# విషయసూచిక

## భీష్మపర్వము

## ద్రోణపర్వము.

విషయము.

శ్రీరస్తు.

# శ్రీమదాంధ్ర వచనమహాభారతము

## భీష్మపర్వము.

శ్లో. నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్,
దేవీం సరస్వతీం చైవ తతో జయముదీరయేత్.

### సైన్యవిచక్షణము

ఓ మునివర్యా! నానాదేశములనుండి యరుదెంచిన మహాత్ములగు మహీపాలకులెల్లరును గురుపాండవసోమకులును దమతమపరాక్రమము లేర్పడ నెటులు యుద్ధమొనర్చిరో తెలుపుమని జనమేజయుఁడు ప్రశ్నింప విని వైశంపాయనుం డిట్లనియె.

ఓజనమేజయా! వీరులగుకురుపాండవసోమకు లెటులు యుద్ధమొనర్చిరో తెలిపెదను వినుము. పాండవులుసోమకులతోఁ దపోనిలయమగు కురుక్షేత్రమును జేరి యెంతయు బలిమివెలయజయము నొందవలయు ననెడికోర్కు లలరఁ గౌరవుల నెదుర్కొని యుండిరి. వేదాధ్యయనసంపన్నులును, యుద్ధోత్సాహవంతులునగు నాపాండవు లటులు జయము నపేక్షించి తమసైన్యముతో నెట్టివీరులకును నెదురింపరాని దుర్యోధనుసైన్యములను జయింపఁ బ్రాఙ్ముఖముగా వెడలిరి. అంత నా యుధిష్ఠిరుఁడు వారు నివసించుటకై శమంతపంచకమునకు వెలుపల వాస్తుశాస్త్రానుసారముగా వేలకొలదిశిబిరముల నేర్పఱిచెను. అందు వారెల్లఁ జేరిరి. అటులు యోధులగువారెల్లఁ జేరుటను బుడమి కేవ

లము బాలురు, వృద్ధులును దప్పఁ దక్కినపురుషులు, రథములు, నేస్గులు మున్నగుసైన్యములు లేక శూన్యమై యుండెను.

ఓపార్థివోత్తమా! సూర్యకిరణప్రసారముచే వెలయింపఁబడు జంబూద్వీపమునఁ గలయోధబలమెల్ల నచ్చోటికి వచ్చియుండెను. అటులు సర్వవర్ణములవారును గుంపుగాఁగూడి దేశములను, నదులను, శైలములను, గాననములను వ్యాపించి యుండఁగా, వారి నాథస్యజుఁ డాదరించి వారివాహనాదులకును వారికిని వలయునాహారాదులను సమకూర్ప నాజ్ఞాపించి, మఱియు నిటులు పలుకువాఁడు పాండ వేయుఁడు అని తెలియవలయునని యెఱిఁగించి యుద్ధకాలము సమీపించుటను, వారి కాభరణాదుల నొసంగి, వేఱువేఱు వేరులను గుఱుతులను నిరూపించెను.

అంత నాసుయోధనుఁ డాధర్మజుని ధ్వజాగ్రమును గాంచి మహోత్సాహముతోఁ దనసోదరులను గూడి గజసహస్రములు తననలువైపుల నావరించియుండ మండలాధినాథులు సహాయులుగాఁ బాండవులకుఁ బ్రతివ్యూహ మొనర్చి శ్వేతాతపత్రమును బట్టించి యెదురొడ్డి యుండెను. అట్టి దుర్యోధనునిఁ గాంచి పాంచాలురు సంతసించి శంఖములను బూరించువారును, వేలకొలంది భేరులను బ్రయోగించువారును నైయుండిరి. అటు లుత్సాహపూరితులగు తమసేనలవారి నారసి పాండవులును, శ్రీకృష్ణభగవానుఁడును సంతుష్టాంతరంగులు గాఁజొచ్చిరి. అంత నాశ్రీకృష్ణార్జునులు, పాంచజన్యదేవదత్తములనెడి తమతమశంఖములను బూరింప నాశంఖారావములను విని యిరుతెగలందును గొందఱు మలమూత్రముల నాపికొనలేక విడుచుచుండిరి. అప్పు డుప్పతిల్లిన యాఁగొప్పచప్పుడు వినిన సైనికులెల్ల సింహగర్జితమునకుఁ దక్కిన మ్రుక్కిడిమృగములువలె జడియందొడంగిరి. మఱియు నత్తఱిఁ బుడమి యెల్ల ధూళిగ్రుంగుట నేమియుఁ దెలియఁబడకుండెను. అటు లా ధూళులు గప్పుట నాదిత్యుఁ డస్తమించిన ట్లగపడకుండెను. మేఘుఁడు రక్తమాంసములను వర్షింప నారంభించెను. ఎల్లకడలను సైన్యములే యైయుండుటచేఁ జూచువారి కాశ్చర్యము గలుగఁజొచ్చెను. పిదప లెక్కకెక్కుడగు నాసైన్యములకు హాని సూచితమగునట్లుగా నపుడిసుకతోఁగూడిన సుడిగాలులు వీవ నారంభించెను.

ఇట్టులుండఁగా నా కురుక్షేత్రమునఁ గురుపాండవసైన్యములు రెండును నిండుమోదముతో నలరుచుఁ దరంగములతో నోలలాడు చున్న మహాసముద్రములునా వెలయుచుండెను. అట్టి యాయిరుతెగల కలయిక యెంతయును, యుగాంతమున నుప్పొంగిన రెండుసముద్ర ములువలె నచ్చెరువు గలిగించెను. కౌరవులకు సహాయులుగా వీరవరు లెల్ల నందుఁ జేరుటను, ధరణి వృద్ధులు బాలురును మాత్రమె మిగిలి శూన్య మనఁదగియుండెను. పిమ్మట నక్కురుపాండవులు శపథములను జేసికొని తా మొనరించుయుద్ధమునకుఁగాఁ గొన్నిధర్మముల నేర్పఱచి కొనిరి. "యుద్ధకాలమునఁదప్ప నది ముగిసినపిమ్మటనెల్ల మన మెప్పటివలె మనకుఁగల సంబంధములను విడిచికొనక పరస్పరము స్నేహముగలిగి యుండవలయునుగాని కలఁతల వెట్టుకొనరాదు. మాటలతో యుద్ధము చేయువానిని మాటలతోడనే కొట్టవలయును. సేనామధ్యమునుండి వెడలినవాని నొకపుడును బ్రహరింపరాదు. అటులే, రథికుఁడు రథికుని తోడను, గజయోధి గజయోధితోడను, రౌతు రౌతుతోడను, వాహ నములేనిపదాతి యట్టిపదాతితోడను బోరాడవలయును. అందును, వారివారి యోగ్యతను, నిష్టమును, నుత్సాహమును, బలమును నను సరించి యుద్ధ మొనరింపవలెనుగాని తన్ను నమ్మి యూరకున్నవానిని, వివశుఁడై యున్నవానిని గొట్టరాదు. మఱియు నొక్కఁ డొక్కనియెడఁ బ్రసన్నుఁడై యుద్ధవిముఖుఁడై యున్నను శస్త్రముగాని, కవచముగాని, లేకయున్నను నట్టివానిని గొట్టరాదు. ఇంకను రథికుఁడులేనిగుఱ్ఱము లందును, సూతునందును, బాణము లందిచ్చువారియందును, శంఖములు భేరులు మ్రోగించువారియందును, శరప్రయోగము చేయరాదు." అని వారు కొన్ని నియమముల నేర్పఱచికొని పరస్పరము చూచుకొనుచు నెంతయు నాశ్చర్యమునొందుచుఁ దమతమసైనికులతోఁ గూడి రెండు తెగలవారును సోత్సాహులై యుండిరి.

## వ్యాసుఁడు ప్రత్యక్షమగుట

ఓజనమేజయా! పిదప సకలవేదవేత్తయు సత్యవతీతనయుఁడు నగు వ్యాసభగవానుఁ డపు డటులు పూర్వపశ్చిమాభిముఖములై నిలిచియున్న సైన్యములను గాంచి, భూతభవిష్యద్వర్తమానముల నెఱిఁ

గినవాఁడగుటను, నాసైన్యము లేక మరణించు ననువిషయమును బ్రత్యక్షముగాఁ దెలిసికొనుచుఁ, దనతనయు లవివేకముచే నీతిరహితులై యుండుట కెంతయుఁ జింతిల్లుచు నేదియో ధ్యానించుచున్న ధృతరాష్ట్రుని సమీపించి, "ఓరాజా! నీసుతులును, దక్కినమనుజపతులును దమకెల్లరకును గాలము సమీపించుటను రణరంగమునఁ బరస్పరము హింసించుకొన నున్నవారు. అటులు కాలవశులై వినాశమొంద నున్నవారికై, కాలచక్రవిధ మెఱిఁగిన నీవిట్లు పరితపించుట పాడిగాదు. కావున శోకము విడువుము. ఇఁకఁ దప్పక జరుగఁదగుసంగ్రామము నారయఁగోరుదేని, యంధుఁడవగు నీకు దృష్టిని బ్రసాదించెదను గైకొనుము. ఆయుద్ధము విధము తెలిసికొనుము." అని తెలుప విని యాయాంబికేయుఁడు "ఓమహర్షివర్యా! జ్ఞాతులమరణము నెట్లు చూడఁగలను? అటులగుట నీయుద్ధసందర్భములనెల్ల నీమహత్వముచే వినఁగోరుచున్నవాఁడను." అని తనయభిప్రాయ మెఱిఁగించెను.

ఓజనమేజయా! అంత నావరదాతయగు నావ్యాసుఁ డాధృతరాష్ట్రుని యింగిత మెఱింగి, సంజయున కెట్టిరహస్యములును దెలియునట్లుగాఁ దగువర మొసంగి, ధృతరాష్ట్రునితో "ఓయీ! రాత్రిగాని, పవలుగాని జరిగిన యీసంగ్రామమువిధము స్పష్టముగాని యస్పష్టముగాని దానినంతయు నీకీసంజయుఁడు తెలుపఁగలఁడు. ఈతఁ డావిషయమును దలంచినమాత్రమె యీతని కది సువ్యక్తమగుచునుండును. మఱియు నీతని, నారణరంగమునందలి శస్త్రములేమియుఁ జేయఁజాలవు. ఈతనికి శ్రమమును గలుగదు. ఇతఁడు హతుఁడుగాక యీయుద్ధమునుండి విముక్తుండు నగును. నే నీకురుపాండవులకీర్తిని లోకమున వెలయించువాఁడను. కావున నీవు వీరికై శోకింపకుము. ఓరాజా! దైవవశముగా వచ్చినదీనికిఁ బరితపించుట పాడిగాదుగదా! ఇది యాపుటకును శక్యముగానిది. ఇందు ధర్మ మెచటఁ గల్గునో యచట జయము గల్గుచున్నది." అని పలికి, మఱియు నాయాంబికేయుం జూచి యిట్లనియె.— "ఓమహారాజా! ఇపుడు జరుగనున్నరణరంగమున గొప్పనాశము సంభవింపఁగలదు. అందులకుఁ బెక్కునిదర్శనము లగపడుచున్నవి. వాని వెఱిఁగించెదను వినుము. ఈసైనికులధ్వజాగ్రములందు గ్రద్దలు, రాబందులు, కాకులు, డేగలు, కొంగలును గుంపులుగాఁ బడి యెగురుచు

వానిపార్శ్వములను గనుఁగొనుచు నెప్పుడు యుద్ధము జరుగునో యని త్వరపడుచున్నవి. మాంసమును దినునవియెల్ల నిందలిగజాదులమాంసములను దినఁగోరుచున్నవి. మఱియు భయంకరములగు కటకటారావములచే వెఱపుగొలుపుచున్నవి. రాబందులు దక్షిణదిశామధ్యమునఁ బరువులిడుచున్నవి. ఇట్టిలక్షణములు పూర్వాపరసంధ్యాకాలములందుఁ గన్పట్టుచున్నవి. ఉదయాస్తమయములందు సూర్యుఁడు, ప్రాణికళేబరములచే నావరింపఁబడుట గానవచ్చెడిని. ఎఱుపు నలుపు తెలుపు రంగులు గలపరివేషములు సంధ్యాకాలముల సూర్యు నావరించుచున్నవి. రేవగళ్లను భేదములేక యెల్లపుడును, సూర్యచంద్రులును, నక్షత్రములును, గానఁబడుచుండుటచే నిపుడు మహాభయము తటస్థింపక మానదు. కార్తికపౌర్ణమియందును, జంద్రుఁడు కాంతిహీనుఁడై పద్మవర్ణముగల యాకసమునడుమ, నగ్నివలె నెఱ్ఱనై గానవచ్చుచున్నాఁడు. కావున వీరులు శూరులు నగురాజులును, రాజపుత్రులును రణనిహతులై పుడమిని బడక తప్పదు. అంతరిక్షమున వరాహములతో నడవియీఁగలు ఘోరముగాఁ బోరాడి మహారావము లొనర్చుచుంట నాకు నిత్యము రాత్రులందుఁ గానవచ్చుచున్నది. మఱియు దేవాలయములందలి విగ్రహములు కదలుచు, నవ్వుచు, రక్తము గ్రక్కుచుఁ, జెమర్చుచుఁ గారణములేకయే యొఱఁగుచుండుట సంభవించుచున్నది. ఓరాజా! భేరులు మ్రోగింపకయే ధ్వనిచేయుచున్నవి. క్షత్రియులకోర్కులును ననుచితములై ప్రవర్తిలుచున్నవి. మఱియుఁ జిలుకలు, కోకిలములు, పిచ్చుకలు, సారసపక్షులు, నెమిళ్లును ఘోరారావము లొనర్చుచున్నవి. అరుణోదయవేళల నినుపముక్కులుగల యొకజాతిమిడుతలు గుఱ్ఱములపై వ్రాలి మొఱలిడుచున్నవి. రెండుసంధ్యలయందును దిక్కులను మంటలు మండుచున్నవి. ఓధృతరాష్ట్రా! మేఘుఁడు ధూళిని మాంసమును వర్షించుచున్నాఁడు. ఓరాజా! ముల్లోకములందును బవిత్రయనఁదగి ప్రసిద్ధివడసిన యరుంధతి వసిష్ఠుని వెనుకఁబెట్టినది. శని రోహిణిని బీడించుచున్నాఁడు. చంద్రునిమచ్చ వెనుకటిచోటినుండి మఱలినది. కావున నిపుడు మహాభయము గలుగక తప్పదు. మేఘములు లేకయే గొప్పయుఱుములు వినవచ్చుచున్నవి. గుఱ్ఱములు మున్నగు

వాహనము లేడ్చుచుఁగన్నుల నీరువెట్టుచున్నవి.”అని తెలిపి వ్యాసుఁడు మఱియు నిట్లనియె.

వ్యాసుఁడు దుశ్శకునములు నిరూపించుట

ఓధృతరాష్ట్రా! మఱియుఁ గలుగుదుశ్శకునములను దెలిపెదను వినుము. గోవులనుండి గాడిదలు పుట్టుచున్నవి. కోడెలు తల్లులపై నెక్కుచున్నవి. ఉద్యానవనములం దాయాపుష్పఫలము లకాలమున నగపడుచున్నవి. గర్భిణులు పుత్త్రులను గనకుండుటయుఁ, గనినను భయంకర రూపములను గనుటయుఁ గలుగుచున్నది. భూతములు పశులంగూడి పరస్పరము దినుచున్నవి. పశువులు మూఁడుకొమ్ములు, నాల్గుకన్నులు, నైదుపాదములును, రెండుమేహనములును, రెండుతలలును గలిగి రెండుతోఁకలు కోఱలునుగలిగి యశుభప్రదములై జనించి, యమంగళధ్వని లొనర్చుచున్నవి. గరుడపక్షులు మూఁడుపాదములును, శిఖలును నాల్గుకోఱలును, గొమ్ములును గలిగి జనించుచున్నవి. ఇంకను మఱికొన్నియు నటులే యగపడుచున్నవి. నీపురమునఁగల వేదవేత్తలగువారియిల్లాండ్రుమయూరములను వైనతేయములను గనుచున్నారు. ఓరాజా! ఆఁడుగుఱ్ఱ మావుదూడను, గుక్క నక్కను గనుచున్నవి. మృగవిశేషములకడుపునఁ గుక్కలు పుట్టుచున్నవి. చిలుక లశుభమును బలుకుచున్నవి. ఒక్కొకస్త్రీ కొక్కమాఱు నల్వురేవురుపుత్త్రికలు జనించుచున్నారు. వారటులు జనించినతోడనే యాడుచుఁ బాడుచు నవ్వుచున్నారు. నిమ్నజాతులలో జనించినయంధులు మున్నగువికలాంగులు సయితము వైపరీత్యమును సూచించుచు, నృత్యమును గానము నొనర్చుచున్నారు. ఇక్కాలమునుబట్టి బొమ్మలును గత్తులుపట్టుకొని సాముచేయుచున్నవి. పిల్లవాండ్రును గఱ్ఱలు చేతఁబూని పరస్పరము కొట్టుకొనఁ బరువులిడుచున్నారు. మఱియు వారు కట్టుకొనిన యిసుకయిండ్లను బరస్పరముఁ బాడుచేసికొనుచున్నారు. చెట్లులందుఁ గలువలు పద్మములు పుట్టుచున్నవి. ఎల్లెడల సుడిగాలులు రేఁగుచున్నవి. ధూళి లెగయుచున్నవి. భూకంపము గల్గుచున్నది. రాహువు సూర్యుని మ్రింగుచున్నాఁడు. అటులే కేతువుసైతము చిత్రానక్షత్రము నతిక్రమించి స్వాత్యాదులను జేరుచున్నాఁడు. కావున నిక్కౌరవుల నాశ

మూహింపఁబడుచున్నది. మఱియు మహాఘోరమగుధూమకేతువు క్షత్త్రియనక్షత్రమగు పుష్యమి నాక్రమించుచున్నది. కావున నిపుడీ సైన్యముల రెండిటికి నెంతయు నమంగళమగును. మఘానక్షత్రమున నంగారకుఁడును, శ్రవణమున బృహస్పతియును వక్రించియున్నారు. శని పూర్వఫల్గుని నాక్రమించి పీడించుచున్నాఁడు. శుక్రుఁడు పూర్వాభాద్రనొంది ప్రకాశించుచున్నాఁడు. మఱియు నుత్తరాభాద్రనొంది యుపగ్రహముచేఁ జూడఁబడుచున్నాఁడు. కేతువు పొగగలయగ్నివలెఁ బ్రజ్వలించుచు జ్యేష్ఠానక్షత్రము నాక్రమించుచున్నాఁడు. ఒకనక్షత్రమును జేరియున్న సూర్యచంద్రులను రాహువు పీడించుచున్నాఁడు. ఎల్లపుడు వక్రియై యున్నాఁడు. మఱియు నతఁడు స్వాతియందుండి రోహిణిని బీడించుచున్నాఁడు. ఆసర్వతోభద్రచక్రమున నంగారకుఁడు మఘానక్షత్రమునసుండి మఱిమఱియు వక్రియై బృహస్పతిచే నాక్రమింపఁబడియున్న శ్రవణమును జుట్టుకొనియున్నవాఁడు. పుడమి సస్యములన్నిటిచేఁ గప్పఁబడియున్నది. యవలైదుతలలును, వరులు నూఱుతలలునుగలిగి పొడముచున్నవి. మఱియు నీలోకమెల్ల నేనిచే జీవింపఁదగియున్నదో యట్టిప్రధానములగుగోవులు, తమదూడలకు రక్తమును గుడుపుచున్నవి. విండ్లనుండి జ్వాలలు వెడలుచున్నవి. ఖడ్గము లెంతయుఁ బ్రజ్వలించుచున్నవి. స్పష్టముగా యుద్ధమును సమీపించినవిధమును శస్త్రములన్నియుఁ దెలుపుచున్నవి. శస్త్రములకు, నుదకములకును నగ్నికాంతు లుదయించుచున్నవి. అటులే ధ్వజములకును, గవచములకును నెఱ్ఱనికాంతి గల్గుచున్నది. కావున నిపుడు గొప్పనాశము సూచింపఁబడుచున్నది. ఇపుడు పుడమి రక్తపుమడుఁగులును, ధ్వజములనెడి తెప్పమ్రాఁకులును గలిగి భయంకరమగును. పాండవులమూలమునఁ గౌరవుల కిపుడు నాశము రానున్నది. ఎల్లదెసలను నోళులు తెఱచి మృగములును, బక్షులును మొఱలు వెట్టుచున్నవి. దీనివలన నెంతయు మహాభయ మింక సమీపించుచున్నదని స్పష్టముగాఁ దెలియనగుచున్నది. ఒక్కొకఱెక్కయుఁ, గన్ను, పాదమును గలిగి పక్షులు రాత్రులఁ జరించుచు భయంకరముగా నఱచుచు రక్తమును వెడలఁగ్రక్కుచున్నవి. రాహుకేతువులు మిక్కిలి యెఱ్ఱనికాంతులతోఁ బ్రజ్వలించుచు సప్తర్షులకాంతుల నాక్రమించి వెలయుచున్న

వారు. మఱియు శనిబృహస్పతులు విశాఖను సమీపించి సంవత్సర స్థాయులై వెలయుచున్నారు. ధూళులతో నిండి దిక్కు లించుకేని కాన రాకున్నయవి. రాత్రులం దుత్పాతమేఘములు రక్తమును వర్షించు చున్నవి. క్రూరుఁడై రాహువు కృత్తికను బీడించుచున్నాఁడు. ధూమ కేతువుతోఁగూడి మహావాయువులు విసరుచు నియ్యవి విషమమగు మహారోదనమును గల్గించునవి. ప్రాణులకు మహాభయమును గల్గించుచు నక్షత్రత్రికమందును బుధుఁడు ప్రవేశించుచున్నాఁడు. మున్ను పదు నాల్గుగాని, పదునైదుగాని, పదునాఱుగాని దినములను బూరించుచు వచ్చునమావాస్య యిపుడు పదుమూఁడుదినములకే వచ్చెను. ఇది యెన్నఁడును జరుగలేదు. ఒకనెలలోనే త్రయోదశిని సూర్యచంద్రు లిరువురును గ్రస్తులయిరి. పర్వముగాకయే వీరి కిట్లుగ్రహణములు గల్గుట ప్రజాసంక్షయమును సూచించుచున్నది. అట్టిసమయముల రాక్షసులు రక్తమును నోట వెడలఁగ్రక్కుచుఁ దృప్తిలేకుందురు. మహానదులు ప్రతికూలముగాఁ బాఱుచున్నవి. కొన్నినదులు శోణితమును బ్రవ హించుచున్నవి. నూతులు నురుగులతోఁగూడి వృషభములువలె గాలు లచేఁ గదల్పఁబడుచుఁ గాన్పించుచున్నవి. ఇంద్రధనుస్సులువలె వెల యుచుఁ బిడుగులతో నుల్కలు రాలుచున్నవి. నేఁటిరాత్రి గడవఁగనే మీరొనర్చినయన్యాయమునకు ఫలము గల్గెడిని. మహోల్కాజ్వాల లచేఁ జీఁకటులు వెడలి యెల్లదిక్కులను వ్యాపించుచున్నవి. అట్టివిప రీతము జరుగునపుడు వేలకొలఁది భూపాలురరక్తమును బుడమి త్రాగునని మహర్షులు చెప్పుదురు కైలాసమునుండియు, హిమవత్పర్వ తమునుండియు, మందరమునుండియు మహాశబ్దము పొడమ వేల కొలఁదిశిఖరములు పడుచున్నవి. భూకంపముచే నాల్గుసముద్రములును వేఱువేఱుగా నుప్పొంగి యొడ్డు దాఁటి భూమి నల్లకల్లోలముచేయు చున్నవి. ఇసుకతోఁగూడిన సుడిగాలు లుగ్రములై చెట్లను బెల్లగించు చున్నవి. అట్టి పెద్దగాలులచేతను, బిడుగులచేతను, గ్రామములందును, నగరములందును గలవృక్షములన్నియుఁ గూలిపడుచున్నవి. బ్రాహ్మణులు హోమ మొనర్చునపు డగ్ని నల్లగను, బచ్చగను, నెఱ్ఱగను మండు చుండెను. మఱియు నాయగ్ని యప్రదక్షిణముగా మండుచు దుర్గం ధముగల్గి దారుణధ్వను లొనర్చుచుండెను. భూతముల రసగంధస్పర్శ

ములు విపరీతము లగుచున్నవి. ధ్వజములు మఱిమఱియుఁ గదలుచుఁ బొగల నెగయఁజిమ్ముచు నిప్పులను వర్షించుచున్నవి. అటులే భేరులును, బటహములును నొనర్చుచున్నవి. ఉన్నతములగు మేడలు మున్నగువాని శిఖరముల కెడమభాగముగ మండలాకారముగా నుండి యెల్లెడలఁ గాకులు మున్నగునవి మిక్కిలి యుగ్రముగా నఱచుచున్నవి. మఱియు నయ్యవి క్షత్రియులనాశమును దెలియంజేయుచు ధ్వజాగ్రముల వ్రాలుచున్నవి. మదపుటేనుగులు వడఁకుచు నేమో ధ్యానము సేయుచు మలమూత్రములను విడుచుచున్నవి. గుఱ్ఱములు దీనములై యున్నవి. ఏనుగులు నీటిలో దిగుచున్నవి. ఈ నా తెలిపినవిషయములను విని నీవిపుడు దీనికిఁ దగురీతి నాలోచించి నిశ్చయింపుము. ఈభరతవంశ మెట్టులు నశింపకుండునో యట్టివిధ మాలోచింపుము.

ఓజనమేజయా! తనతండ్రియగు వ్యాసుఁ డిటులు తెలుప విని ధృతరాష్ట్రుఁడు మఱియు వ్యాసునితో "ఓనాయనా! దీనికెల్ల దైవము కారణమని తలంచెదను. ఇఁక మానవక్షయము కాక తప్పదు. రాజులెల్లరును క్షత్రియధర్మమును బూని రణరంగమున మరణించి వీరుల కర్హమగు నుత్తమలోకమునొంది సుఖింతురు. అటులే మహాయుద్ధమునఁ బ్రాణములు విడుచుటచే వారి కిహమునఁ గీర్తియుఁ, బరమునఁ జిరకాలసుఖమును గాఁగల"దని తెలుప విని యామునియు నట్లే యగుట నిశ్చయమని పలికి పిదపనాతఁడును గొంతవడిఁ జింతించి మఱియు నాధృతరాష్ట్రునితో "ఓతండ్రీ! నిస్సంశయముగాఁ గాల మీలోకమును నశింపఁజేయును. మఱియు సృజించును. ఇది శాశ్వతముగాదు. అయినను నీవు నివారింపఁ దగువాఁడవు గావున నీ వాకౌరవులకును, పాండవులకును, వారివారిబందుగులకును ధర్మమగుమార్గము నెఱిఁగింపుము. వారిని దీనినుండి మఱలింపుము. జ్ఞాతివధము నీచకార్యమని తెలుపుదురు. నా కప్రియ మొనర్పకుము. ఓరాజా! క్షత్రియవినాశకాలమే నీకుఁ బుత్రరూపమున నిటులు జనించెను. వేదమునఁ బ్రాణివధము పూజ్యముగా నెన్నఁబడి యుండలేదు. అది హితమును గానేరదు. ఎవ్వఁడు వధ మంగీకరించునో వాఁడు కులధర్మమును, నిజశరీరమును నశింపఁజేసికొనువాఁ డగుచున్నాఁడు. ఇట్టి యకృత్యమును వారింపఁదగియుండియుఁ గాలవశమున నీవు దుష్పథమున నడుచుచున్నాఁడవు. నీకులమును దక్కినరాజలోకమును

నశింపఁజేయుటకే నీకిటు లీరాజ్యమనెడియనర్థము కలిగినది. నీవు ధర్మమును జెలుచుకొనకుము. నీపుత్రులకు ధర్మమును దెలుపుము. ఏ యీరాజ్యముచే గీర్తియు ధర్మము స్వర్గము నొందనగుచున్నదో యట్టిరాజ్యము నీకిపుడు పాపమును గూర్పుచున్నది. కావున నీ వీరాజ్యమెల్లఁ గోరక పాండవుల కిప్పింపుము. అటులయినఁ గౌరవులు సుఖింతురు.” అని యిటులు బ్రాహ్మణోత్తముఁ డగువ్యాసుఁడు తెలిపెను.

అది విని ధృతరాష్ట్రుఁడు “ఓనాయనా! నీవేమి యెఱుఁగుదువో యదియెల్ల నేనెఱుగనివాఁడనుగాను. యథార్థములగుభావాభావములు నే నెఱుంగుదును. అయినను లోకము తనకార్యముపట్ల వ్యామోహ మందుచుండును. నేనును లోకములోనివాఁడనని తెలియుఁడు. ఓ మహానుభావా! నిన్ను బ్రతిమాలుకొనుచున్నవాఁడను. నీవే మా కుత్తమగతి చూపువాఁడవు. నాపుత్రులు నాకు లొంగరు. కావున న న్నీవిషయమున దోషిగా భావింపఁదగదు. నీవే భరతవంశము ధర్మప్రవృత్తియుఁ, గీర్తియు నైయున్నవాఁడవు. మఱియుఁ గురుపాండవులకుఁ బూజ్యుఁడవు పితామహుఁడవు నైయుంటివిగదా” యని పలుక విని యతఁడు “ఓవిచిత్రవీర్యపుత్రా! నీచిత్తమునఁగల యభిప్రాయ మెయ్యదియో తెలుపుము. నీ యాసంశయమును దొలఁగింతు” నని పలికెను. అది విని యాధృతరాష్ట్రుఁడు “ఓనాయనా! సంగ్రామరంగమున జయమునొందువారిలక్షణము లెట్టివో వానినెల్ల వినఁ గోరుచున్నాఁడను.” అని ప్రార్థింపఁగా నావ్యాసుఁ డిట్లనియె.

ఓయాంబికేయా! ఎవ్వఁడు హోమమొనర్చినయగ్ని పొగలేక ప్రదక్షిణజ్వాలలతోఁ బ్రసన్నకాంతిగల్గి పవిత్రమగు నాహుతిగంధమును వెలయించునో యట్టివానికి జయము గల్గుననవచ్చును. మఱియు నేపక్షమువారిశంఖములును, మృదంగములును గంభీరములగు మహాధ్వని నొనర్చునో యందు జయమగును. ఎచట సూర్యచంద్రులు మబ్బులు గప్పక వెలయుదురో యచటివారికి జయము గల్గును. ఎవ్వరు యుద్ధమునకు వెడలునపుడు పక్షు లిష్టముగాఁ బలుకునో, నడచుచున్నపుడు వెనుకవచ్చి త్వరపెట్టునో, ముందు నడచి బోధించునో వారికి జయము గల్గును. కల్యాణవచనములు గలచిలుకలు, రాజహంసములు, కొంగలు, నెమిళ్లును నెవ్వరికిఁ గుడివైపుగాఁ బోవునో వారికిఁ దప్పక

యుద్ధమున జయముగలుగునని పండితులు తెలుపుచున్నారు. మఱియు నలంకారములును, గవచములును, ధ్వజములును గలిగి గుఱ్ఱములు శ్రావ్యము లగుధ్వనులు చేయుచుండఁగా నెవ్వరిసేనలు చూడ నలవి గాక యెంతయుఁ దేజరిల్లుచుండునో యట్టివారు శత్రులను జయించి జయము వడయుచున్నారు. ఓధృతరాష్ట్రా! ఎవ్వనిసైన్యమునఁ గల యోధులు హర్షవచనములందును, బలమందును గొఱఁతవడకుందురో మఱియు నేవారలంకరించుకొనిన పూలదండలు వాడకుండునో వారు యుద్ధసముద్రమును దాఁటఁగల్గుచున్నారు. యుద్ధసన్నద్ధు లగువారికిఁ గుడియెడమలను, వెనుకను వాయసము లఱచుట కార్యసిద్ధిసూచక మును ముందుభాగమున మొఱయుట ప్రయాణనిషేధసూచకము నగు నని యెఱుఁగవలయును. మఱియును యోధులశబ్దరూపరసస్పర్శగంధ ములు చెడక శుభప్రదములుగా వారు హర్షపూరితులై యుందురేని వారికి జయమగును. ఎవ్వరిని గాలులు, మేఘములు, పక్షులును నను సరించుచుండునో మఱియు నేరి కింద్రధనుస్సు లెదురుగాకుండునో యట్టివారికి జయమగును. ఓరాజా! విపరీతముగా జరుగునపుడు వారికి మరణము తప్పదు. వెనుకఁ దెలిపినలక్షణములు గలయపుడు సైన్య ముల హెచ్చుతగ్గులతోఁ బనిలేకయే జయము కల్గును. యోధుల యుత్సాహగుణమే జయలక్షణమగుచున్నది. సేనలో నొకఁడు ధైర్యము చెడెనేని సేనయెల్లఁ జెడును. అటులు సేన చెదరినపుడు శూరు లగు యోధులును వారి ననుసరింతురు. అటులు భగ్నమగుసైన్య మెంత గొప్పదయ్యును దానిని మఱలించి నిలుపుట దుస్తరము. అట్టిసైన్యము మహావేగముగల యుదకములువలె వెఱచినమృగసమూహమువలె బెదరిచెదరి పరువులిడును. యోధులసంఘర్షము గలిగినపుడు సేనలను నిలువరించుట శక్యముగాకుండుటయెగాక పరమధైర్యవంతులును జెడ వలసివచ్చును. సేనలలోఁ గొందఱు వెఱచినవారి నారసి తక్కినవారును భీతులగుచు దిక్కులఁబట్టి పోవుదురు. అట్టిసైన్యమును మహాశూరు లయినవారును నొకనిమేషమయినను నిలుపఁజాలరు. ఓరాజా! ఉపా యముచే నగుజయ ముత్తమమైనది. భేదముచే నగునది మధ్యమము. యుద్ధముచే నగుజయమునీచమైనది. యోధులపరస్పరసంఘర్ష మెంతయు హానికరము. అందు మొదట గల్గునది నాశము. పరస్పర మెఱిఁగి

యుత్సాహపూరితులై పుత్రకళత్రాదులను దలంపక ధైర్యవంతు లగు శూరు లేబదుగురైనను నెంతటిసైన్యమునైనను జయింపఁగలరు. ఇంకను శూరులగువార లయిదారేడ్వురే యెట్టిసేనను జయింపనోపుదురు. వినతాపుత్త్రుఁ డగుగరుడుఁడు సేనాబాహుల్యమును బ్రశంసింపలేదు. కేవల సేనాబాహుల్యముచే జయ మెన్నఁడును గలుగనేరదు. అనిత్య మగుజయము దైవాధీనమై యుండును. సంగ్రామమున జయశీలుగను నొకపు డపజయము నొందుచుందురు.

జంబూఖండనిర్మాణమున భూమిగుణకథనము

ఓజనమేజయా! అటు లావ్యాసమహర్షి ధృతరాష్ట్రునితోఁ బలికి వెడలిపోఁగా నంత నాయాంబికేయుఁడు కొంత చింతించి పిమ్మట నొక రెండుగడియ లటులుండి ప్రాజ్ఞుఁ డగు సంజయునితో "సంజయా! శూరవరు లగుభూరమణు లెల్లరును నీధారుణికై పోరాడ నుత్సాహపడుచున్నారు. ఇఁక వీరు పలువిధముల నస్త్రశస్త్రములతో నొకరినొకరు చంపికొని తమతమజీవితముల నీపుడమికి దారవోయుదురుగాని శాంతి వహించువారుగాఁ గానరాదు. ఇఁక యమమందిరము వృద్ధినొందనున్నది. వీరిటులు పరస్పరమును గలహించుటెల్ల భౌమసంపదలకేగదా! కావున భూమిగుణము గొప్పదిగాఁ దలంపవలసియున్నది. ఓసంజయా! ఆభూమిగుణ మెట్టిదో నాకెఱిఁగింపుము. ఈకురుజాంగల ప్రదేశమున లెక్కకుమిక్కిలిగా నిక్కుమారులకు సహాయులై క్షత్త్రియులు చేరియున్నవారు. వీరెల్ల నివసించుదేశపరిమితియుఁ బట్టణములవిధమును దెల్పుము. వీరెల్ల నెవం రెందుండి వచ్చిరి? నీవు దివ్యబుద్ధియుక్తమగు జ్ఞానదృష్టిగలవాఁడవు. నీకట్టిజ్ఞానమును విప్రర్షి యగునావ్యాసునిమహత్త్వమువలనఁ గలిగినది. కావున నీవెల్ల విషయములను నా కెఱిఁగింపుము."

అది విని సంజయుఁడు "ఓప్రాజ్ఞా! భరతసత్తమా! నాశక్తికొలఁది భూమిగుణముల నెఱిఁగించెదను. శాస్త్రదృష్టిచే వీనిని దెలిసికొనుము. నీకు నమస్కారము. వినుము. జంగమములనియు, స్థావరములనియు భూతములు రెండువిధములు. అం దండజములు, స్వేదజములు, జరాయుజములు నని మూఁడువిధములై భిన్నజన్మస్థాన

ములు గల్గియున్నవి. ఓరాజా ! ఆమూఁడిటిలో జరాయుజము లుత్తమములు. వానిలో మానవు లుత్తములు. ఆజరాయుజములలోఁ బశువులు నానారూపములతోఁ గూడి పదునాల్గువిధములై యున్నవి. వానిలో నేఁడారణ్యములు నేడు గ్రామ్యములు నైయున్నవి. సింహములు, పులులు, నడవిపందులు, నడవిపోతులు, కోఁతులు, నేన్గులు, నెలుఁగుబంటులు ననునవి యారణ్యములు. గోవులు, గొఱ్ఱెలు, మేఁకలు, గుఱ్ఱములు, కంచరగాడిదలు, గాడిదలు, మనుష్యులు గ్రామములందుండు ప్రాణులు. ఇప్పదునాలుగును నారణ్యములును గ్రామ్యములు నగుపశువు లనఁబడుచున్నవి. ఓరాజా ! ఇయ్యవి యజ్ఞోపయుక్తములగునవని వేదములు దెల్పుచున్నవి. ఈ తెలిపిన గ్రామ్యములలోఁ బురుషులను, నారణ్యములలో సింహములను నుత్తమజాతులుగాఁ బరిగణింపవచ్చును. సర్వభూతములును దమజీవనవిషయమునఁ బరస్పరము నాధారపడియుండును. ఉద్భిజ్జములు స్థావరము లనఁబడును. అయ్యవి వృక్షములు, పొదలు, తీఁగెలు, త్వక్సారములగువల్లులు, తృణములనియైదువిధములు. అయ్యవి పంచమహాభూతములందును, బందొమ్మిదిగా నున్నవి. లోకసమ్మితమగు గాయత్రి యిరువదినాల్గక్షరములుగలదిగా నుద్దేశింపఁబడియున్నది. సకలగుణాన్వితమై పవిత్రమైన యాగాయత్రి నెవ్వఁడు సరిగా నెఱుంగునో వాఁడే లోకమున నాశమొందనివాఁడు. సకల ప్రపంచమును బుడమియందే పొడమి దానియందే యడఁగును. భూమి సకలభూతములకును స్థానమును, నదియే స్థిరమైనదియు నై యున్నది. ఎవ్వనికి భూమి గలదో వానికే జంగమస్థావరములన్నియుఁ గలవనవచ్చును. దానిని వలచియేగదా ! ఈభూపతులెల్లఁ బరస్పరము చంపికొనను న్నవారు." అని తెలుప విని ధృతరాష్ట్రుఁడు మఱియు నిట్లనియె.

"ఓసంజయా ! ఈపుడమిని గలనదులయుఁ, బర్వతములయు, జనపదములయుఁ బేరులను, బ్రమాణములను నాకెఱిఁగింపు" మన విని సంజయుఁడు "ఓధృతరాష్ట్రా! ఈ ప్రపంచమున నున్న మహాభూతములు సంగ్రహముగా నరసినచో నైదని చెప్పఁదగియున్నవి. అవియన్నియును దుల్యములనియే పెద్దలు తెలుపుదురు. పృథివ్యప్తేజోవాయ్వాకాశములైదును నుత్తమగుణములు గలవియే. అందు భూమి ప్రధానము. శబ్దస్పర్శరూపరసగంధములైదును భూమిగుణములని తత్త్వవేత్త లగు

ఋషులు తెలిపియున్నవారు. వానిలో గంధ మొక్కటి దక్కఁ దక్కినవి యుదకమున నుండును. తేజమునకు శబ్దస్పర్శరూపములు మూఁడును గలవని తెలుపుదురు. అటులే శబ్దస్పర్శములు రెండే వాయువునకును, శబ్ద మొక్కటియే యాకసమునకును గలవు. పంచమహాభూతములకును గలగుణము లివియే. అటులగుట భూతములుగల యెల్లప్రాణులయందును నీగుణము లుండును. ఇవి సమములై యున్నపుడు పరస్పరము గలిసి యుండును. ఎపుడు వీనికిఁ బరస్పరవైషమ్యము గల్గునో యపుడీ దేహధారులు దేహములను ధరించి జనించుచుందురు. ఇటులేగాని యివి వేఱొకరీతికాదు. మఱియు నీభూతములు క్రమముగా నొకదానియం దొకటి జనించి, మఱలఁ గ్రమముగా నొకదానియం దొకటి యడంగుచుండును. ఇవియన్నియుఁ బరిమితిలేనివై యుండును. వీనిరూప మీశ్వరరూపము. అక్కడక్కడఁ బాంచభౌతికము లగుధాతువులు గానవచ్చుచుండును. వానిప్రమాణములను మానవు లూహించి తెలుపుదురు. వానిలోఁ దెలియగానిభావములు కొన్ని గలవు. వాని నూహించి తెలుపవలనుపడదు. ప్రకృతులకెల్లఁ బరమగున దెద్దియో యదియే యచింత్యమనఁబడును. ఓకౌరవాగ్రణీ! ఇఁక జంబూద్వీపమువిధము తెలిపెదను. వినుము. ఓమహారాజా! మండలాకారముగల యీద్వీపము చక్రమువలె నుండును. దీనిచుట్టును నదీజలములును, పెద్దమేఘములనుబోలు కొండలును, పలురూపములుగలపురములును, మనోహర మగుదేశములును, పుష్పఫలములుగలవృక్షములు నావరించియుండును. ఇది ధనధాన్యసమృద్ధమై వెలయుచుండును. మఱియు నిది లవణసముద్రముచే నావృతమై యుండును. లోకమునందలి జనులయాకృతి నద్దమందువలె దీనియాకృతి చంద్రమండలమునఁ గానవచ్చుచుండును. అందు రెండంశములు పిప్పలము, రెండంశములు శశమునై సకలవిధౌషధములకును నావాసమై యుండును. దానిని సంక్షేపముగాఁ దెలిపెదను వినుము." అని సంజయుఁడు తెలుప విని ధృతరాష్ట్రుఁడు మఱియు నిట్లనియె.

జంబూఖండభూమ్యాది పరిమాణనిరూపణము

"ఓసంజయా! నీవు బుద్ధిమంతుఁడవుగదా! జంబూద్వీపవిధమును సంక్షేపముగాఁ దెలిపితివి. ఇఁక దీనివిస్తారమును దెలుపుము. శశలక్ష

ణముగల యీద్వీపముపరిమితి దొలుతఁ దెలుపుము. పిదపఁ బిప్పలమును దెల్పుదువు." అని యిటులు పలుక విని సంజయుఁడు , "ఓమహారాజా! ఈజంబూద్వీపమునకు నలుదెసలను నాలుపర్వతములు చుట్టుకొని యున్నవి. అటులే పూర్వపశ్చిమసముద్రము లుభయపార్శ్వముల నావరించియున్నవి. హిమవంతము, హేమకూటము, నిషధము, నీలము, వైడూర్యమయమై చంద్రతుల్య మగుశ్వేతపర్వతము నెల్లరంగులతో వెలయుశృంగవంతము ననియెడిపర్వతము లాఱును, సిద్ధులు చారణులును జరింప నీద్వీపముచుట్టును గలిగియున్నవి. వీనినడుమనున్న యీ భాగముపరిమితి వేయియోజనములు. ఇం దక్కడక్కడఁ బవిత్రములగు ప్రదేశము లున్నవి. వానిలో నానాజాతు లగుప్రాణు లున్నవి. ఇదియే భారతవర్షము. తరువాతిది హైమవతము. హేమకూటముతరువాతిది హరివర్షము. నీలమునకు దక్షిణముగను, నిషధమున కుత్తరముగను, ప్రాక్పశ్చిమముల నావరించి మాల్యవత్పర్వత మున్నది. దానితరువాతిది గంధమాదనము వెనుకటిక్రమముననే గంధమాదనము మండలాకారముగ నుండును. నీలనిషధములకు నడుమ మేరువు గలదు. అయ్యది సువర్ణమయమై బాలసూర్యునిరీతిగను ధూమరహితమగుపావకునిభాతిగను వెలయుచుండును. దీని యధోభాగ మాఱువేలయోజనములు. పొడ వెనుబదినాల్గుయోజనములు. క్రిందికిని మీఁదికిని ప్రక్కలకును బెరిగి లోకముల నిది యావరించి యుండును. దీని నలుప్రక్కలను భద్రాశ్వము, కేతుమాలము, జంబువు, నుత్తరకురువు ననెడినాల్గు ద్వీపము లాశ్రయించి యుండును. వీనియందుఁ బవిత్రప్రదేశములు గలవు. సుముఖుఁడు సుపర్ణపుత్త్రుఁడు నగుగరుడుఁడు మున్ను సువర్ణమయములగువాయసములను జూచి యుత్తమమధ్యమాధమము లగు పక్షులకంటె దీని విశేషము లేకుండుటను నీమేరువును విడుచుచున్నాఁడ నని చింతించెనఁట. తేజోరూపులలో నుత్తముఁ డనఁదగు నాదిత్యుఁ డీమేరువును జుట్టి తిరుగుచుండును. అటులే నక్షత్రములతోఁ గూడి చంద్రుఁడును, వాయువు, ప్రదక్షిణముచేయుచుందురు. ఓమహారాజా! అట్టి మేరుపర్వతము మనోహరము లగుఫలపుష్పములతోడను గూడి వెలయుచుండును. ఇందు సువర్ణమయము లగుభవనము లుండును. మఱియు నిందెల్లపుడును గంధర్వులును, దేవతలును, రాక్షసులును,

నప్సరసలతోఁ గలిసి విహరించుచుందురు. బ్రహ్మయు, రుద్రుఁడు, సురేశ్వరుఁ డగునింద్రుఁడును నిందుఁ బెక్కుదక్షిణలతోఁ బలువిధములగు యాగము లొనర్చిరి. తుంబురుఁడు, నారదుఁడు, విశ్వావసువు, హాహా హూహూవులు నందులకేగి బహువిధములుగా స్తోత్రములుచేయుచుం దురు. మహాత్ము లగుసప్తర్షులును, గశ్యపప్రజాపతియును, నందుల కెప్పుడును బర్వదినములందుఁ బోవుచుందురు. ఓమహారాజా! ఆ మేరువు నగ్రమున శుక్రుఁడు నివసించియుండెను. సువర్ణమును రత్నరాశులును దానియందలివే. భగవానుఁ డగుకుబేరుఁడు దానియందలి నాల్గవభాగము ననుభవించుచున్నాఁడు. దాని యుత్తరభాగమునఁ బుష్పములతో నిండి నదియు, దివ్యమైనదియు, శిలాసమూహమునడుమ జనించినదియునై కర్ణికారవన మొకటి మనోజ్ఞమై వెలయుచుండును. మఱియు నందు భగవానుఁడగుశంకరుఁ డుమాసహాయుఁడై భూతపాలన మొనర్చుచు భూతగణములంగూడి కర్ణికారపుష్పమాలిక మెడను వ్రేలాడ మూఁడు కన్నులతోఁగూడియుదయించుచున్న సూర్యుఁడువలె లోకమును వెలిఁగించుచున్నాఁడు. ఘోరతపోనిష్ఠుఁడగు నాభవానీవల్లభుని సిద్ధులగు వారు నిత్యము సందర్శించుచుందురు. ఆమహనీయుఁడు దురాచారులకు దూరుఁడై యారయ నలవిగాకుండును. ఓరాజా! ఆ మేరువు చివరనున్న చంద్రమప్సరస్సున క్షీరధారాతుల్యమై బహురూపయుఁ, బరిమితి లేని దియునై భయంకరారావముతోఁ బవిత్రమై సజ్జనులకుమాత్ర మొందఁ దగు గంగానది యెల్లపుడును గడువడిగాఁ బడుచుండును. ఆనదీప్రవాహముచే నందోకసముద్రతుల్య మగుహ్రద మేర్పడియెను. పర్వతముల కును వహింపరాని యాజలధారను నూఱువేలవత్సరము లయ్యాది తన తలతో మోయుచుండును. ఆ మేరువునకుఁ బశ్చిమపార్శ్వమునఁ గేతుమాలము గలదు. జంబూఖండగతమగు నా కేతుమాలమున గొప్పజనపద మొకటి గలదు. అందలివారు సువర్ణసమవర్ణులై పది వేలవత్సరము లాయువుగలిగి వర్తింతురు. మఱియు నందలిస్త్రీ లప్సరలంబోలి వెలయుచు మిగుల నారోగ్యముచే శోకమనునది లేక యే కాలమును మోదమానమానసులై యుందురు. అందలిమానవులు మెఱుఁగుబంగారుకాంతిగలిగియే జనించుచుందురు. గంధమాదనము శిఖరములందు రాక్షసులంగూడి తన్నప్సరసలు సేవింపఁ గుబేరుఁడు

యక్షుల కధీశ్వరుఁడై సంతసించుచుండును. ఆ గంధమాదనము ప్రక్కను దాని కవయవము లనఁదగు చిన్న కొండ లుండును. అందుఁ బదునొకొండువేలేం డ్లాయువుగలిగి నల్లని మేనిచాయతో మహాబలులై కొందఱు తేజోవంతులై యుందురు. అందుఁ గొంతలు నల్లగలువరంగుగల శరీర చ్ఛాయలతోఁ జూచువారి కెంతయు సంతస మొదవించు చుందురు. పర్వతములనే వర్షములుగాఁ దెలియుము. నీలపర్వతముకంటె శ్వేతపర్వతమును దానికంటె హైరణ్యకమును మిన్నలని తెలియుము. ఓరాజా! ఐరావతవర్షము పలువిధము లగు దేశములతోఁ గూడియున్నది. దక్షిణోత్తరములుగా భారతైరావతవర్షములు రెండును ధనురాకారములై యుండును. వానినడుమ నైదువర్షములును గలవు. అందిళావృతము మధ్యమున నుండును. ఈవర్షము లొకటికొకటి గుణములచే మించి మిన్నయై యెన్నఁబడుచుండును. ఆయావర్షములందలివారు తమతమ ధర్మార్థకామములనుబట్టి యాయుఃప్రమాణమును నారోగ్యమును గల్గియుందురు. ఓమహారాజా! ఇటులు పుడమి పర్వతములచే నావృతమై యున్నది. గొప్పదగు హేమకూటమే కైలాస మనఁదగియున్నది. అందే కుబేరుఁడు యక్షులతోఁ గూడి విహరించుచుండును. ఆకైలాసమున కుత్తరముగా మైనాక మున్నది. దాని కుత్తరముగా మణిమయ శిఖరములతో నలరుచు హిరణ్యశృంగపర్వత మున్నది. వాని ప్రక్కను దివ్యమును మహత్తరమును నగుబంగరుటిసుకదిబ్బ యొకటి వెలయుచున్నది. పైనిదెలిపిన కొండలనడుమ బిందుసరము గలదు. అందే మున్ను భగీరథుఁడు చిరకాలము గంగకై కనిపెట్టియుండెను. అందలి యూపములు మణిమయములును, చైత్యవృక్షములు హిరణ్యములును నైయుండును. మహాకీర్తినిధి యగుసహస్రాక్షుఁ డంచే పెక్కుయాగము లొనర్చి సిద్ధివడసినవాఁడు. మఱియు నచ్చోటనే సనాతనుఁ డగుభూతపతి సర్వలోకములను సృజించి దివ్యతేజుఁడై భూతకోటిచే సేవింపఁబడుచుండును. ఇంకను నందు నరనారాయణులును, బ్రహ్మయు, మనువు, శివుఁడును దపమొనర్చిరి. అందే సురనది తొలుత వెలసి బ్రహ్మలోకము నుండి వెడలి వస్వోకసార, నళిని, సరస్వతి, జంబూనది, సిత, గంగ, సింధువు అని యేడువిధములుగా నేర్పడినది. అచింత్యమై మహనీయ మగు నీవిధానమును మహేశ్వరుఁడు లోకోపకారముగా నొనర్చెను.

అందే వేయియుగములు గడచినపిదప నింద్రు సుపాసింపఁ గోరి సరస్వతి దృశ్యాదృశ్యయై కనబడుచుండును. ఈయేడువిధము లగునదులును ముల్లోకములందును బ్రసిద్ధములై యుండును. హిమవంతమున రక్షస్సులును, హేమకూటమున యక్షులును నివసింతురు. నిషధమున నాగసర్పజాతులును, గోకర్ణమునఁ దపోధనులును నివసించియుందురు. నిత్యము గంధర్వులు నిషధమునందును, బ్రహ్మర్షులు నీలమునందును నుందురు. ఓమహారాజా! శృంగవత్పర్వతము దేవతలు విహరించునట్టి స్థానమై యున్నది. భాగములుగానున్న యీయేడువర్షములందును జంగమస్థావరములెల్ల నివసించియున్నవి. ఆజంగమస్థావరముల యభివృద్ధి బహువిధమై దేవమానుషరూపమై యగపడుచున్నది. నీవడిగిన శశాకారముగల యాప్రదేశము పరిమితి తెలుప నలవిగానిది. శశవర్షమున కిరుప్రక్కలను దక్షిణోత్తరముగా నున్నశాక కాశ్యపద్వీపములు దానికిఁ జెవులు. తామ్రపర్ణియు మలయపర్వతమును శిరస్సుగా, నిది రెండవద్వీపముగాఁ గానవచ్చుచున్నది.” అని తెలుప విని ధృతరాష్ట్రుఁడు మఱియు నిట్లనియె.

## మాల్యవత్పర్వతవర్ణనము

ఓసంజయా! నీవు మిగుల బుద్ధిశాలివి. కావున మున్నుగా మేరువున కుత్తరముగానున్న మాల్యవత్పర్వతమునందలి విశేషములను సంపూర్ణముగాఁ దెలుపుము.

అది విని సంజయుఁడు “ఓమహారాజా! నీలపర్వతమునకు దక్షిణముగను, మేరువున కుత్తరముగను నుత్తరకురుదేశములు గలవు. అయ్యవి సిద్ధగణసేవితములై పవిత్రము లనఁదగియున్నవి. అందు నిత్యము పుష్పములును ఫలములును గలిగి వృక్షము లలరుచుండును. వానిపుష్పములు సువాసనగల్గినవియు, ఫలములు రసముగలవియు నై యుండును. మఱియు నందుఁ గొన్నిచెట్టు లెల్లకోర్కులను సమకూర్చునవి. మఱికొన్ని క్షీరవృక్షములును గలవు. ఓరాజా! అయ్యవి యెల్లపుడు నమృతతుల్యషడ్రసములు గలపాలను స్రవించుచుండును. మఱియు నవి వస్త్రములను బండ్లనుండి యాభరణములను సమకూర్చుచుండును. ఆప్రదేశము చిఱుబంగరుటిసుకదిన్నెలుగలిగి మణిమయా

త్మక మగుభూమి గలిగియుండును. మఱియు నందలిభూభాగమెల్ల మణిరత్నతుల్యమగుట రమ్యమై వజ్రవైదూర్యకాంతులు గలిగి పద్మరాగసమకాంతివెలయ నందందుఁ జూపట్టుచుండును. అందన్ని ఋతువులందుఁ గలసుఖస్పర్శము గల్గియుండును. ఎందును బురద గాన్పింపదు. ఓనరాధిపా! మఱియు నందలిసరోవరములు మనోహరములును, సుఖస్పర్శము నొసంగునవియు నై యుండును. స్వర్గమునుండి జాఱినమానవులెల్ల నందు జనించుచుందురు. మఱియు నందలివారు విష్ణుభక్తులకు మిత్రులై ప్రసన్నరూపములు గల్గియుందురు. అందలిస్త్రీ లప్సరసలతోఁ దుల్యలై మిథునములుగా నేర్పడుదురు. వారాక్షీరతరువులయమృతతుల్యమగు క్షీరమును ద్రావుచుందురు. తగుకాలమందు మిథునముగా నేర్పడి క్రమముగా వర్ధిలుచుఁ దుల్యమగురూపగుణములును, వేషమును గలిగి యుందురు. ఓరాజా! అటులగుటఁ జక్రవాకదంపతులువలె ననురూపగుణోపేతులై యుందురు. ఆలోకములందు రోగములు కానరావు. వారెల్లపుడును సంతుష్టాంతరంగులై యుందురు. ఓమహారాజా! వారు వందలకొలందిని, వేలకొలందిని వత్సరములు జీవించుచు, నొకరినొకరు విడువకుందురు. అందుఁ దీక్ష్ణములగుతుండములుగల భారుండములు భయంకరములై మరణించినవారిని హరించి పొదలలో నుంచుచుండును. ఓరాజా! ఉత్తరకురువులవిధమును సంగ్రహముగాఁ దెలిపితిని. మేరువు పూర్వపార్శ్వమువిధము నున్నదున్నటులు తెలిపెదను. భద్రాశ్వమనునది భద్రశాలవనమును కాలామ్రమనెడి మహావృక్షమును గల్గియుండుటచే నన్నిటిలో నది ముఖ్యమనఁదగియున్నది. ఓమహారాజా! ఆకాలామ్రద్రుమము నిత్యము పుష్పఫలముల నిచ్చునదై యుండునది. మఱియు దానిపొడ వొకయోజనము. దానిని సిద్ధులు చారణులు మున్నగువారు సేవించుచుందురు. అందుఁ బురుషులు తెల్లనివారై తేజోనిధులును మహాబలులు నై యుందురు. స్త్రీలు కలువరంగు గల్గి చక్కనిరూపములతోఁ జూడ నింపయియుందురు. తెల్లనికాంతిచేఁ జంద్రతుల్యలై పూర్ణచంద్రముఖులై చంద్రునివలెఁ జల్లనిస్పర్శముగల మేనులతో నృత్తగీతవిశారదలై వెలయుచుందురు. అందలివారు పది వేలవత్సరము లాయువు గల్గియుందురు. అక్కాలామ్రఫలరసములను ద్రావుటచే నిత్యముచెడని యౌవనముగల్గి వెలయుచుందురు. నీలము

నకు దక్షిణముగను, నిషధమున కుత్తరముగను, సుదర్శనమనెడి గొప్ప జంబూవృక్ష మొకటి గలదు. అది పరమప్రాచీనమై సిద్ధులును జారణులును నివసించియుండుటచేఁ బవిత్రమైనదియు నెల్లగోర్కుల నిచ్చునదియు నై యున్నది. ఆజంబూవృక్షముపేరితోడనే సనాతనమై యది జంబూద్వీపమను పేరొందెను. ఆవృక్షము నూఱువేలయోజనముల పొడవు గల్గియుండును. ఓమనుజాధీశా! దానివైశాల్యమన్ననో యొక లక్షయేఁబదివేలయరత్నులు గల్గియున్నది. మఱియు దానిపండ్లు రసమును స్రవించుచుఁ బుడమిపైఁ బడునపుడు గొప్పధ్వని యగుచుండును. ఓరాజా! అప్పుడవి వెండివలె నుండురసమును విడుచుచుండును. ఆరసమేఱై ప్రవహించుచు మేరువునకుఁ బ్రదక్షిణముగాఁ దిరుగుచు నుత్తరకురుదేశములను బ్రవేశించును. అందున్నవారికి నెమ్మదిగలిగి దప్పి యనునది గలుగకుండుటయెగాక దానిఫలరసమును వారు త్రావినవారగుటను వారికి ముదిమియును గలుగనేరదు. అందు జాంబూనదమనెడిబంగారు దేవతలకు భూషణమై యారుద్రపుర్వువన్నెగలిగి కాంతి గల్గించుచుండును. మఱియు నందు మానవులు బాలసూర్యతుల్యులై జనింతురు. అటులే మాల్యవత్పర్వతశిఖరమున హవ్యవాహనుఁడు గానవచ్చుచుండును. ఆయగ్నియే సంవర్తకకాలాగ్నినామములతో వెలయును. ఆమాల్యవచ్ఛిఖరమునకు ముందుభాగమునఁ జిన్నపర్వత మొకటి గలదు. ఓరాజా! మాల్యవంతము ముప్పదివేలయోజనముల పరిమాణముగలది. అందు సువర్ణవర్ణులైన మానవులుందురు. మఱియు నందు బ్రహ్మలోకమునుండి భ్రష్టులయినవారును, బ్రహ్మవాదులును, దీవ్రమగుతపమొనర్చుచు నూర్ధ్వరేతులై వర్తింతురు. అటులు తపమొనర్చి భూతరక్షణమునకుఁగా వారు సూర్యునిఁ బ్రవేశింతురు. వారఱువదియాఱువేవురును సూర్యునెదుట వెడలి యాతనిఁ జుట్టికొని యఱువదివేలయాఱువందలవత్సరము లాసూర్యునికిరణములచేఁ దపించి చంద్రమండలమును జొత్తురు" అని తెలుప విని ధృతరాష్ట్రుఁడు మఱియు నిట్లనియె.

### మేరూత్తరభాగస్థితఖండత్రయవర్ణనము

"ఓసంజయా! వర్షములయుఁ బర్వతములయుఁ బర్వతములం దుండు వారియుఁ బేరులను యథార్థముగా నెఱిఁగింపుము."

అది విని సంజయుఁడు "ఓరాజా ! శ్వేతమునకు దక్షిణముగను, నిషధమున కుత్తరముగను రమణకమనువర్ష మొకటి గలదు. అందు మానవులు జనింతురు. వారు విష్ణుభక్తులకు మిత్రులై మనోహరాకారులై పరస్పరవైరములు లేక మెలంగుదురు. నీలమునకు దక్షిణముగను, నిషధమున కుత్తరముగను హిరణ్మయవర్షము గలదు. అందు హైరణ్వతి యనెడినదియుఁ, బక్షిరాజగు గరుడుఁడును, సుందరాకారులైన యక్షులును నుందురు. అందలిజనులు మహాబలులై మనోహరులై శోకము లేకుందురు. వారు లక్షయేఁబదివేలవత్సరము లాయుఃప్రమాణముగలవారై యుందురు. దానికి మూఁడుశృంగములు గలవు. అందొకటి మణిమయము. మఱొకటి సువర్ణమయము. వేఱొకటి రత్నమయము. మఱియు నది భవనములతో శోభిలుచుండును. అందు నిత్యము స్వయంప్రభ యగుశాండిలిదేవి నివసించును. దానిశిఖరమున కుత్తరముగా సముద్రాంతమున శృంగవత్పర్వతమునకుఁ బైఁగా నైరావతవర్షము గలదు. అందు సూర్యుఁడు పరితాపము గలుగఁజేయఁడు. మానవులకు ముదిమియును గలుగదు. దానిని నక్షత్రములతోఁ గూడి చంద్రుఁడు తేజోనిధియై యావరించియుండును. అందలిమానవులు పద్మకాంతిగలిగి పద్మనేత్రులై పద్మసుగంధముగలిగి జనింతురు మఱియు వారు నిరాహారులై దేవతలువలెఁ జెమ్మటలేక సుగంధులై జితేంద్రియులై వెలయుచుందురు. సర్వభ్రష్టులును రజస్తమోనివృత్తులునగువా రందు జనించి పదుమూఁడువేలేం డ్లాయుఃపరిమితిగలిగి జీవింతురు. క్షీరసముద్రమున నుత్తరభాగమునఁ బ్రభు వగునారాయణుఁడు సువర్ణమయమగు శకటమున నివసించియుండును. ఆశకట మెనిమిదిచక్రములుగలిగి భూతసమన్వితమై మనోవేగముగలదియు నగ్నివర్ణము బంగారునగలును గలిగి యలరుచుండును. ఆప్రభువు సర్వభూతవిభుఁడు. సంక్షేపము విస్తారము నగుసృష్టికిఁ గర్తయు గారయితయు నైనవాఁడు, ఓరాజా ! అతఁడు పృథివ్యప్తేజోవాయ్వాకాశములయిదును నైనవాఁడు యజ్ఞరూపుఁడు నతఁడే. అతనిముఖ మగ్ని." అని తెలిపెనని పలికి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

ఓజనమేజయా! బుద్ధిశాలియగుసంజయుఁ డిట్లు తెలుప విని ధృతరాష్ట్రుఁడు కొంతవడి తనతనయులనుగుఱించి చింతించి మఱియు నాత

నితో "ఓసంజయా! నిస్సంశయముగాఁ గాల మీలోకమును సృజిం చుచు సంక్షేపించుచుండును. ఇందు స్థిరమైన దేదియును లేదు. సర్వ భూతాత్మకులగు నరుఁడును నారాయణుఁడును సర్వజ్ఞులు. ఆతని దేవత లును, మానవులును వైకుంఠవాసి యగువిష్ణునిఁగాఁ దెలుపుదురు.

## భారతవర్ష నదీదేశ వర్ణనము

ఓసంజయా! సైన్యములెల్లఁ బ్రోవుపడిన యీభారతవర్షమునెడ నెంతయును నాతనయుఁ డగుదుర్యోధనుఁడు పేరాసవడియున్న వాఁడు. పాండుపుత్త్రులును దానినే కోరుచున్నవారు. నాచిత్తమును దీనియెడ మగ్నమగుచున్నది. కావున దీనితత్త్వమును నా కెఱిఁగింపుము." అని ప్రశ్నింప విని సంజయుం డిట్లనియె.

"ఓమహారాజా! నావచన మాలింపుము. నీవనినయటు లాపాండ వులు దీనియెడఁ బేరాసవడియుండలేదు. సుబలకొమరుఁ డగుశకునియు, దుర్యోధనుఁడును దీని నాశించియున్నవారు. మఱియు నానాదేశా ధీశు లగుక్షత్త్రియులును దీనికై యాశవడి పరస్పర మసూయగలిగి యున్నవారు. ఓభరతోత్తమా! ఈభారతవర్షము నభిలషించినవారి నెఱిఁ గించెదను వినుము. ఇయ్యది దేవేశుఁ డగునింద్రునకును, వైవస్వతమను వునకును బ్రియమైనది. మఱియుఁ బృథువు, వేనుఁడు, ఇక్ష్వాకువు, యయాతి, అంబరీషుఁడు, ఋషభుఁడు, ఇలుఁడు, నృగుఁడు, కుశికుఁడు, సోమకుఁడు, దిలీపుఁడు నింకనుగల బలవత్తరు లగు నిలాధినాథులును దీనిపైఁ బ్రేమగలిగియుండిరి. ఆ యీభారతవర్ష విధమును నీవిటు లడిగితివి గానఁ దెలిపెదను వినుము.

మలయము, మహేంద్రము, సహ్యము, శుక్తిమంతము, గంధ మాదనము, వింధ్యము, పారియాత్రము ననఁ గులపర్వతము లేఁడు గదా! వానిచేరువను లెక్కకుమీఱిన కొండలు గలవు. అయ్యవి యమేయములును సారముగలవియునై విచిత్రతరము లగు చఱియలు వెలయ నలరుచుండును. ఆకొండలప్రాంతమున హ్రస్వరూపులు హ్రస్వ జీవనులునై కొందఱుందురు. వారితో నార్యులును మ్లేచ్ఛులును గలిసియుందురు. వీరు గంగానది మున్నగు నదులయుదకములను త్రావి జీవించుచుందురు. ఆనదులనెల్లఁ దెలిపెదను వినుము. గంగ,

సింధువు, సరస్వతి, గోదావరి, నర్మద, బాహుద, శతద్రువు, చంద్రభాగ, యమున, దృషద్వతి, విపాశ, విపాప, వేత్రవతి, కృష్ణ వేణి, ఐరావతి, వితస్త, పయోష్ణి, దేవిక, వేదవతి, త్రిదివ, ఇక్షుల, కృమి, కరీషిణి, చిత్రవాహ, చిత్రసేన, గోమతి, గండకి, కౌశికి, కృత్య, నిచిత, లోహతారిణి, రహస్య, శతకుంభ, సరయువు, చర్మణ్వతి, హస్తి సోమ, దిశ, శరావతి, భీమరథి, వీణ, కావేరి, చులక, వాణి, శతబల, నీవార, సుప్రయోగ, కుండల, రాజని, పురమాలిని, వీర, భీమ, ఓఘవతి, ఫలాశిని, పాటలావతి, అశిక్ని, కుశచిర, మకరి, ప్రవర, మేన, హేమ, ఘృతవతి, పురావతి, అనుష్ణ, శైబ్య, కాపి, సదానీర, కుశధార, సదా కాంత, వీరవతి, వాస్తువు, సువాస్తువు, గౌరికంపన, హిరణ్వతి, వీరకర, పంచమ, రథచిత్ర, జ్యోతిరథ, విశ్వామిత్ర, కపింజల, ఉపేంద్ర, బహుళ, కువీర, మధువాహిని, వినది, పింజల, వేణి, తుంగవేణి, విదిశ, తామ్ర, కపిల, శలువు, సువామ, వేదాశ్వ, హరిస్రావ, మహాపగ, శీఘ్ర, పిచ్ఛిల, భారద్వాజ, శోణ, చంద్రమ, దుర్గ, అంతశ్శిల, బ్రహ్మ బోధ్య, బృహద్వతి, యవక్ష, రోహి, జాంబూనది, సువస, తమస, దాసి, వస, వారాణసి, మాల, ధృతిమతి, పూర్ణాశ, తామసి, వృషభ, బ్రహ్మమేధ్య అనియెడినదులు గలవు. ఇవియుఁగాక మఱికొన్నియు మహానదులు గలవు. వానిని వినుము. నిరామయ, కృష్ణ, మందగ, బ్రహ్మాణి, మహాగౌరి, చిత్రోపల, చిత్రరథ, మంజుల, వాహిని, మందా కిని, వైతరణి, కోశ, ముక్తిమతి, అనంగ, పుష్పవేణి, ఉత్పలావతి, లోహిత్య, కరతోయ, వృషక, కుమారి, ఋషికుల్య, మారిష, సర్వ, సుపుణ్య అనియెడిపేరులతో వెలయుచుండును. ఇవియెల్ల లోకమాత లును మహాఫలము నొసంగునవియు నై యున్నవి. ఇంకను దెలియనివి వందలకొలఁదిని, వేలకొలఁదిని గలవు. నాకుఁ దెలిసినంతవఱకును నదు లను దెలిపితిని. ఇఁకను జనపదములను దెలిపెదను వినుము. వానిలోనే కురుపాంచాలములు చేరియున్నవి. సాల్వ, మాద్రేయ, జాంగల, శూర సేన, కళింగ, బోధ, మాల, మత్స్య, సుకుట్య, సౌబల్య, కుంతలము లును, కాంతి, కోసల, చేది, మత్స్యకరూషములును, భోజ, సింధు, పులిందములును, ఉత్తమ, దశార్ణ, మేకలోత్కలములును, పాంచాల, కౌశిజ, నైకపృష్ఠ, ధురంధరములును, గోధా, మద్ర, భుజంగములును,

కాశయాపరకాశయములును, జఠర, కుకుర, సదశార్ణదేశములును, కుంత్యవంత్యపరకుంతిదేశములును, గోమంత, మందక, ఖండ, విదర్భ, రూపవాహికములును, అశ్మక, పాంసురాష్ట్ర, గోపరాష్ట్ర, కరీతు లును, అధిరాజ్య, కుశాద్య, మల్లరాష్ట్రములును, వారవాస్యాయ వాహచక్ర, చక్రాతి, శకదేశములును, విదేహ, మగధ, స్వక్షమలజ, విజయములును, అంగ, వంగ, కళింగ, యకృల్లోమములును, మల్ల, సుదేష్ణ, ప్రహ్లాద, మాహికా, శాసికాదేశములును, బాహ్లీక, వాటధానా, భీర, కాలజోషకములును, అపరాంత, పరాంత, పంచాల, చర్మమండ లములును, అటవీశిఖర, మేరుభూత, ఉపావృత్తానుపావృత్త, స్వరాష్ట్ర కేకయములును, కుందాపరాంత, మాహేయ, కక్ష, సాముద్ర, నిష్కు- టములును, ఆంధ్రదేశము, అంతర్గిరి, బహిర్గిరి, అంగమలజము, మాగ ధము, మానవర్జకము, సమంతర, ప్రావృషేయ, భార్గవములును, పుండ్ర భార్గ, కిరాత, సుదృష్ట, యామునములును, శక, నిషాద, నిషధా, నర్త, నైఋతములును, దుర్గల, ప్రతిమత్స్యకుంతల, కుశలదేశము లును, తీరగ్రహ, శూరసేనములును, ఈజక, కన్యకా, గుణదేశము లును, తిలభర, మంతములును, సుకంటక, కాశ్మీర, సింధు, సౌవీర, గాంధార, దర్శకములును, అభిసారము, ఉతూలశైవాల, బాహ్లీకము లును, దార్వి, వానవ, దార్వ, వాతజామర, థోరములును, బహు వాద్య, కౌరవ్య, సుదామ, సుమల్లికాదేశములును, వధ్ర, కరీషక, కుళిందకములును, ఉపత్యకా, వనాయు, దశాపార్శ్వ, రోమకుశ, బిందు వులును, కచ్ఛ, గోపాలకక్ష, జాంగల, కురువర్ణకములును, కిరాత, బర్బర, సిద్ధ, వైదేహ, తామ్రలిప్తకములును, ఔఘ్రి, పౌండ్రక, సైసి తిక, పార్వతీయదేశములును గలవు. ఇంకను దక్షిణములైన మఱికొన్ని దేశములును గలవు. వానిని వినుము. ద్రావిడ, కేరళ, ప్రాచ్య, భూషికా, వనవాసకములును, కర్ణాటక, మాహిషికవికల్ప, మూషికములును, ఝిల్లికాకుంతల, సౌహృద, నల, కానన, దేశములును, కౌకుట్టక, చోళ, కొంకణ, మాళవ, నరదేశములును, సమంగ, కరక, కుక్కురము లును, అంగార, మారిషములును, ధ్వజిని, ఉత్సవసంకేతము, త్రిగర్త, సాళ్వసేనములును, బక, కోకరక, ప్రోష్ఠ, సమ, వేగవశములును, వింధ్య, చుళక, పుళిందకల్కలదేశములును, మాలవ, మల్లకములును, అపర

వల్లభ, కులింద, కాలకములును, కుంతక, కరటకములును, పూర్వాక, స్తనబాల, సనీయ, ఘుట, సృంజయములును; అలింద, పాశివాట, తనయ సునయ, దశీ, విదర్భ, కాంతీక, తంగణా; పరతంగణములును గలవు. ఉత్తరమ్లేచ్ఛులు, క్రూరులు, యవనులు, చీనులు, కాంభోజులును భయంకరులగు మ్లేచ్ఛజాతులు, సకృద్గ్రహ, కులత్థ, హూణ, పారసీకులును రమణ చీన, దశమాలికులును, క్షత్రియోపనివేశ వైశ్యశూద్రకుల, శూద్రాభీర, దరద, కాశ్మీర పశ్వులును; ఖాశీరాంతచార, పహ్లవ, గిరిగహ్వరులును, ఆత్రేయులు, భారద్వాజులును, స్తనపోషకులు, ప్రోషకులు కళింగులును గిరాతజాతులు నై యున్నవారు. మఱియుఁ దోమర, హంసమార్గ, కరభంజకము లనెడిదేశములు ప్రాచ్యోదీచ్యము లై యున్నవి. ఏవో కొన్ని దేశములుమాత్రము నాచేఁ దెలుపఁబడినవి.

ఓరాజా! పుడమి మానవులగుణములను బలమును, ననుసరించి సరిగా నారాధింపఁబడిన కామధేనువువలె ధర్మార్థకామముల నొసంగును. అట్టిపుడమిపైఁ బేరాసపడి యీరాజులు ధర్మార్థకోవిదులయ్యును, ధనాశచే రణరంగమునఁ బ్రాణములు పరిత్యజింప నున్నారు. దేవమానవులకామములకు భూమియే యుత్తమస్థానము. అయ్యయో! కుక్కలామిషమునకు వలెఁ బరస్పరము కాటులాడుకొనుచున్నారు. వారిట్టు లగుటయెల్లఁ బుడమి నపేక్షించియేగదా! ఇందెవ్వరికిని గామముల నొడఁ దృప్తి గానరాకున్నది. అక్కారణముననే యిక్కురుపాండవులు పుడమిఁ బరిగ్రహింప నిటులు సామదానభేదదండోపాయములచేఁ బ్రయత్నించుచున్నారు. ప్రాణులకుఁ బుడమియే తండ్రియు, సోదరుఁడు, పుత్త్రులును, నాకసము, స్వర్గమునై సంపూర్ణదృష్టికిఁ బాత్రమై యుండును.” అని తెలుప విని ధృతరాష్ట్రుఁడు మఱియు నిట్లనియె.

చతుర్యుగవర్ణనము భారతాదివర్షముల యాయుఃప్రమాణకథనము

“ఓసంజయా! భారతహైమవతవర్షముల యాయుఃప్రమాణమును, బలమును, వారిభూతభవిష్యద్వర్తమాన శుభాశుభములను సవిస్తరముగాఁ దెలుపుము అటులే హరివర్షమును దెల్పుము.

అదివిని "ఓరాజా! కృతత్రేతాద్వాపరకలియుగములని యుగములునాల్గు.అయ్యవి క్రమముగా నొకటివెనుక నొకటి వచ్చుచుండును. అందుఁ గృతయుగమునందలివారి కాయుఃప్రమాణము నాల్గువేలవత్సరములు. ఓరాజోత్తమా! త్రేతయందలివారు మూఁడువేలును, ద్వాపరమునందలివారు రెండువేలును వత్సరము లాయుఃపరిమితి గలిగియుందురు. అక్కలియుగమందన్ననో యాయువున కింతయని ప్రమాణము లేదు. ఆకలియుగమందలివారు గర్భమందుండియే కొందఱును, జనించిన వెంటనే కొందఱును, మృతినొందుచుందురు. కొందఱు మహాబలులును, సత్వసంపన్నులును, వివేకాదిసద్గుణసమన్వితులునై వందలకొలఁది వేలకొలఁదిని జనించుచుందురు. జనించినవారును గలరు. అటులు కృతయుగమున జనించినవారు ధనికులును, సుందరాకారులును, మానులును, దపోధనులునై మహోత్సాహముగలిగి మహాత్ములై ధర్మమును సత్యమును విడువకుందురు. మఱియుఁ గొందఱు ధనుర్ధరులును, బరాక్రమనిధులునై వెలయుచుందురు. క్షత్రియు లుత్తములై యుద్ధములందు శూరవరులై విక్రమింతురు. త్రేతయందన్ననో క్షత్రియులు చక్రవర్తులై మహావీరులు నాయుష్మంతులు ధనుర్ధరోత్తములు నై యుందురు. ద్వాపరమందు సర్వవర్ణములవారును గలిగియుందురు. వారు మహోత్సాహులును, బరాక్రమవంతులునై యొకరినొకరు జయింపఁ దలంపుగలిగియుందురు. కలియుగమందన్ననో వారిసారమల్పమయ్యును గోప మధికముగా లోభులును, ననృతవాదులును నై జనించుచుందురు. ఇంకను వారి కీర్ష్యయు, నభిమానము, క్రోధము, మాయాసూయలును గలిగి, లోభరాగములు తమ్ముఁ బీడింపఁ బ్రవర్తించుచుందురు. ఈద్వాపరమందు గుణములు సంక్షిప్తములై యుండును. ఈహైమవతము గుణములచే నుత్తమమైనది. దానికంటె హరివర్ష ముత్తమమైనది" అని తెలుప విని ధృతరాష్ట్రుఁ డిట్టులనియె.

### శాకద్వీపవర్ణనము

"ఓసంజయా! జంబూఖండవిధమునెల్లఁ దెలిపితివి. దీని విరివిని బ్రమాణమును సముద్రప్రమాణమును నున్నదున్నటులు దెల్పుము. మఱియు శాకద్వీపముల నెఱిఁగింపుము, అటులే శాల్మలి క్రౌంచద్వీప

ములవిధమును దెలియఁజేయుము. మఱియు సూర్యచంద్రులయు, రాహువుయొక్కయు విధ మెఱింగింపుము."

అదివిని సంజయుఁడు "ఓరాజోత్తమా! ఈప్రపంచమునఁ గల ద్వీపములు పెక్కులు. అందు సప్తద్వీపములయుఁ, జంద్రాదిత్యాదిగ్రహ ములయు విధ మెఱిఁగించెదను వినుము. ఓరాజా! జంబూద్వీపము పదునెనిమిది వేలయాఱువందల యోజనముల వైశాల్యము గలదిగా నున్నది. లవణసముద్రము విరివి దానికి ద్విగుణమై యుండును. అయ్యది పలువిధములగు దేశములుగలిగి మణివిద్రుమాదులచేఁ జిత్రమై పెక్కు రంగులుకలిగి పర్వతములతో వెలయుచుండును. మఱియు దానిచుట్టును సాగర మావరింప నది సిద్ధచారణులతోఁగూడి యలరుచుండును. ఇఁక శాకద్వీపమువిధ మెఱిఁగించెదను వినుము. దానివైశాల్యము జంబూ ద్వీపముకంటె ద్విగుణము. దానిని క్షీరసముద్రము చుట్టియుండును. ఆసముద్రము ప్రమాణ మాద్వీపప్రమాణమునకు రెండురెట్లు. దాని యందలి జనపదములు పరమపవిత్రమైనవి. అందు జనించినవారికి మర ణమే లేదు. శాంతియుఁ దేజమును గలవారికి దుర్భిక్షమన నెట్టిది? శాకద్వీపవిధము సంగ్రహముగాఁ దెలిపితినిగదా! ఇఁక నేమి వినఁ గోరెదు?" అని యడిగెను.

అదివిని ధృతరాష్ట్రుఁడు "ఓమహాప్రాజ్ఞా! శాకద్వీపమువిధము సంగ్రహముగా నెఱిఁగించితివి. ఇఁక దానియాథార్థ్యమును విస్తరించి తెలుపు"మన వినిసంజయుఁడు "ఓరాజా! ఈశాకద్వీపమున మణిమయము లగుపర్వతము లేడు గలవు. అటులే సముద్రములును నదులును గలవు. వానిపేరులను దెలిపెద నాలకింపుము. అందుఁగలదెల్లఁ బరమ పవిత్రమైనది. మఱియు నందున్న పర్వతములలో మేరువు మొదటిది. అందు దేవర్షులును గంధర్వులు నుందురు. దేనినుండి మేఘములు జనించి వెడలుచుండునో యట్టి మలయపర్వతము దానికిఁ దూర్పునుండి పడ మటిదాఁక వ్యాపించియుండును. దానికిఁ బశ్చిమముగా జలధారమనెడి మహాపర్వతము గలదు. దానినుండియే యింద్రుఁ డెల్లపుడును జలము లను సంపాదించుచుండును. ఓరాజా! వర్షకాలమురాఁగనే, దాని నుండియే వర్ష ముప్పతిలుచుండును. దానివెనుక నున్నత మగురైవతక పర్వతము గలదు. ఆకసముననున్న రేవతి విధికృతముగా దీనియందుఁ

ప్రతిష్ఠింపఁబడియుండును. దీని కుత్తరముగా శ్యామగిరి గలదు. అయ్యది నీలమేఘతుల్యమై మిక్కిలి యెత్తుగలిగి, యెంతయు మనోహర మగురూపము గలిగియుండును. ఓరాజా! అందలి వారెల్ల శ్యామవర్ణము గలవారై యుందురు."

అంత నాసంజయునివచనము లాలించి, యాధృతరాష్ట్రుఁడు "ఓయీ! నీ తెలిపినవచనములను బట్టి నాకొక గొప్పసంశయము గల్గుచున్నది. ఇందుఁగలవారు శ్యామలవర్ణము వారగుట తెలుపవలె నెట్లు?" అని ప్రశ్నింపఁగా విని సంజయుఁడు మఱియు నిట్లనియె.

"ఓరాజా! అన్ని ద్వీపములందును గౌర, కృష్ణ, పతంగవర్ణములు గల్గినప్రజ లుందురు. ఇందున్నవారు చామనచాయవారై యుందురు. ఇందులకు నిమిత్తమును మునుముం దెఱిఁగించెదను వినుము. శ్యామగిరివెనుక, దుర్గశైలములుగల మహోదయపర్వతము కేసరగంధమైన గాలి గలకేసరపర్వతమును గలవు. వీనియందు వర్షము లేడుగలవు. మహాకాశము, జలదము, కుముదోత్తరము, సుకుమారము, కౌమారము, మణికాంచనము, మోదాకి యనునివియే యేడువర్షములు నైయున్నవి. వీని ప్రమాణము జంబూద్వీపమువలె నగునని తెలియవలెను. ఈశాకద్వీపమున నొకగొప్పవృక్షము గలదు. దానిచే దీని కీపేరు గలిగెను. ఇందుఁ బెక్కుజనపదములు గలవు. ఇందలివారు శివభక్తులు. ఇందు సిద్ధులు, చారణులు, దేవతలును జరించుచుందురు. మఱియు నిందలి నాల్గువర్ణములవారును ధార్మికులై యుందురు. నిజధర్మమును విడిచినవా రిందు లేకుండుటయెగాక దొంగయనువాఁ డిందుఁ గానరాఁడు. ఇంకను వారు దీర్ఘాయుష్కులును, జరామరణవర్జితులు నై యుందురు. ఇందలి ప్రజలు వర్షాకాలపునదులువలె మిక్కిలి వృద్ధిగలిగి యుందురు. నదులు పవిత్రజలములై యుండును. ఇందు గంగానది బహువిధములుగాఁ బ్రవహించి సుకుమారి, కుమారి, సీత, కావేరక, మహానది, మణిజల, చక్షుర్వర్ధనిక యనెడినామములతో వెలయుచుండును. పుణ్యోదకములు గలనదు లింకను లక్షలకొలఁదిగా నిందుఁ బ్రవహించును. వానినుండియే యింద్రుఁడు వర్షించును. వాని లెక్కయుఁ గొలతయుఁ దెలుప వలనుపడదు. మఱియు నిందుఁ బవిత్రము లగునాల్గు దేశములు గలవు. అయ్యవి మంగ, మశక, మానస, మందగ

ములను పేరులతో వ్యవహరింపఁబడియెను. వీనిలో మంగ దేశమునస్వకర్మ నిరతు లగుబ్రాహ్మణు లెక్కుడుగా వెలయుచుండురు. మశక దేశమున రాజులు సకలకామప్రదులును, ధర్మనిరతులు నైయుందురు. మానస దేశమున వైశ్యులు నిజకర్మవిశారదు లైయుందురు. మందగ దేశము ధర్మతత్పరులగు శూద్రులతో నిండియుండును. ఆదేశమునకు రాజను వాఁడు లేకుండుటను దండించువారును, దండింపఁబడువారును నుండరు. అందలిప్రజలు ధర్మజ్ఞులగుటఁ దమ్ముఁ దామే పరస్పరము రక్షించుకొనుచుందురు. తేజోవంత మగుశాకద్వీపమునుగురించి తెలుపఁ దలసినవిషయ మిదియే యనుటను దీనిని దెలిపితిని.

ఉత్తరకురుదేశనిరూపణము

ఓమహారాజా! ఉత్తరద్వీపములవిధమును వినుము. అందు ఘృతోదకముగలసముద్ర ముండును. దానివెనుక దధిసముద్రము, పిదపఁ గ్రమముగా సురాసముద్రము, జలసముద్రమును గలవు. ఎల్ల ద్వీపములును గ్రమముగా నొకదానికంటె నొకటి గుణవంతమ్మై యుండును. ఇటులే యివి యెల్లసముద్రములచే నావరింపఁబడియున్నవి. దీనినడుమఁ మణిసిలరూపుగల గౌరపర్వత మొక్కటిగలదు. దీనికిఁ బశ్చిమమునఁ గృష్ణపర్వత మొకటి యున్నది అది నారాయణునకుఁ బ్రియ మైనది. అందున్నపలువిధము లగుదివ్యరత్నములను నారాయణుఁడే పాలించుచుండును. అతఁ డందలిప్రజలయెడఁ బ్రసన్నుఁడై వారికిసుఖ ములు సమకూర్చుచుండును. కుశద్వీపమునడుమ గొప్పగుశస్తంభ మొకటి గలదు. అది చుట్టును గొన్ని జనపదములు గల్గియుండును. శాల్మలిద్వీప మున శాల్మలివృక్షము గలదు. క్రౌంచద్వీపమున గొప్పక్రౌంచగిరి గలదు. అది రత్నములకెల్లఁ దానకమై యుండును. మఱియు నందు నాల్గువర్ణ ములవారును వెలయుచుందురు. ఓరాజా! అందుఁ బెక్కురంగులుగల గోమందమను నొకపర్వతము గలదు. అందుఁ గమలాక్షుఁడు నిత్యము నివసించును. ముక్తిని గోరువారెల్ల నానారాయణు నాశ్రయించి యుందురు. కుశద్వీపమున విద్రుమపర్వతము వ్యాపించియుండును. మఱియు నందు సునామమనెడి బంగరుకొండ రెండవదై యున్నది. అటులే కాంతిమంతమగు కుముదగిరి మూఁడవది. పుష్పవంతమనెడిగిరి

నాల్గవది. కుశేశయగిరి యైదవది. హరిగిరి యాఱవది. ఈయాఱును నందలి పర్వతోత్తమములు. ఈకొండలనడిమివిరివి వీని యెల్లవానివిరివి కిని ద్విగుణమై యుండును. ఔద్భిదము, వేణుమండలము, సురథాకారము, కంబలము, ధృతిమంతము, ప్రభాకరము, కాపిలము, అనెడి నామములతో నేడువర్షలంభకములు గలవు. వానిలో దేవతలును, గంధర్వులును, ప్రజలును జరించుచుందురు. అందలిజనములకు మరణము లేదు. మఱియు నందు దస్యులును, మ్లేచ్ఛజాతులును లేరు. వారు గౌరవర్ణముగలిగి మిక్కిలి సుకుమారులై యుందురు. ఓరాజా! మిగిలినద్వీపములవిధము నేను విన్నయటులునదెలిపెదను, దీనిని విని గ్రహింపుము. క్రౌంచద్వీపమునఁ గ్రౌంచమహాగిరి గలదు. దానిపిదప వామనకము, దానితరువాత నంధకారకము ననెడిపర్వతములు గలవు. ఓరాజా! దానివెనుక మైనాక మున్నది. ఆపర్వతోత్తమము వెనుక గోమందము, దానివెనుకమైనాకనిబిడపర్వతమును గలవు. వానివైశాల్య మొకదానికంటె నొకటి ద్విగుణమై యుండును. ఆద్వీపమునందలి దేశముల నెఱిగించెదను వినుము. క్రౌంచమును సంబంధించిన దేశము కుశలమనియు, వామనకమును సంబంధించినది మనోనుగమనియుఁ దెలుపఁబడును. ఓకురూద్వహా! ఆమనోనుగము తరువాతిది యుష్ణదేశము. దానితరువాతిది ప్రావరకము. దానిపిమ్మటి దంధకారకము. ఆయంధకారకదేశము వెనుకటిది మునిదేశము. ఆమునిదేశము పైది దుందుభిస్వనమని చెప్పఁబడుచున్నది. ఓజనాధిపా! అందలవారు తెలుపు గౌరవర్ణము గల్గియుందురు మఱియు నందు సిద్ధులును, చారణులును విహరింతురు. ఓమహారాజా! ఈదేశములు దేవతలకును, గంధర్వులకును సేవింపఁదగినవి. పుష్కరద్వీపమునఁ బుష్కరమనుపర్వతముమణులకును, రత్నములకును నాకరమై యుండునది. అందు నిత్యము ప్రజాపతి నివసించియుండును. మహర్షులును, దేవతలును మనోహరములగు స్తుతివచనములచేఁ బొగడుచు నిత్యము నాతని నుపాసించుచుందురు. జంబూద్వీపమునుండి పలువిధము లగురత్నములు వెలువడుచున్నవి. ఇటు లెల్లద్వీపములందును గలప్రజలు బ్రహ్మచర్యము, సత్యము, దమము మున్నగుసుగుణములుగల్గి యారోగ్యము నాయువు ననుసరించి వృద్ధినొందుచుందురు. వానినిబట్టియే ద్వీపములందెల్ల నొకటికొకటి

హెచ్చుయియుండును. నా యీ తెలిపిన దేశములందెల్లఁ గర్మ మెక్కుటిగాఁ గానిపించుచున్నది. అందుఁ బ్రజాపతియే ప్రభువై వానిని శాసించుచు రక్షించుచుండును. పామరులు పండితులు నను యీ భేదము లేక యెవ్వఁడు ప్రజల నేలఁదగియుండునో వాఁడే రాజు, దేవుఁడు, తండ్రియుఁ, దాతయు నై యుండునుగదా! ఓకురువంశాగ్రణీ! ఈలోకమునఁ దనంతఁదా లభించి సిద్ధమైయున్న యాహారము నేగదా నిత్యము భుజింతురు. అటులు భుజించుటనే లోకసంస్థితి వైషమ్యము లేక యగపడుచుండును. ముప్పదిమూఁడుదళములతో నలుచదరముగా నీజంబూమండలము వెలయుచుండును. అందు జనసమ్మతములై వామనము, సుప్రతీకము, నైరావతము మున్నగు నాల్గుదిగ్గజములు గలవు. ఆజంబూమండలము పరిమాణమును దెలుప నే నుత్సహింపను అందు నిత్యము నసంఖ్యాకముగా వాయువు లెల్లదిక్కులనుండి విసరుచుండును. ఆదిగ్గజము లాకసంబంధము లేకయే యావాయువులను పద్మతుల్యములును దేజోవంతములు నగు తమతొండములచే వహించుచు నూఱువిధములుగా వాని నవి పైకి విడుచుచుండును. అవి యటు లూపిరి విడుచుచుండఁగా వెడలినవాయువులచేఁ బ్రజలెల్ల నిలుచుచుందురు.” అని తెలుప విని ధృతరాష్ట్రుఁ డిట్లనియె.

“ఓసంజయా! నేనడిగినవిషయమును విస్తరించి తెలిపితివి. ద్వీపస్వరూపము నెఱిఁగింపఁబడినది. ఇఁక రెండవదగు సూర్యచంద్రరాహుగ్రహాదులనుగుఱించి తెలుపుము.”

అదివిని సంజయుఁడు “ఓమహారాజా! ద్వీపములవిధము తెలిపితిని. ఇఁక గ్రహములనుగుఱించి వినుము. రాహువు మండలాకారముగా నుండునట్టిగ్రహము. దానివిరివి పండ్రెండు వేల యోజనములు. దానిచుట్టుకొలఁత ముప్పదియాఱు యోజనములు. దానికంటె నాఱు వేల యోజనము లధికమగువిస్తారముగలదై యది వెలయుచుండునని పౌరాణికులు తెలుపుదురు. చంద్రమండలమన్ననో పదునొకొండు వేల యోజనములవిష్కంభమును, ముప్పదిమూఁడు వేల యోజనముల చుట్టుకొలతయుఁ గల్గియుండును. సూర్యుఁడు పది వేల యోజనములవిరివియు, ముప్పది వేల యోజనముల చుట్టుకొలతయు, నేఁబదియెనిమిది వేల యోజనములు వైపుల్యమును గల్గియుండును. ఈసూర్యుఁడు మిక్కిలి యధికుఁ

డని వినుచున్నారము. అర్కుని ప్రమాణ మిదియని తెలియుము. ఆ రాహువొక్కొకప్పుడు తనమహత్తుచే సూర్యచంద్రులను గప్పుచుండును. ఈసూర్యాదులవిధమును సంగ్రహముగాఁ దెలిపితిని. మఱియు నీప్రపంచనిర్మాణ మిట్టిదని నాయెఱిఁగినచొప్పున శాస్త్రమునుబట్టి యెఱిఁగించితినిగాన నిఁక నీతనయుఁ డగుదుర్యోధనునిగుఱించి చింతింపకుము. ఈభూమిపర్వవిషయమును వినినభూపాలుఁ డర్థసిద్ధిఁ బొందుచున్నాఁడు. మఱియు వాని కాయువు, తేజము, బలము, కీర్తియు వర్ధిలుచుండును. వానిపితృపితామహులును సంతసించుచున్నారు. మన మీభారతవర్షమునందే నివసించియున్నారముగదా! మనపూర్వులచేఁ బాలింపఁబడిన దీనివిధము వింటివిగదా!" అని తెలిపెనని పలికి వైశంపాయనుఁడు మఱియు నిట్లనియె.

### భీష్మునిమరణమును వినుట

ఓజనమేజయా! అంతట నొకనాఁడు ప్రత్యక్షముగా భూతభవిష్యద్వర్తమానముల నెఱిఁగినసంజయుఁ డామహారణరంగమునుండి వచ్చి యప్పటి కేదియో చింతించుచున్నధృతరాష్ట్రునిఁ జూచి తానును మిగుల దుఃఖితుఁడై భారతపితామహుఁ డగుభీష్మునిమరణము నిటులు చెప్పెను.

"ఓమహారాజా! నేను సంజయుఁడను. నీకు నమస్కరించుచున్నాఁడను. కురుపితామహుఁ డగుశాంతనవుఁడు హతుఁడయ్యెను. అయ్యయో! ఆతఁడు సర్వయోధులనడుమను ధ్వజస్తంభముగదా! సర్వధనుర్ధరులకును దేజమువంటివాఁడుగదా! అట్టికురుపితామహుఁ డిపుడు శరతల్పమునఁబడియున్నవాఁడు. ఆహా! నీకొమరుఁ డాభీష్ముని బలముపై నాధారపడియే ద్యూత మొనరించినవాఁడు. అట్టివాఁడు రణరంగమున శిఖండిచేఁ బడఁద్రోయంబడియెను. మున్నాతఁడు మహారథుఁడై కాశిరాజుపై వెడలి యపుడు యుద్ధమునకు సిద్ధపడినమహాయోధులగు పెక్కురుభూపాలురఁ దానొక్కఁడే యుక్కడంగఁ జేసినవాఁడు మఱియుఁ బరశురామునితో నెమ్మదిగా యుద్ధమొనరించి యాతనిచేఁ గొట్టుపడకయు నిపుడీశిఖండిచే హతుఁడయ్యెను. అతఁడు శౌర్యముచే నింద్రుని, స్థైర్యముచే హిమవంతుని, గాంభీర్యముచే సము

ద్రుని, శాంతముచేఁ బుడమిని బోలినవాఁడు. శరములనెడి కోఱలును, ధనువనెడివక్త్రము, గత్తియనెడినాలుకయుఁ గల్గిన నరసింహుఁడగు నీ తండ్రి యిపుడు శిఖండిచే నిహతుఁ డయ్యెను. ఓరాజా! సింహమును జూచిన గోగణమువలెఁ బాండవసైన్యములెల్ల నాతనిఁ జూచి వెఱచి కంపమొందెడివిగదా! వీరమారకుఁ డగునాతఁడు, తనసైన్యమునెల్లఁ జెదరకుండ నిలిపి పదిదినములు యుద్ధమొనర్చినవాఁడు. అటులు వెలిఁగి ఘనకార్యమొనర్చి, తుది కిటు లాదిత్యునివలె నస్తమించెను. మఱియు నతఁ డింద్రునివలె నోర్వ నలవిగాకుండ బాణవర్షమును వర్షించినవాఁడు. ఆపదిదినములలోఁ బదికోటులయోధుల నతఁడు చంపెను. అట్టివాఁ డిపుడు, గాలిచే నేలఁగూలిన మహాతరువువలెఁ బుడమిఁ బడినవాఁడు. అతఁడు నీదురాలోచనకుమాత్ర మనర్హుఁడు." అని తెలుప విని ధృతరాష్ట్రుఁడు మఱియు నిట్లనియె.

"ఓసంజయా! కురుశ్రేష్ఠుఁడగు భీష్ముఁ డెటులు శిఖండిచే హతుఁ డయ్యెనో, ఇంద్రతుల్యుఁడగు నాతండ్రి రథమునుండి యెట్లు పడియెనో అట్టిపరాక్రమశాలి లేకున్నను, నాపుత్రు లెటులుండిరో తెలుపుము. ఆహా! అతఁడు తండ్రియానతిచొప్పుదప్పక బ్రహ్మచారియై దేవతలతోఁ దుల్యమగు బలముగలవాఁడు. మహాప్రాజ్ఞుఁడు. మహోత్సాహముగలవాఁడు. సత్యసంపన్నుఁడు. మానవోత్తముఁడు. అట్టివాఁడు పడుట వినిన నామన మెటు లెఱియకుండును? అతఁడు హతుఁడగుట కెంతయు నాకు వంత గల్గుచున్నది. ఓసంజయా! అట్టి మహనీయుఁడు రణమునకు వెడలినపు డెవ్వరెవ్వ రాతని ననుసరించిరి? ఆతనిముందు నడిచినవా రెవ్వరు? ఎవ్వరు నిలిచిపోయిరి? ఎవ్వరు మఱలిరి? ఎవ్వ రాతని నెదుర్కొనిరి? మఱియు రథమునఁ బులివలె భయంకరముగా నగపడు నక్కురూద్వహుని రణరంగమునకు సహాయులైనవా రెవ్వరు? శత్రుఘాతకుఁ డగునాతఁడు చీఁకటులు దొలఁగించు సూర్యునివలె వైరుల నోడించుచు సైన్యముల కెట్లు వెఱపుగొలిపెను? దుష్కరమగుపని చేయుచు వైరిసైన్యములను భక్షించు నీభీష్మునిఁ బాండవులలో నెవ్వఁడు చుట్టుముట్టెను? ఓసంజయా! అట్టి యోర్వరానిపరాక్రమము చూపు నట్టినాతండ్రినిఁ బాండవసైన్యము లెదిరింపఁగలిగెనా? మఱియు శరములనెడిదంష్ట్రలను, ధనువనెడి తెఱచిననోరును, గత్తియనెడిజిహ్వయును

గల్గి యెవ్వరికిని జేరరాక పులివలె వెలుఁగొలుచునాతని వధార్హుఁడు గాని యాతని మర్యాదగలయాతని, దుస్సహుఁడగునాతనిఁ గుంతీపుత్రుఁ డెటులు పడఁద్రోయించెను? అతఁ డుగ్రమగుధనువుఁ బూని, రథ మధిరోహించి శత్రులతలలఁ దెగనేయుచుఁ గాలాగ్నివలెఁ దేఱిచూడరాక రణరంగమున మెలంగెనుగదా! అటులు తనసైన్యముల నిలుపుచుఁ బది దినములు దుష్కరమగుయుద్ధ మొనర్చి తుదికి సూర్యుఁడువలె నస్తమించెనా! అతఁడు తనబాణవర్షముచే నాపదిదినములలోను బదికోట్ల యోధులను జంపెనా? ఆహా! అట్టివాఁ డిపుడు గాలిచేఁ బుడమిపైఁ బడిన మహాతరువువలె నేలఁగూలెనుగదా! ఈపాంచాలసైన్యము భీమపరాక్రముఁడగు నాతని నెటులు జయింపఁగలిగెను? పాండవు లాభీష్మునితో నెటులు పోరాడిరి? ఓసంజయా! ద్రోణుఁడు జీవించియుండఁగా వారు భీష్ము నెట్లు జయింపఁగలిగిరి? అటులే కృపుఁడును, నశ్వత్థామయు సమీపించియుండఁగా నాతని కపజయ మెటులు గలిగెను? ఇంత యేల! అతిరథుఁడగు నతఁడు శిఖండిచే నెటులు హతుఁ డయ్యెనో నాకు సంశయ మగుచున్నది. దేవతలకును నోర్వరాక మహాబలుఁడగు పరశురాము నెదురించిన యింద్రపరాక్రముఁడగు నాభీష్మునివిధ మెఱిఁగింపుము. ఇంక మనకు సుఖమన్న దెటులు? మనయోధులలో నెవ్వరు దుర్యోధనునాజ్ఞచే నాశ్రీకృష్ణు నెదుర్కొనిరి? శిఖండి మున్నగు పాండవయోధులు భీష్ము నేల యెదుర్కొనిరి? ఓసంజయా! అపు డచ్యుతునిఁ గౌరవు లెదుర్కొనిరా? అయ్యో! నాహృదయము ఱాయివలె నెంత కఠినమైనది! పురుషసింహుఁడగు భీష్ముఁడు పడుట వినియు నది వ్రయ్యలు గాకున్నదే! ఆమహాత్మునియందు సత్యము, వివేకము, నీతియు నపరిమితములై యున్నవిగదా! అట్టివాఁడు యుద్ధమున నెటులు పడియెనో తెలియకున్నది. వింటిచప్పు డుఱుములుగా, బాణములు వర్షబిందువులుగా, ధనువు మెఱుపుగా, మహారావముగల గొప్ప మేఘమువలె నున్నతుఁడగునతఁడు పాంచాలురు సృంజయులు మున్నగు వైరివీరుల నింద్రుఁడు దానవులనువలెఁ దునుమాడుచు బాణములనెడిమొసళ్లను, గాత్మకములనెడియూర్ములనుగలిగి కదలుచు నంతములేక ద్వీపము గానరాక గుఱ్ఱములనెడిసుడులుగలిగి శంఖధ్వనులనెడి హోరుగలిగి కాలిబంటులనెడి మత్స్యములతో నిండియున్న యస్త్రశస్త్ర

సాగరమునకుఁ దాను దీరమై కదలనీక యందు రథహయగజపదాతులు మునిఁగి తేలుచుండ వీరాపహారి యగు నామహనీయు నెవ్వ రావరించి యుండిరి? ఓసంజయా! ఆమహావీరుఁ డటులు వైరిమారకుఁడై ప్రవర్తిలునపుడు దుర్యోధనుహితముగోరి యెవ్వ రాతనియెదుట నిలిచిరి? మఱియు నాతనిదక్షిణచక్రమును రక్షించినవా రెవ్వరు? ఆతనివెనుక నిలిచినవీరు లెవ్వరు? చేరువను జేరియున్నవా రెవ్వరు? ఉత్తరచక్రమును రక్షింపనున్నవా రెవ్వరు? ఆతనివామభాగమున సృంజయులను భంజించుచు సహాయపడినవా రెవ్వరు? ముందుముందు నడిచినవా రెవ్వరు? ఆతఁడు దురవస్థ నొందియున్నప్పుడు పార్శ్వరక్షకులుగా నున్నవా రెవ్వరు? ఆసమూహమున శత్రువీరులతో నపుడు యుద్ధ మొనర్చినవా రెవరు? అపుడు మనవీరులచే నాతఁడు రక్షింపఁబడిన విధమును, నాతనిచే రక్షింపఁబడిన వీరులవిధమును దెలుపుము. సర్వలోకేశ్వరుఁ డగునాబ్రహ్మకును దుర్జయు లగుమనసైన్యములవారి నోడింప నప్పాండవు లెటులు శక్తులైరి? ఎవ్వని నొకయోద్ధఁగాఁ జేరి యారణసాగరమునఁ బ్రవేశించి మనవారు వైరులతోఁ బోట్లాడ నెంచిరో! యట్టిభీష్ముఁ డాసాగరమున మునిఁగెనని తెలుపుచున్నాఁడవు. మఱియు నెవ్వనిబలము నమ్మికొని మహాబలుఁడై నాకొమరుఁడు పాండవులను లెక్కగొనకుండెనో యట్టివీరుఁడే వైరులచే హతుఁడయ్యెనా? ఆహా! మున్నాతఁడు దేవతలెల్లఁ దన్ను సాహాయ్య మొనరింపఁగోరఁగా వెడలి దానవుల రూపుమాపినవాఁడు. అట్టివానిం బట్టిగాఁ బడయుటను శంతనుఁడు లోకప్రసిద్ధి వడసెను. పుత్త్రలక్షణములుగల యీతఁడు జనించుటచేఁ దనశోకమును దైన్యమును విడిచినవాఁడు. అయ్యో! ప్రాజ్ఞుఁడును, స్వధర్మనిరతుఁడును, బవిత్రుఁడును, వేదవేదాంగవేత్తయు నగు నామహనీయుని హతునిఁగాఁ దెలుపుచున్నాఁడవు. సర్వాస్త్రవేత్తయు, వినయవంతుఁడును, శాంతుఁడు, దాంతుఁడు, మానవంతుఁడు నగునాతఁడు హతుఁడగునపుడే మనబలమెల్ల హతమైన దనుకొనవలయును. వృద్ధుఁడును బూజ్యుఁడు నగునాతని హతు నొనర్చి పాండవులు రాజ్యమును గోరుట చూడఁగా ధర్మముకంటె నధర్మమె బలవత్తరమైనదని నాయభిప్రాయము. అంబకై యత్నించి మున్ను పరశురామునితోఁ బోరియు సకలాస్త్రవేత్తయగుట నాతని కోడనిభీష్ముఁడు

రణరంగమున నింద్రతుల్యుఁడై యోధులకెల్ల ధ్వజస్తంభమునుబోలిన భీష్ముఁడు హతుఁడగుటకంటె నాకిక దుఃఖమేమి గలదు? పలుమాఱులు పెక్కుఱు క్షత్త్రియు లీతనిచే జయింపఁబడలేదా? ఎట్టి వీరులనైనను జయింపఁగలిగిన పరశురాముఁ డీతని జయింపఁగలిగెనా? అట్టిమహాత్ముఁ డిపుడు శిఖండిచే హతుఁడగు టరయఁగా యుద్ధగర్వితుఁడును, బరాక్రమనిధియు నగుపరశురామునికన్నఁ దేజోవీర్యబలములచే ద్రుపదపుత్త్రుఁ డగుశిఖండియే బలశాలి యనవలసి యున్నదిగదా! లేనిచో శూరుఁడును, సర్వశాస్త్రవీరుఁడును, సకలవిధాస్త్రాధారుఁడు నగునాతని నెట్లు చంపఁగలిగెను? శస్త్రపరిషత్తులో నాతనిఁబోలినవా రెవ్వరు? ఓసంజయా! పాండవులతో నతఁ డెపుడు యుద్ధమొనర్చెనో తెలుపుము. నాపుత్త్రునిసైన్య మాఁడుదిసలె గొప్పవీరునిఁ గోలుపోయెను. ఇఁక మాసైన్యము గోపుఁడులేనిగోగణమువలెఁ జెదరకుండు టెట్లు? ఎవ్వాఁడు యుద్ధమొనర్చునపుడు సర్వలోకపౌరుషమును పరలోకమొందనగునో యట్టివాఁడు పరలోకప్రియుఁ డగుచుండఁగా నింతకంటె దుఃఖింపఁ దగిన దేమిగలదు? ఇఁక మావారు జీవించినను బ్రయోజనమేమి? పరమధార్మికుఁడును, బరాక్రమశాలియు నగునాతనిఁ జంపించి లోఁతునీట మునిఁగినయోడను జూచుచు నుపేక్షించిన నావికునివలె, నాపుత్త్రులిఁక శోకింతురని తలంచెదను. ఓసంజయా! నేను ఱాతిగుండియవాఁడ ననక తప్పదు. అట్టి భీష్ముఁడుపడినను నేనిటులు జీవించియుంటినే! అయ్యో! అస్త్రములు, శౌర్యము, తపము,బుద్ధియు, ధైర్యము, త్యాగము మున్నగునవి యెన్నియున్నను మృత్యువునుండి యవి మానవునిఁదప్పింపఁజాలవుగదా. నిక్కముగాఁ గాలమే మిక్కిలిపరాక్రమముగలదనియుఁ, దప్పించుకొనరానిదనియుఁ జెప్పవలసియున్నది. లేకున్నచో భీష్ముఁడు హతుఁడగు టేమి? ఓయీ! నాకుఁ బుత్త్రశోకసంతాపము సంభవించినను నాదుఃఖమును జింతింపక శంతనుపుత్త్రుఁ డగు భీష్మునుండియే నారక్షణ ముపేక్షించువాఁడను. ఓసంజయా! సాయంకాలసూర్యునివలె నతఁడు పుడమిఁబడు నపుడు దుర్యోధనుఁ డాతనిఁజేరి యేమియొనర్చెను? మనవారియుఁ బాండవులయు సైన్యములను బుద్ధిచే నాలోచించునపుడు శత్త్రుసైన్యములు మిగులక నశించునని యూహించుచుండెడివాఁడను. అయ్యో! మునిప్రోక్త మగుక్షత్త్రియధర్మ మెంతయు భయంకరమైనదిగదా! లేకున్న,

శాంతనవు నంతటివానిఁ జంపి పాండవులు రాజ్యము నిచ్చగింతురా! అటులే మనవారును నాతనిఁ జంపించియుఁ గార్యము నింకను గోరుచున్నారు. క్షత్త్రధర్మమును బూనియున్న పాండుపుత్త్రుల కిందేమి తప్పు గలదు? గొప్పయాపదలు తటస్థించునపు డార్యులు చేయఁదగిన దెద్దియో! యట్టిపరాక్రమమేమో యాతనిచేఁ జూపఁబడినది. దుర్జయుఁడై శత్త్రుసైన్యములఁ దునుమాడుచున్న యాతనిఁ బాండవు లెటు లెదుర్కొనఁగలిగిరి? అపుడు వారితో యుద్ధమెటులు సాగెను? భీష్ముఁ డెట్లు హతుఁడయ్యెను? అపుడు మాయావు లగుదుర్యోధనకర్ణశకునులును, దుశ్శాసనుఁడును నేమనిరి? నాఁడు మందబుద్ధులై కపటద్యూతమునకుఁగా సభను బ్రవేశించిన యాదుర్యోధనాదు లిపుడు గజహయపదాతులచే నిండి శరశరాసనఖడ్గతోమరాదులచే భయంకరమైన యుద్ధసభను బ్రవేశించి ప్రాణద్యూతమనెడి భయము సంభవింపఁగా వారేమి యొనర్పవారైరి? ఈభీష్ముఁడేగాక యింకను జయింపఁబడినవా రెవ్వరో జయించినవా రెవ్వరో తెలుపుము. శాంతనవుఁడు పడుట వినిన నాస్వాంతమున కింతయేని శాంతి గలుగకున్నది. ఆహా! తండ్రీ! నీరూపమును, నీపరాక్రమమును దలంచికొనిన గుండియ లవియకమానవు. ఓసంజయా! నా కొమరులచేఁ గలిగి నాహృదయమున నెలకొనియున్న యీదుఃఖమును నీవు నేతిచే నగ్నివలె మఱియుఁ బ్రజ్వలింపఁజేయుచున్నాఁడవు. అటులెంతయు నీసంగరభారమును దనతలపై నిడికొనియున్న యాభీష్ముఁడు హతుఁడగుడు నాపుత్త్రు లెట్లు శోకించిరో వారిదుఃఖములను దెలుపవేమి? అపు డందు జరిగినదెల్లఁ దెలుపుము. మందుఁడైన దుర్యోధనుని యవివేకముచే నపుడు గల్గినయపనయ మెద్దియో నయ మెద్దియో యది యెల్లఁ దెలుపుము. భీష్ముఁడు జయ మపేక్షించి యొనర్చినయుద్ధము తొలుతనుండియు నాకెఱిఁగింపుము. అపుడు కురుపాండవసైన్యములలో నెవ్వరెవ్వ రెట్టులెట్టులైరి? క్రమముగాఁ దెల్పుము" అని పలుక విని సంజయుం డిట్లనియె.

దుర్యోధనదుశ్శాసనులసంవాదము

"ఓమహారాజా! నీ వీప్రశ్న మొనర్చుట సరియేగాని దుర్యోధనునియెడ దోష మారోపించుట తగవుగాదు. మానవుఁ డెపుడును దనతప్పుమూలముననే కష్ట మనుభవించుచుండును. అందులకు వాఁడొన

ర్చినపాపమే నిమిత్తమగుచున్నదిగాని మఱియొకటి శంకింపరాదు. ఓరాజా! మానవులలో నెవ్వఁడు నింద్యమును నొనర్చునో వాఁడు తన కృత్యమునుబట్టియే యెల్లవారికి వధ్యుఁడగుచుండును. మీవారొనర్చిన యవమానమును బ్రజ్ఞానిధులయ్యును బాండవు లెంతేని కాలము నీకై నిరీక్షించి భరించిరిగదా! దానికిఁ దమ శాంతిఫలమును నీవువారితోఁ గూడ ననుభవించి చూచినదియేగదా? కావున వారును నింద్యులు గారు. ఇఁక నీవడిగిన ప్రశ్నమున కుత్తర మిచ్చెదను. తేజోనిధు లగు యోధులయు, వారిహయగజములయుఁ గృత్యములను బ్రత్యక్షముగను, యోగబలముచేతను, నేను గాంచినవిషయమును దెలిపెదను వినుము. శోకమునుండి మఱలుము. ఎవ్వనిప్రసాదానుగ్రహమునఁ సర్వోత్తమ మగుదివ్యజ్ఞానముప్రాప్తింపఁగా, దానిచే దూరదృష్టియు, దివ్యదృష్టియు, దూరశ్రవణశక్తియుఁ బరులయింగితమెఱుంగుటయు, భూతభవిష్యద్వర్త మానజ్ఞతయు, బహువిధప్రపంచోత్పత్తిజ్ఞానము, నాకాశగమనము, యుద్ధమున శస్త్రహతిలేకుండుటయు నాకు లభించెనో యట్టిమహాత్ముఁ డగు నీతండ్రి పారాశర్యునకు నమస్కరించి తెలిపెదను వినుము. ఇది మిక్కిలి యద్భుతమైనది. ఈభారతయుద్ధము వినినవారి మేనులు గగుర్పొడువక మానవు. ఓమహారాజా! యథావిధిగా నాసైన్యము లన్నియు వ్యూహములుగా నేర్పడియుండుటను జూచి దుర్యోధనుఁడు దుశ్శాసనుతో "ఓతమ్ముఁడా, భీష్మరక్షణమునకై రథముల నాయితపఱుపుము. సైన్యములనెల్ల వడిగా నడుపుము. పెక్కుదినముల నుండియుఁ జింతింపఁబడుచున్న యిప్పాండవకౌరవసైన్యసమాగమ మిన్నినాళులకు, దటస్థమయ్యెను. ఇపుడు భీష్ముని రక్షించుటకన్న మిన్న యగుకార్యము వేఱొకటిలేదని తలంచెదను. ఈ మనభీష్మాచార్యుఁడు రక్షితుఁడై, పాండవులను, సోమకులను, సృంజయులను భంజింపవలసి యున్నది. మఱియు నీశుద్ధాత్ముఁడు శిఖండిని ఖండింపనని ప్రతినయొనర్చి యున్నవాఁడు. ఆశిఖండి వెనుక నొకప్పుడు డాఁడుదియగుటచే నాతని భీష్ముఁడు చంపక విడుచునఁట. కావున ముఖ్యముగా నిపుడు భీష్ముఁడు రక్షింపఁదగియున్నవాఁడనినాయభిప్రాయము. మనవారెల్ల శిఖండినిఖండిం చుటకే సంసిద్ధులై యుండవలెను. అటులే ప్రాచ్యులును, బ్రతీచ్యులును, దాక్షిణాత్యులును, నుత్తరదేశస్థులును నాతని రక్షించుటకై శస్త్రాస్త్ర

నిపుణులై యాతనిఁ గాపాడుచుండవలయును. మహాబలశాలి యగు సింహమైనను రక్షింపఁబడక వృకముచేఁ జచ్చుట సంభవించును. ఇపుడు మనము సింహమును నక్కచేఁ జంపించుకొనరాదు సుమీ! కావునఁ దనవామచక్రమును యుధామన్యుఁడును, దక్షిణచక్రము నుత్తమౌజుఁడును రక్షింపఁగా వచ్చునట్టి యర్జుననిసహాయముగల నిస్సారుఁ డగుశిఖండినుండి భీష్ముని రక్షింపవలయును. ఆశిఖండి పార్థరక్షితుఁడై భీష్మునిచే విడువఁబడి యున్నవాఁడు. ఓ సోదరా! గాంగేయు నాశిఖండి దండింపకుండునటు లొనర్పవలయును అని పలికె" నని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## సైన్యవర్ణనము

"ఓరాజా! ఆరేయి గడవ గొప్పకలకలము జనించెను. క్షత్త్రియు లెల్లరును లెండు లెండని యొకరినొకరు ప్రోత్సహించు శంఖధ్వనులను, సింహనాదములను జేయసాగిరి. మఱియు రథములచప్పుడులును గుఱ్ఱముల హేషితధ్వనులును, గజములబృంహితనాదములును, బదాతు లగు యోధులసింహనాదములును, మల్లచఱచు వారిచప్పుడులుం గూడి హెచ్చి గొప్పదొమ్మి జరిగెను. ఓమహారాజా! అటులు సూర్యోదయముగుడుఁ గురుపాండవులసైన్యము లెల్ల నొక్కమాఱుగా బయలువెడలెను. అపుడు నీపుత్త్రులయుఁ బాండుపుత్త్రులయుఁ గవచములును నాయుధములును వెలుఁగొలుపసాగెను. పిదప శస్త్రములను ధరించినయిరుతెగల సైన్యములును గానవచ్చెను. అందలి గజహయరథాదు లెంతయు నలంకరింపఁబడి మెఱుపులుగల మేఘములువలె వెలయుచుండెను. రథములు గొప్పనగరములువలెఁ గానవచ్చెను. అట్టిసైన్యమున నీతండ్రి చంద్రుఁడువలె నగపడుచుండెను. ధనుఃఖడ్గగదాతోమరాదిశక్తులతోఁ గూడిన యోధులును గజహయపదాతులును వేలకొలఁదిగాఁ జేరి శత్రులను బంధించుటకుఁ బన్నినవలలువలె వెలయఁజొచ్చెను. మఱియు నిరుతెగల వారిధ్వజము లున్నతములై పలువిధములుగాఁ గానవచ్చుచుండెను. అయ్యవి సువర్ణమణిమయములగుటచేఁ బ్రజ్వలించు నగ్నులువలెఁ దేజోవంతములై వేలకొలఁదిగా నగపడుచు నింద్రునిభవనములయందున్న ధ్వజములునా నొప్పుచుండెను. యోధు లొకరినొక రోడించుకొను

కోరికలతో యుద్ధసన్నద్ధులై చేతులం గత్తులం గట్టికొని తూణీరములు వీపులపై వ్రేలాడ ధనుర్ధరులై సేనాముఖమున నిలువంబడియుండిరి. శకుని, శల్యుఁడు, సైంధవుఁడు, విందానువిందులును, కేకయులును, కాంభోజుఁ డగుసుదక్షిణుఁడును, కాలింగుఁ డగుశ్రుతాయువు, జయత్సేనుఁడు, కురువంశ్యుఁ డగుబృహద్బలుఁడును, యాదవుఁ డగు కృతవర్మయు ననెడియిప్పుడుగురువీరులును బెబ్బులులంబోలి యక్షౌహిణులకుఁ బతులై యున్నవారు. వీరును, మఱికొందఱును, రాజులును రాజపుత్త్రులును ధీరులై యుద్ధమరణదీక్ష వహించి దుర్యోధనునకుఁ బ్రాణము లప్పగింప నెంచియున్నవారు. అటులు దుర్యోధనునికై పోటుపడ సమర్థులై యున్నసైన్యము పదియక్షౌహిణులు. పదునొకొండవది సితసయులపై యున్నది. సర్వసైన్యములకును నాయకుఁడై తెల్లనిపాగయు ఛత్త్రము, కవచమును గలిగినభీష్ముఁడు చంద్రునివలెఁ గానవచ్చుచుండెను. ఆతనిరథము తాలధ్వజముచే నలంకరింపఁబడియుండెను. అట్టి శాంతనవుని శ్వేతాభ్రముగల శీతాంశునిఁగాఁ గురుపాండవు లూహించిరి. ధృష్టద్యుమ్నుఁడు సేనానాయకుఁడుగాఁ గలిగినసృంజయు లా గాంగేయుం గాంచి సింగముంగనిన నీచమృగములువలె వెఱపునొందిరి. ఓరాజా! శోభాకరము లగునీసైన్యములు పదునొకొండక్షౌహిణులు. మహాయోధరక్షితము లైనపాండవులసైన్యము లేడక్షౌహిణులు. అట్టి మహాసైన్యములు రెండును మహామకరములు క్రూరగ్రాహములునుగల సాగరములువలె నలరుచుండెను. ఓరాజా! ఇట్టిసైన్యమేళనము మేము మున్ను విన్నదియుఁ గన్నదియును గాదు." అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

"ఓయాంబికేయా! మున్ను భగవానుఁడగుకృష్ణద్వైపాయనుఁడు తెలిపినట్టులే క్షత్త్రియులందఱు నొకచోఁ జేరిరి. అపుడు చంద్రుఁడు పితృలోకగతుఁడై యుండెను. గ్రహము లేడును నాకసమున విరాజిల్లుచుండెను. నాఁ డాదిత్యుఁ డుదయమున రెండువిధములుగాఁ గానవచ్చెను. పిదప నొకశిఖగలిగి యతఁ డాకసమున నుదయించెను. రవి దీప్తమగు నాదెసను నక్కలును, కాకులును మాంసభోజనాపేక్షులై శరీరములను గోరుచు నఱపఁజొచ్చెను. యుద్ధకాలమునఁ బ్రతిదినమందును, కురువృద్ధుఁ డగుపితామహుఁడును, గురుఁ డగుద్రోణుఁ

డును సుదయమున లేచి నియతులై పాండుపుత్రులకు జయ మగుం గాక యని పలుకుచుందురు. కాని తామొనర్చిన ప్రతినచొప్పున వారు నీకై యుద్ధముచేయ నెంచిరి. సర్వధర్మవేత్త యగు నీతండ్రి రాజులనెల్ల నుద్దేశించి యిట్లు పలికెను. "ఓక్షత్రియవీరులారా! మీకెల్ల స్వర్గద్వార మిపుడు తెఱవఁబడియున్నది. అత్రోవఁబట్టి యింద్రలోకమునకును, బ్రహ్మలోకమునకును బొండు. మనపూర్వులును, వారిపూర్వులును నాదరించిన వేదోక్తమార్గ మిదియే. నిశ్చయచిత్తులై యుద్ధమునెడ మీ మానసములు నిల్పుఁడు. మున్ను నాభాగుఁడు, మాంధాతయు, యయాతి, నహుషుఁడు, నృగుఁడును నిట్టి యుత్తమకర్మములచేతనే సదా సిద్ధులై యుత్తమస్థానముల నొందినవారు. క్షత్రియు లగువారు వ్యాధిపీడితులై గృహములందుఁ జచ్చుట యధర్మముగదా! వారికిఁ గత్తివలనిమరణ ముత్తమమని సనాతనధర్మము.

ఇటులు భీష్ముఁడు తెలుప విని క్షత్రియవీరులందఱును దమతమ రథములతో సైన్యముల నడిపింపసాగిరి. ఓభరతోత్తమా! అపుడు సూర్యపుత్రుఁడగు కర్ణుఁడుమాత్రము తనబంధువులతోఁ గూడి భీష్ముని మూలమున యుద్ధవిముఖుఁడై యస్త్రసన్న్యాస మొనర్చెను. అటు లగుటఁ గర్ణుఁడుతప్పఁ దక్కినరాజలోకమును నీపుత్రులును బదిదిక్కులును బ్రతిధ్వనింప సింహనాదములు నేయుచు బయలువెడలిరి. అపుడు శ్వేతచ్ఛత్రములును, బతాకలును, హయగజరథపదాతులును వెడలిరా భేరులు, పణవములు, దుందుభులును మున్నగునవి మ్రోయుచుండఁగా రథనేమిధ్వనులచేఁ బుడమి యాకులపడ బంగరుభూషణములతోడను, విండ్లతోడను వెలయుచు నగ్నులతోఁగూడిన కొండలువలె యోధులు విరాజిల్లుచుండిరి. మిక్కిలి యున్నత మగుతాలధ్వజముతో భీష్ముఁడా కురుసైన్యమునకు నాయకుఁడై ముందు నిలిచెను. ఓరాజా! నీవారగు వీరులెల్ల ధనుర్ధరులై యాతనియానతిని సిరసా వహించి యుండిరి. మఱియు గోవానదేశీయుఁడగు శైబ్యుఁడు రాజులతోఁగూడి వెడలెను. మఱియు శ్రుతాయుధుఁడు, చిత్రసేనుఁడు, పురుమిత్రుఁడు, వివింశతి, శల్యుఁడు, భూరిశ్రవుఁడు, వికర్ణుఁడు ననియెడివీరేడ్వురును మహాయోధులై యశ్వత్థామకు ముందు నిలిచియుండిరి. వీరెల్ల భీష్మునకు ముందు నడచువారైరి. వారికిని మిక్కిలి యున్నతములై రథములను వెల

యించుచు, బంగరుపూతగలధ్వజము లెంతయు నలరుచుండెను. ఆచార్యవర్యుఁ డగుద్రోణునిధ్వజమున్నతో బంగారువేదికగలిగి కమండలువుతో నలంకరింపఁబడి గొప్పవింటితో నలరారుచుండెను. వేలకొలఁది సైన్యములు వెంటరాఁగా వెడలినదుర్యోధనుని ధ్వజము మణిమయసర్పచిహ్నమై వెలయుచుండెను. అతనికిఁ ముందుగాఁ బౌరవుఁడును, గాలింగుఁడును, గాంభోజుఁడును, సుదక్షిణుఁడును, క్షేమధన్వుఁడును, శల్యుఁడును దమతమరథములతో వెడలిరి మహార్హ మగురథమును, వృషభధ్వజమును గల్గి మాగధునిసేనాగ్రమున నడుపుచుఁ గృపుఁడు వెడలెను. కర్ణుఁడును, గృపుఁడును రక్షకులై యుండఁగా, శరత్కాలమేఘములను బోలిన ప్రాచ్యులసైన్యము వెడలెను. వరాహచిహ్నమై వెండితోఁ జేసిన తనధ్వజము వెలయ సైంధవుఁడు సేనాముఖమున నిలిచియుండెను. మఱియు నతఁ డటులు నిలిచి, లక్షరథములును, నెనిమిదివేలయేనుఁగులును, లెక్కలేనిగుఱ్ఱపుదళములును తనవెంట నంటియుండఁగా నాసైన్యమును బాలించుచుండెను. పెక్కుగజాశ్వములును, నలువదివేలరథములును, బదివేలేనుఁగులును గల్గి గొప్పరథముపై నధిరోహించి కాలింగదేశాధీశుఁడు వెడలెను. వానిమహాగజములు కొండలువలె మెండై, యంత్రతోమరతూణీరములతోడను, ధ్వజములతోడను గన్పట్టుచుండెను. పావకచిహ్నముగల ధ్వజశ్రేష్ఠముగల్గి నిష్కమయ మగుచామరమును వెలయు, విచిత్రమైనయుత్తమాంకుశముతోఁ గూడిన యొకగొప్పయేనుఁగు నెక్కి మేఘముపైనున్న సూర్యునివలె నగపడుచు, నైరావతమెక్కిన యింద్రునివలె భగదత్తుఁడును, దానిననుసరించి గజాధిరూఢులై యవంతిదేశాధీశు లగు విందానువిందులును నడుచుచుండిరి. అటు లావ్యూహ మేనుఁగులనెడియవయవములును, రాజులనెడి తలయును, గుఱ్ఱములనెడిఱెక్కలును గలుగ ద్రోణభీష్మకృపాశ్వత్థామబాహ్లికులచే నేర్పఱుపఁబడి వెలయుచుండెను." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

### కౌరవసైన్యవర్ణనము

"ఓయాంబికేయా! పిదప నొకరెండుగడియలకు గొప్పదొమ్మిగా గుండియ లవియించుచప్పుడు లుప్పతిల్లెను. అప్పు డాశంఖదుందుభిధ్వను

లును, నేన్గులబృంహితములును, రథములనేమిధ్వనులును బుడమిని బ్రద్దలుచేయునట్లు వినవచ్చెను. అంత నవి గుఱ్ఱముల హేషాధ్వనులతోడను, యోధులసింహనాదములతోడను గలసి యొకగడియలో భూమ్యాకాశముల గొప్పచప్పుడులు నిండఁజొచ్చెను. అటులు వారిని తెగలవారును గలిసినపు డుభయసైన్యములును గంపింపఁదొడఁగెను. ఓరాజా! బంగారునగలుగల యందలిగజరథాశ్వములు మెఱుపులతోఁ గూడిన మేఘములునా నొప్పుచుండెను. బహువిధాకారములతో నీవారిధ్వజములు పైకి నుండుచున్న యగ్నులవలె వెలుఁగు చుండఁగా నుభయసైన్యములవారును సూర్యాగ్నులంబోలి యున్నవారు. భీష్ముని వెనుకభాగమును రక్షించువారై నీతనయు లగుదుశ్శాసన, దుర్విషహ, దుర్ముఖ, దుస్సహ, వివింశతి, చిత్రసేన, వికర్ణ, సత్యవ్రత, పురుమిత్ర, జయులును; భూరిశ్రవుఁడు, శల్యుఁడు మున్నగువారును వెడలిరి. మఱియు నభీషాహులు, శూరసేనులు; శిబిదేశీయులు, వసాతులు, సాల్వులు, మాత్స్యులు, సంబష్ఠులు, త్రైగర్తులు, కేకయులు, సౌవీరులు, మఱియుఁ బ్రాక్పశ్చిమోత్తరములనుండి వచ్చినకైతవులును దమతమ శరీరములయం దాశ విడిచికొని భీష్ముని రక్షింప నెంచువారై యుండిరి. వడిగల పదివేలయేన్గులతోఁ గూడి మాగధుఁ డాశాంతనవుని వెంబడిన బయలువెడలెను. ఆసైన్యమునందలి రథములకుఁ జక్రరక్షకులుగను, నేన్గులకుఁ బాదరక్షకులుగను నఱువదిలక్షలజనము సేనామధ్యమున నునుపఁబడియెను. మఱియుఁ బలువిధము లగునాయుధములను ధరించి పెక్కుకోట్లసైనికులు వెడలిరి. అటు లాపదునొకొండక్షౌహిణులును గూడి గంగాయమునాసంయోగమువలెఁ గానవచ్చె" నని తెలుప విని మఱియు ధృతరాష్ట్రుం డిట్లనియె

### పాండవసేనాప్రయాణము

"ఓసంజయా! అటులు పదునొకొండక్షౌహిణులును నొక్కవ్యూహముగా నేర్పడియుండుటను జూచియు ధర్మజుఁడు తన కొలఁదిసైన్యముతో మనవారి నెట్లు తలపడెను? మానుషము, దైవము, గాంధర్వము, ఆసురము అనెడివ్యూహముల నెఱిఁగినభీష్ముని యుధిష్ఠిరుఁ డెటు లెదుర్కొనియెను?"

అదివిని సంజయుఁడు ధృతరాష్ట్రుఁ జూచి "ఓరాజా! అటులు మనసైన్యము వ్యూహముగా నేర్పడుటను జూచి ధర్మాత్ముఁ డగుధర్మ జుఁడు ధనంజయుతో నిట్లుపలికెను. ఓతమ్ముఁడా! మహర్షి యగు బృహ స్పతివచనముచొప్పున నల్పసైన్యముల సంఘముగా నొసర్చియు, బహు సైన్యముల విస్తరించియు యుద్ధముచేయింపవలయునుగదా! కావున నిపుడు మనకుఁ దటస్థించిన బహుశత్రుసైన్యములతో మనయల్పసైన్య ములను సంఘముగా నొనర్చి సూచీముఖమనెడి వ్యూహ మొనర్పవలసి యున్నది. మనసైన్య మల్పము, వైరిసైన్య మధికము నై యుండెను గదా! ఈవిషయమును దెలిసి వ్యూహమును బన్నుము.'

అంత నయ్యర్జునుఁడు 'ఓరాజోత్తమా! మనసైన్యము నిపుడు దుర్జయ మగువ్యూహముగా నొనర్చెదను. ఇది మున్నింద్రునిచేఁ బన్నం బడి యచలమై వజ్రమనుపేరితో వెలయునది. ఈవ్యూహము పెను గాలివలెఁ జెలరేఁగి శత్రులకు దుస్సహమై యుండును. దీనికిముందుగా యోధవర్యుఁ డగు భీముఁడు నిలిచిరిపుసైన్యముల మర్దించుచు యుద్ధము చేయవలసియున్నది. అతఁ డీవ్యూహమునకు ముందుగా నిలిచి యుపా యముగా యుద్ధముచేయఁగలవాఁడు. ఆతని జూచినతోడనే దుర్యోధ నాదులు వెఱపొంది, సింగముఁగాంచిన ముక్కడిమృగములువలెఁ జెదరి పరువులిడుదురు. మహావీరుఁడై ప్రాకారతుల్యుఁ డగు నాతని నాశ్ర యించి మనము దేవరాజు నాశ్రయించిన దేవతలువలె నిర్భయులమై యుండుదము. ఓయన్నా! మనవృకోదరుని బోలిన మహావీరుఁ డీలోక మున లేఁడు. కుపితుఁడైన యీతనియుగ్రకర్మము నెవ్వరు సహింపఁ గలరు?' అని పలికి తా నన్నతో నన్నవిధముగా నన్నరుఁ డావ్యూహ మును బన్నెను. అటు లావ్యూహమును బన్ని యర్జునుఁడు వెడలెను. ఓయాంబికేయా! అటులు యుద్ధసన్నద్ధమైయున్న కౌరవసైన్యములఁ జూచి పాండవసైన్యము నిండుగాఁ బ్రవహించుగంగానదివలె మెల్లఁగా నడుచుచుఁగానవచ్చెను. వారిసేనకు భీముఁడు ముందుగానుండెను. మఱి యుఁ బరాక్రమనిధు లగుధృష్టద్యుమ్నుఁడును, నకులసహదేవులును, ధృష్టకేతువు, నొకయక్షౌహిణితో విరాటుఁడును, నాతనిసోదరులు, బుత్రులును భీమునివెనుక నిలిచియుండిరి. తేజోనిధు లగునకులసహ దేవు లాభీమునకుఁ జక్రరక్షకులై యుండిరి. ఉపపాండవులు నభిమన్యుఁ

డును నాతని వెనుకభాగమును రక్షించువారై యుండిరి. వారికెల్లఁ బాంచాలుఁ డగుధృష్టద్యుమ్నుఁడు రక్షకుఁడై యుండెను. ఆతనికి శూరు లగుకొందఱు సహాయులై యుండిరి. వానివెనుక శిఖండి, యర్జునునిచే రక్షింపఁబడుచునుండెను. అతఁడే భీష్మునిఁ బ్రహరింప వెడలినవాఁడు. ఆయర్జునునకు వెనుక యుయుధానుఁడు నిలిచియుండెను. పాంచాల్యులగు యుధామన్యుఁడును, నుత్తమౌజుఁడును నాతనికిఁ జక్రరక్షకులై యుండిరి. కైకేయుఁడు, ధృష్టకేతువు, చేకితానుఁడును సహాయులై యుండ భీముఁడు వజ్రతుల్యమై దృఢ మగు తనగదను బట్టుకొని కడువడి నడుచుచుండెను. అతఁడు సముద్రమునైనను శోషింపఁజేయువాఁడు. ఇటులు నీజ్ఞాతు లగుపాండవులు మంత్రులతోఁ గూడి చూచుచుండిరి. అప్పు డర్జునుఁడు భీమునితో 'ఓరాజా! ఇఁక నీబలమును జూపుము' అన నప్పార్థుని వారిసైన్యములన్నియు ననుకూలవచనములచే గౌరవించిరి. రా జగుయుధిష్ఠిరుఁడు సేనామధ్యమునఁ గదలుచున్న కొండలవలె నుండు నేనుగులనడుమ నుండెను. పిదప నొకయక్షౌహిణిబలముతోఁ బాండవార్థముగాఁ బరాక్రమించి ద్రుపదుఁడు విరాటు ననుసరించి వెడలెను. వారెల్లరును సూర్యచంద్రులువలె వెలయుచుఁ గనక భూషణాదులగు నానాచిహ్నములను ధరించికొని గొప్పధ్వజములు గల రథముల నధిష్ఠించియుండిరి. వానివెనుక మహారథుఁ డగుధృష్టద్యుమ్నుఁడు తనసోదరులతోడను బుత్రులతోడను గూడి యుధిష్ఠిరునకు రక్షకుఁడై యుండెను. ఓరాజా! నీవారియు వారివారియు రథములందున్న ధ్వజములనెల్లఁ దిరస్కరించి యర్జునుని కపిధ్వజము గానవచ్చుచుండెను. మఱియుఁ గత్తులు మున్నగునాయుధములు ధరించి పదాతులు పెక్కు రాభీమునకు ముందుండి యాతనికి రక్షకులై యుండిరి. పద్మగంధముగల మదించిన పదివేలయేనుగులు కదలుచున్నకొండలువలె నడుచుచున్న వర్ష కాలపుమేఘములువలె వెడలి బంగారువలలతో వెలయుచుఁ దన్ను వెంబడింపఁగా భీముఁడు పరిఘతుల్యమై భయంకర మగు తనగదను బుజముపై వైచికొని యామహాసైన్యమును నడపించుచుండెను. సూర్యునివలెఁ దేఱిచూడరాక సేనలను దపింపఁజేయు నా వృకోదరుని మనయోధు లెవ్వరును జూడఁజాలకుండిరి. ఓరాజా! ఆ వజ్రవ్యూహము సర్వతోముఖమై, నిర్భయమై ధనువులనెడి మెఱుపులు

గలిగి ఘోరమై యర్జునుచే రక్షితమగుచు, నీవారికిఁ బ్రతివ్యూహమై మానవలోకమున నెవ్వారికిని జయింప శక్యముగాకయుండెను. పిదప రెండుసైన్యములును నపు డుదయించుచున్న సూర్యునిఁ గాంచి సంధ్యాకృత్య మొనర్చుచుండఁగా వారివెనుక గాలి బయలువెడలెను. మేఘములులేకయే మెఱపులు మెఱయఁ జొచ్చెను. ధూళిలుగలవాయువులు వీవసాగెను. అటులు ధూళులు వెడలుటచే లోకము చీఁకటిగాఁజొచ్చెను. ప్రాఙ్ముఖముగా నుల్కలుపడి యపు డుదయించుచున్న సూర్యునిఁ జప్పుడగునట్లుగా రెండుఖండములు గావించెను. మఱియు సైన్యములు సన్నద్ధములగుచుండఁగాఁ గాంతిహీనుఁడై సూర్యుఁ డుదయించెను. భూమి కంపించి మహానాదముతో వ్రయ్యలయ్యెను. ఎల్లదిక్కులందును బెక్కుగాఁ బిడుగులు పడ నారంభించెను. అప్పుడు తీవ్రమగు ధూళి వెడలుటచే నేదియుఁ దెలియఁబడకుండెను. మఱియుఁ గదలుచు బంగారుముత్యాలమాలికలతోడను, వస్త్రములతోడను గూడియున్న ధ్వజములు తేజోవంతములై తాటివనములువలెఁ జప్పుడులు సేయసాగెను. ఈవిధముగాఁ బాండవులు యుద్ధోత్సాహులై నీపుత్త్రునిసైన్యమునకుఁ బ్రతివ్యూహ మొనర్చి నీవారియోధులఘాతువులను గ్రుంగునట్లుగా నుండిరి. సేనాముఖమున గదాపాణియై భీముఁడు నిలువఁబడియుండెను." అని తెలుప విని ధృతరాష్ట్రుఁడు మఱియు నిట్లనియె.

కురుపాండవసైన్యవర్ణనము

"ఓసంజయా! అటులు సూర్యుఁ డుదయించుచుండఁగా భీష్ముఁడు నాయకుఁడుగా మావారును, భీముఁడు నాయకుఁడుగాఁ బాండవులును యుద్ధాభిలాషులై యుండిరంటివిగదా! అపు డెవ్వరు ముందు తలపడిరి? ఎవ్వరివెనుక గాలులతోఁగూడిన సూర్యచంద్రు లుండిరి? ఎవ్వరిసేనలో నక్కలు మొఱగెను? ఎవ్వరి యోధులమొగములు వికసించి యుండెను? దానినంతయు నెంతయు యథార్థముగాఁ దెల్పుము."

అది విని సంజయుఁడు "ఓరాజా! ఇరుతెగలవారును సమానముగనే యుత్సహించుచు సరిగనే బయలువెడలిరి. గజహయరథపూర్ణములగుసైన్యములు రెండును విచిత్రము లగువనములువలె వెలయుచుండెను. అటులే యుభయసైన్యములును గొప్పనియు భయంకర

ములునై భారతభూమి కోర్వశానిర్వైయుండెను. మఱియు నవి స్వర్గ జయమునకే సృజింపఁబడి, సజ్జనులచే భజింపఁదగియుండెను. కౌరవులు పశ్చాన్ముఖులును, పాండవులు ప్రాఙ్ముఖులును నై యుద్ధ మొనర్పసాగిరి. అపుడా కౌరవసైన్యము దైత్యసైన్యమువలెను, పాండవసైన్య మింద్రునిసేనవలెను గానవచ్చెను. శుక్రుఁడును, వాయువును పాండవులకు వెనుకగా నుండెను. కౌరవసైన్యమున నక్క- లఱచెను. నీపుత్త్రుల యేన్గులు మత్తగజముల తీవ్రగంధములను సహింపలేకుండెను. అపుడు పద్మవర్ణము బంగారుపార్శ్వకములు వలయుఁ గలిగి మదించిన యొక యేన్గునెక్కి- వందిమాగధులు తన్నుఁ బొగడుచుండఁగాఁ గౌరవుల నడుమ సుయోధనుఁడు వెలయుచుండెను. ఆతనిఛత్త్రము తెల్లనిదై యుండెను. అతఁడు తలను బంగారుమాలిక నొకటి ధరించెను. మఱియు నాతని నలుగెలంకులఁ బార్వతీయులను, గాంధారసైన్యములను గూడి శకుని బయలువెడలెను. మీసైన్యములకు ముందుగా వృద్ధుఁ డగు భీష్ముఁడు తెల్లని వగుఛత్త్రము, విల్లు, శంఖము, పాగయు, ధ్వజము, గుఱ్ఱములనుగలిగి కైలాసమువలె వెలయుచుండెను. ఆతనిసైన్యము లెల్ల ధార్తరాష్ట్రులును, బాహ్లికులలో నొకఁ డగుశలుఁడును, నంబష్ఠులు, సింధుసౌవీరులు, శూరు లగు పంచనదులును నై యుండిరి. ఎఱ్ఱని గుఱ్ఱములుగట్టిన బంగారురథ మధిష్ఠించి ధనుర్ధరుఁడై ద్రోణుఁడు క్షత్త్రియసైన్యముల కన్నిటికిని వెనుకను నింద్రునకు బృహస్పతివలెఁ గాచియుండెను. సకలసైన్యములనడుమను భూరిశ్రవుఁడును, బురుమిత్త్రుఁడును, జయుఁడును, సాళ్వులు, మత్స్యులు, కేకయసోదరులును, గజసైన్యములతో యుద్ధోత్సాహము గలిగియుండిరి. మహాత్ముఁడును, జిత్రయోధియు, గౌతముఁడు నగుకృపుఁ డుత్తరసైన్యరక్షకుఁడై శకులు, కిరాతులు, యవనులు మున్నగువారింగూడి సేన కుత్తరముగా వెడలెను. మఱియు సంశప్తకులనెడి పదివేలరథికులు తమవలన నర్జునునకు మరణముగాని, జయముగాని కావలయుననునిశ్చయముతో నున్నవారు. అటులగుట నాయర్జునుఁ డేదెస నడచిన నందులకే యాత్రిగర్త శూరులు వెడలువారై యున్నవారు. ఓ రాజా! మఁభీష్మాచార్యుఁ డొక లక్ష యేన్గులను, నొక్కొక్క- యేన్గున కొకనూఱేసిరథములను, నొక్కొక రథమునకు నూఱేసిగుఱ్ఱములును, నొక్కొకగుఱ్ఱమునకుఁ బదుగురేసి

ధనుర్ధరులును, నొక్కొక్కరథానుష్క్రునకుఁ బదుగురు కృష్ణాజినధరులునై వెలయు వ్యూహమును బన్నియున్నవాఁడు. మానుషమైన గాంధర్వాసురవ్యూహములలో నొక్కొక్కటిగాఁ బ్రతిదినము మున్నచువచ్చెను. అట్టి కౌరవులవ్యూహము సముద్రప్రవాహస్ఫూర్తిగలిగి పదునాఱుమొగమై నిలువఁబడియుండెను ఓరాజేంద్రా! మీసైన్య మనంతమై భయంకరమై యుండెను. పాండవబల మటులుగానుండినను ధృష్టాస్త్రను లంఘించుటచే నదియే గొప్పదిగను, నోర్వరానిదిగను నున్నదని తలంచెదను." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

ధర్మార్జునసంవాదము.

"ఓరాజా! అటులు విస్తారమై వెడలిన మీసైన్యమును గాంచి కుంతీనందనుఁ డగుయుధిష్ఠిరుఁ డెంతయుఁ జింతిల్లి, 'ఆహా! భీష్మునిచే నభేద్యముగా వ్యూహ మమర్పఁబడియున్నదే! ఇపు డేమిచేయవలసియున్నది?' అని తలంచుచు నర్జునుం జూచి యిట్లనియె.

'ఓయర్జునా! ఈయుద్ధమున మనము ధార్తరాష్ట్రులతోఁ బోరాడు టెట్లు? వారిపక్షమున భీష్ముఁడు యుద్ధముచేయువాఁడై యున్నవాఁడు గదా! వైరిమారకుఁ డగుభీష్మునిచే శాస్త్రీయముగా నీవ్యూహము పన్నఁబడి యభేద్యమై చలింపఁజేయఁదగనిదిగా నుండెను. ఈమహావ్యూహమును నెటులు భేదించి వెడలుటయో యని మనసైన్యములును మనమును సంశయింపవలసియున్నది.'

అది విని యపార్థుఁడు తనయన్న విషణ్ణుఁడై యుండుటకుఁ జింతించి 'ఓరాజా! నీసేన యల్పమయ్యును బ్రజ్ఞాధికులును, శూరులును, గుణాధికులు నగు వెక్కురనైనను జయించునని తెలియుము. అందులకుఁ గారణ మెఱిఁగించెదను వినుము. ఆవిషయమును నారదుఁడును, భీష్ముఁడును, ద్రోణుఁడును దెలియుదురు. ఈసందర్భము నుద్దేశించియే మున్ను దేవాసురయుద్ధమున భీష్ముఁ డింద్రాదులతో వైరుల నోడించుటలో సత్యము, అక్రౌర్యము, ధర్మమును, దోడ్పడునటులు బలము వీర్యమును దోడ్పడ నేరవనియు, ధర్మాధర్మములను దెలిసికొని యందు ధర్మము నాశ్రయించి యహంకారము విడిచి యుద్ధముచేయుఁ డనియు, ధర్మమున్నచోటనే జయముగుననియుఁ దెలిపెనఁట. ఓరాజా!

ఇటులే మనకు యుద్ధమున జయము సిద్ధమని తెలియుము. కృష్ణుం డెందుండునో యందు జయ మగునని నారదుఁడు చెప్పియున్నవాఁడు. జయమనునది కృష్ణునకు వశమై దాస్య మొనరించునది. శ్రీకృష్ణున కీవిజయ మెటులు వశపడియున్నదో యటులే యితరగుణములును వశ పడియున్నవి. ఈగోవిందుఁ డనంతతేజుఁడై వైరులయెడ నించుకేని జంకులేనివాఁడు. మఱియు సనాతనపురుషుఁడున్నై యుండుటచే నీతఁ డున్నచోట జయము గలుగక తప్పదు. మున్న తఁడు హరియై యమోఘ సాయకుఁడై సురాసురులలో మిన్నయైయుండి ఎవ్వరికి జయము గల్గు నను ప్రశ్నము రాఁగా కృష్ణు ననుసరించినచో జయమొందుదు మనెడి వారికే జయముగలుగునని పలికెను. ఆతని యనుగ్రహముచేతనే యిం ద్రాదులగుసురలకుఁ ద్రైలోక్యాధిపత్యము ప్రాప్తించెను. ఏ నీజయమును విశ్వభోక్త యగుత్రిదివేశ్వరుఁడే కోరుచుండెనో యట్టి నీకు వ్యథగల్గు టకు నిమిత్తమేమో తెలియకున్నది అని పలికె” నని తెలిపి సంజ యుఁడు మఱియు నిట్లనియె.

## పాండవులు యుద్ధమునకు వెడలుట

“ఓరాజా! ధర్మజుఁడు భీష్మునిసైన్యములకుఁ బ్రతివ్యూహముగా నొనర్పఁ దనసైన్యములను బ్రోత్సహించెను. వారెల్లరు నుత్తమస్వర్గము నభిలషించి యుద్ధమునకు సంసిద్ధులైరి. శిఖండిసైన్యమును నడుమనిడి సవ్యసాచి రక్షించువాఁడై యుండెను. ధృష్టద్యుమ్నుఁ డెల్లెడలఁ దిరుగు చుండియు భీముఁడు ముందు నిలిచియు నాతనిఁ బాలింపసాగిరి. సేనా దక్షిణభాగమును యాదవోత్తముఁడగుసాత్యకి రక్షించుచుండెను. ఇంద్రవాహనతుల్యమై సకలవిధాలంకారసమన్వితమై సువర్ణభాండము లతోఁ గూడియున్నరథము నాయుధిష్ఠిరుఁ డధిరోహించి, గజసహస్ర ములనడుమ నుండెను. ఆతనిగొడుగు వెల్లనిదై దంతశలాకములతోఁ గూడి మిక్కిలి యున్నతమై యుండెను. ఆతనికుడివైపునఁ గూర్చుండి మహర్షు లాతని సంస్తుతించుచుండిరి. పురోహితులు శత్రువధమగునని తెలుపుచుండిరి. బ్రహ్మర్షు లాతనిఁ బొగడుచు మంత్రజపములు మహా షధులు మున్నగువానిచే నాతనికి శుభము సంఘటించుచుండిరి. పిదప నాధర్మతనయుఁడు వేలకొలఁదిగోవులను, ఫలములను, పుష్పములను,

నాణెములను బ్రాహ్మణుల కొసఁగుచు నమరేశుఁ డగునింద్రుఁడువలె వెడలెను. పిమ్మట వందలకొలది మువ్వలతోఁగూడి యుత్తమసువర్ణమయమై వేయిసూర్యులువలె వెలుఁగుచు జ్వాలామాలికలుగల యగ్నివలె వెలయుచున్న యొకరథమునకు శ్వేతాశ్వములు పూన్పనం దర్జునుఁ డధిష్ఠించి యుద్ధానికిఁ గేశవుఁడు సారథిగాఁ గపిధ్వజుఁడై గాండివపాణియై తేజోవిరాజమానుఁ డగుచుండెను. ఓరాజా! ఇప్పుడమిని ధనుర్ధరులందెవ్వరును నాతనిసాటివా రిప్పటికి లేరు. ముందును గలుగరు. అట్టి యర్జునుఁడు నీకొమరునిసైన్యములను నమలుచున్నట్లుగా రౌద్రరూపమును దాల్చియున్నవాఁడు. మఱియు నాయుధ మక్కఱలేక కేవల భుజములతోడనే మానవులను మత్తగజములను పిండిగాఁజేయు దండిమగఁడగుభీముఁడు కవలంగూడి రథికుఁడై యుండెను. మదించినసింగమువలె రణరంగమునఁ గ్రీడించుమహేంద్రతుల్యుఁ డగు నాభీముని సేనాముఖమునఁ గాంచి బురదలోఁబడిన యేన్గులువలె నీయోధులు భయభ్రాంతులై వ్యథనొందసాగిరి. అటు లాసేనలో నిలిచి యజేయుఁడై యున్న యన్నరు నాలోకించి వెన్నుఁ డిట్లనియె. 'ఓయర్జునా! ఈభీష్మునిఁ జూడుము. ఈతఁడు రోషకలితుఁడై సేనామధ్యమునసుండి మనసేనలకు సింహమువలె వెఱపుగొలుపుచు నున్నవాఁడు. కురువంశవర్ధనుఁ డగు నీతఁడు మున్నూఱుహయమేధములఁ జేయించినవాఁడు. సూర్యుని మేఘములువలె నీతని నీసైన్యము లావరించి చుట్టును నిలిచియున్నవి. వీనినెల్లఁ దొలుత గెలిచి పిదప నీభరతోత్తమునితోఁ బోరాడవలసియున్నది' అని పలికె" నని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## దుర్గాస్తోత్రము.

"ఓయాంబికేయా! యుద్ధసన్నద్ధమైయున్న కౌరవసైన్యమును గాంచి యర్జునుని హితముంగోరి శ్రీకృష్ణుఁడు" ఓయర్జునా! నీవిపుడు శుచివై సంగ్రామమున కభిముఖుఁడవై శత్రుల నోడించుటకై దుర్గాదేవిని సంస్తుతింపుము' అని బోధించెను.

అంత నాధీమంతుఁ డగు నావాసుదేవునుపదేశము నాలించి రథము డిగ్గి కేల్మొగిడ్చి యాయర్జునుఁ డిట్లు దుర్గాదేవిని సంస్తుతించెను.

'ఓసిద్ధసేనానీ! నీకు నమస్కారము. ఓ ఆర్యా! మందారవాసినీ! కుమారీ! కాళీ! కాపాలీ! కపిలా! కృష్ణపింగళా! భద్రకాళీ! నీకు నమస్కారము. మహాకాళీ! నీకు నమస్కారము. ఓచండీ! చండా! నమస్కారము. తారిణీ! వరవర్ణినీ! కాత్యాయనీ! మహాభాగా! కరాళీ! ఓవిజయా! ఓజయా! శిఖిపింఛధ్వజధారిణీ! నానాభరణభూషితా! అట్టశూలములను ధరించినదానా! ఖడ్గఖేటకములను బూనినదానా! గోపేంద్రసోదరీ! ఓజ్యేష్ఠా! నందగోపకులమున జనించినదానా! మహిషాసురమర్దినీ! కుశికవంశమున జనించినదానా! పీతాంబరధారిణీ! మందహాసము గలదానా! కోకముఖీ! నీకు నమస్కారము. ఓయుద్ధప్రియా! ఉమా! శాకంభరీ! శ్వేతా! కృష్ణా! కైటభాసురమర్దినీ! హిరణ్యాక్షీ! విరూపాక్షీ! ధూమ్రాక్షీ! నీకు నమస్కారము. మహాపుణ్యా! బ్రాహ్మణులకు శరణమైన దానా! జాతవేదసీ! జంబూకటకచైత్యనిత్యనిలయా! నీవే బ్రహ్మవిద్యల కెల్ల విద్యవు. ప్రాణులకు మహానిద్రాస్వరూపవు. ఓస్కందమాతా! భగవతీ! దుర్గా! కాంతారవాసినీ! స్వాహాకారము, స్వధయుఁ, గలయుఁ,

అర్జున ఉవాచ—నమస్తే సిద్ధసేనాని ఆర్యే మందారవాసిని, కుమారి కాళి కాపాలి కపిలే కృష్ణపింగళే. ౧. భద్రకాళి నమస్తుభ్యం మహాకాళి నమోఽస్తు తే, చండి చండే నమస్తుభ్యం తారిణి వరవర్ణిని. ౨. కాత్యాయని మహాభాగే కరాళి విజయే జయే, శిఖిపింఛధ్వజధరే నానాభరణభూషితే. ౩. అట్టశూలప్రహరణే ఖడ్గఖేటకధారిణి, గోపేంద్రస్యానుజే జ్యేష్ఠే నందగోపకులోద్భవే. ౪. మహిషాసృక్ప్రియే నిత్యం కౌశికి పీతవాసిని, అట్టహాసే కోకముఖే నమస్తేఽస్తు రణప్రియే. ౫. ఉమే శాకంభరి శ్వేతే కృష్ణే కైటభనాశిని, హిరణ్యాక్షి విరూపాక్షి ధూమ్రాక్షి చ నమోఽస్తు తే. ౬. వేదశ్రుతిమహాపుణ్యే బ్రహ్మణ్యే జాతవేదసి, జంబూకటకచైత్యేషు నిత్యం సన్నిహితాలయే. ౭. త్వం బ్రహ్మవిద్యా విద్యానాం మహానిద్రా చ దేహినామ్, స్కందమాతర్భగవతి దుర్గే కాంతారవాసిని. ౮. స్వాహాకారః స్వధా చైవ కలా కాష్ఠా సరస్వతి, సావిత్రీ వేదమాతా చ తథా వేదాంత ఉచ్యతే. ౯. స్తుతా నిత్యం మహాదేవి విశుద్ధేనాంతరాత్మనా, జయో భవతు మే నిత్యం త్వత్ప్రసాదాద్రణాజిరే. ౧౦. కాంతారభయదుర్గేషు భక్తానాం పాలనేషు చ, నిత్యం వససి, పాతాళే యుద్ధే జయసి దానవాన్. ౧౧. త్వం జంభనీ మోహినీ చ మాయా హ్రీః శ్రీస్తథైవ చ, సంధ్యా ప్రభావతీ చైవ సావిత్రీ జననీ తథా. ౧౨. తుష్టిః పుష్టిర్ధృతిర్దీప్తిశ్చంద్రాదిత్యవివర్ధనీ, భూతిర్భూతిమతాం సంఖ్యే వీక్ష్యసే సిద్ధచారణైః. ౧౩.

గాష్టయు, సరస్వతియు, సావిత్రియు, వేదమాతయు, వేదాంతమును నీవుగాఁ జెప్పఁబడుచున్నదానవు. నీవే విశుద్ధాంతరాత్మచే నుతింపఁబడిన దానవు. నీయనుగ్రహమువలన నీయుద్ధరంగమున నాకు జయముగల్గుఁగాక. కాంతారభయదుర్గములందును, భక్తులయాలయములందును, పాతాళమునందును నిత్యము నివసించుదానవు. యుద్ధమున దానవులను జయించినదానవు. జంభనీ! మోహినీ, మాయా, హ్రీ, శ్రీ, సంధ్యా, ప్రభావతీ, సావిత్రీ! జననీ! తుష్టి, పుష్టి, ధృతి, దీప్తి అను పేరులతో వ్యవహరింపఁబడుదానవు. చంద్రాదిత్యుల వృద్ధినొందించుదానవు. సంపదలుగలవారి సంపదవు రణరంగమున సిద్ధులచేతను, జారణులచేతను జూడఁబడుదానవు' అని యర్జునుఁడు సన్నుతించినవిధమును దెలిపి మఱియు సంజయుఁ డి ట్లనియె.

ఓరాజా! అనంతర మాయర్జునుభక్తిని దెలిసి మానవులయెడ వాత్సల్యముగల యాదుర్గాదేవి యాకాశవాణిగా గోవిందున కగపడుచు 'ఓయర్జునా! కొలఁదికాలముననే నీవు శత్రులనోడింపఁగలవు. నీవు నరావతారమవు. నీకు నారాయణునిసహాయము గలదు. కావున నీవు వైరులకుఁ దేఱిచూడరాకుందుదువు' అని పలికి యామె వెంటనే యంతర్ధానమునొందెను.

ఓమహారాజా! అటు లాయర్జునుఁడు వరమువడసి తనకు జయము గల్గునని తలంచి వెంటనే యతఁడు రథ మధిష్ఠించెను. కృష్ణార్జును లిరువురును నొకరథముపైఁ గూర్చుండి తమదివ్యశంఖములను బూరించిరి. ఏమానవుఁ డీస్తోత్రము నుదయవేళఁ బఠించునో వానికి యక్షరక్షఃపిశాచాదులవలనిభయము గలుగనేరదు. మఱియు వారికి వైరులనుండియు, దంష్ట్రలుగలపాములు మున్నగువానినుండియు, రాజులనుండియు భయము కలుగదు. వివాదమున జయము గల్గును. బద్ధుఁడగువాఁ డాబంధమునుండి విడువఁబడును. మఱియు దీనిపఠనమువలన యుద్ధమున జయముగలిగి నిర్బాధకమైన లక్ష్మి సిద్ధించుచున్నది. ఇంకను దీనిని బఠించినవాఁ డారోగ్యవంతుఁడై నూఱేండ్లు జీవించును. ఓ ధృతరాష్ట్రా! ఇదియెల్ల నావ్యాసమహర్షియనుగ్రహమువలన నాకుదృష్టిగోచరమయ్యెను. దుర్మార్గు లగునీతనయులు కోపము నాపికొనలేక యీ కృష్ణార్జునులను నరనారాయణులనుగాఁ దెలియఁజాలకున్నారు. వీరికిఁ

జేటుకాలము సంప్రాప్తించుటను వీరు కాలపాశబద్ధులై యున్నవారు. వ్యాసుఁడు, నారదుఁడు, కణ్వుఁడు, బలరాముఁడును సంగ్రామము వల దని నీపుత్త్రులను నివారించిరి. కాని వారావచనములను బరిగ్రహింప రైరి. ఎందు ధర్మము, తేజము, కాంతి, బిడియము, లక్ష్మియు వివేకము గల్గియుండునో మఱియు నెందు ధర్మముండునో, అందే శ్రీకృష్ణభగ వానుఁ డుండును. అతఁ డేపక్షమున నుండునోవారికే జయముగల్గును." అని తెలుప విని ధృతరాష్ట్రుఁడు మఱియు నిట్లనియె.

సంజయుఁ డుభయసైన్యములను వర్ణించుట

"ఓసంజయా! అప్పు డాయోధులలో నెవరు మున్ను గానుత్సాహ పూరితులై యుద్ధమునకుఁ దలపడిరో గర్వితులై యున్నావా రెవ్వరో దీనులై యున్నవా రెవ్వరో తెలుపుము. కౌరవపాండవులలో నెవ్వరు భయంకర మగు నారణరంగమున ముందుగా బ్రహరించిరి? దానిని దెలు పుము. ఎవ్వరిసైన్యములోఁ బుష్పమాలికాగంధము లుద్భవించెను? ఎవ్వరికి బ్రదక్షిణవాయువులు వీచెను?"

అదివిని సంజయుఁడు "ఓరాజా! రెండుసేనలవారును నెల్లప్పు డును నుత్సాహవంతులుగ నేయుండిరి. అటులే పుష్పగంధములును గల్గి నవి. అటు లుభయసైన్యములు గలియఁగనే యొకగొప్పసమ్మర్దము గలి గెను. శంఖములయు, భేరులయుఁ జప్పుడులతోఁ గూడి రొమ్మియారంభ మయ్యెను. రణశూరు లగువారికి గొప్పసమావేశము జరిగెను. అప్పు డుభయసైన్యములవారును నొకరినొకరు చూచుకొను చుండిరి. ఏనుగులు గర్జిలుచుండెను." అని తెలుప విని ధృతరాష్ట్రుఁడు మఱియు నిట్లనియె.

శ్రీమద్భగవద్గీత, అర్జునవిషాదయోగము

"ఓసంజయా! మావారును బాండవులును యుద్ధోత్సాహమున ధర్మ క్షేత్ర మగుకురుక్షేత్రమును జేరి యేమియొనర్చిరి?"

అదివిని సంజయుఁడు "ఓరాజా! అటులు వ్యూహముగా నేర్ప డిన పాండవసైన్యమును జూచి నీకొమరుఁడు ద్రోణుని సమీపించి యాతనితో నిటులు పలికెను. ఓయాచార్యా! నీకు శిష్యుఁడై ధీమంతుఁ డగుధృష్టద్యుమ్నునిచే నేర్పఱుపఁబడిన యిప్పాండుపుత్త్రుల గొప్ప సైన్యమును జూడుము. ఈవ్యూహమున భీమార్జునులతోఁ దుల్యులైన

సుఖింపఁగల్గుదుము? ఒకప్పుడు లోభదోషదూషితచిత్తులగుటచే నీ ధార్తరాష్ట్రులకుఁ గులక్షయముచే నగుదోషమును మిత్రద్రోహముచే నగు పాపమును; తెలియకపోవచ్చునుగాని వంశక్షయముచే నగుదోష మెఱిఁగిన మేమెట్లు దీనినుండి నివర్తింపవలయునని తెలిసికొనఁగూడదు? కులక్షయముచే సనాతనములగు ధర్మములన్నియుఁ జెడుచున్నవి. అట్టిధర్మము చెడినచో నధర్మము ప్రబలి యావంశమును జెఱుచుచున్నది. ఓకృష్ణా! అటు లధర్మముచే వంశము చెడినప్పుడు కులకాంతలు దుష్టలగుచున్నారు. స్త్రీలు దుష్టలైనచో వర్ణసంకరము సంభవించుచున్నది. ఆవర్ణసంకర మావంశఘాతకులకును, వారికులమునకును నరకమును గూర్చుచున్నది. ఈవర్ణసాంకర్యముగలవారిపితరులు తిలోదకపిండక్రియలు లేక పతనమునఁ గూలుచున్నారు. మఱియుఁ గులఘాతకుల వర్ణసాంకర్యముచే నగునీదోషములచే శాశ్వతములగు జాతిధర్మములును, వంశధర్మములును జెఱుపఁబడుచున్నవి. ఓజనార్దనా! కులధర్మములు చెడిన మానవులకుఁ దప్పక నరకవాసము గల్గునని వినుచున్నారము. ఆహా! మేము మహాపాతకమును జేయ నడుకట్టితిమిగదా! కానిచో రాజ్యసుఖముల నపేక్షించి స్వజనము నిటులు చంపఁదలంతుమా! దుర్యోధనాదులు శస్త్రధారులై ప్రతీకారమును జేయక యుపేక్షించియున్న నన్ను జంపినఁ జంపనిమ్ము. అదియును నాకు క్షేమమే అని పలుకుచు నాయర్జునుఁడు శరశరాసనములు విడిచి, శోకాకులితమానసుఁడై యారణరంగమునఁ దనరథకూబరమునఁ గూలఁబడియుండె" నని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## సాంఖ్యయోగము

"ఓయాంబికేయా! అటులు కృపావిష్టుఁడై కనులు నీరు నించుచున్న యప్పాండవమధ్యముం జూచి వాసుదేవుఁ డిట్టులనియె. ఓ యర్జునా! మూఢజనోచితమై స్వర్గవిఘ్నకారియై యపకీర్తినిగల్గించు నీ బుద్ధిమాంద్య మిట్టివిషమసమయమున నీ కెందులకుఁ గల్గెను? ఓపార్థా! ఈనపుంసకత్వ మవలంబింపకుము. ఇది నీకుఁ దగనిది. ఓవైరిమారకా! నీచమగు మనోదుర్బలత్వమునువిడిచి యిఁక లెమ్ము.

అదివిని యప్పార్థుఁడు ఓవాసుదేవా! పూజార్హులగు భీష్మద్రోణుల కెదురుగా నిలిచి యెటులు యుద్ధమొనర్చువాఁడను? ఓమధుసూదనా!

మహానుభావులగు గురువులను జంపక విడిచి యీలోకమున బిచ్చమెత్తి కొని జీవించుట యైనను శ్రేయమని తలంతును. గురువులను జంపియు నీలోకమున నర్థకామములను లైనభోగములను నెత్తురుకూడుగా ననుభవింపవలయును. గురువులను జంపుట, భోగము లనుభవించుట ననెడి రెండింటిలో నెయ్యది మేలో నాకుం దెలియకున్నది. ఇదియు గాదు. యుద్ధమొనర్చినను మేము వారిని జయింతుమో! వారే మమ్మును జయింతురో! యనునది యొకటి నిశ్చితముగాయకదా! ఎవ్వరిని జంపి మేము బ్రదుకందలంచమో యట్టిధార్తరాష్ట్రులే మాకెదురుగా నున్న వారు. కార్పణ్యదోషముచే మతిచెడి ధర్మమెద్దియో తెలియక నిన్నుం బ్రశ్నించుచున్నాఁడను. కావున నాకెయ్యది నిశ్చితమగు శ్రేయమో దానిని జెల్పుము. నీకు నేను శిష్యుఁడను. నిన్ను శరణు చొచ్చితిని. కావున నన్ను శాసింపుము ఓదేవా! నిర్బాధకమై సమృద్ధిగలరాజ్యము గాని, సురాధిపత్యముగాని పొందియు నింద్రియములను బరితపింపఁ జేయు నాయీదుఃఖము నెట్లు దొలఁగించుకొనుటయో తెలియకున్నాఁడను. కావున నేనిఁక యుద్ధముచేయఁజాలను అని పలికి యూరకుండఁగా నారెండుసైన్యములనడుమ నటులు చింతిలుచున్న యాయర్జునుంజూచి, వాసుదేవుఁ డాతనిఁ బరిహసించువాఁడువలె నిట్లు పలికెను.

ఓయర్జునా! నీవు శోకింపఁదగనివారికై శోకించితివి. పండితులు తెలుపఁదగుపలుకులు పలుకుచున్నాఁడవు. పండితు లగువా రొకప్పుడును గతించినవారికై గాని, బ్రతికియున్నవారికై గాని శోకింపరు. నేనుగాని, నీవుగాని, యీమానవాధీశులుగాని లేకుండుట యెన్నఁడును సంభవింపలేదు. అటులే మనమెల్లరము నింకను నుండకపోము. దేహి యగు వాఁ డీదేహమున నెట్లు బాల్యయౌవనవార్ధకావస్థల నొందునోయటులే మఱియొకదేహము నొందుచుండును. కావునఁ బండితుఁ డీదేహమునెడ మోహము పెట్టుకొనఁడు. ఓయర్జునా! శ్రోత్రాదు లగునింద్రియములకు శబ్దము మున్నగువిషయములతోఁ గలయిక కల్గినపుడు చలి, వేఁడి, సుఖము, దుఃఖము నను నవి జనించుచున్నవి. అవి యనిత్యములై వచ్చుచుఁ బోవుచుండునవి. వానిని సహింపుము. ఓపురుషవర్యా! ఎవ్వఁడు సుఖదుఃఖములయెడ సమబుద్ధిగల్గి నిశ్చలుఁడై యుండునో వాని నాసుఖదుఃఖములు బాధింపఁజాలవు, అట్టివాఁడే ముక్తికర్హుఁ

యుయుధానుఁడు, విరాటుఁడు, ద్రుపదుఁడు, ధృష్టకేతువు, చేకితా
నుఁడు, కాశీరాజు, పురుజిత్తు, కుంతిభోజుఁడు, ద్రౌపదీపుత్రులు ననెడి
వీరందఱును మహారథులేగదా! ఇఁక మనవారిలో ముఖ్యులగు సేనా
నాయకులగువారిని గుఱుతించుటకై తెలిపెదను వినుము. నీవొకఁ
డవు. భీష్ముఁడు, కర్ణుఁడు, కృపుఁడు, అశ్వత్థామ, వికర్ణుఁడు, సౌమదత్తి,
సైంధవుఁడు మఱియు ననేకులు శూరులును నాకొఱకై ప్రాణములనర్పింప
నున్నవారు. వీరెల్లరును బహువిధశస్త్రములలోఁ బ్రహరించువారును,
యుద్ధనిపుణులు నైనవారు. అయినను భీష్మాభిరక్షితమగు మనసైన్యము
సంపూర్ణము గానట్లున్నది. భీమాభిరక్షితమగు నీపాండుపుత్రులసైన్యము
సంపూర్ణమైనట్లున్నది. కావున నాయాచోటుల మీరెల్ల నిలిచి
భీష్మునిఁ గాపాడవలసియున్నది.

అదివిని కురువృద్ధుఁడును, బ్రతాపశాలియు నగు భీష్ముఁడా దుర్యో
ధనునకు హర్షమొదవించుచు సింహనాదమొనర్చినట్లు తనశంఖమును
బూరించెను. పిదప శంఖములును, భేరులును, పణవములును, ఆనక
ములు, గోముఖములు నొక్కమాఱుగా మ్రోగింపఁబడెను. ఆచప్పు
డెంతయు సాంద్రముగాఁజొచ్చెను. పిమ్మట తెల్లనిగుఱ్ఱములు పూన్చిన
గొప్పరథమును శ్రీకృష్ణార్జును లిరువురు నారోహించి కేశవుఁడు పాంచ
జన్యమును ధనంజయుఁడు దేవదత్తమును బూరించిరి. భీమకర్ముఁ డగు
భీముఁడు పౌండ్రకమనెడి తనమహాశంఖము నూఁదెను. అటులే యుధి
ష్ఠిరుఁడు తనయనంతవిజయమును, నకులసహదేవులు సుఘోషమణి
పుష్పకము లనెడిశంఖములను నొత్తిరి. పిమ్మట ధనుర్ధరుఁడగు కాశిరాజు,
మహారథుఁ డగు శిఖండియు, ధృష్టద్యుమ్నుఁడును, విరాటుఁడు, ద్రుప
దుఁడు, సాత్యకి, ద్రౌపదేయులును, మహాబాహుఁ డగునభిమన్యుఁ
డును దమతమశంఖములను బూరించిరి. ఆయారావములచేఁ గౌరవుల
గుండియలు వ్రయ్యలు గాఁజొచ్చెను. అపుడు భూమ్యాకాశములను
బ్రతిధ్వనులుగలుగ నెంతయు దొమ్మి యారంభమయ్యెను. అనంతర
మాయర్జునుఁ డందందేర్పడియున్న కౌరవుల నారసి శస్త్రప్రహారము
లారంభమగుటను జూచి తానును విల్లెక్కుపెట్టి శ్రీకృష్ణునితో నిట్టు
లనియెను. ఓయచ్యుతా! ఈరెండుసేనలనడుమ మనరథమును నిలు
పుము. ఈసంగ్రామసమయమున నేనెవ్వరితో యుద్ధముచేయవలసియున్న

దో ఎవ్వరు దుర్బుద్ధి దుర్యోధనునకుఁ బ్రియమొనర్ప నిందువచ్చియున్న వారో యట్టి యివీరుల నొకసారి యారయవలసియున్నది.

ఓధృతరాష్ట్రా! అటు లాయర్జునుఁడు పలుక విని వాసుదేవుఁడాయిరుసైన్యములనడుమఁ దమరథమును నిలిపి ఓయర్జునా! భీష్మద్రోణులు మున్నుగా నిందులకు వచ్చియున్న యికౌరవవీరులను గనుంగొనుమని తెలిపెను. అం దర్జునునకుఁ దండ్రులును, తాతలును, గురువులు, మేనమామలు, నన్నలు, తమ్ములు, బుత్రులును, పౌత్రులును, మిత్రులు, మామలు, బంధువులును గానవచ్చిరి. అటు లగపడనిబంధువులనెల్లఁ జూచి యాసవ్యసాచి తనకెంతయుఁ గృపగలుగఁ జింతిలుచుఁ గేశవునితో నిట్లు పలికెను.

ఓకృష్ణా! ఇటులు యుద్ధమొనర్పవచ్చియున్న యీనాస్వజనమును గాంచఁగా నాయవయవములు పటుత్వము తప్పుచున్నవి. మొగము తడియాఱుచున్నది. శరీరము వడఁకుచున్నది. మఱియు మేన గగుర్పాటు గలుగుచున్నది. నాచేతినుండి గాండివము జాఱుచున్నది. ఒడలు మండుచున్నవి.నామనమేమో చలించుచున్నది. ఇఁక నిలువఁజాలను. ఓకేశవా! శకునములు సైతము విపరీతములుగాఁ గానవచ్చుచున్నవి. ఈ యుద్ధమున నీబందుగులను జంపుటచే నాకొకశ్రేయ మగపడలేదు. ఓ దేవా! నాకిందు విజయ మపేక్షితముగాలేదు. రాజ్యమును సుఖములను నేను గోరను. నా కీరాజ్యముచేఁగాని, భోగములచేఁగాని, బ్రదుకుచేఁగాని యేమిప్రయోజనము? ఓగోవిందా! నేనెవ్వరికిఁగా నీరాజ్యమును, భోగములను, సుఖములను, గోరితినో అట్టి నాబందుగులేయిందులకు వచ్చి తనుప్రాణములను, ధనములను, బరిత్యజింపనున్నవారు. వీరు గురువులు, తండ్రులు, తాతలు, పుత్రులు, పౌత్రులు, మేనమామలు, మామలు, స్యాలకులు, సంబంధులు నైయున్నవారు. ఓమధుసూదనా! వీరు నన్నుఁ గొట్టుచున్నను వీరిని జంపుతలంపు నాకుఁ గలుగకున్నయది. ఇకౌరవులనుఁ జంపినచోఁ ద్రిలోకాధిపత్యమువచ్చినను నాకుఁ బ్రీతిగలుగదన్నపు డీపుడమిచేఁ నాకేమిప్రయోజనము? ఈధార్తరాష్ట్రులాతతాయులైనను వీరిని జంపిన మమ్ములను, బాప మాశ్రయింపక మానదు. కావున బంధు సహితులైయున్న యీధార్తరాష్ట్రులను మేము చంపఁజాలము. ఓమాధవా! మేము స్వజనమునెల్లఁ జంపికొని యేమి

సుఖింపఁగల్గుదుమా? ఒకప్పుడు లోభదోషదూషితహృదయులగుటచే నీధార్త రాష్ట్రులకుఁ గులక్షయముచే నగుదోషమును మిత్రద్రోహముచే నగు పాపమును; దెలియకపోవచ్చునుగాని వంశక్షయముచే నగుదోషమెఱిఁ గిన మేమెట్లు దీనినుండి నివర్తింపవలయునని తెలిసికొనఁగూడదు? కుల క్షయముచే సనాతనములగుధర్మములన్నియుఁ జెడుచున్నవి. అట్టిధర్మము చెడినచో నధర్మము ప్రబలి యాకులమంతయును జెడుచున్నది. ఓకృష్ణా! అటు లధర్మముచే వంశము చెడినప్పుడు కులకాంతలు దుష్టలగుదురు. స్త్రీలు దుష్టలైనచో వర్ణసంకరము సంభవించుచున్నది. ఆవర్ణసంకర మూ వంశఘాతకులకును, వారికులమునకును నరకమును గూర్చుచున్నది. ఆవర్ణసాంకర్యముగల వారిపితరులు పిండోదకక్రియలు లేక నరక మునఁ గూలుచున్నారు. మఱియుఁ గులఘాతకుల వర్ణసాంకర్య మునకు నగునీదోషములచే శాశ్వతములగు జాతిధర్మములును, వంశధర్మ ములును జెఱుపఁబడుచున్నవి. ఓజనార్దనా! కులధర్మములు చెడిన మాన వులకుఁ దప్పక నరకవాసము గల్గునని వినుచున్నారము. ఆహా! మేము మహాపాతకమును జేయ సమకట్టితిమిగదా! కానిచో రాజ్యసుఖముల నపేక్షించి స్వజనము నిట్టులు చంపఁదలంతుమా! దుర్యోధనాదులు శస్త్రధారులై ప్రతీకారమును జేయక యుపేక్షించియున్న నన్ను జంపనుఁ జంపనిమ్ము. అదియును నాకు క్షేమమే అని పలుకుచు నాయర్జునుఁడు శరశరాసనములు విడిచి, శోకాకులితమానసుఁడై యాపణరంగమునఁ దనరథకూబరమునఁ గూలఁబడియుండె" నని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## సాంఖ్యయోగము

"ఓయాంబికేయా! అటులు కృపావిష్టుఁడై కనులు నీరు నించు చున్న యప్పాండవమధ్యముం జూచి వాసుదేవుఁ డిట్టులనియె. ఓ యర్జునా! మూఢజనోచితమై స్వర్గవిఘ్నకారియై యపకీర్తినిగల్గించు నీ బుద్ధిమాంద్య మిట్టివిషమసమయమున నీ కెందులకుఁ గల్గెను? ఓపార్థా! ఈనపుంసకత్వ మవలంబింపకుము. ఇది నీకుఁ దగనిది. ఓవైరిమారకా! నీచమగు మనోదౌర్బల్యమునువిడిచి యింక లెమ్ము.

అదివిని యప్పార్థుఁడు ఓవాసుదేవా! పూజార్హులగు భీష్మద్రోణుల కెదురుగా నిలిచి యెటులు యుద్ధమొనర్చువాఁడను? ఓమధుసూదనా!

మహానుభావులగు గురువులను జంపక విడిచి యీలోకమున బిచ్చమెత్తికొని జీవించుట యును శ్రేయమని తలంతును. గురువులను జంపియు నీలోకమున నర్థకామమూలము లైనభోగములను నెత్తురుకూడుగా ననుభవింపవలయును. గురువులను జంపుట, భోగము లనుభవించుట ననెడి రెండింటిలో నెయ్యది మేలో నాకుఁ దెలియకున్నది. ఇదియుగాదు. యుద్ధమొనర్చినను మేము వారిని జయింతుమో! వారే మమ్మును జయింతురో! యనునది యొకటి నిశ్చితముగాదుకదా! ఎవ్వరిని జంపి మేము బ్రదుకఁదలంపమో యట్టిధార్తరాష్ట్రులే మాకెదురుగా నున్నవారు. కార్పణ్యదోషముచే మతిచెడి ధర్మమెద్దియో తెలియక నిన్నుఁ బ్రశ్నించుచున్నాఁడను. కావున నాకెయ్యది నిశ్చితముగ శ్రేయమో దానిని జెప్పుము. నీకు నేను శిష్యుఁడను. నిన్ను శరణు చొచ్చితిని. కావున నన్ను శాసింపుము ఓదేవా! నిర్బాధకమై సమృద్ధిగలరాజ్యముగాని, సురాధిపత్యముగాని పొందియు నింద్రియములను బరితపింపఁజేయు నాయీదుఃఖము నెట్లు దొలఁగించుకొనుటయో తెలియకున్నాఁడను. కావున నేనిఁక యుద్ధముచేయఁజాలను అని పలికి యూరకుండఁగా నారెండుసైన్యములనడుమ నటులు చింతిలుచున్న యాయర్జునుంజూచి, వాసుదేవుఁ డాతనిఁ బరిహసించువాఁడువలె నిట్లు పలికెను.

ఓయర్జునా! నీవు శోకింపఁదగనివారికై శోకించితివి. పండితులు తెలుపఁదగుపలుకులు పలుకుచున్నాఁడవు. పండితు లగువా రొకపుడును గతించినవారికై గాని, బ్రతికియున్నవారికై గాని శోకింపరు. నేనుగాని, నీవుగాని, యీమానవాధీశులుగాని లేకుండుట యెన్నఁడును సంభవింపలేదు. అటులే మనమెల్లరము నింకను నుండకపోము. దేహి యగు వాఁ డీదేహమున నెట్లు బాల్యయౌవనవార్ధకావస్థల నొందునోయటులే మఱియొకదేహము నొందుచుండును. కావునఁ బండితుఁ డీదేహమునెడ మోహము పెట్టుకొనఁడు. ఓయర్జునా! శ్రోత్రాదు లగునింద్రియములకు శబ్దము మున్నగువిషయములతోఁ గలయిక కల్గినపుడు చలి, వేఁడి, సుఖము, దుఃఖము ననునవి జనించుచున్నవి. అవి యనిత్యములై వచ్చుచుఁ బోవుచుండునవి. వానిని సహింపుము. ఓపురుషవర్యా! ఎవ్వఁడు సుఖదుఃఖములయెడ సమబుద్ధిగల్గి నిశ్చలుఁడై యుండునో వాని నాసుఖదుఃఖములు బాధింపఁజాలవు. అట్టివాఁడే ముక్తికర్హుఁ

డగుచున్నవాఁడు. లేనిదానికి స్థితియును లేదు. ఉన్నదాని కభావమును లేదు. ఈసదసత్తుల రెండిటి ప్రాప్తినిశ్చయమును, దత్త్వవేత్త లగు వారు తెలియుదురు. దేనిచే నీజగమెల్ల నిండియున్నదో యది నాశము లేనిదని తెలియుము. ఓయర్జునా! నాశము లేని దీని నెవ్వఁడును నశింప జేయఁజాలఁడు. నాశరహితమై యప్రమేయము నిత్యము నగుశరీరికి శరీరములు నాశముగలవిగాఁ దెలుపఁబడుచున్నవి. కావున నీవు యుద్ధమునకు సిద్ధపడుము. ఎవ్వఁ డిది హింసించునదిగాఁ దలంచునో మఱియు నెవ్వఁ డిది హింసింపఁబడునదిగాఁ దలంచునో వారుభయులును నవివేకు లనఁదగియుందురు. ఇది చంపునదియునుగాదు. చంపఁబడునది యునుగాదు. మఱియు నొకపు డిది జనించుటయును లేదు. ఒకపుడు చచ్చునదియునుగాదు. ఇది మున్ను గలిగినదిగాదు. ఇఁకఁ గలుగఁబోవు నదియుఁగాదు. అజము, నిత్యము, శాశ్వతము నగునిది యనాదియై శరీరములు నశింపఁజేయఁబడుచున్నను, నిది నశింపఁజేయఁబడదు. ఇది నిత్యము వినాశరహితము, అజము, అవ్యయము నని యెవ్వఁడు తెలిసి కొనునో యట్టివాఁ డెవ్వనిఁ జంపువాఁడును, నెవ్వనిఁ జంపించు వాఁడును గానేరఁడుగదా! మానవుఁడు చినిఁగినవస్త్రము లెటులు విడిచి, క్రొత్తదుస్తులను ధరించుచుండునో యటులే చెడినశరీరములను విడిచి దేహి మఱియొక క్రొత్తదేహమును బొందుచున్నాఁడు. ఈదేహిని శస్త్రములును ఛేదింపఁజాలవు. పావకుఁడును దహింపఁజాలఁడు. ఉదకములును దడుపలేవు. గాలి శోషింపఁజేయఁజాలదు. కావున దేహి యచ్ఛేద్యుఁడును, నదాహ్యుఁడును, నక్లేద్యుఁడును, నశోష్యుఁడు నగుచున్నాఁడు. సనాతనమగునిది నిత్యము, సర్వగతము, స్థిరము, నచలము, అవ్యక్తము, అచింత్యము, వికారశూన్యము అని చెప్పఁబడుచున్నది. కావున నిది యిట్టిదని తెలిసి నీవు దీనికై శోకింపఁదగదు. ఓయర్జునా! అటులుగాక యిది యెల్లపుడును జనించునదియు, నిత్యము మరణించు నదియు నని తలంతువేని యపుడుసయితము నీవు దీనికై శోకింపఁ బనిలేదు. పుట్టినవానికిఁ గిట్టుటయుఁ గిట్టినవానికిఁ బుట్టుటయుఁ దప్పనిది. కావునఁ దప్పనిదానికై నీవు శోకించుట తగవుగాదు. ఈప్రాణులు తొలుత నవ్యక్తములై నడుమ వ్యక్తములగుచు మఱల నంతమున నవ్యక్తములగునవిగదా! అట్టివానియెడ శోక మెందులకు? దీని నొకఁ

డాశ్చర్యముగాఁ జూచును. వేఱొకఁ డాశ్చర్యముగాఁ బలుకును. మఱియొకఁడు దీని నాశ్చర్యము గావినును. ఇంకొకఁడు దీనిని వినియుఁ దెలియఁజాలఁడు. ఓభరతపుత్రా! ఎల్లదేహములందును గలదేహి నిత్యుఁడగుటఁ జంపఁబడఁడు. కావున భూతసమూహమునుగూర్చి నీవు శోకింపఁదగదు. ఇదియుఁగాక నీవు నిజధర్మము ననుసరించియు నిటులు చరించుట పాడిగాదు. క్షత్రియునకు ధర్మసంపాదక మగు యుద్ధముకంటె వేఱొకశ్రేయము గూర్చునది లేదు. దైవవశముగాఁ దెఱవఁబడిన స్వర్గ ద్వారమనఁదగి యిట్లు లభించిన యీయుద్ధమును బూనియే క్షత్రియులు సుఖించుచున్నారు. ఇకఁ ధర్మయుక్తమగు నీసంగ్రామ మొనర్పకుందువేని, దానివలన నీవు తప్పక నిజధర్మమునకును, గీర్తికిని దూరుఁడవై పాపము నొందఁగలవు. ఇదియుఁగాక లోకమువారు నీయపకీర్తినినైతము శాశ్వతముగాఁ జెప్పికొనక మానరు. ఇంతకుమున్ను గౌరవార్హుఁడై యున్నవాని కగునపకీర్తి మరణముకంటె నెక్కుడనక తప్పదుగదా! మఱియు మహారథులగు నిక్కర్ణదుర్యోధనాదులు నీవు భయపడి యిటులు రణరంగమునుండి మఱలితివని తలంపకమానరు. ఇటకు మున్ను వారిగౌరవమునకుఁ బాత్రుఁడవైయుండియు నిపు డగౌరవ మొందుదువు. ఇంకను నీసామర్థ్యమును నిందించుచు నీవైరులు నిన్నాడరాని మాటలు పెక్కులాడుదురుగదా! దానిని వినంచినదుఃఖ మేమిగలదు? ఓయర్జునా! ఈయుద్ధమున శత్రువులను జయింతువా! భోగము లనుభవింతువు. లేక మరణింతువా! స్వర్గ మనుభవింతువు. కావున నింక నీవు యుద్ధోత్సాహమును విడువక లెమ్ము. సుఖదుఃఖములను, లాభాలాభములను, జయాపజయములను దుల్యముగాఁ జూచికొని యుద్ధమునకు సిద్ధపడుము. ఇటులైనచో నీకుఁ బాపము సంభవింపనేరదు. ఓయర్జునా! సాంఖ్యవిషయక మగుబుద్ధి నీకెఱిఁగించితిని. ఇఁకఁ గర్మబంధములను ద్రెంచునట్టియోగబుద్ధిని దెలిపెదను వినుము. మోక్షమార్గ మగుయోగమునం దారంభమునకు నాశమును లేదు. ఇది నెఱవేరకున్నఁ బ్రత్యవాయమును లేదు. ఈధర్మము స్వల్పమయ్యును గొప్పభయమునుండి రక్షించుచున్నది. ఓయర్జునా! ఈయోగమునందు నిశ్చయస్వభావముగలబుద్ధి యొకవిధమైనదియే. ప్రామాణ్యజనితనిశ్చయజ్ఞానము లేనివారిబుద్ధులు బహువిధములై యనంతములగుచుండును ఓపార్థా! స్వర్గఫలముకంటె

వేఱుగుఫలము లేదని తలంచుచు నర్థవాదఫలకములగు వేదముల వాదించుచుఁ బండితులుగా నుండుటను వినుటకుమాత్ర మింపుగాఁ బలుకుచుందురు. వారు కోర్కులుగల్గి స్వర్గకాములై భోగముల నైశ్వర్యమును గుఱించి జన్మకర్మఫలముల నిచ్చు పలువిధము లగు క్రియలుగల వాక్కులను దెలుపుచుందురు. అట్టి భోగములందును, నైశ్వర్యములందును బ్రసక్తులై వ్యాపారబాహుళ్యబోధకములగు తపములచే నపహృతాత్ము లగువారికి సమాధియందు నిశ్చయాత్మికబుద్ధి కలుగదు. ఓయర్జునా! వేదములు సంసారమును సంబంధించి తెలుపునవిగాన నీవు నిష్కాముఁడవగుచు సుఖదుఃఖాదిద్వంద్వరహితుఁడవై నిత్యమును సత్త్వమును విడువక యోగక్షేమములను బరిత్యజించి యాత్మ నన్వేషించువాఁడవై ప్రవర్తింపుము. జలముతో నిండియున్న నూతినుండి వాని నపేక్షించువాని కెంతఫలము గల్గునో యంతటిప్రయోజనమే వేదములనుండి ముముక్షువగు బ్రాహ్మణునకుఁ గల్గుచున్నది. కర్మము లొనర్చుటయందే నీకధికారముగాని వానిఫలములను నీవు గోరరాదు. కర్మఫలప్రాప్తికి నిమిత్తము కాకుము. కర్మములను విడుచుటను గోరకుము. ఫలము సిద్ధించినను సిద్ధింపకున్నను వికారము లేక వానియెడఁ దుల్యబుద్ధియై యుండుటయే యోగ మనఁబడును. అట్టియోగమూని సంగవర్జితుఁడవై కర్మముల నాచరింపుము. ఓయర్జునా! సంగరహితములగు కర్మములకంటె సంగసహితములగుకర్మములు దూరములును దక్కువైనవియు నై యుండును. కావున బుద్ధియుక్తుఁడవగుము. ఫలాపేక్షులగు వారు కృపణులగుచుందురు. సమబుద్ధిగలవాఁడు సుకృతదుష్కృతములు రెండిటిని నశింపఁజేసికొనుచున్నాఁడు. కావున బుద్ధియోగమునకై యత్నింపుము. కర్మములందలి కౌశలమే యోగము. బుద్ధియుక్తులగువారు కర్మములనుండి ఫలములను గోరక జ్ఞానులై జన్మబంధములనుండి విడి యెట్టి యుపద్రవము లేని పరమపదము నొందుచున్నారు. ఎపుడు నీబుద్ధి, మోహమనెడికల్మషము నతిక్రమించుచున్నదో యపుడే వినఁగలదాని యెడను వినినదానియెడను విరక్తి నొందఁగలవు. మఱియుఁ బ్రవృత్తినివృత్తిలక్షణములగు శ్రవణములచే విప్రతిపన్న మగునీబుద్ధి యెపుడు నిశ్చలమై సమాధియందుఁ జలనము లేక యుండునో యపుడే యోగము నందఁగలవు.

అదివిని యర్జునుఁడు ఓకృష్ణా ! సమాధిస్థుఁడై యాత్మానాత్మ వివేకబుద్ధిగలవానిభాష యెట్టిదో! వాఁడేమి పలుకునో! ఎటులు కూర్చుం డునో ! ఎట్లు ప్రవర్తించునో ! తెలుపుమన విని యాభగవానుఁ డిట్లనియె.

ఓపార్థా! ఎవ్వఁడు నిత్యసంతుష్టుఁడై మనసున జనించినకోర్కుల నెల్ల నామనసునందే యెప్పు డుపసంహరించునో యప్పుడే వాఁడు స్థితప్రజ్ఞుఁ డనఁబడుచున్నాఁడు. మఱియు దుఃఖములయెడ నుద్వేగమును, సుఖములయెడఁ గోర్కియు లేక రాగమును, భయమును, క్రోధమును విడిచినవాఁడే స్థితప్రజ్ఞుఁ డనఁబడుచున్నాఁడు. ఎవ్వఁ డన్నిట నుదాసీనుఁడై యాయాశుభాశుభములు తటస్థించునపుడును వానియెడ నానందము ద్వేషము నొందకయుండునో వానిప్రజ్ఞయే స్థిరమైనది. ఏయితఁడు కూర్మము తనయంగములన్నిటివలె నెపు డింద్రియార్థములనుండి తన యింద్రియముల నుపసంహరించునో యపు డీతనిప్రజ్ఞ స్థిర మగుచున్నది. నిరాహారి యగుదేహికి రాగముతప్పఁ దక్కినవిషయములు నివర్తించుచున్నవి. ఆరాగమును బ్రహ్మదర్శనమైనచో నివర్తించుచున్నది. ఓ యర్జునా! పరమపదము నరయుటకై పండితుఁడు యత్నించుచున్నను వాని మనము నింద్రియార్థములు బలాత్కారముగా నాకర్షించుచుండును. కావున నాయింద్రియములను నియమించుచు నాయందు సక్తుఁడై, యెవ్వఁడు తనయింద్రియములను దనవశ మొనర్చుకొనునో వానిప్రజ్ఞయే బ్రహ్మమునందు స్థిరత్వమందుచున్నది. విషయములను దలంచినచో మానవునకు వానియెడ సక్తి గలుగక తప్పదు. అట్టివిషయాసక్తివలనఁ గామము గల్గును. దానివలనఁ గ్రోధమును, దానివలన మోహమును, మోహమువలన స్మృతినాశమును, దానివలన బుద్ధినాశమును, దానిచే మానవునకు నాశమును గల్గుచున్నది. రాగద్వేషరహితములై తనకు వశపడిన యింద్రియములచే వర్జింపరాని యశనపానాదులగువిషయముల ననుభవించుచు లొంగినమనసుగలిగి నిర్మలుఁ డగుచున్నాఁడు. అట్టిచిత్తనైర్మల్యము గలుగఁగా నపు డాతని సర్వదుఃఖములును నణఁగుచున్నవి. అట్టి నిర్మలచిత్తునకు వడిగా బుద్ధిస్థైర్య మొదవును. యోగాభ్యాసరహితున కాత్మస్వరూపవిషయబుద్ధిగలుగదు. యోగిగాని

వాని కాత్మజ్ఞానాభినివేశమును గలుగదు. అట్టిభావనలేనివానికి శాంతి గలుగదు. శాంతిరహితునకు సుఖమన నెట్టిది? విషయప్రవృత్తములగు నింద్రియముల నెవ్వనిమన మనుసరించునో యట్టిమనసు వానిప్రజ్ఞను జలములందున్న యోడను గాలివలెఁ జలింపఁజేయును. ఓయర్జునా! ఆకారణముచే నెవ్వనియింద్రియము లింద్రియార్థములనుండి నివర్తింపఁబడునో వానిప్రజ్ఞయే స్థిరమగుచున్నది. సకలభూతములకు నెయ్యది రాత్రియో యందు యోగి మేలుకనుచున్నాఁడు. అటులే భూతము లెక్కాలమున మేలుకనునో యాత్మదర్శనము చేయువాని కది రాత్రి యగుచున్నది. ఉదకములతో నిండియు నిశ్చలమైయున్న సముద్రము నుదకము లెట్లు ప్రవేశించి యడంగునో యటులే సర్వేంద్రియములు నెవ్వనియందుఁ జొచ్చి యడంగునో యట్టివాఁడు శాంతి నొందుచున్నాఁడు. విషయముల నపేక్షించువాని కెన్నఁడును శాంతి గలుగ నేరదు. మఱియుఁ గామముల నెల్ల వీడి యెవ్వఁడు నిస్పృహుఁడై యహంకారమమకారములు లేకుండునో వాఁడు శాంతి నొందుచున్నాడు. ఓయర్జునా! ఇదియే బ్రహ్మయందగుస్థితి. దీని నొందినవాఁడు మోహవశుఁడుగాఁడు. తుదికాలమందైనను దీనిని బూనినవాఁడు ముక్తి నొందు చున్నాఁడు అని తెలిపిన విని యర్జునుం డిట్లనియె.

## కర్మయోగము.

ఓజనార్దనా! కర్మమార్గముకంటె జ్ఞానమార్గమే గొప్పదని నీవు తలంతువేని ఘోరమగు నాకర్మజాల మొనర్చుటకై యిట్లు నియోగింపనేల? ఓదేవా! మందబుద్ధి నగునాకు మిశ్రములైనవివలెఁ గానఁబడుమాటలచే నన్నిటులు మోహపెట్టుచున్నట్టు లున్నాఁడవు. కావున నేది నాకు శ్రేయము గల్గించునదియో యట్టిదాని నొకటి నిశ్చయించి తెలుపుము.

అదివిని యావాసుదేవుఁ డోయర్జునా! ఈలోకమున నాచరింపఁదగినది రెండువిధములై యుండునని యింతకుమున్నే తెలిపియుంటిని గదా! అయ్యది సాంఖ్యులకు జ్ఞానమార్గమును, యోగులకుఁ గర్మమార్గమును నై యున్నది. కర్మముల నారంభింపకున్నంతనే జ్ఞాననిష్ఠ గలుగఁబోదు. కర్మములను విడిచినంతనే సిద్ధిగలుగఁబోదు. ఎవ్వఁడైనను

నొకప్పుడును, నొకక్షణమైనను కర్మ మొనర్పకుండుట సంభవింపదు. సకల జనులును బ్రకృతివలనఁ గల్గిన గుణములకు వశులై కర్మములను జేయుచునే యుందురు. కర్మేంద్రియముల నడంచినను, నెవ్వఁ డింద్రియార్థముల మనసునఁ దలంచుచుండునో వాఁడు మూఢుఁడును, దురాచారుఁడు నని చెప్పఁబడుచున్నాఁడు. ఓయర్జునా! స్థిరచిత్తముచే నింద్రియములనడంచి కర్మేంద్రియములచేఁ గర్మఫల మపేక్షింపక కర్మము లెవ్వఁడొనర్చునో వాఁడుత్తముఁ డనఁబడుచున్నాఁడు. నీవు నియతమగుకర్మ మొనర్పుము. అకర్మముకంటెఁ గర్మ ముత్తమమైనది. కర్మ మొనర్పనివానికి దేహయాత్రయు సిద్ధింపదుగదా! యజ్ఞమునకు నిమిత్తముగాని యితరకర్మ మొనర్చినచో నాజనము దానిచేఁ గట్టఁబడును కావునఁ గర్మఫలాపేక్ష విడిచి, యాయజ్ఞార్థమై కర్మమాచరింపుము. మున్ను పరమేష్ఠి యజ్ఞములతోఁగూడఁ బ్రజలను సృజించి యాప్రజలతో "ఓయీ! ఈ యజ్ఞముచేఁ బ్రజలను సృజింపుఁడు. ఇది మీయిష్టములనెల్ల సమకూర్చునది. దీనిచేతనే దేవతలను సేవింపుఁడు. ఆదేవతలు మిమ్మును రక్షింతురు. మీరును, దేవతలును నిటులు పరస్పరము భావించుకొనినచో, మీకు మేలు చేకూరును. దేవతలు యజ్ఞములచేఁ బూజింపఁబడి మీకిష్టము లగుభోగముల నొసంగుదురు. ఆదేవతలిచ్చినవానిని వారి కర్పింపక, తానే దినినవాఁ డొకదొంగ యనఁబడుచున్నాఁడు. యజ్ఞశేషమును భుజించిన సజ్జనులు సకలపాపముల నుండియు విముక్తులగుచున్నారు. అటులుగాక యెవ్వరు తమకుఁగా వండికొందురో యట్టిపాపులు పాపమునే దినుచున్నవారు. అన్నము వల్లనే భూతములు పుట్టుచున్నవి. ఆయన్నము పర్జన్యునివలనఁ గల్గుచున్నది. ఆపర్జన్యుఁడు యజ్ఞమువలనఁ బొడముచున్నాఁడు. ఆ యజ్ఞము కర్మములవలనఁ గల్గుచున్నది. ఆకర్మము వేదముచేఁ గల్గుచున్నది. ఆవేదము పరమాత్మవలనఁ గల్గుచున్నది. కావున సర్వగతమగుబ్రహ్మము, నిత్యము యజ్ఞమునఁ బ్రతిష్ఠింపఁబడియున్నది" అని తెలిపెను. ఓయర్జునా! ఇటులు తిరుగుచక్రము నెవ్వఁ డనువర్తింపఁడో వాఁడు పాపజీవనుఁడై విషయసక్తుఁడై వ్యర్థముగా జీవించుచుండును. ఏమానవుఁ డాత్మయందే రతిగల్గి యాయాత్మచేఁ దృప్తినొంది, యాత్మయందే తుష్టినొందునో వాఁడొనర్పఁదగుకార్య మెద్దియును లేదు.

అట్టివాఁడు కర్మ మొనర్చినను తత్ఫలము గలుగదు. కర్మము మానినను కీడుపూడదు. మఱియు వానికి, సకలభూతములందును సాధింపఁదగిన హిత మేకియును లేదు. కావున ఫలవాంఛను విడిచి కర్మముల నాచరింపుము. అటులొనర్తువేని పరమపదము నీకు సిద్ధించుచున్నది. కర్మము చేతనే జనకాదులు సిద్ధిబడసిరిగదా! యంతియగాక లోకసంగ్రహార్థముగనైన నీవు కర్మము లాచరింపఁదగియున్నవాఁడవు. లోకములో నుత్తముఁడగువాఁ డేదేది యాచరించునో దానినే యితరులును జేయఁబూనుదురు. మఱియు నాయుత్తముఁ డేది ప్రమాణముగ నెంచునో దానినే లోకమునైత మనువర్తించును. ఓపార్థా! నాకాచరింపఁదగిన దించుకేనియును లేదు. మూఁడులోకములందును, నాకుఁ బొందఁదగినదియును లేదు. లభింపనిదియు లేదు. నేను గర్మము లాచరింపలేదా? ఒకపుడేని, నేను జాగరూకుఁడనై కర్మము లాచరింపనిచో నెల్లవిధములను మానవులు నామార్గము నే యనుసరింతురు. కావున నేను గర్మములాచరింపకుంటినేని, యీలోకములన్నియుఁ జెడవలసివచ్చును. ఆకారణముచే వర్ణసాంకర్యమునకు నేను గర్తనై ప్రజలకు హాని గల్గించినవాఁడ నగుదును. ఓయర్జునా! జ్ఞానహీనులగువారు కర్మములందాసక్తిగలిగి వాని నెటులొనర్తురో యటులు జ్ఞానియగువాఁ డసక్తుఁడై లోకసంగ్రహార్థముగాఁ గర్మము లొనర్పవలయును. కర్మసక్తులయిన యజ్ఞానులకుఁ బ్రాజ్ఞుఁ డగువాఁడు బుద్ధివైకల్యమును గల్గింపరాదు. విద్వాంసుఁడు తాను గర్మములొనర్చుచు నెచ్చరికచేసి వారిచేఁ గర్మములను జేయింపవలయును. ప్రకృతిగుణములచేఁ గర్మములెల్ల జేయఁబడుచుండఁగా నహంకారముచే మూఢాత్ముఁ డగువాఁడు తాను జేయుచున్నాఁడ నని తలంచుచున్నాఁడు. ఓపార్థా! గుణకర్మవిభాగ మెఱింగినవాఁడు గుణములు గుణములతోఁ గూడి వర్తించునని తలంచుచు వానియం దాసక్తివిడుచును. ప్రకృతిగుణములకుఁ దగుల్కొని మూఢులైనవా రింద్రియవిషయములకుఁ జిక్కుచుందురు. అట్టి స్వరమును దెలియని మందబుద్ధు లగువారిని బండితులగువారు వికలచిత్తులఁగాఁ జేయరాదు. సకలకర్మములను నాయందునిచి జ్ఞాననిష్ఠ మగుమనసుచే నిష్కాముఁడవును నిరహంకారుఁడవు నై యిప్పరితాపమును వీడి యుద్ధ మొనర్పుము. ఎవ్వరు నాయీమతమూని శ్రద్ధావంతులును, ననూయా

రహితులు నై నిత్యము దీని ననుసరింతురో వారు కర్మబంధములనుండి విముక్తులగుచున్నారు. అటులుగాక నాయీమతమం దసూయగలిగి దీని నాచరింపకుందురో సర్వజ్ఞానశూన్యులై మూఢులగునట్టివారిని బుద్ధిహీనులై చెడినవారినిగాఁ దెలుసుకొనుము. జ్ఞానియును దన ప్రాచీనకర్మ వాసనలచేఁ గర్మములందు వర్తించును. ప్రకృతి కధీనమై ప్రవర్తించు ప్రాణికోటి యింద్రియనిగ్రహ మెటు లొనర్పఁగలదు? అది యెల్లయింద్రియార్థములందును రాగద్వేషములు విడువకుండును. కావున నారాగద్వేషముల కెవ్వరును వశపడఁగూడదు. అవి శ్రేయమునకు విఘ్నము చేయునట్టిశత్రువులు. సరిగా నొనర్చినపరధర్మముకంటె విగుణమైనను నిజధర్మమే శ్రేయస్కరము. నిజధర్మాచరణమున మరణమైనను మేలే. పరధర్మమన్ననో భయహేతువగును. అని భగవానుఁడు తెలుపఁగా విని యర్జునుఁడు ఓదేవా! మానవుఁడు తాను గోరకుండియు బలాత్కారముగా నేకారణముచే శాసింపఁబడి దుష్కర్మము లొనర్చువాఁ డగుచున్నాఁడు? అనియడుగ వాసుదేవుఁడు మఱియు నిట్లనియె.

ఓయర్జునా! ఈకామక్రోధములు రజోగుణముచేఁ గల్గుచున్నవి. ఇవి మహాశనములును మహాపాపులు నై నయవి. కావున వానిని వైరులఁగాఁ దెలిసికొనుము. ఓయర్జునా! పొగచే నగ్నియు, మాలిన్యముచే నద్దమును, మావిచే గర్భమును నావరింపఁబడినట్టులుగా నిండింపరాని యగ్నియైన యికామరూపమగు నిత్యవైరిచే జ్ఞాని విజ్ఞాన మావరింపఁబడియుండును. ఇకామమున కింద్రియములు, మనసు, బుద్ధి యనునవి యధిష్ఠానములుగాఁ జెప్పఁబడుచున్నవి. మఱియు నికామము, జ్ఞానము నావరించి యింద్రియములచే దేహిని మోహపెట్టుచున్నది. కావున నీవు ముందుగా నాయింద్రియములను నియమించి పాపిష్ఠతమును జ్ఞానవిజ్ఞానముల నశింపఁజేయునదియు నగు నీకామమును విడిచికొనుము. ఈస్థూలదేహముకంటె నింద్రియములును, వానికంటె మనసునుఁ దానికంటె బుద్ధియు, దానికంటెఁ బరమాత్మయును, నుత్తమత్వమొందియుండెనని తెలియుము. ఇటులు బుద్ధికంటెఁ బరమగువస్తువును దెలిసికొని యాత్మచే నాత్మను సమాధిగతముగ నొనర్చి దుర్జయ మగు కామరూపవైరిని ఛేదింపుము. అని తెలిపి భగవానుఁడు మఱియు నిట్లనియె.

ఓయర్జునా! అవ్యయ మగు నీయోగమార్గమును, మున్ను నేను సూర్యునకుఁ దెలిపితిని. అతఁడు మనువున కెఱిఁగించెను. ఆమను విష్వాకువున కుపదేశించెను. ఇటులు పరంపరగావచ్చిన యీయోగమును రాజర్షులు దెలిసికొనిరి. ఓయర్జునా! ఆయోగము చిరకాలము నష్టమయ్యెను. పురాతన మగునాయోగమునే యిపుడు, నీవు నాకు భక్తుఁడవగుటను, మిత్రుఁడవగుటను, నుత్తమ మగునీరహస్యము నెఱిఁగించితిని. అని పలుక విని యర్జునుఁడు ఓదేవా! నీజన్మ మిపుడు జరుగుచున్నది. వివస్వతుని జన్మము జరిగిపోయెనుగదా ! నీవాతనికిఁ దెలుపుట యెట్లు జరుగును? అని ప్రశ్నింపఁగా విని మఱియు భగవానుఁ డిట్లనియె.

ఓయర్జునా! నాకును నీకును బెక్కుజన్మములు గడచినవి. ఆజన్మములనెల్ల నే నెఱుఁగుదును. నీవు తెలిసికొనఁజాలవు. నేనజుఁడను, నవ్యయుఁడను, నీశ్వరుఁడనైనను, త్రిగుణాత్మికయగు నాప్రకృతియే నాకధిష్ఠానముగా నామాయచేతనే నే యావిర్భవించుచుందును. ఓభారతా! ఏయేకాలముల ధర్మమునకు హాని సంభవించుచుండునో యటులే యధర్మ మెప్పు డుదయించుచుండునో యపుడు నేనే నన్ను సృజించుకొనుచుందును. సాధుజనులను రక్షించుకొనుటకును, దుర్జనులను నశింపఁజేయుటకును, ధర్మమును నిలుపుటకును, బ్రతియుగమందును నే నవతరించుచుందును. ఓయర్జునా! ఇట్టి నాదివ్యజన్మములను గర్మములను నెవ్వఁడు యథార్థముగాఁ దెలియునో వాఁ డాదేహమును విడిచి పిదప మఱి జన్మమొందక నన్నుఁ గలియుచున్నాఁడు. రాగమును, భయమును, గ్రోధమునువీడి మన్మయులై నన్నాశ్రయించిన యనేకులు జ్ఞానతపముచేఁ బవిత్రులై ముక్తినొందిరి. ఎవ్వరెటులు నన్నుఁ దెలిసికొని సేవింతురో యటులే వారిని జూచి నేనును సేవించుచున్నాఁడను ఓ పార్థా! మానవు లెల్లవిధములను నామార్గమునుబట్టియే ప్రవర్తించుచున్నారు. ఈమానవులు కర్మఫలములనే గోరువారగుటను దేవతల నారాధింతురు. వారికి శీఘ్రముగా. నాకర్మఫలము సిద్ధించుచున్నది. గుణకర్మవిభాగమునుబట్టి నాల్గువర్ణములను నేను సృజించితిని. అయినను నవ్యయుఁడనగు నేను వానికిఁగర్తగాఁ దెలిసికొనుము. నన్నుఁ గర్మములంటఁజాలవు. నాకుఁ గర్మఫలమునందు వాంఛయును లేదు. నాయీవిధము నెవ్వఁడు తెలిసికొనునో వాఁడు కర్మములచే బద్ధుఁడు గానే

రఁడు. ఇది యిటులని తెలిసికొనియే ముక్తినిగోరు పూర్వులచేఁ గర్మము
లాచరింపఁబడియెను. కావున నీవును నాపూర్వు లాదరించినకర్మములను
విడువక వానినొనర్పుము. కర్మ మేదియో యకర్మ మేదియో యనువిషయ
మును దెలిసికొనఁజాలక దీనియెడఁ బండితులును భ్రాంతులైరి. కావున
దేనిని దెలిసి నీవు సంసారబాధలనుండి తొలఁగుదువో యట్టి కర్మాకర్మ
విభాగమును దెలిపెదను వినుము. శాస్త్రవిహితకర్మములకును, నిషిద్ధ
కర్మములకును, గర్మరాహిత్యమునకును, బోద్ధవ్యము గలదు. కర్మగతి
మిక్కిలి గహనమైనది. కర్మమునందుఁ గర్మాభావమును, గర్మాభావమునఁ
గర్మమును నెవ్వఁడు తెలిసికొనునో వాఁడే మానవులందు బుద్ధిమంతుఁ
డును, యోగియు నై యెల్లకర్మములను దెలిసినవాఁ డగుచున్నాఁడు.
ఎవ్వని కార్యారంభములన్నియుఁ గామసంకల్పశూన్యములై యుండునో
జ్ఞానాగ్నిదగ్ధకర్ముఁడగునట్టివానినే పండితుఁడని పెద్దలు తెలుపుచున్నారు.
కర్మఫలములను గోరక నిత్యతృప్తుఁడును, నిరాశ్రయుఁడునునై కర్మము
లొనర్చినను వాఁడు కర్మములను జేయనివాఁడే యగుచున్నాఁడు.
కోర్కి విడిచి చిత్తము నాత్మను నియమించి సర్వపరిగ్రహములను బరిత్య
జించి శరీరము నిలుపుకొనుట కుపయోగించు కర్మములనుమాత్రము
చేయుచున్నవానికి సంసారతాపము గలుగదు. మఱియుఁ బ్రయత్నమే
లేక లభించినవానితోఁ దృప్తినొందుచు సుఖదుఃఖాదిద్వంద్వములకు
లొంగక యసూయవిడిచి లాభాలాభములందు సమబుద్ధిగలిగి కర్మము
లాచరించినను వాఁ డాకర్మములచే బద్ధుఁడు గానేరఁడు. సర్వసంగపరి
త్యాగ మొనర్చి ధర్మాధర్మబంధములను దగులుకొనక జ్ఞానమున నిలుపఁ
బడినచిత్తముతో యజ్ఞమునకుఁ గాఁ జేయఁబడుకర్మము సమగ్రముగా
నశించుచున్నది. "హోమముచేయుస్రుక్కులు బ్రహ్మము. హవిస్సు
బ్రహ్మము. అయ్యది బ్రహ్మాగ్నియందు బ్రహ్మముచే హోమ మొనర్పఁ
బడుచుండు" ననెడిబుద్ధితో బ్రహ్మకర్మసమాధిగల మానవునిచే నొందఁ
దగినదియు బ్రహ్మమే. కొందఱు కర్మయోగులు దేవయజ్ఞము నొనరిం
తురు. కొందఱు బ్రహ్మవేత్తలు బ్రహ్మాగ్నియం దాత్మచేనాత్మను హోమ
మొనర్తురు. మఱికొందఱు శబ్దాదు లగువిషయముల నింద్రియాగ్నుల
యందు హోమముచేయుదురు. మఱికొంద ఱింద్రియకర్మములను,
నాకుంచనప్రసారణాదిప్రాణకర్మములను జ్ఞానముచేఁ బ్రజ్వలింపఁజేయఁ

బడిన యాత్మసంయమయోగమనెడి యగ్నియందు హోమముచేయు దురు. అటులే మఱికొందఱు సంశితవ్రతులగుయతులు ద్రవ్యదానమనెడి యజ్ఞమును తపోయజ్ఞములను, యోగయజ్ఞములను, స్వాధ్యాయ యజ్ఞములను, జ్ఞానయజ్ఞములను జేయువా రగుచున్నారు. ప్రాణాపాన గతులనరికట్టి, ప్రాణాయామపరులై యపానమునఁ బ్రాణమును, బ్రాణ మున నపానమును, మఱికొందఱు హోమముచేయుదురు. వేఱొక కొందఱు నియతాహారులై ప్రాణములందే ప్రాణములను హోమము చేయుదురు. వీరందఱును యజ్ఞవేత్తలై తమతమ యొనర్చుయజ్ఞము లచేఁ గల్మషములను దొలఁగించుకొనుచున్నారు. అటులు యజ్ఞము లొనర్చి తచ్ఛేషమనెడి యమృతమును భుజించువారు సనాతన మగు బ్రహ్మము నొందుచున్నారు. ఓకౌరవోత్తమా! ఈయజ్ఞములు చేయని వాని కీలోకమే గలుగదనఁగా, నితరలోక మెక్కడిది? ఇట్లు బహువిధము లగుయజ్ఞములు బ్రహ్మముఖమున వ్యాపించియున్నవి. వానినన్నిటిని గర్మసంభవములనుగాఁ దెలిసికొనుము. ఇట్లు తెలిసికొందువేని సంసార బంధమునుండి విముక్తుండవగుచున్నాఁడవు. ఓయర్జునా! ద్రవ్యాత్మక మగుయజ్ఞముకంటె జ్ఞానయజ్ఞ ముత్తమమైనది. సర్వకర్మములును నశిం పక ముక్తిసాధన మగుజ్ఞానమున నంతర్భవించుచున్నవి. అట్టి బ్రహ్మజ్ఞాన మును నమస్కారమొనర్చియుఁ, బ్రశ్నమొనర్చియు, సేవించియుఁ దెలిసి కొనుము. దానిని దత్త్వవేత్తలగుజ్ఞానులు నీకుపదేశింతురు. ఓయర్జునా! నీవు దేనిని దెలిసికొనిన నిపు డీవొందినమోహమును మఱల నొంద కుందువో, మఱియు నేజ్ఞానముచేఁ బ్రాణులనెల్ల నాత్మయందును, వాసు దేవుఁడ నగునాయందును నున్నటులు తెలిసికొందువో యట్టిజ్ఞానము నొందెదవు. అదియుఁగాక పలువిధము లగుపాపము లాచరించినవారి కంటెఁ బాపుఁడవైనను, జ్ఞానమనెడి యోడచే నాపాపసాగరమును దాఁటఁ గల్గుదువు. ఓయర్జునా! మండుచున్నయగ్ని, కట్టెల నెట్లు బూడిదగాఁ జేయునో యటులే జ్ఞానాగ్ని కర్మములనెల్ల భస్మముచేయుచున్నది. జ్ఞానముతోఁ దుల్యమగు పవిత్రమైన దెందును లేదుగదా! అట్టిజ్ఞాన మును గర్మయోగముచే సంస్కరింపఁబడినవాఁడు కొంతకాలము నకుఁ దనంతఁదానే పొందుచున్నాఁడు. ఎవ్వఁడు శ్రద్ధగలిగి గురూపా సనాపరుఁడై జితేంద్రియుఁడగునో వానికి జ్ఞానము లభించుచున్నది.

అటులు జ్ఞానమునొంది, యచిరకాలముననే యుత్తమశాంతి నొందు చున్నాఁడు. ఆత్మజ్ఞానహీనుఁడును, గురుశాస్త్రవిశ్వాసశూన్యుఁడును, సంశయాత్ముఁడు నగువారు నశించుచున్నారు. అదియుఁగాక యామువ్వురిలో సంశయాత్మున కీలోకమును లేదు. పరలోకమును లేదు. సుఖమును లేదు. ఓయర్జునా! పరమవస్తుదర్శనరూపయోగముచేఁ గర్మమును విడిచి జ్ఞానముచే సంశయములను దొలఁగించికొనిన యాత్మజ్ఞానిని గర్మములు బంధింపలేవు. కావున నజ్ఞానమున జనించినట్టియు, బుద్ధిగతమైనట్టియు, నాత్మసంబంధమైనట్టియు సంశయమును జ్ఞానమనెడి కత్తిచే నఱికి యోగము నవలంబించి యుద్ధమొనర్ప నీక లెమ్ము. అని తెలుప విని యర్జునుఁడు మఱియు నిట్లనియె.

## కర్మసన్న్యాసయోగము

ఓదేవా! తొలుతఁ గర్మసన్న్యాసమును దెలిపి మఱల యోగ మెఱిఁగించుచున్నాఁడవు. ఈరెండిటిలో నేది శ్రేయమొసంగునదియో నిశ్చయించి యాయొక్కటిని దెలుపుమన విని వాసుదేవుఁ డిట్లనియె.

ఓపార్థా! సన్న్యాసము కర్మయోగము ననెడి రెండును ముక్తిని గల్గించునవియే. కాని యారెంటిలోఁ గర్మసన్న్యాసముకంటెఁ గర్మయోగమే యుత్తమమైనది. ఎవ్వఁడు రాగద్వేషములను విడుచునో వాఁడే నిత్యసన్న్యాసీ యనఁబడును. ఓయర్జునా! సుఖదుఃఖాదిద్వంద్వముల నతిక్రమించినవాఁడు సుఖముగా బంధములనుండి విడివడుచున్నాఁడు. సాంఖ్యము యోగము ననునవి వేఱని యల్పజ్ఞానులు దెలుపుదురుగాని పండితు లగువారు తెలుపరు. వానిలో నొకదానినేని లెస్సగాఁ బూనినచో నారెండిటిఫలమును బొందుచున్నాఁడు. సాంఖ్యులేస్థానము నొందుచున్నారో దానినే యోగులును బొందుచున్నారు. ఈయోగసాంఖ్యములకు ఫల మొకటియగుట నెవ్వఁడు వీనిని రెండిటి నొకటిగా భావించునో వాఁడే సరిగాఁ జూచువాఁ డగుచున్నాఁడు. ఓయర్జునా! కర్మయోగము లేకసన్న్యాస మొందుట యెంతయుఁగష్టముగా నుండును. యోగముగలమునియే యల్పకాలమున బ్రహ్మమునొందఁగల్గుచున్నాఁడు. పరిశుద్ధాత్ముఁడై మనసుజయించి యింద్రియములను గెలిచి సకలభూతములకు నాత్మభూతుఁడైన కర్మయోగి కర్మము లాచరించు

నున్నను వాని నవి యంటఁజాలవు. తత్త్వవేత్తయగుకర్మయోగి తానిం చుకయుఁ జేయుచున్నాఁడనని తలంపఁగూడదు.అట్టివాఁడు తాను జూచు చుండియు, వినుచుండియు, స్పృశించుచుండియు, వాసనచూచు చుం డియుఁ, దినుచుండియు, నడుచుచుండియు, నిద్రించుచుండియు, నూపిరి తీయుచుండియు, సంభాషించుచుండియు,విడుచుచు,గ్రహించుచు, ఱెప్ప వేయుచుండియును, నింద్రియము లింద్రియార్థములందుఁ బ్రవర్తించు చుండునని తెలియుచుఁ గర్మములను బ్రహ్మమునందిడి ఫలకాంక్షవిడిచి కర్మము లాచరించుచుండును. అట్టివానిని దామరా కుదకమువలెఁ బాపము లంటఁజాలవు. దేహము, మనసు, బుద్ధి, యింద్రియములు ననెడి వీనియన్నిటిచేతను మమకారశూన్యముగా ఫలకాంక్షవిడిచి యోగులు తమయాత్మశుద్ధికై కర్మము లాచరించుచుందురు. యోగి కర్మఫలము లనువిడిచి, జ్ఞాననిష్ఠచేఁ గల్గుముక్తిరూప మగుశాంతి నొందుచున్నాఁడు. యోగవిధ మెఱుఁగనివాఁడు కామప్రేరితుఁడగుటచేఁ గర్మఫలము లపే క్షించిబద్ధుఁడగుచున్నాఁడు. జితేంద్రియుండన్నవో సర్వకర్మములను మన సుచేసన్న్యసించి తానుజేయక యొరులచేఁ జేయింపక నవద్వారపుర మగు దేహమున సుఖముగా నివసించుచున్నాఁడు. కర్మములను గాని, కర్తృ త్వమునుగాని కర్మములచేఁ గల్గుఫలముతోఁ గూడికొనుటనుగాని యాత్మ సృజింపలేదు. ఓయర్జునా! అంతయు స్వభావముచేతనే జరుగు చుండును. ఆయాత్మ యొకనిపాపమునుగాని, పుణ్యమునుగాని పరిగ్ర హింపఁడు. ప్రాణు లజ్ఞానముచే జ్ఞాన మావరింపఁబడుటను "నేను జేయు చున్నాఁడను జేయించుచున్నాఁడ" నని మోహమందుచున్నారు. ఎవ్వరి యజ్ఞాన మాత్మజ్ఞానముచే నశింపఁజేయఁబడునో వారిజ్ఞానము సూర్యుఁ డువలె నాపరవస్తువును బ్రకాశింపఁజేయును. ఆబ్రహ్మమునందే బుద్ధి నిలిపి తాదాత్మ్యమును భావించి దానియం దభినివేశముతోఁ దదాసక్తి గలిగి జ్ఞానముచే సకలపాపములను దొలఁగించుకొనువారు పునరావృత్తి రహితమగు బ్రహ్మము నొందుచున్నారు. మఱియు నెవరు విద్యావినయ ములు గలబ్రాహ్మణునియందును, గోవునందును, నేన్గునందును, గుక్క యందును, గుక్కలనుదిను చండాలునందును సమబుద్ధిగలిగి ప్రవర్తిం తురో వారే పండితులు. ఎవ్వరిమనసు సర్వభూతములందును బ్రహ్మ సామ్యమును నిశ్చయించునో యట్టివారు జీవించుచుండియు, జన్మమును

జయించినవారగుదురు. బ్రహ్మము సమమైనదియు, నిర్దుష్టమైనదియు నగుటచే వారు దానియందే యుందురు. సందేహరహిత మగుబుద్ధితో మోహమునొందక బ్రహ్మవేత్తయై బ్రహ్మమందున్న జ్ఞాని ప్రియమునొంది సంతసించుటయు, నప్రియమొంది పరితపించుటయుఁ దగదు. బాహ్య విషయములందు సక్తివిడిచి యాత్మయందు సుఖమొందుటయనునదియే బ్రహ్మయోగముతోఁ గూడినమనసుగలవాని కక్షయసుఖానుభవమున కగుచున్నది. ఎయ్యవి విషయములవలనఁ గల్గుచున్నవో యట్టిభోగ ములు దుఃఖమునకే యగుచున్నవి. ఓయర్జునా! అయ్యవి యనిత్యము లగుట నట్టిభోగములయెడఁ బండితుఁడు ప్రీతి వహింపఁడు. ఎవ్వఁ డిహమునఁ దనశరీరమును విడువకమున్నె కామక్రోధముల వేగ మును నోరువఁగల్గియుండునో వాఁడే యోగియు సుఖముగలవాఁడు నగుచున్నాఁడు. మఱియు నెవ్వఁడంతస్సుఖముగలిగి యాత్మతోడనే క్రీడించుచు, నంతర్జ్యోతియై వెలుఁగునో యాయోగి బ్రహ్మభూతుఁడై బ్రహ్మానంద సుఖమందుచున్నాఁడు. సంశయమును విడిచి నియతాత్ములై సర్వభూతహితమును గోరుచుఁ గల్మషహీనులైనమహర్షులు బ్రహ్మానంద సుఖమొందుచున్నారు. మఱియుఁ గామక్రోధములను బరిత్యజించి మనో నిగ్రహమొనర్చిన యాత్మజ్ఞానము గలయతులకు బ్రహ్మానంద మొదవు చున్నది. బాహ్యము లగువిషయములను బహిష్కరించి దృష్టిని బొమల నడుమ నిలిపి ప్రాణమును, నపానమును నాసికాంతరచారులుగను దుల్యముగను నొనర్చి యింద్రియములను బుద్ధిని మనస్సును నియ మించి యెవ్వఁడు ముక్తిపరుఁడై యిచ్ఛాభయక్రోధములను బరిత్యజించి యాత్మదర్శనమొనర్చునో వాఁడెల్లపుడును ముక్తుఁడనఁబడుచున్నాఁడు. సర్వలోకేశ్వరుఁడను యజ్ఞతపోభోక్తను సర్వభూతమైత్రిగలవాఁడను నగునన్నెఱింగినవాఁడే సంసారమునుండి మఱలినవాఁ డగుచున్నాఁడు. అని తెలిపి వాసుదేవుఁడు మఱియు నిట్లనియె.

### యోగాభ్యాసయోగము

ఓయర్జునా! కర్మఫలాకాంక్ష విడిచి, యెవ్వఁడు కర్మమును గర్త వ్యముగా నెంచునో వాఁడే సన్యాసియు, యోగియు నగుచున్నాఁడు. అట్టివాఁ డగ్నులులేనివాఁడును, గర్మములులేనివాఁడును గానేరఁడు.

దేనిని సన్న్యాసమందురో యదియే యోగమని తెలుపుదురు. ఎవ్వఁడును సంకల్పమును విడువక యోగి గాఁజాలఁడు. యోగము నొందఁదలంచినమునికిఁ గర్మమే కారణమని తెలుపఁబడుచున్నది. యోగమూనిన యామునికి శమమే సాధనమని తెలుపఁబడును. సర్వసంకల్పములను బరిత్యజించి యెప్పు డింద్రియార్థములందును, నిత్యనైమిత్తికాది కర్మములందును సక్తుఁడు గాకుండునో యపుడే యతఁడు యోగారూఢుఁడని పిలుపఁబడుచున్నాఁడు. ఆత్మచేతనే యాత్మను సంసారసాగరమునుండి యుద్ధరించుకొనవలయునుగాని దానిని గ్రిందికిఁ ద్రోయరాదు. ఆత్మ కాత్మయే బంధువు, నాత్మయే శత్రువునగుచున్నది. ఏ యీ యాత్మచే నాత్మ జయింపఁబడునో యాయాత్మయే యాత్మకు బంధువు. అజితాత్ముఁడగువానికి, శత్రుత్వమొనర్చుటలో నాత్మయే శత్రువగునని తెలియవలయును. ఆత్మచే సుఖదుఃఖములను, మానావమానములను, శీతోష్ణములను గెలిచి ప్రశాంతుఁడైనచో సాక్షాత్తుగా నాత్మభావమొందుచున్నాఁడు. జ్ఞానవిజ్ఞానములచే సంతుష్టాత్ముఁడై యింద్రియములను జయించి కూటస్థుఁడై బెడ్డయు, బంగారము, ఱాయి యొకటిగా నెంచుచున్నయోగి యోగమునకుఁ దగినవాఁడని తెలుపఁబడుచున్నాఁడు. ఎవ్వఁడు మిత్రులందును, శత్రులందును, నుదాసీనులందును, మధ్యస్థులయందును, నుపకారులందును, బంధువులందును, నపకారులయందును, సజ్జనులందును, దుర్జనులందును సమబుద్ధిగల్గియుండునో వాఁడే యుత్తముఁ డనఁబడుచున్నాఁడు. యోగి యెల్లపుడును నిర్జనస్థలమున నేకాకియై దేహాంతఃకరణములను నియమించి కోర్కెలు విడిచి, పరిగ్రహమొనర్పక యాత్మను సమాధిగతము గావింపవలయును. మఱియు మిక్కిలి యెత్తును; మిక్కిలి పల్లమునుగాక సమమై స్థిరమగు నాసనముగా నొకశుచి ప్రదేశమున దర్భలును, వానిపై నజినము, దానిపై వస్త్రమును బఱచి యందుఁ గూర్చుండి మనస్సు నేకాగ్రముగా నొనర్చి చిత్తేంద్రియవ్యాపారముల నరికట్టి యాత్మశుద్ధికై యోగమును బూనికొనవలయును. మెడయుఁ దలయు శరీరమును సమముగా నుంచి, చలనములేక స్థిరుఁడై తననాసికచివరను జూచుచు, దిక్కులను బరికింపక శాంతాత్ముఁడై నిర్భయముగా బ్రహ్మచర్యవ్రతముతో మనసు వశమొనర్చి నాయందే ధ్యానమిడి నన్నే పరునిఁగాఁ దలంచుచు యోగి

సమాధి నొనర్పవలయును. నియతచిత్తుఁడై యిటు లెల్లపుడును, మనసు నిలిపిన యోగి ముక్తియే పరమావధిగల మదధీన మగుశాంతి నొందు చున్నాఁడు. మిక్కిలిగా భుజించువానికిని, గొంచెమేనిఁ దిననివానికిని నటులే యతినిద్రగలవానికిని, నెల్లపుడును మేల్కనినవానికిని యోగ మును ధరింప నలవిగాదు. ఓయర్జునా! యుక్తము లగునాహారమును విహారమునుగలిగి కర్మములందు యుక్తముగాఁ బ్రవర్తించుచు యుక్తము లగునిద్రావబోధములు గల్గువానికి దుఃఖములను దొలఁగించు యోగము సిద్ధించుచున్నది. ఎపు డాత్మయందుఁ జిత్తము నియతమై విడువ కుండునో యపుడే కోర్కులనెల్ల విడిచి యోగి యనఁబడుచున్నాడు. నియతచిత్తుఁడై యోగము నవలంబించిన యోగియాత్మ, గాలిలేనిచోటఁ గదలకున్న దీపమువలె నుండునని పండితులు తెలుపుదురు. యోగ విధిచే నాపఁబడి చిత్త మెందుపరతి నొందునో యెం దాత్మపై దృష్టినిడి యాత్మచే నాత్మయందు సంతసింపనగునో, మఱియు నెద్ది యింద్రియా తీతమై బుద్ధిగ్రాహ్యమగుచు నత్యంతసుఖానుభవహేతువై వెలయునో యెందుఁ దత్త్వమునుండి చలింపక యుండనగునో దేనినొంది దానికన్న వేఱగులాభము లేదని మానవుఁడు తలంపనగునో, దేనియందు స్థిరముగా నుండి యధికదుఃఖముచేనైనను గదల్పరాకుండనగునో దుఃఖసంయోగ నాశక మగుదానినే యోగమని తెలియవలయును. నిర్వేదమొందని చిత్తముతో బుద్ధినిశ్చలతనొనర్పఁగా యోగము సిద్ధించును. సంకల్పము వలనఁ గల్గినకోర్కులనుబరిత్యజించి యింద్రియములనెల్ల సంపూర్ణముగా మనసుచే నియమించి ధైర్యముచే గ్రహింపఁబడినబుద్ధిచేఁ గ్రమక్రమ ముగా నుపరతిఁ బొందవలయును. మనస్సు నాత్మాధీనముగా నొనర్చి నుఱిదేనిని దలంపరాదు. చంచలమై స్థిరత్వము లేనిమనస్సే యేవిషయము లపై వ్యాపించునో వానినుండి వానిని మఱలించి యాత్మకు వశమొ నర్చికొనవలయును. ప్రశాంతచిత్తుఁడును, రజస్తమోఽతీతుఁడును, బ్రహ్మ భూతుఁడునునైన నిష్కల్మషుఁ డగునీయోగి కుత్తమసుఖము గల్గు చున్నది. ఇటులెల్లపుడును యోగియగువాఁ డాత్మను సమాధిగత ముగా నొనర్చుచు నిష్కల్మషుఁడై సులభముగా బ్రహ్మసంస్పర్శము గల యత్యధికసుఖ మొందుచున్నాఁడు. ఆయోగి యోగమునఁ దన యాత్మనుగూర్చి యన్నిటియందును దుల్యబుద్ధియై తనయాత్మ సకల

భూతములందుండుటను దనయాత్మయం దెల్లభూతము లుండుటయును గాంచుచున్నాఁడు. ఎవ్వఁడు నన్నంతట నుండువానిఁగను నన్నియు నాయందును జూచునో వానికి నేను బరోక్షత్వ మొందను. వాఁడు నాకుఁ బరోక్షుఁడు గానేఁడు. ఎవ్వఁడు సర్వభూతాంతర్యామినగు నాయందైక్యమై నన్ను భజించునో యట్టివాఁ డెల్లవిధముల వర్తించు చున్నను నాదగువిష్ణుపదమునందే వర్తించుచున్నవాఁడు. ఓయర్జునా! మఱియు నెవ్వఁడు సర్వప్రాణులసుఖదుఃఖములను దనసుఖదుఃఖము లనుగాఁ దలంచునో వాఁడే పరమయోగిగాఁ దలంపఁబడుచున్నాఁడు. అని తెలుప విని యర్జునుఁడు మఱియు నిటులు ప్రశ్నించెను.

ఓదేవా! సర్వసమదర్శనలక్షణముగల యీయోగమువిధ మెఱిఁగించితివి. కాని చంచలచిత్తుఁడ నగుటచే దీనిస్థిరస్థితి యెట్లు గల్గునో? తెలియఁజాలకున్నాఁడను. ఓకృష్ణా! మనసు చంచలమై శరీరేంద్రియములఁ గలఁతనొందించుచు గెలువ శక్యముగాక మిక్కిలి దృఢమైనది. దానినిరోధము వాయునిరోధమువలె దుష్కరమైయుండునని తలంచెదను. అదివిని భగవానుఁడు "ఓపార్థా! నీవన్నటులు మనసు చంచలమై నిగ్రహింపరానిదనుట నిస్సందేహము. కాని యది వైరాగ్యముచేతను, నిత్యాభ్యాసముచేతను నిగ్రహింపఁబడును. మనసు నియమింపఁబడనిచో యోగము నిలువదనినాయభిప్రాయము. మనసు వశముచేసికొని ప్రయత్నించినవాఁడే యీయోగము నుపాయముచే నొంద నర్హుఁడగుచున్నాఁడు అని తెలిపెను.

అంత మఱియు నర్జునుఁడు ఓవాసుదేవా! యోగి యోగమార్గమున శ్రద్ధగల్గియుఁ బ్రయత్నములేకుండుటను యోగమునుండి వానిమనసు చలించెనేని యోగసిద్ధి వానికిఁ గలుగనేరదుగదా! అపుడు వాడెట్టిగతి నొందును? మిక్కిలి మూఢుఁడై బ్రహ్మపథమునుండి జాఱి యాధారశూన్యుఁడై కర్మయోగమార్గములు రెండిటికిని జెడి చెదరిన మేఘమువలె నశింపఁడుగదా? ఓకృష్ణా! ఈనాసందియ మెల్లఁ దొలఁగింపుము. ఈసంశయమును దొలఁగింప నీవుతప్ప మఱియొకఁ డర్హుఁడు లేఁడు అని పలికెను.

అదివిని యావాసుదేవుఁ డోయర్జునా! అట్టియోగి కిహమందును, బరమందును నాశము లేదు. ఓతండ్రీ పుణ్యము లాచరించువాఁ డెవ్వఁ

డును దుర్గతినొందఁడు. అట్టి యోగభ్రష్టుఁడు పుణ్యాత్ములలోక మొంది చిరకాల మందు సుఖములనుభవించి పిదపఁ బవిత్రులును, శ్రీమంతులు నగువారియింటఁ బుట్టుచున్నాఁడు. లేదా! ధీమంతులగు యోగుల సద్వంశముననైన జనించును. ఇట్టిజన్మము లోకమం దెవ్వరికిని దుర్లభమై యుండునుగదా! మఱియు వాఁడు తనకుఁ బూర్వదేహమునఁ గలబుద్ధి నాశ్రయించి మఱల యోగసిద్ధికై ప్రయత్నించును. ఓ యర్జునా! ఆతఁడు పరవశుఁడై యున్నను బూర్వజన్మమందలి యభ్యాసముచేతనే బలాత్కారముగా లాగఁబడుచుండును. అంత యోగ జిజ్ఞాస యాతనికిఁ గల్గినంతమాత్రముననే శబ్దబ్రహ్మము నతఁడు దాఁటుచున్నాఁడు. అందుఁ బ్రయత్నమే యొనర్చినచో నతఁడు కిల్బిషముల నెల్లఁ దొలగించుకొని యనేకజన్మసంసిద్ధుఁడై పిదప నుత్తమగతి నొందుచున్నాఁడు. యోగి తపస్విలకంటెను, జ్ఞానులకంటెను, గర్మపరుల కంటెను నధికుఁడైనవాఁడు. కావున నీవు యోగివి గమ్ము. ఆ యోగులలోనెల్లను మద్గత మగునంతరాత్మతో నెవ్వఁడు నన్ను భజించునో వాఁడే యెంతయు యుక్తతముఁడని నాయభిప్రాయము. అని పలికి మఱియు నిట్లనియె.

### విజ్ఞానయోగము

ఓయర్జునా! నాయెడఁ జిత్తము నిలిపి సమాధినిష్ఠుఁడై నన్నే యాశ్రయించి సమగ్రముగా నన్నెటులు తెలియనగునో సంశయము దొలఁగునట్లుగా దాని నీకుం దెలిపెదను వినుము. నీకు స్వానుభవ యుక్తమగు నీజ్ఞానవిధమెల్లఁ దెలిపెదను. దీనిని దెలియుదువేని యింక నీవెఱుంగఁదగినవిషయము వేఱొకటి నీకు మిగిలియుండదు. వేలకొలఁది మానవులం దొకఁడు యోగసిద్ధికై యత్నించును. అట్టిసిద్ధికై యత్నించినవారిలో నొకఁడుమాత్రమే నన్ను యథార్థముగాఁ దెలిసికొనుచున్నాఁడు. పృథివ్యప్తేజోవాయ్వాకాశములును, మనోబుద్ధులును నహంకారమునని నాప్రకృతి యెనిమిదవిధములుగా విభాగింపఁబడినది. ఓయర్జునా! జగములకన్నిటికి నాధారమై జీవరూపమగు వేఱొక ప్రకృతిగలదని తెలియుము. ఓయీ! భూతములన్నియు నీరెండిటివలనఁ గల్గుచున్నవని గ్రహింపుము. నేనే సకలజగము నుత్పత్తికిని నాశము

నకును గారణమైనవాఁడను. ఓధనంజయా! నాకంటె నుత్తమమగునది వేఱొక టేదియును లేదు. ఈప్రపంచమెల్ల దారమున మణులువలె నాయందుఁ గూర్పఁబడియున్నది. ఓయర్జునా! ఉదకములయందలిరసము, సూర్యచంద్రులయందలికాంతియు నేనే యగుచున్నాఁడను. వేదములందలి ప్రణవము నేనే. ఆకసమునందలి శబ్దమును, బురుషులందలి పురుషభావమును, బుడమియందలి పవిత్రగంధమును, నగ్నియందలి తేజము, సకలభూతములజీవనమును, దపోవంతులతపమును నేనై యున్నవాఁడను. సర్వభూతములకును నన్ను సనాతనబీజముగాఁ దెలియుము. బుద్ధిమంతులబుద్ధియుఁ, దేజోనిధులతేజము, బలవంతులకామరాగవర్జితమైయున్నబలమును నేనైయుందును. భూతములందున్న ధర్మావిరుద్ధ మగుకామమును నేనే. ఓయర్జునా! సాత్త్వికతామసరాజసభావము లెయ్యవి గలవో యవియన్నియును నానుండియేగల్గుచున్నవి. కాని వానియందే నడంగియుండను. అవి నాయం దడంగియుండును. గుణమయములై మూఁడగు నీసత్త్వరజస్తమోభావములచేతనే యీ జగమెల్ల మోహావృతమై వీనికన్న విభిన్నుఁడనై యవ్యయుఁడనగు నన్నుఁ దెలియకున్నది. నాకు స్వభావభూతమై గుణమయమగు నా యీమాయ తప్పించుకొనరానిదై యున్నది. నన్నెవ్వ రాశ్రయింతురో వా రీమాయను దప్పించుకొనఁ గల్గుచున్నారు. మూఢులై మాయాపహృతజ్ఞానులై యాతురభావ మొంది పాపమొనర్చినమానవాధములు నన్నొందఁజాలరు. ఓయర్జునా! ఆర్తుఁడు, జిజ్ఞాసువు, కార్యార్థి, జ్ఞాని అనుసుకృతు లగునీనాల్గువిధములవారును నన్ను సేవించుచుందురు. వారిలో నేకభక్తిగలిగి నిత్యమును యోగనిష్ఠను బూనినవాఁ డగు జ్ఞానియొక్కఁడే యుత్తముఁడు. అట్టివాని కేనెంతయును బ్రియుఁడను. అతఁడు నా కెంతయును బ్రియుఁడు. వారందఱును నుదారులేగాని జ్ఞాని నాయాత్మయనియే నాయభిప్రాయము. యోగయుక్తాత్ముఁ డగు నాతఁడు నన్నే యుత్తమగతిగా నెంచువాఁడు గదా! పెక్కుజన్మములందినపిదప జ్ఞాని సర్వమును వాసుదేవుఁడగునన్నుగాఁ దలంచి నన్నే పొందుచున్నాఁడు. అట్టిమహనీయుఁడు లోకమునం దుండుట యరుదు. తమప్రకృతికి బద్ధులై యాయాకోర్కులఁ బూని యన్యదేవతల నారాధింతురు. ఎవ్వఁడెవ్వఁ డేయేదేవతాతనువును శ్రద్ధమైఁ బూజింపఁ

నెంచునో వానికి వాని కట్టియట్టిస్థిర మగు శ్రద్ధను గల్గించుచున్నాఁడను. వాఁడా శ్రద్ధతోఁగూడి యాయాదేవత నారాధింప నెంచుచున్నాఁడు. పిదప నేనేయొసంగినహితములగుకోర్కెల నొందుచున్నాఁడు. అల్పబుద్ధు లగునట్టివారి కస్థిరమగు ఫలమే చేకూరుచుండును. దేవతలను బూజించు వారు దేవతలనే పొందుదురు. నన్నుఁ బూజించువారు నన్నే పొందుదురు. బుద్ధిహీనులగువారు నాశములేనిదియు సర్వోత్తమమైనదియు నగునాపరమతత్త్వమును దెలియఁజాలక, యవ్యక్తుఁడే వ్యక్తుఁడై యొప్పుచుండెనని నన్నెన్నుచుందురు. యోగమాయ నాశ్రయించి నే నెల్లవారికిని నాప్రకాశము నెఱిఁగింపను. మూఢమగుమానవలోకము అజుఁడను నవ్యయుఁడను నగునన్నుఁ దెలియఁజాలదు. ఓయర్జునా! నేను భూతభవిష్యద్వర్తమానము లగుభూతములనెల్లఁ దెలియఁగల్గుదును. కాని యవి నన్నుఁ దెలియఁజాలవు. ఓపార్థా! సకలభూతములును నిచ్ఛాద్వేషములచేఁ గల్గుసుఖదుఃఖములచే మూఢత్వమొంది మఱల సృష్టికై పోవుచుందురు. ఎవ్వరు పుణ్యకర్మము లొనర్చుటను దమ పాపము లంతమొందఁగా సుఖదుఃఖాదిద్వంద్వమోహములనుండి విముక్తులై యుందురో వారు దృఢవ్రతులై నన్ను సేవింతురు. మఱియు నెవ్వరు నన్నాశ్రయించి జరామరణవిముక్తికై ప్రయత్నింతురో వారా బ్రహ్మమును, నఖిలకర్మములను దమయాత్మలోఁ దెలియుచున్నారు. నన్నధిభూతయుక్తునిఁగను, నధిదైవయుక్తునిఁగను, నధియజ్ఞయుక్తునిఁగను నెవ్వరు తెలియుదురో వారు యోగయుక్తాత్ములై మరణకాలమందును నన్ను భావించుచుందురు. అని తెలుప విని యర్జునుం డిట్లనియె.

## అక్షరపరబ్రహ్మయోగము

ఓవాసుదేవా! బ్రహ్మమనఁగా నేమి? అధ్యాత్మమన నెయ్యది? కర్మమన నెట్టిది? అధిభూత మెట్టిదిగాఁ దెలుపఁబడెను? అధిదైవమన నేమి? ఈదేహమున నధియజ్ఞుఁడనఁగా నెవ్వఁడు? నియతచిత్తులగువారిచే మరణకాలమున నీవు తెలియఁబడు టెట్టులు?

అది విని యాభగవానుఁడు ఓపార్థా! బ్రహ్మమనఁగాఁ బరమ మగునక్షరము. అధ్యాత్మమనఁగా స్వభావము. కర్మమనఁగా భూతవస్తూ

తృప్తికరమై దేవతోద్దేశముగాఁ జేసిన పురోడాశపరిత్యాగము. అధిభూతమనఁగా క్షరభావము. అధిదైవతమనఁగాఁ బురుషుఁడు. దేహధారులదేహమున నధియజ్ఞుఁడనఁగా నేనే యగుదును. మరణకాలమున నన్ను స్మరించుచుఁ గళేబరమును విడిచి యెవఁడు పోవుచుండునో వాఁడే మద్భావము నాశ్రయించుచున్నాఁడు. ఇందు సందియము లేదు. ఓ యర్జునా? ఎవఁడు దేవతావిశేషమును స్మరించుచు శరీరము విడుచునో వాఁ డాయాభావమునే పొందుచున్నాఁడు. కావున నెల్లకాలములందును నన్ను స్మరింపుము. యుద్ధసన్నద్ధుఁడవుగమ్ము. నాయందు మనోబుద్ధుల నర్పింతువేని నిస్సందేహముగా నన్నే పొందఁగల్గుదువు. ఓపార్థా! విషయాంతరములకుఁబోక యభ్యాసముతోఁగూడిన చిత్తముచే దివ్యుఁడగు పరమపురుషుని భావించువాఁ డాపరమపురుషు నొందుచున్నాఁడు. సర్వజ్ఞుఁడును, బురాణపురుషుఁడును, సర్వజగములను శాసించువాఁడును, నణువుకంటె నణువును, సకలమును జేయువాఁడును, నూహింపరానిరూపముగలవాఁడును, దమోఽతీతుఁడై నిత్యప్రకాశవర్ణముగలవాఁడును నగువానిని బ్రయాణకాలమున భక్తిగలిగి నిశ్చలచిత్తముతో యోగబలమున నెవ్వఁడుతలంచుచు బొమలనడుమ సరిగాఁ బ్రాణమునుంచునోఁ వాఁడాదివ్యపురుషు నొందుచున్నాఁడు. వేదవేత్తలు దేని నక్షరముని దెలుపుదురో రాగశూన్యులగుయతులు దేనిని బ్రవేశించుచుందురో బ్రహ్మచర్యమున దేనిని గోరుదురో యట్టిదానిని నీకు సంగ్రహముగాఁ దెలిపెదను వినుము. ఓయర్జునా! సర్వద్వారములను నియమించి హృదయమున మానసమును నిరోధించి తనప్రాణమును దలయందుంచి, యోగధారణమునుజేసి "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" అని యుచ్చరించుచు నన్నే స్మరించుచు నెవ్వఁడు దేహమునువిడిచి వెడలుచున్నాఁడో వాఁడుత్తమగతి నొందుచున్నాఁడు. మఱియు నెవ్వఁ డన్యములందు మనసు నిలుపక యెల్లపుడు నన్నే స్మరించునో యోగనిష్ఠగల యట్టివానికి నేను సులభుఁడ నగుచున్నాఁడను. నన్నాశ్రయించి పరమసిద్ధి నొందినమహాత్ములు దుఃఖములకుఁ జోటై యశాశ్వత మగుపునర్జన్మమును బొందరు. ఓయర్జునా! బ్రహ్మలోకము మున్నగులోకములెల్ల బునరావృత్తిగల వియేగాని నన్నొందినవారికిఁ బునర్జన్మము గలుగదు. వేయియుగములు బ్రహ్మ కొకపవలును, వేయియుగము లొకరాత్రియు నగునని యహో

రాత్రవేత్తలు తెలుపుదురు. ఆబ్రహ్మకుఁ బవలు గడనఁగనే యవ్యక్తము నుండి వ్యక్తులన్నియుఁ బొడముచుండును. మఱియు రాత్రి రాఁగనే మఱల నాయవ్యక్తమందే యణఁగుచుండును. ఆభూతకోటియే యటులు కల్పాంతరమున మఱియుఁ బుట్టిపుట్టి రాత్రిరాఁగనే వశము తప్పితప్పి యడఁగుచుఁ బవలురాఁగనే మఱియుఁ బ్రభవించుచుండును. పూర్వోక్తమైనదానికంటె భిన్నమై విలక్షణమై యింద్రియగోచరముగానిదై సనాతనమైనభావ మెయ్యది గలదో యది సర్వభూతములు నశించినను దాను నశింపదు. అవ్యక్తమక్షరమని చెప్పఁబడినది దానినే పరమగతిగాఁ దెలుపుదురు. దేనినొందిన మఱలుట సంభవింపదో యాయుత్తమతేజము నాయదియే ఎవ్వనియందు భూతములన్నియు నున్నవో యెవ్వఁ డన్నిటను వ్యాపించియుండెనో యట్టిపరమపురుషు ననన్యమగుభక్తిచే నొందనగును. కర్మయోగు లెపుడు మృతిచెంది యనావృత్తిని, యెపుడు మరణించి యావృత్తిని బొందుదురో యక్కాలమును దెలిపెదను ఓయర్జునా! అగ్నియు, జ్యోతి, పగలు, శుక్లపక్షము ఆఱునెలలుగలయుత్తరాయణము అనువీనియందు శరీరము విడిచినవారు బ్రహ్మము నొందుదురు. పొగయు, రాత్రి, కృష్ణపక్షము ఆఱునెలలు గలదక్షిణాయనము అనువీనియందు శరీరములు విడిచినవారు చంద్రజ్యోతినొంది మఱల నివర్తింతురు. లోకమునకు శుక్లకృష్ణగతులు రెండు శాశ్వతములైనవి. అందొకదాన నేఁగినవాని కనావృత్తియు, వేఱొకదాన నేఁగినవాని కావృత్తియుఁ గల్గును. ఓపార్థా! ఈరెండుత్రోవల నెఱిఁగినయోగి యెవ్వఁడును మోహము నొందఁడు. కావున నీ వెల్ల కాలములందును యోగనిష్ఠగలిగి వర్తింపుము వేదములందును, యజ్ఞములందును, దపములందును, దానములందును నెట్టిపుణ్యఫలము దెలుపఁబడియెనో యట్టిఫలము నిది యతిక్రమించియుండును. దీనినెల్లఁ దెలిపినయోగి సనాతనమగునుత్తమస్థానము నొందుచున్నాఁడు అని తెలిపి భగవానుఁడు మఱియు నిట్లనియె.

### రాజవిద్యారాజగుహ్యయోగము

ఓయర్జునా! అసూయారహితుఁడవగు నీ కీరహస్యము నుపదేశింతును. ఇయ్యది విజ్ఞానయుక్తమైనజ్ఞానము దీనిని దెలిసికొనినచో సంసా

రముసుండి విముక్తినొందఁగలవు. మఱియు నిది విద్యలందు రాజు. రహస్యములందు రాజు. పవిత్రమైనది. ఉత్తమమైనది. సుఖాదులువలెఁ బ్రత్యక్షావబోధమగునది. ధర్మయుక్తమైనది. నాశములేనిది. సుఖముగా నొందఁగల్గినది. ఓయర్జునా! ధర్మయుక్తమగుదీనియెడ నెవ్వరు శ్రద్ధను వహింపరో వారు నాగతి నొందఁజాలక సంసారమార్గమునకు మఱలుచున్నారు. అవ్యక్తమూర్తినగు నాచే నీలోకమెల్ల నిండియున్నది. భూతకోటియెల్ల నాయందుండునుగాని నేను వానియందు లేను భూతములు నాయందులేని నాదగు యఱియొక యీశ్వరయోగమును జూడుము. భూతములను బుట్టించునదగు నాయాత్మ, భూతములను భరించునదయ్యు భూతములందుండదు. గాలి యెల్లప్పుడు నెటు లాకసమందుండి యంతటను వ్యాపించియుండునో యటులే సర్వభూతములును నాయందుండునవని తెలియుము. ఓపార్థా! సకలభూతములును నా ప్రకృతిని బొందుచున్నవి. వానిని గల్పావధిని మఱల విడుచుచుందును. ప్రకృతిని జేపట్టి దానికి వశమై యవశమగుభూతకోటిని మాటికిని బుట్టించుచుందును ఓధనంజయా! ఆకర్మములం దాసక్తిలేక సాక్షినైయున్న న న్నాకర్మములు బంధింపఁజాలవు. నేనటులు సాక్షినై యుండఁగా బ్రకృతియే చరాచర మగుభూతకోటిని సృజించుచున్నది. ఓయీ! ఈహేతువుచేతనే జగము ప్రవర్తిల్లుచున్నది. సకలభూత నియామక మగునామహాభావమును దెలియనేరక మానవశరీరము నాశ్రయించి నన్ను మూఢులుపేక్షింతురు. రాక్షసము, నాసురము, నజ్ఞాన జనకము నగు ప్రకృతికి వశులై జ్ఞానము వ్యర్థముగా వ్యర్థాశులును, నిరర్థకకర్ములును నై మతిచెడి పరితపింతురు. దైవి యగు ప్రకృతి నాశ్రయించినమహానుభావులు, నన్ను భూతముల కాద్యునిఁగను, నవ్యయునిఁగను దెలిసి మదేకనిష్ఠతో నన్నే భజియింతురు. ఎల్లప్పుడు నన్నే పొగడుచు జితేంద్రియులై దృఢవ్రతులై భక్తితో నాకు నమస్కరించుచు నిత్యయోగనిష్ఠులై నన్నే సేవింతురు. మఱికొందఱు జ్ఞానయజ్ఞముచే నన్నుపాసించుచు నేకత్వమునను, బృథక్త్వమునను బహువిధములుగను బూజింతురు. నేనే క్రతువను. నేనే యజ్ఞమను. నేనే స్వధను నేనే యౌషధమను. మంత్రమును నేనే. ఆజ్యము నేనే. అగ్నియు నేనే. హుతమును నేను. ఈలోకమునకుఁ దండ్రిని నేను. తల్లియు, ధాతయుఁ,

బితామహుఁడను నేనే. వేద్యము, పవిత్రము, ఓంకారము, ఋక్సామ యజుస్సులు నేనే. గతిని, భర్తను, బ్రభుఁడను, సాక్షిని, నివాసము, శరణము, మిత్త్రుఁడు నేనే. ప్రభవము, ప్రళయము, స్థానము, నిధానము, అవ్యయబీజము నేనే. తపింపఁజేయువాఁడను నేనే. వర్షించువాఁడను, వర్షము నిలుపువాఁడను నేనే. అమృతము మరణము నేనే. ఓ యర్జునా! సదసత్తులు నేనే. ఋగ్యజుస్సామములు దెలిసినవారు సోమపానమొనర్చి పావనులై యజ్ఞములచే స్వర్గమును గోరి నన్నుఁ బూజింతురు అట్టివారు పవిత్రమగు దేవలోకమునొంది యందు దివ్యము లగు భోగము లనుభవించి యాపుణ్యఫలము క్షీణింపఁగా మఱల మర్త్య లోకమును బ్రవేశించుచున్నారు. ఇటులు కోర్కెల నపేక్షించి వేదోక్తధర్మములయందు దవిలి రాకపోకలు సలుపుచుందురు. ఇతరచింతలేక నన్నే యెవ్వరు సేవింతురో యట్టినిత్యయోగనిష్ఠు లగువారికి నేనే యోగక్షేమములఁ గూర్చువాఁడను. ఎవ్వరితరదేవతలను భక్తిమెయిఁ బూజింతురో వారు శ్రద్ధగలిగి, యవ్విధిపూర్వకముగ నన్నుఁ బూజించినవారే. యజ్ఞములకన్నిటికిని భోక్తను బ్రభుఁడను నేనేగదా! యథార్థముగా నన్నుఁ దెలియకుండుటచే వారు యాగఫల భ్రష్టులగుచున్నారు. దేవతలకై వ్రతములొనర్చినవారు దేవతలను, బితృవ్రతులగువారు పితృదేవతలను, భూతయజ్ఞము లొనర్చువారు భూతములను, నన్నుఁ బూజించువారు నన్నును బొందుచుందురు. పత్రముగాని, పుష్పముగాని, ఫలముగాని, జలముగాని యెవ్వఁడు నాకు భక్తితో సమర్పించునో పరిశుద్ధాత్ముఁడగువాఁడు భక్తితోఁ దెచ్చిన యావస్తువును నే ననుభవింతును. ఓయర్జునా! నీవేమిచేయుదువో ఏమిభుజింతువో ఏది హోమము చేయుదువో ఏది దానముచేయుదువో! ఏమి తప మొనర్తువో యది యెల్ల నాకర్పింపుము. ఇట్లు సన్న్యాసనిష్ఠగలిగినయాత్మతో శుభాశుభఫలముల నొసంగుకర్మబంధములనుండి విడివడుదువేని నన్నుఁ బొందఁగల్గుదువు. ఎల్లభూతములయెడను నేను సముఁడను. నాకొకఁడు శత్త్రుఁడును నొకఁడు మిత్త్రుఁడును గాఁడు. ఎవ్వరు నాయెడ భక్తిగలిగి యుందురో వారియెడ నేను నటులే వర్తించువాఁడను. దురాచారుఁడైనను నితరులను సేవింపక నన్నే యెవ్వఁడు భజించునో వాఁడు సజ్జనుఁడుగనే పరిగణింపఁబడును మఱియు వాఁడు లెస్సయగు దృఢభావముతోఁ గూడిన

వాఁడేయగుచున్నాఁడు. వాఁడు వడిగా ధర్మబుద్ధిగలవాఁడగుచున్నాఁడు. స్థిర మగుశాంతిని నైతముఁ బొందుచున్నాఁడు. ఓయర్జునా! నాకు భక్తుఁ డగువాఁడు నశింపఁడు. ఇది నిశ్చయముగా నమ్ముము. ఓపార్థా! తా మొనర్చిన దురాచారములచేఁ బాపయోనులందుఁ బుట్టినస్త్రీలుగాని, కోమట్లుగాని, శూద్రులుగాని నన్నాశ్రయింతురేని వారును నుత్తమ గతినే పొందఁగల్గుదురు. ఇఁక నాకు భక్తులై పవిత్రులైనబ్రాహ్మణులయు రాజర్షులయు మాట చెప్ప నేటికి? ఈలోక మనిత్యమును సుఖములేని దియు నగుచున్నది. కావున దీనిని బొందియు నన్ను సేవింపుము. నన్నే మనసునందుంచి నాకు భక్తుఁడవై నన్నే పూజించుచు నాకు నమస్క రింపుము. ఇటులు చిత్తమేకాగ్రముగా నొనర్చి నేనేగతియని యుందు వేని నన్నే పొందుదువు. అని చెప్పి మఱియు నిట్లనియె.

విభూతియోగము.

ఓయర్జునా! నాయెడఁ బ్రియముగలిగిన నీకు హితమును గోరి మఱియు నుత్తమవచన మొకటి దెలిపెదను వినుము. నామహత్త్వ మును దేవతలుగాని, మహర్షులుగాని తెలియఁజాలరు. నేను దేవతులకును, మహర్షులకునుగూడ నెల్లవిధములను మొదటివాఁడను సర్వలోకేశ్వరుఁ డను. అజుఁడను, అనాదిని నగునన్నెవ్వఁడు తెలిసికొనునో వాఁడీ మధ్యమలోకమున మూఢుఁడుగాక సర్వపాపములనుండి తొలఁగు చున్నాఁడు. బుద్ధి, జ్ఞానము, మోహరాహిత్యము, శాంతియు, సత్త్వము, శమము, దమము, సుఖము, దుఃఖము, ఉత్పత్తి, నాశము, భయము, అభయము, అహింస, సమబుద్ధి, సంతుష్టి, తపము, దానము, కీర్తి, అప కీర్తి, అనియెడి పలువిధములగు నీభావములన్నియు నానుండియే కల్గు చున్నవి. ప్రాచీను లగుసప్తర్షులును నలువురు మనువులును నన్ను భావిం చియే నాకు మానసపుత్రులైరి. ప్రజలనందఱును గల్గించినవారు వారే గదా! నా యీవిభూతియోగమును నెవఁడు యథార్థముగాఁ దెలి యునో వాఁడు స్థిర మగుయోగమును గల్గినవాఁ డగుచున్నాఁడు. ఇందు సందియము లేదు. అన్నిటికిని నేనే హేతుభూతుఁడను. అన్నియు నానుండియే ప్రవర్తిల్లుచున్నవి. అని తలంచి సద్భావముతోఁ బండి తులు నన్ను భజించుచుందురు. ఎవ్వరు నాయెడఁ జిత్తము నిలిపి వారి

ప్రాణములు నాకర్పించి యొకరికొకరు బోధించుకొనుచు నన్నే నిత్యముం జెప్పికొనుచు సంతోషముతోం గాలమును గడపుదురో యటులు ప్రీతి పూర్వకముగా నిత్యయోగనిష్ఠ గలిగి భజించువారికి వారెట్లు నన్నుం బొందఁగల్గుదురో యట్టిబుద్ధియోగము నొసంగుచున్నవాఁడను. వారిపై నాకుఁ గలదయచే వారిబుద్ధిభావములందు నిలిచి ప్రకాశించుజ్ఞానదీప ముచే నజ్ఞానముపలనఁ గల్గుచీఁకటిని దొలఁగించుచున్నాఁడను అని తెలిపెను.

అది విని యర్జునుఁడు ఓదేవా! నీవే పరమధామము. పరబ్రహ్మము. పరమపవిత్రము నీవే. దేవర్షి యగునారదుఁడు, అసితుఁడగు దేవలుఁడు, వ్యాసుఁడు మున్నగుమహర్షులెల్లరును నిన్నే దివ్యపురుషునిఁగను, నాది దేవునిఁగను, నవ్యయునిఁగను, నజునిఁగనుఁ విభునిఁగను చెలుపు చున్నారు. అటులే నీవును బలుకుచున్నాఁడవు. కావున నిదియెల్ల సత్య మనియే తలంతును. ఓకేశవా! నీవ్యక్తిని దేవతలుగాని, దానవులు గాని తెలిసికొనలేరు. ఓపురుషోత్తమా! ఓభూతభావనా! ఓభూతేశా! ఓజగన్నాథా! నీవెట్టివిభూతులతో లోకమునెల్ల వ్యాపించియుంటివో యట్టి నీదు దివ్యము లగువిభూతులనెల్ల నాకెఱిఁగింపుము. నీవే నిన్నె ఱుంగఁజాలుదువు. ఓపరమయోగివర్యా! ఎల్లపుడును దలంచుచు నిన్ను నే నెట్లు తెలియఁగలను? నేను నిన్నేయేవస్తువులందు ధ్యానింపవల యును? ఓజనార్దనా! నీయోగవిధమును, నీవిభూతిని సవిస్తరముగాఁ దెలుపుము. అమృతతుల్య మగునద్దాని నెన్నిసారులు వినినను నాకుఁ దృప్తి గలుగకున్నది. అని ప్రశ్నింపఁగా వాసుదేవుఁడు మఱియు నిట్లనియె.

ఓయర్జునా! నావిభూతివిస్తారమున కంతము లేదు. ఆహా! నీవడిగి తివిగాన దివ్యము లగువానిలోఁ బ్రధానమైన విభూతిని దెలిపెదను. ఓ యర్జునా! సర్వభూతహృదంతరములందున్న యాత్మను నేనే. భూతముల కాదిమధ్యాంతములు నేనే. ఆదిత్యులలో విష్ణువనెడియాదిత్యుఁడను నేనే. నేను తేజముగలవానిలో సూర్యుఁడను. మరుత్తులను దేవతలలో మరీచిని. నేను నక్షత్రములలోఁ జంద్రుఁడను. వేదములలో సామవేద మగుచున్నాఁడను. దేవతలలో నింద్రుఁడను. ఇంద్రియములలో మన

స్సును, ప్రాణులకుఁ జైతన్యమును నేనే. రుద్రులలో శంకరుఁడను, యక్షులు రక్షస్సులు ననెడివారిలోఁ గుబేరుఁడను నేనే. అష్టవసువు లలో నగ్నిని నేను. పర్వతములలో నేను మేరువను. ఓపార్థా! నేనే బురోహితులలో ముఖ్యుఁడగుబృహస్పతిని. సేనానాయకులలో నేను గుమారస్వామినని తెలియుము. దేవఖాతము లగుసరస్సులలో నేను సముద్రుఁడను. మహర్షులలో భృగుఁడను. మాటలలో నోంకారము నేనే. యజ్ఞములలో జపయజ్ఞము నేను. స్థావరములలో హిమవత్పర్వ తము నేను. వృక్షములలో రావిచెట్టును, దేవర్షులలో నారదుఁడును నేనే. గంధర్వులలోఁ జిత్రరథుఁడను. సిద్ధులలోఁ గపిలమునిని నేనే. అశ్వము లలో నమృతమునఁ బుట్టిన యుచ్చైశ్శ్రవస్సనెడి యశ్వమును నేనే యని తెలియుము. గంజేంద్రములలో నైరావతమును, మానవులలో రాజు నుగా నన్నుఁ దెలియుము. ఆయుధములలో వజ్రాయుధము నేను. ఆవు లలోఁ గామధేనువను జననమునకుఁ గారణముగుమన్మథుఁడను నేనే. సర్ప ములలో వాసుకిని నేను. నాగులలో శేషుఁడను. ఉదకదేవతలలో వరు ణుఁడను. పితృదేవతలలో నర్యముఁడను. శాసకులలో యముఁడను. దైత్యులలోఁ బ్రహ్లాదుఁడను. గణనముచేయువారికిఁ గాలమును నేనే. మృగములలో సింహమును నేను. పక్షులలో గరుత్మంతుఁడను. పవిత్రము చేయువానిలోఁ బవనుఁడను నేను. ధనుర్ధరులలో దశరథరాముఁడను. జలజంతువులలో మకరము నేను. నదులలో గంగానదిని నేను. ఓయర్జునా! సృష్టి కాదిమధ్యాంతములును నేనే. విద్యలలో నధ్యాత్మవిద్యను. ప్రవక్త లలో నుత్తమవాదిని నేనే. అక్షరములలో అకారమను. సమాసము లలో ద్వంద్వసమాసము నేనే. అక్షయకాలము నేను. సర్వతోముఖుఁ డగువిధాతను నేను. సర్వసంహారకమగుమృత్యువు నేనే. కాఁబోవుశుభ ములకుఁ గారణము నేను. ఉత్తమకాంతలకీర్తియు, శ్రీయు, వాక్కు, స్మృతి, బుద్ధి, ధృతి, శాంతియు నేనే. సామములలో బృహత్సామము నేను. ఛందస్సులలో గాయత్రిని. మాసములలో మార్గశీర్షమను. ఋతు వులలో వసంతఋతువను. జూదగాండ్ర ద్యూతము నేను. తేజోవంతుల తేజము నేను, జయము నేను. ప్రయత్నము నేను. బలవంతులబలము నేను. యాదవులలో వాసుదేవుఁడను. పాండవులలో ధనంజయుఁడను. మునులలో వ్యాసుఁడను. కవులలో శుక్రుఁడను దండించువారిదండ

నము నేనే. జయేచ్ఛగలవారినీతిని నేను. గోప్యము లగువానిలో మౌన ము నేనే. జ్ఞానులజ్ఞానము నేనే. ఓయర్జునా! సర్వభూతములకు బీజ మగు నదెద్దియో యది నేను. జంగమస్థావరాత్మక మగుభూతకోటిలో నేదియు నేనులేనిది లేదు. నాదివ్యవిభూతుల కంతము లేదు. నావిభూతివిస్తారమున నేక దేశముమాత్రము తెలుపఁబడినది. ఓయర్జునా! ఏవస్తువు విభూతిగల దియు, శోభగలదియు, యుక్తమైనదియు నైయుండునో, యదియెల్ల నా తేజముచే నైనదిగాఁ దెలియుము. ఓయర్జునా! ఇది పెక్కుగాఁ దెలి యుటచే నీకుఁగల ప్రయోజనమేమి? నావిభూతినిగల యొకయంశముచే నీసకలలోకమును నిండియున్నది. అని తెలుప విని యర్జునుఁడు మఱియు నిట్లనియె.

విశ్వరూపసందర్శనయోగము

ఓదేవా! నన్ననుగ్రహించి యధ్యాత్మసంజ్ఞగల పరమరహస్య మును నీవు నాకిటు లెఱిఁగించుటచే నాయజ్ఞానము తొలఁగినది. ప్రాణుల యుత్పత్తివినాశములవిధము సవిస్తరముగా వింటిని. ఓకమలాక్షా! మఱి యు నీనుండి యవ్యయమగుమాహాత్మ్యమును దెలిసితిని. ఓపరమేశ్వరా! నీవాత్మనుగుఱించి యిది యిట్టిదని దేని నెఱిఁగించితివో యట్టి యైశ్వర మగురూపము నాకుం జూపుము ఓప్రభూ! నీయారూపము నేను గనుం గొన సమర్థుఁడనని తలంతువేని యవ్యయ మగునట్టి యాత్మను నాకుం గానిపింపుము.

అది విని యాభగవానుఁడు ఓపార్థా! నానావర్ణములుగల్గి దివ్య ములై పెక్కువిధములై నారూపములు వందలకొలఁదిగను, వేలకొలఁది గను గలవు. వానిం జూపెదను జూడుము. ఆదిత్యులను, వసువులను, రుద్రులను, నశ్వినీదేవతలను, మరుత్తులను మఱియు నెన్నఁడును నీవు చూడనియాశ్చర్యకరములగు పెక్కింటిని జూడుము. ఇంకను నా దేహ మున మఱియేదైనఁ జూడఁదలంతువేని యిపుడొక్కచోనున్న జంగమ స్థావరాత్మక మగునీసకలజగము నిందుఁ జూడుము. ఈ నీదృష్టితో నీవు నన్నుఁ జూడఁజాలవు. కావున నీకు దివ్యచక్షు వొసంగెదను. నాయైశ్వర మగురూపమును జూడుము అని పలికెను.

ఓయాంబికేయా! ఇటులు పలికి మహాయోగీశ్వరుఁడగు నాహరి యుత్తమ మగు తనయైశ్వరరూపమును జూపించెను. ఆవిధమును దెలిపె

దను వినుము. ఆరూపము పెక్కుముఖములును, నేత్రములునుగల్గి యనేకాద్భుతదర్శనములుగలది. పెక్కుదివ్యాభరణములుగలది. అనేక దివ్యాయుధములుగలది. దివ్యములగువస్త్రములను మాల్యములను ధరించినది. దివ్యగంధములను బూసికొనినది. మఱియు ననంతమై విశ్వతోముఖమై సర్వాశ్చర్యనిధానమైనది. వేయిసూర్యు లొక్కమా ఱాకసమున నుదయించినచో నామహాత్ముని కాంతికిఁ దుల్యమైయుండు నేమో! అపు డాపాండవమధ్యముఁ డాభగవానుని దేహమున నొక్కచో నిఱికి యనేకవిధములుగా నేర్పడియున్న యాసకలప్రపంచమును గాంచెను. అంత నాధనంజయున కందుల కాశ్చర్య మొదవఁ బరవశుఁడై మేను గగుర్పొడువ నాతఁ డాభగవానునకు సవినయముగా నమస్కరించి కేల్మోగిడ్చి యిట్లు పలికెను.

ఓ దేవా! ఈ నీ దేహమున సకలదేవతలను, నటులే సకలభూతవిశేషములను గనుఁగొనుచున్నాఁడను. కమలాసనమందున్న ప్రభు వగు బ్రహ్మను, ఋషులను, దివ్యులగునురగులను గాంచుచున్నాఁడను. పెక్కు బాహువులు, కడుపులు, ముఖములు, నేత్రములుగల నీయనంతరూపమంతటను గానవచ్చుచున్నది. ఓవిశ్వేశ్వరా! విశ్వరూపా! నీ యీ రూపమున కాదియు మధ్యము అంతమును గానరాలేదు. మఱియుఁ గిరీటము, గద, చక్రము గల్గి కాంతిమంతమై తేజోరాశియై ప్రజ్వరిల్లు నగ్నిని సూర్యునిఁబోలి పరిమితిలేక చూడ నలవిగాకయున్న నీరూపమంతటను జూచుచున్నాఁడను. తెలిసికొనఁదగినపరబ్రహ్మము నీవే. ఈ ప్రపంచమునకు నీవే పరమనిధానము. అవ్యయుఁడ వగు నీవే శాశ్వతధర్మములను రక్షించువాఁడవు. నీవే సనాతనపురుషుఁడవని నాయభిప్రాయము. ఆదిమధ్యాంతరహితమును, నధికబలముగలదియు, బెక్కుబాహువులుగలదియు, సూర్యచంద్రులు కన్నులుగలదియుఁ, బ్రజ్వలదగ్నివక్త్రముగలదియు నగు నీరూపము నిజతేజముచే నీవిశ్వము నెల్లఁ దపింపఁ జేయునదిగాఁజూచుచున్నాఁడను. నీయొక్కనిచేత నే యీభూమ్యాకాశమధ్యము నెల్లదిక్కులును నిండియున్నవి. ఓమహాత్మా!అద్భుతమై యుగ్రమగు నీయీరూపమును జూచిముల్లోకములునువడఁకుచున్నవి. ఈ దేవతలలోఁగొందఱు నిన్నుఁజొచ్చుచున్నారు. మఱికొందఱు జడిసి చేతులు జోడించి నిన్నుఁ బొగడుచున్నారు. మహర్షులును, సిద్ధసమూహము

లును స్వస్తివచనములను బల్కుచు సముగ్రము లగుస్తోత్రములచే నిన్ను సన్నుతించుచున్నారు. రుద్రులు, నాదిత్యులు, వసువులు, సాధ్యులు, విశ్వేదేవులు, అశ్వినీదేవతలు, మరుత్తులు, ఊష్మపాయులు, గంధర్వులు, యక్షులు, సురలు, సిద్ధులు, ననెడివీరెల్లరును నాశ్చర్యపరవశులై నిన్నుఁ గాంచుచున్నవారు. పెక్కుమొగములును గన్నులుగల నీ యీరూపము మిక్కిలి గొప్పదై యున్నది. అటులే పెక్కుబాహువులుఁ, దొడలు, పాదములు గలిగి యనేకోదరములు భయంకరము లగు పెక్కుదంష్ట్రలునుగలిగిన యీ నీరూపమును జూచి లోకములును నేనును వణఁకుచున్నవారము. మఱియు నాకసమును ముట్టినట్టియుఁ, బ్రజ్వలించునట్టియుఁ, బెక్కురంగులుగల్గినట్టియు వికృతవదనమై యెఱ్ఱని పెద్దకన్నులు గల్గిన నిన్నుఁజూచి భీతచిత్తుఁడనై ధైర్యమును, శాంతిని బొందనేరకున్నవాఁడను. ప్రళయకాలాగ్నితుల్యములై కోఱలచే వెఱపుగొలుపు నీమొగములను జూచి దిగ్భ్రమనొందుచున్నాఁడను. సుఖము లేకున్నది. ఓజగదాధారా! నాయెడఁ బ్రసన్నుఁడవగుము. ఈధార్తరాష్ట్రులెల్లరును దమకు సహాయులుగావచ్చిన రాజులతోడను, భీష్మద్రోణకర్ణముఖ్యులతోడను, మనయోధముఖ్యులతోడను, గోఱలచే భయంకరము లగు నీవదనములను బ్రవేశించుచున్నారు. అందుఁ గొంద ఱాకోఱల నడుమఁ బిండి యగుచున్నతలలతోఁ గానిపించుచున్నారు. నదీప్రవాహోదకము లెటులు సముద్రమునుబట్టి పోవునో యటులే మిక్కిలి ప్రజ్వలించు నీ యీవదనములం దీమానవనాయకులు చొఱఁబడుచున్నారు. మిడుతలు కడువడిగా వచ్చి మండుచున్నయగ్నిలో నెటులు తమనాశ మెఱుఁగక పడ నెంచుచుండునో యటులే యీలోకములన్నియు మిక్కిలి వేగముగాఁ దమనాశమునకే నీవదనములను జొచ్చుచున్నవి. నీ వాలోకముల నంతటను మండెడినీవదనములచే మ్రింగుచు రుచిచూచుచున్నాఁడవు. ఓప్రభూ! నీ యీమేనితేజములు జగములనాక్రమించి యుగ్రములై తపింపఁజేయుచున్నవి. ఓదేవా! ఉగ్రరూపుఁడ వగు నీవెవ్వఁడవో తెలుపుము. నీకు నమస్కారము. నన్ననుగ్రహింపుము. ఆద్యుఁడ వగునిన్నుఁ దెలియఁదలంచుచున్నవాఁడను. ప్రవృత్తివిధ మెట్టిదో తెలియకున్నాఁడను అని పలికెను.

అదివిని యాభగవానుఁడు ఓయర్జునా! నన్ను లోకములను నశింపఁజేయునట్టికాలముగాఁ దెలియుము. ఇటులు ప్రవృద్ధుఁడనై లోకములను సంహరించుటకుఁ బ్రవర్తించితిని. నీవుతప్ప రణరంగమునఁ గలయోధులందఱును నిలువఁజాలరు. కావున నీక యుద్ధసన్నద్ధుఁడ వగుము. కీర్తినిబొందుము. శత్రులను వధించి సమృద్ధమగురాజ్య మను భవింపుము. వీరెల్ల నింతకుమున్నే నాచే హతులయినవారు. ఓసవ్య సాచీ! నీవిందు నిమిత్తమాత్రముగమ్ము. భీష్ముని, ద్రోణుని, సైంధవునిఁ, గర్ణుని, మఱియుఁగలయోధులను నేనే చంపియున్నవాఁడను. కావున నీక నీవు వీరిని జంపుము. వ్యథనొందకుము. యుద్ధముచేయుము. శత్రువులను జయింపఁగల్గుదువు.

ఓధృతరాష్ట్రా! ఆవాసుదేవునివచనములు విని యర్జునుఁడు వడఁకుచుఁ జేతులు జోడించి మఱలమఱల నమస్కరించుచు మఱిమఱి భయపడుచు గద్గదస్వరముతో ఓహృషీకేశా! ఇది యుక్తమే. నీ యీయుత్తమకీర్తికి లోకము హర్షించుచున్నది. ప్రీతినొందుచున్నది. రక్షస్సులు భయపడుచు దిక్కులకుఁ బరువులిడుచున్నారు. ఓమహాత్మా! ఆదికర్తవై పరబ్రహ్మమ వగు నీకెవ్వరు నమస్కరింపరు? ఓయనంతా! దేవేశా! ఓజగన్నివాసా! నీవు పరబ్రహ్మము. సదసద్రూపములను మించిన యపరస్వరూపుఁడ వీవే. నీ వాదిదేవుఁడవు. పురాణపూరుషుఁడవు. ఈప్రపంచమున కుత్తమనిధానమవు. తెలియఁదగినదియుఁ, దెలియు వాఁడవును నీవే. నీవే పరమపదము. ఓయనంతరూపా! ఈప్రపంచమెల్ల నీచే వ్యాప్తమైయున్నది. వాయువు, యముఁడు, అగ్ని, వరుణుఁడు, చంద్రుఁడు, ప్రజాపతియును నీవే, పితామహునకుఁ బితామహుఁడవు. నీకు వేలకొలఁదివందనము లాచరించుచున్నవాఁడను. మఱియుమఱియు మ్రొక్కెదను. నీకు ముందువెనుకలను నమస్కారము. నీకంతటను నమస్కారము. అనంతబలుఁడవును, నమితవిక్రముఁడవునునై యంతను వ్యాపించియున్నవాఁడవు. నీ యీమహిమను దెలియమినో, పొర పాటుననో, స్నేహముచేతనో నిన్ను మిత్రునిఁగాఁ దలఁచి కృష్ణా! యాదవా! మిత్రమా! యని పిలుచుటకును సపరిహాసముగా నిన్ను విహరించునపుడును, భుజించునపుడును, కూర్చుండునపుడును, శయ నించునపుడును, నొంటిపాటునను గౌరవింపకుండుటకును క్షమింపుమని

యప్రమేయుఁడ వగు నీసముక్షమున మనవి చెప్పికొనుచున్నాఁడను. నీవు జంగమస్థావరాత్మకమగు ప్రపంచమునకుఁ దండ్రివి. మఱియుఁ బూజ్యుఁడవును, గురుఁడవును, సర్వాధికుఁడవు నైనవాఁడవు. ఓయసదృశ ప్రభావా! మూఁడులోకములందును నీతోఁ దుల్యులే లేరన్నచో నధికు లుందురని చెప్పుటెట్లు? కావున సర్వేశ్వరుఁడవై సన్నుతింపఁదగు నిన్ను సవినయముగా నమస్కరించి నన్ననుగ్రహింపుమని వేఁడు చున్నాఁడను. ఓదేవా! పుత్రునిఁ దండ్రియు మిత్రుని మిత్రుఁడు, భార్యను భర్తయు వలె నాయపరాధమును క్షమించి నన్ను దయ చూడుము. ఎన్నఁడును జూడని నీరూపమును జూచి సంతసించితిని. భయముచే నామనము వడఁకుచున్నది. కావున నాకుఁ బ్రియమగు నీవెనుకటిరూపమును జూపుము. ఓదేవా! జగన్నివాసా! కిరీటము, చక్రము, గదయుఁగల్గిన నీతొలుతటిరూపమును జూడఁగోరుచున్నాఁడను. ఓవిశ్వరూపా! ఓసహస్రబాహూ! నాల్గుభుజములుగల నీవెను కటిరూపము నాశ్రయింపుము అని ప్రార్థించెను.

అంత నావాసుదేవుఁ డప్పార్థుం జూచి ఓయీ! అర్జునా! ఇత రుల కెవ్వరికిని దేఱిచూడరాక, తేజోమయమై యనంతమై యాద్య మైన నా యీవిశ్వరూపమును నాకు నీయెడఁగల యనుగ్రహముచే నాత్మయోగము నవలంబించి నీకుఁ జూపితిని. ఓకురుప్రవీరా! నీకుఁ దప్పఁ దక్కినవారికి యజ్ఞములచేఁగాని, దానములచేఁగాని, యితరకార్య ములచేఁగాని, భయంకరము లగుతపములచేఁగాని నా యీరూపము చూడ నలవిగానిది. ఘోరమగు నా యీరూపమునుజూచి భయమొంద కుము. మూఢుఁడవుగాకుము. ఇఁక భయమువిడిచి సంతుష్టమానసుఁడవై నాతొలుతటిరూపమును జూడుము. అని తెలిపెను.

ఓయాంబికేయా! ఇటు లావాసుదేవుఁడు పలికి, మఱియు నాయర్జునునకుఁ దనవెనుకటిప్రసన్నరూపమును జూపెను. అటులా సౌమ్యవిగ్రహమును జూపి యతఁడు భయపడుచున్న యాయర్జును నూఱడించెను.

పిదప నర్జునుఁ డాభగవానునితో ఓజనార్దనా! నీయీసౌమ్య మగుమానుషరూపమును జూచితిని. నాకుఁ జైతన్యముగల్గినది. ఎప్పటి వలెఁ గుదుటఁబడితిని అని పలుక విని ఓపార్థా! చూడనలవిగాని యే

నారూపమును నీవు చూచితివో దానిని దేవతలు నిత్యముఁ జూడఁ గోర్కిగలవారై యుందురు. అట్టి నారూపమును నీవు సులభముగాఁ జూడఁగల్గితివిగాని యియ్యది వేదములచేఁ గాని, తపోదానములచేఁ గాని యాగములచేఁ గాని వేఱొకరికి దర్శింప నలవిగాని దగుచున్నది. ఓయర్జునా! నాయెడఁగల కేవలభక్తిచేతనే నన్నుఁ దెలిసికొనుటకును, జూచుటకును, బ్రవేశించుటకును నవకాశము గల్గుచున్నది. నాకుఁగాఁ గర్మము లొనర్చుచు నాయెడ సక్తిగలిగి నాకు భక్తుఁడై సంగవర్జితుఁడై సకలభూతములందును వైరమును విడిచి యెవ్వఁడు ప్రవర్తించునో వాఁడు నన్నుఁ బొందుచున్నాఁడు అని తెలుప విని యర్జునుం డిట్లనియె.

భక్తియోగము

ఓదేవా! ఎవ్వరిటులు యోగనిష్ఠులై భక్తులై యక్షరస్వరూపుఁడవు, నవ్యక్తుఁడవు నగునిన్ను సేవింతురో యట్టివారిలో నెవ్వ రుత్తములో తెలుపుమన విని వనజనాభుఁ డిట్టు లనియెను.

ఓపార్థా! ఎవ్వ రెంతయు శ్రద్ధగలిగి, నాయెడఁ దమచిత్తము నిలిపి నిత్యయోగనిష్ఠులై నన్ను సేవింతురో వారే నాకు యుక్తతములుగా నగపడుచుందురు. ఇఁక నెవ్వరు అవ్యక్తునిఁగను, నచలుఁగను, నంతటను నున్నవానిఁగను, నూహింపరానివానిఁగను, గూటస్థునిఁగను, శాశ్వతునిఁగను, నిర్దేశింపరానివానిఁగను, నక్షరుఁగను దలంచి యింద్రియముల నడంచి యన్నిటిని దుల్యదృష్టితోఁ గాంచుచు సర్వభూతదయాళురై నన్ను సేవింతురో వారును నన్నే పొందుచున్నారు. కాని యటు లవ్యక్తమున సక్తచిత్తు లగువారికిఁ గ్లేశ మధికమై యుండును. దేహధారు లగువారి కవ్యక్తమును దెలిసికొనుట మిక్కిలి కష్టతరమై యుండునుగదా! ఇఁక నెవ్వఁడు సకలకర్మములను నీశ్వరుఁడనగు నాయెడ విడిచి మదేకనిష్ఠులై విశ్వరూపుఁడ నగునన్నే చెందెడియోగమూని నాయందే చిత్తములుంచి నన్ను ధ్యానించుచు నుపాసింతురో వారిని సంసారసాగరమునుండి యచిరకాలముననే యుద్ధరించువాఁడను. కావున నీవు నాయందే చిత్తము నిలుపుము. నాయందు బుద్ధి నిలుపుము. అటు లొనర్తువేని నిస్సంశయముగా నాయందే నివసింపఁగలవు.

ఓధనంజయా! నాయెడ నీచిత్తము స్థిరముగా నిలుపఁజాలవేని యభ్యాస యోగము నాశ్రయించియైన నన్నుఁ బొందందలంపుము. అటు లా యభ్యాసయోగము నవలంబించుటకును శక్తిచాలదందువేని నాకుఁగా నొనర్పఁదగుకర్మములందు సక్తిగల్గి యుండుము. అటులొనర్తువేని సిద్ధి నొందఁగలవు. అదియును జేయఁజాలవేని నాయోగము నాశ్రయించి పిదప నంతఃకరణమును నియమించి సర్వకర్మఫలపరిత్యాగ మొనరిం పుము. అభ్యాసయోగముకంటె జ్ఞానము మేలు. దానికన్న నాధ్యాన ముత్తమమైనది. ఆధ్యానముకంటెఁ గర్మఫలపరిత్యాగము మేలైనది. దానిచే శాంతియుఁ గల్గుచున్నది. మఱియు దేనియెడను ద్వేషములేక స్నేహముగల్గి కనికరము చూపుచు మమకారాహంకారములు పరిత్య జించి సుఖదుఃఖములు రెండిటిని దుల్యముగాఁ గనుఁగొనుచు శాంతుఁ డై నిత్యసంతుష్టుఁడై మనోనిగ్రహముచే దృఢనిశ్చయుఁడై యోగ మవలంబించి యెవ్వఁడు నాయందే మనోబుద్ధులు సమర్పించి యుండునో అట్టిభక్తుఁడే నాకుఁ బ్రియమైనవాఁడు. లోక మెవ్వనినుండియు నెవఁడు లోకమునుండియు జడియకుండునో, మఱియు నెవ్వఁడు సంతోషమును రోషమును భయోద్వేగములను విడుచునో, వాఁడే నాకుఁ బ్రియ మైనవాఁడు. మఱియు నిరపేక్షుఁడును, శుచియు, సమర్థుఁడును, నుదా సీనుఁడును, భయరహితుఁడును, గార్యారంభములను బరిత్యజించిన వాఁడును నై యోగియై యెవ్వఁడు నాకు భక్తుఁడై యుండునో వాఁడే నాకుఁ బ్రియుఁడగును. ఎవ్వఁడు దేనికిని హర్షమును, ద్వేషమును, శోకమును బొందక కోరిక లేక లాభాలాభములయెడ సక్తివిడిచి నాయెడ భక్తిగలిగియుండునో వాఁడే నాకుఁ బ్రియుఁడు. మఱియు నెవ్వఁడు శత్రులను, మిత్రులను, నటులే మానావమానములను, జలివేఁడుము లను, సుఖదుఃఖములను దుల్యముగాఁ జూచుచు సంగవర్జితుఁడై నిందా స్తుతులను సరిగా నెంచుచు మౌనమూని దైవలబ్ధమగుదానితోఁ దృప్తి వడుచుఁ దనకుఁగా నొకనివాస మేర్పఱచుకొనక స్థిరబుద్ధియై నాయెడ భక్తి చూపునో వాఁడే నాకుఁ బ్రియుఁడు. ఓపార్థా! ఎవ్వరు నా యీ చెప్పినధర్మయుక్తమై యమృతమయ మగుదానిని శ్రద్ధావంతులును మదేకనిష్ఠులునునై సేవింతురో అట్టిభక్తులే నాకెంతయును బ్రియు లయినవారని తెలియుము అని తెలుప విని యర్జునుం డిట్లనియె.

## క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగము

ఓదేవా! ప్రకృతియుఁ బురుషుఁడు, క్షేత్రము, క్షేత్రజ్ఞుఁడు, జ్ఞానము, జ్ఞేయము అనువీనివిధ మెట్టిదో తెలియఁగోరుచున్నాఁడను.

అదివిని యాభగవానుఁడు ఓపార్థా! ఈశరీరము క్షేత్రమని పిలువఁబడును. ఈక్షేత్రము నెవ్వాఁడు తెలియుచుండునో వాఁడే క్షేత్రజ్ఞుఁడని దానివిధ మెఱిఁగినవారు తెలుపుదురు. ఓభారతా! సర్వ శరీరములందు నున్న క్షేత్రజ్ఞుఁడును నేనే యని తెలియుము. ఈక్షేత్ర క్షేత్రజ్ఞుల విభాగమును దెలియునదియే జ్ఞాన మనఁబడునని నాయభి ప్రాయము. ఇఁక క్షేత్ర మెద్దియో! అది యెట్టిదో, ఎట్టి వికారముగల దియో, దేనినుండి యది గల్గెనో మఱియు క్షేత్రజ్ఞుఁ డెవ్వఁడో అతఁ డెట్టి ప్రభావముగలవాఁడో యనెడిదాని కలనిధమంతయు సంగ్రహ ముగాఁ దెలిపెదను వినుము. వసిష్ఠాదు లగుఋషులు, వివిధములగు వేద వాక్యములచేతను, హేతుయుక్తములై సిద్ధాంతములగు బ్రహ్మసూత్ర పదములచేతను నీవిషయము తెలుపఁబడియున్నది. పంచమహాభూతము లును, నహంకారము, బుద్ధి, మూలప్రకృతియు మనసుతోఁగూడి పదు నొకొండింద్రియములును, శబ్దస్పర్శరూపరసగంధములనెడివిషయము లును, ఇచ్ఛయు, ద్వేషము, సుఖము దుఃఖము, దేహము, చేతన, ధృతి అనియెడి యివియే సంగ్రహముగా సవికారమగు క్షేత్ర మనిపించు కొనును. మానము, దంభము, హింస అనునవి లేకుండుటయు, శాంతి, ఋజుబుద్ధి, గురుశుశ్రూషయు, శుచిత్వము, స్థిరత్వము, మనోనిగ్ర హము, ఇంద్రియార్థములయెడ విరక్తియు, నహంకారము లేకుండు టయు, జననమరణములయు, జరావ్యాధులయు, దుఃఖదోషములను గనిపెట్టుటయు, విషయాభిలాష లేకుండుటయు, దారపుత్రాదులసంప ర్కము లేకుండుటయు, నిర్ధనము, ఇష్టానిష్టములందు సమబుద్ధిగల్గి యుండుటయు, నితరములను విడిచి కేవలము నాయందే చలింపనిభక్తి చూపుటయు, నిర్జనప్రదేశమందుండుటయు, జనసమూహముతోఁ గలి యుటయందు విరక్తియు, నిరతమును, నధ్యాత్మజ్ఞానము గల్గియుండు టయుఁ, దత్త్వజ్ఞానార్థమునెడ దృష్టియు ననియెడునవియే జ్ఞాన మనఁ బడును. వీనికి విలక్షణమైనదియే యజ్ఞానము. ఇఁక దేనిని దెలియుటచే

ముక్తి నొందనగునో యట్టిజ్ఞేయమువిధ మెఱిఁగించెదను వినుము. ఆది లేనిదియే పరబ్రహ్మము. అది సత్తుగాదు. అసత్తునుగాదు. మఱియు నది యంతటను బాణిపాదములును, నెల్లెడలను దలలును, గన్నులు మొగములుగలదియు నంతటను జెవులుగలదియు నై యన్నిటి నావరించి యుండును. అది సకలేంద్రియశూన్యమై సర్వేంద్రియవ్యాపారములచే వ్యాపారముగలదియువలె నుండునదియు, దేనితో సంగములేకయు సకలమును భరించునదియువలె నుండునదియు, గుణరహితమైయుం డియు గుణముల ననుభవించుచుండునదియు, బహిరంతర్భావములచేఁ జరించునది యైనను జరింపనిదియు నై యుండును. సూక్ష్మ మగుటచేఁ దెలియరాకుండును. మఱియు నది దూరముననను, జేరువనుగూడ నుండు నది. అది విభక్తిగానిదైనను, భూతములందు విభజింపఁబడియున్నటు లుండును. అయ్యది భూతములను సృజించునదియు, భరించునదియు మ్రింగునదియునై యుండును. మఱియు వినుము. తేజము గలవానిలో నెల్లఁ దేజోవంతమై తమస్సు నతిక్రమించియుండునదియే జ్ఞానము. అట్టి జ్ఞానముచేఁ దెలియఁదగినది జ్ఞేయము. అదియే సకలప్రాణులహృదయ మునందుండునది అని తెలియుము. ఓయర్జునా! ఇటులు సంగ్రహముగా క్షేత్రమును, జ్ఞానమును, జ్ఞేయము ననువానివిధ మెఱిఁగించితిని. నాభక్తుఁడగువాఁడు దీనిని దెలిసికొని పరమాత్మభావమున కర్హుఁ డగుచున్నాఁడు. ప్రకృతి పురుషుఁడు ననునీరెండిటి ననాదులనియే తెలియుము. బుద్ధిమొదలుగా దేహమువఱకును గల వికారములును, గుణములును బ్రకృతివలనఁ బరిణమించినవిగాఁ దెలియుము. కార్యమునకును గారణమునకును గలకర్తృత్వమునఁ బ్రకృతియే హేతువని చెప్పఁబడుచున్నది. సుఖదుఃఖభోక్తృత్వమునఁ బురుషుఁడు హేతువుగాఁ జెప్పఁబడుచున్నాఁడు. పురుషుఁడు ప్రకృతిసంబంధము గలిగి ప్రకృతివలనఁ గల్గినగుణము లనుభవించుచున్నాఁడు. వీనికి సదసద్యోనులను జనించుటకు గుణసంగమే హేతువగుచుండును. ఈ దేహముననున్న పరమపురుషుఁ డుపద్రష్టయు, అనుమంతయు, భర్తయు, భోక్తయు, మహేశ్వరుఁడును, బరమాత్మయు నని తెలుపఁబడు చున్నాఁడు. ఎవ్వఁడివ్విధముగాఁ బురుషునిగుణములతోఁగూడఁ బ్రకృతిని దెలిసికొనునో వాఁడు పలువిధములఁ బ్రవర్తించినను బునర్జన్మ

మొందఁడు. కొందఱు ధ్యానబలము నాశ్రయించి యాత్మచే నాత్మలో నాత్మను గాంచుచుందురు. మఱికొందఱు సాంఖ్యముచేతను, యోగముచేతను దెలిసికొందురు. మఱికొందఱు కర్మయోగముచేఁ గనుగొందురు. మఱికొంద ఱీవిధము తెలియక యాచార్యులయుపదేశమును బట్టి ధ్యానింతురు. అటులు గురూపదేశశ్రవణపరాయణులైనవారును మృత్యువు నతిక్రమించుచున్నారు. స్థావరజంగమాత్మకమై జనించిన ప్రాణియెల్ల క్షేత్రక్షేత్రజ్ఞులసంయోగమువలననే గల్గునని తెలియుము. సర్వభూతములందును దుల్యుఁడై నశించెడివానియందుండియు నశింపక యున్న యప్పరమేశ్వరు నెవ్వఁడు తెలిసికొనునో వాఁడే చూచువాఁడగుచున్నాఁడు. ఎల్లెడల సమముగా నున్న యీశ్వరునిఁ గాంచువాఁడాత్మచే నాత్మను హింసింపఁడు. కావుననే వాఁడుత్తమగతి నొందుచున్నాఁడు. ప్రకృతిచేతనే కర్మములన్నియుఁ జేయఁబడుచుండునని యెవ్వఁడు తెలిసికొనునో మఱియు నెవ్వఁ డాత్మ నకర్తనుగాఁ దలంచునో వాఁడే చూచువాఁ డగుచున్నాఁడు. భూతములపృథగ్భావము నెవ్వఁడేకగతముగా నెపుడు తెలిసికొనునో దానివలననే విస్తారముగాంచునో యపుడే తాను బ్రహ్మమగుచున్నాఁడు. అనాదియు నిర్గుణుఁడును నగుటచే నవ్యయుఁ డగు నాపరమాత్మ శరీరములందుఁ దానుండియుఁ గర్మములను జేయువాఁడు గాఁడు. వాని నవి యంటఁజాలవు. ఆకాశము సూక్ష్మమైనదగుటచే నెల్లెడలనుండియు దేనిని నంటకుండునో యటులే పరమాత్మయు దేహమంతటను వ్యాపించి యుండియు దేనిని నంటక యుండును. సూర్యుఁడుఁ తానొకఁ డీలోకము నెల్ల నెటులు వెలయించునో యటులే క్షేత్రజ్ఞుఁడు సకలదేహమును బ్రకాశింపఁజేయుచుండును. ఎవ్వ రీక్షేత్రక్షేత్రజ్ఞులభేదమును భూతములప్రకృతిమోక్షణమును జ్ఞానదృష్టిచేఁ దెలియుదురో వారుత్తమగతి నొందుచున్నారు. అని తెలిపి మఱియు నిట్లనియె.

### గుణత్రయవిభాగయోగము

ఓపార్థా! ఏది తెలియుటచే మునులెల్ల దేహబంధమునుండి మోక్షసిద్ధి నొందియున్నవారో యట్టిజ్ఞానములలో నుత్తమ మగుజ్ఞానమును మఱియు నీకెఱిఁగించెదను. ఈజ్ఞానము నాశ్రయించినవారు

నాసారూప్యమునొంది సృష్టికాలమున జననమును, ప్రళయకాలమునఁ జలనము నొందరు. మహాప్రకృతియే నాదుయోని. దానియందే నేను గర్భముంచెదను. ఓయర్జునా! దానినుండియే సర్వభూతోత్పత్తియు నగు చుండును. సకలయోనులయందును నేయేమూర్తులు సంభవించు చున్నవో వానికెల్ల మాయయే కారణమనియు, నేను బీజప్రదుఁడ నగు తండ్రిననియుఁ దెలియుము. సత్త్వరజస్తమోగుణములు మూఁడును బ్రకృతివలనఁ గల్గుచు నవ్యయుఁడగు దేహి నీదేహమున బంధించు చున్నవి. అందు సత్త్వము నిర్మలమైనదగుటచేఁ బ్రకాశింపఁజేయునదియు ననామయమైనదియు, సుఖసంగముచేతను, జ్ఞానసంగముచేతను దేహిని బంధించును. తృష్ణాసంబంధముచే జనించురజమును రాగాత్మకముగాఁ దెలియుము. ఓకౌంతేయా! అయ్యది కర్మసంగముచే దేహిని బంధిం చును. సర్వదేహులకును మోహమును గల్గించుతమ మజ్ఞానముచేఁగల్గు నని తెలియుము. అయ్యది ప్రమాదము, ఆలస్యము, నిద్ర అనువానిచే దేహిని బంధించును. సత్త్వము సుఖసంగ మొనర్చును. రజము కర్మ సంగ మొసంగును. జ్ఞానము నావరించి తమము ప్రమాదమును గల్గించు చున్నది. సత్త్వము రజస్తమముల నడంచి వెలయును. రజము తమ స్సత్త్వముల నధఃకరించి వెలయును. అటులే తమము, రజస్సత్త్వముల నధఃకరించి యుండును. ఈదేహమునందుఁగల యెల్లద్వారములందును నెపుడు ప్రకాశ ముదయించునో యపుడు సత్త్వము వృద్ధినొందునని తెలియుము. లోభము, ప్రవృత్తి, కర్మారంభము, శాంతిరాహిత్యము, వాంఛ యనునవి రజము వృద్ధినొందునపుడు గల్గునని తెలియుము. ఓ పార్థా! అవివేకము, ప్రవృత్తియుఁ, బ్రమాదము, మోహము అనునవి తమోవృద్ధియందగునని తెలియవలయును. సత్త్వము వృద్ధినొందునపు డెవ్వఁడు మరణించునో వాఁడుత్తమజ్ఞానవేత్తల యుత్తమలోకముల నొందుచున్నాఁడు. రజము వృద్ధినొందియున్నపుడు మరణించినచోఁ గర్మాసక్తు లగువారిలో జనించును. తమోవృద్ధిని మృతి సంభవించినచో నీచజాతులందు జనించును. సాత్త్వికకర్మములకు నిర్మల మగుసాత్త్విక ఫలమే గలుగునని తెలుపుదురు. మఱియు నాకర్మములందు రజమధిక మగునేని దుఃఖఫలమును దమమధికమగునేని యజ్ఞానఫలమును నగు చుండును. సత్త్వమువలన జ్ఞానమును, రజమువలన లోభమును, దమము

వలనఁ బ్రమాదమోహములును, నజ్ఞానమును బొడముచుండును. సత్వగుణప్రధాను లగువా రూర్ధ్వముగాఁ బోవుదురు. రజఃప్రధానులు మధ్యమలోకముల నుందురు. నీచగుణప్రవృత్తు లగుతామసు లధోలోకములకుఁ బోవుదురు. గుణములకు భిన్నుఁ డగువానిని కర్తగా నెవ్వఁడు భావింపఁడో యెవ్వఁడు గుణములకంటెఁ బరుఁడగువానిని దెలిసికొనునో వాఁడుపరమాత్మభావ మొందుచున్నాఁడు. దేహసంభవము లగుమూఁడు గుణములను నతిక్రమించి జన్మము, మృత్యువు, ముదిమి అనెడిదుఃఖములను బాసి ముక్తి నొందుచున్నాఁడు. అని తెలుప విని యర్జునుఁడు ఓదేవా! మూఁడుగుణములను నతిక్రమించివాఁ డెట్టిగుఱుతులుగల్గి యుండును? వానియాచారము లెట్టివి? వాఁడాగుణముల నతిక్రమించు టెట్టులు? అని ప్రశ్నించెను.

అది విని యావాసుదేవుఁ డావాసవనందనునితో ఓపార్థా! ఎవ్వఁడు సత్వరజస్తమోగుణకార్యములగు ప్రకాశప్రవృత్తిమోహములు ప్రవృత్తములగునపుడు వానిని ద్వేషింపకయు నివృత్తము లగునపుడు వానిని గాంక్షింపకయు నుదాసీనునివలెనుండి యాగుణములచేఁ గదల్పఁబడ కుండునో మఱియు గుణములే యిట్లు ప్రవర్తిలుచున్నవని తలఁచి స్థిరుఁడై చలింపకుండునో సుఖదుఃఖములందును, గాంచనపాషాణములందును నెవ్వఁడు సమబుద్ధి యైయుండునో ప్రియాప్రియముల యెడఁ దుల్యుఁడై ధైర్యముగలిగి నిందాస్తుతులను సరిగాఁ బరిగణించుచునటులే మానావమానములందును, శత్రులందును, మిత్రులందును దుల్యబుద్ధిగల్గియుండునో మఱియు సకలకార్యారంభములఁ బరిత్యజించునో వాఁడే గుణాతీతుఁడని తెలుపఁబడుచున్నాఁడు. ఇంకను స్థిరమగుభక్తియోగముచే నన్నెవఁడు సేవించునో వాఁడును గుణములను దాఁటి బ్రహ్మ మగుచున్నాఁడు. ఓపార్థా! అమృతుఁడును, నవ్యయుఁడును నగుబ్రహ్మమునకును, శాశ్వతధర్మమునకును, నిత్యసుఖమునకును నేనే యాశ్రయుఁడనని తెలిపి భగవానుఁడు మఱియు నిట్లనియె.

## పురుషోత్తమయోగము

ఓపార్థా! బ్రహ్మమే మూలముగాఁ గలదియు మహదహంకారాదులే కొమ్మలుగాఁ గలదియు నై సంసార మొకయశ్వత్థవృక్షమని చెప్పఁ

బడును. మఱియు దేనికి ఛందములే పత్రములో యట్టిదానిని దెలియు వాఁడే వేదవేత్త యనఁబడుచున్నవాఁడు. గుణములచే వృద్ధినొందుచు విషయములనెడి చిగుళ్లుగలిగి దానికొమ్మలు క్రిందికి మీఁదికిని వ్యాపించియున్నవి. కర్మానుబంధములు గలవ్రేళ్లు క్రిందను, మనుష్య లోకమునను బ్రాకియున్నవి. పూర్వముచెప్పినట్టులు దానిరూప మిందుఁ గానరాదు. దాని కంతమును లేదు ఆదియును లేదు. దాని కొకయా శ్రయమును లేదు. దృఢ మగుమూలముగల యాయశ్వత్థమును దృఢ మైనసంగరాహిత్యమనెడి శస్త్రముచే ఛేదించి పిదప దేనిని బొందినచోఁ బునరావృత్తి గలుగదో యట్టి యుత్తమస్థానమును వెదకవలయును. ఎవ్వఁడు పురాతన మగుప్రవృత్తిని బ్రవర్తింపఁజేయునో యట్టి యాద్యుఁ డగుపురుషుని శరణమొందవలయును. మానమోహములను విడిచి సంగ దోషములను జయించి పరమాత్మస్వరూపాలోచనాపరులై కోర్కులను మఱలించి సుఖదుఃఖాదిద్వంద్వములచే విముక్తులైనవారు మూఢత్వ మును విడిచి యవ్యయ మగునాపదము నొందుచున్నారు. సూర్యుఁడును జంద్రుఁడును, నగ్నియు దేనిని బ్రకాశింపఁజేయఁజాలరో దేని నొందిన వారికిఁ బునరావృత్తి గలుగదో యట్టియుత్తమస్థానము నాయదియే యని తెలియుము. జీవలోకమున జీవభూతుఁడైనవాఁడు నాసనాతనాం శమే. ఆయంశమే ప్రకృతిస్థానముగాఁగలిగి మనసుతోఁగూడ నాఱగు నింద్రియముల నాకర్షించుచుండును. ఈశ్వరుఁ డెప్పుడు శరీరమునుబొం దునో, ఎప్పుడు దానినుండి వెడలునో యపు డొకవస్తువునుండి గాలి గంధమునువలె మనసు మొదలగు నీయింద్రియములను గ్రహించి వెడలిపోవుచున్నాఁడు. త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములను, మన స్సును నధిష్ఠించి యితఁడు విషయముల ననుభవించుచుండును. పూర్వ దేహమునుండి వెడలుచున్నను దేహమందున్నవిషయము లనుభవించు చున్నను గుణాన్వితుఁ డగునాతని మూఢులగువారు గాంచఁజాలరు. జ్ఞానదృష్టిగలవారే నన్నుఁ గాంచఁగల్గుచున్నారు. ప్రయత్నమునుజేయు యోగు లాత్మయందున్నయీతనిని గాంతురు. ప్రయత్నముచేసినను సంస్కారహీనబుద్ధు లగునవివేకు లీతని దర్శింపఁజాలరు. అఖిలలోక మును వెలయించు నాదిత్యునితేజము నటులే చంద్రాగ్నులతేజములును నాయవియే యని తెలియుము. నేను బుడమిని బ్రవేశించి నాబలముచే

భూతకోటులను వహించుచున్నాఁడను. మఱియు రసాత్మకుఁ డగు చంద్రుఁడనై యోషధులనెల్లఁ బోషించుచున్నాఁడను, నేను వైశ్వానరుఁడనై ప్రాణులదేహము నాశ్రయించి ప్రాణాపానములతోఁ గూడి భక్ష్యభోజ్యచోష్యలేహ్యము లనియెడునాల్గువిధము లగు నాహారములను బక్వ మొనర్చుచుందును. మఱియు నేనే యెల్లప్రాణులహృదయమం దుండువాఁడను. నావల్లనే స్మృతియు జ్ఞానమును గల్గుచుండును. ఎల్లవేదములచేఁ దెలియఁదగినవాఁడను నేనే. మఱియు వేదాంతకర్తను వేదవేత్తను నేనే యగుచున్నవాఁడను. అక్షరుఁడు, క్షరుఁడునని పురుషులిరువురు సర్వభూతములును క్షరుఁడనఁబడును. కూటస్థుఁ డక్షరుఁ డనఁబడుచున్నాడు. మఱియొకయుత్తమపురుషుఁడు పరమాత్మగా నుదాహరింపఁబడుచున్నవాఁడు. అవ్యయుఁ డగు నాయీశ్వరుఁడే మూఁడు లోకములయం దావేశించి వానిని భరించుచున్నాఁడు. క్షరునికంటె నక్షరునికంటెను నుత్తముఁడ నగుటచే లోకమందును వేదమందును బురుషోత్తముఁడనెడి పేరందితిని. ఓయర్జునా! ఇట్టులు నన్నుఁ బురుషోత్తమునిఁగా నెవ్వఁడు తెలియునో వివేకియై సర్వజ్ఞుఁ డగునాతఁడు సర్వవిధముల నన్నే భజించుచుండును. ఓయనఘా! రహస్య మగు నాశాస్త్రమును నీకుఁ దెలిపితిని. ఈవిధ మెఱిఁగియే మానవుఁడు బుద్ధిమంతుఁడును గృతజ్ఞుఁడు నగు చుండును. అని తెలిపి వాసుదేవుఁడు మఱియు నిట్లనియె.

## దైవాసురసంపద్విభాగయోగము

ఓపార్థా! భయరాహిత్యము, అంతఃకరణశుద్ధి, జ్ఞానయోగనిష్ఠయు, దానము, బాహ్యేంద్రియనిగ్రహము, యజ్ఞము, వేదపఠనము, ఋజుబుద్ధి, అహింస, సత్యము, కోపములేకుండుట, సన్న్యాసము, శాంతియు, గొండెములు తెలుపకుండుటయు, భూతదయ, చాపల్యములేకుండుట, మృదుస్వభావము, బిడియము, వ్యర్థకార్యములుచేయమియుఁ, దేజము, క్షమ, ధైర్యము, శౌచము, ద్రోహ మొనర్పకుండుట, గర్వము లేమియు ననునివి దేవతావిభూతి కర్హుఁడై జనించినవాని కగుచున్నవి. దంభము, గర్వము, అభిమానము, క్రోధము, పారుష్యము, అజ్ఞానము నను నివి యాసురసంపద కర్హుఁడై జనించినవాని కగుచున్నవి. దైవసంపద బంధ

మోక్షణమునకును, నాసురసంపద బంధమునకును నగుచుండును. ఓ పాండుపుత్రా! దైవసంపదను జనించినవాఁడవగుట నీవు శోకింపరాదు. ఈలోకమున దైవము, ఆసురము అని భూతసర్గములు రెండుగా నుండును. దైవసర్గము సవిస్తరముగాఁ దెలిపితిని. ఇఁక నాసురసర్గము నాలకింపుము. ఆసురులగుజనులు ప్రవృత్తినివృత్తులను దెలియఁజాలరు. అటులే వారియందు శౌచము, సదాచారము సత్యమును జూపట్టవు. మఱియును, వారు తమవలె జగ మసత్యమనియు, నిది ధర్మాధర్మాశ్రయము కానిదనియు, దీని కీశ్వరుఁడు లేఁడనియుఁ, గాము హేతుక మగు స్త్రీపురుషసంయోగమే దీనికి హేతువుగాని వేఱొక కారణము లేదనియుఁ దెలుపుదురు. ఇట్టిదృష్టిగలిగి యల్పబుద్ధులై మతిచెడి హితముదెలియక క్రూరకర్ములై జగము నశింపఁజేయ నుద్భవించుచుందురు మఱియు వారెంతకును దృప్తిలేని కామము నాశ్రయించి దంభమానమదములతో గ్రహింపరానివానిని బరిగ్రహించుచు నపవిత్రులై ప్రవర్తించుచుందురు. పరిమితిలేక ప్రళయమువఱకును నశింపకుండెడిచింత నాశ్రయించినవారు కామభోగానుభవపరులై తమ కదియేగాని వేఱొండు లేదని సిద్ధాంతించికొనియుందురు. మఱియు నట్టినిశ్చయముతో వారు పాశము లనఁదగు వందలకొలఁదియాశలకుఁ జిక్కి కామక్రోధములకు వశులై తమకోర్కుల ననుభవించుటకై యన్యాయముగా ధనము లార్జింప సమకట్టుచుందురు. "నే నిపు డింతయార్జించితిని. ఇఁక నీకోర్కుల నీడేర్చుకొనెదను. ఇది నాకుఁ గలదు. అదియు నాకుఁ గొలదిలోఁ గల్గును. ఈనాశత్రువు నడంచితిని. ఇంకనున్నవైరులను జంపెదను. నేనే ప్రభుఁడను. భోగశాలిని బలవంతుఁడను. సుఖము గలవాఁడను. ధనవంతుఁడను. గొప్పవంశమువాఁడను. నాతోసాటివాఁ డెవ్వఁడును లేఁడు. నేనే యజ్ఞమును జేయువాఁడను. దానము చేయువాఁడను. హాయిగా నుండువాఁడను?" అని పలురీతులుగా నవివేకమునఁ దలంచుచుఁ బెక్కుచిత్తవిభ్రాంతుల నొందుచు మోహసమూహములకుఁ బాల్పడి కామభోగపరాయణులై యపవిత్రమగునరకమునఁ బడుచుందురు. మఱియును వారు తామే యుత్తమగుణముగలవారమని తలంచి గర్వితులై ధనమానమదములతో దంభపూరితముగా శాస్త్రవిరుద్ధముగా యాగము లొనర్చుచుందురు. అహంకారము ఇతరులను బరిభవించునట్టి బలము,

గర్వము, కామము, క్రోధమును బూని యాత్మదేహములందును బర దేహములందు నున్న నన్ను ద్వేషించుచు నసూయవహించుచుందురు. అటులు నన్ను ద్వేషించునట్టి క్రూరు లగు నా నరాధములను దుఃఖకరము లగు నాసురయోనులందు జనించునట్టుగా నెల్లపుడును సంసారము లందుఁ బడఁద్రోయుచుందును. అటులు వారాసురయోనులందే మఱి మఱియు జనించుచు మూఢులై నన్నుఁ బొందఁజాలకుండుటను నధో గతి నొందుచుందురు. ఆత్మనాశక మగునరకద్వారము మూఁడువిధము లుగా నుండును. అయ్యవి కామ క్రోధ లోభము లనునవియే. కావున నమ్మూఁడిటిని బరిత్యజింపవలయును. ఓయర్జునా! నరకద్వారము లగు నమ్మూఁడిటిని విడిచినవాఁడు తన శ్రేయమును సంపాదించుకొని యుత్తమ గతి నొందుచుండును. అటులుగాక శాస్త్రవిధుల నతిక్రమించి తనయిచ్ఛ వచ్చినట్టు లెవ్వఁడు ప్రవర్తించునో వానికి సిద్ధిగాని, సుఖముగాని, యుత్తమగతిగాని గలుగనేరదు. కావున నీకుఁ గర్తవ్యాకర్తవ్యము లను నిశ్చయించుటలో శాస్త్రమే ప్రమాణముగాఁ గలదు. అటులగు టను శాస్త్రోక్తమగు మార్గమును దెలిసి కర్మము లొనర్పుము. అని తెలుప విని యర్జునుఁడు మఱియు నిట్లు ప్రశ్నించెను.

## శ్రద్ధాత్రయవిభాగయోగము

ఓవాసుదేవా! ఎవ్వరు శ్రద్ధగలవారయ్యును శాస్త్రవిధి నతిక్ర మించి యాగము లాచరింతురో వారి కగునవస్థ యెట్టిది ? అయ్యది సాత్వికమా? రాజసమా? లేక తామసమా?

అదివిని యావాసుదేవుఁడు పార్థునితో ఓయర్జునా! ప్రాణులకుఁ గలశ్రద్ధ మూఁడువిధములై యుండును. అయ్యది మరణకాలమున నభి వ్యక్తమగు పూర్వజన్మకృతధర్మాధర్మాదిసంస్కారములవలన జనించునదై, సాత్వికి, రాజసి, తామసి యన వెలయుచుండును. దానిం దెలిపెదను వినుము. సత్వానురూపమై యెల్లవారికి శ్రద్ధయగుచుండును. ఈపురు షుఁడు శ్రద్ధామయుఁడు. ఎవని కెట్టిశ్రద్ధగల్గునో వాఁడట్టివాఁడగును. సాత్వికులు దేవతలను యజింతురు. రాజసులు యక్షులను, రక్షస్సులను నారాధింతురు. తామసులగుజనులు భూతప్రేతగుణములను బూజింతురు. శాస్త్రవిహితముగాకుండ నెవ్వరు ఘోర మగుతప మొనర్తురో దంభా

హంకారములుగల్గి కామరాగబలమునకు లోఁగి యవివేకులై శరీర మందున్న భూతసమూహమును బీడించుచు శరీరాంతర్గతుఁడ నగు నన్నును బీడించువారగుదురు. అసురనిశ్చయు లగునట్టివారే తామసు లని తెలియుము. ఎల్లవారికి నాహారముసైతము త్రివిధమై యుం డును. అటులే యజ్ఞము, తపము, దానమును భిన్నములుగా నుండును. వానిభేదములను దెలిపెదను వినుము. ఆయువు, సత్వము, బలము, ఆరోగ్యము, సుఖము, ప్రీతి యనువానిని వర్ధిలఁజేయు నట్టియు రసవంతములై చమురుగలిగి చిరకాలమునఱకు నుండఁదగి నవై మనోహరములగునవి సాత్వికులయాహారములు. కటువులు మిక్కిలి పుల్లనివి, మిక్కిలి యుప్పనివి, మిక్కిలి వేఁడిమిగలవి, తీక్ష్ణ ములు, కఠినములు, దప్పిగలిగించునవియునై దుఃఖమును, శోకమును, ననారోగ్యమును గల్గించునాహారములు రాజసులకుఁ బ్రియములై యుండును. సరిగా నుడుకనివి, రసము చెడినవి, దుర్గంధముగలవియుఁ దొలినాఁటివి, యెంగిలివి, యపవిత్రములు నగునాహారములు తామసు లకుఁ బ్రియములైనవి. ఫలాపేక్ష విడిచి చేయఁదగినది యనిమాత్రమ మనసువెట్టి శాస్త్రీయముగా నేయాగ మొనర్పఁబడునో యది సాత్విక యజ్ఞము. ఏదే నొకఫల మపేక్షించి దంభముగా నేయాగ మొనర్పఁ బడునో యది రాజసయజ్ఞ మనఁబడునని తెలియుము. శాస్త్రహీనమై యన్నదానములేక మంత్రరహితమై దక్షిణ లొసంగఁబడక, శ్రద్ధా శూన్యముగా నొనర్పఁబడినయాగము తామసమని నుడువఁబడుచున్నది. దేవతలను, బ్రాహ్మణులను, గురువులను, బ్రాజ్ఞులను బూజించుటయు, శుచిత్వము, ఋజుబుద్ధి, బ్రహ్మచర్యము, అహింస అనునవి శారీరతప మనఁబడుచున్నవి. ఒకరి కుద్వేగముగల్గింపక సత్యమై, ప్రియమై, హిత మై వెలయువచనమును, వేదాభ్యాసమును, వాఙ్మయతప మనఁబడును. మనోనైర్మల్యము, సౌమ్యత, మౌనము, మనోనిగ్రహము, భావశుద్ధి అనునవి మానస మగుతప మనఁబడుచుండును. మానవులు మిక్కిలి శ్రద్ధతో నొనర్చెడితపము మూఁడువిధములై యుండును. ఫలాపేక్ష విడిచి, సమాహితచిత్తు లగువారిచేఁ జేయఁబడుతపము సాత్వికము. దంభ ముతో సత్కార, మాన, గౌరవములకుఁగా నొనరింపఁబడినతపము రాజ సము. అది యస్థిరమై నశించునది. తనకు బాధగల్గుచున్నను మొండిపట్టు

దలతో నెయ్యది యాచరింపఁబడునో యితరహింసాకరమగు నయ్యది తామసతప మనఁబడుచున్నది. ఒకనివలన నుపకార మపేక్షింపక మంచి దేశకాలపాత్రముల ననుసరించి దాన మొనర్పవలయు ననెడిపూనికతోడనే చేయంబడునది సాత్వికదాన మనఁబడును. ఒకనివలన నుపకార మపేక్షించిగాని లేక వేఱొకఫల మపేక్షించిగాని, కష్టముగాఁ జేయఁబడునది రాజసదాన మనఁబడును. ఉచితము లగు దేశములు లేక, యపాత్రులకుఁగా వారియెడ గౌరవము లేకుండుటయేగాక యవమానపూర్వకముగా నొనర్పంబడుదానము తామస మనఁబడును. "ఓమ్ తత్ సత్" అని బ్రహ్మనిర్దేశము, మూఁడువిధములుగాఁ జెప్పబడియున్నది. ఆనిర్దేశముతోడనే బ్రాహ్మణులును, వేదములును, యజ్ఞములును, మున్ను నిర్మింపఁబడియెను. కాఁబట్టి "ఓమ్"అను నుచ్చారణముగల్గియే శాస్త్రోక్తములైన బ్రహ్మవాదుల యజ్ఞదానతపఃక్రియలెల్లఁ బ్రవర్తిలుచుండెడివి. "తత్" అని ఫలమును గోరక యజ్ఞదానతపఃక్రియలు ముక్తికాము లగు వారిచే వివిధముగాఁ జేయఁబడుచుండెడివి. సాధుభావమందును, సద్భావమందును, "సత్" అనునది సత్కర్మములందుఁ బ్రయోగింపఁబడుచున్నది. కావున "సత్" అనుశబ్దము ప్రయోగింపఁదగియున్నది. యజ్ఞము, తపము, దానము అనువీనియందు స్థితి 'సత్' అనఁబడును. తదర్థమగుకర్మమును "సత్" అనుపేర నొప్పును. శ్రద్ధను విడనాడి చేసిన హోమము దానము తపమును "అసత్" అనఁబడును. దానిచే నిహపరములు రెండును లేవు అని తెలుప విని యర్జునుం డిట్లనియె.

## సన్న్యాసయోగము

ఓదేవా! సన్న్యాసతత్త్వ మెట్టిది? త్యాగతత్త్వ మెట్టిది? ఆరెంటిటికినిగల విభాగ మెట్టిది? నా కెఱింగింపుము.

అది విని యాదవనజాతుఁ డాయర్జునుం జూచి ఓయీ! కామ్యము లగుకర్మములను బరిత్యజించుటయే సన్న్యాసమని పండితులు తెలుపుదురు. సకలకర్మఫలపరిత్యాగము త్యాగమని ప్రాజ్ఞులు నుడువుచున్నారు. దోషయుక్త మగుకర్మమును విడువవలయునని కొందఱును, యజ్ఞదానతపః కర్మములు కర్తవ్యములని మఱికొందఱును దెలుపుదురు. అట్టిత్యాగమున నిశ్చయ మెయ్యదియో తెలిపెదను వినుము. ఓపురుషవరా!

త్యాగమనునది ముత్తెఱఁగులుగలదై యున్నది. యజ్ఞము, దానము, తపము అనుమూఁడును జేయఁదగినవిగాన వానిని విడువరాదు. అయ్యవి మనీషులను బావనులఁగా నొనర్చునవి. వీనినిసైతము సక్తివిడిచి ఫలాపేక్షలేకయే యొనర్పవలెనని నిశ్చితమగు నాయుత్తమాభిప్రాయము. నిత్యకర్మములను బరిత్యజింపరాదు. అవివేకముచే వానిని బరిత్యజించిన నది తామసత్యాగ మనఁబడును. కాయక్లేశములచేఁ గష్టమగునని వెఱచి కర్మత్యాగ మొనర్చినచో నది రాజసత్యాగ మనిపించుకొనును. అట్టి త్యాగముచేఁ ద్యాగఫలము లభింపఁజాలదు. ఇది యొనర్పవలసినదని తలంచి యేనిత్యకర్మము సంగరహితముగను, ఫలాపేక్షారహితముగను నొనర్పఁబడునో యట్టిత్యాగము సాత్వికత్యాగ మనఁబడును. ఎవ్వఁడు సత్వముగలవాఁడును, ద్యాగశీలియు, బుద్ధిశాలియు, సంశయరహితుఁడును నగునో వాఁడశుభకర్మములందు ద్వేషమును, శుభకర్మములందు వాంఛను నొనర్పఁడు. దేహధారు లగువారికిఁ గర్మములన్నిటిని విడుచుట యెన్నఁడును బొసఁగనేరదు. కర్మఫలత్యాగ మొనర్చువాఁడే త్యాగి యనఁబడుచున్నాఁడు. అనిష్టము, ఇష్టము, మిశ్రము అని మూఁడువిధములై యుండెడికర్మఫలము త్యాగహీను లగువారికి మరణానంతరమునఁ గల్గును. అది త్యాగవంతుల కెన్నఁడును గలుగదు. సకలకర్మఫలములొందుటలో సాంఖ్యసిద్ధాంతమున నధిష్ఠానము కర్త పలువిధము లగుకరణములును, భిన్నములై పలువిధము లగుచేష్టలును నైదవ దగుదైవము ననెడియైదును గారణములుగాఁ దెలుపఁబడియెను. ఈయైదింటిని దెలియునట్టి మనుజుఁడు శరీరము, మనస్సు, వాక్కు-ననెడివానిచే న్యాయ్యముగాని యన్యాయ్యముగాని యగుకార్య మొనర్ప నారంభించునపుడు దాని కీయవి హేతువు లగుచుండును. అది యటు లగుచుండఁగా వివేకహీనుఁడై యెవ్వఁ డాత్మను గేవలము కర్తగాఁ దలంచునో యట్టిదుర్మతి తత్త్వమును జూడనివాఁ డగుచున్నవాఁడు. ఎవ్వనిభావ మహంకారరహితమై యుండునో, ఎవ్వనిబుద్ధి కర్మఫలము నంటదో వాఁడు ప్రాణులను గొట్టియుఁ గొట్టనివాఁ డగుచున్నాఁడు. వానికి బంధమును గలుగనేరదు. తెలివియుఁ, దెలియఁదగిన వస్తువు, తెలియునదియు నని కర్మవిధులు మూఁడువిధములై యుండును. కరణము, కర్మము, కర్త, యను నీమూఁడును గర్మసంగ్రహములు.

జ్ఞానము, కర్త, కర్మము అని గుణభేదముచే మూఁడువిధము లగునని గుణసంఖ్యానమునఁ దెలుపఁబడుచున్నది. వానిని దెలిపెదను వినుము. భిన్నభిన్నములై యున్న యెల్లభూతముల దేహములందును నవ్యయమై యొక్కటిగానున్న యాత్మవస్తువు దేనిచేఁ దెలియనగుచున్నదో యట్టి జ్ఞానము సాత్త్విక మనఁబడుచున్నది. పెక్కువిధములై పెక్కుభావములను నెల్లప్రాణులందును దేనిచే భిన్నభిన్నములుగాఁ గాంచనగునో యట్టిజ్ఞానము రాజస మనఁబడుచున్నది. యుక్తిరహితమై తత్త్వార్థము గలదిగాక యల్పమై యేజ్ఞాన మొకకార్యమునందు సమస్తమందువలె సక్త మగుచుండునో యది తామసజ్ఞాన మనఁబడుచున్నది. ఫలాపేక్షను విడిచి రాగద్వేషశూన్యముగా సక్తుఁడుగాక యొనర్చిన నిత్యకర్మము సాత్త్విక మనఁబడును. కోర్కెగలిగి యహంకారముతో మిక్కిలి యాయాసముగా నేకర్మ మాచరింపఁబడునో యది రాజసకర్మ మనఁబడును. వెనుక నగుదానిని ధనక్షయమును, బ్రాణిపీడను దలంపక తన శక్తిని విమర్శింపక యవివేకముచే నేమది చేయఁబడునో యది తామసకర్మ మనఁబడును. సంగరహితుఁడై యహంకారములేక ధైర్యోత్సాహములుగలిగి సిద్ధియందును, నసిద్ధియందును మోదఖేదవికారములు లేని కర్త సాత్త్వికుఁ డనఁబడును. రాగము గల్గి కర్మఫలాపేక్షను విడువక ధనలుబ్ధుఁడై హింసాపరుఁడును నశుచియునై ఖేదమోదములకు వశుఁడగుకర్త రాజసకర్త యనఁబడును. సమాహితచిత్తుఁడుగాక బాలప్రాయుఁడై వినయరహితుఁడును, వంచకుఁడును, బరవిభేదనపరుఁడును, సోమరియు, శోకశీలుఁడును, దీర్ఘసూత్రియు నగుకర్త తామసకర్త యనఁబడును. బుద్ధి, భేదము, ధృతిభేదమును, గుణమునుబట్టి త్రివిధమై యుండును. ఓధనంజయా! దానిని సమగ్రముగను, సవివేకముగను దెలిపెదను వినుము. ప్రవృత్తియు, నివృత్తియుఁ, గార్యము, అకార్యము, భయము, భయరాహిత్యము, బంధము, మోక్షము అనువాని నెయ్యది తెలిసికొనునో యదియే సాత్త్వికబుద్ధి. ఓపార్థా! దేనిచే ధర్మాధర్మములును, గార్యాకార్యములును యథార్థముగాఁ దెలియరాకుండునో యదియే రాజసబుద్ధి. ఏబుద్ధి తమోవృత్తమై యధర్మమును ధర్మముగను, సర్వపదార్థములను దలక్రిందుగను గాంచునో యదియే తామసబుద్ధి. ఏధృతిచే మనఃప్రాణేంద్రియవ్యాపారము

లను ధరించునట్టి యవ్యభిచరిత మగు యోగము నవలంబింపనగునో యట్టి ధృతి సాత్త్వికి యనఁబడును. ఓయర్జునా! దేనిచే ధర్మార్థకామాసక్తుఁడై ఫలములను గాంక్షించునో యది రాజసధృతి యనఁబడును. దేనిచే నిద్రాభయములును, శోకవిషాదములును, మదము ననునవి తొలఁగింపఁబడకుండునో దుష్టమగునది తామసధృతి యనఁబడును. ఓపార్థా! ఇఁక మూఁడువిధము లగుసుఖములవిధ మెఱిఁగించెదను వినుము. అభ్యాసవశమునఁ దత్సుఖమందే తవిలి దుఃఖమును దొలఁగించుకొననగును. తొలుత విషముగ నుండియుఁ దుది కమృతతుల్యమై యాత్మకును బుద్ధికిని నైర్మల్యము నొసఁగునట్టిసుఖము సాత్త్వికసుఖ మనఁబడును. విషయేంద్రియములకుఁ గలసంబంధముచే నమృతసమమై తుదికి విషముగాఁ బరిణమించుసుఖము రాజససుఖ మనఁబడును. తొలుతను బిమ్మటను నాత్మను మోహింపఁజేయునదై నిద్రాలస్యప్రమాదములచే జనించిన సుఖము తామససుఖ మనఁబడును. ప్రకృతివలనఁబుట్టిన సత్త్వరజస్తమోగుణములచే విడువఁబడినప్రాణి పుడమిని మానవులందుఁగాని, స్వర్గమున దేవతలందుఁగాని లేఁడని చెప్పవచ్చును. ఓయర్జునా! బ్రాహ్మణక్షత్త్రియవైశ్యశూద్రకర్మములును, బ్రకృతివలన జనించినగుణములచే వేఱువేఱుగా నేర్పఱుపఁబడియున్నవి. శమము, దమము, తపము, శౌచము, క్షమ, ఋజుబుద్ధి, జ్ఞానము, విజ్ఞానము, ఆస్తిక్యము అనియెడిస్వభావజనితము లగుకర్మములు బ్రాహ్మణములు. శౌర్యము, తేజము, ధైర్యము, సమర్థత, యుద్ధమున భయాదులచేఁ బఱవెత్తకుండుట, దానము, ప్రభుత్వము అనెడిస్వభావజనితము లైనకర్మములు క్షాత్త్రకర్మములు. వ్యవసాయము, గోరక్షణము, వర్తకము అనెడిస్వభావజనితము లైన కర్మములు వైశ్యకర్మములు. స్వభావజమైన వర్ణత్రయమువారిపరిచర్య శూద్రకర్మము. ఓపార్థా! బ్రాహ్మణాదులు తమతమకర్మములం దాసక్తులై సిద్ధిపడయుచుందురు. ఇఁక నిజకర్మనిరతుఁ డగువాఁడు సిద్ధినొందువిధ మెట్టిదో తెలిపెదను వినుము. భూతములప్రవృత్తి దేనివలన గల్గుచుండునో ఎయ్యది యెల్లెడల వ్యాపించి యున్నదో యద్దానిని నిజకర్మముచే నారాధించి మానవుఁడు సిద్ధినొందుచున్నాఁడు. సరిగా నొనర్చిన పరధర్మముకంటె విగుణమైనను నిజధర్మము శ్రేయస్కరము. సహజమై తనకు నియత మగుకర్మము నాచరించువారు పాపము నొందరు.

సహజ మగుకర్మము దోషముగలదైనను దానిని విడువరాదు. పొగచే నగ్నివలె సర్వారంభములును దోషములచే నావరింపబడియే యుండును. మఱియు దేనియందును బుద్ధి సక్తము గాకుండ నొనర్చి మనోనిగ్రహముచేఁ గోర్కులనెల్లఁ బరిత్యజించినవాఁడై సన్న్యాసమొనర్చినచో నుత్తమమై కర్మ రాహిత్యరూపమగుసిద్ధి నొందగల్గుచున్నాఁడు. ఎటులు సిద్ధినొంది బ్రహ్మము నొందఁగల్గునో యట్టి యుత్తమ మగుజ్ఞాననిష్ఠను, సంగ్రహముగా నెఱింగించెదను వినుము. విశుద్ధ మగుబుద్ధిగలిగి ధృతిచే నాత్మను నియమించి శబ్దాదు లగువిషయములను విడిచి రాగద్వేషములను జేరనీక నిర్జనప్రదేశమున నివసించువాఁడై లఘ్వాహారియు, మనోవాక్కాయములను నియమించువాఁడును నై కేవలము ధ్యానయోగపరుఁడై విరక్తిగలిగి యహంకారమును బరపరిభవకారి యగుబలమును, గర్వమును; గామక్రోధములను, బరిగ్రహమును బరిత్యజించి మమకారరహితముగా శాంతి నెవ్వఁడు వహించునో వాఁడు బ్రహ్మత్వమున కర్హుఁడగుచున్నాఁడు. అటులు బ్రహ్మభూతుఁ డగువాఁడు ప్రసన్నచిత్తుఁడై శోకమును గాంక్షను విడిచి సకలప్రాణులందును సమబుద్ధిగలిగినచో నుత్తమ మగు నాభక్తిని బొందుచున్నాఁడు. భక్తిచే నేనెంతవాఁడనో ఎట్టివాఁడనో యనువిషయమును యథార్థముగాఁ దెలిసికొని యటులు తెలియుటచే నన్నొందుచున్నాఁడు. సకలకర్మములను జేయుచుండియు నాయందే సర్వభావముల నర్పించినచో నాయనుగ్రహముచే నవ్యయమై శాశ్వత మగుపదము నొందఁగల్గుచున్నాఁడు. కర్మములనెల్ల మనఃపూర్వకముగా నాకర్పించి మదేకనిష్ఠుఁడై బుద్ధియోగము నాశ్రయించి నాయందే చిత్తము గల్గియుండుము. అటులు నాయెడఁ జిత్తముంచినవాఁడు నాయనుగ్రహముచే నెట్టికష్టములనైనను బోఁగొట్టికొనఁగలఁడు. ఓయర్జునా! అటులుగాక యహంకారముచే నామాట లక్ష్యపెట్టవేని చెడుదువు. నీవహంకారముచే నామాటఁ ద్రోసి యుద్ధముసేయవేని యీ నీనిశ్చయమెల్ల వ్యర్థమగును. నీక్షాత్త్రప్రకృతియే నిన్ను నియోగించును. ఓపార్థా! నీకు సహజమగుకర్మమునకు బద్ధుఁడవుగమ్ము. ఒకపు డవివేకముచే దానిని జేయఁదలంపకున్నను వశముతప్పియైన నీవు దానిని జేయక తప్పదు. ఓయర్జునా! సర్వప్రాణులహృదయములందునుండి యాయీశ్వరుఁడే తనమాయచే వానిని యంత్రా

రూఢునిఁగా నొనర్చి త్రిప్పుచుండును. కావున వానినే నీవు శరణునొందుము. అటులేని వానియనుగ్రహముచే నుత్తమశాంతినొంది శాశ్వతపద మొందుదువు. ఓపార్థా! రహస్యములలో రహస్య మగునీజ్ఞానమును నేను నీకెఱిఁగించితినిగదా! దీనినెల్ల విమర్శించి నీయిచ్చవచ్చినటు లొనర్పుము. మఱియు నెంతయు రహస్య మగు మఱియొకవచనమును నీవు నాకెంతయుఁ బ్రియుఁడవగుటచే నీకది హితమగునని తలంచి తెలిపెదను వినుము. నాయందే మనసునుంచి నాకు భక్తుఁడవై నన్నే పూజించుచు నాకు నమస్కరింపుము. అటులేని నీవు నన్నొందుదువు. ఇందులకు సందియములేదని ప్రతిన చేయుచున్నాఁడను. నీవు నాకిష్టుఁడవు గదా! ఎల్లధర్మములను విడిచి నన్నొక్కనినే శరణునొందుము. నేను నిన్నెల్లపాపములనుండియు విడిపించువాఁడను. ఇఁక శోకింపకుము. ఓయర్జునా! ఈపరమరహస్యమును దపోహీనునకును, నాయెడ భక్తిలేనివానికిని, వినఁగోర్కిలేనివానికిని, నాయెడ నసూయసేయువానికిని నొకపుడును దెలుపరాదు సుమీ! నాయం దెంతయు భక్తిగలిగి పరమ రహస్యమగుదీని నెవ్వఁడు నాభక్తుల కుపదేశించునో వాఁడు నన్నే పొందఁగల్గును. ఇందులకు సందియములేదు. మానవులలో నట్టివాని కంటెఁ బ్రియుఁడు నాకెవ్వఁడును లేఁడు. మఱియు వానికంటె నాకుఁ బ్రియమొనర్పువాఁ డింకను వేఱొకఁడు గలుగఁడు. ధర్మయుక్త మగు నీమనసంవాదము నెవ్వఁ డధ్యయన మొనర్చునో వాని జ్ఞానయజ్ఞ మగు నట్టియధ్యయనముచే నేనెంతయుఁ బ్రీతినొందువాఁడనని నాయభిప్రాయము. మఱియు నసూయవడక శ్రద్ధమై దీని నెవ్వఁడు వినునో వాఁడు పాపములనుండి విడివడి పుణ్యకర్ము లగువారి శుభలోకముల నొందఁగల్గుచున్నాఁడు. ఓపార్థా! నీవు దీని నేకాగ్రచిత్తుఁడవై వింటివా? నీయజ్ఞాన ముడఁగెనా? అని పలికెను.

అదివిని యాయర్జునుఁడు "ఓదేవా! నీయనుగ్రహముచే నాయవివేకము నశించినది. ఆత్మస్మృతిలాభము గల్గినది. ఇప్పటికి సందేహము తీఱినది. ఇఁక నీశాసనమం దుండువాఁడను" అని పలికెను.

ఓయాంబికేయా! ఇటు లావాసుదేవునకును వాసవనందనునకును జరిగినసంవాదమును వింటిని. అది విన నెంతయు నద్భుతమై నామేన గగురుపా టొదవెను. ఇది మిక్కిలి రహస్యమైనను వ్యాసునను గ్రహ

ముచే నే నాయోగిపుంగవుఁ డగుభగవానుఁడు తనంతఁ దాఁ జెప్పిన విషయమును వినఁగల్గితిని. ఓరాజా! అద్భుత మగు నీకేశవార్జునుల పవిత్రసంవాదమును మఱిమఱియు స్మరించి మాటికిని సంతసించుచున్నాఁడను. మఱియు నాహరి యద్భుతరూపమును మాటికిని స్మరించియు నాకెంతయు నాశ్చర్య మొదవ మిక్కిలి సంతసించుచున్నవాఁడను. యోగీశ్వరుఁ డగుకృష్ణుఁడును, ధనుర్ధరుఁ డగునర్జునుఁడు నెందుందురో యందు సిరియు, విజయము, స్థిరమగుసంపదయు, నీతియుఁ గల్గునని నాయభిప్రాయము." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

ధర్మరాజు భీష్మద్రోణకృపశల్యుల కభివాదన మొనర్పఁ బోవుట

"ఓరాజా! గాండీవమును బాణములను ధరించియున్న యాధనంజయుం జూచి మఱల మహారథులెల్ల సింహనాదము లొనర్చిరి. పాండవులును, సృంజయులును, వీరి ననుసరించి వెడలినవీరులును, సముద్రమునఁ బుట్టిన శంఖములను బూరింప నారంభించిరి. అంతట భేరులు, బూరగొమ్ములు, కాహళములును, జయమంగళములు ననియెడివాద్యవిశేషము లొక్కుమ్మడి మ్రోగింపఁబడెను. అచప్పుడు సమ్మర్దముగా నుండెను. పిదప గంధర్వులును, దేవతలును, పితృదేవతలును, సిద్ధులు, చారణులును నాయుద్ధమును దిలకింప నెంచి యచ్చోట వచ్చియుండిరి. మహాభాగులగు ఋషు లింద్రుని ముందిడుకొని యామహాయుద్ధము నారయఁ గోరి యందొకచో సమీపించి యుండిరి. పిదప నాధర్మజుఁడు యుద్ధసన్నద్ధములై యుత్సాహముతో సాగరమువలె నెంతయుఁ జలించు నారెండుసైన్యములను జూచి కవచమును విప్పి తనయాయుధము నొకచో నుంచి రథమునుండి కడువడిగా దిగి కాలినడకతోఁ గృతాంజలియై భీష్ము నీక్షించి శత్రుసేనల కెదురుగా మౌనమువహించి వెడలెను. అటులు వెడలినయన్నను జూచి యర్జునుఁడును రథముడిగి తనతక్కినసోదరులంగూడి యాధర్మజు ననుసరించి వెడలెను. ఓరాజా! వాసుదేవుఁడును బిదప వారివెంటనంటి బయలువెడలెను. మఱికొందఱు ముఖ్యులగురాజులును సోత్సాహులై యాతని ననుసరించిరి. ఇంక వారి ప్రసంగములను వినుము.

అర్జునుఁడు:—ఓరాజా! ఇటులు మమ్మెల్ల విడిచి కాలినడకతో శత్రుసేన కెదురుగా నేల వెడలితివి? నీయుద్దేశ మేమి?

భీముఁడు:—ఓరాజేంద్రా! కవచము నాయుధమునువిడిచి నీసోదరులను దిగనాడి కవచములను దొడిగికొనియున్న శత్రుసైన్యములలోని కేల పోయెదు?

నకులుఁడు:—ఓరాజా! జ్యేష్ఠభ్రాతవగు నీవిటులు బయలువెడలుట కెంతయు మనభీమునిహృదయము పరితపించుచున్నది. నీ వెందుల కేగెదవో తెలుపుము.

సహదేవుఁడు:—ఓరాజా! మహాభయంకరమై యీరణసన్నాహ మిటులు ప్రాప్తింపఁగా మమ్ములను విడిచి శత్రుల కభిముఖముగా నెందుఁ బోయెదు?

ఓయాంబికేయా! సోదరు లిటులు పలుకఁగా వినియు నేమియు బదులు వలుకక మఱియు నతఁడు పోవుచుండెను. అపుడు మహాప్రాజ్ఞుఁడును, గంభీరమానసుఁడు నగువాసుదేవుఁ డాధర్మజునియింగిత మెఱింగినవాఁడువలె నవ్వుచు, "ఇతఁడు పూజ్యు లగుభీష్మద్రోణకృపశల్యుల యనుమతిని గొని పిమ్మట శత్రులతో యుద్ధముచేయఁగలఁడు. ఎవ్వఁడు గురువులయు, వృద్ధులయు, బంధువులయు ననుమతిని యథావిధిగా ముందొంది మహత్తరు లగువారితో యుద్ధమొనర్చునో వాని కాయుద్ధమునఁ దప్పక జయమగును అని పూర్వకల్పమునఁ బ్రసిద్ధమైయున్న విషయము నితఁడు గమనించి యుండునని నాయభిప్రాయము." అని కృష్ణుఁడు పలుకుచుండఁగా గౌరవసైన్యమున గొప్పయాహాకారము జనించెను. కొందఱు నిశ్శబ్దముగా నుండిరి. కౌరవసేనావీరులు ధర్మజు నారసి పరస్పర మిటులు సంభాషించుకొనసాగిరి. "ఆహా! క్షత్రియకులపాంసనుఁ డగునీధర్మజుఁ డెంతయు భయపడినవాఁడువలె భీష్మునికడకు వచ్చుచున్నవాఁడు. ఇతఁడు తనసోదరులంగూడి భీష్ముని శరణువేఁడ వచ్చియుండును. సమర్థుఁ డగునర్జునుఁడును, భీముఁడును, నకులసహదేవులు నుండఁగా నీతఁ డిటులు భీతినొందుటేల? నిజముగా వీఁడు క్షత్రియ వంశమున జనించినవాఁడు గాఁడు. యుద్ధము ప్రాప్తింపఁగా నల్పబలుఁడగు నీతనిహృదయమున భయము జనించియుండవచ్చును."

అంత నీసైనికులెల్లఁ గౌరవులను బ్రశంసింప సాగిరి. మఱియు సంతుష్టాంతరంగులై తమతమవస్త్రాంచలములఁ ద్రిప్ప నారంభించిరి. నీ యోధులందఱును ధర్మజుని, నాతనిసోదరులను, వాసుదేవునిఁ దూల

నాడిరి. పిమ్మట నీసైన్యమువారు ధర్మజుని "ఛీఛీ" యని తూలనాడి మఱల నిశ్శబ్దముగా నుండిరి మఱియు నపు డం దుభయసైన్యముల వారికిని ధర్మరా జేమి చెప్పునో; దానికి భీష్ముఁ డేమి బదులు పలుకునో? యుద్ధప్రియుఁ డగు భీముఁ డేమనునో! కృష్ణార్జును లేమి పలుక నెంచి యున్నవారో! అను గొప్పసంశయము గలిగెను. ఓరాజా! అంత నా యుధిష్ఠిరుఁడు తనసోదరులంగూడి యుద్ధసామగ్రిచే వెలుపుగొలుపు మన సైన్యమును బ్రవేశించి కడువడిగా భీష్మునికడ కేగి యాతనిపాదములపైఁ బడి యటులు యుద్ధసన్నద్ధుఁడై వచ్చియున్నయాతనితో "ఓతాతా! ఎవ్వరికి నోరువరానినీతో మేమిపుడు యుద్ధముసేయ సమకట్టి యందు లకై నీసెలవుగొన వచ్చితిమి. ఆవిషయమున నీవంగీకరింపవలయును. మమ్మాశీర్వదింపవలయును." అని పలికెను.

అది విని భీష్ముఁడు ధర్మజునితో "ఓరాజా! ఇట్లు నీవు నాకభివం దన మొనర్పకుందువేని నిన్నుఁ బరిభవమునకుఁ బాత్రునిఁగా శపి యించి యుందును. నీవిటులు వచ్చినందులకు సంతసించితిని. యుద్ధమొన ర్పుము. జయము గాంతువు. ఇదియుఁగాక యీయుద్ధమున మఱియే కోర్కినైనఁ బొందఁగలవు. ఓధర్మజా! నానుండి యింకేదేని వరము గోరుదేని కోరికొనుము. అట్లైన నీకుఁ బరాజయము గలుగదు. ఓరాజా! అర్థమునకుఁ బురుషుఁడు దాసుఁడగునుగాని, యర్థ మెవ్వని కిని దాస్యమొనర్పదుగదా! అటులగుట నిజముగాఁ గౌరవుల యర్థ ముచే నేను గట్టువడితిని. కావున నాకిటులు నిస్సారముగాఁ బలుకవలసి వచ్చెను. యుద్ధవిషయమున గౌరవులయర్థమునకుఁ గట్టువడియుండుటచే దీనిని దప్ప మఱియేది కోరినను గోరవచ్చును.

యుధిష్ఠిరుఁడు:—ఓమహాప్రాజ్ఞా! ఎల్లపుడు నా మేలుకోరుచు, నా కాలోచన చెప్పుచుండుము. కౌరవులపక్షమున నీవు పోరాడవచ్చును. కాని యిదియే నీవు మాకొసంగఁదగినవరము.

భీష్ముఁడు:—రాజా! ఒకరికిఁగా నేను బోరాడక తప్పదు. ఇపుడు నేను నీకుఁ జేయవలసినసాహాయ్య మెద్ది? నీ వేమి చెప్పఁదలంచితివి?

యుధిష్ఠిరుఁడు:—ఓపితామహా! అటులగుటనే నిన్నొకటియడుగు చున్నాఁడను. నీకిదె నమస్కారము. దుర్జయుఁడవగునిన్ను మేమీయుద్ధ

మున జయించుటెట్లు? మాశ్రేయము గోరుదేని మాకిందు హితమెఱిఁగింపుము.

భీష్ముఁడు:—ఓరాజా! అదియే నాకుఁ దెలియదు. రణరంగమున యుద్ధమొనరించుచున్నా యింద్రుఁడైనను నోడింపఁజాలఁడన మానవుఁడు నన్నెటు లోడింపఁగలఁడు ?

యుధిష్ఠిరుఁడు:—అయ్యో! అటులగుటనే నిన్నడుగవలసివచ్చినది. నీకునమస్కారము. సమరమున శత్రుల కీవెటులు వశుఁడవై హతుఁడవగుదువో యట్టియుపాయ మెఱిఁగింపుము.

భీష్ముఁడు:—ఓరాజా! సమరమున నన్నెవ్వఁడు జయింపగల్గునో స్ఫురింపకున్నది. నాకు మృత్యువులేదు. కావున మఱల రమ్ము పొమ్ము" అని పలికెను.

ఓయంబికానందనా ! పిమ్మట నాధర్మరాజుఁ డాభీష్మునివచనము శిరసావహించి మఱియు నమస్కారమొనరించి ద్రోణునిరథమును సమీపించెను. అతఁ డటులరిగి సైన్యములెల్లఁ జూచుచుండఁగా వారినడుమను దనసోదరులతో వెడలి యాద్రోణున కభివందన మొనర్చి పిదపఁ బ్రదక్షిణమొనరించి తనకు శ్రేయస్కరముగా నాతనితో నిట్లనియె.

యుధిష్ఠిరుఁడు:—ఓబ్రాహ్మణోత్తమా! దుర్జయుఁడవగు నీతో యుద్ధముచేయ నెంచి నీయనుమతినొంది కలుషము లేనివాఁడ నయ్యెదను. నీ యాజ్ఞనొందక యెల్లరిపులను నేనెట్లు జయింపఁగలను?

ద్రోణుఁడు:—ఓరాజా ! నీవు యుద్ధనిశ్చయమొనర్చి నన్ను మున్నుగా వచ్చి చూడకుంటివేని, యెల్లవిధముల నీకుఁ బరాభవమగునటులు శపియింపవలసినదే. నీవిటులు నన్ను గౌరవించినందులకుగా సంతుష్టుఁడనైతిని. నీవచన మే నంగీకరించితిని. ఇఁక యుద్ధముసేయుము. జయమొందుదువు. నీవేమిచెప్పఁదలఁచియుంటివో తెలుపుము. నీకోర్కి నీడేర్చెదను. ఇది యటులుండఁగా యుద్ధసాహాయ్యము తప్ప మఱియొకటేదేనిఁ గోరుదువేనికోరుము. అర్థమునకుఁ బురుషుఁడు దాసుఁడుగాని, వాని కది దాస్యమొనర్పదుగదా! ఇటులగుటఁ గౌరవులయర్థమునకు నేనే గట్టువడితిని. కావున యుద్ధవిషయమునఁ దప్ప వేఱొండు కోరికొమ్మని నిస్సారముగాఁ బలికితిని. కౌరవులకుఁగాఁ బోరాడెదను. నీకు జయము నాశీర్వదించెదను.

యుధిష్ఠిరుఁడు:—ఓబ్రాహ్మణవర్యా ! నాకు జయము నాశీర్వదింపుము. మఱియు హితమును దెలుపుము. నీవు కౌరవులపక్షముననే యుద్ధము చేయవచ్చును. ఇదియే నిన్ను నేఁ గోరినది.

ద్రోణుఁడు:—ఓరాజా ! నీకు వాసుదేవుఁడు మంత్రియైయుండఁగా విజయము గల్గుటలో సందియమంద నేటికి ? నీవు శత్రువుల నీ యుద్ధమున జయింపఁగల్గుదువని నేను బ్రతిజ్ఞ చేయుచున్నవాఁడను. శ్రీకృష్ణుఁ డెందుండునో యందు జయము గల్గును. ధర్మ మెందుండునో యందు జయము గల్గును. ఇఁకఁ బొమ్ము. యుద్ధమొనర్పుము. ఇంకను నేఁ జెప్పఁదగినది గలదేని యడుగుము.

యుధిష్ఠిరుఁడు:—ఓద్విజోత్తమా ! నిన్నొకటి ప్రశ్నించెదను. నామనవి వినుము. ఓరువరాని నిన్నోడించు టెట్టులో తెలుపుము.

ద్రోణుఁడు:—ఓరాజా ! నేను యుద్ధముచేయుచున్న యన్నినాళులును నీకు విజయముగలుగఁజాలదు. నీసోదరులంగూడి మున్నుగాఁ గడుపడి నన్నుఁ జంప యత్నింపుము.

యుధిష్ఠిరుఁడు:—ఆహా ! అటులగుటనే నిన్నడిగితిని. నిన్ను మేమువధించునుపాయ మెద్దియో నీవే తెలుపుము. ఓఆచార్యా! ఇదె నీకు నమస్కారము. మఱియు నమస్కరించి యడుగుచున్నాఁడను.

ద్రోణుఁడు:—ఓతండ్రీ! రణరంగమున నిలిచి సన్నద్ధుఁడనై శరవర్షమును వర్షించుచుండఁగా నన్నుఁ బ్రహరించువాని నెందును జూడలేదు. ఓరాజా! మరణమునకు నియతుఁడనై యస్త్రశస్త్రములను విడిచి చైతన్యముదప్పక యున్నంతవఱకు యుద్ధమున నన్నేవీరుఁడును గొట్టఁజాలఁడు. నిజము చెప్పెదను వినుము. నేను రణరంగమున నేదే నొక యప్రియమును వినినచో నపు డస్త్రసన్యాసమొనర్తును. దానిని నమ్మఁదగినవాఁడు తెలుపవలయును. ఇది సత్యము.

ఓవిచిత్రవీర్యపుత్రా! పిమ్మట ధర్మజుఁ డాయాచార్యునివచనములు విని యాతనిసమ్మతిగొని కృపుని కడకేగి యాతనికి నమస్కరించి మఱియుఁ బ్రదక్షిణమొనర్చి నేర్పుమై నిట్లనియె.

యుధిష్ఠిరుఁడు:—ఓగురువర్యా!నీయనుమతినొందియుద్ధ మొనర్చి నిర్దుష్టుఁడ నయ్యెదను. ఓయనఘా! నీయనుజ్ఞ యైనచో నెల్లరిపులను జయింపఁ గల్గుదును.

కృపుఁడు:—ఓరాజా! నీ విపుడు యుద్ధమునకు నిశ్చయించి, మున్నుగా నాకడకు రాక యుందువేని నిన్ను నేను శపియించి యుందును. దానివలన నీకుఁ దప్పక పరాభవము గల్గెడిది. పురుషుఁడు ధనదాసుఁడగునుగాని ధనము పురుషుని దాస్యము నెన్నఁడు నొనర్పదు. కావునఁ గౌరవులయర్థమునకు బద్ధుఁడనైనవాఁడను. నేను వారికై యుద్ధము చేయవలసియున్నదని నాయభిప్రాయము. కావుననే యుద్ధసాహాయ్యము తప్ప వేఱొండు కోరికొమ్మని నిస్సారముగాఁ దెలుపవలసి వచ్చెను.

యుధిష్ఠిరుఁడు:—ఓయాచార్యా! నీకట్టియభిప్రాయముండుటనే నే నొకటి నిన్నడుగు చున్నవాఁడను.

ఓధృతరాష్ట్రా! ఇటులు పలికి చింతాక్రాంతుఁడై చైతన్యముతప్పిన వాఁడువలె మాటలాడ కూరకుండెను. అంత నాకృపాచార్యుఁ డాయుధిష్ఠిరు నభిప్రాయమును దెలిసికొని, "ఓయీ! నే నెవ్వరికిని వధ్యుఁడను గాను. కావున నీవు పోయి యుద్ధమొనర్పుము. జయమందఁగలవు. నీవిందు వచ్చుటచేఁ బ్రీతుఁడనైతిని. నీకే జయము గల్గునటు లాశీర్వదించువాఁడను. ఈనావచనము సత్యమని నమ్ముము." అని తెలిపెను. అది విని ధర్మజుఁ డాతని సెలవుపడసి శల్యునికడకేగి యాతనికిఁ బ్రదక్షిణనమస్కారమొనర్చి తనకు మేలుగూర్చునట్టివచన మొకటిపలికెను.

యుధిష్ఠిరుఁడు:—ఓమామా! నీయాజ్ఞనొంది యుద్ధమొనర్చు వాఁడను. దానివలన నాదోష మడంగెడిని. నీసెలవయినచో నేను వైరులను జయింపఁగల్గుదును.

శల్యుఁడు:—ఓధర్మజా! నీవు నాకడ కిటులు రాకుందువేని నీకీయుద్ధమున నపజయమగునటులు శపియించియుందును. నీవిటులు వచ్చి నన్ను గౌరవించుటచే, నెంతయు సంతుష్టుఁడనైతిని. నీవేమి కోరెదవో నీకది యగుఁగాక. నేను సమ్మతించితిని. ఇఁక యుద్ధముచేయుము. జయము తప్పక యొందుదువు. ఓవీరవర్యా! నీకు నావలనిప్రయోజన మెట్టిదో తెలుపుము. దానిఁ దీర్చెదను. ఒకయుద్ధసాహాయ్యముదక్క వేఱొండెద్దియైనఁ గోరికొనుము. ధనమునకుఁ బురుషుఁడు దాసుఁడుగాని, ధనము పురుషుని దాస్యమొనర్పదు. కావునఁ గౌరవులు నాయెడఁ జూపినగౌరవరూప మగునర్థమునకు బద్ధుఁడనైతిని. ఓయల్లుఁడా! నీ

కభీప్సిత మగుమనోరథము తీర్చువాఁడను. కావున యుద్ధము తప్ప వేఱొండు కోరుమని నిస్సారముగాఁ బలికితిని.

యుధిష్ఠిరుఁడు:—ఓమహారాజా! ఉత్తమ మగు నాహితము నాలోచింపుము. పరులకై నీవు యుద్ధమొనర్పవచ్చును. కాని నే నీవర మును గోరుచున్నవాఁడను.

శల్యుఁడు:—ఓనృపోత్తమా! నేను నీకేమి సాహాయ్యమొనర్ప వలసియున్నదో తెల్పుము. కౌరవు లర్థము నాకొసఁగి నన్నుఁ గోరుటను పరులకై పోరాడక తప్పదు.

యుధిష్ఠిరుఁడు:—ఓమామా! ఉద్యోగసమయమున నీవొసంగిన కర్ణుని తేజోవధరూపమగువరమే యిపుడు నాకు వలయునది.

శల్యుఁడు:—ఓయుధిష్ఠిరా! నీయీకోర్కి కాఁగలదు. నీయిచ్చ మెయిఁ బొమ్ము. యుద్ధసన్నద్ధుఁడవు గమ్ము. నీకగుజయమునుగుఱించి నేను బ్రతిజ్ఞ చేయువాఁడను.

ఓయాంబికేయా! మద్రాధీశుఁడును, మేనమామయు నగుశల్యు ననుమతిగొని ధర్మజుఁడు తనతమ్ములతోఁగూడి యామహాసైన్యమునుండి వెడలిపోయెను. పిమ్మట నావాసుదేవుఁడు కర్ణునికడ కేగి యాతనితో, "ఓరాధేయా! నీవు భీష్మునితో ద్వేషించి యుద్ధముచేయవని వింటిని. భీష్ముఁడు చంపఁబడునంతకును, నీవు మాపాండవులపక్షమున యుద్ధము చేయఁదగదా! కౌరవులకు సాహాయ్యమొనర్పనెంతువేని భీష్ముఁడు పడిన పిదప మఱల నందులకుఁ బోవచ్చును." అని పలుక విని యక్కర్ణుఁడు "ఓకేశవా! దుర్యోధనున కెన్నఁడును నే నపకార మొనర్చువాఁడను గాను. ఆతనిహితమునకై నేను బ్రాణత్యాగ మొనర్చువాఁడనని నమ్ముము." అని తనయభిప్రాయ మెఱిఁగించెను. ఓధృతరాష్ట్రా! అక్కర్ణుని వచనములు విని కృష్ణుఁడు యుధిష్ఠిరుఁడు మున్నగుపాండవులంగూడి వెడలిపోయెను. అంత నాయుధిష్ఠిరుఁ డుభయసైన్యములనడుమ నిలిచి మనసైనికుల నుద్దేశించి "ఓసైనికులారా! మీలో నెవ్వరేని మాకు సహాయమొనర్చువారు గలరేని రండు. వారిని మేము కోరుచున్నాము." అని పలుక విని, యప్పాండవులఁ జూచి యుయుత్సుఁడు, ధర్మరాజునెడఁ బ్రీతుఁడై "ఓరాజా! నీవు నన్నుఁ గోరుదేని నీపక్షమును జేరి కౌరవులతోఁ బోరాడెదను?" అని పలికెను,

అదివిని యుధిష్ఠిరుఁడు "ఓయుయుత్సుఁడా! రమ్ము, రమ్ము. మూఢులగు నీయన్నలతో మనమెల్ల యుద్ధమొనర్తము. ఎల్లవిధముల మేమును నీవాసుదేవుఁడు నిదె చెప్పుచున్నారము. నాకై పోరాడవలసినదిగా నిన్ను నేను గోరుచున్నవాఁడను. నీమూలముననే ధృతరాష్ట్రునకుఁ బిండము, తంతువును సిద్ధింపఁగలదు? ఓరాజపుత్రా! నిన్నాదరించునట్టి మమ్ము నీవాదరింపుము. అసూయాగ్రస్తుఁడై దుర్బుద్ధి యగుసుయోధనుఁడు బ్రదుకఁజాలఁడు." అని పలికెను.

ఓధృతరాష్ట్రా! అటులు యుధిష్ఠిరుఁడు పలుక యుయుత్సుఁడు, నీకొడుకులను విడిచి పాండుపుత్రులను జేరికొనియె. అపుడు సైన్యములో దుందుభులు మొరసెను. పిమ్మట ధర్మాత్మజుఁడు సంతుష్టాంతరంగుఁడై యెప్పటివలెఁ దనకనకోజ్జ్వల మగుకవచమును దొడిగికొనియెను. అంతట వారెల్లరును, దమతమరథముల నధిరోహించిరి. పిదప నెప్పటి చొప్పున వ్యూహప్రతివ్యూహము లేర్పడియెను. వందలకొలఁది దుందుభులు వాయింపఁబడెను. యోధులందఱును వివిధముగా సింహనాదము లొనర్చిరి. అంత నప్పాండవు లెప్పటివలె రథముల నధిష్ఠించుటం జూచి ధృష్టద్యుమ్నుఁడు మున్నగువారు హర్షమునొందిరి. మఱియు నటులు మాన్యు లగువారిని గౌరవించు నమ్మాన్యు లగుపాండుపుత్రులమర్యాదను గాంచి యందలిరాజులందఱు నెంతయు వారిని బూజించిరి. మఱి కొందఱు మహాత్ములగుపాండవుల స్నేహభావమును సమయమువచ్చినపుడు జ్ఞాతులయెడ వారికగుదయను బ్రశంసించిరి. కీర్తిగలవార మని కొనెడివారిగుండియలకుఁ దగులునటు లెల్లెడలను మేలుమేలనెడి స్తుతివచనము లుప్పతిల్లెను. అందున్నమ్లేచ్ఛులు, నార్యులుదానిని విని,కనియు నాపాండుపుత్రులవృత్తమును దలంచి గద్గదస్వరములతో నేడువసాగిరి. పిమ్మట గొప్పభేరులు మ్రోగసాగెను. యోధులందఱును దమతమశంఖములను బూరించిరి." అని సంజయుఁడు తెలుప విని ధృతరాష్ట్రుఁ డిట్లనియె.

## యుద్ధారంభము

ఓసంజయా! అటు లుభయసైన్యములును వ్యూహములుగా నేర్పడినపిదప నందు ముందుగా నెవ్వరు తలపడిరి?

అది విని సంజయుఁడు “ఓరాజా! నీకొడుకు దుశ్శాసనుఁడు తన యన్న సెలవొంది భీష్ముని ముందిడి సేనతోఁగూడ వెడలెను. అటులే పాండవులును, భీముని మున్నిడుకొని భీష్మునిపైకి యుద్ధమునకు వెడలిరి. ఓరాజా! రెండుసైన్యములందును నపుడు భేరీమృదంగమురజాదు లగువాద్యములును, సింహనాదములును, గిలకిలారావములును బెచ్చు పెరిగి గొప్పసంకులమయ్యెను. అటు లాయిరువాగులును గలియఁగా నందలిశంఖమృదంగారావములతోఁ బెనుగాలికి వనములువలె నాసైన్యములు కంపింపసాగెను. మఱియు నటులెంతయుఁ బెచ్చుపెరిగి యోధకరిహయాదిసమాకుల మైయున్న యామహాసైన్యములను గాలిచేఁ గదలు సముద్రములందువలె గొప్పచప్పు డుప్పతిల్లెను. మేనులకు గగురుపాటొదవించెడి యట్టిశబ్దము జనింపఁగా నందులకు భీముఁ డలరి వృషభోత్తమమువలెఁ బెద్దయారావ మొనర్చెను. అపు డతఁ డొనర్చినసింహనాదము దుందుభిశంఖాదులయు, నేనుగుల బృంహితధ్వనులయు, సైన్యముల సింహనాదములయుఁ జప్పుడులనుమించి వినంబడియెను. అందులకు మనసైన్యములన్నియును జడియఁజొచ్చెను. పిడుగులవలె భయంకర మగు నాభీమునిగర్జనమునకు గజాశ్వాదివాహనములన్నియు సింహమున కితరమృగములువలె జడిసి యొక్కమాఱుగా మలమూత్రములను విడువసాగెను. అటు లాభీముఁడు ఘోరముగాఁ దనయాకారమును జూపుచు గర్జించుచు నీపుత్త్రులకు వెఱపుగొల్పుచు వారిని సమీపించెను. అటులు తమపైకి భీషణముగావచ్చు నాభీమునిఁ గాంచి నీపుత్త్రు లగు దుర్యోధన. దుశ్శాసన, దుర్ముఖ, దుస్సహ, దుర్మర్షణ, వివింశతి, చిత్రసేన, వికర్ణులును, పురుమిత్త్రుఁడు, జయుఁడు, భోజుఁడు, సౌమదత్తి మున్నగువారెల్ల నాతనిఁ జుట్టిముట్టి మేఘములు సూర్యునివలె శరవర్షముచేఁ గప్పుచు మెఱుపులువలెఁ జాపములఁ ద్రిప్పుచుఁ బొరవిడిచిన పాములనాఁదగుబాణములను బ్రయోగించుచుండిరి. పిమ్మట ద్రౌపదీపుత్త్రులును, నభిమన్యుఁడును, నకులసహదేవులును, ధృష్టద్యుమ్నుఁడును మున్నగువారు నీపుత్త్రుల నెదుర్కొని పర్వతశిఖరములను వజ్రాయుధముచేవలె వాఁడిబాణములచే నొప్పింపసాగిరి. ఆమొదటియుద్ధమున భీకరము లగుధనుష్టంకారధ్వనులతో నీవారియందును వారియందు నొక్కఁడును బరాఙ్ముఖుఁడు గాలేదు. ఓరాజేంద్రా! ద్రోణశిష్య

లగు కురుపాండవుల శరప్రయోగలాఘవమును లక్ష్యములను భేదించుటను జూచితిని. వింటిచప్పుడులకు విశ్రాంతి లేదు. కాంతివంతములై బాణములు నక్షత్రములువలె నాకసమునుండి వెడలుచుండెను. మఱికొందఱు రాజులు ప్రేక్షకులువలె భయంకర మగు నా జ్ఞాతులసమాగమమును గనులపండువుగాఁ గాంచుచుండిరి. పిమ్మట నమ్మహారథులెల్లరు నుద్రేకించి స్పర్థతో నొకరినొకరు ప్రహరించుకొనుచు విజృంభించిరి. కరిగజాశ్వరథసంకులము లగు నాయిరుసైన్యములును నారణరంగమునఁ బటమునఁ జిత్రింపఁబడినవివలె నలరుచుండెను. పిదప నారాజులెల్లరును విండ్లెక్కు-వెట్టిరి. ఆసైన్యములధూళిచేఁ గప్పంబడి సూర్యుఁ డగపడకుండెను. నీపుత్త్రునాజ్ఞచే సైన్యము లన్నియు యుద్ధసన్నద్ధములయ్యెను. వారు పరువులిడుచుండఁగా గజాశ్వములచేఁ జొఱరాక సింహనాదములతోఁగూడి శంఖభేరీధ్వనులు మ్రోయుచుండఁగా శరములనెడి గ్రాహములు, విండ్లనెడిపాములు, ఖడ్గములనెడికచ్ఛపములును బురోవాయువులుగలిగి కలఁతనొందినసముద్రమువలె నారణరంగమున గొప్పచప్పుడు గలిగియుండెను. పిమ్మట యుధిష్ఠిరుని కనుసన్నగనుంగొని రాజులెల్లరును దమతమసైన్యములతో నీతనయునిసేనలపైఁ దలపడిరి. అపు డుభయసైన్యములమేళన మెంతయుఁ దీవ్రమై కానిపించెను. యుద్ధమొనర్చువారిలోఁ గాని, హతు లగుచుండువారిలోఁ గాని, మఱలివచ్చుచుండెడివారిలోఁగాని తారతమ్యము నారయఁగా నిరువాగులందును గొంచెమేని విశేష మగపడదయ్యెను. మిగుల భయంకరమై యెంతయు సమ్మర్దముగానున్న యాయుద్ధము ప్రారంభమగుడునందు గాంగేయుఁడు సర్వసైన్యముల నతిక్రమించి యలరుచుండెను.” అని తెలిపి మఱియు నిట్లనియె.

## ద్వంద్వయుద్ధము

ఓరాజా! ఆనాఁటిపూర్వాహ్ణమున రుద్రాకారుఁ డగు నాభీష్ముఁడు రాజసమూహముల దేహములను ఖండించునట్టి మహాఘోర మగుయుద్ధము జరిగెను. అపుడు కురువులు, సృంజయులు నొకరినొకరు జయింపఁగోరి పోరాడుచుండఁగా సింహగర్జనమువలె భూమ్యాకాశములఁ బ్రతిధ్వనించుచు శంఖధ్వనులతో వారిసింహనాదములచప్పుడులును,

వింటిచప్పుడులు సుద్రేకించెను. మఱియుఁ గాలిబంటులపాదములయు, గుఱ్ఱముల హేషితములయు, నాయుధములయుఁ, బరువులువెట్టు నేన్గుల ఘంటలయుఁ, జప్పుడులును వినువారికి గగురుపాటొదవింప నెంతయు సమరము సంకులముగా నుండెను. అపుడు మనసేనలవారెల్ల ధ్వజము లెత్తి క్రౌర్యము లేర్పడఁ బ్రాణములపై నాశ విడిచి పాండవుల నెదుర్కొనిరి. ఓరాజా! గాంగేయుఁ డర్జునుపైకి వెడలి కాలదండతుల్యమై ఘోరమగు తనవిల్లు పట్టుకొని యుద్ధసన్నద్ధుఁడై వచ్చెను. అర్జునుఁడును బ్రసిద్ధమగు తనగాండివమును బూని యాగాంగేయు నెదుర్కొనెను. అపుడు వారిరువురు నొకరినొకరు హింసించికొనఁ దలంచి పోరాడియు గాంగేయుఁ డర్జుననిగాని, యర్జునుఁడు గాంగేయునింగాని చలింపఁ జేయఁజాలరైరి. ధనుర్ధరుఁ డగుసాత్యకి కృతవర్మను దలపడి యద్భుతమై ఘోరమగుయుద్ధ మొనర్చెను. వారిరువురును బరస్పరము ప్రహరించుకొనుచు శరవర్షములచేఁ గప్పికొనుచు మహాబలులై యొకరినొకరు పీడించికొనిరి. వసంతఋతువునఁ బుష్పించిన మోదుగుచెట్లువలె నలరుచుండిరి. కోసలదేశాధీశుఁ డగు బృహద్బలుఁ డనువాని నభిమన్యుఁ డెదుర్కొన నతఁ డాయభిమన్యునిధ్వజము నఱికె సారథిని గూలఁ ద్రోసెను. అటులు తనసారథి పడఁగా నభిమన్యుఁడు కుపితుఁడై యా బృహద్బలుని వాఁడిబాణములచే నొప్పించి వాఁడియగు నొకబాణముచే వానిధ్వజమును, నొకదానిచే సారథిని బడవైచెను. అటు లొనర్చిన పిమ్మట వారు పరస్పరము తీవ్రము లగుబాణములచే నొప్పించుకొనిరి. పిదప మానవంతుఁడై వైరముగొని రణరంగమున వెలయుచు మహారథుఁడై నీతనయుఁ డగుదుర్యోధను నెదుర్కొని భీముఁడు పోరాడఁ దొడంగెను. పురుషవ్యాఘ్రులు, మహారథులు నగు నాకురుముఖ్యులిరువురును నారణరంగమునఁ బరస్పరము బాణవర్షమును వర్షించికొనిరి. అటులు మిగుల నేర్పుమెఱయ రణమొనరించు నాభీమదుర్యోధనులఁ జూచిన యెల్లవారికిని విస్మయము గల్గకపోలేదు. దుశ్శాసనుఁడు మహారథుఁ డగునకులు నెదుర్కొనియెను. అంత నానకులుఁడు మర్మములను ఛేదింపఁదగు పెక్కువాఁడికోలలచే నీతనయునిధ్వజమును, ధనుస్సును ఛేదించి పిదప క్షుద్రకములనెడి యిరువదైదుబాణములు నీతనయుని మేన నర్పించెను. అంత నీతనయుఁ డానకులునిఁ గొట్టి యాతనిధ్వజ

ము, గుఱ్ఱములను బడఁ ద్రోసెను. దుర్ముఖుఁడు మహాబలుఁ డగు సహా దేవునితోఁ బోరాడ వచ్చి యాతనిపై శరవర్షమును గురిసెను. అపు డా సహదేవుఁ డెంతయుఁ దీవ్రమగు నొకబాణముచే నీపుత్త్రసారథిని బడఁ ద్రోసెను. అటులు వారు తలపడి రణగర్వితులై యొకరికొకరు ప్రతీ కారము లొనర్చుకొనుచు, ఘోరము లగుశరప్రహారములచే భయము గల్గించిరి. యుధిష్ఠిరుఁడు తానొక్కఁడె శల్యు నెదుర్కొనియెను. అంత ధర్మజుఁడు చూచుచుండఁగనే యాతనిచాపము నామద్రపతి రెండు ఖండములుగా నొనర్చెను. పిదప ధర్మజుఁడు ఖండిత మగు తనవింటిని విడిచి కుపితుఁడై వెంటనే దృఢమగు వేఱొకవిల్లు పూని నిలునిలుమని పలుకుచు నాతని శరవర్షముచే ముంచెను. ఓరాజా! ధృష్టద్యుమ్నుఁడు ద్రోణు నెదుర్కొనఁగా నతఁ డెంతయుఁ గోపావేశమున నాతని దృఢ మును శత్రుసంహారకము నగువింటిని నఱికి కాలదండమును బోలు ఘోరమగు వేఱొకనారాచమును బ్రయోగించెను. అది యాతని మెయినాటఁగా నతఁడు వేఱొకవిలు పూని పదునాల్గు సాయకములతో నాద్రోణునిఁ గొట్టెను. వారిరువురు నుద్రేకించి మహాసంగర మొనరిం చిరి. అటులే శంఖుఁడు సోమదత్తి నెదుర్కొని "ఓయీ! నిలునిలుము ఎందుఁబోయెదు." అని పలుకుచు వానికుడిభుజముపైఁ గొట్టెను. పిదప సోమదత్తి వానికొంకులను గొట్టెను. రణగర్వితు లగువారిరువురును దేవదానవులవలె ఘోరముగాఁ బోరాడిరి. మహారథుఁ డగుధృష్ట కేతువు కుపితుఁడై క్రోధపూరితుఁ డై యున్న బాహ్లీకు నెదురించెను. అపు డాబాహ్లీకుఁ డాధృష్టకేతునిఁ బెక్కుబాణములచేఁ బీడించి సింహ నాద మొనరించెను. అందుల కాచేది రాజు క్రుద్ధుఁడై మదించినయేన్గు మత్తగజమునువలెఁ దాఁకి తొమ్మిదిబాణములచే నాతని నొప్పించెను. వారిరువు రాసమరభూమిని మఱిమఱియుఁ బెచ్చుపెరిగి కుపితు లగు నంగారకబుధులువలెఁ బరస్పరసంఘర్షణ మొనర్చికొనిరి. క్రూరకర్ముఁ డును రాక్షసుఁడు నగునలంబుసుని ఘటోత్కచుఁడు మున్నింద్రు నా బలుఁ డనెడిరక్కసునివలె నెదుర్కొని మహాబలుఁడగు నాతనిఁ దొంబది బాణములచే నొవ్వనేసెను. పిదప మహాబలుఁ డగు నాభీమపుత్త్రుని రక్కసుఁడు గట్టిగా నాకర్షించి విడిచినబాణములచే బహుభంగుల నొప్పించెను. వా రాయుద్ధమునఁ బరస్పరబాణవిద్ధులై యెంతయుద్ధ

ప్రకాశించిరి. ఓరాజా! బలశాలి యగుశిఖండి యశ్వత్థామ నెదురింపఁగా నతఁ డెంతయుఁ గినిసి యెదురుగానున్నశిఖండి నొక తీవ్ర మగుబాణముచేఁ గొట్టి చలింపఁజేసెను. పిదప నాశిఖండియు వాఁడియై పచ్చని దగు నొకబాణముచే నాద్రోణపుత్రునిఁ బ్రహరించెను. అపుడు వారిరువురును బహువిధము లగుబాణములచే నొప్పించికొనిరి. తనసేనతోఁ గూడ విరాటుఁడు రణశూరుఁ డగుభగదత్తునిఁ దలపడెను. అంత వారిరువురకు యుద్ధ మారంభమగుడు విరాటుఁడు తనశరములచే మేఘుఁడు వర్షముచేఁ బర్వతమునువలె నాతని ముంచెను. అందుల కా భగదత్తుఁ డలిగి యుఁదయించుచున్నసూర్యుని మబ్బువలె నావిరాటుని శరములచేఁ గప్పెను. కృపాచార్యుఁడు కేకయు నెదుర్కొని శరవర్షమాతనిపై గుఱియ వాఁడు కుపితుఁడై కృపునిఁ గొట్టెను. వారిరువురు నటు లన్యోన్యముఁ బ్రహరించుకొనుచు గుఱ్ఱములను ధనువులను ఛేదించికొని విరథులై కోపము మిగుల ఖడ్గములతో ఘోరముగాఁ బోరనారంభించిరి. అటులగుట వారిపోరు భయంకరమై గానవచ్చెను. పిమ్మట ద్రుపదరాజు సైంధవునిఁ దలపడియెను. అపుడు సైంధవుఁ డా ద్రుపదుని మూఁడు వాఁడి నారాచములచే నొప్పింప వాఁ డాతని మఱలఁ బ్రహరించెను. అపుడు వారిరువురును మిక్కిలి భయంకరముగా యుద్ధ మొనర్చిరి. వారియుద్ధము శుక్రాంగారకులపోరువలెఁ జూచువారికిఁ గనులపండువు గాఁజొచ్చెను. నీపుత్త్రుఁ డగు వికర్ణుఁడు వడిగలగుఱ్ఱములతో మహాబలుఁడును, భీమసేనతనయుఁడునగు శ్రుతసోము నెదురించి యుద్ధ మొనర్చెను. అందు వికర్ణుఁడు కొన్నినారాచ, ములచే నాశ్రుతసోముని నొప్పించెనుగాని వాఁ డందులకుఁ జలింపఁ డయ్యెను. అటులే యావికర్ణుఁడును నాతని ప్రహారములకుఁ జలింపకుండెను. అయ్యది చూచువారికి మహాద్భుతముగానుండెను. ఓరాజా! మహారథుఁ డగు చేకితానుఁడు సుశర్మను మార్కొని కుపితుఁడై పాండవులకై పరాక్రమింపసాగెను. అపు డాసుశర్మయు నాతని దనశరవర్షముచే ముంచెను. అందుల కాచేకితానుఁ డోరువక పెనుమబ్బులు పర్వతమునుబోలెఁ దనబాణములచే నాతనిఁ గప్పెను. అంతఁ బరాక్రమశాలియై తనపైకి వచ్చు ప్రతివింధ్యుని శకుని మార్కొని మత్తగజముపై సింహకిశోరమువలె విజృంభించెను. అపు డాయుధిష్ఠిర

తనయుఁ డగు ప్రతివింధ్యుఁ డాశకునిని వాఁడికోలలచే మున్నిం ద్రుఁడు వృత్రాసురునివలెఁ బ్రహరింపసాగెను. శకునియు నాతనిఁ గొట్టెను. కాంభోజులలో మహారథుఁ డగుసుదక్షిణుని శ్రుత కర్మ యెదుర్కొన నతఁడు మహారథుఁ డగు నాసహదేవపుత్త్రుని పైఁబడి యాతనిఁ బ్రహరించెనుగాని యందుల కతఁడు మైనాకపర్వతమువలెఁ జలింపఁడయ్యెను. అంత నాశ్రుతకర్మ కాంభోజాధీశుఁ డగు సుదక్షిణునిపైఁ గినిసి యతనిమేను వ్రయ్యలగునట్లుగా బహువిధప్రహారము లొనర్చెను. పిదప నిరావంతుఁడు కుపితుఁడై శ్రుతాయువు నెదుర్కొనియెను. అర్జునపుత్త్రుఁడగు నాయిరావంతుఁ డటులు తన్నెదుర్కొనిన యాశ్రుతాయువు గుఱ్ఱములను జంపి సింహనాద మొనర్చెను. ఓరాజా! ఆతనిసైన్యము శంఖధ్వను లొనర్చెను. అపుడా శ్రుతాయు వాయిరావంతునిగుఱ్ఱములను దనగదాగ్రముచే మోది రూపుమాపెను. అటులు వారికిఁ గొంతవడి యుద్ధము జరిగెను. అవంతీశ్వరులగు విందానువిందు లిరువురును మహారథుఁడును నిజసైన్యపుత్రపరివారపరివృతుఁడు నగుకుంతిభోజునిపైకి యుద్ధసన్నద్ధులై వచ్చిరి. వారిఘోరపరాక్రమముల నద్భుతముగాఁ జూచితిమి. మఱియు వారు చలింపక నిలిచి తమ గొప్పసేనలతోఁగూడి యుద్ధ మొనర్చిరి. అం దనువిందుఁడు కుంతిభోజునిఁ దనగదతో మోదఁగాఁ గుంతిభోజుఁ డాతనిపై శరవర్షమును గురిసెను. కుంతిభోజనందనుఁడు విందునిం దనసాయకములచే నొప్పించెను. విందుఁడు మఱల వానిఁగొట్టఁగా నది యద్భుతమయ్యెను. కేకయు లేవురును గాంధారులనైదుగురిని దమగుఱ్ఱపుదళములతో వచ్చి చుట్టుముట్టి రణ మొనర్చిరి. నీకొమరుఁడగు వీరబాహుఁడు విరాటపుత్త్రుఁడగు నుత్తరుని మార్కొని వాఁడితూపులచే నాతని నొప్పించెను. ఆయుత్తరుఁడు నావీరబాహుని మఱలఁ బ్రహరించెను. చేదిరా జులూకునిఁ దాఁకి శరవర్షమున నాతని ముంపఁగా నాయులూకుఁడును దనశత్రునిఁ దీవ్రబాణములచే నొవ్వనేసెను. వారిరువురును ఘోరముగాఁ బోరాడిరి.

ఓరాజా? ఇటు లావీరులు పరస్పరమును బోరాడి యొకరికొకరోడక ద్వంద్వయుద్ధ మొనర్చిరి. అంత వేలకొలఁదిద్వంద్వములకు యుద్ధము జరిగెను. అది యొక రెండుగడియలు చూచువారి కానంద కరమై గానవచ్చెను. పిమ్మట నమ్మహాసైన్యమున నేనుఁగుతో నేన్గును,

గుఱ్ఱముతో గుఱ్ఱమును, బదాతితోఁ బదాతియును, ద్వంద్వములై పోరాడ ఘోరసంగ్రామమయ్యెను. అదియెల్ల నెటులేమయ్యెనో, జడుని వలె నేను దెలియఁజాలనైతిని. పిదప గొప్పసంకులయుద్ధమయ్యెను. ఆ శూరుల పరస్పరయుద్ధములను గాంచుటకై దేవర్షులును, సిద్ధులును, జారణులు వచ్చి యది దేవదానవయుద్ధమును మించియుండెనని తలంచిరి. పిదప గజములయు, రథములయు గుఱ్ఱములయుఁ, బదాతులయు, సమూహములు క్రమముతప్పి యందందుఁ జెదరెను.” అని తెలిపిమఱియు నిట్లనియె.

## సంకులయుద్ధము

“ఓయాంబికేయా! అందందు వేలకొలఁదిపదాతులు మేరమీఱి యుద్ధమొనర్చియున్నవారు. ఆవిధముం దెలిపెదను వినుము. ఆరణరంగమున భూతావేశమొందినవారువలెఁ గొమరుఁడు తండ్రిని, దండ్రి కొమారుని, దమ్ముఁ డన్నను, నన్న తమ్ముని, మామ యల్లుని, నల్లుని మామయు, స్నేహితుఁడు స్నేహితునిఁ దెలయక యక్కురుపాండవులు పోరాడఁదొడంగిరి. కొందఱు రథములతో రథసైన్యముల నెదుర్కొనిరి. అపుడు రథములచేఁ బూఁజులు వ్రయ్యలొనర్పఁబడుచుండెను. అటులే రథదండములచే రథదండములును, రథకూబరములచే రథకూబరములును ఖండింపఁబడుచుండెను. ఎదుటఁబడినవారెల్ల నొకరినొకరు హింసించుకొనసాగిరి. కొన్నిరథములు రథములకుఁ దగుల్కొని కదలఁజాలకుండెను. గొప్పమేనులుగలయేన్గులుకొన్ని మహాగజముల కెదురువడి కుపితములై దంతములచే నొకటినొకటి పలువిధములుగాఁ జీల్చుకొనుచుండెను. తోరణపతాకలుగలిగి రథవారణములైన మహాగజముల వేగముతాఁకుడుచేఁ గొన్నియేన్గులు గొట్టువడి యెంతయుఁ బీడితములై యఱవఁజొచ్చెను. మావటివారిశిక్షలచే నేర్పువడసి యంకుశపుఁబోటులచే మదహీనములగు నేన్గులుసైతము మత్తగజముల కభిముఖముగాఁ బోయిఁబోయి వానింగవిసెను. మఱికొన్నియేనుగులు వానింగలిసి బృంహితధ్వను లొనర్చుచుఁ బరువిడసాగెను.సరిగా శిక్షితములగు కొన్ని మత్తగజములు, తోమరములు నారాచములు మున్నగువానిచే నిరుద్ధములై మర్మస్థలములు ఛేదింపఁబడుచుండఁగా నఱచుచుఱుదునవియు

నేలఁగూలిమరణించునవియు నయ్యెను. మఱికొన్ని భయంకరముగా నఱచుచు దెసలకుఁ బరువులిడసాగెను. బలిష్ఠు లగుగజపాదరక్షకులు కొందఱు విండ్లు, పరశ్వధములు, గదలు, రోఁకండ్లు, భిందిపాలములు, తోమరములు,దుడ్లు, సాయకములు, వాఁడిగలకత్తులు మున్నగువానితోఁ గొట్టుకొనుచుఁ బరువులెత్తుచు నొకరినొకరు హింసించుకొనుచుఁ గాన వచ్చిరి. మానవులరక్తములచేఁ దడుపఁబడినకత్తు లెంతయు వెలయుచు, నొకరిపై నొకరు పరువులువాఱునట్టి వీరులహస్తములందుఁ గాన వచ్చెను. యోధులబాహువులనుండి తలక్రిందుగా జాఱి వైరులమర్మ స్థలములందుఁ బడినఖడ్గములచప్పుడులు తుములములై వినవచ్చెను. మఱియు గదలచేతను, రోఁకండ్లచేతను బీడింపఁబడియు వాఁడికత్తులచే నఱుకఁ బడియు, నేనుఁగుదంతములతాఁకుడులచే ఖండితములైనవియు, నేనుఁగులచేఁ ద్రొక్కుడుపడినవియు నైనయోధసమూహముల పరస్పరాహ్వానముల దారుణారావములు ప్రేతలవచనములువలె విననయ్యెను. చామరభూష ణములుగల గుఱ్ఱములతో రౌతులు వడిగలహంసలతోవలెఁ బరుగులిడు చుండిరి. వారిచే విడువఁబడినయాయుధవిశేషములు వడిగా వెడలి సర్ప ములువలెఁ బడుచుండెను. కొందఱు రౌతులు వడిగలతమగుఱ్ఱము లతోఁ బరువులిడి గొప్పరథములను జుట్టిముట్టి రథికులతలల నాకర్షించు చుండిరి. అటులే రథికుఁడొకఁడు తనవాఁడికోలలకు గుఱియై కన్పడిన రౌతుల ననేకులను జయింపఁగడంగెను. నల్లనిపెనుమబ్బులనా వెలయు బంగారునగలుగల మదపుటేనుఁగులు గుఱ్ఱములను లాగి తమపాదము లతోఁ ద్రొక్కి చంపనారంభించెను. కొన్నియేనుఁగు లీటెలుపోటులు తల లందును బ్రక్కలందును మిక్కిలి నొప్పిగల్గింపఁగా నెంతయు గర్జిం చుచు రౌతులతోఁగూడియున్న గుఱ్ఱములపైఁబడి వాని నాకర్షించి నశింపఁజేయఁగడంగెను. వీరులు ప్రయోగించునట్టి యాయుధములు కొన్ని పదాతులకవచములను జీల్చి వారిమేనులనాఁటి యుల్కాజ్వాలలు నా వెలయుచు నెంతయును ఘోరముగాఁ గానవచ్చెను. కొందఱు పరు వులువెట్టి కత్తులతో నఱికికొని చచ్చిరి. కొందఱేనుఁగుల త్రొక్కుడులను, గుఱ్ఱముల త్రొక్కుడులనుబడి మృతినొందిరి. కొందఱు రథముల క్రిందఁ బడి గతప్రాణులైరి. అందందు మఱికొందఱు తమతమబంధుగులను బిలుచుచుండిరి. మఱికొందఱు తమపుత్రులను, గొందఱు తండ్రులను,

నింకొకకొంద అన్నలను, వేఱొకకొందఱు మామలను రమ్మని యఱచు చుండిరి. మఱియు నారణరంగమునఁ బ్రేవులూడినవారును గుడిప్రక్కలు విఱిగినవారును, జేతులు తెగినవారునునై బ్రతుకఁ దలంచి యేడ్చుచుఁ గానవచ్చిరి. ఓరాజా! అల్పబలు లగుకొందఱు దప్పిగొని పుడమిఁబడి జలముల నపేక్షింప సాగిరి. మఱికొందఱు తమమేనులు రక్తసిక్తములగుడుఁ బీడ సహింపఁజాలక నీపుత్త్రులను గలిసినందులకై తమ్ము నిందించుకొన సాగిరి. శూరు లగు కొందఱుక్షత్త్రియులు పరస్పరవైరములు విడువక తమశస్త్రములను బరిత్యజింపక మొఱలువెట్టక పోరాడుచు నందందు వెఱపుగొల్పుచుఁ బ్రవర్తించిరి. మహాబలు లగుమఱి కొందఱు కోపావేశమునఁ బెదవులు కొఱుకుచు బొమలుముడిచి భయంకరము లగురూపములతో నొకరినొకరు చూచుకొనుచు బాణముల వ్రేటులచేఁ బీడితులయ్యును వెనుదీయక మొఱలువెట్టక పోరాడుచుఁ గానవచ్చిరి. కొందఱు విరథులై మఱియొకరిరథములపై కుఱుకు వారును, గొంద ఱేనుఁగులత్రొక్కుడులకు నలఁగువారునునై యవ్వీరులు పూఁచినమోదుగుచెట్లవలెఁ గానవచ్చిరి. వీరక్షయకారియై భయంకర మగు నామహాసంగరమున ననేకులు భీకరాగావము లొనర్పసాగిరి. అందుఁ గొమరుఁడు, తండ్రి యని తలంపకయుఁ, దండ్రి కొడుకని చింతింపకయు, మామ యల్లుఁడని యాలోచింపకయు, నల్లుఁడు మామ యని ప్రేమింపకయు, మిత్త్రుఁడగుట చంపఁదగఁడని గుర్తింపకయు, బంధువులని పాటింపకయు నొకరినొకరు చంపికొనసాగిరి. పాండవులతోఁ గౌరవుల కిపుడు సంభవించిన మహాక్షయకారి యగు నీభయంకరసంగ్రామమునఁ బరిమితిలేక యిట్టివిపర్యాసములు జరిగెను. అంతఁ బాండవులసైన్యము గాంగేయుని సమీపించి యెంతయుఁ జలింపఁ జొచ్చెను. అతఁ డారణరంగమున రజతమయమై మిక్కిలి యున్నతమగు తనతాలధ్వజముతో మేరువుతోఁ జంద్రుఁడువలె నలరుచుండెను." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.


శ్వేతునియుద్ధము

"ఓయంబికాపుత్త్రా! నాఁటిపవలు రెండుజాములు కావచ్చెను. అదియెంతయు దారుణమై రౌద్రమై క్షత్త్రియప్రళయమై యుండెను.

అట్టితఱి నీతనయుని ప్రోత్సాహముచే దుర్ముఖుఁడును, కృతవర్మయుఁ, గృపుఁడును, శల్యుఁడు, వివింశతియు, భీష్మునిఁ జేరి యాతనికి రక్షకులుగా నుండిరి. ఓరాజా! అతఁ డటు లీయేవురుమహారథులును దనకు బాసటగా నావరించియుండ నప్పాండవసైన్యమునఁ బ్రవేశించెను. చేది, కాశి, కరూశ, పాంచాల దేశాధీశులలో నెల్ల నగ్గాంగేయునితాలధ్వజమే చలత్పతాకమై కానవచ్చుచుండెను. ఓరాజా! ఆమహావీరుఁడు రథమార్గములఁ జరించుచు వాఁడిగలకోలలచే ధ్వజములతోఁ గూడిన రథమును మున్నగువాని ఖండింప మొదలిడెను. ఆతనివ్రేటులచే మర్మములెడలినయేన్గు లాక్రందధ్వను లొనర్చెను. అంత నభిమన్యుఁ డందుల కలిగి, పచ్చనిగుఱ్ఱములఁ బూంచిన తనరథముతో వెడలి భీష్ము నెదుర్కొనియెను. ఆయభిమన్యుని కర్ణికారధ్వజము సువర్ణమయమై యలరుచుండెను. అంత నాయభిమన్యుఁ డాతాలకేతుని, నాతనికి సహాయులై యున్నవారిని దీవ్రమగు నొకబాణముచేఁ గొట్టెను. మఱియుఁ గృతవర్మపై నొకటియు, శల్యునిపై నైదును బాణములు ప్రయోగించి తనకుఁ బ్రపితామహుఁడగుభీష్మునిమేనఁ దొమ్మిదిబాణములు నోనాఁట నేసెను. పిదప సువర్ణభూషణమయ మగు దుర్యోధనునిధ్వజము నొక వాఁడికోలచే ఖండించి యాతనిసారథి తలఁదెగనేసె. మఱియుఁ గృపుని విల్లొకతూపున ఖండించి, తీవ్రముఖము లగుబాణములచే వారి మేనుల నొప్పించెను. అటులు కుపితుఁడై వారిని గొట్టి యానందముతో నటించుచున్న యభిమన్యునిపరాక్రమమునకు దేవతలు సంతసించిరి. భీష్ముఁడు మున్నగురథికులెల్ల నాయభిమన్యుని లక్ష్యశుద్ధికి మెచ్చికొని బలశాలి యగునాతని సాక్షాత్తుగా నితఁ డర్జునుఁడే యని తలంచిరి. పిదప శరలాఘవమార్గ మెఱింగినయాగాంగేయుఁడు తనచాపము నగ్నిప్రభలు వెలయ గిరగిరత్రిప్పుచు గాండివమునువలె ధ్వనింపఁజేయుచు నాతనిఁ జేరి తొమ్మిదిబాణములచే నాయభిమన్యుని నొప్పించెను. మూఁడుబాణములచే ధ్వజమును ఖండించి సారథిని మూఁడుబాణములఁ గొట్టెను. అటులే కృతవర్మయుఁ గృపుడుఁ, శల్యుఁడును, నాతనిఁ గొట్టిరిగాని దాని కతఁడు మైనాకమువలె నించుకేనిఁ జలింపఁడయ్యెను. పిదప శూరుఁ డగునాతఁడు మహారథులగు నీతనయులతోఁ గూడియున్నవారి నెల్లర శరవర్షముచే ముంచుచు, వారు ప్రయోగించుమహాస్త్రములను

దనబాణములచే ఖండించుచు, భీష్మునిపై శరములు పఱపి సింహనాద మొనర్చెను. అపు డాతనిబాహుబల మత్యధికమై ప్రదర్శింపఁబడియెను. అంత భీష్ముఁ డాయభిమన్యునిశరముల నెంతవారించుకొనుచున్నను దన్ను తఁడు నొప్పింపగా భీష్ముఁ డాతనిపైఁ గొన్ని బాణములు పఱపెను. వాని నాయభిమన్యుఁడు మార్గమధ్యముననే ఖండించి పిదప నమోఘము లగు తొమ్మిదిబాణములచే భీష్ముని తాలధ్వజము గూలనేసెను. అందుల కందలి వారెల్ల నాక్రోశించిరి. రజతమయమై గొప్పబోదెగల యాతాలధ్వజము నేలఁబడియెను. అపు డాయభిమన్యుని శరప్రహారముచేఁ దాలధ్వజము పడుట కలరి భీముఁ డెంతయు సింహనాదమొనర్చెను. అటు లామహా సంగర మతిరౌద్రమై ప్రవర్తిల్లఁ బలశాలి యగుభీష్ముఁ డడరి పెక్కు దివ్యాస్త్రములను బ్రయోగించి పిదప శరవర్షముచే నాతనిమేను గప్పెను. అది యెంతయు నద్భుతము గలిగించెను. పిమ్మట నాయభిమన్యుని రక్షించుటకై ధనుర్ధరు లగుపదుగురు పాండవయోధులు త్వరగాఁ బరువులిడిరి. అటు లాపాండవయోధు లగు విరాటుఁడును, నాతని పుత్త్రులును, ధృష్టద్యుమ్నుఁడును, భీముఁడు, కైకయుఁడును, సాత్యకియుఁ గడువడి నాభీష్మునిఁ జేరఁగా నాశాంతనవుఁడు వారిలో ధృష్టద్యుమ్నునిపై మూఁడును, సాత్యకిపైఁ దొమ్మిదియును బాణములు ప్రయోగించి గట్టిగా నాకర్షించి విడువఁబడిన యొకబాణముచే భీముని ధ్వజము ఖండించెను. అటు లాతనిచే ఖండింపఁబడి సువర్ణమయ మగు నాభీమునిసింహధ్వజము రథమునుండి నేలఁగూలెను. పిమ్మట భీముఁడు మూఁడువాఁడినారసములచే భీష్ముని, నొకబాణముచేఁ గృపుని, నెనిమిది టిచేఁ గృతవర్మను గొట్టెను. పిదప నుత్తరుఁడు కుపితుఁడై యొకయేన్గు నెక్కి శల్యు నెదుర్కొనియెను. అపు డాతనియేనుఁ గాశల్యునిపైఁ బడ నతఁడు దానివడి నొకనిమేషములో నివారించెను. అపు డది యెంతయుఁ గుపితమై యున్నతములై వడిగాఁ బరువులిడు నాశల్యుని హయములనాల్గిటిని గాలితోఁ ద్రొక్కి చంపెను. అంత శల్యుఁ డటులు హతాశ్వమగురథముననే నిలిచి యుత్తరు నంతమొందింపఁదగు నొక యమోఘమయమగుశక్తిని బ్రయోగింపఁగా నది యుత్తరునికవచమును భేదించి యాతనికి మూర్ఛగలిగించెను. అటులగుట నతఁ డాగజస్కంధమునుండి జారి తనచేతనున్న యంకుశము విడిచి నేలంబడియెను. పిమ్మట

శల్యుఁ డారథమునుండి దిగి యొకఖడ్గముచే నాయుత్తరుగజోత్తమము తొండమును ఖండించెను. అంత నాయేన్గు శల్యుని శరపరంపరలచే గవచమెడలి తొండము తెగి భయంకరముగా నఱచుచు నేలఁగూలి ప్రాణములు విడిచెను.అది యటులొనర్చి శల్యుఁడు భాస్వరమగుకృతవర్మ రథము నధిరోహించెను. అంత నట్లు హతుఁడగు నుత్తరునిఁజూచి యాతని సోదరుఁ డగు శ్వేతుఁ డాయేడ్వురురథికులపైఁ గినిసి తీవ్ర బాణములచే వారివిండ్లను ఖండించెను. అయ్యవి ప్రయ్యలగుడు వారొక యరనిముసములో మఱల ధనువులు ధరించి యేఁడుబాణములచే నా శ్వేతునిగుఱ్ఱములఁ బడఁద్రోసిరి. పిదప నా శ్వేతుఁడు మఱల నేఁడుబాణములచే వారి విండులను బడఁగొట్టెను. అటులు తమచాపములు మఱియు ఖండితములగుడు వారు కుపితులై రథశక్తులను ధరించి భైరవారావముల నొనర్చిరి. ఓరాజా! ఆరథికు లేడ్వురును మఱల నా శ్వేతునిరథముపై నాయేఁడు రథశక్తులను వేయఁగా నవి ప్రజ్వలించుచు నుల్కలవలెను, బిడుగులవడువునను వెడలినవి. కాని వాని నాపరమాస్త్రవేత్త యగు శ్వేతుఁడు తనబాణము లేఁడిటిచే ఖండించెను. పిమ్మట సకలవైరివిదారణ మగు నొకసాయకశ్రేష్ఠము నా శ్వేతుఁడు రుక్మరథునిపైఁ బ్రయోగింపఁగా నది వానిమేన నాఁటి వానిముఖద్వారమునుండి వెడలి పోయెను. అంత నారుక్మరథుఁ డటులు హతుఁడై తనరథమున నొఱగి నిశ్చేతనుఁడై పడియెను. అటులు చైతన్యము తప్పియున్న యారుక్మరథు, నాతనిసారథి యందఱును గాంచుచుండఁగా నారణరంగమునుండి యాతనిఁ దీసికొనిపోయెను. అంత నా శ్వేతుఁడు మఱియు నాఱుబాణములను దీసి సువర్ణభూషణభూషితము లగు నా యోధులగుఱ్ఱములను, ధ్వజాగ్రములను ఖండించెను. పిమ్మటఁ దక్కినవారిగుఱ్ఱములను, సారథులను ఛేదించి వారినిఁ జెదరఁగొట్టి శల్యునిపైకి వెడలెను. అపుడు నీ సైన్యమున హాలహలాశబ్దములు జనించెను. అపు డటులు శల్యుని రథము పైకివచ్చుచున్న యాతనిఁ గాంచి నీతనయుఁడు భీష్ముని ముందిడికొని మఱికొందఱుశూరులతోఁ గూడి శల్యుని రక్షించుటకై వెడలెను. అటులగుట నాశల్యుఁడు మృత్యుముఖమునుండి తప్పిపోఁగలిగెను. పిదప నీవారికిని, వారివారికిని, సంకుల మగుయుద్ధ మెంతయు భయంకరముగా జరిగెను. అంతఁ గురుపితామహుఁ డగుభీష్ముఁడు

భీమునిపైని, సాత్యకి, యభిమన్యుఁడు, కైకయుఁడు, విరాటుఁడు, ధృష్టద్యుమ్నుఁడు మున్నగువారిపైని దక్కినసైన్యములమీఁదను శరవర్షములఁ గురిసెను.” అని తెలుప విని ధృతరాష్ట్రుఁడు మఱియు నిట్లనియె.

## శ్వేతునివధము

“ఓసంజయా! అటులా శ్వేతుఁడు శల్యునిరథముపై కుఱుకఁగా నపుడు కౌరవులును బాండవులు నేమి యొనర్చిరి? భీష్ముఁ డేమి యొనర్చెను? దాని నెఱిఁగింపుము.”

అది విని సంజయుఁడు “ఓరాజా! లక్షలకొలఁది క్షత్రియోత్తములపు డాసేనాపతి యగు శ్వేతుని. బురస్కరించుకొని నీపుత్త్రునియెడఁ దమతమబలములను జూపుచు, శిఖండిని బురస్కరించికొని భీష్మునుండి యా శ్వేతుని రక్షింపఁదలఁచిరి. అటులగుటను సువర్ణభూషణభూషితమగు నాభీష్మునిరథమును జుట్టుముట్టి యాతనిఁ జంపుతలంపులుగల్గి యుండిరి. అపు డెంతయు సంకులసమర మయ్యెను. ఓరాజా! పిమ్మట నిరుసైన్యములకును జరిగిన యద్భుతమగుసంగ్రామమువిధ మెఱిఁగించెదను వినుము. అపుడు మహారథుఁడగుభీష్ముఁడు పెక్కురథోపస్థములను శూన్యముగా నొనర్చుచు శరవర్షముచే శిరములను ఖడించుచు, నుదయకాలసూర్యుఁడు చీఁకటులనువలె లక్షలకొలఁది వాఁడినారసములఁ బఱపుచు సూర్యమండలమును గప్పెను. మహాబలముతో మిక్కిలి వడిగా నెగయు నాతనితూపు లారణరంగమున వందలకొలఁది శూరుల శిరముల నుఱుమాడెను. ఓరాజా! కవచములు దొడిగికొని సన్నద్ధులై వచ్చి వీరులు విగతశిరస్కులై రథములందే కూలఁబడి గానవచ్చిరి. కొన్నిగుఱ్ఱములు రథికులతోడనే రథముల నీడ్చుకొని పోసాగెను. వేఱొకకొన్ని చచ్చి తమపై వ్రేలాడుచున్న కార్ముకహస్తు లగు వీరులతోఁగూడఁ బరువులు వెట్ట నారంభించెను. మఱికొందఱు వీరులు తమ మేనులఁగట్టుకొనినకత్తులతోడను; నమ్ములపొదులతోడను గూడి కవచములు చినుఁగ వందలకొలందిగా నారణభూమిని బడి వీరశయ్యల శయనించుచుండిరి. మఱియు నొకరిపై యొకరు పరువులిడుచుఁ బడుచు లేచుచు మఱియుఁ బరువులువెట్టుచు ద్వంద్వయుద్ధముల నొనర్పసాగిరి.

అటులే పరస్పరము పీడించికొనుచు నిందించుకొనుచుండిరి. మత్తగజములు పడియెను. రథికు లంతటను రథములతోఁగూడ నలఁగి హతులై పడఁజొచ్చిరి. ఒక్కొక్కఁ డితరునిబాణముచే రథముననే పడియుండెను. వేఱొకఁడు హతసారథియై యారథమునుండి నేలఁ గూలెను. మఱియొకఁడు యుద్ధముచేయునపుడు వెడలినధూళిచే దెసలు దెలియకుండియు ధనుష్టంకారధ్వనులనుబట్టి యుద్ధముచేయుచు వైరిని గుఱుతింపఁ గలిగెను. మఱియు నిరుతెగలఁగలయోధ ప్రతియోధులకుఁ దమతమ గాత్రస్పర్శములును గుఱుతులై యుండెను. బాణములతోఁ బోట్లాడెడి వారి యల్లెత్రాటిచప్పుడులచే భటు లొనర్చుసింహనాదములు వినరాకుండెను. ఇంకను సంగ్రామపటహములచప్పుడులు చెవులఁ జిల్లులువడఁ జేయుచుండెను. అట్టితఱిఁ దనపౌరుషమును వెలయించుచు యుద్ధమొనరించువాని బింకపుమాట లాసంకులయుద్ధమున స్పష్టముగా వినరాకుండెను. ఇంతయేల ! అమ్మహాసంగరమునఁ దండ్రి కొడుకును గుర్తింపఁ జాలకుండెను. భీష్మప్రయుక్తము లగుబాణపరంపరలచే నొకరథచక్రము భగ్నమైనవారును, నొకరథయుగము విఱిగినవారును, నొకగుఱ్ఱము చచ్చినవారును నై రథికులు తమసారథులతోఁ గూడి రథములనుండి క్రిందికిఁబడుచుండిరి. అటులు భిన్నచక్రములగురథములనుండి తొలఁగి వివశులై తలలు తెగిపడినవారిలోఁ దమబంధువు లెవ్వరు పడిరో యను విషయమును దెలియఁగోరువారి కది గుఱుతింప వశముగాకుండెను. ఆసమయమున భీష్మునిశరప్రహారమును బొందనివాఁ డొకఁడును గానరాఁడయ్యెను. ఆయుద్ధమున శ్వేతునివిక్రమ మద్భుతమయ్యెను. అతఁడు వందలకొలఁదిరాజపుత్రుల నుఱుమాడెను. వేలకొలఁదియోధులతలలఁ దెగనేసెను. ఓరాజా ! నాఁడు శ్వేతుని శరవర్షముచే రథచక్రములు, రథములు, సారథులు, రథికులును, వివిధము లగుధ్వజములును, గుఱ్ఱపుదళములును, బదాతులును, వందలకొలందియేన్గులును నారణరంగమునఁ బడియెను.

ఓరాజా ! ఆశ్వేతునిశరప్రహారముల కోరువఁజాలక మనయోధులు భీష్మునిఁ జేరి "ఓవీరాగ్రేసరా మే మాశ్వేతునకు జడిసి వచ్చితిమి. ఇఁక నీపై భారమిడి చూచువారము" అని పలికి యాతనికి నలుగెలంకుల రక్షకులైయుండఁగా నట్టిదైన్యసమయమున భీష్ముఁ డొక్కఁడును

దీనుఁడుగాక మేరుగిరివలె స్థిరచిత్తుఁడై యుండెను. మఱియు నతఁడు వేసవిసూర్యునివలెఁ బ్రజ్వలించుచు సహస్రకిరణుఁడు తనకిరణములను వలె శరపరంపరలను గురియుచు వైరిప్రాణాంతకుఁడై విజృంభించెను. అపు డతఁడు మున్ను రక్కసులను దునుమాడుచక్రపాణివలెఁ గాన వచ్చెను. అటు లతఁడు విక్రమింపఁగా నాతని నెవ్వరును జేరఁజాలకుం డిరి. అంత భీష్ముఁ డాశ్వేతునిపై గుఱియిడి ధైర్యసాహసములతో దుర్యోధనునిప్రియమునకై పాండవసైన్యములఁ దునుమాడ నారం భించెను. అటు లాశాంతనవుఁ డాపాండవసైన్యముల నటులు రూపు మాపుచుఁ దనసేనలను బ్రహరించుపాండవసేనాపతి యగుశ్వేతునిపైఁ దనరథము పఱపెను.

ఓరాజా! అపు డాభీష్మశ్వేతులకు గొప్పయుద్ధము జరిగెను. అంత నాశ్వేతుఁ డాభీష్మునిఁ దనశరజాలముచే ముంచెను. అతఁ డాశ్వేతుని శరవర్షమున ముంచెను. అటులు తలపడి, వారిరువురును వృషభముల వలె ఱంకెలువేయుచు మత్తగజములువలె నొడలు తెలియక బెబ్బులులు వలెఁ గుపితులై పరస్పరమును బ్రహరించుకొనిరి. మఱియు నస్త్రము లకుఁ బ్రత్యస్త్రములను బ్రయోగించుకొనుచు వారిరువురు నటు లొకరినొకరు హింసించుతలంపులతోఁ బోరాడిరి. నాఁడు శ్వేతుఁ డటు లుద్రేకించి సైన్యమును రక్షింపనిచోఁ బాండవసైన్యమునెల్ల భీష్ముఁడు దహింపవలసినదే! అంత నాశ్వేతుఁడు పితామహుని యుద్ధవిముఖు నిఁగా నొనర్చెను. అందులకుఁ బాండవులు మోదమును గౌరవులు ఖేదమును నొందిరి.

పిమ్మట నీపెద్దకొడుకు కుపితుఁడై కొందఱు యోధులంగూడి పాండవసైన్యములఁ దలపడియెను. శ్వేతుఁడు భీష్ముని విడిచి వడివడి నీ కొడుకులున్నయెడకు వెడలి, పెనుగాలి చిన్నచెట్లకువలె నీవారికెల్ల మారకుఁడై విజృంభించెను. అటు లతఁ డాసైన్యములఁ జెదరఁగొట్టి మఱల భీష్మునిపైకి వెడలెను. అపుడు మహాబలులును, మహాధైర్యవం తులు నగు వారిరువురును వృత్రవాసవులవలెఁ బరస్పరజయేచ్ఛలతో నెంతయు ఘోరముగాఁ బోరాడిరి. శ్వేతుఁడు మున్నుగా గాంగేయు నేఁడుబాణములతోఁ గొట్టెను. మత్తగజము మదగజమునువలె వాని నాభీష్ముఁడు నివారించెను. పిదప శ్వేతుఁడు పదిబాణములచే నాతనిఁ

గొట్టఁగా, నాభీష్ముఁడు వాని నటులే గట్టిగాఁ గొట్టెను. కాని దాని కాతఁడు కొండవలె నించుకేనిఁ జలింపక మఱల గట్టిగా దిగిచి విడిచిన యిరువదైదుబాణములచే నాశాంతనవుని నొప్పించెను. అది యద్భుతముగా నగపడియెను. అపుడు శ్వేతుఁ డట్టహాసమొ నర్చి సెలవులం దడుపుచుఁ బదిబాణములచే భీష్మునివిల్లు పదిముక్క లుగాఁ దెగనేసి లోమప్రవాహి యగు నొకవాఁడితూపు వింటఁగూర్చి యామహాత్ముని తాలధ్వజశిఖరమును ఖండించెను. అటు లాతనికేతువు భూతలమునఁ బడుట గాంచి నీతనయులు శ్వేతునకు వశుఁడై భీష్ముఁడు హతుఁడయ్యెనని తలంచిరి. పాండవులు హర్షపూరితులై తమతమశంఖ ములఁ బూరించిరి. అపుడు దుర్యోధనుఁడు కోపావిష్టుఁడై తనసైన్య ములఁ బ్రోత్సహించి సప్రయత్నముగా నటులు కలఁతపడియున్న భీష్ముని రక్షించువాఁడై వెడలి తనవారితో "ఓవీరులారా! జడియకుఁడు. శూరుఁ డగుశాంతనవుఁడు తప్పక శ్వేతు నిపుడు చంపఁగలఁడు. నామాటను విశ్వసింపుఁడు." అని బిగ్గరగాఁ జెప్పెను. అది విని మహారథు లెల్లరును, వడివడిగాఁ దమచతురంగబలములతో వెడలి యాభీష్ముని రక్షించు చుండిరి. అటులు భీష్మరక్షకులై బాహ్లికుఁడు, కృతవర్మ, కృపుఁడు, శల్యుఁడు, జరాసంధపుత్రుఁడు, వికర్ణుఁడు, చిత్రసేనుఁడు, వివింశతి యును దఱిమించుచుండెనని కడువడిగాఁ బోయి యాశ్వేతునిపై శర వర్షమును గురిపించిరి. అంత నాశ్వేతుఁడు, కుపితస్వాంతులైయున్న మనయోధులనెల్ల నొక్కుమ్మడిగాఁ దనహస్తలాఘవము చూపుచు నిలువరించెను. అటు లతఁడు వారినెల్ల సింగ మేనుగులనువలెను నిలిపి మిక్కిలి వడిగలవాఁడితూపులచే నాభీష్మునివిల్లు తునుమాడెను. అంత నాశాంతనవుఁడు వేఱొకవిల్లు పూని కంకపత్రములుగల విశిఖములచే నాశ్వేతుని నొప్పించెను. అందుల కతఁ డెంతయుఁ గినిసి, యెల్లవారు గాంచుచుండఁగాఁ, బెక్కునారాచములచే మఱల నాభీష్మునిఁ బ్రహ రించెను. ఓరాజా! సర్వలోకప్రవీరుఁ డగు భీష్ముఁ డటు లాశ్వేతునిచే నివారింపఁబడుట కెంతయుఁ జింతిలి నీసైన్యమువారిలో నొకనికిని ధైర్యము నిలువదయ్యెను. అంత నాశ్వేతునిశరప్రహారములచేఁ గొట్టు వడిన యాభీష్మునిఁ జూచి నీవారెల్ల భీష్ముఁ డాశ్వేతునకుఁ జిక్కెననియే తలంపసాగిరి. అంత నాశాంతనవుఁ డెంతయుఁ గోపించి యటులు తన

సైన్యము నివారింపఁబడుటకును, చనవిల్లు తెగుటకును, నోరుపక యాశ్వేతునిపైఁ బెక్కుసాయకములను బ్రయోగించెను. వానినెల్ల వాఁడు నివారించి మఱల నీతండ్రి విల్లు తునుమాడెను. అపుడు భీష్ముఁడు దానిని విడిచి బలముగల వేఱొకవిల్లు గొని యందు తాయివలెఁ దీవ్రము లగు నేఁడుబాణములనుగూర్చి నాల్గిటిచే నాశ్వేతుని నాల్గుగుఱ్ఱములను, రెండిటిచే వానిధ్వజమును, నొకదానిచే వానిసారథితలను దెగనేసెను. అంత నాశ్వేతుఁ డటులు తనసారథియు గుఱ్ఱములును గూలఁగా రథము నుండి దిగి కోపావేశముచే వికలచిత్తుఁడై యుండెను. అటులు విరథుఁడై యున్న మహారథుఁడగు నాశ్వేతునిఁ గాంచి యాభీష్ముఁడు వాఁడిగల కోలలచే వానిమేను నొప్పించెను. అంత నతఁడు తనవిల్లొకచోనుంచి, సువర్ణమయ మగునొకశక్తిని బట్టుకొనియెను. ఆశక్తి మిగులభయంకరమై మృత్యువుసునై తమ నశింపఁజేయందగి కాలదండమునావెలయుచుండెను. అపు డాశ్వేతుఁ డాశాంతనవునితో "ఓయీ! నిలు నిలుము. ఇపుడు నన్నుఁ జూడుము" అని పలుకుచుఁ బరాక్రమశాలియై నల్లత్రాచుంబోలిన యాశక్తిని భీష్మునిపైఁ బ్రయోగించెను. అపుడు పాండవపక్షమును బరాక్రమింపఁజేయునట్టియు, నీవారికనర్థముగల్గించునట్టియు, నాహాకారములు నీపుత్త్రులలో నెంతయు జనించెను. అంత నెంతయు ఘోరమై మృత్యుదండమువలె వెలుఁగుచుఁ బొరవిడిచినపామువలెఁ గ్రూరమై యాశ్వేతునిచే విడువఁబడినశక్తి యాకసమునుండి పడెడి యుల్కాపాతమును బోలి వడిగా జ్వాలామయమై తనపైకి వచ్చుచుండుటను జూచి సంభ్రాంతుఁడై భీష్ముఁడు దాని నెనిమిదిబాణములచేఁ దొమ్మిదిముక్కలుగా ఖండించివైచెను. అటు లాశక్తి ముక్కలగుఁడు, నీవారెల్లరు గట్టిగా నఱచిరి. అంత నందుల కాశ్వేతుఁడు ఖిన్నుఁడై కోపావేశమున నేమియుఁ దోపక, కాలోపహతమానసుఁడై నగుచు, నాశాంతనవునిఁ జంపుటకై యొకగదను బట్టికొని వెడలి కన్ను లెఱ్ఱవడ రెండవదండధరునివలె నగపడుచుఁ బ్రవాహము పర్వతమునువలె నాభీష్ము నెదురించెను. పిదపఁ బ్రతాపశాలి యగు నాభీష్ముఁడు వానివేగ మోరువఁదగనిదిగాఁ దలంచి తానును వడిగాఁ బుడమి కుఱికెను. అంత నాశ్వేతుఁడు కోపావేశముతో గదను ద్రిప్పుచు నాభీష్ముని రథముపై దానిని విసరెను. దానిచే నాభీష్మునిరథము, రథాశ్వములు,

సూతుఁడును జూర్ణమయ్యెను. పిదప నటులు విరథుఁడై పాదచారియై యున్న రథికోత్తముఁ డగు నా శ్వేతునిఁ గాంచి వడిగా శల్యుఁడు మున్నగుమహారథులు వానిపై వెడలిరి. పిమ్మట భీష్ముఁ డటులు తన రథము విఱుగుటచే వేఱొకరథ మధిష్ఠించి విల్లెక్కిడి మెల్లగా మఱల నా శ్వేతుని సమీపించెను.

ఇంతలో నాభీష్మునకు దివ్యమై, హితమై, విశాలమైన యొక యాకాశవాణి విననయ్యెను. "ఓభీష్మా! భీష్మా! నీవిఁక జాలము సేయక ప్రయత్నింపుము. ఇదియే వీనిని జయించు కాలముగా విధిచేఁ గల్పింపఁ బడియున్నది." అని.

ఆదేవదూతవచనములు విని సంతుష్టాంతరంగుఁడై భీష్ముఁడామార్గముననే తనచిత్తము నుంచెను. అంత విరథుఁడై పాదచారియై యున్న రథికవరుఁ డగు నా శ్వేతునిఁ గాంచి, సాత్యకి, భీముఁడు, ధృష్టద్యుమ్నుఁడు, కైకయులు, ధృష్టకేతువు అభిమన్యుఁడు మున్నగు మహారథులెల్లఁ గూడి యాతనికి సహాయులై మఱలిరి. అటులు వచ్చుచున్న యామహారథుల నారసి ద్రోణుఁడు, కృపుఁడు, శల్యుఁడును దనకు సహాయులుగా శాంతనవుఁడు వాయువేగమును బర్వతమువలె వారి నొక్కగడియలో నివారించెను. అటు లాభీమసేనాదులు నివారింపం బడుటయు, శ్వేతుఁడే మఱలఁ గత్తినెత్తి భీష్మునివిల్లు ఖండించెను. అంత నాశాంతనవుఁ డటులు విఱిగిన తనవిల్లు విడిచి యాదేవదూతవచనమును దలంచి వానిని జంపుటకుఁ ద్వరపడుచు వేఱొకధనువు పూని యింద్ర ధనుస్సునాఁదగువాని నెక్కిడి యా శ్వేతునిలక్ష్యముచేసి భీమసేనాదులతోఁ గూడియున్నయాతని నెదుర్కొనియెను. అటు లా శ్వేతు నెదుర్కొని తనపైకి వచ్చుచున్నభీము నఱువదిబాణములచేఁ గొట్టి యభిమన్యుని మూఁడుబాణములచే నివారించి సాత్యకిని శరశతముచేఁ బ్రహరించి ధృష్టద్యుమ్ను నిరువదిబాణములచేఁ గొట్టి కైకయులపై నైదింటిని బ్రయోగించి పీడించెను. అటులు వారినెల్లఁ దనఘోరశరములచే నివారించి మఱల శ్వేతునిపైకిఁ బరువిడి మృత్యుతుల్య మగు నొకతీవ్రబాణమును వింట సంధించి ప్రయోగించెను. లోమప్రవాహియై బ్రహ్మాస్త్రసంయుక్తమగు నాబాణమును దేవతలును, గంధర్వులు, పిశాచులు, రాక్షసులు, నురగులును భయభ్రాంతులై చూచుచుండిరి.

ప్రజ్వలించునగ్నిని బోలియున్న యాశ్వేతునికవచము నాభీష్మప్రయుక్త మగు బాణము భేదించి పిడుగువలెఁ బుడమిఁజొచ్చెను. అటులా శ్వేతుని జీవితమును లాగికొని యాబాణము కిరణములతో సూర్యుఁడువలె వెడలిపోఁగా నతఁడు నేలఁ గూలెను. ఓరాజా! అటులు భీష్మునిచే నిహతుఁడై పడిన యాతనిఁ గొండనుండి జాఱినశిఖరమునువలె మేము చూచితిమి. అపుడు మహారథు లగుక్షత్రియులును, పాండవులును శోకించిరి. నీతనయులగు కౌరవులెల్లరును బరమానందభరితులైరి. ఓరాజా! అటులు నేలఁగూలిన శ్వేతునిఁ గాంచి దుశ్శాసనుఁడు పలువిధము లగువాద్యము లతో నాట్య మొనర్చెను. అట్టిమహారథుని భీష్ముఁడు చంపుటను జూచి శిఖండి మున్నగురథికులు వడంకసాగిరి. ఓరాజా! పిమ్మట నర్జునుఁడును గృష్ణుఁడును నట్టి తమసేనాపతి హతుఁడగుటను, గొంత చింతించి మెల్ల మెల్ల నూఱటగొనిరి. పిమ్మట నీవారికిని, వారివారికిని గొంత విశ్రాంతి గలిగెను. మీసైన్యములు మఱిమఱియు నొఱయుచు మ్రుఱియు చుండిరి. పాండవులు మనోవైకల్యమొంది యట్టిఘోరవధమునకుఁ జింతిలుచు మఱలిరి. అని తెలుప విని ధృతరాష్ట్రుఁడు మఱియు నిట్లనియె.

ప్రథమదివసయుద్ధవిశ్రాంతి

ఓసంజయా! అటు లా శ్వేతుఁడు రణరంగమున మడియఁగాఁ బాండవులును బాంచాలురును నేమియొనర్చిరి? ఆశ్వేతునిమరణమునువిని వానికై ప్రయత్నించి పలాయితు లగు వైరులవృత్తమును వినుటచే నీవాక్యములకు సంతసమొందితిని. కాని దీనికిఁ బ్రత్యుపాయమును దలంచిన నాకు లజ్జ గలుగుచున్నది. వీరుఁడును, వృద్ధుఁడును నగుభీష్ముఁ డనురక్తుఁడై యున్నవాఁడు. నాకొమరుఁడు బుద్ధిశాలియగు పినతండ్రి కొడుకుతో వైరముఁ బూనికొనియెను. వాఁడుదుర్మతియై పురుషాధము లతోడి సహవాస మొనర్చియున్నవాఁడు. ఈయుద్ధమునకు భీష్ముఁడుగాని ద్రోణుఁడుగాని సమ్మతింపలేదు. అటులే నేనును, గాంధారియుఁ, గృపాచార్యుఁడును నిష్టపడమైతిమి. ధర్మజుఁడును, గృష్ణుఁడును, నర్జునాదులును నందుల కంగీకరింపరైరిగదా! పలుమాఱులు నేనును, గాంధారియు, విదురుఁడును నివారించుచునే వచ్చితిమి. అటులే పరశురాముఁడును, వ్యాసుఁడును నివారించిరి. కాని దుర్యోధనుఁడు నిత్యము దుష్టబుద్ధియై

ప్రవర్తించుచు వచ్చెను. వాఁడు కర్ణశకునిదుశ్శాసనులమతమున కిష్టపడి పాండవులయెడ నసూయ వహించెను. వాఁడు ఘోరము లగుకష్టముల పాలగునని నేను దలంచియున్నవాఁడను. ఈశ్వేతునివినాశముచే భీష్మునకుఁ గల్గినవిజయము కష్టావహ మగునని సంశయింపవలసి యున్నది. క్రుద్ధుఁడై పిమ్మటఁ గృష్ణునిఁగూడియర్జునుఁ డేమియొనర్చెను? ఓనాయనా! అర్జునునివలన నాకు భయమడంగకున్నయది. అతఁడు మిగుల శౌర్యము గలవాఁడు. దీనికి వెంటనే ప్రతీకార మొనర్పక తప్పదు. ఇఁక నతఁడు తనశరపరంపరచే వైరులశరీరములను జూర్ణముచేయక మానఁడు. ఇంద్రపుత్త్రుఁడును, నుపేంద్రతుల్యుఁడును, బలముచే మహేంద్రునకు సాటి యగువాఁడును, గ్రోధసంకల్పములు వ్యర్థముగానివాఁడును నగునర్జునునిఁ జూచి మామనము లెట్లుండునో నీవే యూహింపవచ్చును. వేదవేత్తయు, శూరుఁడును, దేజశ్శాలియు నగునతఁ డైంద్రాస్త్ర మెఱిఁగినవాఁడు. మఱియు వజ్రస్పర్శతుల్యము లగు నస్త్రములును శత్రులపైఁ బ్రయోగించువాఁడు. మఱియు శరలాఘవముగలవాఁడునుగదా! అది యటు లుండఁగా, నా శ్వేతవధమును విని బలశాలియగు ధృష్టద్యుమ్నుఁ డేమి యొనర్చెను? ఓసంజయా! మహాత్ము లగుపాండవులచిత్తము లా శ్వేతుని వధమునకును, వెనుకటివైరమునకును బ్రజ్వలించియుండునని తలంచెదను. వారికి దుర్యోధనాదులపైఁ గలక్రోధమును రేపవల్లు దలంచినచో నేనాసుయోధనుయెడ శాంతిపూనియుండు టెట్లు? ఓసంజయా! అటుపై యుద్ధ మెటులు జరిగెనో దానినంతయు నా కెఱిఁగింపుము.

అదివిని సంజయుఁడు "ఓరాజా! స్థిరచిత్తుఁడవై వినుము. ఈగొప్ప తప్పిదము నీయదియే. దీని నాసుయోధనునిపై నారోపించుట పాడి గాదు. నీబుద్ధి నీరుపోయినపిదపఁ గట్టు గట్టుటకుఁ దలంచునట్టిది. నీవిల్లు కాలినపిమ్మట నూయిఁ ద్రవ్వించువాఁడ వగుచున్నవాఁడవు. ఓరాజా! నిన్నపగటిమొదటిపూఁట జరిగిన యామహాదారుణయుద్ధమున భీష్మునిచే నట్టు లా శ్వేతుఁడు హతుఁడగుడుఁ గృతవర్మతోఁ గూడియున్న శల్యునిఁ జూచి విరాటపుత్త్రుఁ డగు శంఖుఁడనువాఁడు కుపితుఁడై నేయివోసిన యగ్నివలెఁ బ్రజ్వలించి యింద్రచాపతుల్య మగు తనధను వెక్కిడి, యామద్రరాజును జంప నెంచి యాతని నెదుర్కొనియెను. అంతఁ దన పైకి సేనాపరివృతుఁడై వచ్చి శరవర్షమును గురియుచు మత్తగజమువలె

విజృంభించు నాశంఖునిఁ గాంచి విరథుని లేదుర్వారు నాశల్యునకుఁ దోడ్పడ వెడలి మృత్యుదంష్ట్రాంతరమునఁ జిక్కియున్న యాతనిచుట్టును గావలిగానుండిరి. అంత భీకరబాహుఁ డగుభీష్ముఁడు మేఘమువలె గర్జించుచు విల్లుపట్టి వానిపైకి వెడలెను. ధనుర్ధరుఁడై వచ్చుచున్న యామహారథు నారసి పాండవసైన్యము మిక్కిలి జడిసి పెనుగాలికిఁ గదలు నోడవలెఁ గంపింపఁజొచ్చెను. అపు డర్జునుఁడు వడిగా నేగి యాశంఖునకుఁ బురస్సరుఁడై యుండెను. అతఁ డాశంఖునిఁ గాపాడవలయుననుపట్టుదలతో నందులకు వచ్చెను. వారిరువురకు నపుడు గొప్పయుద్ధము జరిగెను. అపుడు యుద్ధమొనర్చు యోధులలో నెంతయు హాహాకారము జనించెను. తేజము తేజముతోఁ గలిసెనని చూచెడివా రాశ్చర్యమొంద సాగిరి. పిదప శల్యుఁడు గదాహస్తుఁడై రథమునుండి దిగి యాశంఖుని రథాశ్వములను నాల్గిటిని గొట్టెను. అటులు రథము హతమగుడు, నాశంఖుఁడును వడిగా రథము డిగి కత్తిపట్టికొని వెడలి యర్జునునిరథ మధిరోహించి శాంతినహించెను. అంత భీష్మునిరథమునుండి శరపరంపర లెగురుచు భూమ్యంతరిక్షముల రెంటిటిని నిండింపఁజొచ్చెను. అపుడు పాంచాలురును, మాత్స్యులును, కేకయులును భీష్మునిబాణముల కెఱయై పడుచుండిరి. అంత నాశాంతనవుఁడు సవ్యసాచిని విడిచి పాంచాలపతి యగుద్రుపదు నెదుర్కొనియెను. అటు లెదుర్కొని ప్రియుఁడును సంబంధియు నగునాతనిపై శరములు గురియుచు వేసవియగ్ని యెండిన యడవులనువలె నాద్రుపదునిసైన్యములనెల్ల బూడిదగావింప మొదలిడెను. ఆరణరంగమున నపు డాగాంగేయుఁడు పొగలేకమండెడు నగ్నివలె నలరుచుండెను. తనతేజముచే మధ్యందినమార్తాండునివలెఁ బ్రజ్వలించు నాశాంతనవునిఁ బాండవవీరు లెవ్వారును నారయలేకుండిరి. పాండవులు భయభ్రాంతులై తమ కిఁక రక్షకు లెవ్వారని తలంచి చలిచే వడఁకుగోవులవలె నలుదెసలఁ జూచుచుండిరి. ఆపుడు నిరుత్సాహముమై పీడవడియుఁ గొట్టువడియుఁ బరువిడుచున్న యప్పాండవసైన్యమున నెంతయు హాహాకారములు జనించెను. పిమ్మట భీష్ముఁడు, తనకేలనున్న విల్లు త్రిప్పుచునే విషముగ్రక్కుపాములనుబోలిన బాణములను బ్రయోగించుచుండెను. మఱియు నతఁ డెల్లదిక్కులను దనబాణములకుఁ దానకముగాఁ నొనర్చి యొక్కొకరినే చెప్పిచెప్పి యాపాండవరథికులును

గొట్టుచుండెను. అటు లాతనిచేఁ బాండవసైన్యములెల్లఁ బీడింపఁబడి భంగమొందఁగా నంత సూర్యుఁ డస్తమించుటను నేదియు నించుకేనిఁ దెలియఁబడకుండెను. అంత నాశాంతనవునుద్రేకమును జూచి పాండవు లానాఁటికి యుద్ధమును ముగించిరి" అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## క్రౌంచవ్యూహనిర్మాణము

"ఓయంబికానందనా! అటు లా మొదటిదినము యుద్ధము ముగియఁగా భీష్ముని సంరంభమున కెంతయు, నీతనయుఁడు సంతోషమొందెను. పిమ్మట ధర్మజుఁడు తనతమ్ములును దక్కినరాజులును వెంటఁరాగా జనార్దనునిఁ జూడఁబోయి, తనకపుడు గల్గినపరాజయమున కెంతయుఁ జింతిలుచు, భీష్మునివిక్రమమును గుఱించి యావాసుదేవునితో నిట్లు పలికెను.

ఓ దేవా! భీమపరాక్రముఁ డగుభీష్మునిఁ జూచితివిగదా! ఇతఁడు మనసైన్యమును దనబాణాగ్నిచే నెండుగడ్డి నగ్నివలె దహించి యున్నవాఁడు. ఈమహాత్ముని మన మెదురించు టెట్లు? నేయివోసినయగ్నివలెఁ బ్రజ్వలించి మనసైన్యములను రూపుమాపుచున్న యీమహాబలుని, నీ ధనర్ధరుని, నీపురుషవ్యాఘ్రుని జూచియు నీతని బాణములచేఁ గొట్టువడియు సేనలెల్లఁ జెల్లాచెదరై పరువులిడెను. ఓకృష్ణా! కుపితుఁడగుయముని నైన జయింపవచ్చును. వజ్రపాణి యగునింద్రు నోడింపవచ్చును. పాశధరుఁడగు వరుణు నోర్చవచ్చును. గదనుబూనివచ్చిన కుబేరునిఁ దఱుమవచ్చును. కాని తేజశ్శాలియై మహారథుఁడగు భీష్మునిజయింప నలవిగాదు. ఇటులుగాఁగా భీష్ముఁడనెడి యగాధజలమున నోడలేక మగ్నుఁడనై యున్నవాఁడను, నాబుద్ధిలోపముచే నిటు లీభీష్ము నెదురించితిమి. ఓ గోవిందా! ఇఁక వనమున కేగెదను. అటులైనచో నాకు సుఖజీవనము గలుగును. ఈభూపాలురను మృత్యువువాతఁ బడఁద్రోయనివాఁడ నగుదును. ఓకృష్ణా! ఈభీష్ముఁడు నాయీసైన్యమునెల్ల నశింపఁజేయునేమో! అతనిబాణాగ్నికి నాసేనలు శలభములగుట తగదుగదా! ఓవార్ష్ణేయా! పరాక్రమవంతుఁడనయ్యు రాజ్యమునకుఁగా క్షీణదశనొందితిని. వీరులగు నాసోదరులు శరపీడితులై బాధింపఁబడిరి. భ్రాతృభక్తిమె నాకుఁగా

రాజ్యమునుండియు సుఖమునుండియు భ్రష్టులైరి. జీవిత మెవ్వారికిని ప్రియముగదా! మఱియు నది మిక్కిలి దుర్లభమైనది. దాని నెవ్వరు నాదరింపక తప్పదుగదా! జీవితావశేషముచేఁ గష్టసాధ్య మగు తప మొనర్చికొనియెదను. కాని మిత్రులగు వీరినెల్లఁ జంపింపఁజాలను. వేల కొలది సారథికులను దనయస్త్రములచే మహాబలుఁడగుభీష్ముఁడు చంపును. ఓమాధవా! ఇపు డేనేమియొనర్చినఁ గర్తవ్య మొనర్చినవాఁడ నగుదునో జాగుసేయక తెలుపుము. అర్జునుఁ డీసమరమున మధ్యస్థుఁడువలె నగపడు చున్నవాఁడు. భీముఁ డొక్కఁడే శక్తివంచనము సేయక మహాబలుఁడై పోరుచున్నవాఁడు. అతఁడు తనక్షత్రియధర్మమును విడువక బాహు బలము చూపుచున్నవాఁడు. వీరమారక మగు తనగదాప్రహారముచే నుత్సాహముకోలఁదిని ధీరచిత్తుఁడై గజాశ్వములయోధను, రథపదాతు లందును గష్టసాధ్య మగుపని యొనర్చువాఁడై యున్నాఁడు. ఓబావా! ఇతఁడు పరసైన్యములను క్షయింపఁజేయఁదగినవాఁడే. ఋజుబుద్ధిచే నితఁడు యుద్ధమున నూఱేండ్లకైనను నిటులొనర్చువాఁడే. ఈ నిమిత్తుఁ డొకఁడే యస్త్ర వేత్తకాని యితఁడు మమ్ముపేక్షించుచున్నవాఁడు. మేము భీష్మునియు, ద్రోణునియు బాణములచేఁ బీడింపఁబడుచున్నవా రము. ఇఁక నాయిరువురదివ్యాస్త్రములును సర్వక్షత్రియులను మఱిమఱి యు దహింపక తప్పదు. ఓకృష్ణా! భీష్ముఁడు విజృంభించి యోధవరులతోఁ గూడ మమ్ములను నశింపఁజేయును. ఈతనిపరాక్రమ మనిర్వాచ్యము. ఓయోగీశ్వరా! ఎవ్వఁడు దావాగ్నిని మేఘమువలె నాగాంగేయుని నశింపఁజేయునో యట్టి మహారథుఁడును ధనుర్ధరుఁడు నగు నాతని నొకని నీవు కనిపెట్టుము. ఓగోవిందా! నీయనుగ్రహముచేతనే పాండవులు వైరుల నోడించి బందుగులతో నిజరాజ్య మనుభవింతురు. అని యటులు పలికి ధర్మజుఁ డేదియో చింతించుచు నంతర్ముఖుఁడై శోకముచే మతిచెడి కొంతదనుక నటులే యుండెను.

అటులు శోకార్తుఁడై మతిచెడియున్న యాధర్మజునిఁ జూచి గోవిందుఁడు వారెల్ల సంతసించునట్లుగా "ఓపాండవోత్తమా! పరి తపింపకుము. నీవిటులు శోకించుట పాడిగాదు. నీతమ్ములు సర్వలోక శూరులు. నేను మీకుఁ బ్రియమొనర్చువాఁడను. మహారథుఁ డగు నీ సాత్యకియును, విరాటద్రుపదులును, ధృష్టద్యుమ్నుఁడును నటులే బల

శాలు లగునెల్ల రాజులును దోడ్పడియున్నవారు. మఱియు వారెల్ల నీ యనుగ్రహముంగోరి నీకు భక్తులై యున్నవారు. ఈపార్షతుం డగు ధృష్టద్యుమ్నుఁడు నిత్యమును నీకోర్కులఁ దీర్ప నడుకట్టియున్నవాఁడు. ఇట్టివాఁడేగదా నీకు సేనాపతియై యున్నవాఁడు. ఇఁక శిఖండియన్నవో భీష్ముని సమయింపఁజేయువాఁడు. నీవేల శోకింపవలయును?" అని తెలుప విని యాయుధిష్ఠిరుఁడు మహారథుఁడగుధృష్టద్యుమ్నుంగాంచి యా రాజసంఘములోఁ గృష్ణుఁడు వినుచుండఁగా నిట్లు పలికెను.

ఓపార్షతా! నేనొకటి తెలిపెదను వినుము. దానిని నీవతిక్రమింప రాదు. నీవు మాకు సేనాపతివై యుండవలయునని వాసుదేవుఁడు నిరూపించియున్నవాఁడు. మున్ను దేవసేనలకుఁ గుమారస్వామి నాయకుఁడై యుండెనుగదా! అటులే నీవును బాండవసేనల కధిపతివిగా నుండవలయును. పరాక్రమశాలి వగునీవు కౌరవులను జంపుము. నేనును నాసోదరులును నిన్ను వెన్నంటివచ్చువారము. అటులే ద్రౌపదేయులును, దక్షిణరాజులును నీవెనుకవచ్చి నీకుఁ దోడ్పడుదురు.

అది విని ధృష్టద్యుమ్నుఁ డారాజలోకము సంతసించునట్లుగా "ఓమహారాజా! మున్ను శంకరుఁడు ద్రోణునిప్రాణములను గొను వానినిగా నన్ను నిర్ణయించి యున్నవాఁడు. కావున రణగర్వితు లగు భీష్ముని, ద్రోణునిఁ, గృపుని, శల్యుని, సైంధవుని, నింకనుగల యెల్ల వారిని నిపుడే యెదురించువాఁడను" అని పలికెను.

పిమ్మటఁ బరాక్రమవంతు లగు పాండవులంగూడి, రాజోత్తముఁ డగు నాధృష్టద్యుమ్నుఁడు సన్నద్ధుఁడై యుండఁగా నపు డాతనితో యుధిష్ఠిరుఁడు "ఓసేనానాయకా! నేనొకటి తెలిపెదను వినుము. క్రౌంచారుణమనెడి యొకవ్యూహము గలదుగదా! ఇది సర్వశత్రులను నశింపఁజేయునది. దానిని మున్ను బృహస్పతి దేవాసురయుద్ధమున నింద్రునకుఁ దెలిపియున్నవాఁడు. కావున నీవిపుడు శత్రుసైన్యవినాశకమును, మున్నెన్నఁడు నెవ్వరు నెఱుంగనదియు నగుదానిని వైరులవ్యూహమునకుఁ బ్రతివ్యూహముగా నొనర్పుము. కౌరవులును దక్షిణరాజలోకమును దానిం గనుంగొనెదరు." అని యతఁడు మున్నింద్రుఁడర్జునున కాజ్ఞాపించునట్లుగా ధృష్టద్యుమ్నున కాజ్ఞాపింప నతం డందులకు సమ్మతించెను.

అంత సూర్యోదయమయ్యెను. సకలసైన్యములకును ముందుగా నర్జునుఁ డుంపఁబడియెను. అతని కేతువు సూర్యమండలమునంటి మనోహరమై యద్భుతముగాఁ గానవచ్చుచుండెను. అది మున్నింద్రునాజ్ఞచే విశ్వకర్మచే నిర్మింపఁబడి యింద్రాయుధములతోఁ దుల్యము లగుపతాకలతో నలంకరింపఁబడియుండెను. మఱియు నది పక్షివలె మిన్నుముట్టుచు గంధర్వనగరము నావెలయు రథమార్గములందు నాట్యముచేయుచున్నట్లుండెను. గాండివధనుస్సుతోఁ గూడి రత్నమయమై వెలయు నాధ్వజముచే భానునిచే మేరుగిరివలె నర్జునుఁ డెంతయు శోభిల్లుచుండెను. ద్రుపదుఁడు తనగొప్పసైన్యముతోఁ గూడి యావ్యూహమునకుఁ దలగా నుండెను, రాజోత్తములగు కుంతిభోజుఁడును, శైబ్యుఁడును దానికిఁ గన్నులుగా నుండిరి. దశార్ణదేశాధీశుఁడును, బ్రయాగాధీశులును దాశేరకులతోఁ గూడి యనూపకులును, కిరాతులును దానికి మెడగా నియమింపఁబడియుండిరి. పటచ్చరులును, హూండులును, పౌరవకులును, నిషాదులును దనకు సహాయులుగా ధర్మరాజు దానికిఁ దోఁకగా నుండెను. భీముఁడును, ధృష్టద్యుమ్నుఁడును దానికి ఱెక్కలుగా నుండిరి. అటులే ద్రౌపదేయులును, నభిమన్యుసాత్యకులును, దారదులు, పిశాచలు, పౌండ్రులు, కుండీవిషులు, మడకులు, లడకులు, తంగణులు, వరతంగణులు, వాహీకులు, తిత్తురులు, పాండ్యులు, నోఘుర్లిలు, శరవులు, తుంబుములు, వత్సులు, నాకులులు, తమకు సహాయులుగా నకులసహదేవు లెడమప్రక్క నుండిరి. దానికేఁ బదివేలురథములు ఱెక్కలుగను, లక్షరథములు శిరస్సుగను, వెనుక నొకయర్బుదమును, నిరువది మెడయందును గలిగియుండెను. లక్షపై డెబ్బదివేలయేన్గులు దానిఁ పక్షములందును, బక్షాగ్రములందును, బక్షప్రాంతములందును నిలుపఁబడియుండెను. ఆయేన్గులు నడుచునట్టిపర్వతములువలె వెడలెను. దానిజఘనప్రదేశమునఁ గేకయులతోఁ గూడి విరాటుఁడును, గాశిరాజు, చైద్యుఁడును ముప్పదివేలరథములతో నిలుపఁబడియుండిరి. ఓరాజా! పాండవు లిట్టివ్యూహమును బన్ని సూర్యోదయమునకై నిరీక్షించుచు యుద్ధసన్నద్ధులై యుండిరి. వారివారిధ్వజములందును, గజములందును నిర్మలములై యాదిత్యునివలె వెలయు గొప్పశ్వేతచ్ఛత్రములు గానవచ్చుచుండెను.'' అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## కౌరవసైన్యవ్యూహము

ఓయాంబికేయా! భేదింపవలనుపడని యాక్రౌంచవ్యూహమును గాంచి నీకొడుకు ద్రోణకృపశల్యులను జేరి సౌమదత్తియు, అశ్వత్థాముఁడు, వికర్ణదుశ్శాసనులు మున్నగుసోదరులను రావించి యింకను యుద్ధము నకువచ్చిన పలువురుశూరుల నుద్దేశించి "ఓవీరులారా! మీరునానావిధ శస్త్రములతోఁ బ్రహరించువారును, శాస్త్రార్థవేత్తలును నై మీరొక్కొ-కరును, బాండవుల నోడింప సమర్థులైనవారు గదా! అట్టి మీరం దఱును గలిసినచో వేఱుగాఁ జెప్పనేటికి? కావున మనసైన్యము భీష్మ రక్షితమై యెల్లవిధముల సంపూర్ణ మనఁదగియున్నది. భీమాభిరక్షిత మగువారిసైన్యమన్నచో పరిమితముగా నున్నది. సంస్థానులు, శూర సేనులు, వేణికులు, కుక్కురులు, రేచకులు, త్రిగర్తులు, మద్రకులు, యవనులు, శత్రుంజయుఁడును, దుశ్శాసనుఁడును, వికర్ణుఁడును, నందోప నందకులును, జిత్రసేనుఁడు, మణిభద్రకులును దమతమసైన్యములతోఁ గూడి భీష్ముని రక్షింపవలయును." అని పలికినపిదప భీష్మద్రోణులును, నీ కొడుకులును బాండవులను బ్రతిఘటించుటకుఁగా మహావ్యూహము నొకటి పన్నిరి. అందు భీష్ముఁ డెల్లెడల సైన్యముచేఁ బరివేష్టితుఁడై యుండెను. ఆతఁడు సైన్యములను నడుపుచు నింద్రుఁడువలె వెలయు చుండెను. మహారథుఁడగుద్రోణుఁ డాతని ననుసరించి వెడలెను. కుంత లులు, దశార్ణులు, మాగధులు, విదర్భులు, మేఖలు మున్నగువారు తమసైన్యములతోఁగూడియుద్ధశోభితుఁడగుభీష్మునకు రక్షకులై యుండిరి. గాంధారులు, సింధుసౌవీరులు, శిబులును, శకునియు, ద్రోణునకుఁ బాల కులుగా నుండిరి. పిమ్మట దుర్యోధనుఁడు తనసోదరులఁగూడి యాశ్వా తకులు వికర్ణులు వామనకోసలులును, దరదులు, వృకులును, క్షుద్ర కులు, మాలవులును దనవెంట రాఁ బాండవసైన్యముల నెదుర్కొని యెను. మనవారివ్యూహమున భూరిశ్రవుఁడును, శలుఁడు, శల్యుఁడు, భగదత్తుఁడు, విందానువిందులు, అవంతిదేశాధీశులు నెడమపార్శ్వమును బాలించువారై యుండిరి. సోమదత్తుఁడు, సుశర్మ, కాంభోజుఁ డగు సుదక్షిణుఁడు, శతాయువు, శ్రుతాయువు కుడిప్రక్కనుండిరి. అశ్వత్థా మయుఁ గృతవర్మ, కృపుఁడును, గొప్పసైన్యముతోఁ గూడి వెనుక

భాగమును రక్షించువారై యుండిరి. మఱియు నానాజనపదాధీశులును గేతుమంతుఁడును, వసుదానుఁడును కాశ్యపుత్రులును నందే యుండిరి. పిదప నీవారెల్ల యుద్ధోత్సాహపూరితులై శంఖములను బూరించు వారును సింహనాదము లొనరించువారునునై సంతోషముతో నుండిరి. అటులు సోత్సాహులై యున్న తనవారిసింహనాదములను విని కురు వృద్ధుఁడగుభీష్ముఁడు సింహనాదమొనర్చి శంఖమును బూరించెను. అనంత రము పాండవులశంఖములును భేరులును గాహళములునుమ్రోగసాగెను. ఆనకదుందుభులు మొఱసెను. ఆచప్పుడు లెంతయు సంకులమయ్యెను. పిదపఁ దెల్లనిగుఱ్ఱములు పూన్చిన గొప్పరథమధిరోహించి కృష్ణార్జునులు సువర్ణరత్నభూషితములగు తమతమపాంచజన్య దేవదత్తములనుబూరిం చిరి. అటులే భీముఁడు తనపౌండ్రమును, ధర్మజుఁ డనంతవిజయమును, నకులసహదేవులు సుఘోషమణిపుష్పకములును బూరించిరి. పిమ్మటఁ గాశి రాజు, శైబ్యుఁడు, శిఖండి ధృష్టద్యుమ్నుఁడు, విరాటుఁడు, సాత్యకి, ద్రుపదుఁడు, ద్రౌపదీపుత్రులును దమతమశంఖములను బూరించి సింహ నాదము లొనర్చిరి. ఆవీరు లొనరించినగొప్పచప్పుడులు వెడలి భూన భోంతరములను బ్రతిధ్వనింపఁజేసెను. ఓరాజా! ఇటులు కురుపాండ వుల రెండుసైన్యములును బెండ్లికి వెడలునట్లు లుత్సాహభరితులై పర స్పరము బ్రహరించుకొనువారై మఱల యుద్ధమునకు వెడలిరి." అని తెలుప విని ధృతరాష్ట్రుఁడు మఱియు నిట్లనియె.

## భీష్మార్జునులయుద్ధము

"ఓసంజయా! ఇటు లుభయసైన్యములును వ్యూహములుగా నేర్పడినపిదప మహారథు లగువారెల్ల నెటులు యుద్ధమొనర్చిరో తెలు పుము."

అది విని సంజయుఁడు "ఓరాజా! అటులు సైన్యములు సన్నద్ధ ములై మనోహరములగు ధ్వజపతాకాదులతో వెలయుచు నపారమగు సాగరమువలెఁ గానవచ్చెను. అట్టిసైన్యమునడుమ నీకొమరుఁడుండి తనవీరులందఱను యుద్ధమునకుఁ బ్రోత్సహించెను. అది విని వారెల్ల మనసులు గట్టిచేసికొని ప్రాణముల కాశపడక యొక్కుమ్మడిగాఁ దమ తమధ్వజముల నెత్తికొని పాండవుల నెదురించిరి. పిమ్మట నద్భుత మగు

గొప్పసంకులసమరమయ్యెను. నీవారియు, వారివారియు రథములు నేస్త లును గలిసెను. రథికులు ప్రయోగించిన తేజోవంతములై తీవ్రాగ్రములనుబాణములు గుఱ్ఱములందును, నేస్తలందును బడుచుండెను. అటులు యుద్ధ మారంభమగుడు కవచము దొడిగి విల్లెక్కిడి, భీమపరాక్రముఁడై భీష్ముఁ డప్పాండవసైన్యములను సమీపించి యభిమన్యుఁడు, భీముఁడు, అర్జునుఁడు, కేకయులు. విరాటుఁడు, ధృష్టద్యుమ్నుఁడు, చేది మత్స్యాధీశులుమున్నగువీరులపై శరవర్షమునుగురిపించెను.ఆమహావీరుని సమాగమముచే నామహావ్యూహమెల్ల వడంకఁజొచ్చెను. ఎల్లసైన్యములకు సమ్మర్దముగలిగెను. అపుడు రౌతులును, బదాతులును, వాజులును, వారణములును గొట్టువడి పాండవులు చెదిరిన రథసైన్యములుగలవారైరి. అపు డర్జునుఁడు మహారథుఁ డగు భీష్మునిఁ జూచి కుపితుఁడై కృష్ణునితోఁ దనరథ మావీరునిపైఁ బఱపుమని నియోగించి, "ఓకృష్ణా! ఈ గాంగేయుఁ డెంతయుఁ గ్రోధావేశపరవశుఁడై యున్నవాఁడు. ఇతడు దుర్యోధనునిమేలుగోరి మనసైన్యములను దునుమాడుననుట స్పష్టము. ఓజనార్దనా! ఈద్రోణుఁడు, కృపుఁడు, శల్యుఁడు, వికర్ణుఁడు, సుయోధనుఁడు మున్నగుధృతరాష్ట్రనందనులు నీకేఁ బాంచాలురను జంపుదురు. కావున నీక ధనుర్ధరుఁడనై వారిని రక్షించుటకై నేను భీష్మునిఁ జంపవలయును." అని పలికెను. అది విని కృష్ణుఁ డర్జునునితో "ఓధనంజయా! సన్నద్ధుఁడవు గమ్ము. ఇదె నిన్నుఁ బితామహునిరథమును జేర్చుచున్నవాఁడను" అని వెంటనే యాభీష్మునిపైఁ దనరథము పఱపెను. అంత నాయర్జునుఁడు కదలునట్టి పెక్కుపతాకలుగలిగినట్టియుఁ, జక్కని గుఱ్ఱములచే నొప్పునట్టియు, నున్నతమై భయంకరారావములొనర్చు వానరచిహ్నముగలిగినట్టియు సూర్యతేజమును మేఘధ్వనియుఁగల తన రథముతో వెడలి కౌరవసైన్యమును శూరసేనులను దునుమాడుచు మిత్రులకు సంతసముగల్గించుచు నాభీష్ముడున్నకడకుబోయెను. అపుడు మత్తగజమువలెఁ దమపైకి వచ్చుచు రణశూరులగు తమకు వెఱపు గొలుపుచు బాణములచే సైన్యములఁ బడఁద్రోయుచున్న యర్జునుని కెదురుగా నడుచుచు, సైంధవుఁడు మున్నగువారును ప్రాచ్యసౌవీర కేకయులు మున్నగువారును దనకు రక్షకులుగాఁ జనుదేఱ భీష్ముఁ డర్జును నెదురింప వెడలెను. గాండివమును బూనినయర్జునుని భీష్ముఁడు

తప్ప వేతెవ్వ రెదురింపఁగలరు? లేదా ద్రోణకర్ణులలో నెవ్వఁడైనను నాతనిపైఁ బోగలఁడు. పిమ్మటఁ గురుపితామహుఁ డగుభీష్ముఁడు డెబ్బదేఁడునారసములతో నర్జును నొప్పించెను. అటులే ద్రోణుఁ డిరువదైదు బాణములచేతను గృపుఁ డైదువందలబాణములచేతను నర్జును నొప్పించిరి. పిదప దుర్యోధనుఁ డఱువదినాల్గును, శల్యుఁడు తొమ్మిదియు, నశ్వత్థామ యఱువదియు, వికర్ణుఁడు మూఁడునుగా బాణములు ప్రయోగించి యర్జును నొప్పించిరి.

అటులు వారెల్లఁ దన్ను నొప్పింపఁగా నర్జునుఁ డందులకుఁ గొండవలెఁ జలింపక భీష్మునిపై నిరువదైదును, గృపునిపైఁ దొమ్మిదియు, ద్రోణునిపై నఱువదియు, వికర్ణునిపై మూఁడును, సుయోధనునిపై నైదునుగా బాణములు ప్రయోగించి వారినెల్ల నొప్పించెను. అపుడాయర్జునునకు సాత్యకియు, విరాటుఁడు, ధృష్టద్యుమ్నుఁడు, ద్రౌపదేయులును, నభిమన్యుఁడును దోడ్పడిరి. అంత భీష్మునకుఁ దోడ్పడుటకై వెడలినద్రోణుని సోమకులతోఁగూడి ద్రుపదుఁ డెదురించెను. అంత నాగాంగేయుఁ డాపాండవమధ్యము నెనుబదిబాణములచే నొప్పింపఁగా నీవారెల్లరును హర్ష మొందిరి. వారిహర్షధ్వనులు వినినతోడనే రథికోత్తముఁ డగునర్జునుఁ డామహారథికులనడుమఁ బ్రవేశించి వారినెల్ల గుఱిచేసి గాండివముతోఁ గ్రీడింప మొదలిడెను. పిమ్మట దుర్యోధనుఁడు తనసైన్య మటులు పీడింపఁబడుట కోర్వక భీష్మునితో "ఓపితామహా! నేఁడు పార్థుఁడు మనసైన్యములనెల్ల మూలచ్ఛేద మొనరించుచున్నాఁడు. చూచితివా? నీవును రథికోత్తముఁ డగుద్రోణుఁడును జీవించియున్నంతవఱకును గర్ణుఁ డస్త్రమును బట్టుకొననని ప్రతిన చేసియున్నవాఁడు. అది నీనుండియేగదా! అతఁడెల్లపుడును నాహితము గోరువాఁడయ్యును నిపుడు పాండవులతో యుద్ధమొనరింపఁడు గదా! కావున నిపు డర్జునుఁ డెట్లు హతుఁడగునో యట్టివిధ మాచరింపుము." అని పలికెను.

ఓరాజా! ఆసుయోధనునిపలుకు లాలించి నీతండ్రియగు దేవవ్రతుఁడు "ఛీ! ఛీ! ఏమి క్షత్త్రియధర్మము" అని పలుకుచుఁ బార్థుని తేరు సమీపించెను. ఓరాజా! ఆతెల్లగుఱ్ఱములవా రొకచో నట్లు గలియుటను జూచి పార్థివులందఱును శంఖములను బూరించి సింహనాదము

లొనరించిరి. అశ్వత్థామయు, దుర్యోధనవికర్ణులును, నాగాంగేయునకు దోడ్పడి యుద్ధమొనర్చువారై యుండిరి. అటులే పాండవులందఱును నప్పార్థునకు నలుగెలంకుల నుండిరి. అటులందఱును సన్నద్ధులగుడు యుద్ధ మారంభమయ్యెను. అంత భీష్ముఁడు తొమ్మిది వాఁడితూపుల నర్జునునిఁ గొట్టఁగా నతఁ డాభీష్మునిఁ బదితీవ్రబాణములచేఁ బ్రహరించెను. మఱియు వారిరువురు నొకరుప్రయోగించినబాణము లింకొకరు నివారించుకొనుచు సరిగాఁ బోరాడుచు నిరువురును సంతసించుచు, యుద్ధాభిలాషులగుచు నొకరిదాని కొకరు ప్రతీకార మొనర్చుచు, హెచ్చుతగ్గులు లేక యుద్ధము నొనర్చిరి. భీష్మునివింటనుండి వెడలినశరజాలము లర్జునసాయకములచే ఖండితములై గానవచ్చెను. అటులే యర్జునుని ధనువునుండి వెడలినబాణములు భీష్మసాయకహతములై పుడమిని బడియెను. అర్జునుఁడు భీష్ము నిరువదిబాణములచేఁ గొట్టఁగా, నతఁ డాపార్థునిఁ దొమ్మిదిబాణములచే నొప్పించెను. ఇటు లిరువురుఁ బరస్పరము తమగుఱ్ఱములను, ధ్వజములను, రథదండములను, రథచక్రములను బ్రహరించుకొనుచు రణక్రీడ సలిపిరి. పిదప భీష్ముఁడు క్రోధావేశముతోఁ గృష్ణుని వక్షమును గుఱిచేసి మూఁడుబాణము లేయఁగా నాప్రహారముచే రణరంగమున నతఁడు, పుష్పించినమోదుఁగువలెఁ గానవచ్చెను. అందుల కర్జునుఁ డెంతయుఁ గినిసి భీష్మసారథిని మూఁడునారాచముల నొప్పించెను. పిమ్మట నిరువురును రథములను ఖండించికొన యత్నించిరిగాని సారథులనేర్పులచే మండలాకారములగు గమనాగమనములచేఁ దప్పించుకొనుట వారిప్రయత్నములు విఫలములయ్యెను. ఓరాజా! వారు పరస్పరము ప్రహరించుకొనుట కవకాశములను గనిపెట్టుచు మఱిమఱియు సింహనాదములతో శంఖధ్వను లొనర్చుచుండిరి. అటులే ధనుష్టంకారము లొనర్చిరి. వారిశంఖధ్వనులను, రథనేమిధ్వనులను బుడమి వ్రయ్యలై కంపింప నప్పుడు గొప్పచప్పు డుప్పతిల్లెను. వారిరువురలో నించుకేని భేదము గానరాదయ్యెను. బలము, చాతుర్యము, శౌర్యము మున్నగువానిచే నిరువురును సమానులై యుండుటచేఁ గౌరవులు వారి చిహ్నములచేఁ దెలిసికొని యందులకు వచ్చిరి. అటులే గుఱుతులను బట్టియే పాండవులును నర్జునుని సమీపించిరి. ఆభారతయుద్ధమున వారియద్భుతపరాక్రమములకు భూతములన్నియు నచ్చెరువడఁ జొచ్చెను.

ఎవ్వరును వారియుద్ధకౌశలమున భేదమునుగాని, దోషమునుగాని, రణధర్మలోపముగాని కనిపెట్టలేకుండిరి. వారు పరస్పరశరజాలములచేఁ గప్పఁబడి యగపడకుండిరి. అటులే వెంటనే యగపడుచువచ్చిరి.

అపు డచ్చోటికి వచ్చియున్న దేవతలును, గంధర్వులును, జారణులును, మహర్షులును నాభీష్మార్జునులపరాక్రమమును జూచి "ఆహా! మహారథు లగువీరు కుపితులై యుద్ధము చేయఁగా వీరితో దేవగంధర్వ మానవులలో నెవ్వరును బోరాడి వీరిని జయింపఁజాలరు. ఇట్టి యద్భుత యుద్ధ మేలోకముననుం గానరాదయ్యెను. భీష్ముఁ డర్జునుని జయింపలేకుండెను. అర్జునుఁడు భీష్ము నోడింపలేకుండెను" అని పరస్పరము సంభాషించుకొనసాగిరి. అపుడు వారిరువురను నీవారును వారివారును సన్నుతింప మొదలిడిరి. అంత నిరుతెగలవారును ఘోరయుద్ధమొనర్చిరి. అట్టి దారుణయుద్ధము ప్రారంభమగుచు నపుడు ద్రోణుఁడును, ధృష్టద్యుమ్నుఁడును దలపడిరి." అని తెలుప విని ధృతరాష్ట్రుఁడు మఱియు ని ట్లనియె.

## ద్రోణధృష్టద్యుమ్నులయుద్ధము

"ఓసంజయా! ద్రోణధృష్టద్యుమ్నులు దలపడిరని తెలిపితివిగదా! వారియుద్ధవిధ మెట్టిదో తెల్పుము. పురుషకారముకంటె దైవము ప్రబలమని తలంచెదను. కావుననే భీష్మునివంటివాఁ డర్జును నతిక్రమింపఁ జాలకుండెను. లేనిచో భీష్ముఁడు కుపితుఁడై చరాచరలోకములనెల్ల నొక్కగడియలోఁ జంపువాఁడుగాదే. ఓసంజయా! అట్టి తేజశ్శాలియు నైతము పాండవమధ్యము నోడింపలేకపోయెను. ఆహా! సమిచిత్రము."

అదివిని సంజయుఁడు "ఓరాజా! ఆద్రోణధృష్టద్యుమ్నుల దారుణ యుద్ధమువిధము దెలిపెదను, స్థిరచిత్తుఁడవై వినుము. దేవతలతోఁ గూడి యింద్రుఁడైన, నాయర్జునాదులను జయింపఁజాలఁడు. ఓరాజా! ద్రోణుఁడు ధృష్టద్యుమ్నునిపైఁ బెక్కువాఁడితూపులేసి యొకభల్లముచే వానిసారథిని రథనీడమునుండి పడఁద్రోసి పిదప వానిరథాశ్వముల నాల్గిటిని నాల్గుబాణములచేఁ జంపెను. పిమ్మట నాద్రోణుని ధృష్టద్యుమ్నుఁడు తొంబదితీవ్రశరములచే నొప్పించి నిలునిలుమని పలికెను. అటులు క్రుద్ధుఁడై యున్నధృష్టద్యుమ్ను నాద్రోణుఁడు నారాచములచేఁ

గప్పి ఘోరమై వజ్రాయుధమునాఁదగి రెండవమృత్యుదండమునుబోలు నొకబాణము నాతనిఁ జంపుటకై వింట సంధించెను. అటు లతఁ డొనర్పఁగా సైన్యమున హాహాకారములు జనించెను. అపుడు ధృష్టద్యుమ్నుని పౌరుషము నద్భుతముగాఁ జూచితిమి. అతఁ డొకఁడే యారణభూమిని గొండవలెఁ జలింపకుండెను. అటులు తనపైకి ఘోరముగావచ్చుచున్న యానారాచమును ఛేదించి యాతఁ డాద్రోణునిఁ దనశరవర్షముచే ముంచెను. అందులకుఁ బాండవులును బాంచాలురును సింహనాదము లొనర్చిరి. పిదప నాద్రోణునిఁ జంపఁదలఁచి సువర్ణవైదూర్యభూషితమై కడువడిగలశక్తి నాతనిపై నాపరాక్రమశాలి యగు ధృష్టద్యుమ్నుఁడు ప్రయోగించెను. కనకమయమై కడువడిగా వచ్చునట్టి యాశక్తిని జూచి నగుచు, ద్రోణుఁడు దానిని మూఁడుముక్కలుగా నొనర్చెను. అటులు తనశక్తి గొట్టువడఁ బ్రతాపనిధి యగు ధృష్టద్యుమ్నుఁ డాద్రోణుని శరవర్షమున ముంచెను. ద్రోణుఁ డాతనిశరపరంపరను నివారించి యాతనివిల్లు నడుమకు విఱుగునట్లుగా ఖండించెను. అంతఁ దనధనువు భగ్నమగుడు ధృష్టద్యుమ్నుఁ డాసమరమున నొకగదవూని ద్రోణునిపై వైచెను. పర్వతసార మగునాగద యాద్రోణునిఁ జంపునట్టి తలంపుతో నాతనిహస్తమునుండి వెడలి ద్రోణుని సమీపించెను. అపుడాద్రోణుని యద్భుతపరాక్రమమును గాంచితిమి. అంత నాద్రోణుఁడాగదను దనకరశరలాఘవముచే ఖండించి, సువర్ణాగ్రములై శిలాతీవ్రములై వెలయు వాఁడితూపులచే నాతనికవచమును భేదించి యాధృష్టద్యుమ్నునిమేను రక్తసిక్తముగా నొనర్చెను. అటులైనను ధైర్యము చెడక ధృష్టద్యుమ్నుఁడు వేఱొకవిల్లువూని యైదుబాణములచే నాద్రోణుని నొప్పించెను. అపుడు వారిరువురును రక్తసిక్తాంగులై వసంతమునఁ బూఁచిన మోదుగుచెట్లవలె వెలయుచుండిరి. పిమ్మట ద్రోణుఁడు కుపితుఁడై యెక్కువవిక్రమముతో మఱల ధృష్టద్యుమ్నునిధనువు త్రుంచి గట్టిగా నాకర్షించి విడిచిన బాణములచే మేఘము కొండనువలె గప్పి యొకభల్లముచే సారథిని రథమునీడనుండి పడఁద్రోసి నాల్గుబాణములచే నాతని నాల్గుగుఱ్ఱములను ద్రుంచి యాసమరరంగమున సింహనాదమొనర్చెను. మఱియు ధృష్టద్యుమ్నుఁడు విల్లుపూనఁగా దాని నొక బాణముచే ఖండించెను.

అంత నా ధృష్టద్యుమ్నుఁ డటులు ఖండితధన్వుఁడును, విరథుఁడును, హతాశ్వుఁడును హతసారథియు నై కేల నొకగద పూని యెంతయు విక్రమించెను. ద్రోణుఁ డాగదను వాఁడితూపులచేఁ దనరథము నందుండియే ఖండించెను. అది చూచువారి కచ్చెరువు గల్గించెను. పిదప ధృష్టద్యుమ్నుఁడు శతచంద్రమనెడి యొకడాలును దివ్యమగు నొకఖడ్గమును బట్టుకొని భుజాబలము వెలయ ద్రోణుని వధించు నుత్సాహముతోఁ గడువడిగా నాతనిపైకి వెడలెను. అపు డాధృష్టద్యుమ్నుఁ డామిషమునుగోరి మత్తగజముపై నుఱుకు సింగమువలెఁ గానవచ్చెను. అపుడు ద్రోణుఁడు చూపిన బాణలాఘవమును, బాహుబలమును, బౌరుషమును మేమెల్ల నద్భుతముగాఁ జూచితిమి. అతఁ డొకఁడే యటులు వెడలిన ధృష్టద్యుమ్నునిఁ దనశరవర్షముచే నివారించెను. అతఁ డెంతయు బలవంతుఁడయ్యును నాశరవర్షమునుండి తప్పించుకొని యేవైపునకును బోఁజాలకుండెను. అటులున్న ధృష్టద్యుమ్నునిఁ జూచి యాశ్చర్యమునొందితిమి. అతఁ డాబాణములను దనచర్మముచే నేర్పుమెయి వారించుకొనుచుండెను. పిమ్మట భీముఁ డాతనికి సహాయమొనర్చువాఁడై కడువడిగావచ్చి పడెను. అటు లతఁడు వచ్చి ద్రోణు నేడుబాణములచే నొప్పించి ధృష్టద్యుమ్నుని వేఱొకరథము నధిరోహింపఁజేసెను. పిమ్మట దుర్యోధనుఁడు కాలింగునిఁ బ్రేరింపఁగా నతఁడు తనగొప్పసైన్యముతోఁగూడి ద్రోణునిరక్షణమునకై వెడలెను. అపు డాకాలింగుని మహాసైన్యము భయంకరమై భీము నెదురించెను. ద్రోణుఁడు ధృష్టద్యుమ్నుని విడిచి యొకచోనున్న వృద్ధు లగువిరాటద్రుపదులపైఁ గవిసెను. ధృష్టద్యుమ్నుఁడు ధర్మజుకడకుఁ బోయెను. పిమ్మట మహాత్ముఁడగు భీమునకును, గాలింగసైన్యమునకును నద్భుత మగుసంకులసమరము జరిగెను. అయ్యది లోకమునకుఁ బ్రళయకరమై ఘోరమై భయంకరమై గానవచ్చెను" అని తెలుప విని ధృతరాష్ట్రుఁడు మఱియు నిట్లనియె.

## కలింగరాజవధము

"ఓసంజయా! నాకొడు కటులు పనుపఁగాఁ దనసైన్యముతో వెడలి కాలింగుఁడు మహాబలుఁడు నద్భుతకర్ముఁడునై రెండవదండపాణివలె గదనుబట్టి తిరుగుచున్న యాభీమునితో నెట్లు సమరమొనర్చెనో తెలుపుము."

అది విని సంజయుఁడు "ఓరాజా! నీకొమరుఁ డనుపఁగాఁ దన సైన్యముతోఁ గాలింగుఁ డటులు వెడలుట వింటివిగదా? గజరథాశ్వములతోఁగూడి మహాయుధములుగలిగి వచ్చుచున్న కాలింగుని మహాసైన్యము నాభీముఁ డెంతయుఁ బీడించి, చేదిసైన్యములతో వచ్చుచున్న నిషాదాధీశుఁ డగు కేతుమంతుని నొప్పించెను. అంత శ్రుతాయువు కుపితుఁడై యాకేతుమంతునితోఁ గూడి యాభీమసేనునిపైకిఁ దనసైన్యముతో వచ్చెను. అటు లాకేతుమంతుఁడు, కాలింగుల పెక్కువేలరథములు తనకు సహాయముగాఁ బదివేలయేన్గులతోడను, నిషాదులతోడను, గూడివచ్చి భీమునిఁ జుట్టుముట్టెను. పిమ్మట భీమసేనుని ముందిడికొని, మత్స్యకరూశసైన్యములు మఱికొందఱరాజులసహాయమున నానిషాదుల నెదురించెను. అంత నెంతయు ఘోరమగు సంకులయుద్ధమయ్యెను. పరస్పరముఁ జంపికొనుతలంపులతో యోధులు పరువులిడ వైరులతో భీమసేనున కపుడు భయంకర మగు యుద్ధము ప్రారంభమయ్యెను. అయ్యది మున్నింద్రునకు గొప్ప దగుదానవసైన్యముతో జరిగినయుద్ధమును దలపించెను. అపుడు గర్జించుచున్నసాగరముధ్వను లుద్భవించెను. పిదప యోధులు పరస్పరము ఖండించుకొనుచుఁ బుడమినెల్ల మాంసశోణితమయముగా నొనర్చిరి. యోధులెల్లరును, బరస్పరముఁ జంపుకొనుటలంపులోఁ దమవారిని నొరులను గుఱితింపక తమవారిని సైతము నుఱుమాడ మొదలిడిరి. అధికసంఖ్యగలవారిచే నల్పసంఖ్యగలవారికి సమ్మర్దము సంభవించెను. అపుడు మహాబలు లగుచేదిసైన్యములు తమశక్తికొలఁది పౌరుషమునుజూపి, యాభీమసేనునివిడిచి మఱలిపోయిరి. అటులు వారు మఱలుడుఁ గలింగులతోఁ బోరాడి తనబాహుబలమునుజూపి పిదప భీముఁడును వారిపై బాణములను వర్షించెనుగాని యాసేనల నతఁడు, రథస్థానమునుండి కదల్పఁజాలఁడయ్యెను. పిమ్మట నాకలింగుఁడును నాతనికొమరుఁ డగుశక్రదేవుఁడును, భీమునిఁ దీవ్రశరములచే నొప్పించిరి. పిదప నాపాండవద్వితీయుండు, తనవిల్లు ద్రిప్పుచు నిజబాహుబలముపై నాధారపడియే కాలింగునితోఁ బోరాడెను. అపుడు శక్రదేవుఁడు శరపరంపరలను బ్రయోగించి, భీమునిగుఱ్ఱములను బడఁగొట్టెను. అంత విరథుఁడైయున్న యాభీము నాశక్రదేవుఁ డెదురొక్కని వేసవి తుదిమబ్బులువలె నాతనిపై శరవర్షమును గురిపిం

చెను. అటులు హతాశ్వ మగురథముపై నుండియే భీముఁ డాశక్రదేవుని పై నొకయినుపగదను విసరెను. దానివ్రేటుతగిలి యాశక్రదేవుఁడు తన ధ్వజముతోడను గూలి నేలఁబడియెను. అటులు హతుఁడగు తనసుతునిఁ జూచి మహారథుఁ డగుకాళింగుఁడు పెక్కువేలరథములతో నాభీముని నలుగెలంకుల నావరించెను. అంత నాభీముఁడు గదను విడిచి దారుణ మగుకృత్య మొనర్ప నెంచి నిరుపమానమై నక్షత్రములును, సువర్ణార్ధచంద్రులునుగల తనడాలును ఖడ్గమును ధరించి యాకాళింగునిఁ గవిసెను. అతఁ డపుడు కుపితుఁడై వింటఁ ద్రాటులగూర్చి సర్పవిషతుల్య మగు బాణము నందు సంధించి దానిచే భీముఁడు మృతినొందు ననునిశ్చయముతో నాతనిపై విడిచెను. అది కడువడిగావచ్చుటను జూచి భీముఁడు తనఖడ్గముచే దానిని రెండుఖండములుగా నొనర్చి మనసైన్యమునకు వెఱపుగొల్పుచు నుప్పొంగి సింహనాద మొనరించెను. అందులకాకాళింగుఁ డలిగి పదునాల్గుతోమరములను వడిగా నాతనిపై విడిచెను. అంత నాభీముఁ డాతోమరముల కించుకేని జడియక తనవాఁడికత్తిచే వానిని మార్గమధ్యముననే ఖండించి యాకాళింగునికొమరుఁ డగు భానుమంతునిఁ జూచి వానిపై నుఱికెను. ఆభానుమంతుఁడు భీముని శరవర్షమున ముంచి మిన్నుమాఱుమ్రోయునట్లు సింహనాద మొనర్చెను. భీముఁడు వానియారావమున కోరువక తాను నొకమహానాద మొనర్చెను. ఆమహానాదమునకు సేనలెల్ల బెగ్గడిల్లెను. అపు డాభీమసేనుని, మానుషమాత్రునిఁగాఁ నేను దలంపఁజాలనైతిని. భీముఁ డటులు మహానాద మొనర్చి పిదపఁ, దనకత్తి విడువక యాభానుమంతుని మదపుటేనుఁగుదంతములఁ బట్టికొని దాని నధిష్ఠించి యాసేనలు చూచుచుండఁగా నందున్న భానుమంతునిఁ దెగనేసి యాతనియేన్గుస్కంధమును దనకత్తిచే మొత్తి నఱికెను. ఆయసిప్రహారముచే నామత్తగజ మాక్రోశించుచు నేలఁగూలెను. చఱియలుగలపర్వతమునుండివలె సింహవేగముతో నాయేన్గునుండి యతఁడు డిగ్గనుఱికి యెప్పటివలె ఖడ్గపాణియై యుద్ధోత్సాహముతో నేల నిలువఁబడియుండెను. మఱియు నతఁడు గజములను బడఁద్రోయుచు నిర్భయుఁడై యనేకగతులఁ జరించెను. ఇంతయేల! అపు డతఁడు త్రిప్పుచున్నకత్తి యగ్నిచక్రమువలెఁ గానిపించెను. గుఱ్ఱపుదళములందును, గజయూథములందును, రథసమూ

హాములందును, బదాతులమూఁకలందును జరించుచు వానిని జంపుచు నాభీముఁ డెందుఁ జూచినను దానై యగపడుచుండెను. ఆయుద్ధమున మహాబలుఁ డగునాతఁడు డేగవలెఁ గడువడిఁ జరించుచు వైరులశరీరములను ఖండించుచు, శిరములను ఛేదించుచుఁ గోపోద్దీపితుఁడై శత్రులకు వెఱపుగొల్పుచుఁ బ్రళయకాలయమునివలెఁ బాదచారియై తానొక్కఁడే వైరివర్గములను నిశ్చేతనులఁగా నొనరించుచుండెను. అటులైనను మూఢములగు నాకాళింగసైన్యములు మఱలసింహనాదము లొనర్చుచు నాభీముని మార్కొనియెను. అంత నాభీముఁడు వారిం గవిసి వారిరథదండములను, యుగములను భేదించుచుఁ బెక్కువిధములుగా సందుఁ గ్రీడించెను. ఓరాజా! ఆభీమునిరణవిహారమునకు జడిసి యాసైన్యమువారు మతిచెడియు, మీఁదికెగిరియుఁ, దిరిగియుఁ, గ్రిందఁ బ్రాకియుఁ, బరువులిడియుఁ, జలించియు బహువిధములుగాఁ జీకాకునకుఁ బాలైరి. అటులే కొంతసైన్యము పడినదియు గొంత ఖండితమైనదియు నై యుండెను. మఱియు నాపాండవసింహునిచే, నేన్గులు కొన్ని ఖండింపఁబడి మర్మస్థానములు వగుల మొఱయునవియుఁ, బుడమిఁబడునవియు నై విగతప్రాణములయ్యెను. అతఁడు మఱికొన్నిటిదంతాగ్రములను, మఱికొన్నిటితొండములను, గొన్నిటికుంభస్థలములను వ్రయ్యలు సేయుచుండెను. మఱికొన్ని యేన్గులు తమయోధులు లేకుండుటను నిజసైన్యములనే త్రొక్కి చంపుచుండెను. మఱియు నావైరులు వైచిన తోమరములు భీమునిచే ఖండితములై యావైరులమూపటివారితలలను ఛేదింపసాగెను. అటులే యాభీముఁ డాయేన్గులపైఁ బెట్టి తెచ్చిన యుద్ధసామగ్రులెల్లఁ జెల్లాచెదరై నేలఁగూలఁగా మూపటివారితోఁ గూడ వానినెల్లఁ గొండలవలె నేలఁగూలఁ ద్రోయుటను జూచితిమి. అంత రణభీముఁ డగు నాభీముఁడు గుఱ్ఱములపైఁబడి మోదుచు, నశ్వారోహులను బడఁద్రోయుచుండెను. అపు డాకాళింగులకును భీమునకును ఘోర మగుయుద్ధము జరిగెను. ఆరణరంగ మెచ్చటఁజూచినను గళ్లెములును, మెడనుగట్టినత్రాడులు, సువర్ణమయము లగు కక్షములును, నేన్గులపైఁ బరచెడితివాసులు, ప్రాసములు, కవచములు, డాలులు, విచిత్రము లగు నాభరణములు మున్నగువానితో నిండియుండెను. మఱియు నతఁ డటులు విజృంభించి కొందఱరథికులను ధ్వజములతో,

గూడఁ బడమిని ద్రోసి చంపుచు నిటులు పెక్కుగతుల రణరంగమునఁ జరించి చూచువారి కచ్చెరువుగల్గించెను. మఱియు నాతఁడు పాదములచే కొందఱను మట్టియుఁ, గొందఱను ఖడ్గములచేఁ గొట్టియుఁ, గొందఱను సింహనాదములచే బెదరించియుఁ, దొడలచేఁ బడఁద్రోసియుఁ, జూపులచేఁ బరువులిడఁజేసియు నాకాళింగసేనల సతఁ డల్లకల్లోలము గావించెను. పిమ్మట నాకళింగసేనల ముందునిలిచియున్న శత్రుతాయుషునిఁ జూచి భీముఁడు వానిపైఁ గవియఁగా, నతఁడు తొమ్మిదిబాణములచే భీముని నొప్పించెను. అందుల కాభీముఁ డంకుశపుపోటునకు మత్తగజమువలె నెంతయుఁ గుపితుఁడై యింధనములచే నగ్నివలె మండిపడుచుండెను. అంత నాభీమునిసారథియగు నశోకుఁడు సువర్ణభూషిత మగు రథమును దేఁగా నతఁడు దాని నెప్పటిచొప్పున నధిష్ఠించి యాకాళింగుఁ డగు శత్రుతాయుషునితో "నరీ నిలునిలుము" అని పలుకుచు నాతని మార్కొనియెను. పిమ్మట నా శత్రుతాయుషుఁ డాభీమునిపైఁ దనకరలాఘవమును మెఱయించుచు, వాఁడితూపులఁ బఱపెను. అంత నా శత్రుతాయుషుఁడు బఱపినతొమ్మిదబాణముల పోటునకుఁ గఱ్ఱదెబ్బపడినపామువలె భీముఁ డెంతయును గినిసి, ధనువుగొని యెనిమిదిబాణములచే నా శత్రుతాయుషుని విగతాయుషునిఁ గావించి మఱియు రెండుబాణములచే నాతనిచక్రరక్షకులను జంపి సత్యదేవుఁడు సత్యుఁడు ననెడి యిరువురను యమమందిరమునకుఁ బంపెను. అటులే వాఁడితూపులచేఁ గేతుమంతునిఁ గొట్టి చంపెను. అందులకుఁ గ్రోధావేశపరవశులై కొందఱు కళింగయోధు లాభీమునిపైఁ గవిసి గదలు, శక్తులు, ఖడ్గములు, తోమరములు, పరశ్వథములు మున్నగునాయుధముల నాతనిపై వర్షించిరి. ఓరాజా! ఆశరవర్షము నతఁడు వారించి యొక గదను బట్టికొని కదుపడిగా వెడలి గంతులిడుచు, నేడువందలయోధుల కొక్కమాఱుగా యమగృహప్రవేశోత్సవ మొనరించెను. మఱియు నతఁ డాకాళింగసైన్యముల రెండువేలను ఖండించి చంపెను. ఇటు లతఁడు మఱిమఱియు నాకాళింగులఁ జంపుచు భీమపరాక్రముఁడై విజృంభింపఁగాఁ దమమావటివారిని బడఁద్రోసి యేన్గులు వాతహతములయిన మబ్బులువలె నలుగెలంకులఁ జెదరి పరువులిడుచుండెను. మఱియు శరపీడితములై తమసేనలవారినే త్రొక్క నారంభించెను.

పిదప భీముఁ డుప్పొంగి కత్తిపట్టికొని శంఖమును బూరించుచు, నెల్ల కాలింగులప్వాంతములను భయభ్రాంతములఁగా నొనరింపఁజొచ్చెను. అందులకుఁ గొందఱు మూర్ఛపడిరి. గుఱ్ఱములుమున్నగుకొన్ని వాహనములు మత్తగజమునకువలె నాభీమునకు వెఱచి పరువులిడెను. అపుడు మనసైన్యములలో నలుదెసలకును జెదరువారును, మూర్ఛపడువారునై యాభీమునిదాడి కోర్వక గడగడ వడంక సాగిరి. అద్భుతకృత్యమున నపు డాభీముఁడు మదముపుఁజొచ్చిన పెద్దమొసలివలె నాసైన్యముల నెల్లఁ గలఁతపెట్ట నాతనికి మనవీరులందఱును జడిసి పరువులిడువారును, మఱల వచ్చియుఁ దొలఁగువారును నై యుండఁగా నపుడు పాండవ సేనాపతి తనసైన్యముల నుద్దేశించి "ఓయీ! ఇఁక విడువకుఁడు. యుద్ధమొనర్పుఁడు." అని ప్రోత్సహింపఁగా నాతనివచనములు విని శిఖండి మున్నగువారు తమతమసైన్యములతోడను, యోధులతోడను గూడి భీష్ము నెదుర్కొనిరి. అపుడు మబ్బులవలె వెలయుగజసైన్యములతోఁ గూడి సేనాపతి యగుధృష్టద్యుమ్నుఁడు తనసేనలను బ్రోత్సహించుచు మఱికొందఱు యోధులు తనవెంట రా భీముని వెనుకభాగమునుబట్టి వెడలెను. ఆధృష్టద్యుమ్నునకు లోకమున భీమసాత్యకులకంటెఁ బ్రియులగువా రెవ్వరును లేరుగదా! అటు లాభీముఁ డాకలింగసైన్యములందు విజృంభించుటను ధృష్టద్యుమ్నుఁడు కన్నులారఁ గాంచియున్నవాఁడు. కావున నతఁ డెంతయు నుప్పొంగి గొప్పసింహనాద మొనర్చెను. శంఖమును బూరించెను. పిదపఁ బారువాలవన్నెగలగుఱ్ఱములబూన్చినసువర్ణరథముపైఁ గూరుచుండియున్న యాధృష్టద్యుమ్నుని కోవిదారధ్వజమును గనిపెట్టి భీముఁ డాతనిఁ బలుకరించెను. అంత నటు లాకాలింగుల నెదుర్కొనియున్నభీమునకుఁ దోడ్పడుటకై ధృష్టద్యుమ్నుఁడు వెడలఁగా వారిరువురును గాలింగులతోఁ బోరాడుచుండిరి. పిమ్మట నట్టివృకోదరధృష్టద్యుమ్నులను సాత్యకి దూరమునుండియే చూచి కడువడి నందులకుఁ దానును వెడలి వారిరువురి వెనుకభాగమును గాపాడుచు నచ్చోటఁగలవైరులనెల్లఁ బరిమార్చుచుండెను. అపు డాభీముఁడు భీకరరూపుఁడై యక్కాలింగులరక్తమాంసములచే నొక నదిని బ్రవహింపఁజేసెను. అటు లొనర్చి యాభీముఁడు దాఁటనలవిగాని యప్పాండవకలింగసైన్యములను దప్పించికొని వెడలఁగా నట్టిభీము

సేనం గాంచి నీవారెల్లరును "యముండే భీముం డనుపేరితో యుద్ధ
మొనర్చుచున్నవాఁ"డని యఱచిరి. భీష్ముఁ డాయఱపులచప్పుడు విని
భీముఁడున్న యచ్చోటికిఁ గడువడిగా వెడలెను. అపు డాసాత్యకియు
భీముఁడు, ధృష్టద్యుమ్నుఁడును నాతనిరథముపైఁ గవిసిరి. అటులు
కవిసి, వారెల్ల నాతనిఁ జుట్టిముట్టి మూఁడుమూఁడు ఘోరనారాచము
లచే నొప్పించిరి. ఓరాజా! నీతండ్రియు వారినెల్ల మఱల మూఁడేసి
బాణములచేఁ బ్రతిహతి యొనర్చెను. పిదప మఱియు నాగాంగేయుఁడు
శరసహస్రముచే వారిని నివారించి సువర్ణకవచములుగల భీమునిగుఱ్ఱ
ములను గూల్చెను. అంత నాభీముఁడు హతాశ్వుఁడగు తనరథముననే
యుండి యాగాంగేయునిరథముపై వడిగా నొకశక్తిని వైచెను.
నీతండ్రి దానిని జూచి రెండుఖండములుగా నొనర్చెను. పిదప భీముఁ
డొకగొప్పయినుపగదనుబూని రథమునుండి వడిగా లంఘింపఁగా ధృష్ట
ద్యుమ్నుఁ డాతనిఁ దనరథముపైఁ గూరుచుండఁబెట్టి యెల్లరును జూచు
చుండఁగా వేఱొకచోటికిఁ గొంపోయెను. పిమ్మట సాత్యకి వడిగా వెడలి
భీమునకుఁ బ్రియమగునట్లుగాఁ గొన్ని వాఁడినారసములచే భీష్మునిసార
థిని గూలనేసెను. అటులు సారథి హతుఁడగుడు, భీష్మునిరథాశ్వములు
వాయువేగముతోఁ బరువిడి, యాతని నారణరంగమునుండి వెడలించెను.
అటు లాయుద్ధభూమినుండి యతఁడు వెడలఁగా నపుడు భీముఁ డుద్రే
కించి యెండినగడ్డిప్రోవుపైఁబడినయగ్నివలెఁ బ్రజ్వలించుచు సేనామధ్య
మున నిలువఁబడి కాలింగులనెల్ల వధించెను. అపుడు నీవారిలో నొకఁ
డును నాతనిపైఁ గవియ నుత్సహింపరైరి. అటులగుట నతఁడు పాం
చాలురకును మాత్స్యులకును బూజనీయుఁ డగుచు ధృష్టద్యుమ్నునిఁ
గౌఁగిలించుకొని సాత్యకికడ కేగెను. అంత నాసాత్యకి యాభీముని
భుజముతట్టుచు ధృష్టద్యుమ్నుఁడు చూచుచుండఁగా "ఓభీమసేనా!
కలింగరాజును, నాతనిపుత్త్రుఁడు కేతుమంతుఁడును, శక్రదేవుఁడును
నీచేఁ జంపఁబడిరి. బాహుబలముచే గజాశ్వరథసంకులమై మహావీరు
లతో నిండియున్న కలింగవ్యూహమును నీవొకండవే మర్దించితివిగదా!
అని పలికి యాసాత్యకి రథమందున్న యాభీమునిఁ జేరి యాలింగన
మొనర్చి మఱలఁ దనరథ మధిరోహించెను. అటు లతఁడు భీమునిఁ

ప్రోత్సహించుటచే నీవారు సగముగాఁ జచ్చినవారైరి." అని తెలిపి మఱియు సంజయుఁ డిట్లనియె.

ద్వితీయదినయుద్ధము ముగియుట.

"ఓయాంబికేయా! ఆనాఁడు మొదటిపూట యిటులు గడవఁగాఁ దమరథగజాశ్వములును, బదాతులును నటులు నశించుటను జూచి యశ్వత్థామయుఁ, గృపుఁడును, శల్యుఁడును, ధృష్టద్యుమ్నునిఁ దలపడిరి. అటు లామహారథు లెదుర్కొన నాధృష్టద్యుమ్నుఁడు తనతీవ్రశరములచేఁ బ్రసిద్ధములగు నశ్వత్థామగుఱ్ఱములను బ్రహరించెను. అంత నటులు హతాశ్వుఁడగు నాయశ్వత్థామ కడువడిగా శల్యునిరథమెక్కి యాధృష్టద్యుమ్నుని మఱల నెదుర్కొనియెను. అభిమన్యుఁ డందులకుఁ గుపితుఁడై వచ్చి యిరువదైదు వాఁడితూపుల నాశల్యునియందును, దొమ్మిదిబాణములు కృపునియందును బ్రయోగించి యశ్వత్థామ నెనిమిదిబాణములచేఁ బ్రహరించెను. అంత నాయభిమన్యు నాయశ్వత్థామ యొకటను, శల్యుఁడు పదింటను, గృపుఁడు మూఁడేటను నొవ్వనేసిరి. అటులువచ్చిన యభిమన్యునిఁ జూచి నీమనుమఁడగులక్ష్మణుఁ డాతని నెదుర్కొన వారిరువురకును పోరు ఘోరముగా జరిగెను. అపుడు లక్ష్మణుఁడు కుపితుఁడై తీవ్రబాణములచేఁ నభిమన్యుని నొప్పింపఁగా నతఁ డాలక్ష్మణు నైదుబాణములచేఁ బ్రహరించెను. అది యద్భుతమయ్యెను. పిదప లక్ష్మణుఁ డాయభిమన్యునివిల్లు ఖండింపఁగాఁ జూపరులెల్ల గట్టిగా నఱచిరి. శత్రుమారకుఁడగు నాయభిమన్యుఁడు వేఱొకవిల్లుగొని వానిఁ గొట్టెను. ఇటు లిరువురును రణోత్సాహులై కృతప్రతీకారము లొనర్చుకొనుచుఁ బరస్పరముఁ బ్రహరించుకొనిరి. పిమ్మట సుయోధనుఁడు, తనతనయుఁ డాయభిమన్యునిచేఁ బీడితుఁడగుటఁ జూచి యందులకు వెడలెను. ఓరాజా! అటులు నీకొమరుఁ డందులకుఁ జనుటఁ గనుంగొని యోధులెల్లరును నాయభిమన్యునిరథముచుట్టు నావరించిరి. శూరులగువారెల్లరును దన్నటు లావరించియున్నను గృష్ణవిక్రముఁడగు నాయభిమన్యు డందుల కించుకేని వెఱవఁడయ్యెను. అంత నాయభిమన్యుని గౌరవవీరులందఱును బరివేష్టించు టారసి యర్జునుఁడు తనతనయునిరక్షణమునకై కడువడిగాఁ గుపితుఁడై వెడలెను. పిమ్మట భీష్ముఁడును, ద్రోణుఁడు మున్నగుమహారథులెల్లరును రథగజాశ్వాదు

లతోఁ గూడి, యందుల కరుదెంచిరి. అప్పుడు హయగజపదాతులనుండి వెడలినభూపరాగములు మిన్నుముట్టి తీవ్రముగాఁ గానవచ్చెను. అంత నాయర్జునునిశరప్రహారములనొంది యందులకు వచ్చినసైన్యములును, యోధులును, నాతని నెదుర్కొనఁజాలరైరి. అప్పు డెల్లప్రాణులు నాక్రోశించెను. దెసలఁ జీకటు లాక్రమించెను. కౌరవులయన్యాయ మెంతయు దారుణమైయుండెను. అప్పు డాయర్జునుశరపరంపరలచేఁ బుడమియు, నాకసము, దెసలును, సూర్యుఁడును గానరాకుండెను. గజాశ్వములు చంపఁబడియెను. రథికులు హతాశ్వులగుచుండిరి. రథయూథములను బాలించువారు పరువులిడు నారథములను బాలింపఁజాలరైరి. రథికులెల్ల విరథులై యటునిటు పరువులిడసాగిరి. ఓ రాజా! ఆయర్జునునకు జడిసి గుఱ్ఱపుదళములవారును, గజారూఢులును, దమగుఱ్ఱములను, గజములను విడిచి వెడలుట నక్కడక్కడ నాయుధములు గలవా రగపడుచుండిరి. మఱియు నాపాండవమధ్యముని బాణపరంపరచే రథములనుండియు, గజములనుండియు, గుఱ్ఱములనుండియు వీరులు పడినవారును, బడుచున్నవారు నై గానవచ్చిరి. మఱియు నతఁడు రౌద్రాకారమువహించి గదలతో నెత్తఁబడినవియుఁ, గత్తులతోఁగూడినవియుఁ, బ్రాసములుగలవియుఁ, దూణీరములు వెలయునవియు నై గానవచ్చుచున్న బాహువులనెల్ల ఖండించెను. అటులే శరశరాసనములును, నంకుశపతాకలను బట్టుకొనినవారిచేతుల నతఁడు తెగనేసెను. ఆరణరంగమునఁ దునిసిపడిన యుద్ధపరికరములవిధ మిట్టిదని తెలుపఁజాలను. ఎందుఁ జూచినను విరిగినపరిఘములే. ఎక్కడఁ గాంచినను ముద్గరములే. అటులే యొకచోఁ బ్రాసములును, వేఱొకచో భిందిపాలములును, నింకొకచో నిస్త్రింశములును, మఱియొకచోఁ బరశ్వధములును నై కాంచనకవచములును, గేడెములును, ధ్వజములును, తోమరములును, ఛత్రములును, బ్రతోదములును, నెల్లెడలఁ జిందఱవందరలై ప్రోవులు ప్రోవులుగా నగపడఁజొచ్చెను. ఓ రాజా! అందు నీసైన్యమువారిలో నెవ్వఁడును మగవాఁడు కానరాకుండెను. అటులుండెనేని యొకఁడేని యర్జును నెదుర్కొనకుండునా? అప్పు డాయర్జునుని మాఱుకొనినవారెల్ల నాతనిశరప్రహారముల కోరువలేక పరలోకమున కేగెడువారే. అటులా సైన్యములెల్లఁ జెల్లాచెదరగుచుండఁ గృష్ణార్జునులు శంఖము

లను బూరించిరి. అటు లన్నివిధముల భగ్నమగుచున్న తనసైన్య మునుజూచి గాంగేయుఁడు నగుచు ద్రోణునితో "ఓయాచార్యా! చూచితే! ఇప్పాండవవీరుఁడు కృష్ణసహితుఁడై ధనంజయుఁ డేమిచేయఁ దగియుండునో యంతయుఁ జేయుచున్నవాఁడు. ఇపు డీతని నెవ్వఁ డును, జయింపఁజాలఁడు. ఈతఁ డిపుడు ప్రళయకాలయముఁడువలె నగపడుచున్నాఁడు. ఈమనసైన్యమును మఱలించుటయు, దుర్ఘట ముగా నున్నది. బలహీనులై యొకరినొక రెట్లు చూచుకొనుచున్నారో చూడుము. ఇది యిటులుండ నెల్లవారిదృష్టి ధనము లపహరించిన వాఁడువోలె సూర్యుఁ డస్తగిరికిఁ బరువులిడుచున్నాఁడు. ఇఁక నీదిన మునకు యుద్ధమును ముగించుటయే మేలని తలంచెదను. ఇటులు యోధులందఱును నలసియు, భీతిలియు నుండఁగా నిఁక యుద్ధము నెటులు చేయఁగలరు?" అని పలికి నాఁటికి నీవారిని యుద్ధమునుండి మఱ లించెను. అంత సూర్యుఁ డస్తమించి సంజ యగుడు నిరుసైన్యములును సమరమును జాలించి మఱలిరి." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

గారుడార్ధచంద్రవ్యూహములనిర్మాణము

"ఓధృతరాష్ట్రా! నాఁటివేఁకువయగుడు శాంతనవుఁడు తనసైన్య ములను బ్రయాణమునకు సన్నద్ధము గండని యాజ్ఞాపించి కౌరవుల జయ మపేక్షించుచు నాఁడు గరుడవ్యూహమును బన్నుటకు సమ కట్టెను. పిదప భీష్ముఁ డాగరుడవ్యూహమునఁ దాను ముఖస్థానమున నుండెను. ద్రోణుఁడును, కృతవర్మయు, దానికి నేత్రములుగా నుండిరి. కీర్తినిధులగు కృపాశ్వత్థామలు దానిశిరస్థానమున నునుపఁబడిరి. వారికిఁ ద్రిగర్తులును, కేకయులును, వాటధానులును సహాయులుగా నందుండిరి. పిదప భూరిశ్రవుఁడు, శలుఁడు, శల్యుఁడు, భగదత్తుఁడు, మద్రకులు, సింధుసౌవీరులు, పంచనదులు, జయద్రథుఁడును దానికంఠ స్థానమున నునుపఁబడిరి. తనసోదరులతోఁగూడి సుయోధనుఁడు దాని పృష్ఠస్థానమున నుండెను. విందానువిందులును, నవంతిదేశాధీశులును, గాంభోజులును, శకులును, శూరసేనులును దానికిఁ దోఁకగా నుండిరి. మాగధులును, గలింగులును, దాసేరకగణములును నావ్యూహమునకుఁ

గుడి తెక్కఁగా నుండిరి. కారూశులు, వికుంజులు, ముండులు, కొండి వృషులు, బృహద్బలుఁడును నెడమ తెక్కఁగా నునుపఁబడిరి.

పిదప మీవారు పన్నిన యావ్యూహమును జూచి యాసవ్యసాచి ధృష్టద్యుమ్నునితోఁ గూడి దానికిఁ బ్రతివ్యూహముగా నర్ధచంద్రవ్యూహమును సంఘటించెను. అది మిక్కిలి భయంకరమై యుండెను. అందు దక్షిణశృంగమున భీమసేనుఁడు వెలయుచుండెను. బహువిధ శస్త్రప్రయోగనిపుణులగు నానాదేశపు రాజులతోఁ గూడి విరాట ద్రుపదులును వామశృంగమున నుండిరి. వారిరువురితరువాత నీలాయుధసహితుఁడై నీలుఁడును, వానివెనుక మహారథుఁడగు ధృష్టకేతుఁడును, చేదిదేశీయులును, కరూశులు, కాశులు, పౌరవులు మున్నగువారును నిలిచియుండిరి. ధృష్టద్యుమ్నుఁడు, శిఖండియుఁ, బాంచాలురును, ప్రభద్రకులును సైన్యసహితులై దానిమధ్యభాగమున నుండిరి. అచ్చోటనే ధర్మరాజుసైతము గజసైన్యమునడుమ నుండెను. ఆతనివెనుక సాత్యకియు నేవురుద్రౌపదేయులును, నభిమన్యుఁడును, వారివెనుక నిరావంతుఁడును, దరువాత ఘటోత్కచుండును, గైకేయులును వామపార్శ్వము నాశ్రయించి యుండిరి. ఎవ్వనికి జగద్రక్షకుఁడగు జనార్దనుఁడు రక్షకుఁడై యుండెనో, యట్టియర్జునుఁ డావ్యూహమునకు రక్షకుఁడై యుండెను. ఓరాజా! పాండవు లీవిధముగా మనవారివ్యూహమునకుఁ బ్రతివ్యూహమును బన్నియుండిరి. మఱియు నందు నీపుత్రులనాశము గోరునట్టి మఱికొందఱును నిలిచియుండిరి. పిదప నీవారికిని వారివారికిని బరస్పరము యుద్ధ మారంభమయ్యెను. అంత నందందు గుఱ్ఱపుదళములును, నేనుఁగులయూథములును బరస్పరప్రహారములచేఁ గూల నారంభించెను. రథములు పరుగిడుచుండెను. దుందుభిధ్వనిమిళితమై సైన్యధ్వనులును సంకులమై మిన్నుముట్టుచుండెను.” అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

### తృతీయదిన యుద్ధారంభము

“ఓయంబికానందనా! అటులా వ్యూహములు రెండును నేర్పడ నపుడు ధనంజయుఁడు రథయూథపాలకులను బడఁద్రోయుచు రథసమూహమును నశింపఁజేసెను. ప్రళయకాలయమునిచే వలె నాయర్జు

కునిచే వధింపఁబడు నాథా_స్త్రరాష్ట్రు లెల్లరును యుద్ధసన్నద్ధులై పాండవులనెదుర్కొనిరి. ఓరాజా! మీవారు ప్రసిద్ధ మగుయశమును గోరి మృత్యువునకు జడియక యేకాగ్రచిత్తులై పాండవసైన్యములను జంపుచు, వారిచేఁ జచ్చుచుఁ బోరాడిరి. పరువు పెట్టునట్టియు, రథములచే నలఁగునట్టియుఁ, గ్రిందమీఁదఁ బడినట్టియుఁ, గౌరవపాండవసైన్యములచే నేమియు నారణరంగమునఁ గానరాకుండెను. అందు వెడలిన ధూళులు సూర్యునిఁ గప్పుచు దిక్కులను విదిక్కులను గానరాకుండ నొనర్చెను. అట్టితఱి నూహాలచేతను, సంజ్ఞలచేతను, నామగోత్రకథనములచేతను నపుడు యుద్ధము జరుగ నారంభించెను. అపుడు ద్రోణరక్షితమగు కౌరవవ్యూహము భేదింప రానట్టులే భీమార్జున రక్షితమగు పాండవవ్యూహమును భేదింప వలనుపడనిదై యుండెను. అందుశూరులు తమరథగజాదులతో నావ్యూహములకొనలఁ జేరి పోరాడనారంభించిరి. మఱియు రౌతులు రౌతులను దలపడి ప్రాసములు మున్నగువానిచేఁ బడద్రోసికొనుచుండిరి. అటులే రథికుఁడు రథికునిఁజేర్చి సువర్ణభూషితములగు సాయకములచే ఖండించుకొనుచుండిరి. ఓరాజా! తొలుతఁ గురుపాండవులసైన్యములలో గజారోహులును గజారోహులును సంఘములుగా నేర్పడి శరతోమరాదులచేఁ బ్రహారించుకొనిరి. అటులే పదాతులును బదాతులును గలిసి భిందిపాల పరశ్వధములతో నఱికికొనిరి. రథికుఁడు గజారోహకునిఁ జేరి యాయేన్గుతోఁ గూడ వానిని గూలనేయ మొదలిడెను. అటులే గజారోహుఁడు రథికుని, రౌతు రథికుని, రథికుఁడు రథసారథిని, బదాతి రథికుని, రథికుఁడు పదాతినిగా నుభయసైన్యములవారును శరములచేతను, శస్త్రములచేతను గొట్టుకొనసాగిరి. గజారోహులు రౌతులను, రౌతులు గజారోహులను బడఁద్రోసికొనిరి. అదియెంతయు నద్భుతముగా నుండెను. పదాతులను రౌతులు పడఁద్రోయుచుండుటను జూచితిమి. ఓరాజా! అపుడు యుద్ధపరికరము లగుధ్వజపతాకాదులచేతను, శరశక్తితోమరాదులచేతను, జర్మకవచాదులచేతను బుడమి పుష్పమాలికలచేవలె భూషింపఁబడియెను. పదాతులయు, గజములయు, నశ్వములయు మాంసశోణితాదులతో నిండి పుడమి ప్రవేశింపరానిదై యుండెను. అపుడు వెడలినధూళులు మానవశోణితములచే నడంగెను. అటులగుట దెస

లన్నియును నిశ్చలములుగాఁ గానవచ్చెను. అపరిమితముగాఁ బై నెల్లెడల నెగురుచున్న మొండెములు జగము నశించుననెడి సూచనలఁ జేయుచుండెను. అట్టిదారుణయుద్ధము, ఘోరముగా నారంభమగుడు, రథికు లెల్లదెసలకుఁ బరువులిడుచుఁ గానవచ్చిరి. పిమ్మట భీష్మద్రోణు లును, సైంధవుఁడును, బాహ్లీకమిత్ర, వికర్ణ, శకులును, సింహతుల్య పరాక్రములై వైరుల కోరువరాక పోరాడుచుఁ బాండవసైన్యముల భంజింప నారంభించిరి. అటులే భీమసేనుఁడును, ఘటోత్కచుఁడును, సాత్యకి చేకితాన ద్రౌపదేయులును, నీవారిని, నీపుత్త్రులను, నింకను గలరాజలోకమును మున్నా దేవతలు దానవులువలె రణరంగమునుండి తోలఁగించిరి. అటు లుభయసైన్యములును బరస్పరము ప్రహరించు కొనుచు రక్తసిక్తాంగులై ఘోరరూపులై మోదుగుచెట్లవలె వెలయు చుండిరి. రెండుసైన్యములందును వైరులను జంపికొనుచు గజా రోహు లాకసమున వెలయుగ్రహములువలె నలరుచుండిరి. పిమ్మట వేయిరథములతోఁ గూడి నీకొమరుఁ డగుసుయోధనుఁడు పాండ వులపై వెడలి ఘటోత్కచు నెదుర్కొనియెను. అటులే పాండవులును గొప్పసైన్యములతో రణశూరు లగుభీష్మద్రోణుల నెదురించిరి. అర్జు నుఁడు కుపితుఁడై రాజలోకము నెల్లఁ దునుమాడుచు వచ్చెను. అభి మన్యుసాత్యకులు శకుని నెదుర్కొనిరి. పిదప నద్భుత మగుయుద్ధము మఱల నుభయసైన్యములకు నారంభమయ్యెను.” అని తెలిపి సంజ యుఁడు మఱియు నిట్లనియె.

### భీష్మదుర్యోధనసంవాదము.

“ఓరాజా! పిమ్మట నాయర్జునుం గాంచి మనయోధులందఱును గుపితులై పెక్కువేలరథములతో, నాతని ముట్టడించి, శరసహస్రము లను బ్రయోగింపసాగిరి. కొందఱు మెఱయుచున్నట్టిశక్తులను, మఱికొందఱు తీవ్రము లగుగదలను, వేఱొకకొందఱు పరిఘములను, ప్రాసములను, ముసలములను, బరశ్వథములను నాతనిరథముపై వర్షము గురిపించిరి. అంత నప్పార్థుఁ డాయస్త్రవర్షము నెల్ల మిడుతలనువలెఁ దనశరజాలముచే వారింపఁగా నద్భుతమగు నాతనిహస్తలాఘవము నారసి దేవదానవ గంధర్వపిశాచులును, రాక్షసోరగులు మున్నగువారును మేలు మేలని

కొనియాడిరి. పిమ్మట నభిమన్యుని, సాత్యకిని శూరులగుశకుని మున్నగు గాంధారులు తమగొప్పసైన్యముతో వచ్చి ముట్టడించిరి. అంత నాగాంధారులు సాత్యకిరథమును ఖండఖండములుగా నొనర్చిరి. అపుడు సాత్యకి విరథుఁడై తనకుఁగల్గిన మహాభయమునకువెఱవక యభిమన్యుని రథముపై కుఱికెను. అటులు వారిరువురు నొక్కరథముపైఁ గూడుచుండియే యాశకునిసైన్యమును దమవాఁడినారాచములచేఁ దునుమాడిరి. పిదప భీష్మద్రోణులు యుద్ధోత్సాహులై ధర్మరాజుసైన్యమును దమశరపరంపరచే నశింపఁజేయ మొదలిడిరి. అపుడు యుధిష్ఠిరుఁడును, నకులసహదేవులును సైన్యములెల్లఁ జూచుచుండఁగా, ద్రోణునిసైన్యమును దలపడిరి. అంత నద్భుతమగు సంకులసమరమయ్యెను. అది మున్ను జరగిన దారుణమగు దేవదానవయుద్ధమును దలపించెను. అపుడు భీమఘటోత్కచులు వైరులతో ఘోరముగాఁ బోరాడిరి. అంత దుర్యోధనుఁడు మఱలి యాతండ్రికొడుకుల నెదురించెను. అందు ఘటోత్కచుని యద్భుతపరాక్రమమును గాంచితిమి. అతఁడు యుద్ధమునఁ దండ్రిని మించినవాఁ డయ్యెను. అంత నాసుయోధనుఁ జూచి భీముఁడు రోషభీషణుఁడై నగుచు నొకతీవ్రబాణముచే నాతనివక్షము నొప్పించెను. అంతటఁ దీవ్రమగు నాభీమునిశరప్రహారమున కోరువలేక సుయోధనుఁడు తనరథస్థానమునఁ గూలఁబడి మూర్ఛవడియెను. అటులు నిశ్చేతనుఁడైన యాసుయోధనుని వానిసారథి యారణరంగమునుండి వెడలించి పోఁగా మీసైన్యమెల్లఁ జెదరిపోయెను. అటులు కౌరవసైన్యము చెదరఁగా దానిని విడువక తీవ్రశరప్రహారములచేఁ గొట్టుచు, మఱియు నాభీముఁడు తఱుమఁ జొచ్చెను. పిదప ధృష్టద్యుమ్నుఁడును, ధర్మజుఁడును, ద్రోణభీష్ములు చూచుచుండఁగాఁ బరువిడుచున్న నీతనయునిసైన్యమును బ్రాణాంతకములగు వాఁడినారాచములచేఁ దునుమనారంభించిరి. అపుడు భీష్మద్రోణు లెంత ప్రయత్నించి మఱలించినను మనసైన్యములు మఱలక పరువిడిపోయెను. అటులగుట వారాసైన్యము నాపలేక యూరక చూచుచుండిరి. అటులు వేలకొలఁదిరథములు చెదరిపోవుచుండఁగా నొకరథమునే యధిష్ఠించియున్న యభిమన్యుసాత్యకు లిరువురును శకునిసైన్యముల నుఱుమాడం దొడంగి యమావాస్యను నభస్థలమున నొకచో నున్న సూర్యచంద్రులువలె విరాజిలుచుండిరి.

మఱియు నర్జునుఁడును గుపితుఁడై నీలమేఘము వర్షధారలచేవలె శర పరంపరలచే మీవారిసైన్యమును ముంచెను. అటులు యుద్ధమొనర్చు నర్జునుంగాంచి కౌరవసైన్యము శోకభయకంపములచేఁ జెదరి నలుదెసలకుఁ బరువిడెను. అటులు చెదరినసైన్యములను మహారథులగు ద్రోణభీష్ములు దుర్యోధనుని హితము గోరువారై మఱలించిరి. పిదప దుర్యోధనుఁడును, దనసైన్యమును హెచ్చరించుచు మఱలించెను. ఎందెందు నీతనయుఁడు కానవచ్చుచుండెనో యందందుఁ గల మహారథులగు క్షత్రియులెల్లరును మఱలుచుండిరి. ఆమఱలినవారిని గాంచి, తక్కిన వారును మఱలిరి. అటులగుట నొకరినొకరు చూచి లజ్జయుఁ బరస్పర స్పర్ధయుఁ గల్గియుండిరి. మఱియు నటులు మఱలివచ్చు నాసైన్యసమూహము చంద్రోదయమున నుప్పొంగుసాగరము నా వెలయుచుండెను. అటులు ప్రోవుపడిన తనసైన్యము నారసి యాసుయోధనుఁడు, భీష్ముని కడకుఁ గడువడిగా వెడలి "ఓతాతా! నీతో నేనొకటిపలికెదను వినుము. నీవు జీవించియుండఁగా, నిటులగుట నీకుఁ దగనిపని. అటులే ద్రోణుఁడు నశ్వత్థామయుఁ, గృపుఁడును నుండఁగా నిటులు సైన్యము చెదరుట కేమందును? పాండవులలో నిన్నెదురింపఁదగుబలవంతులు లేరని తలంచువాఁడను. ద్రోణకృపాశ్వత్థాములు నట్టివారేగదా! ఓపితామహా! ఇటులు చచ్చుచున్న నాసైన్యమును జూచియు నీవూరకుండుట నారయఁగా నీవు పాండవులయెడ దయతలంచియున్నటు లగపడుచున్నది. యుద్ధమారంభముగాకమున్నె 'నేను బాండవులను, సాత్యకిధృష్టద్యుమ్నులను దలపడను' అని నీవు నాకెఱిఁగించి యుండవలసినదిగదా! నేను నీవచనమును, ద్రోణునిమాటయు విని కర్ణునితోఁగూడి యదియే యాలోచించువాఁడను. ఈయుద్ధమున నేను మీయిరువురకుఁ బరిత్యాజ్యుఁడఁ గానేని మీమీవిక్రమములకుఁ దగురీతిగా యుద్ధమొనర్పుఁడు" అని పలికెను.

అది విని గాంగేయుఁడు మఱిమఱి నగుచుఁ, గుపితుఁడై నీతనయునితో "ఓయీ! పలుమాఱులు నీకు హితము తెలిపితిని. పాండవులు దేవేంద్రదేవతాదులకును జయింప వలనుపడనివారని నేను నీకెఱిఁగింపలేదా! ముదుసలి నగు నేను నాశక్తికొలఁదిగా నేమి యొనర్పవలయునో యదియెల్ల నొనర్చువాఁడను. నీవును నీబంధుగులును జూడుఁడు. ఇపుడు బంధువులతోఁ గూడఁ బాండవులనెల్ల, నెల్లవారు చూచు

చుండఁగా నివారించెదను" అని పలుక విని నీతనయుఁడు సంతుష్టాంత రంగుఁడై శంఖమును బూరించెను. భేరులు మ్రోయింపఁబడెను. పాండవు లాచప్పుడులను విని తాము శంఖములను బూరించిరి. భేరులనుమురజములను మ్రోయించిరి" అని తెలుప విని ధృతరాష్ట్రుఁ డిట్లనియె.

తృతీయదినయుద్ధము ముగియుట

"ఓసంజయా! నాతనయుఁ డాడినమాటలకుఁ గోపించినభీష్ముఁ డటులు యుద్ధమొనర్తునని ప్రతినచేసినవాఁడుగదా! అపు డతఁ డా పాండవులయెడఁ జూపినపరాక్రమ మెట్టిది? పాంచాలుర నేమి చేసెను? తెలుపుము."

అది విని సంజయుఁడు "ఓరాజా! ఆనాఁటి మొదటిపూట గడ వఁగా, రవి, పశ్చిమదిశ నలంకరించి యింక నడిచెను. మహాత్ము లగు పాండవులొందిన సంపూర్ణజయమును దలంచి పితామహుఁడు కడువడి గలగుఱ్ఱములను బూజించినయరద మెక్కి పాండవసైన్యముఁ దల పడెను. ఆతనికి నీపుత్త్రుఁడు గొప్పసైన్యముతోఁ గావలిగా నుండెను. పిదప నద్భుతమై సంకులమగు యుద్ధ మారంభమయ్యెను. అపు డెంత యును ధనుష్టాంకారములయు, తలాఘాతములయు మహానాదము కొండలు వ్రయ్యలగునట్టులుగా మోఁదై నిండెను. మఱియు నపుడు "ఓయీ! ఇదె యిందున్నవాఁడను. నిలుము. వీని నెఱుంగుదువా! మఱలకుము, కదలకుము. ఇదె నే నిలిచియున్నవాఁడను. కొట్టుము." అనెడిశబ్దము లెల్లెడలను వినవచ్చెను. పిదప సువర్ణమయము లగు కవచములందును, గిరీటములందును, ధ్వజములందును, గొండలనుండి పడి యెడుపాషాణములచప్పుడుల ననుకరించుచప్పుడు లుప్పతిల్లెను. పిమ్మట వందలకొలందిని, వేలకొలందిని దలలును, నలంకృతము లగుబాహువు లును నేలఁబడి దొరలుచుండెను. కొంద ఱెత్తినవిం డ్లెత్తినట్టు లుండఁగా నుత్తమాంగములు దెగినవారును బట్టినయాయుధములు పట్టినట్టు లుండఁగాఁజట్టలు దెగువారునునై కడువడిగా వెడలినరక్తప్రవాహమున మునుఁగుచుఁ దేలుచుండిరి. మఱియు నేన్గులపిండుల నెడిపాషాణము లును, మాంసశోణితము లనెడిబురదయును గలిగి, గజాశ్వసంఘాతుల నుండి జనించి పరలోకసముద్రమునకు వెడలినరక్తనది గ్రద్దలకును, నక్కలకును సంతసమును గూర్చునదై వెలయఁజొచ్చెను. ఎన్నఁడు గని

విననియుద్ధ మపుడు కురుపాండవులకు జరిగెను. ఆరణరంగమునఁబడిన యోధులతో నిండుట నందు రథమార్గములు లేకుండెను. మఱియు నల్లనియేన్గుతండములు కొండశిఖరములువలె నెల్లెడల వ్యాపించెను. అందుఁ జెదరియున్న కవచములచేతను, చిత్రము లగుశిరస్త్రాణములచేతను నారణరంగము శరత్కాలనభమువలె వెలయుచుండెను. కొందఱు శరములచే నలుకఁబడినగాత్రములనుండి ప్రేవులు జాఱుచున్నను దైన్యమొందక శూరులై గర్వముతో వైరులపైఁ బరువులిడుచుండిరి. "ఓతండ్రీ! ఓయన్నా! ఓమిత్రమా! ఓచుట్టమా! ఓవయస్యా! ఓమామా! నన్ను విడువకుము." అని రణరంగమునఁబడినవా రఱచుచుండిరి. మఱి కొందఱు "ఓయీ! ఇటు రమ్ము. నన్ను సమీపింపుము. భయపడుచుంటివా యేమి? ఎందేగెదవు! ఇదె యిందున్నవాఁడను. యుద్ధమున జడియఁగూడదు." అని యఱచుచుండిరి.

అట్టితఱి భీష్ముఁడు చక్రాకారముగాఁ దనవిల్లు త్రిప్పుచు మెఱయునట్టిబాణములను గొప్పసర్పములనువలెఁ బ్రయోగించి యెల్ల దెసలను బాణములకుఁ దానకముగా నొనర్చుచుఁ బాండవరథికులనెల్ల వేర్వేఱఁ బేరుల నిరూపించి ప్రహరించుచుండెను. ఓరాజా! మఱియు నతఁడు రథమార్గముల నటించుచుఁ గరలాఘవమును జూపుచు నందందు నగ్నిచక్రమువలెఁ గానిపించుచుండెను. సమరశూరుఁ డగు నాగాంగేయుఁ డొక్కఁడే తనశరీరలాఘవము మెఱయఁ జరించుచు, నాపాండవులకును సంజయులకును లక్షలకొలఁదిరూపములుగా నగపడుచుండెను. అప్పుడాభీష్ము నొకమాయారూపునిఁగా వారు తలంచిరి. అతఁడు తూర్పుదెసను గన్పడియు నపుడే మఱలఁ బశ్చిమదిక్కునఁ గానవచ్చెను. అటులే యుత్తరమునఁ గన్పడి దక్షిణదిశను జూపట్టుచు వచ్చెను. పాండవులకుఁ బ్రతియోధియై యతఁడు గానవచ్చుటేగాని వారిలో నెవ్వఁడును నాభీష్మునిఁ దేఱిచూడ లేకుండెను. ఆతనివింటినుండి వెడలిన పెక్కువిశిఖములే వారికిఁ గానవచ్చుచుండెను. అటు లతఁడు నిరుపమాన మగుసమరకర్మము నొనర్చుచు సైన్యములను జంపుచు విహరింపఁగా నందలి వీరులందఱును పలుగతుల నాక్రోశింపసాగిరి. అమానుషరూపముతో రణరంగమునఁ జరించు నీతండ్రికి రాజులెల్లరును మిడుతలై యాతని శరాగ్నిలోఁ బడుచుండిరి. ఆతనిశర మొకటియుఁ బొల్లు

గాదయ్యెను. కరశరలాఘవము గలయాతఁడు గజాశ్వపదాతులయంగ ములు పెక్కిటిని నొకబాణమును బ్రయోగించియే ఖండించుచుండెను. కవచముతోఁ గూడిన యేన్గును, నిరువురు మువ్వురు గజారోహులను వజ్రాయుధముచేఁ గొండలనువలె నొకతీవ్రనారాచముచే ఖండించెను. ఎవ్వఁ డెవ్వఁడు రణరంగమున భీష్మునికంటఁబడునో వాఁడెల్ల రెండుగడి యలలో భీతుఁడై పుడమిఁ బడి కానవచ్చుచు వచ్చెను. ఇట్టు లాపాండవ సైన్యము గాంగేయహతమగుచు వేయిచీలికలుగాఁ జెదరెను. మఱియు నాతనిశరవర్షమున కామహాసైన్యము గడగడ వడంకెను. దాని నా వాసుదేవార్జునులు చూచుచునేయుండిరి. వారు తమశక్తికొలఁదిఁ దమ సైన్యమును మఱల్పఁ బ్రయత్నించిరి. కాని భీష్మశరపీడితములగు వానిని వారింప వారికి వశముగాకుండెను. ఇంద్రతుల్యపరాక్రముఁడగు నా గాంగేయునిచే సైన్యమెల్ల భగ్నమొనర్పఁబడియెను. ఓమహారాజా! అపుఁడాగాంగేయునిచేఁ గొట్టువడకుండునవి పడినరథకూబరములును, జెదరినరథనాగాశ్వములును, బరువులిడెడిపదాతులును దప్ప వేఱొండు సైన్యమాతనిప్రహారమును బడనిదిలేదు. అటులగుటఁ బాండవసైన్య మున హాహాకారములు జనించెను. మఱియు నపుడు తండ్రి కొమరునిఁ, గొమరుఁడు తండ్రిని, మిత్రుఁడు మిత్రునిఁ దెలియక చంపఁదొడఁగిరి. పాండవసైన్యములోఁగొందఱు కవచములనువిడిచియుఁ,గొందఱుజుట్టు విరియఁబోసికొనియుఁ బరుగిడుచుఁ గానవచ్చిరి. ఆలమందవలెఁ జెదరి యార్తస్వరము లొనర్చెడి యాపాండవసైన్యమును గాంచి వాసుదే వుఁడు పార్థునిరథ మాపి యాతనితో "ఓయీ! నీవు కోరినకాల మిదె వచ్చెను. నీవు మోహమందక స్థిరచిత్తుఁడవై తేని యీతనిఁ బ్రహరిం పుము. మున్నీవు రాజులెల్ల విన నేమి పలికితివో మఱచితివా! భీష్మద్రోణు లను సైన్యములతో ధార్తరాష్ట్రులను వారివారిబంధులను నీయె దుటఁబడినవారినెల్లఁ జంపెదనంటివిగాదే! ఓకౌంతేయా! ఆడితప్పని వాఁడవగుట నటులొనర్పవలసియున్నది. ఓయర్జునా! నీసైన్యమెల్ల భగ్నమై యిటునటు నెటులు పరువులువెట్టుచున్నదో చూడుము. మన బలమునఁగల మహీపాలు రెల్లరును జెదరిపోవుచు సమరమున నోరు తెఱచియున్న యంతకుఁ డనఁదగుభీష్మునిఁ జూచి భయార్తులై సింహ మును జూచిన ప్రుక్కిడిమృగములువలె నశించుచున్నారు." అని పలికెను.

అది విని ధనంజయుం డాతనితో "ఓదేవా! భీష్ముం డెందున్నాఁడో యందులకు మనగుఱ్ఱముల నదలింపుము. వృద్ధుం డగుకురుపితామహునిఁ బడఁద్రోసెదను" అని తెలుప విని యతఁడు వెండిగుండులు నాఁదగు నాయర్జునుగుఱ్ఱములను భీష్ముఁడున్నచోటికిఁ బఱపెను. అటు లాయర్జునుఁడు భీష్ము నెదుర్కొనుట నారసి యాధర్మజునిసైన్యమెల్ల మఱలెను. అపు డాగాంగేయుఁడు సింహామువలె గర్జించుచు, శరవర్షముచే నా ధనంజయునిరథమును ముంచెను. ఒకగడియలో నాయర్జునునిరథము, ధ్వజము, సారథియుఁ గప్పఁబడి కానరాకుండెను. అపు డావాసుదేవుఁడు చలింపక ధీరుఁడై భీష్మునితూపులవ్రేటుపడిన తనయశ్వములను దోలుచు నాతని సమీపింపఁగా నపు డర్జునుఁడు విల్లుగొని గర్జించుచుఁ దీవ్రబాణములచే నాతనివిల్లు ఖండించి పడవైచెను. అంత నాశాంతనవుఁడు తనవిల్లు తునుఁగ వేఱొకవిల్లు పూని తెప్పపాటులో బాణమును సంధింపఁగా నర్జునుఁడు మఱల దానిని ఖండించెను. అపు డాయర్జునుని శరలాఘవమున కాభీష్ముఁడు మెచ్చి 'ఓయర్జునా! మేలుమేలు. ఇట్టి యద్భుతకృత్యము నీకే తగినది. ఓపుత్రకా! సంతసించితిని. నాతో యుద్ధముచేయుము.' అని యాయర్జునుఁ బొగడి మఱియు వేఱొకవిల్లు గొని యర్జునునిరథముపై శరములఁ బఱపెను. అపుడు కృష్ణుఁడు గుఱ్ఱములను నడుపుటలోఁ దననేర్పు మెఱయించుచు రథమును మండలగతులఁ ద్రిప్పుచు నాభీష్మునిశరములకు గుఱిగాకుండ నొనర్చుచుండెను. ఓరాజా! పిమ్మట నాగాంగేయుఁ డావాసుదేవధనంజయులను దీవ్ర నారాచములచే నెల్లగాత్రములందును నొప్పింపఁగా వారెంతయును విరాజిలుచు వృషభోత్తమములునా అంకెవేయుచుండిరి. మఱియు నాభీష్ముఁడు క్రుద్ధుఁడై శరసహస్రములచే నాకృష్ణార్జునులను నొప్పించి యెల్లదెసల బాణమయములుగా నొనర్చి కృష్ణు నొకతీవ్రబాణముచే నొప్పించి యట్టహాస మొనరించెను. అపుడు వాసుదేవుఁ డాభీష్మునిపరాక్రమమును బార్థుని మృదుయుద్ధమునుగాంచియుఁ బాండవసైన్యముల నడుమ నిలఁబడి యాదిత్యునివలె వెలయుచు శరవర్షమును వర్షించుచు సైన్యములను మడియించుచు యుగాంతమునువలెఁ జేయు నాభీష్ముని యుద్రేకమును దలంచియు నందులకు సహింపఁజాలక యిట్లు చింతించెను. "ఆహా! ఇఁక యుధిష్ఠిరునిసైన్యము లేదనవచ్చును. భీష్ముఁ డొక

దినమున దేవదానవులను జంపఁగలఁడన సైన్యసహితము లగుపాండవులను జయించు టాతని కెంతపని! మహాత్ముఁ డగుధర్మజునిబలమెల్లను జెదరిపోవుచున్నది. భగ్నమగుసోమకసైన్యమును జూచి కౌరవులు వారిని వెంటదఱుముచుఁ బితామహుని సంతసింపఁజేయుచున్నారు. నేనిఁకఁ బాండవులకుఁగాఁ గవచమును బూని యీపితామహుని వధించెదను. పాండవుల యీకార్యభారమును నేనే తీర్చెదను. ఈయర్జునుఁడు తీవ్రము లగుబాణములచేఁ బ్రహరింపఁబడియుఁ దనకు భీష్మునియెడఁగల గౌరవముచేఁ గర్తవ్యమును దలంపకున్నవాఁడు."

ఇటులు చింతించుచుండునంతలో మఱియుఁ గుపితుఁడై పితామహుఁడు పార్థునిపై శరవర్షమును గురిసెను. ఆబాణములు పెక్కు లగుటచే దిక్కులనెల్లఁ గప్పినవయ్యెను. అపుడు భూమ్యాకాశములును, దెసలును, భాస్కరుఁడును గానరాకుండెను. పొగలతో వాయువులు విసరుచుండెను. దిక్కులెల్లఁ గలఁతవడఁ దొడంగెను. పిదప భీష్మునాజ్ఞచే ద్రోణవికర్ణులును, జయద్రథుఁడును, భూరిశ్రవసుఁడు, కృపకృతవర్మలును, శ్రుతాయుషుఁడు, నంబష్ఠుఁడు, విందానువిందులును, సుదక్షిణుఁడును, బ్రాచ్యు లగుసౌవీరులును, వశాతకులు, క్షుద్రకులు, మాలవులును నాకిరీటిని ముట్టడించిరి. అటులు వేలకొలఁది పదాతిరథగజాశ్వములచే ముట్టడింపఁబడియున్న యక్కవ్వడిని జూచి, సాత్యకి, వడివడిగా నాశ్రీకృష్ణార్జునులకడకు పెడలెను. అపుడు వా రనేకరథగజాశ్వ పరివేష్టితులై వైరివీరులను దఱుముచు నాతనికిఁ గానవచ్చిరి. అంత నాసాత్యకి యావాసుదేవార్జునులఁ జేరి యప్పార్థునకు సహాయుఁడై యింద్రునకుఁ దోడ్పడినవిష్ణునిఁ దలపించుచు గజరథాశ్వములు చెదర యోధులు వడంకఁ బరువులిడుధర్మజుసైన్యమును జూచి యతఁడు ఓసైనికులారా! ఓయోధులారా! ఎందులకేగెదరు? ఇది క్షత్రియ ధర్మముగాదని ప్రాచీనులు తెలిపియుండిరి గాదే! ఓవీరులారా! మీ మీప్రతిజ్ఞలను బరిత్యజింపకుఁడు. మీవీరధర్మముల నాచరింపుఁడు" అని పలికెను. అంత నటు లొకరినొకరుగూడి పరువులిడుచున్న యా క్షత్రియముఖ్యుల నావాసుదేవుఁ డారసి, పార్థునిమృదుయుద్ధమును భీష్ముని తీవ్రపరాక్రమమును జూచినవాఁడగుటఁ గుపితుఁడై యాసాత్యకితో "ఓయీ! శినిప్రవరా! ఎవ్వరు చెదరిపోవుచున్నారో వారిని

బోనిమ్ము. ఇందున్న వారునైత మింకఁ బోవుదురుగాక. ఇదె చూడుము రథమునుండి భీష్మునిఁ బడఁద్రోయువాఁడను. అటులే ద్రోణునినైతము నాతనిసైన్యములతోఁ బాఱఁదోలెదను. కుపితుఁడ నగు నాయెదుటఁ గౌరవులలో నిలుచువారెవ్వరు? నిలిచియు బ్రతుకువారెవ్వరు? కావున నిదె నాచక్రము పట్టుకొని దేవవ్రతునిప్రాణములను దీసెదను. ఓసైనేయా! ఈరణరంగమున సైన్యముతో, భీష్ముని ద్రోణునిఁ జంపి ధర్మజునకును, ధనంజయునకును, భీమునకును, నకులసహదేవులకును సంతసము గలిగించెదను. మఱియు ధార్తరాష్ట్రులను వారిపక్షమువారిని నశింపఁ జేసి యజాతశత్రుఁడగుధర్మజున కిదె రాజ్యమును సంపాదించి సంతుష్టుఁడనయ్యెదను" అని పలికి యతఁడు మంచినాభిగల్గినట్టియు, రవిప్రభలతో వేయివజ్రాయుధములతో సరియగునట్టియుఁ జుట్టును గత్తులు గల్గునట్టి తనచక్రము నెత్తి బుజముపై బెట్టి తాఁబట్టినపగ్గములు విడిచి పుడమి కుఱికెను. అపుడాతనిపదఘాతముచేఁ బుడమి వడంకెను. అతఁడటులు కడువడి వెడలి, మదాంధ మగుగజముపై నుఱుకుసింగపుంగొదమవలె రణగర్వితుఁడగు నాభీష్మునిఁగవిసెను. ఆసేనామధ్యమునఁ గుపితుఁడై యున్న యాయుపేంద్రుఁడు తనపీతాంబరము వ్రేలాడుచుండ మెఱపుతోఁగూడిన మేఘమువలె వెలయఁజొచ్చెను. ఆశౌరి కేలనున్న సుదర్శనము నిజవలయమనెడిపద్మమును భుజమనెడినాళమును గల్గి రవికాంతితో నాదినారాయణునినాభిని జనించినయాదిపద్మమువలె నెంతయు వెలయుచు నాతనికోపమనెడి సూర్యోదయముచే వికసించి జుట్టునుగల తీవ్రాగ్రములనెడి దళములతో నొప్పుచుండెను. అట్టిచక్రమును బట్టి గట్టిగా సింహనాదమొనర్చుచుఁ గోపోద్దీపితుఁడై యున్న యాయుపేంద్రుంజూచి యెల్లప్రాణులును "కౌరవుల కిఁక నాశము తప్పదని మొఱసెను. అతఁడిటులు చక్రముపూని జీవలోకమునకుఁ బ్రళయ మొనర్చువాఁడువలెఁ జరించుచుఁ బ్రాణులను దహించు ధూమకేతువువలెఁ జూపట్టెను. తనపై కటులు వెడలి చక్రము పట్టుకొని వచ్చుచున్న యావాసుదేవుం జూచి భీష్ముఁడించుకేనిఁ జలింపక కేలను విల్లమ్ములుపూనియే రథమందుండి యాతనితో "ఓదేవేశా! ఓజగన్నివాసా! రమ్ము. రమ్ము. ఓశార్ఙ్గపాణీ! నీకు నమస్కారము.

ఓభూతరక్షకా! న న్నీ రథమునుండి క్రిందికిఁ బడఁద్రోయుము. నీచే హతుఁడ నగు నా కిహపరములందు శ్రేయమునకుఁ గొఱంత గలుగదు. ముల్లోకముల పొగడ్తగనిన నీచే నిట్లు గౌరవింపఁబడినవాఁడను” అని పలికెను.

ఓరాజా! ఆశాంతనవుని శాంతవచనములను విని యవ్వనజాక్షుఁ డాతని వడిగా సమీపించి “ఓయీ! ఇప్పుడమిఁ బ్రజాక్షయమునకు నీవే మూలము. దుర్యోధను నిపు డుద్ధరింపఁగలవు. ధర్మమార్గమునఁ జరించు మంత్రివైతేనిఁ గపటద్యూతమునుండి యాసుయోధనుని మఱలింపరాదో? అటు లొకప్పుడు వాఁడు ధర్మమార్గమును దప్పి నడచి కులపాంసనుఁడై నీవచనము వినకుండెనేని వానిని విడువరాదో?” అని పలుక విని భీష్ముఁ డాతనితో “ఓదేవా! రాజు పరమదైవతముగదా!” అని పలికెను. అదివిని భగవానుఁడు మఱియు నాతనితో “యాదవుల హితమునకై బోధింపఁబడియు వినని కంసుఁడు విడువఁబడలేదా? ఎవ్వఁడేని దైవముచే విపరీతబుద్ధియై హితమును వినఁడేనిఁ గ్లేశ మొందక తప్పదు.” అని పలుకుచుండునంతలో నర్జునుఁడు రథమునుండి డిగ్గనుఱికి కడువడిగా నాయదువీరునిఁజేరి దీర్ఘబాహుఁ డగు నాతనిఁ దనయాజాను బాహువులచేఁ బట్టుకొనియెను. అటులు నివారింపఁబడియు నాకృష్ణుఁడు సరోషుఁడై యాయర్జుని బెనుగాలి యొంటిమ్రానివలె నాకర్షించియే వేగముగా వెడలెను. ఆగాంగేయునికడకుఁ బరువిడుచున్న యాశ్రీకృష్ణునిపాదములు గట్టిగాఁ బట్టికొని పదవయడుగున నాతని నాపఁగలిగెను. అంత నాయర్జునుచే నమస్కరింపఁబడి వాసుదేవుఁ డందుఁ గూరుచుండెను. అటులున్న యాభగవానునకు మఱియు నమస్కరించి సంతుష్టుఁడై యర్జునుఁ డాతనితో “ఓదేవా! శాంతింపుము. కోప ముప సంహరింపుము. పాండవులకు నీవే గతివిగదా! ఓయింద్రానుజా! నేను జేసినప్రతిజ్ఞను విడుచువాఁడను గాను. ఇదె నాసోదరులపైనిఁ బుత్రుల పైని యొట్టుపెట్టుకొనుచున్నవాఁడను. నీచెప్పినట్టులఁ గౌరవులనెల్ల నంత మొందించువాఁడను” అని పలికెను.

అది విని కేశవుఁ డందుల కమందానంద మొంది పాండవుల హితము గోరువాఁడై యెప్పటిచొప్పున మఱల రథ మధిరోహించి పగ్గములు పట్టుకొని తనశంఖము నెప్పటివలెఁ బట్టి పూరించెను. ఆ

శంఖారావ మెల్ల దెసలను మాఱుమ్రోగునటు లొనరించెను. అప్పుడు కుండలములు భుజభూషణములును జలింపఁగా, ధూళిఁ బ్రుంగిన తెప్పలు గలకన్నులతోడను, దెల్లనిపలువరసతోడను గూడి శంఖము పట్టుకొని యున్న యాశ్రీకృష్ణునిఁ జూచి మనవారు గట్టిగా నఱచిరి. పిదపఁ గౌరవసైన్యములం దెల్లెడలను మృదంగ భేరీపటహధ్వానములును, దుందుభిస్వనములును, సింహనాదములును నొక్కమాఱుగా విజృంభించెను. పిమ్మటఁ బార్థుని గాండీవధ్వని యెల్లదెసలను గర్జాతుల్యమై ప్రబలెను. ఆతనివింటనుండి వెడలిన శరపరంపర లెల్లదిక్కులందును వ్యాపించెను. అటు లతఁడు విజృంభించి కౌరవులును, శకుని, భీష్ముఁడు, భూరిశ్రవుఁడును మున్నగు యోధుల నెదుర్కొని, యెండుగడ్డిప్రోవు నంటుకొన్న యగ్నివలెఁ బ్రజ్వలింపసాగెను. అపుడు భూరిశ్రవుఁ డాయర్జునిపై నేఁడు సాయకములను, దుర్యోధనుఁ డుగ్రవేగముగల తోమరములను, శల్యుఁడు గదను, భీష్ముఁ డొకశక్తినిఁ బ్రయోగించిరి. అపు డాయర్జునుఁ డాభూరిశ్రవునిబాణముల నేడుసాయకములచే నివారించి యొకతీవ్రబాణముచే దుర్యోధనునిగదను ఖండించి పిదప మెఱుపువలె మెఱయుచు భీష్మప్రయుక్తమై వచ్చుశక్తిని శల్యప్రయుక్తమగుగదను రెండుతూపులచే ఖండించెను. ఓరాజా! పిమ్మట నమ్మహానీయుఁడు విచిత్రమై యమేయ మగుతనగాండీవమును రెండుబాహువులచే గట్టిగాలాగి విధ్యుక్తముగా ఘోరమగుమహోగ్రాస్త్రము నంతరిక్షమునఁ బ్రాదుర్భవింపఁజేసెను. అటు లద్దానిని జయింపఁజేసి, మహాత్ముఁడును మహాధనుర్ధరుఁడునగు నాయర్జునుఁ డెల్లకౌరవసైన్యములను నగ్నివర్ణము లగుశరపరంపరలచే నివారించుచుండెను. ఆతనిధనువునుండి వెడలినశరజాలము రథములను, ధ్వజాగ్రములను, ధనువులను, బాహువులను, ఖండించి, గజాశ్వములదేహములందుఁ బ్రవేశించెను. అటు లతఁడు దిక్కులను విదిక్కులను దనశరపరంపరచే నింపి, గాండీవధ్వనిచే వైరులచిత్తముల కుత్తలము గల్గించెను. ఘోరమగు నామహాస్త్రయుద్ధమున శంఖారావములును, దుందుభిస్వనములును, రథనాదములును నాగాండీవధ్వనిలో నడంగినవయ్యెను. పిమ్మట నాగాండీవధ్వని విని విరాటుఁడు మున్నగువీరులును, ద్రుపదుఁడును స్థిరచిత్తులై యందుల కేతెంచిరి. ఎందెందు గాండీవారావము వినవచ్చుచుండునో యా

యాచోటుల విడిచి మనసైన్యములన్నియుఁ బరువులిడుచుండెను. కాని భయపడి యెవ్వరును నాతని నెదుర్కొనఁజాలరైరి. ఘోర మగు నామహాసంగరమున వీరులును, రథములతో సూతులును, గజములును, బతాకలును గడువడిగాఁ బుడమిని బడసాగెను. మఱియు నాతని వడి గలశరములవ్రేటులచే వికలాంగులై పడెడువీరులును, ఖండితములై యొఱఁగినయంత్రములునుగా సాధనంజయుని వాఁడితూపులచేఁ బదాతులును, గుఱ్ఱములు, నేనుగులును సేనాముఖమునఁ బలువిధములుగాఁ దెగిపడుచుండెను. అపు డారణరంగమున నాయైంద్రాస్త్రమునుండి వెడలినబాణపరంపరచే ఖండిత మగువీరులు మున్నగుసైన్యములరక్తమొక నదిగా నేర్పడి వీరులమెదడు నురుగుగాఁ బ్రవహింపసాగెను. మఱియు నయ్యది గొప్పప్రవాహముగలిగి యందుఁబడియున్న గజాశ్వములశరీరములొడ్డులుగాఁ బదాతులప్రేవులును మెదడునుమాంసమును బురదయై రథౌఘములును, భూతములు నొడ్డుసున్నవృక్షములుగా, శిరఃకపాలకేశములు పచ్చికపట్టులై శరీరసమూహములు ప్రవాహములుగాఁ జినిఁగి పడినకవచములు తరంగములై యొప్పుకలే, గులకఱాలుగా, నక్కలు, తోఁడేళ్లు, గ్రద్దలు, రాబందులు మున్నగుమాంసాహారులుతీరములందుఁ జేరి నిలువఁగాఁ జూపఱుల కది వైతరణీనదిగాఁ గానవచ్చెను. అటులాయర్జునుశరప్రహారములచే జనించి భయంకరమైన యారక్తప్రవాహమును, ఘాతయోధమగు నాసైన్యమును జూచి, పాండవులును, జేదిమాత్స్యపాంచాలకరూశదేశాధీశులును సింహనాదము లొనర్చిరి. మఱియుఁ దమకుఁ గల్గినజయముచే గర్వించినపాండవవీరులు కౌరవవీరులను దర్జించుచుండిరి. అటులు బెదరి నలుదెసలకుఁ బరువులిడుచున్న యక్కౌరవసైన్యములఁ జూచి కృష్ణార్జునులు సింహనాద మొనర్చిరి. అపుడు సూర్యుఁడు తనకిరణజాలమును ముడిచికొనుచుండెను. అంత నర్జునశరప్రహారక్షతాంగులై ఘోరమై యారయరాని యాయైంద్రాస్త్రమును జూచి యయ్యది యుగాంతముగా భావించి భీష్మద్రోణులును, దుర్యోధనాదులును యుద్ధవిముఖులైరి. సంజకెంజాయలు గానవచ్చెను. అగ్నియం దెఱ్ఱనికాంతి వొడమెను. ధనంజయుఁడు తనశత్రుల నపకీర్తిపాలు గావింపఁగా ధర్మజుఁడు తనసోదరులంగూడి యుద్ధమును ముగించి శిబిరమునకుఁ బోయెను. అంతఁ గౌరవసేనలో సమ్మర్దమగు

నాదము జనించెను. ఆనాఁడు కౌరవసైన్యములోఁ బదివేలరథములును, నేఁడువందలయేన్గులును, బ్రాచ్యులగు సౌవీరగణములవారందఱును, క్షుద్రకమాలవులును నర్జునిచే నిహతినొందవలసివచ్చెను. ఇంతయేల! నాఁ డర్జునుఁ డెవ్వనికిని జేయరానియద్భుతకృత్య మొనర్చెను. ఆహా! నేఁడు శ్రుతాయువు, అంబష్ఠుఁడు, కృపుఁడు, సైంధవుఁడు, బాహ్లీకుఁడు, భూరిశ్రవుఁడు, శలుఁడు, శల్యుఁడు నింకను గలయోధులును గుపితుఁ డగుపార్థుని బాహుబలముచేఁ బీడితులైరి. అని సైనికు లొకరితో నొకరు పలికికొనుచు మనయోధులు తమతమశిబిరములకుఁ బోయిరి. నాఁ డర్జునునకు వెఱచి మండుచున్న దివ్వటీలతోడను, బ్రదీప్తము లగు దీపములతోడను గురుసైన్యములు శిబిరములను బ్రవేశించిరి” అని తెలిపి మఱియు ని ట్లనియె.

భీష్మార్జునులద్వంద్వయుద్ధము

“ఓయాంబికేయా! నాఁటిరాత్రి గడచుడుఁ గౌరవసైన్యముల కధిశుఁడై వైరులపై నెంతయుఁ గోపమొదవ భీష్ముఁడు యుద్ధసన్నద్ధుఁ డయ్యెను. ఆగాంగేయుని ద్రోణదుర్యోధనబాహ్లీకులును దుర్మర్షణుఁడు చిత్రసేనుఁడునుమున్నగు యోధులు వెంబడించి వెడలిరి. మహారథులును, తేజోవంతులును, విక్రమశాలులు నగురాజోత్తముల నడుమ నాభీష్ముఁడు దేవతలలో నింద్రుఁడువలె విరాజిలుచుండెను. అతఁడు సైన్యముల కధీశుఁడై నడుమఁగాఁ గదలుచు. నల్లగను, దెల్లగను, నెఱ్ఱగను, బచ్చగను వెలయు పతాక లేన్గులమూఁపులపైఁ గానవచ్చెను. అట్టిసైన్యము నాయకుఁడగుభీష్మునితోడను,మహారథములతోడను,గజాశ్వములతోడను వర్షాకాలమున మెఱపులతోడను, మేఘములతోడను గూడిన యాకసమువలె నలరుచుండెను. పిదప నట్టికౌరవసేన యాశాంతనవుచే రక్షితమగుచు నర్జునుపై వెడలి భయంకర మగునదివేగముతో నడుచుచుండెను. నడుమ నానావిధసారబలములతో నిండినట్టియుఁ, బదాతిరథములు పక్షములుగాఁ గల్గినట్టియుఁ, బెనుమబ్బుతో సరియగునట్టి యా కౌరవవ్యూహము దూరమునుండియే యర్జునునిదృష్టిగోచర మయ్యెను. అతఁడు కపిధ్వజము నెత్తించి తెల్లనిగుఱ్ఱములుపూన్చిన రథ మధిరోహించి సేనాముఖమున నిలిచి బయలువెడలెను. అట్టికపిధ్వజునిఁ గాంచి

నీవారెల్లరును నీపుత్త్రులతోఁ గూడఁ బరితపింపసాగిరి. ధనుర్ధరుఁడై మహారథుఁడగు నాయర్జునుచేఁ బాలింపఁబడు నావ్యూహమును నీవారు చూచిరి. అయ్యది పూర్వదినమే పాండవసత్తముఁ డగుధర్మజునిచే సమకట్టఁబడినది. అట్టివ్యూహము మానుషలోకమున మున్నెన్నఁడును జూచినదియు వినినదియుఁ గాదు. పిదప నాయుద్ధరంగమున వేలకొలఁది భేరులు మ్రోగింపఁబడినవి. అటులే శంఖధ్వనులును, దూర్యారావములును, సింహనాదములును సకలసైన్యములందును జెలరేఁగెను. పిమ్మట బాణములతోఁ గూడినధనువులు మహాధ్వనుల నొనర్పసాగెను. శంఖధ్వనులును, భేరీనాదములను గప్పుచుండెను. ఆశంఖధ్వనులతో నావరింపఁబడియున్నట్టియుఁ, బుడమినుండి వెడలినధూళులతో నిండి గొప్ప మేలుకట్టువలె వెలయు నాకసము నారసి వీరులెల్ల నొక్కమాఱుగా యుద్ధసన్నద్ధులైరి. ఒకరథికుఁడు వేఱొకరథికుని సూతునితోను, గేతువుతోను, రథ్యములతోను, రథములతోను బుడమి వైచుచుండెను. అటులే యేనుఁగచే నేనుఁగు, పదాతిచేఁ బదాతియు హతులగుచు, ఘోరాకారమును నద్భుతదర్శనమును గలిగి గానవచ్చెను. సువర్ణముక్తాభూషణభూషితములగు గుఱ్ఱపుదడములు ఖడ్గప్రాసాదులచే ఖండింపఁబడుచు నేలఁ గూలుచుండెను. గజదంతములతాఁకుడులచేఁ జేతులు తెగి సూతులతో రథికులు త్రెళ్ళుచుండిరి. రథికులు రథికులశరప్రహారములచే హతులగుచుండిరి. మఱియు నేనుఁగులవేగముచేతను, సాయకములవ్రేటులచేతను, గజపాదవిషాణఘాతములచేతను జూర్ణమగుచున్న పదాతులయు, రౌతులయు నార్తధ్వనులు వినినవారు నేలఁ గూలఁబడుచుండిరి. ఇంకను గజరథాశ్వములు తిరుగుడువడుచుఁ, బదాతులు నశించుచునున్నయట్టిదురవస్థ భీష్మునికంటఁబడెను. అంత నైదుతాడులు పొడవు గలధ్వజముతో నాభీష్ముఁడు వెడలి యశ్వవేగముచే వైరుల కనివార్యుఁడై, గొప్పయస్త్రవేగముచేఁ బిడుగువలె మెఱయు నాయర్జును నెదుర్కొనియెను. అటులే ద్రోణుఁడు మున్నగుయోధులును నప్పార్థునిఁ దలపడిరి. పిదపఁ గృపుఁడును, శల్యుఁడును, వివింశతి, దుర్యోధనుఁడు, సౌమదత్తియు నాతనినే యెదురించిరి. పిమ్మట నారథసమూహమునుండి సువర్ణకవచుఁడు సర్వాస్త్రవేత్తయు, నర్జునసుతుఁడు నగునభిమన్యుఁడు వెడలి యక్కౌరవయోధులనెల్లఁ గడువడిగా నెదుర్కొని మహాబలులగు నాయోధుల

మహాస్త్రములనెల్ల ఖండించుచు భీకరకర్ముఁడై గొప్పమంత్రములతో హోమము చేయఁగా జ్వాలామయుఁడైన భగవానుఁడగునగ్నివలె వెల యుచు నారణరంగమున వైరులరక్తము నొకనదిగాఁ బ్రవహింపఁ జేసెను. పిదప భీష్ముఁ డాయభిమన్యునిఁ దప్పించుకొని మహారథుఁ డగు నర్జునునికడకు వెడలెను. అంత నాయర్జునుఁ డద్భుతమై మహాధ్వని గల గాండివమునుండి వెడలుశరజాలముచే వైరులమహాస్త్రములనుఖండించు చుండెను. అటులు తన్నుఁజేరిన ధనుర్ధరోత్తముఁ డగు పితామహునిపై నాకపిధ్వజుఁడు తీవ్రము లగుశరములఁ గురిపించెను. అటులే భీష్మ ప్రయుక్తము లైనబాణములచే ఖండింపఁబడినయర్జునాస్త్రముల నంత రిక్షమున నీవారెల్లరును గాంచిరి. అపుడు సూర్యోదయముచేఁ జీక టులువలె నాయర్జునాస్త్రములు తొలఁగసాగెను. ఇటు లాభీష్మార్జునుల భయంకరధనురారావములు గలద్వంద్వయుద్ధమును గౌరవులును, సృంజ యులును, లోకమువారును నద్భుతముగాఁ జూచిరి.” అని తెలిపి సంజ యుఁడు మఱియు నిట్లనియె.

## సాంయమనిశోమరునివధము

“ఓరాజా! అశ్వత్థామయు భూరిశ్రవుఁడు, శల్యుఁడు, చిత్ర సేనుఁడును, సాంయమనిపుత్రుఁడును నభిమన్యునిఁ దలపడిరి. తేజో వంతుఁడైన యాయభిమన్యు నొక్కని నాయేవురు నెదుర్కొనన నైదేన్గు లచే నెదుర్కొనఁబడిన సింగపుఁగొదమవలె నతఁడు చూపరులకుఁ గాన వచ్చెను. లక్ష్యశుద్ధియందును, శౌర్యమందును, బరాక్రమమందును, నస్త్రలాఘవమందును నాయభిమన్యునకు సాటియగువారు లేరనవచ్చును. శత్రుమారకుఁడై యటులు విక్రమించుచు యుద్ధావేశముతోనున్న తనతనయునిఁ జూచి యర్జునుఁడు సింహనాద మొనరించెను. పిదప సైన్యమునెల్లఁ బీడించుచున్న నీమనుమనిఁ గాంచి నీవారెల్లరును నాతనిఁ జుట్టుముట్టిరి. అందుల కతఁ డించుకేని దైన్యమొందక వైరి సైన్యములకు దైన్యమొదవించుచుఁ దనతేజోబలములతో శరలాఘవ మును జూపుచు యుద్ధముచేయుచున్న యాతనిధనువు సూర్యునితో సరిదియై కానవచ్చెను. అపు డతఁ డశ్వత్థామపై నొకకోలను, శల్యు నిపై నైదుశరములను బ్రయోగించి,యెనిమిదిబాణములచే సాంయమని

పుత్రుని ధ్వజము తెగనేసి సువర్ణదండముగలిగి సర్పతుల్యమై సౌమ దత్తిచేఁ బ్రయుక్తమగుమహాశక్తి నొకబాణముచే ఖండించెను. పిదప శల్యుఁడువైచిన నారాచములను నివారించి యాతనిగుఱ్ఱముల నాల్గిటినిఁ గొట్టెను. భూరిశ్రవుఁడును, శల్యుఁడు, శలుఁడు, నశ్వత్థామయు సాంయమనితనయుఁడును సంరంభించియు, నాయర్జునతనూజుని బాహుబలమోరువలేక యెదుర్కొనలేరైరి. పిమ్మట నీకొమరునిప్రేరణముచేఁ త్రిగర్తులును, మద్రులు, కేకయులు నగు నిరువదైదువేవురు ధనుర్ధరులు వెడలి యభిమన్యునితోఁ గూడ నాయర్జునుఁ బరిమార్ప నెంచి వారిని ముట్టడించిరి. ఓరాజా! అటు లాయోధులచే నాతండ్రికొడుకులరథము లావరింపఁబడుటను జూచి పాండవసేనాపతి యగు ధృష్టద్యుమ్నుఁడు వారికిఁ దోడుపడుటకై వేలకొలఁదిగజరథాశ్వములను వేలకొలఁదిపదాతులను వెంటనిడుకొని కుపితుఁడై ధనుష్టంకార మొనర్చుచుఁ దనసైన్యమును బ్రోత్సహించుచు మద్రకులను, గేకయులను దలపడియెను. పిమ్మటఁ గీర్తినిధియగు నాధృష్టద్యుమ్నునిచే రక్షితమైన యాసైన్యము పోరాడుచు నెంతయు విరాజిల్లెను. అంతఁ బాంచాలకులవర్ధనుఁ డగు నాతఁ డర్జునుం గలిసి మూఁడిటిచేఁ గృపుని మూపుఱెమ్ముకల నొప్పించి, పిమ్మట నమ్మద్రకులను బదిబాణములచేఁ బ్రహరించి,కృతవర్మపృష్ఠరక్షకు నొకబాణముచేఁ గొట్టి, పౌరదాయాదుఁ డగు దమను నొకవాడికోలచేఁ బీడించెను. అందులకుఁ గుపితుఁడై సాంయమనిపుత్రుఁడు రణగర్వితుఁ డగు నాధృష్టద్యుమ్నుని ముప్పది బాణములతోడను, నాతనిసారథిని బదికోలలతోడను, నొప్పింపఁగా నెంతయుఁ బీడితుఁడై యాధృష్టద్యుమ్నుఁడు సెలవులఁ దడుపుచు, నెంతయుఁ దీవ్ర మగు నొకబాణముచే నాసాంయమిని విల్లుదును మాడి పిదప నాతని నిరువదైదుసాయకములచే నొప్పించెను. అటులే యతఁడాసాంయమనిపుత్రునియశ్వములను బార్ష్ణిసారథులను జంపెను. అంత హతాశ్వుఁడై రథమున నిలిచి యాసాంయమనిపుత్రుఁడు ద్రుపదసుతునిఁ జూచి రథము డిగి పాదచారియై, ఘోర మగు నొకఖడ్గమును బూని దానితోఁ రథముపై నున్న ధృష్టద్యుమ్నునిఁ బీడించెను. ఓరాజా! మహాప్రవాహమువలె వడిగలిగి యాకసమునుండి పడెడిసర్పమువలెఁ

గన్పట్టుచుఁ బ్రళయకాలయమునివలె భయంకరస్నై మధ్యాహ్న సూర్యునివలెఁ బ్రజ్వలించుచు మదగజవిక్రమముగల యాసాంయమని పుత్రునిఁ బాండవులును, ధృష్టద్యుమ్నుఁడును గాంచిరి. అపు డటులు ఖడ్గహస్తుఁడై బాణముకంటె వడిగా వెడలి యుద్ధముగాఁ దనరథము కడకు వచ్చుచున్న యారాజపుత్రు నారసి యాధృష్టద్యుమ్నుఁడు కుపితుఁడై తనగదతో వానితలపైఁ గొట్టెను. అంత నాసాంయమని కొమరుఁ డాగదాప్రహారముచే భిన్నాంగుఁడై తనఖడ్గముతోఁ గూడ నేలఁగూలెను. అటులు వాని వధింపఁగా నందఱును నాధృష్టద్యుమ్నుని భీమపరాక్రమమునకు మెచ్చికొనిరి. ఓరాజా ! మహారథుఁడగు నా రాజపుత్రుఁడు హతుఁడగుడు నీవారిలో నాహాకారములు జనించెను. పిమ్మట సాంయమని తనకొమరుఁ డటులు సమరమున సమసినందులకుఁ గుపితుఁడై రణగర్వితుఁడై యున్న యాధృష్టద్యుమ్నునిఁ గవియ నా మహావీరులిరువురకును ఘోరమగుమహాసంగరమయ్యెను. దానినిఁ గురు పాండవు లాశ్చర్యముగాఁ జూచుచుండిరి. అపు డాసాంయమని క్రుద్ధుఁడై మూఁడువాఁడికోలలచే మహాగజము నంకుశముచేవలె నాతనిమేను నొప్పించెను. అటులే శల్యుఁడును గుపితుఁడై యాధృష్ట ద్యుమ్నునివక్షమునఁ గొట్టెను. అపుడు ఘోరముగా యుద్ధము జరిగెను" అని తెలుప విని ధృతరాష్ట్రుఁ డి ట్లనియె.

### భీమసేనునిపరాక్రమము

"ఓసంజయా! మావారిసైన్యము పాండవసైన్యమున కోడుట నారయఁగాఁ బురుషకారముకంటె దైవమే బలవత్తరమని తలంచెదను. ఓయీ ! ఎపుడుచెప్పినను మావారు హతులైరనియుఁ బాండవసైన్యములు జయించెననియుఁ దెలుపుచున్నాఁడవుగాని పాండవులు హతులైరని తెలుపవు. ఇపుడు పురుషకారముచేతను హతు లగుమావారిని బలితులుగను, బాత్యమానులుగను, హతులుగనుగూడఁ దెలుపుచున్నాఁడవు. మనవారు జయ మపేక్షించి యథాశక్తిగా యుద్ధము చేయుచున్నను వారినిబాండవులు జయించుచునేయున్నారు. మావారు తగ్గిపోవుచున్నారు. దుర్యోధనకృతము లగు తీవ్రదుఃఖములను బెక్కిటిని వింటిని. అవి నాకు దుస్సహములై యున్నయవి. పాండవు లెట్లు

నశింతురో యట్టియుపాయము నూహింపఁజాలకున్నాఁడను. మావారి కీయుద్ధమున జయ మెట్లు గలుగునో తెలియకున్నది."

అది విని సంజయుఁడు "ఓరాజా! యోధులయు, గజరథాశ్వము లయునాశమును స్థిరచిత్తుఁడవై వినుము. ఇదియెల్లను నీగొప్పతప్పిదమే గాని వేఱొండుగాదు. అటులు శల్యుఁడు ధృష్టద్యుమ్నుని నొప్పింపఁగా నతఁ డలిగి తొమ్మిదియినుపకోలలచే నామద్రేశ్వరునిఁ బీడించెను. అపు డాధృష్టద్యుమ్నునిపరాక్రమ మద్భుతముగాఁ జూపట్టెను. ఆపార్షత ప్రయుక్తములగు వాని నాశల్యుఁడు వారించెను. వారటులు యుద్ధము చేయుచుండఁగా, నించుకేని వారిలోఁ దారతమ్యమును గనిపెట్టలేక పోయితిమి. అపుడటులు రెండుగడియలు యుద్ధముజరిగెను. పిదపశల్యుఁ డొకతీవ్ర మగు పచ్చనిబాణముచే వర్షకాలమున జలధారలు పర్వత మునువలె నాతనిఁ గప్పెను. అంత నాపార్షతుఁడు శరపీడితుఁ డగుటను జూచి యభిమన్యుఁడు కుపితుఁడై శల్యునిరథమున్పైఁ గవిసి, మూఁడు వాఁడితూపులచే నాతని నొప్పించెను. పిదప నాశల్యునిరథముచుట్టును జేరి యాతనిరక్షణమునకై దుర్యోధనదుశ్శాసనులును, వివింశతివికర్ణ లును, దుర్మర్షణదుస్సహులును, దుర్ముఖచిత్రసేనులును, సత్యవ్రతపురు మిత్రులును మున్నగు నీవారందఱును నాయభిమన్యు నొక్కమాఱుగా ముట్టడించిరి. అటులు వచ్చినవారినెల్లఁ జూచి యెంతయుఁ గోపావేశ ముతో భీముఁడును, ధృష్టద్యుమ్నుఁడును, ద్రౌపదేయులును, నకుల సహదేవులును, నభిమన్యుఁడు ననునీపదుగురును దుర్యోధనాదు లగు పదువురను నెదుర్కొనిరి. అటులు వారు పరస్పరము తలపడి యొకరి నొకరు హింసించునుత్సాహములతోఁ గుపితులై పోరాడిరి. ఓరాజా! నీదురాలోచనమువిధముగాఁ బదుగురురథికులును గుపితులై యపుడు నీవారికిని, వారివాడికిని ఘోరమగుయుద్ధ మారంభమగుడుఁ దక్కినరథి కులు దానినిఁ జూచుచుండిరి. ఆమహారథులు పలువిధములగుశస్త్రము లను బరస్పరముఁ బ్రహరించుకొనుచు సింహనాదములొనర్చుచు మహా సంరంభముతో నొకరినొకరు కలిసి మహాస్త్రములను బ్రయోగించు కొనుచుండఁగా దుర్యోధనుఁ డెంతయును గుపితుఁడై ధృష్టద్యుమ్నుని నాల్గునారసములచే నద్భుతముగాఁ బ్రహరించెను. అటులే దుర్మర్షణుఁ డిరువదియుఁ, జిత్రసేనుఁ డైదును, దుర్ముఖుఁడు తొమ్మిదియు, దుస్సహుఁ

డేఁడును, వివింశతి యైదును, దుశ్శాసనుఁడు మూఁడునుగా వాఁడి తూపుల నాధృష్టద్యుమ్నుని నొప్పించిరి.అంత వైరిసంతాపకుఁ డగు నాపార్షతుఁడు తనకరలాఘవమును జూపుచు వారిని బ్రత్యేక మొక్కొక్కరి నిరువదై దేసిబాణములచేఁ బ్రతిహతి యొనర్చెను. పిమ్మట నభిమన్యుఁడు సత్యవ్రతపురుమిత్రులను బదేసిబాణములతోఁ గొట్టెను. నకులసహదేవులు తమకు మామయగు శల్యునిఁ దీవ్రశరములచేఁ గప్పిరి. అది యెంతయు నద్భుతమయ్యెను. ఓమహారాజా! పిమ్మట నమ్మద్రనాథుఁ డమ్మాద్రీపుత్రులను దనమేనల్లురనితలంపక పెక్కుశరములచే వారిని బీడించెను. వారు మఱల వానిని శరవర్షమున ముంచిరిగాని యించుకేనిఁ జలింపరైరి. పిదప మహాబలుఁడగుభీమసేనుఁడు దుర్యోధనునిఁ జూచి యప్పటికాకలహము ముగియునట్లుగాఁ జేయనెంచి గదను బూని యాశల్యునిపైకి వెడలెను. అటులు గదబూని కైలాసమువలెఁ జూపట్టుచు యుద్ధసన్నద్ధుఁడుగా మహాబాహుఁడగు నాభీమునిఁ జూచి నీ పుత్రులెల్ల వెఱచి నలుదెసలకును బరువులిడిరి. అపుడు దుర్యోధనుఁడు కుపితుఁడై వడిగలపదివేలయేనుఁగులసైన్యము గలమాగధునిఁ బ్రోత్సహించి వానిని ముందిడికొని దుర్యోధనుఁ డాభీమసేను నెదుర్కొనియెను. అంతఁ దనపైకివచ్చుచున్న యాగజసైన్యమును గాంచి యాభీముఁడు తనగదను గేలఁబూని సింగపుఁగొదమవలె గర్జించుచు రథము డిగి పర్వతసార మగు తనగొప్పగదను ద్రిప్పుచు నోరుతెఱచినయమునివలె నాయేనుఁగులపైఁ గవిసి వానిని మోదుచు నారణరంగమునఁ జరించెను. మహాబాహుఁడగు నతఁడు మున్ను దానవులలో నింద్రుఁడువలె గర్జించెను. సకలజనమనోభయంకర మగు నాభీముని మహానాదమున కందలి వారందఱును జేష్టారహితు లైరి. పిమ్మట నుపపాండవులును, నభిమన్యుఁడును, గవలవారును, ధృష్టద్యుమ్నుఁడును నాభీమునివెనుక నిచిలి యాతనికి రక్షకులై మేఘములు కొండనువలె శరవర్షముచే నావైరివర్గమును ముంచుచు, మఱియు నాగజయోధులపై క్షురములను, క్షురప్రములను, భల్లములను బ్రహరించుచు, వారితలలఁ దెగనేయసాగిరి. అంత నాగజయోధులతలలును భూషితములగుబాహువులు నంకుశములతోఁగూడినచేతులును భూతలమునఁ బాషాణవర్షమువలెఁ గురియఁజొచ్చెను. అపుడు వారు తెగినతలలతోఁ బర్వతాగ్రములందు

శిఖలు తెగిన మొండిచెట్లవలెఁ జూపట్టిరి. మహాత్ముఁ డగు నాధృష్టద్యుమ్నునిచేఁ గూలినట్టియుఁ, గూలుచున్నట్టియు మహాగజముల నెన్నిటినో చూచితిమి.

అంత నామాగధుఁ డైరావతము నాఁదగు నొకగొప్పయేన్గు నాయభిమన్యుని రథముపైఁ బురికొల్పెను. అయ్యది యాతనిపైకి వెడలి రాఁగాఁ జూచి యాయభిమన్యుఁడు దాని నొకబాణముచేఁ గొట్టి సువర్ణపుంఖముగల వేఱొకభల్లముచే నామాగధునితలఁ దెగనేసెను. పిమ్మట భీముఁ డాగజసైన్యముఁ జొచ్చి మున్నింద్రుఁడు కొండలనువలె మర్దించుచు నొకప్రహారముచేతనే యాయేన్గులఁ బెక్కిటిని నేలఁగూలఁ ద్రోసెను. అయ్యవి వజ్రహతములై పడినపర్వతములువలె మాకుఁ గానవచ్చెను. అందుఁ గొన్ని దంతములు విఱిగినవియుఁ, గొన్ని గండములు ఖండింపఁబడినవియు, మఱికొన్ని మోఁకాళ్లు దెగినవియు, వేఱొక కొన్ని కుంభములు వ్రయ్యలైనవియునై పర్వతాకారములై రక్తమును గ్రక్కుచు వశముతప్పుచుఁ బుడమిఁ బడుట మాకుఁ గాననయ్యెను. అపు డాభీముఁడు తనమేను మేదోరుధిరములచేఁ దడసి వసయు మజ్జయు నెల్లెడల నిండ నాదండధరునివలె భయంకరుఁడై రణరంగమున విహరించెను. గజరక్తసిక్తమైన గదను బూనియున్న యావృకోదరుఁడు శూలముఁ బూనియున్నరుద్రుఁడునాఁ జూపట్టెను. ఆభీమునిచే మర్దింపఁ బడినయేన్గులు నీసైన్యమును ద్రొక్కుచుఁ బరువులిడెను. అటులు యుద్ధమొనర్చుచున్నభీముని మహారథులగు నభిమన్యుఁడు మున్నగువారు మున్నింద్రుని దేవతలువలెఁ గాపాడుచుండిరి. గజరక్తములచేఁ దడుపఁబడినగదను బుజముపై వేసికొనిన భీమునిఁ జూడఁగా రౌద్రాకారుఁడగుయమునివలె నతఁడు గానవచ్చెను. మఱియు గదను ద్రిప్పుచున్నయాతని నాట్యముచేయుచున్న శంకరునివలెఁ జూచితిమి. ఆతని చేతనున్నగద వజ్రాయుధమునాఁ బొలిచి మిక్కిలి భయంకరమై మాకుఁ గానవచ్చెను. మున్ను ప్రళయకాలరుద్రుఁడు తనపినాకమును బూని ప్రాణులనెల్లఁ బ్రళయమొందించునట్లుగా భీముఁ డాగదతో నేన్గులఁ జంపుచుండెను. పెనుగాలిచే మేఘములువలె నాతనిగదాప్రహారములచేఁ మనసైన్యమందలియేన్గులు చెదరి పరువులిడుచు మనవారిరథములను

ద్రొక్కెను. అపు డాభీముఁడు శ్మశానమున నున్నరుద్రుఁడువలెఁ గాన వచ్చెను" అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

సాత్యకి భూరిశ్రవులయుద్ధము

"ఓయాంబికేయా! అటు లాగజసైన్యమెల్ల హతమగుడు నీ కొడుకు దుర్యోధనుఁడు తనసైన్యములను భీమునిఁ జంపుఁడని ప్రోత్స హించెను. అంత నాసైన్యము లాతనిశాసనము శిరసావహించి భీకరా రావము లొనర్చుచు నాభీమసేనునిఁ గలపడఁగా నపరిమితమై దేవతల కును దుస్సహమై పర్వదినమునందు సముద్రుఁడువలె విజృంభించివచ్చునా కౌరవసైన్యమును జూచి భీముఁడు దాని కొకచెలియలికట్టయై దాని నొకనిమేషమున నివారించెను. రథగజాశ్వసంకులమై శంఖదుందుభి నినాదపూరితమై పాదాతులపదధూళిచే నావృతమై యనంతమైన యాసైన్యమును మహాసముద్రమువలె నాపుటఁ జూడఁగా మాకెంత యును వింత గలిగెను. ఆతనికృత్య మపు డమానుషమై గన్పట్టెను. ఒక్కమాఱుగా నుద్రేకించి గజరథాశ్వములతో వచ్చిన యారాజులనెల్ల నతఁడు సులభముగాఁ దనగదాసహాయమున నివారించెను. అటు లా బలములనెల్ల నడంచుచుఁ దుములమైయున్న యాసేనలనడుమ నతఁడు మేరువువలెఁ గానవచ్చెను. అపు డట్టిమహాభయంకరమగు యుద్ధము తట స్థింపఁగా ధృష్టద్యుమ్నుఁడును, నాతనిపుత్రులును, సోదరులును, ద్రౌప దేయులును, నభిమన్యుఁడును, శిఖండియు నాభీము నేమఱక కాపాడు చుండిరి. పిదప నాభీముఁడు తనమహాగదనుబూని నీయోధులపై రెండవ దండధరుఁడువలెఁ బరువులిడి, రథబృందములను గుఱ్ఱపుదడములను యుగాంతాగ్నివలె సమయించుచు, రథజాలములను దొడలబలిమిచేఁ దొలఁగించుచుఁ, బచ్చికపట్టు నేన్గులువలె సైన్యములను ద్రొక్కుచు, రథ ములనుండి రథికులను బడఁద్రోయుచు, నేన్గులనుండి గజయోధుల నాక ర్షించుచు, గుఱ్ఱములనుండి రౌతులను బుడమిని బడవైచుచుఁ, బదా తులను నేలఁగూల్చుచు నిటులు సకలసైన్యములను బెనుగాలి వృక్ష ములనువలె రూపుమాపుచుండెను. మెదడు, మజ్జ, వస, మాంసము, రక్తము మున్నగువానిచే వ్యాప్తమై యారణరంగము మృత్యుగృహము వలెఁ గానవచ్చెను. అటు లుద్రేకించి సర్వసైన్యములను, బాఱఁద్రోలు

నాపవమానతనయునిఁ జూచి నీవారెల్లరును భీతచిత్తులై నిశ్చేష్టులైరి. అతఁడు తనగదను బూని యేవైపు చూచునో యందలివారెల్లఁ బరువు లిడసాగిరి. అంత నటులు వివృతముఖుఁడై ప్రాణులను మ్రింగు నంత కుఁడువలెనున్న యాభీమునిఁజూచి భీష్ముఁ డాతనిపైఁ గడువడిగా వెడలి యెదుర్కొనియెను. అటు లెదుర్కొని యుఱుమువలె వెలయు తనరథ ధ్వనిచే దిక్కులద్రువ నాగాంగేయుఁ డాభీముని, శరవర్షమున ముంచుచుఁ, దనపై విజృంభింపఁగా నతఁడును నాభీష్మునిఁ దలపడియెను. అపుడు సాత్యకియు నాభీష్మునిఁ దలపడి నిజధనుర్విముక్తములగు బాణములచే నీవారిసైన్యమును జలింపఁజేయుచుఁ తీవ్రాగ్రములగు బాణములను వెదచల్లుచుండ నాతని నివారింప నెవ్వరును జాలకుండిరి. అపుడలంబుసుఁ డను రాక్షసుఁ డాసాత్యకిని బదినారసములచే నొప్పింపఁగా నాసైనేయుఁడు, నాల్గుబాణములచేఁ బ్రతిహతి యొసర్చెను. అటులు సైన్యములఁ దలపడి వైరులనడుమఁ దిరుగుచుఁ గౌరవులనెల్ల నివారించుచు మఱిమఱియు సింహనాద మొనర్చుచున్న యాసాత్యకినిఁ జూచి నీవారు కొందఱు మేఘములు కొండనువలె శరములచేఁ గప్పిరి గాని పట్టపగలిటిసూర్యునివలె వెలుఁగు నాతని నెవ్వరును బూర్ణముగా వారింపఁజాలరైరి. అపు డొకభూరిశ్రవుఁడు తప్ప నీవారిలో దుఃఖితుండు గానివాఁడు లేఁడు. అతఁ డపుడు మిక్కిలి యుగ్రమగుతన విల్లు పూని యాసాత్యకితో యుద్ధమొనరింప నెంచి యాతని నెదుర్కొనియెను” అని తెలిపి మఱియు నిట్లనియె.

నాల్గవదినముయుద్ధము ముగియుట

“ఓధృతరాష్ట్రా! అటులాభూరిశ్రవుఁడు, సాత్యకిని గవిసి తొమ్మిది బాణములచే నాతని, నంకుశములచే మహాగజమునువలె నొప్పించెను. అంత నాసాత్యకియు నెల్లరు చూచుచుండఁగా నాకౌరవునిఁ బ్రతిహతు నొనర్చెను. పిమ్మట దుర్యోధనుఁడు తనసోదరులతోఁ గూడి యుద్ధోత్సాహుఁడై యున్న యాభూరిశ్రవునకు సహాయుఁడై యాతని నావరించియుండెను. అటులే పాండవులును, నాసాత్యకికిఁ దోడుపడ వెడలి యాతనిఁ జుట్టును నిలిచియుండిరి. అపుడు భీముఁడు కుపితుఁడై తనగదను బట్టి సుయోధనుఁడు మున్నగునీకొడుకులను ముట్టడించెను. అంత నీ

కొడుకు నందకుఁడనువాఁడు, మహాబలుఁడగు భీమసేనునిఁ గవిసి, యాత
నిపైఁ దీవ్రములగు తూపులను బఱపి నొప్పించెను. అటులే సుయోధ
నుఁడు వాఁడిమిగల తొమ్మిదిబాణములచేఁ గొట్టెను. అంత నాభీముఁడు
తనరథమెక్కి సారథియగు విశోకునితో "ఓయీ! మహారథులును శూరు
లును మహాబలులునగు నీధార్తరాష్ట్రులెల్లరును, గుపితులైన న్నీయుద్ధ
మునఁ జంపఁ దలఁచియున్నవారు. నీవు చూచుచుండఁగా నిదె వీరిని
జంపెదను. కావున నీక మసయశ్వములను సిద్ధమొనర్చి నడుపుము"
అని పలికి యతఁడు నీసుతుఁడగు దుర్యోధనునివక్షమునఁ బదింటను,
నందకుని మూఁడింటను గొట్టెను. పిదప దుర్యోధనుఁ డఱువదిబాణము
లచే మహాబలుఁడగు భీమునిఁ గొట్టి మూఁడుబాణముల నాతనిసారథిని
నొప్పించి మఱియు నాభీముని మోఁచేతిని మూఁడువాఁడితూపులచే
నొంచి విల్లు పడఁగొట్టెను. అటులు తనసారథి, సుయోధనుశరములచేఁ
బీడితుఁడై నందుల కెంతయు నలిగి, తనదివ్యమగుధనువు త్రిప్పుచు, నీ
తనయుఁడు తనప్రహారముచేఁ జచ్చునటు లోకలోమప్రవాహియగు
క్షురప్రమును వింట సంధించి యాతనివిల్లు తెగనేసెను. అంత నీతనయుఁ
డందులకుఁ గుపితుఁడై వేఱొకవిల్లు గొని, దాన నొకప్రళయకాల
మృత్యుతుల్యమగు ఘోరశరమును సంధించి దానిచే నాభీమసేనునివక్ష
మున గట్టిగాఁ గొట్టెను. అయ్యది గాఢముగా నాటుటచే నాభీముఁడు
తనరథస్థానమునఁ గూలఁబడి మూర్ఛమునిఁగెను.

ఓరాజా! అది చూచి యాతనిముందున్నయభిమన్యుఁడు మున్న
గు పాండవవీరు లోరువఁజాలక నీతనయునిశిరముపై శరవర్షమును గురి
సిరి. అంతలో నాభీముఁడు తెలివొంది దుర్యోధనుని మూఁడుబాణము
లచేఁ గొట్టి వెంటనే మఱల నైదుబాణములచె నొప్పించి, శల్యు నిరువ
దైదుబాణములచే నొప్పించెను. సువర్ణపుంఖములగు నాభీముని బాణముల
వ్రేటుపడి, యాశల్యుఁ డారణరంగమునుండి వెడలిపోయెను. పిమ్మట
నీపుత్త్రులలో సేనాపతియగు సుషేణుఁడు, జలసంధుఁడు, సులోచనుఁడు,
ఉగ్రుఁడు, భీమరథుఁడు, వీరబాహుఁడు, అలోలుపుఁడు, దుర్ముఖుఁడు,
దుష్ప్రధర్షుఁడు, వివిత్సుఁడు, వికటుఁడు, సముఁడు ననియెడిపదునలువు
రును బెక్కుబాణములను బ్రయోగించుచుఁ గుపితులై యాభీమసేను
నెదుర్కొనిరి. వారి నాభీముఁడు చూచి మహాబలుఁడై నెలవులఁ దడు

పుచుఁ బశువులనడుమఁ దోఁడేలువలెఁ జొచ్చి గరుడవేగముతో వారిపై నుఱికి, సుషేణు నొకతురప్రముచేఁ దలఁదెగనేసి యుప్పొంగుచు జలసంధునిఁ గొట్టి యమపురి కనిపెను. మఱియు నతఁ డుద్రేకించి, యుగ్రునిఁ దలపాగతోఁ దల నొకభల్లముచే డొల్లనేసి డెబ్బదిబాణములచే సారథితోను, గుఱ్ఱములతోను వీరబాహుని ఖండించి పరలోకగతునిఁగా నొనర్చి, పిదపఁ జిఱునగవుతోఁ భీమ, భీమరథుల నిద్దఱను నాభీమసేనుఁడు చంపెను. అంత నతఁడు సులోచనునిఁ జూచి, వాని నొకభల్లముచే నెల్లసైన్యములు చూచుచుండఁగాఁ బుడమిఁ బడవైచెను. అటులాభీమసేనుఁడు వరుసగాఁ దునుముచుండుటను జూచి మిగిలిన నీకొమరులు జడిసి యాభీమునిచేఁ బ్రహరింపఁబడుచు నారణరంగమునుండి వెడలిపోయిరి. అంత నాశాంతనవుఁడు తనమహారథుల నారసి వారితో "ఓవీరులారా! ఈభీముఁడు రణరంగమునఁ గుపితుఁడై మహాబలులగు ధార్తరాష్ట్రులను జంపుచున్నాఁడు. కావున నీవీరుని ముట్టడింపుఁడు" అని పలుక విని సైనికులెల్లరును గుపితులై యెక్కుమ్మడి నాభీము నెదుర్కొనిరి. అందు భగదత్తుఁ డొకమహామత్తగజము నధిష్ఠించి కడువడిగా వచ్చి యాభీమునిఁ దలపడియెను. అటులు కవియుచునే పాషాణసారములగు శరాసారములచేఁ బెనుమబ్బులు సూర్యునివలెఁ గప్పి యాభీమునిఁ గానరాకుండఁ జేసెను. అందుల కభిమన్యుఁడు మున్నగు మహారథు లుద్రేకించి యాభగదత్తుని శరవర్షమునఁ గప్పుటయెగాక యాతనియేన్గును బాణములచే నొప్పించిరి. మహారథులగువా రెల్లరును బలువిధములగు వాఁడితూపులచేనొప్పింప నాప్రాగ్జ్యోతిషాధీశుని మత్తగజము రక్తధారాసిక్తమై యారణరంగమున సూర్యకిరణములచే వ్యాప్తమగు పెనుమబ్బువలెఁ గానిపించెను. పిదప నామత్తగజము నాభగదత్తుఁడు ప్రేరేపింపఁగా నది చెలరేఁగి ప్రళయకాలయమునివలెఁ గడువడిగా వెడలి పుడమిని వడఁకించుచు వైరివీరులపైఁ బడియెను. దాని భయంకరరూపమును గాంచి యందలిమహారథు లెల్లరును నోరువఁ జాలక చింతాక్రాంతులైరి. పిదప నాభగదత్తుఁడు కుపితుఁడై యాభీమునివక్షమును దివిచివైచిన యొకబాణముచే నొప్పించెను. ఆవ్రేటుచే భీముఁడు మూర్ఛమునిఁగి ధ్వజస్తంభమునకుఁ జేరఁబడియెను. అంతఁ దనవ్రేటుచే భీముఁ డొఱఁగుటను వారిసైన్యములు వెఱచుటనుఁ జూచి

తనప్రతాప మేర్పడ భగదత్తుఁడు బిగ్గరగా సింహనాద మొనర్చెను. పిమ్మటఁ దనతండ్రి యటులగుటను జూచి ఘటోత్కచుఁడు, కోపావేశ పరవశుఁడై వచ్చి తనమాయాబలముచే నంతర్ధానమొంది యామాయ చేతనే భీరువులగువారికి వెఱపుగొలుపుచు, నొకతెప్పపాటులో నిజ మాయాకల్పితమగు నైరావతము నెక్కి ఘోరాకారముతో మఱలఁ గానిపించెను. ఆయైరావతము వెనుక దిగ్గజములు మఱికొన్ని వెడలెను. అంజనము, వామనము, మహాపద్మము ననెడిమూఁడును రాక్షసు లెక్కిరాఁగా మదమును గార్చుచుఁ బెనుఁగొండలనాఁ గన్పడుచుఁ, దేజోబలసమన్వితములై యాఘటోత్కచుని వెంటనంటి యుండెను. అపుడు ఘటోత్కచుఁడు తనయేన్గు నాభగదత్తునిపైఁ బురికొలి పెను. మఱియుఁగల యామూఁడేన్గులును గుపితములై యారక్క సులతోఁగూడి నాభగదత్తునిగజమును దమదంతములచేఁ బీడింప సాగెను. అంత నది యాయేన్గులచేఁ బీడింపఁబడియు, బాణములఁగొట్టు వడియు నప్పీడ నోరువలేక పిడుగుచప్పుడులఁబోలు మహానాద మొన ర్పఁగా, ఘోరమగుదాని యారావమును విని భీష్ముఁడు ద్రోణదుర్యో ధనులఁ జూచి వారితో "ఓయీ! మహారథుఁ డగుభగదత్తుఁ డిపుడు దురాత్ముఁడగు ఘటోత్కచునిపైఁ దలపడి యెంతయు దురవస్థనొంది యున్నవాఁడు. ఆరాక్షసుఁడన్ననో మహాశరీరుఁడు. ఈరాజు మిక్కిలి కోపముగలవాఁడు. కాలమృత్యుతుల్యులగు వీరిరువురును బరస్పరముఁ దలపడిరి. నిశ్చయముగా వీరిద్దఱును సమానులే. అయినను బాండవుల సోత్సాహధ్వనులు మెండుగా వినంబడుచున్నవి. మఱియు నాతనిమహా గజము వెఱచినటు లఱచుచున్నది. కావున నారాజోత్తముని రక్షిం పఁగా మనము పోవలసియున్నది. లేనిచో నతఁ డిపుడే ప్రాణములను గోలుపోవును. అటులగుట నిఁకఁ జాలము సేయరాదు. ఓవీరులారా! త్వర పడుఁడు. ఆమహాసంగ్రామ మెంతయు భయంకరమై మేనికి గగురుపా టొదవించుచున్నది. అతఁడు మనకు భక్తుఁడు, కులపుత్త్రుఁడు, శూరుఁ డు, సేనాపతియు నగుట నాతనిరక్షణము మన కవశ్యమును గర్తవ్యమై యున్నది." అని తెలుప విని యాభగదత్తుని రక్షించుతలంపుతో రాజు లెల్లరును గలిసి ద్రోణుని మున్నిడికొని కడువడిగా నతఁ డున్నకడకు వెడలిరి. అటులు వెడలినవారినెల్ల నారసి ధర్మజుఁడు మున్నుగుపాండ

వులును, బాంచాలురును వైరులపైకి వెడలిరి. వారి నారసి యారక్క సుఁడు మఱియు సుక్కుమిగిలి పిడుగువలె వెఱపుగొలుపుమహానాద మొనర్చెను. ఆమహానాదమును వినియు యుద్ధమొనర్చునేన్గులఁ గనియు మఱల నాశాంతనవుఁ డాద్రోణునితో "ఓయాచార్యా! నీచుఁడగు నీ ఘటోత్కచునితోడియుద్ధము నాకించుకయురుచింపకున్నది. బలపరాక్రమ ములుగల వీనికిపుడు సహాయమునైతము సంభవించియున్నది. వీని నీరణ రంగమున నావజ్రాయుధధారియుఁ దనంతఁ దా జయింపఁజాలఁడు. ఇతఁడు గుఱితప్పక కొట్టుచున్నవాఁడు. మనమన్నినో యిపు డలసి యున్నవారము. పాంచాలురును బాండవులును మనల శరప్రహార ములచే నొప్పించిరిగదా! కావున నిపుడు పాండవులతో యుద్ధమొన ర్చుట కిష్టపడువాఁడను గాను. నేటికి యుద్ధమును ముగింపుము. రేఁపు మఱల యుద్ధమొనర్తము." అని తెలిపెను.

అది విని మనవారెల్లను నందులకు సమ్మతించి సంతుష్టాంతరంగులై యుపాయముగా నాఘటోత్కచునిబారినుండి తప్పించికొని వెడలిరి. అటులు మనవారు మఱలుడు విజితశత్రులగుపాండవులు, శంఖవేణు నినాదములతో సింహనాదము లొనర్చిరి. ఓరాజా! నాఁటియుద్ధ మీరీతిగా జరిగెను. ఘటోత్కచునిఁ బురస్కరించికొనివచ్చిన పాండవుల కును, గౌరవులకును, మహాసంగ్రామము జరుగఁగాఁ గౌరవులు సిగ్గు గదురఁ బరాజితులగుచుఁ గడువడి వెడలి తమతమ శిబిరములను జేరి కొనిరి. పాండవులు శరప్రహారములచే నలంకృతులై నిజశిబిరములకుఁ బోయిరి. అపుడు భీమసేనఘటోత్కచులను ముందుంచుకొని వారిని బొగడుచు మహానందముతో వివిధములగుతూర్యాదిధ్వను లొనర్చుచు శంఖధ్వనులతో సింహనాదము లొనర్చుచుఁ బుడమి వడంకఁ బాండవ సైన్యములు నీపుత్త్రునిమర్మము నుద్ఘాటించుచు వెడలిరి. అటులు వారు తమతమ నివాసములఁ జేరఁగా, నంత నీతనయుఁడగుసుయోధ నుఁడు, భ్రాతృమరణమునకు దీనమానసుఁడై కన్నీరై గారగాఁ గొంతవడి చింతించి, పిదప శిబిరకృత్యమును యథావిధిగా నొనర్చి యందేదియో ధ్యానించుచుండెను" అని తెలుప విని ధృతరాష్ట్రుఁడు మఱియు ని ట్లనియె.

భీష్ముఁడు దుర్యోధనునకు విశ్వోపాఖ్యానమును దెలుపుట.

"ఓసంజయా! దేవతలకును సాధ్యపడని పాండుకుమారులకృత్యమును వినిన నాకెంతము భయము విస్మయమును గలిగెను. నాకొమరులయవమానమును విని యెల్లవిధములను నెంతయుఁ జింతయే గలుగనేమగునో తోఁపకున్నది. నిశ్చయముగా విదురునివాక్యములు నాహృదయమును దహించెడిని. దైవయోగముచే నంతయు నటులే గానవచ్చుచున్నది. ఓసంజయా! పాండవసైన్యములోఁ గలయోధులు శస్త్రవేత్తలును, యోధసత్తము లగుభీష్ముఁడు మొదలగుశూరులను దాఁకి యుద్ధముచేయుచున్నారు. మహాబలులగుపాండవు లటులు వధ్యులుగాకుండుట కేమి నిమిత్తమో? ఓనాయనా! వారెవ్వారినుండియైన వరములు వడసిరా? లేక వారిజ్ఞానము లోకాతీతమైనదా? ఆకసమునందలి చుక్కలువలె వారు నశింపకుండుటకు హేతువెయ్యది? మఱిమఱియుఁ బాండవులచే నాసైన్యము హతమగుట కోరువఁజాలను. దైవము నాకే పరమదారుణమగుశిక్ష విధించుచున్నాఁడు. పాండుసుతు లెటులు హతులగుదురో? నాతనయు లెటు లవధ్యులగుదురో యదియెల్ల నా కెఱిఁగింపుము. ఓసంజయా! ఈ నాదుఃఖమునకు మేర గానరాకున్నది. అంతము లేనిసముద్రమును భుజములతో దాఁటుట కెంచియున్నమానవునివలె నేనుంటిని. ఇపుడు నాపుత్త్రులకు దారుణమగుకష్టము సంభవించెనని తలంచుచున్నాఁడను. భీముఁడు నిస్సంశయముగా నాతనయులనెల్లఁ జంపకమానఁడు. ఈరణరంగమున నాపుత్త్రులను రక్షించునట్టివీరుఁడు నాకెవ్వఁడును గానరాఁడయ్యెను. అటులగుట నాపుత్త్రులు తప్పక నశింతురని యూహింపఁదగియున్నది. ఈవిషయమునఁ బ్రశ్నించునట్టి నా కందుఁగలహేతువును శక్తిని యథార్థముగాఁ దెలుపుము. అటులు యుద్ధవిముఖులయిన తనసైన్యములను జూచి సుయోధనుఁ డేమియొనర్చెను? అపుడు భీష్మద్రోణులును, కృపుఁడు, శకునియు, సైంధవుఁడు, నశ్వత్థామయు, వికర్ణుఁడు మున్నగు మనయోధు లేమి నిశ్చయించికొనిరి? నాపుత్త్రు లటులు విముఖులగుటకు నామహాత్ము లేమనికొనిరి?"

అది విని సంజయుఁడు "ఓరాజా! జాగరూకుఁడవై నాచెప్పినమాటలు విని గ్రహింపుము. పాండవులు మంత్రముగాని, మాయగాని, పట్టి వెఱపించుటగాని కొంచెమేని చేయనెఱుంగరు. వారు

న్యాయముగా యుద్ధమొనరించుచున్నారు. యుద్ధమునఁ దమశక్తిని జూపుచున్నారు. మఱియు ధర్మయుక్తముగనే జీవితము మున్నగు తమ కార్యములెల్ల నెపుడును బ్రారంభించువారై గొప్పయశమును గోరు చున్నవారు. కావుననే వారు మహాబలులై యుద్ధమునుండి మఱలక పనిచేయుచున్నవారు. ధర్మవంతులగుట నుత్తమలక్ష్మికిఁ బాత్రులగు చున్నారు. ధర్మ మెందుండునో యందేగదా జయము! ఓరాజా! ఆ కారణముచే వారవధ్యులై యీయుద్ధమున జయము గొనుచున్నవారు. నీతనయులన్ననో దురాత్ములును, బాపాచారులునై యెల్లపుడును నీచ ములును బరుషములు నగుపనులనే చేయువారు. కావుననే వారీ యుద్ధమున నశించుచున్నారు. ఓజనాధిపా! నీకొమరు లెన్నియేని క్రూర కర్మములొనర్చి పాండవులను, నీచులువలె పరిభవించిరి. ఓపాండురా జాగ్రజా! అటులైనను నప్పాండవులు వానినెల్ల లెక్కసేయక తమ మనములందే మాటుకొని యింతకాలమువఱకును నోర్చియున్నవారు. అప్పటికిని నీపుత్రులు వారి నాదరింపరైరి. అటులు వారెడ తెగక యొన ర్చినపాపకర్మమే ఘోరమై యిపుడు విషవృక్షమువలె ఫలించినది. ఓ మహారాజా! దాని నిపుడు నీవు పుత్రులతోడను మిత్రులతోడను గూడి యనుభవింపవలసియున్నవాఁడవు. ఓరాజా! నీహితు లెన్నిసా రులు నిన్ను నివారించినను నీవు హితము గుఱుతెఱింగితివా? విదు రుఁడు బోధించెను. భీష్మద్రోణులు దెలిపిరి. నేను బలుమాఱులు వల దని వారించితిని. కాని నీవెఱుంగనేరవైతివి. బుద్ధిలేనివానికిఁ బథ్యమగు నౌషధమువలె హితములగు మావచనములు నీకు రుచింపవయ్యెను. నీవు నీపుత్రులమతమే పూని పాండుపుత్రులను జూడవైతివి. నీవు నన్న డిగితివి. కావున మఱియు నిందలియాథార్థ్యమును దెలుపుచున్నాఁ డను వినుము. ఇదియే పాండవులజయమున కొకగొప్పకారణము. దీనిని నాకెఱిఁగినవిధముగాఁ దెలిపెదను. ఓకౌరవేశ్వరా! తనసోదరులెల్ల రణరంగమునఁ బరాజితులగుటను జూచి శోకాకులమానసుఁడై సుయో ధనుఁడు రాత్రివేళ వెడలి భీష్మునికడకేగి యీ నీప్రశ్నించినవిషయము నుద్దేశించియే యిటు లాతనిఁ బ్రశ్నించెను.

“ఓతాతా! నీవును, ద్రోణుఁడు, శల్యుఁడు, కృపాశ్వత్థామలును, కృతవర్మయుఁ, గాంభోజపతియగుసుదక్షిణుఁడు, భూరిశ్రవుఁడు, విక

ర్ణుఁడు, పరాక్రమశాలియగు భగదత్తుఁడును మహారథులని ప్రసిద్ధివడసిన వారు. మఱియుఁ గులపుత్రు లగుటను బ్రాణముల కాశపడక పని చేయువారు. మీ రెల్ల ముల్లోకములవారికిని నోరువరానివారని నా నమ్మకము. అట్టి మీ రెల్లఁ బాండవులపరాక్రమముకడ నిలువఁజాలకున్నవారుగదా! ఇటు లగుటకు నిమిత్త మెద్దియో తెలిపి యీ నాసందియముం దీర్పుము. దేని నాశ్రయించి పాండవులు మమ్ము మాటికిని జయించుచున్నారు?

అదివిని భీష్ముఁ డాసుయోధనుతో "ఓ రాజా! నాదొకవచన మాలింపుము. ఇది పలుమాఱులు నీకుఁ దెలిపినదియేగాని నీవు దీని నాదరింపవైతివి. 'ఓసుయోధనా! నీవు పాండవులతో సంధిచేసుకొనుము. ఇదియే నీకును, నీమానవలోకమునకును దగినది. నీవును నీతమ్ములును నెమ్మదిగా నిమ్మహి ననుభవింపుఁడు. అటులయిన నీవు నీమిత్రులను బంధుగులను నానందమొందించువాఁడ వగుదువు' అని మున్ను నే నెన్నిసారులు మొఱవెట్టలేదు. నీవు దానిని వింటివా ? లేదు. పాండవులకు నీవొనర్చిన యవమానమెల్ల నిటు లిపుడు ఫలించినది. ఇఁక నదియేల? ఎవ్వరికి నెన్నఁడును నించుకేని హానిగలిగింపనియప్పాండవులు వధ్యులు గాకుండుటకు నిమిత్తమడిగితివి, కావున నావలన దానిం దెలియుము. చక్రపాణియగు శ్రీకృష్ణుఁడు రక్షకుఁడై యుండుట నప్పాండవుల నెవ్వరును జయింపఁజాలరు. వారిని జయింతుమనుట యేలోకమువారికిని భూతభవిష్యద్వర్తమానములందును వట్టి కల్లమాట. ఓధర్మజ్ఞా! భావితాత్ములగు పురాణమునులచేఁ దెలుపఁబడినయథార్థమగు నొకవిషయ మెఱిఁగించెదను వినుము. మున్నొకపుడు దేవతలెల్లరును ఋషులును గంధమాదనపర్వతమందున్న పితామహునికడ కరుదెంచి యాతనిఁ బరివేష్టించి యుండిరి. వారినడుమ నాచతురాననుఁడు సుఖాసీనుఁడై యుండి కాంతిమంతమై యాకసమున వెలుఁగునట్టియుత్తమమగు నొకవిమానరాజమునుగాంచి, చేతులు మొగిడ్చి ధ్యానించి, యందున్న పరమేశ్వరునకు నమస్కరించెను. పిదప దేవతలును, ఋషులును దానిం గాంచి, యందుల కద్భుతమొందుచుఁ బ్రాంజలులై నిలువఁబడి చూచుచుండిరి. అనంతర మాపరమేష్ఠి విధ్యుక్తముగాఁ బూజించి యాపరమాత్ముని నిట్లు సన్నుతించెను.

"ఓ దేవా! నీవు విశ్వావసుఁడవు. విశ్వమూ_ర్తివి. విశ్వేశ్వరుఁడవు. విష్వక్సేనుఁడవు. విశ్వక_ర్తవు. వాసుదేవుఁడవు. కావున యోగరూపివగునిన్ను నేనొందుచున్నవాఁడను. ఓవిశ్వరూపా! ఓమహాదేవా! ఓలోకహితరతా! నీకు జయమగుఁగాక. ఓయోగీశ్వరా! నీకు జయము. ఓప్రభూ! ఓయోగపరావరా! నీకు జయము. ఓపద్మనాభా! విశాలాక్షా! లోకేశ్వరేశ్వరా! నీకు జయము. భూతభవద్భవ్యముల కధీశుఁడైనవాఁడా! పరిమితిలేనిగుణములుగలవాఁడా! సర్వో_త్తముఁడా! నీకు జయమగుఁగాక. ఓనారాయణా! శార్ఙ్గధరా! అంతములేనివాఁడా! సకలగుణములుగలవాఁడా! విశ్వరూపా! నిరామయా! మహాబాహూ! లోకార్థతత్పరా! నీకు జయము. ఓమహోరగా! ఓఆదివరాహా! ఓహరికేశా! నీకు జయము. ఓహరివాసా! దిగధీశా! విశ్వావాసా! ఓ అమేయా! అవ్యయా! వ్యక్తావ్య_క్తరూపా! నియతేంద్రియా! నిష్క్రియా! సంఖ్యాతీతా! ఆత్మభావ మెఱిఁగినవాఁడా! గంభీర కామప్రదా! ఓయనంతా! భూతభావనా! కృతకార్యా! కృతప్రజ్ఞా! ధర్మజ్ఞా! విజయావహా! గుహ్యరూపా! సర్వయోగాత్మకా! భూతాత్మా! లోకేశా! భూతవిభావనా! ఓయాత్మయోనీ! ఓమహాభాగా! కల్పసంక్షేపతత్పరా! ఉద్భావనా! బ్రాహ్మణజనప్రియా! నీకు జయము. నిసర్గసర్గనిరతా! కామేశా! పరమేశ్వరా! అమృతోద్భవా! సద్భావా! యుగాగ్నిరూపా! విజయప్రదా! ప్రజాపతులకుఁ బతియైనవాఁడా! పద్మనాభా! మహాబలా! ఆత్మభూతా! మహాభూతా! కర్మరూపా! సత్వప్రదా! నీకు జయము. పుడమియే నీయడుగులు. నీబాహువులు దిక్కులు. దివము నీతల. నీశరీరము నేను. దేవత లవయవములు. సూర్యచంద్రులు నీకన్నులు. బలము, తపము, సత్యము, ధర్మకృత్యమును నీవలనఁగలిగినది. నీతేజమే యగ్ని. నీశ్వాసమే పవనము. ఉదకములు నీచెమటవలనఁ గలిగినవి. అశ్వినీదేవతలు నీచెవులు. నీనాలుక సరస్వతి. నీసంస్కారనిష్ఠలు వేదములు. ఈజగమెల్ల నిన్నాశ్రయించియున్నది. ఓయోగీశ్వరా! నీసంఖ్యయు, నీపరిమితియు, నీతేజము, నీపరాక్రమము, నీబలము, నీపుట్టువు మేమెఱుంగఁజాలము. ఓదేవా! నీదుభ_క్తిగలిగి నియమము లొనర్చి నిన్నాశ్రయించియున్నవారము. ఓవిష్ణూ! మహా

శుఁడవు పరమేశ్వరుఁడవునగు నిన్నెల్లపుడును బూజించువారము. మఱియు ఋషులును, దేవగంధర్వులును, యక్షరాక్షసులును, బన్నగులును, పిశాచులును, మానవులును, మృగములు, పక్షులు, సరీసృపములు మున్నగుప్రాణులను నేను సృష్టించుట నీయనుగ్రహముమూలముననేగదా! ఓపద్మనాభా! ఓవిశాలాక్షా! కృష్ణా! దుఃఖప్రణాశనా! సర్వభూతములకును నీవే గతివి. నీవే రక్షకుఁడవు. నీవే లోకమునకు ముఖ్యమైనవాఁడవు. ఓదేవేశా! నీయనుగ్రహముచేతనే దేవతలెల్ల సుఖులై యున్నవారు. నీదయగలిగిననే పుడమి యెల్లపుడును భయరహితమై యుండునది. కావున నీవు యదువంశమును వర్ధిలఁజేయ నంతరింపుము. ధర్మసంస్థాపన మొనర్చుటకును, దైత్యులను వధించుటకును, బుడమిని బోషించుటకును, నాయీమనవి చెల్లింపుము. ఓవాసుదేవా! పరమరహస్యమగు నీ యీవిధము యథార్థముగా నీయనుగ్రహముచే నేను బ్రకటించితిని. సంకర్షణదేవుఁడవగు నిన్నుఁ బ్రత్యక్షముగాఁ జూచితిని ఓకృష్ణా! నీవు నీచేతనే యాత్మజునిఁగాఁ బ్రద్యుమ్నునిఁ గాంచితివి. ఆతనినుండి నీవే యనిరుద్ధుని జనింపఁజేసితివి. అతఁడే యవ్యయుఁ డగువిష్ణువు. ఆయనిరుద్ధుఁడు లోకధారియై బ్రహ్మనగు నన్ను సృజించెను. వాసుదేవమయుఁడనగు నేను నీమూలముననే వెలసినవాఁడను. ఓవిభూ! నీనుండి యొకభాగమును విడిచి మానుషత్వ మొందుము. అందు సర్వలోకసుఖావహముగా దానవుల నడంచి ధర్మమును బెంచి కీర్తి నించి యథార్థముగా యోగము నాశ్రయింతువుగాక. ఓయమేయవిక్రమా! లోకమందుఁగల యెల్లబ్రహ్మర్షులును, దేవతలును నిన్నాయానామములచే నద్భుతముగా భక్తిమెయిఁ బాడుచుందురు. ఓసుబాహూ! వరప్రదుఁడవగు నిన్నాశ్రయించియే యెల్లభూతములును నీయందుండునవి. ఆదిమధ్యాంతరహితునిఁగను నమేయమగు యోగముగలవానిఁగను లోకమునకు సేతువుగను నిన్నుఁ బండితులు నుడువుచున్నారు." అని పలికెనని తెలిపి భీష్ముఁడు మఱియు నిట్లనియె.

### విశ్వోపాఖ్యానము

"ఓసుయోధనా! అటు లాపరమేష్ఠి సన్నుతింప నందులకుఁ బ్రసన్నుఁడై భగవానుఁడు లోకేశ్వరుఁడు నగునాపరమాత్ముఁ డాతనితో

"ఓయీ ! యోగబలముచే నీకుఁ గలకోర్కులెల్లఁ దెలిసికొంటిని. తప్పక నీప్రార్థనను మన్నించితిని" అని పలికి యచ్చోటనే యంతర్ధాన మొందెను. అందుల కందలిగంధర్వులును, దేవర్షులును బరమాద్భుత మంది యెంతయుఁ గుతూహల మొదవఁగా నాపితామహునితో "ఓ ప్రభూ! నీవటులు సవినయముగా నమస్కరించి యుత్తమోత్తమము లగుసన్నుతులచే సంస్తుతించినవాఁ డెవ్వఁడు? అది యెందులకు? దానిని వినఁగోరుచున్నవారము" అని ప్రార్థించిరి.

అది విని యాపితామహుఁ డందున్న దేవర్షిగంధర్వుల నుద్దేశించి మధురవచనములతో "ఓయీ ! భూతభవిష్యద్వర్తమానములందును నెయ్యది స్థిరమై యన్నిటికిఁ బరమై బ్రహ్మమై వెలయునదియో యట్టి ప్రసన్నమగు తేజోరూపికిని నాకును నిపుడు సంవాదము జరిగెను. ఓ దేవర్షులారా! నేను లోకోపకారమునకుఁగా లోకాధీశుఁడగునాతనితో 'ఓవాసుదేవా ! రాక్షసులగువారిని జంపుటకై నీవు మానుషలోకమున నవతరించి పుడమి నుద్ధరింపుము" అని కోరితిని. సంగ్రామమున హతులగుదైత్యదానవరాక్షసులు మఱల మానవలోకమున ఘోర రూపులై మహాబలులై జనించిరి. వారిని జంపుటకై నరునితోఁగూడ నారాయణుఁడు మానవయోనియందు జనించును. పురాణమునిసత్తములగు నానరనారాయణులే దేవతలతోఁ గూడి మానవలోకమున జనింతురు. అటులగుట వారి నెవ్వరును జయింపఁజాలరు. అమేయ పరాక్రములగువారిని మూఢులు తెలిసికొనఁజాలరు. సర్వజగత్పతియగు నెవ్వనికి నేను దనయుఁడ నైతినో యట్టి సర్వలోకమహేశ్వరుఁడగు వాసుదేవుఁడు మీకెల్ల సంస్తవనీయుఁడు. ఓసురోత్తములారా! ఈ నావచనముచొప్పున మీరొకపుడును మహాపరాక్రముఁడగు నాశంఖ చక్రగదాధరు నవమానింపకుఁడు. ఈనాతేజమే పరమరహస్యమైనది. ఇదియే పరమపదము. ఇదియే పరబ్రహ్మము. ఇదియే పరమసుఖప్రదము. ఇదియే సత్యస్వరూపమని విశ్వకర్తయగు నాతనిచేతనే కీర్తింపఁబడినది. కావున నింద్రుఁడు యున్నగు సురాసురులును నీయవక్రవిక్రముని మానవునిఁగా భావించి యవమానింపరాదు. ఎవ్వఁ డీతని మానవమాత్రునిఁగాఁ దలంచునో వాఁడు మందబుద్ధి యనఁబడుచున్నాఁడు. ఈతని నవమానబుద్ధితోఁ జూచినవాఁ డధమాధముఁ డగు

చున్నాఁడు. మఱియు యోగియు మహాత్ముఁడును నై మానుషశరీరము నాశ్రయించిన యావాసుదేవు నెవ్వఁడు చులుకగాఁ జూచునో వానిని దామసుఁడని జనులు తెలుపుదురు. జంగమస్థావరస్వరూపుఁడును, శ్రీవత్సాంకుఁడును, మహాతేజస్వియుఁ, బద్మనాభుఁడు నగుదేవు నెవ్వ రెఱుంగఁజాలరో వారినిఁ దామసులని జనులు తెలుపుదురు. కిరీట కౌస్తుభధారియు, మిత్రుల కభయమొసంగువాఁడునగు నామహాత్ము నవమానముగాఁ జూచువాఁడు ఘోరమగునారకమున మునుఁగు చున్నాఁడు. ఓదేవతోత్తములారా! ఇట్టితత్త్వమును దెలిసికొని లోకేశ్వరుఁడగు వాసుదేవుఁ డెల్లలోకులకును నమస్కరింపఁ దగినవాఁడు." అని తెలిపెను.

ఓసుయోధనా! ఇటు లాపరమేష్ఠి యాదేవర్షుల కెఱిఁగించి వారికి సెలవొసంగి నిజభవనమునకుఁబోయెను. పిదప నాగంధర్వులును, దేవతలును, మునులు, నప్సరసలును నాతఁడు తెలిపినయుత్తమకథను విని సంతుష్టాంతరంగులై స్వర్గమునకుఁబోయిరి. ఓనాయనా! మున్నొకపుడు భావితాత్ములగుమహర్షు లొకచోఁగూడి ప్రసంగించునపుడు వాసుదేవుని యిక్కథ వారివలన వింటిని. మఱియుఁ బరశురాముఁడు మార్కండేయుఁడు వ్యాసనారదులును దీనిని నాకెఱిఁగించిరి. మహాత్ముఁడును లోకేశ్వరుఁడు నగువాసుదేవునిమహత్త్వమును వినియు, దానిని జక్కఁగాఁ దెలిసియు, సర్వజగత్పతియగు పరమేష్ఠికిని దండ్రియైనట్టియు వాసుదేవుఁడు మానవుల కెందులకుఁ బూజనీయుఁడు గాకుండును? మున్ను భావితాత్ములగు మునులుసయితము వాసుదేవునిసహాయము గలపాండవులతో యుద్ధము వలదని నిన్ను వారించిరి. ఓతండ్రీ! అవివేకముచే నీవు దానిని గ్రహింపనేరవైతివి. నీవు క్రూరరాక్షసుఁడవని తలంచెదను. అటులే యజ్ఞానావృతుఁడవై యున్నవాఁడవు. కావుననే గోవిందునితోడను ధనంజయునితోడను ద్వేషము పెట్టుకొన్నవాఁడవు. నరనారాయణులగు నాకృష్ణార్జునులతో నీవుగాక వేఱొకఁ డెవ్వఁడు ద్వేషించును? కావుననే నీకిటులు తెలిపితిని. ఈతఁడు శాశ్వతుఁడు. అవ్యయుఁడు. సర్వలోకమయుఁడు. ధాతశాసకుఁడు. మఱియు స్థిరుఁడై యీతఁడు ముల్లోకములనుధరించుచున్నవాఁడు. చరాచరములకును బూజ్యుఁడును బ్రభువునైనవాఁడు. మఱియు నితఁ డేయోద్ధయు జయించువాఁ

డును, జయమును నైనవాఁడు. అన్నిటికిని బ్రకృతియు నీశ్వరుఁడునై యున్న వాఁడు. ఓరాజా! ఇతఁడు రజస్తమోఽతీతుఁడై కేవలసత్త్వమూర్తియైనవాఁడు. ఈశ్రీకృష్ణుఁ డెందుండునో యందు ధర్మముండును. ఎందు ధర్మముండునో యందు జయము గలుగును. ఆతని మహాత్త్వయోగము చేతను, నాతనియాత్మయోగముచేతను బాండవులు రక్షింపంబడి జయమొందఁగలిగియున్నవారు. మఱియు నెవ్వఁడు పాండవుల కెల్లప్పుడును శ్రేయోదాయక మగుబుద్ధి నొడఁగూర్చి నిత్యము నీయుద్ధమున బలమును గలిగించి భయములనుండి వారిని రక్షించుచుండెనో యట్టిశాశ్వతుఁడును, సర్వభూతమయుఁడును, శుభప్రదుఁడు నగుదేవుఁ డీవాసుదేవుఁడే. ఈవు నన్నడిగినయంశ మిదియేగదా! బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్య శూద్రులలోఁ గృతలక్షణులగు నెవ్వరిచేనైనను నతఁడు నిత్యము సేవింపఁబడుచున్నవాఁడు. మఱియు నతఁడు యోగు లగువారి నిజకర్మములచేఁ బూజింపఁబడుచున్నవాఁడు. ద్వాపరాంతమందును, గలియుగాదియందును పాంచరాత్రాగమవిధానము నాశ్రయించి యేది సంకర్షణునిచేఁ దెలియఁజేయఁబడునో యదియును, మఱియు సురమర్త్యలోకములును బుడమిని ద్వారకాపత్తనమును బ్రతియుగమందును మానుషవాసమును నీవాసుదేవుఁడే సృజించుచున్నాఁడు" అని భీష్ముఁడు తెలుప విని దుర్యోధనుఁ డిట్లనియె.

### విశ్వోపాఖ్యానము

"ఓపితామహా! వాసుదేవుఁడే మహామహుఁడని సర్వలోకములందును జెప్పఁబడుచున్నాఁడు. కావున నాతనియాగమమును బ్రతిష్ఠను దెలియఁగోరుచున్నవాఁడను."

అదివిని భీష్ముఁడు "ఓసుయోధనా! మహనీయుఁడగు వాసుదేవుఁడే పరమదైవతములకును దైవతము. ఓభరతోత్తమా! ఆపుండరీకాక్షుని కంటెఁ బరమవస్తు వేదియును గానరాదు. మార్కండేయుఁ డీగోవిందు నద్భుతమహాత్ముగాఁ దెలుపుచున్నాఁడు. సర్వభూతముల కాదిభూతుఁడును మహాత్ముఁడునగుపురుషోత్తముఁడు జలములను, దేజమును, వాయువును గల్పించెను. పిదప భూమిని సృజించి సర్వలోకేశ్వరుఁడగు నామహాప్రభుఁడు జలములందు శయనించి సర్వతేజోమయుఁడై యోగనిద్ర

నొందెను. అంత నతఁడు ముఖమునుండి యగ్నిని, ఘ్రాణమునుండి వాయువును సృజించెను. మఱియు నటులే సరస్వతిని వేదములను మనసునుండి సృజించెను. ఇతఁడే మున్నుగా లోకములను ఋషిగణములతో దేవతలను సృజించినవాఁడు. మఱియుఁ బ్రజలయుత్పత్తి ప్రళయములకు హేతువులను గల్పించెను. ఇతఁడు ధర్మరూపియు, ధర్మజ్ఞుఁడును, సర్వకామప్రదుఁడును, వరదుఁడు నైనవాఁడు. కర్తయుఁ గార్యము నితఁడే. ఈతనికి వేఱొకప్రభువు లేఁడు. ఈజనార్దనుఁడు ముందుగా భూతభవిష్యద్వర్తమానములను గలిగించెను. ఈమహాత్ముఁడు జగములను సృష్టించునట్టియు, సర్వభూతముల కగ్రజుఁ డైనట్టియు సంకర్షణునిఁ బుట్టించెను. మఱియు నెవఁడు సకలభూతములను బర్వతములతోఁగూడిన భూమిని వహించుచున్నాఁడో యనంతుఁ డను పేరుగల యట్టిశేషునిసయిత మితఁడే సృజించినవాఁడు. విప్రులు జ్ఞానయోగముచే నీతనిఁ దెలిసికొనుచున్నారు. కర్ణమలమునుండి జనించి యవక్రవిక్రముఁడై యుగ్రకర్మమును, క్రూరబుద్ధియుఁగలిగి పద్మగర్భునివేదములను హరించిన మధురాక్షసుని వధించినవాఁ డితఁడే. ఆమధునిఁ జంపుటచేతనే పురుషోత్తముఁ డగు నీజనార్దనుని, మధుసూదనుఁడని మహర్షులును, మానవులును, దేవదానవులును జెప్పుచున్నారు. మఱియు నీప్రభుఁడే, వరాహ, సింహ, త్రివిక్రమరూపములను ధరించినవాఁడు. సకలప్రాణులకు నితఁడే తండ్రియుఁ దల్లియు నైనవాఁడు. పుండరీకాక్షుఁ డగుహరికంటెను, వేఱొకటి భూతభవిష్యత్తులందు లేదు. అతఁడు తనముఖమునుండి విప్రులను, బాహువులనుండి క్షత్త్రియులను, దొడలనుండి కోమటులను, బాదములనుండి శూద్రులను జనింపఁజేసెను. ఉత్తమతపోనియతుఁడును, సకలదేహులకు నిధానము నగునావాసుదేవుని, బ్రహ్మభూతునిఁగను, మహద్భూతునిఁగను దలంచి, యమావాస్యాపౌర్ణమాస్యలందు సేవించుచున్నవాఁడు మహద్రూపుఁడగును. ఓనరాధిపా! మునులీకేశవునిఁ బరమతేజముగను, సర్వలోకపితామహునిఁగను దెలుపుచున్నారు. ఇతనినే పితగనుగురునిఁగను భావింపవలయును. ఎవ్వని కీతఁడు ప్రసన్నుఁడగునో వాని కెన్నఁడును నాశములేక జయమే యగును. మఱియు నెవ్వఁడు తనకు భయముగలుగునపు డీతని శరణుచొచ్చునో వాఁ డాభయమునుండి తొలఁగును. దీనిని బఠించినవాఁడు శుభము

లను గాంచి యెల్లపుడును సుఖమై యుండును. ఏమానవులు శ్రీకృష్ణు నిఁ బ్రపత్తితో సేవింతురో వారు మోహము నొందరు. భయమగ్నులగు భక్తులను జనార్దనుఁడు రక్షించును. ఈవిషయమును యుధిష్ఠిరుఁడు యథార్థముగా నెఱిఁగి జగదీశ్వరుఁడును మహాదేవుఁడు నగు నీవాసుదేవు నెల్లవిధములను శరణమొందియున్నవాఁడు" అని తెలిపి భీష్ముఁడు మఱియు ని ట్లనియె.

## విశ్వోపాఖ్యానము

"ఓరాజా! మఱియు బ్రహ్మప్రోక్తమగు వాసుదేవస్తోత్రమును నావలన వినుము. దానిని మున్ను బ్రహ్మర్షులును దేవతలును దెలిపిరి. 'ఓ దేవా! సాధ్యులకును దేవతలకును బ్రభుఁడవనియు, లోకభావనభావజ్ఞుఁడవనియు నారదుఁడు తెలిపియున్నవాఁడు. నీవే భూతభవ్యభవిష్యద్రూపుఁడవని మార్కండేయుఁ డెఱిఁగించెను. నీవు యజ్ఞములకు యజ్ఞమనియుఁ, దపములకును దపమనియు, దేవతలకును దేవతవనియు వ్యాసుఁడు తెలిపియున్నవాఁడు. తొలుతఁ బ్రజలను సృజించుటలో నిన్ను దక్షప్రజాపతిఁగాఁ బలుకుచున్నారు. ఓదేవా! అంగిరుఁడు నిన్ను సర్వలోకములకును స్రష్టగాఁ జెప్పియున్నవాఁడు. అటులే దేవలుఁడు నీ శరీరమునుండి యవ్యక్తము జనించెననియు, నీమానసమున వ్యక్తమున్నదనియు, దేవతలు నీవాక్కునుండి జనించిరనియుఁ దెలిపియున్నవాఁడు. నీశిరముచే దివమును, బాహులచే దిక్కులును, వ్యాపింపఁగా నీవే పుడమిని ధరించియున్నవాఁడవనియు, నీబొజ్జలో ముల్లోకము లుండఁగా నీవు సనాతనపురుషుఁడవనియు, నీవే యుత్తమదైవమనియుఁ దపోనిష్ఠు లగుమానవులు భావించుచున్నారు. ఆత్మదర్శనసంతుష్టు లగు ఋషులలో నెల్ల నీవే యుత్తముఁడవు. సమరమున విముఖులుగానట్టియు, నుదారు లయినట్టియు, సకలధర్మప్రధాను లైనట్టియు రాజర్షుల కీవే యుత్తమగతివి. ఓమధుసూదనా! నీవు సర్వేశ్వరుఁడవు.' అని యిటులు నిత్యము యోగవేత్త లగు సనత్కుమారుఁడు మున్నగువారిచే నీపురుషోత్తముఁడు సేవింపఁబడుచున్నాఁడు. ఓరాజా! ఇది మిక్కిలి పెక్కుగా నున్నను సంక్షేపించి నీకుఁ దెలిపితిని. ఇక్కేశవుని యాథార్థ్యమును దెలిసికొని యీతనియెడ ననురక్తిగలిగి వర్తింపుము." అని తెలిపెను.

ఓయాంబికేయా! నీకొమరుఁ డీపుణ్యకథను విని యావాసుదేవుని బాండవులను బహుమానించెను. అంత నాశాంతనవుఁడు మఱియు నాసుయోధనుతో "ఓరాజా! మహాత్ముఁ డగుకేశవుని మాహాత్మ్యమును వింటివిగదా! అటులే యర్జునునిమహత్త్వమును దెలిపితిని గదా! నీవడిగిన దిదియేగదా! ఆనరనారాయణులు దుర్జనులను సంహరించుటకే యవతరించినవారు. అటులగుట వీరలగువా రెవ్వరికిని జయింపఁదగినవారుగారు. అట్టి శ్రీకృష్ణుఁడు పాండవులయెడఁ బ్రీతిగలిగి యుండుటను వా రెవ్వరికిని యుద్ధమున వధ్యులుగారు. కావున నప్పాండవులతో సంధిగావించికొమ్మని, నీకుఁ దెలుపుచున్నాఁడను. బలవంతులును నీకు భాగ్రితలు నగువారితోఁగూడి రాజ్యసుఖము లనుభవింపుము. ఆనరనారాయణుల నవమానించితివేని నశింతువు." అని తెలిపి నీతండ్రి తనశిబిరమును బ్రవేశించెను. అంత నీకొమరుఁడును నాతనికి నమస్కరించి తనశిబిరమునకుఁ బోయి యొకదివ్య మగుశయనమునఁ బరుండి యారాత్రి యతేఁడు గడపెను. అని సంజయుఁడు మఱియు నిట్లనియె.

## పంచమదినయుద్ధారంభము

"ఓధృతరాష్ట్రా! ఆరాత్రి గడచి సూర్యోదయమగుడు మఱల నెప్పటివలె రెండుసైన్యములును యుద్ధమునకు సన్నద్ధము లయ్యెను. వారు పరస్పరజయకాంక్షలచేఁ గుపితులగుచు, నొకరినొకరుచూచుకొని పరువులిడసాగిరి. ఓరాజా! ఇదియెల్ల నీదురాలోచనవలనఁ గల్గినదియే. పాండవులును గౌరవులును వ్యూహములనుబన్ని యుత్సాహపూరితులై సన్నద్ధులైరి. ఓరాజా! భీష్ముఁడు మకరవ్యూహము నేమఱక రక్షించుచుండెను. అటులే పాండవులును దమవ్యూహమును రక్షించుకొనుచుండిరి. అంత రథికశ్రేష్ఠుఁ డగు నీతండ్రి పెక్కురథజాలముతోఁ గూడి వెడలెను. మఱికొందఱు తమతమచోటుల నిలిచి, యాతని వెంబడించి నడిచిరి. అటులే గుఱ్ఱపురౌతులును, నేన్గు లధిష్ఠించినవారును, పదాతులును వెడలిరి. అటులు సన్నద్ధులైయున్నవారిని గాంచి యంచితకీర్తులగు పాండవులును, రణమున వైరులకు భేదింపరాని శ్యేనవ్యూహమును బన్ని యుండిరి. అందు ముఖమున మహాబలుఁ డగుభీమసేనుఁ డునుపఁబడియెను. నేత్రస్థానమున శిఖండియు, ధృష్టద్యుమ్నుఁడును నిలిచియుండిరి.

సత్యపరాక్రముఁ డగుసాత్యకి దానిశీర్షస్థానమున నుండెను. గాండీవముఁ ద్రిప్పుచు నర్జునుఁడు దానికంఠదేశమున నిలిచెను. ఆవ్యూహము కొక యక్షౌహిణిబలము వామపార్శ్వముగా నందుండెను. మహాత్ముఁడగు ద్రుపదుఁడు తనతనయులతోఁగూడ నాయక్షౌహిణికి నాయకుఁడై యుండెను. వేఱొకయక్షౌహిణితోఁ గైకేయుఁడు దక్షిణభాగమునం దుండెను. ద్రౌపదేయులును, నభిమన్యుఁడును దానికి దోఁకగా నుండిరి. వారి వెనుక ధర్మజుఁడు నిలుపఁబడి యుండెను. ఆతనికి నకులసహదేవులు రక్షకులై యుండిరి. పిదప యుద్ధమారంభమై భీముఁడామకరవ్యూహము ముఖమును సమీపించి భీష్ముని దనసాయకములచేఁ గప్పెను. పిమ్మట భీష్ముఁడు పాండవవ్యూహమునకు మోహముఁగలిగించుచు మహాస్త్రములను బ్రయోగింపసాగెను. ఆతనియస్త్రములకు మోహమందిన తన సైన్యమును జూచి ధనంజయుఁడు కుపితుఁడై భీష్ముని శరసహస్రముచేఁ గప్పెను. ఆరణాగ్రమున భీష్మప్రయుక్తము లగు మహాస్త్రములను జూచి తనసైన్యములు సంతసిల్లుడు నీతనయుఁ డగు సుయోధనుఁడు యుద్ధసన్నద్ధుఁడై వెడలి ద్రోణునితో "ఓయాచార్యా! మున్ను నాసోదరులయు సైన్యములయు వధమును గాంచి నీబలమునెల్లఁ జూపుచుఁ ద్వరపడి యుత్సాహముతోఁ బనిచేసితివి. ఓయనఘా ! నీవెల్లపుడు మాహితముగోరువాఁడవు. మేమన్ననో నిన్నును భీష్ముని నాశ్రయించి దేవతలను సయితము జయింపఁగోరుటలో సందియము లేదు. హీనబలపరాక్రములగుపాండవులను యుద్ధమున జయించు టెంతపని? పాండవులెటులు వధింపఁబడుదురో యట్టివిధమునఁ బ్రవర్తింపుము" అనిపలికెను.

అదివిని ద్రోణుఁడు నాఁటిసంగరమున సాత్యకి చూచుచుండఁగాఁ బాండవసైన్యములను బ్రహరించెను. పిమ్మట సాత్యకి యాద్రోణునిఁ బ్రహరించి నివారించెను. అంత వారిద్దఱకు ఘోరమై భయంకర మగు యుద్ధము జరిగెను. అపుడు ప్రతాపవంతుఁ డగుద్రోణుఁడు మిక్కిలి కుపితుండై యాసాత్యకిని జూచి నగుచుఁ బదిబాణములచే నాతని జత్రుప్రదేశమునఁ గొట్టఁగా నందులకు భీముఁ డలిగి శస్త్రధారులలో నుత్తముఁ డగుభారద్వాజునుండి యాసాత్యకిని రక్షించువాఁడై యాద్రోణునిఁ గొట్టెను. పిదప ద్రోణభీష్ములును, శల్యుఁడును గుపితులై యాభీముని బాణవర్షముచేఁ గప్పిరి.పిమ్మట నభిమన్యుఁడును ద్రౌపదేయులును

గోపావేశముతో నుద్యతాయుధు లగు నాభీష్మాదులనెల్లఁ దీవ్ర శరములచే నొప్పించిరి. అందులకుఁ గుపితులై భీష్మద్రోణులు మిక్కిలి యుద్రేకముతో మహాబలులై వెడలుటను జూచి శిఖండి వారి నెదుర్కొని మేఘధ్వనిగల తనధనువుబూని దెసలు గప్పునట్లుగా బాణవర్షమును గురిసెను. కాని కురుపితామహుఁ డాశిఖండిస్త్రీత్వమును స్మరించుచు నారణరంగమున నాతనిఁ బ్రహరింపక విడిచెను. అపు డాభీష్ముని రక్షించుటకై సుయోధనుని ప్రోత్సాహముచే ద్రోణుఁడు శిఖండి నెదుర్కొనియెను. అంత నాశిఖండి ప్రళయకాలాగ్నివలెఁ బ్రజ్వలించు నాద్రోణునను జడిసి యచ్చోటినుండి తొలఁగిపోయెను. పిమ్మట సుయోధనుఁడు గొప్ప బలముతోఁగూడి భీష్ముని రక్షింపఁబోయి యాతని సమీపించియుండెను. అంత నప్పాండవులు ధనంజయుని ముందిడికొని భీష్ముని జయించుపట్టుదలతో నాతని నెదుర్కొనిరి. అపుడు వారికి దేవదానవులకువలె ఘోరమగుయుద్ధము జరిగెను. అపు డుభయసైన్యములును గీర్తిని జయమునుగోరి పోరాడఁదొడఁగిరి." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## సంకులయుద్ధము

"ఓయాంబికేయా! భీమసేనునుండి భయమును దప్పించి రక్షించుటకై నీపుత్త్రులకుఁ దోడ్పడి శాంతనవుఁడు సంకులసమర మొనరించెను. నాఁటిపూర్వాహ్ణమున రాజులకు రౌద్ర మగుయుద్ధము ప్రవర్తిల్లెను. కురుపాండవులలో శూరముఖ్యు లగువారికెల్ల మారక మగు నాయుద్ధమున మిన్ను ముట్టు మహానాదము లుప్పతిల్లెను. మత్తగజము లఱచుచుండెను. గుఱ్ఱములు సకిలించుచుండెను. భేరీశంఖధ్వనులు సంకులమై వినఁబడఁజొచ్చెను. విజయమునకై మహాబలు లగువారెల్లరును విక్రమింపసాగిరి. అపుడు వారు పరస్పరము పోరాడుచు గర్జించుగోష్ఠములందలి వృషభములవలెఁ గానవచ్చిరి. ఆసమరమునఁ దీవ్రశరములచేఁ బడఁద్రోయఁబడుసైన్యములతలలు పాషాణములవలె నాకసమునఁ గానవయ్యెను. కుండలములు, పాగాలు గలిగి సువర్ణమయములైనతలలు నేలఁగూలుచుఁ జూడఁబడియెను. అటులే శరప్రహారములచేఁ దెగినగాత్రములును, దలలును, నాభరణములతోఁగూడిన యిత

రావయవములును బుడమిని గప్పుచుండెను. ఓరాజా! ఏనుగులయొక్క యు, గుఱ్ఱములయొక్కయుఁ, బదాతులయొక్కయుఁ గవచములతోఁ గూడినశరీరములును, నలంకరింపఁబడిన భుజములును, జంద్రసన్నిభము లగుముఖములును నొక్కగడియలోఁ బుడమి నెల్లెడల వ్యాపించెను. ధూళులనెడి మేఘములుగప్ప గత్తులతళతళలనెడి మెఱపులలో నాయుధ ములచప్పుడును గర్జనములువలె వినవచ్చెను. ఓభారతా! అపుడు కురు పాండవులకు రక్తోదకమగు సంకులయుద్ధ మయ్యెను. గగురుపాటొద వించు ఘోరమగు నామహాభయంకరయుద్ధమున రణగర్వితు లగుక్షత్రి యులు శరసహస్రములను వర్షించుచుండిరి. ఆశరవర్ష పీడితములై యేనుఁ గులఱచుచు నీవారిని వారివారిని మట్టుచుఁ బరువులిడసాగెను. మఱియు సంరంభముగలిగి పరాక్రమాధారులు, ధీరులు నగువీరుల ధనుష్టంకారములచే నేమియు వినరాకుండెను. రక్తోదకములగు మొండెము లెగురుచుండఁగా వైరివధప్రయత్నముతో వీరులు పరువు లిడుచుండిరి. బాణములు, గదలు, శక్తులు, శంఖములు మున్నగు వానితో శూరులు పరస్పరము ప్రహరించుకొనిరి. శరవిద్ధములగు నేనుగులు నిరంకుశములై తిరుగఁజొచ్చెను. రౌతులు మృతినొందుటను గుఱ్ఱ ములు నలుదెసలకుఁ బరువులిడసాగెను. మఱికొన్ని శరపీడితములై మీఁదికెగిరి క్రిందికిఁ బడుచుండెను. నీవారును వారును బరువులుపెట్ట సాగిరి. ఇంతయేల! ఎందుఁ జూచినను దలలు, బాహువులు, హస్తములు, తొడలు, గదలు, పరిఘములు, పాదములు కేయూరాదిభూషణములును బ్రోవులు ప్రోవులుగాఁ బడి కానవచ్చెను. ఆభీమసేనభీష్మసమాగమమున గజరథాశ్వపదాతుల సమూహములు పరువులిడుచుఁ జూపట్టెను. అసి, గదాప్రాసబాణాదులచేఁ గొట్టుకొని క్షత్త్రియులు కాలచోదితులై మృతినొందిరి. కొందఱువీరులు మల్లయుద్ధములొనర్చిరి. వేఱొకకొందఱు పరిఘములచే మొత్తికొనిరి. ఓరాజా! మఱియుఁ బిడికిటిపోటులచేతను, జానుప్రహారములచేతను దొఱకినవారి నెల్లఁ గురుపాండవసైన్యములు పరస్పరము కొట్టుకొనిరి. పుడమి నెల్లెడలఁ బడువారును బడుచున్న వారును దొరలువారునుగా నందందు ఘోరయుద్ధమయ్యెను. రథికులై విరథులై కత్తులువట్టుకొని పరస్పరజయేచ్ఛలతో నొకరినొకరు ప్రహరించు కొనఁ బరువులిడిరి. పిదప సుయోధనుఁడు పెక్కురగు కాళింగులతోఁ

గూడి భీష్మునిముందిడికొని పాండవుల నెదుర్కొనియెను. అటులే పాండవులును భీముని నడుమనిడి కుపితులై కడువడిగలవాహనములతో భీష్మునిఁ దలపడిరి." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

సంకులయుద్ధము.

"ఓరాజా! అటులు భీష్మునిఁ దలపడిన తనసోదరులను మఱికొందఱను గాంచి యర్జునుఁడాయుధముపూని గాంగేయునిపైకి వెడలెను. అపుడు మనవారికెల్లరకును నాతని గాండివముచప్పుడు పాంచజన్యము ధ్వనియుఁ జెవుడుగొలుప నాతనిధ్వజముగాంచుట నెంతయు వెఱపుగలిగెను. ఓమహారాజా! సింహలాంగూలమై యాకసమునఁ బ్రజ్వలించుపర్వతమువలెను, వృక్షములకుఁ దగుల్కొని యగపడు ధూమకేతువువలెను వెలయుచు బహువర్ణములుగలిగి విచిత్రమై వానరచిహ్నముగల యాయర్జునునిధ్వజము మేము చూచితిమి. అయ్యది మేఘములనడుమనున్న మెఱపువలె వెలయుచు నాకసమునఁ గానవచ్చెను. మనయోధులు సువర్ణపృష్ఠముగల యాగాండివమును జూచిరి. ఇంద్రధనువుఁబోలిన దానినుండి గర్జనము వినవచ్చెను. అంత నీవారిసైన్యమెల్ల నేలఁగూలసాగెను. మఱియు నతఁడు మెఱపులు గర్జనములుగలిగి పెనుగాలితోఁగూడిన మేఘమువలెఁ దనశరవర్షముచే దెసలనెల్ల ముంచెను. అతఁడు శాంతనవుఁ దలపడి యస్త్రములను బ్రయోగించుచుండఁగా నస్త్రసమ్మోహితులమై మేము దిగ్భ్రమనొందితిమి. అపుడు మనయోధులు భయభ్రాంతులై శ్రాంతులై హతాశ్వులును హతమానుసులునై యొకరి నొకరు చేరియుండిరి. అనేకులు నీకొమరులతో భీష్మునిఁ జేరికొనుటచే నపుడు భీష్ముఁడొకఁడే వారికెల్ల నార్తరక్షకుఁడు గావలసివచ్చెను. రథికులు రథమునుండి జడిసి పుడమి కుఱికిరి. రౌతులు గుఱ్ఱముల నుండి డిగ్గనుఱికిరి. పదాతులు భూమియందే యడంగిరి. ఆయర్జునుని గాండివధ్వని విని సకలసైన్యములును భీతిచే పుడమి నడఁగియుండెను. పిమ్మటఁ గడువడిగల కాంభోజదేశపుగుఱ్ఱములుగల వేలకొలఁదిగోపులతోడను, మద్రసౌవీరగాంధారులతోడను, త్రిగర్తులతోడను, సకలకాలింగముఖ్యులతోడనుగూడి కలింగదేశాధిపతియుఁ బలువిధములగు సైన్యములతో దుశ్శాసనుని ముందిడుకొని పెక్కురాజులతో సైంధవుఁ

డును మఱికొందఱు గుఱ్ఱపుదడములవారును సుయోధనుని ప్రోత్సా హముచేఁ బదునాలుగువేవురు శకునిని జేరియుండిరి. పిదపఁ బాండవు లెల్లఁ దమతమవాహనములతో వేలువేలుగాఁ గదలి నీవారిని బ్రహరింపసాగిరి. రథికగజాశ్వపదాతులతోఁ గూడి సేనలు రెండును ఘోరమగుయుద్ధ మొనర్పఁగా నాకసమెల్ల ధూళులతో నిండెను. పెక్కురుయోధులతోఁ గూడి భీష్ముఁ డర్జునునిఁ దలపడియెను. అవంతి దేశాధిపతులు కాశిరాజుతోడను, సైంధవుఁడు భీమునితోడను యుద్ధముచేయఁ దలపడిరి. కీర్తినిధియగు మద్రేశునితో ధర్మజుఁడు పోర నెదుర్కొనియెను. అటులే వికర్ణుఁడు సహదేవునిఁ, జిత్రసేనుఁడు శిఖండిని, మాత్స్యులు శకుని దుర్యోధనులను గవిసిరి. ద్రుపదుఁడును సాత్యకియుఁ జేకితానుఁడును ద్రోణాశ్వత్థామల నెదుర్కొనిరి. కృప కృతవర్మలు ధృష్టద్యుమ్నునిఁ దలపడిరి. అంతఁ బరువులువాఱుగుఱ్ఱ ములును, దిరుగుడువడునేన్గులును, భగ్నములగురథములునుగా వారి వారికి యుద్ధములు ప్రారంభమయ్యెను. మేఘములు లేకయే తీవ్రము లగు మెఱపులు మెఱయఁజొచ్చెను. దిక్కులు ధూళులతో నావ రింపఁబడియెను. గొప్పయుల్కాపాతములు రాలెను. పిడుగులు పడెను. పెనుగాలులు వెడలి పరాగవర్షము గురిసెను. ధూళిబ్రుంగుడువడి సూర్యుఁ డాకసమున నంతర్ధానమయ్యెను. సకలభూతములకును బ్ర మోహ మావహిల్లెను. రజముచేఁ దిరోహితులై యస్త్రజాలములతో బోరాడువీరుల బాహులనుండి వెడలునట్టియు, సర్వావరణములను భేదించునట్టియు శరసమూహములచప్పుడులు మిక్కిలి సంకులమై విన వచ్చెను. ఓభరతర్షభా! వీరు లెత్తినబాహులందుఁ గానవచ్చుశస్త్రములు తళతళమని మెఱయుచుఁ జుక్కలవలె నాకాశమును బ్రకాశింపఁ జేయఁదొడంగెను. మఱియు విచిత్రములై సువర్ణమయములగు వల లతోఁగూడిన ఋషభచర్మము లెల్ల దెసలందును బడుచుండెను. సూర్య కాంతిగలఖడ్గములచే నఱుకఁబడిన శరీరములును దలలును దశదిశ లందును జూపట్టెను. అటులే చక్రములు, నీడములు, నఖములు, భగ్నములగుచు గుఱ్ఱములు చచ్చి రథికులు హతులైతొలఁగ, రథములు చూర్ణములై యందందుఁ గానవచ్చెను. శస్త్రకృతవ్రణములై గుఱ్ఱ ములుగూలెను. సూతులును రథికులును హతులగుటచేఁ గొన్నిరథములు

పరువులిడుచుండెను. ఓరాజా! అక్కడక్కడ శరహతములై దేహములు వ్రయ్యలుగాఁ గట్లుదెగినగుఱ్ఱములు కేవలము యుగములను మాత్ర మీడ్చుకపోవుచుండుటఁ గానవచ్చెను. బలవంతుఁడగు నొకనిచేఁ గొట్టుపడి రథికులు తమసూతులతోడను, గుఱ్ఱములతోడను బుడమిని బడిరి. ఆరణరంగమున నేనుఁగులు మదగంధములను బరస్పరము వాసనచూచికొని కుపితములై యొకటినొకటి మర్దించుకొనసాగెను. మఱియు నేనుఁగు లొకదానిచే నొకటి యాకర్షింపఁబడి యోధులతోఁ గూడ నేలఁ గూలఁజొచ్చెను. ఓమహారాజా! రథకూబరములు భగ్నములై రథజాలములు చెడఁగా రథికుల నేనుఁగులు కేశములం దాకర్షించి లాగికొనిపోవుటను జూచితిమి. చెట్లకొమ్మలువలె రథికు లేనుఁగులచే ఖండఖండములుగా ఖండింపఁబడిరి. రథములకు రథములు చిక్కుకొని యేనుఁగులచే దెసల కాకర్షింపఁబడియెను. అపు డయ్యవి సరోవరములందలి పద్మములను లాగివేయుచున్నటులు గానవచ్చెను. ఇటులు గజములయుఁ, బదాతులయు, రథికులయుఁ బోరాటము ఘోరమై చూపట్టెను.” అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## భీష్మపరాక్రమము

“ఓయంబికానందనా! అపుడు మత్స్యసైన్యములు గలవిరాటునితోఁగూడ శిఖండి కడువడిగా వెడలి దుర్జయుఁ డగుభీష్ము నెదుర్కొనియెను. అటులే ద్రోణునిఁ, గృపుని, వికర్ణుని మహాబలులును ధనుర్ధరులు నగుమఱికొందఱురాజులను ధనంజయుఁ డెదుర్కొనియెను. మంత్రులు బంధులు మున్నగువారితోఁ గూడినసైంధవునిఁ, బ్రాచ్యులు దాక్షిణాత్యులు మొదలగురాజులను, మహారథుఁ డగుదుర్యోధనుని, దుస్సహుని భీమసేనుఁ డెదుర్కొనియెను. సహదేవుఁడు ధనుర్ధరోత్తములును దుర్జయులును దండ్రికొడుకులు నగు శకుని, నులూకుని నెదుర్కొనియెను. నీకొమరుఁ డధిక్షేపించుటకు సహింపక ధర్మజుఁడు గజసైన్యముపైఁ దలపడియెను. మాద్రీపుత్త్రుఁ డగునకులుఁడు త్రిగర్తులను దాఁకెను. సాత్యకియుఁ, జేకితానుఁడు, నభిమన్యుఁడును, సాల్వులను, గైకయులను గవిసెను. ఘటోత్కచుఁడును, ధృష్టకేతుఁడును నీపుత్త్రుల రథములను మార్కొనిరి. పాండవసేనాపతియు, నమేయవిక్రముఁడు

నగుధృష్టద్యుమ్నుఁ డుగ్రకర్ముఁ డగుద్రోణునిపైఁ దలపడెను. ఇటులు మహాధనుర్ధరులగు నీవారు పాండవులను దాఁకి శూరులై పోరాడం దొడంగిరి. సూర్యుఁడు నభోమధ్యమును జేరునంత సంకులముగాఁ గురు పాండవులు పరస్పరముఁ బ్రహరించుకొనిరి. అపుడు వ్యాఘ్రచర్మావృత ములును, సపతాకములును, సధ్వజములునై, బంగారుకాంతు లుప్పొంగఁ బెక్కురథములు రణాంగణమున విరాజిల్లుచుండెను. అటులు పరస్పర జిగీషలతో నొకరినొక రెదుర్కొనఁగా, గర్జించుసింహములచప్పుడువలె గొప్పనాద ముప్పతిల్లెను. అప్పటి దారుణయుద్ధము నద్భుతముగాఁ జూచితిమి. అపు డాకురుసృంజయులకు జరిగినసంగ్రామమున వారు ప్రయోగించు శరజాలములచే మాకు దిక్కులు, విదిక్కులును, నాకసము సూర్యుఁడును గానరాకుండెను. మఱియు విమలములై యుగ్రములగుశక్తులును, దోమరములును, గవచములు, కత్తులు, భూషణములు మున్నగువానికాంతులు వెడలి దిక్కులను, విదిక్కులను, వెలిఁగింపఁ మొదలిడెను. చంద్రసూర్యులవలె విరాజిల్లు రాజోత్తములమేనికాంతులచే నందందు రణభూమి వెలయఁజొచ్చెను. రథికులనెడి సింహములును, బదాతులనెడివ్యాఘ్రములును, నారణరంగము నాకసమును నక్షత్రములువలె వెలిఁగింపసాగెను. అపుడు రథికశ్రేష్ఠుఁ డగుభీష్ముఁడు కుపితుఁడై యెల్లసైన్యములు చూచుచుండఁగా మహాబలుఁ డగు భీముని నివారించెను. పిదప భీష్మప్రయుక్తములై సువర్ణాగ్రములును, శిలాసారములు నగుబాణములు తైలధౌతములై సానవెట్టఁ బడినవగుటచే భీముని నొప్పించెను. అంత నాభీమసేనుఁ డాభీష్మునిపైఁ గుపితమగుసర్పమునుబోలి మహావేగముగలయొకమహాశక్తినిఁ బ్రయోగించెను. సువర్ణదండముగలిగి దురాసదమై కడువడిగాఁ దనపైకివచ్చు నాభీమునిశక్తిని గట్టిగాఁ దిగిచ్చివైచిన నారాచములచే ఖండించి పిదపఁ బచ్చనై దారుగలవేఱొకభల్లముచే నాతనివిల్లు రెండుఖండములుగా ఖండించెను. పిమ్మట నెంతయు వడిగా వెడలి సాత్యకి యాకర్ణాంతముగా లాగివిడిచినట్టియు మిక్కిలి దారుగలిగినట్టియు ననేకములగు శరములచే నీతండ్రిని నొప్పించెను. అనంతర మాశాంతనవుఁడు తీవ్రమై దారుణమగు నొకనారాచముచే సాత్యకిసారథిని రథమునుండి పుడమిఁ బడఁద్రోసెను. అటులు సారథి హతుఁడగుడు నాతనిగుఱ్ఱములు వాయు

వేగముతోఁ బరువులిడి యాసాత్యకితోఁ గూడ వెడలిపోయెను. అంత సకలసైన్యమందును సంకులధ్వనిజనించెను. మహాత్ములగుపాండవు లాహాకారము లొనర్చిరి. అంత నాతనిరథమును నిలుపుఁడు, పరుగెత్తుఁడు, పట్టుకొనుఁడు అనుశబ్దములు విననయ్యెను. ఆసమయమున నాసురసేన నింద్రుఁడువలె కురుపితామహుఁడు పాండవసైన్యమును నశింపఁజేయ మొదలిడెను. అపుడు పాంచాలురును సోమకులు నాభీష్ముని ప్రహార ములకుఁ బాలగుచుండియు, యుద్ధోత్సాహమును వీడక యాతని నెదుర్కొనిరి. ధృష్టద్యుమ్నుఁడు మున్నగుపాండవులును నా గాంగే యునిపైకిఁ బరువులిడిరి. అటులే ద్రోణుఁడు మున్నగువారు వెడలి పాండవసైన్యములపైఁ బడిరి. పిదప ఘోరముగా యుద్ధము జరిగెను.'' అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## ద్వంద్వయుద్ధము

''ఓరాజా! పిమ్మట భీష్ముని విరాటుఁడు మూఁడుబాణములచేఁ గొట్టెను. మఱియు మహారథుఁడగునతఁడు మూఁడుబాణములచే నాభీష్మునిగుఱ్ఱములను నొప్పించెను. అంత నాశాంతనవుఁడు పదిబాణ ములచే నావిరటునిఁ బ్రహరించెను. పిమ్మట నశ్వత్థామ యెంతయు హస్తబలము వెలయ నాఱుబాణములచే నర్జునుబొమ్ము నొప్పింపఁగా నర్జునుఁడాతనిధనువు తునియలుగా నొనరించెను. అటు లర్జునుఁడైదు బాణములచేఁ దనవిల్లు దునుమ నాద్రోణసుతుఁ డలిగి వేఱొకవిల్లు పూని తొంబదివాఁడికోలలచే నర్జునుఁ గొట్టి డెబ్బదిబాణములచేఁ గృష్ణుని నొప్పించెను. కాని యటులు సరివారిలో నర్జునుఁడు తనవిల్లు ఖండించుట కెంతయు ఖిన్నుఁడయ్యెను. పిదప నందుల కర్జునుఁ డలిగి క్రోధముచేఁ గన్ను లెఱ్ఱచేసి మిక్కిలి వేడిగను, బొడవుగను నిట్టూర్పు పుచ్చి మఱిమఱియుఁ జింతిలుచు నెడమచేతితోఁ దనధనువు వంచి ప్రాణాంతకరములును, ఘోరములు నగు తీవ్రబాణముల నందు సంధించి, గట్టిగాఁ దిగిచివిడువ నవి యాద్రౌణికవచమును జించి యాతనిమేని రక్తమును ద్రావెనుగాని యతం డందుల కించుకేనిఁ జలింపఁడయ్యెను. ఓరాజా! ఆద్రోణతనయుఁ డటులు ధైర్యమును విడువక మఱలఁ దీవ్ర బాణములచే నర్జునుఁగొట్టి సమరమహావ్రతమును రక్షించువాఁడయ్యెను.

అందులకుఁ గౌరవు లెంతయు నాతని బ్రశంసించిరి. "ఆహా! ఇతఁ డిటులు రణరంగమునఁ గృష్ణార్జునులఁ దలపడియెనే. ఎన్నఁడైనను నితఁడు యుద్ధమున భయపడువాఁడు గాఁడు. అదియుఁగాక యితఁడు ప్రయోగ సంహారములతో నస్త్రములనెల్ల ద్రోణునివలన గ్రహించినవాఁడు" అని సన్నుతించిరి. అంతనర్జునుఁడు "మనయాచార్యున కితఁడు ప్రియపుత్త్రుఁడు. మఱియు విశేషించి బ్రాహ్మణుఁ డగుటను నా కెంతయుఁ బూజనీయుఁడు గదా!" అని పలువిధములఁ దలపోసి యశ్వత్థామపై దయగలిగి యాతనితో యుద్ధ మొనర్పక విడిచి కడువడి వెడలి నీకొడుకులను గొట్టుచు విజృంభించెను. అపుడు సుయోధనుఁడు శిలాసారములగు పది తీవ్రబాణములచే భీమునిఁ గొట్టి నొప్పించెను. భీముఁ డందుల కెంతయును గుపితుఁడై వైరిప్రాణాంతకరమును దృఢమును జిత్రము నగు కార్ముకమున వాఁడిగలబాణములను దొడిగి యాకర్ణాంతముగా లాగి యాకురుపతియురము నొప్పించెను. అపు డాసుయోధనుని వక్షముననున్న కాంచనసూత్ర మగుమణి బాణములచేఁ బరివృతమై యాకసమున గ్రహములనడుమనున్న సూర్యునివలె వెలయఁజొచ్చెను. అంత నీకొడుకు భీమసేనుని ప్రహారమున కోరువక చేతిచప్పుడులకు మహాసర్పమువలెఁ గుపితుఁడై సువర్ణాగ్రములు శిలాతీవ్రములు నగుశరపరంపరలచే భీమునిఁ గొట్టి తనసైన్యమును గాపాడునట్టి వాఁడయ్యెను. ఓరాజా! అటులు నీకొడుకు లిరువురును బరస్పరము బ్రహరించుకొనుచు నాసంగ్రామరంగమున నెంతయు విరాజిల్లిరి. వైరిమారకుఁడును వీరోత్తముఁడు నగునభిమన్యుఁడు తీవ్రములగు నేడుబాణములచేఁ జిత్రసేనునిఁ బురుమిత్రునిఁ బ్రహరించి సత్యవ్రతుని డెబ్బదిబాణములచే నొప్పించెను. అటు లతఁడు ప్రహరించి యుత్సాహముతో రణరంగమున నటింపఁగా మనవా రార్తులై యుండిరి. అంతఁ జిత్రసేనుఁడు పదిబాణములచే నభిమన్యునిఁ గొట్టెను. పిదప సత్యవ్రతుఁడు తొమ్మిదింటను, బురుమిత్రుఁ డేడింటను, నాతని నొప్పించిరి. ఆప్రహారములచే నొడలు రక్తసిక్తమగుడు నభిమన్యుఁడు శత్రుసంహారకమగు నాచిత్రసేనుని విచిత్రమగు కార్ముకము ఖండించి మఱియుఁ గవచమును ఛేదించి వాఁడికోలచే వానివక్షమునఁ గొట్టెను. పిమ్మట నీవారెల్లరును మహారథులగు రాజపుత్త్రులును గూడి యుద్రే

కించి తీవ్రశరములచే నాతని నొప్పింపఁగా బరమాస్త్రవేత్తయగు నతఁడు వారినెల్ల వాఁడిగలశరములచేఁ బ్రహరించెను. అటులు నీ యోధులనెల్ల నెండినగడ్డి నగ్నివలె దహించుచున్న యాయభిమన్యుని భీకరకర్మమును జూచి నీపుత్రులెల్ల నాతనిఁ జుట్టుముట్టుకొనిరి. అపు డభిమన్యుఁడు వేసఁగియగ్నివలె నీసైన్యములను గాల్చుచుఁ బ్రజ్వలింప సాగెను. అట్టి యాతని యద్భుతకృత్యమును గాంచి నీపౌత్రుఁ డగు లక్ష్మణుఁడు వడిగా వెడలి యాయభిమన్యు నెదుర్కొనియెను. పిదప శుభలక్షణుఁడగు లక్ష్మణునిపైఁ గినిసి యభిమన్యుఁ డాతని సారథిని నాతని నాఱుబాణములచే నొప్పించెను. ఓరాజా! పిమ్మట నీమనుమఁ డాయింద్రునిమనుమనిఁ దీవ్రనారాచములచే నొప్పింపఁగా, నదిచూచు వారి కద్భుతముగాఁ గానవచ్చెను. అంత మహారథుఁడగు నాసౌభద్రుఁ డాలక్ష్మణుని రథాశ్వముల నాల్గిటిని గొట్టి, సారథిని జంపి, యారథికుని వాఁడికోలలచే నొప్పించెను. అటులు హతాశ్వమగురథమందే నిలిచి కుపితుఁడై లక్ష్మణుఁ డొకశక్తి నాయభిమన్యునిపై విసరెను. ఎవ్వరికి నోరువరాక ఘోరమై తనపైకి వచ్చునట్టి యాశక్తిని గాంచి యభి మన్యుఁ డొక కొన్నితీవ్రబాణములచే దానిని ఖండించెను. పిమ్మటఁ గృపుఁ డాలక్ష్మణుని దనరథముపై నిడికొని సైన్యమెల్లఁ జూచుచుం డఁగా నారణరంగమునుండి తీసికొనిపోయెను. అనంతరము మహా భయంకరమై యాసంగ్రామరంగము సంకులమగుడుఁ గౌరవులును బాండవులును బరస్పరవధకాంక్షులతో నొకరినొకరు హింసించుకొనుచుఁ బరువులిడిరి. పరస్పరముఁ బ్రహరించుకొని తమప్రాణముల సమరదేశా గ్నిని హోమముచేసికొనసాగిరి. కేశములు వీడి భిన్నకవచులై విరథులై ఖండితకార్ముకులై సృంజయులు కౌరవులతో బాహుయుద్ధ మొనర్ప మొదలిడిరి. పిమ్మట మహాబలుఁడును, మహాబాహువు నగుభీష్ముఁడు క్రోధావేశముతో మహాత్ము లగుపాండవులసైన్యమును దివ్యాస్త్రము లచే నొప్పించెను. అటు లతఁడు విక్రమించుటను మావటీండ్రు హతు లుగా మిగిలినయేన్గులును, బడినపదాతులును, గుఱ్ఱములు, రథికులు, రౌతులు రణభూమి నెల్లెడల వ్యాపించి యుండిరి." అని తెలిపి సంజ యుఁడు మఱియు నిట్లనియె.

## పంచమదివసయుద్ధావసానము.

"ఓరాజా! పిదప మహాబాహుండగుసాత్యకి యుద్ధగర్వితుండై సారమగు నొకవిల్లు పూని దానినుండి సర్పములనుబోలినకోలలను విడుచుచు, దృఢమై చిత్రమై వెలయుకరలాఘవమును జూచితిమి. అతండు విల్లుత్రిప్పుటయు, బాణములను బ్రయోగించుటయు, మఱియు శరసంధానముసేయుటయు, మఱియుఁ బ్రయోగించి శత్రులను వధించుటయుఁ జూడ వర్షించుమేఘమువలె మాకెంతయు నద్భుతముగాఁ గానవచ్చెను. పిమ్మట నటు లుద్రేకించియున్న యాసాత్యకినిఁ జూచి నీతనయుఁ డతనిపైఁ బదివేలరథములను బ్రోత్సహించి పంపెను. ధనుర్ధరులగువారినెల్ల నారసి, యాసాత్యకి యవక్రపరాక్రముండై దివ్యాస్త్రములచే నొప్పించెను. పిదప నతఁ డటులు దారుణకృత్య మొనరించి శరశరాసనములు ధరించి యందొకచోఁ గానవచ్చినభూరిశ్రవసునిఁ దలపడియెను. అపు డాభూరిశ్రవుఁ డాసాత్యకిచేఁ బడఁద్రోయఁబడిన తన సైన్యములను జూచి కుపితుండై కౌరవులలోఁ గీర్తినిధియగు నతఁడు సర్పతుల్యములును వజ్రసన్నిభములు నగుబాణములను బ్రయోగించి కరలాఘవమును జూపెను. మృత్యుతుల్యములగు నాభూరిశ్రవుని శరపరంపరలకు సాత్యకి సహాయులగువా రోరువఁజాలక నలుదెసలకును బరువులిడసాగిరి. అటు లాయుద్ధరంగమున యుద్ధగర్వితుఁ డగుసాత్యకిని విడిచి యాతనిసహాయులు తొలఁగుడు. నాతనికి సుతులును, వీరసన్నుతులు నగు చిత్రవర్మ మున్నగుమహారథు లాభూరిశ్రవసునిఁ జేరి యెంతయు నుద్రేకముతో "ఓకౌరవదాయాదా! మహాబలా! మాలో నొక్కొకనితోఁగాని, మాయెల్లరతోఁగాని పోరాడుము. ఈసంగ్రామరంగమున మమ్ము విడిచిపోతివేని యపకీర్తి నొందకుందువు. మేము నిన్నువిడిచి యెంతయుఁ బ్రీతినొందుదుము" అని పలికిరి. అది విని మహాబలుఁడును శూరుఁడు నగు నాభూరిశ్రవుఁడు వారితో "ఓవీరులారా! మీవచనము లెంతయు శ్లాఘనీయములై యున్నయవి. మీరెల్లరును గలిసి నాతో యుద్ధ మొనరింపుఁడు, మిమ్మెల్ల వధింతును" అని యతఁడు తెలుపఁగా విని వా రాలస్య మొనర్పక తమశౌర్య మేర్పడ వైరిగర్వాపహారియగు నాభూరిశ్రవునిపై శరవర్షమును గురిపించిరి. ఓరాజా! అప్పటి కపరాహ్ణమగుడు సంగ్రామ మెంతయు సంకులమయ్యెను. అటు

లాయొక్క వీరుని వారెల్లఁ గవిసి శరవర్షమున ముంచిరి. అపు డతఁడు మేఘములచేఁ బర్వతమువలెఁ గప్పఁబడియుండెను. వారు ప్రయోగించిన శరపరంపరలనెల్ల నాభూరిశ్రవుఁడు తన్నుఁ జేరకమునుపే ఖండించుచు వచ్చెను. వా రాతనిఁ జుట్టుముట్టి ప్రహరింపసాగిరి. అతఁడు కుపితుఁడై వారిచాపములను దీవ్రశరములచే ఖండించి, మఱియు వివిధశరజాలములచే వారిని వధించెను. వారెల్ల నేలఁగూలి వజ్రహతములగు మహావృక్షములువలెఁ గానవచ్చిరి. మహాబలులగుతనపుత్రు లటులు సంగ్రామ భూమి నొఱగుటను గాంచి క్రోధావేశముతో సాత్యకి సింహనాద మొనరించుచు నాభూరిశ్రవునిఁ జేరి యుద్ధమొనరింపఁ గడంగెను. అంత మహాబలులగు వారిరువురును బరస్పరమును రథములను గుఱ్ఱములను జంపికొని విరథులై ఖడ్గములను బట్టుకొని సూర్యచంద్రులువలె వెలయఁ జొచ్చిరి. పిమ్మట నటులు ఖడ్గధారియైయున్న యాసాత్యకిని భీముఁడు సమీపించి తనరథమున నాతనిఁ గూరుచుండఁబెట్టికొనియెను. అంత నీకొమరుఁ డాభూరిశ్రవునిఁ దనరథముపైఁ గూరుచుండఁబెట్టెను. అది యటులగుడు మహారథుఁడగు భీష్మునిఁ గవిసి పాండవులు యుద్ధ మొనర్చిరి. అంత సూర్యుఁ డెఱ్ఱవాఱుచుండుటను జూచి యర్జునుఁడు త్వరపడుచు నిరువదైదు వేవురరథికుల నొక్కమాఱుగా నొప్పించెను. అపుడు వారెల్ల దుర్యోధనప్రేరితులై యర్జునునిఁ దలపడి పావకునిపైఁ బడు శలభములువలెఁ గానవచ్చిరి. పిదప ధనుర్వేదవేత్తలగుమాత్స్యులును, కేకయులును, బుత్రపరివారములతో మహారథుఁడగు నర్జునుని జేరిరి. అంత సూర్యుఁ డస్తంగతుఁ డగుచుండెను. అటులగుట సకలసైన్యములకును బ్రమోహము వాటిల్లెను. అపుడు నీతండ్రి యగు దేవవ్రతుఁడు నాఁటియుద్ధమును ముగింప నెంచెను. కురుపాండవులసైన్యములు రెండును వాహనము లలసియుండుటచేఁ బనిచేయఁజాలవయ్యెను. అటులగుట సైన్యములు రెండును దమతమశిబిరములకుఁ బోసాగెను." అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

## ఆఱవదినము యుద్ధ మారంభించుట

"ఓరాజా! నాఁడు కురుపాండవులు విశ్రాంతినొంది యారాత్రి గడుప మఱునాఁ డెప్పటివలె యుద్ధసన్నద్ధులైరి. పూన్చెడిరథ

ములయు, బృంహితములొనర్చెడి యేనుఁగులయు, సన్నాహ మొనరించెడి హయపదాతులయు చప్పుడులు, నీయొక్కయు వారియొక్కయు సైన్యములం దుప్పతిల్లెను. శంఖములయు దుందుభులయు నాదములు సంకులములై వినవచ్చెను. పిమ్మట ధర్మజుఁడు ధృష్టద్యుమ్నునితో "ఓవీరాగ్రేసరా! నేఁడు నీవు మకరవ్యూహమును బన్నుము. అయ్యది వైరిమారక మగునది." అని తెలుప విని, మహారథుఁ డగు నాతఁ డందులకు సమ్మతించెను. ఆవ్యూహమునకు ద్రుపదుఁడు, నర్జునుఁడును శిరముగను, నకులసహదేవులు నేత్రములుగను, మహాబలుఁ డగు భీముఁడు దానికిఁ దుండముగను నుండిరి. అభిమన్యుఁడు, ద్రౌపదేయులును, ఘటోత్కచుఁడును, సాత్యకియు, ధర్మజుఁడును దానికంఠప్రదేశమున నుండిరి. ఓమహారాజా! సేనాపతియగు విరాటుఁడు దానికిఁ దోఁకగా నుండెను. పెక్కుసైన్యములతోఁ గూడి కైకేయు లగుసోదరు లేవురును ధృష్టద్యుమ్నునితోఁ గూడ నెడమప్రక్క నాశ్రయించి యుండిరి. ధృష్టకేతువు వీర్యశాలియగు చేకితానుఁడును వ్యూహరక్షణమునకుఁగా దక్షిణభాగము నాశ్రయించి యుండిరి. దానిపాదములస్థానమున మహారథుఁ డగు కుంతిభోజుఁడును, శతానీకుఁడును గొప్పసైన్యముతో నుండిరి. మహేష్వాసుఁ డగుశిఖండియు, సోమకులతోఁ గూడి యిరావంతుఁడును మకరవ్యూహము పుచ్ఛాగ్రమున నుండిరి. ఓమహారాజా! అప్పాండవు లిటులు వ్యూహమును బన్ని సూర్యోదయమగుడు మఱల యుద్ధమునకుఁ గవచధారులై వెడలిరి. అటులు రథగజాశ్వపదాతులతోను, బొడవగుధ్వజములును, జిత్రము లగుశస్త్రములును నెల్లెడల మెఱయఁగా వ్యూహమైయున్న యాసైన్యమును గాంచి దేవవ్రతుఁడు తనసైన్యమును గ్రౌంచవ్యూహముగా నేర్పఱచెను. దానిముఖమున ద్రోణుఁడు నిలిచియుండెను. కృపాశ్వత్థామలు దాని నేత్రస్థానమున నిలిచిరి. కాంభోజబాహ్లికులతోఁ గూడి కృతవర్మ, ధనుర్ధరుఁడై దానిశిరమున నుండెను. నీకొమరు లగుశూరసేనుఁడును దుర్యోధనుఁడును దానికంఠస్థానమునఁ బెక్కండ్రు రాజులతో నిలిచి యుండిరి. మద్రసౌవీరకేకయులంగూడి ప్రాగ్జ్యోతిషాధిపతి దానివక్షమున నుండెను. ఆతనికి పెక్కుసైన్యము సహాయముగా నుండెను. ప్రస్థలాధీశుఁ డగుసుశర్మ నిజసైన్యముతో దానియెడమపార్శ్వముగా నుండెను. మాలికులతోఁ గూడ యవనులు,

తుషారులు, శకులును నావ్యూహము దక్షిణభాగము నాశ్రయించి యుండిరి. శ్రుతాయువు, శతాయువు, సౌమదత్తియు దానివెనుకఁ బరస్పరరక్షణ మొనర్చుకొనుచు నుండిరి. అంత సూర్యోదయమగుడుఁ గురుపాండవులు యుద్ధమునకుఁ దలపడిరి. అపుడు రథికులు హస్తిపకులను, రథికులను మావటివారును, హయారోహులు హయారోహులను, రౌతులు రథికులను, పాదులు గజారోహులను, రథికులు పదాతులను గవిసి, క్రోధావేశపరవశులై పరస్పరము ప్రహారించుకొనఁ బరువులిడిరి. మహారథు లగుక్షత్రియులచేతను, భీమసేనార్జుననకులసహదేవులచేతను రక్షింపఁబడుచుఁ బాండవసైన్యము నక్షత్రములచే రాత్రివలె వెలయుచుండెను. అటులే భీష్మద్రోణకృపశల్య దుర్యోధనాదులతో మీసైన్యమును గ్రహములచే నాకసమువలె విరాజిలుచుండెను. పిమ్మటఁ బరాక్రమశాలి యగుభీముఁడు ద్రోణునిఁ జూచి యాతనిఁ గడువడిగల గుఱ్ఱములతో వెడలి యెదుర్కొనియెను. ఓరాజా! అటులు తన్నెదుర్కొనిన భీమునిఁ గని కుపితుఁడై యాద్రోణుఁ డాతనిమర్మములు నాఁటునట్లుగాఁ దొమ్మిదియినుపబాణములను బ్రయోగించెను. ఆద్రోణుని యేటునకు నొచ్చి యాభీముఁ డాతనిసారథిని యమపురమున కంపెను. అంత నాద్రోణుఁడు తనగుఱ్ఱములను దానే నిలుపుకొనుచుఁ దూలరాశి నగ్నివలెఁ బాండవసైన్యమును దహింప మొదలిడెను. అటు లాద్రోణుఁడును భీష్ముఁడును విజృంభించియేయుఁడు సృంజయులును, కైకయులును బరువులిడ నారంభించిరి. అటులే నీవారిసేనలును భీమార్జునుల ప్రహారములకు లోఁగి మదించినకాంతవలె నందందు మూర్ఛవడుచుండెను. అటులుభయసైన్యములందును వీరు లగువారు క్షీణించుటను వ్యూహములు రెండును భిన్నములు కాఁజొచ్చెను. అపుడు పాండవులకును నీవారికిని ఘోరమగు సంకులసమరమయ్యెను. అదియెల్ల నద్భుతముగాఁజూచితిమి" అని తెలుప విని ధృతరాష్ట్రుఁడు మఱియు ని ట్లనియె.

## ధృతరాష్ట్రుఁడు చింతించుట

"ఓసంజయా! మనసైన్యము పెక్కుసుగుణములు గలదియు, బహువిధములయినదియు నైయున్నది. మఱియు మనవారివ్యూహమును యథాశాస్త్రీయమగుట నమోఘమై గానవచ్చెడిని. యోధులు మన

యెడఁ బ్రీతిగలిగియున్నవారు. వినయముగలిగి, యెట్టివ్యసనములు లేక దృఢపరాక్రమము గలిగియున్న వారు. ఇందుఁ గేవలము వృద్ధులుగాని, బాలురుగాని, కృశించినవారుగాని, యొడలుత్రిప్పికొనలేనివారుగాని లేరుగదా! అందఱును శరీరలాఘవముగలిగి సారముగల యవయవములతో నారోగ్యవంతులై యున్నవారు. మఱియుఁ, బలువిధము లగు శస్త్రములను బరిగ్రహించి సన్నాహముగలిగియున్నవారు. కత్తిపోటునందును, గదాయుద్ధమందును, మల్లయుద్ధమందును నించుకేని వెనుదీయువారుగారు. ఇంకను దోమర పరిఘాద్యాయుధములతోఁ బ్రహరింప నేర్పుగలవారు. శక్తి, భిందిపాల, ముసలాదియుద్ధములందును బరిశ్రమ చేసినవారు. ఎల్లశస్త్రవిద్యలందు నలవాటుపడినవారు. మఱియు నేన్గులు మున్నగువాని నధిష్ఠించుటయు, వానినుండి దిగుటయుఁ, బ్రాకుటయు, నడుమ నెగురుటయుఁ, బ్రహరించుటయు, వైరులపై వెడలుటయు, సమయము వచ్చినపుడు తొలఁగుటయుఁ జక్కఁగా నెఱిఁగినవారు. గజాశ్వరథయానములం దారితేరినవారు. అదియుఁగాక సేనలో యోధులనెల్లఁ బరీక్షించి వారివారికిఁ దగునట్లుగా వేతనములొసంగి నాకొడుకు వారి నాదరించువాఁడు. కాని చనవుచేఁగాని, యుపకారబుద్ధిచేఁగాని, యేదేనిసంబంధముచేఁగాని వచ్చినవారుగారు. స్నేహబలముచే నీచులను బరిగ్రహింపలేదు. మనసైన్యమందలివారందఱును సమృద్ధులును, బూజ్యులును, మనయందిష్టముగలవారును, సత్కరింపఁబడినబంధువులు నై యున్న వారుగదా! మఱియు మనయుపకారము లొందినవారును గీర్తివంతులును బట్టుదలగలవారు నైనవారు. మఱియుఁ బెక్కుయుద్ధములందుఁ బనిచేసియున్న స్వజనమును, లోకప్రసిద్ధులై లోకపాలతుల్యు లగు ముఖ్యులును మనసైన్యమును బాలించువారై యుండిరి. పుడమిని జనసమ్మతులై వెలయు ననేకు లగుక్షత్రియులు తమంతఁదాము తమసైన్యములతో మనయెడఁ బ్రీతిగలిగి మనలఁ జేరినవారు. మహానదులచే నిండిన మహోదధివలె మనసైన్యము సంపూర్ణ మైయున్నది. ఱెక్కలులేని పక్షులవలె వెలయురథములతోడను నేన్గులతోడను గూడి పెక్కుయోధులుగలిగి భయంకరమై వాహనములనెడి తరంగములును, గదాశక్తిశరప్రాసములనియెడి క్షేపణులును, సంకులమై వెలయు, నది యొక సాగరమువలెఁ గానవచ్చెను. అందు ధ్వజభూషణాదులు సముద్ర

మండలి రత్నములవలె నుండెను. పరుగులిడువాహనములచేఁ గగలు సముద్రము ననుకరించియుండెను. ద్రోణభీష్ములును, కృపకృతవర్మలును, సైంధవమహాశ్వాసులును, భగదత్తవికర్ణులును, శకున్యశ్వత్థామబాహ్లీకులును మున్నగువీరులచే రక్షింపఁబడియున్నది. ఇట్టిమహాత్ములు, ఇట్టి మహాబలులు గలిగియు, మనవారికిఁ బరాజయము గలుగుచుండెనఁట చూడఁగా దైవమే యందులకు నిమిత్త మనవలసి యున్నది. ఓ సంజయా! ఇట్టిప్రయత్నము మానవులుగాని, పురాణఋషులుగాని చేసియున్నట్లు గానరాదు. శస్త్రసంపదగల యిట్టిసైన్యసమూహమే సంగ్రామమున వధింపఁబడుచుండెనేని యిందులకు దైవముగాక వేఱొండేమినిమిత్తము చెప్పగలము? ఓసంజయా! ఇదియెల్ల విపరీతముగా నగపడుచున్నది. వీనికిఁ బలుమాఱులు విదురుఁడు హితముపదేశించెను. కాని యవివేకియగు నాకొడుకు దానిని గ్రహింపఁజాలఁడయ్యెను. సర్వజ్ఞుఁడగు నామహాత్మునిబుద్ధి సత్యమైనది. ఇదియెల్ల నతఁడు కనుఁగొనినదియే. ఓసంజయా! వీని నననేల! ఎల్లవిధముల నిదియెల్లఁ గాఁదగియున్నది. అన్నలువ మున్ను విధించినది వేఱొండువిధముగా నెట్లగును?" అని పలుక విని సంజయుఁడు మఱియు నిట్లనియె.

## ద్రోణపరాక్రమము

"ఓయంబికానందనా! నిజదోషమునుండియే నీకిట్టియిక్కట్టులు సంభవించెను. ఓరాజా! ధర్మసాంకర్య మొనరించిన యిప్పనులఫలము నీవు చూతువుగాని నీకొమరుఁడు చూడఁడు. మున్ను దుష్టద్యూతము నీమూలముననే జరిగినది. నీతప్పిదముచేతనే పాండవులతో యుద్ధము సంభవించెను. నీవు మున్నార్జించినపాపఫల మిపు డనుభవింపుము. ఎవ్వఁడార్జించినపాపము వాఁడే యనుభవింపవలయును. ఓరాజా! అది యిహమునఁగాని పరమునఁగాని పొందకతప్పనిది. కావున నట్టిపాపఫలము నీకిపు డీమహావ్యసనరూపముగాఁ దటస్థించినది. అటులగుట స్థిరచిత్తుఁడవై జరిగినయుద్ధమువిధము నెఱిగించెదను వినుము.

ఓరాజా! భీమసేనుఁ డడరి తీవ్రబాణములచే మనసైన్యములను ఛేదించి, పిదప దుర్యోధనుఁడు మున్నగు నీతనయులందఱపైఁ దలపడియెను. మహాబలుఁ డగుభీముఁ డటు లాదుశ్శాసన, దుర్విషహ,

నుస్పృహా, దుర్మద, జయ, జయసేన, వికర్ణ, చిత్రసేన, సుదర్శన, చారుచిత్ర, సువర్మ, కర్ణ, దుష్కర్ణులు మున్నగువారినిఁ గాంచి కుపితుఁడై భీష్ముని లక్ష్యము సేయకయే యాసైన్యమును బ్రవేశించెను. అపు డా భీమునిఁ గాంచి వారెల్లరును "ఈభీముని జీవముతోఁ బట్టుకొనెదము" అని యతని ముట్టడించిరి. అట్టి నిశ్చయముగలవారినడుమ నాభీముఁడు క్రూరగ్రహములచే నావరింపఁబడియున్న సూర్యుఁడువలె వెలయుచుండెను. ఆవ్యూహమధ్యమును జేరియు నాభీముం డించుకేని జడియఁ డయ్యెను. అపు డతఁడు దేవాసురయుద్ధమున దానవులను సమీపించిన యింద్రుఁడువలెఁ గానవచ్చెను. అంత వేలకొలఁది రథికులు పలువిధము లగుశస్త్రములను బూని యాభీము నొకని ముట్టడించిరి. పిదప నాశూరుఁ డాయోధులను, గజరథాశ్వపదాతులను బ్రహరించెను గాని నీకొడుకులపై దృష్టి పెట్టలేదు. అంతఁ గౌరవయోధులు తన్నుఁ బట్టికొనఁ బ్రయత్నించుటను దెలిసికొని యాభీముఁడును వారినెల్లఁ జంప నుద్యమించి రథమునుండి దిగి గదనుబట్టి, మహాసాగరమనఁదగు నాకౌరవబలమును బ్రహరింపసాగెను. అటు లాభీముఁడు రణరంగమునఁ బ్రవేశించుటను జూచి, ధృష్టద్యుమ్నుఁడు ద్రోణుని విడిచి వడిగా వెడలి శకుని నెదుర్కొని నీసైన్యమునెల్ల నివారించి శూన్యమైయున్న భీమునిరథమును సమీపించెను. అటులు సమీపించి యాతనిసారథి యగు విశోకునిఁ జూచి దుఃఖితుఁడై చైతన్యము దప్పి కనుల నీరువిడుచుచు నిట్టూర్పులిడుచు సన్ననికంఠస్వరముతో "ఓవిశోకా! ప్రాణప్రియుఁ డగుభీముఁ డెక్కడ?" అని ప్రశ్నించెను. అది విని వాఁడు చేతులుమొగిడ్చి "ఓరాజా! నన్నిందుంచి మహాబలుఁడగుపాండవమధ్యముఁడు మహార్ణవమనఁదగు ధార్తరాష్ట్రసైన్యమును బ్రవేశించియున్నవాఁడు. అతఁడు రథముడిగి వెడలునపుడు సంతోషముతో నన్నుఁ జూచి "ఓయీ! రెండుగడియ లిందు గుఱ్ఱముల నాపి నాకై నిరీక్షింపుము. వీరెల్ల నన్నుఁ జంప సమకట్టియుండుటను వీరి నిపుడే చంపి వచ్చెదను" అని పలికి యాసైన్యమునడుమఁ జొచ్చెను. పిదప మహాబలుఁ డగుభీముఁడు గదను బూని పరుగిడుటను జూచి సర్వసైన్యములకును సంఘర్షముజరిగెను. అట్లు మహాభయంకరమైన సంకులయుద్ధము ప్రారంభమగుడు నీమిత్రుఁ డగుభీముఁ డామహావ్యూహమును ఛేదించి

లోనికిఁ జొచ్చెను." అని యావిశోకుఁడు తెలిపెను. వానివచనములు విని మహాబలుఁ డగు నాధృష్టద్యుమ్నుఁ డారణరంగమునడుమ నిలిచి "ఆహా! ఇఁక నా బ్రదుకుచేఁ బ్రయోజనమేమి? ఈరణరంగమున భీముని విడిచి పాండవులస్నేహము తొలఁగి భీముఁడు లేకుండ వెడలితినేని క్షత్త్రియులు నన్ను నిందింప కుందురా ? నేను బ్రదికి యుండఁగా భీముఁడు పెక్కురకులోఁగియు, నపజయ మెట్లొందును? ఆతని కింద్రాదులును సమంగళమును గూర్పఁజాలరు. ఆతఁడు తనకు సహాయులు లేకున్నను సుఖముగా నింటికి మఱలి రాఁగలఁడు. మఱియు నాభీముఁడు నాకు మిత్త్రుఁడును, సంబంధియు, భక్తుఁడును నైనవాఁడు. నేనాతనికి భక్తుఁడను. కావున నిపుడు నేనాతఁ డున్నచోటికిఁ బోవువాఁడను. ఓయీ! ఇదె దానవుల నింద్రుఁడువలె వైరులనెల్లఁ జంపెదను చూడుము" అని పలికి యతఁడు భీముఁడున్నకడకు వెడలెను. అంతట నా భీముఁడు, తనత్రోవనున్న యేనుఁగులను, జంపుచు శత్త్రుసైన్యములను దహించుచు నాధృష్టద్యుమ్నునకుఁ గానవచ్చెను. అపు డాభీముఁ డారణభూమిని, మహావృక్షములనువలె రాజులను నఱకుచుండెను. ఆతనిచేఁ బ్రహరింపఁబడు నేనుఁగులు, రథికులు, రౌతులు, పదాతులును నెంతయు నార్తస్వరము లొనర్చుచుండిరి. ఓమారిషా! నీసైన్యమున హాహాకారములు జనించెను. చిత్రముగా యుద్ధమొనర్చుచు మిక్కిలి నేర్పుతో భీముఁడు నీసైన్యములను వధింపసాగెను. అంత నాభీమునిఁ గాంచి యోధులగువారెల్లరును జడియక చుట్టుకొని యెల్లెడల నాతనిపై శరవర్షమును గురిసిరి. అటు లొక్కుమ్మడిగా వారెల్ల నప్పాండవవీరుని ఘోరముగాఁ బరివేష్టించి యుండుటనుజూచి ధృష్టద్యుమ్నుఁ డాతని సమీపింపఁగా నతఁడు గదాహస్తుఁడై ప్రళయకాలాంతయముఁడువలెఁ గ్రోధవిషమును గ్రక్కుచు శత్త్రుశరపీడితాంగుఁడై యచ్చోఁ గనఁబడెను. అపు డాధృష్టద్యుమ్నుఁ డాభీమునోదార్చి యాతని మేనఁ గ్రుచ్చికొనియున్న బాణముల నూడఁబెఱికి తనరథముపై గూర్చుండఁబెట్టి కౌఁగిలించికొని కొంతశాంతి గలిగించెను. పిమ్మట నా సమ్మర్దమును గాంచి నీకొమరుఁడు వడిగాఁ దనయనుజులతో "ఓయీ! దురాత్ముఁ డగునీద్రుపదపుత్త్రుఁడు భీమునితోఁగూడ నిందులకువచ్చియున్నవాఁడు. కావున లెండు. మనమెల్లఁ గలిసి వానిపైకి వెడలుదము.

యుద్ధోత్సాహముగల మన కీఁక వైరియే లేకుండుఁగాక." అని పలుక విని యాజ్యేష్ఠునిప్రేరణచే వారెల్లఁ గుపితులై యాయుధములెత్తి యుగాంతమునఁ గనఁబడుధూమకేతువులువలె నాభీముని వధింపవెడలిరి. అపు డవ్వీరులధనుష్టంకారములకును నేమిధ్వనులకును బుడమి వడఁక మబ్బులు పెన్నీటిధారలచేఁ బర్వతమునువలెఁ దమశరజాలములచే వారాద్రుపదపుత్రుని ముంచిరి. అటులు వారెంతయుఁ దన్ను నొప్పించి నను నాధృష్టద్యుమ్నుఁ డించుకయుఁ జలింపక చిత్రయోధియై తన నలు దెసల నావరించి యుద్రిక్తులై యున్న నీపుత్రులను జూచి వారినెల్ల నొక్కమాఱుగా వధింప నెంచి సమ్మోహనాస్త్రమును వారిపైఁ బ్రయోగించెను. మున్నింద్రుఁడు దానవులపైవలెఁ గుపితుఁడై యాద్రుపదపుత్రుఁ డటు లాయస్త్రమును విడువఁగా దానిచే నీతనయులెల్ల నిశ్చేతనులై మూర్ఛ వడిరి. కాలము సమీపించినవారివలె నష్టచేతనులై యున్న నీకొమరులను గాంచి కురుసైన్యము లన్నియుఁ దమగజరథాశ్వములతోఁ బరువులిడెను. ఇట్టిసమయమున ద్రోణుఁడు ద్రుపదుని దారుణములగు మూఁడుబాణములచే నొప్పించెను. ఓరాజా! అటు లాద్రోణుఁడు ప్రహరింపఁగా వెనుకటివైరమును స్మరించుచు ద్రుపదుఁ డారణరంగమునుండి తొలఁగి వెడలిపోయెను. అంత నాద్రోణుఁడు శంఖమును బూరించెను. ఆతనిశంఖధ్వని విని సోమకులందఱును జడిసిరి. పిమ్మట నాద్రోణుఁడు నీకొమరులెల్ల సమ్మోహనాస్త్రముచే మూర్ఛవడియుండుటను దెలిసి, స్వామిభక్తిచే వెడలి నీతనయులున్నచోటికి వచ్చి సంగ్రామరంగమున స్వేచ్ఛగాఁ జరించుభీమధృష్టద్యుమ్నులను మూర్ఛితులైయున్న నీపుత్రులను గాంచి యపుడు ప్రజ్ఞాస్త్రముచే నాసమ్మోహనాస్త్రమును దొలఁగించెను. అంత నీతనయులందఱు నెప్పటిచొప్పునఁ దెప్పిఱిల్లి మఱల నాభీమధృష్టద్యుమ్నులను దలపడిరి. పిదప ధర్మజుఁడు తనసైన్యములను బిలిచి "ఓవీరులారా! భీమపార్షతు లున్నచోటికిఁ బొండు. శక్తికొలఁది వారికిఁ దోడ్పడుఁడు. వీరు లగునభిమన్యుఁడు మున్నగువారు పండ్రెండుగురు వెడలి వారిప్రవృత్తిని దెలిసికొనివచ్చునంతవఱకు నానెమ్మనము నెమ్మది నొందదు" అని పలుక విని, యాపరాక్రమనిధులగుశూరులెల్లరును నాతనియాజ్ఞ శిరసావహించి వెడలిరి. అపుడు పవలు రెండుజాములు కావచ్చెను. అపు డాకైకేయులు, ద్రౌప

చేయులు, ధృష్టకేతువు, నభిమన్యుని మున్నిడికొని గొప్పసైన్యముతోఁ గూడి సూచీముఖముగా నేర్పడిన మనవారిసైన్యమును భేదించి యందుఁ జొచ్చిరి. అంత నాయభిమన్యుఁడు మున్నగువీరులు వచ్చుటను జూచి యంతకుమున్నే భీమునకు వెఱచియు, ధృష్టద్యుమ్నునిచే మూర్ఛపడియున్న మనసైన్యము నిలుప నెవ్వరును శక్తులుగాకుండిరి. అప్పు డది మార్గమధ్యమున మూర్ఛపడియున్న కాంతవలె దీనయై కానవచ్చెను. అప్పుడు సువర్ణమయధ్వజులును, మహాభుజులు నగునాయభిమన్యుప్రభృతు లాభీమధృష్టద్యుమ్నులను సమీపించిరి. వారిని గాంచి యావీరులిరువురును సోత్సాహులై నీవారిసైన్యము నడంచుచు నుండిరి. అంతలో వడిగాఁ బఱవిడిపోవుచున్న ద్రుపదుఁడు వారికిఁ గానవచ్చెను. అప్పుడు ధృష్టద్యుమ్నుఁ డట్టి తనతండ్రిని జూచుటను నీ పుత్త్రులను వధించుతలంపువిడిచి యాభీమునిఁ గైకేయురథమున నుంచి, కుపితుఁడై ద్రోణునిఁ బలపడఁబోయెను. పిదప నట్లు వడిగాఁ దనిపైకి వచ్చిన యావీరు నారసి, యాభారద్వాజుఁడును గోపావేశ మొదవ వాని విల్లొకతీవ్రబాణముచేఁ దునియ లొనర్చి మఱియు నాతనిపై వందల కొలంది బాణములు పఱపెను. అప్పుడు స్వామియగుదుర్యోధనుఁడు తన కోసఁగుపిండమును స్మరించుచు నాతనిహితముకై యటు లతఁడు విక్రమించెను. అంత నాధృష్టద్యుమ్నుఁడు వేఱొకవిల్లు పూని సువర్ణాగ్రములును, శిలాసారములు నగుదెబ్బరిబాణములచే ద్రోణుని నొప్పించెను. మఱియు నాతనివిల్లు ద్రోణుఁడు ఖండించి గుఱ్ఱములను నాల్గిటిని నాల్గుబాణములచేఁ జంపి, యొకవాఁడికోలచే సారథిని మృత్యుమందిరమున కంపెను. అంత నాపార్షతుఁడు హతాశ్వ మగురథము డిగి వడిగా నభిమన్యునిరథ మధిరోహించెను. అప్పుడు రథగజాశ్వసహితముగా సైన్యమెల్ల వడంకసాగెను. అంత నాభీమపార్షతులు చూచుచుండఁగా నాద్రోణునిచే భంగపడి చెదరుచున్నసైన్యములను, మఱలించుట కందలియోధులు సమర్థులుగాకుండిరి. ద్రోణనిహతమగుపాండవసైన్యము కలఁతపడినసాగరమువలెఁ జలనమొంది చెదరుటను గాంచి మనసైన్యమువా రుత్సాహపూరితు లైరి. అటులు కుపితుఁడై వైరిసైన్యములను వధించు నాయాచార్యునిఁ జూచి యిరుతెగలయోధులును మేలు మేలని యఱచిరి." అని తెలిపి సంజయుఁడు మఱియునిట్లనియె.



భీమపరాక్రమము

"ఓరాజా! పిదప దుర్యోధనుఁడు కొంతవడి కాసమ్మోహమునుండి తెప్పిఱిలి శరవర్షమును గురియుచు భీమునిఁ దలపడియెను. అపు డెప్పటి చొప్పున నీతనయులందఱు నేకీభవించి భీమునితోఁ బోరాడ నారంభించిరి. అంత నాభీముఁడును దనరథము నధిష్ఠించి నీతనయుఁ డగుదుర్యోధనునిఁ జేరి వైరిప్రాణాంతకరమగు నొకదృఢశరాసనమునుబరిగ్రహించి కొన్నితీవ్రబాణముల నాతని నొప్పించెను. పిదప నీతనయుఁడు, మహాబలుఁ డగుభీము నొకవాఁడికోలచే మర్మముఁ దాఁకునట్లు ప్రహరింపఁగా నతఁడు కను లెఱ్ఱచేసి కోపావేశముతో వింట మూఁడుబాణములు సంధించి వానిబాహువులందును వక్షమందును నాటించెను. కాని యందులకు సుయోధనుఁడు కొండవలె నించుకేనిఁ జలింపఁడయ్యెను. అటులు పరస్పరము కుపితులై పోరాడు నాభీమదుర్యోధనులను గాంచి తక్కిన నీతనయులెల్లఁ బ్రాణములకుఁ దెగించి, తాము మున్నాలోచించి కొనిన భీమనిగ్రహమును స్మరించి, వారిలో వా రొకమాఱు నిశ్చయించికొని యాభీమునిఁ బట్టికొనఁగడంగిరి. వారు వచ్చుచుండఁగనే మహాబలుఁ డగునాతఁడు మహాగజము శత్రుగజములనువలె వారినెదుర్కొని కుపితుఁడై నీకొమరుఁడగుచిత్రసేను నొకబాణముచేఁ గొట్టి, మిగిలిన నీకొడుకులకు వేగముగల బహువిధశరములచే నొప్పించెను. పిదప ధర్మరాజుచే ననుపఁబడిన యభిమన్యుప్రభృతు లగుపన్నిద్దఱును మహారథు లగు రాజపుత్రులను గవిసి పోరందొడంగిరి. నిజతేజముచే సూర్యాగ్నులను మించి వెలుఁగు నాశూరులనెల్ల జూచి నీతనయు లాభీముని విడిచి తొలఁగిపోయిరి. కాని యటులు తనయెదుటఁబడియు జీవితములతో సుయోధనాదు లేగినందులకు వాయునందనుఁడు సహింప లేకుండెను" అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.



సంకులయుద్ధము

"ఓరాజా! పిమ్మట భీమధృష్టద్యుమ్నులతోఁగూడి యభిమన్యుఁడు మఱల నీపుత్రులను నీవారిసైన్యమును బీడించెను. అంత మహారథు లగు సుయోధనాదులు ధనుర్ధరులై వడిగలగుఱ్ఱములతో వెడలి యారథికు లున్నచోటి కేగెను. అపు డపరాహ్ణమగుడు మహాసంగ్రామ మారంభ

మయ్యెను. అటులుపోరాడు కౌరవపాండవయోధులలో నభిమన్యుఁడు వికర్ణునిగుఱ్ఱములను గొట్టి, పిదప నిరువదైదుబాణములచే నాతనిఁ బ్రహరించెను. అంత నావికర్ణుఁడు తనరథాశ్వములు హతములగుడుఁ దేజోవంతమగు చిత్రసేనునిరథ మధిష్ఠించెను. అటు లొకరథము నెక్కి యున్న కురువంశవర్ధను లగునాసోదరుల నిరువురను, శరవర్షముచే నాయభిమన్యుఁడు గప్పెను. పిమ్మట దుర్జయుఁడగు నావికర్ణుఁ డాయభిమన్యునైదుబాణములచేఁ గొట్టెనుగాని యతఁ డందుల కించుకేనిఁ జలింపక మేరుగిరివలె సుస్థిరుఁడై యుండెను. పిదప దుశ్శాసనుఁడు కైకేయులనేవురను దలపడి యుద్ధమొనర్ప నది యద్భుతమయ్యెను. ద్రౌపదేయు లేవురును గుపితులై దుర్యోధను నెదుర్కొని యొక్కొకఁడు మూఁడేసి బాణములచే నాతని నొప్పించిరి. దుర్జయుఁడగు నీతనయుఁ డాయేవురను వేలువేలుగా వాఁడికోలలచే నొప్పించెను. మఱల వా రాతనిఁ బ్రహరింపఁగా నతఁడు రక్తసిక్తాంగుఁడై గైరికాదిధాతువుగల ప్రవాహములతోఁగూడిన పర్వతమువలె విరాజిల్లెను. ఓరాజా! ఆరణరంగమున భీష్ముఁడు పాండవసైన్యమును గోపాలుఁడు పశుగణములనువలె మోదెను. పిమ్మట గాండివధ్వని వినఁబడెను. అయ్యది సైన్యములకు దక్షిణముగానున్న శత్రులను జంపుచున్నటులు తెలియఁజేసెను. ఆప్రదేశమున మొండెములు వేలకొలఁది గానవచ్చెను. మఱియుఁ గురుపాండవులసైన్యము రక్తోదకములును, బాణములనెడిసుడులును, నేన్గులనెడి ద్వీపములును, గుఱ్ఱములనెడితరంగములును, రథములనెడి యోడలును గలిగి సాగరతుల్యమగుట నందు వీరు లెట్టులో మునిఁగి తేలుచు దానిని దాఁటిరి. అందుఁ గొందఱు చేతులు తెగినవారును, గవచములుచినిఁగిన వారును నై వందలకొలఁదిని, వేలకొలఁదినిఁ బడియుండిరి. ఓరాజా! అందుఁబడియున్న మత్తగజములు రక్తప్రవాహములుగలిగియుండుటను, వానిచేఁ బుడమి పర్వతములు గలదిగాఁ గానవచ్చెను. అపు డుభయ సైన్యములందును నొకయద్భుతమును గాంచితిమి. అందు యుద్ధాభిలాషలేనిమానవుఁ డొకఁడును మాకుఁ గానరాఁడయ్యెను. అపుడు వారెంతయును గీర్తి కాసపడి పోరాడిరి. మీవారి కపుడు జయమే యపేక్షితమై యుండెను" అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

ఆఱవనాటియుద్ధము ముగియుట

"ఓరాజా! అంత సూర్యుఁ డెఱ్ఱవాఱుచుండఁగా, దుర్యోధనుఁడు యుద్ధోత్సాహ మెక్కుడగుట నాభీమునిఁ జంపుఁ దలంపుతో నాతనిఁ దలపడ, నాతఁ డాదుర్యోధనుతో "ఓయీ! పెక్కువత్సరములనుండి నేనభిలషించుచున్న సమయ మిపు డిదె తటస్థించినది. కావున నింక నిన్నుఁ జంపువాఁడను. నీవిపు డీయుద్ధమునుండి మఱలకుందువేని కుంతికష్ట మును, మావనవాసక్లేశమును, ద్రౌపదిమనోదుఃఖమును నిన్నుఁ జంపి మఱలింతును. నీవు పాండవులయెడ మత్సరముగలిగి ప్రవర్తించి వారి కొనరించిన యవమానముఫల మిదె నీకుఁ గష్టరూపమునఁ దటస్థించెను. నీవు మున్ను కర్ణసౌబలులమతమే సమ్మతముగానెంచి, సొంతబుద్ధివెట్టక, పాండవుల నీయిష్టమువచ్చినటులు కష్టములపాలునేసితివి. అది తగదని ప్రార్థించిన శ్రీకృష్ణభగవానుని, మోహాంధుఁడవై యవమానించితివి. మఱియు మహోత్సాహముతో నులూకుని సమాదేశ మొసంగితివి. కావున నిన్నిపుడు బంధుమిత్రపరివారసహితముగా నంత మొందించు వాఁడను. ఆపాపపుఫల మనుభవింపుము." అని పలికి విల్లుపూని, దానిని బలుమాఱులు సవరించి పిడుగులుంబోని ఘోరనారాచములను ముప్పదాఱింటిని సంధించి వడిగా నాసుయోధనుపైఁ బఱపి, మఱియు రెండు బాణములచే నాతనిధనువును, మఱి రెండిటిచే సూతునిఁ గొట్టి, నాల్గు బాణములచే గుఱ్ఱములనుజంపి, గట్టిగాఁదిగిచివైచిన రెండుబాణములచే నాసుయోధనుని ఛత్రము రథమునుండి నేలఁ గూలనేసెను. మఱియు మూఁడువాడికోలలచే నుత్తమమై ప్రజ్వలించు నాతనిధ్వజము నఱికి, యతఁడు చూచుచుండఁగా భీముఁడు గొప్పసింహనాద మొనర్చెను. అంత మేఘమునుండి మెఱుపువలె నానారత్నభూషితమై వెలయు నాతని ధ్వజము పుడమిఁబడియెను. మణిమయమగుట సూర్యునివలె వెలుఁగుచు సర్ప చిహ్నమగు నాతనిధ్వజము తెగి నేలఁగూలుటను రాజులందఱును గాంచిరి. మఱియు నతఁడు పరిహాసమొనర్చుచుఁ బదిబాణములచే నా సుయోధను నంకుశములచే నేనుగువలె నొప్పించెను. పిదప మహాబలుఁ డగుసింధుపతి యాసుయోధనునివెనుకఁ గొందఱు వీరులతోఁగూడి యాతనిపార్ష్ణిగ్రాహుఁడై యుండెను. అంత రథికోత్తముఁ డగు కృపుఁ

డాసుయోధను నొకరథముపైఁ గూరుచుండఁబెట్టెను. అపు డెంతయు నాభీముని ప్రహారములచే నొచ్చుటను నీతనయుఁడు తనరథస్థానమునఁ గూలఁబడియుండెను. పిమ్మట సైంధవుఁడు భీమునిఁ దలపడియెను. పిదప మఱియుఁ బెక్కురురథికు లాతనిఁ బరివేష్టించిరి. అదిచూచి ధృష్టకేతువు నభిమన్యుఁడు, ద్రౌపదేయులు, కేకయులు మున్నగువారు నీతనయులతో యుద్ధమొనర్పసాగిరి. అపు డభిమన్యుఁడు నీవారి నొక్కొకని నైదేసివాఁడితూపులచే నొప్పించెను. వారెల్ల నందులకు సహింపక యా యభిమన్యుని మేఘములు మేరుగిరినివలె శరవర్షముచే ముంచిరి. కృతాస్త్రుఁడును రణగర్వితుఁడు నగునాయభిమన్యుఁడు, వారిశరపీడను సహింపక, దేవాసురయుద్ధమున మహాసురుల నింద్రుఁడువలె నీవారినెల్ల జలింపఁజేసి, వికర్ణునిసర్పతుల్యములగుపదునాల్గుతీవ్రనారాచములచేనొప్పించి, మఱియు నాతనిధ్వజమును సూతుని నేలఁగూలఁద్రోసి, గుఱ్ఱములను జంపి నాట్యమొనరించుచు, మఱియు నుత్సాహముతోఁ దీవ్రాగ్రములును ఘోరములు నగు నారాచములచేఁ నాతనిఁ బ్రహరింపఁగా నవి యావికర్ణునిదేహమును భేదించి, బుసకొట్టుపాములువలెఁ బుడమిఁ జొచ్చెను. సువర్ణాగ్రము లగు నాయభిమన్యునిబాణము లావికర్ణునిఁజంపి రక్తసిక్తములై, శోణితమును గ్రక్కుచున్నవివోలెఁ బుడమిని గానవచ్చెను. అంత హతుఁ డగునావికర్ణునిఁ గాంచి యాతనిసోదరులు కుపితులై యభిమన్యుప్రముఖులగువీరులను దలపడిరి. అటు లెదుర్కొన నపుడు యుద్ధగర్వితు లగువారికిఁ బరస్పరము ఘోరయుద్ధము జరిగెను. అంత దుర్ముఖుఁడు, శ్రుతకర్మ నైదుబాణములతోఁగొట్టి యొకకోలచే వానిధ్వజమును, నేఁడుబాణములచే సారథిని, నాలుబాణములచే వాయువేగముగల యాతనిగుఱ్ఱములను గొట్టి, సారథిని బడఁద్రోసెను. అపు డాశ్రుతకర్మ హతాశ్వమగురథమునం దేనిలిచి, కుపితుఁడై యగ్నిజ్వాలవలెఁ బ్రజ్వలించు నొకశక్తి నాదుర్ముఖునిపై విసరెను. అవి యాదుర్ముఖునికవచమును భేదించి మిక్కిలి దారుగలదగుటఁ బుడమిని బ్రద్దలుచేసి యందుఁ జొచ్చెను. అంత విరథుఁ డగు నాశ్రుతకర్మను మహాబలుఁ డగు శ్రుతసోముఁడు, సకలసైన్యములును జూచుచుండఁగా దనరథముపై నుంచెను. పిదప శ్రుతకీర్తి, నీకొమరుఁ డగుజయత్సేనునిఁ దాఁకి, శరవర్షము గురిపింపఁగా జయత్సేనుఁ డాతనివిల్లు ఖండించెను. అటులు

శ్రుతకీర్తివిల్లు తునుఁగుటను జూచి యాతనిసోదరుఁ డగుశతానీకుఁడు సింహమువలె మఱిమఱియు గర్జించుచు, నాజయత్సేనునిఁజేరి పదివాఁడి తూపులచే నాతని నొప్పించి, మత్తగజమువలె మహానాద మొనర్చెను. పిదప నాశతానీకుఁడు మఱియు సర్వావరణములను భేదించి నొకవాఁడి కోలచే నాజయత్సేనుని వక్షమునఁ గొట్టఁగా, నంతలో నాతనిచెంత నున్నదుష్కర్ణుఁడు నకులపుత్త్రుఁ డగు నాశతానీకుని శరశరాసనములఁ దునుమాడెను. పిమ్మట నాశతానీకుఁడు వేఱొకవిల్లు పూని తీవ్రబాణ ముల నావింట సంధించి "ఓరీ! నిలునిలుము" అని పలుకుచు నాదుష్కర్ణునిపైఁ బాములవంటిబాణములను బ్రయోగించెను. అటులు ప్రహరించి యొకబాణముచే వానివిల్లు రెండిటిచే సూతునిఁ గొట్టి కొన్నిబాణములచే మఱల నాతని నొప్పించెను. మఱియుఁ దీవ్రములగు పండ్రెండు బాణములచే మనోజవము లగు నాదుష్కర్ణునిగుఱ్ఱములను హింసించి, వేఱొకవాఁడికోలచే వానివక్షమును బ్రహరించెను. అంత నాదుష్కర్ణుఁడు వజ్రహతమగువృక్షమువలె నేలఁగూలెను. అటులు దుష్కర్ణుఁడు హతుఁ డగుటను గాంచి, మహారథు లేవురు వెడలి యాశతానీకుని ముట్టడించిరి. అంత నాకేకయసోదరులేవురును గుపితులై శరవర్షమును గురియుచు నెదుర్కొనుటఁ జూచి యాశతానీకునిపై నీతనయు లగు దుర్ముఖ, దుర్జయ, దుర్మర్షణులు సయుతము వెడలిరి. అటులే శత్రుంజయుఁడును, శత్రుసహుఁడును యుద్ధోత్సాహులై వెడలిరి. అపుడు పర్వతములఁబోలు రథములతోడను, నలంకృతము లగుగుఱ్ఱములతోడను, నానావర్ణము లగు పతాకలతోడను గూడి, విచిత్రకవచధారులును, శరశరాసనధరులునై, వనమునుండి వనమునకు వెడలినసింహములునా వారాసైన్యమును బ్రవేశించిరి. అపు డవ్వీరులు పరస్పరము ప్రహరించుకొనఁగా నొకగొప్పసంకులయుద్ధమయ్యెను. అంత సూర్యుఁ డస్తంగతుఁడుకావచ్చెను. అపుడు భీష్ముఁడు కుపితుఁడై పాంచాలసైన్యములను యమపురగృహప్రవేశ మొనర్ప నారంభించెను. ఇటులగుడుఁ గొంతసేపటికి సైన్యములు శాంతినొందుటనుజూచి యుద్ధమును ముగించి సుయోధనుఁడు నిజశిబిరమునకుఁ బోయెను. ధర్మజుఁడును భీమధృష్టద్యుమ్నులను శిరముల మూర్కొని సంతుష్టాంతరంగుఁడై తనశిబిరమును బ్రవేశించెను" అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

భీష్మదుర్యోధనసంవాదము

"ఓరాజా! అటులు పరస్పరము వైరములు పెంచుకొని పోరాడి రక్తసిక్తాంగులై తమతమశిబిరములకుఁబోయి కొంతవిశ్రమించి యొకరి నొకరు గౌరవించుకొనుచు, మఱల యుద్ధాభిలాష లడర సన్నద్ధులై యుండిరి. ఓయాంబికేయా! పిదప నీకొమరుఁడు నొచ్చినవాఁడగుటఁ గొంతచింతిలి పితామహునికడ కేగి "ఓతాతా! రౌద్రములై భయంకరము లగుమనవ్యూహములను జీల్చి పాండవవీరులు కడువడిఁ గొట్టియుఁ, బీడించియు విజృంభించుచున్నారు. మఱియు నేఁడు వజ్రకల్పమగు మకరవ్యూహమును జొచ్చి సైన్యములను మూర్ఛనొందించి భీముఁడు నన్నెంతయుఁ బీడించినవాఁడు. క్రుద్ధుఁ డగునాతనిఁ జూచుటను గల్గినభయముచే మూర్ఛితుఁడనైన నాకిప్పటికి శాంతి యొదవకున్నది. ఓసత్యప్రతిజ్ఞా! నీయనుగ్రహముచేఁ బాండవులను జంపి జయమునొందఁ దలంచియున్నవాఁడను." అని పలుక విని మహాత్ముఁడగు భీష్ముఁ డాసుయోధనుని దుఃఖితునిగా నెఱిఁగి యిట్లు పలికెను.

"ఓరాజా! మిక్కిలి ప్రయత్నముచే నెల్లవిధముల వెనుదీయక పాండవసైన్యమునుజొచ్చి నీకు జయమును సుఖమును గలిగింప నుత్సాహముతోఁ బనిచేయుచున్నవాఁడను. నీకార్యమున నాశరీరమును దాచుకొనలేదు. ఇప్పాండవవీరులన్నరో శూరులును, మహారథులు, నస్త్రవేత్తలును నై శ్రమలకోర్చి యుద్ధసాహాయ్య మొనర్పఁ బూనియున్నవారు. క్రోధవిషము గ్రక్కుచున్నవారు. కావున వీర్యశాలులగువారు నీతో వైరముగొనియున్నను వారి నిపుడు సులభముగా జయింప వలనుపడదు. అయినను వీరులనెదుర్కొని జీవితాశ విడిచి యుద్ధముచేయువాఁడను. ఓమహానుభావా! నీవిషయమున నాజీవితమును రక్షించుకొనఁ దలంపలేదు.నీయీ కార్యముపట్ల దేవదానవులతోఁ గూడిన మూఁడులోకములను భస్మీకరింపఁదలంచువాఁడనుగదా! నీ శత్రుల నుపేక్షింతునా? ఓరాజా! తప్పక యప్పాండవుల నెదుర్కొనెదను. నీకుఁ బ్రియమొనర్చెదను."

అది విని సుయోధనుఁ డెంతయు నలరి ధైర్యమొందెను. పిదప రాజలోకమును జూచి "ఓయీ! మీమీసైన్యములను యుద్ధసన్నద్ధ

ములఁ గావింపుఁ"డని ప్రోత్సహించెను. అంత నాతనియాజ్ఞ శిరసా వహించి రథగజాశ్వపాదాతులుగల నీసైన్యములు నానావిధాయుధములువట్టి వెడలిరి. ఆసేనలసమ్మర్దముచే జనించినపరాగములు సూర్యకిరణములను గప్పసాగెను. రథములందును, నేన్గులందును గూరుచుండినవారిచేఁ ద్రిప్పఁబడుఖడ్గములు మింట మేఘములతోఁ గూడినమెఱపులవలె విరాజిల్లుచుండెను. రాజకుమారులధనుష్టంకారములు ఘోరమగుసంకులధ్వనులఁ బ్రకటింపసాగెను. అయ్యది వెనుక దేవాసురులచేఁ దఱువఁబడుసముద్రముఘోషము ననుకరించియుండెను. అట్టియుగ్రధ్వనులతోడను, బహువిధము లగు వర్ణములతోడను గూడిన నీవారిసైన్యము వైరిసైన్యమారకమై యుగాంతమేఘసమూహమునాఁ గానవచ్చెను" అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

సప్తమదివసయుద్ధారంభము

"ఓమహారాజా! పిదప నేదియో ధ్యానించుచున్న నీకొమరునిఁ జూచి, మఱియు నాభీష్ముఁ డాతనికి హర్షము గలుగునట్లుగా నిట్లు పలికెను.

"ఓయీ! నేను, ద్రోణుఁడును, శల్యుఁడు, కృతవర్మయు, అశ్వత్థామయు, వికర్ణుఁడు, సోమదత్తుఁడు, సైంధవుఁడు, నవంతిదేశాధీశు లగువిందానువిందులును, బాహ్లికుఁడు, త్రిగర్తాధీశుఁడు, మాగధుఁడు, బృహద్బలుఁడు, చిత్రసేనుఁడు, వివింశతి, మఱియు వేలకొలఁదిరథములును, గొప్పధ్వజములును, నుత్తమజాతిహయములును, మదించినయేన్గులును, బదాతులును, నానాయుధవేత్త లగుశూరులును నీకై పోరాడ సోత్సాహులై యుండిరి. ఇంకను వీరుగాక మఱికొందఱును నీకై జీవితేచ్ఛల విడిచియున్నవారు. వీరెల్ల సంగ్రామమున దేవతలనుసైతము జయింప సమర్థులని నాయభిప్రాయము. ఓరాజపుత్రా! నీకు నేనెల్లపుడును హితము చెప్పవలసియే యున్నది. ఇంద్రునితోఁ గూడినదేవతలకును బాండవులు జయింప వలనుపడనివారు. మఱియు మహేంద్రవిక్రము లగు నాపాండవులకు వాసుదేవుఁడు సహాయుఁడై యున్నవాఁడు. కావున వారెల్లవిధములఁ బ్రహరింతురు. ఓరాజా! నీమాటచొప్పున వర్తించువాఁడను. కాని పాండవులు నన్ను జయింతురో వారిని నేనే

జయించువాఁడనో తెలుపఁజాలను" అని పలికి యాసుయోధనునకు వీర్యవంతమై విశల్యకరణి యను నొకయోషధినిచ్చి యాతనిదుఃఖరహితునిఁగా నొనర్చెను. అంతఁ బ్రభాతమగుట నెల్లసైన్యములతోఁగూడి వ్యూహకుశలుండగుభీష్ముఁడు మండలమను నొకవ్యూహమును బన్నెను. అయ్యది నానాశస్త్రసమాకులమై వేలకొలఁది రథగజాశ్వపదాతులతో నిండియుండెను. అందొక్కొకయేన్గున కేడేసిరథములును, నొకరథమున కేఁడేసిగుఱ్ఱములును, నొకగుఱ్ఱమునకుఁ బదుగురుధనుర్ధరులును, నొక ధనుర్ధరునకు నేఁడుగురు కవచధారులును నుంచి నీసైన్యము నొక వ్యూహముఁగా నేర్పఱచెను. అటు లొనర్చి యామహాసైన్యమునకు భీష్ముఁడు పాలకుఁడై యుండెను. పదివేలగుఱ్ఱములును, బదివేలయేన్గులును, బదివేలరథములును గూర్చికొని నీకొడుకులు కవచధారులై పితామహునకు రక్షకులై యుండిరి. ఆశూరుల కాతఁడు రక్షకుఁడై యుండెను. మఱియు మహాబలులగురాజులు సన్నద్ధులై యుండిరి. పిదప సుయోధనుఁడు రథ మధిష్ఠించి యింద్రుఁడు త్రివిష్టపమునందువలె విరాజిలుచుండెను. పిమ్మట నీపుత్రులరథఘోషమును, వాద్యములమహాధ్వనియు దిక్కుల బిక్కటిల్లెను. అంత ధార్తరాష్ట్రులసైన్యమును దోడ్కొని భీష్ముఁడు పశ్చిమముఖముగా వెడలెను. ఆమండలమహావ్యూహము వైరులకు భేదింపరానిదై యుండెను. పరమదారుణమై శత్రుదురాసదమగు నామండలమహావ్యూహమును గాంచి ధర్మజుఁడు వజ్రమనెడి వ్యూహమును సంఘటించెను. అటు లారెండుసైన్యములును వ్యూహములుగా నేర్పడి తమతమస్థానములందుండెను. పిదప యోధులు సింహనాదము లొనరించిరి. యుద్ధోత్సాహు లగు నుభయసైన్యములశూరులును బ్రహరించుకొనుచు నావ్యూహములను భేదింపసాగిరి. అపుడు ద్రోణుఁడు విరాటుని, నశ్వత్థామ శిఖండిని, సుయోధనుఁడు ధృష్టద్యుమ్నునిఁ దలపడిరి. నకులసహదేవులు శల్యునిఁ దాఁకిరి. విందానువిందు లిరావంతు నెదుర్కొనిరి. నీయోధులగుక్షత్రియులందఱును నర్జును మార్కొనిరి. భీముఁడు కృతవర్మ నెదుర్కొనెను. నీపుత్రులగుచిత్రసేన వికర్ణదుర్మర్షణులను నభిమన్యుఁడు గవిసెను. ఘటోత్కచుఁడుభగదత్తుని మత్తగజము మదగజమునువలె మార్కొనియెను. ఓరాజా! పిదప నలంబుసుఁడు సాత్యకిని, భూరిశ్రవుఁడు ధృష్టకేతునిఁ దలపడిరి.

ధర్మజుఁడు శ్రుతాయుషు నెదుర్కొనియెను. చేకితానుఁడు కృపునిఁ దాఁకెను. మిగిలినమఱికొందఱు భీమునిఁ దలపడిరి. ఇంకను గలరాజ లోకము పార్థుని నెదుర్కొనియెను. వీరెల్ల నానాయుధములను ధరించి యుండిరి. అపు డర్జునుఁడు కుపితుఁడై వాసుదేవునితో "ఓమాధవా! కౌరవసైన్యమును జూచితే? వ్యూహవేత్తయు మహాత్ముఁడు నగు గాంగేయునిచే నీవ్యూహము సంఘటింపఁబడియెను. యుద్ధాభిలాషులై యున్న యీశూరులను గాంచితివా? ఓమాధవా! సోదరులతోఁగూడి యున్న త్రిగర్తరాజును జూడుము. ఓజనార్దనా! నీవు చూచుచుండఁగా నిదె యిపుడే వీరినెల్లఁ జంపెదను. వీరు నాతో యుద్ధ మొనర్ప నుత్సాహపూరితులై యున్నవారుగదా!" అని పలికి గాండీవము సవరించి రాజలోకముపై శరవర్షముసుగురిపించెను. వారును నాతని శరవర్షమున ముంచిరి. అపుడు వర్షకాలమున వారిధారలచేఁ దటాకమువలె నారణరంగము పూరింపఁబడియెను. నీసైన్యమున హాహాకారములు జనించెను. అపుడు శరవర్షముచేఁ గప్పఁబడినకృష్ణార్జునులఁ జూచి దేవ గంధర్వులును, దేవర్షులును, నురగులును విస్మయమందిరి. ఓరాజా! అపు డర్జునుఁడు కుపితుఁడై యైంద్రాస్త్రమును బ్రయోగించెను. ఆ యర్జునుపరాక్రమము నపు డద్భుతముగాఁ గాంచితిమి. అతఁడు వైరి ప్రయుక్తము లగునస్త్రజాలములను వారించుచుండెను. ఆతనిఁచే గొట్టఁ బడనివాఁ డొకఁడును నందుఁ గానరాఁడయ్యెను. అందుఁగల రాజసహస్రములయు, గజాశ్వములయు, సమూహమునఁ బ్రతిప్రాణియు నొని రెండుమూఁడుబాణప్రహారములను దినకుండినది లేదు. అటు లతఁడు ప్రహరించుట కోరువలేక వీరలెల్ల గాంగేయునిఁ జేరికొనిరి. అటులాపన్ను లగుకౌరవులకు భీష్ముఁడే శరణమయ్యెను. ఎల్లెడలను బడు నా యర్జునుబాణములచే భగ్నమైన మీవారిసైన్యము వెనుగాలిచేఁ గలఁతపడినసాగరమువలెఁ జనించెను." అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

### కురుపాండవుల ద్వంద్వయుద్ధము

"ఓరాజా! మహాత్ముఁ డగుపాండవమధ్యమునిచే నాసంగ్రామమున వీరులెల్ల హతులగుటను సుశర్మ మఱలఁగా, మహార్ణవతుల్య మగు

సైన్యము కలఁతపడుచు గాంగేయునిఁ జేరఁగా, నపుడు దుర్యోధనుఁ డాపార్థునిపరాక్రమము నారసి కడువడిగా వెడలి రాజలోకములోఁ బ్రధానుఁ డగుసుశర్మతో "ఓయీ! ఈ మనభీష్మాచార్యుఁ డర్జునుతోఁ బోరాడ సమకట్టియున్నవాఁడు. ఇపు డీతఁ డెల్లవిధములఁ బ్రయత్నించి తనజీవితమునైన లక్ష్యముసేయక సైన్యముతోఁ గూడియున్న యర్జును నెదుర్కొనును. కావున మీ రెల్ల సన్నద్ధులై యాతని రక్షింపవల యును" అని తెలుప విని వారెల్ల నాతని యానతిచొప్పునఁ బితా మహునిఁ జేరియుండిరి. అంత శాంతనవుఁడు కడువడిగా నాకవ్వడిని దలపడియెను. అర్జునుఁడును దెల్లనిగుఱ్ఱములతోఁ బూన్పఁబడి, వెలుపు గొలుపు వానరచిహ్నమును మేఘధ్వనియుఁ గలరథము నధిష్ఠించి యెంతయు విరాజిల్లుచు భీష్ము నెదుర్కొనియెను. అపుడు విక్రమశాలి యగునర్జునునిఁ, బగ్గములుపట్టుకొని రెండవచండభానునివలె వెలయు శ్రీకృష్ణునిఁ గాంచి వెఱపుగదురనున్న నీవారిసైన్యమున గొప్పచప్పు డుప్పతిల్లెను. మధ్యందినమార్తాండునివలె నాతని నెవ్వరును జూడఁజాల కుండిరి. అటులే శ్వేతాశ్వుఁడును, శ్వేతకార్ముకుఁడు నగుశాంతనవునిఁ జూచి యుదయించిన శ్వేతగ్రహమునుబోలె నారయలేక పాండవసైన్యము వైముఖ్యమొందసాగెను. మఱియు నాభీష్మునకు భాతృపుత్త్రసహితు లగుత్రిగర్తులు సహాయులుగాఁ బరివేష్టించియుండిరి. మఱికొందఱు మహారథులును నాతనికిఁ గావలిగా నుండిరి. పిదప ద్రోణుఁడు విరటునిఁ దాఁకి యొకకోలచే నాతనిధ్వజమును వేఱొకబాణముచే వింటిని నఱికెను. అంత సేనాపతియగువిరాటుఁ డావిల్లువిడిచి వేఱొకదృఢమగు ధనువుగొని విషముగ్రక్కు పన్నగములువలెఁ బ్రజ్వలించుబాణములు మూఁడిటిని బఱపి నాల్గిటిచే నాతనిగుఱ్ఱములను నొకకోలచే ధ్వజ మును, నైదుబాణములచే సారథిని, నొకశరముచే ధనువును గొట్టెను. అందులకుఁ గుపితుఁడై యాబ్రాహ్మణోత్తముఁడు దిగిచివైచిన యెని మిదివాఁడికోలలచే నావిరటునిగుఱ్ఱములను జంపి, మఱియు నొకబాణ ముచే వానిసారథిని గూలఁద్రోసెను. అపు డావిరటుఁడు హతాశ్వుఁ డును, హతసారథియు నగుట రథమునుండి దిగి వడిగా శంఖునిరథ మధి ష్ఠించి యాతండ్రికొడుకు లిరువురును నొకరథమందుండియే ద్రోణుని శరవర్షమున ముంచిరి. ద్రోణుఁ డందులకుఁ గుపితుఁడై యొకతీవ్ర

బాణము నాశంఖునిపైఁ బ్రయోగించెను. అయ్యది యాశంఖునివక్షముఁ జీల్చి రక్తమునుద్రావి పుడమిని బ్రవేశించెను. అటులు ద్రోణబాణహతుఁడగుశంఖుఁడు రథమునుండి నేలఁగూలెను. అంతఁ దనచెంతనే పడిన కొడుకును జూచి వెఱచి రణరంగమునుండి తొలఁగిపోయెను. ఆతని కాద్రోణుఁడు నోరుతెఱచినయముఁడువలెఁ గానవచ్చెను. పిదప వందలకొలఁది వేలకొలఁది పాండవసైన్యమును ద్రోణుఁడు నివారించుచు వచ్చెను. పిమ్మట శిఖండి యశ్వత్థామ నెదుర్కొని మూఁడు తీవ్రనారాచములచే నాతని బొమలనడుమఁ బ్రహరించెను. అపుడు లలాటమున నాఁటినయాబాణములచే నున్నతము లగుమూఁడుశిఖరములచే వెలయు మేరుగిరివలె నాయశ్వత్థామ విరాజిల్లెను. పిదప నాద్రౌణి యెంతయును గుపితుఁడై యొకయరనిముసమునఁ బెక్కునారాచములచే నాశిఖండిధ్వజమును, సూతుని, గుఱ్ఱములను, నాయుధమును గొట్టి నేలఁ బడవైచెను. అంత హతాశ్వ మగురథము డిగి యాశిఖండి, దారుగలిగి బాణములను వారింపఁదగు నొకఖడ్గమునుబట్టి డేగవలె లాఘవము మెఱయఁ జరించెను. కత్తి వట్టికొని యతఁడు చరించుచుండఁగా నాతనిఁ బ్రహరింప నవకాశ మాయశ్వత్థామకు లభింపదయ్యెను. అయ్యది యెంతయు నద్భుతమయ్యెను. మిక్కిలి కోపము గలయాద్రౌణి యాశిఖండిపై బహుశరసహస్రములు పఱపి సింహనాద మొనర్చెను. అటులు తనపైకివచ్చు శరసహస్రము నాశిఖండి, తనఖడ్గముచే ఖండించివైచెను. మఱియు నాయశ్వత్థామ ఱెక్కలు గలబాణములచే నాఖడ్గమును బ్రహరింపఁగా నది ఖండితమగుటను వెంటనే యాశిఖండి దానిని సానవెట్టి యాద్రౌణిపై విసరెను. కాలాగ్నితుల్యమై విషముగ్రక్కు పామువలెఁ దనపైకి వచ్చు నాఖడ్గమును దనశరలాఘవము మెఱయ ఛేదించి, మఱియుఁ బెక్కుబాణములచే నాశిఖండి నాయశ్వత్థామ నొప్పింపఁగా నతఁ డందుల కోర్వలేక మహాత్ముఁ డగుమాధవునిరథ మధిష్ఠించెను. పిమ్మట సాత్యకి కుపితుఁడై క్రూరుఁ డగు నలంబుసరాక్షసు నెదుర్కొని యెల్లెడలఁ గ్రమ్ము ఘోరనారాచముల వానిపైఁ బఱపెను. అంత నారక్కసుఁ డాసాత్యకివిల్లు దునుగ నర్ధచంద్రబాణములచేఁ గొట్టెను. మఱియు నారక్కసుఁడు రాక్షసమాయను గల్పించి యాసాత్యకిని శరవర్షమున ముంచెను. అపుడు సాత్యకి చూపినపరాక్రమ

మునకు మే మెంతయు విస్మయమందితిమి. అతఁడు వాఁడిబాణములచే నటులు నొచ్చియు, నించుకేని సంభ్రమింపక యైంద్రాస్త్రమును బ్రయోగించెను. అయ్యది యర్జునునిచే సాత్యకికి లభించినది. అటులగుట నా యస్త్రరాజ మారాక్షసమాయను బటాపంచలుగా నొనరించి మఱియు ఘోరనారాచములచే నారక్కసుని వారిధారలచేఁ బర్వతమునువలె నాచ్ఛాదించెను. అంత నాశర ప్రహారముల కోరువక యారక్కసుఁడాసాత్యకిని విడిచి వెడలిపోయెను. అటు లాయజేయుఁ డగునలంబుస రాక్షసుఁ డోడుటయు, నా సాత్యకి నీయోధులు చూచుచుండఁగా సింహనాద మొనరించెను. పిదప నాసాత్యకి మఱియు నీవారిని బహువిధశర ప్రహారములచే నొప్పింపఁగా, వారు జడిసి పరువులిడ నారంభించిరి. ఇంతలో ద్రుపదపుత్త్రుఁడును బలశాలియు నగుధృష్టద్యుమ్నుఁడు నీ పుత్త్రుఁ డగుసుయోధనునిఁ దాఁకి శరవర్షమున ముంచెను. అటులు ధృష్టద్యుమ్న ప్రయుక్త మగు శరజాలమున మునిఁగిజడిసియు నీకొడుకు వెనుదీయక తొంబదితీవ్రబాణములచే నాతని నొప్పించెను. అయ్యది యద్భుతమయ్యెను. అందుల కలిగి ధృష్టద్యుమ్నుఁడు సుయోధనుని ధనువు ఖండించి మఱియు నాతనిగుఱ్ఱములు నాల్గిటిని గొట్టి యేఁడు వాఁడికోలలచే నాతని నొప్పించెను. అంత హతాశ్వమగురథమును విడిచి నీకొడుకు ఖడ్గపాణియై యాధృష్టద్యుమ్నునిపైకిఁ బరువిడెను. పిదప స్వామిభక్తుఁ డగుశకుని వడిగా వెడలి రాజరాజగు నాసుయోధనునిఁ దనరథముపై నెక్కించుకొనియెను. అంత నాధృష్టద్యుమ్నుఁ డటులు నీకొమరునిఁ బరాభవించి యింద్రుఁ డసురసైన్యమునువలె నీవారిసైన్యమును హతము గావింప మొదలిడెను. పిమ్మటఁ గృతవర్మ భీమునిఁ దలపడి పెనుమబ్బు సూర్యునివలె నాతని శరములచేఁ గప్పెను. శత్త్రుసంతాపకుఁ డగుభీముఁడు వానికోర్చి కుపితుఁడై యాకృతవర్మను దీవ్రబాణములచే నొప్పించెను. అతిరథుఁడును బలాధికుఁడు నగు నాకృతవర్మ యందులకుఁ జలింపక మఱియు నాభీముని వాఁడికోలలచే నొప్పించెను. పిదప మహాబలుఁ డగు నామహాబలసుతుఁడు కృతవర్మునిగుఱ్ఱములను గొట్టి సారథిని బడవైచి యలంకృత మగు ధ్వజమును గూల నేసెను. అంత శిథిలీకృతసర్వాంగుఁడై యాకృతవర్మ హతాశ్వ మగు తనరథము విడిచి తనకు బావ యగువృషకునిరథ మధిరోహించెను. ఇదియెల్ల నీ

కొడుకు చూచుచుండెను. భీముఁడును దండపాణి యగుసంతకుఁడు వలెఁ గుపితుఁడై నీవారిసైన్యముపైఁ బరువులిడి ప్రహరింపసాగెను." అని తెలుప విని ధృతరాష్ట్రుఁ డిట్లనియె.

## ద్వంద్వయుద్ధము.

"ఓసంజయా! మావారికిని బాండవులకును జరిగిన ద్వంద్వయుద్ధములఁగల యనేకవిచిత్రములను నీవలన వింటిని. కాని నా కెంతయు సంతస మొదవించునట్టిదాని నొకటియుఁ జెప్పవు. ఎల్లపుడును బాండవులే హర్షపూరితులై యుండుటను జయించుటను దెలుపుచున్నాఁడవు. అటులే మావారు నిస్తేజస్కులై యోడి ఖిన్నులగుచుండుటను దెలుపుచున్నవాఁడవు. ఓసంజయా! ఈసంగ్రామమున జయమనునది దైవాధీనమగుట నిస్సంశయము."

అది విని సంజయుఁడు "ఓభరతసత్తమా! నీవారు తమయుత్సాహము విడువక శక్తికొలఁది యుద్ధమునఁ బనిచేయుచుఁ బౌరుషమును చూపుచునే యున్నవారు. కాని సురనదియగుగంగ మధురోదకము మహోదధిసంపర్కమున క్షార మైనటులు మహాత్ములగు నీవారిపౌరుషమెల్ల వీరులగుపాండవులకడ నిస్సారమగుచున్నది. తమతమశక్తికొలఁది నీకుఁ గూర్చునట్టియు దుష్కరకర్మ మొనర్చునట్టి నీవారిపై దోషమూహింపఁదగదు. ఇదియెల్ల నీవును నీకొమారుఁడు నొనర్చిన గొప్పతప్పు గాని నీయోధులలోపముగాదు. ఇపుడు పుడమిని ఘోరమగు ప్రజాక్షయమై యమక్షయము నక్షయముగా నొనర్పక తప్పదు. నీదోషముచే నిట్టియిక్కట్టు గలుగుటను, నీవు శోకించుట తగదు. ఇఁక రాజలోక మీలోకమునఁ దమజీవితమును రక్షించుకొనఁజాలదు. ఈక్షత్త్రియులందఱును యుద్ధమున మరణించి పుణ్యాత్ములలోకములను గోరువారై సైన్యమునఁ బ్రవేశించి స్వర్గపరాయణులై యుద్ధముచేయుచున్నవారు. ఓమహారాజా! పూర్వాహ్ణమున గొప్పజనక్షయ మయ్యెను. దేవదానవులకయిన యుద్ధమునుబోలిన యాసంగ్రామమువిధము నెఱిఁగించెదను స్వస్థచిత్తుఁడవై వినుము. గొప్పసేనగలిగి మహాబలులై ధనుర్ధరులగు నవంతిదేశాధీశులు, విందానువిందులు రణోత్సాహులై గూడి యిరావంతు నెదుర్కొనిరి. అపుడు వారికి సంకులమై గగుర్పాటొదవించు

యుద్ధమయ్యెను. అంత నిరావంతుఁడు కుపితుఁడై దేవతుల్యులగు నా సోదరులను దిగిచివైచిన తీవ్రబాణములచే నొప్పింపఁగా, వారును నతని మఱల నొప్పించిరి. అటులు యుద్ధమొనరించువారిలో నెవ్వరియందును విశేష మగపడకుండెను. పరస్పరనాశమునకును దుల్యముగనే కృతప్రతీకారము లొనర్చుకొనుచుండిరి. అపు డిరావంతుఁడు నాల్గుబాణములచే ననువిందుని నాల్గుగుఱ్ఱములను యమమందిరమున కనిపి మఱిరెండు తీవ్రభల్లములచే నాతనికేతువును ధనువును దునుమాడెను. అది యొంతయు నద్భుతముగాఁ గానవచ్చెను. అంత నాయనువిందుఁడు విందునిరథ మధిరోహించి దృఢమై యుత్తమమగు నొకవిల్లు పూనియుండెను. పిదప నావిందానువిందు లిరువురు నొకరథముననుండియే మహాత్ముఁడగు నిరావంతునిపై శరవర్షము గురియఁ దొడంగిరి. అపుడు వారిచేఁ బ్రయుక్తములై కాంచనభూషితములై మహావేగముగల శరపరంపరలు దివాకరునిఁ గప్పి యాకసము నెల్లెడల వ్యాపించెను. అందుల కాయిరావంతుఁ డెంతయుఁ గుపితుఁడై మహారథులగు నా సోదరులు నిరువురను శరవర్షమున ముంచి వారిసారథిని బడఁద్రోసెను. అపు డటులు వారిసారథి ధారుణిఁ గూలుఁడు గుఱ్ఱములు రథమునీడ్చికొని రణాంగణమునుండి తొలఁగెను. అంత నాయులూపికొడుకు వారి నోడించి తనపౌరుషము వెలయునట్లుగా నీ వారిసైన్యమును బీడించెను. అపుడటులు పీడితమగు మనవారిమహాసైన్యము విషముద్రావినమానవునివలె మహావేదన నొందెను. పిదప ఘటోత్కచుఁడు భగదత్తుని మార్కొనియెను. అతనిరథ మాదిత్యునివలె వెలయుచుండెను. భగదత్తుఁ డొకగజోత్తమము నధిష్ఠించి మున్ను దేవాసురయుద్ధమున వెడలినయింద్రునివలెఁ గానవచ్చెను. అపు డచ్చోటికి వియచ్చరులగు దేవగంధర్వులును, ఋషులును జూడవచ్చిరి. కాని వారి కాఘటోత్కచభగదత్తులయం దొకవిశేష మేమియుఁగానఁబడదయ్యెను. మున్ను కుపితుఁడైనయింద్రుఁడు దానవులనువలె నాభగదత్తుఁ డాపాండవసైన్యములను జెదరఁజేసెను. ఆతనిచేఁ బఱుమఁబడి పరువులిడు నప్పాండవసైన్యమున కందు రక్షకుఁ డెవ్వఁడు గానరాఁడయ్యెను. ఓరాజా! మఱియు నపు డారథమున ఘటోత్కచుఁడు కానరాఁడయ్యెను. అటులగుటఁ దక్కినయాతనిసైన్యము మనసుచెడి యందు నిలువక వెడలి

పోయెను. అటులు పాండవసైన్యము మఱలుడు నీసైన్యమున ఘోర మగు వేదన నెఱిఁగించుధ్వని యొకటి యుత్పత్తిల్లెను. అపుడు ఘటోత్కచుఁడు మఱల భగదత్తుని పెనుమబ్బు మేరుగిరినివలె శరవర్షముచే ముంచెను. అంత నాభగదత్తుఁ డారాక్షసుఁడు ప్రయోగించినశర జాలము ఖండించి వడిగా నాఘటోత్కచునిమర్మములు నాఁటునట్టులు గొట్టెను. అంత నాఘటోత్కచుం డెంతయుఁ గొట్టువడియుఁ, గొండవలె నించుకయుఁ జలింపఁడయ్యెను. అంత నాభగదత్తుఁడు మఱియు నలిగి పదునాల్గుతోమరము లాతనిపై వైవ వాని నాఘటోత్కచుఁడు ఖండించెను. అటులు వాఁడికోలలచే వానితోమరములను ఖండించుటయే గాక వజ్రతుల్యము లగుడెబ్బదిబాణములచే నాఘటోత్కచుఁ డతని నొప్పించెను. అందులకుఁ గోపమొదవ నాభగదత్తుఁ డాతనిగుఱ్ఱముల నాల్గిటి నీల్గునటులు ప్రహరించెను. ప్రతాపనిధి యగుఘటోత్కచుఁ డటులు హతాశ్వ మగురథమందే నిలిచి, యాప్రాగ్జ్యోతిషుని గజముపై నొకశక్తిని విసరెను. అపు డాభగదత్తుఁడు తనపై కివచ్చు తీవ్రవేగము గల యాశక్తిని నఱుకఁగా, దానిహేమదండము మూఁడుఖండములై పడియెను. అంతఁ దనశక్తి ముక్కలగుడు ఘటోత్కచుఁడు వెఱచి, యింద్రునకు వెఱచిన నముచివలె యారణరంగమునుండి వెడలిపోయెను. యమునకును వరుణునకును నోడింపరాని విక్రమశాలి యగు నాఘటోత్కచుని జయించి, యాభగదత్తుఁడు తనయేన్గుతోఁ బాండవసైన్యమును మర్దింపసాగెను. ఓ రాజా! అపు డతఁడు సరోవరముఁ జొచ్చిన మహా వనగజమువలెఁ గానవచ్చెను. పిమ్మట మద్రేశ్వరుఁడగుశల్యుఁడు నకుల సహదేవుల నెదుర్కొని యామేనల్లురఁ దనశరములచేఁ గప్పెను. అపుడు తన్నెదుర్కొనినమామను గాంచి సహదేవుఁడు మేఘుఁడు దివాకరునివలె నాతని బాణములచేఁ గప్పెను. అంత నాశల్యుఁడు మేనల్లునిశరవర్షమునఁ గప్పఁబడియు నుప్పొంగెను. వారికిని దమతల్లి సంబంధియగుట నాతనిపైఁ బ్రీతిగలిగెను. పిదప నాశల్యుఁడు నగుచు నకులునిగుఱ్ఱములు నాల్గిటిని నాల్గుబాణములచేఁ గొట్టి యమమందిర మందురలోఁ బ్రవేశ పెట్టెను. అంతన నానకులుఁడు తనరథము హతాశ్వ మగుట సహదేవునిరథ మధిష్ఠింపఁగా రణశూరు లగువా రిరువు రొక రథమందుండి ధనువులుపూని కుపితులై యామద్రరాజును శరవర్షమున

ముంచిరి. కాని యచలమువలె నాశల్యుఁ డందులకుఁ జలింపకయుండి యాశరవృష్టి నొకనిమేషమున నివారించెను. పిమ్మట సహదేవుఁడు కుపితుఁడై యొకతీవ్రశరము నామద్రాధిపతిపైఁ బఱపఁ నది గరుడునివలెఁ గడువడిఁ బోయి యాతని నొప్పించి పుడమిని నాటికొనియెను. అప్పు డాశల్యుఁ డెంతయు నొచ్చి యారథమునఁ గూలఁబడి మూర్ఛవడియెను. అటులు మూర్ఛవడి చైతన్యము తప్పియున్న యాశల్యుని వానిసారథి యుద్ధరంగమునుండి తీసికొనిపోయెను. అటు లానకులసహదేవుల కోడి పరాఙ్ముఖుఁడైన యాశల్యునిరథము నారసి నీతనయులెల్ల ఖిన్నులై యేమియు నుపాయము దెలియనివారై యుండిరి. అంత నామాద్రేయులు మామను జయించి మోదమానమానసులై సింహనాదము లొనర్చి తమతమశంఖములను బూరించి, మఱియు నింద్రోపేంద్రు లా దానవసైన్యమునువలె నీసైన్యమును దఱుమనారంభించిరి.” అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## సుశర్మార్జునులసమాగమము

“ఓయాంబికేయా! అప్పటికి రెండుజాములై యుండెను. అంత యుధిష్ఠిరుఁడు తనగుఱ్ఱములను వడిగా నడుపుచు శ్రుతాయుషునిపైకి వెడలి తివిచివైచిన తీవ్రబాణములచే నాతనిఁ బ్రహరించెను. వాఁడును నప్పాండవాగ్రజు నేఁడు వాడికోలలచే నొప్పించెను. వానిప్రహారము లాధర్మజునికవచము భేదించి రక్తమును ద్రావి యామహాత్మునిప్రాణములు వెడలినవివోలెఁ గానవచ్చెను. అటు లెంతయు నొచ్చి కుపితుఁడై యతఁ డాశ్రుతాయుషుని వరాహకర్ణమనెడి యొకబాణముచేఁ గొట్టిమఱియు నొకతీవ్రభల్లముచే వానికేతువు భూతలపాతమొందునటులు గొట్టెను. అంతఁ దనధ్వజము తునుఁగ నాశ్రుతాయుషుఁడు వాఁడిగలయేఁడుకోలలచే ధర్మజుమర్మములు నాటనేసెను. అందులకు యమసూనుఁడగుయుధిష్ఠిరుఁ డెంతయు మండిపడుచు యుగాంతమునఁ బ్రాణులను దహించు నగ్నివలెఁ గానవచ్చెను. ఓమహారాజా! అటులు కుపితుఁడైనయప్పాండవాగ్రజునిఁ జూచి దేవగంధర్వరాక్షసులు ఖేదమొందిరి. లోకమెల్ల నాకులమైయుండెను. ఎల్లభూతములకును “ఈధర్మజుఁ డిపుడు ముల్లోకములను గాల్చునేమో” యనునూహలు గలిగెను. మహర్షులును దేవ

తలును లోకశాంతికై స్వస్తిసంఘటింపసాగిరి. అంత నాధర్మజుఁ డటులు కుపితుఁడై పెదవులతుదిని దడువుచు దనమేను యుగాంతరవితుల్యమై కన్పడునట్లుగాఁ జరించుటకు, నీవారిసైన్యములెల్లఁ దమజీవితములం దాశవిడిచికొనిరి. అపుడు యుధిష్ఠిరుఁడు కొంతవడికి ధైర్యముచేఁ గోపము నాపికొని, యాశ్రుతాయుష్మని ముంజేతఁ గొట్టి యాతనివిల్లు ద్రుంచి మఱియు నొక నారాచముచే వక్షముకు భేదించి యెల్లసైన్యము లును గాంచుచుండఁగా నాతనిగుఱ్ఱములను గూల్చెను. అంత నాశ్రు తాయుష్మఁడు హతాశ్వమగురథమువిడిచి ధర్మజునిపరాక్రమమున కోరు వక కడువడిగావెడలిపోయెను. అట్టిపరాక్రమనిధి యాధర్మజునిచేఁ బరా జితుఁ డగుటకు మనవారిసైన్యము పరాఙ్ముఖ మైయుండెను. ఓరాజా! యుధిష్ఠిరుఁ డిటులొనర్చి ప్రాణులను మ్రింగంగడంగుకాలునివలె నీవారి సైన్యములను బ్రహరింపసాగెను. పిదపఁ జేకితానుఁడు కృపునిఁ దాఁకి శరవర్షమును గురియ, వాని నాకృపుడు నివారించి మఱియు నాచేకితా నునిఁ దీవ్రశరములచే నొప్పించి, మఱియొకభల్లముచే వానివిల్లు దును మాడి, కరలాఘవము మెఱయ మఱియొకకోలచే వానిసారథినిఁ బడ ద్రోసి, మఱియు వానిగుఱ్ఱములను బార్ష్ణిసారథులను గూలనేసెను. అపుడు వాఁ డారథము విడిచి యొకగదను బూని దానిచే నాకృపుని గుఱ్ఱములను సారథిని గూలద్రోసెను. అంత నాకృపుఁడు పుడమి నుండియే వానిపైఁ బదునాఱుబాణములను బ్రయోగింపఁగా నవి యాచేకితానునికవచమును భేదించి పుడమిని బ్రవేశించెను. అందుల కాచేకితానుఁ డలిగి తనకేలనున్నగద నాకృపునిపై విసరెను. అపుడు వాఁడు వృత్రవధాకాంక్షి యగుపురందరుఁడునాఁ జూపట్టెను. అంతఁ దనపైకివచ్చు పాషాణగర్భ మగునాచేకితానునిగదను బెక్కునారాచ ములచే నివారింపఁగా, నపుడు మఱియు నాచేకితానుఁ డొకకత్తి నొఱవెఱికి శరీరలాఘవము మెఱయ నాకృపునిపైకిఁ బరువిడెను. ఇపుడు కృపుఁడును తనధనువు పరిత్యజించి వాఁడిగలఖడ్గము పట్టికొని కడు వడిగా నాచేకితాను నెదుర్కొనియెను. ఖడ్గకవచధారులై బలసంపన్ను లగు నాయిరువురును దారుగలతమకరవాలములచేఁ బరస్పరముఁ బ్రహ రించుకొనిరి. వారు కొంతసేపటులు పోరాడి పుడమిఁబడుచు లేచుచు

నలసియుండునంత నాచేకితానునిమిత్త్రుఁడగు కరకర్షుఁ డందులకు వచ్చి యెల్లవారు నరయుచుండఁగా నాతనిఁ దనరథముపై నిడికొనిపోయెను. ఓరాజా! అంత నీబావయగుశకుని రథికోత్తముఁ డగు నాకృపునిఁ దనరథమునఁ గూరుచుండఁబెట్టికొనియెను. పిదప ధృష్టకేతువు కుపితుఁడై భూరిశ్రవునిఁ దాఁకి తొంబదిబాణములచే నాతనివక్షమును గొట్టెను. ఓమహారాజా! అప్పు డాభూరిశ్రవుఁడు తనయురమున మెఱయుశరములచేఁ గిరణములతో వెలుఁగునాదిత్యునివలెఁ గానవచ్చెను. అపుడు కుపితుఁడై యాభూరిశ్రవుఁడు ధృష్టకేతునిసూతునిగుఱ్ఱములను గూల్చి విరథునొనర్చి, మఱియు నాతని శరవర్షమున ముంచెను. అంత నాధృష్టకేతువు తనరథము విడిచి శతానీకునిరథ మధిరోహించెను. ఓరాజా! పిదపఁ జిత్రసేనుఁడును వికర్ణుఁడును, దుర్మర్షణుఁడును సువర్ణకవచధారులై యభిమన్యు నెదుర్కొనిరి. అప్పు డాయభిమన్యునకును వారికిని ఘోరమగుయుద్ధ మయ్యెను. ఓరాజా! వారిపోరు వాతపిత్తకఫములు మూఁడిటితో శరీరమునకు జరిగినపోరునాఁ జూపట్టెను. అప్పు డాయభిమన్యుఁడు నీకొమరులను విరథుల నొనరించి భీమునిమాట స్మరించి ప్రహరింపసాగెను. పిమ్మట గజరథాశ్వములతో వెడలిన వేలకొలఁదిక్షత్త్రియులకు భయంకరమై దేవదానవులకును నోర్వరాని గొప్పసంగ్రామ మారంభమయ్యెను. అపుడు నీపుత్త్రులను రక్షించుటకై మహారథుఁడును బాలుఁడు నసహాయుఁ డగు నభిమన్యుని నీవారెల్లఁ బరివేష్టింపఁగడంగిరి. అదిచూచి యర్జునుఁడు వాసుదేవునితో "ఓదేవా! ఆక్షత్త్రియసమూహముకడకు మనరథము పోనిమ్ము. అందు రణగర్వితులును గృతాస్త్రులు నగు పెక్కురుశూరులు విజృంభించి మనసైన్యములను నశింప సమకట్టియున్నవారు" అని తెలుప విని యావాసుదేవుఁ డందులకు రథమును వడిగా నడిపెను. అటు లాయర్జునుఁడు కుపితుఁడై నీవారిసైన్యములపైకి వెడలుటను గాంచిన నీవారిసైన్యములందు హాహాకారములు జనించెను.

పిమ్మట నాధనంజయుఁ డాభీష్మరక్షకు లగురాజులను గాంచి యందు, సుశర్మతోఁ "ఓయీ! నిన్ను నేనెఱుఁగుదును. నీవెంతయును వీరుఁడవును, నాకుఁ బూర్వవైరివినైనవాఁడవు. మఱియు నాకు నీతోడి యుద్ధము సంభవించినది. దీనికిఁ దగుదారుణఫలమును గాంచెదవు.

మున్ను నాచే యమమందిరమున కనుపఁబడిన నీపితామహులను నీ కిపుడు చూపువాఁడను" అని పలికెను.

అట్టి పరుషవచనములను వినియు, నాసుశర్మ యేమియు మాఱు పలుకక తనకు శుభమెగాని యశుభమెగాని యగుఁగాక యని తలంచి యూథనాథుఁ డగునాతఁడు పెక్కురుక్షత్రియులు తనకు సహాయులుగా నీపుత్త్రులతోఁగూడి వెడలి యర్జును నలుదెసల ముట్టడించి మేఘములు దివాకరునివలె నర్జునుని శరపరంపరలచేఁ గప్పెను. అపుడు రక్తోదకము లెల్లెడల వెడల భయంకరసంగ్రామమయ్యెను" అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## చిత్రసేన రథభంగము

"ఓరాజా! అపు డటులు వారిశరప్రహారములకు నొచ్చి యర్జునుఁడు తోఁకద్రొక్కినపామువలె బుసకొట్టుచు, నొక్కొకబాణముచే నామహారథికులధనువులెల్లఁ దునియనేసెను. అటులు వారిచాపములను ఖండించి మహాత్ముఁ డగునాతఁ డొకక్షణములో బహువిధశరప్రహారములచే వారినెల్ల నిశ్శేషము గావించెను. ఓరాజా! ఆరాజులెల్ల నయ్యాజిరంగమున నర్జునశరపీడితులగుట రక్తసిక్తాంగులై యెల్లెడలఁ బడియుండిరి. అటు లారణరంగమునఁ బడిన రాజపుత్త్రులను జూచి సుశర్మ రథముతో వెడలెను. పిదపఁ బరాజితు లగురథికులపృష్ఠరక్షకు లగుముప్పదియిద్దఱురథికు లప్పార్థునిఁ దలపడి వింధ్యక్కెడి మేఘము లుదకధారలచే మేరుపర్వతమునువలె శరధారలచే ముంచిరి. వారటులు తన్ను నొప్పింపఁగా నప్పాండవమధ్యముఁడు కుపితుఁడై యఱువదితీవ్రబాణములచే నాపృష్ఠరక్షకులను గొట్టి, పరాజితుల నొనర్చి ప్రీతచిత్తుఁడై భీష్మునిఁ జంపుటకై త్వరపడుచు రాజులనెల్లఁ జంపనారంభించెను. అంత నా సుశర్మ హాతు లగు తనబంధుజనులఁ జూచి కొందఱుక్షత్త్రియులను ముందిడికొని పార్థుని వధించుటకై వెడలెను. అటు లారథికు లర్జును ముట్టడించుటను జూచి శిఖండి మున్నగుపాండవయోధు లాతని రక్షించుటకై వెడలిరి. అంత నాయర్జునుఁ డాత్రిగర్తులను, బహువిధశరప్రహారములచే నోడించి భీష్మునిఁ జేరఁబోవుచు, దుర్యోధనుఁడు సైంధవుఁడు మున్నగురాజులను గాంచి, వారి నొకరెండుగడియలలోఁ దొలఁగించి

గాంగేయుని సమీపించెను. అపు డచ్చోటికి ధర్మజుఁడును వచ్చియుండెను. అటులే నకులసహదేవులతో భీమసేనుఁడును వచ్చెను. వారెల్ల నాగాంగేయునిఁ దలపడిరి. అటులు మహారథులు నుగ్రబలులు నగుపాండవులందఱును గలిసి తన్నెదుర్కొని శరపరంపరలఁ గురిసినను, మహాత్ముఁడును, చిత్రయోధియు నగునాభీష్ముఁ డించుకయు నొవ్వకుండెను. పిమ్మట నుగ్రబలుఁ డగుసైంధవుఁడు, వచ్చి యామహారథులధనువుల ఖండించెను. అటులే దుర్యోధనుఁడును గుపితుఁడై యుధిష్ఠిరుని భీమనకులసహదేవులను దీవ్రబాణములచే నొప్పించెను. అంత శల్యుఁడును, శలుఁడును, గృపుఁడును, చిత్రసేనుఁడును బహువిధశరప్రహారములచే యుధిష్ఠిరాదులను నొప్పించిరి. అపు డప్పాండవులు, మున్ను దానవులు ముట్టడించిన దేవతలవలెఁ గానవచ్చిరి. పిమ్మట భీష్ముఁడు శిఖండిధనువు ఖండించెను. అపుడు యుధిష్ఠిరుఁడు శిఖండిని గాంచి కోపముతో, "ఓయీ! నీవు మున్ను నీతండ్రి వినుచుండఁగా భీష్మునిఁ దప్పక చంపెదనని నాతో నటులు పలికితివి. మహావ్రతుఁ డగుదేవవ్రతుని నాతీవ్రబాణములచే మడియించెదనని ప్రతిజ్ఞయును జేసితివి. కాని యిపు డాతని వధింపక వ్యర్థప్రతిజ్ఞుఁడవైతివి. కావున నిజధర్మమును గీర్తిని వంశమును గాపాడికొనుము. నీప్రతిజ్ఞను జెఱుచుకొనకుము. భీమపరాక్రముఁ డగు నీ భీష్మునిఁ జూడుము. ఇతఁడు మనసైన్యములనెల్లఁ దునుమాడుచున్నవాఁడు. మఱియు నాతఁడు నీవిల్లు ఖండింపఁగా యుద్ధాభిలాష విడిచి పరాజితుఁడవైతివి. నీబంధులను సోదరులను విడిచి నీవెందులకుఁ బోయెదవు? నీ కిది యించుకయుఁ దగనిపని. బలాధిక మగు మనసైన్యమెల్ల నీభీష్మునిచే నిటులు తఱుమఁబడుచుండుటఁ జూచియు భీతిచే నీవిటు లుపేక్షింతువా? ఓద్రుపదపుత్రా! నీవు నిశ్చయముగా జడిసితివి. నీముఖవికారమును జూడఁగా నటులే కానవచ్చెడిని. నిన్నుఁ దెలియక యర్జునుఁడు రణమొనర్పఁ బ్రోత్సహించినవాఁడు. ఓ వీరా! పుడమిని బేరుగాంచిన నీవిటు లీగాంగేయునకు జడిసెద వేల?" అని పలికెను. ఓరాజా! పరుషాక్షరములై విరోధోక్తిప్రచురము లగు నాధర్మజునివచనములు విని, యది యొకయాజ్ఞగా నెంచి యాశిఖండి భీష్మునిఁ జంపుటకై కడువడిగా వెడలెను. అటులు భీష్మునిపైకి వెడలిన యాశిఖండిని దుర్జయమును ఘోరము నగు నొకయాగ్నేయాస్త్రముచే

శల్యుఁడు నివారించెను. కాని యాశిఖండి యాతనియస్త్రమునకు మోహ మొందక యందే నిలిచి శరపరంపరచే దానిని బ్రతిహతముగా నొన ర్చును, మఱియు దానికిఁ బ్రతిఘాత మొనర్చువారుణాస్త్రమును బ్రయో గించెను. అపు డయ్యది యయ్యనలాస్త్రమును నివారింపఁగా నందలి క్షత్రియులును, దేవతలును నెమ్మదినొందిరి. అంత నాభీష్ముఁడు ధర్మజుని ధ్వజమును, ధనువును ద్రుంచి సింహనాద మొనరించెను. అపుడు భయ భ్రాంతుఁడై యున్న ధర్మజునిఁ జూచి భీముఁడు తనవిల్లు విడిచి పదా తియై గదనుబూని సైంధవునిపైఁ బరువిడెను. అటులు గదతోఁ దన పైకివచ్చు నాభీమునిఁ జూచి యమదండతుల్యములై వాఁడియగునైదు వందలబాణములచే నాతని నొప్పించెను. కోపావేశపరవశుఁడై యాపా వని యాశరపరంపరను లక్ష్యపెట్టక వడిగాఁబోయి సింధుదేశసంభవము లగు నాసైంధవుని, సైంధవములను మోది చంపెను. అంత నీకొమ రుఁడు నిరుపమానపరాక్రమశాలియై త్వరపడుచు బోయి యాభీముని దండింప నందులకు వచ్చెను. అపుడు భీముఁడు గర్జించుచు గదచేఁ దర్జన మొనర్చుచు నాతనిపైకి వెడలెను. యమదండతుల్య మగు నాభీముని గదాదండమును గాంచి, కౌరవులెల్ల బెదరి తమయగ్రజుని విడిచి యా గదాప్రహారమును దప్పించికొనువారై నలుదెసలకుఁ జెదరిపోయిరి. దారుణమై భారతులకు మోహకరమై సంకుల మగునారణరంగమున భీమునిచే వైవఁబడిన యాగదను గాంచి చిత్రసేనుఁడు రథమును విడిచి పదాతియై కత్తిపట్టికొని కొండనుండి వెడలినసింహమువలెఁ బుడమికి దిగి చరించుచుండెను. అపు డాభీమప్రయుక్త మగుగద యాచిత్రసేనుని సారథిని గుఱ్ఱములను జంపి ప్రజ్వలించుచు నాకసమునుండి జాఱిన మహోల్కవలెఁ బుడమిని బ్రవేశించెను. అపుడు తక్కిన నీకొమరు లెల్ల నాచిత్రసేనునిఁ జూచి సంతుష్టాంతరంగులై సింహనాదములొన ర్చిరి. సైన్యములవారెల్లరును జిత్రసేనుని వివేకమునకు మెచ్చుకొనిరి." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

### సప్తమదినయుద్ధమును ముగించుట

"ఓయాంబికేయా! అటులు విరథుఁ డగు నాచిత్రసేనుని సమీ పించి నీకొమరుఁ డగువికర్ణుఁడు వానిని దనరథముపై నెక్కించుకొని

యెను. అటు లాసంకులయుద్ధ మారంభమగుడు భీష్ముఁడు ధర్మజు నెదుర్కొనియెను. అంత యుధిష్ఠిరుఁడు మృత్యుముఖమునఁ బడియెనని తలంచిరి. సృంజయులు తమసైన్యములతో వడంకిరి. ధర్మజుఁడు నకులసహదేవులంగూడి శాంతనవునిఁ దలపడియెను. పిదప నప్పాండవాగ్రజుఁడు దివాకరుని మేఘుఁడువలె గాంగేయుని శరపరంపరలచేఁ గప్పెను. అంత నాశాంతనవుఁడు శాంతముగా వాని నొక్కొకటిగా నివర్తించెను. పిదప నాగాంగేయుఁడు ప్రయోగించినశరజాలము లాకసమునఁ బక్షుల సమూహములువలెఁ గానవచ్చెను. ఓరాజా! ఒకయరనిముసమునఁ దన శరపరంపరచే ధర్మజునిఁ గానరాకుండఁ గప్పెను. పిమ్మట ధర్మజుఁ డొక తీవ్రనారాచము నాభీష్మునిపైఁ బఱపఁగా దానిని త్రోవనడుమనే యొక క్షురప్రముచే ఖండించి, మఱియు నాయుధిష్ఠిరుని రథాశ్వములను గొట్టెను. అంత నాధర్మజుఁడు హతాశ్వమగురథమును విడిచి మహాత్ముఁడగునకులునిరథ మధిరోహించెను. మఱియుఁ గుపితులై యున్న నకుల సహదేవుల నెదుర్కొని భీష్ముఁడు శరపరంపరచే వారిని గప్పి పీడించెను. అటులు భీష్మబాణప్రపీడితు లగుతనచిన్నితమ్ములను జూచి యెంతయుఁ జింతగదుర గాంగేయు నెటులయిన వధింపుఁడని తనక్షత్రియయోధులను బ్రోత్సహించెను. పిమ్మట నాతనివచనములు విని యందలిపార్థివులందఱును బెక్కురథికులతోఁ బితామహుని ముట్టడించిరి. వారటులు ముట్టడింపఁగా నాదేవవ్రతుఁడు మహారథులగువారి నెల్లఁ బడఁద్రోయుచు విల్లుగొని దానితో నాడుకొనుచుండెను. అటు లారణరంగమునఁ జరించు నాకౌరవసింహుని వనమున మృగములనడుమఁ జరించుసింహ కిశోరమునువలెఁ గాంచిరి. ఓమహారాజా! శూరులను వెఱపించునట్టియు, సాయకములచే నొప్పించునట్టియు నాతనిఁ జూచి సింగముం గాంచిన మృగములువలె నారాజలోక మెంతయు భీతిల్లెను. అపు డాతనివిధము చూడఁగా నెండుగడ్డినిదహించెడి యగ్నివలెఁ గానవచ్చెను. నేరిమిగలవాఁడు పండినతాటిపండ్లనువలె నతఁడు రథికులతలల నారణరంగమునఁ బడఁద్రోయసాగెను. ఓమహారాజా! అపు డాతఁడు పడఁద్రోయు వైరులశిరములచప్పుడు సంకులమై పుడమినిబడు పాషాణములశబ్దము ననుకరించెను. అట్టి ఘోరసంగ్రామమున నుభయసైన్యములకు నెంతయు భయముగొలుపు సమ్మర్ద మయ్యెను. ఆగాంగేయునిచే

వ్యూహములు భేదింపఁబడుటను యోధులందఱును బరస్పరము యుద్ధమొనరింపఁ బిలిచికొనుచుఁ దలపడసాగిరి. అంత నాభీష్ముని సమీపించి శిఖండి "ఓయీ! నిలుము నిలుము" అని పలుకుచు నెదురింపఁబోయెను. అపుడు వాని స్త్రీత్వమును తలంచినవాఁడగుటను నా పలుకు లాదరింపక సృంజయులపైఁ గవియఁబోయెను. సృంజయులును గాంగేయుం గాంచి సోత్సాహులై శంఖధ్వనులతోఁగూడ సింహనాదములొనరించిరి. ఓరాజా! సూర్యుఁడపరదిశ నాశ్రయింప సాగునంతలో గొప్పసంకులయుద్ధ మారంభమయ్యెను. ధృష్టద్యుమ్న సాత్యకు లిరువురును, శక్తితోమరవర్షముచే మనవారిసైన్యమునుబీడించుచునుండిరి. అటులు వారిచే హతులగుచుండియు క్షత్రియధర్మమును బరిత్యజింపఁజాలక, మనవారు యుద్ధోత్సాహమును విడువక తమశక్తి కొలఁదిని బోరాడుచుండిరి. అపుడు మనవారిసైన్యమున గొప్పచప్పు డొకటి యుప్పతిల్లెను. అయ్యదిధృష్టద్యుమ్ను నిపరాక్రమముచేమనవారి యాక్రోశమని గ్రహించితిమి. అటులు మనవారొనర్చెడి యాయాక్రంద ధ్వని విని మహారథు లగు విందానువిందు లాధృష్టద్యుమ్నునిఁ దలపడి యాతనిగుఱ్ఱములనుగొట్టి, శరవర్షమున నాతని ముంచిరి. అపుడాపార్షతుఁడు కడువడిగా రథమునుండి డిగి, మహాత్ముఁడగు సాత్యకిరథము నధిష్ఠించెను. పిమ్మట యుధిష్ఠిరుఁడు పెక్కుసైన్యముతో, రణకుపితు లగు నావిందానువిందులపై వెడలెను. అటులే నీకొమరుఁడును నెల్లవిధములను నావిందానువిందులకు సాహాయ్యమొనర్ప వెడలెను. అపు డర్జునుఁడును గుపితుఁడై రెండవయింద్రునివలె వెలయుచు క్షత్రియ వీరులనెల్ల నొప్పింపసాగెను. నీపుత్రునిప్రీతికై ద్రోణుఁడును గుపితుఁడై పాంచాలురనెల్లఁ దూలరాశి నగ్నివలె రూపుమాపఁ దొడంగెను. దుర్యోధనుఁడు మున్నగునీపుత్త్రులు భీష్ముని నడుమనిడికొని పాండవులతోఁ బోరాడఁదొడంగిరి. ఓభరతోత్తమా! అంత నాదిత్యుఁ డెఱ్ఱవాఱుచుండెను. ఘోరమైన రక్తపుతరంగములతో నదులు ప్రవహించెను. ఆ సాయంకాలమున నమంగళము లగునక్కలరొదలచే నాసంగ్రామభూమి మఱియు భయంకరమైయుండెను. రాక్షసులును, పిశాచములును నింకను గలమాంసాశనముగోరుప్రాణులును నెల్లెడల వేలకొలఁదిగా నందందుఁ గానవచ్చెను. అర్జునుఁడు సుశర్మాదులగురాజుల నోడించి, నిజశిబిరము

నకు వెడలెను. ధర్మజుఁడును దనసోదరులతోడను సైన్యములతోడను గూడి శిబిరమును బ్రవేశించెను. భీముఁడును సుయోధనుఁడు మున్నగు రథికులను జయించి తనశిబిరమునకుఁబోయెను. దుర్యోధనుఁడును, భీష్మునితోఁ దనశిబిరమును జేరెను. అటులే ద్రోణకృపాశ్వత్థామకృతవర్మశల్యులును సైన్యములతో శిబిరములను జేరికొనిరి. సాత్యకియు, ధృష్టద్యుమ్నుఁడును యోధులతోఁ దమశిబిరములకుఁబోయిరి. ఓరాజా! ఇటులుభయసైన్యములు నాసంధ్యాసమయమున వెడలిపోయి, పరస్పరము గౌరవించికొనుచు, రక్షించుకొనుచు, శల్యములను దొలఁగించుకొని, పరిమళితోదకముల స్నానములొనర్చికొని వందిమాగధులచేఁ బొగడఁబడుచుండిరి. కొంతవడి గీతవాద్యములతోఁ గ్రీడించిరి. రెండుగడియల సేపటులు సుఖముగా నానందించిరిగాని యుద్ధకథను స్మరింపరైరి. ఓ రాజా! మిక్కిలిగా నలయుటచే నుభయసైన్యములును నిద్రించి చూడఁదగియుండెను" అని తెలిపి మఱియు సంజయుఁ డిట్లనియె.

## ఎనిమిదవనాఁటియుద్ధము

"ఓరాజా! కురుపాండవవీరులెల్లరు నా రాత్రి సుఖనిద్రతోఁ గడపి మఱల యుద్ధమునకు సన్నద్ధులైరి. అపు డుభయసైన్యములందును గొప్పనాదము లుప్పతిల్లెను. ఆ రెండుసైన్యములును నడుచుచు మహాసాగరతుల్యమై కానవచ్చెను. పిమ్మటఁ గౌరవయోధులగు భీష్మద్రోణులును, దుర్యోధనుఁడును, చిత్రసేనుఁడును, వివింశతియుఁ గలిసి పాండవుల నెదుర్కొన వ్యూహముగా నేర్పడిరి. నీతండ్రియగు పితామహుఁడు వాహనములనెడి తరంగములతో ఘోరమై పారావారతుల్యమగు నామహావ్యూహమున నెల్లసైన్యములకు ముందుగా నడిచెను. ఆతనికి మాలవులును, దాక్షిణాత్యులును, నవంతిదేశాధీశులును సహాయులుగా నుండిరి. ఆతనివెనుకఁ బ్రతాపశాలి యగు ద్రోణుఁడుండెను. ఆభారద్వాజునకుఁ బుళిందులు పారదులు క్షుద్రకమాలవులును దోడ్పడియుండిరి. ద్రోణునివెనుకఁ బరాక్రమశాలి యగుభగదత్తుఁడు, మాగధులును, గళింగులును, పిశాచులును నాతనికిఁ దోడుగాఁ నుండిరి. వానివెనుక మేలక, త్రైపుర చిచ్చిలులతోఁగూడికోసలదేశాధీశుఁడగు బృహద్బలుఁడు నిలిచి యుండెను. అతనివెనుకఁ గాంభోజులు యవనులు మున్నగువారిఁ గూడి

ప్రస్థలాధీశుఁ డగు త్రైగర్తుఁడును వానివెనుక నశ్వత్థామయు వెడలిరి. పిదప దగాతలము ప్రతిధ్వనించునట్లు సింహనాదములు జనించెను. ఆటుల సర్వసైన్యసమేతుఁడై తనసోదరులంగూడి సుయోధనుఁడు ద్రోణ పుత్త్రునివెనుక నిలిచియుండెను. ఆదుర్యోధనువెంబడినే కృపుఁడు వెడ లెను. ఇటు లావ్యూహము సాగరసన్నిభమై వెడలి చూచువారి కచ్చె రువు గలిగించెను. ఓరాజా! అందు ఛత్త్రములును, బతాకలును, మహా ర్హము లగుభుజభూషణములును, ధనువులును గాన్పింపసాగెను. అట్టి నీ వారిమహావ్యూహము నారసి మహారథుఁడగు ధర్మజుఁడు సేనాధీశుఁడగు ధృష్టద్యుమ్నునితో "ఓయీ! ధనుర్ధరోత్తముఁడగు భీష్మునిచేఁ బన్నఁబడిన యీమహావ్యూహమును గాంచితివా? ఇది యొకసాగరమునా వెలయు చున్నది. కావున నీవును దీనికిఁ బ్రతివ్యూహమును సంఘటింపుము. జాగు సేయకుము." అని పలుక విని యతఁడు భయంకరముగా నొకవ్యూహ మును బన్నెను. ఓమహారాజా! వైరివ్యూహవినాశకమగు నయ్యది శృం గాటకము. అందుఁ బెక్కురథములతోడను హయపదాతులతోడను గూడి మహారథుఁ డగు భీముఁడును సాత్యకియు శృంగములుగా నుండిరి. కపిధ్వజుఁడును శ్వేతాశ్వుఁడు నగునర్జునుఁడు దాని నాభిస్థానమున నుండెను. దానినడుమ నకులసహదేవులతో యుధిష్ఠిరుఁడు నివసించి యుండెను. పిదప మహేష్వాసులగు రాజోత్తములందఱును, వ్యూహ శాస్త్రవేత్తలగుట నావ్యూహమున నందందు దానిని బూరించియుండిరి. దానివెనుక నభిమన్యుఁడును మహారథుఁ డగువిరాటుఁడును, ఘటోత్క చుఁడును, ద్రౌపదేయులును నిలుపఁబడిరి. ఓరాజా! ఇటు లాపాండవులు మహావ్యూహమును బన్ని సమరశూరులును, యుద్ధాభిలాషులు నై జయము నపేక్షించియుండిరి. శంఖధ్వనిమిళితములై భేరీనినాదములును సంకులముగా వినవచ్చెను. అటులే భుజాస్ఫాలనముతోఁగూడి సింహనాద ములు మెండుగా నెల్లదెసల నిండెను. పిమ్మట నమ్మహీనాథులెల్లరును ఱెప్పపాటులేక యొకరినొకరు చూచుకొనుచుండిరి. ఓరాజేంద్రా! వారు మున్నుగా యుద్ధమునకుఁ బరస్పరమును మనఃపూర్వకముగాఁ బిలిచికొనిరి. పిదప యుద్ధము భయంకరమై యారంభమయ్యెను. అపుడు నీవారియుఁ బాండవయోధులయుఁ దీవ్రనారాచములు మెండుగా సంగ్రామరంగమునఁ బడుచుండెను. అయ్యవి నోరుతెఱచినపాములు

వలె భయంకరములై గానవచ్చెను. సూనెతో సానవెట్టుటను దళతళ మనెడిశక్తులు మేఘములనుండి వెడలిన మెఱుపులువలె వెలయుచుండెను. సువర్ణభూషితములై తెల్లనిపట్టములతోఁ గప్పఁబడినగద లారణరంగమున నందందుఁ బడి పర్వతశిఖరములునాఁ జూపట్టుచుండెను. ఖడ్గములు నిర్మలాకాశమునాఁ గానవచ్చెను. ఋషభచర్మములకేడెము లందందుఁబడి వెలయుచుండెను. అపుడాయిరుసైన్యములును దేవదానవులసైన్యములు వలెఁ బరస్పరము పోరాడుచుఁ గానవచ్చెను. రథికులు రథికులతో వడిగా నెదుర్కొనిరి. రథముల యుగములతో యుగములుగలిపి వీరులు పోరాడసాగిరి. ఏనుగు లేనుఁగులతోఁ బోరునపుడు వానిరాపిడిచే నగ్నికణము లుప్పతిలుచు వానిదంతములందుఁ బొగలెగయసాగెను. ప్రాసప్రహారములచేఁ జచ్చిన కొందఱుగజయోధు లంతటను బడుచు, కొండనుండి యొఱగు వృక్షములువలెఁ జూపట్టిరి. ప్రాసాద్యాయుధములతో నాయోధన మొనర్చెడిపదాతులును బరస్పరము ప్రహరించికొని చిత్రరూపులై కానవచ్చిరి. అటు లాకురుపాండవసైన్యములు నానావిధము లగుశరములచేఁ గొట్టుకొని యమమందిరము నలంకరించెను. పిదప శాంతనవుఁడు తనరథనేమిధ్వనిచేతను, ధనుష్టాంకారముచేతను వెఱవఁజేయుచుఁ బాండవుల నెదుర్కొనెను. అంత బాండవరథికు లగు ధృష్టద్యుమ్నుఁడు మున్నగువారును భైరవారావము లొనరించుచు యుద్ధసన్నద్ధులైరి. పిదప నుభయసైన్యములవారికిని సంకులసమరమయ్యెను.” అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

## ఆదిత్యకేతుప్రభృతులను జంపుట

“ఓరాజా; అపుడు కుపితుఁడై తపనునివలెఁ బ్రజ్వలించుచున్న భీష్ము నెవ్వరును దేఱిచూడఁ జాలకుండిరి. అటులయినను ధర్మజునిశాసనముచే నెల్లసైన్యములవారును భీష్ము నెదుర్కొనిరి. అంత నాశాంతనవుఁడు రణోత్సాహియై సోమకసృంజయపాంచాలురను సాయకప్రపంచముచేఁ బంచత్వ మొందింపసాగెను. ఆపాంచాలసోమకాదు లటులు ప్రహరింపఁబడుచుండియు మృత్యువునకు జంకక యాగాంగేయునితోఁ బోరాడ నారంభించిరి. అపు డారథికులతలలను భుజములను దెగనేసెను. రథికులలోఁ గొందఱ విరథులఁగా నొనర్చెను. గుఱ్ఱములనుండి

రాతులతల లెగురుచుఁ బడుచుండెను. ఓమహారాజా! భీష్మప్రయుక్తాస్త్ర మోహితములై నిర్మనుష్యముగానేలఁగూలి పర్వతతుల్యములై యున్న యేనుఁగులను జూచితిమి. అంత మహాబలుఁ డగు భీముఁడుతప్పఁ బాండవ యోధు లం దెవ్వరును గానరారైరి. అతఁ డొక్కఁడును భీష్మునిఁ జేరి పీడించుచుండెను. ఆభీష్మభీమసమాగమమున సైన్యములలో హాహాకార ములు జనించెను. ఆభీముఁ డప్పు డెల్ల వారికిని భయంకరుఁడై ఘోరరూప మును దాల్చియుండుటను బాండవులెల్ల సంతుష్టాంతరంగులై సింహనా దములొనర్చిరి. పిదప దుర్యోధనుఁడు తనసోదరులంగూడి జనక్షయమై జరుగు నారణమున భీష్మునిరక్షించువాఁడై యుండెను. అంత నాభీముఁడు, భీష్మునిసారథినిగొట్టి, యాతనిరథము యుద్ధభూమినుండితొలఁగుడుఁ దీవ్ర మగుక్షురప్రమనెడి యొకబాణముచే సునాభునితలఁ దెగనేసెను. ఓరాజా! మహారథుఁ డగు నీపుత్త్రుఁడు సునాభుఁడు హతుఁడగుటకు సహింపక యాతనిసోదరు లేడ్వురు యుద్ధసన్నద్ధులై వెడలిరి. అటులు నీపుత్త్రు లగు నాదిత్యకేతువు, బహ్వాశి, కుండధారుఁడు, మహోదరుఁడు, పండితకుఁడు, అపరాజితుఁడు, విశాలాక్షుఁడు ననువారు విచిత్రకవచాయుధధారులై యాభీము నెదుర్కొనిరి. అందు మహోదరుఁడు తొమ్మిదియుగ్రనారా చములచే నముచి నింద్రుఁడువలె భీమునిఁ బ్రహరించెను. అటులే యాది త్యకేతువు డెబ్బదియు, బహ్వాశి యైదును, కుండధారుఁడు తొంబదియు, విశాలాక్షుఁ డేడును బాణములఁ బ్రయోగించి భీముని నొప్పించిరి. ఓరాజా! అపరాజితుఁడు పెక్కువాఁడికోలలచే మహాబలుఁ డగుభీముని నొవ్వనేసెను. పండితకుఁడు మూఁడుబాణములచేఁ గొట్టెను. అపు డా భీముఁడు వైరిప్రహారముల కోరువక యెడమచేత విల్లుసారించి యొక తీవ్రనారాచముచే నపరాజితునితలఁ దెగనేసి, వేఱొకభల్లముచేఁ గుండధారుని దండధరునిదండ కనిచి, యెల్లసైన్యములును జూచు చుండఁగా, మఱియు నొకశిలీముఖమును సంధించి పండితకునిపైఁ బ్రయోగించెను. అయ్యది వానిఁ జంపి పుడమిఁ జొచ్చెను. అపుడు మా కది యొక మానవునిఁ జంపిన సర్పమువలెఁ గానవచ్చెను. మఱియు నా భీముఁడు వెనుకటివైరమునుస్మరించి మూఁడువాఁడికోలలచే విశాలాక్షుని తల నిలఁగూలఁద్రోసెను. పిదప నటులే యొకనారాచముచే మహోదరుని వక్షమును గొట్టఁగా, దానిచే వాఁడు గతప్రాణుఁడై ధరణిఁ దొరఁగెను

పిమ్మట నాదిత్యకేతునిఛత్త్రము నఱికి తీవ్రబాణముచే వానిశిరము ఖండించివైచెను. అంతఁ దనకెదురుపడిన బహ్వాశిని జూచి కుపితుఁడై వానిని యమసదనమున కంపెను. పిమ్మటఁ దక్కిన నీపుత్త్రులెల్లరును నాఁడు సభలో భీముఁ డాడినవచనములను సత్యముగాఁ దలపోయుచు భీతులై పరువులిడిరి. అప్పుడు సుయోధనుఁడు తనసోదరులమరణమున కెంతయుఁ జింతిలి యెట్లైన భీముని వధింపుఁడని నీవారిని బ్రోత్సహించెను. ఇటులే నీపుత్త్రులెల్లరును మరణించినసోదరులను జూచి మున్ను మహాప్రాజ్ఞుఁడగు విదురుఁడు చెప్పినశ్రేయస్కరమగు హితవచనములను దలంచిరి. ఆహా! అసత్యవాదివచనము చొప్పుదప్పక యిది యిప్పుడిట్లు సంభవించెను. ఓరాజా! నిన్ను లోభమోహములు చుట్టికొనుటను పుత్త్రప్రేమ విడిచికొనలేక మున్నా విదురుఁడు చెప్పిన తథ్యముహితమునగువచనములను గ్రహింపఁజాలవైతివి. బలశాలియగు పాండవమధ్యముఁడు నీపుత్త్రులను జంపుటకే నిశ్చయముగా జనించినవాఁడగుటచే నివు డిటులు వధించుచున్నవాఁడు. ఓరాజా! పిమ్మట దుర్యోధనుఁడు భీష్ముని సమీపించి యెంతయు దుఃఖాక్రాంతుఁడై "ఓతాతా! నాభ్రాతలెల్లరును భీమసేనునిచే రణరంగమున మడియింపఁబడుచుండిరి. అటులే సోత్సాహముగాఁ బనిచేయునట్టిసైన్యములవారును - నాతనిచే వధింపఁబడుచుండిరి. నీవు తటస్థుఁడవై నిత్యము మమ్ముపేక్షించుచున్నవాఁడవు. నేను జెడుత్రోవ ద్రొక్కియున్నవాఁడను. నా దురవస్థ యెటులున్నదో చూడుము" అని పలువిధముల విలపించెను.

అదివిని నీతండ్రి యగుదేవవ్రతుఁడు కుపితుఁడై యేడ్చుచున్న సుయోధనునిఁ జూచి "ఓయీ! తండ్రీ! ఈవిషయమున మున్ను నేను, ద్రోణవిదురులును, నీతల్లియగు గాంధారియును దెలిపితిమిగాని దానిని నీవు గ్రహింపవైతివి. మఱియు నేను మీతో 'ద్రోణాచార్యుని నన్నును యుద్ధమునకు నియోగింపకుఁ'డని నిశ్చయముగా మున్ను దెలిపియుంటిని. ఈసంగ్రామరంగమున భీముఁడు నీసోదరులలో నెవ్వనినిఁ గాంచునో వానిని జంపకమానఁడని నిజము చెప్పుచున్నాఁడను. కావున నీవిఁక జలింపక ధృఢమతివై నీయంతన పాండవులతోఁ బోరాడుము. వారిని జయింప సనాతను లగు దేవతలకును దరముగాదు. అటులగుట

నీవే బుద్ధిగఁ బిర్చికొని వారిని జయింపుము అని తెలిపె" నని పలికిన విని ధృతరాష్ట్రుఁ డిట్లనియె.

## అష్టమదివసయుద్ధము

"ఓసంజయా! పాండవులలో నొక్కనిచే హతు లగు నాపుత్రుల ననేకులఁజూచి భీష్మద్రోణకృపు లుపేక్షించిరా? ఏమొనరించిరి? ఓయీ! ప్రతిదినము నాకొమరులు నశించుచునే యున్నవారు. ఎల్లవిధముల వారు దైవోపహతులై యున్నవారని తలంతును. అటులగుట వారం దఱును జయింపఁబడుచుండిరిగాని వైరులను జయింపఁజాలకుండిరి. ఓసంజయా! మహాత్ము లగు భీష్మద్రోణకృపాశ్వత్థామలును, వీరు లగు సోమదత్తభగదత్తులును, మఱియుఁగలశూరులును బోరాడుచుండి నను నాకొమరుకు లేశమాత్రమున సమరంబును బరికింపఁగా దైవముగా కిందులకు మఱేమి నిమిత్తము? మందబుద్ధి యగు సుయోధనుఁడు పెద్దలు చెప్పినహితవచనము గ్రహింపఁజాలఁడయ్యెను. ఈయుద్ధమువలదని నేను నివారించితిని. భీష్మవిదురులును బోధించిరి గాంధారియు నాసహితము గోరి తెలిపెను. కాని దుష్బుద్ధి యగు నాతఁడు రాజ్యలోభముచే వెలియఁడయ్యెను. దాని కిది ఫలముగాఁ బ్రాప్తించెను. ఈయుద్ధమున భీముఁడు కుపితుఁడై నాకొమరులను విశేషించి ప్రతిదినము చంపుట చూడఁగా నాకొమరుని యవివేకమే యిందులకు నిమిత్తమై గానవచ్చెడిని."

అదివిని సంజయుఁడు "ఓప్రభూ! విదురుఁ డెన్నియోసారులు హితమై సత్యమగువచనములు తెలిపియున్నను నీవు వానిని గ్రహింపలేక పోయితివి. అతఁడు నీసుతుల దుష్టద్యూతమునుండి మఱలింపుమనియుఁ, బాండవులకు ద్రోహ మొనర్పరాదనియుఁ దెలిపెను. ఇంకనుగల నీ మిత్రులు నీహితముగోరువారై యావిషయమునే తెలిపిరి. కాని, వాని నెల్ల రోగి యగుమానవుఁడు పథ్యమగునౌషధమునువలె నీవిష్టపడి పరిగ్రహింపవైతివి. ఆసజ్జనులు దెలిపినదియే నీకిపుడు సంప్రాప్తించెను. భీష్మద్రోణవిదురులయు నింకనుగలహితులయు వచనముల నాదరింపకుండుటచే, గౌరవుల కిట్టిపాట్లు తటస్థించెను. ఇది యిపుడు వచ్చినదిగాదు. ఇంతకుమున్నే వచ్చినదనికొమ్ము. కావున యుద్ధ మెటులు ప్రవర్తిల్లెనో

దానినెల్ల యథార్థముగాఁ దెలిపెదను వినుము. నాఁటిమధ్యాహ్నము మహారౌద్ర మగుయుద్ధము జరిగెను. అది లోకమునకు క్షయహేతు వయ్యెను. దానిని వినుము. పిదప ధర్మజునాజ్ఞచే నెల్లసైన్యములును విజృంభించి భీష్మునిఁ జంపునుత్సాహముతో నాతని నెదుర్కొనియెను. ధృష్టద్యుమ్నుఁడును, సాత్యకియు, శిఖండియుఁ బెక్కుసైన్యముతోఁ గూడి యాతని ముట్టడించిరి. అటులే సోమకులతోఁగూడి ద్రుపదవిరాటు లును గాంగేయునే తలపడఁబోయిరి. మహారథు లగు కైకయులును, ధృష్టకేతువు, కుంతిభోజుఁడును సన్నద్ధులై తమసైన్యములతో వెడలి భీష్ముని నెదుర్కొనిరి. మఱియు నర్జునుఁడును, ద్రౌపదేయులును, చేకి తానుఁడును, దుర్యోధనాజ్ఞప్త లగురాజులనెల్ల మార్కొనిరి. అటులే యభిమన్యుఁడును, ఘటోత్కచుఁడును, భీముఁడును గుపితులై కౌరవు లపైఁ బరువులిడిరి. అపుడు ద్వంద్వములుగా నేర్పడి పాండవులచేఁ గౌరవులు వధింపఁబడుచుండిరి. అటులే కౌరవులును పాండవసైన్య ములను మడియింపఁ దొడంగిరి. అపుడు రథికోత్తముఁ డగు ద్రోణుఁడు సోమకసృంజయుల నెదుర్కొని యమమందిరమున కనుపుచుండెను. అందు మహాత్ములగు సృంజయులయాక్రందనధ్వను లెంతయు హెచ్చుగా వినవచ్చెను. అపుడు పెక్కురుక్షత్రియులు ద్రోణనిహతులై రోగపీడి తులవలె నేలఁగూలి పొరలుచుఁ గానవచ్చిరి. ఆరణరంగమున నఱచు నట్టియు, మొఱపెట్టునట్టియుఁ, బొగడునట్టియు సైనికులయారావము పెల్లాకలిచేఁ బీడితు లగువారి మొఱలువలె వినవచ్చెను. అటులే మహా బలుఁ డగుభీమునిచే హతు లగుకౌరవసైన్యములవారియందును విన నయ్యెను. అపుడు కుపితుఁడై భీముఁడు రెండవదండపాణివలెఁ గాన వచ్చెను. అంత నుభయసైన్యములును బరస్పరము వధించుకొనుచుండు టను ఘోరయుద్ధమై రక్తప్రవాహము లేఱులై పాఱెను. ఓమహారాజా! అపుడు యమపురము వర్ధిలునట్లుగా ఘోరమై కురుపాండవులకు భయం కరమగుసంగ్రామమయ్యెను. అందు భీముఁడు విశేషించి గజసైన్యములను బొలియించెను. అపుడు భీమునిచేఁ జంపఁబడినయేనుగులు పుడమిఁబడు నవియుఁ, జచ్చునవియు, మొఱలిడునవియు, దెసలకుఁ బరువులిడునవి యునై చూపట్టెను. మఱియుఁ గొన్ని తొండములు తెగినవియు, మొండెములైనవియునై మొఱలువెట్టుచుఁ, గ్రౌంచపర్వతములై పుడమిఁ

బడియెను. నకులసహదేవులు గుఱ్ఱపుదడములను దఱుమనారంభించిరి. అపుడు సువర్ణభూషణభూషితములై వారిచేఁ జచ్చిపడినగుఱ్ఱముల ననేకసహస్రములను మేము చూచితిమి. పడుచున్న గుఱ్ఱములచేఁ బుడమియెల్ల నిండెను. ఓరాజా! నాలుకలు తెగినవియు, నిట్టూర్పులిడు నవియు, నఱచునవియునై నానారూపములుగల యాగుఱ్ఱములచేఁ బుడమి చిత్రముగాఁ గానవచ్చెను. అర్జునుఁడు ననేకు లగువీరులను జంపెను. అపు డాతనిచే విఱిగినరథములును, దెగినధ్వజములును, ఖండింపఁబడినఛత్రములును, దునిఁగినచామరవ్యజనములును, ఛేదింపఁ బడిన మహాయుధములును, మఱియు హారములును, గేయూరకుండ లాదులతోఁగూడిన మొండెములును, నందందుఁ జెదరినతలపాగలును, జెండాలును, బగ్గములతోఁగూడిన నొగలును బుడమి నాచ్ఛాదింపఁగా నది వసంతమునఁ గుసుమములచేవలె వానిచేఁ వెలయఁ జొచ్చెను. ఇటులే భీష్మద్రోణకృపాశ్వత్థామలును, నింకను గలవీరులును గుపితులై యుద్ధమొనర్పఁగాఁ బాండవసైన్యములందును ననేకులు మడిసిరి” అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

## ఇరావంతునిమరణము

“ఓరాజా! వీరవరమారకమై మహారౌద్ర మగురణ మారంభ మగుడు, శకుని పాండవులను దలపడియెను. అటులే కృతవర్మయుఁ బాండవసైన్యమును ముట్టడించెను. అపుడు త్తమములైన జవనాశ్వ ములతోఁగూడి యర్జునపుత్రుఁ డగు నిరావంతుఁడు కౌరవసైన్యమును మార్కొనియెను. అతఁ డర్జునునకుఁ బుత్రుఁడయినవిధము వినుము. మున్ను నాగరాజగు నైరావతుఁడనువాఁడు తనకూఁతు నొకనికిచ్చి వాఁడు సుపర్ణునిచే హతుఁడగుటను బతివిహీనయై సంతానహీనయగు నా మెను భార్యనుగా నర్జునున కొసంగఁ గామవశయైవచ్చిన యామె నర్జునుఁడు పరిగ్రహించెను. ఆతనివలనఁ బరకళత్రమగునామెయం దీయి రావంతుఁడు జనించినవాఁడు. ఇతఁడు నాగలోకమునఁ దల్లికడఁ బెరి గియు నర్జునునిపై ద్వేషముగలదురాత్ముఁ డగు తనపినతండ్రి యశ్వసేను నిచేఁ బరిత్యజింపఁబడి యర్జునుఁ డింద్రలోకమందుండుట వినినవాఁడ గుట నందులకుఁబోయి యాతనిదర్శించి తనతల్లి కాతనితోఁగలిగినసమా

గమమునున్నగు తనచరిత్రమంతయు నాతని కెఱింగించెను. ఆవృత్తాంత మంతయు నర్జునుఁడు జ్ఞప్తికిఁ దెచ్చికొని గుణములచేఁ దనతో సమానుఁ డగువానిని గౌఁగిలించికొని యాయింద్రలోకమున నాతనితోఁ బ్రీతి గలిగియుండెను. అంత నాకపు డర్జునుఁడు వానింజూచి, "ఓయీ! నీవు మాకుఁ దగు యుద్ధకాలమువచ్చునపుడు సాహాయ్యమొనర్పవలయును" అని యాజ్ఞాపించెను. అదివిని యాతఁడు నందులకు వల్లెయని యంగీక రించినవాఁడగుట, నిపుడు నుంచిపన్నమును గొప్పవేగమునుగలగుఱ్ఱ ములు పెక్కిటితోఁగూడి వచ్చినవాఁడు. వానిహయములు సువర్ణశిరో భూషణములుగలవియు, నానావర్ణములుగలవియు, మహావేగముగల వియునై మహాసముద్రమందును నెగిరి పరుగిడఁగలవు. అట్టిగుఱ్ఱములు మహాజవముగల నీవారిగుఱ్ఱములను దాఁకి క్రోడములతోడను, మూతు లతోడను వానివక్షములందును మూతులందును గొట్టసాగెను. అపుడు గరుడపతనమందువలె గొప్పచప్పు డుప్పతిల్లెను. అటులే యందలిరౌతు లును బరస్పరముఁ బ్రహారించికొని ఘోరయుద్ధమొనర్చిరి. అటులెంతయు సంకులయుద్ధ మారంభ మగుటచే, రెండుసైన్యములందలి గుఱ్ఱములును జెదరిపోయెను. శూరులును, బ్రత్యేకబాణులును, నిహతాశ్వులును నై బడలి పరస్పరము సఱకికొనుచు నాశమునొందసాగిరి. ఓరాజా! అట్లు కొంచెము మిగులుగా గుఱ్ఱపుదడము నశించుటనుగాంచి శకునిసోదరులు రణాంగణమునుండి బయలువెడలి తమయగ్రజుఁ డగుశకునియు, మహా బలులగుయోధులును బోవలదని వారించినను మానక, వాయువేగ మనోవేగముగలవియు, బలముగలవియు నగుగుఱ్ఱముల నధిరోహించి యుద్ధసన్నద్ధులై, రౌద్రాకారులై దుర్జయ మగునాయిరావంతునిసైన్య మును భేదింపసాగిరి. అటు లాశకునిసోదరులగు గజుఁడు, గవాక్షుఁడు, వృషభుఁడు, చర్మవంతుఁడు, ఆర్జవుఁడు, శుకుఁడు ననెడియార్వురును రణగర్వితులై యుత్సాహముతోఁ దనసైన్యమును భేదించుటను గాంచి వీర్యశాలి యగు నిరావంతుఁడు విచిత్రభూషణాయుధధారు లగు తన యోధులతో "ఓవీరులారా! ఈదుర్యోధనుని యోధులు సాయుధవాహ నులై యెటు లచిరకాలమున మడియింపఁబడుదురో యట్టియుపాయ మున యుద్ధమొనర్పుఁడు" అని యాజ్ఞాపింపఁగా వారందులకు వల్లెయని యాగాంధారసైన్యములను బ్రహారింపఁదొడంగిరి. అటులు తమ

సైన్యము హాత మగుచుండుటను సహింపక యాగాంధారు లాయిరావంతునిమార్కొని తీవ్రప్రాసములచేఁ బ్రహరించుచుఁ బరస్పరము ప్రోత్సహించుకొనుచు, గొప్పసమ్మర్దమొనర్చుచుఁ బరువులిడసాగిరి. అంత నాయిరావంతుఁ డటులు వారు ప్రాసములచేఁ బ్రహరింపఁగా రక్తసిక్తాంగుఁడై యంకుశములపోట్లుపడిన మహాగజమునలెఁ గానిపించెను. ఓరాజా! అటులు పలువురుగూడి యాతని ఱొమ్మునను, బ్రక్కలను, వీఁపునను బహువిధప్రాసాదులఁ బ్రయోగించి నొప్పించినను నాయిరావంతుఁడించుకయుఁ జలింపఁడయ్యెను. అప్పు డతఁడు కుపితుఁడై యాగాంధారులనెల్లఁ దీవ్రనారాచములచే నొప్పించి యారణరంగమున వారిని మూర్ఛమునుఁగునటు లొనరించెను. మఱియు నతఁడు తనమేనఁ గ్రుచ్చి కొన్నప్రాసములఁ బూడఁబెఱికి వానితోడనే వారిని నొప్పించుచు నొకవాఁడిగలఖడ్గమును బట్టి వెడలి కాలినడకతో నాగాంధారులపై నుఱికెను. అపుడు వారు మూర్ఛదేఱి మఱియుఁ గ్రోధావేశపరవశులై యాయిరావంతునిపైకిరా నతఁడు తనఖడ్గమును మెఱయించుచుఁ బాణిలాఘవము చూపుచుఁ జరింపసాగెను. అటు లతఁడు జరించుటను వారాతనిఁ జేరుట కవకాశము చిక్కదయ్యెను. అంత నాగాంధారు లాతని ముట్టడించి పట్టుకొనఁదలంచి యాతని సమీపింపఁగా నతఁడు వారినెల్లఁ దనఖడ్గముచే నఱుక నారంభించెను. అపుడు వా రాతని ప్రహారములచే నాయుధాదులు దెగి ఖండితగాత్రులై నేలఁగూలిరి. అందు వృషభుఁ డొక్కఁడు నావీరుని ప్రహారమునకుఁ దప్పి తనశరీరమును రక్షించుకొనఁ గలిగెను. ఓరాజా! అపుడు వారెల్లఁ బడుట నారసి నీకొమరుఁడు సుయోధనుఁడు, ఘోరపరాక్రముఁడును, రాక్షసుఁడును, మాయావియునగు ఆర్ష్యశృంగునితో, "ఓయీ! చూచితివా? మీబకునిఁ జంపిన భీమునకు వీఁడు తమ్మునికొడుకు. కావున నీకు వైరియైనవాఁడుగదా! నీవన్ననో మాయాస్త్రవేత్తవును, గామగమనుఁడవు నైయున్నవాఁడవు. వీఁడు మాయావియై మనబలమునెల్ల ఘోరముగా నశింపఁజేయుచు విప్రియమొనర్పకుండ నీవెటులయిన వీని నీయుద్ధమునఁ జంపవలయును." అని తెలుప విని వాఁడు ఘోరాకారుఁడై సింహనాదమొనరించి యాయిరావంతుఁ డున్నకడకు వెడలి యుద్ధకుశలులై ప్రాసములతోఁ బోరాడనేర్చిన వీరులతోడను, బలిష్ఠము లగుసైన్యములతోడను,

రెండువేలగుఱ్ఱములతోడను గూడి మహాబలుఁడగు నాయర్జునకుమారు నెటులయినఁ జంపవలయు ననుపట్టుదలతో వాని నెదుర్కొనియెను. అటులు తనపైకివచ్చిన యారాక్షసుని జూచి కుపితుఁడై యాయిరావంతుఁడును గడువడిగాఁ వానిని మార్కొని తనమాయ నుపయోగించెను. అపు డాతనిమాయాబలముచేఁ బెక్కువేలగుఱ్ఱములు జనించెను. వానికిఁ దగినరౌతులును జనించిరి. అటులు జనించి వారు ఘోరాకారులై శూలపట్టిసాద్యాయుధధారులై విజృంభించి యార్ష్యశృంగుని రెండువేలసైన్యములను నొకనిమేషమున యమపురమునకంపిరి. అంత నాసైన్యము హతమగుడు రణగర్వితులై వారిరువురును, వృత్రవాసవులవలె యుద్ధమొనర్పఁ దొడంగిరి. అపు డిరావంతుఁడు యుద్ధగర్వితుఁడై యున్న యారక్కసునిఁ జూచి క్రోధావేశముతో తన్ను సమీపించినవానివిల్లు నొకకత్తిచే నఱికి, యైదుబాణములచే వానిని నొప్పించెను. అంత నారక్కసుఁ డుక్కుమిగిలి తునిఁగినధనువు విడిచి మింటికెగిరి, తనమాయచే నాయిరావంతునకు మోహ మావేశింపఁజేసెను. కాని వానిమాయకు లోఁగక యిరావంతుఁడు నంతరిక్షమున కెగిరి, వానిని మాయచే మోహితుఁగా నొనర్చి, మఱియు నారక్కసునిగాత్రములనెల్ల ఛేదించెను. అటు లారక్కసుఁడు మఱిమఱియు నఱుకఁబడియు నూతనయౌవనము గలశరీరమునొందెను. రక్కసులు నిజమాయాబలముచేఁ గామవయోరూపముల నొందువారుగదా! అటులగుట నెంత నఱికినను వానిమేను మఱియుఁ దేజమునే వహించెను గాని క్షీణింపదయ్యెను. అందుల కాయిరావంతుఁ డెంతయుఁ గుపితుఁడై మహాబలుఁడగు నారాక్షసునిఁ దీవ్రమగు నొకగండ్రగొడ్డలిచే మఱిమఱియు నఱుక నపు డారక్కసుఁ డెంతయు బిగ్గరగా నఱచెను. ఆచప్పుడు మిగుల సంకులమై వినవచ్చెను. ఆగొడ్డలిదెబ్బలచే వాఁడు తనమేన రక్తము వెడలఁ గ్రోధావేశముతో నాయిరావంతు నారసి నిజమాయాబలముచే గొప్పరూపమును బూని, వానినెత్తుకొనిపోవ నారంభించెను. అపు డెల్లరు నాశ్చర్యముగాఁ జూచిరి. అపు డారాక్షసమాయను జూచి యిరావంతుఁడును గుపితుఁడై మాయను సృజించెను. అటులతఁడు కుపితుఁడగుడు నంత నాతనివంశమాతృకవచ్చి కొన్నివేలపాములతో నారక్కసుని ముట్టడించెను. మఱియు నది గొప్పయనంతరూప

ముసంబూని బహువిధసర్పములచే నారాక్షసునిఁ గప్పెను. అటు లా పాములు తన్ను ముట్టడింప నారక్కసుఁడు కొంచెము ధ్యానించి, గరుడ రూపమును వహించి యామాయాసర్పముల రూపుమాపఁ దొడంగి యావంశమాతృకను భక్షించెను. అంత నిరావంతుఁడు మూర్ఛవడు టయు, నారాక్షసుఁడు తనకత్తిచే వానిని నఱికెను. అపు డాయిరావం తునిముఖము చంద్రసన్నిభమై మకుటకుండలాద్యలంకారములతో నేలఁగూలుటయు గాంచి మనవారెల్ల మించినమోదమును వహించిరి. అట్టిభయంకరసంగ్రామమున నిరుసైన్యములకును గొప్పసమ్మర్దము జనిం చెను. అపుడు హయగజపదాతులు పరస్పరముఁ జంపికొనఁ బోరు ఘోరమయ్యెను. ఆసంకులయుద్ధమున నర్జునుఁడును దనతనయుఁడు మృతినొందుట తెలియకయే భీష్మరక్షకులై యున్న రాజులను సంహరించు చుండెను. అటులే సీవారును సృంజయులును బరస్పరమును బ్రహరించు కొని యాసమరాగ్నిని దమప్రాణములను వ్రేల్చికొనసాగిరి. అంతఁ గొందఱు జుట్టులువీడి కవచములుచినుఁగ విరథులును నిహతకార్ము కులునై పరస్పరముగలిసి కేవలబాహుయుద్ధమొనర్ప నారంభించిరి. అంత నాశాంతనవుఁడు మర్మములు నాఁట నేయుచుఁ బాండవసైన్యములకు వెఱపుగొలిపెను. అపు డాతనిచే యుధిష్ఠిరసైన్యమున రథములవారును, హయారూఢులును, గజారోహకులును బెక్కురు హతులైరి. ఓరాజా! ఆభీష్ముని యద్భుతపరాక్రమ మెంతయును మాకింద్రపరాక్రమమును స్ఫురింపఁజేసెను. అటులే భీమధృష్టద్యుమ్నులును సాత్యకియును మిగుల బరాక్రమించిరి. అపుడు ద్రోణునివిక్రమము గాంచి పాండవసైన్య ములు జడియఁదొడంగెను. ఆద్రోణుఁ డొక్కఁడే యెల్లసైన్యములను జంపుటకు సమర్థుఁడై యుండఁగా, నాతనికి శూరులగువారు సహాయు లయినపుడు చెప్పవలసిన దేమున్నది? ఓరాజా! ఆద్రోణునిశరప్రహార ముల నొందినవారు దెలిపినదిది. ఓభరతర్షభా! అటు లాయుద్ధ మెంత యును రౌద్రమైయుండఁ బరస్పర మోహవక శూరులగువారు పిశాచా ద్యావేశముగలవారువలె నొడలు తెలియక పోరాడిరి. ఇంతయేల! అపుడు తమప్రాణములను గాపాడికొనువా రెవ్వరును గానరారైరి." అని తెలుప విని సంజయునిఁ జూచి ధృతరాష్ట్రుఁ డిట్లనియె.

ఎనిమిదవనాఁటియుద్ధమున దుర్యోధనఘటోత్కచులయుద్ధము

"ఓసంజయా! అటు లిరావంతుఁడు మడియుటను విని మహాబలులగుపాండవు లేమి యొనర్చిరో దానిని నా కెఱిఁగింపుము."

అదివిని సంజయుఁ డాతనితో "ఓరాజా! అపు డటు లిరావంతుఁడు మృతుఁడగుటను జూచి భీమునితనయుఁ డగుఘటోత్కచుఁడు గొప్పనాద మొనరించెను. ఓరాజా! ఆమహారావము సపారావారము సపర్వతవనము నగుపుడమినెల్లఁ జలింపఁజేసెను. అటులే దశదిశలును వడంకెను. మఱియు నాచప్పుడు వినినసైన్యమునకుఁ దొడలఁగంప మొదవెను. వడఁకుపుట్టెను. చెమ్మటలు గ్రమ్మసాగెను. మీవా రెల్లరును దీనమానసులై సింహమునకు జడిసినయేనుఁగులువలె జడిసి, స్తానులవలెఁ జుట్టిపోయిరి. అటులు మహానాద మొనరించి యాఘటోత్కచుఁడు భీకరాకారమును బూని తేజోవిరాజమానమగు నొకశూలమును గేలను ధరించి, నానాప్రహరణములుగల రాక్షసవీరులతోఁగూడి క్రోధావేశమునఁ గాలాంతకుఁడువలె వెడలెను. అంతఁ గుపితుఁడై ఘోరరూపముతో వచ్చుచున్న యాతనిఁ గాంచి భీతిలుచు విముఖమైయున్న తన సైన్యమును జూచి సుయోధనుఁడు ఘటోత్కచునిపై వెడలి శరశరాసనధరుఁడై సింహనాద మొనరించెను. కొండలవంటి పదివేలయేనుఁగులతోఁ గూడి వంగదేశాధీశుఁ డాసుయోధనునకు సహాయుఁడై యాతనివెనుక వెడలెను. అటులు గజసైన్యముతోఁ దనపైకివచ్చు నీతనయునిఁ గని భీమనందనుఁ డెంతయుఁ గుపితుఁడైయుండెను. అంతఁ జూచువారిమేనుల గగురుపాటొదవించు గొప్పసంకులసమరమయ్యెను. మబ్బులువలెఁ బరువులిడు నాగజసైన్యమును గాంచి రాక్షసులు శస్త్రపాణులై వానిపైకిఁ బరువులిడిరి. అపుడు మేఘములువలె బహువిధముల గర్జించుచు శక్తియష్టినారాచాదులతో మనవారిగజయోధుల నురుమాడుచు విజృంభించిరి. మఱియు నారక్కసులు వృక్షములు పర్వతాగ్రములు మున్నగువానిచే నామహాగజములను వధింపసాగిరి. ఓరాజా! అపుడు రాక్షసులచేఁ జంపఁబడు నాయేనుఁగులు కుంభములు వ్రయ్యలై మేనులు వగుల రక్తముల స్రవించుచుండుటను మేమెల్లఁ జూచితిమి. ఆగజయోధులు భంగపడి క్షీణపరాక్రములగుడు నంత దుర్యోధనుఁడు, కుపి

తుఁడై ప్రాణములం దాసవిడిచి యారక్కసుల నెదుర్కొని వారిపైఁ దీవ్రనారాచములఁ బఱపెను. మఱియు నామహాబలుఁ డటులు కుపితుఁడై ప్రధానులగు రాక్షసుల నెల్లఁ జంపుచు, మహారౌద్రాకారముతోఁ గడుపడిగావచ్చు విద్యుజ్జిహ్వుఁడను వానిని, నాల్గుబాణములచేఁ బ్రహరించి, యింకను శరవర్షమును రక్కసులమూఁకపై గురిపించెను. ఓ రాజా! నీకొమరుఁ డటులు విజృంభించి భయంకరకర్మము నొనర్చుటను జూచి, కోపావేశపరవశుఁడై ఘటోత్కచుఁడు తనమహాబలము మెఱయ, విల్లుసారించి కడువడిగా నాదుర్యోధనునిపై కుఱికెను. ఓయాంబికేయా! మఱియు నటులు వెడలి కాలసృష్టుఁ డగుయమునివలె వచ్చునా దుర్యోధనునిఁ గాంచి యించుకేనిఁ జలింపక కోపముచేఁ గన్ను లెఱ్ఱవాఱ నారక్కసుఁ డాతనితో "ఓయీ! పాండవులు క్రూరుఁడవగు నీ మూలమునఁ గపటద్యూతమునఁ బరాజితులై చిరకాలము ప్రవాస మొనరించిరిగదా! మఱియు ద్రౌపది రజస్వలయై యేకవస్త్రయై సభ కీడ్వంబడి యెంతయుఁ గ్లేశముగాఁ బీడింపఁబడియెనుగదా! మఱియు నాతండ్రులను బరాభవించి సైంధవుఁడు ద్రౌపది నవమానించెనుగదా! అటులు వాఁడొనర్చుట నీప్రీతికై గాదే! ఈనా తెలిపినయవమానములె గాక యింకను గలవు. ఓవంశాధమా! ఇట్టి నిన్నిపుడు చంపి నాతలిదండ్రులఋణము దీర్చికొనియెదను. నీ వీరణరంగమున నిలిచియుండువేని నిన్నంతమొందించువాఁడను" అని పలికి పండ్లుకొఱుకుచుఁ బెదవుల మూలములఁ దడుపుచు, ధనుష్టంకార మొనర్చి వర్షకాలమునఁ బర్వతము నుదకధారలచే మేఘుఁడువలె గొప్పశరవర్షముచే నాసుయోధనుని ముంచెను." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## ఘటోత్కచునియుద్ధము

"ఓధృతరాష్ట్రా! దానవులకు సైత మోరువరాని వానిబాణవర్షమును, నీతనయుఁడు పెనువానను బక్షివలె నోరిచి యంతఁ గుపితుఁడై నిట్టూర్పులిడు పన్నగమువలె రోఁజుచుఁ బ్రాణసంశయ మొందుచు, నారక్కసునిపై నిరువదైదుబాణములను బ్రయోగించెను. ఓరాజా! ఆ నారాచములు కుపితములగుపాములువలె గంధమాదనమువలె వెలయు నారక్కసునిపైఁ బడియెను. అపు డాఘటోత్కచుఁడు మదమును

స్రవింపఁజేయు నేన్గువలె రక్తమును స్రవింపఁజేయుచు, దానితో సుయోధనుఁడు మరణించు నను నిశ్చయముతోఁ గొండలనుసైతము ఖండింపఁదగు నొకమహాశక్తిని ధరించెను. అయ్యది ప్రజ్వలించు మహోల్కవలె నొంతయు నాతనిబాహువునఁ గానవచ్చెను. అటు లాతఁ డెత్తిన యామహాశక్తిని గాంచి వంగదేశాధీశుఁడు వడిగా వెడలి, పర్వతతుల్యమగు నొకయేన్గు నారాక్షసునిపైఁ బురికొలిపెను. బలిష్ఠమగు నాయేన్గు వడిగా వెడలి యాదుర్యోధనునిరథమార్గమున కడ్డువడియెను. ఓమహారాజా! అటులగుట కాఘటోత్కచుఁ డెంతయుఁ గోపముచేఁ గన్నులెఱ్ఱచేసి తానెత్తిన యామహాశక్తి నాయేన్గుపై విసరెను. ఘటోత్కచబాహువిముక్తమగు నామహాయుధముప్రేటుచే నామేటియేన్గు రక్తమును గ్రక్కుచు నేలఁగూలెను. అంత నావంగాధీశుఁ డద్దాని నుండి పుడమి కెటులో డిగి పరువిడిపోయెను. అపు డాపడియున్న యేన్గును జెదరిన తనసైన్యమును గాంచి నీకొడు కెంతయుఁ జింతిలుచు, క్షత్రధర్మమును, దనమానమును రక్షించుకొనువాఁడై కొండవలెఁ గదలక, కాలాగ్నితుల్యమగు నొకతీవ్రబాణమును సంధించి యాఘటోత్కచునిపైఁ బ్రయోగించెను. వజ్రాయుధమునాఁ దనపైకివచ్చు నాఘోరనారాచమును జూచి యాఘటోత్కచుఁడు తనలాఘవము మెఱయఁ దప్పించుకొని రక్తాంతలోచనుఁడై మఱియు మహానాద మొనరించెను, యుగాంతమేఘము నారావమునకువలె నాయారావమున కెల్ల సైన్యములును బెదరెను. ఘోరమగు నాయారావమునువిని శాంతనవుఁ డాచార్యునిఁ జేరి "ఓయాచార్యా! రాక్షసప్రేరితమగు ఘోరారావమును వింటివా? ఇపు డాఘటోత్కచుఁడు మనసుయోధనునితోఁ బోరాడుచున్నట్లు గానవచ్చుచున్నది. వీని నెవ్వరును రణరంగమున జయింప నలవిగాదు. కావున మీరెల్లఁ బోయి, సుయోధనుని రక్షింప వలయును. వాఁడు దుర్యోధనునిఁ దఱుముచున్నవాఁడు. మనయెల్లరకు నిపు డాతనిఁ గాపాడుట పరమకర్తవ్యమైయున్నది." అని తెలిపెను.

అదివిని ద్రోణుఁడు, సోమదత్తుఁడు, బాహ్లికుఁడు, సైంధవుఁడు, కృపుఁడు, భూరిశ్రవుఁడు, శల్యుఁడు, బృహద్బలుఁడు, అశ్వత్థామ, వికర్ణుఁడు, చిత్రసేనుఁడు, వివింశతి మున్నగుమహారథు లెల్లరును గడు వడిగా వెడలిరి. వారివెనుకఁ బెక్కువేలరథములు వెడలెను. అటులు

వెడలి పరువిడుచున్న దుర్యోధనునిఁ జేరి యాతనిపై కాతతాయినులై వచ్చునాఘటోత్కచునుండి తప్పింప నెంచి యారక్కసుని మూర్కొనిరి. అపు డాతఁడును దనజ్ఞాతులతోఁగూడి శూలముద్గరాదులగు నానా యుధములను బూని నీవారి నెదుర్కొనియెను. అంత నారాక్షసులకును, నీవారిసైన్యమునకును గగుర్పా టొనరించు గొప్పసంకులసమర మయ్యెను. ఎల్లయెడల ధనుష్టాంకారములు వినవచ్చెను. ఓమహారాజా! యోధులకవచములపై శస్త్రములు పడునప్పటిచప్పుడులు వెదుళ్లు కాలు నప్పటిచప్పుడులు నాఁదగియుండెను. మఱియుఁ గొండలు ఖండింపఁబడు నట్లుండెను. వీరులబాహులనుండి వెడలి యాకసము నంటుచున్న తోమ రాదులు పరువులిడుసర్పములునాఁ గానవచ్చెను. పిమ్మట నారాక్షసేంద్రుఁడు మిక్కిలి కుపితుఁడై ధనువు సారించి భయంకరముగా నఱచి యాచా ర్యునివి ల్లొకయర్ధచంద్రబాణముచేఁ ద్రుంచివై చెను. అటులే సోమ దత్తునిధ్వజమును గొట్టి సింహనాద మొనర్చుచు, బాహ్లికునివక్షమును మూఁడుబాణములచే నొప్పించెను. మఱియుఁ గృపు నొకకోలచేతను, జిత్రసేనుని మూఁడువాఁడికోలలచేతను గొట్టి గట్టిగా లాగి విడిచినట్టి యొకబాణముచే వికర్ణుని మూపుటెమ్ముకలపైఁ గొట్టఁగా నతఁడు రక్త సిక్తాంగుఁడై యారథకూబరముచేరువను బడియెను. పిదప నతఁడు పదు నైదుబాణములచే భూరిశ్రవునిఁ గొట్టఁగా నవి వానికవచమును భేదించి పుడమి నడఁగెను. పిమ్మట నాఘటోత్కచుఁడు వివింశత్యశ్వత్థామల సారథులను బ్రహరింపఁగా వారు తమతమపగ్గములను విడిచి యారథో పస్థమునఁ బడిరి. మఱియు నతఁ డటులు విజృంభించి స్వర్ణభూషిత వరాహచిహ్నము నొకయర్ధచంద్రముచే ఖండించి, వేఱొకదానిచే వాని విల్లు దునిమి క్రోధరక్తలోచనుఁడై నాల్గునారాచములచే బృహద్బలుని నాల్గుగుఱ్ఱములను గొట్టి మఱియు నొకతీవ్రమగుపచ్చనిబాణముచే నారాజపుత్రుని నొప్పించెను. వాఁ డావాఁడికోలవ్రేటున కోరువలేక యారథమధ్యమునఁ గూలఁబడియెను. పిదప మఱియు నారాక్షసేంద్రుఁడు క్రోధావిష్టుఁడై తీవ్రములై సర్పసన్నిభములగుబాణములను బ్రయో గింపఁగా నయ్యవి శల్యు నెంతయు నొప్పించెను." అని తెలిపి సంజ యుఁడు మఱియు నిట్లనియె.

### ఘటోత్కచునియుద్ధము

"ఓ రాజా! అటు లారాక్షసుఁడు నీవారినెల్ల యుద్ధవిముఖులఁగా నొనరించి సుయోధనునిఁ జంపువాఁడై యాతనిపైఁ బరువులిడ నాతనిఁ గాంచి కొందఱు నీవారు రణగర్వితులగుచు వెడలి తాలప్రమాణములగు ధనువుల నాకర్షించుచు, సింహనాదము లొనర్చుచు, నాఘటోత్కచు నెదుర్కొని వలాహకములు వారిధారలచేఁ బర్వతమునువలె నాతని శరధారలచే ముంచిరి. అంత నాఘటోత్కచుఁ డాశరప్రహారములకు నొచ్చి యంకుశవిద్ధమగుగజేంద్రమువలెఁ గుపితుఁడై గరుడునివలె మింటి కెగిసి శరత్కాలమేఘమువలె నెంతయు గర్జించుచు, దశదిశలు మాఱుమ్రోఁగ మహానాద మొనరించెను. అదివిని యుధిష్ఠిరుఁడు శత్రుమారకుఁ డగుభీమునితో, "ఓభరతోత్తమా! మహారథులగు ధార్తరాష్ట్రులతో నీతనయుఁ డగుఘటోత్కచుఁడు పోరాడుచున్నవాఁడు. ఆతని భీకరారావము వినవచ్చుచున్నది. ఇప్పటియుద్ధవిధ మెంతయు వానికిఁ గష్టమైయున్న ట్లూహించుచున్నాఁడను. మఱియు భీష్ముఁడును గుపితుఁడై పాంచాలురను బంచత్వ మొందింప నెంచియున్నవాఁడు. వారిని రక్షించుటకై మనయర్జునుఁ డందులకుఁ బోయి యుద్ధమొనర్చుచున్నవాఁడు" అని తెలిపెను. అదివిని యటు లొక్కమాఱుగాఁ దటస్థించిన రెండుకార్యములను దలంచి, తనతనయుని రక్షించుట యప్పు డావశ్యకమగు ననుధర్మజునివచనము శిరసావహించి భీముఁ డెంతయు వడిగా వెడలి రాజులకెల్ల వెఱపుగలిగించుచు సింహనాదముతో వారిని సమీపించెను. అప్పు డతఁడు పర్వకాలమునందలిసముద్రమువలె నుప్పొంగుటను జూచితిమి. అంత నాభీముని సత్యధృతియు, సౌచిత్తియు, శ్రేణిమంతుఁడును, వసుదానుఁడును, గాశ్యపుత్రుఁడును, నభిమన్యుఁడును, మహారథులగు ద్రౌపదేయులును, నిజసేనాసహితుఁడై నయనూపాధీశుఁ డగు నీలుఁడును వెంబడించి వైరులను శరవర్షమున ముంచుచు, నాఘటోత్కచునకు రక్షకులై యుండిరి. మఱియు వారిసింహనాదములకును రథనేమిధ్వనులకును వసుంధర వడఁకసాగెను. అటు లొక్కసారిగా వెడలివచ్చినవారి నారసి నీవారిసైన్యము భీమసేనునకు భయపడి ముఖవికాసము చెడినదయ్యెను. ఓమహారాజా! అప్పు డాసైనికు లాఘటో

త్కృచుని విడిచి మఱలిపోయెను. అంత నపాండవులకును నీవారిలోఁ గొందఱకును మహాసంగ్రామ మప్పుడు ప్రారంభమయ్యెను. మహారథులెల్లరును నానాయుధములను బ్రయోగింపసాగిరి. ఒకరిపై నొకరు పరువులిడుచుఁ బరస్పరమును బ్రహరించుకొనుచుండిరి. అటు లెంతయు మహారౌద్రమై భయావహ మగు నాసమయమున హయగజపదాతులతో రథికులు పరస్పరము స్పర్థించుకొనుచు సమీపింపసాగిరి. అట్టి తీవ్రసమావేశమున గొప్పధూళి లెగయఁజొచ్చెను. అటులు గజహయరథపదాతుల మూలమున వెడలినయాధూళి లాసమరభూమి నాక్రమించెను. ఆపలు రంగులుగలపతాకములచేఁ దమవారినియుఁ బెరవారినియు భేదము నెవ్వరును దెలియఁజాలరైరి. తండ్రి తనకొడుకుని గుమారుఁడు వానితండ్రిని గుఱుతింప నవకాశము లేదయ్యెను. పరిమితిలేక యట్టిఘోరసంహార మారంభమగుడు ప్రయుక్తము లగునస్త్రములయు, గర్జించునట్టివీరులయు, మహారావములు, ప్రేతధ్వనులు నాఁదగి వెఱపుగొలుపసాగెను. గజవాజిపదాతులరక్తప్రవాహముతోఁ గేశములనెడినాఁచుతో నొకనది యేర్పడియెను. వీరులశరీరములనుండి పడియెడితలలచప్పుడులు పాషాణపతనమునందలి ధ్వనుల ననుకరించెను. అప్పుడు తలలు తెగిన వీరులును, ఖండితగాత్రములైన గజములును, మేనులుతునిఁగిన గుఱ్ఱములును బుడమినెల్ల నావరించి యుండెను. మహారథులు నానావిధాయుధములను బ్రయోగించుకొనుచుఁ బరస్పర మెదుర్కొనుచుఁ జంపుకొనుచుండిరి. రౌతులచే పురికొలుపఁబడి గుఱ్ఱములు గుఱ్ఱములను మార్కొనఁ జొచ్చెను. అటులే పదాతులు నొకరినొకరు మార్కొని పరస్పరముఁ జంపికొని నేలఁగూలసాగిరి. మావటివారిచేఁ బ్రోత్సహింపఁబడిన యేనుగులు చెలరేఁగి యేనుగుల నురుమాడెను. అయ్యవి పతాకలతోఁ గూడి రక్తసిక్తాంగములై మెఱపులతోఁగూడిన మేఘములువలెఁ గానవచ్చెను. మఱికొన్ని యేనుగులు దంతాగ్రములచే మేనులు వగులఁ గుంభములు వ్రయ్యలుగా నఱచుచు గర్జించునట్టిమేఘములు నాఁజూపట్టెను. ఇంకను గొన్నితొండములు రెండుగాఁ జీలియు, మేనులు దెగియు నాసంకుల సమరమున తెక్కలుదెగినకొండలువలెఁ బడియుండెను. మఱికొన్ని యేనుగులు వైరివారణములచేఁ బార్శ్వములు చీల్పఁబడి గైరికాదిధాతువుల గొండలువలె రక్తములను గార్చుచుండెను. నారాచనిహతులును,

దోమర ప్రహృతులు నగురౌతులు శిఖరములుదెగినపర్వతములు నాఁ జూపట్టిరి. కొందఱు యోధులు క్రోధపూరితులై మదాంధులై వందల కొలఁది రథహయపదాతులను మర్దించిరి. అటులే రౌతులు గుఱ్ఱములను దోమరములచేఁ బ్రహరింపసాగిరి. మఱియు దెస లాకులము లగునట్లుగా నొకరినొకరు తలపడి రథికులు రథికులతోఁ బ్రాణములయెడ నాశవిడిచి పోరాడ నారంభించిరి. యుద్ధకుశలు లగుయోధులు కొందఱు యశ మునే గోరి పరస్పరముఁ బ్రహరించుకొనిరి. అట్టిసంకులయుద్ధమున మన వారిసైన్య మెంతయుఁ బరాఙ్ముఖము గాఁజొచ్చెను." అని తెలిపి సంజ యుఁడు మఱియు ని ట్లనియె.

## ఘటోత్కచుని మాయాప్రదర్శనము

"ఓరాజా! అప్పు డటులు తనసైన్యము భగ్నమగుటను జూచి, వైరిమారకుఁ డగుభీముని, సీకొమదుఁ డగుసుయోధనుఁడు మార్కొని యింద్రాయుధతుల్య మగు నొకగొప్పవిల్లు పూని శరవర్షముచే నాతనిఁ గప్పి, మఱియు నొకయర్ధచంద్రబాణమును బ్రయోగించెను. లోమవాహియై వాఁడిగలయది యాభీమునివిల్లు రెండుఖండము లొనరించెను. ఇంతలోఁ గొండనుసైతము ఖండింపఁ దగు నొకతీవ్రబాణముచేఁ గడు వడిగా నాభీమునివక్షమును గొట్టి సింహనాద మొనరించెను. అటులు భీముఁడు గాఢముగాఁ గొట్టుపడి పెదవులకొనలఁ దడుపుచుఁ సువర్ణ భూషిత మగుతనధ్వజమును బట్టికొని కూర్చుండెను. అటు లతఁడు కూలఁబడుటయు మనసుచెడి యుండుటయును జూచి ఘటోత్కచుఁడు కుపితుఁడై మండెడునగ్నివలెఁ బ్రజ్వలింపసాగెను. అభిమన్యుఁడు మున్నగు పాండవవీరులును, నఱచుచు సుయోధనుని ముట్టడించిరి.

అటులు కుపితులై కడువడిగా దుర్యోధనునిపైఁబడవచ్చినవారి నారసి ద్రోణుఁడు మహారథు లగుకొందఱ సీయోధులతో "ఓవీరులారా! శీఘ్రముగా మీరేగి రాజును రక్షింపవలయును. అతఁడు నిస్సంశయ ముగా నాపత్సముద్రమున మునుఁగ నున్నవాఁడు. మహారథు లగు నిప్పాండవవీరు లెంతయుఁ గుపితులై భీమసేనుని ముందిడికొని యా సుయోధనుని ముట్టడించిరి. నానావిధాయుధములను బ్రయోగించుచు జయాభిలాషులై మన సైన్యములు వెఱఁగందునట్లుగా భయంకరా

రావము లొనర్చుచున్నవారు" అని తెలుప విని యాతనియానతి శిరసా వహించి సోమదత్తుఁడు మున్నగు మనవీరులు పాండవసైన్యములపైకి వెడలిరి. అటులు వెడలి కృపుఁడు, భూరిశ్రవుఁడు, శల్యుఁడు, ద్రోణపుత్రుఁడు, వివింశతి, చిత్రసేనుఁడు, వికర్ణుఁడు, సైంధవుఁడు, బృహద్బలుఁడును దుర్యోధనునకు సహాయులై యాతనిఁ జుట్టును గాచి యుండిరి. అపుడు పాండవులును, ధార్తరాష్ట్రులును నచ్చోటి కిరువది యడుగులదూరముపోయి యందు యుద్ధముచేయ నారంభించిరి. అంత నా ద్రోణుఁడును విల్లు సారించి భీము నిరువదాఱు బాణములచే నొప్పించి, మఱియుఁ బెక్కు బాణములచే, జలధారలచే మబ్బులు పర్వతమునువలె నాతనిఁ గప్పెను. అందుల కలిగి భీముఁడును, దీవ్రబాణములచే వడిగా నాతనిపార్శ్వమునఁ బ్రహరింపఁగా గాటమగు నాయేటుల కోర్వక వయోవృద్ధుం డగునతఁడు నిశ్చేతనుఁడై రథమధ్యమునఁ గూలఁబడియెను. అట్టి యాచార్యునిఁ జూచి నీపట్టియగుదుర్యోధనుఁడును నశ్వత్థామయును గుపితులై కాలాంతకోపములై భీమసేను నెదుర్కొనిరి. అంత నాకౌంతేయమధ్యముఁడును రథము డిగి, గదను బూని కొండవలెఁ జలింపక యందు నిలువఁబడియుండెను. కైలాసశిఖరమువలె నటు లుద్యత గదాయుధుఁడై యున్న యాభీముం గాంచి దుర్యోధనాశ్వత్థామలిరువురును గూడియే యాభీము నెదుర్కొనిరి. అటులు కలిసివచ్చు నాయిరువుర నాభీముఁడును మార్కొనియెను. ఆయుగ్రరూపునిఁ గాంచి మహారథులగు కౌరవయోధులు సందులకుఁ బరువులిడిరి. అంత ద్రోణుఁడు మున్నగువారు భీము నెటులయినఁ జంపవలయునని నానావిధశస్త్రములతో నాతనివక్షము నొప్పించిరి. అటు లెల్లరును గూడి యొకభీమునిఁ బీడించుచుండ సంశయావస్థలోఁబడియున్న భీమునారసి యభిమన్యుఁడు మున్నగు పాండవవీరులు విడువరానివయ్యును బ్రాణములయెడ నాసలు గొలుపక పరువులిడిరి. అపు డనూపాధిపతియు భీమునకుఁ బరమమిత్రుఁడును, నీలమేఘశరీరుఁడు నగు నీలుఁడుం కుపితుఁడై యశ్వత్థామను మార్కొనియెను. ఆనీలుఁ డెపుడును ద్రోణపుత్రుపై నసూయగలిగి యుండువాఁడు. అటులగుట నతఁడు తనవిల్లుసారించి మున్నింద్రుఁడు విప్రచిత్తియనుదానవునివలె నొకబాణముచే నాయశ్వత్థామను నొప్పించెను. అపు డా ద్రౌణియుఁ గుపితుఁడై తనమేన రక్తము స్రవించు

చున్నను జలింపనిధైర్యముతో, ధనువు సారించి యానీలునిఁ జంపకలయు ననునిశ్చయముతోఁ దీవ్రబాణములను సంధించి వానినాల్గు గుఱ్ఱములను, ధ్వజమును నేలఁగూలనేసి, మఱియు నొకబాణముచే వానియురము గుఱిచేసి యేయఁగా దానిచే వాఁ డెంతయును నొచ్చి రథమధ్యమునఁ గూలఁబడెను. అటులు మూర్ఛితుఁడై పడిన యానీలునిఁ గాంచి కుపితుఁడై ఘటోత్కచుఁడు తనవారినిగూడి యుద్ధకుశలుఁ డగు ద్రోణపుత్రుని మాఱ్కొనియెను. అటులే మఱికొందఱురాక్షసులును నందుఁ ఱకుఁ బరువులిడిరి. అంత నాయశ్వత్థామయు ఘోరాకారులగు నారక్కసుల నారసి మున్నుగా నాఘటోత్కచుని యగ్రభాగమున నున్నవారిని బ్రహరించెను. వారు రణవిముఖు లగుటఁ జూచి ఘటోత్కచుఁడు క్రోధావిష్టుఁడై తనమాయ నావిష్కరింపఁజేసెను. అమ్మాయ యెంతయు ఘోరరూపముతో దారుణమై యాద్రౌణిని మోహావశునిఁగా నొనర్చెను. దానిచే నీవారెల్లరును బరాఙ్ముఖులై యొకరి నొకరు చూచుకొనుచు దీనులై పుడమిఁబడి దొరలుచు రక్తమున మునుఁగుచుండిరి. అంత ద్రోణదుర్యోధనశల్యాశ్వత్థాములు వెడలి పోయిరి. రథికులు పలువురు నాశమొంది నేలఁ గూలిరి. వేలకొలఁది రౌతులును, గుఱ్ఱములు ఖండింపఁబడెను. అది చూచి నీసైన్యము నిజ శిబిరములకు మఱలెను. అపుడు నేనును శాంతనవుఁడును "ఓసైనికులారా! ఇది ఘటోత్కచునిమాయగాని సత్యముగాదు. కావున వెఱవక యుద్ధమొనర్పుఁడు." అని యఱచితిమి కాని వారు మిక్కిలి వెఱచి యుండుటను మావచనమును నమ్మరైరి. అటులు వారు పలాయితులగుటఁ జూచి పాండవులు తమ కానాఁడు జయమయ్యెనని తలంచిరి. అంత ఘటోత్కచుఁడు మున్నగువారు సింహనాదములొనరించిరి. పిదప శంఖదుందుభిధ్వనులును విజృంభించెను. అటు లానాఁటిసాయంకాలమున దురాత్ముఁడగుఘటోత్కచునిచే మనసైన్యమెల్లఁ జెదరిపోయెను." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## భగదత్తునిపరాక్రమము

"ఓయాంబికేయా! అట్టి మహాసమ్మర్దమున సుయోధనుఁడు సవినయముగా గాంగేయునిఁ జేరి నమస్కరించి యాతనితో జరిగినవృత్తాంత

మంతయుఁ దెలుప నారంభించి ఘటోత్కచుని విజయమును, దమపరా
జయమును దెలుపుచు మఱిమఱియు నిట్టూర్పు విడువసాగెను. మఱియు
నతఁడు, "ఓపితామహా! పాండవులు వాసుదేవు నాశ్రయించినట్టులే
మేము నిన్నాశ్రయించి యీఘోరయుద్ధ మారంభించితిమి. మఱియుఁ
బదునొకం డక్షౌహిణులును నేనును నీయానతి శిరసావహించి యున్న
వారము. ఓభరతోత్తమా! అట్టి నేను ఘటోత్కచు నాశ్రయించిన
భీమసేనుఁడు మున్నగు పాండవులచేఁ బరాజయ మొందితిని. ఎండిన
మ్రానినగ్నివలె నాపరాజయము నామేనిఁ బరితపింపఁ జేయుచున్నది.
కావున నీయనుగ్రహముచే నారాక్షసాధమును నెట్లయినఁ జంపఁగోరు
చున్నవాఁడను. ఓపితామహా! నీయాశ్రితులమగు మాకీయుపకార
మొనర్పఁదగియున్నవాఁడవు" అని ప్రార్థించెను.

అదివిని యాశాంతనవుఁ డాసుయోధనునితో, "ఓయీ! రాజా!
నేనొకటి తెలిపెదను వినుము. నీవు నాచెప్పినచొప్పున వర్తింపుము.
ఓతాతా! ఎట్టియవస్థలందును శరీరము రక్షించుకొనఁదగియున్నది. నీవు
ధర్మజునితో నిరతము యుద్ధమొనరింపుము. అటుగాదేని యర్జునునితోఁ
గాని, నకులసహదేవులతోఁగాని, భీమునితోఁగాని యుద్ధముసేయుము.
రాజధర్మము ననుసరించి రాజు రాజుతోఁ బోరాడవలయును. నేనును,
ద్రోణకృపాశ్వత్థాములును, కృతవర్మయు, శల్యుఁడును, సౌమదత్తియు,
వికర్ణుఁడును, దుశ్శాసనాదులగు నీసోదరులును నీకై యాఘటోత్కచు
నితోఁ బోరాడెదము. ఆరాక్షసేంద్రునియెడ నీకట్టి యనుతాపముగల
దేని దుర్మతి యగువానితోడి యుద్ధమునకై యింద్రతుల్యుఁ డగుభగ
దత్తుఁడు వెడలును." అని యాసుయోధనునితోఁ దెలిపి యాశాంత
నవుఁడు మఱియు నాభగదత్తునితో నిట్లు పలికెను. "ఓయీ! భగదత్తా!
నే నీమహారాజుసన్నిధినే నీతో నొకటి తెలుపువాఁడను. నీవు యుద్ధ
గర్వితుఁ డగుఘటోత్కచునితోఁ బోరాడ నేగవలయు. ఎల్లసైన్యము
లును జూచుచుండఁగా నీవు వానిని నివారింపవలయును. నీపరాక్ర
మము మిక్కిలి శ్లాఘ్యమైనది. నీయస్త్రములన్నో దివ్యములు. మఱియు
నీవు మున్ను పెక్కురక్కసులతోఁ బోరాడినవాఁడవు. కావున ము
న్నింద్రుఁడు తారకాసురునివలెఁ గ్రూరకర్ముఁ డగు నీఘటోత్కచు
నెదుర్కొని హింసింపవలయును. ఓరాజా! నీవే వాని నెదురింపఁదగిన

వాఁడవు. నీవు నీవిక్రమమును బ్రకటించి వారి నెటులయినఁ జంపఁగల యును." అని తెలుప సేనాపతి యగు నాశాంతనవునివచనములు విని యాభగదత్తుఁడు సింహనాదమొనరించి వైరిసైన్యములను మార్కొన వెడలెను. అటు లుద్ధతుఁడై వచ్చు నాభగదత్తునిఁ గాంచి పాండవరథి కులు కుపితులై వాని నెదుర్కొనిరి. అపుడు భీముఁడు, నభిమన్యుఁడు, ఘటోత్కచుఁడు, ద్రౌపదేయులును, సత్యధృతి, క్షత్రదేవుఁడు, చేది వంశ్యుఁడగు వసుదానుఁడు, దశార్ణదేశాధీశుఁడును మున్నగు యోధు లటు లెదుర్కొనుటను జూచి భగదత్తుఁడు తన సుప్రతీకమనెడి మహా గజ మధిష్ఠించి పోరాడ నారంభింపఁగా వారి కపుడు గొప్పసంగ్రామ మయ్యెను. అయ్యది యమరాజ్యమునకు వృద్ధిహేతువయ్యె ననుటకు సందియము లేదు. రథికులు ప్రయోగించిన వాఁడిబాణములచే నేన్గులును, రథములును బుడమిఁ బడియెను. మహాగజములు మావటివారిచేఁ బ్రోత్సాహ మొనర్పఁబడి పరస్పరము చంపుకొని నేలఁ గూలసాగెను. మఱియు నవి కొన్ని దంతములనియెడి రోకండ్లచేఁ బీడించికొనుచు నొకదాని నొకటి నొప్పించుకొనుచుండెను. అటులే రౌతులచేఁ బురి కొల్పఁబడినగుఱ్ఱములును బరస్పరముఁ గలసి పోరాడఁదొడంగెను. పదా తులు పదాతులనుజేరి శక్తితోమరాదులచేఁ బీడించికొనుచుండిరి. రథి కులు రథికులను దీవ్రసాయకములచేఁ బీడించి సింహనాదముల నొనర్ప సాగిరి. అట్టి మహాసంగ్రామమున, భగదత్తుఁడు భీమునిఁ దాఁకెను. సెల యేఱులు గలకొండవలె మదధారాపూరితమగు నాతని యేన్గు మున్ను పురందరు నైరావతమువలెఁ గానవచ్చెను. అట్టి తనసుప్రతీకమెక్కి యా భీమునిపై శరవర్షమును గుఱియ, వేసవిముగిసిని వారిధారలచేఁ గప్పఁ బడిన మహాపర్వతమువలె భీముఁడు గానవచ్చెను. అంత నాభీముఁ డం దులకుఁ గుపితుఁడై, శరవర్షముచే మనవారిపాదరక్షకులను వేలకొలఁ దిగా మడియించెను. అది చూచి భగదత్తుఁడు కోపావేశమునఁ దన సుప్రతీకము నాభీమునిరథముపైఁ బురికొలిపెను. ఆయేన్గు, వింటినుండి వెడలినబాణమువలె గడువడిగా వెడలుటయుఁ బాండవరథికు లగు కేక యులు, ద్రౌపదేయులు, నభిమన్యుఁడు, దశార్ణదేశాధీశుఁ డగు క్షత్ర దేవుఁడు, చేదిపతి యగుచిత్రకేతుఁడును భీమునకు సాహాయ్య మొన రింప వెడలి యాయేన్గును ముట్టడించి దానిని శరవర్షమున ముంచిరి.

అపు డది ధాతుమగ్న మగుపర్వతరాజమువలెఁ గానవచ్చెను. అంత దశార్ణదేశాధీశ్వరుఁ డగు క్షత్రదేవుఁడు పర్వతసన్నిభ మగు తనయేనుఁ నెక్కి భగదత్తుని మహావారణమును వారింప వెడలఁగా నది సముద్రమును వేలవలె దాని నడ్డుకొనియెను. అపుడు పాండవు లాతనిసైన్యములను మెచ్చుకొనిరి. అందులకుఁ గుపితుఁడై భగదత్తుఁడు పదునాల్గు తోమరముల నాక్షత్రదేవు నేనుఁగుముఖమునఁ గొట్టి నొప్పించెను. అంత నాయేనుఁ గెంతయు నొచ్చి భయంకరారావ మొనర్చుచు నిజసైన్యమునే త్రొక్కుచుఁ గడువడిగా వెడలిపోయెను. అటు లా పరాజయమునొందఁ బాండవరథికులు సింహనాదములు సేయుచు యుద్ధసన్నద్ధులై భీముని ముందిడికొని భగదత్తునిపై వివిధములగు శస్త్రాస్త్రములను ప్రయోగింప సాగిరి. అటులయ్యు నతఁ డించుకేని వెఱువక తనయేనుఁగును హెచ్చరించుచు వెడలుటయు, నది పాండవబలములనెల్లఁ బలువిధముల మర్దింప నారంభించెను. దానిచేఁ బీడితమై పాండవబలమెల్ల నగ్నిలోఁబడినచర్మమువలె సంకోచమొందెను. అటులు తమసైన్యము భగ్నమగుటఁగాంచి ఘటోత్కచుఁడు కుపితుఁడై, దీప్తాస్యుఁడును, దీప్తనేత్రుఁడు నగుచు, వికటరూపముచే వెఱపుగొలుపుచు భగదత్తు నెదుర్కొని కొండలను సయితముఁ జెండాడఁదగు నొకశూలము నాతనిగజముపైఁ బ్రయోగించెను. అంత నాశూలము మిఱుఁగుఱులు గ్రమ్ముచు నెల్లెడలఁ దనతేజమును వెలయింపఁజొచ్చెను. అటులు మిగులఁ దీవ్రమై వచ్చు నాశూలమును గాంచి భగదత్తుఁ డొకయర్ధచంద్రబాణమును దానిపై విసరెను. అపు డాశూల మాయర్ధచంద్రముచే రెండుఖండము లయ్యెను. అటులది ఖండితమగుటను జూచి సువర్ణదండమును నగ్నిజ్వాలాతుల్యమునగు నొకమహాశక్తిని బరిగ్రహించి, యాఘటోత్కచునితో నిలునిలుమని పలుకుచు, దానిని వానిపైఁ బ్రయోగింపఁగా నాఘటోత్కచుఁడు దానినాకసమునందుండఁగనే చూచి, వడిగా నెగిరిపట్టుకొని తనముడుకుతో దానిని విడిచి సింహనాదమొనరించెను. దానిని జూచి భగదత్తుఁ డచ్చెరువొందెను. బలవంతుఁ డగునాఘటోత్కచుని యాదుష్కరకర్మమునకు దేవతలును గంధర్వులును మునులును విస్మయము నొందసాగిరి. భీమసేనుఁడుమున్నగుపాండవులు మేలుమేలనెడివచనములచే నాతనిఁ బొగడి పుడమిఁ బ్రతిధ్వనింపఁజేసిరి. అంత నాపాండవుల యుత్సాహధ్వనుల

నాలించి భగదత్తుఁడు సహింపలేక, తనపరాక్రమము మెఱయునట్లుగా నింద్రాశనితుల్యమగు తనవిల్లు సారించి తీవ్రము లగునారాచములను బ్రయోగించుచుఁ, బాండవయోధులకు వెఱపుగలిగింపఁ దొడఁగెను. మఱియు నతఁడు భీము నొకటను, ఘటోత్కచునిఁ దొమ్మిదింటను, నభిమన్యుని మూఁడింటను, కేకయుల నైదింటను, ద్రౌపదేయుల నిరువదైదింటను గొట్టి భీమసేనునిగుఱ్ఱములను బడఁగొట్టి మూఁడుబాణములచే నాతనిధ్వజమును ఖండించెను. మఱియు మూఁడుబాణములచే సారథిని నొప్పింపఁగా నావిశోకుఁ డెంతయు నొచ్చి రథమధ్యమునఁ గూలఁబడియెను. ఓ రాజా! అటులు భీముఁడు, తనసారథి మూర్ఛపడుటయు గదను బూని రథముడిగి, మీవారిసైన్యముపై వెడలెను. శిఖరముతో గూడిన కొండవలెనున్న యాభీముని గాంచి కౌరవసైన్యము భీతమయ్యెను. ఓ మహారాజా! అంతలోఁ గృష్ణసారథి యగుపాండవమధ్యముఁడు శత్రుసైన్యములను దునుమాడుచు భగదత్తు నెదురించియున్న తండ్రీ కొడుకు లగు భీమసేనఘటోత్కచులకడకు వచ్చి మహారథులై యుద్ధము చేయుచున్న తనసోదరులను గాంచి, తాను నచ్చో యుద్ధమొనర్ప నారంభించెను. పిమ్మట మహారథుఁ డగుదుర్యోధనుఁడును గడువడిగా వెడలి రథగజసమాకులమగు తనసైన్యమును బ్రోత్సహించెను. అటు లతఁడు ప్రేరించుటను వెడలినకౌరవసైన్యమును గాంచి యప్పాండవమధ్యముఁడు వాని నెదుర్కొనియెను. అంత భగదత్తుఁడును దన మహాగజమును బాండవసైన్యముపైఁ బురికొలిపి త్రొక్కించుచు యుధిష్ఠిరుని మార్కొనియెను. అపు డాయుధధారు లగు పాంచాల సృంజయకేకయులతో నాభగదత్తునకు సంకులసమర మయ్యెను. అంత భీముఁడును గేశవార్జునులును నిరావంతుని మరణమును వినిరి" అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

ఎనిమిదవనాఁటియుద్ధము ముగియుట

"ఓయాంబికేయా! అటులు ధనంజయుఁడు తనపుత్రునిమరణమును విని యెంతయు దుఃఖితుఁడై సర్పమువలె నిట్టూర్పులిడుచు వాసుదేవు నారసి, "ఓ దేవా! మహామతి యగు విదురుఁడు మహాప్రాజ్ఞుఁడగుటను, గురుపాండవులకు ప్రాప్తించిన యీఘోరభయమునెల్ల

మున్నే గనిపెట్టి ప్రజాధీశుఁడగు ధృతరాష్ట్రునితో నీసంగ్రామము నెటులయిన వారింపవలయునని బోధించెను. ఓమధుసూదనా! ఆతఁ డన్నటులీమహాసంగ్రామమునఁ గౌరవులచే మనవారు పలువురు నశించిరి. అటులే మనవారిచేఁ గౌరవబలమును నశించెను. ఓపురుషోత్తమా! ధనము నిమిత్తముగా నిట్టి నీచకర్మ మొనర్పబడుచున్నదిగదా! ఛీ! ఛీ! ఈ ధనమునకే జ్ఞాతులెల్ల నశింపఁజేయఁబడుచున్నారు. ధనము లభింపకున్నను మరణమే మేలుగాని జ్ఞాతివధము శ్రేయముగాదు. ఓకృష్ణా! ఇటులు వచ్చినజ్ఞాతులను వధించి మే మేమి లాభ మొందువారము. అయ్యో! దుర్యోధనునితప్పిదముచేతను, కర్ణశకునులదురాలోచనముచేతను రాజులెల్లరును మడియుచున్నారు. ఓమధుసూదనా! ధర్మజుఁడు తనకై దూళులయినఁ జాలు నిమ్మని, సుయోధనుని యాచించుట యెంతయు శ్రేయోదాయకమైనపని యని యిపుడు గ్రహింపఁగలిగితిని. దుర్బుద్ధి యగునాసుయోధనుఁ డవియు నొసంగఁడయ్యెను. ఇపు డీరణరంగమున బడిన క్షత్రియశూరులను గాంచి, ఛీ! ఛీ! క్షత్రజీవనము మిగులఁ గష్టమని నన్ను నే నిందించుకొనుచున్నవాఁడను. ఓదేవా! జ్ఞాతులతో యుద్ధ మొనర్ప నాకిష్టముగాకున్నది. కాని నేను యుద్ధమునకుఁ జాలక యిటులైతినని యీక్షత్రియులు తలంపకమానరు. కావునఁ గడువడిగా ధార్తరాష్ట్రసైన్యముపై మనరథము నడుపుము. అంతులేని యీసమరసముద్రమును నాభుజములచే దాఁటువాఁడను. ఓమాధవా! ఇఁకఁ గొంచమే నిపుడు నిస్సారముగా నుండుట కిది కాలముకాదు" అని తెలిపెను.

అదివిని యావాసుదేవుఁడు, వడిగల తనరథాశ్వములను గౌరవబలముపైఁ బఱపెను. ఓరాజా! అపుడు మనవారిసైన్యమున గొప్ప కోలాహలమయ్యెను. అపరాహ్ణమునఁ బ్రారంభమైన యాసంగ్రామమున వాతోద్ధూతమై పర్వదినమునఁ గానఁబడుమహాసాగరమువలె సైన్యములు గానవచ్చెను. పాండవుల నెదుర్కొనిన భీష్మునిచాపధ్వని యుఱుములవలె వినవచ్చెను. ఓరాజా! అపుడు నీకొడుకులు భీము నెదుర్కొనిరి. వారికి, మున్ను వసువులకు వాసవుఁడువలె, ద్రోణుఁడు సహాయుఁడై యుండెను. పిమ్మటఁ గృపుఁడును, శాంతనవుఁడును, భగదత్తుఁడు, సుశర్మయును, నర్జునునిఁ దాఁకిరి. కృతవర్మయు బాహ్లికుఁడును

సాత్యకి నెదుర్కొనిరి. అంబష్ఠుడును రాజోత్తముం డభిమన్యుని మార్కొనియెను. మిగిలినపఱికొందఱు మఱికొందఱ నెదుర్కొనియుద్ధము చేయందొడంగిరి. పిమ్మట భయప్రద మగుయుద్ధ మారంభ మయ్యెను. ఓరాజా! భీముఁడు నీపుత్రులను గాంచి హవిస్సుచే నగ్నివలెఁ బ్రజ్వలించెను. అంత నీకొడుకులును నాతని వర్షకాలపుమబ్బులు పర్వతమును వలె బాణములచేఁగప్పిరి. అటులు వారిశరవర్షమునఁ దోగి యాభీముఁడు, నెలవులఁ దడుపుచు బెబ్బులివలెఁ గడువడిగా నొకతీవ్రబాణముచే వ్యూఢోరస్కునిఁ బడఁద్రోసి, మఱియును వాఁడిగల యొకపచ్చనిబాణముచే, సింహము ముక్కిడిమృగమునువలెఁ గుండలియనువానిసజంపెను పిదప మఱియు మఱికొన్నితీవ్రనారాచముల సంధించి వడిగా నీకొడుకులపైఁ బఱపఁగా, నయ్యవి యామహారథులను రథములనుండి కూలఁద్రోసెను. అటులు నేలఁగూలిన, యనాధృష్టియుఁ, గుండభేదియు, వైరాటుఁడు, దీర్ఘనేత్రుఁడు, దీర్ఘబాహువు, సుబాహువు, కనకధ్వజుఁడును వసుధఁగూలిన వసంతపుష్పవృక్షములువలెఁ గానవచ్చిరి. ఓరాజా! మిగిలిన నీకొడుకులు వడిగా వెడలిపోయిరి. అపు డతఁడు నీవారికి యముఁడువలెఁ గానవచ్చెను. అంత ద్రోణుఁ డాతనిఁ గాంచి జలధారలు పర్వతమునువలె శరధారలచేఁ గప్పెను. ఓరాజా! అపు డాభీముని పరాక్రమ మద్భుతముగాఁ జూచితిమి. ఆహా! అటులు ద్రోణుఁడు తన్ను నివారించుచున్నను, నాకసమునుండిపడెడి వర్షధారలను వృషభమువలె నాద్రోణునిశరధారలను లెక్కగొనక యాభీముఁడు నీకొమరులను గొట్టుచునే యుండెఁ. ఓమహారాజా! అపుడు భీముఁ డద్భుతవిక్రమము చూపెను. అటు లతఁడు నీకొడుకులను బ్రహరించుచు ద్రోణుని నివారించుచు లేడికూటువను బెబ్బులివలె సందుఁ జరించుచు నీకొడుకులను మడియింపసాగెను. అపు డావృకోదరునిఁ గాంచి నీకొడుకులు వెఱచి వృకమును జూచినమేకలవలె నలుదెసలకును జెదరిపోసాగిరి. అంత శాంతనవుఁడును, భగదత్తుఁడును, గృపుఁడును, గడువడి వెడలి, కవ్వడి నెదుర్కొని యస్త్రప్రయోగ మొనరించిరి. అపు డతఁడు వారియస్త్రముల, నిజాస్త్రములచేఁ బ్రతిహత మొనరించి, నీవారిసైన్యమునందలి వీరులను మృత్యువశులఁగాఁ జేయదొడంగెను. పిదప నభిమన్యుఁడు తన్నెదుర్కొనిన యంబష్ఠుని విరథు నొనరింపఁగా, వాఁడు లజ్జితుఁడై

రథముడిగి యొకఖడ్గము నాతనిపై వైచి మహాబలుఁ డగు కృతవర్మని రథము నధిష్ఠించెను. అటు లంబష్ఠకుఁడు వైచినఖడ్గమును శరీరలాఘవముచే నాయభిమన్యుఁడు ఖండించివైచెను. ఓరాజా! అపు డాతనిలాఘవనైపుణ్యమునకు మేలుమే లనియెడిశబ్దములు మెండుగా వినవచ్చెను. అంత ధృష్టద్యుమ్నుఁడును మున్నగువారు మనసైన్యములతోడను, మనవారు పాండవసైన్యములతోడను బోరాడ నారంభించిరి. అపుడు పరస్పరముఁ బ్రహరించుకొను నక్కురుపాండవులలో గొప్పయాక్రందముప్పతిల్లెను. ఓరాజా! శూరు లగుకొంద ఱొకరినొకరు జుట్టులు పట్టుకొని దంతములతోడను, గోళ్లతోడను జీల్చుకొనుచు, ముడుములు, పిడికిళులు మున్నగువానితోఁ బొడిచికొనుచు బాహాబాహిగాఁ బోరాడుచుఁ, గత్తులతో నఱికికొనుచు, నవకాశము దొఱకునప్పుడెల్లఁ జంపుకొనసాగిరి. ఆమహాసంగ్రామమునఁ దండ్రి కొమరుని, గొమరుఁడు తండ్రిని దెలిసికొనలేక చంపికొనిరి. అందు వీరులు తమ యొడలెల్ల శిథిలము లగునట్లుగాఁ బోరాడిరి. అపు డప్పుడమినిబడిన చక్కనివింట్లును, దెగినఖడ్గములును, వాఁడిబాణములును బొరలువిడిచినపాములువలెఁ గానవచ్చెను. ఒకచో సువర్ణభూషితములగు నేస్తు దంతముల పిడులుగలకత్తులును, వేఱొకచో సువర్ణచిత్రితములగు చర్మములును బడియుండెను. మఱియు బంగరుప్రాసములును, హేమభూషితము లగుపట్టసములును, భిందిపాలములును నందందుఁ బడియుండెను. అటులే యేన్గులపై బరచెడితివాసులును, చామరములును, వ్యజనములును, నానావిధము లగుశస్త్రములును బుడమిని బడియెను. ఆయుధములనువిడిచి పుడమిఁబడియున్న మహారథులు కొందఱు జీవించియున్నటులే గానవచ్చుచుండిరి. మఱియుఁ గొందఱుపదాతులు గదాప్రహారముల నలఁగి ముసలఘాతములచేఁ దలలు బ్రద్దలుగా గజవాజిపదముల త్రొక్కుడువడియు, రథముల క్రిందఁబడి చూర్ణమయ్యుఁ జూడఁబడుచుండిరి. ఓరాజా! అటులే గజాశ్వపదాతులశరీరముల ప్రోవులు కొండలవలె నందందుఁబడి పుడమి నాచ్ఛాదించెను. మఱియు నెందుఁ జూచినను దోమరములును, గత్తులును, బట్టసములును, ప్రాసములును, బరశ్వథములును, బరిఘములును, దుపాకులును, శస్త్రభిన్నము లగుశరీరములును గుప్పలు కుప్పలై కానవచ్చెను. ఇంకను రక్తసిక్తాంగులై కొందఱు

మెల్లఁగాఁ బలుకువారై యుండిరి. కొందఱు గతప్రాణులై నిశ్శబ్దముగా నుండిరి. కవచములును, కేయూరములును, చందనముపూసినబాహువులునుగలిగి చూడామణులును, కుండలములును గల తలలతో వీరులందందుఁ బడియుండిరి. రక్తసిక్తము లైనబంగారుకవచములచేఁ బుడమి యెల్ల జ్వాలాయుక్తమగు నగ్నికణములప్రోవునాఁ జూపట్టెను. మఱియు నూడిపడిన నగలును, వాఁడిచెడినతూపులతెగలును, హతములైన రథచయములును, మృతములైనహయములును, కూలిపడినగజములును, వ్రాలిచెడినధ్వజములును గలిగి నానావిధము లగు నలంకారములచేఁ బుడమిపడఁతి యలంకరింపఁబడియున్నటు లగపడియెను. ఒక్కొకచో బాణప్రహారములవేదన కోర్వక యేనుఁగులు కొన్ని తొండములనుండి సీత్కారముల విడుచుచుఁ గదలుచున్నకొండలవలె నారణరంగమునఁ గానవచ్చెను. నానావర్ణములుగలయేనుఁగులకంబళములును, వైదూర్యమణి దండములుగల యంకుశములును, నందందుఁబడినగంటలును, దివాసులును, నేనుఁగులకంఠభూషణములును, బహువిధములై తెగిపడినయంత్రములును, సువర్ణమయము లగుతోమరములును, ధూళిరంగుగల గుఱ్ఱములపరికరములును, కేయూరములతోఁ దెగిపడిన రౌతులభుజములును దలపాగలును, మున్నగువానితోఁ బుడమి గ్రహనక్షత్రాదులతోఁ గూడిన యాకసమువలె నలరారుచుండెను. ఓరాజా! ఇటులు నీవారును బాండవులును నాఁడు కలిసి పోరాడి పరస్పరము మర్దించుకొని యలసిరి. అంత భయంకరముగాఁ జీఁకటులు గ్రమ్ముఁడు రణరంగము గాన్పింపకుండుటను వారు నాఁటికి యుద్ధమును ముగించి తమతమశిబిరములకు వెడలిపోయిరి." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## భీష్మదుర్యోధనసంవాదము

"ఓమహారాజా! పిమ్మట సుయోధనుఁడును, శకునియును, దుశ్శాసనుఁడును, దుర్జయుఁడగుకర్ణుఁడును నొకచోఁ జేరి పాండుపుత్త్రులను జయింపఁ దగుసుపాయము నాలోచింప నారంభించిరి. అందు సుయోధనుఁడు తనకు మంత్రు లగువారిలోఁ గర్ణు నుద్దేశించియు, శకునినాలోకించియు నిట్లు పలికెను.

"ఓయీ! భీష్ముఁడును, ద్రోణకృపులును, శల్యుఁడును, సౌమదత్తియును కౌంతేయులను బాధింపఁజాలకున్నవారు. ఇందులకు నిమిత

మెయ్యదియో తెలియదు. ఇఁకఁ బాండవులన్ననో పరాజయమొందక మనసైన్యమును మడియించుచున్నవారు. ఓమిత్రుఁడా! నానాఁటికిని నేను క్షీణసైన్యుఁడను క్షీణశస్త్రుఁడ నగుచున్నవాఁడను. శూరులు నవధన్యులు నగుపాండవులచేతను, దైవతముచేతను నేను బరాభవింపఁబడుచున్నాఁడను. ఇటులు సంశయావస్థను బడియున్న నేనెటులు వారిని జయింపఁగలుగుదునో తెలియకున్నది."

అది విని కర్ణుఁడు, "ఓమహారాజా! నీవు చింతింపకుము. నేను నీకుఁ బ్రియమొనర్చువాఁడను. భీష్ముఁ డీమహాసంగ్రామమునుండి మఱలనిమ్ము. అంత నేనెంతయు విక్రమించి సోమకులతోఁ గూడఁ బాండవులను ఖండింతును. అపుడు నాయపక్రవిక్రమమును శాంతనవుఁడు గాంచఁగలఁడు. ఇందులకు నీవు సందియపడవలదు. ఓరాజా! ఇదె ప్రమాణ మొనరించెదను. భీష్ముఁడన్ననో పాండవులయెడ నిత్యము దయచూపువాఁడు. మఱియు మహారథు లగు నిప్పాండవులను జయింప నతఁడు సమర్థుఁడు గాఁడు. అతఁ డభిమానియుఁ గలహప్రియుఁడు నైనవాఁడు.అట్టివాఁడు యుద్ధమునఁ బాండవులుసమీపించినను వారి నెటుల జయింపఁగలుగును? కావున నీవు వడిగా వెడలి శాంతనవుని శిబిరమునకుఁబోయి వృద్ధుఁడును బూజ్యుఁడు నగు నాతని న్యస్త్రసన్న్యాసమును బ్రార్థింపుము. అతఁడు శస్త్రాస్త్రములను విడిచెనా? పాండవులు చచ్చిరనుకొనుము. ఓరాజా! నే నొకఁడనే బాంధవులతోఁగూడఁ బాండవులను జంపెదను" అని తెలిపెను. అది విని యాసుయోధనుఁడు తన తమ్ముని దుశ్శాసనుఁ గాంచి "ఓతమ్ముఁడా! దుశ్శాసనా! మనసైన్యములన్నియు నెటులు యుద్ధయాత్రకు సన్నద్ధమైయుండునో యటులు నీవు వడిగా నొనర్పఁదగియున్నది" అని తెలిపి మఱియుఁ గర్ణునితో "ఓయీ! మానవోత్తముఁ డగుభీష్ము న్యస్త్రసన్న్యాసమున కంగీకరింపఁజేసి యిదె వచ్చెదను. అతఁడు తొలఁగినతోడనే నీవు పాండవులను బ్రహరింతుగాక." అని పలికి, దేవతలతో శతక్రతువువలెఁ దనసోదరులతోఁగూడి వడిగా వెడలెను. పిదప శార్దూలసమవిక్రముఁ డగు నానృపశార్దూలునపు డొకహయముపై దుశ్శాసనుఁ డధిష్ఠింపఁజేసెను. అంత నతఁడు కేయూరములను,గిరీటమును, మురుగులును ధరించి, సుందరమగునశ్వము నధిరోహించి యెంతయు వెలయుచుఁ బ్రయాణమయ్యెను. మంజిటు

పూవును, బంగారునుబోలి యుత్తమమై పరిమళించు శ్రీచందనము మేన నలందికొని తెల్లనివస్త్రమును గట్టికొని సింహగతినై యాకసమున దివాకరుఁడునా నాదుర్యోధనుఁ డాగుఱ్ఱముపైఁ గానవచ్చెను. అటులు వెడలిన యారాజశార్దూలుని సర్వలోకధనుర్ధరోత్తము లగు కొందఱు వీరులు వెంబడించి వెడలిరి. దేవత లింద్రునివలె నాతనిభ్రాతలును వెనుకఁ బ్రయాణమై కొందఱు గుఱ్ఱములను, మఱికొంద ఱేనుగులను నధిష్ఠించిరి. వేఱొకకొంద ఱాతనికి రక్షకులై శస్త్రాస్త్రములు ధరించి చుట్టును గావలిగా నుండిరి. అనంతర మాకురురాజు నిజపరివారముచేఁ బూజ్యమానుఁడగుచు గాంగేయునిసదనముఁ జేరి సకలశత్రువినాశకమై యేన్గుతొండము నావెలయు తనకుడిభుజమును గప్పికొని నలుదెసలఁ దనకు నమస్కరించువారివందనమును బరిగ్రహించుచు నానాదేశాధీశుల మధుర స్తుతివచనములను వినుచు, మఱియు వందిమాగధులు తన్ను బొగడ వారి నాదరించుచుఁ, గర్పూరదీపములు తనకు నలుగెలంకులఁబట్టి పరిజనము వెడలఁగా నాసుగంధిదీపములచే దీప్తము లగుమహాగ్రహములచేఁ జంద్రుఁడువలె వెలయుచుండెను. అపు డాతనికి ముందుభాగమున బంగరుపాగలను ధరించి వేత్రహస్తులై కొందఱు భృత్యులు నలుదెసల నుండి మూఁగెడివారిని బ్రక్కలకుఁ దొలఁగించుచుండిరి. అంత నా రారాజు శాంతనవునిశాంతమును జేరి గుఱ్ఱము డిగి పితామహుని దర్శించి యాతనికి నమస్కరించి యొక యుత్తమాసనమునఁ గూరుచుండెను. అటులు మంచియాస్తరణముగల సర్వతోభద్ర మనెడియాసనమున నాసీనుఁడై చేతులుమొగిడ్చి కన్నీరునించుచు నిట్లు పలికెను.

“ఓపితామహా! వైరిమారకుఁడవగు నిన్నాశ్రయించి యుద్ధమున నింద్రునితోఁగూడిన సురాసురులనైన జయింపఁగలుగుదుమని యుత్సాహముతో నున్నవారము. అట్టిపట్టున బంధువర్గముతోఁగూడిన పాండవులను జయించుట మాకెంతపని? ఓప్రభూ! నీవు నాయెడ నెంతయు దయచూపఁ దగియున్నవాఁడవు. ఓగాంగేయా! మున్ను దానవుల నింద్రుఁడువలెఁ బాండవులను ఖండింపుము. ‘నేను సోమకులను బాంచాలురను గేకయులను బరిమార్చువాఁడను’ అని మున్ను నీవు పలికిన వచనములను దప్పక పాంచాలసోమకాదులను జంపి దృఢప్రతిజ్ఞుఁడవు గమ్ము. ఓప్రభూ! నీకుఁ బాండవులయెడఁ గలదయచేఁగాని, నాపైఁగల

కోపముచేఁగాని, నాయభాగ్యముచేఁగాని పాండవులను రక్షింపఁదలంతు
వేని యుద్ధమును జాలించి యీసంగ్రామభారమును గర్ణునిపై విడు
వుము అతఁడు బంధుమిత్రపరివారముతోడఁ గూడిన పాండవులను
జయించును" అని పలికి భీమపరాక్రముఁ డగు నాభీష్మునితో మఱియు
నేమి పలుకక నీకొడుకు హూరకుండెను." అని తెలిపి సంజయుఁడు మఱియు
ని ట్లనియె.

దుర్యోధనదుశ్శాసనసంవాదము

"ఓధృతరాష్ట్రా! అటులు నీకొడుకు వాక్శల్యములచేఁ దన్ను
నొప్పింపఁగా, వాక్శలాకచే నొచ్చినపామువలెఁ గుపితుఁడై యెంతయు
దుఃఖము తన్నావేశింప రోఁజుచుఁ గొంచెమేని ప్రియము పలుకఁ దలం
పకయుఁ గొంతవడి చింతించి, రోషకలుషితాంతరంగుఁడై కన్ను లెఱ్ఱ
చేసి, దేవాసురగంధర్వలోకములను దహించువాఁడువలెఁ గాన
వచ్చుచుఁ బ్రియపూర్వకముగా నొకవచన మిట్లు పలికెను.

"ఓసుయోధనా! నీ విటులేల నన్ను వాక్శల్యములచే నొప్పించు
చున్నవాఁడవు? నాశక్తికొలఁదిగా నీకుఁ బ్రియమొనర్చుచు నున్నవాఁ
డనుగదా! నీప్రియమునకే సమరాగ్నిని వైరివీరులప్రాణములను హోమ
మొనరించుచున్నాఁడను. పాండవమధ్యముఁడు శూరశిఖామణి యనుట
కాతఁడు వైరుల నోడించి ఖాండవవనమున నగ్నిదేవునిఁ దృప్తినొం
దించుట నిదర్శనముగదా! మఱియు నీపైఁబడినగంధర్వులను బరాభవించి
యతఁడు నిన్ను విడిపించుట యొకసంపూర్ణనిదర్శనము గదా! అపుడు
నీసోదరులెల్లఁ బరువిడిపోయిరిగదా! ఓమహాబాహూ! సూతపుత్రుఁ
డపు డేమిచేసెను? వారును నీవును నేనును జూచుచుండఁగ నేగదా యర్జు
నుఁడు మనలను విరాటనగరమున జయించినవాఁడు. ఆతని కపు డొకఁ
డేని సహాయుఁడు గలఁడందువా? అది యాతనివిక్రమము నెఱిఁగింప
దొకో? ఇంకను ద్రోణుఁడును నేనును గాంచుచుండఁగనే మనవారితల
పాగచెఱఁగుల నతఁడు కోసికొనిపోవుట యాతనిపరాక్రమమును
సూచింపలేదా? అటులే కృపాశ్వత్థామల నతఁడు జయించుట యతని
యసహాయశూరతకు సాక్షిగాదా? మఱియు మహావీరుఁడ ననెడియహం
కారము గలకర్ణు నోడించి యుత్తరునకు వస్త్రాంచలము లొసంగుట

చూడ నతేఁడు మహాశూరుఁడనుటలో సందియముగలదా ? ఇంద్రుఁనకును నోర్వరాని నివాతకవచుల నాతేఁడు జయించుట తగునిదర్శనము గదా? సకలజగద్రక్షకుఁడగు శంఖచక్రగదాధరుఁ డాతనికి రక్షకుఁడై యుండఁగా నాయర్జుననిజయించుటకు కెవరుశక్తులగుదురు?ఆవాసుదేవుఁడనంతశక్తియు, సృష్టిసంహారకారకుఁడును, సర్వేశ్వరుఁడును, దేవదేవుఁడును, బరమాత్ముఁడును, సనాతనుఁడు నని, నారదాదిమహర్షులు మున్ను పలుసారులు చెప్పియుండలేదా? అవివేకముచే నీవు గ్రాహ్యాగ్రాహ్యముల నెఱుఁగవైతివి. ఓసుయోధనా! చావనున్న వాని కెల్లవృక్షములును కాంచనములైగానవచ్చును. అటులే నీవును, విపరీతబుద్ధితో హితము నహితముగాఁ జూచుచున్న వాఁడవు. ఓయీ! నీవు పాండవులతోడను సృంజయులతోడను నీయనంతవైరము దెచ్చికొంటివి. కావున నీవే యిపుడు వారితోఁ బోరాడి వీరుఁడవుగమ్ము. మేము చూచుచుందుము. నేను శిఖండినిదప్పఁ దక్కినసోమకులను బాంచాలురనెల్లను వధించువాఁడను. లేదా వారిచేఁ జచ్చి యమసదన మొందువాఁడను. వారినే నేను జయింతునా! నీకు సంతసముగలిగించువాఁడను. మున్ను శిఖండి రాజగృహమున నాఁడుదిగా జనించి, వరదానముచేఁ బురుషుఁడైనవాఁడు. కావున నాప్రాణములనైనఁ ద్యజింతునుగాని వానినిమాత్రము చంపువాఁడనుగాను. నా వచనము లాలించితివిగదా! ఇఁకఁబోయి సుఖముగా నిద్రింపుము. పుడమిజను లెల్లకాలమును నాయశము చాటుకొనునట్లుగా ఱేపు మహాసంగ్రామ మొనర్పువాఁడను."

అది విని నీకొమరుఁ డాశాంతనవునకు నమస్కరించి నిజగృహమునకు వెడలిపోయి తనపరివారమునకు సెలవొసంగి తనశిబిరమును బ్రవేశించెను. అంత నారాత్రి గడవఁ బ్రభాతమగుడు నాసుయోధనుఁడు సెజ్జవిడిచి సైన్యములను సన్నద్ధమొనరించుటకై రాజుల కిట్లాజ్ఞాపించెను. "ఓయీ! నేఁడు గాంగేయుఁడు కుపితుఁడై సోమకులను వధించువాఁడు. మీరెల్లరును వడిగా వెడలుఁడు."

అంత నాశాంతనవుఁ డటులు దుర్యోధనుఁడు పలుక విని యాతని మొఱను మాటికిఁ దలంచుచుఁ దన్ను వాఁడటులు దూషించినందులకుఁ బరితపించుచుఁ, దాను బరవశ్యత నొందినందులకు నిందించుకొని సంగ్రామమున నర్జునునితోఁ బోరాడుట కెంతయుఁ గొంతవడి చింతించెను.

పిమ్మట సుయోధనుఁడు తమ్మునిఁ జూచి, "ఓదుశ్శాసనా! భీష్ముని రక్షించునట్టిరథములను వడిగా సన్నద్ధపఱుపుము. మనము చిరకాలము నుండి చింతించుచుండెడి పాండవసైన్యవధమును రాజ్యస్థైర్యమును నేటికి సంప్రాప్తించెను. కావున నందులకు భీష్మరక్షణ మొకటి యత్యావశ్యకము. అతఁడు రక్షితుఁడైనచో సంగ్రామమునఁ బాండవులను దండించును. కాని విశుద్ధాత్ముఁ డగునతఁడు శిఖండిని ఖండింపనని సెలవిచ్చెను. మఱియు నాగాంగేయుఁడు, శిఖండి మున్నాఁడుదియనియుఁ దాను తనతండ్రికిఁ బ్రియ మగునట్లుగా రాజ్యమును, స్త్రీలను వర్జించితి ననియుఁ, దానొకపుడును స్త్రీనిగాని మున్ను స్త్రీయైనవానిఁగాని చంప నని ప్రతిజ్ఞ చేసితిననియుఁ దెలిపెను. మఱియు నతఁడు నాతో "ఓరాజా! శిఖండి యాఁడుది యగువిధమును మున్ను మన మీయుద్ధమున కుద్యోగ మొనరించునపుడే తెలిపియున్నవాఁడను. అతఁడు తొలుతఁ గన్యకయై పిమ్మటఁ బురుషుఁడగుటచే వానితోడ నేనెటులు పోరాడుదును? వాని మొగముచూడను. ఈయుద్ధమున శిఖండినిదక్కఁ దక్కినపాండవజయార్థులగుక్షత్రియులను నాకంటఁబడినవారినెల్లఁ బరిమార్చెదను" అని తెలిపియున్నవాఁడు. ఓతమ్ముఁడా! అటులగుట శాస్త్రవేత్త యగు నా గాంగేయు నెల్లవిధముల మనము రక్షింపవలసియున్నది. తగురక్షణము లేకయున్నచో మహావనమున వసించుసింహమును వృకమైనను జంపును గదా! వృకతుల్యుఁ డగుశిఖండిచే వీరసింహ మగుగాంగేయునిఁ జంపించు కొనరాదుగదా! కావున మామ యగుశకునియు, శల్యుఁడును, కృపుఁడును, ద్రోణుఁడును, వివింశతియు మనపితామహుని రక్షింపవలయును. అటులేని మనకు జయము సిద్ధము" అని తెలిపెను.

అది విని రథికోత్తములెల్లరును పితామహుని నలుదెసల నావరించి యుండిరి. అటులే నీతనయులును నాతనికిఁ దోడై వెడలిరి. అపుడు వెడలినయేనుఁగులును, రథములును, భూమ్యాకాశములఁ గలఁతనొందింప సాగెను. అంత నామహారథులెల్లరును దమతమరథములతో సన్నద్ధులై దేవతలు వాసవునివలె నాశాంతనవుని రక్షించువారై యుండిరి. పిదప సుయోధనుఁడు మఱియుఁ దనతమ్మునితో, "ఓసోదరా! ఆయర్జునుని రథము నెడమచక్రమును యుధామన్యుఁడును, కుడిచక్రము నుత్త

మహారాజుడును రక్షించువారై యుండిరి. ఆయర్జునుఁడు శిఖండికి రక్షకుఁడై యుండును. కావున నెటులు పార్థుఁడు సందుచేసికొని భీష్మునిఁ గొట్టకుండునో యటు లాతని మనము విడువకుండవలయును. ఇదియ నీకు గ_ర్తవ్యము.” అని తెలిపెను. అది విని దుశ్శాసనుఁడు పితామహుని సైన్యములకు ముందిడి యాతనిచుట్టు రథికులనుంచి వెడలెను. పిమ్మట నర్జునుడు రథసమూహముచే నావృతుఁడై యున్న భీష్మునిఁ జూచి ధృష్టద్యుమ్నునితో, “ఓయీ! మనశిఖండిని భీష్ముని కెదురుగా నిలుపుము వానికి నేను రక్షకుఁడనై యుందును.” అనిపలికె” నని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

దళ్యూహములు గానిపించుట

“ఓ రాజా! శాంతనవుఁడు తానే సర్వతోభద్రమనెడి వ్యూహము బన్ని గొప్పసైన్యముతో బయలువెడలెను. కృపుఁడు, కృతవర్మ, శైబ్యుఁడు, శకుని, సైంధవుఁడు, సుదక్షిణుఁడు మున్నగువారు నీ పుత్త్రులతోఁగూడ భీష్ముని సకలసైన్యములకు ముందుగా నుండిరి. ఆ మహావ్యూహమునకు ద్రోణుఁడు, భూరిశ్రవుఁడును, శల్యుఁడు, భగదత్తుఁడును కుడిప్రక్క నుండిరి. అశ్వత్థామయు, సోమదత్తుఁడును, విందానువిందులును గొప్పసైన్యముతో నెడమప్రక్క నాశ్రయించి యుండిరి. సుయోధనుని నలుగెలంకులను త్రిగర్తు లునుపఁబడిరి. అటులు సుయోధనుఁడు వ్యూహమధ్యమున నిలిచి పాండవుల కెదురుగా నుండెను. అలంబుసుఁడును శ్రుతాయువు సకలసైన్యములకును వెనుకభాగమున వ్యూహరక్షకులై యుండిరి. ఓరాజా! ఇటులు నీవా రావ్యూహమునుబన్ని సన్నద్ధులై ప్రజ్వలించునగ్నులువలెఁ గానవచ్చిరి.

పిదప ధర్మజుఁడును, భీమసేనుఁడును, నకులసహదేవులును నెల్ల సైన్యముల కగ్రభాగమున నిలిచి వ్యూహరక్షులై యుండిరి. ధృష్టద్యుమ్నుఁడును, విరాటుఁడు, సాత్యకియు గొప్పసైన్యముతోఁగూడి వైరిసేనావినాశకులై యుండిరి. అటులే శిఖండియు, నర్జునుఁడును, ఘటోత్కచుఁడును, కుంతిభోజుఁడును, జేకితానుఁడును, నభిమన్యుఁడు, ద్రుపదుఁడును, కేకయసోదరులును యుద్ధసన్నద్ధులై వెడలిరి. ఇటులు పాండవులును మనవారివ్యూహమునకుఁ బ్రతివ్యూహమును సంఘటించి దుర్జయులై గానవచ్చిరి. అట్టి పాండవసైన్యమును జయింపఁ దలఁచి

మనవారు గాంగేయుని సేనాముఖమునకుంచి వెడలఁగాఁ బాండవులును భీముని మున్నిడుకొని విజయము నపేక్షించువారై వెడలిరి. అంతట భేరీమృదంగపణవాదివాద్యములతో సింహనాదములును, కిలకిలారావ ములును విజృంభించెను. పాండవులును భీకరారావము లొనర్చుచు, భేరీమృదంగాదుల మ్రోఁగఁజేయుచు, సింహనాదము లొనర్చుచు నెదుర్కొనఁగా, మేమును వారిని గడువడిగా నెదురించితిమి. అపుడు మిగుల సంకులమయ్యెను. అంత బరస్పరముఁ బ్రహరించుకొనుచుఁ బరువులిడ నారంభించిరి. అపు డాచప్పుడులకుఁ బుడమి వడఁకెను. పక్షులు భయంకరముగా నఱచుచుఁ బరిభ్రమింపసాగెను. కాంతిమంతుఁడై యుదయించినపస్మినీకాంతుఁ డెంతయుఁ దేజోహీనుఁడై కానవచ్చెను. గొప్పభయమును దెలుపుచుఁ బెనుగాలులు విసరందొడంగెను. నక్కలు ఘోరారావముల నొనర్చెను. అయ్యదియెంతయుఁ బ్రాణిహానిసూచకముగాఁ గానవచ్చెను. దెసల మంటలు జనించెను. పాంసువర్షములు గురిసెను. అటులే రక్తమిశ్రములై యెముకలు వర్షించెను. గజాశ్వాదు లేడ్చుచుఁ గనుల నీరుగార్చుచుండెను. ఓరాజా! మఱియు నవి మాటికిని మూత్రము విడుచుచు నేమో ధ్యానించుచున్నటులుండెను. భీకరారావము లొనరించురక్కసుల గొప్పచప్పుడులు సైన్యారావములం దడఁగి వినవచ్చుచుండెను. అటులే వాయసములు నక్కలును రణరంగమునఁ జరించుట గానవచ్చెను. మఱియు నందుఁ బలువిధములుగాఁ గుక్కలు మొరగ నారంభించెను. మహోల్కలు ప్రజ్వలించుచు దివాకరు నాచ్ఛాదించి మహాభయమును బ్రకటించుచుఁ బుడమిని బడఁజొచ్చెను. అప్పు డప్పాండవులయుఁ గౌరవులయు మహాసైన్యముల శంఖమృదంగారావములచేఁ, బెనుగాలికివలె మహావనములెల్లఁ గంపింపందొడంగెను. అటు లమంగళముహూర్తమున వెడలిన గజరథాశ్వాదిసైన్యములచప్పుడు వాతోద్ధాతము లగుసాగరముల చప్పుడునా వినవచ్చెను." అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

### అలంబుసాభిమన్యులు తలపడుట

"ఓరాజా! రథికోత్తముఁ డగునభిమన్యుఁడు పచ్చనిగుఱ్ఱములను బూన్చినరథ మధిరోహించి యవక్రపరాక్రముఁడై సుయోధనుని గొప్పసైన్యము నెదుర్కొని పెనుమబ్బు జలధారలనువలె శరములను

వర్షించుచుండఁగా నటులు సేనాసాగరమును జొచ్చి మథించునట్టి యాతనిఁ జేరఁ గౌరవసైన్యమున నెవ్వరును సమర్థులుగాకుండిరి. ఓరాజా! ఆయభిమన్యుఁ ప్రయుక్తము లగుబాణపరంపరలు పొల్లుపోక శూరు లగు కౌరవవీరులను యమాగారమును జేరుపసాగెను. మఱియు నాయర్జును తనూజుఁడు సర్వతుల్యములై ఘోరయమదండసన్నిభము లగుసాయక ములను బఱపుచు రథములతో రథికులును, గుఱ్ఱములతో రౌతులును,గజ ములతో హస్తిపకులను ఖండించుచువచ్చెను. అతఁ డట్టియద్భుతకృత్య మొనరించుచుండుట కెంతయు నలరి యందలి రాజలోకమెల్ల నాతనిఁ బ్రశంసింపసాగెను. ఓరాజా! అతఁడు మనవారిసైన్యములనెల్ల గాలి తూలమునువలె నలుదెసలఁ జెదరునటు లొనరించెను. అటులు చెదరిన మనవారిసైన్యములు రక్షకుఁడగువాఁడు లేక బురదలోఁ దిగఁబడిన యెద్దులువలె నేమియుఁ జేయఁజాలకుండెను. అంత నతఁ డటులు సైన్యములెల్లఁ దొలఁగించి పొగతొలఁగినయగ్నివలెఁ బ్రజ్వలించు చుండెను. ఓరాజా! అటులు వైరిమారకుఁడైయున్న యాయభి మన్యునిఁ జేరిన మనవారెల్లరును గాలప్రేరితములై మండుచున్న యగ్నిని సమీపించినమిడుతలవలె మాఁడుచుండిరి. మఱియు నతఁడు పాండవులకు వైరు లగువారినెల్లఁ బ్రహరించుచు వజ్రాయుధధారి యగు వాసవునివలెఁ గానవచ్చెను. సువర్ణపృష్ఠ మగు నాతనివిల్లు నలువంకలకుఁ దిరుగుట గానవచ్చెను. దానినుండి పచ్చనిబాణములు మేఘములనుండి మెఱపులువలె వెడలి నలుదెసలఁ గ్రమ్ముచుండెను. ఓరాజా! పూచిన చెట్లుగలవనమునుండి వెడలినతుమ్మెదలమూఁకలకువలె నాతనివింటినుండి వెడలినశరపరంపరలకు విరామము గానరాకుండెను. అటు లతఁడు విజృంభించి ద్రోణకృపాశ్వత్థామలను సైంధవుని మోహావశులఁగా నొన రించెను. ఓభరతోత్తమా! అతనివిల్లు మండలాకారమై యుండుటయే మాకుఁ గానవచ్చెను. మనవారిసైన్యముల మాడ్చుచు మధ్యందిన మార్తాండునివలెఁ బ్రజ్వలించు నాయభిమన్యునిఁ గాంచి క్షత్రియ శూరులెల్లరును నీక లోకమున నర్జును లిరువురని తలంచిరి. ఓమహా రాజా! ఆతనిపీడ కోరువక కౌరవసేనయెల్ల మదముపట్టిన ముదితవలె నందందుఁ బరిభ్రమింపసాగెను. అపు డతఁడు సైన్యము నటులు చెదరఁ జేసి మహారథులకు వడఁకుపుట్టించి మయు నోడించినవాసవుఁడువలెఁ

దనమిత్రుల కానంద మొదవించెను. ఆసంగ్రామమున నాతనిశర ప్రహార పీడిత మగు మనసైన్యమున జనించినయార్తస్వరము లుఱుములునా విన వచ్చెను. పర్వదినమున గాలిచేఁ గదలు సాగరమునాఁ దగు మనసైన్యములఘోరారావము లాలించి సుయోధనుఁ డపుడు రాక్షసేంద్రుఁ డగు నలంబుసునితో "ఓమహాబాహూ! పార్థునితనయుఁ డగు నభిమన్యుఁ డొకఁడే క్రోధపరవశుఁడై రెండవయర్జునుఁడునాఁ దగి వృత్రుఁడు దేవసైన్యమునువలె మనసైన్యము నెల్లఁ బాఱఁదోలుచున్న వాఁడు. ఓరాక్షసోత్తమా! ఈసంగ్రామమున వానినడంచుటలో సర్వవిద్యాసంపూర్ణుఁడ వగు నీవుదక్క వేఱొకండు లేఁడు. కావున నీవే కడువడిగా వెడలి యాకవ్వడికొడుకు మడియు నటు లొనరింపుము. భీష్మద్రోణులను ముందిడికొని మే మాయర్జునుని వధింతుము" అని తెలుప విని పరాక్రమశాలి యగు నాయలంబుసుఁడు నీకొడుకునానతి వట్టి వడిగా వెడలి వర్షకాలపుమేఘమువలె గర్జిలుచుఁ, దనఘోరారావముచేఁ బాండవబలమును పెనుగాలి సాగరమునువలెఁ జలింపఁజేసెను. ఓమహారాజా! ఇంత యేల! ఆరక్కసుని భయంకరారావమునకు జడిసి యనేకులు తమకుఁ బ్రీతిపాత్రము లగుప్రాణములు విడిచి నేలఁగూలిరి. అప్పు డాయభిమన్యుఁడును శరశరాసనములు ధరించి సోత్సాహుఁడై రథమధ్యమున గంతులు వైచుచున్నవాఁడువలెఁ జూపట్టుచు, నారక్కసు నెదుర్కొనియెను. పిదప నాయలంబుసుఁడును జలముగొని యాయభిమన్యుని మార్కొని యాతనికిఁ జేరువగానున్న సైన్యమును బాఱఁదోలఁగా నపుడు వారిరువురకు పోరు ఘోరముగా జరగెను. అంత నారక్కసుఁడు పాండవబలమును బొలియించుచు నిజపరాక్రమమును వెలయించెను. అపుడు వానిపీడ కోపక పాండవబలము వెఱచి నలుదెసలకుఁ జెదరి పఱువిడి పోయెను. అందులకుఁ గుపితులై ద్రౌపదేయు లేవురును గ్రహము లైదును సూర్యునివలె నారక్కసుని మార్కొని పీడింపఁగా నాయలంబుసుఁడు గ్రహపంచకముచే యుగాంతమునఁ బీడితుఁ డైనచంద్రుఁడు నాఁ జూపట్టెను. పిమ్మట మహాబలుఁ డగు ప్రతివింధ్యుఁడు తీవ్రము లగు బాణములచే నారక్కసుని నొప్పించెను. అంత నావాఁడికోలలచేఁ గవచము చినుఁగ నారాక్షసుఁడు రవిమరీచులచే సంగతుఁ డగు మేఘుఁడు నాఁ గానవచ్చెను. మఱియుఁ దన మేన నాఁటికొనియున్న బంగారు

ఱెక్కలుగల యాబాణములచే నాయలంబుసుఁడు శిఖరములచే దేదీప్యమాన మగుకొండవలె నుండెను. అంత నాప్రతివింధ్యునిసోదరు లేవ్వురును సువర్ణభూషితము లగువాఁడికోలలచే మఱియు నారాక్షసుని నొప్పించిరి. కుపితము లగుసర్పములఁ బోలు వారిశరములచేఁ బ్రహతుఁడై సర్పరాజమువలె నెంతయు కోపావేశపరవశుఁడై యాయలంబుసుఁ డొకముహూర్తమాత్రము మూర్ఛమునిఁగి మఱియుఁ దెప్పిరిలి రెట్టి యగుకోపముచే నాద్రౌపదేయులవిండ్లను ధ్వజములను సాయకములను ఖండించెను. అంత మఱియు నాతఁడు రథమధ్యమున నాట్యమొనరించువాఁడువలెఁ గానిపించుచు, నయ్యుపపాండవులగుఱ్ఱములను, సారథులను గూలనేసి, యవక్రపరాక్రమము వెలయఁగా విరథులఁగా నొనర్చి, యింకను దీవ్రబాణములచే వారిని నొప్పించెను. అటు లారక్కసునకుఁ జిక్కి పీడితులై యున్న యక్కుమారపంచకమును గాంచి, మఱియు నాయభిమన్యుఁడు వానిని మార్కొనియెను. అపుడు వారిరువురకును వృత్రవాసవులకువలె ఘోర మగుపో రారంభమయ్యెను. అటులు పోరాడువారిరువురను, మీవారును, మహారథులగు పాండవవీరులును గాంచుచుండిరి. ఆగొప్పపోరాటమున వారిరువురును గలిసి కుపితులై కనులెఱ్ఱచేసి కాలాగ్నితుల్యులై యొకరినొకరు చూచి కొనిరి. వారిపరస్పరసమాగమము మున్ను శక్రశంబరసమాగమము వలె నెంతయు ఘోరముగాఁ గానవచ్చెను." అని తెలుప విని ధృతరాష్ట్రుఁడు మఱియు సంజయునితోఁ నిట్లనియె.

## ద్రోణార్జునులు గలియుట

"ఓసంజయా! అటు లాసంగ్రామమున మహారథులను బ్రహరించు నాయభిమన్యునితో నాయలంబుసుఁడు మార్కొని యెటులు యుద్ధమొనరించెను? వాని నాసౌభద్రుఁ డెటులు ప్రహరించెను? జరిగినది జరిగినటు లదియెల్ల నాకెఱిఁగింపుము. మఱియు భీముఁడును, రథికోత్తముఁడును, రాక్షసశ్రేష్ఠుఁడు నగు ఘటోత్కచుఁడును, నకులసహదేవు లేమియొనర్చిరి ? మనసైన్యముల నాయర్జునుఁ "డేమిచేసెను? నీవు నిపుణుఁడవగుట నిదియెల్లఁ దెలుపుము."

అది విని సంజయుఁడు "ఓరాజా! ఆయలంబుసాభిమన్యులపోరా టమువిధమును దెలిపెదను వినుము. అది మిక్కిలి యద్భుతమయ్యెను. మఱియు నాభీమార్జునులును నకులసహదేవులును నొనర్చినసంగ్రామపద్ధ తిని వినుము. అటులే భీష్మద్రోణాదు లగు మనవారివీరులును నిర్భయ ముగా నద్భుతకృత్యముల నొనరించిరి. అపు డలంబుసుఁడు మహారథుఁ డగునభిమన్యునకు వెఱపుగలుగ మహానాదము నొనరించుచు, నిలు నిలుమని పలుకుచు మార్కొనఁగ, నాయభిమన్యుఁడును గడువడి సింహ నాదమొనరించి తనతండ్రికిఁ బరమవైరి యగునాతని నెదురించెను. అపు డటులు వారిరువురును దేవదానవులువలెఁ గలిసి, రాక్షసుఁడు మాయా శాలియు నభిమన్యుఁడు శస్త్రాస్త్రవేత్తయునై యుద్ధమొనర్ప నారంభిం చిరి. అం దభిమన్యుఁడు తొలుత మూఁడు వాఁడికోలలచే నొప్పించి, మఱియు నైదుబాణములచే నారక్కసునిఁ బ్రహరించెను. అంత నలం బుసుఁడును గుపితుఁడై తొమ్మిదితీవ్రబాణములచే నంకుశములచే మహా గజమునువలె నొప్పించి, మఱియుఁ దనశరలాఘవమేర్పడ శరసహస్రము లచే నాయభిమన్యునిఁ బీడించెను. అందుల కాయభిమన్యుఁడు కుపి తుఁడై దారుగలతొమ్మిదినారాచములచే నారక్కసునిఱొమ్ము నొప్పింప నవి వానిమర్మముల నాఁటికొనియెను. అపు డటు లాయలంబుసుఁడు విభిన్న సర్వాంగుఁడై పూఁచినమోదుగులతోఁ గూడిన పర్వతమునాఁ జూపట్టెను. మఱియు వాఁడాశరపరంపరతోఁగూడి మంటలతోఁగూడిన కొండవలె నుండెను. అంత నారక్కసుఁ డెంతయుఁ గోపము రెట్టింప మహేంద్రతుల్యుఁ డగు నాయర్జునాత్మజుని శరపరంపరచేఁ గప్పి నొప్పింప, యమదండతుల్యములై తీవ్రము లగునావిశిఖము లాయభి మన్యుని గొట్టి పుడమిని నాఁటికొనియెను. అటులే యభిమన్యుఁడు ప్రయోగించినబాణములు నాయలంబుసునిమేన నాఁటి పాతాళమును బ్రవేశించెను. అంత నాసౌభద్రుఁ డారాక్షసునిఁ దీవ్రశరప్రహారము లచే విముఖునిఁగా నొనరించి, మయునిఁగొట్టినవాసవుఁడువలె భాసిలు చుండెను. పిమ్మట నమ్మనుజాశనుఁ డెంతయు నటులు నొచ్చుటను వడిగాఁ దనమాయ నావిర్భవింపఁజేసెను. ఓరాజా! అపుడు వానిమాయచే నభి మన్యుఁ డెవ్వరికిని గానరాకుండెను. అటులే మనవారును వైరులును గానరారైరి. అంత నాయభిమన్యుఁ డాఘోరమగు మాయాంధకా

రము నారసి తేజోవిరాజమాన మగు భాస్కరాస్త్రమును జనింపఁజేసెను. అప్పు డది జగమునెల్లఁ దేజోమయముగా నొనరించి యారక్కసుని మాయాంధకారమును దొలఁగించెను. అంత నారక్కసుఁ డుద్రేకించి, మఱియు నాయభిమన్యుని శరపరంపరచేఁ గప్పుచు, నింకను బలువిధముల మాయలను బ్రదర్శించెను. కాని, సర్వాస్త్రవేత్త యగు నాయభిమన్యుఁడు వానిమాయలనెల్ల నివారించుచు వచ్చెను. అంత నారాక్షసుఁడు తనమాయలెల్లఁ దొలఁగి యభిమన్యుప్రహారములచేఁ బీడితుఁడై మిగుల వెఱపుతో నందే రథమును విడిచి పరువిడిపోయెను. కపటయుద్ధనిపుణుఁ డగు నాయలంబుసుఁ డోడి వెడలఁగా నాయభిమన్యుఁడు నీవారిసైన్యములపైఁబడి మర్దించెను. అతఁ డపుడు పద్మములుగల సరోవరముజొచ్చిన మదపుటేనుగున్నాఁ గానవచ్చెను.

పిమ్మట కౌంతేయుఁడు తనసైన్య మటులాయభిమన్యునిపీడనోపక చెదరఁబాఱుటయు, నాతనిపై శరవర్షము గురియఁజొచ్చెను. కౌరవవీరులును నాయభిమన్యు నొక్కమాఱుగా ముట్టడించి యసహాయుఁడగు నాతనిపైఁ బలువురు శరవర్షముచే నొప్పించిరి. కాని పితృతుల్యపరాక్రముఁ డగునాయభిమన్యుఁడు నిజవిక్రమముచేతను, బలముచేతను మాతులుఁ డగుకృష్ణభగవానునకుఁ దక్కువగాక రథికోత్తముఁడై పలువిధములుగా యుద్ధ మొనరింపఁదొడఁగెను. పిమ్మట, వేఱొకచోఁ గౌరవసైన్యముల రూపుమాపుచున్న యాపాండవమధ్యముఁడు పుత్రప్రీతి వెలయ నాయభిమన్యుఁడున్నకడ కరుదెంచెను. అటులే పితామహుఁడును బాస్కరు నెదుర్కొను రాహువునాఁదగి యాయర్జును మార్కొన నందులకు వచ్చెను. పిదప గజరథాశ్వములతో నీపుత్రులును వచ్చినయాశాంతనవునకు రక్షకులై చుట్టును గావలిగా నుండిరి. అటులే పాండవులును, ధనంజయునకుఁ గవచముగా నలుదెసల నావరించియుండిరి. కృపుఁడు, భీష్మునకు ముందుగా నిలువఁబడియున్న యర్జును, నిరువదైదుబాణములచే నొప్పించెను. ఆకృపునిఁ జేరి సాత్యకి బెబ్బులిఁ జేరిన గజమువలె వెలయుచుఁ దీక్ష్ణసాయకములచే నాతని నొప్పించెను. అంత నాకృపాచార్యుఁడును గ్రుద్ధుఁడై ఱెక్కలుగలబాణములచే సాత్యకి నొవ్వనేసెను. పిదప నందులకుఁ గుపితుఁడై సాత్యకి వడిగా విల్లు వంచి కృపునిఁ జంపఁదగు నొకబాణమును సంధించి విడిచెను. పిడుగువలె

వెడలి వడిగావచ్చు నా నారాచమును రెండుఖండములుగా నశ్వత్థామ, నడుమనే ఖండించెను. అంతఁ బరమకోపముఁ డగు నాసాత్యకి, యా కృపుని విడిచి, చంద్రునిఁ జేరు రాహువువలె, నశ్వత్థామను దలపడఁ బరు విడెను. ఓరాజా! అపు డాయశ్వత్థామయు నాసాత్యకివిల్లు ఖండించి తీవ్రసాయకములచే నాతని నొప్పింపఁగా, నాతఁడును సారమై వైరి మారకమగు వేఱొకవిల్లు పూని, యఱువదిబాణములచే నాద్రోణతనయు వక్షమును, బాహుమధ్యమును నొప్పించెను. అంత నాయేటున కోరువలేక పీడవడి రెండుగడియలు మూర్ఛమునిఁగి ధ్వజస్తంభమును బట్టుకొని రథమధ్యమునఁ గూలఁబడియు, మఱియుఁ దెలివొంది యా ద్రౌణి, సాత్యకిపై నొకబాణమును బ్రయోగించెను. అది యాసాత్య కిని నొప్పించి వసంతమున బిలముఁజొచ్చిన బలవంత మగుసర్పశిశువు వలె ధరాతలముఁ జొచ్చెను. మఱియు నాద్రోణతనయుఁడు వేఱొకనారాచ ముచే సాత్యకిధ్వజము నఱికి సింహనాద మొనర్చెను. ఓరాజా! మఱియు నాయశ్వత్థామ వర్షకాలమున సూర్యుని మేఘమండలమువలెఁ దన్ను శరపరంపరచేఁ గప్పుడు నాసాత్యకి యాశరజాలమును, నివారించి వడిగా నాద్రౌణిని వాఁడికోలలచే నొప్పించి, మేఘవిముక్తుఁ డగు భాస్కరుని వలె వెలయుచు శరవర్షముచే మఱియు నాతనిఁ గప్పి, తానును సింహ నాద మొనరించెను. అంతఁ దనతనయుఁ డటులు, రాహువునకుఁ జం ద్రుఁడువలెఁ జిక్కియుండుటను గాంచి ద్రోణుఁ డందులకు వచ్చి తీవ్ర మగు నొకబాణముచే నాసాత్యకిని నొప్పించెను. పిదప నాసాత్యకి మహా రథుఁడగుగురుపుత్రునివిడిచి యిరువదిబాణములచే ద్రోణుని నొప్పించెను. అంతలో నందుల కర్జునుఁడు కుపితుఁడై వచ్చి యాద్రోణు నెదుర్కొని యెను. పిమ్మట నాద్రోణార్జునులు నభస్స్థలమున బుధశుక్రులువలె నా మహాసంగ్రామరంగమునఁ బోరాడఁ దొడంగిరి" అని సంజయుఁడు తెలుప విని ధృతరాష్ట్రుఁడు మఱియు నిట్లనియె.

## భీమునిపరాక్రమము

"ఓసంజయా! వీరోత్తము లగు నాద్రోణార్జును లిరువురును గలిసి రంటివిగదా! వా రెటులు పోరాడిరి? పాండవమధ్యముఁ డా ద్రోణునకుఁ బరమప్రియుఁడు. కాని యాయర్జునుతోఁ బోరాడుటయు ద్రోణునకుఁ

ప్రియమైనదే. మఱియును వారు సింహపరాక్రములయిన రథికోత్తములు. అటులగుట వారియుద్ధవిధము నెఱిఁగింపుము."

అదివిని సంజయుఁడు "ఓరాజా! ద్రోణుఁడు యుద్ధమునమాత్రము ధనంజయునిఁ బ్రియతమునిఁగాఁ దలంచువాఁడుగాఁడు. అటులే యర్జునుఁడును క్షత్రియధర్మము ననుసరించి రణరంగమున ద్రోణుని గురుఁడని యుపేక్షింపఁడు. ఓరాజా! క్షత్రియులుమాత్ర మెపుడైనను బరస్పరము పరిత్యజించుకొనక తండ్రులతోడను, సోదరులతోడను మితిమాఱి పోరాడువారుగదా! అటులగుట నర్జునుఁడు గురుని మూఁడుకోలలచే నొప్పింప, వాని నించుకేని లక్ష్యముసేయక యాద్రోణుఁడు శరవర్షముచే నాయర్జునునిఁ గప్పి మిక్కిలి కోపముచే దవాగ్నివలెఁ బ్రజ్వలించెను. ఓరాజేంద్రా! పిమ్మటఁ బార్థుఁడును దీవ్రము లగు నారాచములచే నాచార్యు నచిరకాలమునఁ గప్పుటయు సుయోధనుఁడు ద్రోణునకువెనుక రక్షకుఁడై యుండునట్లుగా సుశర్మను బ్రోత్సహించెను. అపు డాసుశర్మయుఁ గుపితుఁడై విల్లు సారించి పార్థునినుపకొనలుగల బాణములచే నొప్పించెను. ఓరాజా! వారిరువురిచేఁ బ్రయుక్తము లగు శరపరంపరలు శరత్కాలహంసలువలె నంతరిక్షమునఁ జరింపసాగెను. అంత నాసుశర్మప్రయుక్తములగు బాణములు నలుగెలంకుల వెడలి ఫలభారనమ్రమగు మేలివృక్షము నాశ్రయించినపక్షులవలె నాయర్జునుమేన నాటికొనియెను. పిమ్మట నయ్యర్జునుఁడు సింహనాదమొనరించి యాసుశర్మను వానిపుత్రులను దీవ్రశరములచే నొప్పించెను. అపుడు వారు యుగాంతయమునిచేవలె నప్పార్థునిచేఁ బ్రహరింపఁబడియు మరణమునకు వెనుదీయక యాతనినే యెదుర్కొని పోరాడుచు, శరవర్షమున నర్జునురథమును గప్పిరి. ఆశరపరంపర నాయర్జునుఁడు, వర్షమునకుఁ బర్వతమువలెఁ జలింపకఁ బ్రతిగ్రహించి మాయెల్లర కద్భుత మగునట్లుగాఁ దనకరలాఘవమును బ్రకటించెను. పలువురు నలుదెసలనుండి ప్రయోగించిన శరజాలముల నతఁ డొకఁడే పెనుగాలి మబ్బులనువలెఁ జెదరఁగొట్టెను. ఆతనియద్భుతకృత్యమునకు దేవదానవులు సంతసించిరి. అంత నప్పాండవమధ్యముఁడు కుపితుఁడై, యాత్రిగర్తులపై వాయవ్యాస్త్రమును బ్రయోగింపఁగాఁ, బెనుగాలిరేఁగి నభస్స్థలమును కలఁత నొందించుచుఁ బ్రాదుర్భవించెను. అటు లది యుద్భవించి తరువులను

బడఁద్రోయుచు, సైన్యముల నశింపఁజేయుచు విజృంభించుటను గాంచి, ద్రోణుఁడు దానికిఁ బ్రతిహతిగా ఘోరమగు శైలాస్త్రమును బ్రయోగించెను. అటు లది ప్రయుక్తమగుడు, నాయర్జునువాయవ్యాస్త్రము శాంతించి దెసలు ప్రసన్నము లయ్యెను. అంత నాతఁడు మఱియు నాత్రిగర్తులరథములను గొట్టి వారిని పరాక్రమహీనులఁగను, నిరుత్సాహులఁగను, విముఖులఁగను నొనర్చెను. పిమ్మట సుయోధనుఁడును, కృపాశ్వత్థామలును, శల్యుఁడును, గాంభోజుఁడును విందానువిందులు సైన్యములతోఁ గూడిన బాహ్లికుఁడును, నాయర్జునుని నలుగెలంకుల నావరించి యుండిరి. అటులే భగదత్తుఁడును శ్రుతాయువును దమతమగజసైన్యములతో భీముని ముట్టడించిరి. భూరిశ్రవుఁడును, శల్యుఁడును, శకునియునుఁ దీవ్రశరపరంపరలచే నకులసహదేవులను మార్కొనిరి. కౌరవసైన్యములతోఁ గూడి భీష్ముఁడు ధర్మజు నలుప్రక్కల నావరించియుండెను. అటులు తనపైకి వెడలినగజసైన్యమును జూచి వనమున వెడలినసింహమువలె నెలవులు దడుపుచుఁ గేలను గదను బూని రథమునుండి వడిగా డిగి నీవారిసైన్యమునకు వెఱపుగలిగించెను. పిదప గదాహస్తుఁడై వెడలినభీమునిఁ గాంచి యాగజసైన్యములవారు నలు దెసల నాతని ముట్టడించిరి. అపు డాగజఘటలనడుమ నాభీముఁడు మేఘములనడుమనున్న భాస్కరుఁడువలె విరాజిల్లెను. అంత నక్కౌంతేయ మధ్యముఁడు తనగదను ద్రిప్పుచుఁ, బెనుగాలి మేఘములనువలె దోలఁగించెను. అంత నయ్యవి గజారోహకులచే మఱియుఁ బురికొల్పంబడి యాభీముని గదాప్రహారములకుఁ బాలగుచు, నార్తనాదముల నొనరించుచు, గర్జించు పెనుమబ్బులునాఁ జూపట్టెను. అంత నాభీముఁడును వైరిగజసైన్యములదంతప్రహారములచేనారణరంగమునఁబూచినరక్తాశోకమువలెఁ గానవచ్చెను. అటు లాభీముఁడు వానితోఁ బోరాడుచు నేన్గుల దంతము లూడఁబెఱుకుచు వానిని బట్టి కుంభస్థలము నధిష్ఠించుచు దండధారి యగు యముఁడువలె వాని నంతము నొందించుచుండెను. ఓరాజా! రక్తసిక్తమై మేదోమజ్జాపూరిత మగు గదను ద్రిప్పుచు రక్తమును బూసికొనియున్న యాభీముఁడు రుద్రుఁడువలె మాకుఁ గానవచ్చెను. అటు లాభీమునిచేఁ బ్రహరింపఁబడి హతశేషములగుకొన్ని యేన్గులు పరువులిడుచుఁ దమసైన్యముల ద్రొక్కుచు నలుదెసలఁ జెదరి

పోసాగెను. ఓధృతరాష్ట్రా! అటులు చెదరి గజసైన్యములతో నీవారి తక్కినసైన్యములును జడిసి యుద్ధపరాఙ్ముఖము లయ్యెను." అని తెల్పి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

## సంకులయుద్ధము

"ఓమహారాజా! నాఁడు మధ్యాహ్నమయ్యెను. అపుడు సోమకులతో రౌద్రమై లోకక్షయకర మగుయుద్ధము ప్రారంభమయ్యెను. అంత నాశాంతనవుఁడు పాండవసైన్యములను జేరి తీవ్రబాణములచే వేలకొలఁదిగా సర్దించుచుఁ, గోసి పడవైచినవరిచేనిని బశుగణముపలెఁ బీడింప మొదలిడుటయు, శిఖండిధృష్టద్యుమ్నులును విరాటద్రుపదులును భీష్ముని మాఱ్కొని శరప్రహారములచే నాతని నొప్పించిరి. పిమ్మట నమ్మహారథుఁడును వరుసగా నాధృష్టద్యుమ్నునిఁ గొట్టి, మఱియు నావిరాటుని మూఁడువాఁడికోలలచే నొప్పించి, ద్రుపదునిపై నొకతీవ్రనారాచమును బ్రయోగించెను. ఓరాజా! అందుల నాయోధులు తొకఁ ద్రొక్కిన పాములునాఁ గుపితులైరి. అంత శిఖండి యాపితామహు నెదుర్కొని ప్రహరింపఁగా నతఁడు స్త్రీమయుఁ డగుటను దలంచి భీష్ముఁ డాతనిఁ బ్రహరింపడయ్యెను. పిదప ధృష్టద్యుమ్నుఁడు కోపముచే నగ్నివలెఁ బ్రజ్వలించుచు మూఁడుబాణములచె నాపితామహునిబాహువులను వక్షమును నొప్పించెను. పిమ్మట ద్రుపదుఁ డిరువదైదును, విరాటుఁడు పదియు, శిఖండి యిరువదైదునుగా శరములఁ బ్రయోగించి యాపితామహుని నొప్పించిరి. అటు లాయోధులు నొప్పింప నతఁడు రక్తసిక్తాంగుఁడై వసంతమునఁ బూఁచిన రక్తాశోకమునాఁ గానిపించుచు వారిని వరుసగా మూఁడేసిబాణములచే నొప్పించెను. అందొకభల్లముచే ద్రుపదునిధనువు దునుమఁగా నతఁడు వేఱొకవిల్లుపూని భీష్ము నైదుబాణములచేఁ బ్రహరించి, మఱియు మూఁడుబాణములచే నాతనిసారథిని నొప్పించెను. అంత భీముఁడును ద్రౌపదేయులేవురును గైకయు లైదుగురును, సాత్యకియు, ధర్మజునిముందిడుకొనిధృష్టద్యుమ్నుఁడుమున్నగుపాంచాలురను బాలించువారై యాభీష్మునిపైకి వెడలిరి. అటులే నీవారును భీష్మరక్షణము నేమఱక తమసైన్యములతోఁ బాండవసైన్యముల నెదుర్కొనిరి. అపు డుభయసైన్యములకును నొప్పసంకులయుద్ధమయ్యెను. రథికులు

రథికులతోడఁ బోరాడి హతులయిరి. అటులే రథగజాశ్వపదాతులును బరస్పరమును బోరాడి పరలోకమును బూరింపసాగిరి. కొన్ని రథములు, రథికులును సారథులును లేక శూన్యములై, నలుగెలంకులకుఁ బరువులిడ సాగెను. ఓరాజా! కొన్ని గుఱ్ఱములు పదాతులను మర్దించుచు గాలివలెఁ జరించుచు, గంధర్వనగరములునా విరాజిలుచుండెను. మఱియుఁ గొందఱు విరథులై కవచములును కుండలోష్ణీషములును వెలయ, శౌర్యముచే నింద్రులును, ధనముచేఁ గుబేరులును నీతిచే బృహస్పతులు, ననఁదగియు నందందుఁ బ్రాకృతమానవులువలెఁ బరువులిడుచుఁ జూపట్టిరి. ఆరోహకులు లేక యేన్గులు తమసైన్యములను ద్రొక్కుచుఁ దమపైనున్న ఛత్రచామరములును, జర్మములును, బతాకలును నేల జాఱుచుండఁగాఁ బటాపంచలై పరువులిడసాగెను. ఓరాజా! ఆసంకులసమరమున నీవారియుఁ బాండవులయు నేన్గులు నల్లని మేఘములునా గర్జించుచు, దంతహీనములై యారోహకులు లేక యందందుఁ బరువులెత్తుట గానవచ్చెను. నానా దేశములజనించిన సువర్ణభూషణభూషితము లగుగుఱ్ఱములు వాయువేగములై వేలకొలఁది చరించుట చూచితిమి. అటులే తమయశ్వములు మడియుటను,ఖడ్గములుమాత్రము ధరించి వైరులచేఁ దఱుమఁబడుచుఁ బరువులిడురౌతులను గాంచితిమి. ఓయాంబికేయా! ఏన్గు తనసాటియేన్గును, బదాతులను, గుఱ్ఱములను దాఁకి మర్దించుట చిత్రముగాఁ జూపట్టెను. రథములు గుఱ్ఱములను గుఱ్ఱములు పదాతులను మర్దింపసాగెను. ఓరాజా! అటు లాసంకుల సమరమునఁ బలువిధములుగాఁ బరస్పరము మర్దించుకొనుచుండుట మహాభయంకరముగాఁ గానవచ్చెను. రక్తనది ఘోరమై ప్రవహింప మొదలిడెను. అం దెమ్ముకలు పాషాణములై కేశము శైవాలముగా, రథములనెడి హ్రదములును, శరములనెడిసుడులును, గుఱ్ఱములనియెడి చేపలు నలరార నేన్గులు మొసళ్లై, కవచోష్ణీషములు నురుగులును, ఖడ్గములు కచ్ఛపములునుగా, నానదికి ధ్వజపతాకలు తీరవృక్షములుగాఁ జచ్చినవారి మొండెము లొడ్డులుగానేర్పడి యందుమాంసాపేక్షచే వచ్చిన క్రవ్యాదాదులే హంసలుగా నారక్తనది భయంకరమై గానవచ్చెను. కొందఱు మహారథులు నిర్భయులై హతములయిన రథనాగాశ్వములను దెప్పలుగాఁ జేసికొని యామహానదిని దరింపసాగిరి. అపుడు వారు

వైతరణిని దాఁటి ప్రేతరాజపురమును జేరుప్రేతలువలెఁ గానవచ్చిరి. ఓరాజా! అపు డపరాహ్ణముగావచ్చెను. యోధులగుక్షత్రియు లాఘోర యుద్ధము నారసి మోహవశులై మొఱవెట్టసాగిరి. కొందఱు "ఆహా! దుర్యోధనునితప్పిదముచే క్షత్రియులు హతులగుచున్నారు. ధృతరాష్ట్ర భూవిభుఁడు గుణవంతులగుపాండవులతో ద్వేషింప నేటికి? అతనిలోభమే యిట్టిదుర్దశకు నిమిత్తము." అని పలువిధములుగా నాడికొనుట విన వచ్చెను. ఆవచనములు విని యోధులగువారు నీపుత్రులయెడఁ బాండ వులు దారుణకర్ములనియుఁ బరస్పరము చెప్పికొనిరి. పిదప సర్వలోకాప రాధి యగునీకొమరుఁడు భీష్మద్రోణకృపశల్యులతో "ఓవీరులారా! జాగేలసేయుదురు? నిరహంకారులై పోరాడుఁడు." అని ప్రోత్సహిం చెను. పిదపఁ బాండవులతోఁ గౌరవుల కెంతయు ఘోరమగుపోరాటము జరగెను. ఓరాజా! కపటద్యూతముచేఁగలిగి ఘోరమైనకష్టమున కిది ఫలముగా సంభవించెను. మహాత్ము లగుభీష్మాదులు నివారించినను, మరల కుండుటచే నిది యిట్లు సంభవించెను. ఓరాజా! ఇఁక నీరణరంగమునఁ బాండవులుగాని, నీకొమరులుగాని ప్రాణములను దాఁచికొనక పోరా డక మానరు. అటులగుట పోరు ఘోరమై స్వజనక్షయమగుట నిస్సంశ యము. దీనికి దైవమో, నీయుపేక్షయో నిమిత్తమైయుండును." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## భీష్మసాత్యకులయుద్ధము

"ఓరాజా! పిమ్మట నర్జునుఁడు తన కగపడినరాజులనెల్ల నుఱు మాడుచుఁ దీవ్రసాయకములచే నొప్పించి దండధరుపురమున కనుపుచు వచ్చెను. అంత సుశర్మ, పార్థు నెదుర్కొని వాసుదేవుని డెబ్బదిటను బార్థునిఁ దొమ్మిదిటను నొప్పింప నెంచి ప్రయోగింపఁగా, వానిని వారించి మహారథుఁ డగునప్పార్థుఁ డాసుశర్మయోధులను బుడమికి బలిగూర్ప సాగెను. అపు డటులు పార్థుఁడు విజృంభించుట కెంతయు జడిసి,కొందఱు రథములను, మఱికొందఱు గుఱ్ఱములను, వేఱొకకొంద ఱేన్గులను విడిచి నలుదెసలకును బఱపులిడి పోసాగిరి. మఱికొంద ఱాగజరథాశ్వ ములను గడువడిగాఁ గొని తొలఁగించికొనిపోయిరి. అటులే పదాతు లును దమతమయాయుధములను విడిచి యుద్ధాభిలాష లేకుండుటను

బరువులిడిపోయిరి. అట్టిసైన్యములను సుశర్మయు మఱికొందఱు వీరులు వారించిరిగాని యవి యెందు నిలువక వెడలిపోయెను. అటు లాసైన్యములు చెదరుటను గాంచి సేనాపతుఁడు సర్వసైన్యములతో భీష్ముని ముందిడికొని, యాసుశర్మని ప్రాణరక్షణమునకై యెల్లవిధములఁ బ్రయత్నించుచు నర్జునుని మార్కొనియెను. అప్పటి కాసుశర్మయు, వాని సోదరులును బహువిధశరప్రహారములు సేయుచు నిలిచిరిగాని తక్కిన వారు చెదరిపోయిరి. అటులే పాండవులును బరమప్రయత్నముతో నర్జునరక్షణమునకై భీష్ముఁడున్న చోటికి వెడలిరి. అయినను వారర్జునుని విక్రమ మెఱిఁగినవారగుట నుత్సాహముతో నాహాకారము లొనర్చుచు నాభీష్ముని ముట్టడించిరి. పిదప నప్పితామహుఁడును నప్పాండవబలమును శరవర్షమున ముంచుచు నొప్పింపసాగెను. అంత నక్కురుపాండవసైన్యములన్నియు నొకచోఁ జేరి పోరాడ నారంభించెను. అపు డపరాహ్ణసమయమైయుండ, సాత్యకి కృతవర్మ నైదుబాణములచే నొప్పించి, యారణరంగమునశరవర్షమును గురియుచుండెను. అటులే ద్రుపదుఁడును డెబ్బది తీవ్రనారాచములచే నాచార్యునిఁ గొట్టి, మఱియు నైదుబాణములచే నాతని సారథిని నొప్పించెను. పిదప భీముఁడును, బ్రపితామహుఁ డగు బాహ్లికునిఁ బ్రహరించి, మహారణ్యమున బెబ్బులివలె మహానాద మొనరించెను.పిమ్మటఁ జిత్రసేనుఁ డభిమన్యునిఁ దలపడి ప్రహరింపఁగా నతఁడు చిత్రసేనునివక్షమును మూఁడుబాణములచే నొప్పించెను. ఓమహారాజా! అపు డామహారథు లిరువురును నభోమధ్యమునఁ గలిసిన బుధశనులు వలెఁ గానవచ్చిరి. అంత నాయభిమన్యుఁడు చిత్రసేనునిగుఱ్ఱములు నాలిగిటిని గొట్టి సింహనాద మొనరించెను. అటులు వాఁడు హతాశ్వుఁడగుటను నిజరథము విడిచి వేఱొకరథము నధిష్ఠించెను. ద్రోణుఁడు ద్రుపదుని వాఁడినారాచములచే నొప్పించి, మఱియు సారథిని బ్రహరింపఁగా నంత నాద్రుపదుఁడు వెనుకటివిరోధమును స్మరించుచు, నప్పటి పీడ నోపలేక కడువడిగలగుఱ్ఱములతో నారణభూమి విడిచిపోయెను. పిదప భీముఁ డాబాహ్లికునిఁ దలపడి, యెల్లసైన్యములును జూచుచుండఁగా, నాతనిరథాశ్వసారథులఁ గూలనేసెను. అపు డాబాహ్లికుఁడు ప్రాణసంశయము గలుగ, నారథము డిగ్గి వడిగా లక్ష్మణునిరథము నారోహించెను. ఓరాజా! పిదప సాత్యకి కృతవర్మని శరపరంపరచే నివారించి

భీష్ము నెదురింపఁగా, నతఁ డఱువదిబాణములచే నాసాత్యకిని గొట్టి, రథమధ్యమున నటించువానివలె ధనువు గిరిగిరఁ ద్రిప్పుచు నయోమయ మగు మహాశక్తి నొకటి వానిపైఁ బ్రయోగించెను. అంత నాసాత్యకియుఁ దనపైకిఁ గడువడిగా నాగకన్యకవలె సువర్ణచిత్రితమై మృత్యువునా దుర్జయమైవచ్చు నామహాశక్తిని గాంచి తనశరలాఘవ మేర్పడ దానిని ఖండించెను. పరమదారుణ మగు నాశక్తి యాసాత్యకిని సమీపింపకయే తెగి మహాప్రభగలమహోల్కవలె నేలఁగూలెను. ఓరాజా! అంత నా సాత్యకి సువర్ణప్రభగలయొకశక్తి నాపితామహునిరథముపై వైవ నది యాతని భుజబలమునుబట్టి కడువడిగలదై మానవునిఁ గాలరాత్రివలెఁ నాభీష్మునిఁ జేరుచుండెను. అంత నద్దాని నారసి యాగాంగేయుఁడు తీవ్రము లగుక్షురప్రములు రెండిటిచే ఖండించి మఱియుఁ దొమ్మిదిబాణములచే నాసాత్యకి నొప్పించెను. పిదప రథాశ్వగజపదాతులతోఁ బాండవు లాధర్మజుని ముందిడికొని వచ్చి యాసాత్యకిరక్షణమునకై యా భీష్ముని ముట్టడించిరి. అపుడు రణజయాభిలాషు లగుకురుపాండవులకు సంకులమై గగురుపా టొదవించు ఘోర మగుపో రారంభమయ్యెను." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## శల్యధర్మజులు పోరాడుట

"ఓయంబికానందనా! అటులు పాండవు లాగాంగేయుని పెనుమబ్బులు భాస్కరునివలె నావరింప నతఁడు కుపితుఁడై యుండుటనుగాంచి, సుయోధనుఁడు, దుశ్శాసనుతో, "ఓయీ! వైరిమారకుఁడగు మనపితామహుని నలుగడలఁ బాండవులు చుట్టియున్నవారు. ఆమహావీరునిరక్షణ మెంతయు నావశ్యకమైయున్నది. అతఁడు రక్షింపఁబడునేని సంగ్రామమునఁ బాంచాలురతోఁ బాండవులను దండించువాఁడుగదా! కావునఁ గర్తవ్యములలో నెల్ల భీష్మరక్షణము కర్తవ్యము సుమీ! ఇతఁడే మనలఁ గాపాడఁదగువాఁడు. అటులగుట నీవు సర్వసైన్యములను గూర్చికొని యెన్నికష్టములనైన సహించి యాతని రక్షింపుము" అని పలికెను.

అది విని నీకొమరుఁడు దుశ్శాసనుఁడు గొప్పసైన్యముతో వెడలి భీష్ముని నలుగడల నాతనికి రక్షకుఁడై యుండెను. అంత నొకలక్షగుఱ్ఱములును, నానాయుధప్రహారనిపుణులై బలవంతులై గర్వితులగు

యోధులును దనవెంట ఁ౦ శకుని వెడలి నకులసహదేవులను, యుధిష్ఠి రుని మార్కొనియెను. పిమ్మట సుయోధనుఁడును శూరు లగుపదివేవురు రౌతుల నాతనికి సహాయులఁగాఁ బంపెను. అంత నారౌతుల వడిగల గుఱ్ఱముల డెక్కలచప్పుడులచేఁ బుడమి వడంకసాగెను. ఓరాజా ! ఆ గుఱ్ఱములడెక్కలచప్పుడులు కొండవినంటుకొన్న వెదుళ్ల పొదలచప్పు డునా మాకు వినవచ్చెను. అపుడు వెడలినధూళులు మిన్నుముట్టి భాస్కరునిఁ గానరాకుండఁ గప్పివైచెను. కడువడిగల యాయశ్వములు హంసలు సరోవరమునువలె నప్పాండవసైన్యమును జొచ్చి కలఁత పెట్టుచు, సకిలించుచుండఁగా నందించుకేళి తెలియఁబడకుండెను. పిమ్మట ధర్మజుఁడును, నకులసహదేవులును నారౌతులవేగము నడంచి, సముద్ర మునకుఁ జెలియలికట్టవలె నాసైన్యము నొక్కమాఱుగా నిలువరించిరి. ఓరాజా ! పిమ్మట రథికోత్తములగు నప్పాండవులు తీవ్రశరపరంపరలచే నా రౌతులతలలను దెగనేయ, గిరిగుహలనుండి యేన్గువెంబడి వెడలిన యేన్గులునా నొకరి వెనుక నొకరు నేలఁ గూలఁబడుచుండిరి. కొందఱు రౌతులతలలు మహావృక్షములనుండి ఫలములుగాఁ బుడమిఁ బడఁ జొచ్చెను, మఱియు వారిహయములును హతములై వెఱచి దెసలకుఁ బరువులిడెను. సింహమును జేరిన ముక్కిడిమృగములువలె మనవారి సైన్యములు పాండవులఁజేరి నలుగడలకుఁ జెదరఁగా నపు డప్పాండ వులు సింహనాదము లొనరించిరి. మఱియు శంఖములను బూరించి భేరు లను మ్రోగించిరి. అంత నీతనయుఁ డటులు పరాజితమగుసైన్యము నారసి శల్యునితో, "ఓవీరాగ్రేసరా! ఇప్పాండవాగ్రజుఁడు నకులసహ దేవులంగూడి మనసైన్యముల నెటులు బెదరించి చెదరఁగొట్టుచుండెనో చూచితే? నీవాతని నిపుడు వేల సాగరమునువలె నివారింపవలయును. నీవు బలసాహసములు గలవాఁడవని తెలియవచ్చుచున్న వాఁడవు." అని పలుక విని ప్రతాపనిధియగు నాశల్యుఁడు యుధిష్ఠిరుఁ డున్నకడకుఁ బెక్కురథములతో వెడలెను. అపు డాశల్యుని గొప్పసైన్యమువడి నొక నిమేషమున నాయుధిష్ఠిరుఁడు నివారించి యామద్రేశునివక్షమును బది బాణములచే నొప్పించెను. అటులే నకులసహదేవులును దమమామ నేఁడేసివాఁడికోలలచేఁ బ్రహరించిరి. పిదప నామద్రేశ్వరుఁడును వారిని మూఁడేసిబాణములచేఁ గొట్టి, మఱియు ధర్మజు నఱువదివాఁడినారాచ

ములచే నొప్పించి తన మేనల్లురను రెండు రెండు బాణములచేఁ గొట్టెను. పిమ్మట మహాబలుఁడగు భీముఁడు మృత్యుముఖతుల్యుఁడగు మద్రరాజును జేరిన తనయన్నను గాంచి, కడువడిగా నందులకు వెడలెను. అంత సూర్యుఁ డస్తమించుచుండఁగాఁ గౌరవపాండవసైన్యములకు దారుణ యుద్ధ మారంభమయ్యెను.” అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

తొమ్మిదవనాఁటియుద్ధము ముగియుట

ఓరాజా! అంత నాశాంతనవుఁడు కుపితుఁడై సైన్యములతోఁ గూడ నప్పార్థులను గొట్టి యందు భీమునిఁ బండ్రెండింటను సాత్యకిని దొమ్మిదిటను, నకులుని మూఁడిటను, సహదేవు నేడింటను, ధర్మజునివక్ష మును బండ్రెండింటను నొప్పించి, మఱియు ధృష్టద్యుమ్నునిఁ గొట్టి సింహనాద మొనరించెను. అంత నాపితామహుని సాత్యకి పండ్రెండింటను నకులుఁడు మూఁడిటను, ధృష్టద్యుమ్నుఁడు డెబ్బదిటను, భీమసేనుఁ డేడింటను, ధర్మజుఁడు పండ్రెండింటను నొప్పించిరి. అంత ద్రోణుఁడును భీమసాత్యకుల నైదైదు తీవ్రనారాచములచేఁ గొట్టఁగా, వారును మూఁడేసివాఁడికోలలచే నాద్రోణునిఁ బ్రహరించిరి. సౌవీరులు, కితవులు, ప్రాచ్యులు, ప్రతీచ్యులు, నుదీచ్యులు, మాలవులు, అభీషాహులు, శూర సేనులు, శిబిదేశీయులు మున్నగువారు భీష్ము నెదుర్కొని వాఁడికోల లచే నొప్పింపసాగిరి. అటులే నానాదేశములనుండివచ్చిన భూపాలురును నానావిధాయుధములను బూని పాండవుల నెదుర్కొనిరి. అంత నప్పి తామహునిఁ బాండవులు నలుగెలంకుల నావరించియుండ నతఁడు వైరి సైన్యములను దవాగ్ని యడవినివలెఁ గాల్చుచుఁ, గొందఱ రథికులధ్వజ పతాకలను బడఁద్రోయఁగా నవి తలలుదెగిన తాఁటిచెట్లవలెఁ గాన వచ్చెను. ఓరాజా! మఱియు నాశాంతనవుఁడు రథగజాశ్వములను, మానవశూన్యములుగా నొనరించి, పిడుగుచప్పుడు ననుకరించునట లుగా ధనుష్టంకారము గావించెను. దానిని విని సర్వభూతములును వడంకెను. ఓభరతర్షభా! ఆతనిశరపాత మొక్కటియు మొక్కవోయె ననుట కవకాశము లేకుండెను. ఓరాజా! ఆవీరవరునిచే హతు లగువీరుల రథములను వానిజవనాశ్వములు రణరంగమునుండి తొలఁగించికొని

పోవుట మేము చూచితిమి. పిదపఁ బదునాల్గువేలచేదికాశికరూశదేశీయు లగుమహారథులు శరీరములం దాశవిడిచి, పరాఙ్ముఖులుగాక నోరుతెఱచినయమునివలె నున్న యాగాంగేయునిఁ జేరి పోరాడి, రథగజాశ్వములతోఁ బరలోకయాత్ర నాచరించిరి. అప్పుడు వేలకొలఁదిగా భగ్నములగురథచక్రాదులను గాంచితిమి. ఓరాజా! అప్పుడు పితామహునిచేఁ బీడితమగురణరంగము చెడిన బహువిధయుద్ధసామగ్రులతోడను, గూలిన గజాశ్వపదాతులతోడను నిండి, పుడమి సూదిమోపనిలుపుటకైన యవకాశ మీయకుండెను. వేలకొలఁది గజరథాశ్వారోహులు నేలఁగూలసాగిరి. భీష్మబాణపీడితులై పరువులిడు కొందఱ యోధుల నాపుట కెట్టివీరులును సమర్థులు గాకుండిరి. ఓమహారాజా! మహేంద్రవిక్రముఁ డగు నప్పితామహునిచేఁ బీడిత మగుచున్న పాండవసైన్యమున నొకరినొకరు గూడక నలుదెసలకుఁ జెదరిపోసాగిరి. ఆమహాసంకులసమరమునఁ దండ్రి కొమరునిఁ, గుమారునిఁ దండ్రియు, మిత్రుని మిత్రుఁడును బిలిచికొనుచుఁ బాండవసైన్యమునఁ గవచములను విడిచియుఁ, గేశములు వీడియుఁ బరువులువెట్టసాగిరి. అప్పు డాసైన్యమెల్లఁ జెదరినయావుల మందవలె నఱచుచు నార్తనాదములతో మాకుఁ గానవచ్చెను. అంత నా దానవాంతకుఁ డాసైన్యవిప్లవమును గాంచి, పార్థునితో "ఓయర్జునా! నీవెవ్వరితోఁ బోరాడఁ గోరితివో యట్టిపితామహునితో రణమొనర్పఁ దగుకాలము సంప్రాప్తించెను. నీవిపుడు మోహవశుఁడవు గాకుందువేని యాతనిఁ బ్రహరింపుము. ఓవీరాగ్రేసరా! మున్ను విరాటనగరమున రాజులసమక్షమున సంజయుఁడు వినుచుండఁగా 'భీష్మద్రోణాదివీరులను, ససైన్యు లగుకౌరవులను, నాయెదుటఁబడిన వారివారిమిత్రులను జంపెద' నని నీవు ప్రతినఁ బలికియున్న వాఁడవు. ఓశత్రునిషూదనా! అట్టిసమయ మిపుడు తటస్థించుటను నీవాక్య మమోఘ మొనరించికొనుము. పరితాపము విడిచి క్షత్రధర్మమును స్మరించి యుద్ధ మొనరింపుము." అని తెలిపెను.

అదివిని యాధనంజయుఁ డధోముఖుఁడై యించుక దృష్టి యొక ప్రక్కకు సారించి, నిష్కాముఁడువలె నావాసుదేవునితో నిట్లు పలికెను.

"ఓదేవా! అవధ్యులగువారిని వధించి నరకహేతువగు రాజ్యముచే లాభముగాని, వనవాసదుఃఖములచేఁ గష్టముగాని నాకుఁ గాన

రాకుండెను. అఱువను నీవచన మలంఘనీయ మగుటచే దుర్జయుండగు భీష్మునిం బడం ద్రోసెదను. కావున మనరథ మింకం గడపుము.” అని తెలుప విని యమ్మాధవుండు రథాశ్వములను బ్రేరించెను. అది చూచి భాస్కరుండువలెం జూడ నలవిగాని యాగాంగేయు నెప్పటివలె యుధిష్ఠిరుని సైన్య మెదురించెను. అంత నాశాంతనవుండు సింహమువలె మహానాద మొనరించుచు, శరవర్షముచే నాధనంజయురథమును ముంచివైచెను. ఓరాజా! ఒకనిమేషమున నాపితామహుని శరవర్షముచే నాయర్జునుని హయసారథులతో రథము గానరాకుండెను. అట్లైనను వాసుదేవుండు చలింపక భీష్మబాణపీడితము లగునిజరథాశ్వములను నడుపుచు ధైర్యము గలిగియుండెను. అంత నప్పార్థుండు మేఘగంభీరారవముగల తనధనువు బూని, తీవ్రనారాచములచే నాగాంగేయునివిల్లు ఖండించివైచెను. అంత నాశాంతనవుండు తునిఁగిన తన ధనువు విడిచి వేఱొకగొప్పవిల్లు పూని యొకనిమేషమున నెక్కువెట్టునంతలో మఱలం దనశరలాఘవ మేర్పడు నట్లుగా నర్జునుండు దానినిగూడం దునియలుగావింప నందులకా పితామహుం డెంతయు సంతసించి, “ఓయర్జునా! మేలుమేలు. ఓకుంతీతనయా! మేలు.” అని సన్నుతించుచు, వేఱొకమనోజ్ఞ మగువిల్లుపూని పార్థునిపై శరపరంపరను గురిసెను. అపుడు వాసుదేవుండు రథాశ్వములకు మండల గతులం గఱపి యప్పితామహుశరములను వ్యర్థముగా నొనరించెను. కాని యాగాంగేయుని శరఘాతములచే వాసుదేవార్జునులు శృంగ ప్రహారచిహ్నితము లగు వృషభరాజములునాం జూపట్టిరి. అపుడు వాసుదేవుం డర్జునుని మృదుయుద్ధమును గాంచియు, భీష్ముండు శరవర్షమును గురియుట నెంచియు, “ఆహా! ఈపితామహుండు సైన్యములనడుమ మధ్యందినమార్తాండునివలె వెలుఁగుచున్నవాండు. పాండవసైన్యములలో వీరులగువారినెల్ల రూపుమాపుచుండెను. యుధిష్ఠిరునిసేనలపాలిట నితండు యుగాంతయముండువలెం గానవచ్చుచుండెనే” అని తలంచియుం గుపితుండై, వెండిగుండులునాఁదగి వడిగలయక్కవ్వడిగుఱ్ఱములను విడిచి సింహమువలె మఱిమఱియు గర్జించుచుం దనకేలను మునికోలం బూని యాభీష్మునిపైకి వెడలెను. అపుడు జగద్భర్తయగు నాతండు తనయడుగులహతిచేం బుడమి వ్రక్కలించువాండుపోలెం గన్ను లెఱ్ఱచేసి తేజోనిధియై వెలుఁగ

నివారిచిత్తము లుత్తలపడసాగెను. అంత, నారణరంగమున "అయ్యో! శాంతనవుఁడు హతుఁడయ్యె హతుఁడయ్యె"ననెడినుడువులు వినవచ్చెను. శ్వేతాంబరోత్తరీయుఁడై మేఘశ్యాముఁ డగు నాభగవానుఁడు శాంతనవుపై వడిగాఁ బరువిడుచు, మెఱుపుతోఁగూడిన మేఘమునాఁ జూపట్టెను. అప్పుడు మత్తమాతంగముపై నుఱుకుసింహకిశోరమువలె నతఁడు మాకుఁ గానవచ్చెను. అటులు తనకెదురువచ్చు నప్పుండరీకాక్షునిఁ జూచి భీష్ముఁడు తనమహాధనువు ముడిచి, తత్తరపాటులేనిచిత్తముతో "ఓ గోవిందా! రమ్ము రమ్ము పుండరీకాక్షా! ఇదె నీకు నమస్కారము. ఓ యాదవవంశోత్తమా! ఇదె నన్నీరణాంగణమునఁ బడఁద్రోయుము. ఓ యనఘా! నీచే హతుఁడ నగుదునేని నాకింతకంటె శ్రేయ మేమి గలదు? ఓదేవదేవా! నే నిపుడు ముల్లోకములకును బూజ్యుఁడ నగుచున్నాఁడను. నీయిచ్చవచ్చినట్టులు నన్నుఁ బ్రహరింపవచ్చును. నీకు నేను దాసుఁడను." అని పలుకుచుండ నంతలో బార్థుఁ డావాసుదేవువెంబడినే వడివడిగా నేగి, తనదీర్ఘబాహువులతో నాతనిఁ బట్టికొనియెను. అంత నయ్యనంతబలుఁ డగుకృష్ణుఁ డప్పార్థునితోడనే కడువడిగా నడువ నుంకింప, నక్కవ్వడి యాసుడివాలుజోదు నడుగుఁదమ్ములఁ బడి, తుట్టతుద కెట్టెటో పదియడుగులలో నాతని నాపఁగలిగెను. ఓరాజా! పిదపఁ గ్రోధకలుషితాక్షుఁడై సర్పరాజువలె నిట్టూర్పులిడుచున్న యప్పుండరీకాక్షునిఁ గాంచి తనయెడ నాతనికిఁగల వాత్సల్యమునుబట్టి యర్జునుఁడు "ఓ దేవా! మఱలుము. నీ వనృతమాడరాదుగదా! ఓకేశవా! మున్ను యుద్ధముచేయనని గదా పలికితివి ఇపు డిటు లీవొనర్చినచో లోకులు నిన్ననృతవాదివని యాడికొనరో! ఈభార మెల్ల నాపైఁ బెట్టుము. ఇదె పితామహుని గతాసునిఁ గావించెదను. ఓకేశవా! నాశస్త్రమును ముట్టి యిదె ప్రమాణముచేయుచున్నాఁడను. ఓశత్రుసూదనా! ఇఁక నిపుడె శత్రు లంతమొందునట్లుగా దుర్జయుఁడును మహారథుఁ డగు నాతనిఁ బడఁద్రోసితిననియె తలంపుము." అని ప్రార్థించెను.

అది విని యమ్మాధవుఁ డించుకయు మాఱు పలుకక, కోపమాపికొనకయే యొప్పటిచొప్పునఁ దనరథ మధిరోహించెను. అంత నాశాంతనవుఁడును రథమును మఱల నధిష్ఠించి, మఱియు మేఘము వర్షముచేఁ బర్వతమునువలె శరవర్షముచే నప్పాండవయోధులను ముంచి, మున్నా

పాండవులు కౌరవసైన్యములను రూపుమాపినట్టు లతఁడు పాండవ సైన్యములను నశింపఁజేయుచు వేసవిసూర్యుఁడువలెఁ దనతేజమును వెలయించెను. అటు లప్పితామహుచే హతములై వేలకొలఁది పాండవ సైన్యములు నిరుత్సాహములగుచు మధ్యందినమార్తాండునివలె నాతనిఁ దేఱిచూడఁ జాలకుండెను. అటు లదరి చెదరిన పాండవసైన్యములకు రక్షకుఁ డగువాఁ డొక్కఁడును గానరాఁ డయ్యెను. అపుడు వారు బురదను దిగఁబడిన పశువులను బోలి దుర్బలములై నలఁగుచున్న చీమలవలెఁ గానవచ్చిరి. ప్రజ్వలించుమార్తాండునివలె శరార్చులను గురియు నా మహారథు నపు డెవ్వఁడును జూడఁజాలరైరి. అటు లప్పితామహుఁడు పాండవసైన్యములను మర్దించుచుండఁగా సూర్యుఁ డస్తమించెను. అటులగుట నాఁటికి యుద్ధము సమాప్తిఁబొందింపఁబడియెను." అని తెల్పి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## పదవనాఁటియుద్ధవిధము నాలోచించుట

"ఓ రాజా! అటు లక్కురుపాండవులు పోరాడుచుండఁగనే సూర్యుఁడస్తమించుటయు ఘోరమైన సంజ గానవచ్చెను. పిదప యుద్ధము చాలింపఁబడియెను. పిమ్మట ధర్మజుఁడు సంధ్యాకాలమగుటఁ జూచియు, భీష్మునిచే హతమై శస్త్రాస్త్రములు విడిచి, పరువులిడుచున్న తనసైన్యమును గాంచియు, సోమకులు పరాజితులై నిరుత్సాహులగుట నెంచియు, నాఁటికి యుద్ధమును జాలించుటయే యుత్తమమని నిశ్చయించెను. అంత నుభయసైన్యములును రణాంగణమునుండి మఱలెను. పిదప నాఁటియుద్ధమున భీష్మబాణపీడితు లగు పాండవవీరుల కాతని యద్భుత పరాక్రమము దలంచుట నించుకేని మనశ్శాంతి గలుగకుండెను. భీష్ముఁడు నాఁటియుద్ధమునఁ బాండవులను సృంజయులను జయించి, నీపుత్రులు తన్నుఁ గొనియాడ నీవారికెల్లరకు వంద్యుఁడై మోదమానమానసు లగు కౌరవసైనికులతో నిజగృహమును బ్రవేశించెను. అంత నెల్లప్రాణులకును మోహావహమైన రాత్రి వచ్చెను. అపుడు పాండవులును, యాదవులును, సృంజయులును భావిసంగ్రామవిధ మాలోచించువారై, మంత్రసిద్ధాంతవేత్తలగుచు నప్పటికిఁ దగునాత్మలాభమును జింతించుచో, ధర్మజుఁడు కొంతతడవు చింతించి యవ్వాసుదేవునితో నిట్లు పలికెను.

"ఓకృష్ణా! ఉగ్రపరాక్రముఁ డగు భీష్మునివిధము గాంచితివిగదా! మత్తగజము పద్మనాళములనువలె మనసైన్యము నెటులు మర్దించుచుండెనో తద్విషయము నేను దెలుపశక్యములేదు. మహాత్ముఁ డగు నాతనిఁ దేఱిచూచుటకైన నుత్సాహము గలుగకున్నది. ప్రజ్వలించినయగ్నివలె మనసైన్యములను దహించెను. ఘోరమైన విషమును గ్రక్కు తక్షకుఁడు వలెఁ గుపితుఁ డగు పితామహుఁడు తనవిక్రమమును వెలయించెను. తీవ్రనారాచములను విడుచు నాతనిజయింప, దేవరాజగు వజ్రపాణికిని వలనుపడదుగదా! పాశధారి యగు వరుణుఁడుగాని, గదాధారి యగు కుబేరుఁడుగాని, కోపపరవశుఁ డగు నాపితామహు నాపఁజాలరు. ఓ దేవా! నాబుద్ధిలోపముచే నాతని రణరంగమున మార్కొని యిటులు దుఃఖసాగరమున మునిఁగినవాఁడను. కావున నిఁక వనముఁజేరి యుండుటయే నాకు శ్రేయమని తలంతును. ఓకృష్ణా! భీష్ముఁడు మమ్ముఁ బీడించుచుండుటను యుద్ధము నాకిష్టపడకున్నది. రాజ్యమునకుఁగాఁ బరాక్రమింప నెంచిననేను, ప్రజ్వలితాగ్నిని జేరు మిడుతవలె భీష్మశరాగ్నికిఁ బాలుగావలసివచ్చుచున్నది. పరమశూరు లగు నాసోదరులును, నాపితామహునిసాయకములచేఁ బీడింపఁబడినవారుగదా! అయ్యో! నాతమ్ములు నాయెడఁగలప్రేమచే రాజ్యభ్రష్టులై వనవాసక్లేశముల నందిరి. ఎట్టివానికిని జీవితము దుర్లభమగుట, నేను జీవితమునే గౌరవించువాఁడను. ఇఁక నాజీవితశేషముచే నుత్తమధర్మమును సంపాదించుకొనువాఁడను. ఓకేశవా! నాసోదరులతోఁగూడ నీకు నే ననుగ్రహపాత్రుఁడనేని, మా క్షత్రియధర్మమున కవిరోధముగాకుండ హితమార్గము నుపదేశింపుము" అని పలుక విని, యాశ్రీకృష్ణుఁడు వారియెడఁగలవిస్తారకారుణ్యముచే నాయుధిష్ఠిరు నోదార్చుచు, "ఓధర్మపుత్రా! పరితపింపకుము. శూరులును వైరివిదారులును దుర్జయులునయిన సోదరులు నీకుఁ గలిగియుండఁగా శోకించు టేటికి? భీమార్జునులు వాయువైశ్వానరతుల్యతేజులు గదా! నకులసహదేవులు నింద్రునిఁబోలిన విక్రమవంతులు. ఓపాండవాగ్రజా! స్నేహబుద్ధితో నన్నును భీష్మునితోఁ బోరాడ నియోగింపుము. నీవాజ్ఞాపింతువేని యిమ్మహాసంగ్రామమున నే నేకార్య మొనర్పనివాఁడను? అర్జునుఁ డాభీష్మునిఁ జంపఁదలంపఁడేని కౌరవు లారయుచుండఁగా నిదె యాగాంగేయునిఁ బిలిచి రణరంగమున నాతనిఁ జంపువాఁడను. భీష్ముఁడే

మరణించెనేని నీకు జయము సిద్ధించినదనుకొమ్ము. ఓరాజా! సంగ్రామమున నాయింద్రునివలె విక్రమించు నన్నుఁ జూతువుగాక. నేనొకఁడనే కురువృద్ధుఁడగు పితామహుని నిదె చంపెదను. అతఁడు మహాస్త్రములను బ్రయోగించుచుండఁగనే రథమునుండి యాతనిఁ బడఁద్రోసెదను. ఎవఁడు పాండవులకు వైరియో వాఁడు నాకు వైరియనుటలో నించుకయు సందియము లేదు. నీప్రయోజనములు మదర్థములే యగుటను నాప్రయోజనములు త్వదర్థములగుటలో సందియమేటికి? మఱియు నీసోదరుఁడు నాకు మిత్త్రుఁడును, సంబంధియు, శిష్యుఁడు నగుచున్నాఁడు. ఓభూపాలా! అర్జుననకుఁగా నామేనిమాంసము నొలిచి యర్పించువాఁడను. ఈయర్జునుఁడన్ననో నాకై జీవితములైనఁ బరిత్యజించువాఁడు. మేమిరువురము నొకరినొక రుద్ధరించుకొనఁ బ్రతిజ్ఞ చేసికొనినవారము. ఓరాజేంద్రా! ఈసంగ్రామమున నేనును యోధుఁడనగునట్లుగా నియోగింపుము. మున్ను నే నర్జునుచే నాగాంగేయునిఁ జంపింతునని యుపప్లావ్యమునఁ బ్రతిజ్ఞ యొనర్చినవాఁడను. అది క్షత్త్రియలోకమెల్ల వినియుంటచే నిపు డర్జునుఁ డావచనమును బాలించుకొనక తప్పదు గదా! పార్థునకు సమ్మతమైనది నాకవశ్యకర్తవ్యమైనది. ఇంతయేల! ఈకార్యభారమెల్ల నర్జునునిదై యున్నది. శత్త్రుసంహారుఁడగు భీష్ము నాయర్జునుఁడు తప్పక వధించును. పాండవమధ్యముఁడు రణరంగమునకు వచ్చెనేని యాతని కెట్టిదియు నశక్యము కాదు. ఓరాజా! దైత్యదానవులతోఁ గూడి దేవతలు సన్నద్ధులై యెదుర్కొనినను, రణరంగమున వారి నర్జునుఁడు జంపఁగలుగునుగదా! భీష్ముని వధించుట యాతనికొకదుర్ఘటమా? మహాబలుఁడయ్యును భీష్ముఁ డిపుడు గతసత్త్వుఁడును, నల్పబుద్ధియునై విపరీతముగాఁ గర్తవ్య మెద్దియో తెలియకున్నవాఁడు" అని తెలిపెను.

అది విని ధర్మజుఁ డవ్వాసుదేవునితో "ఓమహాబాహూ! నీవన్నదెల్ల సత్యము. అటులు భీష్మునిపైకి వెడలిన నీవేగము వీరెల్ల నాపఁగలిగిరా? అటులగుట నాయీమనోరథము నెల్లఁ దప్పక యొందఁగలవాఁడను. నీవు నాపక్షమున నుండఁగా నాకేమికొఱఁత? నీవు మాకధిపతివై యుండఁగా నింద్రాదిదేవతలను సైతము జయింపఁగలుగుదును. ఓగోవిందా! భీష్ముఁడన మాకేపాటి? ఓమాధవా! మనకుఁగలగౌరవమును

బట్టి నిన్ను నృత మాడింపనొల్లను. కావున నీవు మాకై యుద్ధము చేయ కయే నీవన్నసాహాయ్య మొసఁగుము. ఓ ప్రభూ! ఆభీష్ముఁడు నాఁడు నాతో 'నీకు యుద్ధమున మంచియాలోచనము చెప్పి నీయర్థసాధన మొనర్తునుగాని నీకై పోరాడను. దుర్యోధనునిపక్షమునఁ బోరాడు వాఁడను, ఇది సత్యము.' అని ప్రతిన యొనర్చియున్నవాఁడు. ఓమాధవా! ఆశాంతనవుఁడు నాకు మంత్రదాతయు, రాజ్యదాతయు నై యున్న వాఁడు. కాఁబట్టి యోమధుసూదనా! తనవధోపాయమును దెలుపు నట్లుగా మఱల నాతనికడకు మన మెల్లఁ బోయి ప్రార్థింతము. అతఁడే మనహితముఁ గోరి సత్యముగాఁ దగు నాలోచనము చెప్పును. అతఁ డేమార్గముపట్టి పొమ్మన్న దానినే యనుసరించువాఁడను. దృఢవ్రతుఁ డగునతఁడు మాకు జయదాతయు, మంత్రదాతయు నైనవాఁడు. తండ్రిలేక బాలులమైయున్న మమ్ముఁ బెనిచినవాఁ డతఁడే. ఓమాధవా! అట్టిపితామహుఁ డగువృద్ధుని జనసమ్మతునిఁ జంపఁదలంచితిమి. ఛీ! ఛీ! క్షత్త్రియజీవికచేఁ బ్రయోజ మేమి?" అని తెలిపెను.

ఓధృతరాష్ట్రా! (౧౦) అంత నవ్వాసుదేవుఁ డప్పాండవాగ్రజునితో "ఓరాజేంద్రా! నీసుభాషిత మెంతయు నాకు రుచించెను. అతఁడు తన చూపులచేత వైరులను దహింపఁగలవాఁడు. కావున నాతనిఁ జంపు నుపాయ మతనినుండి తెలిసికొనుటయే యుచితవు. ఓభారతా! వృద్ధుఁ డగు నప్పితామహునితో నాలోచింపఁ బోవుదము. అతఁ డేమియాలో చన మెఱిఁగించునో దాని ననుసరించియే వైరులకు మార్కొని పోరా డుదము." అని యాలోచించికొని యప్పాండవు లావాసుదేవు యుధి ష్ఠిరులంగూడి యాశాంతనవుఁ డున్నకడకు వెడలి శస్త్రకవచములను విడిచి యుష్ణీషాదులు ధరింపనితలలతో నాతనిగృహము ప్రవేశించి, మఱిమఱియు నతనిఁ బూజించుచు, సవినయముగా నమస్కరించి శరణు చొచ్చిరి. అప్పు డక్కురుపితామహుఁ డగు భీష్ముఁడు వారి నారసి, "ఓ వాసుదేవా! ఓపాండవులారా! మీకెల్ల స్వాగతమా? మీకు నావలనఁ గాఁదగు హితకార్య మెద్ది? ఎట్టిదుష్కరమయ్యెను దాని నెల్లవిధ ములఁ దప్పక చేయువాఁడను." అని మఱిమఱియుఁ బ్రీతిపురస్సర ముగాఁ బ్రశ్నించునాతని వచనమును విని యుధిష్ఠిరుఁడు దైన్య మేర్పడునట్లుగా నప్పితామహునితో, "ఓతాతా! మేము జయించు

కెట్టులు ? మాకు రాజ్యము లభించు టెట్టులు ! ప్రజాక్షయ మధిక ముగా నగుచున్నది. అటులుగాకుండ మాకేదే నుపదేశింపుము. నీవు మరణించు నుపాయ మేదియేని నీయంతన నీవు మాకుఁ దెలుపుము. ఓ వీరాగ్రేసరా! ఈసంగ్రామమున నిన్ను మేము జయించు టెట్టులు? ఓ కురుపితామహా! మాకించుకేని యవకాశము గానరాకున్నది. ఎల్లపుడును నీవు విల్లు మండలాకారముగనే త్రిప్పుచున్నవాఁడవు. ఓమహాబాహూ! నీవు రథమధ్యమున నపరభాస్కరునివలె వెలుఁగుచు నెపుడు బాణ మాకర్షింతువో, యెప్పుడు సంధింతువో, యెపుడు విడుతువో తెలియఁ బడకున్నది. రథగజాశ్వములుమాత్రము నీచేఁ దెగిపడుచున్నవి. ఇపుడు నిన్నెవ్వఁడు జయింప సాహసింపఁగలఁడు! శరవర్షమును వర్షించు నీచే నీసంగ్రామమున నాసైన్యములు లెక్కలేక మడియుచుండెను. ఓపితా మహా! నిన్ను మే మెటులు జయింతుమో? మాకు రాజ్య మెటులు లభించునో? మాసైన్యముల కెటులు హానివాటిల్లకుండునో? యనువిష యమున మాకు హితమార్గ ముపదేశింపుము” అని పలికెను.

అంత నాశాంతనవుఁ డప్పాండవులతో, “ఓకౌంతేయులారా! నేను జీవించియుండఁగా మీ కీసంగ్రామమున జయము గలుగుట కల్ల. ఇది సత్యమని నమ్ముఁడు. నేను జయింపఁబడితినా ? మీకుఁ దప్పక జయము కలుగును. కావున మీరు జయము గోరుదురేని వడిగా నన్నుఁ బ్రహరింపుఁడు. ఓపార్థులారా! మీరు నన్ను సులభముగాఁ జంపుట కంగీకరించువాఁడను. ఇదియే మీకు మేలిమార్గమని నేను దెలియు చున్నవాఁడను. నేను హతుఁడనయితినా! మాసైన్యములెల్ల హతము లయ్యెననియే తలంపుఁడు. కావున నాచెప్పినచొప్పునఁ జేయుఁడు.” అని తెలిపెను. అదివిని ధర్మజుఁడు మఱియు నాభీష్మునితో, “ఓతాతా! నీవన్న యటులు నిన్నుఁ గుపితుఁడైన దండహస్తుఁ డగుయమునివలె జయిం చుట దుర్లభము. సురాసురులతోఁ గూడిన యింద్రుఁడుగాని, యముఁడు గాని, వరుణుఁడుగాని సమరమున నిన్ను జయించుట సుకరముగాదు గదా! కావున నిన్ను జయించునుపాయము మా కెఱిఁగింపుము.” అని ప్రార్థింపఁగా, మఱియు నాభీష్ముఁ డాతనితో, “ఓయుధిష్ఠిరా ! నీవన్నది నిజము. నేనే ధనువుఁ బూని యుద్ధసన్నద్ధుఁడనై శస్త్రమును బట్టితినేని సురాసురులకును జయింప నలవిగానివాఁడను. అటులగుట నేను శస్త్ర

ముగాని బరిత్యజింతునేని నన్నెవ్వరేని సులభముగాఁ జంపుదురు. ఇఁక నేను శస్త్రమును విడిచినవానియందును, పతితునందును, కవచధ్వజములు లేనివానిపైని, పరుగులువాఱువానిపైని, వెఱచినవానిపైని, నేను నీవాఁడనని శరణుసొందినవానిపైని శస్త్ర ముపయోగింపను. అటులే స్త్రీతోడను, స్త్రీనామధేయుతోడను, ఏకపుత్రునితోడను, దీనునితోడను, హీనునితోడను బోరాడుటకు సమ్మతింపను. ఓరాజేంద్రా! నేను మున్ను సంకల్పించినవిధమును దెలిపెదను వినుము. అశుభచిహ్నముగలవాఁ డగపడినపుడు నేను మఱి యుద్ధము చేయ నుత్సహింపను. ఓరాజా! మీసైన్యమున మహారథుఁడగుశిఖండి గలఁడు గదా! వాఁడు రణప్రియుఁడును, శూరుఁడు నైనవాఁడు. వాఁడు తొలుత నాఁడుదిగాఁ బుట్టి, పిదపఁ బురుషుఁ డైనవాఁడు. అదియెల్ల మీరెఱిఁగినదియే. కావున వానిని ముందిడికొని సమరశూరుఁడగు మన యర్జునుఁడు నన్ను మార్కొని తీవ్రబాణములచే నొప్పింపవలయును. వాఁడు మున్నాఁడుదియు, నశుభలక్షణముగలవాఁడు నగుటచే వానిని నేను బ్రహరింపనొల్లను. అటులు వాని నుపేక్షించియున్నతఱి నర్జునుఁడు నన్నుఁ జేరి శరప్రహారములచే నొప్పింపవచ్చును. అటులుగాక యుద్ధసన్నద్ధుఁడనై యున్న నను జయించుట కెవ్వరికిని వలనుపడదు. కాని కృష్ణార్జును లిరువురలో నెవరేని నన్ను జయింప నోపుదురు. వారును నాచెప్పినచొప్పున నాశిఖండిని ముందుంచుకొనియే నన్ను జయించుట సుకరము. ఓసువ్రతా! ఇపుడు నేను దెలిపినవిధముగా నొనరింపుము. అటులయినచో నీసంగ్రామమునఁ గౌరవులను నిశ్శేషముగాఁ జంపఁగలుగుదువు." అని యాగాంగేయుఁడు బోధించెను.

ఓధృతరాష్ట్రా! అది విని పాండవులెల్లరును నక్కురుపితామహుఁడగుభీష్మునకు నమస్కరించి తమశిబిరములకుఁ బోయిరి. అంత నాశాంతనవుఁ డటులు పరలోకదీక్షతో హిత ముపదేశించుటయు, నర్జునుఁడు దుఃఖాక్రాంతుఁడై యించుక లజ్జవొడమ నవ్వాసుదేవునితో, "ఓదేవా! పూజ్యుఁడును గురువృద్ధుఁడును బ్రజ్ఞానిధియు నగుపితామహునితో యుద్ధముచేయు టెట్టులు? ఓమాధవా! నేను బాల్యమున ధూళిగల చోట నాడుకొనుచుండఁగాఁ జూచినపుడెల్ల నాతనిచిత్తము వ్యథ నొందెడిది. ఓగదాగ్రజా! పాండుజనకుఁడై మహాత్ముఁ డగునాతనినే

తండ్రీ! యని పిలుచుచు, నాతనితొడపై నాడుకొనుచు నుండఁగా నతఁడు నాతో "ఓబాలకా! నేను నీకుఁ దండ్రిని గాను. నీతండ్రికిఁ దండ్రిని" అని పలుకుచుండెడివాఁడు. అట్టివానిని నే నెట్టులు చంపుకొందును. మాసైన్యము నెల్ల నతఁడు చంపినఁ జంపనిమ్ము. కాని నే నాతనితో యుద్ధమొనర్పనొల్లను. నాకు జయమే గలుగనీ! వధమే గలుగనీ! నే నాతనిఁ జంపను. ఓకృష్ణా! నీవిందుల కేమితలంతువు?" అని పలికెను. అది విని య య్యాదవనందనుఁ డాపార్థునితో, "ఓయర్జునా! మున్ను రణరంగమున భీష్ముని వధింతునని ప్రతినయొనర్చియు, క్షత్రధర్మ మందుండియు నీవాతని వధింపకుందు వెట్లు? ఓపార్థా! యుద్ధగర్వితుఁ డగు నాతని రథమునుండి పడఁద్రోయుము. అతని హతునిఁ గావింపవేని నీకు జయము గలుగదు. ఇదియెల్ల మున్ను దేవతలచేఁ గనిపెట్టఁబడినవిషయమగుట వేఱొకవిధముగా జరుగఁబోదు. ప్రళయకాలయమునివలె దుర్జయుఁడగుభీష్ముని నీవుదక్క యావజ్రధారియు రణరంగమున మార్కొనఁజాలఁడు. భీష్మునిఁ జంపుము. నామాట మన్నింపుము. 'గుణవృద్ధుఁడును వయోవృద్ధుఁడు నైననుఁ దనకుఁ హానిఁగూర్ప నెంచి తనవారిని బీడించువానిని జంపవచ్చును.' అని బుద్ధిశాలియగు బృహస్పతి మున్నింద్రునకుఁ దెలిపియుండలేదా? ఓధనంజయా! నాచెప్పినది క్షత్రియులకుత్తమమైననిత్యధర్మము. క్షత్రియుఁడగువాఁ డసూయవిడిచి ప్రశ్నింపవలయును. తెలిసికొనవలయును. యుద్ధము చేయవలయును. సాధులను రక్షింపవలయును." అని తెలిపెను.

అది విని యర్జునుఁడు, "ఓకృష్ణా! భీష్మునకు శిఖండియే మారకుఁడగుట నిశ్చయము. వానినిజూచినతోడ నేగాంగేయుఁడు యుద్ధవిముఖుఁడగును. అపుడు మేమెల్ల వానిని ముందుంచుకొని యుపాయముచే నాతనిఁ బడఁద్రోయవలయునని నిశ్చయించితిని. అపుడు భీష్మునకుఁ దోడుగావచ్చినవారి నెల్ల నేను నివారింతును. శిఖండి భీష్మునితోయుద్ధము చేయును. 'నేను శిఖండిని జంపువాఁడనుగాను.' అని భీష్ముఁడు ప్రతిన యొనరించియున్నవాఁడు." అని యప్పాండవులు మాధవునితోఁ గూడఁ బలికికొని సంతుష్టాంతరంగులై యుండిరి." అని సంజయుఁడు తెలుప విని ధృతరాష్ట్రుఁ డిట్లనియె.

## కపవసాఁటియుద్ధము. భీష్మశిఖండి సంభాషణము

"ఓసంజయా! శిఖండి యూ గాంగేయు నెటు లెదురించెను? పాండవు లేమి యొనర్చిరి? భీష్ముఁ డేమి చేసెను? అదియెల్ల నాకుఁ దెలుపుము."

అది విని సంజయుఁడు, "ఓయాంబికేయా! పిమ్మటికథ నెఱిఁగించెదను వినుమ" మని యిట్లనియె. "ఓరాజా! సూర్యోదయమగుటయుఁ బాండవులెల్లరును భేరులును, మృదంగాదులును మ్రోగుచుండఁగా, శంఖములు పూరింపఁబడుచుండఁగా శిఖండిని ముందుంచుకొని యుద్ధమునకు వెడలిరి. అపుడు సకలశత్రుసిరాసకమగు నాపాండవవ్యూహమున శిఖండి సేనలకు ముందుగా నుండెను. ఆతనికి భీమార్జునులు చక్రరక్షకులై యుండిరి. పరాక్రమశాలి యగు నభిమన్యుఁడును, ద్రౌపదేయులును వానివెనుక నుండిరి. సాత్యకియుఁ, జేకితానుఁడును వారికి రక్షకులై యుండిరి. వారివెనుక ధృష్టద్యుమ్నుఁడు పాంచాల్యులచే రక్షితుఁడై యుండెను. వారివెనుక నకులసహదేవులతోఁ గూడి యుధిష్ఠిరుఁడు సింహనాదముచేయుచు వెడలెను. వారివెనుకఁ దమతమసైన్యములతో విరాటద్రుపదులు వెడలిరి. ఓరాజా! పాండుసైన్యములకు వెనుకను గైకేయులగు సోదరులును ధృష్టకేతుఁడును రక్షకులై యుండిరి. ఓవిభూ! ఇటులు తమగొప్పసైన్యమును వ్యూహముగా సంఘటించి, మీవారిసైన్యము నెదుర్కొని ప్రాణములపైఁ దీపివిడిచి యుత్సాహముతో నుండిరి.

ఓరాజా! అటులే కౌరవులును మహారథుఁడగు భీష్ముని సకలసైన్యములకు ముందుగా నిలిపి పాండవులను మార్కొనిరి. నీకొడుకు లా శాంతనవునకు రక్షకులై యుండిరి. వారివెనుక ద్రోణుఁడును, మహాబలుఁ డగు నాతనికొమరుఁడును నిలిచిరి. భగదత్తుఁడు తనగజసైన్యముతోఁగూడి కృపుఁడును గృతవర్మయుఁ దనకు సహాయులుగా నాద్రోణుని వెనుక నుండెను. వారివెనుకఁ గాంభోజుఁడును, జయత్సేనుఁడును, శకునియు నిలిచియుండిరి. అటులే సుశర్మ మున్నగు యోధులు నునుసైన్యముల వెనుకభాగమును గాపాడుచు నుండిరి. ప్రతిదినమందును భీష్ముఁడు తనవ్యూహముల నాసురములు పైశాచములు రాక్షసములుగా నొనర్చు

చుండెను. పిమ్మట యమరాష్ట్రము వృద్ధినొందునట్లుగాఁ బరస్పరముఁ బ్రహరించుకొనుచు నీవారును బాండవులును బోరాడ నారంభించిరి. అర్జునుఁడు మున్నగు పాండవులు శిఖండిని ముందుంచుకొని పలువిధము లగు శరపరంపరలఁ గురియుచు భీష్ముని మార్కొనిరి. ఓరాజా! అందు భీమునిచేఁ బ్రహృతులై నీవారు రక్తసిక్తాంగులై పరలోకమును బొందు చుండిరి. నకులసహదేవులును సాత్యకియుఁ దమ తేజము ప్రకటితముగా మీవారిసైన్యమును బీడింపసాగిరి. ఓరాజా! అటులు మీవారు హతు లగుచుండియుఁ బాండవులబలమును నివారింప వలంతులు గాకుండిరి. పిదప సర్వవిధముగా హతమై కౌరవసైన్యము నలుదెసలకును జెదరు చుండెనుగాని యొకఁడు దానికి రక్షకుఁడు గానరాకుండెను. పాండవ సృంజయులు విజృంభించి మీవారిని మర్దించుచుండిరి." అని తెలుప విని ధృతరాష్ట్రుఁడు మఱియు సంజయునితో, "ఓయీ! అటులు తనసైన్యము పాండవులచేఁ బీడింపఁబడుచుండుట గాంచియుఁ బరాక్రమశాలి యగు భీష్ముఁ డూరకుండెనా? లేక కుపితుఁడై దానికిఁ బ్రతిహతి యేమేనిఁ జేసెనా? అపు డతఁడు పాండవుల నెదుర్కొని సోమకులు మున్నగు వారి నెటులు ప్రహరించెనో? అదియెల్ల నాకెఱిఁగింపుము.''అని పలికెను.

అది విని సంజయుఁ డాజనవిభునితో, "ఓరాజా! నీతండ్రి యపు డేమియొనర్చెనో తెలిపెదను వినుము. అంతఁ బాండవసృంజయసైన్యము లటులు నీవారిసైన్యములను బీడించుటయుఁ, బాండవులు సంతుష్టాంత రంగులై యుండిరి. అటులు తనగజరథాశ్వపదాతిసైన్యము లెల్లఁ బాండవులపీడ వడనోపక చెదరుటఁ గాంచి భీష్ముఁడు క్రోధావేశపర వశుఁడై యప్పాండవసృంజయులను బలువిధములైన వత్సదంతములు, నారాచములు, నంజలికములు మున్నగువానిచే వారిని బ్రహరించుచుఁ, బ్రాణములం దాశవడక పెక్కులగుగజాశ్వాదులను జంపుచు, రథికులను గొట్టి రథములనుండి పడఁద్రోయుచు, రౌతులను బదాతులను నేలఁ గూలఁద్రోయుచు, గజారోహకులకు వెఱపుగొలుపుచు విజృంభించెను. అటులు భీష్ముఁ డొకఁడే పెచ్చుపెరుగుట నారసి పాండవు లాతని రాక్షసు లింద్రునివలె నెదుర్కొని పిడుగులనుబోని తీవ్రబాణములను బ్రయోగించుచుండిరి. అపుడు భీష్ముఁ డెల్లదెసలఁ దానయై యగపడు చుండెను. అటులు పోరాడుచున్న యాతనిచేతివిల్లు గుండ్రముగాఁ

దిరుగుటయె గానవచ్చెను. ఆమహావీరుని సమరవిధము నారసి, దేవా రెల్లరును బరమాశ్చర్యభరితులై యాతనిఁ గొనియాడిరి. అటులు పరమ శూరుఁడై విక్రమించు నాగాంగేయుం గాంచి పాండవులు ఖిన్నులై యేమియు నప్పటికిఁ జేయఁజాలక యున్న దేవతలు విప్రచిత్తినివలె నుపేక్షించియుండిరి. అతఁడు ప్రళయకాలయముఁడువలె నాపదియవ నాఁటియుద్ధమున మహారణ్యముఁ గార్చిచ్చువలె దహించుచు, శిఖండి రథజాలమును బ్రహరింపసాగెను. అంత నాశిఖండి యాభీష్మునివక్షమును మూఁడుబాణములచే నొప్పించెను. అపుడాభీష్ముఁడు కాలస్పృష్టమై కుపిత మగు సర్పమువలె నాశిఖండి ప్రహారముఁ సహింపక వానిం గాంచియుఁ జూడనొల్లక నగుచు వానితో, "ఓరీ! నీవు శస్త్రప్రయోగము చేసినను జేయకున్నను సరే! నీతో నేను యుద్ధమొనర్చువాఁడను గాను. నిన్ను ము న్నానలువ సృష్టించుటలో నీవు శిఖండినివిగాని శిఖండివిగావుగదా" అని పలుక విని శిఖండి కుపితుఁడై పెదవులు దడుపుచు నాతనితో "ఓ మహాబాహూ! నిన్ను నే నెఱుఁగుదును. నీవు క్షత్రియనాశకరుఁడవు. నీయుద్ధనైపుణ్యము ము న్నా పరశురామునిచే వినియున్నవాఁడను. మఱియు నీప్రభావము దివ్యమైనదని పెక్కుసారులు వినియుంటిని. అటులైనను నీతో నిపుడు యుద్ధమొనరించి, పాండవులకుఁ బ్రియ మొనర్చి, నాకును యశము గూర్చికొనెదను. ఇపుడు నీతో నేను యుద్ధ మొనర్చి తప్పక నిన్నుఁ జంపెదనని యిదె నీయెదుటఁ బ్రతినచేయు చున్నాఁడను. ఈ నావచనమును వింటివిగదా! ఇఁక నీకుఁ గర్తవ్య మగుదాని నొనరింపుము. నీవు యుద్ధమొనర్చినను మానినను నిన్ను జీవముతో నుండనీను. ఓభీష్మా! లోకమెల్ల నావిక్రమ మాలోకించుఁ గాక." అని పలికెను.

ఓయాంబికేయా! ఇటు లాశిఖండి పలికి, యైదుతీవ్రబాణములచే నాభీష్ముని నొప్పించెను. అంత నయ్యర్జునుఁడును, శిఖండి నిదియె తగు సమయమని ప్రేరించుచు, "ఓయీ! నేను నీకు సహాయుఁడనై పెఱవీరుల నెల్లఁ బాఱఁద్రోలువాఁడను. నీవు పరాక్రమశాలి యగు భీష్ముని మార్కొని పోరాడుము. నీకించుకేనిఁ బీడ గలుగదు. కావున నిపుడు సన్నద్ధుఁడవై భీష్మునెదురింపుము. ఇపుడు నీ వీభీష్మునిఁ జంపకపోయితివేని, నీకును నాకును నగుబాటు గలుగకమానదు. ఈయుద్ధమున మన కెటు

లవమానముగలుగకుండునో యటులు యత్నించి భీష్మునిమడియింపుము, నీకొకింతయు హానివాటిల్లకుండ నేను నిన్ను రక్షించువాఁడను. రథికుల నెల్ల నేను నివారింతును. నీవు భీష్మునిమాత్రము ప్రహరింపుము. ఇంత యేల! ఈద్రోణకృపాశ్వత్థామలను, చిత్రసేన వికర్ణసుయోధనులను, సైంధవుని, విందానువిందులను, గాంభోజుని, భగదత్తమాగధులను, భూరిశ్రవుని, శలంబుసుని, సకలసైన్యములతోఁ గూడినసుశర్మను, సముద్రమును వేలవలె నేను నివారింతును. మఱియు మహాబలులగు కౌరవులనెల్ల నే నొకఁడనే నీదరిఁ జేరకుండఁ దొలఁగింతును. నీవు భీష్మునిఁ జంపుము." అని పలికెనని సంజయుఁడు తెలుప విని ధృత రాష్ట్రుఁడు మఱియు ని ట్లనియె.

## దుర్యోధన భీష్మసంవాదము

"ఓసంజయా! ఆగాంగేయు నాశిఖండియెటులుమార్కొనియెను? అపుడు భీష్మునుండి శిఖండిని రక్షించినవా రెవరు? మహారథులగువా రెల్లరును జిగీషతో నేమి యొనర్చిరి? మహావీరుఁడగుభీష్ముఁడాపదియవనాఁడు పాండవసృంజయుల నెదుర్కొని విక్రమించినవిధ మెట్టిది? ఆహా! శిఖండి భీష్ము నెదురించుట కించుకయు నాచిత్త మొప్పకున్నది. ఆతనికి రథ భంగముగాని, ధనుర్భంగముగాని గలిగెనా? తెలుపుము" అని ప్రశ్నించెను.

అది విని సంజయుఁ డాతనితో, "ఓరాజా! యుద్ధముచేయునట్టి యాగాంగేయునకు రథభంగమన నెట్టిది ? ధనుర్భంగమన నేమి? వేల కొలఁదియేన్గులును, మహారథులును భీష్ముని ముంగిడికొని వైరులను పరి మార్చుచు వచ్చిరి. ఆభీష్ముఁడును దానొనర్చినప్రతినచొప్పునఁ పాండవ సైన్యముల నశింపఁజేయసాగెను. అంతఁ బాంచాలురును బాండవులు నాశాంతనవు నెదుర్కొనిరిగాని నాఁటియుద్ధమునఁ బాశహస్తుఁడగు నంతకునివలెనున్న యాతని జయింపఁజాలకుండిరి. పిమ్మట నాయర్జునుండు తనప్రావీణ్యముచేఁ గౌరవయోధులకు వెఱపుగొలుపుచు, నెవ్వరికిని లోఁ గక, మాటికిని సింహానాదమును జేయుచు, ధనుష్టాంకార మొనరించుచుఁ గాలుఁడువలె నాగణరంగమునఁ జరించెను. ఓరాజా! ఆతని యా ధనుష్టాంకారముచే నీవా రెల్ల జడిసి, సింగమునకు వెఱచిన మృక్కిడి

మృగములునా నలుదెసలకును బాఱఁదొడంగిరి. అటులు వెఱచఱచి పసువులవలె తనసైన్యమును జయించుచున్న యర్జునునిఁ గాంచి సుయోధనుఁడు భీష్మునితో, "ఓ తాతా! శ్వేతాశ్వుఁడును గృష్ణసారథియునగు నీ పార్థుఁడు శుష్కవనము నగ్నివలె మాసైన్యమునెల్లఁ గాల్చుచున్నవాఁడు. నలుదెసలకును జెదరుచున్న మహాసైన్యములను జూచితివా? మఱియు నాయర్జునుచే నశింపఁజేయఁబడుచున్నవారు. అడవిని బశుగణములను గోపాలుఁడువలె మనసైన్యముల నాయర్జునుఁడు తఱుముచున్నవాఁడు. అర్జునశరపరంపరలచే మనవారు బెదరి చెదరుచున్నారు. అటులే భీముఁడును మనబలమును బీడించి యోడించుచున్నాఁడు. మఱియు మాద్రీపుత్రులును, సాత్యకియు, నభిమన్యుఁడును విక్రమించుటను మనసేన చకాచకలై వికలమగుచున్నది. అటులే ఘటోత్కచుఁడును, ధృష్టద్యుమ్నుఁడును నీసంగ్రామరంగమునుండి నాసైన్యమును దఱుముచున్నవారు. ఇటు లీమహారథులు పీడింపఁ దొడంగుటచే నాసైన్యములకు గతి గనఁబడదయ్యెను. నిలుచుటకుఁగాని యుద్ధము చేయుటకుఁగాని త్రోవ గానరాకున్నది. దేవతుల్యపరాక్రముఁడవగు నీవుదక్కఁ బీడితులగు నాయోధులకు వేఱొకదిక్కు లేదు." అని పలుక విని నీతండ్రియగు దేవవ్రతుఁడు రెండుగడియ లేదో చింతించి నిశ్చయించికొని నీకొమరు నోదార్చుచు వానితో, "ఓసుయోధనా! స్థిరచిత్తుఁడవై వినుము. మున్ను నేను బదివేవురుక్షత్రియులను జంపక రణరంగమునుండి మఱలువాఁడను గాను. ఇదియే నా కీనాఁటికృత్యము. అని ప్రతినచేసి యుంటినిగదా! దానిని దప్పక యాచరించితిని. ఓ మహాబలా! ఇంకను నద్భుతమగు కృత్య మొనర్చువాఁడను. నేఁడు పాండవులనైనఁ జంపెదను. లేదా నేనైన హతుఁడనై శయనింతును. ఇపుడే నీఋణ మీఁగుదును. ఓ రాజా! నీయన్నము దినుటను నీసేనాముఖమునఁ బోరాడి నిహతుఁడనయ్యెదను." అని పలికి యామహావీరుఁ డెప్పటిచొప్పున క్షత్రియులను శరపరంపరలచే ఖండించుచుఁ బాండవసైన్యముపైఁ బడియెను. అటు లతఁడు సేనామధ్యమునఁ గుపిత మగు సర్పమువలె విజృంభించియుండ నాతనిఁ బాండవులు మార్కొనిరి. ఓ రాజా! నాఁడు శాంతనవుఁడు తనశక్తినెల్లఁ బ్రకటించుచుఁ బదివేవురు క్షత్రియులను హతులఁ గావించెను. మఱియుఁ బాంచాలయోధుల

తేజములను సూర్యుఁడు జలమునువలె నాకర్షించుచు, నటులే పదివేల యేన్గులను, రౌతులతోఁ గూడఁ బదివేలగుఱ్ఱములను, శతసహస్రపదాతులను దునుమాడి, పొగలేక ప్రజ్వలించునగ్నివలె నాగాంగేయుఁడు విక్రమించెను. వేసవిసూర్యునివలెఁ దపించునాతనిఁ బాండవులు తేఱి చూడఁజాలకుండిరి. అటు లప్పాండవు లెంతయు నాతనిచేఁ బీడితు లయ్యును మఱలక సృంజయులతోఁ గూడి యెటులయిన నాతని వధింప వలయునని వెడల వారితో నతఁడు పోరాడుచు, మబ్బులచే నావృత మగు మేరుశైలమువలెఁ గానవచ్చెను. అంత నాశాంతనవునకుఁ దోడుగా నీకొమరుఁడు తనసైన్యముతో వెడలినపుడు ఘోరయుద్ధ మారంభ మయ్యెను." అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

అర్జునదుశ్శాసనులు గలియుట

"ఓరాజా! అపు డర్జునుఁ డాగాంగేయునివిక్రమముఁ జూచి శిఖండితో, "ఓయీ! ఇఁక నీవు భీష్ముని మార్కొనుము. నీవాతనినుండి యించుకేని వెఱవకుము. నేనే యాతని రథమునుండి పడఁద్రోయు దును." అని పలుక విని యాశిఖండి గాంగేయునిఁ జేరెను. అటులే ధృష్టద్యుమ్నుఁడును నభిమన్యుఁడును నాయర్జునుమాట వట్టి యాశంతను పట్టిని ముట్టడించిరి. నీకొడుకు చూచుచుండఁగనే విరాటద్రుపదులును గుంతిభోజుఁడును నాతనిపైకి వెడలిరి. అటులే నకులసహదేవులును యుధిష్ఠిరుఁడును బెక్కుసైన్యములతో నాభీష్ముని సమీపించిరి. అటు లందులకుఁ జేరిన యామహారథులనెల్ల నీవారును మార్కొని తమతమ శక్తికొలఁది నుత్సాహముతోఁ బనిచేయ నారంభించిరి. అదియెల్లఁ దెలిపెదను వినుము.

చిత్రసేనుఁడు చేకితానుని మార్కొనియెను. మహావృషభమును బులిపిల్లవలె నాగాంగేయునిఁ జేరు ధృష్టద్యుమ్నునిఁ గృతవర్మ నివారించెను. అటులే కుపితుఁడై భీష్మునివధింపవెడలిన భీముని వడిగాభూరిశ్రవుఁడు సమీపించి యద్ధుకొనియెను. పిదపఁ బలువిధము లగుశరములను బ్రయోగించుచు వెడలిననకులుని వికర్ణుఁడు నివారించెను. ఓరాజా! భీష్మునిపైకి వెడలిన యభిమన్యునిఁ గాంభోజాధీశుఁడగు సుదక్షిణుఁడు మార్కొనియెను, సహదేవునిఁ గృపుఁడును, క్రూరకర్ముఁడైన ఘటోత్క-

చని దుర్ముఖుఁడును, సాత్యకిని సుయోధనుఁడును నెదుర్కొనిరి. క్షత్రియ లగు విరాట ద్రుపదుల నశ్వత్థామ యెదుర్కొనియెను. అటులే భీష్మ వధముఁగోరి వెడలినయుధిష్ఠిరుని ద్రోణుఁ డెదురించెను. శిఖండిని ముం దుంచుకొని భీష్మునిఁ జంపుటకై యుత్సాహముతో వెడలినయర్జునుని నీకొమరుఁడు దుశ్శాసనుఁడు నివారించెను. ఇంకనుగల పాండవులమహా యోధులను నీవారిరథికులెల్ల భీష్మునిపైఁ బడకుండ నివారించిరి. ధృష్ట ద్యుమ్నుఁడును సైన్యములను గాంచి, "ఓసైనికులారా! భీష్మునిపై నుద్రేకించి వెడలుఁడు. ఇదె యర్జునుఁడు భీష్మునిమార్కొనుచున్నాఁడు. వెఱవకుఁడు. మీరును మార్కొనుఁడు. అర్జునుతోఁ బోరాడుట కా వాసవుఁడును సాహసింపఁడు. గతబలుఁడై యల్పజీవితుఁ డగు భీష్ముఁడు పార్థునిఁ జేరఁగలఁడా! కావునఁ ద్వరపడుఁడు." అని ప్రోత్సహింపఁగా నా సేనాపతివచనము విని వారెల్లరు నాగాంగేయునిరథమును ముట్టడించిరి. అటులు వచ్చినవారినెల్ల నీవారు నివారించుచు వెడలిరి. ఓమహారాజా! దుశ్శాసనుఁడు భయమువిడిచి భీష్మునిజీవితమును గోరువాఁడై యర్జును నెదుర్కొనియెను. అటులే పాండవులును మహారథు లగు నీపుత్రులను మార్కొనిరి. అపు డప్పార్థుఁడు దుశ్శాసనురథముఁ దాఁకి పోరా డుట నద్భుతముగాఁ జూచితిమి. తరంగపరంపరతో నుప్పొంగుసాగర మును వేలవలె నయ్యర్జును నాదుశ్శాసనుఁడు నివారించెను. రథికోత్త ములును, దుర్జయులునై వారిరువురును జంద్రసూర్యులునాఁ గాంతి ప్రతాపములతో వెలయుచుఁ, బరస్పరవధమును గోరుచు, యముఁడు నింద్రుఁడువలెఁ బరస్పరముఁ బోరాడ నారంభించిరి. ఓరాజా! అపు డాదుశ్శాసనుఁ డయ్యర్జునుని మూఁడువాఁడికోలలచే నొప్పించి, వాసు దేవు నిరువదిబాణములచేఁ గొట్టెను. అంత నయ్యర్జునుఁడు పీడితుఁ డగు కృష్ణునిఁ జూచి రోషావేశపరవశుఁడై నూఱునారాచముల నాదుశ్శాస నుపైఁ బ్రయోగింపఁగా నవి వానికవచమును భేదించి, వానిరక్తమును జవిచూచెను. అందులకుఁ గుపితుఁడై దుశ్శాసనుఁడు నైదుబాణము లచే నర్జును నొప్పించి, మఱి మూఁడుబాణముల నాతనినుదుట నాటిం పఁగా, వానితోఁగూడినయప్పార్థుఁడు శిఖరములతోఁగూడిన మేరువువలె విరాజిలుచుండెను. ధనుర్ధరుఁ డగు నీకొమరునిచే నటులు పీడింపఁబడి యాపార్థుఁడు పూఁచినమోదుగునా వెలయుచుఁ గుపితుఁడై పూర్ణిమ

నాఁడు క్రుద్ధుఁడై చంద్రుని రాహువువలె నాదుశ్శాసనునిఁ బీడించి, యతఁడు మఱియు శిలాసానము లగు గ్రద్దరెక్కలబాణములచే వాని ధనువు ఁదునుమాడి మూఁడుబాణములనాతనిపైఁ బ్రయోగించెను. అంత నాబాణములు క్రోధవశమున నుండఁగనే వానిని నీకొడుకు ఖండించి పుడమిఁ బడవైచెను. అది యర్జునునకును నాశ్చర్యము గలిగించెను. అందుల కర్జునుఁ డలిగి, వింట నమ్ములు సంధించి ప్రయోగింపఁగా నవి హంసలు తటాకమునువలె నాదుశ్శాసను మేనుగప్పి పీడించెను. అంత నతఁ డప్పార్థునివిడిచి భీష్మునిరథము వెనుకకుఁబోవ, లోఁతునీటమునుఁగువాని కొక ద్వీపమునలె వాని కాగాంగేయుఁడు రక్షకుఁడై యుండెను." అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

## ద్వంద్వయుద్ధము

"ఓరాజా! పిదప భీష్మునిపైకి వెడలినసాత్యకి నలంబుసుఁ డెదుర్కొనియెను. అంత నాసాత్యకి కుపితుఁడై పరిహాస మొనర్చుచు, నా రక్కసునిఁ దొమ్మిదిబాణములచే నొప్పింప, వాఁడును రోషరూషితుఁడై తొమ్మిదిబాణములచే నాసాత్యకిని బ్రహరించెను. మఱియుఁ బెక్కువాఁడితూపుల నాసాత్యకి యారాక్షసునొప్పింప, వాఁడును దీవ్రనారాచముల నాతని నొప్పించి సింహనాద మొనరించెను. పిమ్మట నమ్మాధవుఁడును వానిశరప్రహారముల కుప్పొంగి బిగ్గరగా నవ్వుచు సింహనాద మొనరించెను. అంత భగదత్తుఁడు క్రుద్ధుఁడై యంకుశపుఁబోటులచే మహాగజమునువలె నాసాత్యకిని దీవ్రనారాచములచే నొప్పింప నతఁ డారక్కసుని విడిచి యాభగదత్తుని మార్కొని వానిపై వాఁడితూపులఁ బ్రయోగించెను. అంత నాభగదత్తుఁ డొకభల్లముచే సాత్యకిధనువు ఖండింప, నతఁడు వేఱొకవిల్లుపూని తత్క్షణ మాభగదత్తుని నొప్పించెను. అందుల కాభగదత్తుఁడు కుపితుఁడై సెలవులు దడుపుచుఁ, గనకవైదూర్యభూషితమును యమదండసదృశమునగు నొకఘోరశక్తి నాసాత్యకిపై వైవ, దాని నాసాత్యకి తనతీవ్రసాయకములచే రెండు ఖండములుగా ఖండించెను. అది యటులు తునిఁగి, సారముచెడి, మహోల్కవలె నిలఁ గూలెను. అటు లాభగదత్తునిశక్తి హతమగుటఁ గాంచి నీకొమరుఁడు పెక్కురథములతో వెడలి యాసాత్యకిని ముట్ట

పించెను. అటు లాసాత్యకిని జుట్టుకొని యాసుయోధనుఁడు తనసోదరులతో, "ఓతమ్ములారా! మీరు రథసమూహముతో నీసాత్యకి గతజీవితుఁడై యెటులు నశించునో యట్లు పోరాడుఁడు. వాఁడిపుడు పుడమిఁ బడునేనిఁ బాండవబలమెల్ల హత మగునని తలంపవచ్చును." అని పలుక విని వా రాతనివచనము శిరసావహించి భీష్ముని యగ్రభాగమున నా సాత్యకి నెదుర్కొని పోరాడ నారంభించిరి. అంత నాశాంతనవుపై వెడలినయభిమన్యునిఁ గాంభోజుఁడు మార్కొనియెను. ఆయభిమన్యుఁ డాసుదక్షిణుని బిట్టుగాఁ గొట్టి, మఱియు నాతనిపై నలువదినాల్గువాఁడి తూపులఁ బ్రయోగింప, వాఁడును నైదునారాచముల నాయభిమన్యునిఁ గొట్టి, భీష్మునిజీవిత మెటులైన గాపాడవలె ననెడిపట్టుదలతో నాతనిసారథిని దొమ్మిదిబాణములచే నొప్పించెను. అపుడు వారిరువురకును ఘోర మగుపోరు జరిగెను. అంత నాగాంగేయుని శిఖండి యెదుర్కొన, విరాటద్రుపదులు కౌరవసైన్యమును నివారించుచు భీష్మునిపై విజృంభించిరి. అపు డందుల కశ్వత్థామ కుపితుఁడై సమీపించెను. అంత నాతని కావిరాటద్రుపదులతో గొప్పయుద్ధము జరిగెను. అపు డా యశ్వత్థామను విరాటుఁడు పదింటను, ద్రుపదుఁడు మూఁడింటను నొప్పింప, నాద్రోణసుతుఁడు వారిరువురను బహుశరప్రహారములచేఁ బీడించెను. అంత నావిరాటద్రుపదులు భీష్ము నెదుర్కొని పోరాడుటయు నావృద్ధులవిక్రమ మెంతయు నద్భుతముగాఁ జూచితిని. పిమ్మట నాశాంతనవుపైఁ గలియవచ్చుసహదేవునిఁ గృపుఁ డెదుర్కొని వనములో మత్తమాతంగము నెదురించినమదేభమువలెఁ బోరాడుచు, సువర్ణపుంఖము లగు డెబ్బదిబాణములచే నాసహదేవుని నోనాఁటనేయ నాతఁ డాకృపునివిల్లు ఖండించి, మఱియుఁ దొమ్మిదిబాణములచే నాతని నొప్పించెను. ఆకృపుఁడును వేఱొకవిల్లు పూని పదివాఁడికోలలచే నా సహదేవునివక్షమును గొట్టి భీష్మునిజీవితమును గాపాడుచు విక్రమించెను. సహదేవుఁడును భీష్ము నానాఁడు వధింపవలె ననునుత్సాహముతో నాకృపునివక్షము పగులునట్లుగాఁ దీవ్రనారాచములఁ బ్రయోగించెను. అపుడు వారి కెంతయు ఘోర మగుయుద్ధ మయ్యెను. పిదప నకులుని వికర్ణుఁడు మార్కొని, పితామహుని రక్షింప నెంచి యఱువదిబాణములచే నాతనిఁ బ్రహరించెను. ఓరాజా! నీకొడుకు వికర్ణుఁ డటులు తన్ను

నొప్పింప, నకులుండును నాతని డెబ్బదేడు బాణములచే నొప్పించెను. అంత వారిరువురును భీష్మునికై ఘోరముగాఁ బోరాడిరి. పిదప నీసైన్యములరూపుమాపుచు విజృంభించినఘటోత్కచుని దుర్ముఖుఁడెదుర్కొని భీష్మరక్షణమునకై పరాక్రమించుటయు, నాతని నాఘటోత్కచుఁ డొక తప్తనారాచముచే వక్షమునఁ గొట్టెను. వాఁడు నారక్కసు నఱువది బాణములచే నొప్పించి సింహనాద మొనరించెను. భీష్ము నెటులయిన జంపుతలంపుతో వెడలినధృష్టద్యుమ్నుని రథికోత్తముఁ డగు కృతవర్మ యెదుర్కొన, నతఁ డాకృతవర్మ నైదుబాణములచే నొప్పించి, మఱియు నేఁబదివాఁడికోలలచే నాతనివక్షమును బ్రహరించెను. అటులే ధృష్టద్యుమ్నునాతఁడు తొమ్మిదిబాణములచేఁ బ్రహరింప నపుడు వారి కా భీష్మహేతుకముగా గొప్పయుద్ధము జరిగెను. అపుడు వారిరువురు నింద్రవృత్రులువలెఁ గానవచ్చిరి. పిదప భీష్మునిపైకి వెడలిన భీమునిఁ గాంచి, భూరిశ్రవుఁ "డో భీమా! నిలునిలుము" అని పలుకుచు, వానివక్షమున నొప్పింప, నాతఁ డాబాణముగలవక్షముతో నెంతయు భాసిల్లెను. ఓరాజా! మున్ను శంకరకుమారశక్తి నాఁటికొనిన క్రౌంచపర్వతమునా మా కాభీముఁడు చూపట్టెను. అపుడు వారిలో నొకఁడు భీష్మవధాకాంక్షయు, వేఱొకఁడు భీష్మత్రాణపరాయణుఁడునై తేజముగలవాఁడికోలలచేఁ బరస్పరము ప్రహరించుకొనుచు హతిప్రతిహతులఁ గావించికొనిరి. పిమ్మటఁ బెక్కుసైన్యముతో నాశాంతనవుపైకి వెడలినయుధిష్ఠిరుని ద్రోణుఁడు వారించి, మేఘగంభీరమగు తనరథధ్వనిచే క్షత్రియులకు వెఱపుగొలుపసాగెను. అంతఁ బాండవయోధుఁ డగు చేకితానునిఁ గుపితుఁడై నీతనయుఁ డగుచిత్రసేనుఁడు మార్కొని, భీష్మునకుఁగాఁ దనప్రావీణ్యమును వెలయించుచు విక్రమించెను. అపుడు వారు ఘోరముగాఁ బోరాడిరి. అపు డర్జునుఁడు నీకొమరునిచే వారింపఁబడియు, నాతని యుద్ధవిముఖునిగా నొనర్చి, నీవారిసైన్యమును నురుమాడెను. అయినను దుశ్శాసనుఁడు వెనుదీయక యెటులయిన భీష్ముని రక్షింపవలయు ననునాగ్రహముతో నర్జునిపై తనశక్తి నుపయోగించెను. కాని యాతనిసైన్యములు చెదరిపోయెను." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## ద్రోణాశ్వత్థామసంవాదము

"ఓరాజా! మహావీరుఁడును, మదేభవిక్రముఁడును నగు ద్రోణుఁడు గొప్పవిల్లుపూని కేలఁ ద్రిప్పుచు సైన్యమును జెదరఁగొట్టుచుఁ బాండవ సైన్యమునఁ జొచ్చి, శకునజ్ఞుఁ డగుట నపుడు తన కగపడిన నిమిత్తములను గనిపెట్టి, కొమరుఁ డగునశ్వత్థామతో "ఓకుమారా! పార్థుఁడు సంగ్రామమున భీష్మునిఁ జంపుటకుఁ దగు ప్రయత్న మొనరించుట నేఁడే యని నిశ్చయింపవచ్చును. నాబాణములు వింటినుండి యెగురుచున్నవి. ధనువు చలించుచున్నది. నాబుద్ధి క్రూరముగాఁ బ్రవర్తిలుచున్నది. అస్త్రములు యోగమును గోరకున్నవి. నలుదెసలందును మృగములు పక్షులును ఘోరముగను నశాంతముగను నఱచుచున్నవి. గ్రద్దలు సైన్యములపై వ్రాలుచున్నవి. సూర్యుఁడు కాంతిరహితుఁడుగాఁ జొచ్చెను. దెసలెల్లను నెఱ్ఱవాఱుచుండెను. పుడమి మొఱయుచు వ్యథనొందునదివోలెఁ గదలుచున్నది. కంకగృధ్రబలాకములు మఱి మఱియు ధ్వనిచేయుచున్నవి. నక్కలు ఘోరముగా నఱచుచు మహాభయమును సూచించుచున్నవి. సూర్యమండలమధ్యమునుండి యుల్క పడెను. మొండెముతోఁగూడిన పరివేషము సూర్యునిచుట్టును గానవచ్చెడిని. అటులే చంద్రునకును సూర్యునకును ఘోరమగు పరివేషమగపడఁజొచ్చెను. అయ్యది క్షత్రియులదేహచ్ఛేదమును దెలుపుచున్నది. ఓపుత్రకా! మనసుయోధనుని దేవతాలయములందున్న దేవతాప్రతిమలు కదలుచు, నగుచు, నాట్యముచేయుచు, నేడ్చుచున్నటులు గానవచ్చెడిని. అమంగళముగా గ్రహములు సూర్యునకపసవ్యముగా భ్రమించుచున్నవి. చంద్రుఁడు తలక్రిందుగా నుండెను. క్షత్రియుల దేహకాంతులు మాసినవిగా నగపడుచున్నవి. కౌరవసైన్యమునఁ గల యోధులు వెలవెలఁబోవుచున్నారు. ఉభయసైన్యములందును బాంచజన్యముయొక్కయు, గాండీవముయొక్కయు ధ్వనులు వినవచ్చుచున్నవి. ఇపు డర్జునుఁ డుత్తమాస్త్రములను బూని, మనసైనికులఁ దోలఁగించి పితామహుని హతునిఁ గావించెడిని. రోమహర్షము లుప్పొంగి నాచిత్తము నుత్తలపడఁ జేయుచున్నవి. ఓయీ! భీష్మార్జునుల సమాగమము నెంచినను, నాశిఖండి పాపచిత్తుఁడగుటను దలంచినను, పార్థుఁ డా

శిఖండిని ముందుంచికొని భీష్మునిపైకి వెడలెననుట యూహింపఁబడుచున్నది. మఱియు మన్న శాంతనవుఁడు, బ్రహ్మచే నాఁడుదిగాఁ దొలుత సృజింపఁబడి, పిదపఁ బురుషుఁడైన శిఖండిని నేను జంపనని తెలిపి యున్నవాఁడు. మఱియు నశుభచిహ్నములుగల యాశిఖండిని ఖండింప నొల్లఁడఁట. ఇవియెల్లఁ దలంచు నాచిత్త మెంతయు వంతనొందుచున్నది. శిఖండి కుపితుఁడై కురువృద్ధు నెదుర్కొని యున్నవాఁడు. ధర్మజుని క్రోధము, భీష్మార్జునులసమాగమము నా యీసమారంభమును బ్రజలకమంగళమును సూచించుచున్నవి. మానవంతుఁడును, బలశాలియు, శూరుఁడును, నస్త్రకుశలుఁడును, నవక్రపరాక్రముఁడును, దృఢశరుఁడును, దూరప్రసారిబాణుఁడు నగునర్జునుని సంగ్రామమున నింద్రుఁడైనను జయింప నశక్తులు. నీవు హానిమార్గమును బరిహరించి ప్రవర్తింపుము. ఇపు డీఘోరమహాసంగరమున గొప్పనాశము సంభవింపనున్నది. శూరుల హేమకవచములు పెక్కు చినుఁగనున్నవి. అటులే ధ్వజాగ్రములును ధనువులును దునుఁగనున్నవి. కుపితుఁడై యున్న కిరీటి మనరాజసైన్యములను గలఁతనొందించువాఁడు. పుత్రులుగలవారిపుడు ప్రాణములను గాపాడుట కిది యదనుగాదు. స్వర్గము నభిలషించి కీర్తిని జయమునకును బ్రయత్నింపుము. రథగజాశ్వపదాతులచే నాకులమై ఘోరమగు సంగ్రామనదిని దనరథముచే నిపుడు దాఁటఁదలఁచియున్నవాఁడు. అర్జునుఁడు తనకుఁ దమ్ముఁడై యుండుటచే ధర్మజుని బ్రహ్మణ్యతయు దానము తపమును ఫలించినవనవచ్చును. అటులే యాతనికి భీముఁడును నకులసహదేవులును వాసుదేవుఁడును సాత్యకియు పక్షమై యున్నవారు. దుర్బుద్ధియగు దుర్యోధను నసూయాజనితమగుకోపమే యిక్కురువర్గమును గాల్చుచున్నది. ఇదె వాసుదేవసహాయుఁడై పార్థుఁడు ధార్తరాష్ట్రసైన్యముల నెల్ల నివారించుచున్నాఁడు. అదె మనసైన్య మాకిరీటిచేఁ గలఁతనొందుచున్నది. సేనాముఖమున హాహాకారములును గిలకిలశబ్దములును వినవచ్చెడిని. నీవు శిఖండిపైకిఁ బొమ్ము. నే నాయుధిష్ఠిరునిపైకిఁ బోయెదను. అతిరథు లెల్లెడల నిండి యుండుటను, మహాతేజోనిధి యగు ధర్మజునివ్యూహమును బ్రవేశించుట కవకాశము గానరాకున్నది. సాత్యకియు, నభిమన్యుఁడును, ధృష్టద్యుమ్నుఁడును, భీముఁడును, నకులసహదేవులును ధర్మజున కెల్లెడల

రక్షకులై యున్నవారు. నీ విపుడు గొప్పవిల్లు పూని యుత్తమాస్త్రము లను సమకూర్పుము. ఇదె యుపేంద్రునివలె నల్లని మేనిచాయతో నీ సేనాముఖమున నితఁడు నడుచుచున్నాఁడు. ఈధృష్టద్యుమ్నుని భీముని మార్కొనుము. ఓపుత్రకా! తనకొమరుఁడు పెక్కుకాలము జీవించి యుండవలెనని యెవ్వఁడు కోరికొనఁడు? అయినను నిపుడు మనకుఁ దటస్థించినక్షత్రియధర్మ మనుసరించి నిన్నిటులు నియోగించుచున్న వాఁడను? ఇదె గాంగేయుఁ డిప్పాండవసైన్యమును దహించువాఁడు వలెఁ జూపట్టుచున్నాఁడు. ఓనాయనా! అతఁడు రణరంగమున యమ వరుణులతో సమానుఁడు సుమా!" అని పలికెనని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

## భీమసేనపరాక్రమము

"ఓరాజా! మహాత్ముఁ డగు నా ద్రోణునివచనము లాలించి భగ దత్తుఁడును, కృపకృతవర్మలును, శల్యుఁడును, విందానువిందులును, సైంధవుఁడును, జిత్రసేనవికర్ణులును, దుర్మర్షణుఁడు ననెడిపదుగురు రథి కులును, నానాదేశములనుండి వచ్చినసైన్యములఁ గూడి గాంగేయునకు గొప్పయశమును గోరువారై భీమునితోఁ బోరాడ నారంభించిరి. అపుడు శల్యుఁడు పదిబాణములును, సైంధవుఁడు మూఁడమ్ములును, విందానువిందు లైదైదువాఁడికోలలును, దుర్మర్షణుఁ డిరువదినారాచ ములును నాభీమునిపైఁ బ్రయోగించి నొప్పించిరి. ఓమహారాజా! అంత నావృకోదరుఁడు వారినెల్ల మార్కొని వేఱువేఱుగాఁ బ్రహరించెను. అటు లతఁడు శల్యునిఁ బదింటను గృతవర్మ నెనిమిదింటను గొట్టి, కృపుని విల్లు నడుమకుఁ దునుఁగునట్లు ఖండించి, మఱియు నాతని నేడుబాణ ములచే నొప్పించి, విందానువిందులను మూఁడుమూఁడువాఁడినారాచ ములచేఁ బ్రహరించెను. అంత గర్వితులై యున్న దుర్మర్షణచిత్రసేను లను నిరువదింటను నైదింటను, వికర్ణునిఁ బదింటను, సైంధవు నైదిం టను గొట్టి సింహనాద మొనర్చుచు, మఱియు నాసైంధవుని మూఁడు కోలలచే నొప్పించెను. పిదప నాకృపుఁడు వేఱొకవిల్లుపూని కుపితుఁడై పదితీవ్రబాణములచే నాభీముని నంకుశములచే మత్తగజమునుబోలె నొప్పింపఁ బరాక్రమనిధి యగు నాపాండవద్వితీయుఁడు క్రోధపూరి

తుఁడై పెక్కునారాచములచే నాకృపునిఁ గొట్టెను. మఱియు నతఁడు ప్రళయకాలయముఁడునా విజృంభించి, సైంధవునిగుఱ్ఱములను సారథిని మూఁడువాఁడికోలలచే మృత్యులోకమున కనిపెను. వాఁడటులు హతాశ్వుఁడై రథముడిగి యాభీమునిపై వాఁడికోలలను బ్రయోగించెను. అంత నాసైంధవునివిల్లు నడుమను రెండుబాణములచే నాభీముఁడు ఖండింపఁగా వాఁడు భగ్నధనుష్కుఁడును విరథుఁడునై చిత్రసేనురథ మధిరోహించెను. ఓరాజా! నీవారెల్లరును జూచుచుండఁగా మహారథులను హరించి యక్కౌంతేయమధ్యముఁ డద్భుతకృత్య మొనరించెను. అప్పు డాతనివిక్రమమున కోపక శల్యుఁడు కర్మారపరిమార్జితము లగు తీక్ష్ణబాణములను సంధించి, నిలునిలుమని పలుకుచు నాభీమునిఁ బ్రహరించెను. ఆశల్యునిరక్షణమునకుఁగాఁ దక్కినకృతవర్మాదులగు రథికులాభీముని నొప్పించిరి. ఆపాండవద్వితీయుఁడును వారి నైదైదుబాణములచే నొప్పించి, మఱియు నాశల్యుని డెబ్బదింటను బదింటనుగాఁ బ్రహరించెను. అంత నాశల్యుఁడు కుపితుఁడై యాభీమునిఁ దొమ్మిది యమ్ముల నొప్పించి, మఱియు నాతనిసారథి నొకబాణముచే గాఢముగా మర్మప్రదేశమునఁ గొట్టెను. అప్పుడు ప్రతాపనిధియగుభీముఁడు ప్రహతుఁడైనతనసారథి యగు విశోకు నారసి శల్యునిపైఁ గినుకయడర మూఁడువాఁడికోలలచే నాతనివక్షమును గొట్టి, పిదపఁ దక్కినయోధులను మూఁడుమూఁడుబాణములచేఁ బ్రహరించి సింహనాద మొనరించెను. అంత నక్కౌరవయోధు లాభీమునిమర్మములు నాఁట నొక్కొక్కరును మూఁటమూఁట నొప్పించిరిగాని యందుల కతఁ డించుకేని చలింపఁడయ్యెను. అటులు వారెల్లరును మబ్బులు పర్వతమును వారిధారలచేఁ గప్పినట్లుగాఁ దనపై శరములను వర్షింపఁ గినుకవడి యక్కవ్వడియన్న శల్యుని మూఁడింటను, భగదత్తుని నూఱుకోలలను నొప్పించి, కృపునిఁ బెక్కునారాచములఁగొట్టి,కృతవర్మునిధనువు నొక క్షురప్రముచేఁ దెగవేసెను. అపుడు కృతవర్మయు వేఱొకవిల్లుపూని యొకతీవ్రనారాచముచే భీముని భ్రూమధ్యమునఁ గొట్టెను. అంత నాభీముఁడు వెనుదీయక మఱల నాశల్యునిఁ దొమ్మిదింటను, భగదత్తుని మూఁడింటను, గృతవర్మ నెన్మిదింటను, కృపుఁడు మున్నగు తక్కినరథికులను రెండురెండుగను గొట్టెను. పిదప వారును నాతనిఁ బ్రతిప్రహారముల నొప్పిం

చిక్కిగాని యతఁడు వారియస్త్రపరంపరలఁ దృణములుగా భావించి నిశ్చింతుఁడై యుండెను. పిమ్మట వారును దీవ్రశరపరంపరలఁ గురిసిరి. భగదత్తుఁడు సువర్ణదండముగల తనమహాశక్తి నాతనిపై విసరెను. సైంధవుఁడు తనతోమరమును బట్టిసమును వైచెను. కృపుఁడు శతఘ్నులను బ్రయోగించెను. శల్యుఁ డొకశరము నొనాఁట నేసెను. అటులే యితరులును నైదైదుశిలీముఖముల నొప్పింపఁగా నతఁడా సైంధవుని తోమరము నొకక్షురప్రముచే రెండుఖండము లొనర్చి, పట్టిసమును మూఁడుబాణములచే నఱికి, తొమ్మిదికంకపత్రములచే శతఘ్నిని దూలించి, వారినెల్ల మూఁడుమూఁడుబాణములచే నాభీముఁడు నొప్పించెను. ఓరాజా! అంత నాభీము నారసి యర్జునుఁ డందుల కరుదెంచెను. అటు లొకచోఁ జేరినమహాత్ము లగు నప్పాండవుల నిరువురను గాంచి నీవారు తమకు జయ మింకఁ గలుగదని నిశ్చయించుకొనిరి. పిమ్మట నాయర్జునుఁ డటులు కౌరవసైన్యములను దనయన్న నురుమాడుట కెంతయు నుత్సహించి తా నాశిఖండిని ముందిడుకొని భీష్ముని వధించువాఁడై మనపదుగురురథికులను సమీపించి యాభీమునకుఁ బ్రియముగా వారినెల్ల నొప్పించెను. అపు డదిచూచి సుయోధనుఁడు సుశర్మను భీమార్జునులను వధింపుమని ప్రేరించి పంపెను. అంత నాసుశర్మయుఁ దనసైన్యములతోఁ గడువడిగా వెడలి పెక్కువేలరథములతో నాభీమార్జునులఁ దలపడియెను. అపుడు వారితో నాయర్జునుఁడు ఘోరముగాఁ బోరాడెను.” అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## భీమార్జునులపరాక్రమము

“ఓరాజా! అపు డర్జునుఁడు శల్యుని శరవర్షముచేఁ గప్పి, కృపుని సుశర్మను మూఁడుమూఁడుబాణములచే నొప్పించి, తక్కినభగదత్తాదు లగురథికుల నొక్కొకబాణముచేఁ బ్రహరించి, మఱియు వారిసైన్యమును వాఁడికోలలచేఁ బీడించెను. అపుడు సైంధవుఁ డప్పార్థునిఁ బెక్కుసాయకములచే నొప్పించి, చిత్రసేనునిరథమందుండియే యాభీముని సైతముఁ బ్రహరించెను. అంతఁ గృపశల్యులును నప్పార్థునిమర్మములు నాఁటునట్లుగా శరములఁ బ్రయోగించిరి. అపుడు చిత్రసేనాదు లగు నీ పుత్త్రు లాయర్జును నైదైదుతీవ్రబాణములచే నొవ్వనేసి, భీముని సైతముఁ

గొట్టి విజృంభించిరి. అంత నక్కౌంతేయు లిరువురును కుపితులై త్రిగర్త సైన్యములను పీడింప, నాసుశర్మయు నప్పార్థునిం దొమ్మిదియమ్ముల నొప్పించి, యుపసైన్యములును జడియునట్లుగా సింహనాద మొనరించెను. ఇంకనుకల మహారథికులును నాభీమార్జునులను శరవర్షము నింపుచుండ నారణరంగమున వారిరువురును గ్రీడించుచుం జిత్రాకారులై గానవచ్చిరి. అపు డాభీమార్జునులు మాంసాభిలాషచే గోవుల నడుమం జొచ్చిన మత్తసింహములువలెం బ్రవేశించి యక్కౌరవవీరుల ధనువులం దునుముచుం, వలలు తెగనేయుచు, భయంకరులై శత్రుయోధులను నేలం గూలంద్రోయుచుండిరి. హతములును భగ్నములునైన వేలకొలందిగుఱ్ఱములును నారోహకులతోం గూడినయేనుగులును బుడమిని బడంజొచ్చెను. అందందు రథికులును రౌతులును గూలి గానవచ్చిరి. చచ్చినయేనుగులతోడను, ప్రచ్చినపదాతులతోడను, నొచ్చినగుఱ్ఱములతోడను, విచ్చిపడినరథములతోడను పుడమియెల్ల నాక్రమింపంబడియెను. అపు డర్జునువిక్రమ మత్యద్భుతమై మాకుం గానవచ్చెను. మహాబలుం డగునతండు తనశరపరంపరలచే వారినెల్ల నివారించుచువచ్చెను. అపుడు నీకొడుకుండు భీమార్జునులపరాక్రమము నారసి, తాను భీష్ముని రథసమీపమును జేరం గృపకృతవర్మలును సైంధవుండు మున్నగు రథికులును నందులకే వచ్చిరి. అపుడు మహారథులగు భీమార్జును లక్కౌరవసైన్యమును జెల్లాచెదరుగాం బాఱద్రోలం గొందఱురాజు లార్జును రథముపై నెమిలిఱెక్కలబాణములను వర్షము గురిపించిరి. పిదప నయ్యర్జునుండు వారినెల్లం దనశరజాలముచే నివారించి, తుదికి వారికిం దుదియవస్థ గలిగించెను. శల్యుం డపు డాయర్జునునియురము నాటునట్లు లోకభల్లము ప్రయోగింప నప్పార్థుండు వానిని లైదుబాణములచే నఱకి, వేఱొకభల్లముచే వానిసారథిని రథమునుండి కూలంద్రోసెను. అంత నాశల్యుండు సర్వసైన్యములును జూచుచుండంగా హతసారథియగు తనరథమును రథాశ్వము లీడ్చుటను దొలంగిపోయెను. ఓరాజా! అపు డించుక యవకాశముగలుగుటను గనిపెట్టి ద్రోణుం డెనిమిదితీవ్రనారాచములచే భీముని నొప్పింప సమరోత్సాహియగు నాసామీరియుం బిత్రసముండగు నాభారద్వాజు నఱువదైదుభల్లములచేం బ్రహరించెను. పిదప నయ్యర్జునుండును బెక్కుసాయకములచే సుశర్మను గొట్టి వెను

గాలి మబ్బులనువలె వానిసైన్యమును బటాపంచలుగావించెను. పిదప భీష్ముఁడును, సుయోధనుఁడును, బృహద్బలుఁడును గుపితులై భీమార్జునుల నెదుర్కొనిరి. అటులే పాండవశూరులగు ధృష్టద్యుమ్నాదులును నోరు తెఱచియున్న యంతకుఁడునాఁదగు నాశాంతనవుపై వెడలిరి. శిఖండియు వెఱపుడిగి యాభారతపితామహునిపై సన్నద్ధుఁడై వెడలెను. పిమ్మట ధర్మరాజాదులును శిఖండిని ముందుంచికొని సృంజయులతోఁ గూడి యాశాంతనవు నెదుర్కొనిరి. అటులే నీవారును భీష్ముని బురస్కరించుకొని శిఖండి మున్నగుపాండవయోధులతోఁ బోరాడ నారంభించిరి. అపు డప్పాండవులతోఁ గౌరవులకు భీష్మునివిజయమునకుఁగా ఘోర మగుపో రారంభమయ్యెను. నీవారిజయమున భీష్ముఁ డొకపణముగా జయాపజయము లెటులున్నను యుదద్యూతమారంభమయ్యెను. అపుడు ధృష్టద్యుమ్నుఁడు తనసైనికులతో "ఓయోధులారా! వెఱవక గాంగేయునిఁ దలపడుఁడు." అని ప్రోత్సహింపగా వారును నాతని యానతి శిరసావహించి భీష్ము నెదుర్కొనిరి. ఓరాజా! అటులు తనపైకి వచ్చుచున్న యప్పాండవసైన్యము నాభీష్ముఁడు సముద్రమును వేలవలె నివారించెను" అని తెలుప విని ధృతరాష్ట్రుఁ డిట్లనియె.

## భీష్ముని యుపదేశము

"ఓసంజయా! ఆపదియవనాఁడు మహావీరుఁ డగుభీష్ముఁ డప్పాండవులతోడను సృంజయులతోడను నెటులు పోరాడెను? మాకౌరవులు పాండవుల నెటులు వారించిరి? యుద్ధశోభితుఁ డగు భీష్మునిమహాసంగ్రామవిధ మెఱిఁగింపుము."

అదివిని సంజయుఁడు "ఓరాజా! కౌరవులు పాండవులతోఁ బోరాడినవిధమంతయుఁ దెలిపెదను వినుము. మనయోధులు ప్రతిదినమును గుపితులై వెడలి యక్కడ్వాడి పరమాస్త్రములపాలై పరలోకమున కేగసాగిరి. భీష్ముఁడు తానొనర్చినప్రతిజ్ఞఁ దప్పక పాండవసైన్యమును జంపుచునే యుండెను. కౌరవులతోఁ గూడియున్న భీష్ముఁడును బాంచాల్యులతోఁగూడిన యర్జునుఁడును బోరాడునపుడు జయ మెవ్వరి కగునదియు సంశయముగాని నిశ్చితముగాదు. అటు లాపదియవనాఁ డాభీష్మార్జునులు గలియఁగా మహాభయంకరమై సైన్యక్షయము సంభవించెను. నాఁడు

గాంగేయుఁడు తనపరమాస్త్రప్రావీణ్యము వెలయఁ బదివేవుర కెక్కుడుగా యోధులను మృత్యుముఖమునఁ బడఁద్రోసెను. ఇంతయేల! నాఁడు భీష్మునిచే హతులగుసూతులనామగోత్రములను పెక్కువేలవత్సరములకును లెక్కింపఁజాలమని నొక్కి వక్కాణింపవచ్చును. ఓరాజా! భీష్ముఁడు పాండవసైన్యమును పదిదినము లొక్కవిధముగాఁ దపింపఁ జేసి తుది కాథర్మాత్ముఁడు తనజీవితమునెడ విరక్తినొంది తనయెదుటఁ బడినవారినైనను జంపనొల్లక యాత్మవధముగోరువాఁడై కొంతచింతించి, చెంతనున్న యక్కౌంతేయునితో, "ఓయుధిష్ఠిరా! మహాప్రాజ్ఞా! నీవు సర్వశాస్త్రవేత్తవు. నేను నీ కొకవచనము దెలిపెదను వినుము. అయ్యది ధర్మయుక్తమై స్వర్గసంపాదకమగునది. ఓనాయనా! నా కీదేహముపై విరక్తిపొడమెను. ఈసంగ్రామమున నెన్నియోప్రాణులను జంపిన నాకాలమెల్లఁ గడచినది. కావున నీవు నాహితముగోరుదేని పాండవమధ్యముని ముందుంచుకొని యటులే పాంచాలురను సృంజయులను దోడుచేసికొని నన్నుఁ జంపుటకై యత్నింపుము" అని పలుక విని సత్యమెఱిఁగినవాఁడగుట నపుడు సృంజయులతోఁ గూడి గాంగేయునిపై నతఁడు వెడలెను. ఓరాజా! పిమ్మట నాశాంతనవునివచనము చొప్పున ధృష్టద్యుమ్నుఁడును ధర్మజుఁడును దమసైన్యమును భీష్మునిపైఁ బ్రోత్సహించి, "ఓయీ! మీరు భీష్మ నెదుర్కొనుఁడు. యుద్ధమొనర్పుఁడు. జయింపుఁడు. సత్యసంధుఁడును, శత్రుహంతయు నగునర్జునుఁడు మీ కపాయము గలుగకుండఁ గాపాడును. మఱియు నీసేనాపతి యగు ధృష్టద్యుమ్నుఁడును భీముఁడును మిమ్ము రక్షింతురు. ఓసృంజయులారా! మీ రించుకేని యాశాంతనవునుండి జడియకుఁడు. మనము శిఖండిని ముందుంచుకొని యాగాంగేయునిఁ దప్పక జయింపగలము." అని పలికిరి. అటు లానాఁడు వారొకరొకరు కూడఁబలికికొని క్రోధపరవశులై ప్రాణములపై నాశ విడిచి వెడలి శిఖండినిఁ బార్థుని ముందుంచుకొని యెట్టులైన భీష్మునిఁ బడఁద్రోయవలయునని మిక్కిలి యత్నముతో నుండిరి. అంత మనవారి పక్షమున సుయోధనాజ్ఞప్తులై నానాదేశాధీశులును ద్రోణాశ్వత్థామలతోడను సైన్యములతోడను బయలువెడలిరి. బలశాలియగు దుశ్శాసనుఁడు తనసోదరులతోఁ గూడి సమరాంగణమధ్యమున నున్న భీష్మునిఁ గాపాడుచునుండెను. పిమ్మట మనవారెల్లరును గాంగేయుని ముందుంచు

కొని శిఖండి మున్నగుపార్థివులతోఁ బోరాడిరి. అర్జునుఁడును, పాంచాలురు, జేదిదేశీయులును వెంటరా, శిఖండిని మున్నిడికొని భీష్ముని మార్కొనియెను. అశ్వత్థామయు సాత్యకియుఁ, పౌరవుని ధృష్టకేతువు, సైన్యముతోఁ గూడియున్న సుయోధనుని యుధామన్యుఁడును, విరటుఁడు తనసైన్యముతో సైంధవుని మార్కొనియెను. సైన్యముతోఁ గూడ యుధిష్ఠిరుఁడు శల్యుని దార్కొనియెను. భీమసేనుఁడు గజసైన్యముపైఁ బరువిడెను. తనసోదరులతో ధృష్టద్యుమ్నుఁడు శస్త్రాస్త్రవేత్తయగు ద్రోణునిఁ దలపడియెను. కర్ణికారధ్వజుఁడును సింహకేతుఁడు నగు నభిమన్యుని బృహద్బలుఁడు మార్కొనియె. శిఖండిని నర్జునుని నీ కొమరులు క్షత్రియపుత్త్రులతోఁగూడి తలపడిరి. నాఁడు మహాభయంకరమై యుభయ సైన్యములును బరాక్రమించి పరువులిడుచుండఁగా మేదిని వడంకెను. పిదప నటులుభయ సైన్యములును బరస్పరమొకరిపై నొకరు పరువులిడు చుండఁగా నెల్ల దెసలను బెల్లగు శబ్దములు జనించెను. శంఖదుందుభిధ్వనులును, నేనుఁగులబృంహితములును, సింహనాదములును దారుణముగాఁ బెచ్చుపెరిగెను. అపుడు సకలక్షత్రియులకిరీటాంగదాదులకాంతులు చంద్రార్కకాంతులునా వెలయఁజొచ్చెను. పెనుధూళి లనెడి మేఘములును, శస్త్రములనెడి మెఱపులును, ధనుష్టాంకారము లనెడిగర్జనములును వెలయ, శరవర్షము గురిసెను. బాణశంఖనినాదములును, భేరీధ్వనులును, రథఘోషములును నెల్లెడల జనించెను. పరస్పరముఁ గలిసి రథికులు రథికులతోడను, బదాతులు పదాతులతోడను, నేనుఁగు లేనుఁగులతోడను బోరాడ నారంభించెను. ఆమిషమునకై వ్యాఘ్రిశ్యేనములువలె భీష్మునకై కురుపాండవసైన్యములు మహాయుద్ధ మొనర్చెను. పరస్పరము జయించుకొనుటకును, వధించుకొనుటకును వారు గలిసి ఘోరముగాఁ బోరాడిరి.” అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

సంకులయుద్ధము

“ఓరాజా! అభిమన్యుఁడు భీష్మునకుఁగా బహుసైన్యముతోఁ గూడిన నీకొమరు నెదుర్కొని విక్రమించెను. అపుడు దుర్యోధనుఁడు తీవ్రములగుతొమ్మిదిబాణములచే నాయభిమన్యుని నొవ్వనేసి కుపితుఁడై

మఱియు మూఁడుబాణముల నాతనివక్షమును గొట్టెను. అంత నతఁడు కోపావేశపరవశుఁడై యాసుయోధనుపై నొకయినుపశక్తిని బ్రయోగింప ఘోరరూపమై తనపైకివచ్చు నద్దాని నాసుయోధనుఁడు రెండు ఖండములుగా ఖండించెను. అటు లది భగ్నమై పుడమిఁబడుట కెంతయుఁ గుపితుఁడై యభిమన్యుఁ డలిగి సుయోధనుని బాహుమధ్యమును మూఁడుబాణములచే నొప్పించి మఱియు నాతనివక్షమును ఘోరశరముల నొవ్వనేసెను. వారిరువురయుద్ధమును మిక్కిలి ఘోరముగా జరగెను. దాని నందఱును నాశ్చర్యభరితులై చూచిరి. ఆసుయోధనాభిమన్యులు పార్థుని జయించుటకును, భీష్మునిఁ జంపుటకును పట్టుదలతోఁ బోరాడిరి. పిదప బ్రాహ్మణోత్తముఁ డగు ద్రోణసుతుఁడు సాత్యకిని మార్కొని యొకతీవ్రనారాచముచే నాతనివక్షమును గొట్టెను. అపుడాసాత్యకియుఁ దొమ్మిదికోలలచేవానిని బ్రహరింప వెంటనే యశ్వత్థామయుఁ దొమ్మిదియమ్ముల నాతని నొవ్వనేసి మఱియు ముప్పదిబాణములచే నాతనిబాహువులందును, వక్షమునందును బ్రయోగించెను. వాఁడటులు ప్రహతుఁడై యడరి యాద్రౌణిని మూఁడుబాణములచే నొప్పించెను. పిమ్మటఁ బౌరవుఁడు ధృష్టకేతుని శరవర్షమున ముంప నాధృష్టకేతువు నాపౌరవుని ముప్పదినారాచములఁ బ్రహరించెను. పిమ్మట వాఁడికోలలచే నప్పౌరవుఁడు ధృష్టకేతునిధనువు దునుమాడి సింహానాదమొనరించుటయు నాతఁడు వేఱొకవిల్లు పూని డెబ్బదిమూఁడుశిలీముఖములచే నాపౌరవుని నొప్పించెను. మహారథు లగువా రిరువురు నొకరి నొకరు శరవర్షమున ముంచికొని పరస్పరము ధనువులను, గుఱ్ఱములను బోకార్చికొని, యిద్దఱును విరథులై ఖడ్గయుద్ధ మొనర్ప మొదలిడిరి. ఓరాజా! అపుడు వారు ఋషభచర్మమయములై శతచంద్రములచే వెలయుచు నక్షత్రశతచిత్రములైన కేడెములను మహాప్రభ గలఖడ్గములను బట్టికొని బరస్పర మెదుర్కొనిమహావనమున సింగపుఁగొదమలునాఁ జెలరేఁగి వలయముగా విచిత్రగతు లొనర్చుచు, వీడుచుఁ, గలియుచుఁ బోరాడిరి అపుడు పౌరవుఁడు ధృష్టకేతునిఁ దనకత్తిచే నొసటి యెముకపైఁ గొట్టఁగా నతఁడు కుపితుఁడై వెన్నెముకపైఁ దనతీవ్రఖడ్గముచేఁ గొట్టి యప్పౌరవుని నొప్పించెను. ఓమహారాజా! అటులు వారు పరస్పరముఁ గొంతవడి ఘోరముగాఁ బోరాడి పుడమిఁ బడ నప్పౌరవుని

నీతనయుఁడగు జయత్సేనుఁడు తనరథముపైఁ గూర్చుండఁబెట్టుకొని తొలఁగించికొనిపోయెను. ధృష్టకేతునిఁ బ్రతాపశాలి యగుసహదేవుఁడు తనరథముపై నిడి తీసికొనిపోయెను. చిత్రసేనుఁడు సుశర్మయను పాండవపక్షీయునిఁ దాఁకి పెక్కునారాచముల నొప్పించి మఱియు నఱువదితొమ్మిదిబాణములచే నొవ్వనేసెను. అంత నాసుశర్మయుఁ గుపితుఁడై నీపుత్త్రు నిరువదిబాణములచే నొవ్వనేయఁ జిత్రసేనుఁడును వానిని ముప్పదివాఁడికోలలచేఁ బ్రతిహతి యొనర్చెను. ఓరాజా! అపు డభిమన్యుఁడు భీష్ముని యశోమానములను రెట్టించుచు బృహద్బలుఁ డను వానిని బ్రహరించి యర్జునునకై భీష్మునిఁ జంప నెంచి యటులు విక్రమింప నాబృహద్బలుఁడును నైదునారాచముల నాయభిమన్యునిఁ గొట్టి యించుకేనిఁ జలింపని యాతని మఱియుఁ గొట్టెను. అపు డాయభిమన్యుఁ డాబృహద్బలునిధనువు దునుమాడి ముప్పదిబాణములచే వానిని నొవ్వనేయ వాఁడును వేఱొకవిల్లు పూని పెక్కుబాణములచే నభిమన్యునిఁ బ్రహరించెను. ఓరాజా! భీష్మునినిమిత్తము చిత్రయోధు లగు నామహారథుల కిరువురకును నట్టియుద్ధము జరగెను. అయ్యది మున్ను దేవాసురయుద్ధమున బలివాసవులవిక్రమమును దలపించెను. భీముఁడు గజసైన్యమును దలపడి మున్నింద్రుఁడు పర్వతోత్తమములను వ్రయ్యలొనరించునట్లుగా వానిని ఖండించి పడఁద్రోయుచుండ నవి కొండలవలెఁ గూలుచు మహారావము లొనరింపసాగెను. యుధిష్ఠిరుఁడు శల్యుని మార్కొని తనసైన్యముతో నాతనిఁ బీడింపసాగెను. అతఁడును భీష్మప్రాణత్రాణమునకై తనపరాక్రమమును వెలయించుచు, నాధర్మజునిఁ బీడింపఁదొడంగెను. సైంధవుఁడు విరాటునిఁ దలపడి తొమ్మిదితీవ్రనారాచములఁ బ్రహరించి మఱియు ముప్పదిబాణముల నాతనిపైఁ బ్రయోగించెను. అందుల కావిరాటుఁ డలిగి ముప్పదిబాణములచే నాసైంధవుని వక్షమును నొప్పించెను. అపు డావిరాటసైంధవులు చిత్రకార్ముకఖడ్గులును, జిత్రకవచాయుధధ్వజులును, జిత్రాకారులును నై విరాజిల్లిరి. ద్రోణుఁడు ధృష్టద్యుమ్నునిఁ దలపడి వానిధనువు దునుమాడి మఱియు నేఁబదిబాణములచే వానినిఁ బ్రహరించెను. అంత నాధృష్టద్యుమ్నుఁడును వేఱొకవిల్లుపూని ద్రోణుఁడు చూచుచుండఁగనే తీవ్రసాయకముల నాతనిపై గుప్పింప వాని నొకనిమేషమున నొకశరప్రహారమునఁ

జెగనేసెను. అటు లాద్రోణుఁడు తనశరసంఘాతమును దునుమఁ గుపితుఁడై యమదండమునాఁదగు నొకగద నాధృష్టద్యుమ్నుఁ డాతనిపైఁ బ్రయోగించెను. అంత నాద్రోణుఁడును దనపైకివచ్చునట్టిగదను దీవ్రసాయకములచే ఖండింప నది పిండియై పుడమిఁ బడియెను. అటులు తన గద భగ్నమగుటఁ జూచి మఱియు నొకశక్తిని బ్రయోగింప దాని నాద్రోణుఁడు తొమ్మిదిబాణములచేఁ ద్రుంచి మఱియు నాద్రుపదపుత్త్రునిఁ బీడించెను. ఓరాజా! ద్రోణధృష్టద్యుమ్నుల కిటులు ఘోర మగుయుద్ధము జరగెను. అపుడు ఘోరాకారుఁడై వెఱపుగొలుపు నాభీష్మునిఁ బార్థుఁడు మార్కొని తీవ్రనారాచముల నాతనిఁ బీడించుటను జూచి ప్రతాపనిధి యగు భగదత్తుఁ డాయర్జును నెదుర్కొనియెను. అటులు మదాంధ మగు తనయేన్గు నెక్కివచ్చు నాభగదత్తు నారసి యర్జునుఁడును నాతనిఁ దలపడియెను. అంత నాతఁ డాయర్జునుని శరవర్షమునఁ గప్ప నప్పార్థుఁ డాభగదత్తునిమహాగజమును వాఁడికోలలచే నొప్పించి మఱియు శిఖండితో, “ఓయీ! నీవు భీష్ము నెదుర్కొనుము. ప్రహరింపుము.” అని వానిని బ్రోత్సహించెను. అంత నాభగదత్తుఁ డాయర్జునుప్రహారముల కోర్వలేక యావీరుని విడిచి ద్రుపదునిపైకి వెడలెను. ఓమహారాజా! అర్జునుఁడును శిఖండిని ముందుంచుకొని యాభీష్ముని మార్కొనియెను. అపుడు వారికి ఘోరముగా యుద్ధము జరగెను. అంత నీవారును గడు వడిగా వెడలి యక్కవ్వడిపైఁబడి యఱచుచుఁ బోరాడ నారంభించిరి. అది మాకద్భుతమై గానవచ్చెను. అపు డర్జునుఁడు మనవారిపలువిధము లగు సైన్యములను బెనుగాలి యాకసమునందలి మేఘములనువలె నలుదెసలకును జెల్లాచెదరుగాఁ జేయుచు నొప్పించెను. అంత నాశిఖండియు గాంగేయుని సమీపించి ధీరుఁడై వడిగలవాఁడికోలల నాతనిపైఁ బ్రయోగించెను. అపు డాగాంగేయుఁడు రథమనెడియగ్నిగృహమునఁ జాపమనెడియగ్నియు నసిశక్తిగదాదులనెడి యింధనములును దన యుపకరణములుగా శరసమూహము లనెడి జ్వాలలు వెలయ నాసమరమున క్షత్త్రియులను గాల్చుచుండెను. మిక్కిలి ప్రజ్వలిత మగు నగ్ని గాలి తనకు సహాయముగా నెండుగడ్డిని దహించునట్లుగా దివ్యాస్త్రములను బ్రయోగించుచు సోమకులను బితామహుఁడు రూపుమాపుచుండెను. ఓరాజా! అప్పు డప్పితామహుఁ డప్పాండవమధ్యమునిసైన్యమును

సువర్ణపుంఖములగు బాణములచే నివారించి దశదిశలఁ బ్రతిధ్వనింపఁ జేయుచు రథికులను, రౌతులను ధరాతలగతులఁ జేయుచు, గుఱ్ఱములను, రథములను మొండెతాళవనములఁగా నొనర్చెను. అతని ధనుష్టంకారధ్వనుల విని సైనికులు పిడుగులకువలె జడియఁజొచ్చిరి. ఓ రాజా! నీతండ్రి వింటనుండి వెడలినబాణము లమోఘములై యాసైనికులమేనుల సక్తముగానట్టు లగపడుచు రథములను నిర్మనుష్యములుగా నొనర్చెను. ఓమహారాజా ! నోరు తెఱచియున్న యముఁడునాఁ దగు నాభీష్మునిఁ దాకి మఱలక పోరాడువారై సువర్ణాలంకృతధ్వజు లగు చేదికాశికరూశదేశీయులగు పదునాలుగువేవురుతేరులెక్కమాఱుగా సంగ్రామరంగమున పడిసి పరలోకగతులైరి. అటులాభీష్మునిఁ జేరినసోమకులలో మహారథుఁ డొకఁడును నారణరంగమున జీవితేచ్ఛగలిగియుండలేదు. అపు డాభీష్మునివిక్రమము నారసినవారందఱును నాతనియెదుటఁ బడిన పాండవయోధులను యమపురమునకుఁ బ్రయాణమయినవారినిగాఁ దలంచిరి. ఓరాజా! అప్పట్టునఁ గృష్ణసారథియు, శ్వేతాశ్వుఁడును నగు పాండవమధ్యముఁడును, పాంచాల్యుఁ డగుశిఖండియుఁ దప్ప వేఱొకమహారథుఁ డెవ్వఁడును నాతనియెదుటఁ బడినవాఁడు గానరాకుండెను.” అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

## సంకులయుద్ధము

“ఓయాంబికేయా! పిమ్మటఁబురుషసింహుఁడగు భీష్ముని మార్కొని శిఖండి పదితీవ్రబాణములచే వక్షమునఁ బ్రహరించెను. అంత నాశాంతనవుఁడు కోపముచేఁ బ్రజ్వలించుచూపులతో నాశిఖండిని దహించువాఁడువలెఁ జూచుచు వానిస్త్రీత్వమును దలంచుచు నెల్లవారు నారయుచుండఁగా వానిని గొట్టఁడయ్యెను. కాని యది యాశిఖండి గ్రహింపఁ జాలఁడయ్యెను. అపు డర్జునుఁడు, శిఖండితో “ఓయీ ఈభీష్మునివధమునకై వడిగాఁ బ్రయత్నింపుము. ఓవీరా! నీకిందుఁ జింతింపఁబనిలేదు. మహారథుఁ డగుభీష్మునిఁ దునుమాడుము. ఓయీ! నీవుదక్క మనసైన్యమున నొకఁడును బితామహుని మార్కొనువాఁడు గానరాఁడు. ఈనావచనము సత్యమని నమ్ముము.” అని పలుక

నప్పార్థునివచన మాలించి యాశిఖండి పలువిధములగు శరపరంపరల నా గాంగేయునిపైఁ గురిసెను. అపు డాభీష్ముఁ డాశిఖండిబాణములను లక్ష్యము సేయక యే యర్జునుని నాతనిసైన్యమును దీవ్రసాయకములచే నివారించుచు వచ్చెను. అంత నాతనిఁ బాండవసైన్యము లన్నియు నొక్కుమ్మడిఁ గవిసి మేఘము లాదిత్యునివలె నాతని నావరించెను. అటు లాతఁడు వారిచే నావరింపఁబడి వనమును బ్రజ్వలితాగ్నివలె వారినెల్ల దహించెను. అపుడు నీపుత్త్రుఁడు పితామహుని రక్షించుటకై పార్థులతో యుద్ధముచేయుట మాకెంతయు నద్భుతమయ్యెను. అతఁ డొకఁడే వారితోఁ బోరాడుటకు లోకమెల్ల నాతని మెచ్చికొనిరి. అటు లుప్రేకించిన యాదుశ్శాసనునిఁ బాండవు లెవ్వరును నివారింపఁజాలరైరి. అంత నాతనిచే రథికులెల్ల విరథులై రథగజాశ్వపదాతిసమూహములు తీవ్రశరప్రహతములై నేలఁగూలెను. కొన్ని యేనుగులు దెసలకుఁ బరువులిడసాగెను. ఇంధనసంయోగమున నగ్నివలె నాదుశ్శాసనుఁడు విజృంభించి పాండవసైన్యమును దహింపసాగెను. అటులు విక్రమించు నీ కొమరుని పాండవరథికులలో నొకఁడును జయించుటకును, నెదుర్కొనుటకును సాహసింపంజాలరైరి. అపుడు వాని నర్జునుఁ డెదుర్కొని యోడింప వాఁడెల్లవారును జూచుచుండ భీష్మునివెనుకకు వెడలిపోయెను. పిదప నర్జునుఁడు బరాక్రమించి మఱిమఱియుఁ దీవ్రశరపరంపరల గుప్పించుచువిరాజిల్లెను. శిఖండియుఁ బిడుగులను బోలినట్టియు, సర్పవిషతుల్యములైనట్టియు, బాణములచే భీష్ముని నొప్పింపసాగెను. కాని వానిసాయకము లాగాంగేయున కించుకేని నొప్పిగలిగింపమి, నతఁడు నగుచు నెండవేడిమి కోరువనివాఁడు జలధారలనుఁ బోలె వానికిఁ దనమేనొడ్డి నిలిచి యుండెను. అటు లతఁ డాశిఖండిశరధారలను బరిగ్రహించుటను గాంచి క్షత్త్రియయోధు లెల్లరును నది ఘోరమని తలంచి చూచుచుండిరి. అయినను భీష్ముఁడు పాండవసైన్యములను దహింపక మానలేదు. అంత నీకొమరుఁడు తనయోధులతో "ఓయోధవరులారా! అర్జునునిపై వెడలి విక్రమింపుఁడు. ధర్మవేత్తయగు భీష్ముఁడు మిమ్మెల్ల రక్షించును. కావున భయమువిడిచి పాండవులతోఁ బోరాడుఁడు. ఇదె తనతాలధ్వజముతో నెల్లధార్తరాష్ట్రులకును బ్రమాదము వాటిల్లకుండఁ గాపాడుచున్నవాఁడు. సన్నద్ధులగుదేవతలు నైతము గాంగేయుని సంగ్రామ

మున నోడించుట దుర్ఘటమన మహాత్ముఁ డగునాతని మస్త్రభూతులగు పాండవులు జయించుట కల్లమాట గదా! కావున మీరు పార్థునికై జడియక యాతని నెదుర్కొనుఁడు గాని చెదరిపోకుఁడు. ఇప్పు డిదె నేనును మీతోఁగూడి పాండవమధ్యమునితోఁ బోరాడువాఁడను." అని తెలిపెను.

అది విని విదేహులును, కళింగులును, దాసేరకులును, నిషాదులును, సౌవీరులును ధనుర్ధరులై యర్జునునిపైకి వెడలిరి. అటులే బాహ్లీకులును, దరదులును, ప్రతీచ్యులు, నుదీచ్యులు, మాలవులు, ఆభీషాహులు, శూరసేనులు, శిబులు, వసాతులు, సాల్వులు, శకులు, త్రిగర్తులు, అంబష్ఠులు, కేకయులు నొక్కుమ్మడిగా నగ్నిలో నుఱుకు మిడుతలువలె నాయర్జునుని మార్కొనిరి. ఓమహారాజా! ఆయర్జునుఁ డపుడు దివ్యాస్త్రములను ధ్యానించి వానిని సంధించి కడువడిగల యా యస్త్రజాలముచేఁ గౌరవసైన్యములనెల్లఁ బావకుఁడు మిడుతలనువలె దహింపసాగెను. అతఁడు బాణసహస్రములను బ్రయోగించుచుండఁగా నాతనిగాండివ మాకసమున దీప్యమానమగుచు వెలయుచుండెను. మఱియు నాతనిబాణప్రహారముల కోరువక ధ్వజములు దొలఁగఁ బరువు లిడెడివారెగాని యాయర్జునుని మార్కొనువారు గానరారైరి. అటులాకిరీటిశరతాడితులై రథములతో రథికులును, నేస్తులతో గజారోహకులును, గుఱ్ఱములతో రౌతులును నేలఁ గూలసాగిరి. పిదప నర్జునుశరపరంపరచేఁ బుడమియెల్ల నావృతమయ్యెను. మనబలము దిక్కులకుఁ జెదరసాగెను. అపుడు పార్థుఁ డటులు నీవారిసైన్యమును బటాపంచలు గావించి దుశ్శాసనుపైఁ బెక్కుబాణములను బ్రయోగింపసాగెను. ఆసాయకములు నీకొమరుని భేదించి పుట్టనుజొచ్చినపాములు వలెఁ బుడమిని నాటికొనియెను. పిమ్మట నతఁడు వివింశతి మార్కొని యిరువదిబాణములచే సారథిని గుఱ్ఱములను గొట్టి విరథునిగా నొనర్చి యాదుశ్శాసను నైదుబాణములచే నొప్పించెను. అటులే కృపుని వికర్ణుని శల్యునిఁ బెక్కుసాయకముల నొప్పించి విరథులఁగా నొనర్చెను. అంత మనయోధులెల్ల విరథులై యాతని కోడి చకాచకలై పోయిరి. నాఁడు పూర్వాహ్ణముననే మనయోధులను జయించి పొగలేనియగ్నివలెఁ బ్రజ్వలించెను. ఓరాజా! రశ్మిమాలి యగుభాస్కరుఁడువలె నాయర్జు

నుఁడు శరవర్షముచే బార్థివసమూహమును దళింపఁజేయుట యద్భుతముగాఁ జూపట్టెను. అటు లాయర్జునుఁడు మనమహారథులనెల్లఁ బరాఙ్ముఖులఁ గావించి సంగ్రామరంగమున రక్తప్రవాహములు ప్రవహింపఁజేయ నక్కురుపాండవులసైన్యములనడుమ మిగుల మహామారణ మారంభమగుడుఁ బాండవబలమంతయు భీష్మునిపై విక్రమించి మార్కొనెను. సోమకులును బ్రాణములయం దాశవిడిచి స్వర్గలోకపరాయణులై యచ్చోటు విడువక పోరాడఁదొడంగిరి. ఓమహారాజా! పాండవులును నీపుత్రులతోఁ గూడ నీవొనర్చినబహువిధములగు క్లేశములను స్మరించువారై ప్రాణములం దాశను భయమును విడిచి సోత్సాహులై నీవారిని మార్కొని పోరాడ నారంభించిరి. అపుడు రథికులచే రథసంఘములును, గజాశ్వములును, బదాతులును నిహతినొంది తలలుదెగి నేలఁ గూలసాగ నది యద్భుతముగాఁ జూపట్టెను. ఎందుఁ జూచినను విఱిగిన రథజాలములును, రూపుమాసినగజాశ్వములునుగా రణభూమి రక్తప్రవాహములకుఁ గారణభూమియై గానవచ్చెను. అందుఁ గుక్కలును, గాకులును, నక్కలును, గ్రద్దలును, వికృతములగు మృగపక్షులును ఘోరారావము లొనర్పసాగెను. ఎల్లదెసలందును బహువిధములగు గాలులు వీసర నారంభించెను. రక్షఃపిశాచాదులు తిరుగ మొదలిడెను. భూతములధ్వనులు మెండయ్యెను. మఱియు నారణరంగమునఁబడిన సువర్ణదామములును, గొప్పవిలువగలపతాకలును గాలి కెగురుచు మా కంపందు: గానవచ్చెను. వేలకొలఁది వెల్లగొడుగులును, ధ్వజములతోఁ గూడిన మహారథములును దెగి నలువైపులఁ జెదరియుంటను జూచితిమి. ఓమానవాధిపా! శరప్రహారపీడితులైన క్షత్రియులు తమతమ గజరథాశ్వములతోఁ బుడమిఁబడి మూర్ఛగపడిరి. అపు డప్పాండవసేనాపతి తనయోధులతో "ఓవీరులారా! గాంగేయుని మార్కొనుఁడు. లేనిచో మీవలనఁ బ్రయోజనమేమి?" అని పలుక విని సోమకులు సృంజయులతోఁ గూడ గాంగేయుని మార్కొని శస్త్రవర్షమును వర్షించిరి. పిమ్మట భీష్ముఁడును దివ్యాస్త్రములను బ్రయోగించుచు నెల్లధనుర్ధరులరయుచుండఁగా నప్పార్థు నెదుర్కొనియెను. అపుడు శిఖండి సన్నద్ధుఁడై గాంగేయు నెదుర్కొన నతఁడు తనపావకాస్త్రము నుపసంహరించికొనియెను. ఇంతలోఁ గౌంతేయుఁడు పితామహుని మూర్ఛఁబడఁ

గొట్టి నీవారిసైన్యమును బ్రహరించెను." అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

భీష్మపరాక్రమము

"ఓరాజా! వ్యూహములు చెదరి తెంపుమిగుల నందం దొకరి నొకరు తలపడిరి కాని, రథికులు రథికులతోడను, పదాతులు పదాతుల తోడను, రౌతులు రౌతులతోడను, గజాశ్వములు గజాశ్వముల తోడనుగాక తమతమ కెదుటఁబడినసైన్యములతోఁ బోరాడ నుభయ సైన్యములకును సంకులసమర మయ్యెను. అపుడు శల్యుఁడును, కృపుఁ డును, చిత్రసేనుఁడును, దుశ్శాసనుఁడును, వికర్ణుఁడును దేజోవిరాజ మానములగు యానములనధిష్ఠించి పాండవసైన్యమునకు వెఱపుగొలుప సాగిరి. అంత నప్పాండవసైన్య మమ్మహాత్ములచే హతమై రక్షకుఁ డగు వాని నందుఁ గానక సముద్రమున మునుఁగుచున్న యోడవలె గాన వచ్చెను. శిశిరకాలము గోవులను బీడించునట్లు నాభీష్ముఁడు పాండవుల మర్మము వెడలునట్లుగా నొప్పింప సాగెను. అటులే నీవారిసైన్యగజ యూథమును పుడమిఁ ద్రోయఁబడుచుండెను. పదాతులును మర్దింపఁబడి యాయర్జును నారాచములచే నేలఁ గూల్పఁబడుచుండిరి. కుండలము లతోఁగూడిన యోధులతలలు రణరంగమును గప్పసాగెను. ఆసమయ మున భీష్మార్జును లటులు విక్రమించిరి. అంత నాశాంతనవ్రుని జూచి నీతనయులు నిజసైన్యములతోఁగూడి యాతని సమీపించిరి. అటులు వారు సమీపించి స్వర్గమునే యుత్తమగతిగా నెంచి ప్రాణములం దిచ్ఛ వీడి పోరాడఁ దొడంగిరి. పాండవులును నీవారు తమకు మున్నొనర్చిన మహాపకారములనెల్లఁ దలంచికొని భయము లేక బ్రహ్మలోకపరాయ ణులై నీవారిని వారిసైన్యమును దలపడిరి. అపుడు వారిసేనాపతి తన సైన్యముతో "ఓసోమకులారా! సృంజయులతో మీరిఁక గాంగే యునిఁ దలపడుఁడు." అని పలుక విని యాసోమకులు సృంజయులతోఁ గూడ వెడలి భీష్ముని శరవర్షమున ముంచిరి. అటులు వారెల్ల నొక్కు మ్మడిఁ దనపైఁ గవియ నప్పితామహుఁడు కోపపరవశుఁడై సృంజయుల నెదుర్కొని మున్ను తా నాపరశురామునికడ నభ్యసించిన యస్త్రవిద్యా పాటవమును బ్రదర్శించుచు, వైరిసేనాక్షయ మొనరించుచుఁ, బదివేవురు

రథికులను నశింపఁజేసెను. ఓరాజా! ఆపదియవనాఁ డాభీష్మఁడు మాత్స్యపాంచాలసైన్యములలో సమాన మగు గజాశ్వసముదయమును, నేడ్వురుమహారథులను, నైదువేలరథములను, బదునాల్గువేవురు పదాతులను, బదివేలగుఱ్ఱములవారిని దనయుద్ధకౌశలముచే మడియించి, పిదప నెల్లమహాక్షత్రియులసైన్యమును జంపి, విరాటునకుఁ బ్రియ సోదరుఁడగు శతానీకుని జంపెను. అటులు వాని మడియించి మఱియు నాభీష్మఁడు రాజులను వేలకొలఁదిగా నేలఁగూలఁద్రోసెను. అపు డాతని పరాక్రమమున కోరువక భీతినొంది కొందఱు క్షత్రియు లర్జునునిఁ జేరి మొఱ్ఱపెట్టుకొనిరి. అటులు భీష్ముఁడు తనశరపరంపరల నలుదెసలకుఁ బఱపుచు, రాజులను యమద్వారమున కనిపి పాండవసైన్యమును గడచి సేనాముఖమున నిలిచియుండ, నాతనిఁ దేఱిచూచుటకయినను నెవ్వరును సమర్థులు గాకుండిరి. అపు డతఁ డుభయసైన్యములనడుమ నిలిచి వేసవిసూర్యునివలెఁ బ్రతాపమును వెలయించుచు మున్నాయింద్రుఁడు దైత్యులనువలెఁ బాండవయోధులను బీడింపసాగెను. అంత నశాంతుఁడై విక్రమించు నాశాంతనవుఁ గాంచి వాసుదేవుఁ డర్జునుతో "ఓధనంజయా! చూచితే! ఇప్పితామహుఁ డిరుసేనలనడుమ నిలిచి యున్నవాఁడు. ఇపు డీతని సమీపించి ప్రహరించితివేని నీకు జయము గలిగెడిని. సేనలన్నియుఁ జెదరియున్నయిత్తఱి నీ వాతని బలాత్కరించి నిలుపుము. నీవుదక్క భీష్మశరప్రహారముల కోర్చువా రెవ్వరును లేరు గదా!" అని పలికి యతఁ డాయర్జునుఁ బ్రోత్సహించెను. ఓరాజా! అపు డర్జునుఁ డాభీష్మునిరథము రథాశ్వములును ధ్వజమును గన్పడకుండు నట్లుగాఁ దనశరపరంపరచే నాతనిఁ గప్పెను. అపుడాగాంగేయుఁడును, నర్జునప్రయుక్తము లగుబాణములను దనబాణప్రహారములచే ఖండించి వైచెను. అంత ద్రుపదుఁడు, ధృష్టకేతువు, భీముఁడును, ధృష్టద్యుమ్నుఁడును, నకులసహదేవులును, జీవితాసుఁడును, కేకయులును, సాత్యకియు, నభిమన్యుఁడును, ఘటోత్కచుఁడును, ద్రౌపదేయులును, శిఖండియు, కుంతిభోజుఁడు, విరాటుఁడు, నింకను గలయోధులును భీష్మునిఁ దలపడి యాతనిసాయకములచేఁ బీడింపఁబడిరి. కాని వారినెల్ల జడియకుఁడని యర్జునుఁడు జడిదీర్చి నిలువరించెను. అంత నా శిఖండియుఁ గడువడిగాఁ గార్ముకమున బాణములు సంధించి యర్జునుఁడు

తనరక్షకుఁడుగా భీష్మునిపైకి వెడలెను. అంత నాయర్జునుఁడును మున్నుగా భీష్ముని వెనుకముందుభాగముల నున్నవారిని దొలఁగించి తానును భీష్ముని మార్కొనియెను. ఆతనివెంట సాత్యకియుఁ, జేకితానుఁడును, ధృష్టద్యుమ్నుఁడును, విరాటద్రుపదులును, నకులసహదేవులును వెడలిరి. వారికెల్ల నప్పాండవమధ్యముఁడే రక్షకుఁడై యుండెను. అపుడభిమన్యుఁడును, ద్రౌపదేయులును గేల విలువూనియున్న యాగాంగేయుం గాంచి తీవ్రసాయకముల నాతని నొప్పించిరిగాని యతఁ డాశరపరంపరలకు లోఁగక పాండవసైన్యమును బ్రవేశించి యందు విహరించువాఁడువలెనాశిఖండిప్రహారములను లక్ష్యపెట్టక, మఱియు నాతని స్త్రీత్వమును స్మరించి యాతనిపై శరప్రయోగ మొనరింపక ద్రుపదసైన్యమునఁ గలరథికులను నుఱుమాడసాగెను. అపు డెంతయుఁ గిలకిలారాన మారంభమయ్యెను. మత్స్యపాంచాలచేదియోధు లాభీష్మునిపైకిఁ బరువులిడసాగిరి. అర్జునుఁడును శిఖండిని ముందుంచుకొని భీష్ముని మార్కొనియెను.” అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

## భీష్మనిపాతనము

“ఓరాజా! అటులు పాండవు లెల్లరును శిఖండిని ముందిడుకొని భీష్ము నెల్లెడలఁ జుట్టుకొని యాతని ఘోరము లగుశతఘ్నులచేతను, బరిఘములచేతను, బరశ్వధములచేతను నటులే ముసల ముద్గరప్రాసాదులచేతను, శ క్తితోమరాదులచేతను నొప్పించిరి. సృంజయులును నాతని నొప్పించిరి. కాని, యటులు వారు తనమర్మము లెడలఁబీడించినను నించుకేని నొవ్వక యతఁడు యుగాంతాగ్నివలెఁ బ్రజ్వరిలుచు, నప్పాండవసైన్యములను భేదించి వెడలి, మఱియు నామహారథులనడుమఁ జరించుచు, నాద్రుపదధృష్టకేతులను లక్ష్యముసేయక యందు విహరించువాఁడువలెఁ గన్పట్టెను. పిదప, భీమసాత్యకులును, నర్జునుఁడును, విరాటద్రుపదులును, ధృష్టద్యుమ్నుఁడును నాతని మార్కొనఁగా నతఁడు వారిని ఘోరనారాచముల నొప్పించెను. వారును భీష్మప్రయుక్తములగు శరపరంపరలను నివారించుకొనుచు వారొక్కొకరును బదేసిబాణములచే నాతనిఁ గొట్టిరి. పిదప శిఖండియు సువర్ణాగ్రములగునారాచములాగాంగేయునిపైఁ బ్రయోగింప నవి యాతనిమేన నాఁటుకొనియెను.

అంత నాపార్థుఁడును, శిఖండిని బురస్కరించికొని యవక్రవిక్రముఁడై గాంగేయుం దలపడి యాతనివిల్లు దునుమాడెను. అపు డాభీష్మని విల్లు దునుమాడుట కోరువక మహారథులగు ద్రోణకృతవర్మలును, సైంధవుఁడును, భూరిశ్రవుఁడును, శల్యభగదత్తులును, నాయర్జునుని మార్కొనిరి. అందు వారిదివ్యాస్త్రప్రావీణ్యము ప్రదర్శింపఁబడియెను. వారటు లాతని నొక్కుమ్మడిఁ గవియునప్పటిచప్పుడులు సంకులమై వినంబడ నప్పాండవయోధు లాయర్జునునకుఁ దోడు గాఁదలంచి పరువులెత్తిరి. అందు సాత్యకిభీమసేనులును, ధృష్టద్యుమ్నుఁడును, విరాటద్రుపదులును,ఘటోత్కచాభిమన్యులును గుపితులై, నానావిధాయుధధారులై యాగాంగేయునిఁ దలపడిరి. అపుడు దేవదానవులకువలె వారితోఁ గౌరవసైన్యములకు ఘోరమగుపో రారంభమయ్యెను. శిఖండియుఁ దన కర్జునుఁడు రక్షకుఁడై యుండ విల్లు తునిఁగియున్న యప్పితామహునిఁ బదితీవ్రనారాచముల నొప్పించెను. పిదప భీష్ముఁడును వేఱొకవిల్లుపూని బదిబాణములచే నాశిఖండి సారథిని ధ్వజము నొకకోలను గూలనేసెను. పిమ్మటఁ బార్థుఁడు మఱియు నాభీష్మునిధనువు మూఁడుబాణములచే నఱికెను. ఓ రాజా! అటులే యర్జునుఁడు కుపితమానసుఁడై భీష్ముఁడు పూనుచున్న విండ్లనన్నిటిని మఱిమఱియు ఖండించుచు వచ్చెను. అతఁ డావిధముగాఁ దనధనువులు దునియఁ గుపితుఁడై సెలవులు దడుపుచుఁ గొండలనుసైతముఁ బిండిచేయఁజాలిన యొకమహాశక్తిని గడువడిగాఁ బరిగ్రహించి యది యప్పార్థునిరథముపైకి వైచెను. పిడుగువలె మండుచుఁ దనపైకివచ్చు నాశక్తినారసి యప్పాండవమధ్యముఁడైదు తీవ్రభల్లములను సంధించి వానిచే నాతనిశక్తి నైదుఖండములుగా ఖండించెను. అంత నయ్యది ముక్కలై మేఘములనుండి జాఱిపడిన మెఱపువలెఁ బుడమిఁ బడియెను. అటులు తనశక్తి ఖండింపఁబడుటఁ గాంచి కోపావేశపరవశుఁడై యాగాంగేయుఁ డిట్లు చింతించెను. "ఆహా! నే నొకధనువు పూనియే పాండవులనెల్లఁ జంపుటకుఁ దగినవాఁడను. ఈజనార్దనుఁడే వీరికి రక్షకుఁడుగా నుండఁడేని వీరినిఁ దృటిలో నశింపఁజేయకుందునా? నే నెవ్వరికిని జయింప వలనుపడనివాఁడనని నానిశ్చయము. అయినను నిపుడు రెండుకారణములచేఁ బాండవులతో నేను బోరాడను. అందొకటి పాండవులు నాకుఁ జంపఁదగనివా రగుటయు, రెండవది యాఁడుది

యగు శిఖండి నన్నెదుర్కొనుటయు నా యీయుద్ధవిరక్తికి హేతువులుగదా! మున్ను నాతండ్రి నాయెడఁ బ్రీతిపడి నా కవధ్యత్వమును స్వచ్ఛందమరణమును దయచేసియున్నవాఁడు. కావున మృత్యువు నా తలంచినపుడు ప్రాప్తించునని తలంతును”

ఓరాజా! తేజస్వి యగు నాభీష్ముని నిశ్చయము నెఱిఁగి యాకసమందు నిలువఁబడియున్న మహర్షులును, వసువులును నాతనితో, “ఓ మహానుభావా! ఈ నీనిశ్చయ మెంతయు మాకును బ్రియమైయున్నది. కావున నీవిఁక యుద్ధమునుండి బుద్ధి మఱలింపుము.” అని పలుకుచుండఁగా, శ్రేయస్కరమై చల్ల నగుగాలి వైచెను. అయ్యది యనుకూలమై సుగంధమును, జల్లఁదనమును గలిగి చిత్తముల కానందము గలిగించెను. దేవదుందుభులు మ్రోగెను. మఱియు నాభీష్మునిపై పుష్పవర్షము గురిసెను. ఓరాజా! ఆమహర్షులయు, వసువులయు సంభాషణము నాకును భీష్మునకును దక్క దక్కినవారికి శ్రవణగోచరము గాదయ్యెను. భీష్ముఁ డపుడు రథమునుండి పడునని దేవతలకు సంభ్రమము జనించెను. అంత నాశాంతనవుఁ డాదేవతలపలుకు లాలించి యాయర్జునునితోఁ బోరాడక యాతనితీవ్రబాణములచేఁ బ్రహారింపఁబడుచుండెను. అపుడు శిఖండియుఁ దొమ్మిదితీవ్రనారాచముల నక్కురుపితామహునురము నాఁటనేసెను. కాని, భూకంపమునకుఁ బర్వతమువలె నతఁ డాశిఖండిప్రహారముల కించుకయుఁ జలింపఁడయ్యెను. పిమ్మట నర్జునుఁడు నగుచు, గాండీవము ద్రిప్పుచు నిరువదైదుక్షుద్రకముల నాగాంగేయునిపై బఱపి, మఱియుఁ ద్వరపడి వందలకొలఁది శరపరంపరలచే నాతనియవయవము లెల్ల మర్మములు నాఁటునట్లుగాఁ బ్రహరించెను. ఇటులే మఱిమఱియు నాతని నర్జునుఁడు శరసమూహమున, గప్పుచుండ నతఁడును వానిని నివారించుచు వచ్చెను. అటులే శిఖండియు నాగాంగేయుపై సువర్ణపుంఖము లగుశరములను బ్రయోగించెనుగాని యవి యాతని కించుకేనిఁ బీడగలిగింపఁజాలవయ్యెను. మఱియు నాకిరీటి కుపితుఁడై భీష్ము నెదుర్కొని, శిఖండిని ముందుంచుకొని, భీష్మునిధనువు దునుమాడి యటులే వేఱొకబాణముచే ధ్వజమును ఖండించెను. మఱియుఁ బదిబాణములచే సారథిని జలింపఁజేయ, నప్పితామహుఁడును వేఱొక విల్లు పరిగ్రహించెను. కాని దానిని సైతము మూఁడు బాణములచే

మూఁడుముక్కలుగాఁ దునుమాఁడెను. ఓరాజా ! ఇటు లెన్నియో మాఱు లాశాంతనవుఁ డెత్తినవింటినెల్ల నర్జునుఁ డొకనిమేషమునఁ దునుముచుఁ దుదికి కాతనికిఁ గలధనువులెల్ల ఖండించెను. పిదప నా భీష్ముఁ డావివ్వచ్ఛుని మార్గాన కుపేక్షింప, మఱియు నాయర్జునుఁ డిరువదైదుక్షుద్రకములచే నొప్పించెను. అపు డతఁ డెంతయుఁ నొచ్చి దుశ్శాసనుం గాంచి, "ఓయీ! దుశ్శాసనా! మహారథుఁ డగు నిప్పార్థుఁ డెంతయుఁ గుపితుఁడై వేలకొలఁదిబాణములచే నన్ను నొప్పించుచున్నవాఁడు. ఈతని నాయింద్రుఁడును సంగ్రామరంగమున జయింపనోపఁడు. నన్నును జయింపఁగలుగు దేవదానవు లొకచోఁగూడిరైయైన నీయర్జును నోడింపఁజాలరుగదా ! మానవమాత్రు లీతని జయించు టెట్లు?" అని పలికెను.

ఓయాంబికేయా! ఇటు లాభీష్ముఁడు పలుకుచుండఁగా శిఖండిని ముందుంచుకొని యర్జునుఁ డాగాంగేయు నెప్పటిచొప్పునఁ దీవ్రసాయకముల నొప్పింపసాగెను. పిదప గాండివధరునిచేఁ బ్రయుక్తము లగు తీవ్రనారాచములచేఁ బ్రహతుఁడై, నగుచు మఱియు నాదుశ్శాసనుతో "ఓయీ! వజ్రతుల్యములై నాపై విడువఁబడు నీబాణములు శిఖండిప్రయుక్తములు గావు. మిక్కిలి దృఢమైన నా యీకవచమును ఛేదించి మర్మములను సోఁకుచు ముసలములువలె నాకు నొప్పి గలిగించు నీబాణములు శిఖండిప్రయుక్తములు గావు. మఱియు, బ్రహ్మదండసమస్పర్శములై వజ్రసన్నిభములై నాయీప్రాణములను నొప్పించుచుండుట, నివి శిఖండిప్రయుక్తములుగావు. నాప్రాణములను గొంపోవుటకై యమదూతలు నాఁదగి గదాపరిఘాదులవలె నొప్పించు నీబాణములు శిఖండిప్రయుక్తములుగావు. కుపితములై నాలుకలు వేడునట్టిసర్పములు నా భయంకరములై నాయాయువుపట్టులఁ బీడించు చుండుటచే, నీబాణములు శిఖండిప్రయుక్తములు గావు. ఇయ్యవి యర్జునబాణములుగాని శిఖండిబాణములు గానేరవు. మహావీరుఁ డగు గాండివధరుఁడు దక్కఁ దక్కినరాజలోకమున నెవ్వరును నన్నుఁ బీడింపఁజాలరైరి." అని పలుకుచు మఱియు మండిపడుచుఁ, బ్రతాపనిధి యగు నతఁ డప్పార్థునిపై నొకశక్తిని వైచెను. ఓరాజా! నీవారెల్ల నారయుచుండఁగా, దానిని మూఁడుకోలలచే మూఁడుఖండములుగా ఖండించివైచెను. పిమ్మట నా

భీష్ముఁడు సువర్ణభూషిత మగు కేడెమును, ఖడ్గమును బూని యెదుటఁ బడినమృత్యువునైన జయించువాఁడై వెడలునంతలో, నతఁడు రథమును దిగుచున్నపుడే యాతని కేడెమును ఖండించెను. అది గాంచువారి కద్భుతము గలిగించెను. పిమ్మట యుధిష్ఠిరుఁడును దనసైన్యములతో "ఓయోధులారా! గాంగేయునిపైకి వెడలుఁడు. ఇంచుకేని వెఱువవలదు." అని పలుక విని వారెల్లరును దోమరములును, ప్రాసములును, బట్టసములును, నిస్త్రింశములును, వత్సదంతములును మున్నగు నాయుధములచే నాతని నొప్పించుచు మార్కొనిరి. అంత నప్పాండవ బలమున ఘోర మగుసింహనాద ముప్పతిల్లెను. అటులే నీవారును భీష్మునకు జయము గోరువారై యాయర్జునుని మార్కొని సింహనాదములఁ గావించిరి. అపుడు నీవారికిని, పాండవులకును సంకుల మగుయుద్ధము జరిగెను. ఆపదియవనాఁటియుద్ధమున భీష్మార్జునసమాగమమున రెండు గడియలు తరంగిత మగుసాగరమువలె నారణరంగము గానవచ్చెను. ఆ యిరుసైన్యములును బరస్పరముఁ జంపికొనఁ బుడమి రక్తసిక్తమై యుండెను. అందు నిమ్నోన్నతము లించుకేనిఁ గానఁబడవయ్యెను. అటు లానాఁడు పదివేవుర యోధులను జంపి యతఁడు మిగిలినవారి మర్మములను భేదించి యూరకుండెను. పిమ్మట నాసైన్యమున నిలిచి పార్థుఁడు కురుసైన్యములఁ జెదరఁగొట్టె, మేమా శ్వేతవాహనుఁ డగు నర్జునునకు జడిసి పరువులు వెట్టితిమి. అటులే సౌవీరులును, గితవులును, ప్రాచ్యులు, ప్రతీచ్యులు, ఉదీచ్యులు, మాలవులు, నభీషాహులు, శూరసేనులు, శిబులు, వసాతులు, సాళ్వులు, శయులు, త్రిగర్తులు, అంబష్ఠులు, కైకయులు మున్నగు వారెల్లరును నర్జునశరపీడితులై, యాతనితో యుద్ధముచేయుచున్న భీష్ముని విడిచిపోయిరి. పిదప నాగాంగేయు నలుగడలఁ బెక్కురు చుట్టికొని కౌరవులను లక్ష్యముసేయక శరపరంపరల గుఱియ నారంభించిరి. అపు డాభీష్మునిరథముకడ "యుద్ధము చేయుఁడు, పడఁద్రోయుఁడు, విడువకుఁడు." అను మున్నగుశబ్దములు వినవచ్చెను. ఓరాజా! నాఁటియుద్ధమున నాతనిమేను రెండంగుళములేని యవకాశములేక యెల్లయెడలును భిన్నమైయుండెను. ఇటులు నీతండ్రి తీవ్రము లగు ఫాల్గునశరపరంపరలచే శిథిలితాంగుఁడై కొంచెము దినశేషముండఁగనే నీకొడుకులెల్లఁ జూచుచుండఁగాఁ దూర్పుగాఁ దల

నిచి రథమునుండి పడియెను. అటులు భీష్ముఁడు రథమునుండి పడినతత్ క్షణమ దేవతలయు, రాజులయు హాహాకారము లాకసమున జనించెను. అపు డాగాంగేయునితో నెల్లవారిహృదయములును బడినవి. మహా చాపుఁ డగునతఁడు విడువఁబడినయింద్రధ్వజమువలెఁ బుడమి వడఁకిం చుచుఁ బడియెను. కాని యతఁడు శరసంఘములచే సమావృతుఁడై ధర ణిని స్పృశింపకుండెను. అటులు శరతల్పగతుఁడై శయనించియున్న యాగాంగేయు నొకదివ్యభావ మావేశించెను. మేఘుఁడు వర్షించెను. పుడమి వడఁకెను. భాస్కరుఁడును దక్షిణముగాఁ బడుచుఁ గానిపిం చెను. కాలమును స్మరించి యామహావీరుఁడు తెలివి తెచ్చికొనియెను. ఆకసము నెల్లెడల దివ్యవాక్కులు వినవచ్చెను. మహాత్ముఁ డగుభీష్ముఁ డీ దక్షిణాయనమునఁ గాలముచేయు టెట్లనుపలుకులు వినవచ్చెను. అంత నది విని "నేను జీవించియే యున్నవాఁడను" అని పలికి యక్కురుపితా మహుఁ డగుభీష్ముఁ డుత్తరాయణము నపేక్షించుచుఁ బుడమిఁబడియుఁ బ్రాణములను ధరించియుండెను. పిమ్మట నమ్మహనీయునియింగితమును దెలిసికొని, హిమవంతునిపుత్రిక యగు గంగ మహర్షుల నందులకు హంసరూపముతో ననిపెను. అపుడు కడువడిగా నందుల కాహంస లా భీష్మునిఁ జూడవచ్చెను. అటు లాహంసరూపధారు లగు మహర్షు లచ్చో శరతల్పగతుఁడై యున్న యాగాంగేయునిఁ గాంచి భాస్కరుఁడు దక్షి ణాయనగతుఁడగుటఁ దలంచి వారొకరితో నొకరు "ఆహా! మహాత్ముఁ డగుభీష్ముఁ డిటులు దక్షిణాయనమునఁ గాలముచేయవలసివచ్చెనే? ఇది యెట్లు!" అని పలికికొనుచు దక్షిణదిక్కుఁబట్టి వెడలిపోయిరి. అపుడా గాంగేయుఁ డెంతయు ధీమంతుఁడగుట వారిం గాంచి చింతించి; "ఓ హంసరూపధారులగు మహర్షులారా! ఆదిత్యుఁడు దక్షిణాయనగతుఁడై యుండుట నే నెఱుఁగుదును. అతఁ డుత్తరాయణగతుఁడు కాఁగనే నా స్థానమును నేను బొందెదను. అంతవఱకు నాప్రాణములను నిలిపికొని యెదను. ప్రాణపరిత్యాగమనునది నాకధీనమై యుండుటచే నాకిపుడు చావు తటస్థించినను ప్రాణములను నేను నిలిపికొనఁగలను. నాతండ్రి నాకిట్టివర మొసంగెనుగాన నాతనివర మిపుడు సిద్ధింపఁ జేయు దును." అని పలికి యాతఁడు శరతల్పగతుఁడై యుండెను. మహా తేజస్వియై కురువులకు శృంగమునాఁదగు భీష్ముఁడు పడుటయుఁ బాండవు

లును సృంజయులును సింహనాదము లొనరించిరి. మహాపరాక్రముఁ డగు నతఁడు పుడమిఁ బడుటచే నీకొమరులు చైతన్యములు తప్పి యుండిరి. అపుడు కౌరవులందు సమ్మర్దము గలిగి వారెల్ల మోహావశులై యుండిరి. కృపుఁడు దుర్యోధనుఁడు మున్నగువా రేడ్వసాగిరి. పిదప మన యోధులు విషణ్ణులై యింద్రియచేష్ట లుడిగి యేదియో ధ్యానించువారై యుద్ధమున నుత్సాహము లేక యుండిరి. అవధ్యుఁ డగుభీష్ముఁ డటులు హతుఁ డగుటయుఁ గౌరవులు తొడలు స్తంభించి పాండవుల నెదు ర్కొనలేనివారైరి. అపుడు కౌరవుల కభావము సిద్ధమయ్యెను. అటులు సవ్యసాచితీవ్రనారాచహతుల మై యతనికోడి హతవీరుల మై యేమి చేయవలెనో మేము తెలియఁజాల మైతిమి. పాండవు లటులు జయము వడిసి శంఖములను బూరించిరి. సోమకులును బాంచాలురును సంతు ష్టాంతరంగులైరి. పిదపఁ దూర్యనాదము లారంభమగుడు, మహాబలుఁ డగుభీముఁడు మల్లచఱచి సింహనాద మొనరించెను. అటు లామహా వీరుఁడు హతుఁడగుడు నిరుసైన్యములందును గలవీరులు శస్త్రాస్త్రములను విడిచి యేదియో చింతించుచు నుండిరి. కొందఱు మొఱలుపెట్టిరి. కొంద అందుండి వెడలిపోయిరి. మఱికొందఱు మూర్ఛపడిరి. కొందఱు క్షత్ర ధర్మము నిందింపసాగిరి. అందఱును భీష్మునిఁ బూజించిరి. మహర్షులును బితృదేవతలును నాతనిఁ బ్రశంసించిరి. కురువృద్ధులును నాతని సన్ను తించిరి. అంత నాశాంతనవుఁ డౌపనిషదయోగమును బూని యుత్తమ కాల మపేక్షించి ప్రాణధారణము చేసియుండెను." అని తెలుప విని ధృతరాష్ట్రుఁడు మఱియు ని ట్లనియె.

దశమదివసయుద్ధావసానము

"ఓసంజయా! తనతండ్రికై బ్రహ్మచర్యమును బూని దేవ తుల్యుఁడై బలశాలియైన యామహావీరుఁడు భీష్ముఁ డటులు లేకుండుట సంభవించెనుగదా! అపుడు మనయోధు లెటులుండిరి? ఎపుడు శిఖండి యాఁడుదియని లజ్జచే భీష్ముఁడు వానిని బ్రహరింపకుండెనో యపుడే కౌరవులును దక్కినమనయోధులును మడిసిరని తలంచితిని. ఇంతకు మించినదుఃఖ మేమి గలదు? ఓసంజయా! ఇపుడు నాతండ్రి హతుఁ డగుట వినియుఁ దుర్మతినై యిటులుండుట నాహృదయము అాయి

యనఁదగియున్నది. లేనిచో నాచిత్తము నూఱుఖండములు గాకుం డునా? ఓసంజయా! జయేచ్ఛతోఁ బోరాడి తుదికి నిహతుఁడగు భీష్ముఁ డెట్లు చేష్టించెనో తెలుపుము. ఆహా! దివ్యాస్త్రములు గల జామదగ్న్యు నకును నోరువరానిభీష్ముఁ డిట్లు హతుఁడయినందులకు మఱిమఱి సహింపరానిచింత వొడముచున్నది. అయ్యో! శిఖండియా భీష్మునిఁ జంపుట?" అని పలువిధములఁ జింతించెను.

అది విని సంజయుఁ డాయాంబికేయునితో "ఓరాజా! నీతనయు లకు విషాదము గలుగ నాఁటిసాయాహ్నమున రణాంగమునఁ బడి పాంచాలురకు హర్ష మొదవించెను. అతఁడు శరతల్పగతుఁడై పుడమిని స్పృశింపకుండెను. అటులు భీష్ముఁడు రథమునుండి జాఱి ధరణీతలగతుఁ డగుడు భూతములలో హాహాకారము లుప్పతిల్లెను. కౌరవులకు సీమా వృక్షమగు శాంతనవుఁడు నేలఁగూల నుభయసైన్యములందును గలక్షత్రి యులకు వెఱపు గలుగఁజొచ్చెను. కవచధ్వజములు ధ్వంసమై ప్రతా పముచెడి పడియున్నయప్పితామహు నారసి కౌరవులును బాండవులును నాతని సమీపించిరి. భాస్కరుఁడు తేజోహీనుఁడయ్యెను. చీకఁటు లావ రించెను. అతఁడు హతుఁడగుటకు ధరణియు మొఱవెట్టెను. అటులు పడి యున్న యాతనిఁ గాంచి భూతము 'లాతఁడు బ్రహ్మవేత్తలలో నుత్త ముఁ'డని సంభాషింపఁజొచ్చెను. అటులే మునులును 'ఈమహనీయుఁడు కామార్తుఁడైన తండ్రియాజ్ఞ ననుసరించి తన్నూర్ధ్వరేతసునిఁగా నొన ర్చెను.' అని పలుకఁ జొచ్చిరి. హతుఁడై యతఁడు పడినతోడనే నీ పుత్రులు తెలివితప్పి శోభాహీనులై విషాదము తమ్మలమికొన లజ్జాభార ముచే మొగములు వాంచి యుండిరి. పాండవులు జయమువడసినవా రగుట సేనాముఖమున నిలిచి సువర్ణభూషితము లగు తమతమశంఖము లను బూరించిరి. హర్షము ప్రకటితమగునట్లుగాఁ బాండవసైన్యమునఁ దూర్యారావము లుప్పతిల మహానందముతో గంతులువైచుకొంతేయ మధ్యమునిఁ గాంచితిమి. మనవారిలో నెంతయు సమ్మోహ మావహి ల్లెను. కర్ణదుర్యోధనులు మఱిమఱియు నిట్టూర్పులు పుచ్చిరి. కురుపితా మహుఁడు పుడమిఁ గూలినందుల కమితముగా నెల్లభూతములందును హాహాకారములు జనించెను. అప్పుడు నీకొడుకు దుశ్శాసనుఁడు తన

యన్నయానతిచే నిజసైన్యముతోఁ గడువడిగా ద్రోణుఁడున్న కడకుఁ బోవెడలెను. అటులు వెడలిన యాతనిఁ గాంచి కౌరవులెల్లరును నాతనిఁ జుట్టుకొని ద్రోణుఁ డాతనితో నేమి పలుకునో యని విన నుత్సాహము గలిగియుండిరి. అపుడు దుశ్శాసనుఁడు ద్రోణునితో భీష్మునిమరణమును దెలుప నప్రియ మగు నవ్వార్తను వినినతోడనే యతఁడు రథమునుండి పడిపోయెను. అంతఁ గొంతవడికిఁ దెలివినొంది ప్రతాపనిధియగు ద్రోణుఁడు తనసైన్యములను నివారించెను. అటులు కౌరవసైన్యములు మఱలుటను జూచి పాండవులును నడిగలగుఱ్ఱములతో దూతలను నలువైపుల కనిపి దమసైన్యమునకు నైతము మఱలించికొనిరి. ఓరాజా! పిమ్మట యోధులెల్లరును కవచములు విడిచి యుద్ధమునుమాని భీష్ముని సమీపించిరి. మున్ను ప్రజాపతిని సమీపించిన దేవతలువలె వారపుడు చూపట్టిరి. అటులు వారు వెడలి యాతని కప్పాండవులును గౌరవులును నభివాదనము లొనర్చి నిలువఁబడియుండిరి. అంత నక్కురుపాండవుల నారసి యాశాంతనవుఁడు వారితో, "ఓమహాభాగులారా! మీ కెల్ల స్వాగతమా? అమరసములగు మిమ్మెల్ల దర్శించుట మా కెంతయు సంతసమొదవెను." అని పలికి మఱియుఁ దనతల వ్రేలాడుచుండ, "ఓయీ! నాతల నిలువకున్నది. తలగడ నొకటి తెండు. నాకిందు." అని తెలిపెను. అంత నానృపాలు రెల్లరును మెత్తనై సన్ననియుపధానములు తెప్పించి సమర్పించిరిగాని వాని నాతఁ డొల్లక వారి నారసి నగుచు, "ఓపార్థివులారా! వీరశయ్యను శయనించినవారి కిట్టియుపధానము లర్హములు గావు." అని పలికి పాండవమధ్యమునితో "ఓయీ! ధనంజయా! నాతల వ్రేలాడుచున్నది. కావున నాకిప్పు డుపయుక్త మనఁదగు నుపధానమొకటి సమకూర్పుము." అని పలికె"నని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

### భీష్మునకుఁ దలగడను గల్పించుట

"ఓరాజా! అటు లాశాంతనవునివచనమును విని యర్జునుఁడు తనధను వెక్కుడిగిచి యాతని కభివాదన మొనర్చి కనుల నీరునించుచు "ఓకురుసత్తమా! సెలవిమ్ము. నీకు నేను సేవకుఁడనై యున్నవాఁడను. ఇపుడు నాకుఁ గర్తవ్య మెద్దియో తెలుపుము." అని ప్రార్థించెను.

అంత నక్కురుపితామహుఁ డాపార్థునితో "ఓయర్జునా! నాతల వ్రేలుచున్నది. కావున నాకిపు డుపధాన మొకటి కల్పింపఁదగియున్నది. యుక్త మగుదానిని వడిగాఁ గల్పింపుము. ఎల్లధనుర్ధరులలో నుత్తముఁడవగు నీవు సమర్థుఁడవైనవాఁడవు. క్షత్త్రధర్మవేత్తవు. సత్త్వగుణాన్వితుఁడవు." అని పలుక విని యందులకు సమ్మతించి గాండివము పుచ్చికొని శరముల నామంత్రించి యాభీష్మునిసెలవుగొని తీవ్రములై వడిగల మూఁడుబాణములనాఁటి వానిచే నాతనితల కుపధానముగా నొనర్చెను. అటులు తనయింగిత మెఱిఁగి యుపధాన మొనర్చిన యర్జునునివివేకమున కెంతయు నాశాంతనవుఁడు సంతసించి, యందుఁగలకౌరవుల నారసి యర్జునునితో "ఓపాండునందనా! నాశయనమున కనురూప మగుతలగడను గల్పించితివి. ఇటులుగాక నీవు వేఱొకవిధముగా నొనర్చితివేని, నిన్ను శపించి యుందును. ఓమహాబాహూ! ధర్మపరినిష్ఠితుఁడై శరతల్పమును జేరినవాఁ డెవఁడైనను నిటులే శయనింపవలయును." అని పలికి యందుఁగల తక్కినవారి నారసి, "ఓరాజులారా! రాజపుత్త్రులారా! ఇపు డిప్పాండవమధ్యమునిచేఁ గల్పింపఁబడినయుపధానమును జూచితిరా! సూర్యుఁ డుత్తరాయణగతుఁ డగునంతకును నేనిందుఁ దలయుంచి శయనింతును. సూర్యుఁడు కుబేరదిశను బ్రవేశించినతోడనే నాకు మిత్రములై ప్రియములగుప్రాణములను విడుతును. నాయున్నచోటఁ జుట్టును నగడ్త నొకటి త్రవ్వింపుఁడు. ఇందు నే నొంటిమెయి నాయాదిత్యుని ధ్యానించుచు నుండువాఁడను. ఓపార్థివులారా! మఱియు నొకటి తెలిపెదను వినుఁడు. మీరిఁక వైరములను విడిచి సంగ్రామమునుండి మఱలుఁడు." అని తెలిపెను.

ఓమహారాజా! అంత నందులకు శల్యముల నుపాయముగాఁ బెఱుకఁ దగువైద్యులు వచ్చి వలసినసామగ్రులతో నిపుణముగాఁ దీయ సమకట్టి యుండిరి. అపు డప్పితామహుఁడు నీతనయుంగని "ఓయీ! ఈవైద్యులకుఁ దగుధన మొసఁగి గౌరవించి పంపుము. ఇట్టియవస్థనొంది యున్న నా కీవైద్యులతోఁ బ్రయోజన మేమి? క్షత్త్రియధర్మమూని యుత్తమగతి నొందియున్నవాఁడను. శరతల్పగతుఁడనై యున్న నా కిది ధర్మము గాదు. ఈ నామేన నాఁటినశరములతోడనే నన్ను దహింపవలయును." అని తెలుప నీకొమరుఁడును వైద్యులఁ దగురీతిగా గౌర

రించి సెలవిచ్చి పంపెను. అంత నందులకు వచ్చియున్న నానా దేశాధీశు లును తేజోనిధియగు నాశాంతనవు ధర్మనిష్ఠ కచ్చెరువడిరి. ఓరాజా! అటు లప్పాండవులును గౌరవులును వీరశయ్య కుపధానము గల్పించి, యాశయ్యనై నాతనిఁ జేరి యామహాసీయునకు ముమ్మారు ప్రదక్షి ణముచేసి నమస్కరించి చుట్టును నాతనికి రక్షణమొనర్చి యావీరులు దుఃఖితులై తమతమశిబిరములకుఁ బోయిరి. పిదప భీష్మపతనమునకు సంతుష్టాంతరంగులైయున్న పాండవులను సమీపించి, యదునాథుఁడు ధర్మజునితో "ఓపాండవాగ్రజా! నీభాగ్యవశమున జయము గలిగెను. భీష్ముని బడఁద్రోసితివి. అతఁడు మానవులకేగాదు దైవతములకును వధ్యుఁడు గానేరఁడు. మాపులచేతనే చంపవట్టి నీఘోరదర్శనముచే నతఁడు హతుఁడయ్యెను." అని తెలుప విని ధర్మజుఁ డాజనార్దనుతో "ఓదేవా! నీదయచే జయమును నీక్రోధముచేఁ బరాజయమును గలు గును. భక్తుల కభయదాతవగు నీవే మాకు శరణము. ఓకేశవా! నీ వెవ్వరి కపుదువో వారికి జయమగుటలో నాశ్చర్యమేమున్నది? నీవు మాకుఁ బ్రతిక్షణము రక్షకుఁడవై మాహితమును వెదకుచున్నవాఁ డవు. ఎల్లవిధముల నిన్నే యాశ్రయించినమాకు జయమగుటలో నాశ్చర్యమేమియును లేదు." అని పలికెను. అంత నాజనార్దనుఁడు నగుచు "ఓయుధిష్ఠిరా! నీభావమునకుఁ దగురీతిగాఁ బలికితివి. ఇది యుక్తముగనే యున్నది." అని పలికె"నని తెలిపి సంజయుఁడు మఱియు నాధృతరాష్ట్ర నితో ని ట్లనియె.

## భీష్ముఁడు దుర్యోధనుని శాసించి పలుకుట

"ఓమహారాజా! నాఁటిరాత్రి ముగిసి ప్రభాతమగుడుఁ బాండవు లును గౌరవులును మఱల నెప్పటివలెఁ బితామహునికడకు వచ్చి వీర శయనము నలంకరించియున్న యాతనికి నమస్కరించి సమీపమున నుండిరి. కన్యలు కొందఱు చందనచూర్ణమును లాజలను జల్లి మాల్య ములను వైచిరి. మఱియు స్త్రీలును, వృద్ధులును, బాలురును నాతనిఁ జూడఁగోరి వేలకొలఁదిగా నందులకువచ్చి భూతము లాదిత్యుఁ వలెనుత్సా హముతోఁ జూడఁదొడంగిరి. అటులే నటులును, నర్తకులును, గణి కలును వచ్చి తూర్యాదివినోదములను గావింప నారంభించిరి. శిల్పులును

నాతనిఁ జూడవచ్చిరి. కురుపాండవులును యుద్ధవిముఖులై యాయుధముల నొకచో నుంచి యా దేవవ్రతునిఁ జేరియుండిరి. అందుఁగల రాజలోకము తమతమప్రాయమును బట్టియుఁ బూర్వపరిచితిని బట్టియుఁ బరస్పరము ప్రీతిగలిగియుండ, క్షత్త్రియసహస్రములతో నిండి భీష్మశోభితమై యాసభ యెంతయు నలరారుచుండెను. మింట నాదిత్యుఁడు నా వెలయు నాగాంగేయునిఁ గొలుచుచు వారొప్పుగాఁ బ్రసంగించుకొనుచుండిరి. అప్పుడు వా రాయింద్రు నుపాసించు దేవతలునాఁ జూపట్టిరి. ఓమహారాజా! ఆభీష్ముఁడు ధైర్యమునుచే వేదనను సహించి, యురగము వలె నిట్టూర్పులు పుచ్చుచు శరతప్తశరీరుఁడై నోరెండుటను బానీయమునుగోరి రాజులను గాంచి, "ఓక్షత్త్రియులారా! నాకిపుడు పానీయము గావలసియున్నది." అని పలుక విని వారు పలువిధము లగు భక్ష్యములను జల్లనినీరుగల జలకుంభములను దెచ్చి యందుంచిరి. అది చూచి, యతఁడు "ఓసుయోధనా ! నాకిపుడు మానుషభోగములు భోగింపఁ దగినవిగావు. నేను మానవులనుండి తొలఁగి శరతల్పమున నున్నవాఁడను. ఉత్తరాయణమును గనిపెట్టి యున్నవాఁడను." అని తెలిపి వారి నాదరింపక, "ఓయీ ! అర్జునుఁ డిపు డెందున్నవాఁడు? వానిని నేను జూడఁగోరుచున్నవాఁడను." అనియుఁ బలికెను.

తత్క్షణ మందుల కా యర్జునుఁడు వచ్చి నమస్కరించి సవినయముగాఁ గేల్మోడ్చి నిలిచి, "ఓపితామహా! నే నేమి చేయవలయునో యానతిమ్ము." అని పల్కుచు నెదుటనుండ నాతని గాంచి యాగాంగేయుఁడు ప్రీతి వెలయ, "ఓయర్జునా ! నీశరప్రహారముల నాశరీరము పరితపించుచున్నది. మర్మములు నొచ్చుచున్నవి. నోరెండుచున్నది. ఇటులు పీడాయుతమైయున్న నాదేహమునకుఁ బానీయ మావశ్యక మైయున్నది. యథావిధిగా నాకుఁ బానీయ మొసంగఁదగువాఁడ వీవకాని వేఱొకఁడు లేఁడు." అని తెలిపెను.

అది విని యర్జునుఁ డందులకు సమ్మతించి రథ మధిరోహించి గాండీవము నెక్కిడెను. అప్పు డతఁ డొనర్చిన ధనుష్టంకారము పిడుగు చప్పుడునా నుప్పతిలుడు దానిని విని సైన్యములెల్ల జడిసిరి. అంత నాయర్జునుఁడు శరతల్పమున నున్న యాగాంగేయునకుఁ బ్రదక్షిణ మొనర్చి దీప్తిగల యొకశరము నభిమంత్రణపురస్సరముగా వింటసంధించి యందుఁ

పర్జన్యాస్త్రమును గూర్చి యెల్లవారు చూచుచుండఁగా నా భీష్ముని దక్షిణపార్శ్వమునఁ బుడమిని భేదించెను. వెంటనే యా భూవివరమునుండి నిర్మలమగు నొక వారిధార పైకి వెడలెను. దానిచే నయ్యర్జునుఁడు భీష్మ మహాత్మునకుఁ దృప్తి యొనరింప నట్టివానిని యద్భుతకృత్యమునఁ గాంచిన క్షత్రియులెల్లరును బరమాశ్చర్యభరితులై యుండిరి. అమానుషవిక్రముఁడగు నా విజయుని యద్భుతకృత్యమును గాంచి కౌరవులెల్లరును, జలిచే నణఁకు నావులవలెఁ జలింపసాగిరి. మఱియు రాజులెల్లరును విస్మయపరవశులై యుత్తరీయములను గదల్పసాగిరి. శంఖదుందుభుల నాదములు జనించి సమ్మర్దముగా నుండెను. ఓ రాజా! భీష్ముఁడును నంతట ప్రీతిపడి రాజలోకము నెదుట నాయర్జునుతో నాతని గౌరవించువాఁడై, "ఓ మహాబాహూ! నీ యెడ నిది యొక చిత్రము గానేరదు. ఓ తేజోనిధీ! నీవు పురాణమహర్షివని నారదుఁడు తెలిపెను. వాసుదేవుని సహాయమున నద్భుతకర్మముల నాచరింతువు. ఓ పార్థా! దేవతలతోఁ గూడి నయింద్రుఁడును నిన్నెదుర్కొన నుత్సహింపఁజాలఁడు. సకలక్షత్రధర్మ మెఱిఁగినవారు నిన్నే ధనుర్ధరుఁగాఁ దెలుపుచున్నారు. ధనుర్ధరులలోఁ బ్రథమగణ్యుఁడవు. మానవులలో నుత్తముఁడవు. లోకమున మానవు లుత్తములు. పక్షులలో గరుత్మంతుఁడు మేటి. జలరాశులలో సాగరుఁడుత్తముఁడు. గోవు చతుష్పాత్తులలో నెన్నఁదగినది. జాతులలో బ్రాహ్మణుఁ డుత్తముఁడు. విలుకాండ్రలో నీవుత్తముఁడవు. ఇవియెల్ల నేనును విదురుఁడును దెలిపియుంటిమి. కాని దాని నా దుర్యోధనుఁడు చెవిఁబెట్టలేదు. అటులే ద్రోణుఁడును, బరశురాముఁడును, జనార్దనుఁడును, సంజయుఁడును దెలిపిరి. విపరీతబుద్ధియును వివేకహీనుఁడును నగు నీ దుర్యోధనుఁడు వాని నెంతమాత్రము విశ్వసింపఁడయ్యెను. శాస్త్రము నుల్లంఘించిన వాఁడు బలిమిగలవారి కోపవహ్నికిని నిహతుఁడై పడక మానఁడు" అని తెలిపెను.

అది విని కౌరవేంద్రుఁడగు సుయోధనుఁడు దీనమానసుఁడై యుండెను. అంత నా శాంతనవుఁ డా సుయోధను నాలోకించి "ఓ రాజా! నే నొకటి తెలిపెదను. తెలిసికొనుము. శోకరహితుఁడవగుము. ఓ సుయోధనా! సుగంధబంధురమై చల్లనైన యీ జలధార నర్జునుఁడు జనింపఁజేయుట నీ కన్నులారఁ జూచితివిగదా! ఇట్టి యద్భుతకృత్య మొన

రించువాఁడు లోకమున నెవ్వఁడేనిఁ గలఁడా? మఱియు నితఁ డాగ్నేయ వారుణవైష్ణవపాశుపతాది దివ్యాస్త్రములనెల్ల నెఱిఁగినవాఁడు. మానవ లోకమందెల్ల శస్త్రాస్త్రపారగుఁ డగువాఁ డీధనంజయుఁ డొక్కఁడే, అటులే దేవకీపుత్త్రుఁడగు శ్రీకృష్ణుఁడును వీనినెల్ల నెఱిఁగినవాఁడు. వీరి దప్పనొక్క వేఱొకరు మహాస్త్రములనెల్ల నెఱిఁగినవారు లేరు. సురాసురులకును నిప్పార్థుఁ డోడవరానివాఁడు. వీనియద్భుతకృత్యములను నీవు చూచియే యున్నవాఁడవు. కావున సత్యవంతుఁడును, యుద్ధకుశలుఁడును, శూరుఁడు నగు నిప్పార్థునితో జాలము సేయక సంధిసేయుట నీకు మేలు. ఓకురుసత్తమా! మహాబాహుఁడగు శ్రీకృష్ణుఁ డెంతవఱకుఁ బార్థునకు స్వాధీనుఁడై యుండునో యంతవఱకును బార్థునితో సంధిసేయుటయ నీకుఁ దగినది. మఱియు హతశేషు లగుక్షత్త్రియులును, సోదరులును నాతనికిఁ గలిగియున్నంతకును నీవాతనితో సంధిచేసికొనుట మేలు. యుధిష్ఠిరుఁడు క్రోధపూరితేక్షణుఁడై నీసైన్యమును జూచి నన్నిసాళిలును నీ వాతని సంధిఁగోరుటయే మేలు. అటులే నకులసహదేవులును భీముఁడును నీసైన్యములను నశింపఁజేయనున్నపుడు నీవు వారితో సంధించుట శ్రేయమని నాయుద్దేశము. ఓనాయనా! పాండవులతోడి యుద్ధము నాయంతముతో నంతమొందింపఁ దగినది. కావున నీక శాంతంపుము. నాయీవచనము నీకు రుచించుఁగాక. ఇది నీకును నీవంశమునకును క్షేమమని తలంచెదను. కోప మిఁక విడిచి పాండవులతో సంధింపుము. అర్జునుఁ డొనర్చినది చాలును. ఇపుడు భీష్మాంతమగుటను మీకు వారితోఁ జెలిమియే మేలు. ఇప్పటికి మిగిలినవారైన జీవింతురు గాక. ఓరాజా! ఇఁకనేనిఁ బ్రసన్నుఁడవగుము. పాండవుల కర్ధరాజ్యమొసంగుము. ధర్మజుఁ డింద్రప్రస్థమున నుండుఁగాక. మిత్త్రులకు ద్రోహమొదవించి, నీచవారిలో నిందింపఁబడుట తగదు. అటులేని పాపమునకును నపకీర్తికిని బాలగుదువు. ఇట్టి నాయవసానమునందేనిఁ బ్రజలకు శాంతిగలుగుఁగాక. ప్రీతిగలిగి పార్థివులు పరస్పరముఁ గలియుదురుగాక. నా యీవచనమును వినకుందువేని, నీకుఁ గాలము సమీపించె ననుకొమ్ము. అంతమున దుఃఖింతువు. సత్యము దెలుపుచున్నవాఁడను.” అని తెలిపెను. ఓరాజా! ఇటులు కేవలము సుయోధనుని యెడఁ గలప్రేమచే నాతనికి హితముపదేశించి, శల్యములు తప్పమిన్న

ములఁబీడింప, వేదన నెటులో యోర్చుచు నూరకుండెను. ధర్మార్థసహితమును, హితమును, ననామయము నగు నాతనివచనములు వినియు, నీకొమరుఁడు చావనున్నవాఁడు మందునువలె, వానిని సమ్మతింపఁడయ్యెను" అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## భీష్మకర్ణులసంభాషణము

ఓయాంబికేయా! అటులు శాంతనవుఁడు తెలిపి శాంతించుటయు, రాజులెల్లరును దమతమనివాసములకు వెడలిపోయిరి. అంత నా శాంతనవుపతనమును విని, కర్ణుఁ డించుక వెఱపొదవఁ గడువడిగా నాతనికడకేగి శరతల్పగతుఁడగు నామహాత్ముని దర్శించెను. అపు డాభీష్ముఁడు, జన్మశయ్యపై నిమీలితాక్షుఁడై పరున్నకుమారస్వామినాఁ గర్ణునకుఁ గానవచ్చెను. అంత నా రాధేయుఁ డాతనిఁ గాంచి, విధేయుఁడై కనుల నుండి నీరు కాలువలు గట్టుచుండ నాతనికి నమస్కరించి "ఓమహానుభావా! నేను రాధేయుఁడను. నీకోపమునకుఁ బాత్రుఁడనైనవాఁడను. నిన్ను దర్శింపవచ్చితిని. ఇదె చూడుము" అని పలికెను.

అది విని యక్కురుపితామహుఁడు, మెల్లగాఁ గన్నులు విప్పి చూచి యందున్నపరిచారకులఁ బొమ్మని స్నేహపురస్సరముగా నాతని గౌఁగిలించుకొని, "ఓరాధేయా! నీవు నాపై నసూయవూని యున్నవాఁడవు. ఇపు డిటులు వచ్చి నన్ను దర్శింపవైతివేని నీ కమంగళము తప్పక గలిగెడిని. ఓయీ! నీవు కుంతిపుత్రుఁడవుగాని రాధేయుఁడవు గావు. నీతండ్రి యధిరథుఁడు గాఁడు. నీజన్మవిధ మెట్టిదో వ్యాసుఁడును నారదుఁడును నాకుఁ దెలిపియున్నవారు. వారివచనములలో సందియము లేదు. నీవు నాకు శత్రుఁడవు గావు. నిజము తెలుపుచున్నవాఁడను. వినుము. ఓసువ్రతా! నీవు కారణము లేకయే పాండవులను నిందించుచుండుటను నీగర్వపరిహారమునకై నిన్నటులు దూలనాడితిని. నీవు ధర్మలోపముచే జనించుటను నీ కట్టిబుద్ధి గలిగెను. గుణవంతులకేని నీచుల నాశ్రయించుటనుబట్టి మత్సరబుద్ధి గలుగకమానదు. కావున నీవు సహవాసదోషముచే నక్కురుసభలో నటులు పలుమాఱులు పరుషముగా సంభాషించితివి. సమరాంగణమున నీవు చూపుపరాక్రమ మెట్టిదో నే నెఱుఁగనివాఁడను గాను. మఱియు నీశౌర్యమును, దానవిధమును,

బ్రహ్మణ్యతను దెలిసినవాఁడను. నిన్నుఁబోలినవీరుఁ డెవ్వఁడును లేఁడు. నీ వమరతుల్యుఁడవు. అయినను నీవలనఁ గులమువారికి భేదము గలుగు టను నిన్నటులు పరుషముగాఁ బలుకవలసివచ్చెను. నీవన్ననో శరప్ర యోగమందును, నస్త్రసంధానమందును, శరలాఘవమందును, నస్త్ర బలమునందును పార్థునితోడను గృష్ణునితోడను సరిపోలునవాఁడవు. ఓ కర్ణా! మున్ను నీవొక్కఁడవే ధనుర్ధరుఁడవై కాశిరాజపురమునకు వెడలి యాతనికన్నియను సుయోధనునకుఁ దేగా రాజులనెల్ల మర్దించితివి గాదే. అటులే బలశాలివై మున్ను జరాసంధునితోఁ బోరాడి వాని నోడించితివి. బ్రహ్మణ్యుఁడవు సత్యయోధివి. తేజోబలములచే దేవ తుల్యుఁడవైనవాఁడవు. యుద్ధమున మానవులు నీకు సరిగారు. నీపై నాకు మున్నుగలకోపమును విడిచితిని. పౌరుష మెన్నఁడును దైవము నతిక్రమింపఁజాలదు. వీరు లగు పాండవులు నీకు సోదరులు. కావున నీవు నాకుఁ బ్రియమొనర్పవాఁడవేనిఁ బాండవులతో సంధియొనర్పు కొనుము. పాండవులతోడి నీవైరము నాతో శాంతించుఁగాక. ఇఁకఁ బుడమిఁ గలక్షత్రియులెల్లరును సుఖింతురుగాక." అని పలికెను.

అది విని యక్కర్ణుఁడు "ఓమహాబాహూ! నీవన్న దెల్ల నిజము. దీనినెల్ల నే నెఱుఁగనివాఁడను గాను. నేను గుంతీపుత్త్రుఁడనేగాని సూతతనయుఁడను గాను. కుంతిచే విడువఁబడి సూతునిచేఁ బెనుపఁ బడినవాఁడనగుటఁ దెలియుదును. అయినను సుయోధనునిచ్చయైశ్వర్య మనుభవించినవాఁడనగుట వానికి వైఫల్య మొనర్ప నుత్సహింపను. వాసుదేవుఁడు పాండవులకుఁగా దృఢవ్రతుఁడై తన ధన, శరీర, పుత్త్ర కీర్తులను వినియోగించునట్టులు, నేనును నాసర్వస్వమును సుయోధను నకై వినియోగించువాఁడను. క్షత్త్రియుఁడన్న వానికి రోగమువలనిమరణము జరుగరాదుగదా! నేను సుయోధను నాశ్రయించుటను బాండ వులతో నాకు నిత్యవైరము తప్పనిది. నీవన్నటులు పురుషకారము దైవము నతిక్రమింపనేరదు గదా! ఓపితామహా! ప్రజాక్షయమున కెన్నియేని దుర్నిమిత్తములు సూచింపఁబడెడిని. అయ్యవి మీరును దెలి యకపోలేదు. పలువురు సభలోఁ దెలిపికొనినవే గదా! పాండవులును వాసుదేవుఁడును గూడ, సాధారణుల కజేయులనుట నే నెఱుంగనిది గాదు. అయినను వారిని మార్కొని జయింతు ననునిశ్చయముతో

సుత్సాహము గలిగియే యున్నవాఁడను. దారుణ మగు నీమావైరము తప్పింపరానిది. నాక్షత్రియధర్మమున సుత్సాహము గలవాఁడనగుట నర్జునునితోఁ బోరాడకమానను. ఓపితామహా! యుద్ధమునకుఁ గృత నిశ్చయుఁడనై యున్ననామనవి నంగీకరింపుము. నీయనుజ్ఞ నడసి యుద్ధము చేయవలయునని నానిశ్చయము. నా యీవచనము దురుక్తిగాని, విరుద్ధముగాని, తొందరపాటుగాని, చాపలముగాని గావచ్చును. ఇందు నాతప్పుగలదేని క్షమింప నర్హుఁడవు." అని తెలిపెను. అంత నాశాంతనవుఁడు "ఓకర్ణా! దారుణ మగు పాండవులతోడివైరము విడువరానిదేని నేనంగీకరింతును. స్వర్గమునుగోరి యుద్ధమొనరింపుము. గర్వమును విడిచి శోకరహితుఁడవై క్షత్రియకృత్య మొనర్పుము. సజ్జనులలో నీవొకఁడవై నీయుత్సాహమునుబట్టి శక్తికొలఁదిగా వర్తింపుము. నే నీప్రార్థన మన్నించితిని. నీయిష్టముచొప్పునఁ బ్రవర్తిల్లుము. ధనంజయుని వలన నీవు క్షత్రియులకు లభించినవీరస్వర్గ మొందఁగలవు. నిరహంకారుఁడవై నీబలపరాక్రమములనుబూని యుద్ధమొనర్పుము. క్షత్రియుఁడైనవానికి ధర్మయుద్ధముకంటె శ్రేయోదాయక మగుమార్గము వేఱొండులేదు. ఓకర్ణా! సంధికై నేను జాలునంతవఱకుఁ దగుప్రయత్న మొనరించితిని. కాని దానిని ఫలింపఁజేయఁజాలనైతిని. ఇదియె నిజము." అని తెలుపఁగా నారాధేయుఁడు మఱియు నమస్కరించి ప్రసన్నునిఁ గావించి నీకొమరుఁ డగు సుయోధనునికడ కేగెను." అని సంజయుఁడు ధృతరాష్ట్రున కెఱిఁగించినవిధమంతయుఁ దెలిపిన విని మఱియు వైశంపాయనుతో జనమేజయుం డిట్లనియె.

భీష్మపర్వము సమాప్తము.

శ్రీ ర స్తు.

# శ్రీమదాంధ్ర వచనమహాభారతము

## ద్రోణపర్వము.

శ్లో. నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమం,
దేవీం సరస్వతీం చైవ తతో జయ ముదీరయేత్.

### ధృతరాష్ట్రుఁడు ప్రశ్నించుట

ఓ బ్రాహ్మణోత్తమా ! నిరుపమానతేజోబలవీర్యపరాక్రమశాలి యగు శాంతనవుం డటులు ద్రుపదపుత్త్రుఁ డగు శిఖండిచే హతుఁడగుట విని దుఃఖితుఁ డైనధృతరాష్ట్రుఁ డెట్లు ప్రవర్తించెను? ఆతనికొమరుఁ డగుసుయోధనుఁడు భీష్మద్రోణులు మున్నగురథికులసహాయముచే ధనుర్ధరు లగుపాండవుల నోడించి రాజ్యమునొంద నిశ్చయించియు, నందు సర్వధనుర్ధరోత్తముఁడగుభీష్ముఁ డటులు హతుఁడగుడు నాతఁ డేమియొనర్చెను? తెలుపుము. అని ప్రశ్నింప విని జనమేజయుం డిట్లనియె.

ఓజనమేజయా! జనాధినాథుఁ డగుధృతరాష్ట్రుఁడు తనతండ్రి మరణమును విని చింతావశుఁడై శాంతియనునది లేకయుండెను. అటులాశాంతనవునికై చింతించు నాతనిచెంతకుఁ బరిశుద్ధాత్ముఁ డగుసంజయుఁడు శిబిరమునుండి రా నాసంజయుని ధృతరాష్ట్రుఁ డిట్లు ప్రశ్నించెను.

"ఓసంజయా! నాతండ్రి యగుభీష్ముఁడు మరణించెనుగదా! ఆతనికై నాకొమరులు చింతించి పిదప నేమి యొనర్చిరి? మహాత్ము లగు నప్పాండవులసైన్యము లటులు విజృంభించి ముల్లోకములను వెఱపుగొలుపునుగదా! శూరుఁడై వైరిమారకుఁ డైన కురుపితామహుఁడు మడియుటను శోకసాగరనిమగ్ను లగునాతనయు లెటులు ధైర్యమొందిరి? సహాయులై వచ్చినరాజు లేమి యొనర్చిరి?"

అది విని సంజయుఁ డాజననాథునితో "ఓయంబికానందనా! శ్రద్ధమై వినుము. నీకొమరు లపు డేమియొనర్చిరో తెలిపెదను. అటు లాసత్యపరాక్రముఁ డగు భీష్ముఁడు హతుఁడగుటయు నప్పాండవులును, కౌరవులును గొంతవడి యేదోచింతించి, నిశ్చేష్టులై యుండి, యాతనికి శయ్యను గల్పించి యం దాతనికి రక్షఁ గూర్చి, మఱల సప్రదక్షిణనమస్కారపూర్వకముగా నాతనిసెలవొంది యొప్పటివొప్పు దప్పక కాల చోదితులై యుద్ధమునకుఁ దలపడిరి. పిదప నీవారియుఁ బాండవులయు సైన్యములు భేర్యాదితూర్యధ్వనులతో వెడలెను. ఓరాజా! నాఁటిపగలు మఱల గాంగేయుఁడుపడునంత ననంతకోపపరవశులై కాలము తమ్ముఁ బ్రేరేప నాయాపగానందను హితవచనముల నాదరింపక తమతమశస్త్రాద్యాయుధములను బూని వడిగా నక్కురుపాండవులు వెడలిరి. అపుడు నీపెద్దకొమరు నవివేకమునుండియు, భీష్మునివధమునుండియు మృత్యువు తమ్ముఁ బిలువ నక్కౌరవులు సకలక్షత్త్రియులతోఁ గూడి వెడలియుఁ గ్రూరమృగసంకులమైన వనమునఁ గాపరి యగు గోపుఁడు లేనిగొఱ్ఱెలవలె నెంతయు భీతిపడిన చిత్తములతో నుండిరి. కౌరవోత్తముఁ డగు నాగాంగేయుఁడు పుడమిఁబడునంత నక్కౌరవసైన్యము నక్షత్రహీన మగు నాకసమునుబోలియు, వాయుశూన్యమగునభము ననుకరించియుఁ జేను లేనిమేదినిఁ బోలియు నుండెను. మఱియు మనసైన్య మపుడు మున్ను బలి నిగ్రహింపఁబడఁగా దీనమైన యాతనిసైన్యమువలెఁ జూపట్టెను. ఆగంగాతనయుఁడు పడినపిదప మనసేన నారయఁగా సంస్కరింపఁబడనివాక్కును, బలిహీన యగుపడఁతిని, నీరు లేనినదిని, యూథపతి నశింపఁగా వృకనిరుద్ధమైన యాఁగు లేడినిబోలి శోభాహీనమై గాన వచ్చెను. వీరు లగుపాండవులకు లక్ష్యమై మిక్కిలి పీడింపఁబడుచు మన సైన్యమపుడు వాతహతమై మహార్ణవమగ్న మగునోడవలెఁ జలింపఁ జొచ్చెను. అటు లెంతయు వ్యాకులమైన గజాశ్వరథసమూహముతో వెఱపుగదిరిన మనసైన్యమున యోధులెల్లరును, నాశాంతనవుఁడు లేకుండుటను బాతాళమునకుఁ గ్రుంకువారివలెఁ జూపట్టిరి. ఓరాజా! అపుడు కర్ణుఁడు భీష్మతుల్యుఁడని యాతని స్మరించికొనిరి. మఱియు నతఁ డాపద్బంధుఁడనియు, సకలధనుర్ధరులలో నుత్తముఁడనియుఁ దలంచి, మనవారు తమచిత్తముల నాతనియందే నిలిపిరి. 'కర్ణా! కర్ణా!'

యని క్షత్రియులు మొఱలువెట్టసాగిరి. మనకై తనువునైనఁ బరిత్యజించు రాధేయుఁడు, గాంగేయుఁడు యుద్ధమొనరించు పదిదినములును యుద్ధముచేయననియెను. ఇపు డాకర్ణుని బంధ్వామాత్యసహితముగాఁ బిలిపింపుఁడు. జాలముచేయకుఁడు. ఎల్లరాజులును వినుచుండఁగా భీష్ముఁడపు డామహాబాహుని బరాక్రమశాలుల నెన్నుటలో నర్ధరథునిగాఁ బరిగణించుట నట్లు యుద్ధమునుండి మరలెను. అతఁడు శూరసమ్మతుఁడై మహారథులలో నొకఁడై యముకుబేరవరుణ దేవేశులతో సయితముఁ బోరాడఁదగువాఁడై యున్నను, నాతనిపైఁగలకోపముచే గాంగేయుఁడటు లవమానించెను. అందుల కోరువక యక్కర్ణుఁడు గాంగేయునితో "ఓభీష్మా ! నీవు జీవించియుండఁగాఁ బాండవులతో నేను బోరాడువాఁడనుగాను. ఒకపుడు నీచే నప్పాండవులు హతులగుదురేని దుర్యోధనునిసెలవొంది వనమునకుఁ బోవువాఁడను. లేదా నీవే పాండవులచే హతుఁడవై స్వర్గమునకుఁబోవుదేని నీవెవ్వరిమహారథులనుగా నెన్నితివో యట్టిపాండవులను నే నొకఁడనే చంపువాఁడను" అని పలికి యప్పది నాళులు నీపుత్త్రునిసమ్మతి వడసి యుద్ధము నొనర్పఁ డయ్యెను. అంత నాశాంతనవుఁడు సమరవిక్రాంతుఁడై కౌంతేయసైన్యముల రూపుమాపి యంతమొందుఁడు, సాగరమును దాఁటఁదలంచినవాఁ డోడనువలె నీకొమరు లాకర్ణు నపుడు తలంచిరి. మఱియు నీవారును క్షత్రియులును గర్ణుఁడువచ్చుట కిదె సమయమని తలంచి 'కర్ణా! కర్ణా!' యని యాక్రందన మొనర్చిరి. మఱికొందఱు 'ఆకర్ణుఁడు పరశురామునిఁ బ్రార్థించి యాతనిసెలవుగొని దుర్వారాస్త్రబలపౌరుషుఁ డైనవాఁడగుట మనల నెల్ల రక్షించుటకును నీభయమునుండి మనలఁ దప్పించుటకును దగిన వాఁ'డనియుఁ బలుకసాగిరి.

ఓజనమేజయా! అటులు సంజయుఁడు కర్ణునిఁ గీర్తించుటను విని, ధృతరాష్ట్రుఁడు మఱిమఱియు నిట్టూర్పులుపుచ్చుచు, నిట్లు ప్రశ్నించెను. "ఓసంజయా! సుయోధనునికై ప్రాణములనైనఁ బరిత్యజించు వానిఁగా నారాధేయు నెంచి యాతని నాశ్రయింపఁ దలంచిరిగదా! మనవారు తలంచినట్టు లాతఁడు నిజముగా నంతటిపరాక్రమశాలి యందువా? కానిమ్ము. ఆర్తులై వెఱచి, తనవలనిరక్షణము నపేక్షించుచు సోదరులతోఁగూడి తన్నుఁ బ్రార్థించుసుయోధనునిలోపము నతఁడు

పూరించునా? కౌరవుల కాశ్రయుఁడైనభీష్ముఁడు హతుఁడగుట వెఱచియున్న మనవారి కాతఁ డడ్డువడి, మనకుఁగల జయాశను ఫలింపఁజేయునా?” అని ప్రశ్నించెను.

కర్ణుని యుద్ధప్రయాణము

ఓయాంబికేయా! అటులు భీష్ముఁడు హతుఁడగుడు, కౌరవసైన్యము సాగరమధ్యమున భిన్నమగునోడవలెఁ జెడుటను దెలిసికొని, యక్కర్ణుఁడు నీపుత్రులలోఁ దాను నొకఁడై పరితపించుచు, వారి నెటులయినఁ దరింపఁజేయ నెంచి ధనుర్ధరోత్తముఁడై నీవారిసైన్యమును గాపాడుటకై వెడలెను. మఱియు నటులు సముద్రమునమునుఁగు నోడవలెఁ జలించు మనసైన్యమునకుఁ బుత్రులకుఁ దండ్రినాఁదగి కడు ప్రీతిమై వెడలి యక్కౌరవులతో నతఁ డిట్టులనియెను.

‘ఓకౌరవులారా! ఎవ్వనియెడ ధైర్యము, బుద్ధియు, బలపరాక్రమములును, సత్యము, శాంతియు, మున్నగుసద్గుణములు స్థిరములై యుండునో, మఱియు నెవ్వఁడు దివ్యాస్త్రవేత్తయై యసూయారహితమైన ప్రియవచనమునే పలుకునో యట్టిమహావీరుఁడు శాంతనవుఁడు ప్రశాంతినొందుటను, మనయోధులెల్ల నంతమొందిరనియే తలంతును. కర్మ మనిత్యమగుటను నీలోకమున నేదియు స్థిరముగాదుగదా! దృఢవ్రతుఁ డగు నాదేవవ్రతుఁడే హతుఁడు కాఁగా, నిఁక సూర్యుఁడు తేపుదయించునని నిశ్చయముగా నెవ్వరు చెప్పఁగలరు? వసువులతేజమున జనించి వసుప్రభావుఁడై వసుంధ రాధినాథుఁ డగుశాంతనవుఁ డావసువులలో లీనుఁడయ్యెను. ఇఁకఁ గౌరవులు తమవసువసుంధరాపుత్రాదులనుగూర్చియు సైన్యములనుగూర్చియుఁ బరితపింపవలసినదే.’

ఓయంబికానందనా! మహానుభావుఁడై వరదాతయై లోకేశ్వరుఁడై తేజోనిధియగుశాంతనవుఁడు పుడమిఁబడ గౌరవులు పరాజితులగుడుఁ, గర్ణుఁడు కనుల నీరుగార్చుచు నెంతయు నిట్టూర్పుపుచ్చెను. ఓరాజా! ఈరాధేయునివచనములను విని నీకొమరులును సైనికులును బరస్పరముఁ జేరి కనులనుండి నీరువిడుచుచు బిగ్గరగా మొఱవెట్టసాగిరి. మరల మహాసంగ్రామ మారంభమగుడు, సైన్యములు యోధులతో సన్నద్ధులగుడు, మనయోధుల కానందకరముగా వారితో నారాధే

యుఁడు 'ఓవీరులారా! నేనొకటి తెలిపెదను వినుఁడు. జగమనిత్యమై యెల్లపుడు పరువులిడుచుండ దృశ్యమగునదెల్ల నస్థిరమనియే తలంతును. మీరెల్ల నిటులుండిపోఁగొండనుబోలినకురుపుంగవుఁ డెట్లునేలఁగూలెనో చూచితిరిగదా! సూర్యుఁడు పుడమిఁబడినటులు మహారథుఁ డగుశాంతన వుఁడు పుడమిఁబడ నిఁక మనయోధులు కొండలనుసయితముఁగదలించు పెనుగాలిని జెట్లువలె నాధనంజయునిఁ గొంచెమే నోరువఁజాలరు. ప్రధా నుఁడు హతుఁడై యార్తినొంది హతోత్సాహమైయున్న యిక్కురు సైన్యము నామహాత్ముఁడగుభీష్ముఁడువలె నేను బాలించువాఁడను. నాతల పై మీరిట్టిభారమునుంచితిరి. అదియుఁగాక జగమనిత్యమని యెఱిఁగిన వాఁడను. యుద్ధమున మహావీరుఁడగు నాతఁడు పడుటఁ జూచితిని గదా! ఇఁక నాకీయుద్ధమున భయమన నేటికి? ఓసైనికోత్తములారా! కురూత్తము లగునప్పాండవులను దండధరునివీటి కనిపి ఘనతరకీర్తిని బడయువాఁడను. లేదా వైరిహతుఁడనై పుడమిఁబడువాఁడను. ధర్మాత్ముఁడగు యుధిష్ఠిరుఁడు బుద్ధిశాలి. భీముఁడు శతగజతుల్యపరాక్ర ముఁడు. ఇంద్రతనయుఁడగునర్జునునిమాట చెప్పనక్కఱయే లేదు.అతఁడు దేవతలకు దుర్జయుఁడైనవాఁడు. నకులసహదేవులు దండధరునిఁ బోలినవారు. మఱియు నాసాత్యకియు వాసుదేవుఁడును గలరు. అట్టి పాండవబలమునుజేరిన యెట్టివైరియు మృత్యుముఖమునుండివలె మఱ లుట దుర్ఘటము. తప ముత్తమతపముచే బాధింపఁబడునట్టులు, బలము బలముచే బాధింపఁబడును. నాచిత్త మెంతయు వైరినివారణమున దృఢ మైయున్నయది. నిశ్చయముగా వీరిప్రభావము నడంచి యిపుడు జయిం తును' అని పలికి మఱియుఁ దనసూతునితో 'ఓయీ! మిత్రద్రోహ మును సహింపఁజాలను. సైన్యము భగ్నమగుచున్నది. కావున నామిత్రు లతోఁగూడి యిపుడు వెడలవలసియున్నది. నాకుఁ గర్తవ్యమగుపౌరుష మిపు డొనర్చువాఁడను. ప్రాణములను నామిత్రకార్యమునకై యర్పించి, భీష్ము ననుగమించెదను. ఈమహాసంగ్రామమున వైరులనెల్ల నుఱుమాడె దను. లేదా వారిచేఁ జచ్చి వీరలోకమొందెదను. స్త్రీలును బాలురును నేడ్చుచుండఁగా ధార్తరాష్ట్రసైన్యము తిరస్కరింపఁబడుటను, శత్రు జయము నాకిపుడుకర్తవ్యమని తలంచుచున్నాఁడను. ఇపుడు కౌరవులను రక్షించుచుఁ, బాండవులను హింసించుటకుఁ బ్రాణములకైన వెనుదీయక

యీఘోరసంగ్రామమున నెల్లవైరులను జంపి, ధార్తరాష్ట్రులకు రాజ్యమును లభింపఁజేయువాఁడను. సువర్ణమయమును విచిత్రమునై శుభ్రమగుకవచము కూర్పబఁడుఁ గాక. మఱియు రత్నవిరాజిత మగుశిరస్త్రాణమును, సూర్యసమతేజము గలధనువును, నగ్నిని విషసర్పమునుబోలిన బాణములను సమకూర్పుము. అటులే శరపూరితము లగుతూణములను బదాఱింటిని సమకూర్చి, దివ్యము లగుపదాఱువిండ్లను దెప్పింపుము. మఱియు మహాస్త్రములగుశరములను శక్తులను గదలను సువర్ణచిత్రిత మగుశంఖమును సువర్ణమయమై విచిత్ర మగుశృంఖలను, జయప్రదమై నల్లకలువఁబోలినధ్వజమును సంఘటింపుము. మఱియుఁ దెల్లనిమేఘములనుబోలి బలిసి, మంత్రపూతోదకములచే స్నానము చేయింపఁబడిన మఱికొన్నిగుఱ్ఱములను దెప్పింపుము. వానికి సువర్ణమయము లగు నలంకారములను సంఘటించునది. చంద్రసూర్యప్రకాశము లగురత్నములచే నలంకరింపఁబడిన యుత్తమరథమును దెప్పించి, యుద్ధోపకరణములతోఁ గూర్పఁబడినగుఱ్ఱములను దానికిఁ గట్టింపుము. చిత్రములై వడిగలధనువులను యుద్ధసమర్థములగు నస్త్రైత్రాదులతోఁగూర్చి సిద్ధముగ నుంచుము. అటులే తూణములనిండ బాణముల నుంచుము. కవచములను సన్నద్ధమొనర్పుము. ఇంతయేల! మనయుద్ధప్రయాణమునకువలయు పరికరములనెల్ల సమకూర్పుము. మాలికను నంగమున బంధించి వడిగా జయభేరులను మ్రోగింపుము. భీమార్జునులును, ధర్మజనకులసహదేవులును నెందుందురో యందులకు మనరథమును బోనిమ్ము. నేనిఁక నీరణరంగమునఁగలిసి వారినెల్లఁ బరిమార్చెదను. లేదా వారిచే హతుఁడనై భీష్మనిమార్గ మనుసరించెదను. మఱియు ధైర్యశాలియు సత్యశీలియు నగుయుధిష్ఠిరుఁడును, భీమార్జునులును, వాసుదేవుఁడును, సాత్యకియు, సృంజయులును గలబలము సామాన్యులగు క్షత్రియులకు జయింపరానిది. ఆమృత్యు వెల్లవారిని హరించునదయ్యెను, సమరమున జాగరూకతతో నయ్యర్జునుని రక్షించుచుండును. అయినను వాని నీసమరమునఁ గలిసి చంపువాఁడను. లేదా భీష్మునివలె యమపురమార్గమును బట్టి పోవుదును. శూరులగు నప్పాండవులనడుమఁ బోనన్నమాట నాకెన్నఁడును గలుగదు. ఇదె నేనొకటి తెల్పుచున్నవాఁడను. మిత్ర

ద్రోహులును భక్తిశూన్యులునునగుపాపులు నాకు యుద్ధసహాయులుగా నక్కఱలేదు' అని తనయభిప్రాయ మెఱిఁగించెను.

ఓయాంబికేయా! అటులు పలికి దృఢమై కూబరముగలిగి సువర్ణభూషితమై సమృద్ధిగల యొకరథమునకు వడిగలగుఱ్ఱములను గట్టి ధ్వజమెత్తించి యక్కర్ణుఁడు జయార్థియై వెడలెను. ఓరాజా! అపు డాశాంతనవునంతదశలో నమ్మహాత్ముఁ డగుకర్ణుని మున్ను దేవత లింద్రుని వలెఁ గౌరవులు పూజింపఁగా గొప్పరథము నధిష్ఠించి యతఁడు ప్రతాపనిధియై యాదిత్యునివలె వెలుఁగుచు విమానము నధిష్ఠించినయింద్రుఁడునా విరాజిల్లుచుండె" నని తెలిపి మఱియు ని ట్లనియె.

కర్ణుఁడు భీష్మునితో సంభాషించుట

"ఓరాజా! తేజస్వియయ్యు మహావాతసమూహముచే శోషితమగు సాగరమునాఁ జూపట్టుచు శరతల్పమున శయనించియున్న సకలక్షత్త్రియాంతకుఁడును బూజ్యుఁడును గురుపితామహుఁడునగు భీష్మునిఁజూచి 'ఆహా! ఇట్టిమహనీయునిసయితము తనదివ్యాస్త్రములచే నర్జునుఁడు పుడమిఁ బడఁద్రోసెనే! ఇఁక మనకు సుఖమును, జయాశయు నెట్లు? అగాధసాగరమున మునిఁగి యొడ్డుచేరలేనివానికి ద్వీప మట్టులు రక్షకుఁడైన యితఁ డిటులు హతుఁడయ్యెనే! యమునాప్రవాహముచేవలె నితఁడు శరపూరముచేఁ బూరింపఁబడియున్నవాఁడు. మహేంద్రునిచేఁ గూల్పఁబడిన మైనాకమువలెఁ గన్పట్టుచున్నవాఁడు. ఆకసమునుండి తొలఁగి పుడమిఁబడినయాదిత్యునివలెఁ గానవచ్చుచున్నవాఁడు. మున్ను వృత్రునిచే జయింపఁబడిన యింద్రునివలెఁ జూపట్టుచున్నవాఁడు. ఈ భీష్మునిపతనము సకలసైన్యములకును వెఱపుగలిగించెడిని. ఇతఁడు సర్వసైన్యములకు నగ్రణియై సకలధనుర్ధరులకును ధ్వజమువంటివాఁడు' అని తలంచు నీపుత్త్రులకు జయాభిలాష క్షీణించెను. అట్టిశాంతనవు నాశరతల్పమునఁజూచి కర్ణుఁడు మోహావిష్టుఁడై రథముడిగి బాష్పాకుల నేత్త్రుఁడై కాలినడకతో వెడలి చేతులు మొగిడ్చి నమస్కరించి సన్నుతించుచు నిట్లు పలికెను.

'ఓకురుపితామహా! నేనిదె కర్ణుఁడను. నాకు భద్రమగునటు లాశీర్వదింపుము. పవిత్రమును, శుభప్రదమునగు నీవచనముచే నన్ను మన్నించి

దయాదృష్టితో నవలోకింపుము. ఓమహానీయా! ధర్మపరుఁడవై వృద్ధుఁడ వగు నీవిటులు పుడమిఁబడుట నరయఁగా సుకృతఫల మిాలోకమున ననుభవింపఁబడదనుట నిశ్చయము. ఓకురుసత్తమా ! కోశమును సంపాదించుటయందును నాలోచనమందును దక్షుఁడవు. వ్యూహరచనము నీసొమ్ము. నానావిధప్రహారణములందును నీయట్టివాఁ డెందును లేఁడు. పరిశుద్ధబుద్ధివై కౌరవులను భయమునుండి తప్పించినవాఁడవు. క్షత్రియ ధర్మము ననుసరించి బహువిధముల యోధులను గొట్టితివి. ఇఁకఁ బితృలోక మొందుదువు. ఇదిమొదలు పాండవులు మృగములను జంపుబెబ్బులులువలెఁ గుపితులై కౌరవక్షయ మొనర్చుటకై గడంగక మానరు. ఇపుడు సవ్యసాచిగాండీవఘోషముసార మెఱిఁగినకురువులు వజ్రపాణి కసురులువలె గాండీవికి జడియక మానరు. ఇఁక గాండివప్రముక్తములై పిడుగులునాఁదగు బాణములచప్పుడులు కౌరవులను నింకనుగల రాజులను బెదరింపకమానవు. ఓవీరాగ్రేసరా! పెక్కుమంటలతోఁగూడిన ప్రజ్వలితాగ్ని వృక్షములనువలె నర్జునునిశరపరంపరలు కౌరవులను దప్పక దహించును. గాలియు నగ్నియుఁ గూడి యెందెందు వ్యాపించునో యందందుఁగల తృణగుల్మద్రుమాదులను దప్పక యవి దహింపక మానవుగదా ! పార్థుఁడు ప్రజ్వలితాగ్నియగుటలో సందియములేదు. అటులే కృష్ణుఁడును వానికి సహాయుఁడై గాలిని బోలినవాఁ డనక తప్పదు. ఓకౌరవోత్తమా! పాంచజన్యధ్వనికిని, గాండివధ్వనికిని నీవారి సకలసైన్యములును జడియక మానవు. ఓవీరా! వైరిమారకుఁ డగునర్జునుని కపిధ్వజముగల రథముచప్పుడులను వినినవారిలో నీవుదక్కఁ దక్కినవా రెవరు సహింపఁగలుగుదురు? మఱియు నీవుతప్పఁ దక్కినరాజులెవ్వ రాయర్జునుని మార్కొనఁగలరు ? ఆయర్జునికృత్యము లద్భుతములని మనీషులగువారు తెలుపుచున్నారు. మఱియు నతఁడు మహాత్ముఁ డగుముక్కంటితో నమానుషసంగ్రామ మొనర్చినవాఁడు. సామాన్యులగువారికి దుర్లభమగువరమునుసయితము మాశంకరునిచేఁ బడిసినవాఁడు గదా! ఇంతయేల? బలశాలివైయు మాధవరక్షితుఁడగు నప్పాండుపుత్రుని నీవే జయింపలేక యోడినపుడు తక్కినవా రాతని జయించు టెట్లు ? ఆహా! సకలక్షత్రియాంతకరుఁడై దేవదానవులచేఁ బూజింపఁబడినపరశురాముని సైతము వీర్యశాలివై నీవు జయించితివి. అట్టి నిన్నాతఁడు

జయించినవాఁడు. యుద్ధకుశలుఁడైన యీ యర్జునుని నిపుడు నీసెలవుగొని జయించువాఁడను' అని పలికె" నని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

భీష్ముఁడు కర్ణు నాశ్వాసించుట

"ఓ రాజా! అటులు పలికిన యీ రాధేయునారసి యకౌరవోత్తముఁడగుభీష్ముఁడు సంతసించి, దేశకాలోచితముగా నాతనితో 'ఓకర్ణా! నదులకు సముద్రుఁడును, దేజములకు భాస్కరుఁడును, సత్యమునకు సత్పురుషులును, బీజములకుఁ బుడమియు, భూతములకుఁ బర్జన్యుఁడును నాశ్రయమైనట్టులు నీవు నీమిత్రుల కాశ్రయింపఁదగినవాఁడవు. ఇంద్రు నాశ్రయించిన దేవతలువలె నీబంధువులు నిన్నుఁ జేరికొని జీవింతురుగాక. మిత్రుల కానందమును వర్ధిలఁజేయుచు శత్రులమానమును జెఱుపుము. దేవతలకు విష్ణువువలెఁ గౌరవులకు నీవు రక్షకుఁడవైనవాఁడవు. మున్నీవు కౌరవుల ప్రియము గోరి, నిజబాహుబల మేర్పడ రాజపురమునకు వెడలి కాంభోజులను జయించితివిగాదే? అటులే గిరివ్రజవాసులగు నగ్నజిత్ప్రముఖక్షత్రియులును, నంబష్ఠులును, విదేహులును, గాంధారులును నీచే జయింపఁబడిరి. ఓకర్ణా! యుద్ధవీరులై హిమవద్దుర్గమున నున్నకిరాతులు నీమూలముననేగదా దుర్యోధనునకు వశులైనవారు. ఉత్కలులును, మేఖలులు, పౌండ్రులు, కళింగులు, నాంధ్రులు, నిషాదులు, త్రిగర్తులు, బాహ్లికులు నీచే జయింపఁబడినవారుగాదే? ఓవీరా! మఱియు నందందుఁగలవీరు లనేకులు దుర్యోధనహితాభిలాషివగు నీచే దండింపఁబడినవారు. దుర్యోధనుఁ డెటులు తనజ్ఞాతులకును బంధులకును బ్రియమైయుండెనో, యటులే నీవును గౌరవులకు గతివై ప్రియమొనర్పుము. నీకు భద్రమగుఁగాక యని పలుకుచున్నవాఁడను. కావున శత్రులతోఁ బోరాడఁబొమ్ము. రణరంగమునఁ గౌరవులను బాలింపుము. సుయోధనునకు జయము సమకూర్పుము. నీవును సుయోధనుఁడువలె మాకుఁ బౌత్రుఁడ వనఁదగినవాఁడవు. యౌనసంబంధమునుబట్టి సుయోధనునకు మేమెట్టులో నీకును నట్టివారమని తలంపుము. సజ్జనులతోడి స్నేహము మిక్కిలి యుత్తమమైనదని పెద్దలు తెలుపుదురు. సుయోధనుఁడు నీతోడిసత్యమగుసాంగత్యముగలవాఁడని నానమ్మకము. కావున

నాసుయోధనుఁడువలె నీవును గౌరవబలమును బాలింపుము' అని పలుక విని యక్కర్ణుఁ డాశాంతనవుపదపద్మముల కభివాదన మొనర్చి సకలధను ర్ధరులసమీపమును జేరి నిరుపమానమై యున్న మహాసైన్యమును జూచి తానును దానిఁ బూరించెను. అటులు సకలసైన్యములతోఁ గూడివచ్చి యున్న యారాధేయు నారసి కౌరవులెల్లరును బరమానందమంది మల్ల చఱచువారై సింహనాదములను ధనుష్టంకారములను గావించుచు నాతనిఁ బూజించి" రని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

కర్ణదుర్యోధనుల సంభాషణము

"ఓయాంబికేయా! అటులువచ్చి రథాధిరూఢుఁడై యున్నయా రాధేయు నారసి సంతుష్టాంతరంగుఁడై నీకొమరుఁ డాతనితో 'ఓ మిత్రమా ! నీచేఁ బాలింపఁబడిన మాసైన్య మిపుడు సనాథ మైనదని తలంచుచున్నవాఁడను. ఇపుడు మనసైన్య మెట్లు సమర్థమై యుండునో యట్టిహితమార్గమును నిశ్చయించి తెలుపు' మని ప్రశ్నించెను.

అది విని యక్కర్ణుఁడు 'ఓసుయోధనా ! నీవు మిక్కిలి ప్రాజ్ఞుఁడ వగుట హిత మూహింపఁదగినవాఁడ వీవే. కర్తవ్య మూహించుటలోఁ గుబేరునివలె నీయట్టివాని నెందును జూడలేదు. ఈపార్థివోత్తము లెల్ల రును నీవచనమును విన నిచ్ఛగలిగి యున్నవారు. ఆయుక్తమగు వచన మును నీవు పలుకవని నా నిశ్చయము' అని తెలిపెను.

అంత సుయోధనుఁడు మఱియు నక్కర్ణునితో 'ఓయీ! వయోవిక్రమములును శాస్త్రసంపదయుఁ దగియుండుటను, నెల్లయోధు లతోఁగూడి భీష్ముఁడు మనసైన్యములకు నాయకుఁడై పాలించియున్న వాఁడు. ఓకర్ణా! కీర్తినిధియగు నాతఁడు వైరిగణములను దునుమాడుచుఁ బదిదినములు యుద్ధ మొనర్చి మమ్ముఁ బాలించినమహాత్ముఁడు. అట్టిమహా త్ముఁడు దుష్కరమగుకర్మ మొనర్చి యిపు డిటులు స్వర్గము నలంకరింప నున్నవాఁడుగదా! ఇఁక మనసైన్యములకు నాయకుఁ డెవ్వఁడు గావలసి యుండునో తెలుపుము. నాయకుఁడు లేక సైన్య మొకనిమేషమైన నిలువఁజాలదు. రణరంగముల నాయకుఁడు లేనిసేన సాగరమునఁ గర్ణ ధారుఁడు లేని యోడవలెను, సారథిలేని రథమువలెను, దానియిచ్ఛ వచ్చినట్టులు పరువిడిపోవునుగాని సరిగా నడువదు. అగ్రేసరుఁడు లేని

సంఘము కష్టములపాలగునట్టులు, నాయకుఁడులేనిసైన్యము సకలదోష ములకును దానకమగుచున్నది. కావున నీవిపుడు మహనీయులగు నా వారిలోఁ దగువాని నొకని సేనానాయకునిఁగా నెంచుము. నీవెవ్వని నాయకుఁగాఁ దలంతువో వానినే మేమును సమ్మతించి వాని ననువర్తింతుము' అని యడుగ విని కర్ణుఁ డిట్లనియె.

'ఓరాజా! వీరెల్లరును మహనీయులే. వీరిలో నేవారును నీసైన్యాధిపత్యమునకుఁ దగినవారు కాకపోరు. కులము, రూపము, జ్ఞానము, బల పరాక్రమములును, బుద్ధియుఁ గలిగి కృతజ్ఞులును ధీమంతులు నై రణరంగమునఁ బరాఙ్ముఖులుగాక వీరెల్లరును పెంపువడసినవారే అయినను నొక్కమాఱుగా వీరినెల్ల నాయకులఁగా నొనర్చుట కనువుపడదుగదా! అటులగుట విశేషగుణములుగలవాఁ డొక్కఁడే యిపుడు నాయకుఁ డుగాఁ జేయఁదగినవాఁడు. అట్టిపట్టునఁ బరస్పరస్పర్ధగ వారిలో నొకని నాయకునిఁగాఁ జేయుదేనిఁ, దక్కినవారు తప్పక మనసుచెడి నీకు హితముగా యుద్ధమొనరింపరు. కావున, నెల్లయోధులకు నాచార్యుఁడును, వృద్ధుఁడును, బూజ్యుఁడును, సకలశస్త్రవేత్తలలో నుత్తముఁడును నగు ద్రోణుఁడే నాయకుఁడుగా నిపుడు నియమింపఁబడుట యుక్తమని నేను తలంచువాఁడను. బ్రహ్మవేత్తయై వైరిదుర్జయుఁడగు ద్రోణుఁ డుండఁగా నీతని విడిచి సేనానాయకునిఁగా వేఱొకని బరిగణించు టెట్లు? ఇది శుక్రబృహస్పతినీతినిబట్టి తెలిపితిని. ఈయెల్లరాజులందును సమరమునకు వెడలినద్రోణునిఁ బోలినవాఁ డెవ్వఁడు గలఁడు? ఓరాజా! సేనానాయకులందును, శస్త్రధారులందును, బుద్ధిమంతులందును నితఁడే యుత్తముఁ డైన వాఁడు. మఱియు నీకు గురుఁడు. కావున నీతననే సేనానాయకునిఁగా నొనర్పుము. అటులేని, మున్ను కార్తికేయుఁడు నాయకుఁడుగాఁగల దేవతలవలె మనసైన్యములు జయేచ్ఛగలిగి వర్తించును.' అని తెలిపె"నని చెప్పి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## దుర్యోధనుఁడు ద్రోణుని ప్రోత్సహించుట

"ఓధృతరాష్ట్రా! అపు డారాధేయునివచనములు విని సుయోధనుఁడు సేనామధ్యగతుఁడై యున్న ద్రోణునితో 'ఓగురూత్తమా! కులమును బట్టియుఁ, బుట్టువుపట్టియు, వయసు, శాస్త్రజ్ఞానము, బుద్ధిపరా

క్రమములు, సామర్థ్యము, అర్థజ్ఞానము, నయము, జయము, తపము, కృతజ్ఞత మున్నగు నీసద్గుణములనుబట్టియు, నీవే సేనాధిపత్యమునకుఁ దగియున్నవాఁడవు. రక్షకులందు నీతోఁ దుల్యుఁడగువాఁడు వేఱొకఁడు లేఁడు. మున్నమరుల నింద్రుఁడువలె నీవు మమ్మునెల్లఁ బాలింపుము. మా కీవు నాయకుఁడవై యుండ, వైరుల నోడింప నుత్సహించియున్న వారము. ఓబ్రాహ్మణోత్తమా! రుద్రులకుఁ గాపాలియు, వసువులకుఁ బావకుఁడును, యక్షులకుఁ గుబేరుఁడును, దేవతలకు నింద్రుఁడును, విప్రులకు వసిష్ఠుఁడును, దేజములకు భాస్కరుఁడును, బితరులకు యముఁడును, జలజంతులకు సముద్రుఁడును, నక్షత్రములకుఁ జంద్రుఁడును, రాక్షసులకు శుక్రుఁడునుబోలె మా కీవు సేనానాయకుఁడవై పదునొకండక్షౌహిణులఁ బాలించి మమ్ము వశ మొనర్చికొనుము. మఱియు నా యీపదునొకొండక్షౌహిణులను వ్యూహముగాఁబన్నికొని యింద్రుఁడు దేవతలనువలె నడిపించి శత్రులను వధింపుము. దేవతలకుఁ గుమారస్వామినా మాసైన్యముల కగ్రేసరుఁడవు గమ్ము. వైరులకుగ్రమై వెలయు నీధనువు మొఱయించుచు ముందునడువ వృషభము ననుసరించు సౌరభేయములువలె యుద్ధమున ననుసరించి వెడలుదుము. సేనానివై వర్తిలు నిన్నుఁ గాంచి యర్జునుఁడు ప్రహరింపఁజాలఁడు. ఓపురుషవ్యాఘ్రా! నీవు సేనాపతివైతివేని సంబంధిబాంధవులతోఁ గూడ ధర్మజుని సంగ్రామరంగమున జయింతును’ అని తెలిపెను.

ఓరాజా! ఇటు లాసుయోధనుఁడు పలుకఁగా నందలి రాజులెల్లరును సింహనాదము లొనర్చుచు, నీకొమరుని సన్నుతించుచు, ద్రోణుని జయ మొందుదువని ప్రోత్సహించిరి. సైనికులు సంతుష్టాంతరంగులై యాద్రోణునిఁ బ్రోత్సహించుచు దుర్యోధనునియశమును గోరుచుండిరి. ఓరాజా! అంత నాద్రోణుఁడు దుర్యోధనునితో నిట్లు పలికె” నని తెలిపి సంజయుఁ డిట్లనియె.

## ద్రోణునిపరాక్రమము

“ఓరాజా! పిమ్మట నాద్రోణుఁ డాసుయోధనుం గాంచి ‘ఓయీ! నేను షడంగములతోఁగూడిన వేదమును జదివియున్నవాఁడను. మనువు చెప్పినయర్థవిద్యలోఁ బూర్ణుఁడను. పాశుపతాస్త్రము మున్నగుపలు

విధములైనయస్త్రములను దెలియుదును. మీరు నాయందే యేగుణములుగలవని తెలిపితిరో వానినెల్లఁ బ్రకటించి జయాభిలాషులగుమిమ్ము సంతసింపఁజేయుచుఁ బాండవులతోఁ బోరాడుదును. ఓసుయోధనా! నన్ను వధించుటకై యానలువచే సృష్టింపఁబడినవాఁడగుట నాధృష్టద్యుమ్నునిమాత్ర మెటులయినను జయింపఁజాలను. సోమకులనెల్లఁ జంపుచు సైన్యములఁ బోరాడింతును. పాండవులు నాతోఁ బోరాడఁ జాలరు' అని తెలిపెను.

ఓయంబికానందనా! అటు లాద్రోణుఁడు పలికి తాను గౌరవ సేనాధిపత్యమును సమ్మతింప సుయోధనుఁడును నాతని సేనానాయకునిఁగా నొనర్చెను. మున్ను దేవతలు కుమారస్వామివలె క్షత్రియులెల్లరును నాద్రోణుని యథావిధిగా సైన్యాధిపత్యమున నభిషేకమొనర్చిరి. అంత నక్కౌరవసైన్యములు శంఖములయు వాదిత్రములయు చప్పుడులచేఁ దమహర్షమును బ్రకటింపసాగిరి. పిదపఁ బుణ్యాహవాచనములును, స్వస్తినాదములును, వందిమాగధుల సంస్తుతిగీతములును జెలరేగెను. అటులే బ్రాహ్మణుల జయశబ్దములును, నటులనర్తనములును బ్రవర్తిల్లెను. అపు డాద్రోణు నభిషేకించి పాండవు లోడినటులు మన వారు తలంచిరి. ఓయాంబికేయా! మహారథుఁ డగుభారద్వాజుఁ డటులు సైన్యాధిపత్యమువడసి యుద్ధాభిలాషియై వ్యూహ మేర్పఱచి నీకొమరులతోఁగూడి వెడలెను. సైంధవుఁడును, గళింగదేశాధీశుఁడును, వికర్ణుఁడును నాతనిదక్షిణభాగమునఁ గవచధారులై యుండిరి. అటులే శకునియు, నుత్తములగు కొందఱు రౌతులును ప్రాసాద్యాయుధపాణులై తన్నుఁగొలువఁ గృప,కృతవర్మ, చిత్రసేన వివింశతి, దుశ్శాసనప్రముఖులతో నాద్రోణునికి సవ్యపక్షరక్షకులై యుండిరి. తమతమపక్షము వారితో సుదక్షిణుఁడు మున్నగుకాంభోజాధీశులును గొప్పయేన్గులతోడను, గుఱ్ఱములతోడను వెడలిరి. యవనులతోఁగూడి శకులును, ముద్రులును, ద్రిగర్తులును, నంబష్ఠులును, బ్రతీచ్యులు, నుదీచ్యులును, మాలవులును, శిబులును, శూరసేనులును, మందులతోఁగూడి శూద్రులును, సౌవీరులును, గితవులు, ప్రాచ్యులు, దాక్షిణాత్యులును నాతని కెల్లెడల నుండిరి. నీకొమరుని బురస్కరించుకొని స్వసైన్యములకు నుత్సాహముగొల్పుచు, మఱియు వారికి బలముగలుగ సకలయోధులకు

ముందుగాఁ గర్ణుఁడును బయలువెడలెను. హ స్తికక్ష్యమై యెంతయు గొప్పరూపముగలిగి యొప్పు నాతనిమహాకేతువు కౌరవసైన్యములకు మోదము గలిగించెను. ఓ రాజా! ఇంతయేల! అక్కర్ణునిఁ గాంచి మన పక్షము రాజులును గౌరవులును భీష్మునిమరణమును గణింపక చింతవిడిచి సంతుష్టాంతరంగులై యుండిరి. మఱికొందఱు యోధు లొకచోఁగూడి యొకరితోనొకరు 'ఓయీ! సంగ్రామమునఁ గర్ణునిఁ గాంచిరేని పాండవులు నిలువక వెడలిపోవుదురు. అతఁడు వాసవుతోఁగూడిన దేవతలను సయితము సమరమున జయింపఁజాలినవాఁడు. హీనపరాక్రములగు పాండవులన నాతని కెంతటివారు? బాహుపరాక్రమశాలియయ్యు శాంతనవుఁడు పాండవులను దండింప కుపేక్షించెను. కర్ణుఁడన్నో తీవ్రశరపరంపరలచే నక్కౌంతేయుల నంతమొందించును' అని పలికికొని పరమానంద మొందసాగిరి. మఱియు రాధేయునిఁ బూజించువారై యాతనిఁ బొగడుచు వెడలిరి. ఓరాజా! నాఁడు ద్రోణుఁడు మనసైన్యములను శకటవ్యూహముగాఁ బన్నెను. పాండవులు క్రౌంచవ్యూహమును బన్నిరి. వారివ్యూహమునకు ముందుభాగమున వీరవరులగుకృష్ణార్జునులు వానరధ్వజమునెత్తి నిలిచియుండిరి. ఆయర్జునుఁ డెల్లసైన్యములకును భుజమూపురమువంటివాఁడు, సకలధనుర్ధరులకును దేజము. అమితతేజుఁడగు పార్థుని కపిధ్వజము మింటినంటి వెలయఁజొచ్చెను. యుగాంతమునఁ బ్రదీప్తుఁడగుసూర్యుఁడువలెఁ బుడమిఁ దపింపఁజేయుచు నాపార్థునిధ్వజము గానవచ్చెను. యోధులలో నర్జునుఁడు శ్రేష్ఠుఁడు. ధనువులలో గాండివ ముత్తమము. ప్రాణులలోనెల్ల వాసుదేవుఁడును, జక్రములలోనెల్ల సుదర్శనమును నుత్తమఖ్యాతి వహించియున్నవి. ఈనాల్గు తేజములునుగలిగి శ్వేతాశ్వములుగలరథము కౌరవుల కెదురుగా శత్రుసైన్యముల ముందుభాగమునఁ బ్రళయకాలచక్రమువలె నిలిచియుండెను. ఓరాజా! ఇటు లామహాత్ము లగు కర్ణార్జును లిరువురును రెండుసైన్యములకును ముందు నిలిచి యొకరినొకరు చంపుకొనందలంచువారై యుద్రేకముగలిగి యొకరినొకరు చూచికొనిరి. పిదప మహారథుఁ డగుద్రోణుఁడు వడిగా వెడలుఁడుఁ, బుడమి యార్తనాదముతో వడంకసాగెను. తత్క్షణము పెనుగాలిచే ధూళులు వెడలి యాకసము నాక్రమించెను. వానిచే భాస్కరుఁడు గ్రుంగుడువడియెను.

మేఘములు లేకయే యాకసము మాంసాస్థిరుధిరములను వర్షించెను. వేలకొలఁది గ్రద్దలు, రాబందులు, కాకులు, డేగలును సేనాసమీపమున మీఁదుగాఁ జరింప మొదలిడెను. అటులే భయంకరముగాఁ బక్షులును నక్కలును నఱవ నారంభించెను. ఆయపధ్వనులు మీసైన్యమున కప సవ్యముగా నొనర్పఁబడియెను. ఆగ్రద్దలు మున్నగునవి మాంసమును దినఁగోరియు, రక్తమును ద్రావఁగోరియు, నటులు మనసైన్యములసమీపమునఁ దిరుగువాఱెను. మఱియుఁ బ్రజ్వలించుచుఁ బిడుగులతోఁ గంపము పుట్టునట్లుగా సంగ్రామమును దనపుచ్ఛముచేఁ జుట్టి యుల్కాపాతము భయంకరమై కలుగఁజొచ్చెను. మనసేనానాయకుఁడు వెడలఁగనే మెఱుపులు మేఘములునుగలుగ గొప్పపరివేషము సూర్యునిఁజుట్టికొనియెను. ఓరాజా! ఇవియుఁగాక యింకను దారుణములగు పెక్కుత్పాతములు వీరులకు నాశకారణములై గానవచ్చెను. పిదపఁ బరస్పరవధము నభిలషించుకురుపాండవసైన్యములకు యుద్ధమారంభమై జగమునెల్లఁ జప్పుడులచేఁ బూరించెను. అపుడు పాండవులు కౌరవులపై విజృంభించి జయాభిలాషులై తీవ్రాస్త్రములతోఁ బ్రహరింపసాగిరి. అంత నాద్రోణుఁడు తేజస్వియై పాండవసైన్యమును శరపరంపరల ముంచుచు వడిగా వారిపై వెడలెను. అపు డటులు ద్రోణుఁడు తమ్మెదుర్కొనుటఁ జూచి పాండవులు సృంజయులతోఁగూడి వేఱువేఱుగా నాద్రోణునిపై శరవర్షమును గురిపింపసాగిరి. అంత నాద్రోణునిచేఁ బాంచాలసైన్యము భేదింపఁబడి కలఁతనొంది పెనుగాలిచేఁ గదలిన మేఘములువలె నలుదెసలకుఁ జెదరఁజొచ్చెను. పెక్కుదివ్యాస్త్రములను విస్తరిలఁజేయుచు ద్రోణుఁ డొకగడియలోఁ బాండవసృంజయసైన్యములకుఁ బీడ గలిగించెను. అటు లాద్రోణునిచే వారు మున్నింద్రునిచే దానవులువలెఁ బీడింపఁబడుటయు, ధృష్టద్యుమ్నుఁడు మున్నగు పాంచాలురు వడఁకసాగిరి. అపుడు దివ్యాస్త్రవేత్తయు మహారథుఁడు నగుధృష్టద్యుమ్నుఁడు వెడలి శరవర్షముచే ద్రోణసైన్యమును ముంచి యాతనిశరపరంపరను నివారించుచు బలశాలియై కౌరవులను వధింపసాగెను. అంత నాద్రోణుఁడును వెడలి తనసైన్యము బెదరకుండ నాపి యాధృష్టద్యుమ్నునిఁ దలపడి సమీపించి యాతనిపై శరపరంపరలఁ గురిపించెను. ఓరాజా! అపు డాద్రోణుఁడు మున్నింద్రుఁడు కుపితుఁడై

దానవులఁ దలపడుటను దలపించెను. ఆతని బాణప్రహారములకుఁ బాండవులును సృంజయులును గంపితులై సింహముచే నితరమృగములవలె మఱిమఱియుఁ బ్రహరింపఁబడుచు నచ్చిరి. ఓయంబికానందనా! అటులెంతయు నాభారద్వాజుఁ డప్పాండవసైన్యమును గలిసి యగ్నిచక్రమువలెఁ జరించుట చూచువారి కత్యద్భుతము గలిగింపఁజొచ్చెను. దేవనగరమునాఁదగి శాస్త్రీయముగా నిర్మింపఁబడినదగుట నెంతయు నలరి చలించుపతాకయు వడిగలగుఱ్ఱములునుగలిగి తెల్లనికేతువుతో వెలయు రథవరము నధిష్ఠించి వైరులకు వెఱపుగొలుపుచు నాద్రోణుఁడు శత్రుసేనలనడుమ విహరించెను" అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## ద్రోణవధవిధమును వినిపించుట

"ఓరాజా! గజాశ్వరథసారథులను వధించు నాభారద్వాజు నారసి పాండవులు చింతాక్రాంతులై యాతనిఁ జేర లేకుండిరి. పిదప యుధిష్ఠిరుఁడును ధృష్టద్యుమ్నధనంజయులను గాంచి, 'ఓవీరులారా! ఈద్రోణుని నివారింపుఁడు'' అని పలికెను. అంత వారిరువురును, మఱికొందఱు యోధులును నందులకు వడివడి నరుదెంచిరి. మఱియుఁ గైకేయులును, భీముఁడును, నభిమన్యుఁడును, ఘటోత్కచుఁడును, యుధిష్ఠిరుఁడును, నకులసహదేవులును, విరాటద్రుపదులును, శిఖండియు, ద్రౌపదేయులును, ధృష్టకేతువు, సాత్యకియుఁ, జేకితానుఁడును, యుయుత్సువు, మఱియుఁగలపార్థివులును నర్జును ననుసరించియుండి, తమతమ బలపరాక్రమముల కనురూపముగా నద్భుతకర్మ మొనర్చువారైరి. అటులు పాండవులచే నెంతయు సురక్షితమైయున్న యాసైన్యము నారసి యాభారద్వాజుఁ డెంతయుఁ గినుకవోడమఁ గనులుత్రిప్పి పెనుగాలిమబ్బులనువలెఁ బాండవసైన్యమును బీడింపఁదొడఁగి, గజరథాశ్వపదాతులను బరువులిడఁజేయుచుఁ దాను ముదుసలియయ్యు యువకుఁడునాఁ జరింపనారంభించెను. వఢిగలిగి రక్తసిక్తాంగములై సహజారుణములగు నాద్రోణునిగుఱ్ఱములు విశ్రాంతిలేకయు నెమ్మదిగాఁ బనిచేయుచుండెను. పిమ్మట నటులు కుపితుఁడై నయముఁడునాఁ జూపట్టు నాద్రోణునిఁ గాంచి పాండవయోధులెల్లరును నాతని మార్కొన వెడలిరి. అపుడటులు

పరువులిడునట్టియు, మఱియు మఱలునట్టియుఁ, జూచుచుండునట్టియు, నిలిచియుండునట్టియు యోధులచప్పు డెంతయు దారుణమై వినవచ్చెను. అయ్యది శూరులగువారికి హర్షమును భీరులగువారికి భయమును గలిగించుచుఁ, బుడమిని నాకసమును వ్యాపించెను. మఱియు నా ద్రోణుఁ డారణరంగమునఁ దనపే రెల్లెడల వెడల శరపరంపరలు పఱపుచు రౌద్రాకారుఁడై ప్రవర్తిల్లెను. ఓరాజా! అటు లా ద్రోణుఁడు పాండవ సైన్యమునఁ జరించుచు ముదుసలియయ్యు యువకునివలె బలము వెలయించుచుఁ, గాలరూపుఁడై శిరములనఱుకుచు, బాహులఁ దెగనేయుచు, రథమధ్యభాగములను శూన్యముగా నొనర్చుచు, సింహనాదము లొనర్పసాగెను. ఓరాజేంద్రా! ఆతనిహర్ష ధ్వనులకును, బాణవేగమునకును యోధులెల్లరును గడగడ వడఁకుచుఁ, జలిబాధ కోరువనిగోవులునాఁ జూపట్టిరి మఱియు నాభారద్వాజునిరథఘోషమువలనను ధనుష్టాంకారమువలనను నాకసమున గొప్పచప్పు డుదయించెను. పిదప నాతని ధనువునుండి వేలకొలఁది బాణములు వెడలఁజొచ్చెను. వెంటనే గజ రథాశ్వపదాతు లెల్లెడల నేలఁగూలసాగెను. అపు డట్టిధనుర్వేగమును మహాస్త్రాగ్నిని వెలయించు నా ద్రోణునిఁ బాంచాలురును బాండవులును దలపడిరి. అటులు తన్నెదుర్కొనిన యాపాంచాలుర గజరథాశ్వాదుల నా ద్రోణుఁడు పరిమార్చుచు, నచిరకాలమున రణరంగమును రక్తసిక్తము గావించెను. మహాస్త్రములను బ్రయోగించునట్టియు, శరపరంపరల సంధించునట్టియు నా ద్రోణునిచే నెల్లదెసల బాణజాలము నింపఁబడియెను. పాండవసైన్యమునఁ గల గజరథాశ్వపదాతులను బరిమార్చు నాతని కేతు వెల్లెడలఁ జూపట్టెను. మఱియు నతఁడు కైకయులేవురను బాంచాలరాజును శరవర్షమునఁ బీడించి మహాబలుఁడై పాండవసైన్యముపైఁ గార్ముకపాణియై వెడలెను. అపు డా ద్రోణునిపై భీమార్జునులును, సాత్యకియు, ధృష్టద్యుమ్నుఁడును, శైబ్యుఁడును, గాశిరాజును దమతమయుత్సాహములకొలఁది శరవర్షమును గురియసాగిరి. అపు డా ద్రోణుఁడు నీకొమరులశ్రేయముఁనుగోరి యాభీమార్జునులు మున్నగు యోధులను మర్దించుచువచ్చెను. ఓరాజా! ఆతనివిక్రమవిధము కొంత తెలిపితినిగదా! ఇది యది యననేల? ఇంకను నెన్నెని విక్రమవిధములఁ జూపి లోకములను గాలసూర్యుఁడువలెఁ బరితపింపఁజేసి తుది కీలోక

మును విడిచి స్వర్గము నలంకరించెను. ఓరాజా! వైరిబలమారకుఁ డగు నాభారద్వాజుఁ డటులు దుష్కరకర్మము నొనర్చి పాండవయోధులను బెక్కురను మడపి తుదికి ధృష్టద్యుమ్నునిచే హతుఁడయ్యెను. ఆతఁ డొకయక్షౌహిణి కధికముగాఁ బాండవశూరులనుజంపి క్రూరకర్ములగు పాండవపాంచాలురచేఁ దుదికి హతుఁడై పరమగతినొందెను. ఓయాంబికేయా! సువర్ణరథుఁ డగు నాద్రోణుఁ డటు లద్భుతకర్మముల నొనర్చి హతుఁడగుడు, నాకసమున భూతములమహానాద ముప్పతిల్లెను. అటులే సైన్యములయు నాదములు భూమ్యాకాశములను దశదిశలను బ్రతిధ్వనింపఁజేయుచుండ నెంతయు నెల్లెడల "అయ్యో! ఎంతపని జరిగెను. ఛీఛీ! ఏమిపనిచేసిరి" అనుశబ్దములే వినవచ్చెను. అపు డటులు పడిన యాద్రోణుని దేవతలును, బితరులును, మఱియుఁ గలబంధులును జూడ వచ్చిరి. పాండవులు జయమువడసి సింహనాదములొనర్చిరి. వారియారావములచే ధాయణి కంపించెను" అని తెలుప విని మఱియు సంజయునితో నాధృతరాష్ట్రుఁ డిట్లనియె.

## ధృతరాష్ట్రునిశోకము

"ఓసంజయా! సకలశస్త్రవేత్తలందును గుశలుఁ డనఁదగు నా ద్రోణుఁ డేమిచేయుచుండ నాతనిఁ బాండవసృంజయులు చంపిరి? ఆతని రథము విఱిగెనా? ధనువు దునిసెనా? జాగ్రత్త తప్పియుండెనా? ఎటులు మృతుఁడయ్యెను? శత్రుల కజయ్యుఁడై సువర్ణపుంఖములగు శరసంఘాతముల వైరులపైఁ గురియుచుఁ, గరలాఘవ మేర్పడఁ జిత్రయుద్ధ మొనర్చుచు, నెంతదూరమందున్నలక్ష్యమునయినను దెగనేయు సంగ్రామపారగుఁ డగు సద్దివ్యాస్త్రవేది నాధృష్టద్యుమ్నుఁ డెటులు చంపెను? ఆహా! అటులు దారుణకర్మ మొనర్చిన మహారథుఁడు మఱియుట నారయఁగాఁ బురుషకారముకంటె దైవము బలవత్తరమైనదని తలంపవలయునని నాయభిప్రాయము. కాదేని చతుర్విధాస్త్రవేత్తయు, మహాత్ముఁడునగు నాద్రోణుని ధృష్టద్యుమ్నుఁడు చంపుటేమి? శస్త్రాస్త్రధరులగువారికెల్ల నాచార్యుఁడగుద్రోణుఁ డాతనిచేఁ జచ్చుటేమి? అయ్యో! సువర్ణరథుఁడును, వ్యాఘ్రచర్మకవచుఁడును, సువర్ణభూషణభూషితాంగుఁడునగు నాద్రోణునిమరణమును విని శోకము నాపుకొనఁ

జాలకున్నవాఁడను. ఓసంజయా! అట్టిద్రోణుఁడు హతుఁడగుట వినియు నేను జీవించియుండుట నరయఁగాఁ, బరదుఃఖముచే నెవ్వానికిని మరణము సంభవింపదనుట నిశ్చయముసుమీ! ఆహా! దైవమే యధికము. పౌరుషము నిరర్థకముగాక తప్పదు. నా యీహృదయము పాషాణమనఁదగియున్నది. కానిచో ద్రోణునిమరణమును వినియు నూఱుఖండములుగాకుండునా? గుణాభిలాషులగు బ్రాహ్మణులును, రాజపుత్రులును, బ్రాహ్మదైవకృత్యములందును, ధనుర్విద్యయందును నామహనీయునే గదా సేవించినవారు. అట్టిమహాత్ముఁడా మృతినొందుట? అయ్యో! సముద్ర మింకుటయు, మేరువు జారుటయు, భాస్కరుఁడు పుడమిఁబడుటయు నెట్టిదో యట్టిదిగదా యీద్రోణునిపతనము! దీని నెట్టులు సహింపఁగలను? ఆహా! అతఁడు దుష్టులను శిక్షించెను. శిష్టులను రక్షించెను. తన్ను శరణమొందువానికిఁగాఁ బ్రాణమునైన నొసంగువాఁడే! ఆతని విక్రమముపై నాధారపడియేగదా మందులగు నాపుత్రులు జయేచ్ఛగలిగియున్నవారు! బుద్ధిచే బృహస్పతి యనఁదగు నాతఁ డెట్లు మరణించెను? ఆహా! మిక్కిలి గొప్పవై యెఱ్ఱనిచాయగలిగి సువర్ణభూషితములగు నాద్రోణునిగుఱ్ఱములు రథమునఁ బూన్ప వాయువేగముతో రణరంగమున సకలశస్త్రములను గడచి పోవునవియే. అయ్యవి బలముగలిగి సకిలించుచు నెంతయు శిక్షింపఁబడినవగుట లెస్సగా రథము వహించునవిగదా! ఒకపుడును నాద్రోణునియశ్వము లెంతయు దృఢములగుట సంగ్రామమధ్యమున నలసినవనుట వినలేదే! మఱియు వాని కేస్నుల ఘీంకారమువలన జడుపులేకుండెడిది. శంఖదుందుభిధ్వనులకుఁగాని, ధనుష్టాంకారములకుఁగాని యవి జడియక శరవర్షమును సహించునవై శత్రుజయమును దెలుపునవై యలయక సిట్టూర్పులిడక యుండెడివి. అట్టి యశ్వములు సువర్ణరథమును వహించుచుఁ బాండవసైన్యమునకుఁ జిక్కు టెట్లు? ఓసంజయా! శూరవరుఁడగు నాభారద్వాజుఁ డటులు సారతరమగు రథమధిష్ఠించి యేమిచేసెను? లోకమునఁగల యెల్లధనుర్ధరులును నాతనివిద్య ననుసరించియేగదా జీవించుచుండిరి. అట్టిసత్యసంధుఁడును బలశాలియునగు నాద్రోణుఁడు రణాంగణమున నేమియొనర్చెను? స్వర్గమున నింద్రుఁడువలె ధనుర్ధరులకెల్లఁ గన్నాకగునాతని నెవ్వ రెదుర్కొనిరి? ఓయీ! ఆసువర్ణరథునిఁ గాంచి పాండవులు పరు

వులువెట్టిరా? లేక దివ్యాస్త్రవేత్తయై మహాబలుఁడగు నాద్రోణుని ధర్మ జుఁడు తనసోదరులతోడను ధృష్టద్యుమ్నాదులతోడను జుట్టుకొని యెనా? ఆతనికి సహాయులగురథికులను బార్థుఁడు నివారింపఁగాఁ బిమ్మట ధృష్టద్యుమ్నుఁ డాద్రోణునిఁ గ్రూరకర్ముఁడై చంపుట నిశ్చయమని యూహింతును. అస్త్రనరక్షితుఁ డగు ధృష్టద్యుమ్నుఁడుదక్క వేఱొకఁ డాద్రోణునిఁ బ్రహరించునని నేనూహింపను. ఒకపుడు, నీచులై యెల్ల విధముల నిస్సారులగుపాంచాలురతోడను నటులే కైకేయులును, గారూశులును,మాత్స్యులు మున్నగుక్షత్త్రియులతోడనుగూడి ధర్మజుఁ డాద్రోణునిఁ బామును జుట్టుకొన్న చీమలువలెఁ జుట్టుకొనిరియెనేమో యని నే నూహింతును. అతఁడు యుద్ధమునఁ జిక్కువడియుండ నాతని బాండవులు చంపిరని నాయభిప్రాయము. అయ్యో! షడంగములతోఁ గూడిన నాల్గువేదములను జదివి నదులకు నదీపతివలె బ్రాహ్మణులకుఁ బ్రతిష్ఠాప్రదాతయై బ్రహ్మక్షత్త్రధర్మములను నిలిపినవాఁడు. గర్వితుల గర్వ మడంచువాఁడు. కన్నులేనివారి కాతఁడు కన్ను. మదించినవారి నడంచువాఁడు. ధార్మికులలో ధార్మికుఁడు. అయ్యో! వృద్ధుఁ డగు నాబ్రాహ్మణుఁడు శస్త్రహతుఁడయ్యెనా? అనర్హులగుపాండవులపై గుపితుఁడనై వారి నెల్లపుడు నేను బీడింపందొడంగ నీద్రోణుఁడు వారిని సహించినందులకుఁ దగుఫల మనుభవించెను. ఆహా! ఎవ్వనికర్మము ననుసరించి యెల్లధను ర్వేత్తలును జీవించుచున్నారో యట్టి సత్యసంధుఁడును బుణ్యాత్ముఁడునగు నాద్రోణుఁడు సిరుల నపేక్షించినపాండవులచే హతుఁడయ్యెను. స్వర్గమున నింద్రుఁడువలె మనసైన్యములలో నుత్తముఁడై మహాబలుఁ డగు నాతఁడు చిఱుచేఁపలచేఁ దిమివలెఁ బార్థులచే నెట్లు హతుఁడయ్యెనో వింతగా నున్నది. ఎవ్వని విజయమునుగోరువాఁ డెవ్వఁడును జీవింపఁజాలఁడో యట్టిబలశాలి యట్టికరలాఘవముగలవాఁడు అట్టివైరిమారకుఁడు హతుఁడయ్యెనా! వేదకాములగువారికి వేదశబ్దమును, ధనుర్ధరు లగువారికి ధనుశ్శబ్దమును నెవఁడు జీవించియుండఁగా విడువకుండునో, యట్టిద్రోణుఁడా మరణించుట? దైన్యములేక పురుషవృషభుఁడై బిడియముగలిగి శత్త్రులకు జంకని ధనురాచార్యుఁ డగు నాద్రోణునిఁ బాండవు లెట్లు కొట్టఁగలిగిరి ? ఓసంజయా! అమేయకీర్తిబలములుగల యతఁ డెట్టివీరునకును జయింపరానివాఁ డగుట, నిపు

డాతఁడు హతుఁడగుట నమ్మఁజాలను. బ్రాహ్మణధర్మమున బ్రహ్మ కైన యగువాఁడును, క్షాత్రధర్మమున నారాయణుఁ డనఁదగినవాఁడు నై, బ్రహ్మక్షత్రధర్మములను పరిపఱచుకొనిన సాంబమూర్తి యగు నాతఁడు హతుఁడగుట వింత. గజరథాశ్వములతోఁగూడిన మనవీరులెల్లనాయుధిష్ఠిరుని తపోబలముచే మడిసిరని తలంపవలసియున్నది. ఓసంజయా! ఎట్టి వారికిని నోరుపరానిబలము గలయామహారథుఁ డాధృష్టద్యుమ్మునిచే నెట్లు హతుఁడయ్యెను? ఆద్రోణునకు రక్షకులై యెవ్వ రాతనిముందు నిలిచి యుద్ధమొనర్చిరి? ఎవ్వరు వెనుక నుండిరి? ఆమహాత్ముని దక్షిణోత్తరరథచక్రముల రక్షించినవారెవ్వరు? అతఁడు యుద్ధముచేయుచుండఁగా నెదుటఁబడినవారెవ్వరు? ఎవ్వ రాతనిచే హతులైరి? ఆ ద్రోణునితోఁ బోరాడుటకు సాహసించినవారెవ్వరు? మందబుద్ధులగు నెవ్వ రీద్రోణునకు సహాయమొనర్పక విడిచిపోయిరి? అటులు రక్షకులు భీతులై యాతని విడిచిపోఁగా శత్రువు లీతనిఁ గొట్టిరా? శౌర్యశాలి యగు నాద్రోణుఁ డెన్నఁడును భయముచే వైరికి వీఁపుచూపువాఁడు గాఁడే! ఎట్టి యాపదయందును జడియని యాతఁడు హతుఁ డెటులయ్యెను? ఓసంజయా! ఎట్టికష్టములు వచ్చినను శూరుఁడగువాఁడు పరాక్రమించుట యుచితము. అయ్యది యాతనియందుఁ గొఱతవడ లేదు. తనవారిని బాలించుచు వైరులతోఁబోరాడు నాభారద్వాజు నెదిరి క్షుద్రక్షత్రియు లప్పాండవుల కప్పగించిరా? లేక తనకు రక్షకు లగువారు తన్ను విడిచిపోఁగా నితఁడు శత్రులపాలయ్యెనా! ఓయీ! అమితపరాక్రముఁ డగునశ్వత్థామ నివారించుచున్నను, నాబ్రాహ్మణుని ధృష్టద్యుమ్నుఁడు వధించియుండవచ్చునని యూహించెదను.ఓసంజయా! నామతి చెడుచున్నది. ఇఁక నిక్కథను దెలుపకుము. మఱియుఁ దెలివొంది నిన్నడిగెదను.” అని పలికెనని తెలిపి వైశంపాయనుఁడు జనమేజయునితో ని ట్లనియె.

## ధృతరాష్ట్రుఁడు ద్రోణునికథను వినఁగోరుట.

ఓజనమేజయా! ఇటు లాసంజయునితోఁ బలికి యెంతయు శోకము తన్నుఁ బీడింపఁ దనకొడుకులకు జయముగలుగదనునిశ్చయముతోఁ జింతాక్రాంతుఁడై నేలఁగూలెను. పిమ్మటఁ బరిచారకులు వచ్చి

తెలివితప్పియున్న యాతనికి శీతలోపచారములొనర్చిరి, పవిత్రగంధము గలవీవనలతో విసరిరి. అపు డటులు చైతన్యముతప్పి పడియున్న యాతని కడకు భరతకాంతలెల్ల వచ్చి చుట్టునుజేరి చేతులతోఁ దడవసాగిరి. పిదపఁ గొంతవడికి మెల్లగా నాతని వారు లేవనెత్తి కన్నీరువిడుచుచు నాసనమునఁ గూర్చుండఁబెట్టిరి. అటు లాసనమందుఁ గూర్చుండియు మఱియు నందు మూర్ఛితుఁడై యుండ నలువైపులఁజేరి వీవనల విసరఁ జొచ్చిరి. అంతఁ గొంతవడి కాతఁడు తెలివొంది వడఁకుచు మఱియు సంజయు నిట్లు ప్రశ్నించెను.

"ఓయీ! ఉదయించుచున్న సూర్యుఁడువలెఁ దనతేజముచేఁ జీఁకటులఁ దొలఁగించుచువచ్చు నయ్యజాతశత్రు నాద్రోణునినుండి యెవ్వఁడు తప్పించెను? కుపితమగుమత్తగజమునాఁ గడువడి వెడలి ద్విరదగామియై దగునాధర్మజు నెవ్వ రెదుర్కొనిరి? ఆతఁ డెవ్వరిని బ్రహారించెను? మహాబాహుఁడగు నప్పాండవాగ్రజుఁ డొక్కఁడే తనఘోరదృష్టిచే దుర్యోధనునిబలము నెల్లఁ జంపఁదగువాఁడుగదా! ధైర్యశాలియు, సత్యప్రతిజ్ఞుఁడును, శాంతుఁడును లోకసమ్మతుఁడునగు నతని నెవ్వరు మనవా రెదుర్కొనిరి? ద్రోణు నెవ్వఁ డెదుర్కొనియెను? మఱియు నద్భుతకర్ముఁడును, మహాబలుఁడును, మహాకాయుఁడు, మహోత్సాహుఁడు, నాగాయుతసమబలుఁడునగు భీముఁడు భయంకరుఁడై వెడలఁగా నాతని మనవారిలో నెవ్వ రెదుర్కొనిరి? నల్లని తనమేనిచాయ వెలయఁ బర్జన్యుఁడునాఁ జూపట్టి పిడుగులంబోలు శరజాలముల వర్షించుచు, జ్యాఘాతరథనేమిధ్వనులచే నెల్ల దెసలఁ బ్రతిధ్వనులెసఁగఁజాపకాంతులనెడి మెఱుపులును, రథగుల్మమనెడి మేఘమును, నేమిఘోషమనెడిగర్జనమును గలుగ, గాండివముచే శోణితోదకములఁ బ్రవహింపఁ జేయుచు మానవుల కంతకుండువలె దుర్యోధనాదులకుఁ జూపట్టుచు వచ్చునాయర్జునుం గాంచి యెవ్వఁ డాతని నెటు లెదుర్కొనియెను? సేనాగ్రమున నెవ్వనిపేరు వినినంతన శత్రుసైన్యములు చెదరునో యట్టి గాండీవధరు నెవ్వ రోరువఁగలరు? శత్రుసైన్యములకు వడఁకుపుట్టించుచు, వీరులకు వెఱపుగొలుపుచున్న ద్రోణుని విడువక యున్న వా రెవరు? భయముచేఁ బరువులిడినవా రెవ్వరు? దేవతలనుసైతము జయింపఁదగు నాయర్జునునిఁ బ్రాణములపై నాశవిడిచి మృత్యుముఖమును

బోలె నెదిర్చినవా రెవ్వరు? ఆశ్వేతాశ్వుని వేగమును సహించు మనవా రెవ్వరు? కృష్ణుఁడు సారథియు, నర్జునుఁడు రథికుఁడు నై యుండ, వర్ష కాలగర్జనము ననుకరించుగాండివధ్వనిని సహించువారుగలరా? అట్టి రథము దేవాసురులకును జయింపరానిగదిగదా! పిన్నవయసువాఁడును, శూరుఁడును, సుకుమారుఁడును, మేధానిధియు నైననకులుఁడు భయంకరారావముతో మనసైనికులఁ బీడించుచు ద్రోణునిపైకి వెడల మనవా రెవ్వ రాతని నివారించిరి? కుపితమగు సర్పమువలె వెడలినసహదేవుని మనవారెవ్వరు నిరోధించిరి? సత్యము ధైర్యము శౌర్యమునుగలిగి బలవంతుడును, సత్యప్రజ్ఞుఁడును, దైన్యరహితుఁడు, నపరాజితుఁడు నై వాసుదేవున కనంతరుఁడయ్యు యుద్ధమున వాసుదేవతుల్యుఁడై, యర్జునునకు ధనుర్విద్యలో శిష్యుఁడై యాతనితోఁ దుల్యుఁడయిన సాత్యకిని ద్రోణునుండి వారించినవాఁ డెవఁడు? ఆహా! ఆసాత్యకి వృష్ణి వంశోత్తముఁడై సర్వధనుర్ధరులలో నెన్నదగి యశోవిక్రమములచే, బరశురామున కెనయగువాఁడుగదా! శౌర్యాదిగుణములన్నియుఁ, గేశవునియందుఁ ద్రిలోకివలె నాసాత్యకియందు వెలయుచున్నవి. అట్టి సుగుణములకు గనియై దేవతలకును వారింపరాని యవ్వీరుని వారించి నవా రెవ్వరు? పాంచాలురలో నుత్తమవీరుఁడును, సజ్జనసమ్మతుఁడును, ధనంజయుని హితముగోరుచు మావారి కనర్థమును దలపోయువాఁడై దిక్పతుల కెనయై ద్రోణు నెదుర్కొనిన యుత్తమౌజు నెవ్వరు నివారించిరి? చేది దేశీయులనుండి విడివడి తానొకఁడే పాండవులఁ జేరిన యాధృష్ట కేతుని ద్రోణునుండి నివారించిన దెవఁడు? స్త్రీపురుషుల గుణాగుణములు గలిగి గాంగేయునిమరణమునకు హేతుభూతుఁడై ద్రోణుని కభిముఖుఁ డగుశిఖండి నెవ్వరు నిరోధించిరి? సకలధనుర్ధరోత్తముఁడును, శౌర్యాది గుణములచే నర్జునునిమించినవాఁడును నై సత్యము బ్రహ్మచర్యమును గలిగి, వీర్యమున వాసుదేవుని, బలముచే నర్జునుని మించి, తేజోబుద్ధిబలములచే సూర్యబృహస్పతులను బోలినయభిమన్యుని వారించినవా రెవ్వరు? అతఁడు ప్రళయకాలయముఁడునా ద్రోణునిపై వెడలునుగదా! వయసుచేతను బుద్ధిచేతను దరుణుఁ డగు నాసౌభద్రుఁడు ద్రోణునిపై వెడల మనవారిమన సెట్టులయ్యెనో? పురుషసింహులగు ద్రౌపదేయులు సముద్రములకు వెడలిననదులువలె నాద్రోణునిపైఁ బరువులిడఁగా

వారిని నివారించినవారెవ్వరు? వీరు పండ్రెండువత్సరములు వరుసగాఁ దమబాల్యక్రీడలను మానుకొని భీష్మునికడ నుత్తమవ్రతనిష్ఠతో నస్త్రాభ్యాస మొదర్చినవారుధృష్టద్యుమ్న పుత్రులగు క్షత్రంజయుఁడును, క్షత్త్రదేవుఁడు క్షత్త్రధర్ముఁడు మానదుఁడు ననెడినలువురను ద్రోణు నుండి నివారించిన వారెవ్వరు? నూర్వుర కొక్కఁడే చాలునని వృష్ణులచేఁ దలఁపఁబడుమహారథుఁ డగుచేకితాను నాద్రోణునుండి వారించినవాఁడెవ్వఁడు? ధార్మికులునుసత్యవిక్రములును నెఱ్ఱనగుకవచాయుధ ధ్వజములు గల కైకేయులేవురిని ద్రోణునుండి నివారించినవారెవ్వరు? వారు పాండవులకుఁ బినతల్లిపుత్రులై వారిజయముఁగోరుచు ద్రోణునిఁ జంపఁదలంచువారై వచ్చియుందురుగదా! కొందఱుక్షత్త్రియులు వారణావతమున నాలుమాసములు జయాభిలాషచే నెవ్వనితోఁ బోరాడియు జయింపఁజాలకుండిరో యట్టి ధనుర్ధరోత్తముఁడగు యుయుత్సు నాద్రోణునుండి వారించినవాఁ డెవ్వఁడు? వారాణసిని మహారథుఁడై స్త్రీలకై యుద్ధమొనర్చిన కాశిరాజపుత్రు నెవ్వఁ డొకభల్లముచే సంహరించెనో, మఱియు నెవ్వఁడు ధనుర్ధరుఁడై పాండవులకు ముఖ్యమంత్రియై దుర్యోధను ననర్థమునుగూర్పనున్న చిత్తముతో సమరమునఁ గౌరవ యోధులను దహించుచు, ద్రోణునిఁ జంపుటకై జనించి, యాతనిపైకి వెడలిన యాధృష్టద్యుమ్నుని నివారించినవా రెవ్వరు? ఇప్పుడమినెల్లఁ జర్మముచేఁ గప్పి, గొప్పరథధ్వనితో వెడలి, శత్రులనెల్లఁ జంపియు, మంచియన్నపానదక్షిణలుగలుగనట్లుగాఁ బదియశ్వమేధములొనర్చియుఁ బ్రజలను నిజసంతానమువలెఁ బాలించియు, గంగానదినిగల యిసుకరేణువులన్ని గోవులను దనయజ్ఞమున దానముచేసియు, మెప్పొంది 'భూత భవిష్యద్వర్తమానముల నిట్టివాఁడులేఁడను' ఖ్యాతిఁగాంచిన యుశీనరుని మనుమఁడగు శైబ్యుని ద్రోణునుండి మరలించినవా రెవ్వరు? సమరమున ద్రోణునిఁ జంపుటుత్సాహముతో వెడలినశత్రుఘాతుకుఁ డగు విరాటునిసైన్యము నాద్రోణునుండి నివారించినవాఁ డెవ్వడు? భీమునకు సద్యఃపుత్రుఁడై మహాబలపరాక్రమశాలియై మాయావియై నాకెంతయు భయముగలిగించుచుఁ, బాండవుల జయమునుగోరి దుర్యోధనునకుఁ గంటకప్రాయుఁడైన మహాకాయుఁడగు ఘటోత్కచు నాద్రోణునుండి వారించినవాఁ డెవ్వడు? ఓసంజయా! ఇవుడు నా తెలిపినవారె

గాక యింకను ననేకులు పాండవులకై సమరమునఁ దమప్రాణముల నర్పింపనున్నవారు గలరు. మఱియు నప్పాండవులకు భగవానుఁ డగు శ్రీకృష్ణునియాశ్రయము గలదు. అట్టిపాండవులకుఁ బరాజయమన నెట్టిది? ఆహా! లోకములకెల్ల నుత్తముఁడును లోకనాథుఁడును సనాతనుఁడు మానవులలో దివ్యరూపముతో నవతరించినవాఁడునగు శ్రీమన్నారాయణుఁడు పాండవులకు సహాయుఁడై యున్నవాఁడుగదా! ఎవ్వని దివ్యకర్మముల నద్భుతముగాఁ బండితులు తెలుపుదురో యట్టిమహానీయుని దివ్యచరిత్రములను భక్తిమెయిఁ గీర్తించి స్థిరచిత్తుఁడ నయ్యెదను" అని పలికి ధృతరాష్ట్రుఁడు మఱియు ని ట్లనియె.

ధృతరాష్ట్రుఁడు విలపించుట

"ఓసంజయా! వాసుదేవునిపరమాద్భుతకర్మములను దెలిపెదను వినుము. ఆగోవిందుఁ డొనరించినకృత్యము లమానుషములు. ఆతఁడు బాలుఁడై యుండియే తనబాహుబలముచే గోపకులమును బహువిధముల రక్షించెనని ప్రసిద్ధివడసియున్నవాఁడు. బలముచే నుచ్చైశ్శ్రవమునాఁదగి, వాయువేగమునఁ జరించు యమునావనవాసియగు హయరాజమును జంపెను. గోవులపాలిటిమృత్యువై వెడలినఘోరరూపుఁ డగు వృషభాసురుని బాహువులఁబట్టి చంపెను. అటులే ప్రలంబుని, నరకుని, జంభుని, పీఠుని, వాపిరాక్షసుని, మురాసురుని నామహానీయుఁడు వధించెను. మఱియు జరాసంధునిచేఁ బాలింపఁబడినవాఁడయ్యుఁ, గంసుఁడు సపరివారముగా నాకృష్ణభగవానునిచే వధింపఁబడియెను. సమరవిక్రమశాలియను ప్రసిద్ధివడసి, కంసునిసోదరులలో మధ్యముఁ డగుశూరసేనుఁ డొకయక్షౌహిణికి నాయకుఁడై విజృంభింపఁగా బలరాముఁడుమాత్రము తనకు సహాయుఁడుగా నీకృష్ణభగవానుఁడు కడువడి వెడలి వానిని జంపెను. పరమకోపనుఁ డగు దుర్వాసుఁడనెడి విప్రర్షి నితఁ డారాధించి యాతనివలన వరములను బడసెను. అటులే యుద్ధమున నెల్ల రాజులను జయించి గాంధారరాజపుత్రికను స్వయంవరమునఁ బరిగ్రహించెను. అటులే యక్షౌహిణీపతి యగు జరాసంధుని మిక్కిలి యుపాయముచే, భీమునిచేఁ జంపించెను. మఱియుఁ బూజార్థమునుగుఱించి వివాద మొనర్చిన శిశుపాలునిఁ బశుమారణ మొనర్చెను.

ఆకసముననున్న సౌభమనెడిదైత్యపట్టణమును సముద్రమునఁ బడఁ ద్రోసెను. మఱియు నీమహనీయుఁ డంగ, వంగ, కళింగ, మాగధ, కాశి, కోసల, వాత్స్య, గార్గ్య, కరూశ, పౌండ్ర దేశాధీశులను సమరమునజయిం చెను. ఇంకను నవంత్యులను, దాక్షిణాత్యులను, పార్వతీయులను, దశైరకులను, కాశ్మీరకులను, నౌరసికులను, పిశాచులను, ముద్గలులను, కాంభోజులను, వాటధానులను, జోళులను, పాండ్యులను, త్రిగర్త లను, మాళవులను, దరదులను నింకను నానాదిశలనుండి వచ్చినవారిని బుండరీకాక్షుఁడగు నితఁడు జయించి, సపరివారముగా యవను నోడిం చెను. మున్ను సముద్రమునఁజొచ్చి జలజంతువులచే నావృతుఁడై నీటఁ దాగియున్న వరుణుని జయించిన మహానుభావుఁడు. అటులే యీతఁడు పాతాళవాసియగు పంచజనునిఁ జంపి, పాంచజన్యమనెడిశంఖమును బడ సెను. మున్ను ఖాండవమున నర్జునుతోఁగూడి యగ్నిని సంతోషపఱచి యాతనివలన నాగ్నేయాస్త్రమును దుర్జేయమగు చక్రమును బడసెను. గరుడు నధిష్ఠించి యమరావతికేగి యందలివారికి వెఱపుగలుగఁ జరించి, యామహేంద్రభవనమునుండి పారిజాతమును దెచ్చెను. అపు డితని విక్రమ మెఱిఁగినవాఁడగుట శక్రుఁ డుపేక్షించెనుగాని యేమియుఁ జేయఁజాలఁడయ్యెను. ఓసంజయా! నాకెంతయు నాశ్చర్యము గలుగు నట్లుగా నాఁడు సభలో నట్టియద్భుతకృత్య మొనర్చెనుగదా! అట్టి మహనీయుఁడుగాక వేఱొకఁ డెవ్వఁడు పూజార్హుఁడు? భక్తిచేఁ బ్రస న్నునిఁగావించికొని యాతని దర్శించినవాఁడనగుటఁ బ్రత్యక్ష మగునాగ మమువలె నంతయు నా కాతనిదివ్యమహిమ యెఱుకపడియెను.

ఓసంజయా! అటులే గదుఁడు, సాంబుఁడు, ప్రద్యుమ్నుఁడు, విదూరథుఁడు, అగావహుఁడు, అనిరుద్ధుఁడు, చారుదేష్ణుఁడు, సార ణుఁడు, ఉల్ముకుఁడు, నిశఠుఁడు, బభ్రుఁడు, పృథువు, విపృథువు, శమీ కుఁడు, ధారిమేజయుఁడు నింకనుగల బలవంతులగుయాదవులును, వృష్ణివీరుఁడును మహాత్ముఁడునగు కేశవునిచే నాహూతులై పాండవ సైన్యము నాశ్రయించి యుద్ధమున నిలుతురు. ఆకారణముచే మాకు జయము సందిగ్ధమగుచున్నది. ఇదియుఁగాక నాగాయుతబలుఁడును, కైలాసగిరివలె నున్నతుఁడును, వనమాలియు, హలియునగు బలరాముఁ డాజనార్దనుఁడుగలపక్షమువాఁడై యుండును. ద్విజాతు లెవ్వని సకల

లోకజనకునిఁగా బలుకుదురో యట్టి వాసుదేవుఁడు పాండవార్థమై యుద్ధమైనను జేయువాఁడు. ఓసంజయా! ఆభగవానుఁడెపుడు పాండవార్థముగా యుద్ధసన్నద్ధుఁడగునో యపు డాతనితో యుద్ధ మొనరింపఁ దగు ప్రతియోధుఁ డెవ్వఁడు గలఁడు? ఒకపుడు కౌరవులు పాండవులను జయింపఁగలిగియున్నను, వాసుదేవుఁ డప్పాండవులకుఁగా నుత్తమశస్త్రమును ధరింపకమానఁడు. అటు లతఁడు కత్తివట్టెనా? సకలరాజమండలమును సమరమున సమయించి, పిదపఁ గౌరవులను మడియించి కుంతీదేవికైనను మేదిని నొసంగక మానఁడు. ఏరథమునకు రథికుఁ డర్జునుఁడును, సారథి నారాయణుఁడునునై యుండెనో యట్టిరథమున కెయ్యది ప్రతి రథముగాఁగలదు? ఏయుపాయముచేఁ జూచినను గౌరవులకు జయ మూహింపఁబడకున్నది. కావున యుద్ధ మెటులు జరిగెనో యదియెల్లఁ దెలుపుము. అర్జునుఁడు కేశవునియాత్మ. అటులే కృష్ణుఁడు నర్జునునియాత్మ యైనవాఁడు. అర్జునునియందు విజయము నిత్యసిద్ధము కృష్ణునియందు శాశ్వతకీర్తి సిద్ధము. ఏలోకములందును నర్జునునకుఁ బరాభవము లేదు. కేశవునియందుఁ బ్రధానగుణము లెన్నియేనిఁ గలవు. అయినను నవివేకముచే సుయోధనుఁ డావాసుదేవునిమహత్త్వ మెఱుఁగఁడు. వాని దైవయోగముచే మృత్యుపాశము చుట్టుకొనుచున్నది. కృష్ణుఁ డొక దాశార్హుఁడనియు, నర్జునుఁడు పాండవమాత్రుఁడనియుఁ దలఁచుచున్నాఁడుగాని, యాదుర్యోధనుఁడు వారి నాది దేవులగు నరనారాయణులఁగాఁ దెలియకున్నవాఁడు. వారిరువురును నేకరూపులయ్యును బుడమిని రెండు మానవరూపములతో జనించినవారు. కీర్తినిధులగు వారు మానవులకు మానసములచేనైన జయింపరానివారయ్యుఁ దాము మానవత్వ మూని కౌరవసైన్యమును జయింపఁ దలఁచియున్నవారు. లేనిచో నిచ్ఛామాత్రమున జయింపఁగలుగుదురు. ఇది లోకమోహనమగు యుగవిపర్యాసమై యున్నది. కానిచో బ్రహ్మచర్యవ్రతనిష్ఠాపరుఁడగు భీష్మఁడును, వేదాధ్యయనపరుఁడగు ద్రోణుఁడును మరణించుటెట్లు? క్రియలచేఁగాని యస్త్రములచేఁగాని మృత్యువునుండి తప్పించుకొనుట దుర్ఘటము. ఓసంజయా! లోకసంభావితులును, నస్త్రకుశలులును, యుద్ధగర్వితులునగు భీష్మద్రోణులు మరణించుట వినియు జీవించి యుండు టెందులకు? మున్ను మనమాయుధిష్ఠిరుని యేసిరుల కసూయ

పడితిమో? భీష్మద్రోణులు మరణించుటచే నిపుడాసిరులచేతనే జీవింప వలసియున్నవారము. నాకుఁగా నిక్కౌరవులమరణము సంభవించినది. పక్వములయినవానినిఁ బడఁద్రోయుటలోఁ దృణములైనను వజ్రాయుధ ములగును. యుధిష్ఠిరుఁ డీయనంతములగు నైశ్వర్యములకుఁ బాత్రుఁడు గావలసివచ్చెను. ఆహా! వానికోపాగ్నిచేఁగదా భీష్మద్రోణులు హతు లయిరి. సహజముగా ధర్మము ఫలించెను. మావారి కట్టిధర్మములేదు. క్రూర మగునిక్కాల మెన్నఁడును సర్వవినాశముఁ జేయక గడచిపోదు. ఓసంజయా! ధీమంతులు లోకవిధముగాఁ జింతించిన కార్యములను దైవము వేఱొకరీతిగాఁజేయక తప్పదని నాయభిప్రాయము. కావున ననివార్యమై యిట్టి గొప్పకష్టము సంప్రాప్తింపఁగా నిందులకుఁ జింతింపఁబనిలేదు. అటు లగుట నున్నదున్నటులు తెలుపుము." అని పలుక విని సంజయుఁడు మఱియు నిట్లు తెలుపఁదొడంగెను.

### ధర్మజు నప్పగింతునని దుర్యోధనునకు ద్రోణుడు వరమిచ్చుట

"ఓయాంబికేయా! అప్పాండవసృంజయులచే నాద్రోణుఁడు హతుఁ డయినవిధమంతయుఁ బ్రత్యక్షముగాఁ జూచియున్నవాఁడ నగుట నీకది యెఱిఁగించెదను వినుము. మహారథుఁడగు నాభారద్వాజుఁ డటులు సేనాపతిత్వమొంది, కౌరవసైన్యములనడుమ నిలిచి, నీకొమరునితోఁ 'ఓరాజా! కురువంశోత్తముఁడగు గాంగేయు ననంతరము నన్ను సేనా నాయకునిఁగా నియోగించి గౌరవించితివి. కావున దానికిఁ దగుఫల మీవు పొందఁగలవు. నీకిపు డేమికావలయునో కోరికొనుము.' అని పలి కెను. అది విని సుయోధనుఁడు దుశ్శాసనాదులతోఁ గూడి యాయా చార్యుం జూచి 'ఓగురువర్యా! నీవు మాకిపుడు వరమొసంగుదేని నే నొకటి కోరియెదను. 'నీవు యుధిష్ఠిరుని జీవముతోఁ బట్టుకొని తెచ్చి నా కప్పగింపుము.' అని కోరెను. అంత నయ్యాచార్యుఁడు నీపుత్రునిపలుకు విని తనసైన్యమున కుత్సాహమువొడమ నిట్లు పలికెను. 'ఓసుయో ధనా! నీ వాధర్మజునిఁ జంపుమని నన్నుఁ గోరక యాతనిఁ బట్టుకొని తెమ్మని కోరుట నతఁడు ధన్యుఁడు. ఓరాజపుత్రా! ఆయుధిష్ఠిరునిఁ జంపు మని యేల కోరవైతివి? ఓసుయోధనా! ప్రమత్తుఁడవై దీనిని గోర వైతివి. లేదా! అజాతశత్రుఁడగు నాతనికి విరోధియే లేఁడా? లేక

యాతనిజీవనమునుగోరి భరతకులమును నిలుపఁదలంచితివా? అటుగాక సమరమునఁ బాండవులను జయించి, మఱల రాజ్య మాయుధిష్ఠిరున కొసఁగి యన్నదమ్ముల చెలిమిఁ జూపనెంచితివా? కుంతీపుత్త్రుఁడగు యుధిష్ఠిరుఁడు ధన్యుఁడు. వానిది మంచిపుట్టువు. నీ వాతనియెడ నిటులు స్నేహముంచుటనుబట్టి యాతని యజాతశత్త్రుత్వ మిపుడు యదార్థమయ్యెను’ అని.

ఓధృతరాష్ట్రా! ద్రోణుఁ డిటులు తెలుప విని, నీతనయుఁడు తనకు నిత్యము చిత్తమందున్న భావ మొకటి యపుడు కడువడిగా వెడల, సంతుష్టాంతరంగుఁడై యిట్లు పలికెను. బృహస్పతితుల్యుఁడైనను నాకా రమును మఱుగుపఱుచుకొనుట శక్యముగాదుగదా! అటులగుట నతఁడు చిఱునగ వంకురింపఁగా ‘ఓయాచార్యా! నీ వాయుధిష్ఠిరుని రణరంగమునఁ జంపుదేని నే నాతని జయించితిననుట సరిపడదుగదా! అదియుఁగాక యాయుధిష్ఠిరుఁడు హతుఁడగునేనిఁ బార్థుఁడు మమ్మెల్లఁ దునుమాడకమానఁడు. సమరమున నెల్లరను నిశ్శేషముసేయ నమరుల కైనను శక్యముగాదుగదా! వారే యొకపుడు మిగులుదురేని మమ్ము మఱి మిగులనీరు. సత్యప్రతిజ్ఞుఁడగు యుధిష్ఠిరుఁడు జీవముతోఁ బట్టు కొనఁబడి నాకడకువచ్చెనా, వానితో మఱల ద్యూతమొనర్తును. అపుడాద్యూతమున నోడిన యాధర్మజుని వెంటనంటి పాండవులెల్ల మఱల నరణ్యమునకుఁ బోవుదురు. అటులగునేని నాకుఁ జిరకాలము జయమగుట సిద్ధము. ఓయాచార్యవర్యా! ఈకారణముచే ధర్మజుని మారణమును గోరకుంటిని’ అని

“ఓరాజా! అపుడాదుర్యోధనుని కపటనిశ్చయమును దెలిసి యాద్రోణుఁడు తత్త్వవేత్తయగుట నాసుయోధనుతో ‘ఓరాజా! నీకు వరమొసంగెదనుగాని యర్జునుఁ డాయుధిష్ఠిరునిఁ బాలింపకుండెనేని నీకాధర్మజుని వశమొనర్చువాఁడనని తలంపుము. దేవాసురులకును నా యర్జునుని జయించుట వలనుపడదు. అటులగుట నీ విషయమునఁ గోపింపవలదు. వాఁడు నాకు శిష్యుఁడై యస్త్రవిద్యలో నిస్సంశయముగా నాకధిక ప్రియుఁడు. మఱియుఁ దరుణుఁడు. ధన్యతముఁడు. సాహసము గలవాఁడు. ఇదియుఁగాక యాతఁ డింద్రునివలనను శంక

రునివలనను నస్త్రములను సంపాదించినవాఁడు. మఱియు నీపైఁ గోపము గలిగియున్నవాఁడు. కావున నిట్లు పలికితిని. ఇందులకుఁ గోపింపకుము. ఏయుపాయముచేనైన నాయర్జునుఁడు రణరంగమునుండి తొలఁగెనా? ధర్మజుఁడు నీకు వశుఁడయ్యెననుకొనవచ్చును. నీవన్నటులు వానిని బట్టుకొనినపుడె నీకు జయముగాని వానినిఁ జంపుటచే నీకు జయము గలుగదు. నాచెప్పినయుపాయముచేతనే యాతనిగ్రహణము సంభవించెడిని. సత్యధర్మనిరతుఁడగు నాధర్మరాజునిఁ బట్టికొనితెచ్చి నీకప్పగించెదను. ఇందులకు సందియము లేదు. అతఁడు సంగ్రామమున రెండుగడియలు నాకు ముందుగా నిలిచియుండఁగా నర్జునుఁ డపు డందు లేకుండెనేని ధర్మజుఁడు మనకు దొఱకెననుకొనుము. అర్జునునిసమక్షమున నాతనిఁ బట్టుకొనుట దుర్లభము. నాకేగాదు. సురాసురులకు నయ్యది సాధ్యపడనిది.' అని పలికెను.

ఓయాంబికేయా! ఇట్లు లాయుధిష్ఠిరుని నిగ్రహము ద్రోణునిచేఁ బ్రతిజ్ఞాతమగుడు, మూర్ఖులగు నీకొమరులు ధర్మజుఁడు దొఱకెననియే తలంచిరి. సుయోధనుఁడా ద్రోణునకుఁ బాండవులయెడఁ బ్రీతిగలదని తెలిసియే మఱియు నాతనిప్రతిజ్ఞ స్థిరమగుటకై యెల్లరకుఁ దెలియునట్లుగా సైన్యములుగల యెల్లెడల ధర్మజునిగ్రహమును జాటించెను." అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

## ద్రోణుఁడు యుధిష్ఠిరునిఁ బట్టుకొనెదనని ప్రతిజ్ఞ చేయుట

"ఓరాజా! అటు లాయుధిష్ఠిరు నిగ్రహము జాటింపఁబడుట విని మనసైన్యములు సింహనాదములను శంఖారావములను గావించెను. ఓభారతా! ఆభారద్వాజకృత్యమును ధర్మజుఁడు తనకాప్తులగువారివలన విని, తనసోదరులను నింకనుగలయోధులను రప్పించి వారెల్ల వినుచుండ నర్జునునితో నతఁడు "ఓతమ్ముఁడా! ఇపుడు ద్రోణుఁడొనర్చిన ప్రతిజ్ఞను వింటివా ? ఎటులే నది యసత్యమై చెడునట్టియుపాయము చింతింపఁబడుఁగాక ఆద్రోణుని ప్రతిజ్ఞలోఁ గొంత యవకాశమున్నది. అయ్యది నీవలనఁ గావలసియున్నది. కావున నీవు నన్ను వీడక నావెనుకనుండి యుద్ధముచేయుచుండవలయును. అటులేని ద్రోణునిచే సుయోధనుఁడు తనయిాప్సితము నొందఁజాలకుండెడిని' అని పలికెను.

అది విని యర్జునుఁడు 'ఓయన్నా! ద్రోణున కొకపుడును నన్ను వధించు టెట్లు సాధ్యపడదో యటులే నిన్ను నే విడుచుటయు నొకపుడును సంభవింపదు. నే నాచార్యునకుఁ బ్రతియోధుఁడనై ప్రవర్తింప నేరనేని రణరంగమున నా ప్రాణములను విడుచువాఁడను. నిన్నుఁ బట్టుకొని దుర్యోధనుఁడు రాజ్యమును గోరువాఁడేని యీజీవలోకమున వాఁ డెటులును దనకోర్కెను బొందనేరఁడు. నక్షత్రములతో నాకసము కూలుఁగాక. పుడమి వ్రయ్యలగుఁగాక. కాని నేను జీవించియుండఁగా ద్రోణుఁడు నిన్నుఁ బట్టుకొనుట జరుగదు. ఇది నిశ్చయము. ఇఁక నా ద్రోణున కావజ్రధారియు సహాయ మొసర్పనీ! లేక దేవతలతోఁ గూడి విష్ణువు సహాయుఁడు కానీ! ఈరణరంగమున నిన్నెవ్వఁడును స్పృశింపఁజాలఁడు. ఓరాజోత్తమా! నేను జీవించి యుండఁగా నీకు భయమేటికి? ద్రోణుఁడు శస్త్రాస్త్రధారులలో సారమైనవాఁ డగుఁగాక. నీవాతనికి జడియనక్కఱలేదు. ఓరాజా! నేను వేఱొక నిశ్చలమగు ప్రతిజ్ఞచేసి పలుకుచున్నవాఁడను. నే నన్నృతమాడను. నాకుఁ బరాజయములేదు. ప్రతిజ్ఞచేసిన దించుకయుఁ దప్పను.' అని పలికెను.

ఓధృతరాష్ట్రా! పిమ్మటఁ బాండవులున్న చోట శంఖములును, భేరులును, మృదంగములును, బటహములును మ్రోయింపఁబడియెను. మహాత్ములగునప్పాండవులు సింహనాదము లొనర్చిరి. భయంకరమై ధనుష్టంకారములును మిన్నుముట్టెను. పాండవుల యాశంఖనినాదమును విని మనసైన్యములవారును వాద్యములను మ్రోయించిరి. పిదప నుభయసైన్యములవ్యూహములును యుద్ధాభిలాషమై మెల్లగాఁ బరస్పరమును సమీపించెను. పిమ్మట ద్రోణపాంచాలురకును, గురుపాండవులకును గగురుపాటొదవించు సంకులయుద్ధ మారంభమయ్యెను. ద్రోణరక్షితమగు సైన్యమును దునుమాడుటకు సృంజయు లెంత ప్రయత్నించినను నది వారికి సాధ్యపడదయ్యెను. అటులే యర్జునపాలితమగు పాండవసైన్యము నోడించుటయుఁ గౌరవవీరులకు సాధ్యపడకుండెను. అటులా యుభయసైన్యములును బరస్పరమును జేరియు రక్షితములగుట నిశ్చలములై, రాత్రి పుష్పించి నిద్రించిన వనవీథులువలెఁ గానవచ్చెను. ఓరాజా! పిమ్మట సువర్ణరథుఁడగు నా ద్రోణుఁడు వైరిసైన్యము నురుమాడుచు సేనామధ్యమునఁ జరించెను. అతఁ డొకఁడయ్యును శరకర

లాఘవముచేఁ బలువురుగాఁ గానవచ్చెను. సూర్యసముఁడగు నాతనిచేఁ బ్రయుక్తములగు ఘోరశరపరంపర లెల్ల దెసల నిండి పాండవసైన్యము నకు వెఱపుగలిగింప మొదలిడెను. సహస్రకిరణసంవృతుఁడై సూర్యభగవానుఁడు మధ్యందినగతుఁడై యెటులు విరాజిల్లునో యటులే ద్రోణుడును గానవచ్చెను. అటులు సమరమునఁ గుపితుఁడైయున్న యాద్రోణునిఁ బాండవులలో నొకఁడును మున్నామహేంద్రుని దానవులువలెఁ దేఱిచూచుటకును వలంతి గాకుండెను. పిమ్మట నాభారద్వాజుఁడు ప్రతాపశాలియై నిజశితశరపరంపరచే ధృష్టద్యుమ్నబలమును వడిగాఁ బీడించుచు, బాణములచే నెల్ల దెసలఁగప్పుచు నాధృష్టద్యుమ్నుఁడున్నచోటఁ గలపాండవసైన్యమును మర్దింపసాగెను." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

అభిమన్యునిపరాక్రమము

"ఓరాజోత్తమా! పిమ్మటఁ బాండవసైన్యమున మిగుల సమ్మర్దమును గలిగించుచు, వృక్షముల నగ్నివలె వైరిసేనలను దహించుచు, నాద్రోణుఁడు చరించెను. ప్రజ్వలించునగ్నినాఁ బాండవసైన్యమును దహించు నాసువర్ణరథు నారసి పాంచాలురు కంపింపసాగిరి. గట్టిగాఁ దివిచివిడిచిన యాతనివింటిచప్పుడు పిడుగుచప్పుడునా వినవచ్చెను. హస్తలాఘవముగల యాతనిసాయకములు రథికులను రౌతులను బదాతులను గజాశ్వములను మర్దింప నారంభించెను. తొలుకరిని గర్జలును గాలియుఁగల పర్జన్యుఁడునాఁదగి, పాషాణవర్షమును శరవర్షమును గురియుచు, నాద్రోణుఁడు పాండవసైన్యమునకు భయమొదవించెను. ఓ రాజా! అపు డాభారద్వాజుఁడు నలుదెసలఁ జరించుచు, సేనలఁ గలఁతవెట్టుచు వైరులకమానుషమగు భయమును జనింపఁజేసెను. సువర్ణాలంకృతమగు నాతనిచాపము రథము లనెడిమబ్బులలో మెఱుపువలెఁ దిరుగుచు, మఱిమఱియుఁ గానవచ్చుచుండెను. సత్యవంతుఁడును బ్రాజ్ఞుఁడును వీరుఁడును ధర్మాధారుఁడునగు నాభారద్వాజుఁడు యుగాంతకాలుఁడువలె ఘోరమై రౌద్రమగు రక్తనదిని బ్రవర్తిలఁజేసెను. అయ్యది కోపవేగముచే జనించి మాంసాశనగణసంకులమై, సైన్యప్రవాహముతోఁబూర్ణమై, వీరులనెడివృక్షముల నీడ్చుకపోవుచు, రక్తోదకము

లును రథములనెడిసుడులును గలిగి, గజాశ్వములె యొడ్లుగాఁ గవచము
లనెడికలువలు వెలయ, మాంసమనెడిబురదయు, మేదోమజ్జాస్థు లనెడి
యిసుకయు, నుష్ణీషము లనెడినురుగునుగలిగి, సమరమనెడి మేఘములచేఁ
బూర్ణమై, ప్రాసాదులనెడి చేఁపలుగలిగి గజాశ్వపదాతులచే దురవగా
హమై శరతరంగములు వెలయ, మానవాదిశరీరదారుసంఘర్షణమొప్ప,
శకటకచ్ఛపసంకులమై, హతవీరశిరస్తటమై, కత్తులనెడిమత్స్యములును,
గజరథములనెడి మహాహ్రదములును, మహారథములనెడి శతావర్తము
లునుగలిగి, భూరేణువు లలలుగా భీరువులకుఁ జొఱరానిదై, కంకగృధ్రా
దులతోనిండి వేలకొలఁది మహారథికులను యమద్వారమును జేరుచుచు
శూరులనెడి క్రూరజంతువులతోనిండి, తెగిపడినశస్త్రములె హంసలుగాఁ
గిరీటములె పక్షులుగాఁ, జక్రములె కూర్మములుగా, గదలే నక్రము
లుగా వెలయుచుఁ, బితృలోకమునకు నూఱులకొలఁది తీసికొనిపోవుచుఁ
బ్రవహింపసాగెను. ఓరాజా! హతులగు వారికేశములె నాఁచుగా, నా
రక్తనదిని భయశీలురగువారికి వెఱపుగొలుపు నాద్రోణుఁడు ప్రవ
హింపఁజేసెను. అటులు తమసైన్యమును బెదరించుచు మహారథుఁడై
యున్న యాద్రోణుని నలుగెలంకులను యుధిష్ఠిరుఁడు మున్నగుపాండవ
యోధులు చుట్టుకొనిరి. అపు డటు లాతనిఁ జుట్టికొన్నపాండవశూరుల
నారసి దృఢపరాక్రములగు మనయోధులు నలుగడల మూఁగి వారి
కడ్డువడిరి. అంత నద్భుతమగుయుద్ధ మారంభమయ్యెను. అపుడు బహు
కపటుఁడగు శకుని సహదేవు నెదుర్కొని వానిసారథిని రథమును ధ్వజ
మును దీవ్రనారాచములచే నొప్పింప, నామాద్రీతనయుఁడును నాశకుని
సూతుని కేతువును రథమును గుఱ్ఱములను దెగనేసి యఱువదిశరము
లచే నాశకునిని సవిలాసముగాఁ బ్రహరించెను. అంత నాశకునియు
నొకగదను బూని రథముదిగి యాసహదేవుసూతుని రథమునుండి పడఁ
ద్రోసెను. ఓరాజా! పిమ్మట నమ్మహారథులిరువురును విరథులై తమబల
ములు వెలయ గదాహస్తులై శృంగములతోఁగూడిన పర్వతములునా
రణరంగమునఁ గ్రీడింప మొదలిడిరి. పిదప ద్రోణుఁడు పాంచాలాధీశునిఁ
బండ్రెండుబాణములచే నొప్పించి, యాతఁడు పెక్కుబాణములచేఁ
దన్నుఁ బ్రహరింప మఱియు నతని నంత కధికమగుశరజాలములచేఁబీడిం
చెను. భీముఁడు వివింశతిని వింశతితీవ్రనారాచముల నొప్పించియుఁ

జలింపఁజేయఁజాలకుండుట యద్భుతమయ్యెను. అంత నావివింశతి కడు వడిగా, నగ్గాడుపుకొమరునిగుఱ్ఱములను, ధ్వజమును, శరాసనమును ఖండింప, సైన్యము లాతనిఁ బూజించిరి. పిమ్మట నవీర్యుఁడగు భీముఁడు దానిని సహింపక తనగదతో వానిగుఱ్ఱములను గొట్టి నేలఁగూలనేసెను. ఓరాజా! పిదప నావివింశతియు, హతాశ్వుఁ డగు నిజరథము డిగి మహాబలుఁడై కేడెము పూని మత్తగజముపై మదగజమువలె నవ్వాయుపుత్రునిపైకి వడిగా వెడలెను. వీరుఁడగుశల్యుఁడు తనమేనల్లుఁ డగు నకులునిఁ గాంచి నగుచు, లాలించుచుఁ, గోపము పుట్టించుచుఁ గొన్ని బాణములచే నాతనిఁ గొట్టెను. అందుల కతఁ డలిగి, యాశల్యునియాతపత్రమును, ధ్వజమును, సూతుని, ధనువును దునుమాడి, యాసమరరంగమునఁ దనప్రతాపము వెలయ శంఖమును బూరించెను. పిమ్మట ధృష్టకేతువు కృపునిచేఁ బ్రయుక్తములగు వివిధశరపరంపరల నఱికి, డెబ్బది బాణములచే నాతని నొప్పించుటయేగాక, మఱియు మూఁడుబాణములచే నాతనిధ్వజము దెగనేసెను. కృపుఁడు వానిని గొప్పశరవర్షముచే నివారించి, మఱియు నాతనితోఁ గొంతవడి యుద్ధమొనరించెను. సాత్యకి కృతవర్మునిఁదాఁకి యొకనారాచముచే నాతనివక్షము నొవ్వనేసి, మఱియు డెబ్బదిబాణములచే నొప్పించెను. అంత నాకృతవర్మఁడును డెబ్బదేఁడు తీవ్రనారాచముల నొప్పించియు, వాయువు కొండనువలె నించుకేని నాశైనేయునిఁ గంపింపఁజేయఁజాలఁడయ్యెను. పాండవసేనాపతియగు ధృష్టద్యుమ్నుఁడు సుశర్మను మర్మముల నొప్పింప, నాతఁ డొకతోమరముచే నాతని జత్రుదేశమును నొప్పించెను. విరాటుఁడు మహావీర్యనిధులగు నమాత్యులతోఁ గర్ణుని నివారించుట యెంతయు నద్భుతమయ్యెను. అపు డక్కర్ణుఁ డావిరటునిసైన్యముల నాపుటలోఁ జూపిన దారుణపరాక్రమ మెంతయు శ్లాఘింపనయ్యెను. ద్రుపదుఁడు భగదత్తుని మార్కొన వారిరువురకును జిత్రతరముగా యుద్ధమయ్యెను. భగదత్తుఁడు తీవ్రబాణములచే నాద్రుపదునిధ్వజమును సూతునిరథమును గొట్టఁగా నాతఁ డాభగదత్తునివక్షము నొకవాఁడికోలచే నొప్పించెను. అంత యోధవరు లగుసౌమదత్తియు,శిఖండియు,నస్త్రవిశారదులై ప్రాణులకు వెఱపుగలుగ యుద్ధమొనర్చిరి. అపు డాభూరిశ్రవుఁ డాశిఖండిని బహుశరపరంపరచేఁ గప్పఁగా నాశిఖండియుఁ గుపితుఁడై తొంబదిబాణ

ములచే నాసోమదత్తిని నొప్పించెను. ఓరాజా! క్రూరకర్ములగు ఘటో త్కచుఁడు, నలంబుసుఁడును బరస్పరజయకాంక్షలతో నదరి యత్య ద్భుతయుద్ధ మొనర్చుచుఁ, బెక్కుమాయలను సృజించికొనుచు, గర్వి తులై చరించుచుఁ, దమమాయాబలముచే నొకరి కొకరు గానరాక, మఱుఁగువడుచుఁ జూపరుల కచ్చెరువుగలుగఁ జరించిరి. చేకితానుఁ డను విందునిఁ దలపడి భయంకరముగా సమర మొనర్ప, వారిరువురును మహా బలులగు బలశక్రులవలెఁ జూపట్టిరి. లక్ష్మణుఁడు క్షత్రదేవునితో నెంతయు భీకరముగాఁ బోరాడెను. వారిపోరాటము, నారాయణ హిరణ్యాక్షులయుద్ధమును బోలియుండెను. పిదప శాస్త్రీయముగా నిర్మింపఁబడి కడువడిగలగుఱ్ఱములను బూన్చినరథముతోఁ బౌరవుఁ డభి మన్యునిఁ దలపడి సింహనాద మొనర్చెను. అంత నాయభిమన్యుఁడును యుద్ధాభిలాషియై వెడలి వానితో నెంతయు నద్భుతముగాఁ బోరాడఁ దొడఁగెను. పౌరవుఁ డపు డాయభిమన్యుని శరపరంపరల నొప్పింప, నతఁ డాపౌరవుని ఛత్రమును, ధ్వజమును, గుఱ్ఱములను బుడమిఁ బడఁ ద్రోసి, మఱియుఁ గొన్నిబాణములచే వానిని గొట్టి, తనసైన్యమునకు సంతసమొదవ సింహనాద మొనర్చి, మఱియు నాపౌరవునిఁ జంపఁదగు నొకతీవ్రనారాచము సంధించెను. ఘోరాకారమగు నాసాయకముసార మెఱిఁగి యపుడు కృతవర్మ రెండుబాణములచే దానిని వింటితోఁ గూడ ఖండించెను. అటులు తునిసినయాధనువువిడిచి తెల్లనిఖడ్గమును బట్టికొని పెక్కుచుక్కలుగల కేడె మొకటి పూని కరలాఘవము వెలయఁ గత్తి త్రిప్పుచుఁ దనపరాక్రమము వెలయఁ జరించుచు, నతఁడు తనకేడెమున కును ఖడ్గమునకును నడుమ నిర్విశేషముగాఁ గానవచ్చెను. అటు లతఁ డదరి యప్పౌరవునిరథముపై కుఱికి సింహనాద మొనర్చుచు, వాని జుట్టు పట్టిలాగుచు, వానిసూతు నొకపదప్రహారముచే నొప్పించి, తనకత్తిచే మఱియు వానిధ్వజమును బడఁద్రోసి, సముద్రమును గలఁతపెట్టి మహా నాగమును జలింపఁజేసిన గరుడునివలె నప్పౌరవు నీడ్చుటను మన పార్థివులెల్లరును జూచిరి. అంత నాయభిమన్యునిచేతఁ జిక్కి యాతనిచే నీడ్వఁబడుచు దిక్కులేకయున్న యప్పౌరవు నారసి యందులకు సహింప క, సైంధవుఁడు బర్హములును, బంగారుమువ్వలును గలిగిన చర్మమును ఖడ్గమునుబట్టి సింహనాద మొనర్చుచుఁ, దనరథమునుండి వానిపై కుఱి

కెను. అటులు తనపైకివచ్చు నాసైంధవు నారసి యభిమన్యుఁ డప్పార్వుని విడిచి డేగవలె గడునడిగా వానిపై కుఱికి, వానిచేఁ బ్రయుక్తములగు ప్రాసపట్టసనిస్త్రింశాదులను దనకత్తిచే నఱికి చర్మముచే నడ్డుకొనియెను. అట్టి యభిమన్యునిబాహుబలము నెల్లరును గాంచి యద్భుతపడిరి. మఱియు నయ్యభిమన్యుఁడు కత్తిని గేడెమును నెత్తి తనతండ్రికిఁ బరమవైరి యగు నాసైంధవునిపైకిఁ గుంజరముపైకి వెడలిన సింగపుంగొదమనా వెడలెను. అపుడు వారిరువురును ఖడ్గదంత, నఖాయుధులై బెబ్బులియు సింహమును వలెఁ బరస్పరముఁ బ్రహరించుకొనిరి. పురుషసింహులగు వారిరువురును, గేడెములను గొట్టుటయందును బడఁద్రోయుటయందును బడుటయందును భేదములేక పోరాడిరి. మఱియుఁ బరస్పరముఁ దప్పించుకొనుటలును, గత్తిచప్పుడులు, లోవెలుపలలఁ బడుటలును, వారికిఁ దుల్యములై గానవచ్చెను. వారటులు బాహ్యాభ్యంతరములఁ జరించుచు ఱెక్కలుగలకొండలునాఁ జూపట్టిరి. అపుడభిమన్యుఁడు కత్తిని వైవఁగా నాసైంధవుఁడు వానిచర్మపర్యంతమునఁ గొట్టెను. అయ్యది మిక్కిలి బలముగా బ్రయుక్తమై సువర్ణపత్త్రాంతరమగు తనచర్మమునకే తగిలి ముక్కలయ్యెను. అంత నభిమన్యుఁ డాసైంధవునిఖడ్గము ఖండితమగుటఁ దెలిసి యాఱడుగులేగి మఱల నెప్పటిచొప్పున నొకనిమేషమునఁ దనరథ మధిష్ఠించెను. అటు లాసైంధవుని విడిచి యభిమన్యుఁడు నిజరథ మధిష్ఠించుట నారసి యందలివీరులు పలువు రొక్కమొగి నాతనిఁ జుట్టుకొనిరి. పిమ్మట నమ్మహాబలుఁడు కేడెము ఖడ్గమును బాఱవైచి సైంధవునిఁ గాంచుచు వానిపరాభవము నెంచి సింహనాద మొనర్చి, భాస్కరుఁడు లోకమునువలె వానిసైన్యమును దపింపఁజేయఁదొడంగెను. పిమ్మట శల్యుఁ డాయభిమన్యునిపై సువర్ణభూషిత మగు నొకశక్తిని వైవ, నగ్నిజ్వాలవలె ఘోరాకారమై ప్రజ్వలించుచువచ్చు నాశక్తి నాతఁ డెగిరి పట్టుకొనియెను.అయ్యది పరుగిడుచు వచ్చు నురగమునుబట్టిన గరుడునిపరాక్రమమును దలపించెను. అపుడాతనిబలమును లాఘవమును గాంచి రాజులెల్లరును సింహనాదములొనర్చిరి. అంత నాయభిమన్యుఁ డాశల్యప్రయుక్తమగుశక్తినే యాతనిపై వైవ నది వానిసూతునిఁ గొట్టి రథమునుండి నేలఁ గూలద్రోసెను. అపుడు విరాటద్రుపదులును, ధృష్టకేతుయుధిష్ఠిరులును, సాత్యకియుఁ,

గైకయుఁడు, ధృష్టద్యుమ్నుఁడును, శిఖండియు, నకులసహదేవులును, ద్రౌపదేయులును నాయభిమన్యునిఁ గాంచి మేలుమేలని పొగడిరి. మఱియు వివిధములగు బాణశబ్దములును, బహువిధములగు సింహనాదములును నాయభిమన్యునిధైర్యమును సూచించుచుఁ జెలరేఁగెను. అంత నీతనయులు తమశత్రుని జయలక్షణమును సహింపక నలుగెలంకుల నాతనిఁ జుట్టుకొని, మబ్బులు పర్వతమునవలె నాతనిపై శరవర్షమును గురిసిరి. అంత నాకౌరవులకుఁ బ్రియమొనర్చువాఁడై తనసూతు నవమానమును దలంచుచు శల్యుఁ డాయభిమన్యునిపైకి వెడలెను” అని తెలుప విని ధృతరాష్ట్రుఁ డిట్లనియె.

శల్యుఁడు భీమున కోడి పాఱిపోవుట

“ఓసంజయా! లోకమున నిట్టివిచిత్రములై బహువిధము లగు ద్వంద్వయుద్ధములను దెలుపుచున్నాఁడవు. వానిని గన నాకుఁ గన్నులు లేకుండుటకుఁ జింతించుచున్నాఁడను. కురుపాండవులయుద్ధము దేవాసురయుద్ధమువలె మిగుల నాశ్చర్యమొదవించునదని మానవులు చెప్పుకొందురు. ఈయుత్తమయుద్ధమువిధ మెంత వినినను దృప్తిగలుగకున్నది. కావున శల్యసౌభద్రులకు జరిగినయుద్ధమువిధ మెఱిఁగింపుము.”

అది విని సంజయుఁడు “ఓరాజా! తనసూతుఁ డటులు తెగుటయుఁ గుపితుఁడై యాశల్యుఁ డొకగదనెత్తి త్రిప్పుచు రథము డిగి ప్రదీప్త కాలాగ్ని నిదండహస్తుఁ డగు యమునిఁబోలి వెడలుటను గాంచి, భీముఁ డొకగదను బట్టికొని వడిగా వెడలెను. అభిమన్యుఁడును బిడుగుబోని యొకగొప్పగదను బూని ‘ఓయీ! శల్యా! రమ్మురమ్ము’ అని పలుకుచు భీమునిచేఁ గడు ప్రయత్నముచే నివారింపఁబడియెను. అటు లాభీముఁ డాయభిమన్యుని వారించి తనప్రతాప మేర్పడ శల్యునిఁ దాఁకి కొండవలె నచలుఁడై యుండెను. అటులే శల్యుఁడును భీము నారసి తనబల మేర్పడ వడిగా బెబ్బులి యేన్గునుబోలె నాతని కభిముఖుఁడై యుండెను. పిదప శంఖారావములును, భేరీనినాదములును, సింహనాదములును, దూర్యధ్వనులును మెండై మ్రోగసాగెను. అపుడు పరస్పరమును గురుపాండవులు పరువులిడువారును జూచువారునై యుండ మేలుమేలను చప్పుడు లుప్పతిల్లెను. అంత నాసైన్యములలో ‘భీమునివేగమును

సహించుట శల్యునకును, శల్యునివడి నాఁగుట భీమునకును దప్ప వే తెవ్వరును శక్తులు గాఁజాల”రనుపలుకులు విననయ్యెను. సువర్ణపట్టము లచే బద్ధమై చూపరులచూడ్కికి వేడ్కగొలుపుచు భీమునిగద యెంతయుఁ బ్రజ్వలించెను. అటులే పలుమార్గములఁ జరించుచు మండల గతులవర్తిలు నాశల్యునిగదయు మెఱుపుబోనికాంతిగలిగి వింతగొలుప సాగెను. వారిరువురును వృషభములువలె గర్జించుచు, మండలాకార ముగాఁ దిరిగిరి. మఱియు గదాగ్రములఁ ద్రిప్పు నాపురుషసింహులగు శల్యవృకోదరు లిరువురకును మండలావర్తమార్గములందును, గదా ప్రహారములందును గొంచెమేని భేదము గానరాక యుద్ధము ప్రవర్తిల్లెను. భీమసేనతాడితమై శల్యునిగద మిడుఁగురు లుమియుచు వ్రయ్యలయ్యెను. అటులే శల్యగదాహతమై భీమునిగదయు వర్షాప్రదోషమున మిడుఁగురుపురుగులచే నావృతమగు వృక్షమువలె వెలయఁజొచ్చెను. ఆసమరమున మద్రరాజుచేఁ బ్రక్షిప్తమగునాతనిగద యాకసమును జ్వలింపఁజేయుచు, మఱిమఱియు నగ్నిని జనింపఁజేసెను. అటులే భీముని గదయు మహోల్కవలె సైన్యమును దపింప జేయసాగెను. సర్వోత్తమములగు నారెండుగదలును బరస్పరముఁ గలిసి బుసకొట్టు నాఁడుపాములునాఁ బోరుచు నగ్నిని సృజించెను. అపు డాభీమశల్యులు, గోళ్లచే బెబ్బులులును, దంతములచే మదపుటేనుఁగులునుబోలె గదాగ్రములచేఁ బరస్పరము ప్రహరించుకొనసాగిరి. అంతఁ బరస్పరగదాప్రహార హతులై రక్తసిక్తాంగులై యామహానీయు లిరువురును బూచినమోదుగులునాఁ జూపట్టిరి. ఆపురుషసింహుల గదాప్రహారారావములు పిడుగులఁబోలి యెల్లదెసల విననయ్యెను. శల్యునిగదచేఁ గుడియెడమలఁ గొట్టుపడియు నాభీముఁడు భిన్నమగుపర్వతమువలె నించుకేని జలింపఁ డయ్యెను. అటులే భీమగదాహతుఁ డగుశల్యుఁడును వజ్రహత మగు పర్వతమువలె ధైర్యముచేఁ గదలకుండెను. అపుడు వారిరువురును గద లెత్తి కడువడిగాఁ గొంతతొలఁగుచు, మఱియు నంతరమార్గములఁ జరించుచు,మండలగతుల వర్తిలుచు, నెనిమిదడుగు లెగురుచు, గజములవలె సమీపించుచు, వడిగా లోహదండములచేఁ బరస్పరముఁ బ్రహరించుకొనిరి. పిమ్మట వారిరువురును బరస్పరగదావేగములచేఁ బ్రహతులై యొక్కమాఱుగనే యింద్రధ్వజములువలెనేలఁగూలిరి. అంత వివశుఁడై

నిట్టూర్పులుపుచ్చు నాశల్యునికడకు వడిగా మహారథుఁడగు కృతవర్ముఁడు వచ్చి గదాభిహతుఁడై యున్న యాతనిఁ గాంచి, మూర్ఛమునిఁగి పాము వలెఁ గొట్టుకొనునాతనిఁ దనరథముపై నెక్కించికొని వడిగా నారణరంగమునుండి తొలఁగించికొనిపోయెను. పిదప భీముఁడును వివశుఁడై పడి కొంతవడికి లేచి గదాహస్తుఁడై గానవచ్చెను. అటులు పరాఙ్ముఖుఁడైన యాశల్యునిఁ జూచి నీకొడుకులు నిజగజాశ్వరథపదాతులతోఁ గూడ వడంకసాగిరి. అపుడు గాలిచేఁ జెదరిన మేఘములునా నీవారెల్లరును పాండవులపీడ నోపక భీతులై నలుదెసలకును జెదరిపోయిరి. మహారథులగు పాండవు లటులు ధార్తరాష్ట్రులను జయించి ప్రజ్వలించునగ్నులువలెఁ బ్రకాశించిరి. అంతఁ బాండవసైన్యమున సింహనాదములును, శంఖారావములును, భేరీనినాదములును మృదంగవాద్యములును నానకస్వనములును నొక్కుమ్మడిగా మ్రోసెను" అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

## అర్జునుని విజయము

"ఓరాజా! అవక్రవిక్రముఁడైనకర్ణపుత్త్రుఁడగువృషసేనుఁడు నీవారిబలమెల్లఁ జెదరుటను గాంచి తానొకఁడే నిజాస్త్రబలముచేఁ దన సైన్యములకు ధైర్యముగలుగ శత్రుసేనలను శరవర్షమున ముంచుచు విజృంభించెను. అంత నాతనిశరపరంపరలు గజాశ్వాదులను వేలకొలదిగాఁ బరిమార్చుచు, వేసఁగి సూర్యునికిరణములువలెఁ బ్రతాపమును జూపెను. ఓమహారాజా! ఆవృషసేనునిచేఁ బీడితులై పెక్కురు రథికులును రౌతులును గాలిచేఁ గూలినవృక్షములువలె నొక్కుమ్మడిఁ బుడమిఁ బడిరి. ఓరాజా! మహారథుఁడగు నావృషసేనుఁడు గుఱ్ఱపుదళములను, గజయూథములను, రథసంఘములను వేలకొలఁదిగాఁ బడఁద్రోయుచు నిర్భయుఁడై చరించుటను జూచి, యోధులెల్లరును నాతని నలుగెలంకులఁ జుట్టుకొనిరి. పిదప నకులపుత్త్రుఁడగు శతానీకుఁ డావృషసేనునిఁ దలపడి మర్మభేదకములగు పదితీవ్రనారాచములచే నాతనిఁ బ్రహరించెను. కర్ణపుత్త్రుఁ డాశతానీకునికేతువు గూలనేసి ధనువు దునుమాడెను. పిమ్మట నాశతానీకునకుఁ దోడ్పడువారై ద్రౌపదేయులు వచ్చి, యావృషసేనుని శరపరంపరచేఁ గప్పి కానరాకుండఁ జేసిరి. ఓమహారాజా!

అశ్వత్థామ మున్నగుమహారథికులు కొందఱు ద్రౌపదేయులపైకి వెడలి, వడిగా మబ్బులు కొండలనువలె నానావిధములగు శరసమూహములచేఁ గప్పిరి. అపుడు పాండవులును, బుత్రత్రాణపరాయణులై పాంచాల కైకయమాత్స్యసృంజయులతో నాయుధహస్తులై వడిగా వెడలిరి. అపుడు నీవారిలోఁ బాండవులకు దేవదానవులకువలె గగుర్పాటొద వించు సంకులయుద్ధమయ్యెను. ఓరాజా! వీరులగు నక్కురుపాండవులు క్రుద్ధులై యొకరినొకరు చూచికొనుచుఁ, బరస్పరము పీడించికొనుచు, యుద్ధమొనర్ప సాగిరి. తేజోనిధులై కోపావేశపరవశులయిన వారి మేనులు మింటఁబోరాడు గరుడనాగశ్రేష్ఠములవలెఁ గానవచ్చెను. భీముఁడు, కర్ణుఁడు, కృపుఁడు, ద్రోణుఁడు, నశ్వత్థామయు, ధృష్టద్యుమ్నుఁడు, సాత్యకి మున్నగుయోధులచే నారణరంగ ముదయించిన ప్రళయకాలసూర్యుఁడువలె విరాజిల్లెను. అపుడు పరస్పరము ప్రహరించుకొను నాయోధులకు బలాఢ్యులగు దానవులకు బలవంతులగు దేవతలతోవలె గొప్ప సంకులసమర మయ్యెను. పిదపఁ బాండవసైన్యము సాగరధ్వనులతోఁ జెలరేఁగి పరువులిడుచున్న మీసైన్యమును వధింప నారంభించెను. అపు డటులు శత్రుపీడితమై చెదరుచున్న నీవారిసైన్యమును గాంచి ద్రోణుఁడు 'ఓసైనికులారా! జడియకుఁడు' అని వారి వెఱపుదీర్చుచుఁ గుపితుఁడై యైరావతమునాఁ బాండవసైన్యమును జొచ్చి యుధిష్ఠిరునిఁ దలపడియెను. అంత నయ్యుధిష్ఠిరుఁ డయ్యాచార్యునిఁ దీవ్రములై కంకపత్రములగు బాణములచే నొప్పింప నాతఁ డా ధర్మజునిధనువు దునుమాడి రణరంగమునుండి తొలఁగునటు లొనరించెను. ఆధర్మజునకుఁ జక్రరక్షకుఁ డగు పాంచాలకుమారుఁ డడరి సాగరమును జెలియలికట్టవలె నాద్రోణుని నివారించుటను జూచి యందలి వారు సింహనాదములతో మేలుమేలని సంస్తుతింప మొదలిడిరి. అంత నక్కుమారుఁ డాద్రోణుని నారణరంగమున నొకసాయకముచే వక్షమునఁ గొట్టి నొప్పించి సింహమువలె మఱిమఱియు హుంకరించుచుఁ గరలాఘవ మేర్పడ నిరాయాసముగా శరపరంపరల నాతనిపైఁ గురియఁ, జక్రరక్షకుఁ డగు నక్కుమారుని ద్రోణుఁడు పలువిధముల నొప్పించి, నీవారిసైన్యముల నడుమను జొచ్చి నలుదెసలఁ జరించుచు వానికి రక్షకుఁడై యుండెను. అటులు నిర్వక్రవిక్రముఁడై యాద్రోణుఁడు శిఖం

డిని బదిరెండిటను, సుత్తమౌజు నిరువదింటను, నకులు నైదిటను, సహ దేవు నేడిటను, ధర్మజునిఁ బదిరెండిటను, ద్రౌపదేయుల నొక్కొకరిని మూఁడింటను, సాత్యకి నైదింటను, విరటునిఁ బదింటను నొప్పించి, ముఖ్యులగువారిని వరుసగాఁ బీడించుచుఁ దఱుముచు, మఱల ధర్మజు నెదుర్కొనియెను. ఓరాజా! అపు డామహారథుఁడగు భారద్వాజుని యుగంధరుఁడు తలపడి వాతోద్ధూతమగు మహార్ణవమువలెఁ గుపితుఁడై యున్న యాభారద్వాజుని నివారించెను. పిదప నాద్రోణుఁ డాయుధిష్ఠి రునిఁ దీవ్రనారాచముల నొప్పించి, యుగంధరు నొకభల్లముచే రథ మధ్యమునుండి పుడమిఁ బడఁద్రోసెను. అంత విరాటద్రుపదులును, కైక యులును, సాత్యకియు, శిబియుఁ, బాంచాల్యుఁడగువ్యాఘ్రదత్తుఁడును, సింహసేనుఁడును, నింకనుగల పెక్కురుయోధులును ధర్మజునిఁ గాచు వారై శరపరంపరలఁ గురియుచు, నాద్రోణునిమార్గము నడ్డిరి. అందుఁ బాంచాల్యుఁడగువ్యాఘ్రదత్తుఁడు తీవ్రములగు నేఁబదిబాణములచేఁ నాద్రోణుని నొప్పింప నందలిజను లందఱును గట్టిగా నఱచిరి. పిదప సింహసేనుఁడును, మహారథుఁడగుద్రోణుని వడిగాఁ గొట్టి యట్టహాస మొనర్ప నందలియోధులందఱును జడియసాగిరి. అంత నాద్రోణుఁడు కనులు పెద్దచేసి నారిని సారించి సథనుష్టంకారముగా నాసింహసేను నియు, వ్యాఘ్రదత్తునియుఁ దలల రెండుభల్లములచే డొల్లనేసెను. అతఁ డటులొనర్చి, మఱియు మహారథులగు పాండవులను శరపరంపరలఁ గప్పి యుధిష్ఠిరునికడ కంతకుఁడువలె వెడలెను. ఓరాజా! అపు డాయుధిష్ఠి రునిసైన్యమున 'అయ్యో! యుధిష్ఠిరుఁడు హతుఁడయ్యెడిని' అను శబ్దము లుప్పతిల్లెను. మఱియు నపుడు ద్రోణునిపరాక్రమము నాలో కించి 'ఆహా! ఇపుడు సుయోధనుఁడు కృతార్థుఁడగును. ఇఁక నిపుడేఁ ద్రోణుఁడు యుధిష్ఠిరునిఁ బట్టుకొని మనసుయోధనునికడ కేతెం చెడిని' అని మనవారు పరస్పరము పలికికొనుచుండఁగనే, యర్జునుఁడు తనరథఘోష ముప్పతిల్ల వెడలి, శోణితోదకముఁను రథావర్తమునై, యెముకలు, మెదడునుగూడి మృతులగువారెయొడ్లుగా, శరసమూహమె నురువుగాఁ, బ్రాసాద్యాయుధములే చేఁపలుగా, రణరంగమహానదిని బ్రవేశించి, కౌరవులను దఱుముచు, ద్రోణసైన్యమును జెదరఁజేయ మొదలిడెను. ఓరాజా! అపు డప్పాండవమధ్యముఁడు శరజాలముచేఁ

గప్పుచు మూర్ఛముంచుచు, వడిగా శరసంధానము సేయుచు ప్రయో గించుచుండఁగా, గొంచెమేని శరసంధానమోక్షణముల నవకాశము గానరాకుండెను. ఓమహారాజా! దెసలును, నాకసమును, దివియు, భువియు బాణమయమై, యించుకేని యవకాశము గానరాకుండెను. ఇంతయేల! ఆగాండీవధరుఁడొనర్చినబాణాంధకారముచే నారణరంగమున నేమియు నగపడకుండెను. అంత సూర్యుఁ డస్తమించుటను, ధూళులు గప్పుటను, నాసమరరంగమున వీఁడు మిత్రుఁడనియు, వాఁడు శత్రుఁ డనియు భేదమును దెలియ నలనుపడ కుండెను. పిదప ద్రోణుఁడు దుర్యోధనుఁడును మున్నగుమనవారు నిజసైన్యములు బెదరి యుద్ధ పరాఙ్ముఖములగుటఁ దెలిసి నాఁటికి యుద్ధమును ముగించిరి. అర్జునుఁడును దనసైన్యములను మఱలించెను. పిదప నర్జునునివిక్రమమునకుఁ బాండ వులును సృంజయులును నమందానందభరితులైరి. పాంచాలు రాధనం జయుని స్తుతివచనములచే మహర్షులు సూర్యునివలె సన్నుతించిరి అంత నాయర్జునుఁడు వైరులనోడించినవాఁడగుట సంతుష్టాంతరంగుఁడై వాసు దేవునితోఁడను వెనుకవచ్చుసైన్యములతోఁడను నిజశిబిరమునకు బయలు వెడలెను. అపు డాయర్జునుఁడు సువర్ణమణిమయమై వెలయురథమునఁ జుక్కలతో వెలయునాకసమున వెలయుచంద్రుఁడునాఁ జూపట్టెను.” అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## అర్జునుఁడు సంశప్తకులపై వెడలుట

“ఓయాంబికేయా! నాఁ డుభయసైన్యములును దమతమశిబిర ములకుఁ బోయి, యథార్హముగను, యథాభాగముగను, యథాన్యాయ ముగను నివసించియుండెను. అటులు ద్రోణుఁ డానాఁడు సైన్యములను మరలించి, దుర్యోధనుతో సిగ్గెదగదుర నిట్లనియె.

“ఓసుయోధనా! అర్జునుఁడు ధర్మజునకు రక్షకుఁడై యుండ కుండెనేని నే నాయుధిష్ఠిరుఁ బట్టి నీకప్పగించువాఁడనని ప్రతినచేసి యుంటిని. కాని యర్జునుఁ డాతని విడువకయే గాచియుండెనుగదా! కాన నాపలుకునకు శంకింపవలదు. కృష్ణార్జును లజేయులు. ఏకారణముచే నైనను నర్జునుం డందు లేకుండెనా ? నీకు యుధిష్ఠిరుఁడు వశపడెనని నమ్ముము. ఇపు డాయర్జును నెవ్వఁడేని యుద్ధమునకుఁ బిలిచి దూరముగాఁ దీసికొనిపోవలయును. వాఁడి నాతఁడు జయించునంతకును మఱలిరాకుండ

నెట్లైనఁ బ్రయత్నింపవలెను. అర్జునుఁడు లేనియట్టిసమయమున నేనాధర్మజునిఁబట్టెదను. ధృష్టద్యుమ్నుఁడు చూచుచుండఁగనే వారిసైన్యమును భేదింతును. ఆధర్మజుఁ డర్జునవిహీనుఁడై యుండియు రథమువిడువకుండెనేని యేయుపాయముచేనైనఁ బాండవాగ్రజుఁడు పట్టువడియెననియే నిశ్చయించుకొనుము. ఓరాజకుమారా! ఈమార్గమున నాయుధిష్ఠిరుని సపరివారముగా నీకు వశమొనర్తును. సంశయము లేదు. రెండు గడియలేని పాండవమధ్యమునఁ డండుండఁడేని యాతనిఁ దెచ్చుచున్నాఁడను. సంగ్రామవిజయముకంటె నిదియె మేలైనమార్గము.'

ఓయంబికానందనా! ద్రోణుఁడాడిన యప్పలుకులు విని త్రిగర్తాధీశుఁడగు సుశర్మ తనసోదరులంగూడి సుయోధనుతో 'ఓరాజా! అర్జునుఁడు మమ్మెల్లపుడును బరిభవించువాఁడు. మేము తొలుతఁ దప్పునేయకున్నను మాకతఁ డపకారముచేయనే తలంచుచుండును. మాకతఁ డొనర్చుపలువిధములగు నవమానములను స్మరించుకొనుచుఁ గ్రోధాగ్నిపరితప్తులమై యొకపుడును రాత్రి నిదురించువారము గాము. ఇపుడు దైవవశముగా నస్త్రసంపన్నుఁడగు నతఁడు మాకు సమయోధుఁడై పోరాడ సంభవించెను. మాయొదలఁ జిరకాలమునుండియుఁ జేయఁదగు కార్య మిపుడు చేయువారము. అయ్యది నీకుఁ బ్రియమైనదియు, మాకుఁ గీర్తికరమైనదియు నైయున్నయది. ఈసమరభూమినుండి పైకాతనిఁ దొలగించికొనిపోయి యాతనిఁ జంపువారము. ఇపు డిప్పుడమి నర్జునుఁడైన లేకుండవలెను. లేదా త్రిగర్తులైనను లేకుండవలయును. మా యీవచనములు సత్యములుగాని, వ్యర్థములుగావనివిశ్వసింపుము.

ఓధృతరాష్ట్రా! ఇటులు పలికి వారిలో సత్యరథుఁడును, సత్యవర్మయు, సత్యవ్రతుఁడు, సత్యేషుఁడు, సత్యకర్మ అను నేవురు సోదరులును బదివేలరథములతోఁగూడి శపథములు గావించి యుద్ధసన్నద్ధులైవచ్చిరి. మాలవుఁడు, తుండికేరుఁడును ముప్పదివేలరథములతో వెడలిరి. త్రిగర్తుఁడగుసుశర్మయు, మావేలకులు, లలిత్థులు, మద్రకులును మున్నగువారింగూడి తనసోదరులు వెంటరాఁ బదివేలరథములతో వెడలెను. మఱియు నానా దేశములనుండి వచ్చినవిశిష్టులు పదివేలరథములతో బయలువెడలిరి. అంత వీరెల్లరు నొకచోఁ గూడి యగ్నిసాక్షికముగా శపథములు గావించికొని, కుశచీరములను జిత్రములగు కవచములను ధరించి, ప్రా

ములపై నాశవిడిచి కీర్తివిజయములను గోరువారై, యుద్ధమునకు సంసిద్ధులైరి. మఱియు వారు సకలక్రతుదీక్షితులగువా రొందఁదగు నుత్తమలోకముల నొందఁదలంచినవారై, బ్రాహ్మణులకు వేలువేలుగా నిష్కములనొసంగి తృప్తులఁగావించి, గోవులను వస్త్రములను వాగ్దానముచేసి యగ్నిని బ్రజ్వరిల్లఁజేసి,యచ్చట దృఢనిశ్చయములతోఁ బ్రతిజ్ఞలొనర్చి యెల్లభూతములును వినుచుండ బిగ్గరగా 'ధనంజయునిఁ జంపుదు' మని ప్రతిజ్ఞచేసిరి. ఇంకను వారెల్లరును 'మే మాయర్జునుని రణరంగము నుండి మఱలిపోనిత్తుమేని, యసత్యవాదులు, బ్రహ్మఘ్నులు, సురాపాయులు, గురుదారాసక్తులు, బ్రాహ్మణధనాపహారులు, రాజాన్నచోరులును, శరణాగతపరిత్యాగులును బొందఁ దగునికృష్టలోకముల నొందువారము. అటులే గృహదాహకులును, గోఘాతకులును, యాచమానులనుగొట్టువారును, నపకారులును బ్రాహ్మణద్వేషులును బొందెడిలోకముల నొందువారము. మఱియు నెవ్వారు ఋతుకాలముల భార్యల నొందకుందురో, శ్రాద్ధకాలముల మైథున మొనర్తురో, యాత్మాపకారులో దాఁచినసొమ్ము దోఁచుకొందురో, మఱియు వేదనాశమును జేయుదురో, నాస్తికులై మాతృపూజారహితులై యెవ్వారు వర్తింతురో, యట్టివారొందు నీచలోకముల నొందుదుము. మఱియు నాయర్జునుఁడు మమ్ముఁ బీడించినను మేము యుద్ధపరాఙ్ముఖుల మగుదుమేని, పాపులలోకముల నొందుదుము. ఇఁక నీరణరంగమునఁ గర్తవ్యముగుకృత్యము నొనరింతుమేని, యుత్తమలోకముల నొందుదుము.' అని ప్రతిజ్ఞచేసి, వారు యుద్ధమునకు వెడలిరి. అపుడు వారెల్లరును నాయర్జునునియుద్ధ మొనర్చుటకై పిలిచి దక్షిణదిశకుఁ గొనిపోయిరి. ఓరాజా! అటులు వారు తన్నుయుద్ధమునకుఁ బిలువఁగా నపు డాధనంజయుఁడు ధర్మజునితో 'ఓయన్నా! సంశప్తకులు నన్ను రణ మొనర్ప రమ్మని పిలుచుచున్నవారు. నన్నొకరు పిలిచినపుడు పోయి మఱలకుండుట నాకు వ్రతమై యున్నది. ఇదె యీసుశర్మ తనసోదరులంగూడి వచ్చి నన్ను పిలుచుచున్నవాఁడు. కావున వీనిని సపరివారముగా సమయించుటకు నాకు సెలవొసంగుము. ఓరాజోత్తమా! ఒకరు పిలిచినపుడు పోకుండుటకు నేను సహింపఁజాలను. నిజముగా నన్నెదుర్కొనువైరులను జంపెదనని ప్రతిజ్ఞ చేయుచున్నాఁడనని దెలియుము.' అని పలికెను.

అది విని ధర్మజుఁ డయ్యర్జునుం జూచి 'ఓనాయనా! ద్రోణుఁడేమిచేయఁదలంచియుండెనో నీవు వినియున్నాఁడవుగదా! ఆభారద్వాజునివచన మెటులు సత్యముగాక చెడునో యటు లీవొనర్పవలసియున్నది. ద్రోణుఁడన్ననో బలశాలియును, శూరుఁడును, నస్త్రవిద్యాపారీణుఁడును, శ్రమమున కోర్చువాఁడును నై యున్నవాఁడు. మఱియు నమ్మహారథుఁడు నన్నుఁబట్టి సుయోధనున కప్పగింతునని ప్రతిజ్ఞ చేసియున్నవాఁడు' అని తెలిపెను.

అంత నగ్గాండివధరుఁ డాధర్మజునితో 'ఓయన్నా! ఈసత్యజిత్తు నిన్ను రక్షింపఁగలడు. ఈరణరంగమునఁ బాంచాల్యుఁడగు నీతఁడు బ్రతికియుండఁగా ద్రోణుఁడు నిన్నేమియును జేయఁజాలఁడు. ఓప్రభూ! ఈతఁడు హతుఁడగునేని నిన్నెందఱు సంరక్షింతుమన్నను నీవు రణరంగమున నిలువకుము' అని పలికెను.

ఓయంబికాతనయా! అంత నయ్యజాతశత్రుఁడు తనతమ్మునికి సెలవొసఁగి కౌఁగిలించికొని ప్రీతిపూర్వకముగాఁ బెక్కులాశీర్వచనములొనర్చెను. పిదప బలశాలియగు నప్పార్థుఁడును దనయన్నవచనముల నమ్మికమీఱ విని, యాఁకలిగొన్న సింహము తనయాఁకలిని దీర్చుకొనుటకై మృగసమూహములపై వలెఁ ద్రిగర్తులపై వెడలెను. పిమ్మట సుయోధనునిసైన్యమును పరమానందముతోఁగూడి యర్జునుఁడు లేకుండుటను ధర్మజునిబట్టికొను నుత్సాహముతో నుండెను. పిదప నిరుసైన్యములును వర్షకాలమున విజృంభించిన గంగాసరయూనదులువలెఁ బరస్పరమును గలిసికొనియెను." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

### అర్జునుఁడు సుధన్వునిఁ జంపుట

"ఓయంబికానందనా! అంత నాసంశప్తకులెల్లరునుగూడి యొకసమప్రదేశముననిలిచి చంద్రాకారముగా వ్యూహమునుబన్ని, తమపైకివెడలివచ్చు నవ్విజయునిఁగాంచి సంతుష్టాంతరంగులై, యపుడొక్కమాఱుగా గొప్పచప్పు డుప్పతిలునట్లుగా నఱచిరి. వారియారావములు దశదిశలను నావరించుటను నవకాశములేక ప్రతిధ్వనులు రాకుండెను. పిమ్మట నాయర్జునుఁడాసంశప్తకుల నారసి, మొగమునఁ జిఱునగ వంకురింప,

శ్రీకృష్ణునితో 'ఓదేవకీనందనా! చావఁదలంచి వచ్చియున్న వీరి నారసితే? వీరిప్పు డేమవవలసియుండఁగా సంతసించుచున్నవారు. లేదా యొకపక్ష మున వీరు నిస్సంశయముగా సంతసింపనువచ్చును. ఏమందువేని నీచులగు వీ ర త్తము లొందఁదగు నుత్తమలోకము లందువా రైయున్నారు గాదే!' అని పలికి, వ్యూహముగా నేర్పడియున్న యాత్రిగర్తులను సమీపించి, సువర్ణభూషితమగు దేవదత్తమును దీసికొని పూరించి, దానియారావముచే దెసలఁ బిక్కటిల్లఁజేసెను. ఆచప్పుడుచే సంశప్త కులు భీతులై చేష్టలు దక్కి యారణరంగమునఁ బాషాణములునాఁ గదలకుండిరి. మఱియు వారివాహనములును గన్నులు తిరుగుడువడ, చెవుల నిక్కించి, మెడలు చాచి కాళ్లాడక మూత్రమును రక్తమును స్రవింప మొదలిడెను. పిదప నాత్రిగర్తయోధులు కొంతవడికిఁ దెలి వొంది తమసైన్యమును నిలిపికొని యొక్కమా టాయర్జునుపై శర ములను గురియింప, నాతఁడు వానిని ద్రోవనడుమనే నఱికివైచెను. మఱియు వా రాయర్జునుపై దీవ్రములగు పదేసిబాణములఁ బ్రయో గింప,వాని నాతఁడు మూఁడేసిబాణములచే ఖండించెను. ఓరాజా! ఇంకను వారొక్కొక రై దేసిబాణములను బ్రయోగింప, వానినాతఁడు రెండేసి బాణములచేఁ బ్రతిప్రహారమొనర్చెను. మఱియు నాసంశప్తకులు కుపి తులై వాసుదేవునితోఁగూడ నాయర్జునుని వర్షముచేఁ దటాకమును వలె శరవర్షముచే ముంప, నయ్యవి పుష్పించినవృక్షమునుదుమ్మెదలవలె నాయర్జునునిపైఁ బడియెను. పిమ్మట నవక్రవిక్రముఁడగు సుబాహుఁడు తీవ్రము లగు ముప్పదిబాణములచే నాసవ్యసాచికిరీటమునఁ గొట్టఁగా, సువర్ణపుంఖములై కిరీటమునాఁటియున్న యాబాణములచే సువర్ణశిరో భూషణముతోనుదయించినసూర్యుఁడువలె నర్జునుఁడు చూపట్టెను. అంత నాయర్జునుఁ డాసుబాహుని హస్తావాపము నొకభల్లముచే ఖండించి, మఱియు వానిని శరవర్షమున ముంచెను. పిదప సుశర్మయు, సురథుఁ డును, సుధర్ముఁడు, సుధన్వుఁడును బదేసిబాణములచేఁ బార్థునిఁ బ్రహ రింపఁగా, వానినెల్ల నావానరధ్వజుఁడు వేఱువేఱుగా నారాచములచేఁ గొట్టి, మఱియు వారిసువర్ణమయములగు ధ్వజములను నిజభల్లములచే ఖండించెను. ఇంకను సుధన్వునిధనువు దునుమాడి, హయములను జంపి, కిరీటమును బడఁద్రోసి, పిదప వానిమేనినుండి తలఁ గూల నేసెను.

వాఁడు పుడమిఁబడఁగనే వానియనుచరులు వెఱచి, దుర్యోధనునిసైన్య ములకడకుఁబోయిరి. పిదప నాయర్జునుఁ డెంతయు గుపితుఁడై యాతని సైన్యమును శరజాలములచే సూర్యుఁడు నిజకిరణములచేఁ జీఁకటినివలె రూపుమాపం దొడంగెను. అంత నాసైన్యము భగ్నమై యెల్లెడలఁ జెదరి యడఁగిపోవఁ గుపితుఁడైన యాసవ్యసాచిం జూచి యాత్రిగర్తులు వెఱపొందిరి. మఱియు నతఁడు వారిని విడువక తీవ్రనారాచములచే నొప్పింప,వారందందు వెఱచినమృగసమూహములువలె మూర్ఛమునిఁగియుండిరి. పిదపఁ ద్రిగర్తరాజు తనమహారథులతో 'ఓశూరులారా! వెఱవకుఁడు, చెదరిపోకుఁడు. మీరెల్ల నటులందఱును వినుచుండఁగా శపథములొనర్చి యిపు డాసుయోధనునిబలముఁ జేరి వారితో నేమిచెప్పికొనఁగలరు? మన మీయపకృత్యముచే లోకమునఁ బరిహాసపాత్రులము కాఁదగదుగదా! కావున మీరెల్లరును మఱలి మీమీబలములకొలఁది పోరాడుఁడు' అని పలికెను. ఓరాజా! అది విని వారు మఱిమఱియు నఱచుచు నొకరినొకరు ప్రోత్సహించుకొనుచు మఱలిరి. నారాయణగోపాలురును దమప్రాణములపై నాసలువిడిచి మఱల నాయర్జునుపైకి వెడలిరి" అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## సంశప్తకులతో నర్జునుఁడు యుద్ధ మొనర్చుట

"ఓరాజా! అటులు మఱల నెప్పటివలె సంశప్తకులు తనపైకి వచ్చుటను గాంచి యాధనంజయుఁడు వాసుదేవునితో 'ఓహృషీకేశా! సంశప్తకులపై మనయశ్వములను బఱపుము. వీరింకను జీవించి రణమొనర్పనున్నవారు. ఇఁక నాబాహుశరాసనబలములను జూడుము. అపుడే రుద్రుఁడు ప్రాణులనువలె వీరినెల్ల నేలఁగూలఁద్రోయుదును.' అని పలుక విని యాశ్రీకృష్ణుఁడు దాని నాశీఃపురస్సరముగా నభినందించి, యతఁడు కోరినచోటులకెల్ల రథమును బఱపుచువచ్చెను. అపు డతఁడు తన శ్వేతాశ్వము లాకసమునంటి పరువులిడుచుండ మండలాకారముగా గతాగతములొనర్చుచు, మున్ను దేవాసురయుద్ధమున నింద్రుఁడువలె నిజరథముతో వెలయఁజొచ్చెను. పిమ్మట నారాయణగోపాలురును గుపితులై పలువిధములగు నాయుధములఁ బూని నారాచములచే నాధనంజ

యునింగప్పుచునొక్కమాఱుగాఁ జుట్టుకొని, యొకనిమేషమున నాతనిఁ గానరాకుండఁజేసిరి. అపు డాధనంజయునితోఁ గృష్ణుఁడును గానరా కుండెను. అంత నప్పార్థుఁడు కోపమడర రెట్టించినపరాక్రమముతో వడిగా గాండీవమును సారించి, క్రోధచిహ్నమగు బొమముడి మొగమునఁ గానరా దేవదత్తమును బూరించి, వైరిమారకమై వెలయు విశ్వకర్మ దత్తమగు వస్త్రమును బ్రయోగించెను. దానినుండి వేలువేలుగా వేల కొలఁదిరూపములు వెడలెను. అయ్యవి బహువిధరూపములను ధరించి యుండుటను, వారు మిక్కిలి మోహావశులై యర్జునునిఁగాఁ దలంచికొని తమ్ముఁదాము ప్రహరించుకొనుచుఁ జచ్చుచువచ్చిరి. మఱికొంద 'ఱిదె యర్జునుఁడు, అదె గోవిందుఁడు, వీరె కృష్ణార్జునులు' అని పలికికొనుచు వారిని వారె చంపుకొనసాగిరి. అటు లాపరమాస్త్రప్రభావముచే మోహితాంతరంగులై పరస్పరము పొడిచికొనుచుఁ బుష్పించినమోదు గులువలెఁ జూపట్టిరి. పిదప వారిచేఁ బ్రయుక్తములగు శరసహస్రముల నాయస్త్రము భస్మీకరించుచు, నవ్వీరుల యమపుర ప్రవిష్టులఁ గావింప నారంభించెను. అనంతర మాయర్జునుఁడు నగుచు లలితులను, మాలవు లను, మావేల్లకులను. ద్రిగర్తులను, యౌధేయులను దీవ్ర నారాచములఁ బీడించెను. అటు లాక్షత్రియులు ధనంజయునిచేఁ బ్రహతులయ్యును గాలచోదితులగుటఁ, బలువిధము లగు శరజాలముల నాయర్జునుపైఁ బ్రయోగింప నారంభించిరి. వారిశరపరంపరచేనప్పార్థుఁడును, రథమును, గృష్ణుఁడును గానరాకుండిరి. అపుడు వారిబాణములు లక్ష్యశుద్ధిగలిగి యుండుట నుత్సాహముచేఁ బరస్పరము నభిక్రోశించిరి. మఱియు వారు కృష్ణార్జునులు హతులైరని మోదమానమానసులై చెఱఁగులఁ గదల్ప సాగిరి. వేలకొలఁదివీరులు భేరీమృదంగాదులను మ్రోయించిరి. సింహనాద ములును వారిలో విజృంభించెను.పిదపఁ గృష్ణుఁడు మేను చెమరింపఁజెమ ర్చియున్న యర్జునుతో 'ఓయీ! నీవెందున్నాఁడవు. నాకుఁ గానరాకుం టివి. జీవముతోనుంటివా?' అని పలుక విని యాధనంజయుఁ డవ్వాసు దేవుఁడు మెచ్చ వడిగా వాయవ్యాస్త్రమును బ్రయోగించి వారిశరవర్ష మును దొలఁగించెను. పిదప నాయస్త్ర దేవతయగువాయువు గజరథాశ్వ ములతో నాసంశప్తకులను గాఁరాకులనువలెఁ జెదరఁజేసెను. ఓరాజా! ఆవాయువుచేఁ దూల్పఁబడిన యాసంశప్తకులు కాలమునఁ జెట్లనుండి

యెగురుపక్షులవలె నెగురుచుఁ గానవచ్చిరి. అటులు వారినెల్ల నాయర్జునుఁడు పీడించి, మఱియుఁ ద్వరపడుచుఁ దీవ్రబాణములు వేలకొలఁది నోనాఁటనేయుచు, భల్లములచే నాయుధములతోఁ గూడినబాహువులఁ దెగనేయుచు, నేన్గుతొండములునాఁదగు తొడలఁబుడమిఁబడఁద్రోసెను. మఱియు నాసైనికులఁ గొందఱను బృష్ఠములను జెండియుఁ, బాదములను నఱికియు, నింకను నానావయవహీనులనుగా నొనర్చెను. ఇంకను గంధర్వనగరతుల్యములగు వారిరథములను శరపరంపరలచేఖండించి, గజరథహయశూన్యముగా సైన్యము నొనర్చెను. అందందుఁ దలలుదెగిన తాటివనములునాఁ జూపట్టిరి. మఱి కొన్ని యేన్గులుపతాకాంకుశధ్వజములతోఁ బిడుగువడినచెట్లుగల కొండలువలె భగ్నములై చూపట్టెను. ఇంకను, గొన్ని యశ్వము లారోహకులతోఁ జామరాపీడకవచములు తెగి ప్రేగులు మున్నవి జాఱ నప్పార్థబాణహతము లై క్షితిని బతితములయ్యెను. మఱియు హతాయుధులును, భగ్నకవచులును, ఖండితాస్థిసంధులునై కృపణులై పదాతులు పుడమిఁ బడియుండిరి. అటులు హతులును, హన్యమానులును నై పడుచున్నవారును, బడినవారునునై యాసంశప్తకులు హతులగుడుఁ గ్రూరమగు నాయోధన మపుడు జరిగెను. ధూళి లెగసి రక్తవర్షముచే శాంతినొందెను. పుడమియు వేలకొలఁది మొండెములచే సంకులమై చొఱరాకుండెను. ఆయర్జునుని నాఁటియుద్ధమెంతయు రౌద్రము బీభత్సమునై చూపట్టెను. అతఁడు ప్రళయకాలమునఁ బ్రాణులను జంపురుద్రుఁడువలె రణరంగమునఁ గ్రీడించెను. అటులప్పార్థునిచే హతు లగుచు గజరథాశ్వములు వ్యాకులములై చెడ వారాతని కభిముఖులై యతిథులై యుండిరి. ఓరాజా! నిహతు లగు నామహారథులచే నారణరంగము నిండియుండెను. ఇటు లుండఁగా వ్యూహమునుబన్ని ద్రోణుఁడు యుధిష్ఠిరునిపై వెడలెను. అంత నాతనిసైన్యములాయుధిష్ఠిరునిఁ బట్టికొనునుత్సాహముతో నడిగా వెడల నపుడు సంకులసమరమయ్యెను." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## సంకులయుద్ధము

"ఓయాంబికేయా! మహారథుఁడగు ద్రోణుఁడునాఁటిరాత్రి గడపి నీకొమరున కేమోమో చెప్పి, మఱియు నాసంశప్తకుల నప్పార్థునితోఁ

బోరాడ నేర్పుఅచి పార్థుఁ డాసంశప్తకులను జంపుటకై వెడలఁ దన సైన్యమును వ్యూహముగాఁ బన్ని పాండవసైన్యములపై యుధిష్ఠిరునిఁ బట్టికొనునుత్సాహముతో వెడలెను. అటులు ద్రోణుఁడు పన్నిన యా గరుడవ్యూహమును గాంచి యుధిష్ఠిరుఁడును, దానికి మండలార్ధమును బ్రతివ్యూహముగాఁ బన్నెను. ఆగరుడవ్యూహమునకు ద్రోణుఁడు ముఖముగను,సుయోధనుఁడు శిరముగను నుండెను. ఆతనిసోదరు లచ్చో టనే యతనికి సహాయులై యుండిరి. దానికిఁ గృపకృతవర్మలు కనులుగా నుండిరి. అటులే భూతశర్మయు, క్షేమశర్మయుఁ, గరకాక్షుఁడును, గలిం గులును, సింహాలులును, ప్రాచ్యులు, శూద్రులు, నాభీరులు,దశేరకులు, శకులును, యవనులు, కాంభోజులు, హంసపదులు నావ్యూహమునకుఁ గంఠస్థానమున నుండిరి. శూరసేనులును, దరదులు మద్రులు, కైక యులు, గజాశ్వరథపదాతిసమూహములతోఁ గూడి. భూరిశ్రవుఁడును, సోమదత్తుఁడును, బాహ్లికుఁడును, శల్యుఁడును నొకయక్షౌహిణితోఁ దమకు సహాయులుగా నావ్యూహమునకు దక్షిణపార్శ్వమున నుండిరి. విందానువిందులును, గాంభోజుఁడును వామపార్శ్వము నాశ్రయించి యశ్వత్థామకు ముందుగా నిలువఁబడియుండిరి. దానికిఁ బృష్ఠభాగమునఁ గలింగులు, నంబష్ఠులు, మాగధులు, పౌండ్రులు, మద్రకులు, గాంధా రులు, శకునులు, ప్రాచ్యులు, పార్వతీయులు, వసాతులు నుండిరి. కర్ణుఁడు పుత్రజ్ఞాతిబాంధవులతో దానిపుచ్ఛస్థానముననుండెను. ఆతనికి నానా జనపదములనుండివచ్చిన గొప్పసైన్యము సహాయముగానుండెను. జయ ద్రథుఁడును, భీమరథుఁడును, సంపాతియు, భూమింజయుఁడును, వృషుఁడు, క్రాథుఁడు, నైషధుఁడును గొప్పసైన్యములతోఁగూడియుద్ధ విశారదులై యావ్యూహమునకు వక్షస్థలమున నుండిరి. అటులు పదా త్యశ్వరథగజములతో నాద్రోణుఁడు పన్నినయావ్యూహము గాలిచేఁ గదలుమహాసముద్రమువలెఁ జలించుచుఁ జూపట్టెను. వేసఁగి తుదిని దశ దిశలనుండి గర్జనములతో వెడలినమబ్బులునా నావ్యూహము పక్షప్ర పక్షములనుండి యుద్ధాభిలాషులై వెడలఁజొచ్చిరి. ఓరాజా! దాని మధ్యమున శాస్త్రోక్తముగాఁ దనయేన్గును నిలిపి, భగదత్తుఁడు దాని నధి రోహించి యుదయించుసూర్యునివలె వెలయఁజొచ్చెను. మఱియు నతనిగజము పుష్పమాలికలతో నలంకరింపఁబడిన ఛత్రముచేఁ గృత్తికా

యోగముగల పౌర్ణమిచంద్రునితోఁగూడిన యాకసమువలె విరాజిల్లు చుండెను. వర్షించిన మేఘములతోఁగూడిన మహాపర్వతమువలె వీరులై వివిధాయుధధారులైన నానాదేశపురాజులతోడను, పార్వతీయులతోడను గూడి, దేవగణములతోఁ గూడిన యింద్రుఁడువలె నాభగదత్తుఁడు విరాజిల్లెను. పిదప నమానుషమై వైరిదుర్భేద్యమైయున్న యావ్యూహము నారసి, యాయుధిష్ఠిరుఁడు ధృష్టద్యుమ్నునితో 'ఓరాజపుత్రా! నే నిపుడు బ్రాహ్మణునివశము గాకుండునట్టియుపాయ మేదేనిఁ జింతింపుము' అని పలుక విని ధృష్టద్యుమ్నుఁడు ధర్మజునితో 'ఓసువ్రతా! ఆద్రోణుఁ డెంతయత్నించినను నాతనికి నీవు వశపడకుండ నేను గాపాడఁగలను. వానిని సపరివారముగా నివారించెదను. ఓకౌరవోత్తమా! నేను జీవించియుండఁగా నీవు బెగ్గిలనేటికి? రణరంగమున ద్రోణుఁ డెన్నఁడును నన్ను జయింపఁజాలఁడు.' అని తెలిపెను.

ఓరాజా! ఇటు లాధృష్టద్యుమ్నుఁడు పలికి పారావతసవర్ణము లగుగుఱ్ఱములఁ బూన్చినరథముతో వెడలి శరపరంపరల వర్షించుచు నాద్రోణు నెదుర్కొనియెను. పిదప ననిష్టదర్శనుఁడగు నాధృష్టద్యుమ్ను నారసి యాభారద్వాజుఁ డించుకసేపు ఖిన్నచిత్తుఁడై యుండెను. శత్రుమర్దనుఁ డగు నీకొమరుఁడు దుర్ముఖుఁ డాద్రుపదపుత్రుం గాంచి ద్రోణునకుఁ బ్రియమొనర్చువాఁడై యాధృష్టద్యుమ్ను నడ్డుకొనియెను. ఓ రాజా! అపు డాదుర్ముఖధృష్టద్యుమ్నులకు ఘోరమై సంకులమగు సంప్రహారము జరిగెను. అంతనాద్రుపదసూనుఁ డాదుర్ముఖుని శరజాలముచేఁ గప్పి, ద్రోణుని గొప్పశరవర్షమున ముంచెను. ద్రోణుఁ డటులు వారింపఁబడుట నారసి నీకొమరుఁడు వెడలి పలువిధముల బాణములచే నాపార్షతుని మూర్ఛఁగొల్పెను. అటు లప్పాంచాలకురుముఖ్యులు పోరాడుచుండఁగా ద్రోణుఁడు యుధిష్ఠిరునిసైన్యమును బహువిధములఁ బీడింపం దొడంగెను. అపుడు గాలిచేఁ జెదరినమేఘములువలెఁ బాండవసైన్యము లందందుఁ జెదరిపోయెను. అంత రెండుగడియ లాతనియుద్ధము చూడ నింపై యుండెను. ఓరాజా! పిమ్మట నుభయసైన్యములును బిచ్చిపట్టినవివలెఁ దమవారనియుఁ బెఱవారనియు భేదము తెలియక పరస్పరము ప్రహరించుకొన సాగెను. సంజ్ఞలనుబట్టియు, నూహించుకొనియుఁ బోరాడికొనిరిగాని, యొకరి కొకరు గానరాకుండిరి. శిరోమణులయం

దును, నిష్కములయందును, భూషణములయందును, కవచములందును గలకాంతులు సూర్యకాంతిసవర్ణములై ప్రకాశింపఁజొచ్చెను. విఱిగినపతాకలును, దొఱఁగిన గజాశ్వములును, నొరగినరథములునుగా నారణరంగము బలాకాదులతో నిండి మబ్బులతోఁగూడిన యాకాశమువలెఁ జూపట్టెను. మఱియుఁ బదాతులను బదాతులును, హయములను హయములును, రథికులను రథికులును, నేన్గుల నేన్గులును బ్రహరించుకొనఁ, బతాకోన్నతములగు గజములు పరగజములతోఁ బోరాడ గొప్పసంకులసమరమయ్యెను. అపు డాసైన్యముల పరస్పరగాత్రసంఘర్షములవలనను, నొకరినొకరు లాగికొనుటవలనను బొగతో నగ్ని జనింపసాగెను. పతాకలు జాఱ దంతములందు మిడుఁగురులు పొడమ నేన్గులు మెఱపులతోఁగూడిన మేఘములునాఁ జూపట్టెను. అందందుఁ జెదరియు, మొఱసియుఁ, బడియు, వెలయు నేన్గులచే వ్యాపించినపుడమి శారదాకాశమునాఁ గన్పట్టెను. తోమరాదులచే హతములగునేన్గులబృంహితములు మేఘగర్జనములునా వినవచ్చెను. కొన్నియేన్గులు బాణవిద్ధములై జడిసి యాక్రోశించెను. మఱికొన్ని యేన్గులు పరగజవిషాణహతములై యుత్పాతమేఘములునా నార్తస్వనము లొనర్పసాగెను. మావటివా రంకుశములచేఁ బొడిచి ప్రేరింపఁ బరవారణములపైఁబడి పీడింప నందలి మహామాత్రులు తోమరాదులచే మహామాత్రులను బొడచుకొనుచు వచ్చిరి. అటులు పోరాడి యాయేన్గులనుండి సాయుధపాణులై నేలఁగూల నిర్మానుష్యములగా నవి యందందుఁ దిరుగఁజొచ్చెను. మఱికొన్ని యేన్గులు హతులగువారిని మోయుచు, సంఘమునుండి విడినమేఘములునా నేకచరములై చరించెను. తోమరపరశుప్రహారములచేఁ దాడితములై ఘీంకారములొనర్చుచు, నార్తస్వనములతోఁ గొన్ని నేలఁగూలసాగెను. అటు లెల్లెడలను గొండలవలెఁ బుడమిఁగూల, వానిచే భూమి వడఁకి గొప్పచప్పు డుప్పతిల్లెను. ఆరోహకులతోడను, బతాకలతోడను జంపఁబడినయేన్గు లందందుఁబడి చెదరియున్నపర్వతములునాఁ జూపట్టెను. ఏన్గులయందున్నమహామాత్రులు రథికులభల్లములచేఁ బడఁద్రోయంబడి నిర్భిన్నహృదయులై చేతనున్నతోమరాంకుశాదులు జాఱ రణరంగమునఁ బడిరి. మఱికొన్ని యేన్గులు క్రౌంచములువలె నినాదమొనర్చుచుఁ దీవ్రనారాచహతములై వైరిగజములనెగాక నిజగజములనుసైతముఁ

జంపుచు, నలుగడలఁ బరువులిడుచుండెను. ఓరాజా! గజాశ్వములయు, రథములయు. యోధులయుఁ గళేబరములు నలుగెలంకుల నిండఁ, బుడమి మాంసశోణితకర్దమభూయిష్ఠమై యుండెను. దంతాగ్రములచే వ్రయ్యలుచేయఁబడినరథములచే మహారథికులు జూపట్టుచుండిరి. రథికులులేనిరథములును, నిర్మానుష్యములగు గుఱ్ఱములును, మావటివారు లేనియేన్గులును బెదరి నలుదెసలకుఁ జెదరసాగెను. ఆరణరంగమునఁ గొమరునిఁ దండ్రియుఁ, దండ్రిని గొమరుఁడును జంపుకొనఁ, దుముల మగుసంగ్రామమయ్యెను. ఏమియుఁ గొంచెమేనిఁ దెలియకుండెను. రక్తసిక్తాంగులై కొందఱు పదాతులు గుల్మములవలెఁ గానవచ్చుచుండిరి. వారి నారయ దవాగ్ని చుట్టుకొన్నమహాద్రుమములవలెఁ గానవచ్చిరి. ఓరాజా! యోధులవస్త్రములును, గవచములును, ఛత్రములును, బతాకలును రక్తసిక్తములై గానవచ్చెను. గుఱ్ఱపుదడములును, బదాతిసమూహములును, తేఱులగుంపులును నేలఁగూలి, మఱియు రథనేమిప్రహతములై చూర్ణములుగా వానిలోఁ బ్రవేశించి కొందఱు మోహపరవశులగుచుండిరి. శరవర్షసిక్తులై కొందఱుయోధులు తమకర్తవ్యమును నెఱవేఱక విఫలులైరి. ఘోరమై యెంతయు భయంకర మగునాయుద్ధమటులు ప్రారంభమగుడు, వైరులను మూర్ఛఁగొట్టి ద్రోణుఁడాయుధిష్ఠిరునిఁ దలపడఁబోయెను.” అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## ద్రోణునియుద్ధము

“ఓయాంబికేయా! పిమ్మట నాద్రోణుఁడు తనతుఁ జేరువై యున్నయుధిష్ఠిరు నారసి మహాశరవర్షముచే నాతని ముంచెను. అంత నాధర్మజునిసైన్యమున ‘అయ్యో! అయ్యో!’ అనెడిశబ్దములు జనించెను. అటులు ద్రోణుఁ డాయుధిష్ఠిరుని మహాసింహము గజయూథనాథునివలెఁ బట్టుకొన సమీపించుతఱి, శూరుఁడును సత్యపరాక్రముఁడునగు సత్యజిత్తు ధర్మజునిఁ గాపాడువాఁడై ద్రోణునిఁ దలపడియెను. పిదప నయ్యాచార్యపాంచాల్యులు మహాబలులై పోరాడి, యుభయులు నుభయసైన్యములను జలింపఁజేసిరి. పిమ్మట సత్యవిక్రముఁడగు సత్యజిత్తు ద్రోణునొకతీవ్రబాణముచే నొప్పించి, తనశస్త్రప్రయోగచాతుర్యమును నెఱపి,

సర్పవిషతుల్యములగు నైదుబాణములచే నాతనిసారథిని నొప్పింప వాఁడు మూర్ఛపడియెను. మఱియు నతఁడు వడిగా ద్రోణునిగుఱ్ఱములను బదిబాణములచేఁ గొట్టి కుపితుఁడై, మఱియుఁ బదేసిబాణములచేఁ బార్ష్ణిసారథులను బ్రహరించి, సేనాముఖమున మండలగతులఁ జరించుచు, నాద్రోణునిధ్వజమును ఖండించెను. ఆరణరంగమున వానివిక్రమాతిశయము నారసి భారద్వాజుఁడు వానికిఁ గాలము ప్రాప్తమయ్యెనని తలంచి తీవ్రములై మర్మభేదకము లగుపదిబాణములచే వానిని గొట్టి వానివిల్లు దునుమాడెను. ప్రతాపనిధియగు నాసత్యజిత్తు వేఱొకవిల్లు పూని మఱియు ద్రోణుని ముప్పదిబాణములచే నొప్పింప, నిఁక నీరణరంగమున సత్యజిత్తు ద్రోణునిఁ మ్రింగునని పాండవులఱచి తమవస్త్రాంచలములఁ గదల్చిరి. అపుడు పాంచాల్యుఁ డగువృకుఁడు కుపితుఁడై ద్రోణునివక్షమును నఱువదిబాణములచే నొప్పింప నయ్యది యద్భుతమయ్యెను. మహారథుఁడగుద్రోణుఁ డటులు శరవర్షముచేఁ బీడ్యమానుఁడగుచుఁ గన్నులు తెఱచి కుపితుఁడై యావృకసత్యజిత్తుల చాపములఁ ద్రుంచి,మఱియు నాఱుబాణములచే నావృకునిహయసారథి సహితముగా వధించెను. పిదప సత్యజిత్తు వేఱొకచాపము ధరించి యాద్రోణుని నాతనిసారథిని, గుఱ్ఱములను నొప్పింప, నందులకు సహింపక వాని నెటులయినవడిగా మడియింపవలెనని తీవ్రనారాచములను బ్రయోగించి, వానిహయములను బార్ష్ణిసారథులను ధ్వజములను దెగనేసి, మఱియు శరవర్షమును వర్షించెను. అటులు కార్ముకాదులు మఱిమఱియు భిన్నములగుచున్నను బరమాస్త్రవేత్తయగు నాపాంచాల్యుఁ డాద్రోణునితోఁ బోరాడుచువచ్చెను. అటులు పోరాడుచు విజృంభించు నాసత్యజిత్తు నారసి యాభారద్వాజుఁ డొకయర్ధచంద్రబాణమును సలక్ష్యముగాఁ బ్రయోగించి యాతనితలఁ దెగనేసెను.మహారథుఁడగు నప్పాంచాలుఁడు హతుఁడగుడు, వడిగలతనగుఱ్ఱములఁదఱిమి యాద్రోణునివిడిచియుధిష్ఠిరుఁడు వెడలిపోయెను. అంతఁ బాంచాలురును, కేకయులును, మాత్స్యలును, జేదికారూశకోసలులును యుధిష్ఠిరుని రక్షించువారై ద్రోణునిఁ దలపడిరి.పిదప నాద్రోణుఁడును ధర్మజునిఁబట్టుకొనువాఁడై యాసైన్యములను వైశ్వానరుఁడు తూలరాశినిబోలెఁ గాల్పనారంభించెను.అటులు విక్ర

మించు నాద్రోణుని విరాటునిసోదరుఁడగు శతానీకుఁ డెదుర్కొని, సాస
వెట్టుటను భానుకిరణసమానములగు నాఱునారాచములచే సూతహయ
సమేతముగా ద్రోణునిఁ గొట్టి యెంతయుఁ గట్టిగా సింహనాద మొనర్చి,
మఱియు దుష్కరమగు క్రూరకర్మ మొనర్చువాఁడై మహారథుఁడగు
నాభారద్వాజునిఁ బ్రహరింప, నతఁ డొకక్షురముచే వానిశిరమును
సకుండలముగా ఖండించెను. అంత నామాత్స్యసైన్యములు చెదరి
పోయెను. అటులు మాత్స్యులను జయించి, చేదికారూశకైకయులను,
బాంచాలురను, సృంజయులను, బాండవులను మఱిమఱియుఁ బ్రహరిం
చుచుఁ, గుపితుఁడై వనమునుగాల్చునగ్నినాఁ జూపట్టు నాసువర్ణరథునిఁ
గాంచి, సృంజయులెల్లరును వడంకఁజొచ్చిరి. కరలాఘవముగల యాయా
చార్యుఁ డుత్తమధనువు గ్రహించునపుడును, శత్రులను గొట్టునపుడును
బొడమినచప్పు డెల్లదెసల వినవచ్చుచుండెను. ధనుఃకౌశలముగల
యాతనిచేఁ బ్రయుక్తములగు సాయకములు, గుఱ్ఱములను, నేన్గులను,
రౌతులను, బదాతులను, రథికులను మథింపసాగెను. మఱియు నతఁడు
సింహనాద మొనర్చుచు, తొలకరిని గాలితోఁగూడిన మేఘుఁ డశ్మవర్ష
మునువలె శరవర్షమును గురియుచు, వైరులకు వెఱపుగొలుపుచు, సైన్య
ములఁ గలఁతవెట్టుచు, నలుగెలంకులఁ దిరుగ నారంభించెను. బలశాలియు,
శూరశిఖామణియు, మహేష్వాసుఁడునగు నాద్రోణుని సువర్ణభూషిత
మగుధనువును మబ్బులలోని మెఱపునువలె నెల్లదెసలఁ జూచితిమి.
మఱియు నాతనిధ్వజమునఁ బ్రకాశమానమగు వేదిని గాంచితిమి.
అయ్యది యాసంగ్రామమున హిమవంతముశిఖరమునా మాకుఁ గాన
వచ్చెను. సురాసురనమస్కృతుఁడగు నారాయణుఁడు దైత్యులందువలె
ద్రోణుఁ డప్పాండవసైన్యమునఁ జరించుచుఁ గదనమొనర్చెను. శూరుఁ
డును, సత్యవచనుఁడును, ప్రాజ్ఞుఁడును, బలశాలియు, సత్యపరాక్రముఁ
డును, మహానుభావుఁడునగు నాద్రోణుఁడు మహాసంగ్రామ మొనర్పఁ,
గురుసృంజయప్రవాహముగల యొకగొప్పనది యంతకుదెసకుఁ బ్రవ
హించెను. అయ్యది రౌద్రమై భీరుభయంకరమై కవచములె తరఁగలును,
ధ్వజములె సుడులును, బదాతులె యొడ్లును, గజాశ్వములె మహా
గ్రాహములును, ఖడ్గములె మత్స్యములును, యోధులయెమ్ముకలె గులక
ఱాలును, భేరీమురజాదులె కచ్ఛపములును, గేడెములు పడవలును,

కేశములే నాఁచుగడ్డియును, శరములే ప్రవాహమును, విండ్లె యుప నదులునుగా రణభూమిని బ్రవహించునదియై, మనుష్యశీర్షపాషాణమై యుష్ణీషములనెడి నురువులు వెలయ, మాంసశోణితములనెడి కర్దమము నిండాఱ, ధ్వజములనెడి వృక్షము లచ్చటచ్చటఁ జూపట్ట, క్షత్రియుల కవగాహస్థానమై భయాద్భుతముల జనింపఁజేయఁజొచ్చెను. అటులు దహించునాతనిఁ బాండవులు మున్నగుయోధు లెదుర్కొనిరి. భువన మును దహింపఁజేయు నాదిత్యునిఁ గిరణములట్టు లాద్రోణుని వారెల్లరును జుట్టుకొని నివారింపఁదొడంగిరి. ఆమహాశూరునకు సహాయులై నీవా రును నాయుధపాణులై యెల్లెడలఁ బరివేష్టించియుండిరి. అంత నాద్రో ణుని శిఖండి యైదింటను, క్షత్రధర్ముఁ డిరువదింటను, వసుదానుఁ డేనిటను, నుత్తమౌజుఁడు మూఁడిటను, క్షత్రదేవుఁడై దింటను, సాత్యకి నూఱిటను, యుధామన్యుఁ డెనిమిదింటను, ధర్మజుఁడు పదింటను నొప్పించిరి. అటులే ధృష్టద్యుమ్నుఁడు పదిబాణములచేతను, జేకితానుఁడు మూఁడిటను నాతనిఁ బ్రహరింప, నాద్రోణుఁడు మత్తగజమువలె రథసైన్యము నతిక్రమించి దృఢసేనునిఁ బడఁద్రోసి, నిర్భయుఁడై ప్రహరించు క్షేమునిఁ గొట్టి, నాతఁడు రథమునుండి పుడమిఁబడియెను. పిదప నయ్యాచార్యుఁడు సైన్యమధ్యమును జేరి నలుగెలఁకులఁ జరించుచుఁ, దనవారికిఁ దాను రక్షకుఁడై యుండెనుగాని వైరులకు రక్షకుఁడు లేకుండెను. పిమ్మట నమ్మహానీయుఁడు శిఖండిని బండ్రెండింటను, నుత్తమౌజు నిరువదింటను గొట్టి, వసుదాను నొకభల్లముచే యమపురప్రవిష్టునిఁ గావించెను. మఱియు నతఁడు క్షేమవర్ము నెనుబదింటను, సుదక్షిణు నిరువదాఱిం టను గొట్టి, క్షత్రదేవుని రథమధ్యమునుండి కూలఁద్రోసి యుధామన్యు నఱువదినాల్గిటను, సాత్యకిని ముప్పదింటను గొట్టి, వడిగా నాయుధిష్ఠి రుపైఁ బరువిడెను. అపు డాయుధిష్ఠిరుఁ డయ్యాచార్యునుండి వడిగాఁ దొలఁగఁ బాంచాల్యుఁడను నొకరాజపుత్త్రుఁ డాద్రోణుని మాఱ్కొని యెను. ద్రోణుఁ డాపాంచాల్యుని గుఱ్ఱములను సారథిని వధించి, విల్లు నఱికి, వాని నొకశరప్రహారమునఁ దునుమ, నతఁ డాకసమునుండి నక్ష త్రమువలె రథమునుండి నేలఁగూలెను. పాంచాలురకుఁ గీర్తికరుఁడగు నతఁడు హతుఁడగుటయు 'ద్రోణునిఁ జంపుఁడు, వధింపుఁడు,' అనియెడి శబ్దము లుప్పతిల్లెను. అటులు విజృంభించినపాంచాలురను, మాత్స్య

లను, కైకేయులను, సృంజయులను, పాండవులను, విడువక, బలశాలియగు నాద్రోణుఁడు ప్రహరింపసాగెను. అంత నాభారద్వాజుఁడు సాత్యకిని, చేకితానుని, ధృష్టద్యుమ్నశిఖండులను, వార్ధక్షేమిని, చైత్రసేనిని, సేనాబిందుని, సువర్చసుని నింకనుగల పెక్కుజనపదాధీశులను జయించి, కురుపరివారితుఁడై యుండెను. ఓరాజా! అపుడు నీవారు మహాసంగ్రామమున జయముగాంచి, యందందుఁ బరువులిడుపాండవసైన్యములను బ్రహరింపసాగిరి. మున్నింద్రునిచే వధ్యమానులగు దానవులునా ద్రోణహతులై పాంచాలురును, కైకయులును మాత్స్యులును వడఁకసాగిరి.” అని తెలుప విని ధృతరాష్ట్రుఁడు సంజయునితో నిట్లనియె.

## ద్రోణునియుద్ధము

“ఓసంజయా! ఆమహాసంగ్రామమునఁ బాండవులును బాంచాలురును భంగమొందిరిగదా! అపుడు వారిలో నెవ్వరైనను క్షత్రియులకుఁ గీర్తికరమును, గాపురుషులకు దుష్కరమును, వీరులగువారికి సుకరమునై పూజ్యమైనయుద్ధాభిలాషను బూని యాతని నెదుర్కొనిరా ? ఆహా! నోరు తెఱచియున్న బెబ్బులిని మదించినకుంజరమును బోలియున్న యాద్రోణు నారసి యెవ్వఁడును నిలువకుండెనా ? యుద్ధసన్నద్ధుఁడై చిత్రయుద్ధకుశలుఁడై రణరంగమునఁ బ్రాణములపై నాసగొలుపక, వైరులకు భయప్రదుఁడై దుర్యోధనునిహితముఁ గోరి సత్యముఁ దప్పక కృతజ్ఞుఁడై శౌర్యమెప్పుడుఁ బనిచేయశూరుఁడగు భారద్వాజునిఁ బాండవవీరులలో నెవ్వా రెదుర్కొనిరో నా కెఱిఁగింపుము. ఎవ్వరు మఱలిరో తెలుపుము.”

అది విని సంజయుఁ డాతనితో “ఓరాజా ! కరలాఘవముగల ద్రోణునిచేఁ బ్రయుక్తమగు శరౌఘముచేఁ జలించినపాంచాలురను, పాండవులను, సృంజయులను, జేదికేకయులను గాంచి, నదీవేగమునఁ గొట్టికొనిపోవుపడవలవలెఁ జెదరిపోవు నప్పాంచాలాదుల నపహసించుచుఁ గౌరవులు సింహనాదము లొనర్చిరి. బహువిధములగు వాద్యములు మ్రోగెను. గజాశ్వరథపదాతు లెల్లెడల సంఘీభవించి యుండిరి. అపుడు సైన్యమధ్యగతుఁడై నిజపరివారపరివేష్టితుఁడైన సుయోధనుఁడు పాండవసైన్యములను జూచుచు, సంతుష్టాంతరంగుఁడై పరిహ

సించుచుఁ గర్ణునితో 'ఓమిత్రమా! రాధేయా! ద్రోణబాణప్రచలితులైన పాంచాలురను గాంచితే? సింహమునకు జడిసిన క్షుద్రమృగములవలె వీరు చూపట్టుచున్నారు. ఇఁక వీరెన్నఁడు నీతనితోఁ బోరాడ సుత్సహింపరని నాయభిప్రాయము సుమీ! వీరు పెనుగాలిచే భగ్నములగు మహాద్రుమములువలె మహాత్ముఁడగు ద్రోణుని సువర్ణపుంఖములగు శరపరంపరలచేఁ బీడ్యమానులై చలించి, కొందఱైనను నిలిచియుంట గానరాదుగదా! మఱికొంద ఱామహాత్మునిచేతను, గౌరవులచేతను నిరుద్ధులై, దవాగ్నిచేఁ జుట్టఁబడినయేన్గులునా మండలీభూతులై నిలిచి యుండిరి. వేఱొకకొందఱు తుమ్మెదలునాఁదగు ద్రోణుని తీవ్రనారాచములు తమ్ముఁజుట్టికొన పలాయనపరాయణులై పరస్పరముఁ జేరి యడఁగి యుండిరి. ఓకర్ణా! ఈభీముఁ డెంతయుఁ గుపితుఁడై తన్నుఁ బాండవులును సృంజయులును విడువ, మనయోధులచే నావరింపఁబడి నాకెంతయు సంతసము గలిగించుచున్నవాఁడు. దుర్మతియగు నాభీముఁ డిపుడు లోకమెల్ల ద్రోణమయముగాఁ జూచుచున్నవాఁడు. ఇఁక నిప్పాండవుఁడు తనజీవితమునెడను రాజ్యమునెడను నిరాశనొందియుండ వచ్చును.' అని పలుక విని యక్కర్ణుఁ డాతనితో ని ట్లనియె.

'ఓరాజా! మహాబాహుఁడగు వీఁడొకపుడును జీవించియుండు నంతకును యుద్ధమును విడువఁడు. మన యీసింహనాదముల నీతఁడు సహింపఁడు. ఈయుద్ధమునఁ బాండవులకును భంగమువాటిల్లదని నా యభిప్రాయము. మఱియు శూరులును, బలాధారులును, గృతాస్త్రులును, రణగర్వితులునగువారు, మీరొనర్చిన విషాగ్నిద్యూతక్లేశములను స్మరించుచు, యుద్ధమును బరిత్యజింపరని నానిశ్చయము. మహాబాహుఁడును దేజోనిధియునగు వృకోదరుఁడు తిరుగఁబడియెనేని, పేరుగలకౌరవుల నొక్కరినే వధించును. మఱియు నసి, ధనువు, శక్తి, దండము మొదలగు నాయుధములచే గజాశ్వరథపదాతులను బ్రోవులు ప్రోవులుగాఁ బెట్టి కొట్టగలఁడు. వానికి సాత్యకి మున్నగువీరులును, బాంచాలురును, గేకయులును, మాత్స్యులును, బాండవులును దోడు పడుదురు. మఱియు బలవంతులు శూరులు విక్రమాన్వితులగుమహారథు లీభీమునిచేఁ బ్రేరితులై ద్రోణు నెదుర్కొనకమానరు. అటులెదుర్కొని భీముని రక్షించువారై యాదిత్యుని మబ్బులు గప్పునట్లుగా వా రేక్షి

భవించి యాద్రోణునిఁ బీడింపకమానరు. రక్షణము లేనియాతనిఁ, వెలిగా సున్న దీపమును శలభములువలెఁ జావనుండియు నిస్సంశయముగా నాతనిపైఁ బడక మానరు. అటులగుట భారద్వాజునిపై నెంతయు భార మారోపింపఁబడును. కావున మన మాద్రోణు ననుసరింపవలసి యుండును. అటు లేని వృకములు మహానాగమునువలె ద్రోణునిఁ బ్రహరింపఁ జాలరు.'

ఓయంబికానందనా! అపు డారాధేయునివచనములువిని సుయోధనుఁడు తనసోదరులతోఁగూడి ద్రోణునిరథముకడకుఁ బోయెను. పలు విధములగు హయోత్తమములతోఁ బాండవులు మఱలి యసహాయుఁ డగుద్రోణునిపైఁ బడఁగా నచ్చో గొప్పచప్పు డుప్పతిల్లెను." అని తెలుప సంజయునితో ధృతరాష్ట్రుఁడు మఱియు నిట్లనియె.

"ఓసంజయా! కుపితులై ద్రోణు నెదుర్కొనినభీముఁడు మున్నగు నెల్ల యోధులకుఁ గల ధ్వజాశ్వములచిహ్నముల నెఱిఁగింపుము."

అది విని సంజయుఁ డాతనితో "ఓరాజా! ఋశ్యవర్ణములగు గుఱ్ఱములతో మఱలుచున్న భీమునిఁ జూచి తెల్లనిగుఱ్ఱములతో శూరుఁ డగుసాత్యకియు మఱలెను. సారంగవర్ణముగలగుఱ్ఱములతో యుధామన్యుఁడును గుపితుఁడై ద్రోణునిరథముపైకి వెడలెను. పారావతముల రంగుగలిగి సువర్ణభూషణాలంకృతములగు గుఱ్ఱములతో ద్రుపద పుత్రుఁడగు ధృష్టద్యుమ్నుఁడును మఱలెను. తనతండ్రిని రక్షించువాఁడై జయమువడయఁగోరి క్షత్త్రధర్ముఁడు రక్తాశ్వములుగల నిజరథ మధిష్ఠించి వెడలెను. పద్మపత్రనిభములై తెల్లనికన్నులుగల గుఱ్ఱ ములతో శిఖండితనయుఁడగుక్షత్త్రదేవుఁడు వడిగా వెడలెను. కాంభోజ దేశీయములై చూడ నింపగు చిలుకఱెక్కరంగులగుఱ్ఱములు నకులునిఁ దోడ్కొని సిపారిసైన్యములపైకిఁ బరువులిడెను. మేఘవర్ణము గల గుఱ్ఱములతో నుత్తమౌజుఁడును, గుపితుఁడై యుద్ధమునకు వెడలెను. అటులే తిత్తిరచిత్రవర్ణముగలిగి వాయువేగముగలగుఱ్ఱములతో సహదేవుఁ డరుదెంచెను. తెల్లని మేనిరంగును, నల్లనితోకరంగును కలిగి వడిగలగుఱ్ఱములు యుధిష్ఠిరునిమోవ నతఁ డరుదెంచెను. బంగరుకవచములుదొడిగిన వడిగలగుఱ్ఱములతో ననేకసైన్యములవా రాయుధిష్ఠిరు నలుగడల వెడలిరి. ఆతనివెనుకఁ బాంచాల రాజగు ద్రుపదుఁడు సువర్ణ

కవచుఁడై నిజపరివారరక్షితుఁడై పచ్చనిరంగుగలిగి శబ్దసహములైన గుఱ్ఱములతో వచ్చెను. పెక్కురథికులతో విరాటుఁడా ద్రుపదు నను సరించి వెడలెను. కైకేయులును, శిఖండియు, ధృష్టకేతుఁడును, దమతమ సైన్యములతో నావిరటు ననుసరించివెడలిరి. ఆవిరాటుఁడు పాటలపుష్ప వర్ణసమవర్ణములగు హయోత్తమములుగలవాఁడు.ఆతనిసుతుఁడగునుత్త రునకు హరిద్రావర్ణములై వడిగలహయములువాహనములై యుండెను. కైకయు లేవురు నారుద్రపురువురంగుగుఱ్ఱములు గలిగియుండిరి. మఱియు వారు బంగరుమేనిచాయయు, నెఱ్ఱనిధ్వజములును, సువర్ణ మాలికలును గలిగి యందఱును యుద్ధవిశారదులై వర్షకాలమేఘములు వలెఁ గవచధారులై మలినశ్వేతులై పాంచాల్యు ననుసరించి యుండిరి. తెల్లనిగుఱ్ఱములు శిఖండిని వహించునవి. అటులే పండ్రెండువేవురుమహా రథికులును, వారి ననుసరించిన యాఱువేవురుసైన్యములవారును శిఖండి ననుసరించియుండిరి. శిశుపాలపుత్త్రుఁడగు నరసింహుఁడు సారంగవర్ణము గల గుఱ్ఱములుగలవాఁడై యుండెను. బలశాలియుఁ జేదిదేశాధీశుఁడు నగుధృష్టకేతువు కాంభోజములును నానావర్ణములుగలవియునగు గుఱ్ఱ ములుగలిగి యుండెను. కైకేయుఁడగు బృహత్క్షత్త్రునకు సుకుమార ములై పలాలధూమవర్ణములైన గుఱ్ఱములు వాహనములై యుండెను. తెల్లనికన్నులును బద్మవర్ణమునుగలిగి బాహ్లికదేశజములైనహయములు శూరుఁడై శిఖండిపుత్త్రుఁడగు క్షత్త్రదేవునకు వాహనములుగానుండెను. సువర్ణభాండచ్ఛన్నములును, శాంతిగలవియునై తెల్లనిపట్టురంగుగల గుఱ్ఱములు సేనాబిందునకు వాహనములై యుండెను. కాశ్యుని పుత్త్రుఁడై ...వకుఁడగు సుకుమారునకుఁ గ్రౌంచవర్ణములైనగుఱ్ఱ ములు వాహనములై యుండెను. నల్లనిమెడలుగలిగి మనోవేగముగల తెల్లనిగుఱ్ఱములు ప్రతివింధ్యునకు వాహనములై యుండెను. సోము నుండి యర్జునుఁడు వరముగాఁబడసిన సుతసోమునకు, మాషపుష్పసమ వర్ణములైనగుఱ్ఱములు వాహనములై యుండెను. కురుదేశములలో నుదయేందువనుపురమున సహస్రసోమసన్నిభుఁడై సోమసంక్రందుల మధ్యమున జనించుట, నితఁడు సుతసోముఁ డనఁబడుచువచ్చెను. సాల పుష్పవర్ణములై యాదిత్యతేజములగుహయములు నకులపుత్త్రుఁడగు శతానీకునకు వాహనములుగా నుండెను. బంగరుమెడపట్టుపులతో

నెమిలిమెడరంగుగలగుఱ్ఱములు ద్రౌపదేయుఁడగు శ్రుతకర్మునకు వాహనములై యుండెను. ద్రౌపదేయులగు శ్రుతకీర్తిశ్రుతనిధులకు మాషపత్రసమవర్ణములగుహాయములు వాహనములై యుండెను. రణరంగమున నెవ్వనిఁ గృష్ణార్జునుల మించునందురో యట్టియభిమన్యుఁడు పచ్చనిగుఱ్ఱములు గలిగియుండెను. ఎవ్వఁడు ధార్తరాష్ట్రులనుండి విడి తానొకఁడే పాండవుల నాశ్రయించెనో, యట్టి యుయుత్సుని మహాకాయములగుహాయములు మోవ నతఁడు వెలువడియెను. అలంకృతములై వరికాడరంగుగలగుఱ్ఱములు వార్ధక్షేమికి వాహనములై యుండెను. సువర్ణపత్రములగు నురశ్ఛదములతో నల్లనిపాదములుగల గుఱ్ఱములు వశవర్తులై సౌచిత్తికి వాహనములై యుండెను. సువర్ణమయములగు పృష్ఠపీఠములుగలిగి, కౌశేయవర్ణములై సువర్ణమాలికలు వెలయ శాంతములగు గుఱ్ఱములు శ్రేణీమంతునకు వాహనములై యుండెను. బ్రాహ్మధనుర్వేదములను దెలిసి యస్త్రపారగుఁడైన సత్యధృతి కెఱ్ఱనిగుఱ్ఱములుండెను. ద్రోణు నెవ్వఁ డొకయంశముగాఁ గల్పించెనో యట్టిధృష్టద్యుమ్నునకుఁ బారావతవర్ణములగుగుఱ్ఱములు వాహనములై యుండెను. సత్యధృతియు, సౌచిత్తియు, శ్రేణీమంతుఁడును, వసుదానుఁడును, గాశ్యపుత్రుఁడగు సుకుమారుఁడును నాధృష్టద్యుమ్నునకు సహాయులై వెడలిరి. వారికిఁ గాంభోజములును, వడిగలవియు, హేమమాలికలుగలవియునగు గుఱ్ఱములు వాహనములుగా నుండెను. మఱియు వైరిభీషణులై యమకుబేరతుల్యులైన యాఱువేల ప్రభద్రకసైన్యములు సాయుధపాణులై నానావర్ణములుగలగుఱ్ఱముల నధిష్ఠించి సువర్ణచిత్రములగుధ్వజములతో శత్రువులను శరవ్రాతములచేఁ దొలఁగించువారై యాధృష్టద్యుమ్ను ననుసరించిరి. బభ్రువర్ణములును, గౌశేయవర్ణములును నై బంగరుమాలికలు ధరించినధైర్యముగలగుఱ్ఱములు చేకితానునకు వాహనములై యుండెను. ఇంద్రాయుధసమవర్ణములగుగుఱ్ఱములతో సవ్యసాచికి మేనమామయగు కుంతిభోజుఁడు వెడలెను. ఆకసమురంగుగలిగి చుక్కలునాఁ జిత్రితములైన గుఱ్ఱములు రోచమానుఁడనువానికి వాహనములుగా నుండెను. చంద్రలోహితవర్ణములై తెల్లని రేఖలుగలిగినగుఱ్ఱములు పాంచాల్యుఁడును గోపతిపుత్రుఁడునగు సింహసేనునకు వాహనములై యుండెను. పాంచా

ఱురలో నొకఁడగు జనమేజయుఁడు సర్షపపుష్పతుల్యవర్ణములగు నశ్వములుగలిగియుండెను. వడిగలిగి మినుపగింజరంగుగలగుఱ్ఱములు పాంచాల్యునకు వాహనములై యుండెను. శౌర్యముగలవియు, మద్రదేశీయములును,బద్మకింజల్కవర్ణములై సితగౌరములగుగుఱ్ఱములనుదండధారుఁడు వాహనములుగాఁ గలిగియుండెను. ధూసరవర్ణములై పృష్ఠమున నెలుకరంగుగలిగినయశ్వములు వ్యాఘ్రదత్తునకు వాహనములుగా నుండెను. నల్లనివై చిత్రములై చిత్రమాల్యవిభూషితములైన హయములు పాంచాల్యుఁడగు సుధన్వునివాహనములై యుండెను. సువర్ణమాలికలు వెలయ జక్కవయుదరమునుబోలినగుఱ్ఱములు కోసలాధీశుపుత్రుఁడగు సుక్షత్రునకువాహనములుగా నుండెను. బంగరుమాలికలు మెడల వ్రేలాడ శాంతములై చిత్రవర్ణముగలయశ్వములు సత్యధృతివాహనములై యుండెను. ధ్వజము, కవచము, గుఱ్ఱములు, ధనువు మున్నగునవన్నియుఁ దెల్లనివై వెలయ శుకుఁడు వెడలెను. సముద్రసేనుపుత్రుఁడై తేజమున రుద్రునిఁబోలుచంద్రసేనునకు సాగరోద్భవములై చంద్రునివలె ధవళములగుహయములు వాహనములుగా నుండెను. సువర్ణభూషితములై నల్లఁగలువరంగుగలగుఱ్ఱములు శైబ్యుఁడగు చిత్రరథునకు వాహనములై యుండెను. సెనగపూవురంగుగలిగి తెల్లనియెఱ్ఱనిరేఖలు వెలయు నశ్వములు యుద్ధగర్వితుఁడగు రథసేనునకు వాహనములై యుండెను. మానవులలో శూరుఁడని పేరువడిన పటచ్చరహంతయనువానికిఁ జిలుకఱెక్కరంగుగలగుఱ్ఱములు రథ్యములై యుండెను. చిత్రమాల్యుఁడును జిత్రకవచాయుధధ్వజములుగలాఁడునగు చిత్రాయుధుఁడు చిలుకరంగుగలగుఱ్ఱములు వాహనములుగా వెడలెను. ధ్వజకవచధనురశ్వాదులన్నియు నల్లనివిగా నీలుఁడు వెడలెను. నానారూపములుగలిగి రత్నచిహ్నితములగు వరూథము ధ్వజము కార్ముకమునుగలిగి చిత్రములగుగుఱ్ఱములును బతాకయుఁగలిగి చిత్రుఁడు వెడలెను. రోచమానసుతుఁడగు హేమవర్ణునకుఁ బద్మపత్రవర్ణముగలగుఱ్ఱములు వాహనములై యుండెను. యుద్ధక్షమములును, శుభప్రదములు తెల్లుకాడలవంటి వెన్నెముకలుగలవియు శ్వేతాండములును, గుక్కుటాండములునునగు హయములు దండకేతునకు వాహనములై యున్నవి. తన తండ్రి రణరంగమునఁ గేశవునిచే హతుఁడుఁ గవాటనగరముచెడ బంధు

వులు చెదరిపోఁగా భీష్మద్రోణపరశురాములనుండి యస్త్రముల నభ్య సించి, రుక్మికర్ణార్జునాచ్యుతులలో నస్త్రవిద్యయందుఁ దుల్యుఁ డనిపించు కొని, యెవ్వఁడు ద్వారకను సకలధరామండలమును జయింపఁగోరియు నాప్తులగువారు తనహితముగోరి వలదని వారింపఁ బ్రాజ్ఞులగు వారివచన ములఁ జొప్పునఁ గేశవునితో వైరము విడిచి స్వరాజ్యమును శాసించెనో, యట్టిపాండ్యుఁడగు సాగరధ్వజుఁడు చంద్రకిరణములఁ బోలు గుఱ్ఱము లతో వెడలి పరాక్రమధనికుఁడై ధనువు సారించుచు, బలశాలియై ద్రోణు నెదుర్కొనియెను. అప్పాండ్యుని వెంబడించినరథముఖ్యులగు నూటనలుబదివేవురుయోధుల కిత్తడిరంగుగలగుఱ్ఱములు వాహనము లుగా నుండెను. నానావర్ణములును నానారూపములునుగల రథచక్ర ధ్వజములుగలిగి నానాకారములుగల గుఱ్ఱములు ఘటోత్కచునకు వాహనములై యుండెను. భరతపుత్రులెల్ల నేకీభవించినను వారిమతము నంగీకరింపక మిక్కిలి భక్తితోఁ దనసర్వాభీప్సితములను విడిచికొని యుధిష్ఠిరు నెవ్వఁడు చేరెనో యట్టి లోహితాక్షుఁడును మహాబాహుఁ డు నగుయుయుత్సునకు మహాసత్త్వములును, మహాకాయములునగు సువర్ణవర్ణాశ్వములు వాహనములై యుండఁగా నతఁడు ధర్మజుని వెంబ డించి బయలువెడలెను. మఱియు దేవరూపులగు పెక్కురు పలువిధము లగు రంగులుగలగుఱ్ఱములతో వెడలి భీమసేనుని ప్రోత్సాహమునఁ గాంచనధ్వజులై యింద్రునితోఁగూడి దేవతలువలెఁ గానవచ్చిరి. అటులు వచ్చినవారినెల్ల ధృష్టద్యుమ్నుఁడు ప్రీతిపురస్సరముగా నాదరించెను. తనసకలసైన్యములను ద్రోణుఁ డాదరించెను. ఆతనిధ్వజము కృష్ణాజినో త్తరమైయుండెను. కమండలువు సువర్ణమయమైనది. భీమునిధ్వజము వైదూర్యమణిలోచనములుగలిగి వెలయు మహాసింహముచే నలంక రింపబడినది. ధర్మజునిధ్వజము సువర్ణమయమై గ్రహగణాన్వితమగు సోమమండలమునాఁ జూపట్టెను. ఈతనిధ్వజమున నందోపనందములనెడి రెండుమృదంగములు కట్టఁబడి యంత్రతాడితములగుచు మృదుమధుర ధ్వనుల వినిపించుచుండును. నకులునిధ్వజము సువర్ణమయమై శరభ చిహ్నముగలిగియుండెను: అయ్యది మిక్కిలి యుగ్రమై యుండుటను గాంచితిమి. ఘంటాపతాకలుగలిగి సహదేవునిధ్వజమున హంస మొకటి వైరులకు శోకముగలిగించునదై వెలయుచుండును. ద్రౌపదేయు లేవుర

కును ధ్వజభూషణములు ప్రతిమలై యుండెను. పాండవులకును, నభిమన్యునకును సువర్ణమయమగు శార్ఙ్గపక్షి ధ్వజభూషణము. మేలిబంగరు ధ్వజమును, నందు గృధ్రచిహ్నమునుగలిగి ఘటోత్కచునిరథము వెలయుచుండును. మున్ను రావణునకువలె నాఘటోత్కచునియశ్వములు కామచారులై యుండెను. ధర్మజునిధనువు మాహేంద్రమైనది. భీముని ధనువు వాయవ్యమై యొప్పునది. లోకత్రయరక్షణార్థమై నలువచే సృజింపఁబడి దివ్యమునై ముదిమిలేక వెలయుధనువు పార్థునిదై యున్నది. నకులునిధనువు వైష్ణవమును, సహదేవుని విల్లాశ్వినమును నై యున్నది. ఘటోత్కచునిధనువు పౌలస్త్యమైనది. ద్రౌపదేయులేవురకును, రౌద్రము, ఆగ్నేయము, కౌబేర్యము, యామ్యము, ఈశాన్యమును నై ధనువు లలరారుచుండును. మున్ను రుద్రునివలన బలరాముఁడు సంగ్రహించినధనూరత్నము సౌభద్రున కొసంగ నదియే యాయభిమన్యునకు విల్లైయుండెను. ఇవియు నింకను ననేకములును ధ్వజాదులై వైరులకు శోకప్రదములై యందు మాకుఁ గానవచ్చెను. ఓ రాజా! ధ్వజసంకులమై వీరసేవితమైన ద్రోణునిసైన్యము వస్త్రగతమగు చిత్రమువలెఁ జూపట్టెను. అపుడు వీరులనామగోత్రములు, స్వయంవర వివాహమునకు వచ్చినవారినామగోత్రములువలె వినిపించిరి." అని తెలుప విని ధృతరాష్ట్రుఁ డిట్లనియె.

## ధృతరాష్ట్రుఁడు శోకించుట

"ఓసంజయా! ఈనీచెప్పినయోధులు దేవసైన్యమునైనఁ బీడింపఁజాలుదురు. అట్టి భీమాదులీయాహవమున ద్రోణు నెదుర్కొనిన వారు. వీరి యీపురుషకారము దైవముతో సంబంధించి యుండుటను దీనియం దెల్లయర్థములును నానావిధములై చూపట్టుచున్నవి. మఱియు ధర్మజుఁడు చిరకాల మరణ్యమున నారచీరలుగట్టికొనియుండియు, నజ్ఞాతవాస మొనర్చియుఁ జరించెను. ఇపు డతఁడే యీయాహవమునకుఁదగు గొప్పసైన్యమును సమకూర్చియున్నవాఁడుగదా! దైవయోగముచే నాపుత్రునియభావమున కింకేమికావలయును? మానవుఁడు భాగ్యముతోడనే పుట్టుట నిశ్చయము. ఆభాగ్యమే వానిని లాగుచుండునుగాని, వాఁడు తనంత నేమియు నభిలషించువాఁడు గాఁడు. ద్యూతవ్యసనా

సక్తుఁడై యుధిష్ఠిరుఁడు పెక్కుచిక్కులువడియు, మఱియు నాతఁడే తనభాగ్యవశముగాఁ దగుసహాయులను సంగ్రహించినవాఁడు. నా కిపుడు కేకయులును, గోశికులును, గోసలులును, జేదులు, వంగులును సహాయులై నన్నే యాశ్రయించియున్నవారనియు, నాకుఁ బుడమి యెల్ల వశమైయున్నదిగాని పార్థున కటులుగాదనియు, వివేకహీనుఁడగు సుయోధనుఁడు మున్ను నాతోఁ బలికియున్నవాఁడు. అట్టి సైనికుల నడుమ ద్రోణుఁడు రక్షితుఁడై యున్నవాఁడు గదా! అట్టి మహా నీయుఁడు ధృష్టద్యుమ్నునిచే హతుఁడగుట వారిభాగ్యముకంటె వేఱేమున్నది? మహాబాహుఁడును, సదాయుద్ధాభిలాషియు, సర్వ శాస్త్రపారగుఁడును నై రాజులనడుమ నున్న ద్రోణుఁ డెటులు మృత్యువుపా లయ్యెను? ఇట్టి గొప్పకష్టము వచ్చుటను నామతిచెడి మోహావశుఁడ నగుచున్నాఁడను. భీష్మద్రోణు లిరువురును హతు లగుట వినిన నా కీజీవముతోఁ బ్రయోజన మేమి ? ఓసంజయా! పుత్రప్రీతిచే మూఢుఁడనైన నాతో మున్ను విదురుఁ డేమేమి చెప్పెనో యవియెల్ల నాతోఁగూడి నాపుత్త్రుఁ డనుభవింపవలసివచ్చెను. క్రూరుఁడగుదుర్యోధను నొక్కని నేను విడిచి నాశక్తికొలఁదిఁ బుత్ర శేషము నాకాంక్షింతునా, యెల్లరకు మరణము సంభవింపకుండెడిది. రాజగువాఁ డెవ్వఁడు ధర్మశూన్యముగా నర్థమును గోరునో వాఁ డీలోక మునుండి విడువఁబడుచు నీచుఁ డనఁబడుచున్నాఁడు. ఓసంజయా! శ్రేష్ఠభాగము నశించుటనుబట్టి యుత్సాహముచెడిన మన యీరాష్ట్ర మిఁక శేషించునని నేను నమ్మఁజాలను. శాంతపరులును బురుషవర్యులు నగు నెవ్వరి నాశ్రయించి యింతకును మనము జీవించుచున్నారమో యట్టి భీష్మద్రోణులు గతించుటనుబట్టి యిఁక శేషమును మన మెటు లూహింపగలము? యుద్ధ మెటులయ్యెనో స్పష్టముగా నెఱిఁగింపుము. ఎవ్వరు యుద్ధమొనర్చిరి? ఎవ్వరోడిరి ? నీచసారులై యెవ్వరు పాఱిరి? రథికోత్తముఁడగు ధనంజయుఁ డేమి యొనర్చెను? ఆయర్జునునుండియు, భీమునుండియు మాకెంతయు వెఱపగుచుండునుగదా! అపుడు పాండ వులు యుద్ధాభిముఖులుగాఁగా, మిగిలిన మనసైన్యముల దారుణసంబంధ మెట్టిది? వారు మఱలినపుడు మనవారిచిత్తము లెట్లులుండెను? మన

వారిలో నెవ్వరు శూరులై వారిని వారించిరి? తెలుపుము” అని పలుక విని సంజయుఁ డిట్లనియె.

## ద్వంద్వయుద్ధము

“ఓరాజా! మేఘములు భాస్కరునివలె ద్రోణుని శరపరంపరలఁ గప్పుచు నప్పాండవులు మఱలుటను జూచి, మనవా రంతయును బెగ డిరి. అప్పాండవులచే నెగసినధూళులు నీసైన్యముల నాచ్ఛాదించెను. పిదప ద్రోణుఁడు హతుఁడయ్యెనని తలంచితిమి. ఆద్రోణుఁడు మాదృష్టి పథమునుండి తొలఁగెను. క్రూరకర్మపరులై యున్న యాశూరులయభి ప్రాయము లెఱిఁగి సుయోధనుఁడు తనసైన్యములతో ‘ఓయోధులారా! మీమీశక్తికొలఁదిగను, నుత్సాహముకొలఁదిగను, బలముకొలఁదిగను బోరాడి, పాండవసైన్యమును నివారింపుఁడు.’ అని ప్రోత్సహింపఁగా, నపుడుదుర్మర్షణుఁడు దూరమునుండియే చూచి ద్రోణునిరక్షించువాఁడై శరపరంపరలఁ గురియుచుఁ గుపితుఁడై మృత్యువువలె భీమునిఁ దలపడి యెను. వాని నాభీముఁడును బ్రహరింపఁగా వారికపుడు సంకులసమర మయ్యెను. ఓరాజా! అపుడు శూరులును బ్రాజ్ఞులును, దైవప్రేరితు లై రాజ్యమును మృత్యుభయమును విడిచి యోధులగువారితో యుద్ధమునకుఁ దలపడిరి. మదగజమును మత్తగజమువలె సాత్యకిని గృతవర్మఁ డెదుర్కొనియెను. సైంధవుఁడు క్షత్రవర్మనిఁ దీవ్రబాణము లచే నొప్పించెను. అటులే యుగ్రధన్వుఁడు మహేష్వాసుని ద్రోణు నుండి మఱలించెను. క్షత్రవర్ముఁడు సైంధవునిధ్వజమును ధనువును దునుమాడి, మఱియుఁ గుపితుఁడై పదిబాణములచే వానిమర్మములందుఁ గొట్టెను. పిదప సైంధవుఁడు వేఱొకవిల్లు గొని కరలాఘవమేర్పడ నయోమయములగు నారాచములచే క్షత్రవర్మని నొప్పించెను. పాండ వులకుఁగాఁ బోరాడుశూరుఁడగు యుయుత్సు, నాతనిభ్రాతయగు సుబా హుఁడు ద్రోణునుండి నివారించెను. అపుడాయుయుత్సుఁడాసుబాహుని ధనుర్బాణములతోఁగూడి పరిఘతుల్యములైన భుజములను, సితపీతము లగుక్షురములచేఁ దెగనేసెను. ధర్మాత్ముఁడును బాండవోత్తముఁడు నగు యుధిష్ఠిరుని సాగరమును వేలవలె శల్యుఁడు నివారించెను. ధర్మజుఁ డాశల్యునిఁ బెక్కుమర్మభేదకములగుబాణములచే నొప్పింప, నామ

ప్రేశుఁ డిరువదినాల్గుబాణములచేఁ గొట్టి యెంతయు సింహనాదమొనర్చెను. అటులు సింహనాదమొనర్చు నాతనికేతువును, ధనువును దునుమాడినధర్మజునిఁ గాంచి జనులు సింహనాదమొనర్చిరి. అటులే బాహ్లికుఁడు ద్రుపదు నెదుర్కొని తనసైన్యములతో నాతని వారింప సైన్యములతోఁగూడిన యావృద్ధులయుద్ధ మెంతయు ఘోరముగాఁజూపట్టెను. మదించినయూథనాథములగు మహాద్విపములువలె వారిరువురును బోరాడిరి. అంత నవంతిదేశాధీశులగు విందానువిందులు తమసైన్యములతో మున్ను బలి నింద్రాగ్నులువలె విరటునిఁ దలపడిరి. అపుడు దేవదానవులకువలె సైన్యములు కలఁతనొందునట్టి యుద్ధము జరిగెను. సభాపతియగుభూతకర్మ నకులపుత్త్రుఁడగు శతానీకునిఁ దాఁకి యతఁడు వైచు నారాచముల నాపుచు ద్రోణునుండి మఱలించెను. అంతనాశతానీకుఁడు తీవ్రములగుమూఁడుభల్లములచే నాభూతకర్ముని బాహువులను దలను దెగనేసెను. శరవర్షమును గురియుచు ద్రోణునిపైకి వెడలివచ్చుసుతసోమున కడ్డుపడి వివింశతి నివారించెను. అపుడు సుతసోముఁడు కుపితుఁడై తనపినతండ్రియగు వివింశతిని దీవ్రనారాచములచే నొప్పించి పోరాడెను. పిదప భీమరథుఁడు సాళ్వు నాఱువాఁడికోలలచేఁ గొట్టి, వానియశ్వములను సూతుని యమమందిరమున కనిపెను. నెమిలిరంగుగుఱ్ఱములతోవచ్చు నీపౌత్త్రుఁడగు శ్రుతకర్మునిఁ జైత్రసేనినివారించెను. నీపౌత్త్రులగువారిరువురును దుర్జయులై యొకరినొకరు చంపుకొనువారై తమతండ్రులయర్థసిద్ధికై గొప్పయుద్ధమొనర్చిరి. ఆరణరంగమునఁ దనయెదుట నిలిచియున్న ప్రతివింద్యునిఁ జూచి యశ్వత్థామ తనతండ్రిగౌరవము కాపాడునట్టివాఁడై కొన్నిబాణములచే వానిని నివారించెను. అటులు కుపితుఁడైయున్న యాద్రౌణి నాప్రతివింద్యుఁడు తీవ్రనారాచముల నొప్పించెను. సింహవాలచిహ్నము వెలయఁ దనతండ్రికి సహాయుఁడై వెడలినయశ్వత్థామతనయునిపై ద్రౌపదేయులు శరవర్షమును గురిసిరి. ద్రౌపదేయులలో నర్జునపుత్త్రుఁడై మహారథుఁడగుశ్రుతకీర్తిని దుశ్శాసనపుత్త్రుఁడు ద్రోణునుండి నివారించెను. కృష్ణసముఁడగు నాశ్రుతకీర్తి యాదుశ్శాసనసుతుని మూఁడుభల్లములచేఁ గొట్టి, వాని ధనువును ధ్వజమును సారథిని నఱికి ద్రోణునికడకుఁబోయెను. ఓరాజా! రెండు సైన్యములందును నెవ్వఁడు శూరుఁడని పేరువడసెనో యట్టిపటు

చ్చురహంతను మనలక్ష్మణుఁడు నివారింప, నతఁడు లక్ష్మణునివిల్లు దును మాడి ధ్వజము నఱికి, యాతనిపై శరజాలములఁ గురియుచు నెంతయు శోభిల్లెను. వికర్ణుఁడు యువకుఁడై తనపైకివచ్చుశిఖండిని నివారింపఁగా, నతఁడు బాణజాలమున నావికర్ణు నాచ్ఛాదించెను. ఆశరసమూహమును దొలఁగించి నీకొమరుఁ డెంతయు విరాజిల్లెను. వీరుఁడగునుత్తమౌజుని ద్రోణునిపైకిఁ బోకుండ నంగదుఁడు శరసమూహమున వారించెను. పురుషసింహులగువారిరువురకును జరిగినసమ్మర్ద మందలి యుభయసైన్యములకు నద్భుతజనకమయ్యెను. మహేష్వాసుఁడగుదుర్ముఖుఁడు వీరుఁడగుపురుజితుని ద్రోణునిపైకిఁ బోకుండ వత్సదంతములను బాణములచే నివారించెను. అంత నాపురుజితుఁ డాదుర్ముఖుని భ్రూమధ్యమున నొక నారాచమును నాఁట, వానిముఖము నాళముతోఁగూడినపద్మమువలె వెలయఁజొచ్చెను. లోహితధ్వజులగు కేకయుల నేవురను గర్ణుఁడు దాఁకి ద్రోణునిపైఁ బోకుండ నివారించెను. వారును నెంతయుఁ గుపితులై శర వర్షముల నాతనిపైఁ గురిసిరి. కర్ణుఁ డాకైకయులను మఱిమఱియు శర జాలములఁ గప్పెను. అటులు పరస్పరబాణసంవృతులై యాకర్ణకేకయులించుకేనిఁ గానరారైరి. అటులే వారిసూతరథధ్వజాదులును గానరావయ్యెను. నీపుత్రులగు దుర్జయుఁడును, విజయుఁడును, జయుఁడును, నీల, కాశ్య, జయత్సేనులనువారిని ముువ్వురను నివారించిరి. వారి యుద్ధము చూపఱ కానందసంధాయక మయ్యెను. అయ్యది సింహ వ్యాఘ్ర తరక్షువులకు, భల్లూక మహిషవృషభములతో జరిగినయుద్ధమును దలపించెను. క్షేమధూర్తియు, బృహంతుఁడును, ద్రోణునిపైకి వెడలినసాత్త్వతునిఁ దీవ్రనారాచములచే నొప్పింప వారి కెంతయు నద్భుతయుద్ధ మపుడు జరగెను. వనమున మత్తగజములతో సింహము నకు జరగినయుద్ధము నది స్మరింపఁజేసెను. యుద్ధాభిలాషియై ద్రోణుని కెదురుగావచ్చు నంబష్ఠునిఁ గుపితుఁడై చేదిరాజు శరపరంపరచే నివారించెను. అపు డంబష్ఠుఁ డాచేదిరాజు నొకయస్థిభేదిని యగుశలాకచేఁ బ్రహరింప, నతఁడు శరచాపములను విడిచి రథమునుండి పుడమిఁబడియెను. వార్ష్ణేయుఁడగువార్ధక్షేమిని గృపుఁడు శరపరంపరచే నివారించెను. చిత్రయుద్ధ మొనర్చుచు మోహావశులైన కృపవార్ష్ణేయులను

గాంచినవా రెవ్వరును యుద్ధమునందు సక్తులుగాక నిశ్చేష్టులై యుండిరి. సోత్సాహుండై యున్న మణిమంతుని సౌమదత్తి మార్కొని, ద్రోణున కపయశము గలుగకుండ యుద్ధమొనర్చుచు నాతని నివారించెను. అంత నామణిమంతుండు డాసౌమదత్తిధనుఃకేతనపతాకలను గొట్టి, సూతుని ఛత్రమును రథమునుండి పుడమిం బడద్రోసెను. అటు లతండు వడం ద్రోసి, మఱియు రథముడిగి తనతీవ్రఖడ్గముచే నాసౌమదత్తి సూతాశ్వ రథధ్వజములను ఖండించెను. ఆతండు వేఱొకరథమును, ధనువును గొని తానే రథము నడుపుకొనుచుం బాండవసైన్యమును బీడించెను. దానవులను ఖండించునింద్రునివలె ద్రోణునిపైకి వచ్చుపాండ్యుని, సమర్థుండగు వృషసేనుండు నిజసాయకసమూహముచే నివారించెను. గదలును, బరిఘములు, నిస్త్రింశములును, బట్టసములును, ముసల, ముద్గర, చక్ర, భిందివాలపరశ్వధములను వైచుచు, ధూళియు, గాలియు, నగ్నియు, నుదకము, భస్మము, మంటిబెడ్డలు, గడ్డి, చెట్లు మున్నగువాని గురిపించుచు, గొట్టుచు, మట్టుచు, సడలద్రోయుచు, వెడలంజేయుచు నిటులు పలువిధములం గురుసైన్యమునకు వెఱపుగలుగ ఘటోత్కచుం డాద్రోణుని పైకి వెడలెను. అంత నాతని నానాప్రహారణములచేతను, నానాయుద్ధవిశేషములచేతను నలంబుసుం డెదుర్కొని ద్రోణునుండి మఱలించెను. ఆరాక్షసముఖ్యుల కపుడు ఘోరమై మున్ను శంబరునకును, నింద్రునకును జరిగినయుద్ధమునుబోలిన మహాసంగ్రామమయ్యెను. ఓరాజా! అటు లక్కురుపాండవయోధులును, వారి వారణరథాశ్వములును ద్వంద్వములుగా నేర్పడ, నట్టియుద్ధ మెన్నండును జూడనిదియు, విననిదియునుగా, నద్భుతమై ప్రవర్తిల్లెను. అయ్యది ద్రోణుండు లేనిదివలె ఘోరమై చిత్రమై రౌద్రమై జరిగెను. అపుడు పెక్కు ద్వంద్వయుద్ధములు జరిగెను" అని తెలుప విని ధృతరాష్ట్రుం డిట్లనియె.

### భగదత్తునియుద్ధము

"ఓసంజయా! అటులు పాండవయోధులు మఱలి మనవారి నెదుర్కొన, నపుడుభయసైన్యములకు యుద్ధ మెటులు జరిగెను? అర్జునుండు సంశప్తకుల నేమిచేసెను?"

అది విని సంజయుండు "ఓరాజా! అటులే కురుపాండవయోధులు పరస్పరము తలపడ, నపుడు గజసైన్యముతో నీతనయుండు భీముని మా

ర్కొనియెను. ఏనుఁ గేనుఁగును, వృషభము వృషభమునుబోలె నాభీముఁ
డాగజసైన్యమును దలపడియెను. ఓరాజా! బాహుబలశాలియగు నా
భీముఁడు తనయుద్ధచాతుర్యమేర్పడ నచిరకాలమున సుయోధను గజ
సైన్యమును ద్రుంగించెను. కొండలునాఁదగి మదమునుగార్చు నాయేన్గు
లాభీమునినారాచప్రహారముల కోరువక మఱలి చెదరఁజొచ్చెను. పెను
గాలి మేఘములనువలె నప్పవనసూనుఁ డాయేనుఁగుల రూపుమాపెను.
అపు డాయేన్గులనడుమనుండి శరప్రయోగ మొనర్చుచు నుదయించి
కిరణములను వెలయించు నాదిత్యుఁడునా భీముఁ డుద్దీపించుచుండెను.
భీమబాణహతములై మనవారియేన్గు లాకసమున రవికిరణసక్తము
లైన మబ్బులను బోలియుండెను. అటులు గజసైన్యములనడంచు నప్పవ
నాత్మజు నారసి, కుపితుఁడై నీకొమరుఁ డాతనిఁ దీవ్రనారాచముల
నొప్పించెను. అంతఁ గొంతవడికి రక్తాక్షుఁడై భీముఁడునీకొమరునీఁదను
మువాఁడై కొన్నిబాణములచేఁ బీడించెను. అందులకు నీనందనుఁడలిగి
పరిహసించువాఁడై రవికిరణములునాఁ దగుతీవ్రబాణములచే నాభీముని
నొప్పించెను. అపుఁ డాపాండవుఁడు నీకొమరునిధ్వజమున మణిమయమై
వెలయునేన్గును ధనువును రెండుభల్లములచే ఖండించెను. ఓరాజా!
భీమునిచేఁ బీడితుఁడైన మనసుయోధనుఁ గాంచి యంగుఁ డొకమాతం
గమునెక్కి యాభీమునిఁ బీడించువాఁడై తలపడెను. మేఘగంభీరారావ
ముతో వచ్చునాయంగుని యేన్గుం గాంచి దానియగు దానికుంభస్థలము
నడుమ నొకనారాచము నాఁటునట్లుగాఁ బ్రయోగించెను. పిదపనాతీవ్ర
నారాచ మాయేన్గుమేను వ్రీల్చి పుడమిఁ జొర నది వజ్రాహతమగుపర్వ
తమువలె నేలఁగూలెను. అంత నామావంతుఁడును బుడమిఁ బడ,వడిగల
యగ్గాడ్పుపట్టియు నొకభల్లముచే వానితలఁ దెగనేసెను. వాఁడు హతుఁ
డగుడు వానిసేనయుఁ జెదరిపోయెను. అటు లాసైన్యము చెదరి తమ
పదాతిసైన్యమునే ద్రొక్కుచు బరువులిడ సైన్యము లెల్లెడలఁ జెదర
సాగెను. పిదప భగదత్తుఁడు తనమత్తగజముతోఁ దలపడ నపుడాయేన్గు
తనపాదములచేఁ ద్రొక్కియుఁ, దొండముచేఁ బ్రహరించియు నాభీముని
రథముపిండిగానొనర్చెను. పిదప నాభీముఁడు కాలినడకతో దానినిఁ గలి
యఁబడి పట్టుకొని కదలనీకుండెను. అదియు నాతనిఁ బట్టుకొని తొండ
ముతోఁ గొట్టెను. అంత నతఁడు దానిని వధించువాఁడై గిరగిరఁ ద్రిప్ప

నది కుమ్మరిసారెవలెఁ దిరిగెను. అటులు దానిఁ ద్రిప్పి వేయి యేన్గుల బలము వెలయ దానియెదుట నిలువఁబడియెను. అదియు నాతనిఁ దొండముచేతను జానువులచేతను గొట్టి పడఁద్రోసి మెడను జుట్టి చంపఁ బ్రయత్నించెనుగాని యాతఁ డాకంఠవేష్టనము నొకభ్రమణము నొనర్చి తప్పించికొనియెను. అటులు తప్పించుకొని కడువడిగా వెడల నపుడు సకలసైన్యములందును 'ఆహా! భీముఁడు హతుఁడయ్యెను కుంజరమాతనిఁ జంపెను' అను నారావములు జనింపఁ, బాండవసైన్యము జడిసి యావృకోదరుఁడున్నకడకే వెడలిపోయెను. అంత నాయుధిష్ఠిరుఁడు భీముఁడు హతుఁడయ్యెనని తలంచి పాంచాల్యులతోఁగూడి యాభగదత్తునిఁ దలపడియెను. అటులు తలపడి నలుగడలఁ జుట్టి వేలకొలఁది తీవ్రనారాచములచే నొప్పించెను. అంత నాపర్వతేశ్వరుఁడగుభగదత్తుఁడు తనగజమును బ్రోత్సహించుచుఁ బాండుపాంచాలురను బీడింప మొదలిడెను. అపుడు వృద్ధుఁడగు నాభగదత్తుఁడు తన యేన్గుతో నొనర్చిన యుద్ధమువిధ మెంతయు నద్భుతమయ్యెను. అంత దశార్ణదేశాధీశుఁ డాభగదత్తునిపైకి గడువడిగలిగిన తనయేన్గుతోఁ దలపడ భీకరాకారములగు నారెండేన్గులకును గొప్పయుద్ధము జరిగెను. మున్ను వృక్షములతోడను రెక్కలతోడను గూడినపర్వతములునా మాకవి గానవచ్చెను. పిదప నాభగదత్తునియేన్గు మఱలి యాదశార్ణదేశాధీశునేన్గును బార్శ్వమునఁ జీల్చి చంపెను. పిమ్మట నాభగదత్తుఁడు రవికాంతులీనుతోమరములచేఁ దనశత్రునిఁ బ్రహరించెను. అంత నాభగదత్తుని బరిమితిలేనిరథికసైన్యముతోఁ దలపడి రథికులు నలుగెలంకుల వాని నాక్రమించిరి. అపు డాభగదత్తుఁడు రథికులచేఁ బరివేష్టింపఁబడి పర్వతమున వనమధ్యమునఁ బ్రజ్వలించుహుతాశనుఁడునా విరాజిల్లెను. అంత నారథికు లాయేన్గును మండలాకారముగాఁ జుట్టును నిలిచి యుగ్రధన్వులై శరవర్షముగురియ వారినడుమ నది యుండెను. పిదప నాభగదత్తుఁ డామహాగజమును బ్రోత్సహించి సాత్యకిపైఁ బురికొల్పెను. అయ్యది యాసాత్యకిరథముఁ బట్టికొని కడువడిగాఁ జిమ్మ నతఁడు కొంతదూరముగఁ దొలఁగి చనియెను. అంత నాతనిసారథి గుఱ్ఱములను విడిచి సాత్యకిని సమీపించెను. అదియు సందుచేసికొని యాగజము కడువడిగా నారథసమూహమును దప్పించి

కొని వెడలి రాజులనెల్ల నెగురవైవఁజొచ్చెను. అప్పు డాయోధులెల్లరును వడిగలయాయేనుఁగునకు జడిసి యామహాగజము నొక్కటినే వేలకొలఁదియేనుఁగులఁగాఁ దలంచిరి. గజారూఢుఁడగు భగదత్తునిచే నటులు పాండవులు పీడితులై పాంచాలురు జడిసి నలుదెసలకుఁ జెదర, గజాశ్వములబృంహితహేషాధ్వనులు మెండై వెఱపు గలిగింపసాగెను. అటులు భగదత్తునిచే నాపాండవులు తఱుమఁబడుడు భీముఁడు కుపితుఁడై మఱియు నాభగదత్తుని మార్కొన వెడల నాతనిగుఱ్ఱములఁ దనతొండము నుదకముచేఁ దడిపి జడిపించుచు నాతనియేనుఁగు విక్రమింప దాని నాభీముఁడు విసరివైచెను. అంత నాభీముని రుచిపర్వుఁ డెదుర్కొని శరవర్షమును గురియ నంతకుఁడునా రథస్థుఁడై యున్న యాతని, సువర్చుఁడనెడి పర్వతరా జెదుర్కొని యొకతీవ్రనారాచముచే వాని నాయమమందిరమున కనిపెను. ఆవీరుఁ డటులు పుడమిఁ బడ నభిమన్యుఁడును, ద్రౌపదేయులును, చేకితానుఁడును, ధృష్టకేతుఁడును, యుయుత్సుఁడును, నాగజోత్తమమును బీడింపఁదొడంగిరి. అట్లు వారెల్లరును శరధారలచే పర్వతమును, మబ్బులువలె శరధారలచే నాయేనుఁగును గప్పి సింహనాదములొనర్చిరి. పిమ్మట నాయేనుఁగు భగదత్తునికాలిమడమపోటులచేతను, నంకుశపుప్రేటులచేతను బ్రోత్సహింపఁబడి తొండమును జాచి చెవులును గన్నులును నిక్కించి వడిగా వెడలి తనయడుగుచే యుయుత్సునిసూతునిఁ ద్రొక్కి చంపెను. ఓ రాజా! అప్పు డాయుయుత్సుఁడు వడిగారథమునుండి దిగి పైకి తొలఁగి చనియెను. అంత నప్పాండవయోధులు సింహనాదము లొనర్చుచు మఱల నామహాగజమును శరవర్షముచే ముంచిరి. పిదప నీకొడుకు యుయుత్సుఁడు సంభ్రాంతుఁడై యభిమన్యునిరథము నధిరోహించెను. ఓరాజా! అప్పు డాభగదత్తుఁ డాయేనుఁగుపైనుండి వైరులపై శరపరంపరలఁ గురియుచుఁ గిరణములను వెలయించునాదిత్యునివలె నెంతయుఁ దేజోవిరాజమానుఁడై యుండెను. అంత నాభగదత్తు నభిమన్యుఁడు పండ్రెండింటను, యుయుత్సుఁడు పదింటను, మూఁడుమూఁడువాఁడికోలల నాద్రౌపదేయులును, నటులే ధృష్టకేతువును నొప్పించిరి. అటులావీరులు ప్రయోగించినబాణములు తనమేన నాఁటికొన నామహాగజము, సూర్యకిరణములతోఁగూడినమబ్బువలె వెలయఁజొచ్చెను.

మాపంతునిచాతుర్యప్రయత్నములచేఁ బురికొల్పఁబడి యామత్తగజము వైరిశరపీడితమయ్యుఁ గుడియెడమల వైరులనఁదగువారినెల్ల నెగయఁ జిమ్ముచుండెను. అపు డాభగదత్తుఁడు మఱియుమఱియు నప్పాండవ సైన్యమును, వనమధ్యమునఁ బశుగణమును, గోపాలుఁడువలెఁ జుట్టును దిరుగుచుఁ గదలనీక నిలుపుచుండెను. ఓరాజా! అపుడు పాండవసైన్యములు చెదరి పరువులిడుచు డేగకుఁ జిక్కినకాకులవలె మొఱవెట్టి పాఱెను. అంకుశపుఁబోటులువడిన యామహాగజము ఱెక్కలుగల కొండవలె భయముగొలుపుచు నంచలినైదల కది చుట్టును దిరిగి వర్తకులకు మహాసాగరమునా భయప్రదమై జూపట్టెను. వెఱపుచేఁ బరువులిడు గజాశ్వరథపదాతులలో జనించినభైరవారావము దశదిశల నావరించెను. ఆమత్తగజములతో నాభగదత్తుఁ డాసేనామధ్యమున మున్ను దేవసేనామధ్యమున బలిచక్రవర్తివలెఁ జరింప మొదలిడెను. అపు డొకపెనుగాలి జనించెను. ధూళులెగసి మిన్నుముట్టి సైనికులఁ గప్పెను. ఆమత్తగజ మొకటియే పెక్కుమత్తగజములుగా నాసైనికులకుఁ గన్పట్టెను" అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

### అర్జునుఁడు సంశప్తకులఁ జంపుట

"ఓరాజా! పార్థుఁ డేమియొనర్చెనో తెలుపుమని నన్నడిగితివి. ఆమహాబాహుఁ డాసంగ్రామమున విక్రమించినవిధ మెఱిఁగించెదను వినుము. అటు లెగసినధూళులఁ గనియు, నప్పటిచప్పుడుల వినియు, భగదత్తుఁడు మఱియు విక్రమింపఁగా, నపు డప్పాండవమధ్యముఁ డా శ్రీకృష్ణభగవానునితో 'ఓదేవా! మధుసూదనా! భగదత్తుఁడు తన మహాగజముతో వడిగలిగి వెడలుట సత్యము. ఈమహానినాదము వానిదై యుండును. గజయానచతురుఁడగుటఁ డింద్రునకుఁ దక్కువగాక రణ రంగమున విక్రమించి పుడమినిగల గజయోధులలోఁ బ్రథముఁడో ద్వితీయుఁడో యైయుండునని నానిశ్చయము. ఆతనిమాతంగముసైతము సంగ్రామమున నప్రతిహతపరాక్రమమై యెట్టిశస్త్రములకును లోఁగక శ్రమమనునది లేక పనిచేయునది. మఱియు నగ్నిస్పర్శమునకును సహిం చునదగుట నిపు డప్పాండవసైన్యము నది యొకటియే నశింపఁజేయఁ దగియున్నది. ఇపుడు మన మిరువురముదక్క నిక్కుంజరము నుక్కడఁ

గించువా రెవ్వరును లేరు. కావున వేవేగ నీ వాగజయానచతురుఁడగు భగదత్తుఁ జేర మనరథముఁ బోనిమ్ము. రణగర్వితుఁడై నిజగజబలము చేతను, వయసుచేతను నొడలు దెలియకున్న యీభగదత్తు నిపుడే స్వర్గతునిఁగా నొనర్తును.' అని తెలుప విని యాకృష్ణుఁ డందులకు వెడలెను. అటులు వెడలి యాయర్జును నారసి మహారథులగు సంశప్తకులు పదునాల్గు వేవురును రణమొనర్ప రమ్మని పిలిచి వడిగా నడ్డువడిరి. మహారథులగువారిలోఁ ద్రిగర్తులు పదివేవురును, వాసుదేవానుచరులగు నారాయణగోపాలులు నాల్గువేలసంఖ్యగలవారు నై యుండిరి. ఓరాజా! అపుడు భగదత్తునకుఁ జిక్కియున్న తమసైన్యమును గాంచియుఁ, దన్ను యుద్ధమునకుఁ బిలుచుసంశప్తకులను గాంచియు, నాయర్జునునిచిత్తము రెండు విధములుగాఁ బోయెను. అందేది కర్తవ్యమో యని యతఁడు కొంత వడి చింతింప సంశప్తకులపైకిఁ బోవుటయా? యుధిష్ఠిరుని సమీపించుటయా? యనుసందేహ మాతనికిఁ గలిగెను. అపు డతఁ డెంతయు విచారింపఁగా, సంశప్తకులను వధించుటయే యుత్తమపథమై తిరముగా నాతనికిఁ బొడకట్టెను. కపికేతనుఁడగు నాతఁ డొకఁడును వేలకొలఁదిరథికులను జంపుటకై వడిగా మఱలెను. అపు డది కర్ణదుర్యోధనులకును నర్జును మడియించుతలంపులో సాధకమయ్యెను. అదియేగదా! ఆయర్జునునకు ద్వైధము కల్పించినది. అటులు డోలాయమానహృదయుఁడయ్యు నప్పార్థుఁ డాసంశప్తకులను జంపుటచే నాసుయోధనుబుద్ధిని వ్యర్థముగా నొనర్చెను. అపు డాసంశప్తకు లాయర్జునుపై శరసహస్రములను విడువ నక్కౌంతేయవార్ష్ణేయు లిరువురును గానరాకుండిరి. ఆ శరపరంపరచేఁ గప్పఁబడి యప్పార్థు రథమును రథాశ్వములును గానరాకుండెను. ఎంతలో నాజనార్దనునకుఁ జెమ్మట గ్రమ్మి యించుక మోహము గలిగెనో యంతలో నాయర్జునుఁ డాశరపరంపరలనెల్ల బ్రహ్మాస్త్రముచేఁ దూలించి మించినవిక్రమముతోఁ గొందఱ ధనువులతోఁగూడిన హస్తములను, ధ్వజములను, సూతులను, రథికులను నేలఁగూలఁ ద్రోసెను. గొప్పవృక్షములను, బర్వతములను, బెనుమబ్బులను బోలిన మేనులుగల దానులు, తమమావంతు లంతమొందఁ బార్థబాణహతములై క్షితిని బడఁజొచ్చెను. మఱియు నయ్యర్జునునిబాణప్రహారము

లచేఁ దమపైనున్న యాస్తరణములు చెదర సొమ్ములు వమ్ముగా గతప్రాణములై గుఱ్ఱములు గూలసాగెను. మఱియు నక్కిరీటిభల్లములచేఁ దమచేతులనున్న ప్రాసముద్గరపరశ్వథాదులు వ్రయ్యలై వడ ఖండితబాహువులై పదాతులు మేదినిఁబడిరి. అప్పు డయ్యర్జునుశరప్రహారములచేఁ దెగినయాసంశప్తకులతలలు కొన్ని బాలాదిత్యునిఁ, జంద్రునిఁ, బద్మములనుబోలి నేలఁగూలసాగెను. ప్రాణాపహారములగు తనశరవారములచేఁ నయ్యర్జునుఁడు వైరుల రూపుమాపుచు మత్తగజము పద్మసరోవరమునుబోలె సేననెల్లఁగలఁతవెట్టు నాపాండవమధ్యముఖండనము విధమునకు భూతగణములెల్లను మేలుమేలని సన్నుతింపసాగెను. అప్పుడు వాసవునిఁబోలు నప్పార్థుని యద్భుతకర్మమునకు విస్మయంపడి యవ్వాసుదేవుఁడాతనితో 'ఓపార్థా! నీ విప్పు డొనర్చు నద్భుతకర్మ మాయింద్రునకును, యమునకును, గుబేరునకును దుష్కరమనఁదగియున్నది. ఈసంగ్రామమున నీవొక్కపరి పెక్కువేలసైన్యముల గూలద్రోసితివిగాదే!' అని పలికెను. అటులు సంశప్తకులనెల్లఁ జంపి భగదత్తునికడకుఁ బోవలయునని కృష్ణు నాయర్జునుఁడు ప్రేరించెను" అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

### భగదత్తుఁ డర్జునుతోఁ బోరాడుట

"ఓయంబికానందనా! అప్పు డప్పార్థుని ప్రయాణేచ్ఛ నెఱిఁగి యాజనార్దనుఁడు మనోజవములగునశ్వములను బ్రేరింప నవి యా ద్రోణునిసైన్యమును జేరఁబోయెను. ద్రోణపీడితులైన తనసోదరుల కడకుఁబోవు నప్పార్థుని వెనుదవిలి తనసోదరులతో సుశర్మయు వెడలెను. పిమ్మట నా శ్వేతవాహనుఁ డావాసుదేవుం జూచి 'ఓదేవా! ఈసుశర్మ తనసోదరులంగూడి యిదె నన్ను రణమొనర్ప రమ్మనుచున్నవాఁడు. అటుచూచిన మనసైన్యమెల్ల భగదత్తునిచేఁ జెదరిపోవుచున్నది. అటులగుట నాచిత్తము రెండువిధములై సంశయగ్రస్తమగుచున్నది. శత్రుపీడితులగుచున్న మనవారిని రక్షింపఁబోదునా? లేక యీసంశప్తకులను జంపుదునా? ఇందుఁ జేయఁదగిన దెద్దియో తెలిసి నా కెఱిఁగింపవలయును.' అని యర్జునుఁడు పలుక విని వాసుదేవుఁడు మఱలి సుశర్మపైకిఁ దనరథమును మఱలించెను. పిదప నర్జునుఁడు సుశర్మ నేడు సాయ

కములచే నొప్పించి మఱియు రెండుక్షురప్రములచే వానిధ్వజమును ధనువును దెగనేసి, మఱియు వానిభ్రాతను సూతాశ్వములతో గతాసుం గావించెను. అంత నాసుశర్మ నల్లత్రాఁచునాఁదగు నొకశక్తి నర్జునుపై విడిచి, వాసుదేవునిపైఁ దోమర మొకటి విసరెను. అపు డర్జునుఁ డా శక్తిని మూఁడింటను, దోమరమును మూఁడింటను బడఁగొట్టి శరసమూహముచే నాసుశర్మకు మోహమును గొల్పి మఱలునటు లొనర్చెను. ఓరాజా! భూరిశరాసారమును గురియుచు వాసవుఁడు నావచ్చు నుగ్రాకారుఁడగు నయ్యర్జునుని నీవారిలో నొకఁడును వారింప వలంతిగాకుండెను. పిదప నాధనంజయుఁడు మహారథులగువారినెల్ల శరపరంపరలఁ గప్పుచు, నెండుగడ్డి నగ్నివలెఁ గౌరవ్యులదహించుచు నందులకు వచ్చెను. అక్కుంతీపుత్రునివేగము నందలివారెవ్వరును బ్రజ లగ్నినివలె సహింపఁజాలకుండిరి. అప్పాండవుఁడు శరవర్షముచే మనసైన్యముల నాక్రమించి గరుడుఁడు నాగేంద్రునిపైవలె నాభగదత్తునిపై నుఱికెను. ఓరాజా! ఎయ్యది యాపన్నులైయున్న పాండవయోధుల క్షేమమును గూర్చునదై యరివర్గమున కశ్రువర్ధన మనఁదగియున్నదో యట్టిధనువు కపటద్యూతనిపుణుఁడగు నీతనయునివినాశమునకును, క్షత్త్రియవినాశమునకును నిపు డర్జునుఁ డెక్కిడియున్నవాఁడు. అటులే నీసైన్యమప్పార్థునిచేఁ గలఁతనొంది పర్వతమునుదాఁకిన యోడవలె నిపుడు వ్రయ్యలగుచున్నది. పిదపఁ బదివేవురుయోధులు జయాపజయములను గణింపక ధనుర్ధరులై వెఱపుడిగి యాయర్జునునిఁ జుట్టికొనిరి. అంత నప్పార్థుఁడు సర్వభారసహమై మడంచినయఱుపదేండ్లమత్తగజము పద్మవనమునుబోలె నీసైన్యమును గుపితుఁడై మర్దింపందొడంగెను. అటులాయర్జునుఁడు నీసైన్యమును మథింప నాభగదత్తుఁడు వడిగాఁ దనయేన్గుతో నాధనంజయునిఁ దలపడియెను. అపు డర్జునుఁడు తనరథముతో నాయేన్గు నెదుర్కొనెను. నారథగజములసంయోగ మెంతయు సంకులమై గానవచ్చెను. శాస్త్రీయముగా నిలుపఁబడి యారథగజములతో వీరులగు నాభగదత్తధనంజయు లిరువురును సంగ్రామమునకుఁ దలపడిరి. పిదప మేఘమునాఁదగు నానాగముపైనుండి యింద్రుఁడువలె నాభగదత్తుఁడాధనంజయుపై శరవర్షమును గురియు, నర్జునుఁడును దాని నానడుమనే తనశరపరంపరలచేఁ ద్రోలఁగించెను. ఓరాజా! పిదప నాభగదత్తుఁ

డాయర్జునునిబాణములను నివారించుచుఁ గొన్నితీవ్రనారాచములచే నాకృష్ణార్జునుల నొప్పించి, వానిని హింసించువాఁడై తనయేన్గును వారిరువురపైఁ బురికొలిపెను. కుపితుఁడగునంతకుఁడు నాఁదగి తమపైకి వచ్చునాయేన్గు నారసి తనస్యందనగతిచే దాని నపసవ్యముగా నొనర్చెను. అపుడు మఱలి యాయేన్గు భగదత్తునితోఁగూడఁ జంప నసువుపడియున్నను, ధర్మమును స్మరించి యర్జునుఁడు దానిని జంపక విడిచెను. అంత నాగజము గజములను, రథములను, గుఱ్ఱములను బెక్కిటిఁ ద్రొక్కుచు మృత్యులోకమున కనుపఁ గని యాధనంజయుఁడు కినుక వహించె" నని తెలుప విని ధృతరాష్ట్రుఁ డిట్లనియె.

**అర్జునుఁడు భగదత్తునిఁ జంపుట**

"ఓసంజయా! అటులు కుపితుఁడైన యర్జునుఁ డాభగదత్తు నేమి చేసెను? భగదత్తుఁ డాపార్థు నేమి చేయఁగలిగెను? యథార్థముగా దాని నా కెఱిఁగింపుము."

అది విని సంజయుఁడు "ఓయంబికానందనా! అటు లాకృష్ణార్జును లాభగదత్తుని మార్కొన్న, మృత్యువుకోఱలఁ జిక్కిరని వారి నపుడు జనులు తలంచిరి. పిదప నాభగదత్తుఁ డాయేన్గుపైనుండియే రథగతులై యున్న కృష్ణార్జునులపై శరవర్షమును గురియుచు గట్టిగాఁ దివిచివిడిచిన యుక్కుబాణములచే నాకృష్ణుని నొప్పించెను. అగ్నిస్పర్శతుల్యములగు నాభగదత్తునినారాచము లా దేవకీపుత్రుని మేనఁ దూసికొనిపోయి పుడమిఁజొచ్చెను. అంత నయ్యర్జునుఁ డాభగదత్తునిధనువు దునుమాడి, పరివారమును జంపి, సవిలాసముగా నాతనితో యుద్ధము చేయ నారంభించెను. అపుడు వాఁడు రవిరశ్మితుల్యములగు పదునాల్గుతోమరములు విసరఁగా, నాసవ్యసాచి వానిని మూఁడుమూఁడు ఖండములుగా ఖండించెను. పిదప నాయర్జునుఁ డాభగదత్తునేన్గుకవచమును ఛేదింప నది వ్రయ్యలై పుడమిఁబడియెను. అటులు కవచము దునియ నామహాగజ మాయర్జునశరప్రహారములకుఁ బాలై వర్షధారాసిక్తమై విగతాభ్రమగు పర్వతోత్తమమునాఁ జూపట్టెను. పిమ్మట నాభగదత్తుఁడు సువర్ణదండయుక్తమై యయోమయమగు నొకశక్తి యవ్వాసుదేవుని పై విడువ, దాని నాయర్జునుఁడు రెండుఖండములుగా ఖండించి,

మఱియు వానిఛత్త్రమును ధ్వజమును నఱికి పదిబాణములచే నప్పర్వతేశ్వరుని నొప్పించెను. అందుల కలిగి యాప్రాగ్జ్యోతిషుఁడు పార్థుని తలను గుఱిచేసి తోమరములను వైచి, సింహనాదమొనర్చెను. వాని తోమరములచే నాయర్జునునికిరీటము తాఱుమాఱగుటను, దానిని సరుదుకొనుచు నాయర్జునుఁ డాతనితో 'ఓయీ! లోకము గుఱిగలిగి ప్రవర్తింపవలయు' నని పలికెను. అది విని వాఁడు కుపితుఁడై శరవర్షముచే నప్పాండవునిఁ గప్పి యాగోవిందుని నొప్పించెను. అంత నయ్యర్జునుఁడు మఱల వానిధనువు ద్రుంచి, తూణీరములఁ జింపి డెబ్బదిబాణములసంధించి వానిమర్మముల నొనాఁటనేసెను. పిదప నట్లు ప్రహతుఁడై వైష్ణవాస్త్రము నభిమంత్రించి యంకుశమున నునిచి దాని నప్పాండవునివక్షమును గుఱిచూచివిడిచెను. అటులు భగదత్తప్రయుక్తమై సర్వఘాతి యనఁదగు నావైష్ణవాస్త్రమును గాంచి, వాసుదేవుఁ డప్పార్థునిఁ గప్పి తా నాయస్త్రము కడ్డుపడి తనయురమును గుఱిచేసెను. అది యాతనివక్షమునకు వైజయంతి యనెడిమాలయై విరాజిల్లెను. పిదప నర్జునుఁడు చిన్నవోయి యవ్వాసుదేవునితో 'ఓవాసుదేవా! నే నీయుద్ధమును మానికొని గుఱ్ఱములను బట్టికొనెదను. ఓపుండరీకాక్షా! నీ ప్రతిజ్ఞను నీవు రక్షించుకొనకుంటివి. ఒకపుడు, నే నాపన్నుఁడను గావచ్చును. అశక్తుఁడను గావచ్చును. అపుడు నీవేమైనఁ జేయవచ్చును గాని నేను శక్తుఁడనై యుండఁగా నీవిటులొనర్చుట పాడియే? ధనుర్బాణములను ధరించిన నేను సురాసురమానవులుగల యీలోకములనెల్ల జయింపఁగల్గుదునసుట నీవెఱుంగనిదిగాదు' అని పలుక విని వాసుదేవుఁ డిట్లనియె.

'ఓయర్జునా! నేనొకరహస్య మెఱిఁగించెదను వినుము. అయ్యది మిక్కిలి ప్రాచీనమైనది. నేను లోకహితమునకై నారూపమును నాల్గు మూర్తులుగా విభజించి మఱిమఱియు లోకత్రాణమునకై యవతరించుచుందును. నామూర్తులలో నొకటి పుడమిని దపశ్చర్యను గావించుచుండును. రెండవది లోకముల మంచిచెడ్డల నరయుచుండును. మూఁడవది మానవలోక మాశ్రయించి కర్మ మొనర్చుచుండును. నాల్గవది వేలకొలఁదివత్సరములు నిద్రించుచుండును. ఎయ్యది వర్షసహస్రాంతమున మేలుకనుచుండునో యది వరార్హులగువారికి నాయాకాలముల వరము

లొసగుచుండును. ఆవరార్ష్ణకాలము వచ్చుట నెఱిఁగి, భూదేవి నరకునికిఁగా నన్నొకవరమును గోరికొనియెను. దాని నెఱిఁగించెదను. వినుము. ఒకపుడు పుడమి మానవాకృతితో నాకగపడి 'ఓదేవా! దేవాసురుల కవధ్యుఁడగుకొమరుఁడు నాకుఁ గావలయును. వానికి వైష్ణవాస్త్రము వశమైయుండవలయును. అట్టివరము నాకొసంగుము' అనివేడికొనియెను. అది విని నే నామె కావర మొసఁగి యమోఘాస్త్రమును దయచేసితిని. మఱియు నపు డామెతో 'ఓపృథివీ! ఈయస్త్రము నరకరక్షణమునకుఁగా నమోఘమై యుండును. వీని నెవ్వఁడును జంపఁజాలఁడు. ఈయస్త్రముచే వైరిమారకుఁడై నీతనయుఁడు గర్వితుఁడగును. మఱియు సర్వలోకములకును దుర్జయుఁడగును.' అని పలుకవిని యటులే యగుఁగాక యని పలికి తనకోరిక నెఱవేరుట నది వెడలిపోయెను. ఆ నరకుఁడును వైరితాపనుఁడై యెట్టివారికిని దుర్జయుఁడుగా నుండెను. వానినుండి నా యీవైష్ణవాస్త్ర మీభగదత్తునిఁ జేరెను. లోకములందెవ్వఁడును వీనికి వధ్యుఁడు గానివాఁడు లేఁడు. ఇంద్ర రుద్రాదులును వీనిని జయింపఁజాలరు. అక్కతమున నీకుఁగా నియ్యస్త్రమును వేఱువిధముగా నొనర్చి వ్యర్థమొనర్చితిని. ఇప్పరమాస్త్రముచే హీనుఁడగు నీమహాసురు నిపుడె వధింపుము. నీకు వైరియు, సురారియునై వైరిమారకుఁడగు నీభగదత్తుని, మున్ను లోకహితమునకుఁగా నే నానరకునిఁ జంపినట్టులే నీవీతని వధింపుము.'

అది విని యపు డప్పార్థుఁడు తీవ్రనారాచముల నాభగదత్తునిఁ గప్పి, పిదప నాతని యేన్గుకుంభస్థలమునడుమ నొకవాఁడికోల నాటనది పర్వతమును వజ్రాయుధమువలె నాటికొని, పుట్టఁజొచ్చినపన్నగమువలె లోనికిఁ బ్రవేశించెను. అంత నాభగదత్తుఁడు మఱియు నాయేన్గును బురికొలిపెనుగాని యది వానివచనమును, ధనహీనునివచనమును వానిభార్యవలె సమ్మతింపదయ్యెను. మఱియు నది యాఘోరవేదన కోరువక దంతములతో నొడలు పుడమిమోపి యార్తస్వనమొనర్చుచుఁ బ్రాణములను విడిచెను. పిమ్మట గట్టిగా దివిచివిడిచిన యర్ధచంద్రబాణముచే నాభగదత్తునిహృదయమును భేదించెను. అంత భిన్నహృదయుఁడై యాభగదత్తుఁడు శరశరాసనములు పరిత్యజించి, గతాసుఁడై నేలఁగూలెను. వానిశిరోవేష్టనము తలనుండి జాఱి కాఁడ తెగినపలాశ

దళమువలె పుడమిఁ బడియెను. సువర్ణాలంకృతమగు తనయేన్గునుండి, జారి వాఁడు కొండనుండి, గాలిచే జాఱిన పుష్పితకర్ణికారమునాఁ జూపట్టెను. ఆయింద్రపుత్రుఁ డాయింద్రసఖుఁడును, నింద్రవిక్రముఁడు నగునాభగదత్తుని రూపుమాపి, మఱియు బలవంతులగు నివారియోధులగువారినెల్లఁ బెనుగాలి వృక్షములనువలె నశింపఁజేసె" నని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

శకుని యోడి పాఱిపోవుట

"ఓరాజా! ఇంద్రమిత్త్రుఁడును, బ్రతాపనిధియునగు భగదత్తునిఁ జంపి యప్పార్థుఁడు ప్రదక్షిణముగా నుండెను. పిదప గాంధారరాజపుత్త్రులును సోదరులునగు వృషకాచలు లిరువురును నాయర్జును మార్కొని కడువడిగల తీవ్రనారాచములచే నెంతయు నొప్పించిరి. అంత నాయర్జునుఁ డందు వృషకుని, సూతాశ్వధనుర్ధ్వజరథములను వాఁడి కోలలచే నూవుగింజలంతలుగా ఖండించి, మఱియు నానావిధములగు శరవ్రాతములచే శకుని మున్నగుగాంధారులనెల్ల నాకులచిత్తులఁ గావించెను. మఱియు నర్జునుఁ డుద్యతాయుధులై వీరులగుగాంధారుల నేనూర్గురను మృత్యులోకగతులఁగా నొనర్చెను. అటులు వృషకుఁడు హతాశ్వమగు తనరథము విడిచి తనయన్నయగు నచలునిరథ మెక్కి వేఱొకవిల్లుగొనియెను. అటు లావృషకాచలు లిరువురు నేకరథారూఢులై, మఱిమఱియు నాయర్జునుని శరవర్షమున ముంచిరి. ఓరాజా! అపుడు నీస్యాలకులగు నావృషకాచలు లిరువురును మున్నింద్రుని వృత్రబలాసురులువలె నెంతయుఁ బీడించిరి. మఱియు నాగాంధారు లాయర్జునుని గుఱితప్పక కొట్టుచు, నిదాఘవార్షికమాసములు వేఁడిమిని, జలాధిక్యమునను లోకమును బీడించునట్లు పీడింపసాగిరి. ఓరాజా! అటు లేకరథస్థులై సంశ్లిష్టాంగులై యొకటిగానున్న యావీరుల నిరువుర నొకబాణముచే నాయర్జునుఁడు చంపఁగా, సింహసన్నిభులును, మహాభుజులును, లోహితాక్షులునగు వా రేకరూపులై గతప్రాణులగుచు నేలఁ గూలిరి. బంధుజనప్రియము లైనవారియొడళ్లు పుడమిఁబడుడు, వారి యశము పవిత్రమై నలుదెసల వ్యాపించెను. అటులు తమమామలు పలాయితులుగాక రణరంగమున నిలిచి హతులగుట నారసి, నీకొమరు

లెల్ల నస్త్రము లెంతయును విడిచిరి. అప్పుడు తనభ్రాతలు హతులగుడు, మాయాశతకుశలుఁడగు శకుని యాకృష్ణార్జునులం దనమాయాబలముచే మోహపెట్టుచు లగుడములు, పాషాణములు, శతఘ్నులు, శక్తులు, గదలు, పరిఘములు, నిస్త్రింశములు, శూలములు, ముద్గరములు, పట్టిసములు, కంపనములు, నఖరములు, ముసలములు, పరశ్వధములు, క్షురములు, క్షురప్రములు, నాలీకములు, వత్సదంతములు, అస్థిసంధులు, చక్రములు, విశిఖములు, ప్రాసములు మున్నగునాయుధములను గల్పించి, నలుదెసల వ్యాపింపఁజేసి, యాయర్జును భ్రమింపఁజేసెను. మఱియు ఖరములు, నుష్ట్రములు, వ్యాఘ్రములు, నెనుపోతులు, సింగములు, గవయములు, చిల్లకములు, నెలుఁగులు, కోఁతులు, గృధ్రములు, సరీసృపములు మున్నగునవియు వివిధములగురక్షస్సులును, నాఁకలిగొని కుపితములై యర్జునుని దఱుముచున్నట్లు గానవచ్చెను. పిదప దివ్యాస్త్రవేత్తయు శూరుఁడు నగు నాథసంజయుఁడు శరజాలములను గురిసి వానినెల్లఁ బీడించెను. అటు లాశూరుఁడు దృఢసాయకములచే నొప్పింప, నవి ఘోరారావములుగా నఱచుచు హతములై రూపుమాసి చనియెను. పిమ్మట నాయర్జును నలుగడలం జీఁకటులు గ్రమ్మెను. ఆపెనుఁజీఁకటిలోఁ గ్రూరవచనము లప్పార్థుని నిందాపరములై వినవచ్చెను. ఆఘోరాకారమైన చీఁకటిని నగ్నిమయమగు మహాస్త్రముచే నర్జునుఁడు నశింపఁజేసెను. అప్పెనుఁజీఁకటి యడంగుడు, భయంకరములగు జలౌఘము లుద్భవించెను. అపు డర్జునుఁడు వాని నడంచుటకై యాదిత్యాస్త్రమును బ్రయోగింప, దానిచే నాయుదకము లెండి రూపుమాసెను. ఇటులు బహువిధములుగా నాసౌబలుఁడు తనమాయాబలముచేఁ గల్పింప, నయ్యర్జునుఁడు వానినెల్లఁ దనయస్త్రబలముచే సవిలాసముగా నడంచెను. అటులు తనమాయ లెల్ల హతములగుచు రాఁగా నర్జునశరాహతుండై యాశకుని జడిసి, ప్రాకృతునివలెఁ దనవడిగలగుఱ్ఱములతో వడిగా వెడలిపోయెను. పిదప నాయస్త్రవేత్తయగు నర్జునుఁడు తనచాతుర్యము మెఱయఁ గౌరవసైన్యమును నురుమాడఁ దొడంగెను. అటు లక్కౌరవసైన్య మాతని యేటుల కోటమిచెంది, పర్వతము దగులుకొన్నగంగవలె నిరుపాయమై చెదరెను. అటులు చెదరి కొందఱు ద్రోణునిఁ జేరఁబోయిరి. మఱికొందఱు దుర్యోధనునికడ కేగిరి. సైన్యమెల్ల ధూళిచే

గప్పంబడుడు, నతఁడు మాకుఁ గానరాకుండెను. కాని యాతనిగాండివ ధ్వనిమాత్రము దక్షిణదిశను వినవచ్చుచుండెను. మఱియు శంఖదుందుభిధ్వనులను, వాదిత్రారావములను మించి గాండివధ్వని మిన్నుముట్టుచుండెను. పిదప మఱియును జిత్రయోధులగువారిసంగ్రామము దక్షిణముగ నేజరుగుచుండఁగా, నం దర్జునునియుద్ధము జరిగెను. నేను ద్రోణునపు డనుసరించితిని. అపుడు యుధిష్ఠిరుసైన్యములు నానావిధములగు మనసైన్యములను జెండుచు వచ్చెను. అపు డర్జునుఁడును నాకసమునఁ బెనుగాలి మేఘములనువలె మనవారినిఁ దోలఁగింపసాగెను. ఇంద్రుఁడే యిటులు వచ్చెనా యన్నటులు శరవర్షమును గురియు నప్పార్థు నొకఁడును నివారింపఁజాలఁడయ్యెను. అటులు మనసైనికు లాయర్జునశరపీడ కోరువక యెంతయుఁ బరువులిడుచు మతిచెడి తమవారినే తాము చంపుకొనసాగిరి. అర్జునప్రయుక్తములగు శరజాలము లపుడు మిడుతలువలె నెల్ల దెసలఁ జెలరేగి వైరివీరులఁ దెగటార్పసాగెను. ఆతని యొకబాణము తురంగమును రథికుని మాతంగమును బదాతిని భేదించి, పుట్టఁజొచ్చిన పామువలెఁ బుడమిని జొరసాగెను. ఆతఁ డొకకుంజరమునుగాని, యశ్వమునుగాని, నరునిఁగాని చంపుట కొకబాణమునేగాని రెండవదాని నుపయోగింపలేదు. అవియెల్ల నాతని యొక్కొకబాణముచేతనే గతాసువు లగుచువచ్చెను. హతులగుపదాతులయు, నేన్గులయు, గుఱ్ఱములయు సమూహములతోనిండి కుక్కలు నక్కలును మొఱయ నా రణరంగము మిగుల భీషణమైయుండెను. ఓరాజా! ఇంతయేల! అక్కొంతేయునిశరప్రహారముల కోరువక కౌరవసైన్యములు తండ్రి కొమరుని, మిత్రుఁడు తనమిత్రుని,కొమరుఁడు తండ్రిని విడిచి నిజప్రాణరక్షణపరులై తమతమవాహనములను దిగి వెడలిరి." అని తెలిపిన విని ధృతరాష్ట్రుఁ డి ట్లనియె.

సీలుఁ డశ్వత్థామచేఁ జచ్చుట

"ఓసంజయా! అప్పార్థునిచే నటులు సైన్యములు భగ్నములై మనవారు చలించుటయుఁ బరువులిడుటయును గాంచి నాపుత్రుల చిత్తము లె ట్లయ్యెను? అటులు చెదరి నిలుకడ నపేక్షింపకున్నసైన్యములను మఱలించుట దుర్ఘటమై యుండునుగదా! అది యెట్టులయ్యెనో తెలుపుము."

అది విని సంజయుఁడు "ఓరాజా! అటులయినను నీతనయుని ప్రియము గోరువారై వీరులు లోకమునఁ దమకీర్తిని రక్షింప నెంచి ద్రోణు ననుసరించిరి. వీరు లస్త్రములెత్తి యుధిష్ఠిరుఁడు తోట్రుపడ నాభీకరసంగ్రామమునఁ గొలఁదులు మీఱి పోరాడుచుండిరి. అంత భీమునకును సాత్యకిధృష్టద్యుమ్నులకును నడుమఁ గొందఱు వీరులు చొచ్చి ద్రోణునిఁ బొదువుఁడు, ద్రోణునిఁ బొదువుఁడని పాంచాలురను బ్రేరించిరి. ద్రోణున కడ్డుపడి యాతని విడువకుఁడని నీకొమరులు కౌరవ సైన్యములను బ్రోత్సహించిరి. కొందఱు ద్రోణునిఁ బొదువుఁడనియుఁ, గొందఱు ద్రోణుని విడువక రక్షింపుఁడనియుఁ బలుకు నక్కురుపాండ వులకలకల మెక్కుడయ్యెను. ఆద్రోణు నొకపణముగా నొడ్డి సమర ద్యూతమును గావించిరి. పాంచాలరథికు నెవ్వానినెవ్వాని నాద్రోణుఁడు పీడించుచుండెనో యందందు ధృష్టద్యుమ్నుఁ డాతని నెదుర్కొనుచు వచ్చెను. అటులు భాగ్యవిపర్యాసముగ యుద్ధము ఘోరమగుటయు వీరులు వీరులును గలిసి భైరవారావము లొనర్చుచుఁ బోరాడ నారం భించిరి. అపుడు వైరుల కజేయులై పాండవులు తమపడినక్లేశములను స్మరించుకొనుచుఁ గౌరవసైన్యముల నుఱుమాడసాగిరి. కొందఱు కుపి తులై బిడియమడర యథార్థ మెఱిఁగి, ప్రాణములపై నాసగొలుపక ద్రోణునిఁ బ్రహరించువారై మఱలిరి. తేజోనిధులగువారు ప్రాణద్యూ తము లారంభింప శిలాపాతమును, నయఃపాతమునుబోలి పోరు ఘోర మయ్యెను. ఓమహారాజా! అట్టియుద్ధమును వృద్ధులునైతము మున్ను తాము చూచినటులుగాని, విన్నటులుగాని స్మరింపఁజాలకుండిరి. ఆవీరుల రాపిడిని బుడమియు వడంకఁదొడంగెను. ఆకస మాసైన్యఘోరారావ మున స్తబ్ధమయ్యెను. అట్టిసమయమున ద్రోణునిఁ బాండుసైన్యములు చేరి యాతని తీవ్రనారాచముల భంగమొందుచువచ్చెను. అద్భుత విక్రముఁడగు నాద్రోణునిచే నటులు తనసైన్యములు మథింపఁబడుటఁ జూచి ధృష్టద్యుమ్నుఁ డాతని మార్కొనియెను. అపు డప్పాంచాల ద్రోణులయుద్ధము నద్భుతముగాఁ గాంచితిమి. ఆయుద్ధమునకు సాటి లేదని నానిశ్చయము. అంత నగ్నితుల్యుఁడగు నీలుఁడు వెడలి, బాణము లనెడిస్ఫులింగములు,విండ్లనెడిజ్వాలలునుగలిగి యెండుగడ్డినిబోలెనకౌ రవసైన్యమును గాల్చుచు విజృంభించెను. అటులు విక్రమించు నా

నీలునిఁగాంచి యశ్వత్థామ చిరకాలమునుండియు వానిని వధింపఁగోర్కి గలవాఁడగుట చేఁ జెలంగుచు వానితో 'ఓనీలా! పెక్కుర యోధులను గాల్చుటచే నీకేమిగొప్ప! నాతో యుద్ధమొనరింపుము. కుపితుఁడవై వడిగా నన్నుఁ బ్రహరింపుము.' అని పలుకవిని యానీలుఁడు, పద్మపత్రతుల్యనేత్రుఁడగు నాయశ్వత్థామను వాఁడికోలల నొప్పించెను. వానియేటునకుఁ గుపితుఁడై వడిగా మూఁడువాఁడిభల్లములచే వానిధనుర్ధ్వజములను ఛత్రమును ఖండించెను. అంత నానీలుఁడు గద ముడిగి కేడెమును ఖడ్గమునుబట్టి పక్షివలె నాద్రోణతనయు శరీరమునుండి శిరముఁ దెగనేయువాఁడై యుఱుక, నున్నతాంసుఁడును సునాసికుఁడునగు నానీలుని సకుండలమగుమూర్ధము నొకభల్లముచే డొల్ల నేసి, యాద్రౌణి యట్టహాస మొనర్చెను. అపుడు వాఁడు పూర్ణచంద్రతుల్యవక్త్రుఁడును, పద్మపత్రనిభనేత్రుఁడునునై నల్లఁగలువఁబోలిన తన పొడవుగలమేను మేదినిఁ గూలఁ బ్రాణములు పరిత్యజించెను. అంతఁ బాండవసైన్యమాకులమై శోకింపఁదొడఁగెను. ప్రతాపశీలుఁడగు నీలుఁడటు లశ్వత్థామకగ్గమై నశించుడుఁ, బాండవమహారథులెల్లరును జింతాక్రాంతులైరి ఓరాజా! అపుడు తమ్మర్జునుఁ డెట్లు రక్షింపఁగలఁడో యనియు, నతఁడు సేనలకు దక్షిణముగా సంశప్తకులను నారాయణగోపాలురను నిశ్శేషము గావింపనుండుట నెటులిందులకు రాఁగలఁడనియుఁ జింతింప నారంభించి"రని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## సంకులయుద్ధము

"ఓరాజా! ఆసైన్యప్రతిఘాతమును సహింపక భీముఁడడరి, బాహ్లీకు నఱువదింటను, గర్ణునిఁ బదింటను గొట్టెను. అపుడు ద్రోణుఁడు తీవ్రధారములగుబాణములచే నాభీముని జీవితాంతమునుగోరి మర్మములు నాఁట నాతనిఁ బ్రహరించెను. అటులే కర్ణుఁడు పదింటను ద్రౌణి యేఁడింటను, దుర్యోధనుఁ డాఱింటను నాభీముని నొప్పించిరి. మహాబలుఁడగు భీముఁడును వారినెల్లఁ బ్రహరింపనెంచి ద్రోణు నేఁబదింటను, గర్ణునిఁ బదింటను, దుర్యోధనునిఁ బండ్రెండింటను, ద్రౌణి నెనిమిదింటను గొట్టి యఱచుచు విక్రమించెను. అపు డాభీమునకు హాని

వాటిల్లునేమో యని జడిసి యుధిష్ఠిరుఁడు తనసైన్యములను, భీముని రక్షింపఁ బ్రోత్సహించెను. విక్రమోదగ్రులగువా రాభీముని సమీపించియుండిరి. నకులసహదేవులును యుయుధానుఁడు మున్నగువారును గలిసి సంరబ్ధులై మఱికొందఱు ధనుర్ధరులు తమకు సహాయులుగా ద్రోణసైన్యమును రూపుమాపువారై భీమున కటులు దోడ్పడ, భీముఁడు మున్నగుమహారథు లాద్రోణు నావరించిరి. రథికోత్తముఁడగు ద్రోణుఁడును జాగరూకుఁడై వారినెల్ల నివారించెను. మహారథులును, బలశాలులును, వీరులు, యుద్ధగర్వితులునగు పాండవులను దాఁకి, నీవారును బ్రాణములయెడ నాసలుగొలుపక పోరాడఁదొడంగిరి. అపుడు రౌతులతో రౌతులకును, రథికులతో రథికులకును, శక్తితోమరఖడ్గాదులతో సంకులయుద్ధ మయ్యెను. కత్తులయుద్ధము దారుణమై యారంభమయ్యెను. ఏన్గులు గూలఁజొచ్చెను. ఏన్గులనుండి కొందఱును, గుఱ్ఱములనుండి కొందఱును గూలుచుండిరి. బాణభిన్నుఁడై రథమునుండి రథికుఁడును బడుచువచ్చెను. ఆసంకులయుద్ధమునఁ గవచహీనుఁడై పడిన యోధు నొకకుంజర మక్కునఁద్రొక్కి తలనుద్రెంచెను. అటులే పుడమిఁబడినపదాతులను మఱికొన్నియేన్గులు దంతములచేఁ జించి చెండాడెను. మఱియుఁ గొన్ని తమదంతములనాఁటిన నారాచములకుఁ బదాతులను గ్రుచ్చి తిరుగఁజొచ్చెను. ఇనుపకవచములుగల గజాశ్వరథపదాతులు నేలఁగూల, నెత్తు రెగఁజిమ్మఁదొడంగెను. పుడమిఁబడిన పృథివీశులు బిడియముచే గ్రద్దలఱెక్కల నాచ్ఛాదించి పరుపులపై పరుండిరి. నాఁటిసంగ్రామమునఁ దండ్రిని గొమరుఁడు చంపిపోయెను. అటులే కొమరునిఁ దండ్రి దండించి విలపింపకుండెను. అక్షము భగ్నమై ధ్వజము తెగిఁ గొడుగు పుడమిఁబడి సగము యుగము తెగిన రథమునీడ్చికొని హయమొకటి పరువిడిపోయెను. ఖడ్గముతోఁగూడిన బాహువును గుండలములతోఁగూడినతలయు నేలఁగూలెను. బలముగల యొకయేన్గొకరథమును జూర్ణముగావించెను. ఒకయేన్గు వేఱొకయేన్గు నారోహకునితో నేలఁగూలఁద్రోసెను. పరిమితిలేక దారుణమైనయుద్ధ మపుడు జరిగెను. 'ఓతండ్రీ! ఓపుత్రకా! ఓమిత్రుఁడా! ఎందున్నాఁడవు? నిలువుము. ఎక్కడకుఁ బరువుపెట్టుచున్నాఁడవు?' అనుపలుకులును, 'ప్రహరింపుము. విడువకుము. చంపుము' అనుపలుకులును మెండై యందు

పలువిధములుగా వినవచ్చెను. గజాశ్వపదాతులరక్తములు ప్రవాహములై పుడమినిబొడము ధూళుల నడఁచి భీరులగువారికి వెఱపుగలిగించెను. ఒకవీరుఁడు వేరొకవీరునిపైఁ జక్రమువైవ వానిచక్రముచే నది భగ్నమగుడు నొకగదాప్రహారముచే వానిశిరము దెగనేసెను. జుట్టులు పట్టుకొని ముష్టియుద్ధమును దారుణముగా నొనర్చిరి. నఖములతోడను దంతములతోడను బోరాడుశూరుఁ డూతకై వెదకి ఖడ్గమునెత్తిన వేఱొకనిబాహువును బట్టుకొనియెను. వేఱొకఁ డొకనిధనుర్బాణములతోఁగూడినబాహువు నూతచేసికొనియెను. ఒకఁడు వేఱొకనిఁ దిట్టెను. ఇంకొకఁ డొకనిఁ బరాఙ్ముఖునిఁగావించెను. తుల్యుఁడగు నొకని వేరొకఁడు తలఁ దెగనేసెను. ఒకఁడు చప్పుడుచేయుచుఁ బరువులిడ దానికి వేఱొకఁడు జడిసెను. ఒకఁడు వైరులను, వేఱొకఁడు తనవారిని దీవ్రనారాచముల సంహరించెను. కొండశిఖరమునాఁదగు నొకయేన్గు వర్షకాలమున నదీకూలమువలె నేలఁగూలెను. అటులే యొకయేన్గొక రథికుని సాశ్వునిఁగను, ససూతునిఁగను గాలితోఁ ద్రొక్కి నిలువఁబడియెను. కృతాస్త్రులగుశూరులు రక్తసిక్తాంగులై నేలఁగూలుటను గాంచి భీరువులగువారు మూర్ఛపడఁజొచ్చిరి. ఆరణరంగమంతయు భయంకరమై యందించుకేని తెలియకుండెను. సేనాపరాగములచే మేరమీఱి పరువులిడు నాసమయమున సేనాపతియగు ధృష్టద్యుమ్నుఁడు తగుసమయమిదెయని పాండవులఁ ద్వరపెట్ట నాతనిశాసన మతిక్రమింపక బాహుబలశాలులగు నప్పాండవులు సరోగతహంసలువలె నొక్కమాఱుగా నాద్రోణునిరథముపైఁబడి ప్రహరింప మొదలిడిరి. 'పట్టికొనుఁడు. పరువులువెట్టుఁడు. జడియకుఁడు, నఱకుఁడు.' అనుసంకులశబ్దము లాద్రోణుని రథముచుట్టును వినవచ్చెను. అపుడు ద్రోణుఁడును, కృపుఁడును, కర్ణుఁడును, ద్రౌణియు, సైంధవుఁడు, విందానువిందులు, శల్యుఁడును నప్పాండవసైన్యముల నివారించిరి. అంత నప్పాండవపాంచాలురును దుర్నివారులై శరపీడితులయ్యు ద్రోణుని విడువకుండిరి. అపుడు ద్రోణుఁడు కుపితుఁడై శరశతముల విడుచుచుఁ, జేదిపాంచాలపాండవసైన్యములతో నెంతయు భీకరముగాఁ గదనమొనర్చెను. ఓరాజా! ఆద్రోణుని వింటినారిచప్పుడు దెప్పరమై యెల్లదిక్కుల వినవచ్చెను. పిడుగుఁబోని దాని కనేకులు భీతిల్లిరి. ఓరాజా! అంతలో నక్కౌంతేయుఁడు సంశప్త

కులఁ బెక్కుర నుక్కడంచి, యప్పాండవబలమును మర్దించు నా ద్రోణుఁ డున్నచోటి కరుదెంచెను. శరసమూహమనెడిసుడులును రక్తోదకము లును గలసంశప్తకసాగరములను శోషింపఁజేసివచ్చి యవ్విహ్వచ్చుఁ డండుఁ గానవచ్చెను. రవితుల్యతేజుఁడై కీర్తినిధియగు నాయర్జునునిధ్వజము కపిచిహ్నితమై దేదీప్యమానమగుచుఁ గానవచ్చెను. తనయస్త్రకిరణము లచే నప్పాండవయుగాంతార్కుఁడు సంశప్తకసముద్రము నింకించి కురు వులపైఁబడి వారిని దనశరాగ్నిచే దహింప నారంభింప,నతఁడు యుగాంత ధూమకేతువునాఁ జూపట్టెను. ఆతనిశరపరంపరచేఁ బీడితములైన గజా శ్వరథయోధసమూహములు వికలావయవములై నేలఁగూలెను. కొంద ఱరచిరి. కొంద ఱేడ్వసాగిరి. మఱికొంద ఱప్పార్థశరములపాలై గతా సులై పుడమిఁబడిరి. పరువులిడినవారిని, బరాఙ్ముఖులయినవారిని, బడిన వారిని యుద్ధనియమము ననుస్మరించి యతఁడు ప్రహరింపకుండెను. భగ్నరథులును, బరాఙ్ముఖులునైన కౌరవయోధులు 'ఆహా! అయ్యో! కర్ణా! కర్ణా!' అని మొఱలిడసాగిరి. అపుడు వారియాక్రందన మాలించి శరణాగతులగుట యెఱిఁగి 'ఓయీ! జడియకుఁడు. ఇదె రక్షించుచు న్నాఁడ' నని ప్రతినపట్టి యర్జునున కభిముఖముగా వెడలి, యాభారత రథికశ్రేష్ఠుఁడగు కర్ణుఁడు సకలభారతయోధహర్షవర్ధనుఁడై యస్త్రవేత్త యగుట నాగ్నేయాస్త్రమును బ్రయోగించెను. అంత దానినుండి వెడ లిన శరజాలమును దనశరపరంపరచే నర్జునుఁడు తొలఁగించెను. అటులు వారిరువురును బరస్పరాస్త్రములను బరస్పరము నివారించుకొనుచు వచ్చిరి. పిదపధృష్టద్యుమ్నుఁడును, భీముఁడును, సాత్యకియుఁ గర్ణునిఁ జేరి మూఁడుమూఁడువాఁడికోలల నాతని నొప్పించిరి. పిదప నర్జునుని యస్త్రము నారాధేయుఁడు తనశరవర్షముచే నివారించి, మూఁడుతీవ్ర నారాచములచే భీమసాత్యకిధృష్టద్యుమ్నుల ధనువులఁ దునుమాడెను. వారటులు భిన్నాయుధులై నిర్విషములగుసర్పములునాఁ బొగిలియు, రథమునుండియే శక్తులనువైచి యెంతయు బిగ్గరగా సింహనాదము లొనర్చిరి. సర్పతుల్యములై వారిచే విడువఁబడిన యాశక్తులు దీప్య మానములై యక్కర్ణునిఁ బ్రహరింపఁబోయెను. ఆశక్తుల నారాధే యుఁడు మూఁడుమూఁడుబాణములచే ఖండించి, పార్థునిపై శరపరంపరఁ గురియుచు సింహనాద మొనర్చెను. అర్జునుండును నేడుబాణములచే

నారాధేయుని వేధించి, కర్ణుని తమ్మునిఁ గొట్టి, యాఱుబాణములచే శత్రుంజయునిఁ జంపి, యొకభల్లముచే విపాటునితలను రథమునుండి పుడమిఁ గూలనేసెను. నీకొమరులు చూచుచుండఁగా నొకయర్జునునిచే గర్ణునియెదుట మూవురుసోదరులు చంపఁబడిరి. పిదప భీముఁడు గరుడు వలె రథమునుండి యెగిరి కర్ణపక్షులగు పదునేవుర నొకయుత్తమఖడ్గముచే ఖండించి, మఱియుఁ దనరథ మెక్కి వేఱొకవిల్లుగొని కర్ణునిఁ బదింటను, వానియశ్వములను సూతుని నేనింటను నొప్పించెను. ధృష్టద్యుమ్నుఁడును నొకకేడెమును ఖడ్గమును బూని చంద్రవర్మని, నైషధుఁడగుబృహత్క్షత్రునిఁ గొట్టి, మఱియుఁ దనరథ మధిరోహించి వేఱొకవిల్లుపూని డెబ్బదిబాణములచేఁ గర్ణుని నొప్పించి సింహనాద మొనర్చెను. సాత్యకియు వేఱొకవిల్లుపూని యారాధేయుని మఱల నఱువదినాల్గు బాణములచే నొప్పించి, సింహమువలె భీకరారావ మొనరించెను. ఓరాజా! మఱియు నాసాత్యకి రెండుతీవ్రభల్లములచేఁ గర్ణునికార్ముకము ఖండించి, మూఁడువాఁడికోలలచే వానియురము నొప్పింప, దుర్యోధనుఁడును, ద్రోణుఁడును, సైంధవుఁడును వెడలి యాసాత్యకి సముద్రమునుండి యారాధేయునిఁ దరింపఁజేయువారై వచ్చిరి. పిమ్మట నీవారిగజాశ్వరథపదాతులు వేలకొలఁదిగా వెడలి వైరులను వెఱపించుచుఁ గర్ణునకుఁ దోడ్పడ, ధృష్టద్యుమ్నుఁడును, భీముఁడును, నభిమన్యుఁడును, నర్జునుఁడును, నకులసహదేవులును, సాత్యకిని గాచువారై యుండిరి. ఇటులు సకలధనుర్ధరులకును క్షయకారణమై మహారౌద్రమై యక్కురుపాండవసైనికులకు ఘోరమగుపోరాట మపుడు జరిగెను. గజాశ్వరథపదాతులు రథపదాతులతోడను, రథికులు గజాశ్వపదాతులతోడను, రథికపదాతులు రథికగజములతోడను, నేన్గు లేన్గులతోడను, గుఱ్ఱములు గుఱ్ఱములతోడను, రథికులు రథికులతోడను, బదాతులు పదాతులతోడను గలిసి పోరాడ నారంభించిరి. మాంసాహారులకు హర్షజనకమై యిట్టియుద్ధ మారంభమై యమరాష్ట్రవర్ధనమై చూపట్టెను. ఇటులు గజతురగరథికపదాతులచే గజతురగాదులు హతములై నాలుకలు దెగినవియుఁ, బం డ్లూడినవియుఁ, గన్నులు వోయినవియు నై కవచభూషణాదులుచెడి నేలఁగూలెను. పెక్కుసాధనములుగల రథికులచే హతములైనగజములును, హయగజపదతాడితులైనపదాతులును, రథనేమి

క్షతులగు సైనికులునుగలిగి దారుణమై యారణభూమి ప్రవర్తిల్లెను. మహాబలులగునవ్వీరులు పరస్పరము చేరి తమతేజోబలముల వినియోగించి చంపుకొనసాగిరి. ఓరాజా! అపుడటులు సైన్యమలసి రక్తసిక్తమై చూపట్టుటను, సూర్యుఁడస్తమించుచుండుటను, నుభయపక్షవీరులును నాఁటికి యుద్ధమును ముగించి తమతమశిబిరములకు వెడలిరి." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

పద్మవ్యూహనిర్మాణవిచారణము

"ఓరాజా! అమేయతేజుఁడగునర్జునుచే మనవారు భంగపడ ద్రోణుని ప్రతిజ్ఞ వ్యర్థమై చెడ, యుధిష్ఠిరుఁడు రక్షితుఁడుగా నీవారెల్లరును విధ్వస్తకవచులై యుద్ధమున నోడిరి. మఱియు మనవారెల్ల ధూళిబ్రుంగి యుద్విగ్నులై నలుదెసలఁ బరికించుచు భారద్వాజునిసమ్మతిపై యుద్ధమును ముగించిరి. గుఱిగలపాండవవీరులశరపరంపరకుఁ జిక్కియెంతయు హీనులై సంగ్రామమునఁ బరిహాసపాత్రులైరి. మఱియును సకలభూతములును ధనంజయుని వేనోళ్లఁ బొగడుటకును, నర్జునునిపైఁ గేశవునకుఁ గలవాత్సల్యము కీర్తింపఁబడుటకును సహింపక నీవారు తమ్ముఁ దెగడినట్లు మూకలై యేమో ధ్యానించువారువలె నుండిరి. పిదప సూర్యోదయమగుడు సుయోధనుఁడు ద్రోణునితోఁ దనకుఁ గల రాజ్యప్రీతియు, నభిమానము, శత్రువృద్ధియుఁ జిత్తమును బీడింప నెల్లయోధులును వినుచుండఁగా వాక్యవిశారదుఁడై యుద్రేకమడర నిట్లనియె.

'ఓబ్రాహ్మణోత్తమా! నీకు మేము నిశ్చయముగా వధ్యపక్షుల మనక తప్పదు. కాదేని నీచేరువకు వచ్చియున్నయుధిష్ఠిరు నేల పట్టుకొనక విడిచితివి? నిజముగ నీవాతనిఁ బట్టికొనఁగోరితివేని నీకనులయెదుటఁ బడిన యాశత్రువును దేవతలతోఁగూడినపాండవులైనను విడిపింపఁ గలరా? తొలుత నాయెడఁ బ్రీతిగలిగి వరమొసంగియుఁ, బిదప వికృతచిత్తుఁడవైతివి. ఆర్యులెన్నఁడును దమయనుగ్రహమునకుఁ బాత్రులగు వారి కాశాభంగమును గలిగింపరుగదా!"

అది విని యాద్రోణుఁడు లజ్జితుఁడై 'ఓరాజకుమారా! నీప్రియమునకై పూనియున్న నన్నిట్లు నీవు తలంచుట తగదుసుమీ! అర్జున

పాలితమగుసైన్యమును జయింప, సురాసురగంధర్వయక్షరాక్షసోరగులకును నలవిగాదు. ప్రపంచముసృజించు గోవిందుఁడుగలిగి యర్జునుఁడు సైన్యమునునడఁప, నందు రుద్రుఁడుదక్కఁ దక్కిన యెవ్వఁడు తనబలము నెఱపఁగలఁడు? ఓనాయనా! నేనిపుడు నిజము తెలుపుచున్నాఁడను. ఇది యెన్నటికిని దప్పనిదనుకొమ్ము. దేవతలకును భేదింపరానియొక వ్యూహమును బన్నుదును. పిదపఁ బాండవవీరులలో నొకయుత్తమ మహారథునిఁ జంపెదను. ఓసుయోధనా! ఏయుపాయముచేనైన నర్జునుఁ డపు డందు లేకుండఁజేయవలయును. ఆయర్జునున కసాధ్యమును దెలియనిదియు నించుకయును లేదు. అందఱునుండియు నతఁడంతయును దెలిసినవాఁడు.' అని తెలుప విని మఱల నెప్పటిచొప్పున సంశప్తకు లర్జునుని యుద్ధమునకురమ్మని దక్షిణముగాఁదీసికొనిపోవ, వారితో నాతనికి సంగరమయ్యెను. అట్టియుద్ధ మెన్నఁడును నెవ్వఁడును విన్నదియుఁ గన్నదియునుగాదు. ఓరాజా! ద్రోణుఁడు తానన్నటు లొకవ్యూహమును గల్పింప, నది యెంతయు విరాజిల్లెను. మధ్యందిన మార్తాండునివలె నది మాకుఁ గానవచ్చెను. తన పెదతండ్రిమాటవట్టి దాని నభిమన్యుఁడు ప్రవేశించి దుర్భేద్యమగునదియైనను, ననేకవిధములుగా దానిని భేదించి, చేయరాని యద్భుతకృత్య మొనర్చి, యందువేల కొలఁదియోధులను జంపి, తుది కాఱుగురువీరులకుఁ జిక్కి, దుశ్శాసనసూనునకు వశుఁడై, యాతఁడు ప్రాణములను బరిత్యజించెను. అపుడు మేమెల్లరము సంతుష్టాంతరంగులమైతిమి. పాండవులు చింతాక్రాంతులైరి. ఆసుభద్రాసూనుఁడు హతుఁడైనవెంటనే యుద్ధమును ముగించితిమి." అని తెలిపెను.

అది విని ధృతరాష్ట్రుఁడు "ఓసంజయా! మీసము లేని రాని చిన్నివయసుగలిగిన పురుషసింహుఁడగు నభిమన్యుకుమారుని మరణమును విని, నాచిత్త మెంత యుబ్బద్దలగుచున్నది. ధర్మప్రవక్తలచే దారుణమగు నీక్షత్త్రధర్మము నిర్ణయింపఁబడినది. ఇది ధర్మమని తలంచియేగదా రాజ్యకాములైనశూరులు బాలుని శస్త్రములచేఁ బడగొట్టిరి. ఓ సంజయా! మిగుల సుకుమారుఁడై నిర్భయముగాఁ జరించు నాబాలునిఁ గృతాస్త్రులగు పెక్కురుశూరు లెటులు చంపిరి? తేజోనిధియై రథిక

సమూహమును భేదించుచుఁ నాసౌభద్రుఁడెటు లారణరంగమునఁ గ్రీడించెనో దానినెల్లఁ దెలుపుము." అని ప్రశ్నించెను.

అది విని సంజయుఁడు "ఓరాజా ! నీ వాసౌభద్రునిపతనవిధ మును వినఁగోరితివిగాన దానినెల్లఁ దెలిపెదను. అవహితుఁడవై వినుము. ఆయభిమన్యుఁడు సైన్యములను భేదించునపుడు విక్రమించినవిధమును నపుడు దుర్వారులై జయేచ్ఛఁగలిగిన నీవారివీరులవిధమును గ్రహిం పుము. అపుడు దావాగ్ని చుట్టుకొనఁ దృణగుల్మద్రుమాదులం దడఁగి యున్న యడవిజంతువులకువలె నీవారికెల్ల మిక్కిలి భయముగలిగెను." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

"ఓరాజా! రణరంగమున నుగ్రకర్ములై క్రియలచేఁ దమపరిశ్రమలు ప్రకటించిన కృష్ణసహాయులగు పాండవులేవురును దేవతలకేని దుర్జయు లగుటలో సందియము లేదు. సత్త్వము, కర్మము, వంశము, వివేకము, స్వభావము, కీర్తియు, లక్ష్మియు మున్నగువానిచేఁ గృష్ణునకుఁ దుల్యుఁ డగుపురుషుఁడు భూతభవిష్యద్వర్తమానములలో నుండఁడు. సత్య వ్రతుఁడును, ధర్మరతుఁడును, ద్విజపూజాదిసద్గుణయుతుఁడునై యుధిష్ఠి రుఁడు, సదేహస్వర్గ మొందఁదగినవాఁడు. ఓరాజా! యుగాంతయముఁ డును, బ్రతాపనిధియగుపరశురాముఁడును, రథస్థుఁడగుభీముఁడును నొకవిధమువారని తెలుపఁబడుచుందురు. రణమున నొనర్చినప్రతిజ్ఞ నిర్వహించునట్టి గాండివధనుర్ధరునకుసాటి యిప్పుడమిని నేను జూడ లేదు. గురుభక్తియు, గాంభీర్యము, వినయము, దమము, శౌర్యము, సౌందర్యము ననియెడియాఱును నకులునియందు నియతములై యున్న యవి. శ్రుతము, మాధుర్యగాంభీర్యములును, సత్త్వరూపపరాక్రమ ములును, గలిగి యశ్వినులకుఁ దుల్యుఁడైనవాఁడు సహదేవుఁడు. కృష్ణునియందును బాండవులందును గలగుణములన్నియు నొకయభి మన్యునియందుఁ గానవచ్చుచున్నవి. యుధిష్ఠిరునిధైర్యము, కృష్ణుని చారిత్రము, భీమునిభయంకరకృత్యములు, ధనంజయుని రూపవిక్రమ శ్రుతములును, నకులసహదేవుల వినయమును నాయభిమన్యునందుఁ గలవు."

అది విని ధృతరాష్ట్రుఁడు "ఓసంజయా! అజేయుఁడగు సుభద్రా తనయుఁడు రణరంగమున నెటు లాయోధనమొనర్చి హతుఁడయ్యెనో

సంపూర్ణముగాఁ దెలుపుము.” అని పలుక నాసంజయుఁ డాతనితో “ఓరాజా! స్థిరచిత్తుఁడవై శోకము నాపికొని, నా తెలుపు గొప్పబంధు నాశమును వినుము. ఓమహారాజా! ఆయాచార్యుఁడు పద్మవ్యూహ మును గల్పించెను. అందింద్రతుల్యులగు రాజు లనేకు లునుపంబడిరి. ఆదిత్యసమ తేజులగుకుమారులు దానిద్వారస్థానమున నిలుపఁబడిరి. అపు డది రాజపుత్రసమూహమునకుఁ దానకమై యుండెను. వారెల్లరును బ్రతిజ్ఞలొనర్చి సువర్ణమయధ్వజులును, రక్తవస్త్రధారులును, రక్తా లంకారులును, రక్తధ్వజులును, సువర్ణమాలాధారులును, చందనాగురు లిప్తాంగులును, పుష్పమాలాభూషితులునై నలిపములుగట్టి యొకరి నొకరు గలిసి, యుద్ధాభిలాషులై యభిమన్యునిఁ దలపడిరి. గట్టివిండ్లుగల యయోధులు పదివేవురును, నీపౌత్రుఁడగులక్ష్మణుని ముందిడుకొని సమదుఃఖసుఖులును, సమసాహసులునై యొకరినొకరుమించి పోరాడువారై పరస్పరము గూడి వెడలిరి. ఓ రాజేంద్రా! అందు సుయోధనుఁడు మధ్య భాగమున నిలుపఁబడియెను. మహారథులగుకర్ణదుశ్శాసనకృపులాదుర్యో ధను నావరించియుండిరి. దేవరాజతుల్యుఁడై శోభిల్లుచు, శ్వేతచ్ఛత్రా చ్ఛాదితుఁడును జామరవ్యజనాలంకృతుఁడు నై యుదయభాస్కరుఁ డునా ద్రోణుఁ డాసేనాముఖమున నుద్యతకార్ముకుఁడై యుండెను. అటులే సైంధవుఁడు నొకవిల్లుపట్టి యందుండెను. ఆసైంధవున కిరుగెలం కులను దేవతుల్యులై యశ్వత్థామను ముందిడికొని నీతనయులు ముప్పండ్రు గాచియుండిరి. మఱియు నాతనివెనుకముందుల శకునియు, శల్యుఁడును, భూరిశ్రవుఁడును విరాజిల్లుచుండిరి. పిదప గగురుపాటొద వించు సంకులయుద్ధ మారంభమయ్యెను. నీవారును వారివారును మృత్యువును లక్ష్యపెట్టక పోరాడసాగిరి.” అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

### అభిమన్యుఁడు ప్రతిజ్ఞచేయుట

“ఓరాజా! భారద్వాజరక్షితమై యజేయమగు మనసైన్యమును భీముఁడు మున్నగుపాండవు లెదుర్కొనిరి. సాత్యకిచేకితానులును, ధృష్టద్యుమ్నుఁడును, కుంతిభోజుఁడును, ద్రుపదుఁడును, నభిమన్యుఁ డును, క్షత్రధర్ముఁడు, బృహత్క్షత్రుఁడును, ధృష్టకేతుఁడును, నకులసహ

దేవులును, యుధామన్యుఁడు, నుత్తమౌజుఁడును, శిఖండియు, విరాటుఁడును, ద్రౌపదేయులును, శిశుపాలసుతుఁడును, కైకయులును, వేవురుసృంజయులును నింకనుగల కృతాస్త్రులును, రణగర్వితులునగు మఱికొందఱును వడిగా నాద్రోణునితోఁ బోరాడువారై వెడలిరి. అటులు తన్నుఁ జుట్టియున్న యాగట్టిమగలఁ గనియు నతఁడు వెను దీయక, గొప్పశరవర్షముచే వారినెల్ల నివారించెను. భేదింపరానికొండను దాఁకినప్రవాహమువలె వా రాద్రోణునిఁ దాఁకియు సముద్రోదకములు వేలనువలె నాతని నతిక్రమింపఁజాలరైరి. ఓరాజా! ద్రోణధనుర్విముక్తములగు శరపరంపరల కాఁగఁజాలక యపాండవు లాతనియెదుట నిలువ లేకుండిరి. అపుడు ద్రోణుని బాహుబల మద్భుతముగాఁ జూచితిమి. ఆతని నపాంచాలురును సృంజయులును నెదుర్కొనఁజాలరైరి. అటులు కుపితుఁడై తమ్మెదుర్కొనియున్న ద్రోణునిఁ గాంచి యుధిష్ఠిరుఁ డాతనికిఁ బ్రతియోధుఁ డెవ్వఁడని పలువిధములఁ జింతించి, యభిమన్యుఁడు దక్క వేఱొకఁ డాద్రోణునిఁ జెనకుట కశక్తుఁడని యెంచి, సహింపరాని యాగొప్పభార మాసౌభద్రుతలపై నుంచఁదలంచి వాసుదేవునకుఁ దక్కువగాక యర్జునునిమించిన తేజముగల యభిమన్యునితో 'ఓకుమారా! నీ వాయొగ్గరముఁ జొచ్చి యర్జునునివలన మాకు మాట రాకుండునటులు లొనర్పుము. ఈపద్మవ్యూహమును భేదింప మే మెవ్వరమును దెలియఁజాలము. నీవేని, యర్జునుఁడేని, కృష్ణుఁడేని, ప్రద్యుమ్నుఁడేని దీని భేదింప వలంతులుగాని యేదవవాఁ డెవ్వఁడును దీనిని భేదింపఁజాలరు. ఓనాయనా! అభిమన్యూ! ఈవరము నాకొసంగఁదగియున్నాఁడవు. ఈ నీవరము నీతండ్రులకును మామలకును సైన్యములకును నపేక్షితమైనది. ఓతండ్రీ! ఇటులుగాదేని యుద్ధమునుండవచ్చి నీతండ్రి మమ్ము నిందించును. వడిగా విల్లుగొని ద్రోణసైన్యమును ఖండింపుము.' అని కోరెను.

అది విని యభిమన్యుఁడు 'ఓమహానీయా! దృఢమై మిక్కిలి యుగ్రమగు ద్రోణునిసైన్యమును దండ్రులగు మీజయమునుగోరి, వడిగాఁ జొచ్చి చెండుదును. ఈవ్యూహమును భేదించునుపాయము నాతండ్రి నాకెఱిఁగించియున్నవాఁడు. అందేదే నాపదగలిగెనేని మఱలి వచ్చుటకుఁ దగునుత్సాహము నాకులేదు' అని తెలిపెను. అంత నా

యుధిష్ఠిరుఁడు మఱియు నాతనితో 'ఓపుత్రకా! యోధులసమూహ మును దొలఁగించి ద్వారమొనరింపుము. నీవేమార్గమునుండి పోవుచుం దువో దానిని విడువక మేమెల్ల నిన్ననుసరించి వత్తుము. ఓనాయనా! యుద్ధమున నర్జునుఁబోలిన నిన్ను మేమెల్ల విడువక రక్షించుచు, నీనలు గెలంకులఁ గూడివత్తుము.' అని పలికెను. అదివిని భీముఁడు 'ఓసౌభద్రా! నేనును, ధృష్టద్యుమ్నుఁడును, సాత్యకియుఁ, బాంచాలురును, గేకయు లును, మాత్స్యులును, బ్రభద్రకులును నీవెనుక వచ్చి నీవు క్రౌంచెము భేదించినవ్యూహమును మేమంతటను దొలంచుచు, వీరులగువారినెల్ల నూరుచుందుము.' అని పలికెను. అంత నాయభిమన్యుఁడు 'ఓనాయన లారా! దుర్భేద్యమగుద్రోణ్యసైన్య మేను కుపితమగుమిడుత మండు చున్ననగ్నినవలెఁ బ్రవేశించువాఁడను. మాతృపితృవంశములకు హిత మగు నిక్కార్య మిపుడే నొనర్చెదను. నాతండ్రికిని నామామకును బ్రీతియొనర్చెదను. బాలుఁడనగు నేనొకండనె సంఘముగానున్న సకల సైన్యములను దఱుముట సర్వభూతములును జూడఁగలవు. ఈసంగ్రా మమున వైరులలో నొకఁడేని జీవించియున్నచో నేను సుభద్రకును నర్జునునకును జనించినవాఁడనుగానని యిదె ప్రతినచేయుచున్నాఁడను. నేనొకండ నొకరథముతో సమగ్రమగుక్షత్త్రమండలము నెనిమిదిఖండ ములుగాఁ జేయనేని యర్జునాత్మజుఁడను గాను.' అని తనయభిప్రాయ మెఱిఁగింప విని, యుధిష్ఠిరుఁ డాతనితో 'ఓబాలకా! ఇటులు పలుకు నీ బలము వర్ధిల్లుఁగాక. దుర్జయమగు ద్రోణసైన్యమును భేదింపనెంచిన నీకు బలము వర్ధిలుఁగాక.' అని పలికెను. అది విని యతఁడు తనసారథినారసి 'ఓసుమిత్రా! మనయశ్వములను వడిగా ద్రోణుఁడున్న కడకుఁబఱపుము.' అని ప్రేరించెను." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

### అభిమన్యుఁడు పరాక్రమించుట

"ఓరాజా! ధీమంతుఁడగు నాయుధిష్ఠిరునివచనములు విని యభి మన్యుఁడు ద్రోణుఁడున్నకడకు దనరథమునడుపుమని సూతునిఁ బ్రేరించె నని తెలిపితినిగదా! అటులు ప్రేరితుఁడై సుమిత్రుఁడు, 'పదము పదము' అని బదులుపలికి, మఱియు నాతనితో 'ఓరథికోత్తమా! పాండవులు కడుభారము నీతలపైఁ బెట్టిరి. నీవు సమర్థుఁడవని బుద్ధిచే

నూహించియే పోరటు లొనర్చిరి. నీవందులకుఁ దగియున్న వాఁడవు. ఆచార్యుఁడగు ద్రోణుఁడు కుశలుఁడును, నస్త్రపరిశ్రమముగలవాఁడును నైయున్నవాఁడు. నీవును గుశలుఁడవయ్యును, మిగుల సుకుమార ముగాఁ బెరిగినవాఁడవు' అని పలుక విని యతఁడు నవ్వుచు సారథితో 'ఓయీ! ఈద్రోణుఁడుగాని, సమగ్రమగుక్షత్రమండలముగాని నాకే పాటి? యుద్ధముఖమున నైరావతారూఢుఁడై దేవతలతోఁగూడివచ్చిన యింద్రునైన నేనోర్చువాఁడను. క్షత్రియమాత్రులు నాకొకవింతగాదు. ఈవైరివర్గము నాకొక పదియాఱవపాలు గాదుసుమీ! ఓసుమిత్రా! విశ్వజేతయగుమాతులుఁడును, నట్టివాఁడెయగు తండ్రియును గలుగ నాకు యుద్ధమన్న జడుపెట్టిది?' అని పలికి యాసారథి వచనములను లక్ష్యపెట్టక, మఱియు వానితో 'వడిగా ద్రోణునిపైకి మనయరదము బోని'మ్మని పలికెను. అది విని వాఁడును మూఁడేండ్లవయసుగలరథాశ్వ ములను బ్రేరింప, సువర్ణాలంకృతములగు నయ్యశ్వములు మహావేగ పరాక్రమములు మిగుల ద్రోణునికడకుఁ బరువులిడెను. అటులు వచ్చు చున్న యాతనిఁ గాంచి ద్రోణుఁడు మున్నగుకౌరవు లాతని నెదురిం చిరి. పాండవు లాయభిమన్యు ననుసరించి వెడలిరి. అతఁడున్నతమగు కర్ణికారధ్వజము వెలయ, సువర్ణకవచుఁడై యర్జునునకీడై యుద్ధాభి లాషతో నిర్భయముగా మత్తగజములపై వెడలినసింగపుంగొదమనా ద్రోణాదుల నెదుర్కొనియెను. వారును మొగ్గరము చొచ్చునాతని గని మోదమానమానసులై యుద్ధ మారంభించిరి. సాగరమున గంగావర్త మువలె నొకముహూర్త మక్కురుపాండవసైన్యములకు దారుణ యుద్ధము సంకులమై జరిగెను. మిక్కిలి వెఱపుగొలుపుచు సంగ్రామ మటు లారంభమగుడు, ద్రోణుఁడు చూచుచుండఁగనే యాయభిమన్యుఁడా వ్యూహమును ఛేదించి లోనికిఁ బ్రవేశించెను. అటులు శత్రుమధ్య మును బ్రవేశించి వైరుల నూరార్చు మహాబలుఁడగు నాతనిని మన వారిగజాశ్వరథపదాతిసైన్యములు చుట్టుకొనియెను. అపుడు పలువిధము లగువాదిత్రధ్వనులును, సింహనాదములును, గర్జనములును, భుజాస్ఫా లనములును జెలరేఁగెను. అటులే యాస్ఫోటములును, హుంకారము లును, నిలునిలుమనెడిపిలుపులును, 'వెడలిపోకుము, ఇదె యిందున్న వాఁడను నిలువు' మనెడిసగర్వోక్తులును మఱిమఱియు విజృంభించెను.

బృంహితనినాదములతోడను, శింజితధ్వనులతోడను, హేసధ్వానముల తోడను, రథనేమిస్వానములతోడను, బుడమిని బ్రతిధ్వనింపఁజేయుచు, నాయభిమన్యునిపై వెడలిరి. అటులు తన్నెదుర్కొనిన యక్కౌరవవీరులను మర్మజ్ఞుఁడగు నాయభిమన్యుఁడు మర్మభేదకములగుశరములచే వడిగను, దృఢముగను మున్నుగ నొప్పించుచువచ్చెను. ఆరీతిగ వారు పలువిధములగు తీవ్రనారాచములచేఁ బీడితులయ్యు, వెనుదీయక యగ్నినుఱుకు మిడుతలువలె నాతనినే మఱియు నెదుర్కొనసాగిరి. పిదప నతఁడావైరులశరీరములచేతను, శరీరావయవములచేతను, నాసమరదేశమును, యాగమునఁ గుశలచే వేదినివలె విస్తరింపఁజేసెను. మఱియు నతఁడుగోధాంగుళిత్రాణములతోఁగూడినట్టియు, శరశరాసనములుగలిగినట్టియుఁ, గేడెముకత్తియునంకుశముగలిగినట్టియుఁ, దోమరపరశ్వథములతోఁగూడినట్టియు, గదాయోగుడప్రాస పట్టిస పరిఘ భిందిపాల శక్తిశరకంపనములు ధరించినట్టియుఁ, బ్రతోదమహాశంఖములును, గుంతకచగ్రహములును గలిగినట్టియు, ముద్గర క్షేపణీయములును, బాశములును పలములునుగలిగినట్టియుఁ, గేయూరాంగదములచే నలంకరింపఁబడి, చిత్రగంధములచేఁ బూయఁబడినట్టియు, వైరులబాహులను వేలకొలఁదిగాఁ గడువడిగా ఖండించివైచెను. ఓమహారాజా! ఎట్టినైవెలయు నాబాహువులు గరుడునిచే ఖండితములగు పంచముఖసర్పములునాఁ జూపట్టెను. చక్కనిముక్కులును ముంగురులునుగలిగి వ్రణితములుగాక కుండలాలంకృతములై దంష్ట్రలతోఁగూడిన యోష్ఠపుటము లలరఁ గుపితములై యుండుటను రక్తమును గ్రక్కుచు, మనోజ్ఞమకుటోష్ణీషములుగలిగి మణిరత్నభూషితములై, నాళములులేని నళినములునా వెలయుచుఁ జంద్రాదిత్యసన్నిభములును, హితప్రియములను బలుకునట్టివియును, బవిత్రగంధములునగు వైరులశిరములచేఁ బుడమినాయభిమన్యుఁడు నింపెను. గంధర్వనగరతుల్యములై పలువిధములుగా నున్నరథములను, చక్రరహితములుగను, భగ్నోపకరణములుగను, నుపస్తరణశూన్యములుగను, హతయోధములుగను నొనర్చి, వేలకొలఁదిబాణములచే వికలములుగా నొనర్చుచు నెల్లదిక్కులఁ దానైయుండెను. మఱియు నిశాతధారాగ్రములగు శరపరంపరలచే శాత్రవులయేన్గులను, వానిపైనున్న

మావంతులను, నంకుశములను, ధ్వజములను వైజయంతులను, దూణ ములను, గవచములను, నేస్గులకక్షములను, గంఠభూషణములను, గంబ లములను,ఘంటలను,దొండములను, దంతాగ్రములను ఖండించి,మఱియు వనాయుజములు, బాహ్లీకములు, కాంభోజములు, పార్వతీయములునై, నిక్కుచెవులును, గన్నులును, దోఁకలునుగల్గి మనోవేగములై లెస్సగాఁ బహువులిడుగుఱ్ఱములను రూపుమాపి యతఁడు విక్రమింప, నపుడు శిక్షి తులై యంకుశహస్తులగు యోధులతోడనే నాల్కలు తెగినవియుఁ, గన్నులు పోయినవియుఁ, బ్రేవులూడినవియు, నారోహకులు నశించినవి యు నై గంటలుజాఱి, చర్మములూడి, కవచములు దునియ, శకృన్మూ త్రరక్తసిక్తాంగములై మాంసాహారులకు మోదమును గలిగించుచు, నీ వారిగజసైన్యములు నేలఁగూలి యెంతయు భయంకరములైయుండెను. అచింత్యపరాక్రముఁడగువిష్ణువువలె నతఁ డొకఁడే దుష్కరకర్మ మొనర్చి సకలాంగములతోఁగూడిన నీబలమునెల్ల మథించి, మున్నమిత పరాక్రముఁడగు త్రినేత్రుఁడు రక్కసిమూఁకలనువలె రూపుమాపి యద్భుతకృత్య మొనరించెను. ఓరాజా! ఇటులు మనవారిపదాతులను జంపి మున్ను రక్కసిమూఁకను కుమారస్వామివలె మనవారిసైన్యమును దానొకఁడే హతముగావించి విజృంభించెను. అపుడు నీవారును, నీతన యులును నలుదెసలఁ గాంచుచు మోములెండఁ, బ్రచలితనేత్రులై, చెమ్మటలువాఱ, మేనులుగగుర్పొడువ,శత్రుజయమునెడనిరుత్సాహులై పలాయనోత్సాహులై, యొకరినొకరు గోత్రనామములతోఁ బిలుచు కొనుచు, జీవితాభిలాషులై హతులగు పుత్రులను, దండ్రులను, నన్నలను, బంధులను, సంబంధులను విడిచి, తమగజాశ్వములను ద్వరపెట్టుచుఁ బరు వులువెట్టసాగిరి.'' అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

### అభిమన్యుపరాక్రమవర్ణనము

“ఓరాజా!అటులు చెదరినతనసైన్యమును జూచి సుయోధనుఁడు తేజోనిధియగు నాయభిమన్యునిఁ దానే కోపమడరఁ దలపడియెను. అంత నాయభిమన్యు నెదుర్కొనినదుర్యోధనునిఁ జూచి ద్రోణుఁడు చెదరుచున్న యోధులతో 'ఓయీ! చూచితిరా? మనయెదుట వీర్య శాలియై యెటు లాయభిమన్యుఁడు విక్రమించుచుండెనో! ఆతనిఁ

దలపడుఁడు. వెఱువకుఁడు. వడిగా వెడలి సుయోధనునిఁ గాపాడుఁడు.' అని పలికెను. పిదపఁ గృతజ్ఞులును, బలవంతులును, మిత్రులు నగు కొందఱువీరులు నిర్భయముగా వెడలి నీయాత్మజునిచుట్టు నావరించి యుండిరి. ద్రోణుఁడును, ద్రౌణియుఁ, గృపుఁడును, గర్ణుఁడును, గృతవర్మయు, శకునియు, బృహద్బలుఁడును, శల్యుఁడును, భూరియు, భూరిశ్రవుఁడును, శలుఁడును, వృషసేనుఁడును, దీవ్రనారాచములఁ గురియుచు నాయభిమన్యు నాక్రమించి, యతని మూర్ఛఁగొట్టి దుర్యోధనుని విడిపించిరి. కాని యభిమన్యుఁడు ముఖగతమగుకబళములను లాగినటు లందులకోరువక, శరపరంపరచే నామహారథులను సూతాశ్వములతో విముఖులఁగా నొనర్చి సింహనాద మొనరించెను. ఆమిషాభిలాషియగుసింహమువలె గంభీరనాదుఁడగు నాతనిసింహనాదమును విని, ద్రోణుఁడు మున్నగురథికులు సహింపక సంరంభించి రథవంశముచే వలయాకారముగాఁ జుట్టి, పలువిధములగుబాణజాలములను గుంపులుగా విడుచుచుండ, నీపౌత్రుఁడు వానినెల్ల నంతరిక్షముననే తీవ్రనారాచములచే ఖండించుచువచ్చెను. అది యెంతయు నద్భుతమయ్యెను. సర్పతుల్యములగు నాతనిశరముల కోరువక కుపితులై కదలనీక యాసౌభద్రునిఁ జంపువారై చుట్టుకొనిరి. సముద్రమువలె నలుగడల వ్యాపించి యున్న నీసైన్యమును దానొకఁడే వేలయై యభిమన్యుఁ డాపెను. అటులు శూరులు యుద్ధమొనర్చుచుఁ, బరస్పరము ప్రహరించుకొనుచు నున్నయకౌరవాభిమన్యులలో నొక్కఁడును నపుడు పరాఙ్ముఖుఁడు గాలేదు. అటులు భయంకరమై ఘోరసంగ్రామ మారంభమగుడు, దుస్సహుఁడు తొమ్మిదిబాణములచే నభిమన్యుని నొప్పించెను. అటులే దుశ్శాసనుఁడు పండ్రెండింటను, గృపుఁడు మూఁడింటను, ద్రోణుఁడు పదునేడింటను, వివింశతి డెబ్బదింటను, గృతవర్మఁ డేడింటను, బృహద్బలుఁ డెనిమిదింటను, నశ్వత్థామ యేడింటను, భూరిశ్రవుఁడు మూఁడింటను, శల్యుఁ డాఱింటను, శకుని రెండిటను, దుర్యోధనుఁడు మూఁడిటను నొప్పించిరి. ఓమహారాజా! ప్రతాపనిధియగునతఁడు చాపహస్తుఁడై నటించుచు, వానినెల్ల మూఁడుమూఁడుబాణములచేఁ దొలఁగించెను. మఱియు నతఁడు కుపితుఁడై నీతనయులు వెఱపొంద దృఢమగునిజశిక్షాభ్యాసకృతబలమును బ్రకటించుచు, గరుడతుల్యవేగములై సూతవశము

లగునశ్వములతోఁ దన్నెదుర్కొనియున్న యశ్మకతనయునిఁ దలపడి నివారించెను. ఆయశ్మకసుతుఁడును నాయభిమన్యునెదుట నిలిచి తన బలము వెలయ నిలునిలుమని పలుకుచుఁ బదిబాణములచేఁ బీడించెను. అంత నప్పార్థాత్మజుఁడును బదిబాణములచే వానియశ్వములను, సూతుని, ధ్వజమును, బాహువులను, ధనువును, శిరమును బుడమిఁ బడఁద్రోసి హాసమొనర్చెను. అటు లాయశ్మకేశ్వరుఁడు హతుఁడగుడు, మనవారి సైన్యము పలాయనపరాయణమై చలించెను. పిదపఁ గర్ణుఁడును, కృపుఁడును, ద్రోణుఁడు, ద్రౌణియు, శకునియు, శలుఁడును, శల్యుఁడును, భూరిశ్రవుఁడును, క్రాథుఁడు, సోమదత్తుఁడు, వివింశతియు, వృషసేనుఁడు, సుషేణుఁడు, కుండభేదియుఁ, బ్రతర్దనుఁడు, బృందారకుఁడు, లలిత్థుఁడు, ప్రబాహుఁడు, దీర్ఘలోచనుఁడు, దుర్యోధనుఁడును గుపితులై శరవర్షమును గురిసిరి. అటు లాయోధులశరపరంపరాపీడితుఁడై యతఁడు కర్ణునికవచావయవములను భేదింపఁదగు నొకశరమును బ్రయోగింప, నది యారాధేయుకవచమును జీల్చి, శరీరమును దూసికొనిపోయి పుట్టనుజొచ్చిన సర్పమునాఁ బుడమిని జొచ్చెను. ఆయభిమన్యుప్రహారముచేఁ బీడితుఁడై యతఁడు వశముతప్పి భూమికంపమునఁ గొండవలె వడంకఁ జొచ్చెను. అటులే తీవ్రనారాచేములచే సుషేణుని, దీర్ఘలోచనునిఁ, గుండభేదిని మూఁడుమూఁడుబాణములచే వధించెను. పిదపఁ గర్ణుఁడిరువదైదుబాణములచేతను, ద్రౌణి యిరువదిబాణములచేతను, కృతవర్మఁ డేడింటను నొప్పింప శరావృతసకలాంగుఁడై కోపమడర నాయింద్రపౌత్రుఁడు చరించుచుఁ, బాశహస్తుఁడగునంతకుఁడునాఁ జూపట్టెను. మఱియు నతఁడు చెంతనున్న శల్యుని శరవర్షమున ముంచి యఱచుచు నీసైన్యములను వెఱపించుచుండెను. అపు డాశల్యుఁ డటులు పీడితుఁడై రథమధ్యమునఁ గూలఁబడి మూర్ఛమునిఁగెను. అటులుపడిన శల్యునిఁ గాంచి, ద్రోణుఁడు చూచుచుండఁగనే మనసైన్యము పరువులిడసాగెను. సువర్ణపుంఖసమావృతుఁడై యటులు చూచుచున్నయాయభిమన్యునిఁ గాంచి సింగమునుగాంచిన మృగములువలె మనవారు పలాయనపరాయణులైరి. ఓరాజా! పితరులును, సురలును, జారణులును, యక్షులును, గిన్నరులు కీర్తింప, భూతలగతులగువారును సన్ను

తింప నాజ్యసిక్తమగువహ్నివలె నాయభిమన్యుఁడు విరాజిల్లెను." అని తెలుప విని ధృతరాష్ట్రుఁ డి ట్లనియె.

### అభిమన్యునిపరాక్రమము

"ఓసంజయా! తనశరపరంపరచే నామహాయోధుల నటులు మథించు నాయభిమన్యుని మనవారిలో నెవ్వరు నివారించిరి?"

అది విని సంజయుఁడు "ఓరాజా! కుమారునిరణక్రీడితము నెఱిఁగించెదను వినుము. అటు లాసౌభద్రుఁడు తనశరపరంపరచే శల్యుని నొప్పింప, నాతనిసోదరుఁడు కుపితుఁడై శరవర్షముఁ గురియుచు, నాయభిమన్యు నెదుర్కొనియెను. అపు డాయర్జునతనయుఁ డాశల్యసోదరుని తలయు, మెడయు, హస్తములు, పాదములు నాల్గుగుఱ్ఱములు, ఛత్రము, ధ్వజము, సారథి, రథచక్రములు, తూణీరము, పతాకయుఁ, జక్రరక్షకులు మున్నగుసకలోపకరణములను దనహస్తలాఘవ మేర్పడ ఖండించెను. అపు డాతని నెవ్వఁడును జూడలేదు. కాని యాశల్యావరజుఁడు భూషణాంబరములు డుల్లి నేలఁగూలెను. గాలిచేఁ గూలినమహాశైలమునా వాఁడు చూపట్టెను. వానియనుచరులును జడిసి యెల్ల దెసలకును బరువులిడిరి. ఆయర్జుననందను నద్భుతకృత్యమును గాంచి సర్వభూతములును బ్రసన్నములై మేలుమేలని సన్నుతించెను. అటు లాశల్యభ్రాత హతుఁడగుడు, నాతనిసైనికులు వేలకొలఁది తమకులనివాసస్థానములను దెలుపుచుఁ గుపితులై నానావిధాయుధపాణులై యభిమన్యునిఁ దలపడిరి. అందుఁ గొందఱు రథములతోడను, గొందఱు తురంగములతోడను, గొంద ఱేన్గులతోడను, మఱికొందఱు పదాతులతోడను ధనుష్టంకారములును, రథనేమిస్వనములును మిన్నుముట్ట హుంకారములొనర్చుచు, సింహనాదములు సేయుచు; గర్జించుచు నాయర్జునాత్మజు నెదుర్కొని 'ఓరీ! నీవు మానుండి జీవములతోఁ బోవలేవు.' అని పలుక వారి నారసి యాసౌభద్రుఁడు నగుచుఁ దన్నెవ్వఁ డెవ్వఁడు మునుమున్న ప్రహరించెనో వానినెల్ల మఱలఁగొట్టి, తనయస్త్రవైచిత్రీలాఘవములను బ్రకటించుచు, సవిలాసముగా నతఁడు యుద్ధమొనరించెను. అతఁ డావాసుదేవునుండియు, ధనంజయునుండియు నేయస్త్రమును సంపాదించెనో దానినెల్ల నాకృష్ణార్జునులకుఁ దక్కువ

గాఁకుండఁ బ్రదర్శించెను. ఆతనిశరసంధానవిమోక్షణములవిశేష మెఱుక పడక కేవలము మండలాకారమై ప్రజ్వలించుధనువుమాత్రమే గాన వచ్చెను. అయ్యది శరత్కాలమునఁ బ్రదీప్తమగుసవితృమండలమునాఁ జూపట్టెను. ఆతని నారిచప్పుడును, దలాఘాతపుఁజప్పుడును వినవచ్చెను. అయ్యారావము పిడుగులచప్పుడు ననుకరించెను. బిడియము నమర్ష మునుగల యతఁడు ప్రియదర్శనుఁడై వీరులను సమ్మానించువాఁడై వారిపై నిష్వస్త్రములను బఱపిపోరాడెను. ఓమహారాజా! వర్షకాలము గడవ శరత్కాలమునందలి దివాకరుఁడువలె మృదువుగానుండియు దారుణముగాఁ బ్రవర్తించెను. మఱియు నతఁడు శిలాశితములును, సువర్ణపుంఖములును, విచిత్రములునగు శరములను, సూర్యుఁడు కిరణ ములనువలె వందలకొలందిగా విడుచుచుండెను. ఆద్రోణుఁడు చూచు చుండఁగా నతఁడు క్షురప్రములు, వత్సదంతములు, విపాదములు, నారాచములు, నర్ధచంద్రములు, భల్లములు, నంజలికములు మున్నగు వాని నక్కౌరవానీకముపైఁ గురిపించెను. పిదప నాసైన్యమటులు శర పీడితమై పరాఙ్ముఖమయ్యె" నని తెలుప విని ధృతరాష్ట్రుఁ డిట్లనియె.

## దుశ్శాసనయుద్ధము

"ఓసంజయా! నాపుత్త్రునిసైన్యము నాసౌభద్రుఁడు నివారించు టను వినిన నాకెంతయును లజ్జయు సంతుష్టియుఁ గలుగఁ జిత్తము రెండువిధములుగా నుండెను. ఓయీ! దానినెల్ల నాకు విస్తరించి తెలు పుము."

"ఓరాజా! ఆయభిమన్యునితో ననేకులకు జరిగిన దారుణసంగ్రా మమువిధ మెఱిఁగించెదను వినుము. అటు లభిమన్యుఁడు కృతోత్సా హుఁడై యుత్సాహపూరితులగు మనవారివీరులతోఁ దలపడి, రథస్థుఁడై రథికులైనవారిపై శరవర్షమును గురిసెను. అపుడు ద్రోణునిఁ, గర్ణునిఁ, గృపుని, శల్యుని, ద్రోణతనయుని, భోజుని, బృహద్బలుని, దుర్యోధ నుని, సౌమదత్తిని, శకునిని, మఱియుఁగలనృపాలురను, సైన్యములను దలపడి యగ్నిచక్రమువలె నలుగడలఁ దిరుగుచు, వారిని నొప్పించెను. ప్రతాపనిధియగునతఁడు వైరుల రూపుమాపుచు నెల్లదెసలును దన తేజము నెఱపుటను జూచి, మనవారిసైన్యము లన్నియు మఱియు మఱియు నూహించుకొనినపిదప భారద్వాజుఁ డిట్లనియె.

'ఓశారద్వతా ! రణవిశారదుఁడగు నీయభిమన్యునిఁ జూచితే? ఇతఁడు పిన్నవయసువాఁడయ్యును బాహ్లులయగ్రభాగమున నడుచు చున్నవాఁడు. తనమిత్రులను యుధిష్ఠిరుని సంతసింపఁజేయుచు, నటులే నకులసహదేవులకు, భీమునకు, బంధులకు, సంబంధులకును బ్రోత్సాహముగలిగించువాఁడై యుండెను. రణరంగమున వీనితోఁ దుల్యుఁడగు ధనుర్ధరుఁడు లేఁడని నాయభిప్రాయము. ఇతఁడు తలంచెనేని మన సైన్యములెల్లఁ జంపఁగలఁడు. కాని యదేమో యీతని కాతలంపు గలుగకున్నది." ప్రీతియుక్తమగు నాద్రోణునివచనములు నీతనయుని మర్మములు నాఁట నాయభిమన్యునిపైఁ గుపితుడై యాసుయోధనుఁ డయ్యాచార్యుం జూచి నగుచుఁ, గర్ణుఁడును, బాహ్లికుఁడును, దుశ్శాస నుఁడును, శల్యుఁడును మున్నగుమహారథులు వినుచుండ, 'ఓయోధ వరులారా ! సకలమూర్ధాభిషిక్తుల కాచార్యుఁడును, బ్రహ్మవేత్తయు నగు నీద్రోణుఁడు మూఢుఁడగు నీయభిమన్యునిఁ జంపదలంపకున్న వాఁడు. సమరమున నీతనియెదుటఁబడిన యముఁడును బ్రాణములతో నేగుదు రనఁజాలము. సామాన్యమానవుఁడన నీతని కేపాటివాఁడు? నిజము తెలుపుచున్నాఁడను అర్జునపుత్త్రుఁడితనికి శిష్యుఁడగుట, వానిని రక్షించుచున్నవాఁడు. శిష్యులును, బుత్త్రులును బ్రీతిపాత్రులుగదా! ధర్మవంతులకు వారిరువురును సంతానమే. వీఁడు ద్రోణునిచే రక్షింపఁ బడియు మూఢుఁడగుట నది తనప్రతాపమే యని భావించుకొనుచున్న వాఁడు. కావున నీక జాలము సేయక చంపుఁడు.' అని పలికెను.

అదివిని వా రాయభిమన్యునిఁ జంపఁ బూనికగలిగి మహాసంరంభులై యాద్రోణుఁ డరయుచుండ నాతని నెదుర్కొనిరి. అపుడు దుశ్శాసనుఁ డాసుయోధనునివచనములాలించి తనయన్నతో 'ఓయగ్రజా! నేను వీని నిదె చంపుచున్నాఁడను ఇప్పాండుపుత్త్రులును, బాంచాలురును గాంచుచుండఁగా రాహువు సూర్యునివలె నీసౌభద్రుని మ్రింగెదను' అని పలికి, మఱియు నతఁడు గట్టిగా ఘోషించి తనయన్నతో నిట్టు లనియెను.

'ఓయన్నా ! మానవంతులగుకృష్ణార్జునులు నేనొనర్చుసౌభద్ర మారణమును విందురేని, యీజీవలోకమును విడిచి నిస్సంశయముగాఁ బ్రేతలోక మొందక మానరు. వారిరువురమరణమును విందురేనిఁ,దక్కిన

పాండవులును మృతినొందకమానరు. వారితో వారిమిత్రవర్గమువారును జేయునదేమియు లేక తమజీవితములను బరిత్యజింపక మానరు. ఇది యెల్ల నొక్కదినమందే జరుగును. కావున నీఁ డొకఁడు మడిసెనా, నీ కహితు లగువారందఱును మడిసి రనుకొమ్ము. ఓరాజా! నన్ను శుభదృష్టితోఁ బరిశీలింపుము. ఇదె నీవైరులనెల్ల నశింపఁజేయుచున్నాఁడను.'

ఓరాజా! నీపుత్రుఁడగుదుశ్శాసను డిటులు పలికి సింహనాదమొనర్చుచుఁ గుపితుఁడై సౌభద్రునిఁ దలపడి, వానిపై శరవర్షమును గురిసెను. అటులు కోపమడరఁ దనపైకివెడలిన యాదుశ్శాసను నారసి, యాయభిమన్యుఁ డిరువదాఱుతీవ్రనారాచములచే వానిని నొప్పించెను. అందుల కలిగి మత్తగజమువలెఁ గోపమడర నాసౌభద్రునితోఁ బోరాడెను. వారిరువురును మండలచిత్రగతులుగలరథములతో సవ్యదక్షిణముగాఁ జరించుచు, రథశిక్షాపాటవములు మెఱయ యుద్ధమొనరించిరి. అంతఁ బణవమృదంగదుందుభినినాదములు, సింహనాదధ్వానమిశ్రములై యెంతయు మిన్నుముట్టి వినవచ్చెను." అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

## దుశ్శాసనకర్ణు లపజయమందుట

"ఓయాంబికేయా! ధీమంతుఁడగు నాయభిమన్యుఁ డటులు శరక్షతగాత్రుఁడై తన్నెదుర్కొనియున్న యాదుశ్శాసనుతో 'ఓదుర్మతీ! దైవవశముగా నేఁటిసంగ్రామమున నభిమానాభిభూతుఁడవగు నిన్నుఁ గాంచఁగలిగితిని. నిష్ఠురస్వభావుఁడవును, బరిత్యక్తధర్ముఁడవు, నిందాసక్తుఁడవు నగు నీవిటులు నన్ను జేరితివి. నాఁడు నీవు సభలో రాజగు ధృతరాష్ట్రుఁడు వినుచుండఁగాఁ బరుషోక్తులచే యుధిష్ఠిరుని వికలచిత్తుం గావించితివి. మఱియుఁ దనకు బలమగుసౌబలుని యక్షకూటపాటవము నాశ్రయించి బలోన్మత్తుఁడవై భాషణములచే భీముని వివశాత్ము నొనర్చితివి. ఇపు డమ్మహాత్ముల ప్రకోపమున నీకిపు డిది సంప్రాప్తమయ్యెను. ఓరీ! నీవొనర్చినపరవిత్తాపహారమును, నీక్రోధము, శాంతిరాహిత్యము, లోభము, అవివేకము, ద్రోహము, తొందరపాటును, నుగ్రధానుష్కులగు నాతండ్రులరాజ్యమును దొంగిలించుటయు,

ననునివి నీకిపుడు ఫలింపనున్నవి. వానిఫల మిపు డనుభవింపుము. ఎల్ల సైన్యములును జూచుచుండ నిన్నిపుడు నాబాణములచే దండించువాఁడను. ఆకోపమునకగుబుఋణ మిదె తీర్పువాఁడను. అటులే కుపితయైన నాతల్లి ద్రౌపదియవమానమును, నాతండ్రియగుభీముని కాంక్షితమును నీడేర్చెదను. నీ వీరణరంగమునుండి మఱలక నిలుతువేని ప్రాణములతోఁ బోఁజాలవు.' అని పలికి యామహాబాహుఁడు దుశ్శాసనాంతకమగు నొకబాణమును సంధించి, కాలాగ్నిసమతేజమగు దానితోఁ బ్రహరింప, నది వానియురముచ్చి జత్రుదేశమును భేదించి, పుట్టలోనికిఁ బామువలెఁ బుంఖముతో వడిగా వెడలిపోయెను. మఱియు నతఁ డిరువదైదు ఖడ్గసమస్పర్శములగుబాణము లాకర్ణాంతముగా లాగి వానిపై విడువ, వాఁడు గాఢవిద్ధుఁడై పీడనోపఁజాలక యారథమధ్యమునఁ గూలఁబడియెను. ఓమహారాజా! అటులుపడిన నీతనయునకు మూర్ఛయు వచ్చెను. అపుడు నిశ్చేతనుఁడైన దుశ్శాసను నాతనిసారథి వడిగా నారణరంగమునుండి తీసికొనిపోయెను. అపుడు వానింజూచి పాండవులును, ద్రౌపదేయులును, విరాటుఁడు, పాంచాలకేకయులును సింహనాదము లొనర్చిరి. మఱియుఁ బాండవసైనికులు సంతుష్టులై పలువిధములగు వాద్యములను మ్రోయించిరి. మఱియును వారు సౌభద్రునిచేష్టితమును, గర్వితుఁడయ్యుఁ బరాజితుఁడగువైరిని జూచి నగుచునుండిరి. పిదప ధర్మ, మారుత, శక్రాశ్వినీదేవతల ప్రతిమలను దమధ్వజాగ్రములందుంచికొని ద్రౌపదేయులును, సాత్యకియుఁ, జేకితానుఁడును, ధృష్టద్యుమ్న శిఖండులును, కైకయులును, ధృష్టకేతువు, మత్స్యపాంచాల సృంజయులును, బాండవులును మోదమానమానసులై యుధిష్ఠిరునితోఁ గూడి వడిగా నా ద్రోణసైన్యమును దునుమాడువారై వెడలిరి. జయము నభిలషించుచు మరలక శూరులై పోరాడు వారివారికిని నీవారికిని ఘోరమగుయుద్ధ మపుడు జరిగెను. ఆరీతిగా భయంకరమై యుద్ధమారంభమగుడు దుర్యోధనుఁడు రాధేయునితో 'ఓమిత్రమా! చూడుము. వీరుఁడగుదుశ్శాసనుఁ డిదె యభిమన్యువశుఁడైనవాఁడు. మఱియుఁ బ్రతాపనిధియై వైరులనడంచు మనదుశ్శాసనునిం జూచి కుపితములై బలోత్కటములగుసింహములునాఁ బాండవు లాయభిమన్యునకుఁ దోడ్పడువారై వెడలిరి.' అని పలికెను.

అది విని కర్ణుఁడు కుపితుఁడై నీపుత్త్రునిహిత మపేక్షించువాఁడగుట నాయభిమన్యు నెదుర్కొని, దురాసదుఁడగునాతనిఁ దీవ్రనారాచముల నొప్పించి, మఱి నవజ్ఞాపూర్వకముగా నాతనియనుచరులను నొప్పించెను. అంత నభిమన్యుఁడును నాద్రోణుని సమీపించువాఁడై యారాధేయుని, వడిగా డెబ్బదిమూఁడుబాణములచే నొప్పించెను. అప్పుడు రథికోత్తములనెల్లఁ బీడించు నాతని నాద్రోణునుండి వారించుటకెవ్వారును జాలకుండిరి. పిదప సకలధనుర్ధరులందును మానియు, జయాభిలాషియు నగునారాధేయుఁ డాయింద్రపౌత్త్రుని వందలకొలఁదిబాణములచే నొప్పించెను. పరశురామశిష్యుఁడై ప్రతాపనిధియై యస్త్రవేత్తయగు నక్కర్ణుఁ డటులు నొప్పించినను సమరమున నమరసదృశుఁడగు నాసౌభద్రుఁ డించుకేని దొలఁగక గట్టిగాఁ దివిచివిడిచిన తీవ్రభల్లములచే మనశూరులధనువులు దునుమాడి కర్ణునిఁ బీడించెను. విషసర్పతుల్యములగు శరపరంపరలచే నక్కర్ణుఁ డాయభిమన్యుని సూతాశ్వచ్ఛత్త్రధ్వజములను గుఱిచూచి నగుచు, వడిగా నైదుబాణములను బ్రయోగింప నతఁ డసంభ్రాంతుఁడై వానినెల్ల గ్రహించి, పిదప నొక రెండుగడియలలో నొక్కబాణముచేతనే యక్కర్ణుని ధ్వజకార్ముకములను నఱికి పుడమిఁబడఁద్రోసెను. అంత నటు లారాధేయుఁడు చిక్కుపడుట నారసి, వానితమ్ముఁడు దృఢముగాఁ గార్ముక మెక్కువెట్టి యాసౌభద్రునిఁ దలపడియెను. అటు లక్కర్ణుఁ డోడుటను గాంచి పార్థులును వారియనుచరులును గట్టిగా నఱచిరి. వాదిత్రములను మ్రోయించి యభిమన్యుని సన్నుతించిరి." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

### యభిమన్యునిపరాక్రమము

"ఓరాజా! అటు లాకర్ణానుజుఁడు గర్జించుచు, మఱిమఱియు నారిసారించుచుండ, వడిగా వారినడుమ వేఱొకరథ మడ్డుపడియెను. పిదప నతఁడు పదిబాణముల దురాసదుఁడగు నాయభిమన్యుని ఛత్త్రధ్వజసూతాశ్వములు లక్ష్యములుగాఁ బ్రయోగించి, పితృపైతామహమగు నమానుషకర్మ మేర్పడునట్టుగాఁ బీడింప, మనవారెల్లరును బరమహర్షితులైరి. అపు డభిమన్యుఁడు నగుచు నొకబాణముచే వానితలఁ దెగనేసి రణమునుండి నేలఁ గూలఁద్రోసెను. గాలిచేఁ గదల్పఁబడి కొండ

నుండి క్రిందఁబడిన కర్ణికారమువలెనున్న తనతమ్మునిఁ గాంచి యక్కర్ణుఁ డెంతయుఁ జింతించెను. అంత నయ్యభిమన్యుఁడా రాధేయునిఁ బరాఙ్ముఖునిఁ గావించి, మఱియు నందుఁగల ధనుర్ధరులను వడిగాఁ దఱిమెను. అంత రెండుపాయలైన యగ్గజరథాశ్వపదాతుల నప్పార్థాత్మజుఁడు కుపితుఁడై భేదించెను. అంత నారాధేయుఁ డాయభిమన్యుశరపరంపరలకునోచ్చి, తనవడిగలగుఱ్ఱములతో వెడలిపో, నాతనిసైన్యమును జెదరిపోయెను. ధారలచేవలె నావృతమగునాకసమును నాయభిమన్యునిశరప్రకాండములు శలభములువలెనెల్లెడల వెలయ, నపుడేమియుఁ దెలియఁబడకుండెను. అటులు తీవ్రనారాచములచే మనయోధులు వధింపఁబడుచుండ నందు సైంధవుఁడుదక్క వేఱొక్కఁడు నిలువలేకుండెను. పిదప నాయభిమన్యుఁడును శంఖమును బూరించి, భారతసేనపై మఱలవడిగాఁ దలపడి యెండినగడ్డిపైఁబడిన నిప్పువలెఁ గడువడి నావైరుల దహించుచు నాసైన్యములనడుమ నెల్లెడల నాట్యమాడెను. రథగజాశ్వపదాతులను, శితశరప్రహారముల నురుమాడుచు నారణరంగమును మొండెములతో నిండునట్లుగా నాదండిమగఁ డొనర్ప, నాతనిచాపప్రభూతములగు నిషుపరంపరలకు జడిసి, ప్రాణప్రీతిగలవారెల్లరును బరువులిడిపోసాగిరి. అభిమన్యుధనుర్విముక్తములగు శరపరంపరలు ఘోరములు, రౌద్రకర్మములునై రథనాగాశ్వములను వధించుచు వసుంధరను నాటికొనిపోవుచుండెను. అపుడు సాయుధములును, సాంగులిత్రాణములునై, సగదములును, సాంగదములునై, సువర్ణాలంకారభూషితములై, బాహువులు కొన్ని నేల వ్రాలుచుండెను. అపు డెచ్చటఁ జూచినను శరములును, చాపములును, ఖడ్గములును, శరీరములును, కుండలయుక్తములగుశిరములును వేలకొలఁదిఁ బుడమిఁ బడుచుండెను. ఒకగడియలో హతములగు గజాశ్వరథపదాతులచే ధారుణి దారుణమయ్యెను. అటులు రాజపుత్రు లొకరినొకరు చంపుకొనుచు మొఱలిడుచునుండ, నందు ధైర్యహీనులకు భయముగొలుపు నొకమహాశబ్ద ముప్పతిల్లెను. దానిచే దెసలన్నియుఁ బ్రతిధ్వనింపసాగెను. అతఁ డటులు సైన్యములనెల్ల దునుమాడుచు భారతరణరంగమధ్యమునఁ గానవచ్చెను. ఎల్ల దెసలఁ దానై తిరుగు నతఁడు రజోవృతమగు నాసైన్యమునడుమఁ గానరాఁడయ్యెను. గజాశ్వములయు, యోధులయు, నాయువులఁ దీయుచున్న యాతఁడు

మఱల నొకగడియకే మధ్యందినసూర్యుఁడువలె గానవచ్చెను. ఓమహారాజా! ఆయభిమన్యుఁడా సైన్యమధ్యమున నింద్రతుల్యుఁడై విరాజిల్లుచు నగపడియె" నని తెలుప విని ధృతరాష్ట్రుఁ డిట్లనియె.

## సైంధవయుద్ధము

"ఓసంజయా! బాలుఁడును, నత్యంతసుకుమారుఁడును, బాహుబలగర్వితుఁడును, యుద్ధచతురుఁడును, వీరుఁడు నగునభిమన్యుఁ డటులు మనసైన్యములోఁ దనమూఁడువత్సరములు వయసుగలగుఱ్ఱములఁ జొరఁబాఱ, నపు డాయుధిష్ఠిరసైన్యమున బలవంతుఁ డెవ్వఁడేని వానిని వెంబడించి వెడలెనా? తెలుపుము."

అది విని సంజయుఁడు "ఓరాజా! యుధిష్ఠిరభీమసేనులును, శిఖండియు, సాత్యకియు, నకులసహదేవులును, ధృష్టద్యుమ్నుఁడును, విరాటద్రుపదులును, కైకయులును, ధృష్టకేతువు, మాత్స్యులును వెడలిరి. అటులు తండ్రులును, మామలును దనమార్గమునుబట్టి సైనికులఁ బ్రహరించుచురా వారి నారసి మనవారెల్లరును విముఖులైరి. అటులు పరాఙ్ముఖమైన మనసైన్యమును గాంచి తేజస్వియగు నీయల్లుఁడు దానిని నిలుపువాఁడై వెడలి పుత్రలోభావిష్టులైనపాండవులను సైన్యములతోఁ గూడ నివారించెను" అని తెలిపెను.

అది విని ధృతరాష్ట్రుఁడు "ఓసంజయా! సైంధవునిపైఁబడిన భారమెంతయు మహత్తరమని తలంచెదను. అతఁ డొకఁడే పుత్రప్రీతితో వెడలినపాండవులనెల్ల నివారించెనుగదా! ఆతనిబలశౌర్యములు మహాద్భుతములని తలంచెదను. అమ్మహాత్మునకట్టియుత్తమవీర్యమును నుగ్రశక్తియును నెట్లు గలిగెను? ఆతఁ డేదేని దానముగాని, తపముగాని, యాగముగాని యొనర్చెనా? లేనిచోఁ దానొకఁడే కుపితుఁడై పాండవుల నెటులు నివారింపఁగలిగెను ? తెలుపు" మన విని సంజయుం డిట్లనియె.

"ఓమాంబికేయా! నాఁడు ద్రౌపదీహరణసందర్భమున భీమునిచేఁ బరాజితుఁడై మానవంతుఁడగుట శంకరునివలన వరముఁబడయువాఁడై గొప్పతప మాచరింపఁదొడంగెను. అం దాతఁ డింద్రియముల నింద్రియార్థములనుండి మఱలించి, క్షుత్పిపాసాతపముల నోర్చి మేను

గృశింప సనాతనబ్రహ్మమును స్మరించుచు మహాదేవు నారాధించెను. అంత నాభగవానుఁడు భక్తుఁడై యున్న యాతనియెడ దయగలిగి స్వప్నమున నాతనికిఁ బ్రత్యక్షమై 'ఓయీ! నీయెడఁ బ్రీతుఁడ నైతిని. నీకేమికావలయునో వరము గోరికొమ్ము' అని పలికెను. అది విని యాసైంధవుఁడు సమస్కరించి, నియతచిత్తుఁడై 'ఓదేవా! భీమపరాక్రములగుపాండవులను రణరంగమున నేనొకఁడనే యొకరథముతో నివారింపవలయును' అని కోరికొన నామహాదేవుఁ డాసైంధవునితో 'ఓయీ! నీకోరినవర మొసంగుచున్నాఁడనుగాని యర్జునునిమాత్రము నీవు నివారింపఁజాలవు. తక్కినపాండవుల నలువురను వారింపఁగలుగుదువు.' అని తెలుప సైంధవుఁడును నట్లే యగుఁగాక యనుచు మేలుకొనియెను. ఓరాజా! నాఁటివరబలము చేతను, దివ్యాస్త్రబలముచేతను దానొకఁడే పాండవసైన్యమునెల్ల నివారింపఁగలిగెను. ఆతని జ్యాతలనాదముచే క్షత్రియులనెల్ల భయ మావేశించెను. నీసైన్యమున కెంతయు సంతసముదయించెను. అటులు యుధిష్ఠిరునిసైన్యముపై ఘోషించుచు వెడలిన యాసైంధవునియందే భారమెల్లను క్షత్రియపుత్రులెల్ల నిలిపియుండిరి." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

### సైంధవుని యుద్ధము

"ఓమాంబికేయా! సైంధవునిపరాక్రమమువిధము నడిగితివే. అతఁడు పాండవులతో నెటులు యుద్ధమొనరించెనో యదియెల్లఁ దెలిపెదను వినుము. ఆసైంధవునకు సారథికి వశములై లెస్సగా బహువులిడు సైంధవములు వాహనములుగా నుండెను. మఱియు నవి సూర్యగతవేగములై గంధర్వనగరతుల్యమై శాస్త్రీయముగా నిర్మింపఁబడిన రథమున గట్టంబడ, నందు వరాహధ్వజమును, శ్వేతచ్ఛత్రపతాకలును, చామరవ్యజనములును వెలయ, నం దాకసమునఁ జంద్రుఁడువలె నలరారుచు ముక్తావజ్రమణిస్వర్ణభూషితమై యయస్మయముగుకవచముఁ దొడిగికొని నక్షత్రములతోఁగూడిన యాకసమువలె నది తనకొకవింతశోభ నొదవింప, ధనువు సారించి శరపరంపరలఁ జిమ్ముచు నతఁడు విజృంభించెను. అంత నతఁడు సాత్యకిని మూఁడిటను, భీము నెనిమిదింటను, ధృష్టద్యుమ్ను నలువదింటను, విరాటునిఁ బదింటను, ద్రుపదు నైదింటను,

శిఖండిని బదింటను, కైకయుల నిరువదైదింటను, ద్రౌపదేయులను మూఁడుమూఁడువాఁడికోలలను,యుధిష్ఠిరుని డెబ్బదింటను గొట్టి తక్కిన వారినికూడ నొప్పించెను. అది యత్యద్భుతమయ్యెను. పిదప ధర్మజుఁడు పరిహసించుచు సితపీతమగు నొకభల్లముచే నాసైంధవునివిల్లు దును మాడ నతఁ డొకతెప్పపాటులో వేఱొకవిల్లుపూని ధర్మజునిఁ బదిబాణ ములచే నొప్పించి, తక్కినవారిని మూఁడుబాణములచే గొట్టెను. వాని శరలాఘవము నారసి, భీముఁడు మూఁడుబాణములచే వానిధనుర్ధ్వజ చ్ఛత్రములను గొట్టి పుడమిఁ బడఁద్రోసెను. అతఁడును వేఱొకవిల్లు సవరించి యాభీముని ధనుర్ధ్వజాశ్వములను గూలనేసెను. అంత నటులు హతాశ్వుఁడగునిజరథమునుండ యెగిరి సాత్యకిరథమునుఁ బర్వతశిఖర మును సింహమువలె నాభీముఁ డధిరోహించెను. పిదప మనవారెల్ల రును సంతుష్టమానసులై మేలుమేలని యాసైంధవుని పొగడసాగిరి. కుపితులగుపాండవుల నాసైంధవుఁ డొకఁడే తనయస్త్రబలముచే నిలుప నాతని యద్భుతకృత్యమును భూతములన్నియు సన్నుతించెను. మున్ను సౌభద్రునిచే హతములగు కౌరవసైన్యములకుఁ జూపఁబడినమార్గమే యిపుడు సైంధవునిచేఁ బాండవసైన్యములకుఁ జూపఁబడియెను. పాండవ పాంచాలమాత్స్యకైకయవీరు లెంత యత్నించి యభిమన్యుఁ ననుసరింత మన్నను సైంధవునిఁ దొలఁగింపలేకపోయిరి. ఎవ్వఁ డెవ్వఁడు ద్రోణ సైన్యమును భేదించుటకుఁ దలపడియెనో, యహితుఁడగు వాని నావర ప్రసాదబలశాలియగు సైంధవుఁడు వారించుచు వచ్చెను" అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

## అభిమన్యునిపరాక్రమము

"ఓరాజా! జయాభిలాషులగు పాండవు లటు లాసైంధవునిచేనిరు ద్ధులగుడు, నీవారికి వైరులతో ఘోరమగుపోరాటమయ్యెను. అపు డా సౌభద్రుఁడు దుస్సహుఁడై మనసైన్యమునుజొచ్చి సాగరమును మహా మకరమువలెఁ గలఁతనొందించెను. అపు డాయభిమన్యుని మనవారు యథాప్రధానముగాఁ దలపడుచు ఘోరముగాఁ బోరాడ, శరవర్ష మును గురియుచు నరిందముఁడగు నాతనితో వారికి మిగుల సంకుల సమరమయ్యెను. అటులు వైరులరథవ్రజముచే నిరుద్ధుఁడయ్యు నాయభి

మన్యుఁడు, వృషసేనునిసూతుఁ జంపి వానికార్ముకమును ఖండించి, మఱియు వానియశ్వములను దీవ్రనారాచములచే నొప్పించెను. అటు లగుట వడిగలవానిగుఱ్ఱములు రణరంగమును దొలఁగించుకొనిపోయెను. అపుడా సందుగా నభిమన్యునిసారథి తమరథమును దప్పింప రథికులు హృష్టమానసులై మేలు మేలని పొగడిరి. మఱియుఁ గుపితుఁడై సింగం పుంగొదమనా, వైరుల నురుమాడుచున్న యవ్వార్ధపుత్రుని వడిగా వసాతీయుఁ డెదుర్కొనియెను. అటు లెదుర్కొని యావసాతీయుఁ డఱువదిబాణములచే నయ్యభిమన్యుని నొప్పించి, 'ఓయీ! నేను జీవించి యున్న నిన్నీరణరంగమునుండి విడుచువాఁడనుగాను.' అని పలుక, నా సౌభద్రుఁ డొకదూరపాతియగుబాణముచే నినుపకవచముగల వానిని బ్రహరించి పుడమిఁబడఁ ద్రోసెను. ఓరాజా! వసాతీయుఁ డటులు హతుఁ డగుట నారసి క్షత్రియోత్తములెల్లరును గుపితులై నీపౌత్రు నెటులైన జంపవలయునని యొక్కుమ్మడి నాతనిఁ జుట్టుకొని, పలువిధములగువిండ్లను సారించుచుఁ బోరాడసాగిరి. అపు డయ్యభిమన్యునకు శత్రులతో రౌద్రమగుయుద్ధము జరిగెను. అంత నతఁడు వారిధనువులతో బాణము లను శరీరములను సకుండలములగుతలలను ఖండింపఁ బలువిధములగు నాయుధములతో హేమాభరణభూషితములగు బాహువు లనేకములు దెగి యారణరంగమునఁ గానవచ్చెను. అందెచ్చటఁ జూచినను బూల మాలికలును, నాభరణములును, వస్త్రములును, ధ్వజములును, గవచము లును, మణిహారములును గిరీటములును, ఛత్రచామరములును, రథ ములయుపస్కరములును, అధిష్ఠానములు, నీషాదండములును, విఱిగిన యక్షములును, భగ్నములైనచక్రములును, అనుకర్షములును, వ్రాలిన పతాకలును నై హతములైన గజాశ్వములతో నారణభూమి నిండి యుండెను. మఱియు హతులగుక్షత్రియులతోడను, జయాభిలాషులై శూరులగు నానాజనపదాధీశులతోడను బుడమి దారుణమై గాన వచ్చెను. ఆసంగ్రామమున దశదిశలఁ జరించుచుఁ గుపితుఁడై యున్న యయ్యభిమన్యునిరూప మంతర్ధాన మొందుచువచ్చెను. సువర్ణమయము లగుకవచాభరణములును, ధనుశ్శరములును, గేవలము గానవచ్చెను. అట్లు మధ్యందినాదిత్యుఁడువలె యోధులనెల్ల శరములపాలుచేయు

నాయభిమన్యు నెవ్వరును గన్నులతోఁ దేఱిచూడఁజాలకుండిరి" అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

దుర్యోధనుఁ డోడి పాఱిపోవుట

"ఓధృతరాష్ట్రా! ప్రళయకాలయముఁడు సర్వభూతముల ప్రాణము లనువలె నప్పార్థసూనుఁ డాశూరులయాయువులను దీయుచు, శక్రుఁడు వలె విక్రమించి యెంతయు విరాజిల్లెను. ఓరాజేంద్రా! మఱియు నతఁడు క్షత్రియులపాలియంతకుఁడై బెబ్బులి మృగమునువలె సత్యశ్రవసుని రూపుమాపుటయు, మహారథులెల్లరును త్వరపడి బహువిధశస్త్రధారులై 'నేనే, నేనే' యని ముందంజలువేయుచు, నాతని నెట్లైనఁ జంపవలయు ననెడిపట్టుదలలతోఁ జుట్టుకొనిరి. అటులు పరస్పరము పరువులిడెడియాక్షత్రియసైన్యముల నతఁడు సముద్రమునందలి క్షుద్రమత్స్యములను దిమింగిలమునా మ్రింగంబోడంగఁ, బరువులిడువారెగాని యొకఁడును నాతనియెదుటఁ బడువాఁడు లేకుండెను. సముద్రమును జొచ్చినసదులువలె నాతనిఁజేరినవారు మఱలుట గానరాదయ్యెను. మహావాతపథమునఁబడి సాగరగతమగునోడవలె మనసేన భయగ్రస్తమై వడఁకసాగెను. పిదప బలవంతుఁడై రుక్మరథుఁడను శల్యతనయుఁడు జడిసి పరువులిడు మనసైన్యమునకు ధైర్యముఁగొలుపుచు 'ఓసైనికులారా! యోధులారా! జడియకుడు నేనుండఁగా వీఁడన నేపాటి? నేను వీనిని జీవముతోఁ బట్టుకొనెదను. సంశయములేదు.' అని పలికి, వాఁ డాయభిమన్యు నెదుర్కొని మూఁడువాఁడికోల లాతనివక్షమున నాఁటి సింహనాద మొసరించెను. అంత నాయభిమన్యుఁ డారుక్మరథుని దక్షిణబాహువును మూఁడింటను, సవ్యబాహువును మూఁడింటను గొట్టి, విల్లు తునుమాడి, తలయుఁ గన్నులు కనుబొమలు గొట్టి పుడమిఁ బడఁ ద్రోసెను. శల్యపుత్రుఁడగురుక్మరథుఁడు హతుఁడగుటఁ గాంచి యాసౌభద్రుని జీవముతోఁ బట్టుకొనువారై రణగర్వితులగు రాజపుత్రులు తమకు మిత్రుఁడగుశల్యపుత్రునివైరముఁ దీర్చికొనఁ దమ యున్నతచాపములను ద్రిప్పుచు, శరవర్షముచే నాతని ముంచుచుఁ జుట్టుకొనిరి. అటులు శూరులు శిక్షాబలసమేతులును పిన్నవయసువారును నగుయోధులు సమరశూరుఁడగు నాసౌభద్రుని శరపరంపర

లచేఁగప్పు సుయోధనుఁ డెంతయు సంతసించి యాయభిమన్యుఁడు మృతుఁడగునని తలంచెను. అంత నక్కౌరవయోధు లయ్యభిమన్యు నొకనిమేషమున మూఁడుమూఁడుబాణములచే నదృశ్యునిఁగావించిరి. అప్పు డాయభిమన్యుని సూతునితో ధ్వజమును, రథమును, శరావృతమగుట నవి మాకగపడకుండెను. అతఁ డెంతయు గాఢముగాఁ బ్రహతుఁడగుటఁ గుపితుఁడై యంకుశముచేఁ బీడితమగు గజమునా నదరి, గాంధర్వాస్త్రమును సంధించి పెక్కుమాయను గల్పించెను. మున్నర్జునుఁడు తప మొనర్చి తుంబురుఁడు మున్నగుగంధర్వులచే వడసిన యాగాంధర్వాస్త్రముచే నతఁ డహితులను మోహపరవశులఁగా నొనరించెను. ఓరాజా! అతఁ డొకవిధముగను, నూఱువిధములుగను, వేయివిధములుగను గనఁబడుచు, శరపరంపరలఁగురియు, నగ్నిచక్రమువలె నారణరంగమునఁ గానవచ్చెను. అటు లతఁడు రథచర్యలచేతను, నస్త్రమాయలచేతను వైరులను మూర్ఛముంచి వందలకొలఁదిగా శరీరములను బడఁద్రోయుచుండఁ బ్రాణములు పరలోకమును, దేహము లీలోకమును బొందుచుండెను. అటులే యాతనిచే ధనువులును, గుఱ్ఱములును, సారథులును, ధ్వజములును, బాహువులును, దలలును దెగి రైదువత్సరముల ఫలోత్పత్తిగల్గి భగ్నమైనమామిడితోఁటవలె నారణరంగము చూపట్టెను. కుపితసర్పములునాఁదగి సుకుమారులగురాజకుమారు లటులు వందలకొలఁది నేలఁగూలుటయు నాసుయోధనుఁ డెంతయు వెఱువసాగెను. అంతఁ గొంతవడి కతఁడు కుపితుఁడై యభిమన్యు నెదుర్కొన నొకక్షణము వారిరువురకును సమరమయ్యెను. కాని యందు నీకొమరుఁడు వానిశరపీడ కోర్వఁజాలక విముఖుఁడయ్యెను." అని తెలుపు విని ధృతరాష్ట్రుఁ డిట్లనియె.

క్రాధునికొడుకు చచ్చుట

"ఓసంజయా! ఒక్కఁడు పెక్కురతో ఘోరముగాఁ బోరాడి తుదికాతఁడే జయము గొనుచుండుటను దెలుపుచున్నాఁడవు. కాని యాసౌభద్రునివిక్రమ మెంతయు నాశ్చర్యకరమై నమ్మఁదగియుండ లేదుసుమీ! అయినను వారిని ధర్మ మాశ్రయించియుండుట నిది యత్యద్భుతమనియుఁ దలంతును. ఓయీ! దుర్యోధనుఁ డటులు విముఖుఁడుగా

రాజపుత్త్రు లనేకులు హతులగుడు మనవా రపు డాయభిమన్యునిఁ గూర్చి యేమి చేయఁదలంచిరి?"

అది విని సంజయుఁడు "ఓరాజా! అపుడు మనవారు పెదవులెండ, భీతిచే నలుదెసలఁ జూచుచుఁ, జెమ్మటలుగ్రమ్మ, మేనులు గగుర్పొడువ, శత్త్రుజయమునెడ నిరుత్సాహులై, పలాయనపరాయణులై, హతులగు పితరులను, భ్రాతలను, బుత్త్రులను, మిత్త్రులను, బంధులను సంబంధులను విడిచి గజాశ్వములను ద్వరపెట్టుచు వెడలిపోసాగిరి. అటులు చెదరినఁ దమసైనికులఁ గాంచి ద్రోణుఁడును, ద్రౌణియు, బృహద్బలుఁడును, గృపకృతవర్మలును, గర్ణుఁడును, శకునిదుర్యోధనులును, గుపితులై యపరాజితుఁడగు నాసౌభద్రునిఁ దలపడిరి. ఓరాజా! వారును నీపౌత్త్రు నోరువఁజాలక కొందఱు విముఖులైరి. అటులుండఁగా నపుడల్లారుముద్దుగాఁ బెరిగియు బాల్యముచే గర్వితుఁడగుట నిర్భయుఁడై యొకఁడే నీమనుమఁడగు లక్ష్మణుఁ డాయభిమన్యు నెదుర్కొనియెను. పుత్త్రప్రేమచే వాని ననుసరించి సుయోధనుఁడు వెడలెను. ఆతని వెంబడించి మహారథులెల్లరును వెడలిరి. వారెల్లరును బెనుమబ్బులు జలములచేఁ బర్వతమునువలె నాయభిమన్యుని శరవర్షమున ముంచిరి. అపుడు వారి నాయభిమన్యుఁడు మేఘములను బెనుగాలివలెఁ దోలఁగించి, నీకుఁ బౌత్త్రుఁడును, మనోజ్ఞరూపుఁడును, శూరుఁడును సుదర్శితకార్ముకుఁడును నై, మిగుల సుఖముగాఁ బెరిగినవాఁడగుట నలకూబరుఁడునాఁదగి తనతండ్రిచెంత నిలువఁబడియున్న యాలక్ష్మణుని, మత్తగజము మదగజమునుబోలె నెదుర్కొనియెను. అంత నాలక్ష్మణుఁ డాసౌభద్రుని మార్కొని, తీవ్రనారాచములచే నాతనిబాహువుల నొప్పించెను. అపు డాయభిమన్యుఁడు దండతాడితమగుసర్పమునవలెఁ గుపితుఁడై నీపౌత్త్రుఁడగులక్ష్మణునితో 'ఓయీ! ఈలోకమును జక్కఁగాఁ జూడుము. నీవికఁ బరలోకమున కేగుదువు. ఓయీ! మఱియు నీబంధువులు నిన్నుఁ గాంతురుగాక. నిన్నిదె యమలోకము నొందించుచున్నవాఁడను' అని పలికి పొరవిడిచినపామునాఁదగు నొకభల్లముచే నాతనిఁ బ్రహరింప నది యాలక్ష్మణుని సకుండలమగు చక్కనివదనముగల తలను దెగనేసెను. అపు డటులు లక్ష్మణుఁడు నిహతుఁడగుటను జనులెల్లరును నాక్రోశించిరి. అంతఁ బ్రియపుత్త్రుఁడగులక్ష్మణుఁడు హతుఁడగుట కెంతయు గుపి

తుఁడై సుయోధనుఁడు క్షత్త్రియులతో 'ఓయీ! వీనినిఁ జంపుఁ' డని యఱచెను. పిదప ద్రోణుఁడును, గృపుఁడును, ద్రోణపుత్త్రుఁడును, కర్ణుఁడును, బృహద్బలుఁడును గృతవర్మఁడును గలిసి యాఱ్వురరథికులు నాతనిఁ జుట్టుకొనిరి. అంత నతఁడు వారిని దీవ్రనారాచముల నొప్పించి పరాఙ్ముఖులఁ గావింప, నంతలో నందులకు సైంధవునిబల మరుదెంచెను. అపు డాతనిసైనికులగు కాలింగులు నిషాదులు క్రాథపుత్త్రుఁడును, కవచధారులై గజసైన్యముతో నాతనిమార్గము నావరించిరి. అపు డెంతయు ఘోరమగుయుద్ధము జరిగెను. అంత నాయర్జునుసూతి, వెను గాలి యాకసమునఁగలమేఘములనుబోలె నాగజసైన్యమును రూపు మాపఁ గ్రాథపుత్త్రుఁడు తీవ్రనారాచప్రయోగముతో నాతని నెదుర్కొనియెను. అపుడు మఱల ద్రోణుఁడు మున్నగురథికులు మఱలి పరమాస్త్రములను బ్రయోగించుచు నాయభిమన్యుని మార్కొనిరి. అపు డతఁడు వారినెల్ల నివారించి యాక్రాథపుత్త్రునిఁ బీడించి, మఱియు నమేయమగుశరపరంపరచే వాని ధనుర్బాణబాహుకేయూరములను, శిరఃకిరీటములను, ఛత్త్రధ్వజసూతాశ్వములను నేలఁగూలనేసెను. కులశీలశ్రుతములును, కీర్తియు, బలమును, నస్త్రబలమునుగల యాక్రాథపుత్త్రుఁడు హతుఁడయినతోడనే తలుచుగా మనయోధులందఱును విముఖులైరి" అని తెలుప విని ధృతరాష్ట్రుఁ డిట్లనియె.

## బృహద్బలుఁడు మృతినొందుట

"ఓసంజయా! చిన్నవయసువాఁడయ్యుఁ బరాజితుఁడుగాక క్షత్త్రియకులానుకూలకర్మ మాచరించు నాసౌభద్రుఁ డటులు ప్రవేశించి, యుద్ధపలాయితుఁడుగాక మూఁడువత్సరములువయసుగల, యాజానేయములతో నాకసమున నెగురుచున్నటులు వచ్చునాతని వారెల్లరును జుట్టుకొనిరని తెలిపితివిగదా! వా రెవ్వరెవ్వరు?"

అది విని సంజయుఁడు "ఓరాజా! అటు లభిమన్యుఁడు ప్రవేశించి తీవ్రనారాచముల నీవారినెల్ల నొప్పించి పరాఙ్ముఖులనొనర్ప, ద్రోణుఁడును, గృపుఁడును, కర్ణుఁడును, నశ్వత్థామయు, బృహద్బలుఁడును, గృతవర్మఁడు ననెడియాఱ్వురుమహారథులును నాతనిఁ జుట్టుకొనిరి. ఓ మహారాజా! నీసైన్యమా సైంధవునిపై భారమెల్ల నిడి, యుధిష్ఠిరునిపై

వెడలెను. తక్కినయోధులు తాళప్రమాణములగుచాపములను సారించుచు, శరవర్షముచే నాసౌభద్రుని ముంచిరి. సకలవిద్యాధురంధరులైన యమ్మహారథులనెల్ల నాతఁడు నిజశరప్రహారములచే నిలువరించి, ద్రోణు నేఁబదింటను, బృహద్బలు నిరువదింటను, గృతవర్మ నెనుబదింటను,గృపు నఱువదింటను గొట్టి, యశ్వత్థామను బదిబాణముల నోనాఁట నేసెను. మఱియు నొకసితపీతనుగు తీవ్రనారాచముచేఁ గర్ణుని నొప్పించి, కృపునిగుఱ్ఱములను బడఁద్రోసి, మఱియు వానిపార్ష్ణిసారథులను గొట్టి యాతనివక్షమును బదిబాణములచే నొప్పించెను. పిదపఁ గురువంశకీర్తివర్ధనుఁడును వీరుఁడునగు బృందారకుని, నీకొడుకులు చూచుచుండఁగా నొకనిమేషమున వధించెను. అపు డశ్వత్థామ యభిమన్యు నిరువదైదు క్షుద్రకములచే నొప్పింప వాని నాయభిమన్యుఁడు వడిగాఁ బ్రతిప్రహార మొనర్చెను. అంత నీకొడుకులెల్లఁ గాంచుచుండఁగా నాయభిమన్యుఁ డాయశ్వత్థామ నఱువదిబాణములచేఁ గొట్ట, నాతఁడును మైనాకమువలెఁ జలింపక డెబ్బదిరెండుబాణములచేఁ గొట్టెను. దాని కా యభిమన్యుఁడు ప్రతిప్రహార మొనర్చెను. అపుడు పుత్రప్రేమచే ద్రోణుఁ డాయభిమన్యు నూఱుబాణములచేఁ గొట్ట, నపుడే యశ్వత్థామయు నఱువదిబాణములచే నొప్పించెను. పిదపఁ గర్ణుఁ డిరువది రెండిటను,గృతవర్ముఁడు పదునాల్గింటను, బృహద్బలుఁ డేఁబదింటను, గృపుఁడు పదింటను బ్రహరింప, వారివారిబాణములను బదిపదిబాణములచే నివర్తించెను. అంతఁ గోసలాధిపుఁడగు బృహద్బలుఁ డొకకర్ణిచే నాయభిమన్యుని నొప్పింప, నయ్యభిమన్యుఁ డాతనియశ్వములను ధ్వజమును జాపమును సూతునిఁ బుడమిఁ బడఁద్రోసెను. పిదప బృహద్బలుఁడు విరథుఁడై కేడెమును ఖడ్గమునుబట్టి యభిమన్యుని తలఁదెగనేయు నుత్సాహముతో వెడల, నతఁ డాబృహద్బలునివక్షము నొకబాణముచే భేదింప, వాఁడు భిన్నహృదయుఁడై నేలఁగూలెను. మఱియు నిటులు ఖడ్గకార్ముకధారులగు పదివేవురుక్షత్రియులఁ జంపి, బృహద్బలుని వధించి,మహాయోధుల నెల్ల శరవర్షముచే నాయభిమన్యుఁడు నిలువరించెను.” అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

అభిమన్యునియుద్ధము

"ఓయంబికానందనా! ఆయభిమన్యుఁడు కర్ణియనెడుబాణముచే నక్కర్ణుని కర్ణమునఁ గొట్టి, మఱియు నేఁబదిబాణములచే నెంతయు నాతనికిఁ గోప ముదయించునట్లుగా నొప్పించెను. అంత నారాధేయుఁడును బ్రతిప్రహార మొనర్చి, యాతఁడు వైచినశరపరంపరలచే నిండి యెంతయు విరాజిల్లెను. ఆయభిమన్యుఁడును కర్ణునిబాణములచే మేనునిండార రక్తసిక్తాంగుఁడై యుండెను. అటులు వారిరువురును బరస్పరప్రహారములచే రుధిరపూరితావయవులై పూఁచినమోదుగులునాఁ జూపట్టిరి. పిదప నయ్యభిమన్యుఁ డక్కర్ణుని మంత్రులారువుర, సూతధ్వజరథాశ్వములను గొట్టి చంపెను. మఱియు నతఁడు మహారథులగు నాయార్వురలోఁ బ్రహరించినవానికెల్లఁ బ్రతిప్రహార మొనర్చి, మాగధపుత్రుఁ డగునశ్వకేతు నాఱుబాణములచేఁ గొట్టి, వానిసూతాశ్వములను బుడమిఁ బడఁద్రోసెను. మఱియు మార్తికావతికునిఁ గుంజరకేతనుని నొకక్షురప్రముచేఁ జంపి శరపరంపరలఁ బ్రయోగించుచు సింహనాద మొనర్చెను. పిదప దుశ్శాసనపుత్రుఁ డాయభిమన్యుని నాల్గుగుఱ్ఱములను గొట్టి, సూతు నొకబాణముచే నొప్పించి, వానిని బదిబాణములచే నొనాఁట నేసెను. పిమ్మట నాయర్జునాత్మజుఁ డాదుశ్శాసనపుత్రునిఁ బదిబాణములచే నొప్పించి, మఱియు సంరంభముచే రక్తనేత్రుఁడై వానితో 'ఓరీ! నీతండ్రి నీచుఁడువలె యుద్ధమును మాని వెడలిపోయెను. అటులుగాక నీవు యుద్ధమెఱిఁగి నాతోఁ బోరితివేని నన్నుఁ దప్పించికొనిపోఁజాలవు.' అని పలికి చక్కఁగా సానవెట్టిన యొకనారాచమును విడువ, ద్రోణతనయుఁడు దానిని మూఁడుబాణములచే ఖండించెను. పిదప నయ్యర్జునాత్మజుఁడు వానిని విడిచి శల్యుని మూఁడుబాణములచే నొప్పించెను. వాని నాశల్యుఁడు కంకపత్రములగుతొమ్మిదిబాణములచే నొప్పించెను. ఓరాజా! అది యెంతయు మాకద్భుతము గావించెను. పిదప నభిమన్యుఁ డాశల్యునిశరాసనమును దునుమాడి పార్ష్ణిసారథులను గొట్టి, యాఱుబాణములచే నాతని నొప్పింప, నతఁడు వేఱొకరథముపైకిఁ బోయెను. పిమ్మట నతఁడు శత్రుంజయునిఁ, జంద్రకేతుని, మహామేధుని, సువర్చసుని, సూర్యభాసునిఁ గొట్టి, మఱియు శకుని నొప్పింప, నాసౌబ

లుఁడు మూఁడుబాణములచే నాతనిఁ గొట్టి, సుయోధనునితో 'ఓ యల్లుఁడా! మున్నుగా మనలో నొక్కొకని వీఁడు హింసించియుండెను. కావున మనమెల్ల వీని నేల మథింపఁగూడదు. ఓరాజా! కృపద్రోణాదులతోఁగూడి వీనిని వధించునుపాయ మూహింపు' మని పలికెను. పిమ్మటఁ గర్ణుఁడు, ద్రోణునితో 'ఓవిప్రోత్తమా! వీఁడు మున్ను మనలనెల్ల మథించుచున్నాఁడు. వీనివధమువిధమును వడిగాఁ దెలుపుము' అని పలికెను. అదివిని ద్రోణుఁడు వారెల్లరతో 'ఓవీరులారా! ఇక్కుమారునేమ నించుకే నవకాశముగలదా? పరికింపుఁడు. ఇతఁడు తనతండ్రివలె నలువైపులఁ జూచుచుఁ బ్రహరించుచున్నవాఁడు. ఈతనిలాఘవము నారయుఁడు. రథమార్గములం దీతనిమండలాకారమగుధనువే గానవచ్చుచున్నది. ఇతఁడు శరసంధానముసేయుటయు, వానిని విడుచుటయుఁ దప్ప వేఱొండు గానరాదు. ఇతఁడు నన్ను శరపరంపరలచేఁ బీడించుచు మూర్ఛగలిగించుచున్నాఁడు. ఈతనివిక్రమము గాంచిన నాకెంతయు సంతసమొదవుచున్నది. ఇతఁడు నిజరణవిహారముచే నా కానందముగలిగించుచున్నాఁడు. మహారథులందఱును బ్రయత్నించియు నవకాశముగనిపెట్టఁజాలకున్నారు. తనహస్తలాఘవము మెఱయ శరప్రయోగము నేయుచుండ నర్జునునకును నతనికిని భేద మగపడలేదు.' అని పలికెను. పిదపఁ గర్ణుఁడు ద్రోణునితో, 'ఓబ్రాహ్మణోత్తమా! అభిమన్యుశరాహతుఁడనై, నిలుము నిలుమని వానియెదుట నిలువ నన్నెంతయుఁ బీడించెను. తేజస్వియగు నక్కుమారునిశరము లతిదారుణములు. అయ్యవి పావకతేజములై నాహృదయము వేధించుచున్నవి' అని పలుక విని నగుచు నాచార్యుఁ డాతనితో 'ఓరాధేయా! ఈయువక్రవిక్రముఁడగు యువకునికవచ మభేద్యము. వీనితండ్రికి నేను గవచధారణము నుపదేశించితిని. దానినంతయు వీఁడు స్థిరముగాఁ దెలిసికొనినవాఁడు. చుఱుకుగల బాణములచే వీనియల్లెత్రాటిని ఛేదింపవచ్చును. విల్లు దునుమవచ్చును. అటులే పగ్గములను గుఱ్ఱములను బార్ష్ణిసారథులను దునుమాడవచ్చును. నీకు వశపడెనేని వీనిని ఛేదింపుము. ఓ రాధేయా! నేఁ జెప్పినటులుగా మున్నుగా వానిని ఛేదించి, పిదప వానిని బరాఙ్ముఖునిఁ గావింపుము. పిమ్మటఁ బ్రహరింపుము. వీఁడు ధనుర్ధ

రుఁడై యుండెనేని వీనిని సురాసురులకును జయింప వలనుపడదు. నీవు వీనిని జంపఁదలఁచితేని మున్నుగా విరథునిఁ జేయుము. విల్లు దెగ నేయుము.' అని పలుక విని యక్కర్ణుఁడు త్వరపడుచు, లఘుహస్తుఁడై శరప్రయోగ మొనర్చుచున్న యాయభిమన్యునిధనువు దునుమాడెను. భోజుఁ డాతనిగుఱ్ఱములను జంపెను. కృపుఁడు వానిపార్ష్ణిసారథులను వధించెను అటులు విధనుష్కుండగు నాతనిఁ దక్కినవారు శరవర్షమున ముంచిరి. ఓరాజా! అటు లాయార్వురుమహారథులును త్వరపడుచు విరథు నొనర్చి దయారహితులై బాలుఁడని యాలోచింపక యసహాయుఁడై యుండఁగా నొక్కఁడిఁ గవిసి నొప్పించిరి. అతఁడటులు విల్లు దెగి విరథుఁడై నిజధర్మమును విడువక కేడెమును ఖడ్గమునుబట్టి యాకసమున కెగరి, కౌశికాదిమార్గములచేతను, బలముచేతను, లాఘవముచేతను, గరుడునివలె జరించుచుండ, నెవనిపైఁ బడునో యని యందఱి మహారథు లూర్ధ్వదృష్టులైచూచుచు, సందుగనిపెట్టి యాతని నొప్పించిరి. అపుడు ద్రోణుఁడు మాణిక్యపుఁబిడిగల యాయభిమన్యుని ఖడ్గమును గొట్టెను. అంత నారాధేయుఁ డాతని కేడెమును గొట్టెను. పిమ్మట నతఁడు సమస్థలమునొంది చక్రముబూని కుపితుఁడై ద్రోణుని పైకి వెడలెను. అటులు వెడలి చక్రరేణువులచే విరాజిల్లుచుఁ జక్రపాణియై యొకక్షణ మావాసుదేవుఁడు నాఁ జూపట్టెను. మేనఁగారు రక్తముచేఁ దనవస్త్రముతడిసి భ్రూకుటిపుటకుటిలితాస్యుఁడై సింహనాద మొనర్చుచు, నతిబలుఁడగు నయ్యభిమన్యుఁ డామహారథులనడుమ నెంతయు శోభిల్లఁజొచ్చెను" అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## అభిమన్యునివధము

"ఓరాజా! ఆవిష్ణుని మేనల్లుఁడు విష్ణునాయుధమగుచక్రము పూని యాసంగ్రామరంగమున విష్ణుఁడునా విరాజిల్లెను. గాలిచేఁ గదలుముంగురులు వెలయఁ గత్తినెత్తి సురలకును జూడరానియాతని మేను జూచి క్షత్రియులెల్లరును మిగుల భయంభ్రాంతులగుచు నాతనిఁ జక్రమును బలువురును బలుఖండములుగా ఖండించిరి. అంత నతఁ డొకమహాగదను బూని యశ్వత్థామపై వెడలెను. అటులు గదను బూని వచ్చునాతనిఁ గాంచి యశ్వత్థామ రథమధ్యమునుండి మూఁడడుగులు మేరతొలఁగి

చన నయ్యభిమన్యుఁ డాతనిగుఱ్ఱములను, బార్ష్ణిసారథులను జంపి, శర వ్యాప్తాంగుఁడై యేఁదుబందినలెఁ గానవచ్చెను. పిదప మఱియు సుబల దాయాదుఁడగు కాలికేయునిఁ జంపి, వానియనుచరులగు డెబ్బదేడ్గురు గాంధారులను గొట్టెను. మఱియు వసాతీయులగుపదుగురరథికులను గొట్టి, కైకేయులగు నేడ్వురరథికులను, బదియేన్గులను జంపి, మఱియు నాగదతో దుశ్శాసనపుత్రుని రథాశ్వములను బీడించెను. ఓరాజా! అందుల కాదుశ్శాసనాత్మజుఁడు కుపితుఁడై తానొకగదబూని నిలునిలు మని పలుకుచు వెడలెను. అటులు వారిరువురును గదలనెత్తి పరస్పర సంహారమును గోరువారై మున్నాత్ర్యంబకాంధకాసురులువలెఁబోరాడ నారంభించిరి. అపుడు వారు పరస్పరము గదలతో మొత్తుకొని పుడమిఁ బడి, యారణరంగమున విడువఁబడిన యింద్రధ్వజములునాఁ జూపట్టిరి. కురుకీర్తివర్ధనుఁడగు దుశ్శాసనాత్మజుఁడు లేచి, యపుడే లేచుచున్న యభిమన్యునితలపైఁ గొట్టెను. మహత్తరమగు నాతని గదావేగము చేతను, నలసియుండుటచేతను, నయ్యభిమన్యుఁడు నిశ్చేతనుఁడై నేలఁ గూలెను. ఓరాజా! అటులు పలువురచే నతఁ డొక్కఁడు నేలఁగూల్పఁ బడియెను. అటులు పెక్కుసైన్యములను, గుంజరము పద్మవనమునువలెఁ జీల్చి చెండాడి, వ్యాధులచే వనగజమువలెఁ దుది కతఁడు మనవీరులచే హతుఁడయ్యెను. అటులుపడిన యాశూరుని మనవారెల్లరును జుట్టి కొనిరి. శిశిరాంతమున నడవిఁగాల్చి శాంతినొందినపావకుఁడునాఁదగి, తరుశృంగములను గూలఁద్రోసి యూరకున్న పెనుఁగాలినిబోలి, భారత వాహిని శుష్కింపఁజేసి, యస్తమించినయాదిత్యు ననుకరించి, రాహు గ్రస్తుఁడగుసోమునిమాడ్కిని,శుష్కించినసాగరమువలెను క్షీణబలుఁడై పూర్ణచంద్రునేలువదనమును, ముంగురు లావరించియున్నకన్నులును జూచువారికి శోకముగలిగింపఁ నేలఁగూలియున్నయభిమన్యునిఁజూచి మనమహారథులెల్లరును బరమానందభరితులై, మఱిమఱియు సింహ నాదము లొనర్పసాగిరి. ఓరాజా! నీవారి కమందానంద మొదవెను. తక్కినవీరులెల్లరును గన్నుల నీరువెట్టిరి. ఓరాజా! అంతరిక్షమున భూత ములన్నియు క్రోశించెను. ద్రోణకర్ణాదులగు నార్వురుయోధులును గూడి యసహాయుఁడగునాతని నొక్కనిఁ జంపి కూలఁద్రోసిరి. ఇది

యెంతయు మన కధర్మము గాకపోదు. అతఁడు హతుఁడై గూలుటను, మేదిని యెంతయు నక్షత్రగణములతోఁగూడి పూర్ణచంద్రుఁడు గల యాకసమువలె విరాజిల్లెను. మఱియు నారణరంగము సువర్ణపుంఖములగు శరపరంపరలచేతను, రక్తప్రవాహములచేతను, సకుండలములగువీరులశిరస్సమూహములచేతను భీషణమగుచు విచిత్రములగుపతాకోష్ణీషములతోడను గూడి చామరములు, కుథలు, దునిఁగినమహాయుధములు, కాంతులీను నరనాగాశ్వరథాలంకారములును, పొరలవిడిచిన పాములునాఁదగు దారుగలకత్తులును, ధనువులు, విశిఖములు, ప్రాసములు, కంపనములును గలిగి పుడమి యెంతయు నలరారెను. గుఱ్ఱములు కొన్ని శ్వాసములువిడుచునవియుఁ,గొన్ని నిర్జీవములయినవియుఁ, గొన్ని రక్తసిక్తములును నై రౌతులతోఁగూడి నేలఁగూల పుడమి విషమమైయుండెను. అటులే యంకుశములతోఁగూడిన మావంతుల తోడనుగూడి కేడెములు నాయుధములు ధ్వజములునుగలిగి శిఖరములు విఱిగిపడిన కొండలునాఁదగు నేన్గులతోడను, నశ్వసారథియోధులతోడను మేదిని వ్యాపించియుండెను. కలఁతవడిన సరోవరములువలె హతములగు గజపదాతిసంఘములచే నారణరంగము భీరువులకు భయజనకమై ఘోరమై గానవచ్చెను. చంద్రాదిత్యసమద్యుతినై యటులుపడినయభిమన్యునిఁ జూచిన నీవారికి మోదమును బాండవులకు ఖేదమును గలిగెను. యువకుఁడగు నయ్యభిమన్యుఁ డటులు హతుఁడగుటఁ గాంచి పాండవ సైన్యములు ధర్మజుఁడు చూచుచుండఁగనే పరువులువాఱెను. అపుడటులు చెదరినసేనను గాంచి యుధిష్ఠిరుఁడు వారితో 'ఓవీరులారా! ఈసంగ్రామమునఁ బరాఙ్ముఖుఁడుగాక పోరి మృతినొందిన యీశూరుఁడు స్వర్గమునుభొందెను. జడియకుఁడు. నిలువుఁడు. మనము వైరులను జయింపఁగలుగుదుము.' అని పలికి వారిదుఃఖము నపనయించుచు ధైర్యమునుగలిగించెను. ఓరాజా! సంగ్రామమున విషసర్పములునాఁదగు రాజపుత్రులను మున్నుగాఁ జంపి, మహారథుఁడగు కౌసల్యుని రూపుమాపి, పిదపఁ గృష్ణార్జునతుల్యుఁడగు నయ్యభిమన్యుఁ డింద్రసదనమును జేరెను. గజాశ్వరథపదాతులను నమేయముగా రూపుమాపి యతఁడు సంగ్రామమునఁ దృప్తిపడక పుణ్యకర్మకర్తయై పుణ్యకర్తలలోకముల నాక్రమింపఁబోయెను." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

### యుద్ధభూమివర్ణనము

"ఓయాంబికేయా! మేమాయుత్తమును గొట్టి, వారిశరపీడవడి యాసాయాహ్నమున రక్తసిక్తాంగులమైమామానెలవుల కేగితిమి. మహారాజా! నాఁటిదివసము ముగిసి నక్కలమొఱలతో నమంగళమై సంధ్యాకాల మద్భుతముగా నారంభమయ్యెను. పద్మమునుబోలి సూర్యుఁ డస్తపర్వతముపై వ్రేలాడెను. అసిశక్తితోమరవిభూషణాదులకాంతుల నాకర్షించుచు, రవి భూమ్యాకాశముల నేకముగఁజేయుచుఁ, దనకుఁ బ్రియమగుపావకశరీరము నాశ్రయింపఁబోయెను. గొప్పమబ్బులగుంపులును, బర్వతములునుబోలి వైజయంతియు నంకుశముఁ గవచము నారోహకులు మున్నగువానితోఁగూడి పడినయేనుఁగులచేఁ బుడమి నిండియుండెను. రథికులు మడియుటను, నశ్వములును సూతులును గెడయుటను, పతాకలును గేతువులును గూలుటను, రూపుచెడి చూర్ణములై రథములు పుడమి నెల్లెడల వ్యాపించియుండెను. కవచాంబరాభరణాదులు చెడి పెక్కురుపదాతులు విలువగలశయ్యలపైఁ బరుండఁదగినవారయ్యు ననాథులువలె నేలఁగూలి దొరలుచుండిరి. అందుఁ గుక్కలును, నక్కలును, గాకులును, గ్రద్దలును, దరక్షువులును, వృకములును, రక్తపాయులగుపక్షులును, దారుణములగురక్షోగణములును, బిశాచగణములును హతములై, గజాశ్వములచర్మముల నొలిచి రక్తముఁ ద్రావుచు, మజ్జామాంసాదులను దినుచుండెను. రాక్షసులు వసను వెదనుజల్లుచు నగుచు శవములను లాగుచుఁ బీకుచునుండెను. శరీరసంఘములే తీరములును, రక్తమే జలములును, రథములే పడవలును, నేనుఁగులే కొండలును, మనుష్యశీర్షములే కలువలును, మాంసములే కర్దమములునుగా భయంకరమై వైతరణివలె దుస్తరమై, ఘోరమైన యొకనది యపుడు ప్రవహింప మొదలిడెను. అట్టిభయంకరమగు సంగ్రామరంగమును జూచువారి కెంతయును భయము గలుగకమానదు. దానిని జూచుచుఁ బోయిరి." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

### యుధిష్ఠిరుఁడు విలపించుట

"ఓరాజా! రథయూథాధిపుఁడగు నభిమన్యుఁ డటులు హతుఁడగుడు, రథసన్నాహములనువిడిచి, విండ్లుపాఱవైచి, పాండవపక్షమువా

రందఱు నాయుధిష్ఠిరు నావరించియుండిరి. అపుడు వారాసౌభద్రునిపై మనములిడి దుఃఖాక్రాంతులై యుండిరి. పిదప భ్రాతృపుత్త్రుఁడును మహారథుఁడునగు నభిమన్యుఁడు హతుఁడగుటను నాయుధిష్ఠిరుఁ డెంతయు దుఃఖితుఁడై యిట్లు విలపించెను.

'ఓ యోధులారా! నా ప్రియమునకై మిక్కిలి సమర్థమగు ద్రోణసైన్యమును జొచ్చి సమర్థము లేకుండ వ్యూహమును భేదించి లోనికి గోమధ్యమును జొచ్చినసింహమువలె నతఁడు ప్రవేశించెను. కృతాస్త్రులును రణగర్వితులునగు యోధులెల్లరును నాతని మార్గ్గాని భంగ మొందకపోలేదు. మాకుఁ బరమవైరియగు దుశ్శాసనుఁడు వాని యెదుటఁబడి శరపీడితుఁడై పరాఙ్ముఖుఁడయ్యెను. మహాసముద్రమనఁ దగు ద్రోణసైన్యము నటులుగడచి తుదికి దుశ్శాసనుతనయుచే స్వర్గము నొందెను. ఆహా! అభిమన్యుఁ డిటులయ్యెనుగదా! ఇఁక నర్జునుమొగ మెటులు గాంచఁగలను? ప్రియపుత్త్రునిఁ జూడఁగోరు నాసుభద్ర నెటులు చూతును? ఆకృష్ణార్జునులతో నీయర్థములేనియసమంజసవిషయమున కేమి బదులుచెప్పఁగలము? ఆకేశవార్జునులకును, సుభద్రకును మేలుగోరువాఁడనై యున్న నేనే వారి కీయప్రియమొనర్చితిని. లోభియగువాఁడు దోషములను గనిపెట్టలేఁడు. ఆలోభము మోహము వలనఁ గలుగుచుండును. తేనెనుగోరి యిట్టిప్రపాతమును దెలియనైతిని. ఎవ్వఁడు వాహనములందును, శయనములందును, భూషణములందును, ముందుగా ననుభవింపఁదగువాఁడై యుండెనో, యట్టిబాలుఁడు యుద్ధమున నాచే ముం దునుపఁబడియెను. అయ్యో! బాలుఁడును, యుద్ధములం దాఱితేరనివాఁడు నగునతఁడు మంచిగుఱ్ఱమువలె సమర్థమగు నచ్చోట నెటులు క్షేమమొందును? కోపదీప్తుఁడగు బీభత్సునికృపణదృష్టిచే దగ్ధులమై యిపుడు మన మీతని ననుసరించి యుందే శయనింతము. మతిమంతుఁడును, బిడియముగలవాఁడును, శాంతిధనుఁడును, రూపనిధియు, బలశాలియు, మానవంతుఁడు, ధీరుఁడును, సత్యపరాయణుఁడు నని యీయర్జునునిఁ బండితులు శ్లాఘింతురు. వీర్యశాలియగు నితఁడు నివాతకవచులను గాంగేయులను రూపుమాపెను. మఱియు హిరణ్యపురవాసులై మహేంద్రశత్రులగు పౌలోములను సైన్యములతోఁగూడ నొకనిమేషమున నాతనిచే హతులైరి. భయపీడితులగు

నెట్టివారికిని నభయమొసఁగు నాయర్జుననాత్మజున కభయమొసంగఁజాల మైతిమి. ధార్తరాష్ట్రసైన్యముల కిపుడు గొప్పభయము సంప్రాప్తించి నది. పార్థుఁడు కుపితుఁడై కౌరవులను నశింపఁజేయకమానఁడు. నీచుఁడును, నీచసహాయుఁడును నై దుర్యోధనుఁడు నిజపక్షక్షయకారకుఁ డగుచు వారినెల్లఁ జూచి దుఃఖించుచుఁ దనజీవితమును విడుచును. నాకిఁక జయము సంతోషకరము కానేరదు. రాజ్యమును రుచింపలేదు. సురలతోఁగూడిన యాదేవత్వమును నాకభిలషితము గాదు. ఛీఛీ ! అప్రతిమానపౌరుషుఁడగు నీయింద్రునిమనుమఁ డిటులు హతుఁడగుట నారయఁగా నీయుద్ధముతో నేమిపని?'అని పలికె" నని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

వ్యాసుఁడు ధర్మజు నూరార్చుట

"ఓరాజా! అటు లాయుధిష్ఠిరుఁడు విలపించుచుండఁగా నందులకు మహర్షియగు వ్యాసభగవానుఁ డరుదెంచెను. ఆతని యథావిధిగాఁ బూజించి యుధిష్ఠిరుఁడు కూర్చుండి యాతనితో 'ఓమహర్షివర్యా ! అధర్మపరులగు పెక్కురుమహారథులు చుట్టుకొన వారితో నావీరుఁడు పోరాడి రణరంగమున హతుఁడయ్యెను. బాలుఁడయ్యు గురుబుద్ధియగు నాసౌభద్రుఁడు యుద్ధమొనర్చుచుండియు, నుపాయముదప్పి సంగ్రామ మున మృతినొందెను. ఓతాతా! నీవు ముందు ప్రవేశించి మాకుఁ ద్రోవఁ గలిగింపుమని నేను దెలిపితిని, కాని లోని కతఁడు ప్రవేశింపఁగనే మేమును వెడలియు నాసైంధవునిచే నివారితులమైతిమి. యుద్ధజీవులగు క్షత్రియు లెపుడయినను సమయుద్ధ మపేక్షింపవలయునుగదా! ఇపుడు వైరులొనర్చినయుద్ధము విషమయుద్ధము. అటులగుట నాస్వాంతమున కెంతయు సంతాపముగదురఁ జింతచే నది యించుకేని శాంతివహింప కున్నది.' అని బాష్పాకులితనేత్రుఁడై మఱిమఱియు శోకించెను.

ఓరాజా ! శోకాకులితచిత్తుఁడై యటులు విలపించు నాధర్మజు నితో వ్యాసుఁడు 'ఓయుధిష్ఠిరా! మహాప్రాజ్ఞా! సర్వశాస్త్రవిశారదా ! నీవంటివా రెవ్వరు నాపదలందు ధైర్యమును విడువరు. ఇక్కుమా రుఁడు పెక్కురువైరులను జంపి స్వర్గమున కేగినవాఁడు ఇతఁడొనర్చిన పని బాలురకు సాధ్యమైనదిగాదు. ఓయుధిష్ఠిరా! విధి దప్పింపరానిదని నీవెఱుంగవా? మృత్యువు దేవదానవగంధర్వులను దీసికొనిపోలేదా?"

అని పలుక విని యతఁడు వ్యాసునితో 'ఓతాతా! ఈభూతలనేతలెల్ల రును మహాబలులై రణరంగమునఁ బోరాడి హతులై తెలివిదప్పి యిప్పు డమిఁ బడియున్నవారు. నాగాయుతబలులును వాయుతుల్యబలులునై యిందుఁబడిరి. వీరికి సాటియగువా రెవ్వరేనిఁగలరందువా? ఒకప్పుడును వీరిని రణమునఁ జంపువాఁ డొకఁడును గలుగఁడని నాయభిప్రాయము. తేజోబలసమన్వితులగు వీరవక్రవిక్రములుగదా! ఇట్టి వీరు పరస్పర మును జంపికొనవలయు ననుస్థిరబుద్ధితో నుండుటలో సందియములేదు. ఆహా! వీరులును ప్రాజ్ఞులునగు వీరెల్ల విగతాయువులై రణశయ్యలను బరుండియున్నవారు. మృతులు అను నొకశబ్ద మర్థముగలిగి ప్రవర్తిలు చున్నది. అవక్రవిక్రములగు నిమ్మహీపాలురెల్లరును మృతులైరిగదా! మఱియు శత్రువశగతులై యభిమానములు వీడి యీరాజపుత్రులు చేష్టారహితులై యగ్నిలోఁబడిరి. ఇందు నాకొకసందియ మొదవెడిని. ఇట్టివీరులకు మృతులనుసంజ్ఞ యెట్లురాఁదగును? మృత్యు వెవ్వనికగును? మృత్యు వెట్లువచ్చును? అయ్యది ప్రజల నెట్లు సంహరించుచున్నది? దానిని నాకెఱిఁగింపుము.' అని యడిగెను.

ఓరాజా! అది విని యావ్యాసుఁ డాశ్వాసకరముగా నాధర్మజు నితో 'ఓయుధిష్ఠిరా! నీవడిగినప్రశ్నమున కుదాహరణముగా నొక పురాతనేతిహాసము గలదు. అది మున్ను నారదుఁ డకంపనున కెఱిఁగించి నది. ఓరాజేంద్రా! ఆయకంపనుఁడును మహత్తరమగుపుత్రవ్యసనదుఃఖ మొంది నీవలెఁ బ్రశ్నించెను. అటులగుట మృత్యుప్రభావము నెఱిఁ గించెదను వినుము. దానివలన స్నేహాశ్రయమైవచ్చిన యీ నీదుఃఖము తొలఁగెడిని. నాయెఱిఁగించు నిప్పురాతనచరిత్ర మాయుష్కరమును, కీర్తిని బుష్టిని గలిగించునదియుఁ, బవిత్రమును శత్రునాశకమును నై, శుభములలో శుభమైనది. వేదాధ్యయన మెట్టిదో, యీయుపాఖ్యాన మట్టిది. ఓమహారాజా! బ్రాహ్మణోత్తములు నిత్యమును బ్రాతఃకాల మున దీనిని దెలుపఁగా వినవలయును. అటులే నేది గోరువాని కది గలిగెడిని. ఓమనుమఁడా! "మున్ను కృతయుగమున అకంపనుఁడను నొకరా జుండెను. అతఁడు సంగ్రామరంగమున శత్రువశుఁ డైనపు డాతనికొమరుఁడగు హరియనువాఁడు యుద్ధమునకు వెడలెను. అతఁడు బలముచే నారాయణునిఁ బోలి శక్రసమవిక్రముఁ డై పోరాడుచు

శత్రుపరివృతుఁడై వేలకొలఁదిగజాశ్వాదులను బరిమార్చుచు, దుష్కర కృత్య మొనర్చి, తుదికి హతుఁడయ్యెను. అటులు తనసుతుఁడు హతుఁ డగుట కాయకంపనుం డెతయు దుఃఖితుఁడై వానికిఁ బ్రేతకృత్యములు నిర్వర్తించి, రేపవలు పరితపించుచు సుఖమనునది లేకుండెను. పుత్రవ్యసనసంభవమగు నాతనిదుఃఖము నెఱిఁగి యందులకు దేవర్షి యగునారదుఁడు వచ్చెను. అంత నామహాభాగుఁడగురాజు దేవర్షి నారసి యథాన్యాయముగాఁ బూజించి, పిదప జరిగిన తనయుదంతము నెల్లఁ దెలిపి, మఱియుఁ దనపుత్రుఁడు రణరంగమున విక్రమించి శత్రుల నోడించి, తుదికిఁ బెక్కురచే హతుఁడయ్యెననియుఁ బలికి, 'ఓమహర్షి వర్యా! మృత్యువన నేమి? దీని బలపౌరుషములన నెట్టివి? దీనిని వినఁ గోరుచున్నాఁడను. ఇందలితత్త్వ మెద్దియో తెలుపుము' అని ప్రశ్నించెను. అదివిని యానారదుఁడు పుత్రశోకాపనోదకమగు నీమహాఖ్యాన మాతనికిటు లెఱిఁగించెను.

'ఓయకంపనా! బహువిస్తరమగు నీయాఖ్యానమును జరిగి నట్లును, నావిన్నట్లును దెలిపెదను వినుము. సృష్ట్యాదిని బితామహుఁ డగు పరమేష్ఠి ప్రజలను సృష్టించి, యది పెరిగి యెప్పటికిని సంహృతము గాకుండుటను జూచి తత్సంహారమునకై యాతఁడు చింతించెను. కాని యం దాతనికేదియుఁ దోఁపదయ్యెను. అంత నాతనికిఁ గోపమొదవెను. అటులు కోపమొదవఁగనే యాతనివదనములనుండి యగ్ని జనించెను. సకల దేశములను దహించునదై యాయగ్ని యెల్ల దెసల నాక్రమించెను. పిదప మన్నును మిన్నును జ్వాలామాలాసమాకులమై యేకమయ్యెను. ఇటు లాభగవానుఁడు సకలజగమును గాల్చెను. అపుడు చరాచరము లగుప్రాణులన్నియు నశించెను. అంత జటాధారియు, స్థాణువు, పిశాచ పతియునగు హరుఁ డాపరమేష్ఠిని శరణమందఁబోయెను. అటులు ప్రజా హితమునుగోరి యాస్థాణు వచటికేఁ గాంచి యామహామునియగు పర మేష్ఠి 'ఓపుత్రకా! నీవు కామమునుండియే జనించినవాఁడగుటఁ గామా ర్హుఁడవు. నీవేమిగోరివచ్చితివి? ఓస్థాణూ! నీకు వలసినదెల్లఁ గూర్చువాఁ డను కోరికొనుము' అని పలుక విని యాస్థాణుఁ డిట్లనియె.

## మృత్యుజననప్రకారకథనము.

'ఓప్రభూ! ప్రజలను సృజించుటకై నీవెంతయేని యత్నించితివి.

పిదప సృజించితివి. పెంచి పెద్దచేసితివి. పలువిధములగు నాభూతకోటులే యిపుడు నీక్రోధాగ్నికిం బాలై కాల్పంబడుచున్నవి. ఓప్రభూ! వానిని గాంచిన నాకెంతయు దయగలుగుచున్నది. కావునం బ్రసన్నుండవగుము' అని ప్రార్థించెను. అది విని యాపరమేష్ఠి 'ఓయీ! నాకు దీనిని సంహరింపందలంపు లేదు కావున నిది యిటులేయగుంగాక భూమికి క్షేమము గూర్చుటకే నాకుం గోపమొదవెను. ఈభూదేవి భారమును సహింపలేక నన్నిటులు ప్రేరించెను. ఆధారుణిభారమును దీరుప నీసంహార మారంభింపంబడియెను. తొలుత దీనిసంహారమునకై బహువిధములం జింతించియు నేమియుం దోపకయున్నపుడు నాకిట్లు కోపమొదవెను.' అని పలికెను.

అంత నారుద్రుండు మఱియు నాతనితో 'ఓదేవా! ప్రజాసంహారమునకుం గోపము చేయకుము. ప్రసన్నుండవగుము. స్థావరజంగమములు నశింపకుండుంగాక. ఓభగవానుండా! నీయనుగ్రహమున నేగదా! భూతభవిష్యద్వర్తమానములందును నీజగము త్రివిధమై యలరుచున్నది. ఓదేవా! నీవు కోపోద్దీపితుండవై యగ్ని సృజించితివి. అయ్యది పాషాణములుగల పర్వతములను, వృక్షములను, సరిత్పల్వలాదులను శోషిల్లంజేయుచున్నది. స్థావరజంగమాత్మకమగుజగము నిశ్శేషమగుచున్నది. ఇదె చూడుము. బూడిదయగుచున్నది. ఓదేవా! ఇంకనైన రోషము విడిచి ప్రసన్నుండవగుము. ఓవిభూ! నీచే సృష్టింపంబడిన వన్నియు నెటులు నశించుచున్నవో చూడుము. కావున నీతేజమును నివర్తించి నీలోన యడంచికొనుము. ప్రజలహితముగోరి యెంతయు దయగలిగిచూడుము. ఈప్రాణులన్నియు మఱల నెటులు నివర్తించునో యటు లనుగ్రహింపుము. ఉత్పన్నులయిన ప్రజల భావమునొందకుందురుగాక. ప్రజాపాలనమునకై నీచే నేను నియోగింపంబడియుంటిని. ఓజగన్నాథా! ఈస్థావరజంగమాత్మకమగు ప్రపంచము నశింపకుండుంగాక. ప్రసాదాభిముఖుండవగు దేవుండవగుట నేనిటులు ప్రార్థించుచున్నాండను' అనికోరెను.

ఓయకంపనా! ఆపరమేష్ఠి, ప్రజాహితము నవేక్షించి పలికిన యారుద్రునివచనము లాలించి తనతేజము నెప్పటియట్లు తనయంతరాత్మయం దడంచికొని, లోకమున వ్యాప్తమైనయగ్ని నుపసంహరించి పిదపం బ్రజల

కుత్పత్తి మోక్షహేతువులను గల్పించెను. అటు లతఁడు కోపజనితమగు నగ్ని నుపసంహరింప నమ్మహాత్ముని యింద్రియగోళములనుండి యొకనారి యుద్భవించెను. అయ్యది కృష్ణరక్తపింగవర్ణయు, నెఱ్ఱనినాలుకయుఁ గన్నులును మొగమునుగలిగి తప్తసువర్ణకుండలభూషిత యై యటు లా యింద్రియగోళములనుండి వెడలి దక్షిణదిశ నాశ్రయించి, యా బ్రహ్మ రుద్రులను గాంచి నవ్వుచుండెను. అపు డామె నా దేవుఁడు 'ఓమృత్యూ!' అని పిలిచి, 'నీ విఁకఁ బ్రజలను సంహరింపుము. నీవు నాకోపమునఁ బ్రజాసంహారమునకే జనింపఁజేయఁబడినదానవు. కావునఁ బండితపామర సామాన్యముగాఁ బ్రజలనెల్ల సంహరింపుము. నా యీనియోగ మిూ వానర్చితేని శ్రేయమొందఁగలదానవు.' అని పలికెను. అది విని యా మృత్యువు కొంతవడిఁ జింతించి మధురస్వరముతో నేడ్చెను. అపు డప్పి తామహుఁడు సర్వభూతహితమునకుఁగా దానికన్నీరు నేలఁ బడకుండ హస్తములతోఁ బట్టి, మఱియు నామె నూఱడించెను' అని తెలిపి నార దుఁడు మఱియు నిట్లనియె.

## మృత్యుప్రజాపతిసంవాదము

'ఓరాజా! ఆమృత్యువు దుఃఖమును జిత్తమంద యడంచికొని వంచ బడినతీఁగవలె సవినయముగాఁ జేతులు మొగిడ్చి యాపరమేష్ఠితో 'ఓ దేవా! నీచే సృజింపఁబడినకాంత యహితమగు నింతటిక్రూరకృత్య మొనరించు టెట్లు? నేను మూఢను. తెలియనిదానను. అధర్మమునకు జడియుచున్నదానను. ఓదేవా! ప్రసన్నుఁడవగుము. మృతులగుప్రియు లను, బుత్రులను, మిత్రులను, బితలను, భ్రాతలను, బతులను దలంచి కొని శోకింతురు. అట్లు శోకించువారినుండి జడియుదును. ఓభగవా నుఁడా! దీనులై రోదనముచేయువారి కన్నీటిబొట్టులకు బిట్టుగా నేను జంకుచున్నదానను. నిన్ను శరణమందెదను. ఓసురోత్తమా! నేను యమ భవనమునకుఁ బోఁజాలను. నీపాదములపైఁబడి నిన్ను వేఁడికొనియెదను. ఓలోకపితామహా! నీవలన నేనొకటి పడయఁగోరుదానను. నీ కనుగ్రహ ముగలదేని నాకుఁ దపమున కనుజ్ఞనొసఁగుము. ఇదియె నాకీవొసంగఁ దగినవరము. నీవు సెలవొసంగుదేని యుత్తమమగు ధేనుకాశ్రమము నకుఁ బోనున్నదానను. అందు నీయందే చిత్తమిడి తప మొనర్తును. ఓ

దేవేశా! అంతియగాని ప్రాణుల కెంతయుఁ బ్రియములగు ప్రాణములను హరించి, వారివారి నేడ్పింపఁజాలను. అధర్మము గాకుండ నన్ను రక్షింపుము.' అని వేఁడికొనియెను.

అంత నాపరమేష్ఠి, మఱియు నామె నారసి, 'ఓనారీమణీ! ప్రజాసంహారమునకుఁగదా నాచే నీవు సంకల్పింపఁబడివచ్చుట! కావున నీవీవిషయమున విచారణమొనర్పక వెడలి ప్రజలను సంహరింపుము. ఇటులే కాఁదగియుండ, వేఱొకవిధముగా నగుటెట్టులు? నామాట మన్నింపుము. లోకమున నీకొకకలంకము కలుగఁబోదు.' అని పలుక విని, యామృత్యు వతనిహితవచన మాలించియుఁ బ్రాంజలియై, ప్రజాహితము గోరునదగుటచే, వారిసంహారమున బుద్ధిపెట్టఁజాలక యూరకుండెను. అంత నాప్రజాధీశుఁడగు పితామహుఁడు వడిగాఁ దనంతఁ దాఁ బ్రసన్నచిత్తుఁడై చిఱునగవు దోఁప నెల్లలోకముల నాలోకించి యనుగ్రహించెను. అతఁ డటులు కోపముడిగి చూచుటను, లోకములెప్పటిచొప్పున నుండెను. అటు లాభగవానుఁడు కోపము విడిచిన తోడనే యక్కన్యయు నక్కడనుండి వెడలిపోయెను. ఓరాజేంద్రా! అటులామృత్యువు ప్రజాసంహారణము నంగీకరింపక, వడిగా నచ్చోనుండి వెడలి ధేనుకాశ్రమమును జేరి యందేకపాదమున నిలిచి పరమతీవ్రమగు నుత్తమవ్రత మొనర్చుచుఁ, బదునాఱుపద్మములు గడపెను. అటులు ప్రజాహితాభిలాషిణియై యామృత్యు విరువదియొక కోట్లవత్సరములు తపమొనర్చి, పిదపఁ బుణ్యములగు సప్తావరణములందును, బదుమూఁడువందలకోట్లవత్సరము లొకపాదముపై నిలిచి తపమొనర్చి, యనంతరము పదివేలపద్మములకాలము మృగములఁ గూడి చరించెను. మఱియు నామె యచ్చోటువిడిచి పవిత్రములై చల్లనివియుఁ దెల్లనివియు నగునుదకములుగల నందానదికేగి యం దెనిమిదివేలేండ్లు నీట నిలువఁబడి తపమొనర్చెను. అటు లానందానదిని నియమము దప్పకయుండుట, నకలుషయై కౌశికీనదికి వెడలి, యందు వాయుజలములే తనకాహారముగా నియమముఁ దప్పక చరించెను. అటులే పవిత్రయగు నక్కన్నియ సప్తగంగములందును వైతసకములందును దపోవిశేషములచే దేహమును గృశింపఁజేసికొనుచుఁ, బిమ్మట గంగకు వెడలి మహామేరువునుజేరి, యందుఁ బాషాణమువలె నిశ్చేష్టయై, ప్రాణాయామపరా

యణరైయుండి, మున్ను దేవతలెల్లను యాగములొనర్చిన యాహిమ వచ్ఛిఖరమున నొకకాలిబొట్టనవ్రేలిపైనుండి పెక్కుకాలము తపమొన ర్చెను. పిమ్మట నటులే పుష్కరములందును గోకర్ణము, నైమిశము, మల యము ననెడియుత్తమ క్షేత్రములందును, మనఃప్రియములగు నియమ ములచే నిజదేహమును గృశింపఁజేసికొనియెను. అటులు నిత్యము వేఱొకదేవతను భావింపక పితామహునియందే మతినిడి యాతని నెంతయు సంతోషపఱిచి యుండ, నతఁడు ప్రీతచిత్తుఁడై యామెతోఁ దనమనస్సౌమ్యత యేర్పడ, 'ఓమృత్యూ! ఏల యిటు లెంతయుఁ దప మాచరించుచున్నదానవు?' అని ప్రశ్నించెను. అంత నక్కాంతామణి భగవంతుఁడగు నప్పితామహు నారసి, 'ఓదేవా! ప్రజల నేను జంపఁ జాలను. బ్రతికియున్నవారు మొఱలువెట్టుదురు. ఓసర్వేశ్వరా! నీవలన నే నొకవరము నభిలషించుచున్నదానను. అధర్మమునకు జడిసి తపము నాశ్రయించితిని. ఓమహాభాగా! భీతనైన నాకు నీ వీయభయము నొసంగఁదగును. ఆర్తురాలను. అపరాధముచేసి యెఱుఁగను. ఆఁడు దానను. కావున నీవే నాకు శరణము.' అని ప్రార్థించెను.

అంత నాభగవంతుఁ డామృత్యువుతో, 'ఓదేవీ! నేను భూతభవి ష్యముల నెఱుంగుదును. ఓమృత్యూ! ఇప్పుడు ప్రజలను సంహరించుటచే నీ కధర్మము గలుగనేరదు. నాపలు కెప్పటికేని గావలసినదేగాని యనృ తము గాఁబోదు. ఓకళ్యాణీ! అటులగుట నాల్గువిధములగు ప్రజాసమూ హమును సంహరింపుము. అటులేని సనాతనధర్మము నిన్ను యాచింపఁ గలదు. నీకు లోకపాలుఁడగుయముఁడును, వ్యాధులును సాహాయ్య మొనర్చుటయెగాక నేనును దేవతలును నీకు వరమునైత మొసంగు వారము. దానివలన నీపాపము లుడిగి, విరజ యనెడి ఖ్యాతి నొందఁ గలుగుదువు.' అని పలికెను.

అది విని యామృత్యువు మఱియుఁ గృతాంజలియై ఫాలమునఁ గేలుమోడ్చి, 'ఓప్రభూ! నాకిది తప్పనిపనియేని నీయానతిని నేను శిరసా వహింపవలయుట నొకటి విన్నవించుకొనెదను వినుము. లోభము, క్రోధము, అసూయ, ఈర్ష్య, ద్రోహము, మోహము, బిడియము, లెమియు మున్నగుపలువిధములైనదోషములు పరస్పరము పరుషములై

దేహుల దేహములను బీడించుఁగాక.' అని కోరుటయు, నంత నాపర మేష్ఠి యి ట్లనియె.

'ఓదేవీ! నీవన్నటులే యగును. ప్రజలను సంహరింపుము. నీ కధర్మము గలుగదు. నేను నిన్నేమియు నిందింపను. నా యీహస్తమున నున్న నీకన్నీటిబొట్టులన్నియుఁ బ్రాణులకు దేహగతములైన వ్యాధు లుగాఁ బరిణమించును. అవియే గతప్రాణులగువారిని మారణమొన ర్చును. అటులగుట నీకు ధర్మహాని వాటిల్లదు. కావున భీతిల్లకుము. నీ కధర్మము గలుగకుండుటయెగాదు. నీవే ప్రాణులకు ధర్మమై ధర్మనేత వగుదువు. కావున ధర్మయుక్తవై నిత్యధర్మమొనర్చుచు, నీప్రాణుల నెల్ల విధములను గాపాడుము. కామరోషములను విడిచి, సర్వప్రాణులజీవ మును సంహరింపుము. ఇట్టులేని యనంతధర్మ మీవొందుదువు. మిథ్యావృత్తులగువారి నధర్మ మొందును. అక్కృతమున నిన్ను నీవే పావనముగా నొనర్చికొనుము. అసత్యముచేఁ బాపమున మునుంగ కుము. కామరోషములను విడిచి యిప్ప్రజలను సంహరింపుము.'

'ఓయకంపనా! అంత మృత్యు వాతనిశాపమునకు జడిసి మాఱు వలుకనేరక అటులే యొనర్తునని యంగీకరించెను. అదిమొద లామె కామక్రోధములను విడిచి, పట్టుదలలేక యంతకాలమునఁ బ్రాణులప్రాణ ములను హరించుచుండును.ఆమెకన్నీటిచే జనించినవ్యాధులే మృత్యువు. ఏయది ప్రాణులను బీడించునో యావ్యాధియే రోగమునాఁబడు. అదియే ప్రాణుల నవసానకాలమున హరించునది. కావున నీవు శోకించుట నిష్ఫలము. ఆయుష్యావసానమున నెల్లయింద్రియములును జీవులతోఁ గూడి వెడలి పరలోకముననుండి, పిదప మఱలుచుండును. మర్త్యులవలె వెడలి యింద్రాదులందుందురుగాని వారు పరలోకమునుండి మఱలరు. కావున సర్వప్రాణులకును మర్త్యధర్మ మవశ్య మొందఁదగినదగుట విచారింపరాదు. వాయువు భయంకరమై గొప్పనాదము బలముగలిగి, ప్రాణులదేహము లెల్లెడల నిండి దేహములను భేదించుచుండును. ఆవాయునకు వృత్తియును లేదు, వృత్త్యభావమును లేదు. ఓరాజసింహా! బ్రహ్మాదిదేవతలకును మరణమన్నది గలదు. కావున నీవు పుత్రునకై శోకింపఁజనదు. నీపుత్రుఁడు స్వర్గమున సంతసించుచు నున్నవాఁడు. అతఁడు వీరస్వర్గమొంది పుణ్యాత్ములతోఁ గూడి దుఃఖమనునది లేక

హాయిగా నందున్నవాఁడు. ఈమృత్యువనునది ప్రజలకు దైవవిహితము. ఇయ్యది ప్రజాసంహారమునకే సృజింపఁబడి, ప్రాణావసానమునఁ బ్రాణులను హరించునది. కావున ధీరులగువారు బ్రహ్మకల్పితమగు మృత్యువు విధము నెఱిఁగి మృతులకై శోకింపరు. ఇట్టి దైవకృతమగుసృష్టివిధము నెఱిఁగి నష్టపుత్రునకై శోకింపఁజనదు.' అని నారదుఁడు తెలిపెను.

ఓధర్మజా! నారదుఁడు తెలిపినయావచనములను విని యకంపనుఁడాతనితో 'ఓమునిసత్తమా! నీతెలిపినయితిహాసమును విని ప్రీతుఁడనైతిని శోకమింక మానుదును, కృతార్థుఁడనైతిని' అని పలుక విన్న పిదప నా నారదుఁడు తనవచ్చినచొప్పున నందనవనమునకుఁ బోయెను. ఓరాజా! ఈయితిహాసమును వినినను వినిపించినను గీర్తియు, బుణ్యము, ధర్మము, ఆయుష్యమును గలుగును.' అని పలుక విని యుధిష్ఠిరుఁడు క్షత్రధర్మమును దెలిసి, శూరులకగునుత్తమగతియు నెఱిఁగి, మహాపరాక్రమనిధియగు నభిమన్యుఁడు స్వర్గమొందెననియు, వైరులగువారి ననేకుల నోడించి కీర్తిపాత్రుఁడయ్యెననియుఁ దలంచి ధైర్యము దెచ్చికొని యెప్పటిచొప్పునఁ దనసోదరులతోఁ గుపితుఁడై యుద్ధమొనరింప నారంభించె''నని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## షోడశరాజులచరిత్రము

"ఓయాంబికేయా! మృత్యుసముత్పత్తిని విని, మఱియు నావ్యాసునితో సవినయముగా 'ఓమహనీయా! పూజ్యులును, బుణ్యకర్ములును, శక్రతుల్యవిక్రములును, సత్యవాదులు, ననఘులునగు రాజర్షుల నిరుపమానకృత్యములనెల్ల సత్యములగు నీమధురవచనములచే నెఱిఁగింపుము. అప్పురాణరాజర్షుల యుత్తమకృత్యము లెంతయు నాశ్వాసకరములై యుండును. ఏయేమహాత్ము లెట్టిదక్షిణలతో నుత్తమకర్మము లాచరించిరో వాని నెఱిఁగింపుము.' అని ప్రశ్నించెను.

అది విని యావ్యాసభగవానుఁ డాధర్మనందనునితో 'ఓయుధిష్ఠిరా! శైబ్యుఁడగు రాజోత్తమునకు సృంజయుఁడను నొకకొమరుఁడు గలఁడు. ఆతనికిఁ బర్వతనారదు లిరువురును బరమమిత్రులు. అటులగుట నొకపు డాయిర్వురు నాతనిఁ జూడవచ్చి, యాతఁడు యథావిధిగా సత్కరింపఁ బ్రీతులై యందు సుఖముండిరి, అంత నొకనాఁడు వారిరువురతో

నొకచోఁ గూర్చుండియున్న తండ్రికడ కాతని కన్నియ వచ్చెను. అటు లది వచ్చి నమస్కరింపఁ దదనురూపములగు నాశీర్వచనములచే నామెను గౌరవించి, నగుచుఁ బర్వతుఁడు 'ఓరాజా! చంచలాపాంగియు, సర్వ లక్షణసమేతయునగు నిక్కన్నియ యెవ్వతె? సూర్యకాంతియా? లేక యగ్నిశిఖయా? కాక శ్రీ, హ్రీ, కీర్తి, ధృతి, పుష్టి సిద్ధులలో నొకతెయా? అటులుగాక చంద్రకళయా?' అని ప్రశ్నింప, విని యాసృంజయుఁ డాత నితో 'ఓదేవా! ఇది నాకొమారిత. తమనుండి యొకవరము గోరు చున్నది' అని పలికెను. అది విని నారదుఁ డాసృంజయునితో 'ఓరాజా! నీకన్నియను నాకొసంగుము. నాకు దీనిని భార్యగా నొసంగుదేని నీవల సినశ్రేయ మొందఁగలవు' అని పలుక విని సంతుష్టాంతరంగుఁడై 'తప్పక యిచ్చెద' ననియే బదులు చెప్పెను. అంతఁ బర్వతుఁ డలిగి నారదునితో 'మామా! మున్నుగా నిక్కన్నియను నేను హృదయముచే వరించి యుండఁగా దీనిని నీవేల కోరితివి? నీవు దీనిని గోరుటచే నీయిచ్చవచ్చి నట్లు స్వర్గము నొందఁ జాలవు.' అని పలికెను. అది విని నారదుఁ డందులకు బదులుగా 'ఓయీ! మనసు, వాక్కు, బుద్ధి, సంభాషణము, ఉదకము, అగ్ని, పాణిగ్రహణమంత్రములు' అనునవి గల్గుటయే భార్యాలక్షణము. వీనిలో నీకెద్దాన నిశ్చితగా లేదు. నీవు కేవలము మనసుచే వరించితివి. నీ కీమెయెడ భార్యాత్వసిద్ధిలేకున్నను నన్నిటులు పలికితివి; కావున నన్ను విడిచి నీవును స్వర్గమునకుఁ బోఁజాలవు. అటులు వారిరువురును శపించి కొని యందుండిరి. పిమ్మట నమ్మహీపాలుఁడును మహీసురులఁ బానభోజ నాచ్ఛాదనములచే సంతసింపఁజేయుచు, వారివలనఁ బుత్రుఁడుగల్గునట్టి వరము పడయుటకై శక్తికొలఁది యత్న మొనర్చి యాదరించెను. అంత నావిప్రులు ప్రసన్నులై తపస్స్వాధ్యాయనిరతులును, వేదవేదాంగపార గులునగుట నాతని కెటులేనిఁ బుత్రునిఁ గల్గించువారై నారదునితో 'ఈరాజున కీప్సితమగుపుత్రలాభ మొదవింపు' మని పలికిరి. అది విని నారదుఁ డటులే యగుఁగాక యని యాసృంజయునితో 'ఓరాజర్షీ! బ్రాహ్మణులు నీయెడఁ బ్రసన్నులై నీకుఁ బుత్రునిఁ గలిగింపఁగోరు చున్నారు. నీకెట్టిపుత్రుఁడు కావలయునో కోరికొనుము, అన విని యమ్మనుజనాథుఁడు ప్రాంజలియై గుణాన్వితుఁడును, యశస్వియుఁ, దేజస్వియు, వైరిమారకుఁడునునగు పుత్రునిఁ గోరికొనియెను.

అపుడు వానికొమరుని మూత్రపురీషములును, స్వేదక్లేదములును సువర్ణమయములగుట నాబాలునకు సువర్ణష్ఠీవి యనునామ మిడిరి. అట్టివరప్రదానముచే నమితధనము వర్ధిల నారాజన్యుఁ డద్దానిచేఁ దనగృహప్రాకారదుర్గములను, బ్రాహ్మణాగారములను, శయ్యాస్థానాసనములను, స్థాలీపిఠరపాత్రాదులను, సువర్ణమయములుగా నొనరించెను. ఇంతయేల! కొంతకాలమున నాధరాకాంతునకుఁ గలనిశాంతములు బాహ్యగృహములు, నింకేవిగల వవన్నియును సువర్ణమయములై వర్ధిల్లెను. పిమ్మట నమ్మహీపాలుఁ డటులగుట విని కొందఱు దొంగలుగూడి యెటులైన దానిని హరింపవలయునని యూహించికొనిరి. అందుఁ గొంద ఱా సువర్ణష్ఠీవినే దొంగిలింతుమని పలికిరి. మఱికొందఱు ఆతనికి బంగారుగని గలదనియు, దానికై యత్నించెదమనియుఁ బలికిరి. పిదప నాదొంగలందఱును లోభావిష్టులై యాభూపతియిల్లు సొచ్చి తొలుత బలాత్కారముగా నారాజపుత్త్రుఁడగు సువర్ణష్ఠీవి నపహరించిరి. వారటులు తీసికొనిపోయి, యాబాలు నొకయరణ్యము నొందించి, వివేకహీనులగుట వానిని జంపి మే నొలిచి చూచిరి. కాని వానిమేన నించుకేని బంగారుగానిపింపదయ్యెను. ఆబాలుఁడు ప్రాణములు విడిచినతోడనే వాని యక్కాంచనవరమునైతము దొలఁగిపోయెను. అంత నామూర్ఖులగు దొంగలును బరస్పరమును గొట్టుకొని చచ్చిరి. యాపాపాత్ము లూహింపరాని ఘోరనారకమునొందిరి. పిమ్మట నమ్మహాతపుఁడగు సృంజయుఁడును వరప్రసాదలుబ్ధుఁడై యటులు హతుఁడైన సుతునిఁ గాంచి మిగుల దుఃఖితుఁడై పలువిధముల దైన్యముగా విలపించెను. అటులు పుత్త్రశోకహతుఁడై విలపించుచున్న యానృపునకు నారదుఁడు ప్రత్యక్షమై, దుఃఖార్తుఁడై యొడలు తెలియక దొరలుచు నేడ్చుచున్న యా రాజన్యు నారసి యిట్లు పలికెను. ఓయుధిష్ఠిరా! దాని నెఱిఁగించెదను వినుము.

నార.—ఓసృంజయా! నీవు కామములయెడఁ దృప్తినొందకున్నాడవు. దీనివలన నాశమొందుదువు. ఓయీ! నీ యీగృహముననున్న బ్రహ్మవాదులమగు మే మామరుత్తుఁడు మృతినొందుట యెఱుఁగుదుము. బృహస్పతిపైఁ గలయసూయచే సంవర్తుఁ డాతనిచే యాగములు చేయిం

చెను. ఆయజ్ఞముల కగుధనము నాభగవానుఁడు ప్రసాదింప నామరు త్తుఁడు హిమవత్పాదమునఁ బలువిధములగుయాగము లొనర్చుచుండ బృహస్పతియు, నింద్రాదులును, విశ్వేదేవులును, నాయాగాంతమున నందులకు వచ్చియుండిరి. ఆతనియజ్ఞశాల మున్నగుపరికరములన్నియు సువర్ణమయములైయుండెను. మఱియు నతఁడు కోరిన యన్నాదు లన్నియుఁ దమంతఁ దాము సిద్ధింప నన్నార్థులగు విప్రులెల్లరును వానిని స్వేచ్ఛగా భుజించిరి. తలుచుగా నాతనియాగములందెల్ల దధిఘృత మధుభక్ష్యభోజ్యములను, వస్త్రములు, నాభరణములును, వేదపారగు లగువిప్రులకు యథేష్టముగాఁ గొదువలేక లభించెను. ఆమరుత్తునిగృహ మున దేవతలు పరివేష్టలైరి. విశ్వేదేవు లాతనికి సభాసదులైరి. మఱియు నెవ్వఁ డొసఁగుహవిర్భాగములకుఁ దృప్తులై దేవతలు సువృష్టిచే సస్య సంపదల నొసంగిరో, మఱియు నెవఁడు పితరులకును, దేవతలకును, ఋషులకును 'దృప్తికరముగా బ్రహ్మచర్యము మున్నగువాని నొన ర్చియు, శయనాసనయానాదులను సువర్ణరాశులను విప్రులకు దాన మొనర్చియు, శక్రునకుఁ బ్రీతి గలిగించి తన్కాలమునఁ బ్రజల సుఖింపఁ జేసెనో యట్టిమరుత్తుఁడు, ప్రజామాత్యదారాపత్యబంధుసహితముగా నక్షయములగుపుణ్యలోకముల నొందఁగలిగెను. యౌవనముతో వేయేండ్లు రాజ్యసుఖము లనుభవించెను. ధర్మజ్ఞానవైరాగ్యైశ్వర్యములు గలయట్టిమరుత్తుఁడు మరణింపక జీవించియుండఁగలిగెనా? నీపుత్రునికంటె నతఁ డలంతియా? కావున నీవాతనికై శోకింపకుము' అని పలికి యా నారదుఁడు మఱియు నిట్లనియె.

## సుహోత్రుని చరిత్రము

'ఓసృంజయా! సుహోత్రుఁడనెడి క్షత్రియోత్తముఁడు మృతుఁ డగుట మనము వినియున్నదియె గదా! అతఁడు శత్రుల కజేయుఁడై యసహాయశూరుఁడై దేవతల కచ్చెరువుగలిగించినవాఁడు. మఱియు నతఁడు రాజ్యమును ధర్మముగా వహించి, ఋత్విగ్బ్రహ్మపురోహితుల వలనఁ దనశ్రేయమును దెలిసికొని వారిమత మాశ్రయించెను. ప్రజా పరిపాలనము, ధర్మము, దానము, యాగము, శత్రుజయము, అనువాని నెఱిఁగి యాసుహోత్రుఁడు ధర్మయుక్తముగా ధనమార్జించెను. ధర్మ

ముచే దేవతల నారాధించి నిజధర్మముచే శత్రువుల నోడించి, నిజసుగుణములచే నెల్లభూతములను రంజిల్లఁజేసెను. మఱియు నెవ్వఁడివ్వసుమతిని మ్లేచ్ఛాటవికశూన్యముగా ననుభవించెనో, మఱియు నెవ్వనిరాజ్యమునఁ బర్జన్యుఁడు పెక్కువత్సరములు హిరణ్యవర్షమును గురియ, సువర్ణప్రవాహములు ప్రవహించెనో, మఱియుఁ బర్జన్యుఁడు సువర్ణమయములగు గ్రాహములను, గర్కటకములను, మత్స్యములను, బహువిధములగు కామములను వర్షించెనో, మఱియు నెవ్వనిదేశమున సౌవర్ణములగుబావులు వేలకొలఁది నిర్మింపఁబడియెనో, మఱియు నెవ్వఁడు సువర్ణమయములగు నక్రమకరకచ్ఛపములను జేయించి యాగములందు దక్షిణలుగా బ్రాహ్మణుల కొసంగెనో యట్టిసుహోత్రుఁడు సామాన్యుఁడా! అతఁడు మఱియుఁ గురుజాంగలమున ననేకములగునశ్వమేధాదిరాజార్హయాగము లొనర్చి, భూరిదక్షిణల నిచ్చి యిష్టగతి నొందెను. నీపుత్రునికంటెఁ బవిత్రుఁడగునతఁడు మృతినొందెనేగాని జీవించియుండెనా? అయజ్వయు నదాక్షిణ్యుఁడునగు నీపుత్రునికై పరితపింపకుము.' అనిపలికి నారదుఁడు మఱియు నిట్లనియె.

### షోడశరాజులచరిత్రము

"ఓస్సృంజయా! పౌరవుఁడగు నంగు నెఱుంగుదువుగదా! అతఁడు మృతినొందలేదో? ఓరాజా! ఆరాజు తనయశ్వమేధములందు సంఖ్యాతీతములగు శ్వేతాశ్వములను విడిచెను. వేదవిద్యావ్రతులును, స్నాతకులును, దాతలును, బ్రియదర్శనులునగు వారికిని, నటనర్తనగంధర్వాదులకును, నిత్యోద్యోగులకును నతఁడు సంతసమొదవునట్లుగాఁ బరిపాలించుచు, యథాకాలముగాఁ బ్రతియాగమునందును దక్షిణలనొసంగుచు, మఱియు వేలకొలఁదియేన్గులను, సువర్ణవర్ణలగుకాంతలను, బంగరుతోఁ జేసినసపతాకములగుధ్వజములను, సువర్ణభూషితలగుకన్నియలను, వేలకొలఁదిగా నతఁడు విప్రుల కొసంగెను. మఱియు యజ్ఞాశ్వగణములను, గృహక్షేత్రగోశతములను, గోపాలకసహస్రములను యాగదక్షిణలగా నొసంగెను. ఈతనియాగములందు బంగరుకొమ్ములును, వెండిడెక్కలును, గంచుపాదుగులునుగలిగి, వత్సములతోఁగూడిన గోవులును, దాసీదాసులును, ఖరములు నుష్ట్రములు గొఱియలు మున్నగునవియును,

వివిధములగురత్నరాశులును, వివిధములగునన్నపర్వతములును, బ్రాహ్మణులకుఁగాఁ గల్పింపఁబడియెనని పురాణవేత్తలగువారు గాథలు గానము చేయుచుందురు. ఈయంగుఁడు యాగకర్త యగునపుడు క్రతువు లన్నియు స్వధర్మములతోవచ్చి యాతనికోర్కుల నీడేర్చెడివని ప్రసిద్ధి. అట్టిమహనీయుఁడు నీపుత్త్రునికంటెఁ దక్కువవాఁడందువా? అతఁడు గతింపక యుండెనా? కావున నీసుతునకై పరితపింపకుము.' అని తెలిపి నారదుఁడు మఱియు ని ట్లనియె.

## శిబిచరిత్రము

'ఓరాజా! ఉశీనరపుత్త్రుఁడగుశిబి మృతుఁడని మనము వినుచుందుముగదా! అతఁడు పుడమినెల్లఁ జర్మమయముగా నొనర్చి, యద్రిద్వీపసాగరవనప్రదేశములుగల భూమినెల్లఁ దనరథఘోషముచే ధ్వనింపఁ జేయుచు వైరులనువారు లేకుండ నొనర్చినవాఁడు. మఱియు నతఁడు మూర్ధాభిషిక్తులగువారినుండి సమ్మతముగా ధనముఁ దీసికొని బహువిధములగుయాగము లొనర్చెను. మఱియుఁ బుడమిగలక్షత్త్రియుల నోడించి, యశ్వమేధము లొనర్చి, యందు నిరర్గళములును, బహుఫలప్రదములగు గోహస్త్యశ్వపశుధాన్యాదులను గోట్లకొలఁది నిష్కములను దానముచేసి, పెక్కుభూదానములను బ్రాహ్మణుల కొనర్చెను. వర్షధారలను, నక్షత్రములను, గంగారేణువులను, మేరువునఁగల పాషాణములను, సముద్రగతములగురత్నములను, భూగతప్రాణులను లెక్కింపవచ్చునుగాని, యాశిబి నిజయాగములందు దానమొనర్చిన గోవులను లెక్కింపఁజాలము. ఆతనియాగములు హేమయూపాసనగృహములుగల్గి సువర్ణప్రాకారతోరణములుగలిగి యుండెను. అందు పరిమితిలేనిబ్రాహ్మణులు భుజించుటకై పెరుగుమడుఁగులును, నన్నపర్వతములును గల్పింపఁబడియెను. మఱియు నపుడు 'త్రాగుఁడు, తినుఁడు భక్షింపుఁడు' అనువచనములతో జనులు కోలాహలము సలుప రుద్రుఁడు ప్రసన్నుఁడై యాతని కక్షయధనములు గలుగునట్లు వరమొసంగెను. ఇటు లనేకములగువరములను బడసి స్వర్గమునొందెనుగాని యతఁడు చిరకాలము జీవించెనా! కావున నీపుత్త్రునకై శోకింపకుము అని పలికి నారదుఁడు మఱియు ని ట్లనియె.

## —శ్రీరాముని చరిత్రము—

'ఓస్సృంజయా! దశరథరాముఁడును మృతుఁడగుట నెఱుంగుదువు గదా! తండ్రి యౌరసపుత్త్రులనువలె నెవ్వనిఁ బ్రజలనుమోదింతురో, తేజోనిధియగు నెవనియం దసంఖ్యాకములగు సుగుణములు గల్గెనో, యట్టిమహనీయుఁడు తనతండ్రియాజ్ఞ జవదాటక పదునాల్గువత్సరములు భార్యతోఁగూడి వనవాసమొనర్చెను. మఱియుఁ దపోధనులను రక్షించుటకుఁగా జనస్థానమునఁ బదునాల్గువేవురరాక్షసులను సంహరించెను. అటు లారక్కసులయుక్కడంచి యతఁ డందే యుండఁగా రావణుఁడనురాక్షసుఁ డాతనిభార్యయగు వైదేహిని మోహించి హరింప, నాశ్రీరాముఁడు కుపితుఁడై యజేయుఁడగు నాపౌలస్త్యుని మున్నాయంధకుని రుద్రుఁడువలె సంహరించెను. అటులు సురాసురుల కవధ్యుఁడై బ్రాహ్మణకంటకుఁడగు నారావణుని సపరివారముగాఁ జంపి, ప్రజానుగ్రహముగల్గి, దేవతలకును బూజనీయుఁడై తనకీర్తి జగమెల్ల నిండ రాజ్యమునొంది, ప్రజలను ధర్మయుక్తముగ నేలుచుఁ, బెక్కుక్రతువు లొనర్చెను. హవిర్భాగదానముచే నింద్రునకు మోదము గల్గించెను. ఆతనిపాలనమునఁ బ్రజలకు రోగపీడలు లేకుండెను. తేజోనిధియు గుణనిధియు నై వెలయుచు, సర్వభూతముల నతిక్రమించి యాదశరథరాముఁడు ప్రకాశించెను. ఆశ్రీరాముఁడు రాజ్యముచేయుచుండఁగా ఋషులకును, దేవతలకు, మానవులకును సహవాసము గలిగెను. తేజము లెంతయు విరాజిల్లెను. అనర్థములు గల్గకుండెను. ఎల్లరును దీర్ఘాయువులై చిన్నవాఁ డెవ్వఁడును మృతినొందెననుట వినఁబడకుండెను. నాల్గువేదములచే హవ్యకవ్యములను బడసి దేవతలు సుప్రీతులై యుండిరి. ఆతని రాజ్యమున నీతిబాధలు లేకుండెను. ప్రాణులు నీటిభయముచేఁగాని, యగ్నిభయముచేఁగాని మృత్యుగతులు కాలేదు. మఱియు నాతనిపాలనమున ధర్మబుద్ధిలేనివారును, లుబ్ధులును, మూర్ఖులును లేకుండిరి. సర్వవర్ణములవారును విశిష్టకర్ములై వర్తిల్లుచుండిరి. జనస్థానమున రక్కసులు నశింపఁజేసిన స్వధాపూజ చెడకుండ వారిని జంపి పితృదేవతల కొసంగెను. ఆతనిరాజ్యమున వేయేండ్లు బ్రదికి వేవురుపుత్త్రులను గాంచిన ప్రజలలో జ్యేష్ఠులు కనిష్ఠుల కెందును శ్రాద్ధకృత్య మొనర్చినది లేదు.

శ్యామలవర్ణుఁడై యువకుఁడై లోహితాక్షుఁడును, మత్తమాతంగవిక్ర ముఁడును, నాజానుబాహువును, సింహస్కంధుఁడును, మహాబలుఁడునై యారాముఁడు పదునొకొండువేలేండ్లు రాజ్యము పాలించెను. ప్రజలలో నాతని బ్రేమింపనివారు లేరు. "రాముఁడు, రాముఁడు రాముఁడు" అనెడికథలె యాతనిరాజ్యమున వినవచ్చెడివి. జగమెల్ల రామమయమై యుండె ననవచ్చును. మఱియు నతఁడు రాజవంశము నెనిమిదివిధములు గాఁ బ్రతిష్ఠించి, నాల్గువిధములైన ప్రజాసమూహమును దనతో స్వర్గ మునకుఁ గొనిపోయెను. అట్టిమహాత్ముఁడును గిట్టక పుడమి నిలువఁ గలిగెనా? అటులగుట నీవు నీపట్టికై శోకింపకుము' అని పలికి నార దుఁడు మఱియు నిట్లనియె.

## భగీరథునిచరిత్రము

'ఓసృంజయా! రాజోత్తముఁడగు భగీరథుఁడు మృతినొందెననుట మనము వినియున్నదియెగదా! అతఁడు పితరులకు స్వర్గతి గల్గించుటకై గంగను బుడమికిఁదెచ్చి తత్కాలమున సువర్ణమయేష్టికలతో యజ్ఞ వేదికలమర్చి, పెక్కుయాగము లొనర్చుచు, నందు లక్షకన్యకల నలంక రించి, వారిని రాజులకును రాజపుత్రులకు నొసంగక బ్రాహ్మణుల కిచ్చెను. అక్కన్నియల నొక్కొకతె నొక్కొకరథమునఁ గూర్చుండఁబెట్టి, రథ ములకు నాల్గుగుఱ్ఱములను గట్టించి, రథమునకు నూఱేసియేన్గులును, వేయివేయిగుఱ్ఱములునుగా నుంచి, యొక్కొకగుఱ్ఱమునకు నూఱేసి గోవులను, వానివెనుక నటులే గొఱియలను నిలిపి, భూరిదక్షిణల నొసంగుచుండఁగా,నాభారముచేఁ దీరమువంగి గంగాప్రవాహ మాతని తొడపైకివచ్చెను. అటులువచ్చి గంగానది యాతనికి దుహితయయ్యె, నాతనివంశ్యులను దరింపఁజేయుట పుత్రత్వమును గాంచెను. భూరి దక్షిణలతో యాగములొనర్చునైక్ష్వాకుఁడగు భగీరథుఁడు తండ్రిగావ లయునని సముద్రగామినియగు గంగ తనభర్తను గోరెనని పితృదేవ మనుష్యులు వినునట్లుగా గంధర్వులు గాథలను గానముచేసిరఁట. ఆతఁ డొనర్చినయాగముల నిర్విఘ్నముగను, నిరామయముగను సేంద్రాది సురగణములు పరిగ్రహించెను. ఏయేబ్రాహ్మణుఁ డేమేమి యెందెందుఁ గోరికొనియెనో వానివాని కందం దాయాప్రియవస్తువుల నతఁ డొసం

గెను. బ్రాహ్మణులకుఁ గావలసిన దేదియైనను వారి కీయఁదగినదియెగాని, యీయరాదనుమాట నాతనికడ లేదు. అటులగుట బ్రాహ్మణానుగ్రహముచే నతఁడు బ్రహ్మలోకమును బొందెను. అట్టి సుప్రసిద్ధచరిత్రుఁడును మృతినొందెనుగాని స్థితినొందఁగలిగెనా? అటులగుట నీసుతునకై పరితపింపకు' మని పలికి మఱియు నారదుఁ డిట్లనియె.

## దిలీపునిచరిత్రము

'ఓరాజా! దిలీపుని మృతునిగా వినియున్నారము. ఆతని యాగశతములందు బ్రాహ్మణులు వేలకొలఁదిగా వచ్చియుండెడివారు. తత్త్వజ్ఞానార్థసంపన్నులును, బుత్రపౌత్రవంతులునగు బ్రాహ్మణోత్తములకు వసుసంపూర్ణమగు వసుధను నతఁడు దానముగా నొనర్చెను. అతఁడు తనయాగములందు సువర్ణమయమార్గము నొనర్ప నది యొకధర్మమని భావించి యింద్రాదిదేవతలు దానినుండివచ్చిరి. మఱియు నాతనియాగములఁ జషాలము ప్రచషాలము యూపమును సువర్ణమయములుగాఁ గల్పింపఁబడియెను. ఆయాగములందు గుడౌదనమును భోజ్యములను భుజించి, మత్తులై మార్గములందుఁ బరుండెడివారఁట. ఇట్టి యద్భుతకృత్యము నేరాజులందును జూడలేదు. అతఁడు నీట యుద్ధముచేయుచుండఁగాఁ జక్రములు మునుంగకుండెడివఁట. సత్యవాదియగు నా దిలీపు నెవ్వరు గాంతురో వారు స్వర్గజేత లగుచున్నారు. ఆతనిచెంత "స్వాధ్యాయఘోషము, జ్యాఘోషము, త్రాగుఁడు, తినుఁడు, భక్షింపుఁడు" అనెడిశబ్దము లైదును నెల్లపుడు వినవచ్చుచుండును. అట్టి గట్టి మగఁడే మరణించెనుగదా! నీకొమరునిమృతికై పరితపించుటేటికి?' అని పలికి నారదుఁడు మఱియు నిట్లనియె.

## మాంధాతృచరిత్రము

ఓసృంజయా! యువనాశ్వసూనుఁడగు మాంధాత, మృతుఁడగుట నెఱుంగుదుముగదా! దేవాసురమానవలోకముల నతఁడు జయించినవాఁడు. మున్నాతనిఁ దండ్రిగర్భమునుండి యశ్వినీదేవత లాకర్షించిరి. ఒకపుడు యువనాశ్వుఁడు వేటకై వెడలి యడవిఁ జరించుచు, దప్పిగొని వాహనము లలసటగొన, నొకచో ధూమమును జూచి, యందేదేని యాగము జరుగుచుండెనని తలఁచి, యందుల కతఁ డరిగెను.

అపు డాతనిగర్భమున నాహోమపదార్థము పుత్రత్వమును గాంచెను. అది చూచి యశ్వినీదేవతలు దాని నాతనిగర్భమునుండి వెడలింప, నా వ్యక్తియాతనితోడపైఁ గూపుచుండెను. దేవవర్చస్సుగల యాబాలునిఁ జూచి, వీఁడెవ్వనిఁ దృప్తినొందింపఁగలఁడని దేవతలు పరస్పరమనుకొనిరి. ముస్సుగా నన్నే సంతోషపెట్టునని యింద్రుఁడు పలికెను. పిదప నా యింద్రుని యంగుళులనుండి యమృతమయమగుక్షీర ముత్పన్నమయ్యెను. "మాంధాస్యతి" అని యింద్రుఁ డాతని ననుగ్రహించుటచే నాతనికి మాంధాత యనుపేరు గలిగెను. పిదప నాయింద్రునిపాణినుండి పయోఘృతధార లామాంధాతముఖమున స్రవించెను. దాని నాతఁడు త్రావి వర్ధిల్లెను. అంత నావీర్యవంతుఁడు పండ్రెండుదివసములలోఁ బండ్రెండేండ్ల వానియంతటివాఁ డయ్యెను. మఱియు నతఁ డొకదినమున నిప్పుడమినెల్ల జయించి, ధర్మాత్ముఁడును, ధైర్యశాలియు, సత్యప్రతిజ్ఞుఁడును, జితేంద్రియుఁడు నై జనమేజయ, గయ, శూర, బృహద్రథ, నృగాదులను జయించెను. సూర్యుఁ డుదయించెడి కొండమొదలతఁ డస్తమించుకొండవఱకునుగల ప్రదేశమెల్ల నాతనిదై యుండెను. అతఁ డశ్వమేధశత మొనర్చి, నూఱు రాజసూయము లాచరించి, యందు సువర్ణమయములై యోజనోన్నతములును, దశయోజనములు పొడవుగలవియు నగు రోహితమత్స్యములను దాన మొనర్చెను. మఱియు బహువిధములై రుచిగలభక్ష్యభోజ్యాన్నపర్వతములను గల్పించి, బ్రాహ్మణుల సత్యధికముగాఁ దృప్తినొందించి యాదరించెను. భక్ష్యాన్నపానసమూహములును, నన్నపర్వతములును, నేతిమడుఁగులును, పెరుగు బెల్లములును మెండుగా నతఁడు గలిగించెను. మధుక్షీర ప్రవాహములు పర్వతములకుఁ దాఁకెను. దేవగంధర్వగరుడయక్షాదులును, వేదవేదాంగపారగులగువిప్రులును నాతనియాగములందు సమావేశమయిరి. మహర్షులును వచ్చిరి. అందుఁ గలవారిలో నొకఁ డపండితుఁడు లేఁడు. మఱియు నాతఁడు ధనపూర్ణమై సాగరాంతమువఱకును గలయిలను బ్రాహ్మణోత్తముల కధీనమొనర్చి యంతరించెను. తనయశమెల్ల దెసల నింపి, పుణ్యకర్తలలోకములకుఁ బోయెను. అట్టివాఁడు చిరకాలము బ్రదుకఁగలిగెనా? కావున నీవిఁక పుత్రశోకమును విడువు'మని పలికి నారదుఁడు మఱియు ని ట్లనియె.

## యయాతిచరిత్రము

'ఓరాజా! నహుషసూతియగుయయాతి మృతినొందెననుట విని యున్నదియెగదా! అతఁడు రాజసూయశతమును, నశ్వమేధశతము నొనర్చి వేలకొలఁది పుండరీకములను, వందలకొలఁది వాజపేయము లను, వేలకొలఁది చాతుర్మాస్యములను, బలువిధములగు నగ్నిష్టోమము లను నొనర్చి, బ్రాహ్మణేతరులగువారిధనమునెల్లఁ బ్రోవుచేసి, యదియెల్ల బ్రాహ్మణుల కొసంగెను. మఱియు నతఁడు దేవాసురయుద్ధమున దేవత లకు సాహాయ్యమొనర్చి, యిప్పుడమినెల్ల నాల్గువిధములుగాఁ బంచి నలు గురుబుత్త్విక్కులకును నొసంగెను. ఇంకను నానావిధయజ్ఞములను నొనర్చి, దేవయానీశర్మిష్ఠలయం దుత్తమసంతానము వడసి, దేవారణ్య ములయందు విహరించెను. అతఁ డటులు స్వేచ్ఛావిహారముతో రెండవ యింద్రుఁడువలెఁ జరించుచు, నెపుడు భోగములందు విరక్తినొందకుం డెనో యపుడు పుడమినిగలస్త్రీ హిరణ్యపశుధాన్యములన్నియు నొక్క నికే చాలవని తలంచి తుదికి శాంతినొందెను. ఇటులు కామములను బరిత్యజించి, ధైర్యశాలియై యతఁడు, పూరుని రాజ్యమున నిలిపి వన మున కేగెను. అతఁడుమాత్రము గతింపకుండెనా? నీవిటులు సుతునకై పరితపింపనేటికి?' అని పలికి నారదుఁడు మఱియు నిట్లనియె.

## అంబరీషచరిత్రము

'ఓసృంజయా! అంబరీషుఁడు మృతుఁడగుట మన మెఱిఁగినదియె గదా! అతఁ డొకఁడే వేలకొలఁదిరాజులతోఁ బోరాడెను. జిగీషులై తనపైకివచ్చిన వైరుల నోడించెను. మఱియు నస్త్రబలముచేతను, శరీర బలముచేతను వైరుల ఛత్త్రాయుధధ్వజరథములను ద్రుంచి, వారు జీవి తార్థులై సన్నాహములు విడిచి శరణమొందఁగా, వారిని జంపక విడిచి పుచ్చెను. అటు లతఁడు శత్రులను వశమొనర్చికొని, వసుంధరనెల్ల జయించి, బహువిధయాగములను యథాశాస్త్రముగా యజించినవాఁడు. ఆతనియాగములం దెందుఁ గాంచినను బ్రాహ్మణులతృప్తికిఁగా మోదక ములు, పూరికములు, అపూపములు, శష్కులులు, సూపములు, మృష్టా న్నములు మున్నగునవి యపరిమితముగాఁ గల్పింపఁబడియెను. అటులే పయోఘృతదధిమధువులు ప్రవాహములుగా నుండెను. కొంద అందు

మత్తుపదార్థములను త్రావి యాతనిఁ బొగడుచు, మత్తులై పడుచు లేచుచుండిరఁట. అతఁడు తానొనర్చినయాగములందు హిరణ్మయకవచులును, శ్వేతచ్ఛత్రాద్యలంకృతులును, సువర్ణస్యందనారూఢులును, సపరివారులునగు రాజులను వేలకొలఁది బ్రాహ్మణులకు దక్షిణలుగా నొసంగెను. దండకోశనిచయములతోఁగూడిన మూర్ధాభిషిక్తులగు రాజపుత్రులను బ్రాహ్మణులకు దానమొనర్చెను. ఆతనిదక్షిణలకుఁ బ్రీతులై మహర్షులు ఇట్టిదాత మున్ను లేఁడనియు, నిఁకను గలుగఁడనియు సంతసించిరఁట. అట్టి మహనీయుఁడును గతించెనుగాదే! నీవేల నీ యీ పుత్రునకై శోకింతువు?' అని పలికి నారదుఁడు మఱియు నిట్లనియె.

## శశిబిందుచరిత్రము

'ఓరాజా! రాజోత్తముఁడగు శశిబిందుఁడు మరణించెనని మనము వినుచున్నారముగదా! అతఁడనేకములగుయాగము లొనర్చెను. అతఁడు తనకుఁ గలలక్షభార్యలతో నొక్కొక్కతెకు వేవురుపుత్రులను బడసెను. పరాక్రమశాలులగువారెల్లరును పెక్కువేలయాగము లొనర్చినవారు. అట్టియశ్వమేధాదియాగము లొనర్చినహిరణ్యకవచులగు తన తనయులను దానొనర్చినయశ్వమేధమున బ్రాహ్మణులకు దానముగా నొసంగ, వారొక్కొక్కరును నూఱునూఱు రథములతో వెడలిరి. అందొక్కొక్కనికి సువర్ణాలంకృతలగుకన్నియలును, నొక్కొకకన్నియకు నూఱునూఱు మదేభములును, నేన్గునకు నూతేసి రథములును, రథమునకు నూతేసిగుఱ్ఱములును, గుఱ్ఱమునకు వేయిగోవులును, గోవున కేఁబదేసి గొఱియలునుగా నాయశ్వమేధయాగమున బ్రాహ్మణుల కాశశిబిందువు దానముచేసెను. ఆయశ్వమేధమున వృక్షములతోఁజేసిన యూపము లెన్నిగలవో యన్ని బంగారుయూపముల నతఁడు చేయించెను. భక్ష్యాన్నపాననిచయములు కొండలుగాఁబడి క్రోశముమేర వ్యాపించి, యాయశ్వమేధము సమాప్తమైనపిదపను గొన్ని మిగిలెనఁట. అట్టి శశిబిందుఁడును మృతినొందెనేగాని బ్రతికియుండెనా?' అని పలికి నారదుఁడు మఱియు నిట్లనియె.

## గయునిచరిత్రము

'ఓరాజా! గయుఁడు మరణించెనని మనము వినియున్నారము గదా! అతఁడు నూతేండ్లు హుతశేషమునుమాత్రమె భుజించినవాఁడు

ఆతని కగ్ని దేవుఁడు ప్రసన్నుఁడై వరము కోరికొమ్మనఁగా, దనకుఁ దపము బ్రహ్మచర్యము వ్రతము నియమము గురూపాసనము ననెడివానితో వేదములను దెలియుటకును, నిజధర్మము గల్గియుండుటకును, నెవ్వరిని హింసింపక యక్షయధనమును సంపాదించుటకును, పాత్రదానమున శ్రద్ధగల్గుటకును, సవర్ణభార్యలందుఁ బుత్రులుగల్గుటకును వర మొసంగుమని ప్రార్థించెను. మఱియు నతఁడు ధర్మమందును, నన్నదానమందును దనకు శ్రద్ధగల్గి, తనధర్మము నిర్విఘ్నముగా నిత్యము జరుగుచు నుండునట్లు వరము ప్రసాదింపుమన, నాయగ్ని యటులే యగుఁగాక యని పలికి యంతర్ధానమయ్యెనఁట. అటు లన్నియు నతఁ డొనర్చి వైరులను జయించెను. అతఁడు దర్శపౌర్ణమాసముల చేతను, నాగ్రయణముచేతను, జాతుర్మాస్యములచేతను, వివిధయాగములచేతను నూఱువత్సరములు శ్రద్ధతో నగ్ని నారాధించెను. నూఱువేలగోవులను, నన్నిగుఱ్ఱములను, లక్షనిష్కములను, నూఱువత్సరములవఱకు బ్రాహ్మణుల కొసంగుచు వచ్చెను. సోమాంగిరసులువలె నతఁడు, నక్షత్రము లన్నిటియందును నక్షత్రదక్షిణలతోఁ బలువిధములగుయాగము లొనర్చెను. మఱియు, నశ్వమేధమహాయాగమునఁ బుడమిని సువర్ణమయముగా నొనర్చి,యందు మణులుదాపి, దానిని బ్రాహ్మణులకు దక్షిణగా నొసంగెను. యూపములను హిరణ్మయములుగా నొనర్చి, రత్నాలంకృతములుగాఁ జేసి వానినాతఁడు బ్రాహ్మణుల కర్పించెను. సముద్ర,నగ, నదీ, ద్వీప, నద, వనములందును, నగరములందును, రాష్ట్రములందును, నెల్లచోటులనుగల ప్రాణులన్నియును, నాతని యాగసంపదలచే సంతృప్తి వడసి, వానికి సరియగువారు లేరని చెప్పుకొనసాగిరి. ఆతనియజ్ఞవేదిక యిరువదియాఱు యోజనములపొడవును, ముప్పది యోజనముల వెడల్పును గలిగి సువర్ణమయమై యలరారెను. మఱియు నతఁ డాయాగమున వస్త్రములను, నాభరణములను, శాస్త్రీయములగుదక్షిణలను విప్రుల కొసంగెను. ఆతనియాగమున బ్రాహ్మణులు భుజింపఁగా మిగిలినయన్నపర్వతము లిరువదైదు. మఱియును రసములు ప్రవాహములై పాఱెను. వస్త్రాభరణగంధముల ప్రోవులు పలువిధములై యుండెను. ఎవ్వని ప్రభావముచే వటవృక్షమును, బ్రహ్మావరమును లోకమునఁ బ్రసిద్ధి వహించెనో యట్టి గయుఁడు మరణింపలేదా? నీసుతునికంటె నతఁ డలఁతియా? కావున

నీవు పుత్రునకై శోకింపకుము.' అని పలికి నారదుఁడు మఱియు ని ట్లనియె.

రంతిదేవునిచరిత్రము

'ఓరాజా! సంకృతిపుత్రుఁడగు రంతిదేవుని మృతునిఁగా విని యుంటివా? లేదా? ఆమహాత్ముఁడు తనయింటికి వచ్చెడునతిథులకును విప్రులకును వండించుటకై యిరువదివేవురువంటవారి నిడికొని, దివారాత్రములు భక్ష్యభోజ్యాదులతో నన్నదాన మొనర్చువాఁడఁట. న్యాయార్జితమగువిత్తమును బ్రాహ్మణుల కొసంగెడివాఁడఁట. మఱియు నతఁడు వేదములను జదివి ధర్మముచే శత్రులను వశ మొనర్చికొనియెను. శాస్త్రీయముగా యాగ మొనర్చిన యాతనికిఁ బశువులు తమంతఁ దాము స్వర్గాపేక్షచే వచ్చెడివఁట. మఱియు నతని వంటయింటినుండి చర్మముల ప్రోవుమూలమున నొకనది ప్రవర్తిల్లుటను జర్మణ్వతి యనుపేరు గాంచెను. బ్రాహ్మణులకు నిష్కసహస్రముల నొసఁగుచున్నతఱి నీకొక నిష్కము నాకొకనిష్కము అని పలుకసాగిరి. నాకల్పమే యిచ్చితి రనువారికి మఱియు నిష్కముల నొసంగెను. ఒక్కదినమునఁ గోటినిష్కముల నతఁడుదక్క వేఱొక్కఁ డిచ్చినవాఁ డెవ్వఁడు? మఱియు నతఁడు సువర్ణమయములగు యాగోపకరణములను, శయనాసనప్రాసాదములను, బ్రాహ్మణుల కొసంగెను. అతఁ డొసంగునదియెల్ల సువర్ణమయమైయుండెను. ఆరంతిదేవుని యమానుషసమృద్ధి నారసిన పురాణవేత్తలు 'ఇట్టి ధనసమృద్ధి కుబేరునింటను గలుగదన మానవుల కెట్లు గల్గును?' అని తెలిపిరఁట. ఆరంతిదేవునింట నొకరాత్రి యతిథిగా నున్నవాని కిరువదియొక వేలగోవులు లభించెడివఁట. మణికుండలాలంకృతులై యాతనివంటివారు 'సూపమునే యధికముగా భుజింపుఁడు, మాంసము నేఁడు లేదు.' అని కేకలువెట్టుచుండెడివారఁట. ఆరంతిదేవునకుఁగల సువర్ణమంతయు నతఁడొనర్చినయాగములందు బ్రాహ్మణుల కీయఁబడెను. దేవతలు ప్రత్యక్షముగా వచ్చి యాతఁ డిచ్చుహవ్యములను భుజించెడివారు. అటులే పితరులును గవ్యములను బరిగ్రహించెడివారు. అట్టిచిత్రచరిత్రుఁడే మృతినొందెనుగదా! నీపుత్రునికై శోకింతువేమి?' అని పలికి నారదుఁడు మఱియు ని ట్లనియె.

## భరతుని చరిత్రము

"ఓసృంజయా! దుష్యంతపుత్రుఁడగుభరతుఁడు మృతుఁడగుట మనము వినుచునేయున్నవారము. అతఁడు చిన్నవయసునాఁడే దుష్కర కృత్యముల నొనర్చినవాఁడు. మంచువలెఁ దెల్లనై నఖదంష్ట్రాయుధము లగు సింహములను, దనబలముచే బలహీనములనుగాఁ జేసి యాకర్షించెడివాఁడఁట. వాని నొకచోఁ గట్టెడివాఁడఁట. క్రూరములై యుగ్రతరములగువ్యాఘ్రములను, గైరికాదిధాతుపూరితములై యడవిఁ దిరిగెడియేన్గులను బలశాలియై పట్టుకొని,యాపులుఁలదంష్ట్రములఁ బెఱికియు, దంతముల లాగియు, విముఖములఁగానొనర్చి, వానినోళు లెండునట్లుగా నొనర్చినవాఁడు. అటులే బలముగలమహిషములను దమించినవాఁడు. అడవిఁ జరించు బలిష్టములగు గవయములను ఖడ్గమృగములను మఱియును గలజంతువులను బట్టుకొని పీడించి కట్టి శిక్షించి విడిచెడివాఁడఁట. అటు లెల్లజంతువులను దమించువాఁడగుటచే సర్వదమనుఁడనుపే రాతనికిఁగల్గెను. ఆతని నామృగములను బట్టుకొనవలదని యాతనితల్లి వారించెనఁట. అతఁడు యమునానదీకూలమున నూఱశ్వమేధములను, సరస్వతిచెంత మూఁడువందలశ్వమేధములను, గంగానదీతీరమున నాల్గువందల యశ్వమేధములను నొనర్చి, నూఱు రాజసూయములుచేసి, సమాప్తదక్షిణలుగలయజ్ఞము లనేకము లొనర్చి, వాజపేయములు వేలకొలఁది చేసి యాశకుంతలాతనయుఁడు ధనములచే విప్రులకుఁ దృప్తిగల్గించి, కణ్వునకుఁ బద్మసహస్ర మొసంగెను. ఆతనియాగమున యూపము శుద్ధసువర్ణమయమై నూఱుబారలచుట్టుకొలఁతగలిగ మిక్కిలిపొడవై యుండ, దేవతలతోడను బ్రాహ్మణులతోడను గూడి యాగము లొనర్చి, యందలంకృతములై హిరణ్మయములగు గజాశ్వములను, రథోష్ట్రములను, గొఱియలను, దాసీదాసధనధాన్యములను, గోవులను, గ్రామములను, గృహములను, వివిధములగువస్త్రాదులను నూఱుకోటుల కెక్కుడుగా బ్రాహ్మణుల కొసంగెను. వైరుల కజేయుఁడై రిపుల నోడించి, చక్రవర్తి యయ్యెను. అట్టి భరతుఁడు మరణించెనా? లేదా? నీవు నీపుత్రున కింతగా వంతనొంద నేటికి?' అని పలికి నారదుఁడు మఱియు నిట్లనియె.

## పృథునిచరిత్రము

'ఓసృంజయా! పృథుఁడు మృతుఁడయ్యెనని మనము విన్నదియె గదా! మహర్షులెల్లరు నాతని రాజసూయమున నభిషేకించిరి. ఇతఁడు మనలను వృద్ధినొందించువాఁడని వారు పలుకుట నితఁడు పృథువనఁబడి యెను. క్షతమునుండి రక్షించువాఁడగుట క్షత్త్రియుఁడయ్యెను. ఆవేన పుత్త్రుఁడగు పృథువు నారసి ప్రజ లనురాగయుక్తు లగుట, రాజనామ మతఁడు గాంచెను. ఆతనికిఁ బుడమి దున్నకయే సకలసస్యములను గల్గించునది. గోవులన్నియుఁ గామములఁ బితికెడివి. వృక్షముల ప్రతి పుటకమందును దేనె లూరుచుండెడివి. మఱియు నాతనియేల్బడిని దర్భలు హిరణ్మయములై సుఖస్పర్శములగుచుండుటను, దానితోఁ గల్పించిన చీరములను బఱచికొని, యందు శయనించెడివారు. ఫలములు రుచ్యములును మృదువులై యమృతతుల్యము లనఁదగి ప్రజల కవియే యాహారములుగా నుండెడివి. నిరాహారు లెవ్వరును లేరు. మఱియు నాతని ప్రజలు నీరోగులై యెల్లయర్థములు సిద్ధింప, నొకపుడును భయము లేకుండిరి. అటులగుట వారు స్వేచ్ఛగా వృక్షమూలములందును గుహలందును నివసించుచుండెడివారు. ఆతనియేలుబడిని రాష్ట్రములయుఁ బట్టణములయు విభాగము లేకుండెడివి. అట్లగుటఁ బ్రజలు స్వేచ్ఛగా సుఖముల ననుభవించుచువచ్చిరి. సముద్రములకుఁ బోవునాతనికి నదులాగి త్రోవ యొసంగెను. పర్వతములు మార్గము లిచ్చెను. తోరణాదులచే నాతనికి ధ్వజభంగమును గలుగదయ్యెను. అతఁ డొకపుడు సుఖాసీనుఁడై యుండఁగా, వృక్షములు, శైలములు, దేవతలు, రాక్షసులు, ఉరగులు, మానవులు, సప్తర్షులు, గంధర్వులు, అప్సరసలు, పితృదేవతలును నందులకు వచ్చి 'ఓమహానీయా! నీవు సామ్రాజ్యాధిపతివి, క్షత్త్రియోత్తముఁడవునై, మాకు రక్షకుఁడవు, తండ్రివి నైతివి. ఓమహారాజా! మాకీవు ప్రభుఁడవై కావలసినవరముల నొసంగుము. మేమెల్ల శాశ్వతముగా సుఖము లనుభవించుచుఁ దృప్తులమై యుండవలయును.' అని ప్రార్థించిరి. అతఁ డటులే యగుఁగాక యని తనయజగవమనుధను వెక్కిడి నిరుపమానములై ఘోరములగుశరములను సంధించి, కొంత వడి చింతించి భూదేవితో 'ఓవసుధాదేవీ! వడిగా రమ్ము. ఈ నా ప్రజ

లకు వలయుకోర్కుల నొసంగుము. అటులేని నీకు భద్రము గల్గించు వాఁడను.' అని శాసించెను. అది విని యవ్వసుధ యాతనితో 'ఓవీరా గ్రేసరా ! నన్నుఁ బితుకుటకై సంకల్ప మొనర్పుము.' అని పలికెను. అంత నతఁడు తద్విధాన మెల్లఁ దనమహాత్త్వముచే సంఘటిల్లఁజేసెను. పిదప భూతములన్నియు నప్పుడమిని బితుకం దొడంగెను. అందు ముందుగా వనస్పతు లాపృథివిని బితుక నారంభించెను. అపు డప్పుడమి చేపి, వత్సమును బితుకువానిని బాత్రమును గోరి నిలువఁబడియుండెను. అప్పుడు పుష్పితసాలము వత్సముగను, ప్లక్షవృక్షము పితుకునదిగను, నౌదుంబరము పాత్రముగను, ఛిన్నప్రరోహణము దుగ్ధమయ్యెను. అటులే యుదయపర్వతము వత్సమయ్యెను. మేరువుపితికెను. పాత్రము పాషాణమయముగా నుండెను. అం దోషధులును రత్నములును బితుక బడియెను. దేవతల కింద్రుఁడు వత్సమైదారుమయపాత్రమై, సూర్యుఁడు పితుకువాఁడై యుండ, నందు బలముగలిగించునది దుగ్ధముగాఁ బితుకఁ బడియెను. రాక్షసులు, శుక్రుఁడు దోగ్ధగా నయఃపాత్రమున విరోచ నుని వత్సముచు జేసి మద్యమును బితికిరి. మానవులు స్వాయంభువుని వత్సమునుజేసి, పృథువు పితుకువాఁడుగాఁ గృషిని సస్యములను బితికిరి. అందుఁ బుడమియే పాత్రమయ్యెను. ధృతరాష్ట్రుఁడు దోగ్ధగాఁ, దక్ష కుఁడు వత్సముగా, నలాబుపాత్రమున, విషము పితుకఁబడియెను. సప్త ర్షులు బృహస్పతి దోగ్ధగా, సోమరాజు వత్సముగా, ఛందఃపాత్రమున బ్రహ్మమును బితికిరి. వైశ్రవణుఁడు దోగ్ధగా, వృషధ్వజుఁడు వత్స ముగా, నామపాత్రమున విరాట్పూరుషుఁ డంతర్ధానదుగ్ధమును బితి కెను. చిత్రరథుఁడు వత్సముగా, విశ్వరుచి దోగ్ధగా, గంధర్వాప్సరసలు పద్మపాత్రమున సుగంధములను బితికిరి. పితరులు వైవస్వతుఁడగు యముఁడు దోగ్ధగా, రజతపాత్రమున స్వధను బితికిరి. ఆపృథువు మఱియుఁ బలువిధములగు యాగములొనర్చి, మనఃప్రియములగు కామ ములనెల్ల భూతములన్నిటికిని గల్గించి, పార్థివములగువానినెల్ల హిరణ్మ యములుగా నొనర్చి, వానినెల్ల బ్రాహ్మణుల కొసంగెను. మఱియునశ్వ మేధయాగమున నాతఁడు బంగారుతోఁ జేయించిన యఱువదియాఱు వేలయేన్గులను బ్రాహ్మణుల కిచ్చెను. మఱియుఁ బుడమిని సువర్ణమయ ముగా నొనర్చి, దానిని బ్రాహ్మణులకు దారవోసెను. అట్టిమహాత్ముఁడును

మరణించెనుగాని బ్రతుకఁగలిగెనా? కావున నీవింకఁ బుత్రశోకమును విడువు' మని పలికి నారదుఁడు మఱియు ని ట్లనియె.

## పరశురామచరిత్రము

'ఓసృంజయా! మహాతపస్వియును శూరుఁడును వీరలోకనమస్కార్యుఁడునగు రాముఁడును మరణించువాఁడేగదా! అతఁడు భూమి నపాంసులముగా నొనర్చి, యత్యధికశ్రీలనొందియు, నించుకేని వికార మొందఁడయ్యెను. తనతండ్రి క్షత్రియులచేఁ బరాభూతుఁడగుట కోపకార్తవీర్యార్జునునిఁ జంపి, పెక్కుమాఱులు వేలకొలఁదిక్షత్రియులను బరిమార్చెను. మఱియు బ్రహ్మద్వేషులగు నాభూపాలురను పదునాల్గువేవురను, దునుమాడెను. అటులే ముసలముచే వేవురను, ఖడ్గముచే వేవురను, నుద్బంధనముచే వేవురను, హైహయులను నశింపఁజేసెను. పితృవధామర్షితుఁడగు పరశురాముఁడు యోధగజరథాశ్వసమూహములను నుఱుమాడెను. పిదప నతఁడు తనపరశువుచేఁ గాశ్మీర, దరదులను, కుంతి క్షుద్రకమాలవులను, అంగవంగకలింగులను, విదేహులను, రక్షోవాహులను, వీతహోత్రులను, త్రిగర్తులను, మార్తికావతులను నింకనుగల యనేకులను వెదకివెదకి వేలకొలఁది చంపి, తనతీవ్రప్రతాపమును జూపించెను. ఇటులు పెక్కుకోట్లక్షత్రియులను రూపుమాపి, యెఱ్ఱనిరక్తప్రవాహములను బ్రవహింపఁజేసి, రక్తము మడుఁగులువాఱఁ బదునెనిమిదిద్వీపములను వశ మొనర్చికొనియెను. మఱియు శాస్త్రీయముగాఁ గల్పింపఁబడిన సువర్ణవేదికలను రత్నాలంకృతములుగా నొనర్చి, పెక్కుక్రతువు లొనరించెను. గ్రామ్యారణ్యపశుగణములతోఁ గూడినపుడమిని గశ్యపునకు దారవోసెను. ఇరువదియొక్కమాఱులు పుడమి క్షత్రియశూన్యముగాఁ జేసి, పెక్కుయాగము, లొనర్చి యవ్వీరుఁడు బ్రాహ్మణులకు దానముగా నొసంగెను. అపుడు మరీచిపుత్రుఁడాతనివలన సప్తద్వీపవసుంధరను బరిగ్రహించి 'ఓరామా? నీ వీవసుధనుండి తొలఁగిపొమ్ము.' అని పలుక, నక్కశ్యపునివచనముచొప్పున సముద్రమున నొకచోటు గావించికొని యందు మహేంద్రపర్వతమున నివసించియుండెను. ఇట్టి పెక్కుగుణములుగల పరశురాముఁడును మృతి నొందకుండునా? వీరెల్లరును నీపుత్రునికంటె గుణోత్తరులు. కావున

నీపుత్త్రునకై శోకింపకుము.' అని నారదుఁడు సృంజయు నోదార్చె' నని తెలిపి వ్యాసుఁడు ధర్మజునితో మఱియు ని ట్లనియె.

—— ధర్మజు నోదార్చి వ్యాసుఁడు వెడలిపోవుట ——

'ఓయుధిష్ఠిరా! ఆయుఃప్రదమై పవిత్రమైన యాషోడశరాజచరిత్రమును విని యాసృంజయుఁడు మాటలాడక యూరకుండెను. అంత నానారదుఁడు మఱియు నాసృంజయునితో 'ఓరాజా! నా యీ తెలిపిన వచనములు విని గ్రహించితివా? లేక శూద్రాపతి కొనర్చినశ్రాద్ధము వలె వ్యర్థమయ్యెనా?' అని పలుక విని యాసృంజయుఁడు ప్రాంజలియై 'ఓమహర్షివర్యా! యాగకర్తలును, దక్షిణావంతులును నగు, పురాణ రాజర్షుల యుత్తమచరిత్రములను వింటిని. అత్యద్భుతముగా నాశోక మడఁగెను. సూర్యతేజమునఁ జీఁకటివలె నాయీదుఃఖ మడఁగినది. పాపరహితుఁడనైతిని. నేనేమిచేయవలయునో తెలుపుము.' అని బదులు పలికెను. అది విని నారదుఁడు 'ఓరాజా! దైవకృపచే నీవు హతశోకుఁడవైతివి. నీకు వలసినవరము గోరికొనుము. నామాట పొల్లువోదు. నీవు కోరినదెల్ల ఫలవత్తరమగును.' అని తెలిపెను. మఱియు సృంజయుఁడు 'ఓమహానీయా! నీ యీవచనముచేఁ బవిత్రుఁడ నైతిని. నీవు నాకుఁ బ్రసన్నుఁడవైతివి. నీవెవ్వనికిఁ బ్రసన్నుఁడ వౌదువో వానికి దుర్లభమైన దేదియుఁ గలుగదుగదా!' అని పలికెను. అది విని నారదుఁడు 'ఓరాజా! దొంగలచే హతుఁడగు నీసుతునిఁ, గష్టనరకమునుండి ప్రోక్షితమగుపశువునువలె మఱలఁ దెచ్చి యిచ్చెదను.' అని పలికెను.

'ఓధర్మజా! ఆనారదుఁ డటులు పలుకునంతనే సృంజయపుత్త్రుఁ డద్భుతముగా నందఁలకు వచ్చెను. అటులు మహర్షి ప్రసాదలబ్ధుఁడైన పుత్త్రుని బడసి యాసృంజయుఁడు పరమప్రీతుఁడై గొప్పదక్షిణలతోఁ బెక్కుయాగము లొనర్చెను. ఆసృంజయపుత్త్రుఁ డకృతార్థుఁడును, భీతుఁడును, నయజ్వుయు, సంతానరహితుఁడును నగుటఁ బునరుజ్జీవితుఁ డయ్యెను. శూరుఁడును, గృతార్థుఁడును నై వేలకొలఁదివైరులఁ దునుమాడి, వీరుఁడై సేనాముఖమున హతుఁడయ్యెను. మఱియుఁ బ్రజ్ఞాశ్రుతములచేతను, బ్రహ్మచర్యముచేతను, గ్రతుశతములచేతను నెట్టిలోకములు లభించునో యట్టియక్షయలోకముల నభిమన్యుఁ డొందిన

వాఁడు. పండితులగువారు పుణ్యకర్మములచే నిత్యము స్వర్గనివాసమును గోరుదురుగాని, స్వర్గముకంటె నీలోక ముత్తమమని వాంఛింపరు. కావున స్వర్గతుఁడగునర్జునసుతుని బ్రతికింపలేము. మనయిష్టమేమియు నొందఁబడదు. వివిక్తధ్యానదర్శనులగు యోగులును, సుత్తమయజ్వలును, దపోనిష్ఠులును బొందునట్టి యుత్తమలోకముల నీతనయుఁ డొందినవాఁడు. మృతినొందియు నమృతమయకిరణములచేఁ జంద్రుఁడువలె నిందుకళారూపమగు తనువు ధరించి యభిమన్యుఁ డెంతయు విరాజిల్లుచున్న వాఁడు. కావున, నాతనికై శోకింపకుము. ఇఁక నాయీవచనముల యర్థ మెఱిఁగి స్థిరచిత్తుఁడవై శత్రుల నోడింపుము. ధైర్యమును వహింపుము. ఓయనఘా! జీవించుచున్న వారినిగుఱించియే మనము విచారింపవలయునుగాని, స్వర్గమునొందినవారినిగూర్చి పరితపింపరాదు. ఓమహారాజా! శోకించినకొలఁది నఘమే పెరుగుచుండును. కావున, శోకము పరిత్యజించి శ్రేయమునకై పండితుఁడు యత్నింపవలయును. ప్రీతి, ప్రహర్షము, ఆనందము, ధైర్యము అనునవి శౌచమనియు, శోకమశౌచమనియుఁ జెప్పఁబడును. ఇది తెలియుము. లెమ్ము. ప్రయత్నింపుము. దుఃఖింపకుము. నిరుపమానతపములును, సర్వభూతసమత్వమును గల్గిననీకు మృత్యువు సంభవమగుటయు, సిరు లస్థిరములగుటయుఁ దెలియనిది గాదు. హతుఁడైనసృంజయసుతుఁడు మఱలి జీవించెనా? లేదా? ఓమహారాజా! ఇదియెల్ల నెఱిఁగి శోకము విడువుము. నేనిదె పోవుచున్నాఁడను.' అని యిటులు పలికి యావ్యాసభగవానుఁ డందే యంతర్ధానమొందెను. అటు లాయుధిష్ఠిరు నోదార్చి భగవానుఁడును, వాగీశుఁడునగు నావ్యాసుఁ డంతర్హితుఁడగుడు. మహేంద్రతుల్య తేజులగుపూర్వపురాజులు న్యాయాధిగతవిత్తములచే నొనర్చినయజ్ఞ సంపదలవిధము విని, వారియం దాదరభావమిడి, తానును శోకరహితుఁడయ్యెను. కాని, యర్జునునితో నేమి చెప్పుటకును దోఁపక దీనుఁడై చింతించుచుండె" నని తెలిపి సంజయుఁడు మఱియు ధృతరాష్ట్రునితో ని ట్లనియె.

## అర్జునుఁడు కోపించుట

"ఓయంబికానందనా! బహుప్రాణిహానికరమై ఘోరమగునాదివసము ముగియ, సూర్యుఁ డస్తమింపఁగా సంధ్యాకాల మయ్యెను.

సైన్యము లన్నియు శిబిరములకుఁ బోయెను. అంత నాకపిధ్వజుఁడును దివ్యాస్త్రములచే సంశప్తకసమూహములను జంపి, తనజైత్రరథ మధిరోహించి నిజశిబిరమునకు వెడలెను. అటులు వెడలిపోవుచు గోవిందునితోఁ గంటనీరువెట్టుచు నిట్లనియె.

'ఓకేశవా ! ఏమో నాహృదయమునకు భీతి వొడముచున్నది. మాట తొట్రువడుచున్నది. అనిష్టములు స్ఫురించుచున్నవి. మేను విలవిలలాడుచున్నది. నాహృదయమున కనిష్ట మొకటి తవిలి తొలఁగింపరాకున్నది. పుడమిని దెసలను నుగ్రములగు నుత్పాతము లగపడి, నా చిత్తమున కుత్తలము పుట్టించుచున్నవి. బహువిధములై యెల్లెడల హానిని సూచించునవియే నాకుఁ జూపట్టుచున్నవి. పూజ్యుఁడగుమాధర్మజునకు సపరివారముగ నపాయమేమియుఁ గలుగఁబోదుగదా?'

అది విని యవ్వనజాక్షుఁడు 'ఓయర్జునా ! సామాత్యుఁడగు నీయన్న కెట్టియపాయము లేదనుట స్పష్టము. నీవు చింతింపకుము. ఏదో కొంచె మనిష్టము గల్గి యుండవచ్చును.' అని బదులు చెప్పెను. ఓరాజా! ఆవీరుల నడంచి వారిరువురును సంధ్యావందన మొనర్చి యుద్ధ చరిత్రమును జెప్పికొనుచు, రథాధిరూఢులై కాంతిహీనమై చింతాక్రాంతమైయున్న నిజశిబిరమును జేరిరి. అటులు రూపుచెడియున్న శిబిరమును గాంచి, పరవీరమారకుఁడగు నర్జునుఁడు మతిచెడి యవ్వాసుదేవునితో 'ఓదేవా! ఈశిబిరమున మున్ను మంగళతూర్యములు వినవచ్చెడివి. అటులే దుందుభిధ్వానములును శంఖారావములును మ్రోగెడివి. ఇపుడన్నియో యవ్వీణాదివాద్యము లెవ్వియును వినరాకున్నవి. మంగళ గీతముల నెవ్వరును బాడకుండిరి. వందులు స్తుతిపాఠములను బఠింపకుండిరి. యోధులును నన్ను గాంచి మొగములువాంచి పోవుచున్నారు. వెనుకటివలెఁ బనులు జరుగుటయు, నన్నభినందించుటయుఁ గానరాకున్నది. ఓమాధవా! నాసోదరులకు నేమమున లోప ముండదుగదా ? ఆకులమైయున్న స్వజనమును గాంచి నాచిత్తము చలించుచున్నది. ఓ యచ్యుతా! విరాటద్రుపదులకును, యోధులకును నపాయ మేమియు సంభవించియుండదుగదా?యుద్ధమునుండివచ్చిన నన్నిపు డాసౌభద్రుఁడు తనసోదరులతోఁగూడి ముద్దులొలుక నగుచు నన్నుఁ జూడరాఁడేమి?' అని ప్రశ్నించెను.

ఓరాజా ! వారిరువురు నిటులు మాటలాడుకొనుచు శిబిరము లోనికిఁ జొచ్చిరి. అపుడు వారి కస్వస్థచిత్తులై పాండవులు గానవచ్చిరి. అపు డాకపిధ్వజుఁడు చింతాక్రాంతులై యున్న తనసోదరులఁ గాంచియు, నభిమన్యుఁ డగపడమి, వారితో 'ఓసోదరులారా ! మీయెల్లరముఖ కాంతి యప్రసన్నమై యున్న దే! అభిమన్యుఁ డగపడఁడేమి? మీర నన్నభినందింపకున్నారేమి? ద్రోణుఁడు పద్మవ్యూహము పన్నెనని విని యున్నాఁడను. అర్భకుఁడగు సౌభద్రుఁడుదక్క నాపద్మవ్యూహమును భేదించువారు మనలో నెవ్వరును లేరుగదా! దానినుండి మఱలుట నేను వాని కుపదేశింపలేదు. ప్రవేశించుటయు మాత్రమే తెలిపితిని. ఆబాలు నావ్యూహమున మీరు ప్రవేశింపఁజేయలేదుగదా ! పరవీరమారకుఁ డగు నాకుమారుఁ డావ్యూహమును జీల్చి యందుఁ జిక్కువడి హతుఁడు గాలేదుగదా ? ఎఱ్ఱజీఱలకనులతో మహాబాహుఁడై కొండలందు జనించినసింగపుఁగొదమనాఁదగి యుపేంద్రతుల్యుఁడైన నాతనయుఁ డారణరంగమున నెట్లు మడిసెనో తెలుపుఁడు? సుభద్రకుఁ బ్రియ పుత్రుఁడై ద్రౌపదికిని గుంతికిని గేశవునకును మిక్కిలి ప్రేమపాత్రుఁ డైన నాతనయు నెవ్వఁడు కాలమోహితుఁడై చంపెను? విక్రమజ్ఞాన మాహాత్మ్యములచే మహాత్ముఁడగు కేశవునకుఁ దుల్యుఁడైన నాపసిబిడ్డఁ డెట్లు మరణించెను? సుభద్రకుఁ బ్రేమపాత్రుఁడై నాచే నెల్లపుడును లాలింపఁబడు నాపుత్రు నిపుడు చూడనేని, యమమందిరమును జూచు వాఁడను. కొంచెము వంచిన కేశాంతమును, బిల్లలేడిచూపులును గలిగి మదగజగమున మెలయఁ, బెరుగుచున్నమద్దిగున్నవలె వెలయుచుఁ, జిఱు నగవుతో మాటలాడుచు, శాంతిపరుఁడును, గురువాక్యకరుఁడునై, బాలుఁడయ్యుఁ, గృత్యముచేఁ బెద్దయై, పరుషవచనమనునదిలేక, మత్స రుఁడుగాక మహోత్సాహుఁడును, మహావీర్యుఁడును, బద్మనేత్రుఁడునై, యాశ్రితపక్షపాతముగల్గి నీచులతోఁగలియక జ్ఞానసంపన్నుఁడై, కృతజ్ఞుఁ డయిన నాసుతుఁ డెక్కడ? యుద్ధాభిలాషియు, వైరిజనభయవర్ధనుఁడును, స్వజనహితుఁడును, బితృజయకాంక్షియునై సంగ్రామమున సంభ్రమ మొందక మున్నుగా వైరులను బ్రహరింపక నీతిపరుఁడై వెలయు నాతనయుఁ డిపు డగపడఁడేని, నేను యమమందిరమున నగపడవలసినదే గాని బ్రదుకఁజాలను. మహారథికులను లెక్కించునపు డందువాఁ డొకఁడై

రణరంగమున నన్ను మించినశౌర్యాదిగుణములుగల చిన్న వయసువాఁడును బాహుబలశాలియుఁ, బ్రద్యుమ్న కేశవులకును నాకును బ్రియుఁడును నగునభిమన్యు నిపుడు చూడనేని, యమాలయమునకుఁ బోవువాఁడను. సునాసికుఁడును, శుభలలాటుఁడును, మంచిబొమలును, జక్కని పలువరుసయు, నెఱ్ఱనిపెదవులునుగలిగిన నాతనయునిఁ గననిచో నాకుఁ జిత్తశాంతి యెట్లు? వీణాతంత్రులస్వనమును, గోకిలారావమునుబోలిన వానిధ్వనిని విననినాకుఁ జిత్తశాంతి యెట్లు? ఆహా! వానిరూప మాదేవత లందును లేదు. అట్టివాఁడు గన్పట్టకున్న నాకు హృదయ మెట్లు కుదుటఁ బడును? వినయవంతుఁడై పితృవచనరతుఁడైనవానిని గానకున్న నా హృదయ మెట్లు కుదుటఁబడును? వీరుఁడయ్యును, నిత్యసుకుమారుఁడై మహార్హశయనములఁ బరుండఁదగియు, ననాథుఁడువలెఁ బుడమి శయనించెనా? శయనించియున్న యెవ్వని మున్ను త్తమ కాంత లుపాసింతురో యట్టివాని నిపుడు పరిభ్రమించుచు, నమంగళములగునక్కలు మూగి లాగుచుండెనా? అయ్యో! మున్ను నిద్రించియున్న నాసూనుని వంది మాగధులు మేలుకొల్పెడివారు. అట్టివాని నిపుడు కుక్కలు వికృత స్వరములతో మేలుకొల్పుచు సేవించెడివా? గొడుగునీడ నుండఁదగిన వానిచక్కనివదనము నేఁడు రణరంగమున రజోరేణువులచేఁ గప్పఁబడి యుండెనా? హా! పుత్రకా! పుత్రదర్శనమునఁ దృప్తిదీఱని భాగ్యహీనుఁడనగు నాకగపడకుండ నిన్నా కాలుఁడు బలాత్కరించి కొంపోయెనా? ఆసంయమని యిపుడే సుకృతులకు గతి యనఁదగియున్నది. నీ మేనికాంతులచే నిపుడది మనోజ్ఞత వహించెను. ప్రియాతిథివగు నిన్నా యముఁడును, వరుణుఁడును, నింద్రుఁడును, గుబేరుఁడును బూజింతురు.' అని బహువిధములఁ బలవించుచు, నోడపగిలినవర్తకుఁడువలె నెంతయు శోకాకులుఁడై తనయన్నంజూచి, 'ఓయగ్రజా! నాకొమరుఁడు సమరమున వైరులతోఁ బోరాడుచు, బహుప్రయత్నములుగల యోధుల నోడించుచు, ననహాయుఁడై సహాయమునకై నన్నుఁ బిలిచి యుండెను గాఁబోలును? కర్ణద్రోణకృపాదులగు యోధులు తీవ్రశరపరంపరలఁ దన్ను నొప్పింప, బలముచెడి 'తండ్రీ! తండ్రీ' యని నన్నుఁ బలుమాఱులు పిలుచుచు, నారక్షణము నపేక్షించెనుగాఁబోలును? అయ్యో! ఇటులు తలంప నేటికి? నాకుఁ గొమరుఁడై మాధవునకు మేనల్లుఁడై సుభ

ద్రకుఁ బుట్టినవానివిషయమున నట్టిదైన్యప్రలాపము లేల? ఆహా! నా హృదయము వజ్రసారమయమై మిక్కిలి దృఢమైయుండెనే! లేనిచో నారక్తాక్షుని, నాదీర్ఘబాహుని జూడకుండియు వ్రయ్యలు గాకుండునా? ఏమీ? ఆయోధులు క్రూరులై, నాపుత్త్రుఁడనియు వాసుదేవుని మేనల్లుఁడనియుఁ బరిగణింపక, యాబాలుని మర్మభేదకములగుశరములఁ బీడింతురా? వైరుల నోడించివచ్చు నన్నుఁ బ్రతిదినము నెదుర్కొనియెడి నా తనయుఁడు నేఁడు నన్నుఁ జూడరాకుండెనేమి? నిశ్చయముగా నతఁడు రక్తసిక్తాంగుఁడై పుడమిఁగూలెను. వానిమేనికాంతులచే మేదిని శోభిల్లుచుండెను గాఁబోలును? యుద్ధపలాయితుఁడుగాని తనతనయుఁ డిటులు హతుఁడై యుండుటను వినినసుభద్రను దలంచిన నాకుఁ శోక మాఁగకున్నది. అది మృతినొందునేమో? అయ్యభిమన్యుఁ డగపడమి నామె నన్నేమి యనునో? దుఃఖార్తయగుద్రౌపది కేమందును? ఇట్లు చెదరకుండిన నాహృదయము వజ్రసారమనక తప్పదు కాదేని రోదన మొనర్చు నాసుదతిని జూచి వేయివ్రయ్యలగును. ఆహా! అపుడు పరమానందభరితులైన ధార్తరాష్ట్రులసింహనాదము నాకు వినవచ్చెను. క్రూరులగునవ్వీరులను నిందించుచున్న యుయుత్సుని యాలాపములు కృష్ణునకు వినవచ్చెను. అపు డాయుయుత్సుఁడు 'ఓమహారథులారా! మీ రసమర్థులయ్యును నప్పార్థపుత్త్రుని బాలునిఁ జంపి, ధర్మరహితులై సిగ్గుపడకున్నా రేమి? అక్కేశవార్జునుల కప్రియ మొనర్చియు, మీకు శోకకాలము సిద్ధమైయుండఁగాఁ, బరమప్రీతితో నిటులు సింహనాదము లొనర్చుచున్నవా రేమి? మీపాపకృత్యమునకు ఫలము వెంటనే గలిగెడిని. అధర్మము తీవ్రమైనపుడు ఫలమున విలంబము గానేరదుసుఁడీ!' అని మహామతియై యావైశ్యాపుత్త్రుఁడు శస్త్రము విడిచి కోపదుఃఖసమన్వితుఁడై యుద్ధమునుండి తొలఁగిపోయెను. కృష్ణా! ఈవిషయ మాయుద్ధసమయమున నేల తెలుపవైతివి? అపుడే క్రూరులగు నవ్వీరుల నెల్ల నాబాణాగ్నిపాలు గావించి యుందునే?' అని పలికెను.

ఓయాంబికేయా! అటులు పుత్రశోకపీడితుఁడై కన్నీరు మున్నీరుగా నేడ్చుచు నేమియో ధ్యానించు నప్పార్థునిఁ బట్టికొని యవ్వాసుదేవుఁడు 'ఓయర్జునా! యుద్ధమునఁ బలాయితులుగాని శూరుల కెల్ల నిదియె మార్గము. ఎవ్వరు యుద్ధజీవికగల్గి క్షత్త్రియు లనఁబడుదురో

వారికి విశేషించినమార్గ మిది. ఓవివేకనిధీ! శూరులై యుద్ధమున వెను దీయక పోరాడువారి కిది ధర్మశాస్త్రజ్ఞులచే నిర్ణయింపఁబడినపద్ధతి. జడియక యుద్ధమొనరించువారికి మరణము తప్పదు. అభిమన్యుఁడు పుణ్యకర్తలలోకముల కేగినవాఁడు. అందు సందియము లేదు. ఓభరతకుల సత్తమా! ఉత్తమవీరుల కిది గోరఁదగినదియే. సంగ్రామమున వెనుదీయక మరణింపవలయును. నీతనయుఁడు వీరుఁడై మహాబలులగు రాజపుత్రులను దునుమాడి, వీరులచేఁ గోరఁదగిన యుద్ధమరణమొందెను. ఓపురుష వ్యాఘ్రా! శోకింపకుము. ఇది సనాతనధర్మము. ధర్మకర్తలు క్షత్రియులకు యుద్ధమరణమే శ్రేయమని నిర్ణయించిరి. ఓభరతసత్తమా! దీనులై యున్న యీనీసోదరులఁ జూడుము. నీవు శోకాకులుఁడవై యుండుట నీభూపతులును మిత్రులును దైన్యపడుచున్నారు. వీరిని మంచిమాటలచే నూఱడింపుము. తెలియఁదగినదెల్లఁ దెలిసినవాఁడవు. కావున శోకింపరాదు. అని యద్భుతకర్ముఁడగు శ్రీకృష్ణునిచేఁ బార్థుఁ డూఱడింపఁబడి గద్గదస్వరములతోఁగూడిన తనసోదరులనెల్లఁ జూచి, 'ఓసోదరులారా! దీర్ఘబాహుఁడును, దీర్ఘ రాజీవలోచనుఁడునునగు నభిమన్యునివృత్త మెట్టులయ్యెనో తెలుపుఁడు. దానిని వినఁగోరుచున్నవాఁడను. నాకొమరునిఁ జంపినయప్పాపులు తప్ప కిపుడే నాచే హతములగు గజాశ్వరథ పదాతిసమూహములను జూడఁగలరు. నాపుత్రునకు వైరులగువారినెల్ల వారివారిసంబంధులతోఁ గూడఁ బరిమార్చువాఁడను. శస్త్రపాణులై కృతాస్త్రులగుమీ రెల్లరును గాపాడుచుండ నావజ్రపాణియుఁ దేటి చూడఁజాలఁడుగదా! అభిమన్యుఁ డెట్లు మృతినొందెనో? అయ్యో! తెలియకపోయితిని. ఇటులు పాండుపాంచాలురు నాపుత్రునిఁ గాపాఁడఁజాలరని తెలిసియుందునేని నేను గాపాడుకొనకుందునా? మీరు రథస్థులై శరవర్షమును గురియుచుండఁగా వైరులాయభిమన్యు నెట్లు వధింపగల్గిరి? ఆహా! మీకుఁ బౌరుషము లేదు. పరాక్రమము శూన్యము. లేనిచో మీరు చూచుచుండఁగా నభిమన్యుఁడు సమరమునఁ బడునా? బలహీనులును, భయశీలులును, నకృతనిశ్చయులునగు మిమ్ము నమ్మి వెడలితిని. ఛీ! ఛీ! నన్ను నేను నిందించికొనవలసినదేగాని మిమ్మనఁ బనియేమి? మీ కీకవచశస్త్రాదులు భూషణములకుఁగా నున్నవి గాఁబోలును? నాపుత్రుని రక్షింపలేని మీ కివి సభలలోఁ జెప్పికొనుటకేగాని

వీనివలనఁ బ్రయోజనము లేదు.' అని పలుకుచు నిలువఁబడినయాతని నం దెవ్వఁడును దేఱిచూడఁజాలకుండెను. మఱియు నంతకుఁడువలెఁ గుపితుఁడై మఱిమఱియు నిట్టూర్పులిడుచుఁ బుత్రశోకాభితప్తుఁడై కన్నీరు కాల్వలుగట్ట దుఃఖించు నాయర్జునునితో సంభాషించుటకును, నాతనిఁ జూచుటకును మిత్రులలో నెవ్వరును జాలకుండిరి. కాని, సర్వావస్థలందును హితులై యాతనిచిత్త మెఱిగిన వాసుదేవయుధిష్ఠిరులు మాత్రము తమయం దాతనికగు గౌరవమునుబట్టియుఁ బ్రేమను బట్టియు నపుడు పలుకువారై యుండిరి. అందు యుధిష్ఠిరుఁ డటులు పుత్రశోకపీడితుఁడై కుపితుఁడై యున్న యప్పార్థునితో నిట్టు లనియెను.

అర్జునుఁడు సైంధవునిఁ జంపెదనని ప్రతిన సేయుట

'ఓయర్జునా! నీవటు లాసంశప్తకబలమును బొలియింపఁబోయిన వెంటనే యాచార్యుఁడు నన్నుఁ బట్టుకొన నెంతయు యత్నించెను. అపుడు మేమెల్లర మెల్లవిధముల నాయాచార్యుని వారించితిమి. అటులు రథానీకముతోఁ బ్రతివ్యూహ మొనర్చిన మాచే వారింపఁబడి యాతఁడు నన్నేమియుఁ జేయఁజాలక మమ్మెల్లఁ దీవ్రనారాచములఁ బీడించెను. అటులు పీడించు నాతనిఁ జూడనైనఁజాలని మే మాపద్మవ్యూహము నెట్లు భేదింతుము ? అపుడు మేమెల్లర మానిరుపమావీర్యుఁడగు తనయుని సౌభద్రునిఁ గాంచి 'ఓనాయనా! నీ వీవ్యూహమును భేదింపుము.' అని పలికితిమి. అతఁ డందులకు సమ్మతించి, మంచిగుఱ్ఱమువలె సహింపరానియాభారమును మోయఁబూనికొనియెను. వాఁడు నీయుపదేశ మొందినవాఁడగుటఁ బ్రవేశించుట నెఱిఁగి, పరాక్రమాన్వితుఁడై బాలుఁడయ్యు గరుడుఁడు సాగరమునుబోలె నావ్యూహమునఁ బ్రవేశించెను. అపు డాసుభద్రాతనయుని మేమెల్లరము ననుసరించి వెడలి ప్రవేశింపఁజూచి యాతని వెంబడించితిమి. ఓతమ్ముఁడా! అపు డానీచుఁడగుసైంధవుఁడు తనకు రుద్రుఁడొసంగినవరము ప్రభావముచే మమ్ముఁ బోనీక యచ్చో నివారించెను. అపుడు ద్రోణుఁడును, కృపుఁడును, కర్ణుఁడును, ద్రౌణియు, బృహద్బలుఁడును, కృతవర్మయుఁడును వానిని జుట్టుకొనిరి. అటు లాయార్వురురథికులునునాబాలు నొక్కుమ్మడిఁ జుట్టి పోరాడ నెంతయేని యత్న మొనరించియుఁ దుదికి విరథుఁ డొనర్పఁబడి

యెను. పిదప నటులు విరథుఁడైన యభిమన్యునిఁ జేర సంశయమొంది యును, దైవవశముగా దుశ్శాసనపుత్త్రుఁ డెదుర్కొనియెను. అప్ప డతఁడు గజాశ్వరథపదాతులను నెనిమిదివేలను, దొమ్మిదివేవురురథికులను, వందలకొలంది యేనుఁగులను, బెక్కువీరులను జంపి, బృహద్బలుని రూపు మాపి, తుది కాదుశ్శాసనతనయునిచే నంత మొందింపఁబడియెను. మాకు శోకము నాపాదించు నిదియే జరిగినవిషయము. అతఁ డీవిధముగా స్వర్గ మునకుఁ బోయెను.'

అటు లాయుధిష్ఠిరుఁడు తెలిపినవచనములు విని యప్పార్థుఁడు 'హా! పుత్త్రా!' అని నిట్టూర్పువుచ్చుచు శోకాకులుఁడై నేలఁ గూలెను. అంత నయ్యుధిష్ఠిరాదు లెల్లరును విషణ్ణవదనులై యాతనిచుట్టును జేరి తెప్పపాటులేక చూచుచు దీనులై యొకరినొకరు గాంచుచుండిరి. అంత నతఁడు కొంతవడికిఁ దెలివొంది క్రోధావేశపరవశుఁడై జ్వరము చేనలె నొడలు కంపింప మఱిమఱియు నిట్టూర్పులు పుచ్చుచుఁ జేతులు నులిపికొనుచుఁ గంట నీరిడి దీర్ఘనిశ్వాసమొదవ వెఱ్ఱివాఁడునా నలు గడలఁ గాంచుచు నిట్లు పలికెను.

'ఓసోదరులారా! క్షత్త్రియోత్తములారా! నిశ్చయముగా రేపు సైంధవుని వధించెదనని యిదే ప్రతిన చేయుచున్నవాఁడను. వాఁడు మరణభీతిచే ధార్తరాష్ట్రులను విడిచి పోకుండవలెను. లేదా! వాఁడు మమ్ముఁగాని, యివ్వాసుదేవునిఁగాని, యుధిష్ఠిరునిఁగాని శరణమంద కుండవలయును. ఇపుడు నాచెప్పినచొప్పుగాక వాఁడు రణరంగమునకు వచ్చెనా! వాఁడు చచ్చెను. ధార్తరాష్ట్రులకుఁ బ్రియమొనర్ప నాయెడఁ గలమైత్త్రిని మఱచి పాపుఁడై నాపాపనివధమునకు నిమిత్తమైనయా సైంధవుని రేపు తప్పక చంపెదను. వానిని రక్షించువారై యెవ్వరేని నాతోఁ బోరుదురేని, ద్రోణుఁడేగాని, కృపుఁడేగాని వారిని నాశరపరం పరలఁ గప్పకమానను. ఓవీరోత్తములారా! నా యీ చెప్పినచొప్పునఁ జేయఁజాలకుందునేని పుణ్యకర్తలలోకములకుఁ దప్పినవాఁడ నగుదును. మఱియు వినుఁడు. మాతృహంతలును, పితృఘాతకులును, గురుదార సక్తులును, గొండెకాండ్రును, సజ్జనులపై నసూయచెందువారును, వితండవాద మొనర్చువారును, దాఁచికొనినధనము దోఁచికొనినవారును, విశ్వాసఘాతకులును, భర్తకంటె మున్నుగా భుజించినకాంతలును, బర

నిందాపరులును, నపకీర్తికరులును, బ్రాహ్మణఘాతకులును, గోహంతకులును, బాయసాపూపాదుల నొకరికిఁగాక తమకు మాత్రమె వండికొని భుజించువారును నేయేలోకములకుఁ బోవుదురో, వారిగతికిఁ బోవుదును. వారి కెట్టిగతిగల్గునో సైంధవుని నేనుజంపజాలనేని, నాకట్టిగతి గల్గును. మఱియు వేదాధ్యయనపరుని, వ్రతనిష్ఠుని, వృద్ధుని, సాధుని,గురుని నవమానించువారికిని గోవులను, బ్రాహ్మణులను, బాదముచే స్పృశించువారికిని, నీటను మలమూత్రశ్లేష్మాదులను విడుచువారికిని గల్గుకష్టగతులు సైంధవునిఁ జంపనేని, నాకుఁ దప్ప కగును. మఱియు నేను సైంధవునిఁ జంపఁజాలనేని, వస్త్రహీనుఁడై స్నానముచేయువానికిని, నతిథికి లేదన్న వానికిని, లంచము పుచ్చుకొనువానికిని, నసత్యవాదికిని, వంచకునకునునగు దుర్గతి నొందుదును. అటులే భృత్యులకును, దారపుత్రాశ్రితులకును బెట్టక వారు చూచుచుండఁగాఁ దినుక్షుద్రబుద్ధులకును, దనమాటలో మెలఁగు నాశ్రితునిఁ బరిత్యజించి, వానికన్నము పెట్టనివానికిని, నుపకారిని నిందించువానికిని, పాత్రుఁడైనపొరుగు వానికి శ్రాద్ధదానమొసంగనివానికిని, ననర్హునకు దానమొనర్చువానికిని, శూద్రాంగనాసక్తునకును,మద్యము త్రాగువానికిని, మేరమీఱినవానికిని, కృతఘ్నునకును, సోదరులను మోసపెట్టువానికిని నేయేదుర్గతులుగల్గునో జయద్రథునిఁ జంపనేని నాకట్టిగతులు గల్గును. ఇంకను నేనుజెప్పని మఱికొందఱు ధర్మమార్గదూరులకగు మార్గమును, బైనిదెలిపినవారికగుదుర్గతియు నేను సైంధవునిఁ జంపనేని, నాకుఁ దప్పకగును. మఱియు నొకప్రతిజ్ఞ చేయుచున్నవాఁడను. వినుఁడు. 'ఈరాత్రి గడచినవెంటనే తేపు సైంధవునిఁ జంపెదను. వీఁడు నాచేఁ జావకుండఁగనే సూర్యుఁడస్తమించునేని యందే యగ్నిప్రవేశ మొనర్చువాఁడను. మఱియు సురాసురమానవులుగాని, పక్షులుగాని, యురగులుగాని, పితరులుగాని రక్కసులుగాని, బ్రహ్మర్షులుగాని, దేవర్షులుగాని, చరాచరములందెయ్యదిగాని, వానికిఁ బరమైనదిగాని, యేదియైన నిపుడు నావైరిని రక్షింపఁజాలదు. ఆసైంధవుఁడు పాతాళముచొరనీ, లేక యాకసమునకెగఁబ్రాకనీ, స్వర్గమునకుఁబోనీ, రక్కసులయిక్కచేరనీ, యేదియెటులైనఁగానీ, నే నాయభిమన్యువైరిశిరము తేపు సంహరించువాఁడను.' అని పలికి యతఁడు తనగాండీవమును సవ్యదక్షిణముగా విక్షేపించెను.

దానిచప్పుడు మిన్నుముట్టెను. అంత నతఁడటులు ప్రతిజ్ఞ చేయుఁడు, జనార్దనుఁడు పాంచజన్యమును బూరించెను. అర్జునుఁడును తనదేవదత్తము నూఁదెను. అంత నవ్వాసుదేవుని ముఖవాయుపూరితమై వెడలిన యప్పాంచజన్యధ్వని లోకమెల్లెడల నిండి, పాతాళముఁ జొచ్చి, మిన్నుముట్టి దెసలకరిగి, యుగాంతమునందువలె జగములకు వడంకు పుట్టించెను. పిదప వేలకొలఁది వాదిత్రములు మ్రోగింపఁబడెను. పాండవులలో సింహనాదములును విజృంభించెను." అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

## ద్రోణుఁడు సైంధవు నోదార్చుట

"ఓధృతరాష్ట్రా! జయాభిలాషులగు పాండవులకుహాశబ్దమును జారులు తెలుపఁగా విని సైంధవుఁ డుత్థితుఁడై, శోకముచే మతిచెడి యగాధమగు దుఃఖసాగరమున మునుఁగుచున్నవాఁడువలె బహువిధములవిమర్శించికొనుచు రాజసమూహమును జేరి, వారికడ మొఱపెట్టుచు నర్జునునకు జడిసినవాఁడగుట బిడియమడర ని ట్లనియె.

'ఆహా! వీరులారా! వింటిరే? పాండునిక్షేత్రమున శక్రునకు జనించిన యీయభిమన్యుజనకుఁడు దుర్మతియై నన్ను వధింపఁ బ్రతినఁ జేసినవాఁడఁట. కావున నాప్రాణము గాపాడుకొనుటకై నిజగృహమునకుఁ బోయెదను. మీకు జయమగుఁగాక. అటులు కాదందురేని క్షత్త్రియపుంగవులగుమీరు మీమీయస్త్రబలములను జూపి నన్నుఁ గాపాడుఁడు. ఓవీరులారా! పార్థునివలన నాకభయము నొసంగ వేఁడితిని. శరణమొసఁగుఁడు. ఓద్రోణదుర్యోధనకృపకర్ణమద్రేశబాహ్లీకులారా! ఓదుశ్శాసనాదులారా! అంతకపీడితుఁడగువానినినైతముఁ గాపాడఁదగు బలాఢ్యులు. ఒకఫాల్గునుఁడు చంపుదునన్నంతమాత్రమున మీరు వెనుదీయుదురా? క్షితిపతులగుమీరెల్లరును నన్ను రక్షింప కుపేక్షింతురేని నాకిఁక దిక్కేది? పాండవులప్రహర్షమును విని జడియుచున్నవాఁడను. ఓరాజులారా! చావనున్నవానికివలె నాయవయవము లన్నియు వడఁకుచున్నవి. గాండివధరుఁడు నన్ను నిక్కముగా వధింతునని ప్రతినచేసినవాఁడు. తమకు దుఃఖకాలమయ్యును బాండవులు పరమహర్షముచే నఱచుచున్నవారఁట. ఈవిషయమున దేవాసురగంధర్వరాక్షసోరగులు

గాని, యింకెవ్వరుగాని వేఱొకవిధముగా నొనర్ప ననర్హులుగదా! మానవాధీశులమాట చెప్పు టేల? కావున నా యీవిన్నపము మన్నింపుఁడు. మీకు భద్రమగుఁగాక. నన్నుఁ బాండవులు చూడకుండురేని వారికంటఁ బడకుండ నిపుడే యెందులకే నేఁగువాఁడను?

అటులు వ్యాకులమానసుఁడై విలపించునాతనిఁ జూచి నిజకార్యగౌరవమునుబట్టి దుర్యోధనుఁ డాతనితో 'ఓయీ! జడియకుము. క్షత్రియవీరులనడుమ నున్న నిన్నెవ్వఁడు యుద్ధమున మార్కొనఁగలఁడు? నేనును, గర్ణుఁడును, జిత్రసేనవివింశతులును, భూరిశ్రవుఁడును, శలుఁడు, శల్యుఁడు, వృషసేనుఁడు, పురుమిత్రుఁడు, జయుఁడు, భోజుఁడు, కాంభోజుఁడు, సత్యవ్రతుఁడు, వికర్ణుఁడు, దుర్ముఖుఁడు, దుశ్శాసనుఁడు, కలింగుఁడు, విందానువిందులును, ద్రోణుఁడును, ద్రౌణియు, శకుని, యింకను గలనానాదేశాధీశులును సైన్యములతో వారి నెదుర్కొందుము. కావున నీమానసజ్వరమును విడువుము. ఓయమేయ విక్రమా! నీవును రథికోత్తముఁడవును శూరుఁడవు నైనవాఁడవు. ఓ సైంధవా! ఇట్టి నీకాపాండవులనుండి బెగ్గిలనేటికి? పదునొకొండక్షౌహిణులు నీరక్షణమునకు దక్షములై బహుప్రయత్నముతో యుద్ధము చేయునుగదా! నీకు భయమేల? నీజడుపుడుగుఁగాక.' అని పలికెను.

ఓయాంబికేయా! నీపుత్త్రుఁడగుసుయోధనుఁ డిటు లోదార్ప, నాసైంధవుఁ డాతనితోఁగూడి యారాత్రి ద్రోణునిశిబిరమున కరుదెంచి, యాతనిపాదములపైఁబడి మ్రొక్కి చేరువఁగూరుచుండి 'ఓయాచార్యా! లక్ష్యభేదనమందును, దూరప్రసారణమందును, శరలాఘవమందును, దృఢప్రహారమందును, నాకును నర్జుననకును గలతారతమ్యము నెఱిఁగింపుము. మఱియు విద్యావిశేషమునందును నాకును నర్జుననకును గల భేదమును నీవలన నెఱుంగఁ గోరుచున్నాఁడను. యథార్థ మెఱిఁగింపుము.' అని ప్రశ్నించెను. అది విని యాద్రోణుఁడు 'ఓసైంధవా! నీకును, నాయర్జుననకును విద్యాభ్యాసక్రమము సమమైనదియే. కాని యభ్యాసపాటవమునుబట్టియు, దృఢప్రహారమునుబట్టియు నర్జునుఁడు నీకన్న మిన్నయనక తప్పదు. అయినను నప్పార్థునుండి నీవు జడియ నక్కఱలేదు. ఓనాయనా! నీ యీభయమునుండి రక్షించువాఁడను నేను. ఇందు సందియము లేదు. మద్బాహుపరిరక్షితుఁ డగువాని నా

యమరులును దేఱిచూడఁజాలరు. పార్థుఁడుసైతము దాఁటరానివ్యూహ మొకటి నేను జేపు పన్నువాఁడను. కావున నిజధర్మముఁను విడువక యుద్ధమొనర్పుము. జడియకుము. ఓమహారథా! పితృపితామహుల నుండియు వచ్చునట్టిమార్గము ననుసరింపుము. నీవు శాస్త్రీయముగా వేదాధ్యయన మొనర్చితివి. యాగము లాచరించితివి. నీకు మృత్యువు వలన భయ మేటికి? మంద లగుమానవులకు దుర్లభమగుమహాభాగ్య మందియు, భుజవీర్యార్జితములై దివ్యములై సర్వోత్తమము లగులోక ముల నీ వేల యొందరాదు? కురువులును, పాండవులును, వృష్ణులును, నింకనుగలమానవు లనేకులును, నేనును, నాతనయుఁడును, నస్థిరుల మని యూహింపుము. మేమెల్లరమును బలిష్ఠమగుకాలముచే నొకరితరువాత నొకరు హతులమై నిజకర్మములతోఁగూడి పరలోకమున కేగువారమే యని తలంపుము. తపోధను లుత్తమతప మొనర్చి యేలోకముల నొందుదురో, క్షత్త్రియధర్మాశ్రితులగువీరులును నాయుత్తమలోకముల నందుదురు.' అని యోదార్ప, నాసైంధవుఁడును బార్థువలన భయముదీఱి యుద్ధోత్సాహము గలవాఁడయ్యెను. ఓరాజా! అపుడు మనసైన్యము లందు హర్ష మొదవ సింహనాదములధ్వానముతో వాదిత్రముల నినాదములు మెండై సిండెను." అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

## కృష్ణుఁ డర్జునునితో సంభాషించుట

"ఓరాజా! అపు డటులు పార్థుఁ డాసైంధవుని వధింపఁ బ్రతిన యొనర్ప వాసుదేవుఁ డాధనంజయు నారసి 'ఓయర్జునా! నీసోదరుల మత మెఱుఁగక నీవిట్లు సైంధవుని జేపు సంహరించువాఁడ నని ప్రతిజ్ఞ చేసితివి. ఇది సాహసము కాకపోదు. నాతో నీ వాలోచింపకయే యీ కష్టతరమగుకార్యమున కుద్యుక్తుఁడవైతివి. ఎల్లవారికిని మన మెట్లు పరిహాసపాత్రులము గాకుందుము? సుయోధనునిశిబిరమునకు నేను జారుల నంపితిని. ఆచారు లిపుడే వచ్చి యుందలివృత్తాంతమును నాకెఱిఁగించిరి. నీవటు లాసైంధవునివధము ప్రతిజ్ఞచేసియుండుట మనవా రొనర్చిన సింహనాదములఁబట్టియు, వాదిత్రనాదములఁబట్టియు వారికిఁ దెలిసియుండును. ఆశబ్దమును ధార్తరాష్ట్రులు బంధుసహితముగా విని, యశ

స్తాత్తుగా సింహనాదము లేమని వారు తలంచిరి. ఓయీ! ఆకౌరవుల చోటను గొప్పసింహనాదములు వినవచ్చెను. వారు నీవొనర్చినసైంధవ వధప్రతిజ్ఞకు జడిసి కోపముచే నర్జునుఁ డీరాత్రియే వెడలునని తలంచి యున్నవారు. అటు లగుట వా రెంతయుఁ బ్రయత్నము గల్గియుండుట నిజము. నీయొనర్చినప్రతిజ్ఞకు వారు కలుషితాంతరంగులై జడిసిన క్రుక్కిడిమృగములునా సుండిరి. అంత నాజయద్రథుఁడును దనయమాత్యులతో వెడలి తనకు మేలగుమార్గములను జింతించుచు, నారాజ సభలో సుయోధనునితో, 'ఓరాజా! నేను వానిపుత్త్రునిఁ జంపుటకు హేతుభూతుఁడనైతినని నన్ను సేనామధ్యమునఁ జంపెదనని పార్థుఁడు ప్రతిజ్ఞ చేసినవాఁడఁట. ఆసవ్యసాచిప్రతిజ్ఞను వేఱొకవిధముగా నొనర్ప నాసురాసురగరుడగంధర్వరాక్షసులునైతము సమర్థులై యుత్సహింపఁ జాలరు. కావున మీరు సంగ్రామమున నన్ను రక్షింపవలయును. ధనంజయుఁడు మీతలపైఁ బదమిడకుండునట్లు ప్రయత్నము లొనర్పవలయును. ఓకౌరవేశ్వరా! న న్నీసంగ్రామమున రక్షింపఁజాలరేనిఁ దెలుపుఁడు. నేనొకవిధాన మూహించితిని. దాని నిపుడు మీరంగీకరింపుఁడు. నేను నాగృహమునకుఁ బోవువాఁడను.' అని పలుక నాసైంధవునివచనములు విని యధోముఖుఁడై చిత్తవైకల్యము దోఁప సుయోధనుఁడు సైంధవుఁ డొనర్చినప్రతిజ్ఞనే చింతించుచుండెను. అంత నాసైంధవుఁ డటు లార్తుఁడైయున్న సుయోధనుతో మృదువుగను, నాత్మహితముగను, సాపేక్షముగను నిట్లు పలికెను.

'ఓరాజా! మీలో నర్జునునియట్టివీర్యశాలిని ధనుర్ధరుని నేను జూడలేదు. ఆపార్థునస్త్రమును నస్త్రముచేఁ బ్రతిహతియొనర్చువాఁ డెవఁడు? వాసుదేవసహాయుఁడై గాండీవమును ద్రిప్పు నాయర్జును నెదుట నాయింద్రునంతటివాఁడైనను నిలువఁజాలఁడు. మున్నామహేశ్వరుఁడును బార్థున కోడెనని వినియున్నదియేగదా! అపు డాతఁడు పదాతియై హిమవత్పర్వతమున నాతని జయించినవాఁడు. మఱియు హిరణ్యపుర వాసులగు దానవులవేవురను వాసవప్రేరితుఁడై యొకరథముతోడనే రూపుమాపినవాఁడు. ఇపు డావాసుదేవునిఁగూడినపార్థుఁడు, దేవతలతోఁగూడినమూఁడులోకములవారిని జయింపఁగల్గునని నానిశ్చయము.

నా కొకకోర్కి గలదు. మహాత్ముఁడును, వీరుఁడును నగుద్రోణుఁడును, ద్రోణపుత్త్రుఁడును నన్ను రక్షించుట కనుజ్ఞ నొసంగుము.'

ఈవిషయమున సుయోధనుఁ డాచార్యునిఁ బ్రార్థించెను. అంత నందులకుఁ దగుసంవిధాన మేర్పఱుపఁబడియెను. రథాశ్వాదులు సన్నద్ధ పఱుపఁబడియెను. కర్ణుఁడును, భూరిశ్రవుఁడును, ద్రోణపుత్త్రుఁడును, కృపుఁడు, శల్యుఁడు, వృషసేనుఁడు ననెడియార్వురు నాసైంధవుని ముందుండిరి. ద్రోణుఁడు శకటపద్మ కార్ధవ్యూహమును బన్నెను. పద్మకర్ణిక మధ్యమున సూచీపార్శ్వమున నాసైంధవుఁ డునుపఁబడియెను. రణగర్వితుఁడగు సైంధవుఁడు వీరులచే రక్షితుఁడై యుండ నియమింపఁబడెను. ఓపార్థా! ఈయార్వురురథికులును ధనురస్త్రబలపరాక్రమములందు నిరుపమానులై సహింపరానివారగుట నిశ్చయము. వీరినెల్ల జయింపక జయద్రథుఁడు మనకు లభింపఁడు. వారార్వురిలో నొక్కొకనిపరాక్రమమే నీవు చింతింపుము. వారెల్లరు నిటు లొక్కటై యుండ వారిని వడిగా జయించుట సుకరముగాదు. కావున నాలోచనాపరులగు మంత్రులతోడను మిత్రులతోడను గూడి మనకార్యసిద్ధికిఁ దగునీతి నాత్మహితముగా మఱల నూహించుకొనవలసియున్నది.' అని కృష్ణుఁడు పలుక విని యర్జునుఁడు మఱియు ని ట్లనియె.

అర్జునుఁడు నిజసామర్థ్యమును దెలిసికొనుట

'ఓవాసుదేవా! ఆధార్తరాష్ట్రులరథికు లార్వురును బలాధికులని నీవు తలఁచుచున్నాఁడవుగదా! అటు లీవెవ్వారిని భావించితివో వారు నాపరాక్రమమున సగముపాలు గల్గియుండరని నానిశ్చయము. ఓ మధుసూదనా! సైంధవవధాభిలాషినగు నాయస్త్రము నీ తెలిపిన వీరులు చూచుచుండఁగా వారియస్త్రములను ఛేదించును. సపరివారముగా విలపించు నాసైంధవునిశిర మాద్రోణుఁ డారయుచుండఁగాఁ బుడమిఁ బడఁద్రోయువాఁడను. ఓవాసుదేవా! సాధ్యులును, రుద్రులును, వసువులు, నశ్వినులు, మరుత్తులు, నింద్రుఁడు, విశ్వేదేవులు, పితరులు, గంధర్వులు, సుపర్ణులు, సాగరములు, పర్వతములు, పుడమి, ఆకసము, దిక్కులు, దిగీశులు, గ్రామ్యారణ్యభూతములు, చరాచరములు నాసైంధవుని రక్షింతురుగాక, అటులైనను నాశరపరంపరలచే

నాసైంధవుని రేపు రూపుమాపెదను. నీవే గాంతువు. మఱియు నిజముగా నేనొకయొట్టుపెట్టుకొని నాయాయుధము నిదె ముట్టుకొనుచున్నాఁడను. దుర్మతియగు నాపాపాత్మున కెవ్వఁడు రక్షకుఁడై యుండునో యాద్రోణునే ముందుగా నెదుర్కొందును. ఆసుయోధనుఁ డాద్రోణునిచే నీద్యూతమునియతమై యుండుటను, వానిసేనాగ్రమును భేదించియే సైంధవునిపైకిఁ బోవుదును. ఓమాధవా! రేపు తీవ్రములగు నారాచములచే, వజ్రముచేఁ బర్వతశిఖరములునా వ్రయ్యలగుచున్న కౌరవవీరులఁ గాంతువు గాక. నావాఁడికోలలచేఁ బడుచున్నట్టియుఁ బడినట్టియు నరనాగాశ్వముల మేనులనుండి రక్తము స్రవించును. నాగాండివమునుండి వెడలునారాచములు మనోవాయుతుల్యవేగములై గజరథాశ్వాదులను దేహప్రాణశూన్యములఁగా నొనర్పకమానవు. నేఁటియుద్ధమున యమకుబేరవరుణేంద్రరుద్రులనుండి నేను సంగ్రహించినయస్త్రములను ఘోరముగాఁ గౌరవవీరు లారయకమానరు. సైంధవరక్షకులగు నక్కౌరవవీరుల యస్త్రములన్నియు బ్రహ్మాస్త్రముచే హతములగుట నీవే చూతువు. ఓకేశవా! రేఁపటియుద్ధమున నాశరపరంపరలచేఁ దెగినరాజులమూర్ధములచేఁ బుడమి యెల్లెడల వ్యాపించుట నీవే గాంతువు. శాత్రవులను బాఱఁద్రోలుదును. మాంసాహారులకుఁ దృప్తి గల్గించెదను. మిత్రులను సంతసింపఁజేసెదను. సైంధవుని వధించెదను. గొప్పతప్పుజేసి నాసంబంధమును జూడనిపాపాత్ముఁడగుసైంధవుఁడు నాచే హతుఁడై తనవారికి శోకముగల్గింపకమానఁడు. మఱియు క్షీరాన్నభోక్తయై పాపాచారుఁడగుసైంధవుఁడు సపరివారముగా రేఁపటియుద్ధరంగమున నాచే మడియుట నీవు చూడఁగలవు. ఓకృష్ణా! ఇంతయేల! సుయోధనుఁడు 'అర్జుననంతటి ధనుర్ధరుఁడు లోకమున వేఱొకఁడు లేఁడని యెట్లు తలంచునో యటులు రేఁపటియుద్ధమున నొనర్చువాఁడను. ఓహృషీకేశా! ధనువా! గాండివము, యోధుఁడనా! నేను, సారథివా! నీవు, నాకపజయ మెట్లు? ఓభగవానుఁడా! నీదయగలదేని నాచే లభింపని దేది? శత్రుల కజేయుఁడనని యెఱిఁగియు నన్నిటు లేల నిందింతువు? చంద్రునందు శోభయు, సంద్రమునందు జలమును నెట్లు స్థిరమై సత్యమైనదో, యటులే నాప్రతిజ్ఞయు స్థిరమై సత్యమైనదని తెలియుము. ఓజనార్దనా! నాయస్త్రముల నిందింప

కుము. దృఢమగు నాగాండివము నవమానింపకుము. నాబాహుబలమును దిరస్కరింపకుము. ధనంజయునిఁ దక్కువ సేయకుము. సంగ్రామమునకుఁ బోవుదును. జయింతును. పరాజయ మొందను. నా యీసత్యప్రతిజ్ఞచే సైంధవుఁడు చచ్చెనని తెలియుము. బ్రాహ్మణునందు సత్యము, సాధుల యందు వినయము, యజ్ఞములందు లక్ష్మియు, నారాయణునందు జయము స్థిరములైనవి' అని తెలిపి యతఁడు తన్నుఁదాను బ్రకటించుకొని, మఱియు నాతనితో 'కృష్ణా! ఱేపు తెల్లవాఱగనే రథోత్తమ మెటులు కల్పింతువో యటులే నాప్రతిజ్ఞయు నిర్వర్తింపఁబడున ట్లొనర్తువు గాక' అని పలికె" నని సంజయుఁడు మఱియు ని ట్లనియె.

కృష్ణుఁడు సుభద్ర నూఱడించుట

"ఓయాంబికేయా! అవ్వాసుదేవార్జునులు దుఃఖార్తులై సర్పములువలె రొజుచు నారాత్రి నిద్రలేకయే యెటులో గడపిరి. అటులానరనారాయణులు కుపితులగుటఁ దెలిసి యింద్రాదిదేవతలును దుఃఖితులై యిది యెటులగునో యని చింతింపఁదొడఁగిరి. అపు డతిదారుణములైన ఘోరవాతములు వీవఁదొడఁగెను! అటులే సూర్యునందు మొండెముతోఁ బరివేషము గానవచ్చెను. మేఘము లేకయే యుఱుములు మెఱుపులుగలిగి, పిడుగులుపడఁజొచ్చెను. శైలవనకాననములతోఁ బుడమియు వడంకసాగెను. ఓమహారాజా! మకరాలయములగు సాగరములెల్లఁ గలఁతనొందెను. నదులన్నియు సముద్రమునకుఁ బ్రతికూలముగాఁ బ్రవహింప నారంభించెను. మాంసాహారులగుపక్షులు మున్నగువానికి మోదమగునట్లును, యమరాష్ట్రము వృద్ధినొందునట్లును, నరనాగాశ్వాదుల ప్రవృత్తి హీనమైయుండెను. గజాశ్వాదివాహనములు మలమూత్రములను విడుచుచుఁ, గన్నుల నీరువెట్టసాగెను. గగురుపాటొదవించుదారుణములగు నాయుత్పాతములనెల్లఁ గాంచి నీసైనికులెల్లరును దుఃఖితులై యుండిరి. మహాబలుఁడగు నాసవ్యసాచి దృఢప్రతిజ్ఞ మనవారి కెంతయు జంకుగల్గించెను. పిదప మహాబాహుఁడగు నాయర్జునుఁడు, కృష్ణునితో 'ఓదేవా! కోడలితోఁగూడి పరితపించు నీ చెలియలగు సుభద్ర నూఱడింపుము. మఱియు నామె కోడండ్రను జెలికత్తియలును నోదార్పుము. నేర్పుమీఱ యుక్తవచనములచే వారి

శోకమును దూరీకరింపుము' అని పలుక విని యవ్వాసుదేవుఁ డర్జును
శిబిరమున కేగి దుఃఖితుఁడగుచుఁ బుత్రశోకార్తయై దుఃఖితయగు తన
సోదరి నూఱడించుచు 'ఓయమ్మా! వార్ష్ణేయీ! కుమారునకై నీవును
నీకోడలును బరితపింపకుఁడు. ఓభయశీలా! సకలప్రాణులకును గాల
నిర్మితమగుస్థితి యొక్కటియే. అందును ధీరమగుక్షత్రియకులమునఁ
బుట్టిన నీతనయునకు విశేషించి యీయుద్ధమరణ ముచితమైనదియేగాని
వేఱుగాదు. భాగ్యవశమున మహారథుఁడై ధీరుఁడై పితృతుల్యపరాక్ర
ముఁడై క్షత్రియపద్ధతినిబట్టి వీరు లభిలషింపఁదగుగతిని నీకొమరుఁ
డొందియున్నవాఁడు. అతఁడు శత్రుల ననేకులను జంపి యమపురికిఁ
బంపి, సకలకామప్రదములగు నక్షయలోకములను బొందెను. తపము
చేతను, బ్రహ్మచర్యముచేతను, శ్రుతముచేతను, బ్రజ్ఞచేతను సజ్జను
లేయేగతుల నొందుదురో, నీపుత్త్రుఁ డాగతిని బొందెను. ఓవార్ష్ణేయీ!
నీవు వీరమాతవు. వీరపత్నివి. వీరజాతవు. వీరబాంధవవు. కావునఁ బరమ
గతినొందిన నీపుత్త్రునకై శోకింపకుము. బాలఘాతకుఁడై పాపుఁడగు
నాసైంధవుఁడును దనగర్వమునకుఁ దగుఫల మిదె సబంధుసపరివార
ముగా నొందుచున్నవాఁడు. ఓవరారోహా! ఈరాత్రి వేఁగుడుఁ బాప
కర్ముఁడగువాఁ డమరావతినిజొచ్చునుగాని వాని నాపార్థుఁడు విడువఁడు.
రేపటియుద్ధమున నాసైంధవునితల స్యమంతపంచమునకుఁ బైగా హరిం
పఁబడుట నీవు తప్పక విందువు. దుఃఖము విడువుము. రోదన మొనర్ప
కుము. శస్త్రజీవులమగు మేమెల్ల నేగతి నొందుదుమో యాగతినే
క్షత్రియధర్మము నాశ్రయించి నీపుత్త్రుఁడును నొందెను. వ్యూఢోరస్కుఁ
డును, మహాబాహుఁడును, సంగ్రామానివర్తియునగు నీతనయుఁడు
స్వర్గమునొందెను. కావునఁ బరితాపమొందకుము. వీర్యనిధియగు నతఁడు
పితృపక్షమువారిని, మాతృపక్షమువారిని ననుసరించి వేలకొలఁదివైరు
లను జంపి, తుదికి హతుఁడయ్యెను. ఓక్షత్రియాంగనా! నీకోడలి నోదా
ర్పుము. నీవు శోకింపకుము. రేపు గొప్పప్రియమును విన నీశోకమును
బరిత్యజింపుము. పార్థుఁ డొనర్చినప్రతిజ్ఞ కావలసినదేగాని వేఱొకరీతిఁ
కానేరదు. నీభర్త చేయఁదలంచినది తప్పకగునుగాని నిష్ఫలముకానే
రదు. మానవులుగాని, సురాసురులుగాని, పన్నగులుగాని, గరుడులు

గాని, యింకెవ్వరుగాని, గాచినను, వాని నెదుర్కొనిన యర్జునుడు వానిం జంపక తప్పదు. తేపు వాడు లేడనవచ్చును.' అని పలికెనని తెలిపి సంజయుడు మఱియు నిట్లనియె.

—సుభద్ర పుత్రునికై శోకించుట—

"ఓరాజా! మహాత్ముడగు కేశవుని యవ్వచనము లాలించి సుభద్ర పుత్రశోకార్తయై యిట్లు విలపించెను. 'హా! పుత్రకా! మందభాగ్యనగు నా కీవేల దక్కుదువు? ఓతండ్రీ! తండ్రినిబోలు పరాక్రమముగల నీవును రణరంగమున కేగి మృతినొందితివా? నల్లగలువంబోలి నల్లనై చక్కనిపలువరుసగలిగి మనోజ్ఞమగు కన్గవగల నీమొగ మగపడునా? ఓవత్సా! రణరేణువులచేఁ గప్పంబడియుంటివా? యుద్ధమునుండి మఱలక నేలఁగూలిన నిన్ను శూరునింగాఁ దలంపకమానరు. చక్కనితలయు, మెడయు, బాహువులునుగల్గి, వెడఁదవక్షమువెలయ సన్ననినడుముగల్గి సర్వాంగసుందరమై, రక్తసిక్తమైన నీమేను జూచి, భూతము లపు డుదయించుచంద్రుఁడని తలంపకమానవు. ఓతండ్రీ! మెత్తనిపరుపులపైఁ బరుండఁదగుసుకుమారుఁడవగు నీవు నేఁడు నేలఁగూలి యెట్లున్నాఁడవో? ఓకొడుకా! మున్ను వరాంగనలు నిన్ను సేవించుచు నెల్లపుడు ననుచరింప, నిపుడు నక్కలఁగూడి దిక్కుమాలి యుంటివా? మున్ను పరమానందముగా వందిమాగధులచే సంస్తుతింపఁబడుచునుండెడినీవు నేఁడునక్కలు గృధ్రములు మున్నగువాని ఘోరారావములచే సేవింపఁబడుచున్నాఁడవు. అయ్యో! పాండవులు యాదవులును బాంచాలురు నీకు రక్షకులై యుండఁగా దిక్కులేనివాఁడువలె మరణించితివా? ఓపుత్రకా! నీదర్శనము నేడఁ దృప్తినొందని మందభాగ్యనగు నేనిఁకఁ దప్పక యమమందిరమునకుఁ బోవుదానను. ఓకుమారా! వెడఁదకన్నులును, నింపగు కేశాంతమునుగల్గి మధురోక్తులతో సుగంధబంధురమగు నీమొగము మఱియెన్నఁడే నగపడునా? ఛీ! భీమసేనునిబలమేల? పార్థుని విలుకానితనమేటికి? వృష్ణివీరులబాహుబలము గాల్పనా? పాంచాలురబలము పాడయ్యెనా? కైకయులును, చేదులును, మాత్స్యులును, సృంజయులును, ఛీ! ఛీ! ఏమి యుపయోగించినవారు? రణరంగమున నున్న నిన్నుఁ గాంచుటకును జాలరైరి. అయ్యో! కుమారా! నా కిపుడు పుడమి

కాంతిహీనమై శూన్యమైన ట్లగపడుచున్నది. వాసుదేవునకు మేనల్లుఁడవై పార్థునకుఁ బుత్త్రుఁడవై వీరుఁడవై మహారథుఁడవగు నిన్నెట్లు చూడఁగలను? హా! వీరా! స్వప్నమునఁ గానవచ్చి, మఱియు నష్టమైన ధనమునా నాకుఁ గానరాకుంటివా? అయ్యో! మానవశరీరము నీటిబుగ్గవలెఁ జంచలమై యనిత్యమైనదిగదా! ఓనాయనా! చిన్నవయసుదై నీవలనఁగల్గినకష్టముచే దుఃఖితయైయున్న యీ నీభార్యను దూడలేనియావునుబోలె నెట్లుపట్టుకొనఁగలదానను? ఆహా! తండ్రీ! ఫలకాలమున నిన్నుఁ జూడ నాసక్తివడియున్న నన్ను విడిచి యకాలమునఁ బ్రయాణమొనర్చితివా? కృతాంతునిచెయువులు ప్రాజ్ఞులకును దెలియకుండును. లేనిచోఁ గేశవుఁడు నీకు రక్షకుఁడై యున్నను, నీ వనాథునివలె మరణింతువా? ఓతనయా! యజ్వలును, దాతలును, గృతాత్ములగు బ్రాహ్మణులును, బ్రహ్మచర్యనిష్ఠులును, బుణ్యతీర్థసేవాపరులును, గృతజ్ఞులును,వదాన్యులును, గురుశుశ్రూషాసక్తులును, సహస్రదక్షిణులునగు వారి కేగతి గల్గునో యట్టిగతి నొందుము. యుద్ధమున మఱలక పోరాడువీరుల కే యుత్తమలోక మొదవునో యట్టిలోక మొందుము. వేలకొలఁదిగోవుల నిచ్చినవారియుఁ, గ్రతువులు చేయించినవారియు, నుపకరణములతో గృహ మొసంగినవారియుఁ బుణ్యలోకములు నీకగుఁగాక. ఓపుత్రకా! శరణ్యులగు బ్రాహ్మణులకు నిధినొసంగువారికిని, నిరస్త్రాభిమానులకు నగు గతి నీకగుఁగాక. సంశితవ్రతులగు మునులు బ్రహ్మచర్యముచేతను, బతివ్రతలు తమయుత్తమచారిత్రముచేతను నేగతి నొందుదురో, యట్టిగతి నీవొందుదువుగాక. సుచరిత్రములచే రాజులకును, సురక్షితములగు పుణ్యములచేఁ బవిత్రులగు చతురాశ్రమములవారికిని, దీనశరణ్యులకును, గొండెమెఱుంగనివారికిని నగునుత్తమగతి నీవొందుము. వ్రతులకును, ధర్మశీలులకును, గురుశుశ్రూషాపరులకును, నతిథిపూజానిరతులకును నేయుత్తమగతిగల్గునో యట్టిగతి నొందుదువుగాక. కష్టతరములగువ్యసనములందును, మనసునిలుపుకొనువారికిని నగుగతి నీకగుఁగాక. ఎవ్వరు తలిదండ్రులకు శుశ్రూషయొనర్తురో, యెవ్వరు నిజదారనిరతులో! యట్టివారిగతి నీకగుఁగాక. ఋతుకాలమున నిజదారలను గలిసినవారికిని, బరస్త్రీపరాఙ్ముఖులకును, బ్రియము మై నెల్లభూతములను గాంచుమాత్సర్యహీనులకును, నెవ్వరికిని బీడగల్గింపనిశాంతచిత్తులకును,

గల్గుగతి నీకగుఁగాక. మద్యమాంసములనుండి మఱలినవారికిని, దంభా నృతములు లేనివారికిని, బరపరితాప మొనర్పనివారికిని, బిడియముగల వారికిని, సకలశాస్త్రజ్ఞులకును, జ్ఞానులకును, జితేంద్రియులకును, సాధు లకును నెట్టిగతి గల్గునో యట్టిసుగతి నీకగుఁగాక.

"ఓరాజా! శోకపీడితయై యిట్లు విలపించుచు దీనవదనయై యున్న యాసుభద్రను నుత్తరతోఁగూడి పాంచాలి చేరవచ్చెను. అంత వారెల్ల రనుగలిసి మొఱవెట్టిరి. ఓరాజా! పిచ్చిపట్టినవారువలె వారు తెలివిలేక పుడమిఁబడిరి. పిదపఁ గృష్ణుఁడు వారి నుపచారముల నేదఁదీర్చి యా యా హితవచనముల నోదార్చి, తెలివితప్పినదివలె రోదనముచేయుచు వడఁకుచున్న తనచెలియలితో 'సుభద్రా! పుత్రునకై శోకింపకుము. ఓ పాంచాలీ! ఉత్తర నోదార్పుము. క్షత్రియపుంగవుఁడగు నీతనయుఁడు ప్రసిద్ధగతి నొందినవాఁడు. ఓవరాననా! కీర్తినిధియగు నభిమన్యున కేయుత్తమగతి గల్గెనో యట్టిగతి తత్కులమున జనించినవారి కగుఁ గాక. మామిత్రులును మేమును గ్రియలయం దట్టికర్మములనే చేయు వారము. నీకొమరుఁ డొకఁడును జేసినపనియే మాకును నభిలషితమై యున్నది.' అని యామె నోదార్చి, యటులే ద్రౌపదిని, నుత్తరను నూఱడించి, మఱల బార్థునికడ కతఁడు వెడలెను. అటులు వెడలి పిదప నందలిరాజులకడ ననుజ్ఞగొని యటులే బంధులతోడను నర్జునునితోడను జెప్పి, యంతఃపురమున శ్రీకృష్ణుఁడు వెడలిపోయెను. పిమ్మట వారును దమతమనివాసములకుఁ బోయిరి." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## శ్రీకృష్ణదారుకసంవాదము

"ఓరాజా! అంత నాభగవానుఁ డర్జునుని భవనము ప్రవేశించి యుదకస్పర్శ మొనర్చి శాస్త్రీయలక్షణములుగల స్థండిలప్రదేశమున వైడూర్యతుల్యములగు దర్భలతో శయ్య నమర్చి, మాల్యములచేతను సుగంధలాజలచేతను నలంకరింపఁబడిన యాశయ్యచుట్టును నాయుధము లుంచి, పిదప నుదకస్పర్శ మొనర్చియున్న యర్జునునకుఁ బ్రతినిశయందును నిత్యమగు త్రైయంబకబలిని నిరూపించెను. పిదపఁ బార్థుఁడును బ్రీత చిత్తుఁడై గంధమాల్యాదులచే నమ్మాధవు నలంకరించి, పిమ్మట నైశ

మగునా త్ర్యంబకబలిని యథావిధిగా నివేదించెను. పిమ్మట నమ్మాధవుఁడు నగుచు నర్జునుతో 'ఓపార్థా! సుఖముగా నిద్రింపుము. నీకు భద్రమగుఁగాక. నీశుభమునకై నేను బోయివచ్చెదను.' అని తెలిపి, ధృతాయుధులగు ద్వారపాలకుల నచ్చోఁ గాపిడి, దారుకానుగతుఁడై నిజశిబిరమునకేగి యందున్నశయ్యపైఁ దనపైనున్న కార్యభారమును జింతించుచుఁ,బార్థు నెటులేని శోకమునుండి తప్పించువిధి నాలోచించుచు శయనించెను. అంత నపు డప్పుండరీకాక్షుఁడు తేజోబలవర్ధనమై యలరు యోగమూని, సర్వేశ్వరుఁడును, పృథుకీర్తియు, విష్ణువు, జిష్ణువు, పాండవప్రియకరుఁడును, శ్రేయస్కాముఁడు నగునాతఁడు నియతచిత్తుఁడై యుండెను. ఆరాత్రి పాండవశిబిరమున నెవ్వరును నిద్రింపలేదు. ఓరాజా! నాఁడందఱకును బ్రజాగర మావేశించెను. 'ఆహా! పుత్రశోకాభితప్తుఁడై మహాత్ముఁడగుగాండివధరుఁడు సైంధవునివధించెదనని ప్రతిన నొనర్చినవాఁడు. మహాబాహుఁడగు నవ్వాసవి తనప్రతిజ్ఞ నెట్లు నిర్వహించుకొనునోగదా! యని యపుడు వారందఱును జింతింపసాగిరి. మహాత్ముఁడగు పాండవమధ్యమున కెంతయుఁ గష్టము సంభవించెనే! యని కొందఱును, నవక్రవిక్రముఁడగు నప్పార్థుఁ డాప్రతిజ్ఞను నిర్వహింపఁగలఁడని వేఱొకకొందఱును, బుత్రశోకాభితప్తుఁడగు నర్జునుఁడు గొప్పప్రతినవట్టినను సోదరులును సైన్యములవారును మిక్కిలి విక్రమముగలవారగుటను జయ మర్జునునకు గల్గుననియే కొందఱును, ధృతరాష్ట్రపుత్రుఁడు సర్వసన్నాహములతో నున్నవాఁ డగుట నెటులే నర్జునుఁడు సైంధవుని జయించునట్లు పరమేశ్వరుఁడు ప్రసాదించుఁగాక యని వేఱొకకొందఱును, 'అయ్యో! అటు లర్జునుఁడు వైరులనోడించి తనవ్రతము నిర్వహింపఁబడునట్లుగా రేపు సైంధవునిఁ జంపఁజాలఁడేని యగ్నిప్రవేశ మొనర్పక తప్పదు. అప్పార్థుఁ డనృతము లాడెడివాఁడు గాఁడుగదా! అటు లర్జునుఁడు మృతినొందెనేని ధర్మరాజు రాజగు టెట్లు? ఆవిజయునందే విజయమెల్ల నిశ్చయింపఁబడి యున్నదిగదా! కావున మనకు దానహోమాదులచే నేమేని సుకృతము గలదేని యద్దాన నాసవ్యసాచి వైరులఁ బరిమార్చుఁగాక.' యని కొందఱును, నిటులు పరిపరివిధముల వారు పలికికొనసాగిరి. ఓరాజా! ఇటు లప్పాండవజయా

స్థులై వారు పరస్పరము సంభాషించుచుండఁగా నెట్టెటో యారాత్రి గడచెను.

అంత నక్కడ నక్కమలాక్షుఁ డానడిరేయి మేల్కని పార్థుని ప్రతిజ్ఞఁ దలంచి దారుకునితో, 'ఓయీ! హతబంధుఁడై యార్తుఁడగుట, తే పాసైంధవుని వధింతునని ప్రతినయొనర్చినవాఁడు. అది విని సుయోధనుఁడు తనమంత్రులతో 'పార్థుఁడు జయద్రథు నెటులు చంపకుండునో యట్టియుపాయమును జింతింపుఁ' డని చెప్పక తప్పదు. వారికిఁ గలపదునొకొండక్షౌహిణులు నెటులే సైంధవునిఁ గాపాడుదురు. సకలాస్త్రపారగుఁడై తనకొడుకుతోఁ గూడిన ద్రోణుఁడు రక్షింపఁబూని యుండఁగా నాసైంధవుని దైత్యదానవమర్దనుఁడగు నాసహస్రాక్షుఁడును దేఁటిచూడఁజాలఁడు కాని, నే నాకుంతీతనయుఁడగు పార్థుఁడు తేపు సూర్యుఁడస్తమింపకుండఁగనే సైంధవుని సమయించునట్లు చేయువాఁడను. ఓదారుకా! కుంతీపుత్త్రుఁడగు నర్జునుని మించిన ప్రియమిత్త్రుఁడుగాని, బంధువుగాని, జ్ఞాతిగాని లేఁడు. భార్యలయందును, నాతనిపై నాకుఁ గలప్రీతి లేదు. ఓయీ! అర్జునుఁడు లేనిలోక మొకనిమేషమైనను నేను జూడఁజాలను. అటు లెన్నఁడును జరుగుటయు సంభవింపదు. ఓయీ! ఇంతయేల! అప్పార్థునర్థమునకుఁగాఁ, గర్ణాదులతోఁ గూడిన సుయోధనాదులను జయించెదను. మహాసంగ్రామమున తేపు నాపరాక్రమము నెల్లరు నారయుదురుగాక. ధనంజయునకుఁగా నేను విక్రమించి తేపు రాజసహస్రములను, రాజపుత్త్రశతములను, గజాశ్వరథములను సంగ్రామమునఁ గూలఁద్రోయుదును. ఓదారుకా! నాచక్రప్రమథితమగు వైరివారమును తే పారయుదువుగాక. పాండవార్థమై కోపమూనిన నాచే హతమైన శత్రుసైన్యమును గాంచి దేవతలును, గంధర్వులును, పిశాచోరగరాక్షసులును, సర్వలోకములును పార్థునితో నాకుఁ గలచెలిమిని దెలియుదురుగాక. ఓయీ! ఆయర్జునునితో ద్వేషించినవాఁడు నాతో ద్వేషించినవాఁడగును. ఆతని ననుసరించినవాఁడు నన్ననుసరించినవాఁ డగుచున్నాఁడు. అని బుద్ధిచే నూహింపవలయును. ఆయర్జునుఁడు నాయర్ధశరీరము. నేఁడు వేఁకువయగుడు నారథోత్తమమును యథాశాస్త్రముగా సన్నద్ధపఱచి తెచ్చి నియతుఁడై వెడలుము. ఓసూతా! మఱియు మనరథమున గద, కౌమోదకి, శక్తి, చక్రము,

ధనుర్బాణములు మున్నగునుపకరణములనెల్ల నిడి, రథమధ్యమున నా గరుడధ్వజమునకు, స్థానముకల్పించి, ఛత్రమెత్తించి, విశ్వకర్మకల్పితము లగు, సువర్ణదివ్యభూషణములచే నశ్వముల నలంకరించి, యాబలాహక మేఘపుష్పశైబ్యసుగ్రీవములను నారథమునకుఁ గట్టితెమ్ము. నీవును గవచము ధరించియుండుము. నేను నాపాంచజన్యమును గర్జనమును బోలు నాదముతోఁ బూరింతును. నీ వాభైరవారావమును విని వడిగా నాకడ కరుదేఱవలయును. ఓదారుకా! ఒక్క దినములోనే నాకోపమును, నా మేనత్తకొమరునుత్తలమును దొలఁగింతును. సంగ్రామమున నర్జునునకు జయముగల్గుటకై యెల్లయుపాయములను జేయువాఁడను. అటులేని ధార్తరాష్ట్రులెల్లఁ జూచుచుండఁగా నర్జునుఁడు సైంధవుని వధించును. ఓసారథీ! పార్థుఁ డెవ్వనెవ్వని వధమునకై యత్నించునో యందందు వానికి జగముగల్గునట్లు నేను గోరుచుందును. ఇది నిశ్చయము.' అని పలుక విని యాదారుకుఁడు 'ఓదేవా! అర్జునునకు జయమే నిశ్చయము గాని పరాజయ మెట్లు? నీవాతనికి సారథివైయుండఁగా నతఁ డోడు టెట్లు? అయినను నీయానతి శిరసావహించి నీచెప్పినచొప్పున నాచరింతును. సుప్రభాతమగు నీరాత్రి విజయునకు జయముగోరువాఁడను' అని తెలిపె" నని పలికి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## అర్జునునకు స్వప్నము గలుగుట

"ఓరాజా! నీకుమారునిమంత్రరహస్యమును ధనంజయుఁడు చింతించుచునే తనప్రతిజ్ఞను రక్షించువాఁడై యేమియుఁ దోఁపక వివశుఁడై యుండ, నటులు శోకసంతప్తుఁడై యున్న యక్కపిధ్వజునకు స్వప్నమున నాగరుడధ్వజుఁడు ప్రత్యక్షమయ్యెను. అపు డాఫాల్గునుఁడు సర్వకాల సర్వావస్థలందును భక్తిప్రేమలచే నాభగవానునకుఁ బ్రత్యుత్థానము సేయువాఁడగుట, నాస్వప్నముననే యెదుర్కొని యాగోవిందున కాసన మొసంగెను. కాని తా నాసనమందుఁ గూర్చుండనొల్లకుండెను. అట్టితఱి నాకృష్ణుఁడు లోకనిశ్చయ మెఱింగినవాఁడగుట నాసీనుఁడై 'ఓ యర్జునా! విషాద మొందకుము. కాలము దుర్జయముగదా! కాలమే సర్వభూతములను భవాభవములను నియమించుచున్నది. నీ కీవిషాద మేటికి? తెలుపుము. పండితులగువారు శోకింపరాదు. శోకము కార్య

నాశకరము. ఏయది చేయఁదగినదియో దానిని క్రియారూపమున నాచరింపుము. క్రియాశూన్యునకు శోకమే శత్రువు. ఓధనంజయా! శోకించువాఁడు శత్రుల కానందమును, బందుగులకు దుఃఖమును గల్గించువాఁడు. అటులు శోకించువాఁడు క్రమముగా క్షీణించును. కావున శోకమొందకుము.' అని తెలిపెను.

ఓరాజా! అటు లవ్వ్యాసుదేవుఁడు తెలుప విని, యర్జునుఁ డర్థయుక్తముగా నాతనితో 'ఓదేవా! సైంధవునివధమునకై గొప్ప ప్రతిజ్ఞ చేసియున్నవాఁడను. ఆపుత్రఘ్నునిఁ జంపుట తేవేగదా! ఓ యచ్యుతా! నాప్రతిజ్ఞ చెఱచుటకై ధార్తరాష్ట్రు లెల్లరును మహారథుల వెనుక నాసైంధవునుంచి కాపాడుదురు. ఓకృష్ణా! మఱియు నకౌరవులకు దుర్జయులగు పదునొకండక్షౌహిణులవారు గలరు. చావఁగా మిగిలినయట్టిసంఖ్యగల సైనికులతోఁగూడిన మహారథులు, వానిని జుట్టుకొనియుండ, వానిని దేఱచూడనైన వలనుపడదు. ప్రతిజ్ఞాపారణ మెట్లగును? ప్రతిజ్ఞ చెడినచో నాయట్టివాఁడు జీవించు టెట్లు? ఓవీరవరేణ్యా! నా దుఃఖము దొలఁగించుకొనుటకెంతయుఁ గోరుచున్న వాఁడను. సూర్యుఁడు వడిగాఁ బోవువాఁడగుట నిటులు పలుకవలసివచ్చెను.' అని పలికెను.

ఓయాంబికేయా! ఆయర్జునుశోకనిమిత్తమును విని, యాగరుడధ్వజుఁడు జలస్పర్శమొనర్చి ప్రాఙ్ముఖుఁడై యుండి పాండవులహితము గోరువాఁడై, సైంధవునివధమున బుద్ధియిడి 'ఓపార్థా! మున్నామహేశ్వరుఁ డేయస్త్రముచే రణరంగమున దైత్యులను వధించెనో, యట్టిపాశుపతాస్త్రము సనాతనమైన దొకటి గలదు. దానిని నీవెఱిఁగియేయున్నవాఁడవు. దానిచే తేపు సైంధవుని వధింపఁగలవు. ఓధనంజయా! ఆదేవుని మానసమున ధ్యానించి దానిని తెలియవలయును. ఒకనిమేషము నిశ్చలముగా నుండుము. పిదప నాతనియనుగ్రహముచే నామహాస్త్రమును బడయఁగల్గుదువు.' అని తెలిపెను.

అంత నవ్వ్యాసుదేవునివచనము లాలించి యాధనంజయుఁడు జలస్పర్శమొనర్చి, యానేలనే గూర్చుండి, యేకాగ్రచిత్తుఁడై యాశంకరుని మనమున నిలిపి, శుభలక్షణలక్షితమగు బ్రాహ్మముహూర్తమున ధ్యానపరుఁడై గగనమునఁ గేశవునితోఁగూడఁ దన్నుఁదాఁ గాంచెను. పిదపఁ బవిత్రమై హిమవత్పాదమగు మణిమంతముమీఁదినుండి వాయువేగ

గతిన్మై కేశవునితోఁగూడ నాకసము నాశ్రయించి వెడలెను. అపు డాతని కద్భుతములై పెక్కువిచిత్రములు గానరా నరయుచు, నతఁ డుత్తరదిశను శ్వేతపర్వతమును గాంచెను. పిమ్మటఁ బద్మములచే నలం కరింపఁబడి బహూదకమై, పుష్పఫలవృక్షములతోడను, స్ఫటికోపలముల తోడను, దీరములు వెలయ నలరు నాగంగానది నరయుచు, మఱియు సింహవ్యాఘ్రసమాకులములై నానామృగసంకీర్ణములగు నందలిపుణ్యా శ్రమములను గాంచుచుఁ, గిన్నరులపాటలచేఁ బ్రతిధ్వనులీను మందర ప్రదేశములను గాంచుచుఁ, గాటుకప్రోవునాఁదగు కాలపర్వతమును జేరి, పిదప బ్రహ్మతుంగమును నటులే పెక్కునదులను, దేశములను గడచుచుఁ దుంగమగు శతశృంగమును, శర్యాతివనమును, బవిత్రమగు నశ్వశిరస్థానమును, నాథర్వణస్థానమును, బృషదంశమును, మహామందర మును గాంచుచు, నప్సరస్సమాకీర్ణములై కిన్నరులతో వెలయు నప్ప ర్వతప్రదేశముల నడుచుచుఁ గృష్ణునితోఁగూడ నయ్యర్జునుఁడు పవిత్ర నదులతోఁగూడినట్టియు, సువర్ణధాతువిభూషితమైనట్టియుఁ, జంద్రకిరణ ప్రకాశితస్వరూపమై పురసమూహములుగల పుడమిని గాంచెను. మఱియు వారి కద్భుతములై సముద్రములు గానవచ్చెను. మఱియు వారటు లాకసమునఁ బోవుచుండిరి. అంత నయ్యర్జునుఁడు వడిగా నెగ చినబాణమువలె గ్రహనక్షత్రచంద్రసూర్యాగ్నితుల్యకాంతులెలయఁ బ్రజ్వలించునదినాఁదగు కైలాసమునకుఁ బోయెను. అటు లప్పర్వతముఁ జేరి యక్కొండశిఖరముననున్న మహాత్ముఁడును దపోనిత్యుఁడునగు వృషభధ్వజు నతఁడు గాంచెను. నిజతేజముచే సూర్యసహస్రమువలె వెలయుచు, శూలధారియై జటిలుఁడై వల్కలాజినవసనుఁడై నేత్రసహ స్రముచేఁ జిత్రరూపుఁడై పార్వతితోడను, భూతసంఘములతోడను, గీతవాదిత్రహాస్యలాస్యములతోడను గూడి, బ్రహ్మవాదులగు మహర్షు లొనరించు దివ్యస్తవములచే సంస్తూయమానుఁడగుచు సర్వభూతరక్ష కుఁడును, సర్వేశ్వరుఁడును, వరదుఁడునునగు శివునిఁ గాంచి యవ్వాసు దేవుఁడు సాష్టాంగవందన మొనర్చెను. అపుడు పార్థుఁడును సనాతనుఁ డగునాతనిని సన్నుతించుచు నమస్కరించెను. మఱియు నాకృష్ణార్జును లపు డనాదియు, విశ్వప్రాప్యుఁడును, జన్మరహితుఁడును, సర్వేశ్వరుఁ డును, నవ్యయుఁడును, మనఃప్రవృత్తినివృత్తిహేతుభూతుఁడును,

వాయ్వాకాశరూపియుఁ, దేజోనిధియు, జలధరస్రష్టయు, భూమికిఁ బరప్రకృతియు, దేవదానవయక్షమానవాదులకు శాసకుఁడును, యోగులకుఁ బరమాశ్రయుఁడును, దత్త్వవేత్తలకుఁ బ్రత్యక్షమైనరహస్యరూపియు, చరాచరసృష్టిసంహారకర్తయు, కాలప్రకోపియు, శక్రునట్టి యైశ్వర్యమును సూర్యునిఁబోలు తేజమునుగల మహాత్ముఁడును నగునాశంకరుని మనోవాక్కర్మములతో నభివందనము లొనర్చిరి. మఱియు, సూక్ష్మమగునధ్యాత్మపదము నభిలషించువిద్వాంసు లెవ్వనిఁ బ్రాపింతురో యట్టి కారణరూపుఁడగు నజుని శరణమునొందిరి. అర్జునుఁడును, నాతనిభూతఁ భవ్యభవ హేతుభూతునిఁగను, సర్వభూతాదిగను దెలిసి మఱిమఱియు నమస్కరించెను.

పిమ్మట నమ్మహేశ్వరుఁ డటులు వచ్చిన యవ్వాసుదేవార్జునుల నారసి ప్రసన్నచిత్తుఁడై నగుచు, 'ఓనరనారాయణులారా! మీకు స్వాగతమా? మిక్కిలి యలసినవారుగాదే. లెండులెండు. మఱియు మీమనోవాంఛితముల వడిగాఁ దెల్పుఁడు. మీరిందుల కేల వచ్చితిరి? నేను జేయవలసినదేమి? మీకు వలసిన శ్రేయ మేదియో దెలుపుదురేని, దాని నెల్ల నిపుడే సంఘటించువాఁడను.' అని తెలిపెను.

ఓరాజా! పిదప వారిరువురును లేచి చేతులుమొగిడ్చి యాశర్వునిట్లు సన్నుతించిరి. 'భవుఁడవు, శర్వుఁడవు, రుద్రుఁడవు, వరదుఁడవు, పశుపతివి, యుగ్రుఁడవుఁ, గపర్దివి నగునీకు నిత్యము నమస్కారము. మహాదేవుఁడవు, భయంకరుఁడవును, ముక్కంటివి, శాంతుఁడవును, బాలకుఁడవును, మఖవిధ్వంసకుఁడవును, నంధకాసురఘాతివినగు నీకు నమస్కారము. కుమారజనకుఁడును, నీలకంఠుఁడును, బినాకధారియు హవిరోగ్యగుఁడును, సత్యస్వరూపుఁడును, విభుఁడును, విలోహితుఁడును, ధూమ్రుఁడును, మృగహంతయు, నపరాజితుఁడును, నీలశిఖండుఁడును, శూలధారియు, దివ్యచక్షువు, హోతయు, పోతయుఁ,ద్రినేత్రుఁడును, వసురేతస్కుఁడునగు నీకు నమస్కారము. చింతింపరాని ప్రభావముగలవాఁడవును, నంబికాభర్తవును, సర్వదేవసన్నుతుఁడవును, వృషధ్వజుఁడవును, ముండుఁడవు, జటిలివి, బ్రహ్మచారివినగు నీకు నమస్కారము. సలిలమునఁ దప మొనర్చునట్టియు, బ్రహ్మణ్యుఁడవై, యజితుఁడవై, విశ్వరూపుఁడవై, విశ్వస్రష్టవై విశ్వము నావరించి యుందువు. అట్టి

భూతసేవ్యుఁడవును, భూతప్రభవుఁడవునగు నీ కెల్లపుడును నమస్కారము. వేదముఖుఁడవుః శుభంకరుఁడవు, శివుఁడవునగు నీకు నమస్కారము. వాచస్పతివి, ప్రజాపతివినగు నీకు నమస్కారము. విశ్వపతివి, మహత్పతివినగు నీకు నమస్కారము. సహస్రశిరస్కుఁడవును, సహస్రభుజుఁడవును, మృత్యురూపుఁడవు, సహస్రనేత్రుఁడవు, సహస్రపాదుఁడవు, నసంఖ్యాకర్ముఁడవునగు నీకు నమస్కారము. హిరణ్యవర్ణుఁడవు, హిరణ్యకవచుఁడవు, భక్తప్రియుఁడవు నగునీకు నిత్యము నమస్కారము. ఓ ప్రభూ! మావరము సిద్ధించుఁగాక.' అని యిటులు స్తుతించి యర్జునునితో నవ్వాసుదేవుఁ డప్పాశుపతాస్త్రప్రాప్తికై యాశంకరునిఁ బ్రసన్నునిఁగావించె" నని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

## అర్జునుఁడు పాశుపతముపడసి స్వప్నమున మఱల నింటికి వచ్చుట

"ఓరాజా! పిమ్మట నమ్మధ్యమపాండవుఁడు నిర్మలాంతఃకరణుఁడై కేలు మొగిడ్చి, వికసితాత్ముఁడై తేజోనిధియగు నావృషభధ్వజునిఁ గాంచెను. అంత నాయర్జునున కాయంధకాంతకునిచెంతఁ దనచేఁ గృష్ణుఁ డిప్పించిన నిత్యమగు నైశోపహార మచటఁ గానవచ్చెను. పిదప నయ్యర్జునుఁ డాశర్వునిఁ గృష్ణుని మానసమున నిల్పి 'ఓశంకరా! నీదివ్యాస్త్రమును గోరుచున్నవాఁడను.' అని పలికెను. అది విని యామహాదేవుఁ డవ్వాసుదేవార్జునులఁ జూచి నగుచు, 'ఓనరనారాయణులారా! మీకు స్వాగతమా! మీయభీష్ట మెఱింగితిని. మీ రేయభీప్సితము గోరివచ్చితిరో దాని నిదె మీకొసంగుచున్నవాఁడను. ఓశత్రుసూదనులారా! దివ్యమై యమృతమయమగుసరోవర మొకటి యిచ్చోటికిఁ జేరువగానున్నది. నేను మున్ను దానిని బాణమును నాసరోవరమున నుంచితిని. నేను దేవారులను జంపుటలో నదియేగదా సాధనమయ్యెను. కావున మీరిరువురును దానినుండి యాధనుర్బాణములఁ దెచ్చికొనుఁడు.' అని తెలుప విని యవ్వీరులిరువురును బారిషదులతోఁగూడ వెడలి, పరమాద్భుతకరమగు నాదివ్యసరోవరముఁజేరి యావృషభవాహానునిచేఁ దెలుపఁబడిన సర్వార్థసాధకమగు పవిత్రస్థలమున సంభ్రాంతులై యానరనారాయణమహర్షులు గాంచి, దానిలో డిగి యందు ఘోరమై సూర్యమండలసన్నిభమగు నొకనాగమును గాంచిరి. పిదప నచ్చోటనే వెయితలలు

గల వేటకాకసర్పము వారికిఁ గానవచ్చెను. అయ్యది యగ్నిసన్నిభమై జ్వాల లుమియుచుండెను. అంత నవ్వాసుదేవార్జునులు జలస్పర్శ మొనర్చి చేతులు జోడించి శంకరుని సన్నుతించుచు, నాసర్పముల నుపస్థానమొన ర్చిరి. అపుడు వారు వేదవేత్తలగుట శతరుద్రియమును జపించుచు, నెల్లవిధముల నాశంకరు విశ్వసించి నమస్కరించిరి. పిమ్మట నారుద్ర మాహాత్మ్యమున నాసర్పములు రెండును సర్పరూపమును విడిచి, వైరి మారకములైన ధనుర్బాణములయ్యెను. అపుడు వారిరువురును బ్రభా వంతములగు నాధనుర్బాణములను బరిగ్రహించి, తెచ్చి మహాత్ముఁడగు నాశంకరునకు సమర్పించిరి. పిదప నాశివునిపార్శ్వమునుండి బ్రహ్మచా రియుఁ బింగాక్షుఁడును దపోనిధియు బలశాలియునగు నీలలోహితుఁ డనెడియాతని యపరమూర్తి యొకటి వచ్చి యాధనుశ్శ్రేష్ఠమును బట్టి కొని స్థానమునుజేర్చి బాణముతోఁగూడ దాని నాకర్షించెను. అంత నప్పార్థుఁడు, దానిమౌర్విని, ముష్టిని, స్థానమును గనిపెట్టి భవప్రోక్త మగుమంత్రమును విని, దానినే మనమునఁ జింతించెను. అటులు చింతించి, పిదప నాధనుర్బాణముల నెప్పటియట్ల వెనుకటిసరోవరమున నిడివచ్చి యందులకు శంకరుఁడు ప్రీతుఁడగుటఁ దెలిసి, మున్ను తనకు శంకరుఁ డరణ్యమున నొసంగినవరమును దర్శనప్రకారమును దలంచి, యది నాకు సిద్ధించుఁగాక యని ప్రార్థింప, నాభవుఁ డది యట్లే యగుఁగాక యని వరమొసంగెను. అంత నయ్యర్జునుఁడు తనప్రతిజ్ఞాపారణమై ఘోరమగు పాశుపతమును బరిగ్రహించి, మేను గగుర్పొడువఁ దా నపుడు ఘన కార్యమొనర్చితినని తలంచెను. పిమ్మట నవ్వాసుదేవార్జునులిరువురు నమ్మహేశ్వరునకు నమస్కారములొనర్చి యాక్షణమ యాతని యానతి వడసి పరమానందభరితులై నిజశిబిరమును జేరికొని మహాసురనిఘాతి యగు నాశివునసుజ్ఞ వడసి జంభవధకాంక్షగలిగిన యింద్రవిష్ణువులు వలె వారుత్సాహముమై నుండిరి.” అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

## శ్రీకృష్ణుఁడు యుధిష్ఠిరునికడకు వచ్చుట

“ఓయంబికానందనా! శ్రీకృష్ణదారుకు లిరువురు నటులు పరస్పరము మాటలాడుకొనుచుండఁగా నారాత్రి గడచెను. అంతఁ బాణిస్వన

మొనర్చువారును,మాగధులు,మధుపర్కికులు, వైతాళికులు సన్నుతించు చుండఁగాఁ బురుషవరేణ్యుఁడగు నాయుధిష్ఠిరుఁడును మేల్కనియెను. అపుడు నర్తకులు నాట్యమొనరించుచుండ గాయకులు గానమొనర్చుచుఁ గురువంశస్తవములను మధురముగా నాలాపింపఁ జక్కఁగా శిక్షవడసిన కుశీలవులు మృదంగాదులను ప్రయోగించుచుండిరి. మేఘగర్జనతుల్యమగు నమ్మహాశబ్దము మిన్నుముట్టెను. మఱియు ఝర్ఝరభేరిపణవానకగోముఖాదులును, శంఖములును మ్రోయింపఁబడియెను. వానిచే నాయుధిష్ఠిరుఁడు మేలుకని మహార్హమగుశయనము విడిచి లేచి, యావశ్యకములగుపనులు దీర్చుటకై స్నానగృహమునకు వెడలెను. అంత స్నానమొనర్చి శుక్లాంబరధరులై పిన్నవయసుగల నూటయెనమండ్రుస్నాతకులు కాంచనపూర్ణకుంభములను బట్టుకొని వచ్చిరి. అంత నాయుధిష్ఠిరుఁడు భద్రాసనముపైఁ గూరుచుండి, చులుకనివస్త్రము ధరించి వారిచే నభిమంత్రితములై చందనమిశ్రితములగు పానీయములచే స్నానమొనర్చెను. పిదపఁ దెలిసినవా రౌషధకల్కమునను, సుగంధబంధురమగు పన్నీటను నాతనిమే నలంకరింప రాజహంసతుల్యమగు నుష్ణీషమును ధరించి, పుష్పమాలికావసనధారియై ప్రాఙ్ముఖముగాఁ జేలుమొగిడ్చి, సజ్జనమార్గానుసారముగ జపమొనర్చెను. అంత నగ్నిహోత్రమున నగ్ని ప్రజ్వలింపఁబడుట నారసి సవినయముగా నతఁ డందుఁజొచ్చి, పవిత్రములతోఁగూడిన సమిధలతోడను, నాహుతులతోడను మంత్రపూతముగా నగ్ని నారాధించి యాగృహమునుండి వెడలెను. పిదప వేఱొకచో నాగృహము రెండవకక్ష్యగడచినపిమ్మట వేదవేత్తలును, వృద్ధులుననగు బ్రాహ్మణు లాతనికిఁ గానవచ్చిరి. దాంతులును, వేదవ్రతస్నాతలును, నవభృథస్నాతలును, సహస్రానుచరులును సూర్యోపాసకులునగు వారిని మఱికొందఱను జందనాక్షతపుష్పాదులచేఁ బూజించి, వారి యాశీర్వచనములుగొని మధుసర్పిఃఫలములతో వేలువేలుగా నొక్కొకనికిని సువర్ణనిష్కముల నిచ్చెను. మఱియు నా వేయియెనమండ్రురకును గాక యింకను గొందఱ కలంకృతములగు నశ్వములను, వస్త్రములను దక్షిణలను, గపిలగోవులను, వత్సములతో సువర్ణశృంగరజితఖురభూషితములుగా నొనర్చి యిచ్చి, మఱియు నందుఁ జేయఁదగు సద్విధుల నెల్లఁ దీర్చి బాహ్యకక్ష్యకు వెడలెను. అందుఁగల కొందఱు పరిచారికలు

సువర్ణమయమై ముక్తావైదూర్యాదులచే నలంకరింపఁబడి మిక్కిలి విలువ గలయాస్తరణ మొకటిగల్గి, పై దుప్పటము వెలయ విశ్వకర్మకృతమగుట దివ్యమైన సర్వతోభద్రమనెడి యొకయాసనముఁ దెచ్చియుంచిరి. అం దతఁడు కూరుచుండ నౌకరులు మహార్హములగు భూషణము లమ్మహాత్ము నకై దెచ్చిరి. ఓరాజా! ఆసేవకులు దెచ్చిన భూషణములను ధరించిన యమ్మహనీయునిరూపము వైరులకు శోకవర్ధనమై యుండెను. మఱియు నాతని కిరుగెలంకులఁ జంద్రకాంతి వెలయ సువర్ణదండములగుచామర ములు వీవ నతఁ డెంతయు మెఱుపులతోఁగూడిన మేఘమువలె విరాజి ల్లెను. అంత నతఁడు వందులు సన్నుతింప, సూతులు వొగడ, గంధ ర్వులు కీర్తింపఁగా నం దుండెను. అటు లోకమహాత్మ మావందుల పొగడ్తలచప్పుడు లెంతయు గొప్పవై యుప్పతిల రథములనేమినినాద మును, గుఱ్ఱములగొరిజలఘోషమును, గజఘంటారావమును, శంఖ ధ్వనియును, బదాతులయడుగులరొదయుఁ గల్గుటను బుడమి వడంక సాగెను. పిమ్మట నొకసేవకుఁడు మోలను గత్తి జాఱుచుండఁ గవచ ధారియుఁ జిన్నవయసువాఁడునై యుధిష్ఠిరుని శుద్ధాంతమున కేగి మోఁకాలఁబడి నమస్కరించి, యందులకుఁ గృష్ణుఁ డరుదెంచుట నెఱిఁ గించెను. ఆధర్మజుఁడును మాధవునకు స్వాగతమొసంగి యర్ఘ్యపాద్య ములఁ బూజించి, యాసనమొసంగవలయునని వారి కెఱిఁగింప వారటు లొనర్చిరి. అంత నయ్యుధిష్ఠిరుఁ డవ్వాసుదేవుని యథావిధిగాఁ బూజిం చెను.” అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

### కృష్ణుఁడు ధర్మజునితో సంభాషించుట

“ఓరాజా! పిమ్మట నాయుధిష్ఠిరుఁ డాజనార్దను నభినందించి యాతనిరాకకుఁ బరమానందభరితుఁడై ‘ఓమధుసూదనా! నీవు రాత్రి సుఖముగాఁ గడపితివా? నీయింద్రియములన్నియుఁ బ్రసన్నములుగా నుండెనా?’ అని ప్రశ్నింప, విని యవ్వాసుదేవుఁడు ‘ఓధర్మజా! నీకు నాయెడఁ బ్రీతిగల్గియుండఁ గొఱంతయెట్టిది?’ అని బదులుచెప్పెను. అంత నందులకు వచ్చియున్న ప్రకృతులరాక నొకసేవకుఁ డాతని కెఱిఁగించి యాతనియనుజ్ఞమై వారినెల్ల లోనికిఁ దోడ్తెచ్చెను. మఱియు విరాట ద్రుపదులును, భీమసాత్యకులును, ధృష్టద్యుమ్నుఁడును, శిఖండియుఁ,

చేదిరాజగు ధృష్టకేతువును, నకులసహదేవులును, చేకితానుఁడును, కైకయులును, యుయుత్సుఁడును, యుధామన్యూత్తమౌజులును, ద్రౌపదేయులును, నింకను ననేకులగుక్షత్రియపుంగవులును నమ్మహాత్ముఁడగు యుధిష్ఠిరుని దర్శింపవచ్చి యాసనములపైఁ గూరుచుండిరి. అపుడు తేజోనిధులును మహాత్ములునగు కృష్ణసాత్యకు లొకయాసనమునఁ గూరుచుండిరి. పిమ్మట వారెల్లరును వినుచుండఁగా నమ్మధుసూదనుతో ధర్మజుఁడు కొంతవడి మధురముగా సంభాషించి, 'ఓదేవా! ఆయింద్రునమరులువలె మేమెల్ల నిన్నాశ్రయించి నీయొకనినుండియే జయమును శాశ్వతసుఖములను గోరుచున్నవారము. ఓకృష్ణా! మాపడినక్లేశములను, మారాజ్యవినాశమును, వైరులు మాకొనర్చిన యవమానమును నీవెఱుంగకపోలేదు. ఓసర్వేశ్వరా! భక్తవత్సలా! మాయెల్లవారిసుఖమును స్థితియు నీపై నాధారపడియున్నవి. కావున, నీయెడ నామనము స్థిరమైయుండునట్లును, నర్జునుఁ డొనర్చిన ప్రతిజ్ఞ సత్యమగునట్లును జేయుము. మఱియు మమ్మీదుఃఖకోపమహాసాగరమునుండి యుద్ధరింపవలయును. ఓమాధవా! ఈకష్టపారావారపారమును జేరఁదలఁచియున్న మాకీవే యోడవై యున్నవాఁడవు. నీవు మాకు సారథ్యమును బూని యేమిచేయుచుంటివో దాని నాకార్తవీర్యతుల్యుఁడగు వీఁడును జేయఁగల్గునా? ఓజనార్దనా! నీ వాయాదవుల నెటులెల్ల విధములగునాపదలందును గాపాడుచున్నాఁడవో యటులే మమ్ములనుసైత మీయాపదనుండి రక్షింపఁదగియున్నవాఁడవు. ఓశంఖచక్రగదాధరా! అగాధమగు నిక్కారుసాగరమున మునిఁగియున్న మా కీవోడవై మ మ్ముద్ధరింపుము. ఓదేవదేవేశా! ఓసనాతనా! ఓసంహారకా! విష్ణూ! ఓజిష్ణూ! హరీ! కృష్ణా! వైకుంఠా! పురుషోత్తమా! నీకు నమస్కారము. నిన్ను నారదుఁడు పురాణమహర్షిగను, వరదునిగను, శార్ఙ్గధారిగను సన్నుతించుచున్నవాఁడు. అది సత్యమగునటు లొనర్పుము.' అని పలికెను.

అది విని యప్పుండరీకాక్షుఁ డాధర్మజునితో నాసభవారు విన నీలమేఘనినాద మెలయ ని ట్లనియె.

'ఓధర్మజా! ధనంజయునిఁబోలినధనుర్ధరుఁడు స్వర్గమర్త్యపాతాళలోకములం దెందును లేఁడనుట సత్యము. అతఁడు తేజమునను, నస్త్ర

సంపదను, బరాక్రమమునను, బలమునను, యుద్ధచాతుర్యమునను మానవులనెల్ల మించిన మహానుభావుఁడు వృషభస్కంధుఁడును, దీర్ఘ బాహువును, మహాబలుఁడును, సింహతుల్యగతియునగు నాయువ కుఁడు నీవైరుల రూపుమాపఁగలఁడు. అక్కుంతీనందనుఁడు ప్రజ్వలిం చినయగ్నివలె ధార్తరాష్ట్రసైన్యముల నెటులు దహింపఁగల్గునో యది యెల్ల నేను జేయువాఁడను. పాపకర్ముఁడును, క్షుద్రుఁడును, సౌభద్ర ఘాతియునగు నాసైంధవు నిపుడే మఱల గానరానిమార్గమునఁ దన మార్గణములచే మనయర్జునుఁడు పనుపఁగలఁడు. నేఁడే యానీచునిమేని మాంసములను, గృధ్రములును, శ్యేనములును, నక్కలును, నింకనుగల మనుష్యమాంసాహారులును భక్షింపక తప్పవు. ఓయుధిష్ఠిరా! ఆసైంధవ హతకున కింద్రాదిదేవతలు రక్షకులై కావ దలంచినను జావకమానఁడు. వాని నిదె యమరాజధాని కనుపుచున్నారము. ఆసంకులసమరమున సైంధవునిఁ జంపి, నేఁడే మీతమ్ముఁడు మిమ్ము సమీపించును. ఓరాజా! నీవిఁక శాంతిగలిగి శోకతాపములఁ బరిత్యజింపుము.' అని తెలిపె" నని పలికి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## అర్జునుఁడు యుధిష్ఠిర రక్షణమునకై సాత్యకిని నియోగించుట

"ఓరాజా! అటులు వారు మాటలాడుచుండఁగనే, మిత్రులతోఁ గూడియున్న యాభరతశ్రేష్ఠుని దర్శించువాఁడై యందుల కర్జునుఁ డరు దెంచి వారున్న యాగొప్పకక్ష్యకు నమస్కరించి, యెదుట నిలిచియున్న యన్నరు నారసి లేచి ప్రేమమై నాయుధిష్ఠిరుఁ డాతనిఁ గౌఁగిలించికొని యెను. మఱియు మూర్ధాఘ్రాణమొనర్చి పరమాశీర్వచనముల లాలించి నగుచు, 'ఓయర్జునా! నీ కీసంగ్రామమునఁ దప్పక గొప్పవిజయమగుట నిశ్చయము. నీమేనికాంతియు నట్టిదమై యున్నది. జనార్దనుఁడును బ్రసన్నుఁడై యున్నవాఁడు.' అని పలుక నయ్యర్జునుఁ డాధర్మజునితో 'ఓయన్నా! ఈవెన్నునను గ్రహముచే నీకు శుభము గూర్చునదియు, మహైశ్వర్యకరమైనదియు, నుత్తమమైనదియు నగు నొకవిషయమును గాంచితిని.' అని తాను జూచినవిషయమెల్ల నున్నదున్నటు లెఱిఁగిం చెను. అమ్మహేశ్వరుని సమాగమకథయంతయు వారిమిత్రుల కాశ్వాస కరమై యుండెను. పిదప నందలివారెల్లరును విస్మితులై తలల నేలమోపి

యవ్వృషాంకునకు నమస్కరించి మేలుమేలని పలుకసాగిరి. పిమ్మట ధర్మజుననుజ్ఞ వడసి వారిమిత్రులెల్లరును ద్వరపడుచు సంతుష్టాంతరంగులై మహాసంరంభముతో యుద్ధమునకు వెడలిరి. మఱియు నవ్వాసుదేవార్జునులును, సాత్యకియునాయుధిష్ఠిరునకు నమస్కరించి, యచ్చోటు నుండి మోదమానమానసులై వెడలిరి. దుర్జయులగు సాత్యకిజనార్దను లొక్కరథ మధిష్ఠించి యర్జునుమందిరమునకుఁ బోయిరి. అటులేగి యచ్చో నాహృషీకేశుఁ డారథికశ్రేష్ఠుఁడగునర్జునునకు సూతునివలెఁ గపిధ్వజచిహ్నితమగు రథోత్తమము సన్నద్ధమొనర్చెను. అయ్యది మేఘస్వననిర్ఘోషమై మేలిబంగారుకాంతులొలయ బాలసూర్యునివలె వెలయఁజొచ్చెను. అప్పురుషోత్తముఁ డటులు సన్నద్ధమొనర్చి యాహ్నికమెల్లఁ దీర్చియున్న యప్పార్థున కవ్విధ మెఱిఁగించెను. పిదపఁ జాపబాణధరుఁడై సువర్ణకవచధారియై యక్కిరీటి పురుషవరేణ్యుఁడగు నవ్వాసుదేవునకుఁ బ్రదక్షిణమొనర్చి, తపోవిద్యావయోవృద్ధులును, గరిష్ఠులును, జితేంద్రియులు నగువారిచేఁ బొగడ్తలందుచు, వారిజయాశీర్వాదములతో నయ్యర్జునుఁడు రథ మధిరోహించెను. జయప్రదములును, సంగ్రామోపయోగులునునగు మంత్రములచే నభిమంత్రింపఁబడిన యారథోత్తమము నారోహించి తేజశ్శాలియగు నుదయభాస్కరుఁడువలె నతఁ డెంతయు నొప్పారెను. అటు లారథికశ్రేష్ఠుఁడు కాంచనకవచావృతుఁడై యక్కాంచనరథ మధిరోహించి మేరుగతుఁడగు దివాకరుఁడునా వెలయ,నపుడు సాత్యకి వాసుదేవులును నాయర్జును ననుసరించియే రథ మధిరోహించిరి అపుడు వారు శర్యాతియజ్ఞమునకు వెడలిన యింద్రుని వెంబడించు నశ్వినీదేవతలునాఁ జూపట్టిరి. అంత నమ్మురాంతకుఁడు మున్ను వృత్రుని వధించుటకై వెడలినవాసవునకు మాతలివలె నాయర్జునురథరశ్ములను బట్టికొని కూరుచుండెను. అటులప్పార్థుఁడు వారిరువురతోఁ గూడి యారథోత్తమము నధిష్ఠించి చీకటులఁ బాఱఁద్రోలుచు బుధశుక్రులతోఁ గూడియున్న చంద్రుఁడునాఁ జూపట్టెను. ఓరాజా! వైరిమర్దనుఁడగు నప్పార్థుఁ డటు లాసైంధవుని వధము గోరువాఁడై యాసాత్యకి జనార్దనులఁ గూడి వెడలి, తారకామయమగు నాకసమున మిత్రావరుణులతోఁ. గూడిన యింద్రుఁడువలెఁ బ్రకాశించెను. పిమ్మట వాదిత్రఘోషములతోడను, మంగళతూర్య

ములతోఁడను మాగధు లాయర్జునునిఁ బొగడిరి. అటులు జయాశీర్వాద ములతోఁడను, వాదిత్రఘోషముతోఁడను, సూతమాగధులసంస్తుతుల తోఁడను గూడినయప్పుణ్యాహము వారి కెంతయు సంతోషాదాయక మయ్యెను. అంత నప్పార్థునకు సంతోషమును నాతనిద్వేషులకు శోష మును గల్గించుచు, సుగంధబంధురమగు పిల్లగాలులు వీవసాగెను. ఓ రాజా! ఆక్షణ మవి జయప్రదములై వివిధములగు శుభనిమిత్తములు పెక్కులు ప్రాదుర్భవించెను. ఓయీ! ఇటులు పాండవులకు శుభనిమిత్త ములును, నీతనయులకు దుర్నిమిత్తములును గానవచ్చెను. అటులు తనకు జయప్రదములై ప్రదక్షిణముగాఁ గల్గు నిమిత్తములను గాంచి యర్జునుఁడు సాత్యకితో, 'ఓయీ! ఇపుడు నాకు విజయము నిశ్చయ ముగాఁ గానవచ్చుచున్నది. ఓశినిపుంగవా! ఇట్టి శుభచిహ్నము లగ పడుచుండుట నాసైంధవుఁ డున్న చోటికిఁ బోవుదును. వాఁడును యమ పురప్రయాణమునకు సన్నద్ధుఁడై నాపరాక్రమమును నిరీక్షించుచున్న వాఁడు. ఎటు లాసైంధవునివధము నాకవశ్యకర్తవ్యమో యటులే ధర్మజురక్షణమును బరమావశ్యకమైయున్నది. ఓమహాబాహూ! కావున నీవిపు డాధర్మజుని రక్షింపవలయును. నాకెటు లతఁడు రక్షణీయుఁడో నీకు నాతఁ డటులు రక్షణీయుఁడని తలంపుము. నిన్ను యుద్ధమున నోడించువాఁ డెవ్వఁడును నీలోకమున లేఁడు. వాసుదేవతుల్యుఁడవగు నిన్నాయమరేశ్వరుఁడును జయింపఁజాలఁడు. నీయందును మహారథుఁ డగుప్రద్యుమ్ననందును నాకు మిక్కిలి నమ్మిక. ఓయీ! నేనొకని నపే క్షింపకయే సైంధవునిఁ జంపఁజాలుదును. నాకుఁగా నించుకేని మీరెవ్వ రును నపేక్షింప నక్కఱలేదు. ఎల్లవిధముల నీ కారాజున్యనిరక్షణమే యవశ్యకర్తవ్యమై యున్నది. ఆతనిచెంత మహాబాహుఁడగు వాసు దేవుఁడు లేఁడుగదా! అతఁడును నేనును గలచోట నించుకేని యాపద గలుగదు' అని తెలుప విని సాత్యకి యందులకు సమ్మతించి, యుధిష్ఠిర ప్రభుఁడున్న చోటికి వెడలెను.'' అని తెలిపిన విని ధృతరాష్ట్రుఁ డిట్లనియె.

## ధృతరాష్ట్రుఁడు పరితపించుట

''ఓసంజయా! ఆరాత్రి వేఁకువ యగుడు దుఃఖశోకసమన్వితులై పాండవు లేమి యొనర్చిరి? అభిమన్యుఁడు హతుఁడగుడు వారు మన వారిలో నెవ్వరితోయుద్ధ మొనర్చిరి? ఆసవ్యసాచికృత్యములను దెలిసి

కొని కౌరవు లెటులు నిర్భయులై యుండిరి? పుత్రశోకాభిసంతప్తుఁడును, నంతకతుల్యుఁడును నై కోపముడర వచ్చు నాధనంజయు నాహవమున నెట్లు చూడఁగల్గిరి? మఱియుఁ గపిధ్వజుఁడై రణరంగమున మహా ధనువు ద్రిప్పుచుఁ బుత్రశోకపీడితుఁడై కుపితుఁడై యున్న య ప్పార్థుని మనవా రేమి యొనర్చిరి? ఓసంజయా! సుయోధనుని గుఱించి సంగ్రామమున నేమి జరిగెను? ఓయీ! వీనియెడ నాకు దుఃఖమే గాని సంతోష మించుకయుఁ గలుగకున్నది. మఱియు నాసైంధవుని యింట మున్ను వినవచ్చెడి, మనోజ్ఞములైన శబ్దము లిపుడు వినరా కున్నవి. నాతనయులశిబిరమందును స్తుతిపాఠములు వినఁబడకున్నవి. మున్ను వందిమాగధులయు నర్తకులయు గీతవాద్యములన్నియు నిపుడు వారు దీనులై యుండుటనో యట్టిశబ్ద మేదియు నాచెవిఁ బడకున్నది. అటులే సత్యధృతియింటను సోమదత్తునిగృహమందును మంగళవాద్య ములచప్పు డున్నట్లు లేదు. ఓసంజయా! మున్ను నాపుత్రులయింట నేను గూర్చుండునప్పుడు వినెడిసుశబ్ద మేదియు వినరాకుండుటయే గాదు. పుణ్యహీనుఁడనగు నాకు వారియింట సుత్సాహశూన్యముగా నార్త స్వరమే వినవచ్చుచున్నది. అటులే వివింశతియు, దుర్ముఖుఁడు, చిత్ర సేనుఁడు, వికర్ణుఁడు, నింకనుగల నాకొమరులును నిరుత్సాహులగుట నేమియో వెనుకటిశుభధ్వను లెవ్వియు వినరావు. ఓసూతుఁడా! బ్రాహ్మణక్షత్రియవైశ్యు లెవనికి శిష్యులై సేవించుచుండెడివారో! మఱియు నెవ్వఁడు నాపుత్రులకుఁ బ్రీతిపాత్రుఁడో! కౌరవులకేగాక యాదవపాండవులకును నెవ్వఁడు గౌరవింపఁదగినవాఁడో యట్టి ద్రోణ తనయునింట మున్ను వినంబడెడి వితండాలాప సంలాపములును, గీత వాదిత్రనినాదములును, నించుకేని నావీనులఁబడకున్నవి. ఇంకను నాతని యింట గాయకులును నర్తకులును నెంతయును బ్రతిదినమును స్తుతి పాఠములను జేయుట గలదు. అదియు నిపుడు గానరాకున్నది. ప్రతి సాయంసమయమందును, విందానువిందులశిబిరమునను, నటులే కైకే యులనివాసములందును, నిత్యము వినవచ్చెడి తాలగీతధ్వనులును, నర్త కులనాట్యపుఁజప్పుడులును నిపుడు వినరావుగదా! యాగక్రియల నిర్వ ర్తించుచు నిత్యము నెవ్వనిని యాజకులు విడువకుందురో వేదనిధియగు నట్టి భూరిశ్రవు శిబిరమున నిపుడు వారియారావములు వీనులవిం

కొనర్పకున్నవి. అనారత మా ద్రోణునింట జ్యాఘోషవేదఘోష
ములు వినవచ్చెడివి. ఏలకో! ఇపు డవి వినరావు. మఱియు నానా దేశ
ములనుండి వచ్చినవారిగీతవాదిత్రనాదములును నిపుడు వినఁబడకున్నవి
గదా! ఓసంజయా! జనార్దనుఁడు సకలప్రాణులయెడను దయగలిగి
వానికి శాంతిసమకూరునటు లొనర్ప నెపు డుపప్లావ్యమునుండి మన
కడకు వచ్చెనో యానాఁడే నే నాసుయోధనునితో, 'ఓపుత్రకా!
వాసుదేవుఁడే మనకు మార్గముగాఁ బాండవులతో సంధిచేసి
కొమ్ము. కాలము వచ్చినట్లు నాకుఁ బొడకట్టుచున్నది. కావున నీవు
తప్పుత్రోవఁ ద్రొక్కకుము. ఆవాసుదేవుఁడే యొకపుడు శాంతినిగోరి
హితముగాఁ బలుకువాఁడేని, నీవు దానిని ప్రత్యాఖ్యానముచేయరాదు.
చేసితివేని నీకు యుద్ధమున జయము గలుగనేరదు అని తెలిపితిని. కాని
ధనుర్ధరోత్తముఁడగు నాదాశార్హుఁడు ప్రియములు పల్కుచున్నను,
నీతిమార్గము తప్పి యాతనివచనముల నాతనయుఁ డొప్పఁడయ్యెను.
అంతియగాక కర్ణదుశ్శాసనులమతము పట్టి కాలవశుఁడై మతిచెడి నా
మాటను సమ్మతింపకుండెను. నేనుగాని విదురుఁడుగాని యాద్యూత
మును సమ్మతింపలేదుగదా! అటులే సైంధవుఁడును, భీష్ముఁడును, శల్య
భూరిశ్రవసులును, జయపురుమిత్రులును, ద్రోణకృపాశ్వత్థామలును
నంగీకరింపరైరి. ఓసంజయా! నాపుత్రుఁ డీమామత మంగీకరించెనేని
జ్ఞాతిమిత్రపరివారసమేతముగాఁ జిరంజీవియై యెట్టియపాయమును లేక
సుఖింపకుండునా? మృదుమధురముగా జ్ఞాతులనడుమఁ బ్రియము పలుకు
వారై ప్రాజ్ఞులనిపించికొనిన పాండవులు సుఖింపకమానరు. ధర్మాపేక్షి
యగుమానవుఁ డెల్లవిధముల నెల్లపుడును సుఖింపకుండునా? అట్టివాఁడు
మరణించియు సుఖమును శుభమును బొందుచున్నాఁడు. మఱియు
సామర్థ్యమే సాధనముగాఁగల యప్పాండవు లిప్పుడమిఁగలయర్థము లను
భవింపఁదగియున్నవారు. కావునఁ బితృపైతామహమై చతుస్సముద్ర
ముద్రితమగు నిర్ధరామండలమెల్ల వారిదే యగును. అప్పాండవులే
ధర్మమార్గమును విడువక పుడమిఁ బాలించువారు. 'ఓయీ! ఇంకను
గొందఱు జ్ఞాతులు నాకుఁ గలరుగదా. పాండవులు వారిమాట నంగీ
కరింతురు. శల్యసోమదత్తులును, భీష్మద్రోణులును, వికర్ణుఁడు, బాహ్లీ
కుఁడు, కృపుఁడు నింకను మహాత్ములగు భారతవృద్ధులును గలరు. వారెల్ల

స్నీకై పాటుపడుచు, హితవచనములు సమ్మతింతురు. నీవేమి తలంచు చున్నవాఁడవోగాని వారిలో నెవ్వఁడును శ్రీకృష్ణునిమాటకు విరుద్ధముగాఁ బలుకువా రుండరు. కృష్ణుఁ డెన్నఁడును ధర్మమును వీడఁడు. ఆతనివారును నట్లు ధర్మమతిక్రమించువారు గారు. ధర్మాత్ములగు పాండవవీరులకును నేను ధర్మపథము దెలిపితిని. వారును వేఱుత్రోవఁ ద్రొక్కువారు గారు.' అనియుఁ బలుమాఱులు మొఱపెట్టుచు నాపుత్రునకుఁ దెలిపితిని. కాని మూఢుఁడగు నాపుత్త్రుఁ డది వినఁడయ్యెను. ఇదియెల్ల గాలవిపర్యాసమని తలంపక తప్పదు. భీమార్జునులును, వృష్ణివీరుఁడగు సాత్యకియు, యుధామన్యూత్తమౌజులును, ధృష్టద్యుమ్నుఁడును, శిఖండియుఁ, గైకయులు, సోమకపుత్త్రుఁడగు క్షత్రధర్ముఁడును, జేకితానుఁడును, ద్రౌపదేయులును, విరాటద్రుపదులును, నకులసహదేవులును, మంత్రియైనమధుసూదనుఁడును వారికిఁ గలరుగదా! ఈలోకమునఁ గొంతకాలమేని జీవింపఁదలఁచినవాఁ డెవ్వఁడు నాచెప్పినవారిని యుద్ధమున మార్కొనఁగలఁడు? మార్కొనియుఁ బరమాస్త్రములతోఁ బని చేయు నాయోధులను సహించువా రెవ్వరు? కర్ణుఁడును, దుర్యోధనుఁడును, శకునియు, దుశ్శాసనుఁడును దక్క వేఱెవ్వరును నేఁ దెలిపిన పాండవయోధులను మార్కొనఁ దలంపరు. ఎవ్వరి కావిష్వక్సేనుఁడు పగ్గములుపట్టుసారథియుఁగా నర్జునుఁడు యోద్ధయై యున్నవాఁడో యట్టివారికిఁ బరాజయమన నెట్టిది? పిదప మనవారివిలాపముల నీ దుర్యోధనుఁడు వినఁడుగదా! పురుషవ్యాఘ్రులగుభీష్మద్రోణులు హతులగుట నీవే తెలిపితివి. దీర్ఘదర్శియగు విదురునివచనములకుఁ గల్గిన యీఫలము నారసి నాతనయులు శోకించుచున్నవారని తలంతును. అర్జునసాత్యకులచే నథఃకరింపఁబడినసైన్యమును శూన్యములగు మనవారిరథమధ్యములను గాంచి నాపుత్త్రులు శోకించువారని తలంతును. ఓసంజయా! ఇంతయేల! ఆధనంజయుఁడు మావారిసైన్యములనియెడి యెండినగడ్డిప్రోవునకు ధనంజయుఁడై వాసుదేవమారుతము ప్రేరింప, మావారినెల్ల దహింపక మానఁడు. ఓయీ! నీకు విసుగు లేదేని దాని నెల్ల నా కెఱిఁగింపుము. అభిమన్యు నటులు పరిమార్చి యర్జునునకు ద్రోహమొనర్చివచ్చిన మనవారిచిత్తము లెటులుండెను? ఆగాండివధన్వునకు గొప్ప యపకారమొనర్చిన మనవారిలో నొకఁ డాతని యుద్ధమున

సహించినవారెవ్వరు? అట్టిపట్టునఁ గర్ణదుర్యోధనులయు, శకునిదుశ్శా సనులయుఁ గృత్య మెట్టిదై యుండెను? వారేమి పలికిరి? ఓసంజయా! నా పుత్రులెల్లఁ గూడికొన నాసంగ్రామమున నేమయ్యెను? మందుఁడును, లోభశీలియు, మాత్సర్యశాలియుఁ, గ్రోధోపహతుఁడును, రాజ్య కాముఁడునగు నాసుయోధనుని దుర్నీతియు సునీతియు నెట్టివై యుం డెనో నాకెఱిఁగింపుము." అని ప్రశ్నింప విని సంజయుఁడు మఱియు నిట్లనియె.

సంజయుఁడు సైంధవవధయుద్ధమును జెప్ప నారంభించుట

"ఓయాంబికేయా! నీవడిగినదెల్లఁ బ్రత్యక్షముగాఁ జూచితిని. అయ్యో! ఇదియెల్ల నీయపనీతికిఁ గల్గినఫలము. దీని నిఁక స్థిరచిత్తుఁడవై వినుము. ఈ నీవిలపించుట యెంతయును గతజలసేతుబంధముగాఁ గాన వచ్చుచున్నది. ఇది నిష్ఫలమగుట నిఁక వలదు. ఓరాజా! అద్భుతమగు నిక్కృతాంతునికృత్యము తప్పింపరానిది. పురాకృతమైన కర్మమునకు నీవు శోకించుటేల? నీవే నాఁడాద్యూతమునుండి ధర్మజుని, నీపుత్రు లను నివారించియుంటివేని, యిట్టివ్యసనము నీకు వచ్చియుండునా? దాని నటుండనిమ్ము. యుద్ధకాలము వచ్చినపుడైన నీవు వారిని మఱలించియుం దువా? నీకిట్టివ్యసనము రాకుండునే! ఓరాజా! మున్ను నీ వాయవిధే యుఁడగు సుయోధనుని వారించినచో, వారిని గాంచుచు గొప్పకీర్తి నొందఁగల్గియుందువే! ఇదియెల్ల నీబుద్ధిప్రమాదమని జనులు నిందింపక మానరు. పాంచాలురును, వృష్ణులును, నింకనుగలరాజులును నిన్ను దూషింపక మానరు. నీవు తండ్రివోట నీవానర్పందగుపని యొనర్చి, పుత్రుని మంచిత్రోవనడపితేని,నీకిట్టియాపద వచ్చియుండునా? నీవు లోక మున బుద్ధిమత్తరుఁడ వనిపించికొనియు, సనాతనధర్మమును విడిచి, కర్ణ దుర్యోధనులయు శకునిదుశ్శాసనులయు మతము ననుసరించి పోయితివి. ఇపు డిటులు విలపించుచున్నవాఁడవు. ఈనీకృత్యమెల్ల విషమిశ్రితమగు తేనెవలె నాకుఁ గానవచ్చుచున్నది. ఓరాజా! నీవు తలంచినట్టు లావాసు దేవుఁడుగాని, ధర్మజుఁడుగాని, భీష్మద్రోణులుగాని తలంపలేదుగదా! ఎపుడు నిన్నా శ్రీకృష్ణుఁడు పైకి ధర్మములు దెల్పుచు రాజ్యలుబ్ధునిఁగాఁ దెలిసికొనియెనో నాఁటినుండి నీకు మున్నాతఁ డొసంగినగౌరవ మొసంగ

లేదు. నీవా రప్పాండవుల నాడరానిమాట లాడినను నీ వుపేక్షించితివి గాదే! పుత్రరాజ్యకాముకుఁడవగు నీకిపుడు దానిఫలము సంప్రాప్తించెను. ఓరాజా! వారికిఁ బితృపైతామహమై వచ్చురాజ్యమును దీసికొంటివి. మఱియుఁ బార్థు లార్జించుకొన్న పుడమియెల్ల నాక్రమించితివి. పాండువిభుఁడు కౌరవులకు రాజ్యమును గీర్తిని గల్గించినవాఁడు. ధర్మాత్ములగుపాండవుల కిది యధికధనముగదా! వారి యిట్టిసత్ప్రవర్తన మెల్ల నీయెడ నిష్ఫలమైనది. కానిచో నామిషలోలుపుఁడవై యిటులు వారిపిత్ర్యమగు రాజ్యమునుండియు వారిని దొలఁగింతువా? పోనీ! మఱల యుద్ధకాలమందేని నీవు నీపుత్రులదోషములన్నిటిని వ్యక్తపఱిచి వారిని దూషించితివేని, యిది యిపు డిటులు సంభవించి యుండునా? పాండవసైన్యమును జొచ్చిన మనయోధులు యుద్ధముచేసినను దమ ప్రాణములను రక్షించుకొనఁజాలరు. కృష్ణార్జునులును, భీమసాత్యకులును రక్షకులైయుండఁగా నప్పాండవసైన్యము నాసుయోధనుఁడు తప్పఁ దక్కినవాఁ డెవ్వఁ డెదుర్కొనును? వారికి యుద్ధమంత్రి జనార్దనుఁడును, యోధుఁ డర్జునుఁడునై యుండ భీముఁడును, సాత్యకియు రక్షకులై పోరాడ నట్టిసైన్యమును గౌరవులును, వారి ననుసరించు కొందఱును దక్క నెవ్వ రెదుర్కొందురు? వారి నెవ్వరు సహింతురు? అవసరజ్ఞులును, క్షత్త్రియధర్మపరులును శూరులునగు రాజపుత్త్రుల కెంతవఱకు శక్యమగునో యంతవఱకును గౌరవులు పోరాడుదురు. ఓరాజా! పురుషవరేణ్యులగుపాండవులఁ దలపడినకౌరవుల కెట్లు కష్టములు సంభవించెనో యదియెల్ల నున్నదున్నటులు తెలిపెదను విను" మని సంజయుఁ డిట్లనియె.

## ద్రోణుఁడు శకటవ్యూహమును బన్నుట

"ఓరాజా! నాఁటిరాత్రి గడవ ధనుర్ధరోత్తముఁడగు ద్రోణుఁడు తనసైన్యములనెల్ల వ్యూహముగా నొనర్చుట కారంభించెను. ఓరాజా! అపుడు పరస్పరవర్ధైషులై గర్జించుచుఁ, గుపితులై వీరాలాపములాడు శూరులు కొందఱు విచిత్రముగా సంభాషించుకొనసాగిరి. మఱికొందఱు ధనుష్టాంకారము లొనర్చువారును, నారులు సారించువారునై బుసలు వెట్టుచు ధనంజయుఁ డెక్కడ? అని యఱచువారైయుండిరి. వేఱొక

కొందఱు మంచిపిడులుగల్గి వాఁడిరైయై యొఱవెలికిన నల్లనికత్తులను త్రిప్పుచు నైవసాగిరి. ఇటులు ఖడ్గప్రకారములను ధనుర్మార్గములను దెలిసినశిక్షితులగు శూరులు యుద్ధాభిలాషులై వేలకొలఁదిగా నందుఁ జూపట్టిరి. మఱియు గంటలు వెలయఁ జందనముచేఁ బూయఁబడి సువర్ణ వజ్రవిభూషితములైనగదలను గొందఱు త్రిప్పుచుఁ బాండవుని వెదక నారంభించిరి. మదోన్మత్తులగు మఱికొందఱు బాహుబలశాలులు పరిఘ ములను నింద్రధ్వజములనుబోలె నాకాశమున వెలయింపఁదొడంగిరి. మఱియు నానావిధప్రహారములను బూని విచిత్రమాల్యాభరణులై యుద్ధాభిలాష మెండగుచుండఁ, గొందఱు శూరు లందందు నిలుపఁబడి యుండి 'ఆయర్జునుఁ డెక్కడ? ఆగోవిందుఁ డెందున్నవాఁడు? భీముఁ డేడీ? వారిమిత్రు లెందున్నవారు?' అని యారణరంగమునఁ బిలువ సాగిరి. పిదప ద్రోణుఁడు శంఖము పూరించి గుఱ్ఱములను వడిగా నటు నిటు తోలుచు వ్యూహరచన మొనర్పసాగెను. అంత నాసైన్యములెల్ల యుద్ధాభిలాష వెలయ నందందు నిలుపఁబడియుండ నాద్రోణుఁడు సైంధ వునితో, 'ఓయీ! నీవు, భూరిశ్రవుఁడును, కర్ణుఁడును, నశ్వత్థామయు, శల్యుఁడును, వృషసేనుఁడును, కృపుఁడును, నీకు రక్షకులుగా నొకలక్ష గుఱ్ఱములును, నరువదివేవురు రథికులును, బదునాల్గువేల మత్తగజము లును, గవచధారులైన యిరువదియొకవేవురు పదాతులును నిన్నుఁ జుట్టి యుండ, నా కాలు క్రోశములదూరమున నుండుము. అందున్న నిన్నుఁ జెనకుట కాయింద్రునితోఁ గూడినదేవతలును జాలరు. పాండవులు నిన్నెటులు చేరఁగలరు? కావున నోసైంధవా! నీకుఁ జింతిలఁ బనిలేదు.' అని తెలుప నాజయద్రథుఁడు శాంతచిత్తుఁడై మహారథులగు నాయా గాంధారులఁ గూడి వెడలెను. ఆతనికిఁ గవచధారులై పాశపాణులగు కొందఱురౌతులు మిక్కిలి ప్రయత్నముగల్గి కాపుగా నుండిరి. ఆతని గుఱ్ఱములు చామరశిరోభూషణములలర సువర్ణభూషణభూషితములై లెస్సగాఁ బరువిడునవియై యుండెను. అట్టివయగు పదివేలగుఱ్ఱములును, కుశలులగునారోహకులు తమ్మధిష్ఠింప మదించి, భీకరాకారములై కవచ ములుగల్గి రౌద్రకృత్యము లొనర్చు పదునైదువందల యేన్గులును దన వెంటరా నీపుత్త్రుఁడగు దుర్ధర్షణుఁడు సర్వసైన్యములకు ముందు నిలిచి యుద్ధముచేయువాఁడై యుండెను. పిదప నీకొమరులగు దుశ్శాసనవిక

ర్ణులు సైంధవరక్షణమునకుఁగా నాయుగ్రసైన్యమున జాగరూకులై యుండిరి. ఆవ్యూహముపొడ విరువదినాలుగుక్రోశములదూరమును వెనుకఁ బదిక్రోశములవిస్తృతియుఁ గల్గి చక్రశకటాకారముగా నాభారద్వాజునిచే నిర్మింపఁబడియెను. మఱియు నతఁ డావ్యూహమున నందందు నానాదేశాధీశుల నుంచి, గజాశ్వరథపదాతిసమూహములను నందందు నిలిపెను. దానిపశ్చిమార్ధమున గర్భవ్యూహముగాఁ బద్మవ్యూహమును బన్ని దానిగర్భమున సూచీవ్యూహమును గూఢముగాఁ బన్ని, యిటులు మహావ్యూహ మొనర్చి, యాసూచీవ్యూహము నగ్రమున మహారథుఁడగుకృతవర్మ నునిచెను. వానివెనుకఁ గాంభోజుఁడగు జలసంధుఁడును, వానివెనుకఁ గర్ణదుర్యోధనులును, వారివెనుక యుద్ధశూరులగు నొకలక్ష యోధులును నిలుపఁబడిరి. శకటముఖరక్షకులగు వారివెనుక నా సూచీపార్శ్వమున గొప్పసైన్యములచేఁ జుట్టంబడి సైంధవుఁడు నిలుపఁబడియెను. ఆశకటముఖమున భారద్వాజుఁడు నిలువఁబడియుండెను. ఆతనికి రక్షకుఁడై వెనుకనే భోజుఁ డుండెను. అంతఁ దెల్లనికవచముగలిగి, మేలిపాగ వెలయు నాద్రోణుఁడు ధనుష్టాంకార మొనరించుచుఁ, గుపితుఁడగునంతకుఁడునా నుండెను. పతాకియు, శోణహయుఁడును, వేదీకృష్ణాజినధ్వజుఁడునునగు ద్రోణునిరథ మాలోకించి కౌరవులెల్లరును సంతుష్టాంతరంగులైరి. అటు లాద్రోణునిచేఁ గల్పింపఁబడి క్షుబ్ధమగుసాగరమునుబోలు నావ్యూహమును గాంచి సిద్ధచారణప్రభృతు లమేయవిస్మయమునొందిరి. కొండలును, సముద్రములు, నడవులును, నానాదేశములును గల్గినయియ్యిలనెల్ల నీవ్యూహ మొక్కపెట్ట మ్రింగునని యెల్ల ప్రాణులును దలంచెను. పెక్కుగజాశ్వరథములును, బదాతులునుగల్గినట్టియు, వైరులకు వెఱపుగూర్చునిస్వనముగల్గు యద్భుతాకారమై, శత్రుహృదయభేదనమగు నామహావ్యూహము నారసి, సుయోధనుఁ డెంతయు సంతసించెను." అని తెలిపి సంజయుఁడు మఱియు నాధృతరాష్ట్రునకి ట్లనియె.

### అర్జునుఁడు రణరంగమును జొచ్చుట

"ఓయాంబికేయా! అటు లాసైన్యములు వ్యూహములుగా నేర్పడి యెంతయు వెలయ, భేరీమృదంగాదులు మ్రోగుచుండ నటులే

సైన్యములనాదమును, వాదిత్రములధ్వనియు, శంఖధ్వానమును మేను లకు గగురుపాటొదవింప భారతయోధు లొకరొకరే యుద్ధాభిలాషులై యాదరించుచుండ భయంకరమైనముహూర్తము ప్రాప్తింప నపుడు సవ్యసాచి యందుఁ గానవచ్చెను. అపు డాసవ్యసాచియెదుటఁ గాకుల మూఁకలును, మాంసరక్తసక్తములగు రక్కసులసంఘములును, నాడఁ దొడంగెను. మఱియు ఘోరారావములగుమృగములును, నశుభసూచకములగునక్కలును, యుద్ధసన్నద్ధులై వెడలినమనవారికి దక్షిణముగా నఱవఁదొడంగెను. పిడుగులతోఁగూడి ప్రజ్వలించుచు వేలకొలఁదిగా నుల్కలు రాలఁజొచ్చెను. అటులు ఘోరభయము ప్రాప్తింపఁగాఁ బుడమియెల్ల వడఁకఁదొడంగెను. మఱియు నెల్లెడల భయంకరములై గులకఱాలు గుఱియుచు గాలులు వీవఁదొడఁగెను. నకులపుత్త్రుఁడగు శతానీకుఁడును, ధృష్టద్యుమ్నుఁడును, బాండవసైన్యములను వ్యూహములుగా నేర్పరిచిరి. పిదప వేయిరథములును, నూఱేన్గులును, మూఁడు వేలగుఱ్ఱములును, లక్షపదాతులును వెంటనంటియుండ, నేనూఱువిండ్ల దూరమున సకలసైన్యములకు ముందుగా నున్న నీతనయుఁడగు దుర్మర్షణుఁడు తనవారితో 'ఓవీరులారా! రణగర్వితుఁడై ప్రజ్వలించుచున్న యగ్గాండీవధరు నిపుడే సాగరమును వేలవలె నిదె యాపుచున్నవాఁడను. ఱాలప్రోవునం దగుల్కొనినఱాలప్రోవునాఁదగు నన్ను మాఱొక్కొనిన యాధనంజయు నిపు డారయనది. మీరును యుద్ధోత్సాహులై వెఱవక నిలువుఁడు. నాయశోమానములు వర్ధిలునట్లుగా నిదె యిటులు ప్రోవుపడియున్నవారితో యుద్ధమొనర్తును.' అని పలుకుచు నతఁడు తన రథికులతోఁగూడి ధనుర్ధరుఁడై యుండెను. అర్జునుఁడును నంటరాని యగ్నిని, వజ్రధరుఁడగువాసవుని, సహింపరానిదండపాణిని, గాలచోదితమగు మత్యువును, గదల్పరానిశూలపాణిని, బాశహస్తుఁడగువరుణునిఁబోలి, జ్వాలామయమగు యుగాంతాగ్నినాఁ బ్రజ్వరిలుచు, జంగమస్థావరములఁ గాల్చునా యని దోపించుచుఁ, గ్రోధావేశపరవశుఁడై నివాతకవచాంతకుఁడగు నతఁడు తనప్రతినఁ బూరించువాఁడై కవచ ఖడ్గములనుబూని సువర్ణకిరీటధారియై శుభ్రమాల్యాంబరధరుఁడై కుండలాంగదములకాంతులలోలయ వెలయుచు, రథవరేణ్యమధిష్ఠించి, నారాయణసహాయుఁడై గాండివము ద్రిప్పుచు, నుదయించినయాదిత్యుఁడునా

నారణాగ్రమున నొప్పారెను. అటు లాసైన్యాగ్రమున నొకబాణపాత దూరమున రథమునిలిపి తనప్రతాపమేర్పడ శంఖమును బూరించెను. ఓరాజా! పిదప నప్పార్థునితోఁగూడ వాసుదేవుఁడును శంఖప్రవరమగు తనపాంచజన్యమును బూరించెను. ఓయీ! ఆశంఖముల ప్రకృష్టనాదముచే మనసైనికులు మేనులు గగుర్పొడువ వడఁకుచుఁ, బిడుగుచప్పుడుల కెల్లభూతములువలె జడిసిరి. వాహనములన్నియు మూత్రపురీషములను స్రవింపఁజేయ నారంభించెను. ఇటులే మనబలమెల్ల జడిసినిశ్చేష్టమై యుండెను. ఓమారిషా! పదాతులందఱును మూర్ఛమునిఁగిరి. కొందఱు వడఁకిరి. పిదప ధనంజయునిధ్వజాగ్రమున మఱికొన్ని భూతములతోఁగూడియున్న యక్కపి నోరుతెఱచి మహానాదమొనర్చుచు, నీసైన్యమునకు వెఱపుగొలుపసాగెను. పిదప నీవారిసైన్యములకుఁ బ్రోత్సాహమగునట్లుగా భేరీమృదంగానకనినాదములును, శంఖారావములును జెలరేఁగెను. అంత నానావాదిత్రనినాదములతోడను, భుజాస్ఫాలనములచప్పుడులతోడను, సింహనాదములతోడను,నటునిటుదిరుగు రథములధ్వనులతోడను సంకులమై భయంకరమైయున్న యామహాశబ్దమున నెంతయు సంతుష్టుఁడై యప్పార్థుఁడవ్వాసుదేవునితో నిట్లనియె.

### అర్జునునియుద్ధప్రకారము

'ఓహృషీకేశా! మనరథ మాదుర్మర్షణుఁడున్న చోటికిఁ బోనిమ్ము. మున్ముగా వానిగజసైన్యమును భేదించి శత్రుసైన్యమునఁ బ్రవేశించెదను.' అని పలికెను. ఓరాజా! అది విని యావాసుదేవుఁ డాయర్జునుఁడుచెప్పినచొప్పున నాదుర్మర్షణుఁడున్న చోటికి రథము నడుప, నందు రథగజాశ్వాదులప్రాణహానికరమగు దారుణయుద్ధ మాయర్జునితోఁ బెక్కురకు జరిగెను. అపు డప్పార్థుఁడు పర్జన్యుఁడు వర్షముచేఁ బర్వతమునువలెఁ దనసాయకవృష్టిచే నందున్నవైరులనెల్లఁ గప్పి, కుపితుఁడై వైరులు తన్ను నివారించుచున్నను నాఁగక రథికులశరీరములనుండి తలలఁ గూలఁద్రోయ నారంభించెను. అపుడు సంగ్రామభూమి పైకివెడలినగ్రుడ్లుగల్గిన మొగములతోడను, గఱచికొనినపెదవులు గలవారితోడను కుండలకిరీటాదులతోడను నిండియుండెను. ఒక్కొకచోఁ జెదరనివన్నెగలమొగములచేఁ బద్మవనముచేవలెఁ బుడమి

యెంతయు శోభిల్లెను. కొన్నిచోట్ల సువర్ణవిచిత్రభూషణము లలర రక్త సిక్తములై మెఱుపులతోఁగూడిన మేఘములునాఁ గొందఱు యోధులు పడియుండిరి. ఓరాజా! కాలపరిపక్వములై నేలగూలెడు తాలఫలములఁ బోలి పుడమిఁబడియెడి తలలచప్పుడు లెంతయు గొప్పలై విననయ్యెను. ధను వెక్కిడి బాణముగూర్చి యొకకేల ఖడ్గ మొరవెఱికి పట్టుకొనియున్న భుజముతో నొక మొండెము పైకివెడలెను. జయకాంక్షియగు నక్కౌంతేయుని సహింపనివారై పడుచున్నతలలఁ దెలియకయే పోరాడు చుండిరి. గుఱ్ఱములపుఱ్ఱెలతోడను, నేనుఁగులతొండములతోడను, వీరుల శిరోబాహువులతోడను బుడమి పాడగానకుండునట్లు కప్పఁబడియెను. 'వీఁడుగో! పార్థుఁడు. పార్థుఁ డేఁడీ! ఇదె పార్థుఁ డిందేయున్నవాఁడు' అనియును, 'ఓపార్థా! ఇందులకు రమ్ము. నిలువుము. ఎందులకేగెదు?' అనియును బలుకు నీసైన్యములలో నెందుఁ జూచినను బార్థుఁడే గాన వచ్చెను. ఆ నీసేనయెల్లఁ బార్థమయమయ్యెను. కొందఱు పరస్పరమును గొట్టుకొనిరి. మఱికొందఱు తమ్ముఁదామే కొట్టుకొనిరి. మనయోధులు కాలమోహితులై తెలియక యారణరంగమెల్ల నర్జునమయముగాఁ దలంచిరి. అందుఁగొందఱు రక్తములు గ్రక్కుచుఁ జైతన్యముతప్పి వేదనల కోరువఁజాలక తమబంధువులను స్మరించువారై వీరు లనేకులు వీరశయనముల శయనించిరి. భిందిపాల, ప్రాస, శక్తి, పరశ్వధ, నిర్వ్యూహ, నిస్త్రింశ, శరాసన, తోమరాదులతోఁ గూడినవియు, బాణవర్మాభరణ గదాంగదములతోఁ గూడినవియునై పరిఘతుల్యములగు బాహువు లనేకములు నేలఁగూలఁజొచ్చెను. ఓరాజా! ఆయర్జునుపరమశరపరంపరలచే హతులై చుట్టికొనిపోవువారును, గిజగిజ గింజుకొనువారును, దొరలువారునై పడియుండిరి. ఎవ్వఁడెవ్వఁ డప్పార్థున కెదురుపడి చరించెనో వానివానిశరీరమున కంతకమై బాణ మొకటి తాఁకుచువచ్చెను. రథమార్గములఁ జరించుచు, ధనువులాగుచు నున్నయప్పార్థుని బాణప్రయోగమునకు లేశమేని యవకాశ మెవ్వఁడును గనిపెట్టఁజాలకుండెను. మఱియు నాతనిశరసంధానశరప్రయోగలాఘవములకు వైరులునై తమువిస్మయమొందసాగిరి. మావంతునితోఁగూడ నేనుఁగును, రౌతుతోఁగూడ గుఱ్ఱమును, సారథితోఁగూడ రథికుని నప్పార్థుఁ డొక్కొకకోలచేఁ గూలనేయుచువచ్చెను. ఆయర్జునుఁడు తనపైకి వచ్చుచున్నవానిని,

వచ్చినవానిని, దనతో యుద్ధముచేయుచున్నవానిని, దనయెదుటనున్న వానిని జంపక విడిచెననుట లేదు. సూర్యుం డెట్లుదయించుచునే గొప్ప చీఁకటులఁ ద్రోలునో యటు లాయర్జునుఁడు తనవాఁడికోలలచే గజసైన్యమును దునుమాడుచువచ్చెను. అతఁడు సూలద్రోసినయేన్గులచే నీసైన్యము ప్రళయకాలమున విచ్ఛిన్నములగు పర్వతములచేఁ బుడమి వలెఁ గానవచ్చెను. ప్రాణులకుఁ జూడ రాని పట్టపగలింటిసూర్యుఁడువలె నప్పార్థుఁ డపుడు వైరులకుఁ దేఱిచూడరాకుండెను. ఓరాజా! అటులు నీవారిసైన్యము శరపీడితమై చెదరినదియు, బెదరినదియుఁ, బరువిడునదియు నై పెనుగాలిచే మేఘబృందమువలె నిలువఁజాలకుండెను. అట్లు పరువిడు నీసైన్యము నెవ్వరును దేఱిచూడఁజాలరైరి. ప్రతోదముల తోడను, ధనురగ్రములతోడను, హుంకారములతోడను, గొరడాదెబ్బలతోడను, మడమపోటులతోడను, బరుషవచనములతోడను నొప్పించి, గుఱ్ఱములను వడిగాఁ దోలుచు, నీవారియోధులు పరువులు వాఱఁజొచ్చిరి. మఱికొందఱు రౌతులును, బడాతులును, మావంతులును, నంకుశాదిసాధనములచే నేన్గులు మున్నగువానిని దఱుమసాగిరి. వేఱొకకొంద ఱాతనిశరప్రహారములచే మతిచెడి నిరుత్సాహులై యాతని కెదురుగనే పోసాగిరి" అని తెలుప విని యాసంజయునితో మఱియు ధృతరాష్ట్రుఁ డిట్లనియె.

## అర్జునుఁడు దుశ్శాసను నోడించుట

"ఓసంజయా! అటు లక్కిరీటి వధింప మనవారిసైన్యము భగ్నమై చెదరుటను గాంచి మనవీరు లెవ్వరే నాధనంజయు నెదుర్కొనిరా? లేక శాకటవ్యూహమునకుఁ బ్రాకారభూతుఁడైయున్న యాద్రోణు నాశ్రయించి నిర్భయులై తమనిశ్చయముల వ్యర్థముచేసికొనియుండిరా?' అని ప్రశ్నించెను.

అది విని యాసంజయుఁ డాతనితో "ఓయనఘా! వినుము. అటు లర్జునుచే నీసైన్యము భగ్నమై వీరులు హతులై యుత్సాహము చెడి చెదరఁగా, నాసంగ్రామమున నాతనిశరప్రహారముల నోర్చువాఁ డొకఁడును గానరాకుండెను. అపు డట్లు చెదరిన నీసైన్యమును గాంచి నీకొమరుఁడగు దుశ్శాసనుఁడు కుపితుఁడై యర్జునుతోఁ బోరాడ

వెడలి, కాంచనవిచిత్రకవచధారియు, సువర్ణమయకిరీటమును ధరించినవాఁడునై గొప్ప గజసైన్యముతో నిప్పుడమిని మ్రింగుచున్నవాఁడునాఁదగి, యాసవ్యసాచి నెదుర్కొనియెను. అప్పుడు గజఘంటారావములయు, శంఖధ్వానములయు, ధనుష్టంకారములయు, గజబృంహితములయుఁ జప్పు డప్పుడమి నావరించెను. యువరాజగుదుశ్శాసనుఁడు బలగర్వితుఁడును, బింగలవర్ణుఁడును, బ్రియదర్శనుఁడునై రెండు గడియలు దారుణాకారుఁడై గానవచ్చెను. అంత నంకుశపుఁబోటులు వడి వడిగా వెడలి తొండములువ్రేలాడ ఱెక్కలుగలపర్వతములు నాఁదగి పతాకాశతసంకులమై తనపైకివచ్చు మనవారిగజసైన్యము నతఁ డెల్లెడలఁ బీడింపఁ, బెనుగాలిచే నెగసి తరంగితమగు మహాసాగరమునా మనసైన్య మపుడు చూపట్టెను. అటు లాకిరీటి యగ్గజసైన్యమును మకరమువలెఁ బ్రవేశించుచునే యుగాంతభానునివలెఁ బ్రజ్వరిలుచు నెల్లదిక్కులఁ దానయై గానవచ్చెను. అపు డాతనిగుఱ్ఱముల డెక్కలచప్పుడును, రథనేమిధ్వనియు, వింటినారియారావమును, నానావాద్యత్ర ధ్వానమును, బాంచజన్యనినాదమును, దేవదత్తఘోషమును విని, మనవారు మందవేగులై మతిచెడి నిశ్చేష్టులైరి. అంత నాయర్జునునిశరప్రహారహతములై మనవారియేన్గులు పంకప్రదేశముల మునిఁగి నవివోలెఁ గదలఁజాలక నశింపఁజొచ్చెను. మఱియు నగ్గాండివధరుని వింటినుండి యొక్కమాఱుగా వెడలి, వృక్షములపైకి గుంపులుగుంపులుగా వెడలినతుమ్మెదలునాఁదగి పుంఖమాత్రావశిష్టములై మేనులఁ జొచ్చి రక్తప్రవాహములను బ్రవహింపఁజేయు నక్కిరీటిశరపరంపరలచే హతములై మహారావము లొనర్చుచు, ఱెక్కలుదెగినకొండలునామన వారియేన్గులు నేలఁగూలసాగెను. మఱికొన్ని యేన్గులు దంతమూలములందును, గుంభస్థలములందును, గండస్థలములందును, శరప్రహారములు వడి, మఱిమఱియుఁ గ్రౌంచపర్వతమునా మొఱయఁజొచ్చెను. మఱియు గజారోహకులగుమావంతులతలల నాయర్జునుఁడు గట్టిగాఁ దివిచివైచిన భల్లములచే నఱుకుచువచ్చెను. కుండలములతోఁగూడి నేలఁగూలు శిరస్సంఘాతములచేఁ బద్మముల ప్రోవుచేవలె నాభూదేవి కతఁ డుపహారమొనరించెను. యంత్రబద్ధులగుటచే, గ్రిందఁబడక కవచహీనులును,

వ్రణపీడితులును, రక్తసిక్తాంగులును నయ్యు నందందుఁ దిరుగు నేన్గుల పైనియోధులు వ్రేలాడుచుఁ గానవచ్చిరి. సుప్రయుక్తమై తెక్కలుగల యొక్కబాణముచే నిద్దరుముగ్గురు హతులై ధరాతలమునఁ గూలిరి. కొండలునాఁగు మఱికొన్ని యేన్గులు తమసంరంభముచెడి చెట్లతోఁ గూడినపర్వతములువోలె నారోహకులతోఁ బుడమిఁబడియెను. అతఁడు రథికులయల్లెత్రాటిని, ధ్వజమును, ధనువును, యుగమును, రథదండమును, గట్టిగాలాగి విడిచినభల్లములచే నొక్కమాఱుగా డొల్లనేసెను. అతఁడు కేవలము మండలాకారముగా ధనువుద్రిప్పుటయె గానవచ్చెను, గాని శరసంధానముచేయుటయు, నాకర్షించుటయు, విడుచుటయు, వహించుటయుఁ గానరాకుండెను. ఆతని నారాచములచేఁ బ్రహతములై నోళుల రక్తములుమియుచు నొకరెండుగడియలలోఁ బెక్కు మదగజములు నేలఁగూలెను. ఓమహారాజా! ఆసంకులసమరమున నెల్లెడల లెక్కిడరాని మొండెములు మింటనెగురుచుఁ గానవచ్చెను. మఱియు ధనువులును, నంగుళిత్రాణములును, ఖడ్గములును, భుజభూషణములునుగల్గి, యందు బెక్కుబాహువులు గానవచ్చెను. మఱియుఁ జెడిన చక్రములును, విఱిగినయిరుసులును, రూపుమాసినపోఁజులును, నేపువాసినధనుర్ధరులును నందందుఁ జెదరిపడఁ, బుష్పమాలికలును, సువర్ణభూషణములును, మహాధ్వజములును, నిహతములైనగజములును, పుడమిఁబడినయోడయులును గలుగ, నారణరంగము దారుణదర్శనమై చూపట్టెను. ఓరాజా! ఇటు లక్కిరీటిచే నాదుశ్శాసనబలమెల్ల హతమై పీడితమై నాయకులతోఁగూడఁ జెదరిపోయెను. అంత నాతనిసైన్యమెల్లఁ జెదర దుశ్శాసనునిఁ గాంచి నిలునిలుమని పలుకుచు బదిబాణములచే నొప్పించి, 'ఓయీ! నీవాఁడినవి దురుక్తులుగదా? వానికిఁ దగుకృత్యమిపు డొనర్పఁదగినదిగాఁ దలంతువేని దానిని జేయుము. జీవితముతో నెట్లు పోఁగలవు' అని పలికి కుపితుఁడై పార్థివమర్దనుఁడగు నప్పార్థుఁడు మఱియు నీతనయు నెంతయుఁ దీవ్రమగుబాణముచే నొప్పింప, వాఁడు జడిసి శరార్దితుఁడగుటఁ దనసైన్యముతో వెడలి ద్రోణునిరక్షకునిగాఁ గోరుచు, నాశకటవ్యూహమునకుఁ బోయెను.' అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## అర్జునుఁడు ద్రోణు నొప్పించి మొగ్గరము సొచ్చుట

ఓరాజా! మహారథుఁడగు నాసవ్యసాచి యటు లాదుశ్శాసను బలము నెల్లఁ బొలియించి, సైంధవుని సమీపించువాఁడై ద్రోణునిసైన్యముపైఁ బడియెను. అటు లాయర్జునుఁ డావ్యూహాముఖమున నిలిచియున్న యాద్రోణునిఁ జేరి కేలు మొగిడ్చి, వాసుదేవు నంగీకారముగొని యయాచార్యునితో 'ఓమహనీయా! నన్ను మంచిబుద్ధితోఁ జింతింపుము. నాకాశీర్వాద మొసంగుము. నీయనుగ్రహము వడసి యేదుర్భేద్యమగు నీసైన్యమును బ్రవేశింపఁ దలంచియున్నవాఁడను. నీవు నాకుఁ బితృతుల్యుఁడవును, ధర్మరాజునట్టివాఁడవును, ధౌమ్యకృష్ణుల కెనయైన వాఁడవు నైయున్నవాఁడవు. ఈ నావచన మసత్యము కాదు. ఓయనఘా అశ్వత్థామ నీకెట్లు రక్షణీయుఁడో నేనును నీకట్లు రక్షింపఁదగువాఁడను. ఓబ్రాహ్మణోత్తమా! నీయనుగ్రహము నాశ్రయించియే యీయాహవమున సైంధవునిఁ జంపుటకుఁ దలంచియున్నవాఁడను. ఓపురుషవరేణ్యా! నా యీప్రతిజ్ఞను రక్షింపుము.' అని పలికెను.

ఓరాజా! అది విని యయాచార్యుఁ డాతనిఁ జూచి నగుచు 'ఓపార్థా నన్ను జయింపక సైంధవుని జయింప నెట్లు పోఁగల్గుదువు?' అని పలుకుచునే యతఁ డాయర్జునుపై శరములు వర్షించెను. మఱియు నతనిరథాశ్వధ్వజములపైని సారథిపైని కొన్నినారాచముల నిగుడించెను. అంత నర్జునుఁ డాద్రోణునిబాణములను వారించి, ఘోరములై గొప్పవగుబాణములచే నాద్రోణు ననుజ్ఞవడసి యాతని నొప్పించెను. పిదప క్షత్రియధర్మము ననుసరించి, మఱియు నాద్రోణుఁ డప్పార్థుని బాణములను ఛేదించి, మఱియు నాకృష్ణార్జునుల నిరువురను విషాగ్నిజ్వాలాతుల్యములగు బాణములచే నొప్పించెను. పిదప నాయర్జునుఁ డాద్రోణుని శరాసనము దునుమ నుంకించునంతనే యతఁ డాయర్జునుని వింటినారి నించుకేని సంభ్రమము లేక వడిగా ఖండించి, మఱియు నాతని యశ్వములను ధ్వజమును సారథిని గొట్టి, పిన్ననగవుదోఁప నతని శరవర్షమున ముంచెను. అంతలో నక్కౌంతేయుఁడు ధనువు సజ్యమొనర్చికొని, యాచార్యుని మించువాఁడై యొక్కబాణమువలె నాఱువందల బాణముల నాద్రోణునిపైఁ బఱపెను. మఱియు నతఁడు పదునేడు

వందలబాణములను వైచి, మఱియుఁ బదివేలుగాఁ బ్రయోగించి యా ద్రోణునిసైన్యమును నొప్పించెను. బలశాలియుఁ గుశలుఁడును జిత్రయోధియునగు నాతఁడు లెస్సగాఁ బ్రయోగించినబాణపరంపరలచే గజవాజిపదాతులు హతములై, యసువు లెడలి పుడమిఁబడియెను. మఱియు నర్జునశరప్రహారపీడితులై సూతాశ్వధ్వజములు దెగి పరిత్యక్తజీవితాయుధులై రథికులు తమతమరథములనుండి వడిగాఁ బుడమిఁ బడుచుండిరి. వజ్రాయుధముచేఁ జూర్ణములైనపర్వతాగ్రములను, బెనుగాలిచేఁ జెదరిన మేఘములను, బ్రజ్వలితాగ్నిచేఁ గాలినగృహములను బోలి మనవారియేన్గులు కొన్ని చూర్ణములై, కొన్ని చెదరి, కొన్ని దగ్ధములై రూపుమాసెను. మఱియు నయ్యర్జునుబాణములచేఁ బ్రహతములై వేలకొలఁదిగుఱ్ఱములు హిమవచ్ఛిఖరమున వారిప్రహతములై కూలినహంసములువలెఁ గూలెను. గజరథాశ్వపదాతిసమూహములు నప్పాండవాస్త్రములచేఁ బ్రళయాదిత్యకిరణములచే హతములగుజలాశయములునా రూపుమాయుచుండెను. అంత నప్పాండవాదిత్యశరకిరణసమూహము నాద్రోణమేఘ మారణరంగమునఁ దనశరవర్షముచేఁ గప్పుచు, శత్రుప్రాణహారియగు నొకనారాచముచే నాధనంజయునివక్షమును నొప్పించెను. అందుల కయ్యర్జునుఁడు వివశీకృతసకలాంగుఁడయ్యు భూమికంపమునఁ బర్వతమువలె ధైర్యముచేఁ జలింపక, యా ద్రోణునిఁ దీవ్రనారాచములచే నొప్పించెను. ఓరాజా! అపు డాద్రోణుఁడును శిష్యుని మించునట్లుగా వాసుదేవు నైదుబాణములచేఁ గొట్టి, యర్జునుని డెబ్బదిమూఁడిటను, నాతనిధ్వజమును మూఁడిటను, బ్రహరించెను. అటులు గొట్టి, మఱియు నతఁ డాయర్జునునిఁ గనఁబడకుండఁ జేసెను. ఓరాజా! ఆద్రోణునిమండలాకారమగుధనువును, దానినుండి వెడలు బాణములును మా కద్భుతముగాఁ గానవచ్చెను. అయ్యవి యవ్వాసుదేవార్జునులపై కంకపత్రములతో వెడలి శిలాపసర్పణమువలె నద్భుతముగాఁ జూపట్టెను. ఓరాజా! బాలుఁడయ్యు నప్పార్థుఁ డా వృద్ధు నెపు డతిక్రమింపఁజాలకుండెనో యపు డాద్రోణుని విక్రమముఁ గాంచి యవ్వాసుదేవుఁడు 'ఆహా! మహార్ణవమును వేలవలె నీయర్జునుఁ డీద్రోణు నతిక్రమింపఁజాలకున్నాఁడు.' అని చింతించి, 'ఓపార్థా! పార్థా! మనకిపుడు కాలవ్యయ మగుట తగదు. కావున నీద్రోణునిఁ దప్పించు

గొనిపోవుటయే మన కెంతయుఁ దగినకృత్యము.’ అని పలుక విని యర్జునుఁ డందులకు సమ్మతించి పిదప మహాభుజుఁడగు నాద్రోణునకుఁ బ్రదక్షిణమొనర్చి పరివృత్తుఁడై బాణములను విడుచుచు వెడలిపోయెను. అంత నాద్రోణుఁ డాతనితో ‘ఓపాండవా! ఎందుఁ బోయెదు? నీవు రణ రంగమునఁ బ్రతియోధుని జయింపక మఱలువాఁడవుగావే.’ అని పలికెను. అది విని యప్పార్థుఁడు ‘ఓమహానీయా! నీవు నాకు గురుఁడవు గాని, ప్రతియోధుఁడగు శత్రుఁడవు గావు. నీకు నేను శిష్యుఁడనై పుత్రతుల్యుఁడను. నిన్ను యుద్ధమున నోడించుపురుషుఁ డీలోకముననే లేఁడు.’ అని ప్రత్యుత్తరమిచ్చెను.

ఓరాజా! ఇటులు పలుకుచునే యాబీభత్సుఁడు జయద్రథునిఁ జంపునుత్సాహముతోఁ గడువడిగా వెడలి యాసైంధవునిసైన్యముపైఁ బడియెను. అటులు నీవారిబలమును బ్రవేశించు నప్పార్థునకు యుధామన్యుఁడు నుత్తమౌజుఁడును జక్రరక్షకులై వెడలిరి. ఓమహారాజా! పిమ్మట గృతవర్మయు, జయుఁడు, కాంభోజుఁడు, శ్రుతాయువు నా ధనంజయు నెదుర్కొనిరి. మఱియు వారిననుసరించి రథికులు పదివేవురును, నభీషాహులు, శూరసేనులు, శిబిదేశీయులు, ధవసాతులు, మావేల్లకులు, లలిత్థులు, కైకేయులు, మాద్రకులు, నారాయణగోపాలురు, కాంభోజులు, మున్ను సంగ్రామములఁ గర్ణునకోడినకొందఱును, భారద్వాజుని మున్నిడికొని పుత్రశోకాభితప్తుఁడై కుపితుఁడై మారకుఁడగు యముఁడునాఁదగి, ప్రాణముల కపేక్షింపక సన్నద్ధుఁడై చిత్రయుద్ధమొనర్చుచు, సైన్యములఁ జొచ్చి యూధపతియగు గజరాజువలె విక్రమించు నాయర్జును నడ్డుకొనిరి. అపుడు పరస్పరసహాయమును గోరికొను మన యోధుల కాయర్జుననితో నెంతయు గగురుపాటొదవించు సంకుల సమరమయ్యెను. అటులు సైంధవవధాకాంక్షియై వచ్చుపురుషసింహుఁడగు నయ్యర్జునుని మనవారెల్లఁ గలిసి కానిపించిన వ్యాధినౌషధ క్రియలువలె నివారించిరి.” అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## శ్రుతాయుధకాంభోజాదులు చచ్చుట

“ఓయాంబికేయా! మహాబలపరాక్రమశాలియగు నప్పార్థుఁడు వారిచే నట్లు నివారితుఁడై వడిగా ద్రోణుఁడు తన్ను వెంబడించిరా

భాస్కరుఁడు కిరణజాలమునువలెఁ దీవ్రశరపరంపరల నతఁడు ప్రసరింపఁ జేయుచు, వ్యాధిగణము దేహమునువలె నాసైన్యము నెంతయుఁ దపింపఁ జేసెను. ఓరాజా! గుఱ్ఱములు గూలెను. రథములు విఱిగెను. మావంతులతో మాతంగములు పడెను. ఛత్రములు జాఱెను. రథములు చక్రశూన్యము లయ్యెను. సైన్యములు చెదరెను. ఇటు లాయర్జునుని శరపీడ కోరువని యాసైన్యమున నేమియుఁ దెలియఁబడకుండెను. ఓరాజా! ఆసంకులసమరమున వారటులు పరస్పరము ప్రహరించుకొనుచుండ నపుడాసైన్యము నర్జునుఁ డెంతయుఁ జలింపఁజేసెను. అపు డప్పార్థుఁడు తన ప్రతిజ్ఞ సత్యమగునట్లొనర్చువాఁడై యాద్రోణు నెదుర్కొన నంతేవాసి యగునాతని గురువగుద్రోణుఁ డిరువదైదుబాణములచే నొప్పించెను. అపు డాతనిశరవేగము నడంచుబాణములను బ్రయోగించుచు, వడిగా నక్కవ్వడి బ్రహ్మాస్త్రము నుపయోగించి యాద్రోణునిబాణముల నెల్ల ఖండించుచువచ్చెను. అపుడు ద్రోణునియాచార్యకము నద్భుతముగాఁ జూచితిమి. యువకుఁడయ్యు నర్జునుఁ డెంతటియత్నముననుసీతని బ్రహరింపఁజాలకుండెను. వేలకొలఁదివారిధారలఁ గురియుమేఘమునాఁదగు నాద్రోణుఁ డప్పార్థపర్వతమును దనశరవృష్టిచే ముంచెను. ఆతనిశరవర్షము నాయర్జునుఁడు తనబ్రహ్మాస్త్రముచే వెడలుబాణములచేఁ బ్రతివేధించుచువచ్చెను. ద్రోణుఁ డపు డిరువదైదుబాణములచే నర్జునుని మర్దించి, వాసుదేవునివక్షమునను, బాహువులను డెబ్బదిబాణములఁ జొప్పించెను. అప్పు డప్పార్థుఁడు నగుచుఁ దీవ్రబాణములను విడుచు నాద్రోణుని నివారించుచువచ్చెను. పిదప నటు లాద్రోణునిచే నారథికోత్తము లిరువురును బ్రహతులగుచు, నుత్థితమగు యుగాంతాగ్ని వలెఁ జూపట్టు నాతనిశరపరంపరలకోరువఁజాలక యాతని వీడి భోజసైన్యముపైకి వెడలిరి. అపుడు కృతవర్మసుదక్షిణులతో నాతనికి యుద్ధము తటస్థించెను. అపుడు కృతవర్మ దుర్జయుఁడగు నక్కురుసత్తముని వడిగాఁ బదినారసముల నొప్పింప, నర్జునుఁ డాతని నూఱుబాణములచేఁ గొట్టి, మఱియు మూఁడుబాణములచే మూర్ఛమునుఁగునట్లొయ నతఁడునగుచు, నప్పార్థవాసుదేవుల నిరువదైదేసి తీవ్రనారాచముల నొప్పించెను. అపు డర్జునుఁ డాతనిధనువు దునిమి యిరువదొకబాణములచే నొప్పించెను. అగ్నిజ్వాలాకారములును గుపితసర్పసన్నిభములగు నాతనిశరముల

నొచ్చియు నాకృతవర్మ వేఱొకవిల్లుపూని గ్రైదునారాచములచే నా పార్థునియురము వేధించెను. అటులు ప్రహరించి, మఱియు నైదుబాణ ముల నయ్యర్జును నతఁడు నొప్పింప, నప్పార్థుఁ డాతనివక్షమునఁ దొమ్మిది బాణములఁ జొప్పించెను. అటు లప్పార్థున కాకృతవర్మ దగులొ్కనుట గాంచి యప్పాంచజన్యధరుఁడు తమకటులు కాలాతిక్రమణముగాఁ దగదని చింతించి 'ఓయర్జునా! ఇఁక నీకృతవర్మునిపై దయఁదలంపకుము. సంబంధమును విడిచి వీని నడఁచి తునుమాడుము.' అని తెలుప విని యప్పార్థుఁడు తన తీవ్రనారాచముల నాతని మూర్ఛఁద్రోసి, వడిగలతన గుఱ్ఱములతో నక్కాంభోజసైన్యముపైకి వెడలెను. అటు లర్జునుఁడు తన్నుఁ గడచిపోవుట కెంతయుఁ గుపితుఁడై యక్కృతవర్ముఁ డాపార్థుని చక్రరక్షకులగు యుధామన్యూత్తమౌజులఁ దలపడి నివారించి వారిని దీవ్రనారాచముల నొప్పించెను. అపు డట్లు యుధామన్యుని మూఁడి టను, నుత్తమౌజుని నాల్గిటను నతఁడు నొప్పింప, వారును బదేసితూపుల నాకృతవర్ముని నొప్పించిరి. మఱియు వారు మూఁడేసి నారాచముల నాతనిధ్వజకార్ముకముల ఛేదింప, వాఁడు వేఱొకవిల్లుగొని క్రోధావేశ పరవశుఁడై వారిరువురధనువులఁ దునుమాడి శరవర్షమున ముంచెను. వారును వేఱువిండ్లు పూని యాతనిఁ గొట్టిరి. అంతలో నక్కౌంతే యుఁడు శత్రుసైన్యముఁజొచ్చెనుగాని యాయుధామన్యూత్తమౌజుల నక్కృతవర్ముఁ డాపుటచే వారికి ద్వారము లభింపదయ్యెను. ఓరాజా! ఆశ్వేతవాహనుఁడు సైన్యములను బీడించుచు వడిగల్గియుండుట నా కృతవర్ముఁడు తనకుఁ జిక్కినను జంపక విడిచెను. అంత నటులు వచ్చు చున్నయవ్వీభత్సునిఁ గాంచి శూరుఁడగుశ్రుతాయుధుఁడు కుపితుఁడై ధనువు ద్రిప్పుచు నాతని నెదుర్కొని, మూఁడుబాణములచే నాతని, డెబ్బదిబాణములచే వాసుదేవుని నొప్పించి, మఱియు నొకతీక్ష్ణమగు క్షురప్రముచే నప్పార్థునిధ్వజమును గొట్టెను. అంత నప్పార్థుఁ డెంత యును గుపితుఁడై యంకుశములచే మహాగజమునుబోలె నాశ్రుతా యుధునిఁ దీవ్రములగు తొంబదినారసముల నొప్పించెను. ఓరాజా! వాఁ డాపాండవునివిక్రమము నోరువక యాతని డెబ్బదేడునారాచముల నొప్పింప, నర్జునుఁ డాతనిధనువు దునిమి శరావాపమును ఖండించి, కుపి తుఁడై నతపర్వములగు నేఁడుబాణముల వానివక్షమువనొనాఁట నేసెను.

అంత నా శ్రుతాయుధుఁడు కోపావిష్టుఁడై వేఱొకవిల్లుగొని, యవ్వాసుది బాహువులందును, వక్షమునందును దగులునట్లు డెబ్బదిబాణముల విడిచెను. పిదప నతఁడు నగుచుఁ, బెక్కువేలశరముల నా శ్రుతాయుధునిఁ బీడించి, మఱియు వానియశ్వములను సారథిని గూలనేసి, మఱియు డెబ్బదిబాణముల నొప్పించెను. అంత నతఁడు హతాశ్వమగు రథము విడిచి, కేల నొకగదఁ బూని యప్పార్థు నెదుర్కొనియెను. ఆ శ్రుతాయుధుఁడు వరుణుని కొమారుఁడు. వానితల్లి చల్లనినీరుగల పర్ణాశ యని యెడి మహానది. ఓరాజా! అది మున్నొకపుడు పుత్త్రనిమిత్తముగా నా వరుణునితో 'నాపుత్త్రుఁ డీలోకమున శత్త్రుల కవధ్యుఁడుగా దగదే' యని పలుక నవ్వరుణుఁ డవ్వనితామణితో 'వీని కట్టివరమొసంగుచున్న వాఁడను. మఱియు నెట్టివారికి నవధ్యుఁడగునట్టి దివ్యాస్త్రము నొసంగెదనుకాని మానవునకు మరణము లేకుండదుగదా! ఓసరిన్నారీమణీ! పుట్టినవాఁడెల్లఁ గిట్టుట తప్పనిదిగాదే! వీఁడు శత్త్రువులకు దుర్జయుఁడే యగును.వీనియస్త్రమహిమ యట్టిదై యున్నది. కావున నీమనఃపరితాపమును విడువుము.' అని పలికి యవ్వరుణుఁ డొకమంత్రపురస్కృతమగు గద నొసంగెను. దానిచే నితఁడు సకలలోకములందును దుర్జయుఁ డయ్యెను. ఓరాజా! అటులైనను మఱియు నపుడే యావరుణుఁ డీతనితో 'ఓశ్రుతాయుధా! దీనిని నీతో యుద్ధము చేయనివానిపైఁ బ్రయోగింతువేని యిది నీపైఁబడి నిన్నే చంపును జుమీ!' అనియుఁ జెప్పిపోయెను. ఓధృతరాష్ట్రా! కాని యాశ్రుతాయుధుఁడు తనకుఁ గాలము ప్రాప్తించుట నవ్వాక్యమును మఱచి యవ్వీరఘాతినియగు గద నవ్వాసుదేవునిపై విసరెను. దాని నాకృష్ణుఁడు తనబలిసియున్నభుజముచేఁ బ్రతిగ్రహించెనుగాని, వాని నాగద గాలివింధ్యగిరినివలె నించుకేనిఁ జలింపఁజేయఁజాలదయ్యెను. అంత నది మఱలి దుర్జేయయగుశక్తివలెఁ గుపితుఁడై యున్న యాశ్రుతాయుధునిఁ జంపి పుడమిఁబడియెను. అటులు గద మఱలుటయు, శ్రుతాయుధుఁడు హతుఁ డగుటయుఁ గాంచి సైన్యములం దపుడు గొప్పహాహాకారములు జనించెను. 'అయ్యో! యుద్ధము చేయనివాసుదేవునిపై గదవైచుట నది మఱలి యాశ్రుతాయుధునే చంపెను. వరుణుఁడు మున్ను చెప్పినచొప్పు మఱచి వాఁడే మరణమొందెనే! ఎల్లధనుర్ధరులును గాంచుచుండఁగా వాఁడు నేలఁ

గూలెను.' అని కొందఱు పలికిరి. అటులు వాఁడు నేలఁగూలి గాలిచేఁ గూలిన పెక్కుశాఖలుగలవృక్షమువలెఁ జూపట్టెను. అటులు శత్రుందముఁడగు నాశ్రుతాయుధుఁడు హతుఁడగుట నారసి మీవారిసైన్యములును సేనాముఖ్యులును బరువులిడఁజొచ్చిరి. అంతఁ గాంభోజరాజపుత్త్రుఁడగు సుదక్షిణుఁడు, వడిగల తనగుఱ్ఱములతో వెడలి, శత్రుమర్దనుఁడగు నప్పార్థునిఁ దలపడ నయ్యర్జునుఁ డాతని నేఁడుబాణములచే నొప్పింప, వాఁ డాగాండీవిశరప్రహారముల కెంతయు నొచ్చి, పదిబాణములచే నప్పార్థునిఁ బ్రహరించెను. అటులు నొప్పించి, మఱియు వాఁ డావాసుదేవుని మూఁడిటను, బార్థునైదిటను నొప్పింప, నర్జునుఁడు వానిధనువు దెగనేసి, ధ్వజముద్రుంచి, యెంతయుఁ దీవ్రములగు రెండు భల్లములచే వానిని బ్రహరించెను. వాఁడు నాతని మూఁడుబాణములచేఁ గొట్టి, సింహనాదమొనర్చి, శూరుఁడగు నాసుదక్షిణుఁడు మఱియు నొకగొప్పశక్తిని గోపమడర నాపాండవమధ్యమునిపైకిఁ బంపెను. అది మహోల్కవలెఁ బ్రజ్వరిలుచు నప్పార్థునిపైకి వచ్చి యాతని భేదించి, మిడుఁగురులతోఁ బుడమిఁబడియెను. అటులు వానిశక్తిచే గాఢముగాఁ బ్రహతుఁడై యర్జునుఁడు మూర్ఛమునిఁగి, కొంతవడికిఁ దెప్పిఱిలి పెదవులఁ దడుపుచు, వానిని బదునాల్గు కంకపత్త్రులచేఁ గొట్టి, వానిధ్వజాశ్వములను సూతుని నొప్పించి, మఱికొన్నితీవ్రనారాచముల రథము దునియలుగావించి, వ్యర్థసంకల్పవిక్రముఁడైయున్న యాసుదక్షుని మఱియు నొక తీవ్రబాణముచే గుండియ లవియఁగొట్ట, వాఁడు భిన్నకవచుఁడై వికలాంగుఁడై మకుటాంగదములు జాఱ, యంత్రమునుండి జాఱినధ్వజమువలె నేలఁబడి గిరిశిఖరమునుండి పడిన వృక్షమురీతిగను, వేసవిని గాలిచేఁ గూలినకర్ణికారముభాతిగను, గాంభోజులకుఁ దగునాస్తరణముపైఁబడి వీరశయనమున శయనించెను. గొప్పవిలువగల నగలతోఁ గూడి చఱియలతోఁగూడినపర్వతమునా నతఁడు దర్శనీయుఁడై పార్థునిచేఁబడి యగ్నితుల్యమగు శిరఃకాంచనమాలికతోఁగూడి గతాసుఁడై యారణరంగము నెంతయు శోభిల్లఁజేసెను. అంత నీతనయునిసైన్యములన్నియుఁ బరువులువాఱఁజొచ్చెను." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

అర్జునుఁ డంబష్ఠుని వధించుట

"ఓరాజా! అటు లాశ్రుతాయుధుఁడగు సుదక్షిణుఁడును హతుఁడగుడుఁ, గుపితులై కొందఱు నీవారిసైనికు లప్పార్థునిఁ దలపడిరి. అందభీషాహులును, శూరసేనులును, శిబిదేశీయులును, ధవసాతులును, శరవర్షముచే నాధనంజయునిఁ గప్పిరి. అంత నయ్యర్జునుఁడు తనతీవ్రనారాచములచే నావేవురను బీడింప వారు బెబ్బులికిజడిసిన మ్రుక్కిడి మృగములువోలె భీతులై పలాయితులైరి. అటులు వారు మఱలియు వైరుల రూపుమాపుచు జిగీషులై పోరాడు నాపార్థుని మఱియుఁ జుట్టికొన, వారింకను వచ్చుచుండఁగనే, గాండివప్రయుక్తములగు శరపరంపరలచే వారిశిరములను బాహువులను నతఁడు నేలఁ గూలఁద్రోసెను. వానిచేఁ బుడమి పొడచూపకుండెను. కాకులు, గ్రద్దలు మున్నగువాని నీడ లభ్రచ్ఛాయలునా నందుఁ జూపట్టెను. అటులు వారెల్ల హతులగుడుఁ గోపావేశపరవశులై శ్రుతాయువు, నచ్యుతాయువును నాధనంజయునిఁ దలపడి బలస్పర్ధలడరఁ గులాభిమానులగుటఁ దమబాహుబలముల వెలయించుచుఁ, గుడియెడమల నాతనిపై శరములఁ బ్రయోగించుచు బాణవర్షమున ముంచి, కీర్తికిఁగొఱఁతరానీక యెటులే నాధనంజయునిఁ జంపువారై, నీపుత్త్రునకు సంతసమొదవించుటకై, మఱియు వేలకొలఁదిబాణములచే మేఘములు తటాకమునువలె నాతనిఁ గప్పిరి. మఱియు నందు శ్రుతాయువు కుపితుఁడై పదునై వాఁడిగల్గిన యొక తోమరముచే నర్జును నొప్పింప, నతఁ డెంతయు నొచ్చి కేశవునకు మోహము గల్గించుచు మూర్ఛమునిఁగెను. అంతలో మహాయుధుఁడగు నచ్యుతాయువు మిక్కిలి తీక్ష్ణమగు శూలముచే నప్పార్థునిఁ గొట్టెను. అపు డది యర్జునునకు క్షతమునఁబడినక్షారమువలె నెంతయుఁ బీడాకరమయ్యెను. అపు డప్పార్థుఁడు మిక్కిలి పీడితుఁడై ధ్వజస్తంభము నాశ్రయించెను. ఓరాజా! అపుడు మనవారిసైన్యమున 'ధనంజయుఁడు హతుఁడయ్యె'నని గొప్పసింహనాదము లుప్పతిల్లెను.అటులు నిశ్చేష్టుఁడైయున్న పార్థునిఁజూచి శ్రీకృష్ణుఁడును నెంతయు సంతప్తుఁడై మిక్కిలి ప్రియములగు వచనములచే నాధనంజయు నోదార్చుచుండెను. పిదప నావీరులిరువురును ధనంజయుని గుఱిపెట్టి, యాతని, నావాసుదేవుని శరవర్షమున

ముంచసాగిరి. అటులు వారు శరవర్షమున ముంపఁ జక్రకూబరరథాశ్వ ధ్వజపతాకలతోఁగూడ నాయర్జునుఁ డదృశ్యుఁడై యుండుట మాకెంతయు నద్భుతమయ్యెను. చచ్చినవాఁడు మఱలివచ్చినట్టు లవ్విశ్వాచ్చుఁడు మెల్లగాఁ గొంతవడికిఁ దేఱి, వారిశరజాలముచేఁ బ్రచ్ఛన్నమైయున్న రథమును గేశవునిఁ గాంచి యెదురుగా నున్నవైరుల నారసి, గొప్పపర్వతములునాఁదగు వారిపై నైంద్రాస్త్రమును బ్రాదుర్భవింపఁజేసెను. దాని నుండి వేలకొలఁదిబాణములు వెడలి, వారిరువురను బీడించి, మఱియు వారిచేఁ బ్రయుక్తములగు సాయకములఁ దొలఁగింప, నవి పార్థబాణ విదారితములై యాకాశమునఁ జరించెను. అటు లతఁడు వారిశరముల మఱల్చి యందందుఁ గలమహారథులతో యుద్ధమొనర్చుచు వెడలెను. పిదప నాతనిశరపరంపరచే వారిరువురును దలలును బాహువులును దెగి పెనుగాలికిఁగూలిన మహాద్రుమములువలె నేలఁగూలిరి. ఆ శ్రుతాయువు నిధనము, అచ్యుతాయువువధము, సముద్రశోషణమువలెఁ గాంచు వారి కెంతయు నచ్చెరువుగల్గించెను. మఱియు నర్జునుఁడు వారి ననుసరించినవారి నైదువందలరథికులను జంపి, మఱియు నందందుఁగలపేరుగల వారినెల్ల వధించుచు, మఱల భారతసైన్యముపైకి వెడలెను. అటు లా శ్రుతాయువు నచ్యుతాయువును మడియుట నారసి నియతాయువును దీర్ఘాయువును గుపితులై యప్పాండవమధ్యము నెదుర్కొనిరి. తమ తండ్రులమరణమున శోకవక వివిధములగు శరముల గురియువారి నిరువుర నాయర్జునుఁ డొకముహూర్తమున సన్నతపర్వములగు శరములచేఁ బరమకుపితుఁడై నొప్పించి యమపురమున కనిపెను. అటు లాసైన్యములను బద్మసరమును గలఁతవెట్టు కరికలభమునుబోలె నాలోడించు నాయర్జునుని క్షత్త్రియోత్తము లెవ్వారును వారింపఁజాలరైరి. అపు డంగుఁ డొకమాతంగ మధిరోహించి యప్పార్థునిఁ దలపడెను. వానితో వేలకొలఁదిశిక్షితులగుమావంతులు కుపితులై దుర్యోధనాజ్ఞప్తులగుటఁ బర్వతములనాఁదగు నేన్గులతో వెడలిరి. అటులు వెడలి యాప్రాచ్యులును దాక్షిణాత్యులును గాలింగులును దనపైకివచ్చుట నారసి యవ్విశ్వాచ్చుఁడు వడిగా గాండివప్రయుక్తములగు శరపరంపరలచే భూషణములతోఁగూడిన శిరోబాహువులను ఖండింప, వానిచేఁ బుడమి యెల్లెడల నిండి సువర్ణపాషాణభుజంగాదులచే నావరింపఁబడినదియుఁబోలె

నెంతయు విరాజిల్లెను. ఓరాజా! అతనివిశిఖములచేఁ దెగినబాహువ్రులును, నూడిపడిన తలలును, జెట్లనుండి యెగురుపక్షులువలె మాకద్భుతముగాఁ గానవచ్చెను. మఱియు నాతని నారాచములచే నిర్భిన్నములగు నేన్గులు స్రవించెడు రక్తములతో వర్షకాలమున జేగురుకాలువలు స్రవించుపర్వతములునాఁ జూపట్టెను. మఱికొన్ని హతములై నేలఁ గూలెను. కొంద ఱేన్గులమీఁదనుండియే వికృతాకారులై నానావేషధారులై నానాశస్త్రపాణులై రక్తసిక్తదేహులై గానవచ్చిరి. మఱికొన్ని యేన్గులు పార్థశరప్రహతములై యారోహకులతోడను, బదానుగులతోడను విచ్ఛిన్నగాత్రములై యఱచుచుఁ బరిభ్రమించుచుఁ బుడమిఁబడియెను. మఱికొన్ని జడిసి తమ్ముఁదామె కుమ్ముకొనుచుండెను. మఱియు రాక్షసమాయ లెఱిఁగిన ఘోరదృష్టులగు యవనులును, పారదులును, శకులును, బాహ్లీకులును, నందినీప్రభవులగు మ్లేచ్ఛులును, యమతుల్యులై ప్రహరించు దార్వాతిసారులును, దరదులు, పుండ్రులు, లక్షలకొలఁదిగా వెడలిరి. వారిని లెక్కింపఁదరముగాదు. వారెల్లరును దీవ్రనారాచముల నాయర్జును ముంచిరి. నానాయుద్ధవిశారదులగు మఱికొందఱుమ్లేచ్ఛులును శరములను గురిసిరి. ఆయర్జునుఁ డపుడు వారిపై శరవర్షము వర్షింప శలభములట్లు బాణము లెల్లెడల వెడల నాసైన్యమెల్ల మేఘచ్ఛాయాసమావృతమై నట్లయ్యెను. ముండులు, నర్ధముండులు, జటిలులు, సూచీజటిలులు నగు మ్లేచ్ఛులనెల్ల నస్త్రబలముచే ఖండింప, నడవులందుఁ దిరిగెడి యాసంఘములవారెల్లరును జడిసి వెడలిపోయిరి. అటు లప్పార్థుని వాఁడినారాచముల నేలఁగూలినగజాశ్వరథపదాతులపైఁ గాకులును, గ్రద్దలును, వృకములు మూఁగి రక్తపానమొనర్పసాగెను. అటులు ప్రవర్తిలినరక్తనదిని గజాశ్వాదులు వంతెనలుగాఁ, గేశపాశములె శైవాలములుగా నారణరంగ మెంతయు భీతిప్రదమైయుండెను. ఆవాసవసూనుఁడు దేహవర్షమును గురియుచుండ, నచ్చోట నిమ్నోన్నతములు గానరాకుండెను. అటులే పుడమియెల్ల రక్తమయమయ్యెను. ఆక్షత్త్రియోత్తముఁడగు నర్జునుఁ డాఱువేలగుఱ్ఱములను, వేవురువీరులను నొక్కగడియలో యమపురమున కనిచెను. వేలకొలఁదియేన్గులుగూలి వజ్రహతములగు శైలములునా నందు శయనించియుండెను. అటు లతఁడు మాతంగములను రథవాజులను జంపుచు

నందుం జరించెను. ఓరాజా! అపుడు పద్మవనమును దునుము వనగజ మునుబోలియు, శుష్కేంధనతృణాదులను గాల్చునగ్నిని బోలియు వెల యుచు, మనసేనారణ్యమును, గృష్ణవాయుసమీరితుండై యప్పార్థ వైశ్వానరుఁడు దహింపఁదొడఁగెను. మఱియు రథమధ్యములను శూన్య ములఁగా నొనర్చుచు, మానవులచేఁ బుడమి నింపుచు, నాసమ్మర్దమున నాట్యముచేయువాఁడువలెఁ జాపహస్తుఁడై యతఁడు చరించెను. అటు లతఁడు కుపితుఁడై భారతసైన్యమును జొచ్చి పుడమినెల్ల శోణితహ్రద ముగా నొనర్ప, నపు డంబష్ఠుఁ డాతని నెదుర్కొనియెను. పిదప నా యంబష్ఠుఁడు ప్రయత్నించుచుండఁగనే యర్జునుఁడు తీవ్రనారాచము లచే వానిగుఱ్ఱములను బడఁగొట్టి, మఱియు వానిధనువు దునుమాడి పరాక్రమించెను. అంత నయ్యంబష్ఠుఁడు క్రోధారుణితాక్షుఁడై యొక గదఁ బూని యక్కేశవార్జునులఁ జేరి వారిరథము గదలనీక నిలిపి, తన గదతో నవ్వాసుదేవుని మోదఁగా, నదిచూచియందులకర్జునుఁడెంతయుఁ గుపితుఁడై సువర్ణపుంఖములగు నారాచములచే గదాధారియైయున్న వానిని, మేఘుఁడు సూర్యునివలె శరములఁ గప్పుచు, మఱికొన్ని బాణ ములచే వానిగదను జూర్ణముగా నొనర్చెను. అది యెంతయు నద్భుత మయ్యెను. అది చూర్ణమగుడు వాఁడు వేఱొకగదను బూని యవ్వాసు దేవార్జునుల మఱియుఁ గొట్టెను. అంత నయ్యర్జునుఁ డాతని గదాయుక్త ములగు బాహువులఁ దునిమి, మఱియు వానితలఁ దెగనేసెను. వాఁడు పుడమిఁ జప్పుడుగల్గునట్లుగాఁ బడియెను. యంత్రముక్తబంధనమై విడువఁ బడిన యింద్రధ్వజమునా వాఁడు నేలగూల, మఱియుఁ దన్నావరించిన రథానీకములతోడను, గజాశ్వములతోడ నయ్యర్జునుఁ డెంతయు మబ్బులుచుట్టుకొన్న సూర్యుఁడునా జూపట్టెను." అని తెలిపి సంజ యుఁడు మఱియు ని ట్లనియె.

### దుర్యోధనుఁడు కవచము ధరించుట

"ఓరాజా! పిదప నక్కౌంతేయుఁ డాసైంధవునిఁ జంపువాఁడై ద్రోణానీకమును భేదింపదుస్తరమగు భోజసైన్యమును జెండాడ, సుదక్షి ణుఁడు దక్షిణదిశకుఁబోఁగా, శ్రుతాయుధుఁడు గతాయువుగా, మా సైన్యములెల్లెడలఁ జెదరిపోఁగా, నట్టిదురవస్థను గాంచి సుయోధనుఁడు

ద్రోణునికడ కేగి, యాతనితో 'ఓయాచార్యా! ఈమహాసైన్యమును జెండాడి యాపురుషసింహుం డందులకుఁ బోవుచున్నవాఁడు. ఇఁకఁ జేయున దెద్దియో బుద్ధిచేఁ బరీక్షింపుము. ఈదారుణ జనక్షయమున నర్జునవిఘాతమును జింతింపవలసియున్నది. అతఁ డాజయద్రథు నెటులు చంపకుండునో యటు లొనర్పుము. నీకు మేలగును. నీవేగదా! మాకుఁ బరమగతి. ఈపార్థాగ్ని కోపమారుతప్రేరితమై నాసైన్యమనెడియెండు గడ్డిని గాల్చుచున్నది. ఓశత్రుమర్దనా! ఈసైన్యమును భేదించియకౌంతేయుఁ డతిక్రమించెనా! సైంధవరక్షకులయెడ సందేహ మొందవలసినదేగదా! అర్జునుఁ డొకపుడును ద్రోణు నతిక్రమింపఁజాలఁడని క్షత్రియపుంగవులెల్లరును స్థిరబుద్ధితోనున్నవారు. ఓతేజోనిధీ! నీవు చూచుచుండఁగనే యర్జునుఁడు దాఁటిపోయెనా! మనసైన్యమెల్ల నిపుడు పీడితమగునని తలంతును. ఓమహాభాగా! నీవుపాండవప్రియుఁడవగుట నే నెఱుఁగుదును. ఓబ్రాహ్మణా ! నాకార్యమును జింతించుచు భ్రాంతిపడుచున్నాను. ఓవిప్రోత్తమా! నాశక్తికొలఁది నుత్తమజీవనమును నీకొసంగుచునే యున్నవాఁడనుగదా! అదియుఁగాక మఱియు నిన్ను సంతసింపఁజేయుచున్నవాఁడను. అదియు నీవు స్మరింపకున్నాఁడవు. ఓయవక్రవిక్రమా! మమ్ము నీవెల్లపుడు భక్తులనుగాఁ దలఁచుచున్నట్లు లేదు. మాకుఁ బరమవైరులగు పాండవులను బ్రీతిమెయిఁ జూచుచున్నాఁడవు. నీవు మావలననే జీవించుచు, మాకే యప్రియమొనర్పు నున్నవాఁడవు. నీవు తేనెపూసినచూరకత్తివని నేనెన్నఁడును దెలియలేనైతిని. నీవు పాండవనిగ్రహమునెడ వరము నాకొసంగవేని యింటికిఁ బోనున్నసైంధవుని నేను వలదని నివారించియుందునా? నీవు నాతోఁ దెల్పుటనుబట్టి, బుద్ధిహీనుఁడనై నీ వాతని రక్షింతువనికొని, వాని నూఱడించి యిపుడు మృత్యువున కప్పగించితిని. యమదంష్ట్రముల నడుమఁజేరిన మానవుఁడు మఱల విడువఁబడునా?పార్థవశుఁడైన సైంధవుఁడు మఱి విడిపింపఁబడు టెట్లు? ఓశోణాశ్వా! సైంధవుఁ డిపు డెట్లు విడిపింపఁబడునో యటు లొనర్పుము. నాయార్తాలాపములకుఁ గోపింపకుము. సైంధవుని రక్షింపుము' అని పలికెను.

అది విని యాద్రోణుఁ డాతనితో 'ఓసుయోధనా! నీవచనములకుఁ గోపింపను, నాకు నీవొకటియు నశ్వత్థామ యొకటియా! ఓరాజా!

నిజము దెలిపెదను. దానిని గ్రహించి సమ్మతింపుము. కృష్ణుఁడు సారథి. వీనియుత్తమాశ్వములు వడిగలవి. చిన్నసందుచేసికొని వడిగా సాధనం జయుఁడు పోవుచున్నవాఁడు. వానిరథము వెనుకఁబడినబాణములకును వానికినడుమ నొకక్రోశముదూరము గలదు. నీవు చూడలేదా? నేను ముదుసలినగుట శీఘ్రయానమునకిపు డసమర్థుఁడనై యున్నవాఁడను. మఱియు నొకటి వినుము. ఈపాండవబలము మనసేనాముఖమునకు వచ్చియున్నది. ధనుర్ధరులెల్లరును జూచుచుండఁగా నీయుధిష్ఠిరునిఁ బట్టికొనవలసియున్నదిగదా! ఓమహాభుజా! రాజులనడుమ, నే నాయుధిష్ఠిరునిఁ బట్టికొందునని ప్రతిజ్ఞచేసియుంటినిగాదే? ఓరాజా! ఇపుడాయుధిష్ఠిరుఁడు ధనంజయుఁడు లేకుండ నాయెదుటఁబడినవాఁడు. కావున నాయీవ్యూహముఖము విడిచి విజయునితోఁ బోరాడఁ దగదుగదా! కావున ససహాయుఁడవై నీకుఁ దగినశత్రు నొకనిఁ జూచి పోరాడుచుండుము. జడియకుము. నీవేగదా! ఈమనసమస్తమునకుఁ బతివి, రాజు, శూరుఁడును, నేర్పరియు, సమర్థుఁడు నై యుండువాఁడుగదా! నీవు వీరుఁడవై యపార్థుఁడున్నకడకు వెడలుము' అని ప్రత్యుత్తరమిచ్చెను.

అంత నాసుయోధనుఁ డాతనితో 'ఓయాచార్యా! సర్వశస్త్రవేత్తలలో నుత్తముఁడవగు నిన్నే యాపార్థుఁ డతిక్రమించెనుగదా! నేనా! ఆధనంజయుని బాధించి వారించువాఁడను? వజ్రపాణియగుపురందరునైన రణమున నోడింపవచ్చునుగాని, వైరిమర్దనుఁడగు నపార్థుని జయింప నలవిగాదు. ఎవ్వనియస్త్రప్రతాపముచే భోజుఁడును దేవతుల్యుఁడవగునీవును నోడితిరి. శ్రుతాయువు గతాయువయ్యెను. సుదక్షిణుఁడు దక్షిణదిశకుఁబోయెను. అటులే యచ్యుతాయువు, చ్యుతాయువయ్యెను. మ్లేచ్ఛులు పెక్కువేవురు మడిసిరి. అటు లగ్నివలె దహించు నప్పాండవుని, దుర్జయుని, శస్త్రకోవిదు నెట్లు మాఱొడ్డి పోరాడఁగలను? ఇపుడు నన్నాతనితోఁ బోరాడఁదగువానిఁగాఁ దలంతువేని, నీకు సేవకుఁడువలె యధీనుఁడనైయుందును. నాయశము రక్షింపుము' అని పలికెను.

అది విని ద్రోణుఁడు మఱియు నాసుయోధనుతో 'ఓయీ! కౌరవ్యా! నీవన్నటు లాధనంజయుఁడు దుర్జయుఁడగుట సత్యము. నీ వాతని నెట్లు సహింపఁగల్గుదువో యట్టివిధ మే నాచరించువాఁడను.

లోకమునఁగల సకలధనుర్ధరులును నీయద్భుతమును దిలకింతురుగాక. వాసుదేవుఁడు చూచుచుండఁగా నీ వక్కొంతేయుని మార్కొనుము. ఓరాజా! ఇదె నే నొక కాంచనకవచమును నీకుఁ దొడుగుచున్నవాఁడను. అటులేని యెవ్వరియస్త్రములును నిన్నుఁ బ్రహరింపఁజాలవు. సురాసురయక్షరాక్షసోరగులుగాని, మూఁడులోకములలో నెవ్వరుగానినీతో యుద్ధమొనర్తురుగాక. వారివలన నీకు భయము గలుగనేరదు. కృష్ణుఁడుగాని, యర్జునుఁడుగాని, యింక నేశస్త్రవేత్తగాని రణరంగమున, నీకవచమున నారాచముల నాటఁజాలఁడు. కావున నిపుడీవీకవచమును దొడిగికొని కుపితుఁడై యున్న యర్జునుపైకి వడిగా నీయంతన పొమ్ము. నిన్ను వాఁడు సహింపఁజాలఁడు.' అని తెలిపెను.

ఓయాంబికేయా! అటు లాద్రోణుఁడు పలికి, జలస్పర్శమొనర్చి, భాసురమగు కవచనమును, మంత్రోచ్చారణపురస్సరముగా, శాస్త్రవిధి నతిక్రమింపక యద్భుతముగా నాతనికిఁ దొడిగెను. ఓరాజా! బ్రహ్మవేత్తయగు నాద్రోణుఁడు తనవిద్యామహిమచే నీతనయున కాయర్జునుతో నాఁటిగొప్పయుద్ధమున లోకములవారి కచ్చెరువగునట్లుగాఁ గవచముదొడిగి, 'ఓసుయోధనా! నీకు వేదములును బ్రహ్మయు బ్రాహ్మణులును స్వస్తి గల్గింతురుగాక. మఱియు నుత్తమములగు సరీసృపములనుండియు నీకు శుభమగుఁగాక. యయాతి, నహుష, దుందుమార, భగీరథులు మున్నగురాజర్షులు నీకు స్వస్తియొసంగుదురుగాక. మఱియు నేకపాదులనుండియు బహుపాదులనుండియు నపాదులనుండియు నీకు స్వస్తియగుఁగాక. నీ కీమహారణమున, స్వాహాయు, స్వధయు, శచియు, సస్తి చేకూర్తురుగాక. ఓయనఘా! లక్ష్మియు, నరుంధతియు, స్వస్తిని సమకూర్తురుగాక. అసితుఁడును, దేవలుఁడును, వసిష్ఠవిశ్వామిత్రులును, నంగిరసుఁడును, గశ్యపుఁడును నీకు శుభము గల్గింతురుగాక. ధాతయు, విధాతయు, లోకేశుఁడును, దిక్కులు, దిగీశులును, గార్తికేయుఁడును నీకిపుడు స్వస్తి నొసంగుదురుగాక. సూర్యభగవానుఁ డెల్లవిధముల నీకు మేలు సమకూర్చుఁగాక. అటులే దిగ్గజములును, బుడమియు నాకసము గ్రహములును, భూమిని మోయుచున్న శేషుఁడును, నీకు శుభము నొసంగుదురుగాక.' అని పలికి, మఱియు నాతనితో నాద్రోణుఁ డిట్లనియె.

'ఓరాజా! మఱియు నొకటి తెలిపెదను వినుము. మున్ను వృత్రాసురునిఁ దలపడి, సురలెల్ల విక్రమించియుఁ దుదికోడి వికలాంగులై తేజోబలములు చెడి యాయింద్రునితోఁ గూడి విష్ణుని శరణు చొచ్చి 'ఓదేవసత్తమా! వృత్రప్రమర్దితమైన యీ దేవతతి నీవ గతిగాఁ దలంచి వచ్చెను. ఓసురశ్రేష్ఠా! ఇమ్మహాభయమునుండి మమ్ముఁ గాపాడుము.' అని ప్రార్థించిరి. అంత నాభగవానుఁడు తనచెంతనున్న పరమేష్ఠిని సురలను గాంచి, విషణ్ణులైయున్న వారితో 'ఓదేవతలారా! ఇంద్రుఁడును మహర్షులును మీరును నాకెల్లప్పుడు రక్షింప దగినవారై యున్నవారు. ఆవృత్రుఁడు దుర్జయమగు తేజమై త్వష్టచే సృజింపఁబడియెను. మున్నా త్వష్ట వేలకొలఁదివత్సరములు తపమొనర్చి యామహేశ్వరు ననుజ్ఞవడసి యావృత్రుని సృజించెను. వాఁ డాతనియనుగ్రహమువలననే బలశాలియై మిమ్ముఁ గొట్టుచున్నవాఁడు. మీరు శంకరస్థానమునకుఁ బోకున్న మీ కాహరునిదర్శనము గానేరదు. ఆతని దర్శించి మీరా వృత్రుని జయింపుఁడు. వడిగా మందిరమునకుఁ బొండు.' అని పలికెను. అంత నయ్యమరులు కోటిసూర్యసమప్రభుఁడగు నాతేజోరాశిని దర్శించిరి. అంత నాభగవానుఁడు వారికి స్వాగతమొసంగి 'ఓదేవతలారా! మీ కేమి నేను గావింపవలసినదియుఁ దెలుపుఁడు. నాదర్శనమమోఘము. మీకభీష్టసిద్ధి యగుఁగాక.' అని పలికెను. అంత నయ్యమరు లాతనితో 'ఓదేవా! ఆవృత్రుఁడు మాతేజమెల్ల హరించెను. ఇఁక నీవే మాకు గతివాదువుగాక. ఓదేవా! మాదేహము లెట్లు శిథిలములయ్యెనో చూడుము. ఓమహేశ్వరా! మేము నిన్ను శరణమొందినవారము. నీవుతప్ప మాకు వేఱు గతిలేదు' అని బదులు మనవిచేసికొనిరి.

అదివిని శంకరుఁడు మఱియు 'ఓసురలారా! మీవచ్చినపని దెలిసినది. ఈతనిశక్తి మిక్కిలి బలవత్తరమైనది. త్వష్టతేజమున జనించిన యీఘోరశక్తి దుర్నివార్యమైనది. కావున మీయెల్లరకు నేనొక సాహాయ్య మొనర్చెదను. ఓయింద్రా! నా యీశరీరమునఁ బుట్టిన భాస్వరమగు నీకవచమును గ్రహింపుము. ఓసురేశ్వరా! ఈమానసమంత్రముచే దీనిని ధరింపుము.' అని తెలిపి కవచమును మంత్రమును శంకరుఁడు వాగి కొసంగెను. ఆకవచము దొడిగికొని యవ్వాసవుఁడు

వృత్రునిసైన్యముపైఁ బడియెను. అపుడు వృత్రుఁడు నానావిధాస్త్రములను బ్రయోగించియు నాకవచసంధులను భేదింప శక్తుఁడుగాకుండెను. అటులగుట నాయింద్రుఁడే యావృత్రునిఁ జంపెను. అంత నతఁడామంత్రమయమగుకవచబంధము నంగిరసున కొసంగెను. ఆయంగిరసుఁడు తనపుత్రుఁడగు బృహస్పతి కుపదేశించెను. ఆబృహస్పతి ధీశాలియగు నగ్నివేశ్యున కుపదేశించెను. ఆయగ్నివేశ్యుఁడు నాకొసంగెను. నేను దానిచే నీ కీకవచమును గట్టుచున్నవాఁడను. ఓనృపసత్తమా! ఈమంత్రముచే నీకు దేహరక్షయగును.

ఓరాజా! ఇటు లాద్రోణుఁడు పలికి తేజోనిధియగు నీపుత్రునితో మెల్లగా 'ఓపార్థివా! నీకిపు డీబ్రహ్మసూత్రముచేఁ గవచమును గట్టుచున్నాఁడను. మున్ను విష్ణునకు హిరణ్యగర్భుఁ డిటులే కట్టెను. మఱియు సంగ్రామమున మున్ను శక్రునకు బ్రహ్మ కట్టినట్లుగా నీ కీకవచమును గట్టుచున్నాఁడను' అని పలికి శాస్త్రోక్తముగా నామంత్రముతో నాతనికిఁ గవచముదొడిగి యాద్రోణుఁ డామహాయుద్ధమునకు నీతనయునిఁ బంపెను. అటు లాద్రోణునిచే గవచముధరించి వేవురుత్రిగర్తరథికులును, వేయిమత్తగజములును, బదివేలశ్వములును, మఱికొందఱు మహారథులును దన్నావరించియుండ మహాబాహుఁడగు నీకొమరుఁడాయర్జునుఁ దలపడ వెడలెను. నానావిధవాద్యములతో నాయింద్రుఁడువలె నతఁ డట్లు వెడల, నపుడు మిక్కిలి లోఁతగు సముద్రములో నీఁదువాఁడువలెనున్న నీకొమరునిఁగాంచిన మనసైన్యములందు మహానాదముప్పతిల్లె" నని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## సంకులయుద్ధము

"ఓయాంబికేయా! ఆరణరంగమున నటు లాకృష్ణార్జునులు ప్రవేశింపఁగాఁ బురుషవ్యాఘ్రుఁడగు నీతనయుఁడును వారివెంట వెడలెను. పిదప మహానాదముతోఁ బాండవబలము సోమకులతోఁగూడి యాద్రోణు నెదుర్కొన, నపుడు గొప్పయుద్ధమయ్యెను. ఓరాజా! అపు డప్పాండవులకును గౌరవులకును నావ్యూహముఖమున జరిగిన తీవ్రసంకులయుద్ధమును మేమెన్నఁడును గని విని యుండలేదు. అది మామేనులకు గగురుపాటొదవించెను. సూర్యుఁ డెపుడు మింటినడుమకు వచ్చెనో

యపు డాధృష్టద్యుమ్నాదులగు పాండవులు ద్రోణసైన్యమును శర
వర్షమున ముంచిరి. మహారథుఁడగు ద్రోణునిఁ బురస్కరించుకొని
మే మెల్ల ధృష్టద్యుమ్నాదులగు పాండవులను శరవర్షమున ముంచితిమి.
వేసవియారంభమున గాలితోఁ గూడి వెడలినమహామేఘములువలె
రథభూషితములై మనోజ్ఞములగు నారెండుసైన్యాగ్రములును నెంత
యుఁ బ్రకాశించెను. మఱియు నారెండుసేనలును గలిసి మిక్కిలివేగ
మును జూపునపు, డవివర్షకాలమున నిరుగెలంకుల నొఱసి పాఱుగంగా
యమునానదులమేళనమును స్ఫురింపఁజేసెను. నానాశస్త్రములనియెడి
పురోవాతముతోఁగూడి, గజాశ్వరథసంవృతమై గదలనెడిమెఱుపులచే
రౌద్రమైన యుద్ధమనియెడిపెనుమబ్బు ద్రోణుఁడనెడిగాలిచేఁ గదల్పఁ
బడి, శరధారాసహస్రములువెలయఁ బ్రజ్వలించినపాండవసైన్యాగ్నిని
జల్లార్చెను. వర్షకాలమున సముద్రమును బెనుగాలివలె నాద్రోణుఁ
డప్పాండవసైన్యములఁ గలఁతనొందించెను. వారు నెల్లప్రయత్నము
లచేఁ బ్రబలములగు జలప్రవాహములు మహాసేతువునువలె భేదించు
వారై తలపడిరి. ఆద్రోణుఁడు వారినెల్ల వారిప్రవాహమును బర్వతము
వలె నివారించెను. మఱికొందఱు శూరులగు రాజులు మహాబలులై
సమరకుపితులైన పాండవపాంచాలకేకయుల నడ్డిరి. పిదపఁ బురుష
సింహుఁడగు ధృష్టద్యుమ్నుఁడు పాండవులతోఁగూడ శత్రుసైన్యమును
ఛేదించువాఁడై ద్రోణుని మఱిమఱియుఁ బ్రహరించెను. ఆద్రోణుఁ
డెటు లాధృష్టద్యుమ్నుని శరవర్షమున ముంచుచుండెనో యటులే ధృష్ట
ద్యుమ్నుఁడును నాద్రోణుని బాణవర్షమున ముంచుచు వచ్చెను. నిస్త్రిం
శములనెడి పురోవాతములుగల్గి శక్తిప్రాసాదిసంవృతుఁడై వింటినారి
యనెడిమెఱుపులుగల్గి, చాపమనెడి సంహ్రాదమువెలయ ధృష్టద్యుమ్నుఁ
డనెడిమేఘము శరధారలనెడిపాషాణవర్షము నెల్లదెసలఁ గురిసెను.
అటులే గజరథాశ్వాదులను గొట్టుచు, మనసైన్యమును బరువులిడఁ
జేసెను. ద్రోణుఁడు పాండవరథికులలో నెవ్వని నెవ్వని బాణములచే
నొప్పింప నెంచివైచునో, వానినెల్ల నాధృష్టద్యుమ్నుఁడు దునుముచు
వచ్చెను. ఓరాజా! అటు లాద్రోణుఁడు ధృష్టద్యుమ్నునితోఁ బోరా
డుచు నెంతయత్న మొనర్చుచున్నను నాయుద్ధమున సైన్యము మూఁడు
విధములుగా భిన్నమయ్యెను. కొందఱు భోజునిఁ జేరిరి. మఱికొందఱు

జలసంధునిఁ జేరిరి వేఱొకకొందఱు పాండవప్రహతులై ద్రోణునే చేరిరి. ద్రోణుఁడు మఱల వాని నొకచోఁ జేర్చుచుండఁగా ధృష్టద్యుమ్నుఁడు వానిని మఱలఁ బీడించుచువచ్చెను. అపుడు పాండుసృంజయులచే నా రీతిగా ధార్తరాష్ట్రులు వధింపఁబడుచుండిరి. వారిదురవస్థ గోపులులేక శ్వాపదములచేఁ బీడింపఁబడు పశువులయవస్థయై యుండెను. ఆసంకులసమరమున ధృష్టద్యుమ్న మోహితులగు మనయోధులను గాలుఁడు మ్రింగుచున్నాఁడని జనులు తలంచిరి. ఓరాజా! నిస్సారుఁడగు భూనాథుని రాజ్యము దుర్భిక్షవ్యాధితస్కరాదులచే నశించునట్లుగా మనవారి సైన్యములన్నియు రూపుమాయఁ జొచ్చెను. సూర్యరశ్మిమిశ్రితములగు శస్త్రములందును, గవచములందును జూపులు ప్రతిహతములగుచుండెను. అటులే సైన్యపరాగము సైతము చూపులను బ్రతిబంధించుచుండెను. అటులు మనసైన్యములు మూఁడువిధములై పాండవులచే వధింపఁబడుచుండుటను జూచి ద్రోణుఁడు కుపితుఁడై పాంచాలురను బంచత్వమొందించుచుండెను. అటులా సైన్యములను మర్దించుచున్న యా ద్రోణునాకారము ప్రజ్వలించు కాలాగ్నినాఁదగియుండెను. ఆమహారథుఁ డొక్కొకబాణముచే రథగజాశ్వపదాతులను జంపుచు వచ్చెను. ఆద్రోణచాపమునుండి వెడలు బాణములను ధరింపఁజాలువాఁ డా పాండవసైనికులలో నొకఁడును గానరాకుండెను. సూర్యకిరణతప్తమగుటయేగాక, ద్రోణబాణతప్తమగు నప్పాండవసైన్య మందందుఁ బరిభ్రమింపఁజొచ్చెను. అటులే ధృష్టద్యుమ్నునిచేఁ దఱుమఁబడి మన సైన్యముసైతము నగ్నిచే నిలువెల్లమండిన యెండిన వనమునాఁ జూపట్టెను. అటులా ద్రోణధృష్టద్యుమ్నులసాయకములచేఁ బీడింపఁబడియు, సైన్యములు ప్రాణములను విడుచువారై, యథాశక్తిగా నెల్లవిధములఁ బోరాడుచువచ్చిరి. ఓరాజా! నీవారును, బాండవులును నటులు యుద్ధముచేయుచుండఁగా నందొకఁడును జడిసి రణరంగమును విడిచినవాఁడు లేఁడు. అపుడు కౌంతేయుఁడగుభీముని సోదరులగు వివింశతి వికర్ణచిత్రసేనులు చుట్టుకొనిరి. ఈమూవురకును విందానువిందులును, క్షేమధూర్తియు సహాయులై వెడలిరి. పిదప బాహ్లీకరాజు తన సైన్యముతోడను,నమాత్యులతోడను గూడి ద్రౌపదేయులఁ దలపడియెను. వేపురయోధులతో శైబ్యుఁడగుగోవాసనుఁడు కాశ్యపుత్రు నెదుర్కొనియెను.

యెను. ప్రజ్వలించుపావకుఁడునాఁదగు యుధిష్ఠిరుని మద్రేశ్వరుఁడగు శల్యుఁడు మార్కొనియెను. దుశ్శాసనుఁడు తనసైన్యమును జెదరనీక నిలుపుచుఁ గుపితుఁడై సాత్యకిపైకి వెడలెను. నేనును నాసైన్యముతోఁ గూడి కవచధారినై నాల్గువందలరథికులు తోడురాఁ జేకితాను నెదుర్కొంటిని. శకుని నకులు నెదుర్కొనియెను. వానికిఁ జాపశక్త్యసిహస్తులగు నేడువందల గాంధారులు సహాయులుగా వెడలిరి. ఆవంత్యులగు విందానువిందులు విరాటు నెదుర్కొని ప్రాణములకు వెనుదీయక మిత్రుఁడగు సుయోధను నభ్యుదయముగోరువారై విజృంభించిరి. బాహ్లీకుఁడు శిఖండిని మార్కొనియెను. క్రూరులగు ప్రభద్రకులు తనకు సహాయులుగా సౌవీరులతో నవంత్యుఁడు కుపితరూపుఁడగు ధృష్టద్యుమ్నునిఁ దలపడియెను. రాక్షసుఁడును శూరుఁడునగు ఘటోత్కచు నలాయుధుఁడు మార్కొనియెను. కుంతిభోజుఁ డలంబుసు నెదుర్కొనియెను. ఓరాజా! సైంధవుఁడు సైన్యములన్నింటికి వెనుకనుండెను. మహేష్వాసులగు కృపుఁడు మున్నగువీరులు వానిని రక్షింపనుండిరి. ఆసైంధవునకు దక్షిణముగా నశ్వత్థామయు, వామభాగమునఁ గర్ణుఁడును జక్రరక్షకులై యుండిరి. భూరిశ్రవుఁడు మున్నగువారు వానికి వెనుకఁగాపాడువారై యుండిరి. అటులే కృపుఁడును, వృషసేనుఁడును, శలుఁడును, శల్యుఁడును, దుర్జయుఁడును యుద్ధవిశారదులై సైంధవునకు రక్షకులై యుద్ధముచేయఁ దొడంగిరి." అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

## ద్వంద్వయుద్ధము

"ఓరాజా! అపు డక్కురుపాండవుల కాశ్చర్యకరముగా నెట్లు యుద్ధముజరిగెనో తెలిపెదను వినుము. వ్యూహముఖముననున్న ద్రోణునిసైన్యమును భేదించువారై పాండవు లాద్రోణునిఁ దలపడిరి. ఆ ద్రోణుఁడు తనవ్యూహమును రక్షించుచు, సైనికులతోఁగూడి యప్పార్థులతోఁ బోరాడుచుఁ దనగొప్పకీర్తిని నిలుపుకొనువాఁడై యుండెను. ఆవంత్యులగువిందానువిందులు విరాటునిఁ బదిబాణములచే నొప్పించిరి. విరాటుఁడును వెనుదీయక వారిరువురతో ఘోరముగాఁ బోరాడెను. వారియుద్ధము దారుణమై, వనమధ్యమున మత్తగజములతో సింహము

నకులవలె నచ్చెరువొందవించునదై రక్తప్రవాహములఁ బ్రవహింపఁ జేసెను. శిఖండి బాహ్లీకునిఁ దీవ్రనారాచములచే మర్మములు నాటు నట్లుగాఁ గొట్టెను. ఆబాహ్లీకుఁ డాతని సువర్ణపుంఖములును, శిలాసార ములునగు తొమ్మిదిబాణములచే నొప్పించెను. వారి యుద్ధముఘోరమై, భీరువులకు భయజనకమై, శూరులకు హర్షవర్ధనమై, శరశక్తిసమా కులమై గానవచ్చెను. వారిరువురును బ్రయోగించుశరపంపరలచే నాక సమును దెసలును నిండి యించుకేనిఁ దెలియఁబడకుండెను. శైబ్యుఁ డగుగోవాసనుఁడు, కాశీరాజపుత్రునిఁ దలపడి, గజము ప్రతిగజముతో వలెఁ బోరాడెను. బాహ్లీకరాజు ద్రౌపదేయులను మార్కొని యా రణరంగమునఁ బంచేంద్రియముల నెదుర్కొనిన మనమువలె విరాజి ల్లెను. వారును, శరసమూహములచే నాతనిఁ బ్రాణులదేహము నింద్రి యార్థములువలె మఱిమఱియుఁ బీడింపసాగిరి. నీకొమరుఁడు దుశ్శాస నుఁడు సాత్యకిని దొమ్మిదివాలుటమ్ముల నొప్పింప, నతఁ డెంతయు నొచ్చుట నించుక మూర్ఛవడి కొంతవడికిఁ దెప్పిఱి మహారథుఁడగు నీ పుత్రునిఁ గంకపత్రులగుపదిబాణములచే నొప్పించెను. ఓరాజా! వారిరు వురును బరస్పరము గట్టిగాఁ గొట్టికొని పరస్పరశరపీడితులై యాసమర భూమిని బుష్పించినమోదుగులువలె నలరారుచుండిరి. కుంతిభోజశర పీడితుఁడై యలంబుసుఁడు పూఁచినకింశుకమువలె నెంతయుఁ జూపట్టెను. పిదప నాయలంబుసుఁడు కుంతిభోజు నాయసములగు పెక్కుబాణము లచేఁ గొట్టి మీసైన్యముఖమున భైరవారావ మొనరించెను. పిమ్మట సమరశూరులగు వారిరువురును బరస్పరముఁ బోరాడ, సకలసైన్యముల వారును శక్రజంభాసురులనువలె వారి నారయఁజొచ్చిరి. కృతవైరుఁ డగుశకునిని నకులసహదేవులు మార్కొని యెంతయుఁ దీవ్రనారాచ ముల నొప్పించిరి. ఓమహారాజా! అపుడు జనక్షయమగు సంకులసమర మయ్యెను. ఓయీ! నీవు క్రోధమూలమగునగ్నిని జనింపఁజేసితివి. కర్ణుఁ డెంతయు దాని వర్ధిలఁజేసెను. నీపుత్రులు దానిని గాపాడిరి. ఓరాజా! అదియే యిప్పుడమినెల్లఁ గాల్ప నారంభించెను. అటు లామాద్రేయుల శరములకు నొచ్చి శకుని విముఖుఁడై, యుద్ధమునఁ జేయఁదగుపరాక్ర మము నించుకేనిఁ దెలియఁజాలఁడయ్యెను. అటులు పరాఙ్ముఖుఁడైన యాశకుని నామాద్రేయులు, మఱియును మహాగిరిని మేఘములువలె

శరవర్షమున ముంచిరి. పిదప నాశకుని వారిశరపరంపర కోరువఁజాలక తనవడిగలగుఱ్ఱములతో ద్రోణునిఁ జేరఁబోయెను. శూరుఁడగు ఘటోత్కచుఁడు రాక్షసుఁడగు నలాయుధుని వడిగా మార్కొన వారికి విచిత్రముగా యుద్ధముజరిగెను. వారిసంగ్రామవిధము మున్ను జరిగినరామరావణులయుద్ధమును దలపించెను. పిదప యుధిష్ఠిరుఁడు శల్యు నెదుర్కొని నైదువందలబాణములచేఁ గొట్టి, మఱియు నేఁడుబాణములచే నొప్పించెను. ఓరాజా! పిమ్మట వారి కద్భుతమగు యుద్ధమయ్యెను. అయ్యది మున్ను శక్రశంబరులకు జరిగినయుద్ధమునకు సరివచ్చెను. వివింశతి వికర్ణచిత్రసేనులు గొప్పసైన్యముతోఁగూడి భీమసేను నెదుర్కొనిరి." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

### సంకులయుద్ధము

"ఓరాజా! రోమహర్షణమైన యాసంగ్రామ మటు లారంభమగుడు మూఁడువిధములుగా వీడిన కౌరవసైన్యములను బాండవులు తఱుమ నారంభించిరి. మహాబాహుఁడగుజలసంధుని భీమసేనుఁడును, కృతవర్మని ససైన్యముగా యుధిష్ఠిరుఁడును మార్కొని శరవర్షమును గురియుచుఁ, దపించుభాస్కరులునాఁ జూపట్టిరి. ధృష్టద్యుమ్నుఁడు ద్రోణునిఁ దల పడఁ ద్వరపడుచు కుపితులగుకురుపాండవుల యోధులకెల్లరకును గొప్ప యుద్ధము జరిగెను. అటులు జనక్షయకరమై మహాభయంకరమై యుద్ధమారంభమగుడు, సైన్యములన్నియు నిర్భయముగా జంటలువీడి పోరాడుచుండఁగా బలశాలియగుద్రోణుఁడు బలవంతుఁడగు పాంచాలునితోఁ బోరుచు, బాణపరంపరలవేయుట నద్భుతముగాఁ జూపట్టెను. ఆ ద్రోణపాంచాలురు వీరులతలలఁ బెక్కిటిని ద్రోసి, విధ్వస్తములగు పద్మవనములనుగా నొనర్చిరి. ఆసైన్యములందెల్లెడల వీరులవస్త్రాభరణాయుధధ్వజకవచాదులు నిండి మెండై గానవచ్చెను. మేలిబంగారుకవచములు రక్తసిక్తములై మెఱుపులతోఁగూడి యొండొంటిఁగలిసిన మేఘ సంఘములునాఁ జూపట్టెను. కొందఱు గజరథాశ్వాదులను బాణములచే బడఁద్రోయుచుండిరి. తాటిచెట్లులయట్టిధనువు లాకర్షించుచు వారటులు పోరాడుచుండఁ గత్తులును, విండ్లును, గవచములును, దలలును దెగి యెల్లెడల వ్యాపించెను. లెక్కకు మిక్కిలిద్దై ఢాక్క లెగురఁ

జొచ్చెను. ఆమహాసంకులసమరమునఁ గాకులు, గ్రద్దలు, రాబందులు, డేఁగలు, నక్కలు మున్నగుమాంసాశనములెల్లఁ బెక్కుగాఁ గానిపించెను. అందుఁ గొన్ని మాంసములను భక్షించునవియుఁ, గొన్ని రక్తము ద్రావునవియుఁ, గొన్ని ప్రేవులను గేశములను లాగునవియుఁ, గొన్ని శరీరములను శరీరావయవములను బీఁకుచు గజనరాశ్వముల తలల నటునిటు ద్రోయుచుఁ బలువిధముల విహరించునవియై మాకుఁ గానవచ్చెను. మఱియు యోధులు రణదీక్షాదీక్షితులై జయము నభిలషించుచు, నపు డెంతయుఁ బట్టుదలతోఁ బోరాడిరి. సైనికులు బహువిధములగు నసిమార్గములఁ జరించిరి. అటులే శక్తిప్రాసశూలతోమర పట్టిస గదాపరిఘాదులగు నాయుధములతోడను, కేవల భుజములతోడను, గుపితులై యుద్ధరంగమునఁ బరస్పరము ప్రహరించికొనిరి. రథికులు రథికులతోడను, రౌతులు రౌతులతోడను, మావంతులు మావంతులతోడను, బదాతులు పదాతులతోడను బోరుచుఁ గ్రొవ్వినవారువలె నున్మత్తులువలె గట్టిగా నఱవసాగిరి. పరస్పరము గొట్టికొనిరి. ఓ రాజా! ఆయుద్ధ మటులు మేరమీఱ నపుడు ధృష్టద్యుమ్నుఁడు ద్రోణుని శోణాశ్వములతోఁ దనయశ్వములఁ గలిపెను. అపు డప్పారావతసవర్ణాశ్వములును, నాద్రోణునిరక్తాశ్వములును గలిసి యెంతయు శోభిల్లెను. అవి మెఱుపులతోఁగూడినమేఘములునా మాకుఁ గానవచ్చెను. అంత నాధృష్టద్యుమ్నుఁ డటులు తన్ను సమీపించి యున్నద్రోణు నారసి, ధనువువిడిచి కేడెమును ఖడ్గమునుబూని దుష్కరకృత్య మొనర్పువాఁడై, కోపముతో నాద్రోణునిరథముపై కుఱికి, యారథము యుగబంధముల నడుమఁ ద్రొక్కియాతనిగుఱ్ఱములపిఱుఁదుల నిలువ, నాతనిని సైన్యములు మెచ్చుకొనియెను. అటు లతఁడు కత్తి పట్టికొని యాశోణాశ్వములపైఁ జరించుచుండుటయెల్ల మాంసాభిలాషియై పడునట్టిడేగపాటు నాఁదగి యించుకే నవకాశము దోఁపనీక యద్భుతమొదవించెను. అటు లతఁడు తన్నుఁ జంపువాఁడై వచ్చునంతలోన యాద్రోణుఁడు శరశతముచే వానికేడెమును, ఖడ్గమును నఱికి, యెనుబదినాల్గుబాణములచే గుఱ్ఱములను గూలఁద్రోసి, ధ్వజచ్ఛత్రములను రెండుభల్లములచే డొల్లనేసి, యటులే పార్ష్ణిసారథులఁ బడఁద్రోసి, మఱియు వానికిఁ బ్రాణాంతక

మగు నొకశరము నాకర్ణాంతముగా లాగి, వజ్రధరుఁడు వజ్రమునువలె విడువ, దానిని బదునాల్గుతీవ్రబాణములచే సాత్యకి ఖండించివైచి, యాచార్యునోటఁబడిన యాధృష్టద్యుమ్నుని విడిపించెను. అయ్యది సింహముఖగ్రస్తమగు మృగము నొక శూరుఁడు విడిపించునట్టిదిగాఁ గానవచ్చెను. అటులు ధృష్టద్యుమ్నుని రక్షించిన యాసాత్యకిని గాంచి ద్రోణుఁడు వడిగా నక్కవ్వడి శిష్యుఁడగు సాత్యకి నిరువదాఱు బాణములచే నొప్పించెను. అంత సృంజయుల మ్రింగుచున్నవాఁడు వోలె నున్నయాద్రోణు, నాసాత్యకి యిరువదాఱుతీవ్రశరములచే వక్షము నొవ్వనేసెను. పిదప జయాభిలాషులగు పాంచాలురు వడిగా వెడలి ద్రోణుఁడు సాత్యకిని మార్కొనునంతలో ధృష్టద్యుమ్నునిఁ దప్పించి తీసికొనిపోయిరి.” అని తెలుప విని ధృతరాష్ట్రుఁ డిట్లనియె.

## ద్రోణసాత్యకులయుద్ధము

“ఓసంజయా! ఆద్రోణునిబాణ మటులు దెగి, ధృష్టద్యుమ్నుఁడు విడిపింపఁబడఁగా, నావృష్ణిప్రవీరుఁడగు సాత్యకితో నాద్రోణుఁడు కుపితుఁడై మార్కొనియెనంటివిగదా! అతఁ డేమియొనర్చెను?”

అదివిని సంజయు డాతనితో “ఓరాజా! ఆద్రోణమహోరగము క్రోధవిషము గ్రక్కుచు శరాసనమనెడినోరు తెఱచి వాఁడికోలలనెడి దశనములును, దీవ్రనారాచములనెడిదంష్ట్రలును వెలయఁ, గన్నులెఱ్ఱ సేయుచు, బుసకొట్టుచుఁ దనవడిగల యెఱ్ఱగుఱ్ఱము లాకసముఁ ద్రొక్కుచుఁ, బర్వతము నాక్రమించునట్టివై పరుపులువెట్ట, సువర్ణపుంఖములగు బాణములను జిమ్ముచు, నాసాత్యకిని దలపడియెను. శరప్రసారమనెడివర్షమును, రథఘోషమనెడిగర్జనమును, గార్ముకమనెడియింద్రధనువును, నారాచములనెడిమెఱుపులును గల్గి, శక్తిఖడ్గాదులనెడిపిడుగులడర, హయమారుతప్రేరితమై యాద్రోణమేఘ మటు లురవడించి వచ్చుట నారసి శూరుఁడగునాశైనేయుఁడు రణగర్వితుఁడై నగుచు, సూతునితో ‘ఓసారథీ! శూరుఁడై నిజకర్మమును వీడి ధార్తరాష్ట్రులను గూడి యాసుయోధనునిభయదుఃఖములఁ దొలఁగించువాఁడై వచ్చుచున్నయీబ్రాహ్మణునిపై నుత్సాహమడర మనవడిగలగుఱ్ఱముల నడుపుము. వీఁడు రాజపుత్రులకెల్లఁ దా నాచార్యుఁడగుట శూరంమాని

రై యున్నవాఁడు' అని పలుకునంతలో వాయువేగములై వెండి గుండులునాఁదగు నాతనివెల్లగుఱ్ఱము లాద్రోణున కభిముఖములై వడిగా వెడలెను. అంత శత్రుంతపులగు వారిరువురును వేలకొలఁదిశర పరంపరలచేఁ బరస్పరముఁ బ్రహరించుకొనుచుఁ బోరాడిరి. వారిశర జాలములచే నాకస మావరింపఁబడియెను. మఱియు శరవర్షము దశ దిశలఁ గప్పిరి. వేసవితుదిని మేఘములువలె వారు, శరధారలచేఁ బర స్పరముఁ గప్పికొన సూర్యుఁడు గాన్పింపకుండెను. గాలివీవఁ చోటు లేకుండెను. శరజాలావృతమగుట ఘోరమగు నంధకార ముప్పతిల్లెను. అపు డెట్టిశూరులకును దేఱిచూడ రాకుండెను. శీఘ్రశరప్రయోగవేత్త లగు నాద్రోణసాత్యకుల శరపరంపరలచే లోక మంధకారబంధుర మగుడు, వారిశరవృష్టులు గానరాకుండెను. వారిపరస్పరబాణసంఘర్షణ ముచేఁ బుట్టినశబ్దము మహేంద్రముక్తములగు పిడుగులచప్పుడులఁ బోలియుండెను. శూరులగువారి నారాచములవ్రేటుపడిన వారిశరముల రూప మాశీవిషవిషవిదష్టములగు సర్పములరూపమునుబోలియుండెను. యుద్ధనిపుణులగువారి వింటినారిచప్పుడు వజ్రాయుధప్రహతములగు గిరి శృంగములనాదము ననుకరించియుండెను. ఓరాజా! వారిరువురును రథములను, గుఱ్ఱములను, సారథులను, సువర్ణపుంఖములగుశరములఁ గప్పికొన, నవి విచిత్రరూపములై గానవచ్చెను. తళతళమని మెఱ యుచుఁ బొరవిడిచిన విషసర్పములునాఁదగి తిన్నగా వెడలువారి నారా చములసంపాత మతిదారుణమై చూపట్టెను. అటులే వారిరువురఛత్ర ములును ధ్వజములును నేలఁగూలెను. ఇరువురును రక్తసిక్తాంగులై విజయాభిలాష వెలయ రుధిరము స్రవించుమత్తగజములునాఁ జూపట్టిరి. ప్రాణాంతకరములగు శరములచే వారు పరస్పరముఁ బ్రహరించుకొనిరి. గర్జనములును, సింహనాదములును, శంఖదుందుభినిస్వనములు లేక యెల్లరును నిశ్చేష్టులై చూచుచుండిరి. ఎవ్వఁడును మాటలాడ లేదు. యోధులెల్ల యుద్ధమునుండి మఱలి మూకీభూతులై యుండిరి. జనము కుతూహలము వెలయ వారిద్వంద్వయుద్ధమును గాంచఁదొడఁగెను. ఆ పురుషసింహులనిద్దఱను రథికులును, మావంతులును, రౌతులును, బదాతులును జుట్టుకొని ఱెప్పలువేయక చూచుచుండిరి. అటులే గజ సైన్యములు గుఱ్ఱపుదడములును, రథసముదాయములును, బ్రతివ్యూ

హాముగా నేర్పడి గాంచఁగడంగెను. ముత్తెములతోడను, బగడముల తోడను, విచిత్రములై మణికాంచనభూషితములైనములును, ధ్వజన జిత్రములగు నాభరణములును, బంగరుకవచములును, వైజయంతీపతాకలును, నేన్గులకంబలములును, వాఁడియగు తెల్లనిశస్త్రములును, సువర్ణ రజితమయములగు మాతంగకుంభమాలికలును, దంతవేష్టములునుగల్గి, యాయుద్ధమును గాంచువీరులవరుసలు వేసవితుదిని బెగ్గురులు మెఱుగుడుపురువులు మెఱుపులుగల్గినమేఘముల సమూహములునాఁ జూపట్టెను. మనవారును యుధిష్ఠిరాదులును జూచుచుండిరి. మహాత్ములగు నాద్రోణసాత్యకులయుద్ధమును బ్రహ్మయుఁ జంద్రుఁడు మున్నగుదేవతలును, సిద్ధచారణసంఘములును, విద్యాధరులును, మహోరగులును, విమానము లెక్కిచూచుచు, శత్రువిఘాతములై చిత్రములగువారి గమనాగమనాకుంచనాదిగతిభేదముల కచ్చెరువడఁజొచ్చిరి. మహాబలులగు నాద్రోణసాత్యకులు తమహస్తలాఘవము నస్త్రములయందుఁ జూపుచుఁ, బరస్పరముఁ బ్రహరించుకొనసాగిరి. అపు డాసాత్యకి ద్రోణునిశరములను ఖండించి, తీవ్రబాణములచే మఱియు నాతనిధనువు దునుమాడెను. మఱియు నతఁ డొకతెప్పపాటులో వేఱొకధనువు, సజ్యమొనర్చునంతలో దానినిసైత మాసాత్యకి ఖేదించెను. పిదప నా ద్రోణుఁడు త్వరపడుచుఁ జాపహస్తుఁడై నిలువ, మఱియు దాని నా సాత్యకి ఖండించెను. ఇటు లెక్కవెట్టుచున్నవిండ్ల నెల్లఁ దునుమాడు నాసాత్యకి యమానుషకృత్యమును గాంచి యాద్రోణుఁడు తనమదిలో 'ఆహా! ఏమి వీనియస్త్రబలము. ఇట్టి దాపరశురామునందును, గార్తవీర్యునందును, ధనంజయునందును, బురుషసింహుఁడగు భీష్మునందును దక్క వేఱొక్కనియందు లేదనవచ్చును.' అని చింతించి, వానివిక్రమాతిశయమునకుఁ దనచిత్తమునందే మెచ్చికొని, వాసవునట్టి శరలాఘవమును గాంచి సంతసించెను. శీఘ్రచారియగు నాసాత్యకిలఘుత్వమును, మున్నింద్రాదిదేవతలును గంధర్వులును గాంచియుండలేదు. అటులే సిద్ధచారణసంఘములును గనియుండలేదు. ఓరాజా! పిమ్మట నా ద్రోణుఁడు వేఱొకవిల్లుగొని యస్త్రవేత్తయగుట నస్త్రములను బ్రయోగించెను. అపు డాతనియస్త్రముల నాసాత్యకి తనయస్త్రమాయలచేఁ బ్రతిహతమొనర్చి, మఱియుఁ దీవ్రబాణములచే నాతనిఁ గొట్టెను. అది

యెంతయు నద్భుతమొదవించెను. అనితరసాధారణమగు నాసాత్యకి యమానుషకృత్యమును గాంచి యుక్తివిదులగువారెల్లరును నాతని గౌరవించిరి. ద్రోణుఁ డేయేయస్త్రమును బ్రయోగించునో, దానినే సాత్యకియుఁ బ్రయోగించుచువచ్చెను. అంత సంభ్రాంతుఁడై ద్రోణుఁడు దానిచేతనే పోరాడించెను. ఓమహారాజా! పిదప ధనుర్వేదపారగుఁ డగు నాద్రోణుఁడు కుపితుఁడై యాసాత్యకిని వధింప నెంచి, దివ్యాస్త్ర మొకటి ప్రయోగించెను. ఘోరాకారమైన యాయాగ్నేయాస్త్రమును గుఱిచూచి యాసాత్యకి వారుణాస్త్రమును బ్రయోగించెను. దివ్యాస్త్ర ధారులగువారి నారసినమనసైన్యమున హాహాకార ముప్పతిల్లెను. ఆకస మునఁ జరించుభూతములుసైత మపుడు మింటఁ జరింపమానెను. అటు లవ్వారుణాగ్నేయాస్త్రములు రెండును వారిచే బాణసమాహితములై ఘోరముగాఁ బోరాడి యూరకుండునంత భాస్కరుఁడు మఱలెను. పిమ్మట యుధిష్ఠిరుఁడును, భీముఁడును, నకులసహదేవులును, సాత్యకిని రక్షించువారై యుండిరి. అటులే ధృష్టద్యుమ్నుఁడు మున్నగువారితో విరాటుఁడును, కేకయులును, మాత్స్యులును, సాళ్వులును వడిగా నా ద్రోణునిఁ జుట్టికొనిరి. అపుడు దుశ్శాసనుని మున్నిడికొని వేవురురాజ పుత్త్రులు ద్రోణునకు సహాయులై వైరులచే నాక్రమింపఁబడియుండిరి. ఓరాజా! వారికిని నీవారికిని గొప్పయుద్ధమయ్యెను. అపుడు వారిశర జాలములచేతను, ధూళులచేతను రణరంగ మాక్రమింపఁబడి యెల్లను భయప్రదమై యించుకేనిఁ దెలియఁబడకుండెను. సైన్యములు నశించు చుండ మేరమీఱినయుద్ధ మారంభమయ్యెను.” అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

### అర్జునుఁడు సరోవరమును నిర్మించుట

“ఓరాజా! సూర్యుఁ డస్తాద్రికి మఱలి ధూళులుగప్పిదివాకరుఁడు మందతనొందుడు యుద్ధముచేయువారెల్ల నూరకుండఁ గొందఱు మఱలుచుండఁ, గొందఱు కొట్టుచుండ, వేఱొకకొందఱు భంగమొందు చుండ మెల్లగా నాపగలు గడవసాగెను. అటులు సైన్యములన్నియుఁ బరస్పరసక్తములై జయాభిలాషమొదవఁ బోరాడుచుండ నావాసు దేవార్జునులు సైంధవునిఁ జంపుటకై వెడలిరి. అప్పార్థుఁడు తనవాఁడి

కోలలచే రథమార్గమును జేయ దానినిబట్టి యాజనార్ద్దనుఁడు నడుపుచుండెను. మహాత్ముఁడగు నర్జునురథ మేయెత్రోవఁ బోవుచుండెనో యాయాత్రోవలందుఁగల నీసైన్యములు చెదరిపోవుచుండెను. ఆదాశార్హుఁడుత్తమమధ్యమాధమమండలములను జూపుచుఁ దనరథయానశిక్షను బ్రకటించెను. నిజనామాంకితములై కాలాగ్నులు నాఁదగి పచ్చనై సన్నపునరములతోఁ గట్టఁబడి గొప్పవై దూరముగాఁ బోఁదగు వేణుమయములును నాయసములునునగు నాయర్జునుబాణములు వైరుల మ్రింగుచు నతఁడు ప్రయోగింప నొకక్రోశముదూరము పోవునవై యతఁ డొకక్రోశమును గడచిపోవునప్పటి కవి వైరులను రూపుమాపుచుండెను. గరుడవేగమును మారుతవేగమును గలగుఱ్ఱముల నాహృషీకేశుఁడు వడిగా నడుపఁబోవుచు లోకమున కచ్చెరువొదవించుచుండెను. ఓరాజా! సూర్యరథమేని యంతవడిగాఁ బోఁజాలదనవచ్చును. అది యొకటేల? ఇంద్రునకుఁగాని, రుద్రునకుఁగాని, వైశ్రవణునకుఁగాని యట్టివడిగలరథ మింకెవనికేనిగాని లేదని చెప్పవచ్చును. ఓరాజా! ఆ యర్జునుమనోభిప్రాయ మెట్లు శీఘ్రముగా నెందుఁ బోనెంచునో యా సేనామధ్యమున నందం దాకేశవుఁడు తనరథమును గడుపుచువచ్చెను. అంతఁ గొంతవడి కారథసంఘమునడుమకుఁ బోవునప్పటి కాహయోత్తమము లాకలిదప్పులు గొని యారథమును నతికష్టముగా వహింపసాగెను. అయ్యవి యుద్ధశౌండులగువారిచే బహువిధములుగాఁ బ్రహతములై క్షతములై మఱిమఱియు విచిత్రములగు మండలగతులఁ జరించి హతములైపడిన గజాశ్వాదుల ప్రోవులను గొండలను దాఁటునట్లుగా దాఁటినవగుటచే నలసి మందగమనములయ్యెను. అంతలో వీరులును సోదరులునగు నావంత్యులు సేనలతోఁగూడి క్లాంతవాహనుఁడై యున్న యప్పార్థుని మార్కొనిరి. అటు లెదుర్కొని వా రాయర్జును నఱువదినాల్గుబాణములచేఁ గొట్టి జనార్దనుని డెబ్బదిట నొప్పించి శరశతముచే నశ్వములఁగొట్టిరి. అంత నయ్యర్జునుఁడు కుపితుఁడై మర్మభేదకములగు తొమ్మిదిబాణములచే నొప్పింప, వారును నక్కేశవార్జునుల శరవర్షమున ముంచి సింహనాదము లొనర్చిరి. అంత నప్పార్థుఁడు తీవ్రభల్లములచే వారిధనువులను, గనకోజ్జ్వలములగుధ్వజములను ఛేదించెను. మఱియు వారు వేఱువిండ్లుగొని కుపితులై యప్పాండవు నొప్పించిరి. అందులకుఁ

గోపమదర సాధనంజయుఁడు బాణములతోఁగూడ ధనువులు దున్మాడి మఱియు నట్టితీవ్ర నారాచములచే వారిగుఱ్ఱములను సారథులను బార్ష్ణిపదానుగులను జంపి వారిలో జ్యేష్ఠునిమేనినుండి తలను దప్పింప వాఁడు గాలిచేఁగూలిన పెనుమ్రానువలెఁ బుడమిఁ బడియెను. అటు లావిందుఁడు హతుఁడగుటఁ గాంచి, ప్రతాపనిధియగు ననువిందుఁడు హతాశ్వమగు తనరథము విడిచి యొకగదఁ గేలఁబూని మహాబలుఁడై భ్రాతృవధమును స్మరించుచు గదతో నాట్యముచేయుచున్న వాఁడువలెఁ దిరుగుచు నాగోవిందులలాటమున నాగదతో మోదెను. అయ్యది మైనాకపర్వతమునువలె నాతనిఁ జలింపఁజేయఁజాలదయ్యెను. అంత నర్జునుఁడు వాఁడియగు నాఱుకోలలచే వానిమెడను బాదములను భుజములను దలను దెగనేయ, వాఁడు కొండవలెఁ గూలెను. ఓరాజా! వారిపవు రట్టులగుడు వారిని వెంబడించియున్న వారు కుపితులై శితశరములను జిమ్ముచు నప్పార్థు నెదుర్కొన వారి నతఁడు శితశరములఁగొట్టి వేసవి నడవిఁగాల్చినవహ్నివలె నెంతయు విరాజిల్లెను. అటు లతికష్టముగా వారిసైన్యమును గడచి మబ్బువీడి వెడలిన సూర్యుఁడువలె వెలయు నాతనిఁ జూచి కౌరవులు జడిసియు మఱియు ధైర్యముగొని వాని నలుదెసలఁ జుట్టుకొనిరి. మఱియు నాయర్జునుఁ డలసియుండుటను సైంధవుఁడు దూరమందుండుటను దెలిసికొని గొప్పసింహనాదముతో నాతని నలుగెలంకుల నావరించిరి. అటులు సంరంభించియున్న వారి నారసి చిఱునగవుదోఁప మెల్లగా నాయర్జునుఁ డావాసుదేవునితో "ఓజనార్దనా! శరార్దితములై మనగుఱ్ఱము లలసియున్నవి. సైంధవుఁ డింకను జాలదూరమందున్న వాఁడు. మన కిపుడు ముఖ్యకర్తవ్య మెద్దియో తెలుపుము. నీవు ప్రాజ్ఞతముఁడవు. నీ కేది రుచించునో యది యాచరించువాఁడను. నీవు నాయకుఁడవుగా నుండుటనేగదా పాండవులు శత్రులను జయింపనున్న వారు. ఇఁక నేనొనర్పఁదగుపని యెద్దియో తెల్పుము. ఒక్కమాఱు గుఱ్ఱములను విడిచి వీనిశల్యములఁ బెఱికి సుఖింపఁజేయుము.' అని పలుక విని, యక్కేశవుఁ డయ్యర్జునుతో 'ఓపార్థా! నీవు పలికినది నాకును సమ్మతమే.' అని బదులుచెప్పెను. అంతె నయ్యర్జునుఁడు మఱియు నాతనితో 'దేవా! నే నీసకలసైన్యము

లను వారించువాఁడను. నీవును జేయఁదగు ననంతరకృత్య మొనర్పుము.' అని చెప్పెను.

ఓయాంబికేయా! అప్పు డాయర్జునుఁడు రథముడిగి యసంభ్రాంతుఁడై గాండీవము పూని చలింపక కొండవలె నుండెను. జయాభిలాషు లగుకొందఱు క్షత్త్రియు లాధనంజయుఁడు పుడమినుండుటఁ జూచి యిదియె యదనని యెంచి యాతని రథవంశముతోఁ దలపడిరి. అటులు తలపడి ధనువు లెక్కిడుచు బాణములను విడుచుచుఁ గుపితులై విచిత్ర శస్త్రప్రదర్శన మొనర్చిరి. మఱియు మబ్బులు దివాకరునివలె శరధార లచే నప్పార్థునిఁ గప్పుచు మత్తగజములు సింహమునువలె నారాజ సింహు నారథికు లొక్కుమ్మడిఁ గవియునపు డప్పార్థుఁడు తనభుజబలము నెంతయు మెఱయించెను. మఱియు నతఁడు కుపితుఁడై యస్త్రములచే వైరులయస్త్రముల నాపుచుఁ బెక్కుబాణములచే నంతరిక్షము నావరింపఁ బ్రగాఢములగు నాబాణములసంఘర్షణమున నగ్ని జనించెను. అపు డందందు నిట్టూర్పులిడుచు రక్తములఁదడియుచున్న హయముల తోడను నేన్గులతోడను గూడి సంరంభించి జయముగోరువీరుల కతఁ డగ్నియై గానవచ్చెను. శరములనెడి తరఁగలును, ధ్వజములనెడిసుడులును, నేన్గులనెడి నక్రములునుగలిగి పదాతులే మత్స్యములుగా, శంఖ దుందుభిధ్వనులె చప్పుడుగాఁ బాగాలు కమఠములుగా, ఛత్రపతాకలు నురుపులుగా, మాతంగాంగములె పాషాణములుగా, నపారమై చలింపఁ జేయరాని రథికసాగరమున కప్పార్థుఁడు వేలయై బాణములచే నాపెను. యుద్ధప్రియుఁడును బురుషసింహుఁడగు నప్పార్థునితో జనార్దనుఁడు, 'ఓయర్జునా! ఈరణాంగణమున మనగుఱ్ఱములకుఁ దగునూప మెద్దియును లేదు. మునుఁగుటకుఁదగు నీరులేకపోనీ! త్రావుటకైనఁ దగుజల మిపు డపేక్షితమైయున్నది.' అని యతఁడు పలుకుచుండఁగనే యర్జునుఁ 'డో దేవా! ఇదె యిందుగల' దని యసంభ్రాంతుఁడై పలుకుచుఁ దనయస్త్రముచే మేదిని భేదించి, గుఱ్ఱములకు వలయు మంచిసరోవరము జనింపఁ జేసెను. అయ్యది, హంసకారండవాదులుగల్గి చక్రవాకములు వెలయ విస్తీర్ణమై నిర్మలోదకము లొప్పార వికసితాంబుజము లలరఁ గూర్మ మత్స్యగణాకీర్ణమై లోతై మహర్షిసేవ్యమై యుండుటను గాంచి యాక్షణము దానిని సందర్శించుటకై నారదుఁ డందులకు వచ్చెను. ఆసరోవర

మునకు శరములే స్తంభములుగను, నవియే వంశములుగను, నవియే పైఁగప్పుగను వెలయ నొకశరవేశ్మము నద్భుతముగా నతఁడు శిల్పివలెఁ గల్పించెను. అందుల కాగోవిందుఁడు మేలుమేలని మెచ్చికొనియెను." అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

### అర్జునశరవేశ్మమునకు సైన్య మచ్చెరువొందుట

"ఓరాజా! మహాత్ముఁడగు నక్కౌంతేయునిచే నటులు జలము సృజింపఁబడుచు శత్రుసైన్యము వారింపఁబడ శరవేశ్మము కల్పింపఁబడఁగా నపు డవ్వాసుదేవుఁడు రథముడిగి శరపీడితములై యున్న తన గుఱ్ఱముల విప్పెను. మున్నెన్నఁడును గాననియద్భుతము నారసినసిద్ధచారణులయు, సైనికులయు సాధువాదములు మెండై నిండెను. పదాతియైన యక్కౌంతేయునితో నామహారథికులు పోరాడియు నాతని వారింపఁజాలకుండుట యద్భుతముగాఁ జూపట్టెను. పెక్కు గజవాజిసైన్యములతో రథికులనేకులు వచ్చుచుండిరిగాని యందుల కతఁ డించుకేని సంభ్రమింపఁడయ్యెను. అదియే యాతనియాధిక్యము. అప్పార్థివులెల్ల నప్పార్థునిపై శరములఁ గురిసిరిగాని యందుల కతఁ డించుకేని నొవ్వఁడయ్యెను. అతఁడు తనపైకివచ్చుశరశతములను, గదలను, ప్రాసములను వచ్చినవానినన్నిటిని నదులను సాగరమువలె మ్రింగుచుండెను. మహత్తరమగు నస్త్రవేగముచేతను, బాహుబలముచేతను నప్పార్థివేంద్రులబాణపరంపరలనెల్ల గ్రసించుచుఁ దాను భూమియందుండియు రథస్థులగువారినెల్ల లోభము తక్కినగుణములనువలె నివారించుచు వచ్చెను. అపు డప్పార్థవాసుదేవులవిక్రమవిశేషముల కద్భుతపడి కౌరవులును వారిని గౌరవించిరి. ఓమహారాజా! ఆమహారణరంగమున నప్పార్థగోవిందులు రథాశ్వములను విడుచుటకంటె లోకమున నింకేమి యద్భుతముగలదో తెలుపుము. ఆరణరంగమునఁ దమయుగ్రతేజమును వెలయించు నావాసుదేవార్జునులు మాకెల్లరకు నెంతయు భయమొదవించిరి. అర్జునుఁ డటులు స్త్రీమధ్యమునందువలె నిర్భయముగా యుద్ధమొనర్చుచుండ నపు డవ్వాసుదేవుఁడు నగుచు శరగర్భగృహమునఁ దనయశ్వములు దొరలునట్లొనర్చి యించుకేనిఁ దొట్రువడక మనవారి సైన్యములెల్లఁ దిలకించుచుండఁగా మఱియు వానిశ్రమయు గ్లానియు

వడంకుచు దీఱ నశ్వకర్మ కుశలుండగుట వానిందేర్చి హస్తకౌశలము మెఱయ వానిశల్యములను మెల్లగాఁదీసి నీటఁగడిగి వానిని నీరుద్రావించెను. అటు లాకృత్యమెల్ల ముగియ స్నానపానాహారాదిదానముచే శ్రమఁదొలఁగియున్న యాగుఱ్ఱముల నతఁ డెప్పటిచొప్పున నారథోత్తమమునకుఁ గట్టి యర్జునుతోఁ గూడ మఱల నారథ మధిష్ఠించి వడిగా వెడలెను. అట్టి యుద్ధరంగమున నీరుద్రావినహయములతోఁ గదలిన యవ్వాసుదేవార్జునులఁ జూచి మఱియును మనవారు చింతాక్రాంతచిత్తులైరి. ఓరాజా! అపుడు మనవా రేమిచేయఁగలరు? నిట్టూర్పులు వుచ్చుచుఁ గోఱలుతీసినపాములువలె నిస్సారులై 'అయ్యో! పార్థుఁడు వెడలిపోయెనే! ఛీ! ఛీ! మనప్రయోజనమేమి?' అని వారిలోవా రనుకొనిరి. ఓరాజా! సకలక్షత్త్రియమండలము చూచుచుండఁగా నొక్కరథముతో వెడలి పిల్లలతో నాడుకొన్నట్టులు మనవారిబలమెల్ల వ్యర్థముగా నెంచి మనవారు ప్రయత్నించుచుండఁగనే యఱచుచుండఁగనే వారికిఁ జిక్కక తమ పరాక్రమమును వెలయించుచు వెడలిపోయిన యక్కేశవార్జునులఁ గాంచి మఱికొందఱు సైనికులు 'ఓయోధులారా! త్వరపడుఁడు. కృష్ణార్జునులను వధించుటకై త్వరపడుఁడు. ఈదాశార్హుఁడు మేమెల్లఁ జూచుచుండఁగా మమ్ము వంచించి సైంధవునిపైకిఁ బరువిడుచున్నవాఁడు.' అని యఱచిరి. ఓరాజా! రాజు లపుడు కొందఱు తమలోఁదా మిట్లు సంభాషించుకొనిరి. 'ఆహా! మున్నెన్నఁడును గానని యీయద్భుతము నారయఁగాఁ గౌరవసైన్యములును, రారాజును, ధృతరాష్ట్రుఁడును నశింతు రనవచ్చును. ఈదుర్యోధనాపరాధముచే సకలక్షత్త్రకులమును, నెల్లపుడమియు విలయ మొందనున్నది. దాని నారాజు తెలియకున్నవాఁడు.' అని కొందఱు పలుక, మఱికొందఱు 'అయ్యో! ఉపాయ మెఱుఁగక వృథాలోచనాపరుఁడైన యాసుయోధనుఁ డింక యమమందిర మొందుచున్నసైంధవున కేమియొనర్పవలెనో యది యాచరించుఁగాక.' అని పలికిరి.

ఓరాజా! అటు లాభాస్కరుఁడు పడమరకు మఱల నీరుద్రావి నెమ్మదినొందినగుఱ్ఱములతో మిక్కిలి వడిగా నాసైంధవునిపై కయ్యర్జునుఁడు వెడలెను. కుపితుఁడగు నంతకుఁడు నాఁదగి వెడలినయామహాబాహుని, మనయోధులం దెవ్వారును వారింపఁజాలరైరి. పిమ్మట నప్పా

ర్జునుఁడు మనసైన్యమునెల్ల వెడలఁగొట్టి యాసైంధవునకై క్రుక్కిడి మృగములను సింహమువలె యోధులనెల్లఁ బీడించెను. అటులు సైన్యమును వడిగాఁ బ్రవేశించుచు రథాశ్వములను బ్రేరించుచు, బెగ్గురునా వెల్లనగు తనపాంచజన్యము నావాసుదేవుఁడు పూరించెను. అర్జునుఁడు తనకెదురుగావిడిచిన బాణము లాతనికి వెనుకఁబడునట్లుగాఁ దెలుపరాని వేగముతో వాయువేగములై యాతనిగుఱ్ఱములు పరువులువెట్టసాగెను! పిదపఁ గుపితులై క్షత్రియులనేకులు, సైంధవవధాపేక్షి యైయున్న యాధనంజయునిఁ దలపడిరి. సైన్యములు చెదరుచుండఁగా నాసుయోధనుఁ డపుడు వడిగా నప్పార్థునిపైకి వెడలెను. గాలిచేఁ బతాక గదల మేఘగంభీరస్వనమై ఘోరమైన కపిధ్వజముగల యాతనిరథము గాంచి యనేకులు విషణ్ణచిత్తులైరి. అపు డెగసినధూళులచేసూర్యుఁ డావరింపఁ బడఁగా నర్జునశరపీడితులగు యోధు లావాసుదేవార్జునులఁ జూడఁజాల కుండిరి.” అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

దుర్యోధనుఁ డర్జునుపైకి వెడలుట

“ఓరాజా! అటు లతిక్రమించిపోవుచున్న యావాసుదేవార్జునులఁ గాంచి భయముచే మనవారిక్షత్రియు లెవ్వరును మార్కొనక జాఱి పోయిరి. అందఱును సంరంభించి లజ్జచే బలముదెచ్చికొని వెడలియుఁ గదలనేరక యాధనంజయునుండి మఱలిరి. కోపావేశపరవశులై యప్పాండవునిపైకి వెడలినవారు సాగరమునుండి నదులువలె మఱి నివర్తించుట లేదు. కొందఱు నిస్సారులు వేదములనుండి నాస్తికులువలె మఱలియు నరకమునొంది తమకిల్బిషము ననుభవించిరి. ఆపురుషవరేణ్యు లాసైన్యమునుండి విముక్తులై రాహుముఖమునుండి వెడలినప్రభాకరులువలెఁ జూపట్టిరి. మఱియునానేనాజాలమును జింపి, మహాజాలమును జింపి వెడలినమత్స్యములునా నపుడు గన్పట్టిరి. ఓరాజా! మిక్కిలి సమ్మర్దమై భేదింపరానియాద్రోణునిసైన్యమునుండి వారు విముక్తులై యుదయించిన కాలసూర్యులను బోలియుండిరి. అటులు వారు శస్త్రాస్త్రసంకటమునుండియు సమ్మర్దమునుండియుఁ దప్పించికొని, వైరులకు శస్త్రాస్త్రములచే సమ్మర్దము చేయుచు, నగ్నిస్పర్శముగల్గిన మకరాస్యమునుండి విముక్తములగు పెద్ద చేపలువలె నాద్రోణునుండి తప్పి సముద్రమును మకరములువలె మన

సైన్యమును బ్రవేశించి కలఁతనొందింపసాగిరి. నీపుత్త్రులును, నీవారును, ద్రోణానీకమధ్యగతులగు కృష్ణార్జునులిఁక దాఁటిపోఁజాలరని తలంచిరిగాని, వా రా ద్రోణుని నతిక్రమించి పోవుటను జూచి సైంధవుని జీవితమునెడ నిరాశ చేసికొనిరి. ఓరాజా! ద్రోణకృతవర్మలను గృష్ణార్జునులు దప్పించుకొనలేరని సైంధవుఁడు చాల విశ్వసించి యుండెను. ఆశ బలవత్తరమైనదిగదా! కాని, వాని కాయాశను విఫలముగాఁ జేసి, వా రా ద్రోణునియు, భోజునియు, దుస్తరములగుసైన్యములను దాఁటి పోయిరి. అటు లతిక్రమించి ప్రజ్వలించినయగ్నులవలెనున్న యవ్వాసుదేవార్జునులఁ జూచి మనవారు సైంధవునిజీవితముపై నిరాశ చేసికొనిరి. అంత నాకృష్ణధనంజయు లాసైంధవునివధమునకై నిర్భయముగా నేమేమో మాటలాడుకొనుచు 'వీఁడు ధార్తరాష్ట్రులగు నార్వురుమహారథుల నడుమ నుంపఁబడి నాకంటఁబడుట నిఁక వీఁడు నన్ను విడిపించికొనిపోఁజాలఁడు. వీని కా దేవగణములతోఁ గూడినయింద్రుఁడు రక్షకుఁడుగా వచ్చినను, వీనిని మనము చంపుదుముగాని విడువము' అని పరస్పరము సంభాషించికొనిరి. ఓరాజా! వారటులు సంభాషించుకొనుచునే యా సైంధవు నెపుడు చూచిరో యపుడు నీతనయులెల్ల బిగ్గరగా నఱచిరి. ఓరాజా! 'డప్పిగొనిన మహాగజములు వడిగా నిర్జలప్రదేశమును దాఁటి నీరుద్రావి యూఱడిల్లినట్టులును, వ్యాఘ్రసింహాదిక్రూరమృగాన్వితములగు నడవులను బర్వతములను దాఁటిన వర్తకులట్టులును, వీరు ముఖకాంతులు వెలయ నొప్పుచున్నవారు' అని తలంచి నీవారెల్లరును నాక్రోశింపసాగిరి. 'విషసర్పతుల్యుఁడును బ్రజ్వలితపావకాకారుఁడు నగు నా ద్రోణునుండియు, మఱియుఁగల క్షత్త్రియులనుండియు, సాగరమునాఁదగు ద్రోణసైన్యమునుండియు వీరు విముక్తులై భాస్కరులు నా వెలయుచున్నవారు. ద్రోణకృతవర్మరక్షితమగు సైన్యమును గడచి వీరు సాగరమును దాఁటినవారువలె సంతోషయుక్తులై యున్నవారు. మఱియు నింద్రాగ్నులువలె వెలుఁగుచున్నారు. ఆభారద్వాజునిసాయకప్రహారములచే రక్తములు స్రవింపఁ గర్ణికారములతోఁగూడిన పర్వతములునా వీరు చూపట్టుచున్నవారు. ద్రోణుఁడనెడి మొసలిగలహ్రదము నుండి సర్పప్రమాదమునుండి వీరు తప్పినవారు. జ్యాఘోషమనెడిగర్జనములును, గదానిస్త్రింశాదులనెడి మెఱుపులును గల్గినద్రోణాస్త్రమేఘము

నుండి విడివడినసూర్యచంద్రులవలె వీరు గానవచ్చుచున్నవారు. వర్షకాలమున జలపూర్ణములై మహాగ్రాహసంకులములగు నదులునాఁదగి యార్వురమహారథికులను దమబాహువులతోఁ దప్పించికొనినవారు. ఇవ్వాసుదేవార్జునులు లోకప్రసిద్ధులు' అని యెల్లభూతములును దలంచెను. 'ఆహా! ఈ ద్రోణు నస్త్రబలమునకు విస్మితులై చేరువనున్న సైంధవునిఁ జంపుదలంపుతోఁ జూచుచు లేఁడిపైఁబడనున్న బెబ్బులులు వలె వీరున్నవారు. అటులే వీరిముఖవర్ణము గానవచ్చుచున్నది.' అని కొందఱు తలంచిరి. ఇటులు నీయోధులు సైంధవుని హతునిఁగాఁ దలంచిరి. లోహితాక్షులును, మహాబాహులునునగు కృష్ణపాండవులు గలిసి సైంధవునిఁ గాంచి సంతుష్టులై మఱియుమఱియు సింహనాదము లొనర్పసాగిరి. ఓరాజా! పగ్గములు పట్టుకొనినశౌరియు, గాండివధారియగు నర్జునుఁడు, సూర్యపావకులునాఁ జూపట్టిరి. ద్రోణసైన్యమునుండి విడివడిన యప్పార్థవాసుదేవులకు సంతోషమే యయ్యెను. వారు మఱియుఁ జేరువనే సైంధవునిఁ జూచి డేగ లామిషమును గాంచినట్లు సంతసించిరి. అటులా సైన్యములనెల్ల నతిక్రమించిన యాకృష్ణధనంజయులఁగాంచి సైంధవరక్షణార్థమై నీకొమరుఁడగు సుయోధనుఁడు విక్రమమువెలయ ద్రోణాబద్ధకవచుఁడై హయసంస్కారమొనర్చికొని తానొకఁడే వెడలి యక్కృష్ణార్జునుల నతిక్రమించి యవ్వాసుదేవు నెదుర్కొనియెను. పిదప సకలసైన్యములును వాద్యములను మ్రోయించిరి. శంఖధ్వనులతోఁగూడ సింహనాదములు చెలరేఁగెను. అటు లాపార్థవాసుదేవులముందు నిలిచి యున్నసుయోధను నారసి మున్ను సైంధవునకు రక్షకులుగానున్న వారును, పావకతుల్యులై యుత్సాహమునొందిరి. ఓరాజా! అటులు పరివారముతోఁగూడఁ దమ్మతిక్రమించిన సుయోధనునిఁ గాంచి తత్కాలానుకూలముగా వాసుదేవుఁ డాయర్జునుతో నిట్లు తెలిపెను.

## దుర్యోధనుఁ డర్జునుతో దంభములాడుట

'ఓయర్జునా! మనల నతిక్రమించివచ్చిన యీసుయోధనునిఁ గాంచితివా? ఇది యెంతయు నద్భుతముగా నున్నదే! వీని కీడగురథికుఁ డెవ్వఁడు? ఓపార్థా! వీఁడు కృతాస్త్రుఁడును యుద్ధగర్వితుఁ డైనవాఁడు. వీనిబాణములు మిక్కిలి దూరముగాఁ బోవును. మఱియు సుఖముగాఁ

బెరిగినవాఁడయ్యెను దృఢాస్త్రుఁడై చిత్రయోధియై మహాబలుఁడగుచు మహారథుల మెప్పుఁబొందినవాఁడు. మఱియు నితఁ డెల్లప్పుడును మిమ్ము ద్వేషించుచుండును. ఇట్టివీనితో నీకిప్పుడు యుద్ధము సంభవించుట సుకృతకాలమని తలంతును. ఇపుడు సైంధవుఁ డొద్దుగా మఱల వీనితో నీకు ద్యూతము సంభవించెను. జయపరాజయము లెట్లుండునో? చిరకాలమునుండి వీనిపైఁగల క్రోధవిషము నిపుడు గ్రక్కుము. వీఁడే మీపాండవుల యనర్థములకెల్ల మూలమైనవాఁడు. అట్టిదుష్టుఁ డిపుడు నీకార్యము సఫలమగునట్లుగా నీకు లభించెను. రాజ్యాపేక్షియగు నీతఁడు నీతో యుద్ధమున కేల వచ్చెనో? దైవవశముగా వీఁడు నీబాణగోచరుఁడయ్యెను. వీని నెటులేనిఁ జంపితివా మనకష్టములెల్లఁ గట్టెక్కును. ఐశ్వర్యమదమత్తుఁడగుట నెవ్వఁడును గష్టసుఖము లెఱుఁగనివాఁడై వీఁడు నీపరాక్రమమువిధము దెలియక యిట్లు వచ్చెను. ఓపార్థా! సురాసురమానవులుగల మూఁడులోకములును నిన్ను జయింప నుత్సహింపవుగదా! ఈసుయోధనుఁ డొక్కఁడును నీకేపాటి? ఓయీ! పుణ్యవశమున వీఁడు నీరథముచేరువకుఁ జేరినవాఁడు. ఓమహాబాహూ! నీవు వీని నాపురందరుఁడు వృత్రునివలెఁ దెగటార్పుము. వీఁడు మీయనర్థములకుఁగా విక్రమించుచుండువాఁడు. వీఁడే ద్యూతమున ధర్మజుని వంచించెను. ఓమానధనా! వీఁడొనర్చినక్రూరకృత్యములు పెక్కుయున్నయవి. ఏపాపమెఱుఁగని మీపైఁబాపబుద్ధిగల్గి యనివార్యుఁడై స్వేచ్ఛాసంచారియై కుపితుఁడై ప్రవర్తిలినవీనిని బూజ్యమైన యుద్ధబుద్ధిఁ జేసి, వేఱేమియుఁ జింతింపక వడిగా సంహరింపుము. ఓపాండవా! వీఁడువంచనచే మీరాజ్యము నపహరించుటయు, మీవనవాసమును ద్రౌపదీపరాభవమును దలంచి, నీవిక్రమము వెలయ దైవవశముగా నీబాణముల పాలఁబడిన వీనిని దూలింపుము. కార్యప్రతిఘాతమునకై వీఁడిట్లు దైవవశముగాఁ బ్రయత్నించుచున్నవాఁడు. నీతో వీఁడు యుద్ధముచేయ సంకల్పించుటయు దైవలబ్ధమే! ఓపార్థా! మనము కోరకుండఁగనే మన కోర్కులన్నియు సఫలములయ్యెను. కావునఁ గులాధముఁడగు నీధార్తరాష్ట్రు నీరణరంగమునఁ జంపుము. మున్ను దేవాసురయుద్ధమున నింద్రుఁడు జంభునిఁ జంపుట నిపు డీవు తలపింపవలయును. ఓయీ! నీవిపుడు వీనిని జంపితివేని వీనిసైన్య మనాథమై చెడును. మన యీవైరమున

కిపు డవభృథస్నాన మగుఁగాక. దురాత్ములకు మూలమగు వీనిని జంపుము.'

ఓరాజా! అపు డర్జునుఁ డది తనకుఁ గర్తవ్యముగా నెంచి 'ఓదేవా! తక్కినదెల్ల నిరాకరించి యాసుయోధనుఁడున్న చోటికి వెడలుము. వీఁడు చిరకాలము మారాజ్యమును నిష్కంటకముగా ననుభవించినవాఁడు. ఈరణమున విక్రమించి వీనితలఁ దెగనేయువాఁడను. ఓమాధవా! రజస్వలయైయున్న యాద్రౌపదికొప్పువట్టి యీడ్చినయప్పటి యాయొప్పులాడి పరిక్లేశమునకుఁ బ్రతీకార మొనర్చువాఁడనై వీని నిదె చంపెదను.' అని పలుకుచు వారిరువురు నుత్సాహమడర, నుత్తమములగు తమతెల్లగుఱ్ఱముల నాసుయోధనుఁ జేరఁ బోనిచ్చిరి. ఓరాజా! వారిసమీపమును జేరి నీకుమారుఁడు తనకపుడు గొప్పభయము ప్రాప్తించినను జడియకుండెను. ఆదుర్యోధనునిధైర్యమున కందలి క్షత్త్రియు లాతని గౌరవించిరి. అటు లక్కేశవార్జునుల నెదురించి నివారించుట సామాన్యమా? పిదప నీవారిసకలసైన్యములందు గొప్పనాద ముప్పతిల్లెను. అటులు భయంకరమై జనులనాదము ప్రవర్తిల్లుఁడు, సుయోధనుఁ డపు డర్జునునిఁ దలపడి నివారించెను. ధనుర్ధరుఁడగు నీ పుత్త్రుఁ డటులు తన్ను వారింప నర్జునుఁ డాతనిపై సంరంభించెను. అటులు సంరబ్ధులైనయాదుర్యోధనధనంజయుల నారసి, భీకరాకారులై ధారుణీపతులెల్లరును నెల్లెడలఁ జుట్టికొనియుండిరి. ఓరాజా! సంరంభించినపార్థుని వాసుదేవునిఁ జూచి, యాసుయోధనుఁడు నగుచు యుద్ధమున కాహ్వానించెను, అందుల కవ్వాసుదేవార్జునులు సంతుష్టులై సింహనాదములొనర్చి, శంఖములను బూరించిరి. అటు లుత్సాహపూరితులైయున్న వారిరువుర నారసి, యక్కౌరవేయులెల్లరును, నీతనయుని జీవితమునెడ నిరాశులైయుండిరి. మఱికొందఱు కౌరవులు సుయోధనుని వైశ్వానరముఖమున హోమముచేయఁబడినవానిఁగాఁ దలంచి శోకించిరి. అటులే నీయోధులు, ప్రహృష్టమానసులైయున్న యాకృష్ణార్జునులఁ గాంచి భయపీడితులై 'అయ్యో! రాజు హతుఁడయ్యెను, హతుఁడయ్యెను.' అని యఱచిరి. ఆజనులఘోషమును విని నీతనయుఁడు 'ఓయోధులారా! జడియకుఁడు. నే నిదె కృష్ణార్జునుల మృత్యుముఖగతులఁ జేయుచున్నవాఁడను.' అని పలికి జయాపేక్షియై సంరంభమడర,

సదంభముగా నర్జునుతో 'ఓపార్థా! నీవు నేర్చికొనిన దైవమానుషాస్త్ర శస్త్రముల నిపుడు నాపై వడిగాఁ జూపుము. నీవు పాండునకు జనించితి వేని నీబలపరాక్రమములను నాపైఁ జూపుమువు. అటులే కేశవునిశక్తి యుఁ జూపఁబడుఁగాక. నీపౌరుష మెట్టిదో వడిగా నిపుడు చూపుము. నేను లేనిచోట నీవెన్నెనికృత్యములఁ జేసితివని దెల్పుచుందురు. స్వామి సత్కారయుక్తములుగా వానినెల్ల నిందుఁ జూపుము.' అని పలికె" నని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

దుర్యోధనుఁ డర్జునునితోఁ బోరి యోడుట

"ఓయాంబికేయా! ఆసుయోధనుఁ డిట్లు పలికి మర్మభేదకములగు మూఁడువాఁడికోలలచే నాయర్జును నొప్పించి, నాల్గునారాచముల గుఱ్ఱ ములఁగొట్టి, వాసుదేవునిఁ బదిబాణములచే వక్షమువనొప్పించి,మఱియు నాతనిమునికోల నొకభల్లముచేఁ దెగనేసి పుడమిఁ బడఁద్రోసెను. అంత నర్జునుఁడు జాగరూకుఁడై చిత్రపుంఖములును, శిలాశితములునగు పదు నాల్గునారసములచే వడిగా నాసుయోధనుని నొప్పించెనుగాని, యవి యాతనికవచమును నాటికొనక జాఱిపోయెను. అవి యటులునిష్ఫలము లగుట నాలోకించి, మఱియు నప్పార్థుఁడు పదునాల్గుతీవ్రబాణములను బ్రయోగించెనుగాని, యవియు నాతనికవచమునుండి జాఱిపోయెను. అటు లిరువదెన్మిదిబాణములు తీవ్రముగాఁ బ్రయుక్తములయ్యు నిష్ఫ లములగుటఁ జూచి, కృష్ణుఁ డయ్యర్జునుతో 'ఓపార్థా!ఎన్నఁడునుజూడని దిపుడు చూచుచున్నవాఁడను. నీవు ప్రయోగించినబాణములు శిలా ప్రసారమును బోలునవిగదా! అవి యిపు డిట్లు వ్యర్థములయ్యెనే? ఓ యర్జునా! నీగాండీవబలము తగ్గెనా? లేక నీచేతిలావు తప్పెనా? లేక వెనుకటి నీభుజములబలము చెడెనా? లేక నీ వీశత్రునితోఁ గలిసినవేళ యిట్టిదా? అటులుగాక యిది తగు కాలముగాదా? తెలుపుము. ఓపార్థా! నీ యీవ్యర్థములైనశరముల నారసి నాకెంతయు నాశ్చర్య మొదవు చున్నదే! నీబాణములన్నో వజ్రతుల్యములై పిడుగులై ఘోరములై వైరులమేను లుచ్చిపోయెడివి గాదే? అట్టి నీయమోఘబాణము లిప్ప ట్టునఁ బనిచేయకుండుట కేమి యీవిడంబన?' అని ప్రశ్నించెను. అది విని యర్జునుఁడు 'ఓకృష్ణా! ద్రోణుఁడు తనబుద్ధి యాథార్థరాష్ట్రు

నందుఁ జొనిపెను. ఆతఁ డిచ్చినయిక్కవచధారణయే నాయస్త్రముల కభేద్యమై యున్నయది. ఇక్కవచధారణయందే లోకమెల్ల నంతర్హితమైయున్నది. దీని నాద్రోణుఁ డొకఁడే తెలియును. నే నాతనివలనఁ గొంటిని. ఇక్కవచము బాణములచే నెట్లును భేదింపవలనుపడదు. ఓగోవిందా! దీని నాయింద్రుఁడు తనవజ్రాయుధముచేనైన భేదింపఁజాలఁడు. ఓకృష్ణా! నీ వెఱింగియు నెఱుఁగనట్లు నన్నుఁ బ్రశ్నించి మోహపెట్టుచున్నాఁడవేమి? ఓకేశవా! మూఁడు లోకములందును, భూతభవిష్యద్వర్తమానములం దేదియేని నీవెఱుఁగనిది యుండునా? ఓమధుసూదనా! నీకువలె నిది మఱెవ్వరికిని దెలియదు సుమీ! ఓకృష్ణా! ఈసుయోధనుఁడు ద్రోణునిచే విహితమగు నిక్కవచధారణను గ్రహించి నిర్భయుఁడై కదలక నిలిచియున్నవాఁడు. ఓమాధవా! వీఁడాఁడుదివలె నీకవచమును ధరించెనేగాని యిందేమి యుంచఁబడెనో యది వీనికిఁ దెలియదు. ఓజనార్దనా! ఇదె చూడుము. నాబాహుబలమును ధనుర్బలమును జూపుచున్నాఁడను. వీఁ డీకవచముచే రక్షింపఁబడియున్న నిదె వీని నోడించుచున్నవాఁడను. దీనినాఁ దేవేశుఁ డంగిరసున కొసంగెను. వానినుండి బృహస్పతికిని, వానినుండి యింద్రునకును నిది లబ్ధమయ్యెను. ఆయింద్రుఁడు ససంగ్రహముగా నాకు దీని నొసఁగెను. ఈమహాకవచమే బ్రహ్మచేనిర్మింపఁబడి దైవకృతమగునేని నాబాణముచే హతుఁడగు నీదుర్బుద్ధిని రక్షింపకుండుఁగాక.' అని పలికి యతఁడు బాణముల నభిమంత్రించి ప్రయోగించునంతలో వాని నాద్రోణపుత్త్రుఁడగునశ్వత్థామ సర్వాస్త్రఘాతియగు నస్త్రముచే ఖండించెను. అటులు దూరమునుండియే బ్రహ్మవాదియగు నశ్వత్థామచే ఖండింపఁబడిన యాబాణములవిధ మెఱిఁగి విస్మితుఁడై, యప్పార్థుఁ డవ్వాసుదేవునితో 'దేవా! నా యీయస్త్రము మఱియొకమాఱు ప్రయోగింపఁదగనిది. ఒకపుడు మఱియుఁ బ్రయోగించితినా! యది నన్నును నాబలమును జెఱుచును.' అని పలుకునంతలో సుయోధనుఁడు తొమ్మిదితొమ్మిదిబాణములచే నవ్వాసుదేవార్జునుల నొప్పించి, మఱియు వారిని శరవర్షమున ముంచెను. అందులకు మనవారందఱు నానందమొంది సింహనాదములను వాదిత్రనినాదములను గావించిరి. పిదపఁ గుపితుఁడై యప్పార్థుఁడు పెదవులఁ దడుపుచుఁ, గవచరక్షితమగు నాసుయోధనునంగము

లను గుఱిసేయక, సుప్రయుక్తములగు తీవ్రబాణములచే వానిగుఱ్ఱముల మేనొల్చి పార్ష్ణిసారథుల నిరువురఁ జీల్చి, విల్లు దుల్చి,హస్తావాపము రాల్చి, యాతనిరథమును దొల్చుట కారంభించెను. అటులతఁడా సుయోధను విరథునొనర్చి రెండు తీవ్రబాణములచే వానిపాణితలముల నొప్పించెను. అపు డప్పరమధనుర్ధరుఁడగు సుయోధనుఁ డట్టికష్టదశ నొందియుండుట నారసి, ధనంజయశరార్దితుఁడగు నాతనిఁ గాపాడువారై, వేల కొలఁది రథములతోడను, గజాశ్వములతోడను, బదాతులతోడను, రథికు లనేకు లాధనంజయునిఁ జుట్టుకొనిరి. అపుడు గోవిందార్జునులును, వారిరథమును, గానరాకుండ మనవారిజనసమూహమును నస్త్రవర్షమును నావరించియుండెను. అంత నయ్యర్జునుఁడు దనయస్త్రబలముచే మన సైన్యమును భేదింప, నపుడు వందలకొలఁదిరథములు నేన్గులును వికలాంగములై నేలఁ గూలెను. వారటులు హతులును, హన్యమానులు నగుచున్నను నాతనివిడువక చుట్టియుండ, నతఁ డొకక్రోశము మేర నలుగెలంకులవారిచే నావరింపఁబడియుండెను. అపు డవ్వాసుదేవుఁ డర్జునుతో 'ఓపార్థా! నీవు మిక్కిలిగా, ధనుష్టాంకార మొనరింపుము. నేను బాంచజన్యమొత్తెదను.' అని పలుక విని యతఁ డట్లు ధనుష్టాంకార మొనర్చి వైరులఁ దునుమాడఁ జొచ్చెను. కేశవుఁడును బలవత్తరముగాఁ బాంచజన్యమును బూరించెను. అపు డాతనియొడలు ధూళిగ్రుంగి మేనెల్లఁ జెమర్చెను. ఆతనిశంఖనినాదముచేతను, గాండీవనిస్వనముచేతను, బలవంతులును, బలహీనులునుగూడఁ బుడమిఁబడిరి. అటులు మనవారిచే విముక్తమగువారిరథము గాలిచేఁ దొలఁగిన మేఘమువలెఁ దొలఁగెను. పిదప సైంధవరక్షకులును వారి ననుసరించియున్నవారును గుపితులై యప్పార్థునిఁ గవిసి,సింహనాదములొనర్చుచుఁ బుడమిని వడఁకించిరి. శంఖారావమిశ్రితములగు బాణశబ్దములను బ్రాదుర్భవింపఁజేసిరి. నీవారిలో జనించిన ఘోరమగు నాదమును విని వాసుదేవార్జునులును దమశంఖములఁ బూరించిరి. ఓరాజా! ఆశంఖముల గొప్పనినాదముచే, శైలార్ణవద్వీపపాతాళములతోఁగూడఁ బుడమి వడంకెను. ఓభరతశ్రేష్ఠా! ఆచప్పుడు సకలదిశల నిండి, యక్కురుపాండవబలమునఁ బ్రతిధ్వనులు వెడలెను. అచ్చో నాకృష్ణధనంజయులఁ గాంచి మనవారు త్వరపడుచు

సంభ్రమము నొందదొడంగిరి. పిదప నకృష్ణార్జునులును నీవారినారసి సన్నద్ధులై కోపమడర వారి నెదుర్కొనిరి. అది యెంతయు నద్భుతముగాఁ జూపట్టెను.” అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## సంకులయుద్ధము

“ఓరాజా! సువర్ణచిత్రితములు, వ్యాఘ్రచర్మావృతములు నైధ్వని గల్గినమహారథములతో వెడలి, బంగారుపిడులుగల్గి చూడనలవిగాక గొప్పనాదములఁజేయుచున్న కార్ముకములు ధరించి, గుఱ్ఱములను హెచ్చరించి, భూరిశ్రవుఁడు, శలుఁడు, కర్ణుఁడు, వృషసేనుఁడు, సైంధవుఁడు, కృపుఁడు, శల్యుఁడు, ద్రోణపుత్త్రుఁడు ననియెడి యెనమండ్రు మహారథికులు, నాకసమును ద్రావువారువలె భీకరులై హేమచంద్రకములగు కవచముల ధరించి, యెంతయు దశదిశల విరాజిల్లఁజేసిరి. మఱియు వారుత్తమాశ్వములు గలరథములతో మనసుయోధను రక్షించువారై ధనంజయు నావరించి, శంఖములను బూరించి, పృథివ్యాకాశములను, సాగరమును ధ్వనులచే నిండఁజేసిరి. అటులే వాసుదేవార్జునులును తమశంఖములను బూరించిరి. ఆదేవదత్తపాంచజన్యములనినాదము భూమ్యాకాశములను బూరించెను. అటులామహానాదము దారుణమై, భీరువులకు భయజనకమై శూరులకు హర్షవర్ధనమైయుండ, మఱియు భేరీమృదంగాదులు మ్రోయింపంబడ, దుర్యోధనుహితము గోరువారెల్లరును నాహూతులైరి. వారానినాదమును విని కుపితులై శంఖములను బూరించి, యవ్వాసుదేవార్జునులఁ బ్రతీకరించుచుండిరి. పిదప సుయోధనుఁడును నాయెనమండ్రురథికులును, సైంధవుని రక్షించుటకుఁగాఁ బాండవమధ్యము నావరించిరి. అపుడు ద్రోణతనయుఁడవ్వాసుదేవుని డెబ్బదిమూఁడుబాణములచే నొప్పించెను. అటులే యర్జునుని మూఁడుభల్లములచేతను, నాతనిగుఱ్ఱముల నైదింటి చేతను నొప్పించెను. అర్జునుఁడాయశ్వత్థామ నాఱుబాణములచే నొప్పించెను. అటులే మఱియుఁ గర్ణునిఁ బదింటను, వృషసేనుని మూఁడింటను గొట్టి, శల్యుని ముష్టియందుండఁగనే శరచాపములను ఛేదించెను. శల్యుఁడు వేఱొక విల్లుగొని పాండవు నొప్పించెను, మఱియు భూరిశ్రవుఁడు మూఁడిటను, కర్ణుఁడు ముప్పది రెండిటను, వృషసేనుఁ డేడింటను, సైంధవుఁడు డెబ్బది

మూఁడింటను, గృపుఁడు పదింటను, శల్యుఁడు పదింటను నప్పార్థుని నొప్పించిరి. పిదప నశ్వత్థామ యఱువదిబాణములచే నర్జునుఁ బ్రహరించి, మఱియు వాసుదేవు నిరువదింటను, నర్జును నైదిటను గొట్టఁ, బరిహాస మొనర్చుచు, నర్జునుఁడు తనపాణిలాఘవ మేర్పడ వారినెల్లఁ గొట్టు వాఁడై కర్ణునిఁ బండ్రెండింటను, వృషసేనుని మూఁడింటను గొట్టి, మఱల శల్యుని శరచాపములు దెగునట్లుగా ముష్టిప్రదేశమును నొప్పించి,భూరి శ్రవుని మూఁడిట నొప్పించి, శలునిఁ బదిటఁ బ్రహరించి, ద్రౌణి నెనిమి దిట నొవ్వనేసి, కృపు నిరువదైదింటను, సైంధవుని నూఱింటను నొప్పిం చుటయెగాక, మఱియు నశ్వత్థామను డెబ్బదిబాణములచే నోనాట నేసెను. అపుడు భూరిశ్రవుఁడు కుపితుఁడై యవ్వాసుదేవు మునికోల నఱికి, మఱియు నర్జును డెబ్బదిమూఁడుబాణములచేఁ గొట్టెను. పిదపఁ దీవ్రములగు నూఱుబాణములచేఁ బెనుగాలి మబ్బులనువలె వడిగా నర్జునుఁడు వానిని నివారించెను.”అని తెలుప విని ధృతరాష్ట్రుఁ డిట్లనియె.

## ధ్వజవర్ణనము

“ఓసంజయా! బహువిధాకారములై శోభావహములగు మా వారియుఁ బాండవులయు ధ్వజములవిధమును దెల్పుము.”

అది విని సంజయుఁడు “ఓరాజా! మహాత్ములగు నక్కురుపాండ వులధ్వజముల రూపమువిధమును వర్ణమును నామములను దెలిపెదను వినుము. ఆరథికవరులరథములందున్న వివిధధ్వజములు ప్రజ్వలితాగ్నులు వలెఁ గానవచ్చెను. సువర్ణమయములై సువర్ణభూషణాలంకృతములై, మేరువు సువర్ణశృంగములువలె నయ్యవి చూపట్టెను. అయ్యవి నానా వర్ణములై పతాకలచే నావృతములై యెల్లెడల నావరించియుండెను. ఆధ్వజములందలి పతాకలు గాలిచేఁ గదలుచు, రంగమధ్యమున నాట్య మాడు వేశ్యలువలెఁ గానవచ్చెను. ఇంద్రాయుధతుల్యములై పతాకలు గదలుచు, రథికులమహారథములను విరాజిల్లఁజేయుచుండెను. సింహ లాంగూలమును, భయంకరముఖమునునగు వానరధ్వజ మాసంగ్రామ మున ధనంజయుని శోభిల్లఁజేయుచుండెను. ఓరాజా! అట్టి వానరముతోఁ గూడి పతాకాలంకృతమైన యాగాండీవధరునిధ్వజము మనసైన్యము లకు వెఱపుగొలుపసాగెను. అటులే సింహలాంగూలచిహ్నితమై సూర్య

సన్నిభమగు నశ్వత్థామ ధ్వజాగ్రమును గాంచితిమి. సువర్ణమయమై యింద్రధ్వజమునాఁదగు నాతనికేతనము గాలిచే దూగాడుచుఁ గౌరవుల కానందకరమైయుండెను. హేమమయమై హస్తికక్ష్యగలిగి కాంచన పతాక వెలయఁ బుష్పమాలాలంకృత మై కర్ణునిధ్వజ మాకసమును బూరించునదై యుద్ధరంగమునఁ జూపట్టెను. పాండవాచార్యుఁడును దపస్వియు బ్రాహ్మణోత్తముఁడునగు కృపునిధ్వజము రథమధ్యమున, వాయుసమీరితమై గంతులువైచునదివలె వెలయుచు, గోవృషచిహ్నితమై చూపట్టెను. కాంచనమణిరత్నమయమై వృషసేనునిధ్వజము మయూరచిహ్నితమై యుండెను. మఱియు నది మాటలాడునదివలె సైన్యాగ్రమును వెలయించుచు, మయూరవాహనుఁడగు కుమారస్వామిని దలపించుచు విరాజిల్లెను. మద్రరాజగుశల్యుని ధ్వజాగ్రమున సువర్ణమయమగుసీతాప్రతిమ యలరుచుండెను. అది యాతనిరథము నాశ్రయించి సర్వబీజనిరూఢయగు సీతవలె వెలయుచుండెను. రాజతవరాహచిహ్నితమై సైంధవునిధ్వజ మెంతయు నలరుచుండెను ఆరాజత కేతువుచే నతఁడు మున్ను దేవాసురయుద్ధమున సూర్యుఁడువలె విరాజిల్లుచుండెను. యజ్ఞశీలుఁడగుభూరిశ్రవుని యూపధ్వజము సూర్యునివలెవెలయుచుండెను. అందు సోముఁడుండెను. ఆయూపము మఖోత్తమమగు రాజసూయమునందలి యున్నతమగు యూపమువలె నలరుచుండెను. ఓరాజా! శలునకు రాజతమగుగజము చిహ్నముగాఁ గాంచనమయూరములచేఁ జిత్రింపఁబడిన కేతువుగల్గి సైన్యమును శోభిల్లఁజేసెను. ఇంద్రునిసైన్యమునకుఁగల శ్వేతమహానాగమువలె మణిమయమగుసర్పము సుయోధనునిధ్వజమునకు చిహ్నమైయుండెను. ఓరాజా! నీతనయునిధ్వజమున వందలకొలంది మువ్వలచప్పు డెంతయుఁ జిత్రమైయుండెను. నిసైన్యమున నీతొమ్మిదియే యుత్తమధ్వజములు అవియే యుగాంతసూర్యతుల్యములై సైన్యమునెల్ల వెలయింపఁజేయుచుండెను. పదియవది మహాకపిగలయర్జునునిధ్వజము. దానిచే నతఁడు వహ్నిచే హిమవన్నగమువలె వెలయుచుండెను. పిదపఁ జిత్రములును, శుభ్రములును, మహాత్రరములునగు కార్ముకములను బూని మనవారిమహారథు లర్జునునిపై వెడలిరి. అటులే పార్థుఁడును వైరివినాశకరమగు ధనుపు బూనియుండెను. ఓరాజా! ఇదియెల్ల నీదుర్మంత్రఫు ల్గాయున్నది.

నీవొనర్చినతప్పుచే నిప్పుడమిఁగలరాజులకెల్ల ముప్పువాటిల్లెను. నానా దిశలనుండి పిలువఁబడి గజాశ్వములతో నశించుచున్నవారు. ఓధృతరాష్ట్రా! అటులు గర్జించుచుఁ రోద్ధసాదులగు వీరులకును, పాండవోత్తముఁడగు నర్జునునకును నపుడు గొప్పవిరోధము జరిగెను. అచ్చోఁ గృష్ణసారథియగు విజయుచ్చుఁ డెంతయు నద్భుతముగా వారెల్లరతోఁ దానొకఁడే పోరాడెను. మఱియు నతఁడు నిర్భయుఁడై గాండివముద్రిప్పుచు జిగీషగల్గి జయద్రథునిఁ జంపువాఁడై, వేలకొలఁది శరపరంపరలఁ గురియుచు, నీవారియోధులనెల్లఁ గానరాకుండఁజేసెను. పిమ్మట నమ్మహారథులెల్లరును గూడి యప్పార్థునిసాయకసమూహముచేఁ గప్పి గానరాకుండఁ జేసిరి.అటు లాపురుషసింహులచే నయ్యర్జునుఁ డావృతుఁడై యుండ నపు డాసైన్యమున గొప్పనాద ముద్భవించెను." అని తెలుప విని సంజయునితో ధృతరాష్ట్రుఁ డిట్లనియెను.

### ధర్మజుఁడు ద్రోణునకోడి పాఱిపోవుట

"ఓసంజయా! ఆధనంజయుఁడు సైంధవుని సమీపింపఁగా, నక్కడ నక్కౌరవులతోఁ గూడియున్న భారద్వాజునకును బాంచాలురకును నేమిజరిగెను?"

అది విని సంజయుఁ డోరాజా! అపు డపరాహ్ణమగుడు ఘోర సంగ్రామ మారంభమయ్యెను. కురుపాంచాలురకు ద్రోణుఁడుద్యూతము జరిగించెను. వాని కతఁడే ద్యూతహేతువగు పణమయ్యెను. పాంచాలురుత్సాహమడర ద్రోణునిఁ జంపువారై గర్జించుచు, శరవర్షము నాతనిపైఁ గురిసిరి. అపు డద్భుతమగు సంకులసమరమయ్యెను. పాండవులతోఁగూడ నప్పాంచాలు రెల్లరు నా ద్రోణునిసమీపించి యాతనిసైన్యమును భేదించుచు, మహాస్త్రప్రదర్శన మొనర్చిరి. అపుడప్పాండవయోధులు ద్రోణునిరథముఁజేరి పోరాడుచుండఁ, గైకయరథికుఁడగు బృహత్క్షత్త్రుఁడు నగుచుఁ, బిడుగులువోని తీవ్రబాణములను వేలకొలఁది విడుచుచుండ, నాతని క్షేమధూర్తి మార్కొనియెను. పిదప నటులే శరపరంపరలఁగురియుచు, బలవత్తరుఁడైన చేదిరాజగు ధృష్టకేతువు మహేంద్రుఁడు శంబరునిపైవలె నెడలఁ దనపైకివచ్చు నాతనిఁగాంచి వీరధన్వుఁ డాతని మార్కొనియె. జిగీషువై వెడలినమహారాజగు యుధిష్ఠిరుని

ద్రోణుఁడు నివారించెను. యుద్ధకుశలుఁడై పరాక్రమించు విక్రమశాలి యగు నకులుని, నీతనయుఁడగు వికర్ణుఁడు మార్కొనియెను. అటులే వెడలిన సహదేవుని దుర్ముఖుఁడు తలపడి యనేకశరసహస్రములను గురి పించెను. సాత్యకిని వ్యాఘ్రదత్తుఁ డెదుర్కొనియెను. పురుషసింహు లగు ద్రౌపదేయులను భూరిశ్రవుఁడు మార్కొనియెను. అపుడు కుపి తుఁడై యున్న భీముని భీమరూపుఁడై మహారథుఁడగు నలంబుసుఁడు తల పడియెను. ఓరాజా! ఆరాజరాక్షసులకు మున్ను రామ రావణులకువలె ఘోరమగుయుద్ధము జరిగెను. అంత నయుధిష్ఠిరుఁడు, గట్టిగాఁ దివిచి వైచిన తొంబదిబాణములచే నెల్లమర్మములు నాట నొప్పింప ద్రోణుఁ డాతని నిరువదిబాణములచే వక్షమునఁ గొట్టెను. ఓరాజా! ధర్మజు ప్రహారములకుఁ గుపితుఁడై యతఁడు మఱియు నిరువదిబాణములచే సూతధ్వజాశ్వములను గొట్టెను. అటు లెల్లధనుర్ధరులు చూచుచుం డఁగా నాద్రోణుఁ డావిధముగా విడిచినబాణముల నాధర్మజుఁడు తన హస్తలాఘవమును జూపుచు నివారించెను. పిదప ద్రోణుఁడు కోపమడర నాయుధిష్ఠిరునిధనువు దునుమాడి, మఱియు వడిగా ననేకశరసాహస్ర ములచే నాతనిమేనెల్ల నింపి, యదృశ్యునిఁగా జేయఁజూచి సర్వభూత ములు నతఁడు హతుఁడయ్యెననియే తలంచెను. మఱికొందఱు పరాఙ్ము ఖుఁడయ్యెనని యూహించిరి. ఓరాజా! అటు లాధర్మజుఁడు పరమదుర వస్థనొంది, తునిఁగినయాధనువు విడిచి వేగముగల వేఱొకవిల్లుపూని యాద్రోణప్రయుక్తములగుసాయకములను ఖండించెను. అది మా కెంతయు నద్భుతమయ్యెను. ఓరాజా! అటు లాయుధిష్ఠిరుఁ డాద్రోణ బాణములఁ దునిమి, కోపారుణితాక్షుఁడై, పర్వతములను సైతముఁ జీల్పఁదగినట్టియు, సువర్ణదండముగల్గి మహాఘోరమై యెనిమిదిగంటలు గల్గి, భయప్రదమగు నొకశక్తి నాద్రోణునిపై వైవ నెత్తి సింహనాద మొనర్చి, దానిచే సకలభూతములకును వెఱపుగల్గించెను. ఆరణరంగము నటులు ధర్మరాజుచే నెత్తఁబడినయాశక్తిని గాంచి సర్వభూతములును ద్రోణునకు స్వస్తియగుఁగాక యని పలికెను. అపు డది యాధర్మజభుజ విముక్తమై పొరవిడిచిన పాముఁవోలె వెడలి, యాకసమును దెసలనుఁ బ్రజ్వలింపఁజేయుచు, నాద్రోణునిఁజేరి నోరు తెఱచినపాముఁవోలె నుండ, దాని నాతఁడు గాంచి, వడిగా బ్రహ్మాస్త్రమును బ్రాదుర్భవింపఁజేసెను.

అది యాధర్మజునిశక్తిని బూడిదచేసి, యాతనిరథముపైకి వడిగా వెడల నపు డాతఁడు తనబ్రహ్మాస్త్రముచే దానిని నివారించెను. అంత నాయుధిష్ఠిరుఁడు మఱియు నాద్రోణు నైదుబాణములచే నొప్పించి, యొకక్షుర ప్రముచే ధనువు ఖండింప, ద్రోణుఁడు వేఱొకవిల్లుపూనక యొకగద నాధర్మజునిపై విసరెను. అపుడు తనపైకివచ్చు నాగదను జూచి యాధర్మజుఁడు తాను నొకగదను బూని, దాని నాతనిపై విసరెను. ఆరెండు గదలును పరస్పరముఁజేరి సంఘర్షముచే నగ్నిజనింపఁ బుడమిని బడియెను. పిదప ద్రోణుఁ డెంతయుఁ గుపితుఁడై నాల్గుతీవ్రనారాచములచే యుధిష్ఠిరునశ్వములఁ గొట్టి, యొకభల్లముచే నింద్రధ్వజతుల్యమగు నాతని ధనువు దునుమాడి, మఱియు ధ్వజము నొకబాణముచేఁ ద్రుంచి, మూఁడుబాణములచే నొప్పించెను. భగ్నాశ్వమైనరథమునుండి యెగిరి యాధర్మజుఁడు విగతాయుధుఁడై చేతులు మీఁదికెత్తి నిలువఁబడి యుండెను. విరథుఁడై విశేషించి విగతాయుధుఁడైన యాధర్మజు నారసి, యాభారద్వాజుఁ డాతనిసైన్యములుమూర్ఛిల్లశరపరంపరలఁగురియుచు, భయంకరమగుసింహము లేడినివలె నాతనిఁ దఱిమెను. అమిత్రఘాతి యగు నాద్రోణుఁ డటు లాధర్మజునిఁ దఱుమఁ జూచినపాండవులందు హాహాకారములు జనించెను. ఓరాజా! 'రాజు పట్టువడియె. రాజు పట్టువడియె.' అనియెడిమహాశబ్దము పాండవసైన్యమున జనించెను. పిదప నయ్యుధిష్ఠిరుఁడు వడిగా సహదేవునిరథ మధిరోహించి వడిగలగుఱ్ఱములచే వెడలిపోయెను." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## సాత్యకి వ్యాఘ్రదత్తునితోఁ బోరుట

"ఓరాజా! దృఢవిక్రముఁడై వెడలినకేకయుఁడగు బృహత్క్షత్త్రుని క్షేమధూర్తి తలపడి వక్షమున నాతనిఁ దీవ్రసాయకముల నొప్పింప, బృహత్క్షత్త్రుఁడును, ద్రోణసైన్యమును భేదించువాఁడై యాక్షేమధూర్తిని వడిగాఁ గొట్టెను. అంత నాక్షేమధూర్తి కుపితుఁడై మహాత్ముఁడగు కేకయునిధను వొకభల్లముచే ఖండించి, మఱియు నొకబాణముచే వడిగాఁ గొట్టి నొప్పించెను. అంత బృహత్క్షత్త్రుఁడును వేఱొకవిల్లుపూని నగుచు మహారథుండగు నాక్షేమధూర్తిని, రథాశ్వసూతరహితునిఁగా నొనర్చి, మఱియు నొకపచ్చనితీవ్రభల్లముచే వాని

మేనినుండి ప్రజ్వలితకుండలమగుతలను దెగనేసెను. అటులుదెగిన వాని తల జుట్టువ్రేలాడఁ, గిరీటముతోఁ బుడమిఁబడి యాకసమునుండి రాలిన నక్షత్రమువలె నెంతయుఁ బ్రకాశించెను. అంత నామహారథుఁడగు బృహత్క్షత్త్రుఁడు వాని నటులు చంపి, పార్థులనిమిత్తముగా నీవారి సైన్యముపైఁ బడియెను. ద్రోణునినిమిత్తముగా విక్రమించివచ్చు నా ధృష్టకేతునిఁ దలపడి వీరధన్వుఁడు పరాక్రమించెను. వారిరువురు నటులు పరస్పరముఁ గలిసి శరసహస్రములచే నొప్పించికొనిరి. వారిరువురిపోరాటము, మహారణ్యమున మదించినయూథపతులగు వారణములపోరాటమువలెఁ గానవచ్చెను. కుపితములై కొండగుహాలలోఁ బోరాడు బెబ్బులులునా వారిరువురును బరస్పరజిఘాంసచే యుద్ధమొనర్చిరి. ఓ రాజా! వారియుద్ధ మెంతయు సంకులమై సిద్ధచారణసంఘములకు నద్భుతావహమై చూడ నొప్పారియుండెను. పిదప వీరధన్వుఁడు కుపితుఁడై ధృష్టకేతునివిల్లు రెండుఖండములుగావించి పరిహాసమొనర్చెను. మహారథుఁడగు చేదిరాజు తనతునిసినధనువు విడిచి, హేమదండమును నయోమయమునై మహాత్తరమగు నొకశక్తిని గ్రహించి, దానిని రెండు బాహువులతోఁ ద్రిప్పి వడిగా నావీరధన్వుని రథముపై విడిచెను. వీరఘాతినియగు నాశక్తిచే వాఁ డెంతయు హతుఁడై గుండియలు వ్రీలి రథమునుండి నేలఁగూలెను. త్రిగర్తవీరుఁడగు సామహారథుఁ డటులు హతుఁడగుడుఁ బాండవేయులచే నీబలమెల్ల భగ్నమయ్యెను. పిదప నీకొడుకు దుర్ముఖుఁడు సహదేవు నఱువదిబాణములచే నొప్పించి, యప్పాండవుని వెఱపించుచు, గొప్పసింహనాద మొనర్చెను. అంత నా సహదేవుఁడు కుపితుఁడై తీవ్రనారాచముల నొప్పింప, నాయన్నదమ్ములిరువురును నవ్వుకొనుచుఁ బరస్పరము ప్రహారించుకొనిరి. అపు డా సహదేవుఁడు దుర్ముఖునిఁ గాంచి తొమ్మిదిబాణములచే నొప్పించి, యొక భల్లముచే వానిధ్వజము దెగనేసి, నాల్గుబాణములచే గుఱ్ఱములను గూల్చి, పచ్చనై తీవ్రమగు వేఱొకభల్లముచేఁ గుండలోల్లసితమగు సారథితలను ఖండించివైచెను. అటు లొనర్చి, మఱియు నతఁ డొకక్షురప్రముచే దుర్ముఖునిధనువు దునుమాడి యైదుబాణములచే నొప్పింప, వాఁడు హతాశ్వమగురథమును విడిచి వికలచిత్తుఁడై నిరమిత్రునిరథ మధిరోహించెను. అంత సహదేవుఁడు కుపితుఁడై యానిరమిత్రు నా

సేనామధ్యమున నొకభల్లముచేఁ బ్రహరింప, వాఁడు రథమధ్యమునుండి నేలఁగూలెను. అందులకు నీసైన్య మెంతయు వ్యథనొందెను. అటు లానిరమిత్రునిఁ జంపి, సహదేవుఁడు మున్ను మహాబలుఁడగు ఖరునిఁ జంపినరాముఁడువలె మిక్కిలి విరాజిల్లెను. ఓరాజా! అపుడు త్రిగర్త లలో నెంతయు హాహాకారములు జనించెను. ఓరాజా! పృథులోచనుఁ డగు వికర్ణుని, నకులుఁ డట్లు తలపడి రెండుగడియలలో నోడింప, నది మిక్కిలి యక్కజము గొలిపెను. పిదప సాత్యకిని వ్యాఘ్రదత్తుఁడు వాఁడికోలలచేఁ గప్పి, యాతని సూతాశ్వధ్వజముల నదృశ్యము గావింపఁ గృతహస్తుఁడగుసాత్యకి వానినెల్ల నివారించి, తనబాణములచే వానిసూతాశ్వధ్వజములఁ గూలఁద్రోసెను. మాగధపుత్రుఁడగువ్యాఘ్ర దత్తుఁ డటులు మడియుడు, మాగధులెల్ల నాసాత్యకినిదలపడి వేలకొలఁది శరతోమరాదులను బ్రయోగించుచు, నటులే భిండివాలప్రాసముసలా దులచే రణగర్వితుఁడై యున్న యాతని నొప్పింపసాగిరి. అపుడు బల శాలియగు నాసాత్యకి, వారినెల్ల సులభముగా జయించి, నగుచు వడిగాఁ బరువిడు హతశేషులను నొప్పింప, నాతనిశరములపీడ నోర్వక నీబల మెల్ల భగ్నమయ్యెను. ఓరాజా! అటులు నీవారిసైన్యమునెల్ల నశింపఁ జేసి, ధనువుద్రిప్పుచు, నతఁ డెంతయు వెలయ జడిసి వానిపై కెవ్వరును యుద్ధమునకుఁ బోకుండిరి. అందుల కాచార్యుఁ డెంతయుఁ గుపితుఁడై వడిగాఁ గనులు విప్పి యాసాత్యకిపైఁ దానే వెడలెను." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## అలంబుసుఁడు భీమునిచేఁ బరాజితుఁడగుట

"ఓయాంబికేయా! మహాయశుఁడగుశలుఁ డామహేష్వాసులగు ద్రౌపదేయులఁ దలపడి యొక్కొకని నైదేసిబాణములచే నొప్పించి, మఱియు నేడుబాణములచే నొప్పించెను. రౌద్రుఁడగు నాతనిచే వా రటు లెంతయుఁ బీడితులై, మోహపరవశులై యుద్ధకృత్యమును మఱ చిరి. అపుడు నకులపుత్రుఁడగుశతానీకుఁ డాతని రెండుబాణములచే నొప్పించి, సింహనాద మొనరించెను. అటులే తక్కినవారును, యుద్ధసన్న ద్ధులై యాశలుని మూఁడేసిబాణములచే నొప్పింప, నాతఁడు మఱల వారి నైదుబాణములచేఁ బ్రహరించెను. అంత నాయేవురు నాతని నైదు

బాణములచే నొచ్చి, యాతనిఁ జుట్టి బాణములచేఁ గొట్టిరి. అం దర్జున పుత్త్రుఁ డాతనిగుఱ్ఱములను, నాల్గుబాణములచేఁ గొట్టి, మృత్యుమందిర మున కంపించెను. అటులే భీమపుత్త్రుఁ డాశలునిధనువు ద్రుంచి సింహ నాద మొనర్ప, యుధిష్ఠిరాత్మజుఁ డాతనిధ్వజముఁ గొట్టి పుడమిఁ బడఁ ద్రోసెను. పిదప నకులపుత్త్రుఁడగు శతానీకుఁడు వానిసూతునిఁ బ్రాణా పేతునిఁ జేసి రథనీడమునుండి నేలఁ గూలఁద్రోసెను. పిదప సహదేవ పుత్త్రుఁడు తనసోదరులచేఁ బరాఙ్ముఖుఁడుగా నొనర్పఁబడియున్న యా శలునితల నొకక్షురప్రముచే నఱికెను. సువర్ణభూషణభూషితమైన వానితల యటులు దెగి నేలఁగూలి బాలసూర్యసమప్రభచే నారణరంగ మును వెలయించెను. మహాత్ముఁడగు నాసోమదత్తతనయుఁడగు శలుఁడు తెగిపడ, మనవారెల్లరును జడిసి పలువిధములుగా వెడలి పోసాగిరి. పిమ్మట నమ్మహాబలుఁడగు భీముని లక్ష్మణు నింద్రజిత్తువలె నలంబుసుఁడు మార్కొనియెను. ఆమానవరాక్షసులు పోరాడుటనుజూచి, సకలభూత ములును విస్మయహర్షముల నొందెను. ఓరాజా! అపుడు కుపితుఁడై యున్న యారాక్షసేంద్రు, నాభీముఁడు నగుచుఁ దొమ్మిదిబాణములచే నొప్పింప, వాఁడు భయానకముగా నఱచి, పదానుగులతోఁ గూడి, భీము నైదుబాణములచే నొప్పించి, పాండవయోధులను బెక్కుర నొప్పించెను. భీముఁ డాయలంబుసుని గొప్పవ్రేటున కోరువలేక రథ మధ్యమునఁబడి మూర్ఛమునిఁగి, కొంతవడికిఁ దెప్పిఱి, కుపితుఁడై భార సాధనమై యుత్తమమై ఘోరమగు నొకధనువు పూని లాగి తీవ్రనారా చములచే నాయలంబుసునిఁ బ్రహరించెను. కాటుకకొండనాఁదగు నాయలంబుసుఁ డెంతయు నొచ్చి, మేనుచ్చి పూఁచినమోదుగునాఁ జూపట్టెను. పిమ్మట, వాఁడటులు భీమునిబాణములచేఁ గొట్టంబడి, మున్నాభీముఁడు తనయన్నను వధించుటను స్మరించుచు, ఘోరాకారుఁ డై యాతనితో ‘ఓరీ కౌంతేయా! నిలువుము. ఇఁక నాపరాక్రమమును జూడుము. ఓదుర్మతీ! బలశాలియై రాక్షసోత్తముఁడగు మాయన్నబకుని నేనులేనపుడు చంపితివిగాదా?’ అనిపలికి యపుడే వాఁ డంతర్ధానమొంది శరవర్షము నాభీమునిపైఁగురియ, నటు లదృశ్యుఁడగు నారక్కసుఁ డుక్కుచెడునట్లుగాఁ దీవ్రబాణములచే భీముఁ డాకసమునుబూరించెను. అంత నారక్కసుఁ డాభీమునిచేఁ బ్రహతుఁడై యొకతెప్పపాటులో

రథము నధిరోహించి క్షుద్రుండై యాకసమున కెగిరి పలువిధములగు రూపములను ధరించుచు, నణువై యపుడే మహత్తరుండై స్థూలరూపియై మేఘమువలె గర్జించుచుం, బెక్కువిధములుగాం బలుకుచుండ నాకసమునుండి వేలకొలందిశరధారలు పడంజొచ్చెను. అటులే కుంత, శక్తి, ప్రాస, కుణప, శూల, పట్టిస, తోమర, పరిఘ, శతఘ్ని, భిందివాల, పరశ్వథములును, పాషాణములు, ఖడ్గములు, వజ్రములును దారుణమై వర్షముగాం గురిసెను. దానిచే నప్పాండవసైనికులును, నేన్గులును, గుఱ్ఱములును, బదాతులును గూలంజొచ్చిరి. మఱియు వానిసాయకములచే రథములనుండి రథికులు పుడమిం బడసాగిరి. ఓరాజా! రక్తమనెడిజలమును, రథములనెడిసుడులును, నేన్గులనెడి మొసళులును, ఛత్రములనెడి హంసలును, మేదఃకర్దమమునుగల్గి రక్షోగణసమాకులమగునట్లుగానొక నది నపుడు వాండు జనింపంజేసెను. ఆనదిలోం జేదిపాంచాల సృంజయులు కొట్టుకపోవుచుండిరి. అటులు నిర్భయుండై యారణరంగమునం జరించు నాయలంబుసునివిక్రమము నప్పాండవు లెంతయు వెఱపుగదురం జూడసాగిరి. అపుడు నీవారిసైన్యమున సంతోషముప్పతిల్లెను. గగురుపాటొదవించు వాదిత్రనినాదమును జనించెను. ఘోరమగు నయ్యార్రావమును విని యాభీముండు చేతిచప్పుడులను సహింపనిసర్పమువలె దాని నోరువక, క్రోధారుణితాక్షుండై ప్రజ్వలించుపావకుండునాం జూపట్టుచుం ద్వష్టయస్త్రమును సంధించి, వాని వలన శరసహస్రములను జనింపంజేయ, వానిచే మనవారిసైన్యములు చెదరెను. ఆరణమున భీమునిచేం బ్రయుక్తమగునాయస్త్రముచే రాక్షసమాయ లడంగుటయేగాక, యాంరాక్షసుండును నొచ్చి, యాభీమునివిడిచి ద్రోణసైన్యమును జేరంబోయెను. ఓరాజా! ఆరాక్షసుం డామహాత్మునిచే జయింపంబడుడుం, బాండవు లెల్లదెసలు నిండ సింహనాదములొనర్చిరి. మఱియు వారెల్లరును సంతుష్టాంతరంగులై మహాబలుండగు భీముని మున్నాప్రహ్లాదుని జయించినయింద్రుని దేవతలువోలె సన్నుతించిరి." అని తెలిపి సంజయుండు మఱియు నిట్లనియె.

### ఘటోత్కచుం డలంబుసునిం జంపుట

"ఓరాజా! పిదప నారణరంగమునం జరించు నాయలంబుసుని ఘటోత్కచుండు నిర్భయుండై చేరి తీవ్రనారాచములచేం బ్రహరించ,

నారాక్షసప్రవరుల కపుడు భయంకరమగుయుద్ధము జరిగెను. వారిద్దరును శక్రశంబరులువలెఁ బలువిధములగుమాయ లొనర్చుకొనుచుండ, నపు డాయలంబుసుఁ డెంతయుఁ గ్రుద్ధుఁడై ఘటోత్కచునిఁ గొట్టెను. ఓరాజా! ఆరాక్షసోత్తముల ఘోరసంగ్రామ మారామరావణులయుద్ధమును దలపించెను. అంత నాఘటోత్కచుఁ డాయలంబుసు నిరువదిబాణములచే వక్షమునఁ గొట్టి, మఱిమఱియు సింహనాద మొనరింప, నటులే వాఁడును రణగర్వితుఁడగు నాఘటోత్కచు నొప్పించి,దశదిశలునిండ సింహనాద మొనరించెను. మహాబలులగు నారక్కసు లిద్దరు నటు లెంతయును గుపితులై యొకరినొకరు తక్కువగాక పరస్పరము మాయలొనర్చుకొనుచుఁ బోరాడిరి. వారు మాయాయుద్ధకోవిదులగుటఁ బరస్పరమును మాయలచే మోహపెట్టుకొనుచు, మాయాశతములను గల్పించుచు, మాయాయుద్ధ మొనరింపసాగిరి. ఓరాజా! అపుడు ఘటోత్కచుఁ డేయేమాయను జూపుచువచ్చెనో యలంబుసుఁడు నాయామాయనే చూపుచు, దానికిఁ బ్రతీకార మొనర్చుచువచ్చెను. ఓరాజా! అంత నాయలంబుసునిఁ గాంచి పాండవులు కుపితులై, మఱియు నాఘటోత్కచునెడ వారికి వెఱపుగదుర భీమసేనాదులు వానినిఁ జుట్టుకొని యుల్కలచేఁ గుంజరమునువలె బాణములచే వానిని నలుదెసలఁగప్పిరి. వాఁ డప్పాండవులయస్త్రవేగమును దనయస్త్రమాయచేఁ దొలఁగించి, యారథసమూహమునుండి దవాగ్నినుండి తప్పించుకొనిన వనగజమువలెఁ దప్పించుకొని, పిడుగులచప్పుడులఁ బోలునట్లుగా ఘోరమగుధనుష్టంకార మొనర్చి, భీము నిరువదైదింటను, ఘటోత్కచు నైదింటను, యుధిష్ఠిరుని మూఁడింటను, సహదేవు నేడింటను, నకులుని డెబ్బదిమూఁడిటను, ద్రౌపదేయుల నైదేసిబాణములను గొట్టి ఘోరముగా సింహనాద మొనరించెను. అపుడు వాని నాభీమసేనుఁడు తొమ్మిదిటను, సహదేవుఁ డైదిటను, యుధిష్ఠిరుఁడు నూఱిటను, నకులుఁ డిరువదినాల్గిటను, ద్రౌపదేయులు మూఁడేసిబాణములను, ఘటోత్కచుఁ డేఁబదింటను గొట్టిరి. మఱియు ఘటోత్కచుఁడు డెబ్బదింటనుగొట్టి సింహనాద మొనర్చెను. వానియానాదముచే నిమ్మేదిని యెల్లఁ గంపించెను. వనపర్వతపాదపజలాశయములును జలించెను. మహారథులగువారెల్లఁ దన్నటులు నొప్పింప నొచ్చియు, వాఁడు మఱియు

వారినెల్ల నైదేసిబాణములచేఁ గొట్టెను. అటులు కుపితుఁడైన యా యలంబుసునిఁ గాంచి ఘటోత్కచుఁడు కోపమడర నేఁడువాఁడికోలల నోనాటనేయ, వాఁడును శరవర్షమును గురిపించెను. అయ్యవి యా ఘటోత్కచునిమేన నుత్సాహముమై మహాబలముగల పన్నగములు గిరిశృంగమునువలెఁ జొరఁబాఱ నంత సప్పాండవులును, ఘటోత్కచుఁడును జడిసియు విడువక తీవ్రనారాచములచే వానిని నొప్పించిరి. వాఁడటు లప్పాండవులప్రేటులువడి, యంత్యావస్థపాల్పడి కర్తవ్యము నెఱుంగకుండెను. పిదప సమరనిపుణుఁడై మహాబలుఁడగు ఘటోత్కచుఁడు వానిదురవస్థను జూచి వానిని జంపువాఁడై వానియున్నతరథముపై కుఱికి గరుడుఁడు పన్నగమునువలె వానిని బట్టికొని మఱి మఱియుఁ గొట్టి, చట్టుపైఁ బడఁగొట్టినమట్టికుండను బోలె, వానిని నేలఁ గూలఁద్రోసెను. అటులుకొట్టి తనబలలాఘవములును విక్రమసంపదయు నేర్పడ, నాఘటోత్కచుఁడు కుపితుఁడై మనసైన్యములకు వెఱపుగొలిపెను. ఆయలంబుసుఁడును నొడలెల్లవ్రీల నెమ్ముకలు చూర్ణముగా నేలఁబడి భయంకరముగాఁ జూపట్టెను. అటు లాఘటోత్కచునిచే నానిశాచరుఁడు హతుఁడగుటకుఁ బాండవులు మోదమానమానసులై యుత్క్రోశించువారును, సింహనాదము లొనర్చువారును, వస్త్రములను గదల్చువారునై యుత్సాహమును వెలిపుచ్చిరి. మహాబలుఁడగునారాక్షసేంద్రుఁడు మడియుటను గాంచి మనవారిసైన్యములు హాహాకారము లొనర్చెను. తనంతఁదాఁబడిన యంగారకునివలెనున్న యాయలంబుసుని జనులును గుతూహలముతోఁ జూడఁదొడంగిరి. ఘటోత్కచుఁడును వాని నటులు చంపి, బలాసురునిఁ జంపిన యింద్రుఁడువలె బలవత్తరముగా సింహనాదమొనరించి, పితృబాంధవాదుల మన్ననలువడసి యుండెను. పిదప గొప్పశంఖనాదములును, బాణఘోషములును జనింప విని, మనవారును బ్రతినాదములొనర్ప నయ్యిరువాగులయారావములు భూనభోంతరముల నిండె"నని తెలుప విని ధృతరాష్ట్రుఁ డి ట్లనియె.

## యుధిష్ఠిరుఁడు సాత్యకి నర్జుననకుఁ దోడ్పడఁ బొమ్మని ప్రార్థించుట

"ఓసంజయా! ఆయుద్ధమున సాత్యకి ద్రోణు నెటులు వారించెనో? దానిని వినఁగోరుచున్నవాఁడ నెఱిఁగింపుము."

అది విని సంజయుఁడు "ఓరాజా! రోమహర్షణమగు నామహా సంగ్రామమువిధ మెఱిఁగించెదను వినుము. సాత్యకి మున్నగుపాండవులచే వధ్యమానమగుచున్న తనసైన్యమును గాంచి యాద్రోణుఁడు సత్యవిక్రముఁడగు నాసాత్యకి నెదుర్కొనియెను. అటులు వడిగాఁ దన్నెదుర్కొనిన మహారథుఁడగు భారద్వాజుని సాత్యకి యిరువదైదు క్షుద్రకములచే నొప్పించెను. అంత నాద్రోణుఁడును విక్రమించి సువర్ణపుంఖములగు తీవ్రనారాచము లైదిటిచే నాసాత్యకిని బ్రహరించెను. ఓరాజా! ఆద్రోణప్రయుక్తబాణము లాసాత్యకి దృఢకవచమును భేదించి, వానిమేనిరక్తమును ద్రావి, బుసకొట్టుసర్పములువలెఁ బుడమిఁజొచ్చెను. అంత నాదీర్ఘబాహుఁడగుసాత్యకి యంకుశపుఁబోటులచే నేన్గువలె గుపితుఁడై యగ్నితుల్యములగు నేఁబదిబాణములచే నాద్రోణుని నొప్పింప, ననేకశరసహస్రములచే నాసాత్యకిని ద్రోణుఁడు నొప్పించెను. ఓరాజా! అటు లాద్రోణబాణములచేఁ బ్రహతుఁడగు నాసాత్యకి కొంతవఱకు నేమిచేయవలసినదియుఁ దెలియక చింతాక్రాంతుఁడై, మఱియుఁ దన్నుఁ దీవ్రనారాచములచే నొప్పించు నాద్రోణునిఁ గాంచియు నూరకుండెను. ఓరాజా! అట్టి సాత్యకిని గాంచి నీపుత్రులును, సైనికులును బ్రహృష్టమానసులై, మఱిమఱియు సింహనాదము లొనర్చిరి. ఆఘోరారావమును వినియు, నటులు పీడింపఁబడుసాత్యకిని గనియు నోపక యుధిష్ఠిరుఁడు తనసైనికులతో 'ఓయీ! సత్యవిక్రముఁడును, వీరుఁడును, వృష్ణివరుఁడునగు సాత్యకి రాహువుచే భానుఁడువలె గ్రసింపఁబడుచున్నవాఁడు. ఆసాత్యకి యుద్ధముచేయుచున్నకడకు వడిగా వెడలుఁడు.' అని పలికి, మఱియుఁ బాంచాల్యుఁడగు ధృష్టద్యుమ్నునితో 'ఓవీరాగ్రేసరా! వడిగా ద్రోణు నెదుర్కొనుము. ఏలయూరకయున్నవాఁడవు? ద్రోణునివలన మనకు ఘోరమగుభయము తటస్థించుట నీవు చూచియుండలేదా? ఓయీ! ఈద్రోణుఁడు సాత్యకితో త్రాడుగట్టినపక్షితో బాలకుఁడువలె నాడుకొనుచున్నవాఁడు. భీముఁడు మున్నగుమీ రెల్లరును నచ్చటికే వెడలుఁడు. నేనును సైనికులతోఁగూడి మీవెంటనే వచ్చుచున్నవాఁడను. యమదంష్ట్రామధ్యపతితుఁడైయున్న యాసాత్యకిని విడిపింపుము.' అని పలికి తనసకలసైన్యముతో సాత్యకిరక్షణమునకుఁగా ద్రోణునిపైకి వెడలెను. అందొక్కద్రోణునితోఁ బోరాడు పెక్కురు

యోధులయారావము మెండై వినవచ్చెను. పాండవులును, సృంజయులును గలిసి మహారథుఁడగు భారద్వాజునిపైఁ దీవ్రనారాచముల వర్షించిరి. అంత నాద్రోణుఁడు వారిశరములెల్ల నవ్వుచునే తనయింటికివచ్చిన యతిథులను జలాసనములచేవలె సగౌరవముగాఁ బరిగ్రహించి, మఱియు వారిని నింటికివచ్చినయతిథులను బోలె శరములచే నాదరించెను. ఓ రాజా! మధ్యందినమార్తాండునివలె నాద్రోణుని వారెల్లరును వేఱిచూడఁజాలకుండిరి. మఱియు ద్రోణుఁడు వారినెల్ల శరవ్రాతములచేఁ దపింపఁజేయుచుఁ, గిరణములచేఁ దపింపఁజేయుభానుఁడునాఁ గానవచ్చెను. ఓమహారాజా! అటు లాద్రోణునిచేఁ బ్రహతులగుచుఁ బాండవులును, సృంజయులును రక్షకుఁడనెడివాఁడు లేక బురదలో దిగఁబడిన యేన్గులునా నుండిరి. నలుదెసలనిండిన యాద్రోణునిబాణములు భువనములఁ దపింపఁజేయు నాదిత్యకిరణములునాఁ జూపట్టెను. అపు డాద్రోణుఁడు ధృష్టద్యుమ్నసమ్మతులై మహారథులగు నిరువదైదుగురను జంపెను. పాండవసైన్యములందును, బాంచాలసైన్యములందును పేరుగలవారు ద్రోణునిచేఁ జచ్చుటఁ జూచితిమి. మఱియు నాద్రోణుఁడు కైకయుల నూర్వురఁగొట్టి పాఱఁద్రోలి, నోరుతెఱచియున్నయంతకుఁడునా నుండెను. ఓనరాధిపా! అపు డాద్రోణుఁడు పాంచాలురను, సృంజయులను, మాత్స్యులను, గైకయులను వందలకొలఁదిని వేలకొలఁదిని జయించెను. ద్రోణబాణభగ్నులగు పాంచాలాదియోధులలోమహారణ్యమున ధూమకేతువుచేఁ గప్పఁబడిన యడవిజంతువులందువలెఁ బెనుచప్పుడుదయించెను. అందు దేవగంధర్వులును, బితరులును 'ఆహా! ఇప్పాండవులును, బాంచాలురును సైనికులతోఁగూడఁ బరువులిడుచున్నవారేగాని యొకఁడును నాద్రోణు నెదుర్కొనలేదు. ప్రహరింపలేదు. సోమకులు నటులే నిహతులగుచు, నేమియుఁ జేయఁజాలకున్నవారు.' అని సంభాషించుకొనిరి. వీరవరక్షయకరమై రౌద్రమైనసంగ్రామ మారంభమగుడు, యుధిష్ఠిరున కపుడు పాంచజన్యధ్వని వినవచ్చెను. సైంధవాభిరక్షకులగువీరులు యుద్ధము చేయుచుండఁగా ధార్తరాష్ట్రులు పార్థునిరథముపైఁబడి మహానాదము లొనర్చుచుండఁగా, వాసుదేవపూరితమగు శంఖము వినవచ్చెను. గాండీవనిర్ఘోషము వినరాకుండెను. అపు డప్పాండవాగ్రజుఁడు మోహపరవశుఁడై 'అయ్యో! నిశ్చయ

ముగా నర్జునుఁడు చిక్కువడియున్నవాఁడు. పాంచజన్యధ్వని వినవచ్చు చున్నది. కౌరవులు సంతుష్టాంతరంగులై మఱిమఱియు సింహనాదము లొనర్చుచున్నవారు.' అని చింతించి వ్యాకులితచిత్తుఁడై సాత్యకితో సగద్గదముగా ని ట్లనియె.

ఓయీ! వృష్ణివరేణ్యా! సజ్జనులు మున్ను దెలిపినశాశ్వతధర్మ మొకటి కలదుగదా! యుద్ధమున మిత్రునకుఁ జేయఁదగుసాహాయ్యము మును మించినధర్మ మేమిగలదు? దాని కిపుడు కాలము సంప్రాప్తించెను. మనయోధులనందఱను జింతించియు, నీయట్టిపరమాప్తు నెవ్వనిఁ గానకుండితిని. ఓశైనేయా! ఎవఁడు నిత్యము ప్రీతచిత్తుఁడై యుండునో, ఎవ్వఁడు నిత్యము ననువ్రతుఁడై యుండునో యట్టివాఁడే యాపదయందు సహాయుఁడుగా నియోగింపఁబడవలెనుగదా! అవ్వాసుదేవుఁ డెట్లు నిత్యమును బాండవులకుఁ బరమగతియై యున్నవాఁడో, అటులే కృష్ణతుల్యపరాక్రముఁడవగు నీవును మాకుఁ బరమాప్తుఁడవు. అటులగుట నేను నీపై నొకభారము పెట్టుచున్నవాఁడను. నీవు దానిని వహింప సమర్థుఁడవు నాయభిప్రాయము నెన్నఁడును నీవు విఫలమొనర్చువాఁడవుగావుగదా! కావున నీవు నాకు భ్రాతయు, నీకు సమవయస్కుఁడును, గురుఁడునగు పార్థున కీయాపత్సమయమున సహాయమొనర్పవలసియున్నది. నీవన్ననో సత్యవ్రతుఁడవును, శూరుఁడవును, మిత్రుల కభయ మొసఁగువాఁడవును నై, లోకమున సత్యవచనుఁడవని ప్రసిద్ధినొందియున్నవాఁడవు. ఓశినిపుంగవా! ఎవఁడు మిత్రునకుఁగాఁ బోరాడి శరీరమును విడుచునో, వాఁడు పుడమినెల్ల బ్రాహ్మణుల కొసంగినవాని కీడగుచున్నాఁడు. బ్రాహ్మణులకు సకలపృథివి నొసఁగిన రాజులనేకులు స్వర్గమునొందియుండుట మనము వినియున్నదియెగదా! ఓ ధర్మాత్మా! అటులగుట నీకుఁ జేతులు మొగిడ్చి, నిన్ను యాచించుచున్న వాఁడను. నీ వీయొనర్చుసాహాయ్యము సకలభూదానఫలమును మించునదై యుండును. కృష్ణుఁ డొకఁడే యెల్లపుడును మిత్రుల కభయ మొసఁగువాఁడై యుద్ధమునఁ బ్రాణములు నర్పింపనున్నవాఁడు. ఓ సాత్యకీ! ఇపుడు నీవు రెండవవాఁడవై యున్నవాఁడవు. విక్రమశాలియు, వీరుఁడును, యుద్ధమునఁ గీర్తిగోరువాఁడును నగు శూరుఁడే సహాయుఁడు గావలయునుగాని ప్రాకృతజనునితో నిందుఁ బనియేమి

గలదు? ఇట్టి దుస్థితిలోనున్న విజయునకు నీవుదక్క వేఱొక్కఁడు రక్షకుఁడు లేఁడు. ఓయీ! నీయద్భుతకృత్యములనే పొగడుచు నర్జునుఁడు నాకెంతయు సంతసముగల్గించెడివాఁడు. మఱియు లఘుహస్తుఁడవనియుఁ, జిత్రయోధివనియు, ఘనపరాక్రముఁడవనియుఁ, బ్రాజ్ఞుఁడవై సర్వాస్త్రవేత్తవై యుద్ధముల మోహమందవనియుఁ దెల్పెడివాఁడు. మఱియు "మహాస్కంధుఁడును, మహోరస్కుఁడును, మహాబాహుఁడు, మహాహనుఁడు, మహాత్ముఁడు, మహారథుఁడునై నా కాసాత్యకిఁ శిష్యుఁడు మిత్రుఁడుఁ బ్రియుఁడునైనవాఁడు. నే నాతనికిఁ బ్రియుఁడను. ఆతఁడు సహాయుఁడుగా నే నాకౌరవులను జయింతును. నాకార్యమునెడఁ గేశవుఁడును, రాముఁడును, ప్రద్యుమ్నుఁడును, గదుఁడు, సారణుఁడు, సాంబుఁడును నెటులు సహాయులగుదురో యటులే పురుషసింహుఁడును, సత్యవిక్రముఁడునునగు సాత్యకిని సాహాయ్యమునకుఁగా వినియోగింతును. ఆతనితో సరియగువాఁడు వేఱొకఁడు లేఁడు' అని మాధనంజయుఁడు నాతో ద్వైతవనమునఁ దెలిపియున్నవాఁడు. నీ పరోక్షమున నీయుత్తమగుణములను బూజ్యులసభలలోఁ జెప్పుచు వచ్చెను. కావున నట్టియర్జునునిసంకల్పమును వ్యర్థముసేయరాదుగదా! ఓవార్ష్ణేయా! ఆవాసుదేవార్జునులకు నీవు దోడ్పడవలయును. నేను దీర్థయాత్రకువచ్చునపుడు ద్వారకలో నీకాయర్జునునెడఁగలభక్తిని జూచితిని. అట్టిమైత్రి నీకెవ్వరియందును లేదు. నీకు మాయెడఁగలభక్తికిని, స్నేహమునకును, శిష్యభావమునకును, ప్రేమమునకును, పరాక్రమమునకును, కులీనత్వమునకును, సత్యమునకును దగునట్లుగా మ మ్మనుగ్రహించి, సాహాయ్యమొనర్పఁదగియున్నవాఁడవు. ద్రోణునివలనఁ గవచమునుదొడిగి సుయోధనుఁ డందులకు వడిగా వెడలినవాఁడు. వానికంటె మున్నుగనే మహారథులగు కౌరవు లాయర్జునునకై వేచియున్నవారు. విజయమునకై గొప్పనాదము వినవచ్చుచున్నది. ఓశినిపుంగవా! నీవిపుడు వడిగావెడలి యర్జునునకుఁ దోడ్పడవలయును. నేనును భీమసేనుఁడును మాసైన్యములతో నాద్రోణుని నివారింతుము. ఓశైనేయా! మనసైన్యము లెటులు పరువులిడుచున్నవో చూడుము. ఆచప్పుడు వినుము. పర్వదినములందు, మారుతవేగముచే సముద్రమువలె -సవ్య

సాచిచే ధార్తరాష్ట్రసైన్యము చెదరుచున్నది. మఱియుఁ బరువులిడు
రథములు గుఱ్ఱములు పదాతులు మున్నగుసైన్యమునుండి వెడలిన
ధూళి యెట్లు వ్యాపించెడినో చూడుము. ప్రాసయోధులగుసింధుసౌవీరు
లచే మనయర్జునుఁడు ముట్టడింపఁబడియున్నవాఁడు. ఈబలము చుట్టు
కొనకున్నచో జయద్రథుఁడు జయింపఁదగియుండును. వీరెల్ల నా
సైంధవునకుఁగాఁ బ్రాణములేనిఁ బరిత్యజింపనున్నవారు. శరశక్తిధ్వజా
దులుగల్గి హయగజాదిసమాకులమై ధార్తరాష్ట్రసైన్య మెంతయుఁ
జొఱరానిదై, యెట్లు చూపట్టుచున్నదో చూడుము. ఆశంఖారావము
లను, నాదుందుభిధ్వానములను వినుము. అటులే సింహనాదములును,
రథనేమిధ్వనులును, బెక్కుగా వినవచ్చుచున్నవి. ఆయేన్గుల ఘీంకారము
లును, బదాతులపాదశబ్దమును, రౌతులచప్పుడును వినుము. పుడమి
వఁడకించుచున్నవి. ముందుగా సైంధవసైన్యము, వెనుక ద్రోణసైన్యము
నాతనిఁ జుట్టియున్నది. ఓపురుషసింహా! ఎట్టిబలమైనను నధికమైనపు
డాదేవేంద్రునైనఁ బీడింపదే? అపరిమితమగు నాసైన్యమునకుఁ జిక్కి
యతఁడు జీవితము విడుచునేమో? అట్టివాఁడే హతుఁడగు నేని మా
యట్టివా రిఁక జీవించుటెట్లు? నీయట్టివాఁడున్నను నేనిట్టికష్టములపాల్ప
డుటయా? శ్యామవర్ణుఁడును గుడాకేశుఁడును యువకుఁడునగు నర్జు
నుఁడు దర్శనీయరూపుఁడుగదా! అట్టివాఁడు చిత్రయోధియై భారత
సైన్యమును బ్రవేశించెను. సూర్యుఁ డుదయించుచుండఁగనే యతఁడు
వెడలెను. ఇపుడు సూర్యుఁడస్తమింపనున్నవాఁడు. ఓవార్ష్ణేయా!
అతఁడు జీవించియుండెనో? లేక యేమయ్యెనో? తెలియకున్నది. అకౌ
రవసైన్యము సాగరమువలె గొప్పదై నిరుపమానమైనదిగదా! బీభత్సుఁ
డొకఁడే యట్టిమహాసైన్యమునఁ బ్రవేశించియున్నవాఁడు. ఆసైన్యము
సురలకును నోరువరానిదని నాయభిప్రాయము. ఇపుడేవిధముగను యుద్ధ
మున నాకు బుద్ధి ప్రసరింపకున్నది. ద్రోణుఁడును నాసైన్యమునెంతయుఁ
బీడించుచున్నవాఁడు. ఈబ్రాహ్మణుఁ డెట్లు చరించుచున్నవాఁడో నీవును
బ్రత్యక్షముగాఁ జూచుచున్నదియెగదా! ఓవివేకనిధీ! ఈరెండుకార్య
ములు నొకప్పుడే తటస్థించెనుగదా! ఇందు మహార్థమగున దెద్దియో
దాని నీవాచరింపవలసియున్నది. ఎన్నిఘనకార్యములున్నను, నిదియె

వానిలో మహత్తరమని నాయభిప్రాయము. కావున నీయుద్ధమున నర్జునపరిత్రాణమే కర్తవ్యము. జగత్పతియు రక్షకుఁడునగు వాసుదేవునకై నేను భయపడను. మూఁడులోకము లేకమైనను వాని నా కేశవుఁడు జయింపఁగలసమర్థుఁడు. నేను నిజము తెలుపుచున్నవాఁడను. ఆ మహానీయున కీధార్తరాష్ట్రసైన్య మేపాటిది? అర్జునుఁడన్ననో యనేకులచే యుద్ధమునఁ బీడితుఁడై ప్రాణములను విడుచునేమో? అని నేను సందియమందుచున్నవాఁడను. నీ వాతనిమార్గమునుబట్టిపొమ్ము. నీవంటివారు వెడలవలయును. నాయట్టివాఁడు వేఁడికొన నట్టివాని కిట్టియాపత్కాలమునఁ దోడుపడువారిలో నీవును, నాప్రద్యుమ్నుఁడునుదప్ప వేఱెవ్వరుగలరు? నీవస్త్రముల నారాయణునకును, బలమున బలరామునకును, వీరత్వమున నర్జునునకును సీడైనవాఁడవు. భీష్మద్రోణుల నతిక్రమించి సర్వయుద్ధవిశారదుఁడవైన నిన్నే పురుషసింహునిఁగా లోకమున సజ్జనులు నుడువుచున్నవారు. సాత్యకికి లోకమున నశక్యమేదియు లేదని ప్రసిద్ధిగదా! ఓమహాబలా! ఆకారణముననే నా తెలుపుప్రార్థన మంగీకరించి యొనర్పుము. నాయొక్కయు నర్జునుయొక్కయు సంభావనను వేఱువిధముగాఁ జేయరాదు. వీరుఁడవై రణరంగమునఁ బ్రాణములయెడ నాశవిడిచి చరింపుము. ఓశైనేయా! దాశార్హుఁడు రణరంగమున జీవితమును రక్షించుకొనఁడుగదా! యుద్ధమొనర్పమియు, నిలువరించి యుండమియుఁ, బలాయనమొనర్చుటయు, నసజ్జనులగు భీరులమార్గముగాని, దాశార్హులకది త్రోవగాదు. ఓశినిపుంగవా! ధర్మాత్ముఁడగునర్జునుఁడు నీకు గురువుగదా! నీకును నప్పార్థునకు నావాసుదేవుఁడు గురువు. ఈరెండుకారణముల నెఱిఁగియే నీతో నిట్లు తెలిపితిని. నా పలుకుఁ ద్రోసివేయకుము. నీగురుఁడగునర్జునకును నేను గురుఁడను. ఈనాయభిప్రాయము వాసుదేవార్జునులకు సైతము సమ్మతమైనదియే. నేను సత్యము తెలుపుచున్నవాఁడను. నీవు ధనంజయుఁడున్నకడకుఁ బొమ్ము. ఓసత్యపరాక్రమా! నా యీవచన మంగీకరించి ధార్తరాష్ట్రబలముఁజొచ్చి మహారథులఁ గలిసి రణరంగమున నీకుఁ దగుకృత్యము నాచరింపుము.' అని పలికె" నని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## సాత్యకిధర్మజులసంభాషణము

"ఓభరతశ్రేష్ఠా! ప్రీతిమై మనోజ్ఞముగా మధురాక్షరములతో, గాలవిరుద్ధముగాకుండ న్యాయ్యముగాఁ బలికినయాధర్మజునివచనము లాలించి యాసాత్యకి, మఱియు నాతనితో 'ఓరాజా! అర్జునునకుఁగా గీర్తిప్రదమును, న్యాయ్యమునైన నీవచనము లాలకించితిని. ఇట్టికాలమున మాయట్టివారికి సమ్మతమగువచనము నాలోచించి, పార్థునకువలె నాకును నీ వానతివెట్టఁదగినవాఁడవగుదువు. ఆధనంజయునకుఁగా నేను బ్రాణములనైన దాఁచుకొనను. అందును నీవు నియోగింప నేఁజేయని దెయ్యది? నీవానతిచ్చితే నాహవమున, దేవాసురమానవులతోఁగూడిన లోకత్రయమును జయింపఁ బోరాడుదునుగదా! ఓనరేంద్రా! దుర్బలమగు నీకౌరవబలముమాట చెప్పనేటికి? ఓరాజా! ఇపుడే యాసుయోధనునిసైన్యముతోఁ బోరాడి జయింతును. నామాట సత్యమని నమ్ముము. యుద్ధకుశలుఁడగు ధనంజయునిఁజేరి రణకుశలుఁడనై జయద్రథునిఁజంపి యిదె నీకడకు వచ్చుచున్నవాఁడను. ఓనరాధిపా! అట్లైనను నేను దప్పక మనవిచేయవలసినది గలదు. అదియెల్ల వినుము. ఆయర్జునుఁడు వాసుదేవుఁడును, సైంధవునిఁ జంపుటకు వారేగునపుడు కొన్నిమాటలు చెప్పిరి. అందు సర్వసైన్యములును వినుచుండఁగా వాసుదేవునకుఁ దెలియునట్లుగా నర్జునుఁడు నాతో దృఢముగా నిట్లు చెప్పెను.

'ఓసాత్యకీ! నేనుసైంధవుని వధింపఁబోవుచున్నవాఁడను. వానిని నేను జంపివచ్చుదనుక నీవు యుద్ధోత్సాహమును విడువక జాగరూకుఁడవై యుధిష్ఠిరునిఁ గాపాడవలయుఁజుమీ! ఓమహాబాహూ! నీయందును బ్రద్యుమ్నునందును నమ్మికమెయి ధర్మజు నప్పగించి నిర్భయుఁడనై సైంధవునిఁ జంపఁబోవుదును. రణరంగమున ద్రోణుఁ డెట్టివాఁడో నీవెఱుంగనిదిగాదుగదా! అతఁ డెట్టిప్రతిజ్ఞచేసియున్నవాఁడో నీకుఁ దెలిసినదియే! ఆభారద్వాజుఁడు ధర్మజునిఁ బట్టికొనఁ బట్టుదలతో నున్నవాఁడు. అతఁ డంతపనియుఁజేయఁదగినవాఁడుగాని తక్కువవాఁడు గాఁడు. నరోత్తముఁడగుధర్మజుని నీకప్పగించి, నేనిట్లు సైంధవునిఁ జంపఁ బోవుచున్నవాఁడను కావున నీవిపుడు నాకుఁ బ్రియమగునట్లును, మనకు జయమగునట్లును రాజును రక్షింపవలయును."

ఓరాజా! ఇటులు నీ వాయర్జునుచే నాకు నిక్షేపముగా నప్ప గింపఁబడియున్నవాఁడవు. అప్పార్థుఁడు నీకు భారద్వాజునుండి భయము గల్గునని శంకించియున్నవాఁడు. ఓమహాబాహూ! నేను నిత్యమును జూచుచున్నవాఁడనుగదా! ఆద్రోణునకుఁ బ్రతియోధియగువాఁడు ప్రద్యుమ్నుఁడుదక్క వేఱొకఁడు లేఁడు. నన్నును నట్టివానింగా నా యర్జునుఁడు తలంచుచుండును. నాసంభావన యిట్టిది. ఆచార్యునివచన మది. ఓరాజా! నిన్ను విడుచుటకును, వెనుకఁబెట్టుటకును నేనిష్టపడను. ఆయాచార్యుఁడు లఘుహస్తుఁడై, యభేద్యకవచావృతుఁడై బాలకుఁడు పక్షితోవలె నీతో నాతఁడాడుకొనును. కృష్ణపుత్త్రుఁడగు ప్రద్యుమ్నుఁ డిందు ధనుష్పాణియై యుండెనేని వానికి నిన్నప్పగించి పోదును. అతఁ డర్జునుఁడువలె నిన్ను రక్షింపఁజాలినవాఁడు. రక్షకుఁడనగు నేను బోవు దునేని, నీకెవ్వఁడు రక్షకుఁడో తెలుపుము. ధైర్యము దెచ్చికొనుము. నే నప్పాండవునికడ కేగుదు ననుకొమ్ము. ఈద్రోణు నెదుర్కొనువాఁ డెవఁడో తెలుపుము. ఓరాజా! అర్జునునెడ నీకు భయశంక వలదు. మహా బాహుఁడగు నాయర్జునుఁ డొకపుడును భార మెక్కుడై చిక్కువడఁడు. సౌవీరయోధులు, సైంధవాదులు, నుదీచ్యులు, దాక్షిణాత్యులు, కర్ణాదులగుమహారథులు నింకనుగలప్రసిద్ధులు నాయర్జును పదునాఱవ పాలు పోలఁజాలరు. ఇంతయేల! సురాసురమానవులతోఁగూడిన పుడమి యెల్లను, రాక్షసగణములును, గిన్నరులును, మహోరగులును, జంగమ స్థావరములన్నియును బ్రయత్నించినను, గుపితుఁడగు నప్పార్థునితోఁ బోరాడఁజాలరని నమ్ముము. నా యీవచనము తెలిసికొని యప్పార్థునెడ జంకు విడువుము. ఓరాజా! మహేష్వాసులును, సత్యపరాక్రములును, వీరులునగు కృష్ణార్జును లున్నకడ నాపదయన నెట్టిది? దైవమును, నస్త్ర పాండిత్యమును, యోగమును, నమర్షమును నీపై నాతనికిఁ గలకృత జ్ఞతను దయను జింతింపుము. నే నాయర్జుననికడకు వెడలిపోఁగా ద్రోణునిచిత్రాస్త్రప్రదర్శనమును జింతింపుము. ఓరాజా! ఆయాచా ర్యుఁడు తప్పక నిన్నుఁ బట్టికొననున్నవాఁడు. నా ప్రతిజ్ఞను రక్షించుచు, సత్యమొనర్పుము. మనోధైర్యమును విడువకుము. నేను వెడలితినేని నీకు రక్షకుఁడెవ్వఁడు? నిన్ను విడిచి నేను బార్థునికడకుఁ బోవ విశ్వాస పాత్త్రుఁడగువాఁ డెవ్వఁడేని లభించిన వాని కప్పగించిపోవుదును. ఇమ్మహా

హావమున నిన్నుఁ దగినవాని కప్పగింపక నేనెందుఁబోఁగలను? నిజము తెలుపుచున్నవాఁడను. ఓబుద్ధిమదగ్రణీ! ఇది బహువిధముల నీబుద్ధిచే నాలోచించి శ్రేయమేదియో నిశ్చయించి పిదప నన్ను శాసింపుము.

ఓయాంబికేయా! ఇటు లాసాత్యకి తెలుప విని యుధిష్ఠిరుఁడు, మఱియు నాతనితో 'ఓశినిపుంగవా! నీవిట్లు పల్కుచున్నాఁడవుగాని యాశ్వేతాశ్వునెడ నాకింకను విశ్వాసము చాలకున్నది. నారక్షణమునకై నేనెంతయుఁ బ్రయత్నమొనర్చికొందును. కావున నామాటవట్టి యవ్వి వ్వాచ్చుఁడున్నకడకు వెడలుము. ఈయుద్ధమున నాసంరక్షణమును, నర్జును కడకు నీవు వెడలుటయు ననెడిరెండువిషయములను బుద్ధిచేఁ జింతింపఁగా, నీవర్జునుఁడున్నచోటికి వెడలుటయే యురవని నాకుఁ దోఁచెడిని. అట్లగుట నీవాతనిచెంతకుఁ బో సన్నద్ధుఁడవు గమ్ము. మహాబలుఁడగు భీముఁడు నారక్షణమొనర్చును. అటులే మహాబలులగుపార్థివులును, సోదరులతోఁగూడినధృష్టద్యుమ్నుఁడును, ద్రౌపదేయులును నిస్సంశయముగా రక్షించువారు. మఱియుఁ గైకేయులును, ఘటోత్కచుఁడును, విరాటద్రుపదులును, శిఖండియును, ధృష్టకేతువు, కుంతిభోజుఁడును, నకులసహదేవులును, పాంచాలురును, సృంజయులును గలరుగాదే! వీ రెల్లఁగలిసి నన్ను నిస్సందేహముగా రక్షింతురు. ద్రోణుఁడును, నాతని సైన్యమును, కృతవర్మఁడును నన్నుఁ జేరుటకైన వలంతులు గానేరరు. నన్నేమియుఁ జేయఁజాలరు. కుపితుఁడగు ద్రోణు నాధృష్టద్యుమ్నుఁడు విక్రమించి సాగరమును వేలవలె నివారింపఁగలఁడు. పరవీరఘాతకుఁడగు నప్పార్షతుఁడున్నచోట ద్రోణుఁడు సైన్యముతోఁగూడ నెటులు చెదరిపోకుండును? వీఁడా ద్రోణునిఁ జంపుటకేగదా అగ్నినుండి జనించినవాఁడు! ఈధృష్టద్యుమ్నుఁడు కవచశరఖడ్గధనుర్భూషణములతోడ నగ్నిలోఁ బుట్టినవాఁడుగాదే? కావున నోశైనేయా! నాయెడ సంభ్రమింపక నమ్మికమైఁ బోవుము. ధృష్టద్యుమ్నుఁడు ద్రోణుని వారింపఁ గలఁడు.' అని పలికె" నని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

### సాత్యకి యర్జునునకుఁ దోడ్పడఁ బోవుట

"ఓరాజా! సాత్యకి యాధర్మజునివచనము లాలించియు, నాతని విడిచివచ్చినందుల కర్జునుఁ డేమనునో యని వెఱఁగందుచు, నంతకుమించి

'భీతిచే నితఁడు పోలే' దని తనకుఁగల్గు లోకాపవాదమును జింతించుచుఁ, దుదికి పోవుటకే నిశ్చయించికొని, యుద్ధగర్వితుఁడై యాధర్మజునితో 'ఓరాజా! నీరక్షణము పాసఁగునని తలంతువేని నీమాట వట్టి యాబీభత్సుననుసరించి యిదె పోవుచున్నవాఁడను. నీకు శుభమగుఁ గాక. ఓరాజా! మూఁడులోకములందును నాకర్జుననిమించిన ప్రియతముఁడు లేఁడని నొక్కి వక్కాణింపఁగలను. నామాట సత్యమని నమ్ముము. ఓరాజా! నీయాజ్ఞ శిరసావహించి యిదె యాతని ననుసరింపఁ బోవుచున్నవాఁడను. నీవిషయమున నాకుఁ జేయరాని దేమియును లేదు. నాగురువచన మెట్టివిశిష్టమో నీవచనము దానిని మించినదని నమ్ముము. నీప్రియమున్నకై నీకును నాకును భ్రాతలగు నప్పార్థవాసుదేవులు ప్రవర్తించువారు. ఓరాజా! వారిప్రియమే నాప్రియమని తెలియుము. ఓప్రభూ! నీయాజ్ఞ శిరసావహించి పాండవార్థముగా నే నీ దుర్భేద్యమగుసైన్యమును భేదించి, కుపితమగు మహామీనము సాగరమునువలె ద్రోణసైన్యమును గలంచి, యాసైంధవుఁ డున్నచోటికిఁ బోవుదును. అర్జుననివలన జడిసి తనసైన్యము నాశ్రయించి కర్ణకృపాశ్వత్థామాదులగు రథికోత్తములచే రక్షితుఁడైన సైంధవుఁ డున్నచోటికిదె పోవుదును. ఓరాజా! వాఁడున్నచోటిక్కడకు మూఁడుయోజనములని తలంతును. వానిని జంపుటకై యర్జునుఁడును నందే యున్నవాఁడు. అట్లు మూఁడుయోజనములు గడచి వెడలినయప్పార్థుఁ డున్నకడకు నేనుఁబోయి యాసైంధవుని వధించునంతకును నందే యుండెదను. ఓరాజా! గురునాజ్ఞలేక యెవ్వఁడును యుద్ధముచేయఁడు. ఆజ్ఞప్తుఁడైనచో నెవ్వఁడు యుద్ధమొనర్పఁడు ? నే నెందులకుఁ బోవలయునో యాప్రదేశమును ముందుగాఁ దెలిసికొనియెదను. హాల, శక్తి, ప్రాస, గదా, చర్మ, తోమర, బాణాస్త్రసమ్మర్దమైయున్న యాయుద్ధరంగమును సాగరమునుబోలెఁ గలఁతవెట్టెదను. వేలకొలఁదిగానున్న యిక్కుంజరసైన్యము ననుసరించి చూచితివా? అది యంజనకకులము. అందుఁ బెక్కురు వీరులున్నవారు. అటులే యుద్ధశౌండులైనబహుమ్లేచ్ఛులతోఁ గూడి యనేకగజసాహస్రములు వర్షకాలమేఘములువలె వెలయుచున్నయవి. మావంతులచేఁ బ్రోత్సహింపఁబడిన యాయేన్గు లొకపుడును నివర్తిల్లవు. ఓరాజా! వీరికి మరణమే పరాజయముగాని, యంతదనుక భీతి

కోటమి లేదు. పిదప ననేకులు రథికులుగలరు చూచితివా? వారు రుక్మరథులనుపేరుగల రాజపుత్త్రులు. ఓరాజా! మహారథులగువా రస్త్రనిపుణులు. మఱియు ధనుర్వేదపారంగతులును, ముష్టియుద్ధకోవిదులు, గదాయుద్ధవిశేషజ్ఞులును, బాహుయుద్ధనిపుణులును, ఖడ్గప్రహారవిశారదులును నై యసిచర్మములనుబట్టి పనిచేయువారు. వీరు శూరులును గృతవిద్యులు నై పరస్పరము స్పర్ధగలిగి, నిత్యము రణరంగమున వైరులను జయింప నిచ్ఛగించుచుందురు. వీరు కర్ణనియుక్తులై దుశ్శాసను ననుసరించియుందురు. వీరి నావాసుదేవుఁడును రథికోత్తములుగాఁ బ్రశంసించుచుండును. మఱియు వీరు కర్ణవశవర్తులై యెల్లపుడు నాతనిప్రియమొనర్చువారు. అక్కర్ణునానతిమై వారప్పార్థునుండి మఱలినవారు. వారు క్లాంతులుగాక శ్రాంతులుగాక దృఢకవచధారులై యున్నవారు. ఆధార్తరాష్ట్రునిశాసనముచే నాకై నిశ్చయముగా నిలుపఁ బడియున్నవారు. ఓరాజా! నీప్రియమునకుఁగా వీరి నడఁచి, పిదప నయ్యర్జును మార్గము పట్టి పోవుదును. మఱియు నీయేడువందలయేనుగులను జూచితివా? ఇయ్యవి కవచావృతములై కిరాతులచే నధిష్ఠింపఁబడియున్నవి. మున్నాదిగ్విజయకాలమున నర్జునునకుఁ జిక్కి నిజజీవితాపేక్షియై యక్కిరాతరాజు వీరి నలంకరించి యిగ్గజములతోఁగూడ నీకు సేవకులఁగా నొసంగెను. అపుడు వీరు నీకు సేవకులై దృఢవిశ్వాసముతో నుండెడివారు. అట్టి యిక్కిరాతులే యిపుడు నీతో యుద్ధముచేయ నుత్సాహముగల్గియున్నవారు. కాలవిపర్యయ మెట్టిదో చూడుము. యుద్ధగర్వితులగు వీరే యిగ్గజసైన్యమునకు మావంతులుగా నున్నవారు. వీరెల్ల నగ్నియోనులై గజశిక్షాపాటవముగల్గి, యర్జును నెదురించి, యాతనిచే మున్ను నిర్జితులైనవారు. ఇట్టి వీరిపుడు దుర్యోధనువశవర్తులై నాకై వేచియున్నవారు. ఓరాజా! యుద్ధదుర్మదులగు నిక్కిరాతులను నాశరములపాలు గావించి, సైంధవవధాయత్తుఁడనై యున్నయన్నరుఁడున్నకడకు వెడలెదను. వరుణు నేన్గుకులమున జనించిన యిమ్మహాగజములను గన్గొనుము. ఇయ్యవి కఠినములై మదముగారుగండములతో సువర్ణకవచభూషితములై యుద్ధమునెడ లక్ష్యముగల్గి యైరావణముఁబోలె నెంతయు శిక్షితములై, శూరులగు నుత్తరపర్వతవాసులధిష్ఠింప వెలయుచున్నయవి. కఠినములై యినుపకవచములుపూని నందినీ

సంభవులును, వానరవంశసంభవులు నై, వారు వీని నెక్కియున్నవారు. వీరెల్లరును గలియుట నీసైన్యము ధూమవర్ణమై కనుపట్టుచున్నది. హిమదుర్గవాసులై పాపకర్ములగు నీమ్లేచ్ఛరాజులసమూహమును, సైంధవ కృపద్రోణసౌమదత్తికర్ణులను సహాయము చేసికొనియే దుర్యోధనుఁడు పాండవుల నవమానించినవాఁడు. మఱియుఁ గాలచోదితుఁడై తన్నుఁ గృతార్థునిఁగా నెంచుకొనుచుండును. వారెల్ల నిపుడు నాబాణగోచరులై యున్నారు. పరపరాక్రమోపజీవియగు నాసు యోధనుమన్ననలు వడసినవారగుట వీరు వడిగల్గి యాకౌరవుని విడువకుందు రేని నాబాణపరంపరచే పీడితులై నశింతురు. ఓరాజా! సువర్ణధ్వజులై యీరథికులగపడుచున్నవారు చూచితే? వీరు దుర్వారులైన కాంభోజులని నీవు వినియే యుందువు. వీరు శూరులై కృతవిద్యులై ధనుర్వేదపారగులై పరస్పరహితము గోరి కలిసి ధార్తరాష్ట్రునకై వెడలి కురువీరాభిరక్షితులై నాకై వేచియున్నవారు. ఓరాజా! జాగరూకతతో నన్నెటులెదురింపనున్నవారో చూచితివా? వారినెల్లఁ దృణరాశినగ్నివలె నొకనిమిషమున నశింపఁజేసెదను. కావున మనరథకల్పకులు రథమున నమ్ములపొదులను సకలోపకరణములను సిద్ధముచేయుదురుగాక. ఈసమ్మర్దమునఁ బలువిధములగు నాయుధములు నావశ్యకములై యుండవలెను. రథమైదుగుణములుగల్గి యుండవలయునని యాచార్యులయుపదేశము గదా! విషముగ్రక్కుపాములునాఁ దగు కాంభోజులతో నిపుడు గలియవలసియున్నది. నానాయుధధారులును, వివిధాయుధయోధులును నగు కిరాతులతోఁ గలిసి పోరాడవలసియున్నది. వారు సుయోధనలాలితులగుట వానిహితముగోరి విషకల్పులై పోరాడుదురు. శక్రతుల్య పరాక్రములును, నగ్నికల్పులును, దురాధర్షులును బ్రజ్వలించినపావకులను బోలినవారునగు శకులతో నిపుడు యుద్ధమొనర్పవలసియున్నది. అటులే మఱియుఁగల యోధులనేకులు యములునా దురాసదులై రణగర్వముతో సిద్ధముగానున్నవారు. వారితోఁ బోరాడవయును. అటులగుట శుభలక్షణములై ప్రసిద్ధములై నేలఁ బొర్లాడి సిద్ధముగానున్న యశ్వోత్తమముల నారథమునకుఁ గట్టింపవలయును.' అని తెలిపెను.

ఓయాంబికేయా! అది విని యాయుధిష్ఠిరుఁడా సాత్యకిరథమున నుపకరణములన్నియుఁ బెట్టించి, యమ్ములపొదులనెల్ల నుంచి, వివిధాస్త్ర

ములను రథమున నుంపించెను. పిదప మదముప్పుట్టించెడి రసవత్పానము చేయించిన వడిగలగుఱ్ఱములను సర్వసన్నాహములతో నారథమునకుఁ గట్టించెను. ఆనాల్గుగుఱ్ఱములును సుపావృత్తములై స్నానమొనర్చి నీరుద్రావి ఖాణముమేసి యలంకరింపఁబడి వినీతశల్యములై సువర్ణమాలికలు వ్రేలాడ, మేనులు బంగరుకాంతులు వెలయ, శిక్షితములును మనోవేగములు నై యెంతయు నలరుచుండెను. అయ్యవి యథావిధిగాఁ గల్పింపఁబడియుండుటను, స్థిరచిత్తములై సోత్సాహముగా నుండెను. సువర్ణకేసరమాలికగల్గిన సింహధ్వజముతో మణివిద్రుమభూషితములగు సువర్ణకౌతుకసూత్రములచే నావృతమై తెల్లనిమేఘములు నాఁదగు పతాకలతో నలంకృతమై సువర్ణదండముగల యున్నతచ్ఛత్రము వెలయ బహుశస్త్రపరిచ్ఛదమైన రథమున నాయశ్వములను బూన్చి సువర్ణభాండభూషితములుగా నొనర్చిరి. ఆసాత్యకికిఁ బ్రియుఁడగు దారుకుని తమ్ముఁడు సూతుఁడై యుండెను. వాఁడు వాసవునకు మాతలివలె నాతని యెదుట నారథము తెచ్చి మనవిచేసెను. పిమ్మట నమ్మహనీయుఁడు స్నానమొనర్చి, శుచియై కృతకౌతుకమంగళుఁడై, వేవురుస్నాతకులకు స్వర్ణనిష్కముల నిప్పించి, వారియాశీర్వాదములనుగొని, పిదప మధుపర్కార్హుఁడై కైలాతకమధువు ద్రావి, మదవిహ్వలాక్షుఁడై మహాహర్షముతో రెట్టించిన తేజ మొలయఁ బ్రజ్వలించుపావకుఁడునాఁదగి, శరశరాసనములఁ దొడపై నిడికొని బ్రాహ్మణులు స్వస్త్యయనములుచేయ నతఁడు కవచముధరించెను. పిదపఁ గన్నియలు సుగంధలాజమాల్యాదుల నాతని నభినందించిరి. పిమ్మట నాసాత్యకి యుధిష్ఠిరునిపాదముల కభివందన మొనర్చి, కేల్మోగిడ్చి యతఁడు తన్ను మూర్ధాఘ్రాణ మొనర్ప రథ మధిరోహించెను. పిదప వాయువేగముగలవియు సుప్రష్టములును, హృష్టములునై యజేయములగు గుఱ్ఱము లాతనిజైత్రరథమును వహింపసాగెను.అటులే భీముఁడును ధర్మజునిచే నాదరింపఁబడి, యాతనికిమ్రొక్కి యాసాత్యకితో వెడలెను. ఓరాజా! వైరిమారకులగువారిరువురునుమీసైన్యమును బ్రవేశింపఁ దలంచియుండుటనారసి,భారద్వాజాదులగు నీవారెల్లరును నిలిచియుండిరి. పిదప నాసాత్యకి సన్నద్ధుఁడై తనతో వెడలిన భీమునిఁగాంచి యభినందించి, యాతనికి హర్షకరముగా 'ఓభీమసేనా! నీవీమనరాజును రక్షింపవలయును. నీకిది యుత్తమకర్తవ్యము కాకపోదు.

కాలపక్వమైయున్న యిక్కౌరవబలము నిదె నేను భేదించి ప్రవేశించు చున్నవాఁడను. నేఁడును మునుముందును రాజునురక్షించుట మనకు శ్రేయస్కరము. నీవు నాపరాక్రమ మెఱుఁగుదువు. నేనును నీవిక్రమ మెఱుఁగుదును. కావున నోవీరాగ్రణీ! నాకుఁ బ్రియముకూర్చువాఁడవేని మఱలుము.' అని పలుక విని యతఁడాసాత్యకితో 'ఓయీ! కార్యసిద్ధికై వెడలిపొమ్ము. ఓపురుషవరేణ్యా! నే నీభూనాథుని రక్షింతును.' అని పలికెను. అది విని మఱియు సాత్యకి 'ఓయీ! ఇఁక నీవు వడిగాఁబొమ్ము. పొమ్ము. నాకు విజయము నిశ్చయము. గుణానురక్తుఁడవగు నీవు నాకు వశుఁడవై యుండుట నాకొకశుభనిమిత్తముగాదే? ఇటులే శకునము లన్నియు ధన్యములై నాకు శుభమును సూచించుచున్నవి. మహాత్ముఁ డగుపార్థునిచేఁ బాపశీలుఁడగుసైంధవుఁడు హతుఁడైనవెంటనే వచ్చి ధర్మాత్ముఁడగుయుధిష్ఠిరప్రభునిఁ గౌఁగిలించికొనియెదను.' అని పలికి యా భీముని విడిచి, బెబ్బులి మ్రుక్కుడిమృగములనువలె నీసైనికులఁ గాంచి, యాధర్మజునిశాసనముచే నర్జునుఁ జూచునభిలాషతో నాసాత్యకి వెడ లెను.'' అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## సాత్యకి కౌరవసైన్యమును బ్రవేశించుట

''ఓరాజా! అటు లాసాత్యకి యుద్ధాభిలాషియై నీసైన్యముపై వెడల, యుధిష్ఠిరుఁడు నిజసైన్యముతోఁగూడి యాసాత్యకివెనుక ద్రోణు రథమును జేరువాఁడై వెడలెను. పిమ్మట సమరగర్వితుఁడగు నాధృష్ట ద్యుమ్నుఁడును, వసుధానుఁడును, బాండవసైన్యమున 'ఓయీ! రండు. కొట్టుఁడు. వడిగాఁ బరువులువెట్టుఁడు. మనసాత్యకి సుఖముగా నీసైన్య మును గడచిపోవలయును. పెక్కురు మహారథికు లితని జయించుటకై సన్నద్ధులైయున్నవారు.' అని పలుకుచుండ, మహారథులెల్లరును వడిగా వెడలిరి. మనవారును జిగీషులై వారిపైఁ బరువులిడిరి. పిదప నాసాత్యకి రథముకడ, గొప్పచప్పు డుప్పతిల్లెను. ఓమహారాజా! అపు డాసాత్య కిచేఁ బ్రహతమై మనసైన్యము చెదరి పరువులిడుచు, నూఱుఖండము లుగాఁ జీలిపోయెను. అది యటులు చెదర నామహారథుఁడగు శైనే యుఁడు సేనాముఖములనున్న మహేష్వాసులగు నేడ్వురవీరులను బడఁ గొట్టి, నానాజనపదేశ్వరులగు మఱికొందఱ రాజులను నగ్నితుల్యములగు

బాణములచే యమమందిరము నొందువారిఁగా నొనర్చెను. అతఁ డొక బాణముచే నూర్వురను గొట్టి, నూఱుబాణములచే మావంతులతో మాతంగములను, రౌతులతో నశ్వములను, సూతాశ్వములతో రథికలను, రుద్రుఁడు పశుసంఘమునువలె రూపుమాపెను. అటులు కడు వడిగా శరసమూహమును వర్షించు నాసాత్యకిని, నీసైనికులం దెవ్వరును మార్కొనలేరైరి. దీర్ఘబాహుఁడగు నాతనికి భీతులై మర్దింపఁ బడుచు, నతిమానిరై యుద్ధమొనర్చు నాసాత్యకిని విడిచి వారు పోసాగిరి. ఆతని తేజముచే మోహితులై వారెల్లరు నాతని నొకనినే చూడ సాగిరి. మథితములగురథములును, భగ్నములగునీడములును, విఱిగిన చక్రములును, దెగినఛత్రములును, బడినధ్వజములును, బతాకలును, సువర్ణశిరస్త్రాణములును, జందనదిగ్ధములగు బాహువులును, హస్తిహస్త తుల్యములును, సర్పాభోగసన్నిభములునగు తొడలును నందందుఁ జెదరిపడఁ బుడమియెల్లఁ గప్పఁబడియెను. అటులే చంద్రతుల్యములగు మొగములతోడను, బర్వతసన్నిభములై పడిన యేన్గులతోడను గూడి యుండెను. అటు లాసాత్యకి నానావిధసైన్యములను గూలఁద్రోసి, మఱియుఁ బరువులిడఁజేసి ధనంజయుఁ డేత్రోవ వెడలెనో దానినిబట్టియే యతఁడును వెడల నిశ్చయించెనుగాని వాని నాద్రోణుఁడు నివారించెను. అంత నతఁ డాభారద్వాజునిఁజేరి, వేలచే సాగరమువలె మఱలఁజాల కుండెను. అపు డాద్రోణుఁడు మహారథుఁడగు నాసాత్యకిని వారించి, మర్మభేదకములగు నైదుతీవ్రబాణములచే వానిని నొప్పించెను. సాత్యకి యాద్రోణు నేడుబాణములచే నొప్పించెను. పిదప నాభారద్వాజుఁ డాఱుసాయకములచే సూతాశ్వములతోఁగూడ నాసాత్యకిని నొప్పింప, నందుల కాసాత్యకి సహింపక సింహనాదమొనర్చి, పదిబాణములచే నాతనిఁగొట్టి మఱియుఁ బదునాల్గుబాణములచేఁ బ్రహరించి, మఱియుఁ బదిబాణములుపూని యొకదానిచే సారథిని, నాల్గిటిచే నాల్గుగుఱ్ఱములను. నొకదానిచే ధ్వజమును గొట్టి, మఱియు నాల్గిటిచే నాద్రోణు నొప్పింపనతఁ డాసాత్యకిని శలభసమూహములనా వెడలుబాణములచే గప్పెను. అపు డాసాత్యకియుఁ బెక్కుబాణములచే నాద్రోణునిఁ గప్ప, నపు డాభారద్వాజుఁ డాతనితో, 'ఓయీ! నీచుఁడువలె నీయాచార్యుఁడు నాతోఁ బోరాడక, నేను యుద్ధము చేయుచుండఁగనే తాను

మాని నాకుఁ బ్రదక్షిణమొనర్చిపోయెను. నీవు నాతో నిపుడు యుద్ధమొనర్చితేని జీవించిపోఁజాలవు. నీవును నీగురునివలె యుద్ధముమాని పొమ్ము. లేనిచో బ్రతుకవు.' అని పలుక విని యాసాత్యకి 'బ్రాహ్మణోత్తమా! ధర్మజునిశాసనముచే సాధనంజయుమార్గముఁబట్టి పోవుచున్నాఁడను. నాకుఁ గాలవిలంబము కాఁదగదు. నీకు శుభమగుఁగాక. ఆచార్యులమార్గమే శిష్యులెల్లపుడు ననుసరింపవలయునుగదా! కావున నాగురునిమార్గ మనుసరించియే వడిగా వెడలుచున్నవాఁడను.' అని ప్రత్యుత్తరమిచ్చెను.

ఓయాంబికేయా! ఇటు లాసాత్యకి పలికి యాద్రోణునిఁ బరిత్యజించి వెడలి తనసారథితో 'ఓయీ! నన్ను నివారించుటకై యీ ద్రోణుఁ డెల్లవిధముల యత్నముచేయక మానఁడు. కావున నీవు కడు యత్నముతో వడిగా మనరథము పోనిమ్ము. ఈ నావచనము వినుము. మహాప్రభగల యావంత్యసైన్య మిదె చూచితివా? దానివెనుక దాక్షిణాత్యమహాబలము గలదు. దానివెనుక బాహ్లికులమహాసైన్యముగలదు. దానికిఁ జేరువనే కర్ణునిమహాసేన గలదు. ఈసైన్యములన్నియుఁ బరస్పరము భిన్నములై యున్నవి. కాని పరస్పర మాశ్రయించి రక్షించుకొనుచుండును. వీనినడుమనుండి మనగుఱ్ఱములను దోలుము. అందు నానాయుధధారులై బాహ్లికులును, దాక్షిణాత్యులును, కర్ణపురోగములును, గజాశ్వరథసమ్మర్దము గల్గియున్నవారు. నానాదేశవాసులగుపదాతులతోఁ గూడియున్నది. చూడుము.' అని పలికి యాద్రోణుని విడిచి యుగ్రమగుకర్ణసైన్యమునడుమనుండి వెడలెను. అపుడా ద్రోణుఁడు కుపితుఁడై బాణవర్షమును గురిపించుచు, నాసాత్యకి వెంటనంటెను. అంతనాసాత్యకి మఱలక యక్కర్ణుసైన్యమును శరపరంపరలఁబీడించుచు, నపరిమితమగుభారతసైన్యమును జేరెను. ఆసాత్యకి యటులు ప్రవేశింప మనసైన్యములు పరువులువాఱ నపుడు కుపితుఁడై కృతవర్ముఁడు సాత్యకి నెదుర్కొనియెను. అటులు తన్ను మార్కొనిన యాకృతవర్మ నాఱు బాణములచేఁ గొట్టి, వానిగుఱ్ఱముల నాల్గిటిని నాల్గుసాయకములచేఁ బ్రహరించి, మఱియుఁ బదునాఱుబాణములచే నాకృతవర్మవక్షమును నొప్పించెను. తీవ్రములగు పెక్కుబాణములచే నటులు ప్రహతుఁడై యాకృతవర్ముఁ డోరువక వాయువేగముగలవత్సదంతమును సంధించి

యాకర్ణాంతముగా నాకర్షించి, యాసాత్యకివక్షమును నొప్పించెను. ఆ సాయక మాసాత్యకికవచమును భేదించి, దేహమున నాటి రక్తసిక్తమై పుడమింజొచ్చెను. మఱియునాకృతవర్మ పెక్కుబాణములచే శరయుక్తమగు నాతనిశరాసనము ఖండించి, కుపితుండై తీవ్రములగుపదిబాణములచే మఱియు నాసాత్యకివక్షమును నొప్పించెను. అంత నాసాత్యకి తన ధనువు దెగుట, నొకశక్తిఁగొని దానిచే నక్కృతవర్మదక్షిణబాహువునం గొట్టి, వేఱొకవిల్లు పూని వేలకొలంది బాణముల నక్కృతవర్మనిపై గుప్పెను. అటు లాసాత్యకి యాహార్దిక్యునిరథము నెల్లెడల బాణములచేఁ గప్పి, వేఱొకభల్లముచే వానిసారథిశిరము దెగనేయ, వాఁడా కృతవర్మరథమునుండి నేలఁగూలెను. అపుడు సూతరహితములగుట, నాతనిరథాశ్వములు పరువిడసాగెను. అంత నక్కృతవర్మ రథాశ్వములను దానే పట్టుకొని, ధనుష్పాణియై యందు నిలిచియుండ నాతనిసైన్యములు సన్నుతించెను. అతఁడటులు రెండుగడియ లూఱడిల్లి, మఱియు నశ్వములను బ్రేరింప, నంతలో సాత్యకి వెడలిపోవ నతఁడు భీముని మార్కొనియెను. అటు లాసాత్యకి యాభోజునిసైన్యమును దప్పించికొని కాంభోజసైన్యములపైకి వెడలి, యందు శూరులనేకులు తన్ను నిరోధింప సత్యవిక్రముఁడగు నాసాత్యకి యందుల కించుకేనిఁ జలింపకుండెను. అపుడు ద్రోణుఁడు తనసైన్యమును గృతవర్మున కప్పగించి, యాసాత్యకితో యుద్ధమొనరింప వెడలెను. అటు లాసాత్యకి వెంటనంటి పరువిడుచున్న ద్రోణునిఁ బాండవసైన్యమునఁగల వీరులెల్ల నివారించిరి. అంత నక్కడ నారథికోత్తముఁడగు కృతవర్మునిఁజేరిన భీముఁడు మున్నగుపాంచాలసైన్యములవారు పోరి, విగతోత్సాహులై యా వీరునిచే నివారితులై బహువిధముల యత్నించియు, నాతనిశరప్రకాండమున కోరువక యలసియుఁ, గీర్తినిగోరువారై యట్లు చెదరక నిలిచియుండి" రని తెలుప విని యాసంజయునితో ధృతరాష్ట్రుఁ డిట్లనియె.

కృతవర్మనిపరాక్రమము

"ఓసంజయా! ఇట్లు మనసైన్యము న్యాయ్యముగను, బహువిధముగను, బహువివేకముగను వ్యూహముగా నేర్పఱుపఁబడియుండెను. మనము నిత్య మీసైన్యమున కేమియు లోపమొదవకుండ నాదరించు

చున్నవారము. ఇది యద్భుతాకారమై ప్రౌఢమై దృఢవిక్రమము గల్గి యున్నది. ఇందుఁ గేవలము వృద్ధులును బాలురునుగాక, కృశులును మిక్కిలి బలిసినవారుగాక, లఘువృత్తులును, ప్రాణబలముగలవారును, దృఢగాత్రులును, రోగరహితులును నై దృఢకవచాదులుగల్గి బహుశస్త్రపరిచ్ఛదులై సైనికులెల్లరును లెక్కుశస్త్రగ్రహణవిద్యలందు నేర్పు గల్గియున్నవారు. మఱియు రథాద్యారోహమందును, శత్రులపైఁ బడుటయందును, బ్రహరించుటయందును, యానమందును, నపయానమందును నేర్పుగలవారు. మఱియు వీరు రథనాగాశ్వములయందుఁ బరీక్షింపఁబడి తమతమకుఁ దగునట్టులుగా వేతనములఁ బుచ్చికొనుచు, నొకప్రసంగముచేఁగాని, గౌరవముచేఁగాని, సంబంధనిమిత్తముగాఁ గాని లోపమునొందక మెలఁగుచున్నవారు. ఇందు మనచేఁ బిలువఁ బడనివారును, మనజీతములు పుచ్చుకొననివారును లేరు. మఱియు నిందెల్లరును సద్వంశ్యులును, నార్యులును వెలయ, నిది నిత్యము సంతుష్టము పుష్టమునై గర్వములేక మానోపచారముల నొందుచు, గీర్తియు మానమును విడువక ప్రవర్తిల్లునది. దీనిని సచివముఖ్యులును, బుణ్యకర్మలును, లోకపాలతుల్యులునగువారు పాలించుచున్నవారు. మఱియు మనకుఁ బ్రియముచేయ నెంచియున్నరాజు లనేకులు తమతమపరివారములతో మనకు సహాయులుగా వచ్చి యిందు రక్షకులైయున్నవారు. అటులగుట నిది, నదులచే సాగరమువలె యోధులచే నిండియున్నది. లెక్కలులేకయుఁ బక్షులునాఁదగు రథాశ్వములతో నావరింపఁబడి యున్నది. మెండుగా మదముగారు గండములుగల గందుటేన్గులతో నిండియున్నది. ఇట్టిమనసైన్యము పరాజయమొందుట, మనయభాగ్యము కంటె వేఱేమికలదు? మఱియు యోధులనెడితఱుగనినీరుగల్గి భయంకరమై వాహనములనెడితరఁగలు వెలయ ననిగదా శక్తి శర ప్రాసాదులనెడిమత్స్యములచే నాకులమై, రత్నములె కలువలుగాఁ, బరువులువెట్టు వాహనములచే జనించినగాలిచేఁ గదలుచు, ద్రోణుఁడనెడిగంభీరపాతాళముగల్గి కృతవర్మఁడనెడిమహాహ్రదము వెలయ, జలసంధుఁడనెడి మహాగ్రాహమును,గర్ణుఁడనెడిచంద్రోదయమునుగల్గిన మనసేనాసముద్రమును గడచి యొక్కవ్వడికి వెడలిపోఁగా నటులే సాత్యకియును గడచి చన, మనసైన్యము మిగులుట యెట్లు? ఓసంజయా! వారిరువురు నటులు

మిక్కిలి వడిగలిగి వెడలిపోఁగా, గాండీవిబాణగోచరుఁ డైయున్న యా సైంధవునిఁ గాంచి కాలచోదితులై కౌరవులేమిచేసిరి? అట్టి దారుణావస్థలో వారెట్లు ప్రవర్తించిరి? ఓతండ్రీ! అపు డకౌరవులు మృత్యుముఖగ్రస్తులై యుందురని తలంతును. యుద్ధమున వారికి నిరుపమాన పరాక్రమమును గానరాదు. యుద్ధమున నవ్యాహతులగు వాసుదేవార్జును లందుఁ బ్రవేశించియున్నవారు. ఓసంజయా! వారిని వారించువాఁ డొకఁడును నందు లేఁడుగదా! యోధులనేకులు పరీక్షింపఁబడియే మనచేఁ బోషింపఁబడుచున్నవారు. ఆమహారథులకెల్లరకును, వేతన మందుఁగాని, ప్రియవచనములందుఁగాని కొఱంతలేదు. ఓనాయనా! సత్కారశూన్యముగాఁ బోషింపఁబడినవాఁడు మనసైన్యమునఁ గలఁడా? వారివారిపనుల కనురూపమగుభక్తవేతనము లందుచునే యున్నవారు. యోధుఁడు గానివాఁ డొకఁడును లేఁడు. అటులే యల్పవేతనముగలవాఁడును, జీతములేనివాఁడును గానరాఁడు. నాశక్తికొలఁది, వారును మఱియు దానమానాసనాదులచేఁ బూజింపఁబడుచునే యున్నవారు. నావలె నాపుత్రులును, నాజ్ఞాతులును, బాంధవులును వారి నాదరించుచునే యున్నవారు. అట్టివారు లభించియు సంగ్రామమున సవ్యసాచిచే జయింపఁబడినవారు. సాత్యకిచే నోటువడినవారు. అయ్యో! ఇదియెల్ల మనయదృష్టముగాక వేఱేమి గలదు? అందు రక్ష్యుఁ డెవ్వఁడు? రక్షకు లెవ్వరు? రక్ష్యరక్షణభావమున నందఱకు నొక్కటియే మార్గము. సైంధవు నెదుటనున్న యప్పార్థునిఁజూచి నాకొమరుఁ డెంతయు మూఢమానసుఁడై యేమి యొనర్చెను? అటులు నిర్భయుఁడై ప్రవేశించుచున్న యాసాత్యకిని గాంచి, ప్రాప్తకాలముగా నాసుయోధనుఁ డేమి చింతించెను? సకలశస్త్రవేత్తలగు నారథికోత్తము లిరువురును మనసైన్యము నటులు చొరఁబడ, వారి నారసి మనవారు యుద్ధమున బుద్ధి నెట్లు నిలిపిరి? అప్పార్థునర్థమునకై పాటుపడు నవ్వాసుదేవుని, నాసాత్యకిని గాంచి నాతనయులు పరితపింతురని తలంతును. మఱియు శత్రుజయము నెడ నిరుత్సాహులై పలాయనపరాయణులై చెదరిపోవుచున్న తమ రథికులను గాంచి, నాపుత్రులు శోకింతురని తలంతును. ఆయర్జునుఁడును సాత్యకియు మనసైన్యమును భేదించి, దాఁటిపోవుచుండఁగాఁ గౌరవులు పరువులిడుచుండఁగాఁ జూచి నాతనయులు దుఃఖించియుందురని తలం

తును. ఆగురుశిష్యులచే మనవారిరథములు శూన్యములగుటఁ గాంచియు, హతులగుయోధులను దలంచియు నాపుత్రులు శోకింపకమానరని తలంతును. అటులే రణరంగమునఁబడిన గజరథాశ్వములను, వేలకొలఁది వీరులను వ్యగ్రులై పరువులిడువారిని నారసి నాతనయులు పరితపింతురని నేను దలంతును. అర్జున శరాహతములై పరువులిడుమత్తేభములను, బలితములైన మఱికొన్నిటిని గాంచి నాసుతులు వెతనొందుచుందురని తలంతును. రౌతులువడినయశ్వములను, విరథులైనయోధులను జూచి నాకుమారులు శోకాగ్నిని గుమారిలకమానరని తలంతును. ఆసాత్యకిపార్థులచే హతములైనహయములను, బరువులిడుచుఁ బోవుగుఱ్ఱములను గని నాతనయులు తపింపకుండరని తలంతును. ఆరణరంగమున నమ్మాధవపార్థులచేఁ బదాతులు పరువులిడుటఁ బొడఁగని నాకొడుకులు కుందక మానరని తలంతును. అటు లాద్రోణు నతిక్రమించిపోవు నవ్వీరుల నారసి, విజయమున నిరాశులై నాతనయులు దుఃఖింతురని తలంతును. ఓనాయనా! ఆసాత్యకియును గృష్ణార్జునులును మనసైన్యమునఁ బ్రవేశించుట విని నేనెంతయు మూఢుఁడనైతిని. ఓసంజయా! ఆసాత్యకియును, భోజసైన్యమును గడచిపోఁగా మనకౌరవు లేమిచేసిరి? అటు లాద్రోణునిచే సమరమునఁ బాండవులు నిగ్రహింపఁబడ నపుడు యుద్ధమెట్లు జరిగెను? దానిని నాకుఁ దెలుపుము. ద్రోణుఁడు బలశాలియు రణగర్వితుఁడును గృతాస్త్రుఁడునుగదా! ఆమహారథునిఁ బాంచాలురెట్లు సంగ్రామమునఁ బ్రహరింపఁగల్గిరి? ద్రోణునెడ బద్ధవైరులైన యప్పాంచాలు రాధనంజయుజయమునే యెల్లపుడును గోరుదురుగదా! వారూరకుందురా? అశ్వత్థామకు వారిపై మిక్కిలి కోపమున్నదే! వాఁడు వారి నేమిచేసెను? సైంధవునివధమునకై యర్జునుఁ డేమిచేసెను? నీవెంతయుఁ జతురుఁడవగుట దానినెల్ల నా కెఱిఁగింపుము.”

అది విని యతఁ డాధృతరాష్ట్రునితో “ఓభరతోత్తమా! నీకిది కేవల మాత్మాపరాధమువల్ల సంభవించినవ్యసనము. ఓవీరాగ్రణీ! నీ విటులు ప్రాకృతునివలె శోకింతువేమి! మున్ను ప్రాజ్ఞులు హితులునగు విదురాదులు నీకుఁ జెప్పలేదా? పాండవులరాజ్య మపహరింపవలదని వారు తెలిపినవచనములు నీవు వినలేదా? ఎవ్వఁడు తనహితముగోరు మిత్రులమాటను జెవిఁబెట్టఁడో యట్టివాఁడు నీవలె గొప్పవ్యసనము

నకుఁ బ్రాలై చింతింపక తప్పదు. ఓరాజా! మున్నా శ్రీకృష్ణభగవానుఁడు సంధికై నిన్ను వేఁడికొనలేదా? మహాయశుఁడగు నాతఁడును నీవలనఁ దనకోర్కి నెరవేఱ కూరకేపోయెనుగదా! మఱియు నతఁడు నీనిర్గుణత్వమును, నీకుఁ బుత్త్రులపైఁగలపక్షపాతబుద్ధిని, ధర్మము నాలోచింపకుండుటను, బాండవులపైఁగల నీమాత్సర్యమును, వారిపై నీకుఁ గలకపటాభిప్రాయము నెఱిఁగి, యెల్లలోకమువారి యార్తనాదముల విని, యతఁడు సర్వలోకేశ్వరుఁడును బ్రభువునగుటఁ గౌరవులతో గొప్పయుద్ధము నారంభించెను. నీతప్పునుండియే నీకీగొప్పముప్పు తటస్థించెను. ఓరాజా! ఈ నీదోషము దుర్యోధనునిపైఁ బెట్టకుము. ఇందుఁ దొలుతఁగాని, నడుమఁగాని, దుదినిగాని నీమంచి యించుకేని గానరాలేదు. వేయేల! నీవే యీపరాజయమునకుఁ గారణము. కావున స్థిరచిత్తుఁడవై లోకజ్ఞానముగల్గి, దేవాసురయుద్ధమునుబోలి ఘోరమై జరుగుచున్నయుద్ధమును శ్రద్ధగా వినుము. సత్యవిక్రముఁడగు నాకైనేయుఁడు నీసైన్యమును జొరఁబాఱ, భీముఁడు మున్నగుపాండవులు నీసైన్యము నెదురించిరి. అటులు వడిగా వెడలి కుపితులైయున్న పాండవుల నొకకృతవర్మయే నిరోధించి, సాగరమును వేలవలె నివారించెను. అపు డాతనిపరాక్రమము మాకద్భుతముగాఁ జూపట్టెను. ఎపుడు పాండవసైన్యము లాకృతవర్మనాహవమున మీఱఁజాలకుండెనో యపుడు భీముఁడు వానిని మూఁడువాఁడికోలల నొప్పించి, పాండవులకెల్ల హర్ష మొదవ శంఖమును బూరించెను. పిదప సహదేవుఁ డిరువదిటను, యుధిష్ఠిరుఁ డైదిటను, నకులుఁడు నూఱిటను నొప్పించిరి. అటులే ద్రౌపదేయులు డెబ్బదిమూఁడిటను, ఘటోత్కచుఁ డేడింటను, ధృష్టద్యుమ్నుఁ డేడింటను నొనాటనేసిరి. విరాటద్రుపదులును, శిఖండియు నైదేసి బాణములచే నొప్పించిరి. ఓరాజా! పిమ్మట నాహార్దిక్యుఁడు మహారథులగువారినెల్ల నొక్కొకని నైదేసిబాణములచేఁ గొట్టి, భీము నేడు సాయకములచే, నొప్పించి మఱియు నాతనిధనుర్ధ్వజములను ఖండించి, నేలఁబడఁగొట్టెను. పిదప విల్లుదెగియున్న యాతనిఁ దీవ్రములగుడెబ్బది నారసముల నురమున నొప్పింప, వాఁడు గాఢవిద్ధుఁడై భూమికంపమునఁ బర్వతమువలె రథమధ్యమునఁ జలించెను. ఓరాజా! అటులు చలించిన భీము నారసి యుధిష్ఠిరుఁడు మున్నగుయోధులు, శరాసారముల నా

కృతవర్మనిపైఁ గురిసిరి. మఱియు వారెల్ల నాతనిచుట్టు నావరించి య మ్మారుతిరక్షణమునకై సాయకములచే నొప్పించిరి. పిదపఁ గొంతవడి కా భీముఁడు స్వస్థచిత్తుఁడై, సువర్ణదండముగల్గిన యినుపశక్తి నొకటిపూని యాకృతవర్మరథముపై విసరెను. భీమభుజనిర్ముక్తమై పొరవిడిచినపాము నాఁదగు నాశక్తి, కృతవర్మచుట్టును బ్రజ్వలించుచు రా యుగాంతాగ్ని సమప్రభమైయున్న యాశక్తి నాకృతవర్ముఁడు రెండుబాణములచే ఖండింప నది తెగి నేలఁగూలెను. ఓరాజా! నలుదెసల వెలయించుచు నాకసమునుండి జాఱినయుల్కవలెఁ దనశక్తి నిహతమై నేలఁగూలుట కెంతయు నాభీముఁడు కుపితుఁడై, వేఱొకవిల్లుగొని భీమబలుఁడై యైదు బాణములచే నాతనివక్షమునఁ బ్రహరించెను. ఓమారిషా! ఇది నీదురా లోచనకు ఫలము. అపు డాభోజుఁడు భీమసేనునిచే సర్వాంగములును క్షతములుగాఁ బూఁచినరక్తాశోకమువలె నారణాంగణమున విరాజిల్లెను. పిదప నక్కృతవర్ముఁడును గుపితుఁడై నగుచు, భీమసేనుని మూఁడుబాణ ములచేఁ గట్టిగాఁ గొట్టి, మఱియుఁ దక్కినవారినెల్ల నొప్పించెను. అటు లాకృతవర్ముఁడు తమ్ము మూఁడుమూఁడుబాణములచే నొప్పింప,వారును నేడేసిబాణములచే వానిని నొప్పించిరి. పిమ్మట నాహార్దిక్యుఁడు కోప మడర నొకక్షురప్రముచే శిఖండిధనువుఁ దెగనేసి పరిహాసమొనర్చెను. అటులు తనవిల్లు విఱుగ శిఖండి కుపితుఁడై యొకకేడెమును ఖడ్గమును బట్టికొని సువర్ణభూషితమగు కేడెమును ద్రిప్పుచు, నాకృతవర్మనిపైఁ గత్తి విసరెను. ఆమహాఖడ్గ మాకృతవర్మధనువు దునుమాడి, యాకసము నుండి జాఱిననక్షత్రమువలెఁ బుడమిఁ బడియెను. అంతలో నప్పాండవ రథికులెల్ల నాకృతవర్మని సాయకములచే నొప్పించిరి. అంత నాభోజుఁ డును దెగినతనధనువు పాఱవైచి, వేఱొకవిల్లుపూని మూఁడేసిబాణము లచే నొప్పించి, శిఖండి నెనిమిదిబాణములచేఁ గొట్టెను. శిఖండియు వేఱొకవిల్లుపూని కూర్మనఖములగు బాణములచే నాహార్దిక్యని నివారిం చెను. ఓరాజా! పిదప నాహార్దిక్యుఁడు కోపావేశముతో మహాత్ముఁడగు భీష్మునకు మృతిహేతుభూతుఁడగు నాశిఖండిపైఁ గుంజరముపైకి వెడ లినమహాశార్దూలమువలె వెడలి తనబలము మెఱయ సమీపించెను. వారు దిగ్గజములువలెను, బ్రజ్వలితపావకులవలెను గలసి, ధనువులఁ ద్రిప్పుచు, సాయకముల సంధించుచు, భాస్కరుఁడు కిరణములనువలెశర

ములను విడుచుచుఁ, బరస్పరము పరితపింపఁజేసికొనుచు, యుగాంత భాస్కరులునాఁ బ్రజ్వలించిరి. పిదప నక్కృతవర్మఁడు మహారథుఁడగు యాజ్ఞసేనిని డెబ్బదిమూఁడుబాణములచేఁ గొట్టి, మఱియు నేడుబాణములచే నొప్పింప, నెంతయు గాఢముగాఁ బ్రహతుఁడగుట నతఁడు రథమధ్యమునఁ గూలఁబడియెను. అటులు శరచాపములువిడిచి మూర్ఛపడి విషణ్ణుఁడై యున్న యాతనిఁ జూచి నీవారెల్లరును హర్షపూరితులై వస్త్రములను గదల్పుచు నాభోజునిఁ బూజించిరి. అటులు హార్దిక్యశరపీడితుఁడైన శిఖండిని గాంచి, సూతుఁ డారణరంగమునుండి యాతనిఁ దీసికొని పోయెను. అంత నప్పార్థు లాశిఖండి రథమధ్యమునఁ బడియుండుట నారసి కుపితులై యాకృతవర్మ నొక్కుమ్మడి చుట్టుకొన, నతఁ డద్భుతముగా నొకఁడే వారినెల్ల వారించెను. అంత నతఁ డప్పార్థులను, బాంచాలురను, సృంజయులను జయించి, చేదులను, కైకయులను బోకారిచి విజృంభింప, వారు ధైర్యము నిలుపుకొనఁజాలక యిటునటు పరువులిడసాగిరి. అటులు భీముఁడు మున్నగుపాండవుల నాకృతవర్మఁ డోడించి నిర్ధూమాగ్నివలె విరాజిల్లెను. అమ్మహారథులెల్లరును సమరము విడిచి విముఖులై నలుదెసలఁ జెదరిరి.” అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## సాత్యకి జలసంధుని వధించుట

“ఓరాజా! నన్నీవు ప్రశ్నించుచున్నాఁడవుగానఁ దెలిపెదను. శ్రద్ధమై వినుము. మహాత్ముఁడగుహార్దిక్యునిచేఁ బాండవబలము చెదరి, లజ్జావనతవదనమై నిలువ, నీవారెల్లఁ బ్రహృష్టాంతరంగులై యుండ, నటులగాధమునఁబడి మెట్టనేలనాశించు నప్పాండవులకు ద్వీపమునాఁదగి యాసాత్యకి యాకృతవర్మ నెదుర్కొనియెను. అంత నాహార్దిక్యుఁడు తీవ్రశరములచే నాసాత్యకిని నొప్పింప, నాసాత్యకి కుపితుఁడై యొకభల్లమాహార్దిక్యునిపైఁ బ్రయోగించి, మఱియు నాల్గుసాయకములనువైవ, నవి యాతనిగుఱ్ఱములను గొట్టి, ధనువు దునుమాడెను. మఱియు నాసాత్యకి యాహార్దిక్యునిసూతు నొప్పించి, యటులు విరథుఁడైయున్న యాతనిసైన్యమును మర్దింపఁజొచ్చెను. అటు లాసైన్యములనెల్ల శరపీడితములఁగా నొనర్చి, సత్యవిక్రముఁడగు నాసాత్యకి కడువడిగా

నచ్చోటినుండి వెడలిపోయెను. ఓరాజా! పరాక్రమనిధియగు నాతఁడు నీసైన్యమును నేమియొనర్చెనో యది తెలిపెదను వినుము. మహత్తర మగుద్రోణసైన్యమును దాఁటి, కృతవర్మ నోడించి, తనసూతునితో మెల్లగా 'ఓయీ! రథముపోనిమ్ము' అని పలికి రథాశ్వద్విపసంకులమై పదాతిజనసంపూర్ణమైన నీసైన్యమును జూచి, మఱియు నాసారథితో 'ఓసారథీ! చూచితే! దేనికి రుక్మరథుఁడు ముఖస్థానముననుండెనో యట్టి మేఘతుల్యమగు గజసైన్య మదె ద్రోణసైన్యమునకు సవ్యభాగమునఁ జూపట్టుచున్నది. ఓసూతా! దుర్నివారులగు ననేకులు దుర్యోధనసమా దిష్టులై నాకుఁగాఁ బ్రాణములనైన విడుచువారై విక్రమించి యుద్ధము చేయ సిద్ధముగానున్నవారు. మఱియుఁ ద్రిగర్తరథికులు సువర్ణమయ ధ్వజులై నాకభిముఖులై యుద్ధముచేయనున్నవారు. ఇందులకు నేను వడిగాఁ జేరునట్లు మనగుఱ్ఱములను దోలుము. ఆద్రోణుఁడు చూచు చుండఁగా నాత్రిగర్తులతోఁ బోరాడువాఁడను.' అని తెలుప నాత నితో సూతుఁ డటులే యని మెల్లగాఁ దనరథ మందులకుఁ బోనిచ్చెను. ఆదిత్యవర్ణమై భాసురమై పతాకవెలయురథముతో సారథివశ్యములగు నశ్వోత్తమము లందులకు వడిగా వెడలెను. అటు లాశంఖవర్ణములగు నశ్వములతో వచ్చుచున్న యాసాత్యకిని గజసైన్యముతో మనవీరులనే కులు చుట్టుకొని, లఘుహస్తులై వివిధములగుతీవ్రనారాచములఁ బెక్కు గురిసిరి. సాత్యకియు నాగజసైన్యముతోఁ బోరాడెను. వేసవితుదిని బెను మబ్బు వర్షముచేఁ బర్వతములనువలె వజ్రాశనితుల్యస్పర్శములగు బాణ ములచే నతఁ డాయేన్గులను నొప్పింప, నవి సంగ్రామరంగమును బరిత్య జించి పరువిడిపోయెను. మఱియు నవి యాసాత్యకి నారాచ వత్సదంత భల్లక్షురప్రాంజలికార్ధచంద్రాదులచేఁ బ్రహతములై దంతములు విఱిగి నవియు, కుంభములు వ్రయ్యలై రక్తములుగాఱునవియుఁ, జెవులు మొగములు తొండములు ఖండములైనవియు, సూతపతాకాశూన్యము లైనవియుఁ, జర్మఘంటాధ్వజాదులు దెగినవియు, మావంతులు గూలి నవియు నై పైనున్నకంబలములు జాఱ, నలుదెసల నఱచుచుఁ దిరుగు చుండెను. అటులే కొన్ని రక్తధారలను గార్చుచు, మూత్రపురీషముల విడుచుచుండెను. మఱికొన్ని పరిభ్రమించెను. కొన్ని తొట్రుపడియెను. కొన్ని మూర్ఛిల్లెను. వేఱొకకొన్ని పుడమిఁబడియెను. ఇటు లాసాత్యకి

యగ్నితుల్యములగుశరములచేఁ బీడితములై కుంజరము లన్నియుఁ బరువులిడసాగెను. అటు లాగజసైన్యము హతమగుఁడు, మహాబలుఁడగు జలసంధుఁడు శ్వేతాశ్వరథుఁడగు నాసాత్యకిపైఁ దనగజముతో నెదుర్కొనియెను. వాఁడు సువర్ణకవచధారియు, సువర్ణభుజభూషణుఁడును, గుండలమకుటభూషాలంకృతుఁడును, శుచియు శూరుఁడునై, చందనమలందికొని కాంతులీనెడిసువర్ణమాలికను దలధరియించి, సువర్ణనిష్కముగల సువర్ణకంఠసూత్రమును, వక్షమునబూని సువర్ణమయమగుధనువు ద్రిప్పుచు, నామత్తేభకుంభమున, గూర్చుండిఁ మెఱుపుతోఁగూడిన మేఘమునా వెలయుచుండెను. అటులు తనపైకి వడిగావచ్చు నామాగధుని యేన్గు నాసాత్యకి, సాగరమును వేలవలె నివారించెను. ఆశైనేయునిశరసమూహముచే నివారితమగు తనగజము నారసి, మహాబలుఁడగుజలసంధుఁడు కుపితుఁడై భారసాధనములగుసాయకములచే నాసాత్యకివక్షమునఁ గొట్టి, పచ్చనై తీవ్రమగు వేఱొకభల్లముచే శరములుగురియు నాశినిప్రసరుశరాసనమును ఖండించెను. అటులు విల్లుదెగియున్న యాసాత్యకిని జూచి నగుచు, మఱియు నామాగధుఁడు తీవ్రములగునైదు బాణములచే నొప్పించెను. ఆజలసంధుఁ డటులు తన్ను బహుబాణములచే నొప్పింప, గడుబలశాలియగుట నాసాత్యకి యందులకుఁ జలింపకుండెను. అది యద్భుతముగాఁ జూపట్టెను. పిదప నాసాత్యకి మిక్కిలి సంభ్రమింపకయే వేఱొకవిల్లుగొని నిలునిలుమని పలుకుచు, నాజలసంధునిగుండియలపై నఱువదిబాణములు ప్రయోగించి, యొకక్షురప్రముచే ముష్టిప్రదేశమునఁగొట్టి, వానిధనువు దునుమాడెను. అంత నాజలసంధుఁ డాశరాసనమును శరముతోఁగూడఁ బాఱవైచి, యొకతోమర మాసాత్యకిపై విసరెను. ఆతోమర మారమాధవుసోదరునిసవ్యభుజమును ఛేదించి, బుసకొట్టు మహోరగమువలెఁ బుడమిఁజొచ్చెను. అటులు సవ్యభుజము దూసికొనిపోవ, సత్యవిక్రముఁడగుసాత్యకి ముప్పదితీవ్రనారాచములచే నాజలసంధునిఁ గొట్టెను. అంత నాజలసంధుఁడు మహాబలుఁడై యొక ఖడ్గమును గేడెమును బూని యాసాత్యకిపై విసరెను. ఆకత్తి శైనేయు చాపము దెగనేసి, పుడమిఁబడియది యలాతచక్రమువలె నెంతయు విరాజిల్లెను. అంత నాసాత్యకి సకలాంగవిదారకమగు వేఱొకధనువుగొని సాలస్కంధసన్నిభమై పిడుగులువోని ధ్వనిగలయాధనువుచే నాజల

సంధు నొకబాణమున నొప్పించి, మఱియు నాభరణభూషితములై యున్న యాజలసంధునిబాహువులను రెండుతుురప్రములచే నవ్వుచుం దెగనేసెను. ఆరెండుబాహువులు నాయేన్గునుండి పుడమిం బడియెను. అయ్యవి పర్వతమునుండి జాఱు పంచశీర్షములుగల పాములువలె మాకుం జూపట్టెను. మఱియు నాసాత్యకి మూఁడవతుురప్రముచే సుదంష్ట్రమై సుందరకుండలమండితమైన వానితలను ఖండింప, తలయు బాహువులును దెగిపడి, భయంకరాకారమైయున్న యామొండెము నేలఁగూలెను. అంత నాతనియేన్గు రక్తసిక్తమై కానవచ్చెను. సాత్యకి యాజలసంధు నటులు చంపి, వడిగా నాగజస్కంధముననున్న విమానమును బుడమిఁబడఁద్రోసెను. అంత నాతనిమాతంగము రక్తసిక్తాంగమై నేలప్రేలాడునాసనము నీడ్చుకొనుచు, సాత్యకి శరపీడితమై పరువులిడుచు, నిజసైన్యమును ద్రొక్కుచు, ఘోరముగా నార్తనాదమొనర్చుచు, నాసంగ్రామభూమినుండి వెడలిపోయెను. ఓరాజా! అపుడు మన సైన్యమున హాహాకారములు జనించెను. ఆజలసంధుఁడటులు హతుఁడగుటఁ గాంచి నీయోధులెల్ల విముఖులై, పలాయనపరులై, శత్రుజయమున కిచ్ఛగింపక పరువులిడసాగిరి. ఓయీ! అంతలో నాద్రోణుఁడు తన వడిగలయశ్వములతో వెడలి యాసాత్యకిని దార్కొనియెను. అటులు గర్వితుఁడైనయాసాత్యకి నారసి, యకౌరవులు కుపితులై ద్రోణునితోఁ గూడ నాసాత్యకిని దలపడిరి. అపు డాసాత్యకితోఁ గౌరవులకును ద్రోణునకును దేవాసురయుద్ధతుల్యమగు ఘోరసంగ్రామ మారంభమయ్యెను." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

సాత్యకిచేఁ గృతవర్మ యోడుట

"ఓమహారాజా! అంత మనయోధు లాయత్తులై వడిగల్గి శరవ్రాతములఁగురియుచు నాసాత్యకితోఁ బోరాడిరి. అపు డాసాత్యకిని ద్రోణుఁడు డెబ్బదితీవ్రనారాచములచే నొప్పించెను. దుర్మర్షణుఁడు పండ్రెండింటను, దుస్సహుఁడు పదింటను, వికర్ణుఁడు ముప్పదింటను, సవ్యపార్శ్వాములను వక్షమునను గొట్టిరి. అటులే దుర్ముఖుఁడు పదింటను, దుశ్శాసనుఁ డెనిమిదింటను, చిత్రసేనుఁడు రెండింటను నాసాత్యకిని నొప్పించిరి. దుర్యోధనుఁ డాతనిపై శరవర్షమును గురిసెను. ఓరాజా! మఱియుఁ

దక్కంగల యోధులును నాసాత్యకిని నలుగెలంకుల నిరోధించిరి. అంత నావార్ష్ణేయుఁడు వారినెల్ల వేఱువేఱుగాఁ బ్రహరించువాఁడై భారద్వాజుని మూఁడిటను, దుస్సహునిఁ దొమ్మిదిటను, వికర్ణు నిరువదైదింటను, జిత్రసేను నేడిటను, దుర్మర్షణునిఁ బదిటను, వివింశతి నెనిమిదిటను, సత్యవ్రతునిఁ దొమ్మిదిటను, జయునిఁ బదింటను గొట్టి, విల్లు ద్రిప్పుచుఁ, బిమ్మట సువర్ణాంగదుఁడగు నీతనయు నెదుర్కొనియెను. అపుడు సర్వలోకాధీశుఁడును, సకలలోకమహారథుఁడునగు నాసుయోధనసాత్యకులకు ఘోరమైనపోరారంభమయ్యెను. వారిరువురును దీవ్రశరముల సంధించుచు, విడుచుచు, నన్యోన్యము నదృశ్యులుగా నొనర్చికొనిరి. ఆకురురాజుచే మిక్కిలి నొచ్చి, యవ్వివ్వచ్ఛుశిష్యుఁడు చందనము నిజరసమునువలె రక్తము స్రవింపఁజేసి విరాజిల్లెను. అటులే యాసాత్యకిచే నీతనయుఁ డెంతయు నొచ్చి, సువర్ణశిరోభూషణముగల యున్నతయూపమువలెఁ జలించెను. ఓరాజా! ఆసాత్యకి నీతనయునిధనువు నొకక్షురప్రముచే ఖండించి, విల్లు దెగియున్నయాతనిఁ బెక్కుబాణములచే నొప్పించెను. అంత నీతనయుఁ డటులునొచ్చి, శత్రునివిజయలక్షణమున కోరువక, సువర్ణపృష్ఠమగు వేఱొకవిల్లుగొని యాసాత్యకిని వడిగా సాయకశతముచే నొప్పింప, నాతఁడును నీతనయునిచే నతివిద్ధుఁడై క్రుద్ధుఁడై నీపుత్త్రు నెంతయుఁ బీడించెను. అటులు పీడితుఁడైయున్న తమయన్నను జూచి మహారథులగు నీపుత్త్రులు సాత్యకిని శరవర్షముచేఁ గప్పిరి. మహారథులై యనేకులగు నీపుత్త్రులశరాసారముచే నటులు గప్పఁబడి, యాసాత్యకి వారి నొక్కొకని నైదేసిబాణములచే నొప్పించి, మఱియు నేడేసిబాణములచేఁ గొట్టి, పిదప నాసుయోధను నొప్పించి, నవ్వుచుఁ గొన్నిశరములచే వైరిభీషణమగు నాతనికార్ముకము దెగనేసి, మణిమయమగునాగమును ధ్వజమును గూలద్రోసి, నాల్గుబాణములచే గుఱ్ఱములు నాల్గిటిని దునుమాడి, యొకక్షురప్రముచే నాసుయోధను సారథినిసైతముఁ బడఁద్రోసెను. ఆటులొనర్చి, మఱియు నాసాత్యకి మోదమానమానసుఁడై మర్మభేదకములగు పెక్కుబాణములచే నాసుయోధను నోనాటనేయ, నందుల కోరువఁజాలక యతఁడు వడిగా వెడలి చిత్రసేనురథముపైకి దుమికెను. అటు లాసాత్యకిచే నాకసమున రాహు

వుచే సోముఁడువలె మ్రింగఁబడుచున్న యన్నరాధిపు నారసి, జగమంత
టను హాహాకారమొదవెను. ఆచప్పుడు విని మహారథుఁడగుకృతవర్మ
వడిగా వెడలి ధనువుద్రిప్పుచు, గుఱ్ఱములను బ్రేరించుచు, సారథితో
'వడిగాఁ దోలు' మని పలుకుచు నాసాత్యకిని మార్కొనియెను. నోరు
తెఱచివచ్చు యముఁడునాఁదగు నాతనిఁ గాంచి, యాసాత్యకి తన
సారథితో 'ఓయీ! ఇదె కృతవర్మ శరశరాసనధరుఁడై వచ్చుచున్న
వాఁడు. సర్వధన్విప్రవరుఁడగు నాతని కెదురుగా రథము పోనిమ్ము.'
అని పలికి యథావిధిగాఁ గల్పింపంబడి జవనాశ్వములు గల్గినరథముతో
నాభోజుని సమీపించెను. పిదప వారిరువురును గుపితులై ప్రజ్వలిత
పావకులై బెబ్బులులవలె వడిగాఁ గలిసిరి. అపుడు కృతవర్మ యాశై
నేయు నిరువదాఱుబాణములచే నొప్పించి, తీవ్రములగు నైదుబాణము
లచే సూతుని, నాల్గుబాణములచే గుఱ్ఱముల నాల్గిటిని నొప్పించి, సువర్ణ
ధ్వజుఁడై, సువర్ణపృష్ఠమగుధనువు నెక్కిడి, సువర్ణకవచుఁడై సువర్ణ
పుంఖములగుబాణములచే నివారించెను. పిదప నాశైనేయుఁ డాకృత
వర్మ నెనుబదిసాయకములచేఁ గొట్టి, వడిగా నాధనంజయునిఁ జూచు
వాఁడై యుండెను. అటు లాసాత్యకిచేఁ బ్రహతుఁడై యాభోజుఁడు
భూకంపమునఁ బర్వతమువలెఁ జలించెను. మఱియు నాసాత్యకి యఱు
వదిమూఁడుబాణములచేఁ గృతవర్మనశ్వములను, నేఁడిటిచే సారథిని
గొట్టి, సువర్ణపుంఖమగు నొకవిశిఖమును సంధించి, కుపితమైనపన్నగము
నాఁదగు విషజ్వాలలుగ్రక్కు నద్దానిచే నాకృతవర్మనిఁ గొట్టెను.
యమదండతుల్యమగు నాశర మాతని సువర్ణచిత్రితమైనవర్మమును
భేదించి, రక్తసిక్తమై, యుగ్రమై పుడమిఁజొచ్చెను. అంత నాకృతవర్మ
సాత్యకిబాణపీడితుఁడై రక్తము స్రవింప శరశరాసనముల విడిచి రథో
త్తమమునుండి పడియెను. అమేయవిక్రముఁడై సింహదంష్ట్రమునాఁదగు
నాతఁ డటు లాసాత్యకిశరపీడితుఁడై రథోపస్థమున మోఁకాలఁబడు
టయు, సహస్రబాహుతుల్యుఁడును సాగరసన్నిభుఁడునగు నాకృతవర్మ
నటు లోడించి, యాసాత్యకి యచ్చోటునుండి వెడలి ధనుశ్శక్తి ఖడ్గా
దులచే నిండి, గజాశ్వరథసంకులమై వందలకొలంది క్షత్రియులరక్త
ముచే నుగ్రమైన సర్వసైన్యములును జూచుచుండ, నాసేనామధ్యము
నుండియే, నిర్భయముగఁ బోవుచు, నింద్రుఁడు రాక్షససైన్యమునువలె

మునసైన్యమును భేదించుచు విక్రమించెను. అంతఁ గొంతవడి కాహార్దిక్యుఁడు తెప్పిఱిల్లి, వేఱొకవిల్లుపూని పాండవులను వారించుచునందుండె" నని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## సాత్యకి ద్రోణాదులపై విక్రమించుట

ఓరాజా! అటు లాసాత్యకిచే మనసైన్యములెల్లఁ జలింప, నాభారద్వాజుఁడు మహత్తరములగు నిజశరవ్రాతములచే నాతనిఁ గప్పెను. ఆద్రోణసాత్యకుల కపు డెంతయు సమ్మర్దమగు సంగ్రామ మారంభమయ్యెను. బలివాసవులు నాఁదగు వారిరువురను సర్వసైన్యములును గాంచఁగడంగిరి. అంత నాద్రోణుఁ డాసాత్యకినుదుటఁ జిత్రములును, విషసర్పతుల్యములునగు మూఁడుబాణములచే నొప్పించెను. లలాటముననాటిన యామూఁడుకోలలచే నాసాత్యకి మూఁడుశృంగములుగల కొండవలెఁ జూపట్టెను. మఱియు నాద్రోణుఁ డవకాశమును గనిపెట్టి పిడుగులచప్పుడువోలు చప్పుడుగలబాణములను బ్రయోగింప, నవివచ్చుచుండఁగనే రెండురెండువిశిఖములచే నాసాత్యకి ఖండించెను. ఓరాజా! అంత నాద్రోణుఁ డాతనిశరలాఘవము నారసి, నగుచు మఱియు ముప్పది నారసము లాతనిమేన నాటి, మఱియు నాసాత్యకి హస్తలాఘవమును మించునట్లుగా నేఁబదినారాచముల నాతనిపైఁ బరపెను. ఓరాజా! కుపితములై పుట్టనుండి వెడలు మహాసర్పములునాద్రోణునిరథమునుండి వెడలుచు, నవి శరీరచ్ఛేదకములై పడుచుండెను. అటులేసాత్యకిచేఁబ్రయుక్తములగు శరసహస్రములు, రక్తపాయులై ద్రోణునిరథము నావరించియుండెను. ఓమారిషా! ఆద్రోణసాత్యకులశరలాఘవమున భేదమును గనిపెట్టఁజాలకుండితిమి. వారిరువురును దుల్యులైయుండిరి. పిదప సాత్యకి యాభారద్వాజునిఁ దొమ్మిది నతపర్వములగు సాయకములచేఁ గొట్టి, ధ్వజమును జలింపఁజేసి, నూఱుబాణములచేసారథిని నొప్పించి తన శరలాఘవమును మెఱయించెను. ద్రోణుఁడాతనిశరలాఘవమును గాంచి డెబ్బదిబాణములచే సారథినిగొట్టి, మూఁడేసిబాణములచే గుఱ్ఱములను బ్రహరించి, యాసాత్యకిరథముపైనున్న ధ్వజము నొకబాణముచే ఖండించి, మఱియు నొకభల్లముచే మహాత్ముఁడగు సమ్మాధవునివిల్లు ద్రొల్లనేసెను. అంత నాసాత్యకి కుపితుఁడై యాధనువు విడిచి గొప్ప

గదనుబూనియాభారద్వాజునిపై విసరెను. అయోమయమై పట్టబద్ధమై వచ్చునాగదను, బహువిధములగుబాణములచే నాద్రోణుఁడు నివారించెను. సత్యవిక్రముఁడగు నాసాత్యకి వేఱొకవిల్లుగొని శిలాశితములగు పెక్కుబాణములచే వీరుఁడగుభారద్వాజుని నొప్పించెను. అటులుకొట్టి యతఁడుసింహనాద మొనరింప, నందులకోరువక యాభారద్వాజుఁడొకశక్తిని గొని, వడిగా నక్కవ్వడిశిష్యునిరథముపైఁబరపెను. ఆశక్తియాశైనేయునిఁజేరక వానిరథమును భేదించి, దారుణధ్వనితో ధారుణిఁజొచ్చెను. ఓరాజా! పిమ్మట నాద్రోణు నాసాత్యకి యొరబాణముచే దక్షిణభుజమును బీడించునట్లు వైవ ద్రోణుఁ డాసాత్యకిధనువు దునుమాడి, సారథి నొకయర్ధచంద్రముచే నొప్పించెను. అంత నాసాత్యకిసారథి మూర్ఛమునిఁగి, రథమధ్యమునఁబడి రెండుగడియ లటులే యుండెను. ఓరాజా! అపు డాసాత్యకి సూతకృత్యమును దానే జరిగించుకొనుచు, బగ్గములను బట్టుకొనియె యాద్రోణునితోఁ బోరాడెను. అటులు వెనుదీయక యతఁ డాద్రోణునిశరశతముచే నొప్పింప, నాతనిపై యాభారద్వాజుఁ డైదుబాణములను బ్రయోగించెను. ఆఘోరశరము లాతనికవచమును భేదించి, రక్తపాన మొనర్చెను. అటులుఘోరశరప్రహతుఁడై యాసాత్యకి యెంతయుఁ గోపమడరఁ గొన్నితీవ్రనారాచముల నాతనిపైఁ బ్రయోగించి, మఱియు నాతనిసూతు నొకబాణముచేఁ బడఁద్రోసి, మరికొన్నిబాణములచేఁ గొట్టి, గుఱ్ఱములను రణరంగమునుండి వెడలునట్లుగాఁజేసెను. ఓరాజా! భ్రాజమానుఁడగుభానుని వలె, నాసాత్యకి మఱియు సరథుఁడై మండలగతుల నారణరంగమునఁ జరించుచుండ 'ఆహా! ద్రోణునియశ్వములఁబట్టి నిలుపుఁడు, పరువులిడుఁడు, పట్టుకొనుఁడు' అని యందలి రాజపుత్రులెల్ల నాక్రోశించిరి. అంత మనరథికులెల్లరును సాత్యకినివిడిచి ద్రోణుఁడున్నకడకువడిగా వెడలిపోయిరి. అటులు సాత్యకి శరపీడితులై ద్రోణునిఁజేరినవారినెల్ల నారసి, మఱియు నీసైన్యము భగ్నమై యాకులమగుడు, మఱల నాద్రోణుఁ డెప్పటి చొప్పున వ్యూహముఖద్వారమునకుఁ బోయెను. సాత్యకిశరపీడితములగు నాద్రోణునిగుఱ్ఱములు గాలివలె వెడలి రథమీడ్చికొనిపోవ, నతఁడు పాండుపాంచాలసంభిన్నమై చెదరిన తనసైన్యము నారసి దానిని రక్షించుటకే యత్న మొనరించెను. అటు లాతఁ డావ్యూహముఖమున నిలిచి

కుపితుఁడై యుదయకాల సూర్యుఁడునాఁదగి యప్పాండుపాంచాలుర నివారించుచుండె” నని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## సాత్యకిచే సుదర్శనుఁడు చచ్చుట

“ఓరాజా! పురుషప్రవీరుఁడగు నాసాత్యకి యటు లాద్రోణుని జయించి, కృతవర్మ మున్నగు నీవారి నోడించి, తనసూతునితో ‘ఓయీ దారుకానుజా! మన మీజయమున నిమిత్తమాత్రమనుకొమ్ము. అవ్వాసుదేవార్జునులే వైరులనెల్ల దహించిరి. అప్పార్థునిచే హతులైనవారినే మనము చంపుచున్నవారము’ అని పలుకుచు, నామహారణరంగమున నుగ్రధనుర్ధరుఁడై వైరులనోడించువాఁడై శరపరంపరలఁగురియుచుఁ డేగ యామిషమునకువలె వడిగా వెడలిపోవుచుండెను. అటులు శంఖవర్ణములగునశ్వములతో సైన్యమును జొచ్చి పోవుచున్నయావృష్ణివీరునారసియు, సహస్రభానుభాసమానమగు నాతనిరథమును మనవారెవ్వరును నివారింపఁజాలరైరి. ఓభరతోత్తమా! అసహ్యవిక్రముఁడై మహాబలము వెలయ నింద్రప్రభావుఁడై, వేసఁగిసూర్యుఁడువలెనున్న యాసాత్యకిపైఁ గోపమడరఁ జిత్రయోధియగుచు శరాసనసువర్ణకవచములను ధరించి, రాజోత్తముఁడగు సుదర్శనుఁ డాతనిఁ దలపడియెను. ఓరాజా! వారిరువురకును దారుణమగు సంప్రహారమయ్యెను. అపుడు నీయోధులును, సోమకులును, వృత్రామరాధీశులయుద్ధమునువలెవారియుద్ధమును బ్రశంసింప నారంభించిరి. ఓరాజా! అంత నాసుదర్శనుఁడు సాత్యకిపై వందలకొలఁది తీవ్రబాణములను బ్రయోగింప, వాని నాసాత్యకి త్రోవ నడుమనే తెగనేసెను. అటులే సాత్యకిప్రయుక్తములగు సాయకముల నెల్లఁ దనదివ్యబాణములచే నతఁడు రెండుమూఁడుఖండములుగాఁ జెండుచువచ్చెను. అంత నాసుదర్శనుఁడు మఱియుఁ దనబాణములాసాత్యకిసాయకములచే హతములగుడుఁ, గుపితుఁడై ప్రజ్వలించు సూర్యుఁడునా వెలయుచు, సువర్ణచిత్రితములగు బాణములను బ్రయోగించి, మఱియు నగ్నితుల్యములైనమూఁడుబాణము లాకర్ణాంతముగా దివిచి విడువ, నవి యాసాత్యకికవచమును ఛేదించి శరీరమునుజొచ్చెను. మఱియు నారాజపుత్రుఁడు, రజతకాంతులు వెలయఁ బ్రజ్వలించు వేఱొకనాల్గుబాణములను వింటసంధించి, యాసాత్యకిగుఱ్ఱములను బ్రహ

రింప సాత్యకి నేయుఁడు వాసవతుల్యపరాక్రముఁడై వడిగలసాయకములచే నాసుదర్శనుని గుఱ్ఱములను గొట్టి, సింహనాద మొనర్చెను. పిదప మఱియు నాసాత్యకి పిడుగువంటి యొకతీవ్రభల్లముచే నాసుదర్శనుని సూతునితలఁ దెగనేసి, కాలానలసన్నిభమగు వేఱొకక్షురప్రముచేఁ గుండలమండితమై పూర్ణచంద్రుఁడునావెలయు నారాజపుత్త్రు మొగ మును దేహమునుండి తప్పించి, మున్నాయింద్రుఁడు బలాసురునివలెఁ బుడమిఁ బడఁద్రోసి, పరమానందభరితుఁడై విరాజిల్లెను. పిమ్మట నమ్మహ నీయుఁడు మఱల నెప్పటిచొప్పున నప్పార్థుఁడున్నకడకు వెడలి, నీవారి సైన్యములను నివారించుచు, జవనాశ్వములుగల తనరథముతోఁ బోవుచు, లోకమునకు విస్మయముగల్గించెను. అచ్చెరువొదవించు నాతని యద్భుతవిక్రమమునకు యోధులెల్ల నాతనిఁ గొరవించిరి. అతఁడును, హుతభుజుఁడునాఁ దనకంటఁబడిన వైరులనెల్లఁ గాల్చుచు వచ్చెను" అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## సాత్యకి యవనుల నోడించుట

"ఓరాజా! మహనీయుఁడును,ధీశాలియునగు నాసాత్యకి యటులా సుదర్శనునిఁ జంపి తనసారథితో 'ఓయీ! గజరథాశ్వసంకులమై శరశక్త్యా దులె తరంగములుగా, ఖడ్గములె మత్స్యములై, గదలే మొసళ్లై, శూరులయాయుధములచప్పుడు లుప్పతిలఁ బ్రాణహానికరమై, రౌద్రమై భేరీమృదంగాదినాదములు రోదోకుహరము నిండ, యోధులకు సుఖస్పర్శ ముగాక, జిగీషువులకు దుర్ధర్షమై, యెవ్వరికిని దరింపరాని ద్రోణునిసైన్య సాగరము నెటులో దాఁటితిమిగదా! ఇఁక జలసంధునిబలముచే రాక్ష సులచేవలె నావృతమై కొంత మిగిలియున్న సైన్యమును జిన్ననదినివలె మనమిపుడు తరింపవలసియున్నది. కావునఁ దొట్రుపాటులేక వడిగా మనగుఱ్ఱములను నడుపుము. ఇపు డప్పార్థుఁడు చేతికందినట్లున్న వాఁడని తలంతును. దుర్జేయుఁడగు ద్రోణుని సపరివారముగా జయించి, యోధ వర్యుఁడగుకృతవర్మ నెపుడు మనము గెలిచితిమో యపుడే ధనంజయునిఁ జేరితి మనుకొనవచ్చును. శుష్కతృణావృతమగువనము ప్రదీప్తాగ్నికివలె నీఁక నాకెన్నిసైన్యములు గానవచ్చినను నించుకేని భయముగలుగలేదు. పాండవముఖ్యుఁడగు కిరీటియున్న యాప్రదేశమును జూడుము. గజరథా శ్వపదాతు లెక్కుడుగాఁ బడుటఁ బుడమి నిమ్నోన్నతమై గానవచ్చు

చున్నది. అమ్మహాత్మునిచే భగ్నమై కౌరవసైన్య మదె చెదరిపోవు చున్నది. ఓసారథీ! గజరథాదు లెట్లు పరువులిడుచున్నవో చూడుము. అదె యెట్టుపట్టుబట్ట నాధూళి యెగురుచున్నది. అటులగుటఁ గృష్ణ సారథియగు శ్వేతవాహనుఁ డిచ్చోటికిఁ జేరువైయుండునని తలంప వచ్చును. అమేయతేజమగు నాగాండివముధ్వని యదె వినఁబడుచున్నది. సూర్యుఁ డస్తమింపకమున్నే మనయర్జునుఁ డాసైంధవుని మడియించు నట్టిశుభశకునములు నాకగపడుచున్నవి. కావున, నాశత్రుసైన్యమున్న కడకు మచ్చికమీఱ మనగుఱ్ఱములను మెల్లఁగాఁ దోలుము. అందు సుయోధనాదులగు యోధులు క్రూరకర్ములై రణగర్వితులైయున్నవారు. మఱియు నచ్చోట సన్నద్ధులై శరశరాసనధరులై యవనులు, దరదులుఁ, గిరాతులు, బర్బరులుఁ, దామ్రలిప్తకులు, నింకను మఱికొందఱు మ్లేచ్ఛులును నాయుధపాణులైయున్నవారు మఱియు నాసుయోధనాదులు నాతోఁబోరాడ నభిముఖులై యున్నవారు. ఇఁక నీరథగజాశ్వపదాతులను జంపి మహాఘోరమైయున్న యీగట్టుగడచితిమనియే తలంపుము.' అని తెలుప విని యాసూతుఁ డాతనితో ని ట్లనియె.

'ఓశినిప్రవరా! సత్యపరాక్రముఁడవగు నీయెదుట నాపరశురాముఁడున్నను నాకుఁ దొట్రుపాటు గలుగదు. ఓమహాభుజా! రథికశ్రేష్ఠుఁడగు ద్రోణుఁడుగాని, కృపుఁడుగాని, మద్రేశ్వరుఁడుగాని నిన్ను మాఱ్కొనఁగాక. నిన్నాశ్రయించియున్న నాకు వెఱపన నేమిటి? ఓ శత్రుసూదనా! నీవు సన్నద్ధులై, క్రూరకర్మలై, రణగర్వితులగు కాంభోజులను, శరశరాసనధరులైన యవనులును, శకులును, గిరాతులును, దరదులు, బర్బరులు, తామ్రలిప్తులు, మఱికొందఱుమ్లేచ్ఛులును నాయుధపాణులై యున్నను, యుద్ధమున వారినెల్ల జయించితివి. నాకపుడు లేని సంభ్రమ మిపు డెందులకు? ఓధీరాగ్రణీ! గోష్పదప్రాయమగు దీనిని దాఁటు టెంతపని? నిన్నిపు డేమార్గమున ధనంజయునిఁ బొందింపవలయును? నీకెవ్వరిపైఁ గోపముగల్గెను? ఇపు డెవ్వరికి మృత్యువు తటస్థించెను? ఎవ్వరిమనము సంయమనీనగరప్రయాణమున కుత్సహించుచున్నది? యుద్ధమున విక్రమించి కాలాంతకతుల్యుఁడవగు నిన్నుఁగాంచి యెవ్వరు పరువులిడరు? ఓమహాభుజా! ఇపు డెవ్వరినాయముఁడు స్మరించుచున్నవాఁడు?'

అది విని యాసాత్యకి 'ఓదారుకానుజా! వాసవుఁ డాదానవులనువలె నిమ్ముండుల నిదె చంపెదను. ఇక్కాంభోజులను జంపి నా ప్రతిజ్ఞ నెఱవేర్చికొనెదను. కావున నందులకే పదము. ఇపుడు వీరితో యుద్ధమొనర్చి, ప్రియుఁడగు పాండవమధ్యమునిఁ జేరెదను. సుయోధనాదులగు కౌరవులు నావిక్రమ మిప్రుడు గాంచఁగలరు. ఓసారథీ ! సకల సైన్యములందును ముండులసైన్యము హతమయ్యెనేని, కౌరవసైన్యములు చెదరును. వారిఘోరారావమును విని సుయోధనుఁడు పరితపింపకమానఁడు. పాండవముఖ్యుఁడును, శ్వేతాశ్వుఁడును, మహాత్ముఁడునగు నాయాచార్యుఁడు చూపినత్రోవనే యిపుడు చూపింతును. మఱియు నిపుడు నాసాయకములచేహతులైన యోధముఖ్యులను వేపురఁ గాంచి యాసుయోధనుఁడు పశ్చాత్తాపము నొందకమానఁడు. నేనిపుడు నాహస్తకౌశల మేర్పడ సాయకములను బ్రయోగించుచు, నగ్నిచక్రమునువలె నాధనువు ద్రిప్పుచుండఁ గౌరవులు గాంతురు. నాసాయకములచే, నొడళ్లు వ్రయ్యలై రక్తములు స్రవింపఁ జచ్చుచున్న తనసైనికుల నారసి, యారాజరాజు పరితపింపక మానఁడు. నే నిపుడు కుపితరూపుఁడనై యోధులగువారినెల్ల వధించుచుండ నాసుయోధనుఁ డీలోకము నర్జునద్వయముగలదానిఁగాఁ దలంపక తప్పదు. ఈసంగ్రామమున నాచే ననేకులు రాజులు హతులగుటఁ గాంచి, యాసుయోధనుఁడు పరితపించును. ఓయీ! నే నిపుడు మహాత్ములగుపాండవులయెడఁ గలభక్తిని స్నేహమును జూపి, రాజసహస్రములను జంపుదును. అపుడు నాబలపరాక్రమములను బాండవులెడ నాకుఁ గలకృతజ్ఞతను గౌరవులు దెలియకమానరు.' అని పలికెను.

ఓయాంబికేయా ! ఇటు లాసాత్యకి తెలుప విని, యాతని సూతుఁడు, శిక్షితములై లెస్సగాఁ బరువులిడు తెల్లనిగుఱ్ఱముల నెంతయుఁ బ్రోత్సహించి నడిపెను. పిదప మనోవాయువేగముగల యా మంచిగుఱ్ఱము లాకసమును ద్రావునవివోలె వడిగా, సాత్యకి నాయవనులకడకుఁ దీసికొనిపోసాగెను. అంత నాసాత్యకిని సమీపించి మన సైన్యములలోఁ గలవెక్కురు, తమహస్తలాఘవము వెలయ శరములఁ గురిపింపఁజొచ్చిరి. ఓరాజా! వారి నారాచములను, నస్త్రములను, దన తీవ్రసాయకములచే నాసాత్యకి తెగనేయుచుండుట, నయ్యవి యాతని

చేరువనైనఁ జేరఁజాలకుండెను. మఱియు నతఁడు సువర్ణపుంఖములును, దీవ్రములునై గ్రద్దఱెక్కలుగల్గి తిన్నగా వెడలునట్టిబాణములచే నా యవనులభుజములను, దలలను దెగనేయుచు, నినుపచిక్కములుగల కంచుకవచములను భేదించుచు, వారినెల్ల నేలఁ గూల్చుచుండెను. వీరుఁడగు నాసాత్యకిచే నటు లాల్లేచ్ఛులు హతులగుచు గతాసులై, వందలకొలందిగా నారణరంగమునఁ బడిరి. మఱియు నతఁడు గట్టిగాఁ దివిచి విడిచినబాణములచే నొక్కొకపరి నేవుర, నార్వుర, నేడ్వుర, నెనమండ్రను జంపుచువచ్చెను. వేవురకొలఁది కాంభోజులయు, శకులయు, శబరకిరాతబర్బరులయు, మాంసశోణితకర్దమములచేఁ బుడమినెల్ల నగమ్యముగా నొనర్చి, నీసైన్యమునెల్ల నాశైనేయుఁడు రూపుమాపెను. బోడితలలును, బోడుగుగడ్డములును గల్గినదస్యులతలలచే బర్హములులేనిపక్షులచేవలెఁ బుడమి వ్యాపించియుండెను. ఎఱ్ఱనిమేఘములచే నాకసముచలె రక్తసిక్తాంగములగు మొండెములచేఁ బుడమియెల్ల నావృత మైయుండెను. వజ్రప్రహారమును బిడుగులనుబోలిన యాసాత్యకి బాణప్రహారములచే సకలసైన్యములును నిహతములై పృథివి నాక్రమింప, నల్పావశిష్టులై భంగమొంది, చైతన్యములెడలిన మనసైన్యములవా గాసాత్యకిచే నపజయమొంది, మడమలతోడను, గశాహతులతోడను దమగుఱ్ఱములను హెచ్చరించుచు, నెంతయు జడిసినవారగుటఁ గడువడిగాఁ బరువులిడ నారంభించిరి. ఓరాజా! అటు లాసాత్యకి దుర్జయమగుకాంభోజసైన్యమును యవనులసేనను, శకులబలమునుజయించి, నీవారినెల్లఁ గొట్టి, తనసూతునితో 'రథము వెడల నిమ్మని' ప్రోత్సహించెను. మున్నెవ్వరు నొనర్పనియద్భుతకృత్యమొనర్చినయాతనివిక్రమము నారసి, చారణులును, గంధర్వులును నెంతయుఁ బూజించిరి. అటు లతఁ డర్జునునకుఁ బృష్టచారియై రక్షకుఁడై యుండుట నాగసి, చారణు లానందించిరి. నీవారును నాతని గౌరవించిరి." అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

## సాత్యకి దుర్యోధనాదులతోఁ బోరుట

"ఓరాజా! ఆసాత్యకి, యవనకాంభోజులను జయించి, నీవారి సైన్యమునడుమనుండి యర్జునుని సమీపింప వెడలెను. చక్కనిదంష్ట్ర

లును, విచిత్రములగుకవచధ్వజములునుగల్గి వ్యాధుఁడు మృగమునువలె నీసైన్యమునకు వెఱపుగొల్పుచుఁ, గొట్టుచు, రథమార్గములఁ జరించుచు, ధను వెంతయుఁ ద్రిప్పుచు, సువర్ణమయశిరస్త్రాణాంగదములు వెలయ సువర్ణకవచావృతుఁడై, సువర్ణధనుర్ధ్వజములతో మేరుశిఖరమునా నతఁడు చూపట్టెను. ధనువు మండలముగాఁ, దేజమే కిరణములుగా, శరత్కాలసూర్యుఁడునా నతఁడు వెలయ, నపుడు సూర్యులిరువురు ప్రకాశించుట యూహింపఁదగియుండెను. వృషస్కంధుఁడును, వృషభాక్షుఁడునై యతఁడు నీవారిసైన్యములనడుమ, గోవులనడుమనున్న వృషభమువలెఁ గాంచఁదగియుండెను. మదించినయేన్గువలె నడుచునట్టియు, మత్తగజసన్నిభుఁడై, యూథమధ్యముననున్న మత్తమాతంగమునాఁదగు నాతనిపై బెబ్బులులవలె నీవారు కవిసిరి. ఓరాజా! అటులు ద్రోణసైన్యమును గడచి, దుస్తరమగుభోజసైన్యము నతిక్రమించి, జలసంధసైన్యసాగరమును దాఁటి, కాంభోజసేనామహానదిని దరించి, కృతవర్మఁడ నెడిమొసలినుండి విడివడివచ్చిన యాసాత్యకి నెదుర్కొని, కుపితులై దుర్యోధన, దుశ్శాసన, వివింశతి, చిత్రసేన, శకుని, దుస్సహ, దుర్ధర్షణ, క్రథులగు నీతనయులును, మఱియు దుర్జేయులును నాయుధపాణులునగు మఱికొందఱు శూరులును నాతనిఁ జుట్టుకొనిరి. తమవెనుకవచ్చుచున్న సాత్యకిని నీవారు వెనుదవ్వులుచుండ మనవారిసైన్యమున గొప్పచప్పు డుప్పతిల్లెను. అపుడాసైన్యముగాలిచేఁ గదలినసాగరమువలెఁ జూపట్టెను. అటులు వచ్చుచున్న వారినెల్ల నారసి, యాసాత్యకి 'ఓసారథీ! మనరథ మిఁక మెల్లగా నడుపుము. ఇదెధార్తరాష్ట్రబలము మెండై నిండియున్నది. అదియు నాపైవే గజాశ్వరథపదాతులతో వడిగా వచ్చుచున్నది. ఓయీ! మనరథారావముచే నలుగడలఁ బూరించుచుఁ బృథివ్యంతరిక్షములు కంపింప, సాగరములు చలింప, నీవచ్చుసైన్యసాగరమును నివారింపవలయును. పౌర్ణమినాఁటిసాగరమును, వేలవలె నిదె యీసైన్యము నాపి యింద్రునివలె విక్రమించెదను జూడుము. గజరథాశ్వపదాతులతో నీశత్రుసైన్యముల నిదె నా తీవ్రశరపరంపరలచేఁ జంపెదను జూడుము. వీరెల్ల నాశరాగ్నికిఁ బాలై వేలకొలఁది, బూడిదగానున్నారు.' అని యాసాత్యకి పలుకుచుండఁగనే యుద్ధాభిలాషమెయిఁ మనసైన్యము లాతని సమీపించెను. అందుఁ

గొందఱు 'కొట్టుము, పరువిడుము, చూడుము, చూడుము, నిలువబడుము.' అని పలుకఁజొచ్చిరి. అటులు వారనుకొనుచుండఁగనే యా సాత్యకి తనవాఁడికోలలచే మూఁడువందలగుఱ్ఱములను, నాల్గువందల యేన్గులను గొట్టెను. అపుడు వారితో నాతనికి, దేవాసురులకువలెగొప్ప సంకులసమరమయ్యెను. జనక్షయమగుచుండెను. మబ్బులమూఁకనాఁదగు నీవారిసైన్యమును సర్పతుల్యములగు శరములచే నాసాత్యకి నిగ్రహించెను. ఓమహారాజా! అంత నాసాత్యకి మనవారిశరపరంపరచేఁ గప్పంబడియు నించుకేనిఁ దొట్రుపడక, యతఁడు పెక్కురను వధించెను. ఓ రాజేంద్రా! మనసైన్యము భ్రష్టవాహనమై, యచ్చెరువొందవించెను. ఆసాత్యకి సాయకమొక్కటియు వ్యర్థము గాదయ్యెను. మఱియు రథనాగాశ్వసంకులమై, పదాతితరంగసమాకులమై సాత్యకి యనెడివేలను దాఁకిఁ నీసైన్యసాగరము గదలనేరక మఱియు మఱియు నందే తొట్రుపడుచు, నాతనిసాయకముల కగ్గమై హతమగుచుఁ, జలికి నోరువనిగోవులునా నందందే పరిభ్రమింపసాగెను. ఓరాజా! ఆసాత్యకి సాయకములచేఁ గొట్టుపడనిగుఱ్ఱమును, బదాతిని, రథికుని, గజమును, రౌతును గాంచఁజాలనైతిని. ఓరాజా! అట్టియుద్ధ మప్పార్థుఁడును జేయలేదు. ఆశైనేయుఁ డాయర్జునునిమించి ప్రజాక్షయ మొనర్చెను. ఇంతయేల ఆసాత్యకి, జంకులేక హస్తశరలాఘవములుగల్గి తననైపుణ్యమెల్లఁ జూపెను. పిమ్మట సుయోధనుఁ డాసాత్యకిసూతుని, మూఁడుబాణములచేఁ గొట్టి, నాల్గుబాణములచేనాల్గుగుఱ్ఱములను నొప్పించి, సాత్యకిని మూఁడువాఁడికోలలచేఁ బ్రహరించి, మఱియు నెనిమిదిబాణములచే నొనాటనేసెను. పిదప దుశ్శాసనుఁడు పదునాఱుబాణములచేతను, శకుని యిరువదైదుసాయకములచేతను, జిత్రసేనుఁ డైదిటను, దుస్సహుఁడు పదునైదిటను, మఱియు నాతనివక్షమున నొప్పించిరి. ఓరాజా! ఆవృష్ణి శార్దూలుఁడగు సాత్యకి యటులు వారిబాణములచేఁ బ్రహతుఁడై, గట్టిగా నగుచు, వారినెల్ల మూఁడుమూఁడుబాణములచే నొప్పించెను. మిక్కిలి తీవ్రములగుబాణములచే వారినెల్ల నొప్పించి,లఘువిక్రముఁడై యతఁ డారణరంగమున డేగవలెఁ జరించుచు, మఱియు శకునివిల్లు దునుమాడి, హస్తావాపమును ఖండించి, సుయోధనుని మూఁడుబాణములచే వక్షమున నొప్పించెను. అటులే చిత్రసేనుని నూఱిటను, దుస్స

హునిఁ బదిటను, దుశ్శాసను నిరువదింటను నొప్పించెను. పిదప నీబావ యగుశకుని వేఱొకవిల్లుగొని, యాసాత్యకి నెనిమిదిబాణములచేఁ గొట్టి, మఱియు నైదుబాణములచేఁ బ్రహరించెను. పిదప దుశ్శాసనుఁడు పదింటను, దుస్సహుఁడు మూఁడిటను, దుర్ముఖుఁడు పండ్రెండింటను నాసాత్యకిని గొట్టిరి. ఓభారతోత్తమా! అపుడాసుయోధనుఁడు మూఁడుబాణములచే నాతనిఁగొట్టి, మఱియు మూఁడుతీవ్రనారాచములచే వానిసారథిని బ్రహరించెను. పిదపఁ దనపై నటులుగవిసిన యామహారథులనెల్ల నాసాత్యకి మఱియు నైదైదుబాణములచే నొప్పించి, రథికోత్తముఁడగు నాతఁడొకభల్లముచే నీతనయుసారథిని బ్రహరింప, వాఁడు నేలఁ గూలెను. ఓప్రభూ! అటులు నీకొమరునిసారథి పుడమిఁబడ, వాయువేగముగల యాతనిగుఱ్ఱము లారణరంగమునుండి యీడ్చికొనిపోయెను. ఓరాజా! అంత మనవారిసైన్యము లారాజురథము నారసి, వందలకొలందిగాఁ బరువులిడసాగెను. అటులు చెదరినయాసైన్యమును గాంచి, యాసాత్యకి సువర్ణపుంఖములును, శిలాశితములునగు సాయకములచే నీవారిసకలసైన్యములను దోలఁగఁజేసి, యాశ్వేతవాహనునిరథముసన్నిధికిఁ బోవెడలెను. అటులు శరసంధానము సేయుటకును, సారథిని రక్షించుకొనుటకును, దన్నుఁబాలించుకొనుటకును మెచ్చికొని, మనవారాసాత్యకిని గౌరవించిరి." అని తెలుప విని ధృతరాష్ట్రుఁడాసంజయుతో ని ట్లనియె.

## సాత్యకిప్రవేశము

"ఓసంజయా! అటులు మనమహాసైన్యమును మర్దించి, యర్జునునిఁ జేరంబోవునాసాత్యకిని, బిడియమువిడిచి నాకొడుకు లేమిచేసిరి? ఓయీ! అపుడు మరణింపనున్న నాకొమరులకు ధైర్యమెట్లు గలిగెను? అర్జునతుల్యుఁడగు నాసాత్యకి యటులు దమపైకిరా, యుద్ధపరాజితులగు క్షత్రియు లేమిచేసిరి? ఆసాత్యకి వారినెటు లతిక్రమించిపోయెను? నాకొడుకు లచ్చో జీవించియుండఁగనే యాసాత్యకి వెడలిపోయెనా? అది యెల్ల నాకెఱిఁగింపుము. ఓతండ్రీ! నీవు నాకత్యద్భుతముగాఁ దెలుపుచున్నవాఁడవు. మహారథులగు పెక్కుఱుశత్రులతో నొక్కఁడు యుద్ధమొనర్చెనంటివి. ఇది చూడ నాపుత్రులకు దైవవైపరీత్యమని తలంచె

దను. అటులుగాదేని మహారథులు నాసాత్యకిచే వధింపఁబడుదురా? ఆతని కొక్కనికి నాసైన్యమెల్లఁ జాలకున్నదే! ఆసాత్యకి కుపితుఁడై యుద్ధమొనర్చుచుండఁ బాండవు లూరకుండవచ్చును. కుశలుఁడును జిత్రయోధియునగు ద్రోణుని జయించి, పశువులను సింహమువలె నా సాత్యకి చంపనున్నవాఁడు. కృతవర్ముఁడు మున్నగుశూరుల కనేకులకు సహింపరాక వారినోడించిన యాసాత్యకి నాపుత్రుల నోడింపకుండునా? మహాయశుఁడగు సాత్యకియొనర్చినట్టి యుద్ధ మాయర్జునుఁడునైతము చేయలేదని తలంపవలసియున్నది."

అది విని సంజయుఁ డాతనితో "ఓరాజా! నీదురాలోచనమున కును, దుర్యోధనునికృత్యమునకును దగుఫలము తెలిపెదను. జాగ రూకుఁడవై వినుము. నీపుత్రునిశాసనముచేఁ గ్రౌర్యము వహించి యుద్ధాభిలాషులై సంశప్తకులు మఱల యుద్ధమునకు సిద్ధపడిరి. దుర్యో ధనాదులును, మూఁడువేలరౌతులును, శకులు, కాంభోజులు, బాహ్లి కులు, యవనులు, పారదులు, కులింగులు, తంగణులు, నంబష్ఠులు, పైశా చులు, బర్బరులు, పార్వతీయులును గుపితులై పావకునిపైఁ బడుమిడు తలువలెఁ బాషాణములను వర్షించుచు నాసాత్యకిని దలపడిరి. ఓరాజా! అటు లాశ్శైనేయు నైదువందలరథికు లొక్కమొగిఁ గవిసిరి. పిదప వందలకొలందిని, వేలకొలందిని మహారథులు వేయియేన్గులతోడను, రెండువేలగుఱ్ఱములతోడను వెడలి శరవర్షమును వర్షింపసాగిరి. అటు లాశ్శైనేయు నెదుర్కొనిన లెక్కలేనిమన సైనికులనెల్లఁ బోత్సహిం చుచు, నాసాత్యకిని బ్రహరింపుఁడనుచు, దుశ్శాసనుఁడు సాత్యకిని జుట్టు కొనియెను. అపుడాసాత్యకి యొక్కఁడును బెక్కురతోఁ దొట్రుపడక, యుద్ధమొనర్చుట నాతనిచరిత్ర మెంతయు మాకద్భుతముగాఁజూపట్టెను. ఆగజరథసైన్యముల నతఁడు వధించెను. అటులే దస్యులగునారౌతుల నెల్లఁ జంపసాగెను. అతఁడు విఱిచినచక్రములును, భగ్నమొనర్చినపర మాయుధములును, దునిసి యీషాదండములతోఁ బడినయక్షములును, నలిగినయేన్గులును, గూలినధ్వజములును, జెదరిపడినవర్మములును, జర్మ ములును, వస్త్రమాల్యాభరణములును బుడమిగొల్ల వ్యాపించెను. అపు డారణరంగము గ్రహములచే నాకసమువలెఁ జూపట్టెను. అంజన వామన సుప్రతీక మహాపద్మైరావతవంశములందును, మఱికొన్నిగొప్పకులము

లందును జనించిన యేన్గులపిండులు, కొండలునానందందుఁ బడియుండెను. అటులే వానాయుజ, పార్వతీయ, కాంభోజ, బాహ్లీకములగు, నశ్వ శ్రేష్ఠముల, నాసాత్యకి యందు వధించెను. అటులే నానా దేశములనుండి వచ్చినపదాతులను, వందలకొలందిని, వేలకొలంది నతఁడు చంపెను. అంత నాదస్యులు చెదరి పరువులిడుచుండఁ జూచి, దుశ్శాసనుఁడు 'ఓయీ! సైనికులారా! యుద్ధధర్మ మెఱుంగక పరువులిడుట యేమిపని? మఱలుఁడు.' అని వారినెల్లఁ బ్రేరించి, మఱియు వారితో 'ఓయీ! ఈ సాత్యకి పాషాణయుద్ధ మెఱుఁగఁడు. కావున వానిని, మీరు శూరులై పాషాణములతోడను బోరాడుఁడు. ఇక్కౌరవుల కశ్మయుద్ధము తెలి యదు. అటులగుట మీరు వెఱవక వడిగా వెడలి యాతని నెదుర్కొ నుఁడు. మి మ్మాతఁడు చేరజాలఁడు.' అని తెలుప విని, యప్పార్వతీయ రాజులెల్లఁ బాషాణములతో యుద్ధమొనర్చుచు, రాజును మంత్రులువలె నాసాత్యకిని సమీపించిరి. పిదప వారెల్ల నేన్గులకుంభస్థలములనుబోలు ఱాలను వర్షించుచు, నాశైనేయుని నిరోధించిరి. నీపుత్త్రుఁడు ప్రేరింప, మఱికొందఱు సాత్యకిని వధించువారై క్షేపణీయములతో నెల్లయెడలఁ జుట్టికొని, శిలలను వర్షించుచుఁ దనపైకిరా, నాసాత్యకి తీవ్రములగు శరములను సంధించి, వానిచే నప్పార్వతీయరాజుల పాషాణవర్షమును నివారించెను. అంత నాతనితీవ్రనారాచములచే వెడలినపాషాణచూర్ణ ములు మిడుగురులునా వ్యాపించి మనసైన్యములకే హానిగలిగింప, నం దాహాకారములు జనించెను. పిదప మహాపాషాణధారులై యున్న యైదువందలశూరులు, బాహువులు తెగి నేలఁగూలిరి. మఱియు వందల కొలఁదిని, వేలకొలఁదిని, పాషాణములతోఁగూడిన తమబాహువులు తెగు టయు, నాసాత్యకి సమీపింపలేకయే పుడమిఁబడిరి. అటులు విచ్ఛిన్న బాహులై యున్న యాశూరులను బెక్కువేవుర నాసాత్యకి వధించుట యెంతయు నద్భుతమయ్యెను. మఱియు వారొక్కమొగిఁగవిసి, పాషాణ వర్షము నెల్లెడలఁ గురియుచు, నయోహస్తులును, శూలహస్తులునై యుండ నాదరదులు, తంగణులు, ఖశులు, లంపకులు, పులిందులు మున్నగువారినెల్ల నాసాత్యకి తనతీవ్రనారాచములచే ఖండింపఁ, గొం డలు గుండయగుచున్నటులు శబ్దమొదవ, దానికి జడిసి గజరథాశ్వ పదాతులు పరువులిడుచు, నాతనియెదుట నిలువఁజాలక భ్రమరములు

వలె నాతనిబాణములు తమ్ముఁ జుట్టికొన వెడలిపోయిరి. హతశేషము లగునేన్గులు, తలలుదెగి రక్తములు స్రవింప నాసాత్యకిరథమును సమీపింపక విడిచిపోయెను. ఓరాజా! అప్పుడు నీసైన్యమున గొప్పచప్పుడుప్పతిల్లెను. అయ్యది సాగరఘోషమునా వినవచ్చెను. ఆమహానాదమును విని ద్రోణుఁడు తనసారథితో 'ఓయీ! సూతా! ఈసాత్యకి, కుపితుఁడై రణరంగమునఁ బలువిధములగు మనసైన్యములఁ జెండాడుచు యముఁడునాఁ జరించుచున్నవాఁడు. ఓయీ! ఆశబ్ద మెచ్చోటినుండి వచ్చుచున్నదో యందులకు మనరథముఁ బోనిమ్ము. ఆయుయుధానుఁడు పాషాణయోధులతోఁ బోరాడుచున్నవాఁడు. అదె చెదరిపాఱుచున్నగుఱ్ఱములతో రథికులు పరువులిడుచున్నవారు. శస్త్రకవచములు తెగి కొందఱు పీడితులై పడుచున్నవారు. సారథులు, తమగుఱ్ఱముల నాపఁజాలకున్నవారు.' అని పలుక విని, యాసూతుఁ డాతనితో 'ఓరథికోత్తమా! కౌరవసైన్య మెల్లెడలఁ జెదరి పరువులిడుచున్నది. ఆసమరభూమి నదె యోధు లెటులు భంగమొంది పరువులిడుచున్నారో చూడుము. ఇదె శూరులగుపాంచాలురు పాండవులతోఁగూడి నిన్నే హింసించువారై యెల్లెడలఁ జుట్టుకొని వచ్చుచున్నవారు. ఓవైరిసూదనా! ఇప్పటికిఁ దగుకార్య మాలోచించి యొనర్పుము. నీవిపుడు నిలువవలయునో! లేక మఱలవలయునో చింతింపుము. సాత్యకి దూరముగాఁ బోయినవాఁడు.' అని తెలిపెను.అంతనాభారద్వాజున కాసాత్యకి బహువిధములగుసైన్యములను సమయించుచుఁ గానవచ్చెను. అటులాసాత్యకిచే హతులగు మనవా రాసాత్యకిని విడిచి ద్రోణసైన్యమునకుఁ బోసాగిరి. మఱియు నాదుశ్శాసనుఁ డెవ్వరితో మున్ను వెడలెనో వారెల్లరును జడిసి ద్రోణుఁడున్నచోటికిఁ బోవఁజొచ్చిరి." అని తెలిపి సంజయుఁడు మఱియు నాతనితో నిట్లనియె.

## ద్రోణుఁడు సాత్యకిపై విక్రమించుట

"ఓరాజా! తనసమీపముననున్న దుశ్శాసనునిఁ గాంచి ద్రోణుఁడాతనితో 'ఓయువరాజా! ఈరథికులెల్ల నిటులేల పరువులిడుచున్నవారు? మనరాజు క్షేమముగా నున్నవాఁడా? సైంధవుఁడు జీవించి యుండెనా? మహారథుఁడవును, రాజపుత్త్రుఁడవు రాజభ్రాతవునగు నీవేల

యటులు యుద్ధముమాని పరువిడుచున్నాఁడవు? మఱియు నీవు యువ రాజవు. మున్ను వాఁడ్రౌపదిని జూచి 'ఓసీ! నీవు ద్యూతమున మాకయి తివి. ఇఁక స్వేచ్ఛాసంచారిణివి గమ్ము. నా జ్యేష్ఠభ్రాతకు వస్త్రవాహికవు గమ్ము. నీకింకఁ బతులెవ్వరు? వారిపుడు నపుంసకతుల్యులై యున్నవారు గదా!' అని యామెతోఁ బలికితివిగదా! ఇపు డిటు లేల పాఱిపోవుచున్న వాఁడవు? పాండవపాంచాలురతో నీయంతన నీవు గొప్పవైరము తెచ్చి పెట్టికొనియు, నిపు డొకసాత్యకి తలపడినంతమాత్రమున యుద్ధమునకు జడియవచ్చునా? మున్ను నీవాదుష్టద్యూతమునఁ బాచికలుపట్టుకొన్న పుడును, విశేషించి పాండవులయెడ నప్రియవచనములు పల్కునపు డును, సాయకములు సర్పతుల్యములై దారుణములుగా నుండునని తెలియకుంటివి గాఁబోలు ? మున్నా ద్రౌపదికిఁ గల్గినపరిక్లేశము నీవలనఁ గల్గినదేగదా! నీకు మానమెక్కడ? గర్వమెక్కడ? పరాక్రమమెక్కడ? పౌరుషమెక్కడ? విషసర్పతుల్యులగు నాపాండవులకుఁ గోపముగల్గిం చియు నిఁక నెందుఁ బోఁగలవు? దయాహీనుఁడవై భ్రాతవై యిపు డిటులు పలాయనపరాయణుఁడవగు నీవలన, రాజగురుయోధనుఁడును మీసైన్యములును బరితపింపవలసివచ్చెను. ఓవీరా! నిజబాహుబలముఁ జూపి రక్షింపఁదగినసేన యిటులు వెఱపుగలిగి చెదరుచుండుట నీవుపే క్షింపఁదగినదా? యువరాజవగు నీవు యుద్ధమువిడిచి జడియుచుండుట కెంతయు శత్రులు సంతసించుచున్నవారు. నీవు సేనానాయకుఁడవై యుండియుఁ బరువులిడుట పాడిగాదు. నాయకుఁడే జడిసినపుడు, వాని నాశ్రయించినసేనలోనివాఁ డెవ్వఁడు జడియకుండును? ఎవ్వఁడు సంగ్రా మమున నిలుచును? ఇపు డొక్కసాత్యకితోఁ బోరాడునట్టి నీ కీసంగ్రా మమునుండి బుద్ధిమఱలెనా? ఓకౌరవా! ఇట్టి నీ వాగాండివధరుని, భీముని, నకులసహదేవులను యుద్ధమునఁ గాంచితేని యిపు డింకేమి చేయుదువోగదా! సూర్యాగ్నిసమతేజములగు నప్పార్థునిసాయకము లీ సాత్యకిబాణములను మించియుండునే! వీనికే నీవు జడిసి పరువులువెట్టు చున్నవాఁడవు. నీ కిఁక యుద్ధోత్సాహము లేదేని నెమ్మదిగా నప్పాండ వాగ్రజున కిప్పుడమి నర్పింపుము. పొరవిడిచినపాములునాఁదగు పార్థుని సాయకములు నీమేన నాటకమున్నే పాండవులతో సంధింపుము. పాండ వులు మీసోదరశతమును జంపి, యీ మీరాజ్యమును దీసికొనక

మునుపే వారితో సంధిచేసికొనుము. మఱియు మహాబాహుఁడగు భీముఁడు మీమహాసైన్యమును జొచ్చి నీసోదరులను జీల్చి చెండాడక మున్నె వారితో సంధింపుము. నీయన్నయగుసుయోధనునకు మున్నా భీష్ముఁడు 'పాండవు లజేయులనియు, వారితో సంధియొనర్చుకొమ్మనియుఁ జెప్పెను. కాని, మందుఁడగు నాతఁడటు లొనర్పలేదు. కావున నీవిఁక ధైర్యమూని పాండవులతోఁ బోరాడుము. ఆసాత్యకి యెందున్న వాఁడో యందుల కిపుడు వడిగాఁబొమ్ము. నీవులేనిచో నీసైన్యము చెదరిపోవును. సత్యవిక్రముఁడగు నాసాత్యకితో నిపుడు పోరాడుట నీకే యుపయోగము.' అని పలికెను.

అది వినియు నీతనయుఁ డించుకేని బదులువలుకక విని విననియట్టు లూరకుండి, యుద్ధమునుండి మఱలకున్నట్టి తనగొప్పసైన్యముతో నా సాత్యకియున్నకడకే వెడలి, మఱియును యుద్ధసన్నద్ధుఁడై యాతనితోఁ బోరాడ నారంభించెను. రథికోత్తముఁడగు ద్రోణుఁడును, బాండవ పాంచాలుర నెదుర్కొని కుపితుఁడై వారిసైన్యమున వందలకొలఁదిని, వేలకొలందిని గొట్టి, పఱవులిడఁజేసెను. పిదప నాద్రోణునకును, బాండవ పాంచాలమాత్స్యులకును గొప్పయుద్ధము జరిగెను. అంత నటులుసైన్యముల నోడించునట్టి యాభారద్వాజునిఁ, దేజోనిధియగు వీరకేతుఁడను నొకపాంచాలపుత్త్రుఁ డెదుర్కొని వాఁడియగు నైదుబాణములచే నాతని నొప్పించి, ధ్వజము నొకసాయకముచేఁ గొట్టి, యేడుబాణములచే సారథిని బ్రహరించెను. ఓమహారాజా! అప్పు డప్పాంచాలపుత్త్రు నాద్రోణుఁ డెదురింపఁజాలకుండుట మాకెంతయు నద్భుతమయ్యెను. అంతఁ బాంచాలు రటులు నిరుద్ధుఁడైయున్న ద్రోణునిఁ గాంచి ధర్మపుత్త్రునిజయముగోరువారై యాతని నొక్కుమ్మడిఁ గవిసి, వారు పావకజ్వాలలునాఁదగుశరములు, తోమరములు, వివిధములగుశస్త్రములు మున్నగువాని నాతనిపైఁ గురిసిరి. ఓరాజా! వాని నాద్రోణుఁడు తన బాణగణములచే నివారించుచు, నాకసమున మేఘములను దొలఁగించు పెనుగాలివలె నపు డతఁ డెంతయుఁ బ్రకాశించెను. మఱియు నాద్రోణుఁడు సూర్యాగ్నితుల్యమై వీరఘాతియగు నొకశరమును సంధించి యావీరకేతునిరథముపై విడువ, నది యప్పాంచాలపుత్త్రుని భేదించి, రక్తసిక్తమై ప్రజ్వలించుచుఁ బుడమిఁ జొచ్చెను. అంత నప్పాంచాలుఁడు

తనరథమునుండి, గాలిచేఁ గదలి పర్వతాగ్రమునుండి పడినసంపెగచెట్టు వలెఁ గూలెను. మహాబలుఁడగు నారాజపుత్త్రుఁడటులు హతుఁడగుచుఁ బాంచాలురెల్లరును వడిగా నాద్రోణునిఁ జుట్టికొనిరి. అటు లావీరకేతుని సోదరులగు చిత్రకేతుఁడు, సుధన్వుఁడు, చిత్రవర్మ, చిత్రరథుఁడును, గూడి యుద్ధాభిలాషులై, యాద్రోణుని ముట్టడించి, వేసవితుదిని మేఘములువలె నాతనిపై శరములను వర్షించుచుండిరి. పలువిధముల నా మహారథులు తన్ను నొప్పింప, వారి నెటులయిన వధింపవలయునని కోప పూరితుఁడై, వారిని శరమయమగువలచేఁ గప్పి, నాకర్ణాంత మాకర్షింపఁబడి విడువఁబడు నాద్రోణునిశరములకు నొచ్చి యేమిచేయుటకును దోఁపక యూరకుండ, నటులు మూఢులై యున్నవారి నారసి యాభారద్వాజుఁడు నగుచు, సూతులను గుఱ్ఱములను గొట్టి, మరియుఁ దీవ్ర నారాచములచేత భల్లములచేతను, బూవులనువలె వారితలలఁ దెగనేసి బుడమిఁ బడఁద్రోసెను. మును దేవాసురయుద్ధమున దైత్యదానవులువలె వారు హతులై క్షితిపైఁ గూలిరి. ఓరాజా! వారి నాభారద్వాజుఁ డటులు గొట్టి, ప్రతాపశాలియై, సువర్ణపృష్ఠమగు తనవిల్లు ద్రిప్పసాగెను. దేవతుల్యులును మహారథులునగు నప్పాంచాలురు హతులగుటఁగాంచి ధృష్టద్యుమ్నుఁడు కుపితుఁడై కనుల నీరునించుచు, నాద్రోణునిరథముపైఁ దలపడియెను. అటు లప్పాంచాలుని శరపరంపరచే నివారితుఁడైన ద్రోణు నారసి, సైన్యమున నొక్కమాఱుగా హాహా నాదము జనించెను. మహాత్ముఁడగుధృష్టద్యుమ్నుఁ డటులు పలువిధముల బాణములచేఁ గప్పినను, ద్రోణుఁడు నొవ్వక నగుచు యుద్ధమొనర్చెను. ఓరాజా! పిదప నప్పాంచాలుఁడు కుపితుఁడై నతపర్వములగు తొంబది బాణములచే వక్షమున నొప్పించెను. అటులు గాఢవిద్ధుఁడై మహాయశుఁడగు భారద్వాజుఁడు మూర్ఛమునిఁగి రథమధ్యమునఁ గూలఁబడియెను. అటులుపడియున్న యాతనిఁ గాంచి, పరాక్రమశాలియగు ధృష్టద్యుమ్నుఁడు విల్లువిడిచి, వడిగాఁ గత్తిపట్టుకొని రథమునుండి వడిగా నెగిరి యాభారద్వాజునిరథముపై కుఱికి యాతనిశిరము దెగనేయ నుంకించుచుఁ గ్రోధతామ్రాక్షుఁడై యుండెను. పిమ్మట నాద్రోణుఁడు కొంత వడికిఁ దెలిసి మఱియొకవిల్లు గొని తన్ను సమీపించియున్నధృష్టద్యుమ్నునిఁ గాంచి చేరువనున్నవారిపైఁ బ్రయోగింపఁదగుబాణములచే

నాతని నొప్పించెను. మహాబలుఁడగు ధృష్టద్యుమ్నుఁ డటు లాద్రోణుని పెక్కుసాయకములచే నొచ్చి, మఱియు నాతనిరథమునుండి వడిగాఁ దనరథముపై కుఱికి తనగొప్పవిల్లు మరలఁ గొని, మఱియు నాద్రోణుని నొప్పింప, నాతఁడును నప్పార్షతునిఁ గొట్టెను. అపు డాద్రోణధృష్టద్యుమ్నులకు గొప్పయద్భుతయుద్ధముజరిగెను. ముల్లోకములనుగోరు,నింద్రప్రహ్లాదులయుద్ధమువలె వారియుద్ధము చూపట్టెను. వారిరువురును విచిత్రములగుమండలగతులఁ జరించుచు, యుద్ధమార్గకుశలులై సాయకములచేఁ బరస్పరము ప్రహరించుకొనుచు, యోధులచిత్తముల కచ్చెరువొదవ వర్షకాలమేఘములువలె శరవర్షములను వర్షించుచు, సాయకములచే దశదిశలఁ గప్పుచు నుండిరి. వారియుద్ధ మద్భుతముగాఁజూపట్ట భూతకోటులెల్ల వారిని మెచ్చికొనెను. ఓమహారాజా! అందుఁగలసైనికులును క్షత్త్రియపుత్త్రులును, వారి నారసి గౌరవించిరి. 'ద్రోణుఁడు ధృష్టద్యుమ్ను నెదుర్కొనియెను. ఇఁక దప్పక యితఁడు ధృష్టద్యుమ్ను నకు వశుఁడగును' అని పాంచాలు రఱచిరి. అంత నాద్రోణుఁడు వడిగా నాధృష్టద్యుమ్ను సారథితలను చెట్టునుండి పండినపండునువలె రాలఁ గొట్టెను. పిదప నప్పాంచాలునిగుఱ్ఱములు వడిగాఁ బరువులిడఁ బిమ్మట నప్పాంచాలసైన్యమును సృంజయులను జెదరఁగొట్టి, పాండుపాంచాలుర నోడించి, మరల నెప్పటిచోప్పునఁ దనవ్యూహమును జేరియుండెను. ఓరాజా! ఆద్రోణునితోఁ బోరాడఁ బాండవు లుత్సహింపరైరి'.అని తెలిపి సంజయుఁ డాతనితోఁ మఱియు ని ట్లనియె.

### సాత్యకిచే దుశ్శాసనుఁ డోడుట

"ఓరాజా! పిదప దుశ్శాసనుఁ డాసాత్యకిపై వెడలి పర్జన్యుఁడువలె శరసహస్రములను వర్షించుచు, నఱువదిబాణములచే నొప్పించి, మఱియుఁ బదునాఱుసాయకములచేఁ గొట్టియు, మైనాకపర్వతమువలె యుద్ధమున స్థిరుఁడై యున్న యాతనిఁ జలింపఁజేయఁజాలఁడయ్యెను. అటులు నానాదేశములనుండివచ్చిన గొప్పరథసమూహముతో నెదుర్కొని యెల్లెడల సాయకములఁ జిమ్ముచు, మేఘుఁడునా గర్జనలచే దశదిశలఁ బ్రతిధ్వనింపఁ జేయుచున్న యాదుశ్శాసనునాలోకించి సాత్యకి వానినెదుర్కొని శరవర్షముచేఁ గప్పి, నపు డాదుశ్శాసనుని ముందున్న

యోధులు జడిసి, నీకొమరుఁడు చూచుచుండఁగనే యారణరంగము నుండి వెడలిపోయిరి. ఓరాజేంద్రా! అటులు వారు వెడలిపోయినను నీకొడుకు జడియక సాయకములచే సాత్యకిని గప్పుచు, నాల్గిట నాతని గుఱ్ఱములను, మూఁడిట సారథిని, నూఱుబాణములచే సాత్యకిని నొప్పించి' సింహనాద మొనర్చెను. ఓమహారాజా! పిదప నాసాత్యకిని కుపితుఁడై తనసాయకములచే వానిరథధ్వజములను, సూతునిఁ గాన రాకుండఁజేసి యాదుశ్శాసనునిఁ బెక్కుబాణములచే సాలెపురుపుతంతు వులచే మశకమునువలెఁ గప్పెను. అంత నాదుశ్శాసనునిఁ జూచి సుయో ధనుఁ డాతనికి సహాయముగాఁ ద్రిగర్తులను బ్రేరించి, యాసాత్యకిరథము పైకిఁ బంపెను. అంత యుద్ధవిశారదులగు నాత్రిగర్తులు క్రూరకర్ములై యాసాత్యకిసమీపమును జేరిరి. అటులు గొప్పరథసమూహముతోఁ యుద్ధాభిలాష స్థిరమై వెలయ, నామూఁడువేలసంశప్తకులును గలిసి శర వర్షమును గురియుచుండఁగా, నందు ముఖ్యులగు నైదువందలయోధుల నతఁడు శరప్రహారముల నొప్పింపఁ, బ్రహతులై వారు పెనుగాలిచే భగ్నములయిన చెట్లువలె నేలఁగూలుచుండిరి. ఓమహారాజా! ఆసాత్యకి శరపరంపరచే, దెగి రక్తసిక్తములై నేలఁగూలినయేనుగులును, గుఱ్ఱము లును, ధ్వజములును వెలయ, రణరంగము పుష్పించినమోదుగులచేవలె నలరారెను. అటు లాసాత్యకిచే హతులైన నీవారు బురదలో దిగఁబడిన యేనుగులువలె రక్షకు నెవ్వనిఁ గానకుండిరి. పిమ్మట మనసైనికులెల్లరును గరుడునిభయముచే మహాసర్పములు పుట్టనుజొచ్చినట్టులు ద్రోణునిరథ మును జేరికొనిరి. అంత నాసాత్యకి సర్పతుల్యములగుసాయకములచే వారిని నొప్పించి, మెల్లగా నాధనంజయునిరథమును సమీపింపఁ బోయెను. అటులు వెడలిన యాశైనేయునిఁ గాంచి దుశ్శాసనుఁడు తీవ్రములగుతొమ్మిదిబాణములచే నొప్పింప, వాఁడైదుబాణములచేఁ బ్రతి హతిఁగావించి నగుచు, మఱియు మూఁడుబాణములచేఁ గొట్టి, యింకను నైదుబాణములచే నొప్పించెను. అంత నాసాత్యకి యైదుబాణములచే నాదుశ్శాసనుధనువు ద్రుంచి, పరిహసించుచు నర్జునుకడకు వెడలెను. అటులు వెడలిపోవుచున్న యాసాత్యకిపైఁ గుపితుఁడై యాతనివధించు నుద్దేశముతో నొకపరశుమయశక్తినిఁ బ్రయోగింప, సాత్యకి తీవ్రనారా చములచే దానిని ఖండించెను. ఓరాజా! పిదప నీకొమరుండు వేఱొక

విల్లుగొని యాసాత్యకిని నొప్పించి, సింహనాదమొనర్చెను. పిమ్మట నా సాత్యకి కోపావేశపరవశుఁడై యగ్నిజ్వాలాకారములగుశరములచే వక్షమునఁ గొట్టి, నీకొమరుని మూర్ఛఁద్రోసి తీవ్రాగ్రములగు నెన్మిది బాణములచే మఱియు నొప్పించెను. దుశ్శాసనుఁ డిరువదిబాణములచే నాసాత్యకి బ్రతిహతిఁ గావించెను. ఓరాజా! ఆసాత్యకియు నతపర్వములగుమూఁడుబాణములచే మఱియు దుశ్శాసనువక్షమును నొప్పించి, పిదప గుఱ్ఱములను, సారథిని తీవ్రనారాచములఁ గొట్టి, యొకభల్లముచే విల్లుదునిమి, నైదుసాయకములచే హస్తావాపమును నఱికి, ధ్వజమును, రథశక్తిని రెండుభల్లములచే ఖండించి, పరమాస్త్రవేత్తయై తీవ్రవిశిఖములచే బార్ష్ణిసారథులను జంపెను. అంత నాదుశ్శాసనుఁడు విల్లుదునుఁగ విరథుఁడై, హతాశ్వుఁడై, హతసారథియై, త్రిగర్తసేనాపతిరథమెక్కి తొలఁగిపోయెను. మఱియు నాసాత్యకి వానిని రెండుగడియలలోఁ గలిసికొనియు భీమసేనునివచనమును స్మరించుచు విడిచెను. ఓరాజా! భీముఁడు నాఁడాసభామధ్యమున నీతనయులనెల్ల వధింతునని ప్రతిజ్ఞ చేసియున్నవాఁడుగదా! అటు లాసాత్యకి దుశ్శాసను నోడించి యప్పార్థుఁడు వెడలినత్రోవనే వెడలెను." అని తెలుప విని ధృతరాష్ట్రుఁడు మఱియు నాసంజయునితో ని ట్లనియె.

### సంకులయుద్ధము

"ఓసంజయా! అటు లాసాత్యకి పోవుచుండఁగాఁగొట్టకయు నివారింపకయు నూరకుండిరిగదా! మనసేనలోఁ గొందరేని మహారథులు లేకుండిరా? ఆసాత్యకియొక్కఁడే సత్యవిక్రముఁడై యింద్రుఁడు దానవులందువలె బలశాలియై యద్భుతకర్మ మొనర్చెను. లేకున్న నతఁడు వెడలినత్రోవ శూన్యమగునా? ఓయీ! అతఁ డొక్కఁడే పెక్కుసేనల యుక్కడంచుచు మహారథులనేకులు యుద్ధముచేయుచుండఁగా నెట్లు తొలఁగిపోయెను? దానిని నాకెఱిఁగింపుము."

అది విని సంజయుఁడు "ఓరాజా! గజరథాశ్వపదాతులప్రయత్నమెంతయు సంకులమై యుగాంతసదృశమై యుండెను. ఆహూతసైన్యసమూహములలో నీసైన్యసమూహమునుబోలినది వేఱొకటిలేదని నా యభిప్రాయము. అపుడు దేవతలును జారణులు నందులకువచ్చి లోక

మున వ్యూహము లిట్టివై యుండవలయుననియు, నిట్టి వ్యూహము వేఱొకటి లేదనియుఁ బరస్పరము పలికికొనిరి. ఆజయద్రథునివధమునాఁ డట్టి వ్యూహ, మాద్రోణుఁడు సంఘటించెను. పెనుగాలిచేఁ గదలుసముద్రములచప్పుడునుబోలి పరువులిడుచున్న మనవారిసైన్యమునఁ జప్పుడు లుప్పతిల్లెను. నీసైన్యమునందును, పాండవసైన్యమునందును వందలకొలఁదిని, వేలకొలఁదిని వీరులు సంరంభమువెలయ యుద్ధమునఁ బట్టుదలగల్గియుండిరి. అందు గగురుపాటొదవించు గొప్పశబ్దము వినవచ్చెను. పిమ్మట భీముఁడును, ధృష్టద్యుమ్నుఁడును, నకులసహదేవులును, యుధిష్ఠిరుఁడును 'రండు, రండు. ప్రహరింపుఁడు. వడిగాఁబరువులిడుఁడు. అదె శత్రుసేనను వాసుదేవార్జునులు ప్రవేశించిరి. వారు సుఖముగా నాసైంధవునిరథమును జేరవలయును. కావున మీరందుల కుపయుక్తముగాఁ బ్రవర్తింపుఁడు' అని యఱచుచుఁ, దమసైన్యములను బ్రోత్సహించిరి. మఱియు భీమసేనధృష్టద్యుమ్నులు 'ఓసైనికులారా! వారిరువురు లేనిచో మనమోడి కౌరవులు కృతార్థులై యుందురు. కావున మీరెల్లఁ గలిసి యక్కౌరవసైన్యమును బెనుగాలి సాగరమునువలె గలఁతనొందింపుఁడు.' అని పలుక వారు తమప్రాణములపై నాసలువీడి, యుత్తమతేజులై యుద్ధమరణమును గోరుచు, స్వర్గాభిలాషులై జీవితము నపేక్షింపక కౌరవులను బ్రహరింపసాగిరి. అటులే నీవారును గీర్తికాములై యుద్ధమున బుద్ధినిలిపి సన్నద్ధులై యుండిరి. అటులు భయప్రదమై సంకులయుద్ధ మారంభమగుడు, సకలసైన్యములను జయించి, సాత్యకి యర్జునునికడకు వెడలెను. సూర్యరశ్మిలునాఁదగు కవచకాంతులు సైనికులచూపుల నెదుర్కొనియెను. అటులే యుత్సాహపూరితులై మహాత్ములగు పాండవులకడిమియు నుద్రేకించియుండెను. అంత నాసుయోధనుఁ డామహాసైన్యమును బ్రవేశింప, నాతనికిని వారికిని గొప్పసంకులసమర మయ్యెను. అది సకలభూతములకు నభావముగల్గించునదిగాఁ జూపట్టెను " అని తెలుప విని ధృతరాష్ట్రుఁ డాతనితో "ఓయీ! అటులు సైన్యములెల్ల వెడల మనసుయోధనుఁడు వానివెనుకనుండి యుద్ధము చేయరాదా? బహుసైన్యములతోఁ గూడిన యామహాహవమున వాఁ డొక్కఁడును జొచ్చుట కష్టమునకుఁ దావగునని నాకు స్ఫురించుచున్నదే! వాఁడు మిక్కిలి సుఖముగాఁ బెరిగినవాఁడును, నైశ్వర్య

ముచే లోకనాయకుఁడునుగదా! అతఁ డొక్కఁడును బెక్కుర నెదుర్కొని పరాఙ్ముఖుఁడుగాకుండెనా?" అని ప్రశ్నించెను.

అది విని సంజయుఁ డాతనితో "ఓరాజా! నీకొమరునిసమర మద్భుతమొనర్చెను. అతఁ డొక్కఁడే పెక్కురతోఁ బోరాడెను. దాని నెఱిఁగించెదను వినుము. అపుడు మనసుయోధనుఁ డప్పాండవసైన్యమును, బద్మవనము నేన్గువలె నెల్లెడలఁ గలఁతనొందించెను. అటులు నీ పుత్త్రునిచేఁ బీడితమగుచున్న తమసైన్యమును గాంచి భీముఁడు మున్నగువారును, బాంచాలురును నాతని నెదుర్కొనిరి. అంత నీకొమరుఁడాభీమునిఁ బదిబాణములచే నొప్పించి, మూఁడుమూఁడుబాణములచే నకులసహదేవులను, ధర్మజు నేడింటను, విరాటద్రుపదుల నాఱింటను, శిఖండిని నూఱిటను, ధృష్టద్యుమ్ను నిరువదింటను, ద్రౌపదేయులను మూఁడుమూఁడుబాణములను, దక్కిన యోధులను వందలకొలందిసాయకములచే నొప్పించి, యముఁడు ప్రాణులవలెఁ దనతీవ్రశరములచే నేన్గులను, రథములను బ్రహరించెను. మఱియు నతఁడు విల్లు గిరగిర త్రిప్పుచు సాయకములను సంధించుచు, విడుచుచు వైరులను దనశిక్షాకౌశలమును, నస్త్రబలమును నేర్పడఁ గొట్టుచుఁ గానవచ్చెను. అటులు శత్త్రులను మర్దించునాసుయోధనుని సువర్ణపృష్ఠమగుధనువే మండలాకారముగా నాసమరరంగమందున్నవారికిఁ గానిపించుచుండెను. పిదప నీకొమరుఁడు ప్రయత్నించుచుండఁగనే యుధిష్ఠిరుఁ డాతనిధనువు రెండు భల్లములచే నఱికి, మఱియుఁ గట్టిగాఁ దివిచివిడిచిన పదిబాణములచే నాతని నొప్పించెను. ఆసాయకములు నీకొమరునికవచమును సోకి భగ్నములై పుడమిఁ జొచ్చెను. పిమ్మటఁ బాండవులు సంతుష్టులై మున్ను వృత్రవధమున నింద్రుని దేవతలును మహర్షులువలె నాయుధిష్ఠిరు నావరించియుండిరి. పిదపఁ బ్రతాపనిధియగు నీకొడుకు వేఱొకవిల్లు గొని 'నిలునిలు'మని పలుకుచు నాయుధిష్ఠిరుని మార్కొన, నపుడు జయాభిలాషులై పాంచాలు రాతనిపైకి వచ్చిరి అంత నాద్రోణుఁ డాయుధిష్ఠిరునిఁ బట్టుకొనువాఁడై పెనుగాలిచేఁ గదలి వర్షించుమేఘములను బర్వతమువలె నప్పాంచాలురనెల్ల లక్ష్యపెట్టక వారినెల్ల నిరోధించెను. ఓరాజా! అపుడు పాండవులకును, నీవారికిని గగురుపాటొదవించు గొప్పసంగ్రామ మయ్యెను. అయ్యది సకలప్రాణుల సంహరించు

రుద్రుని విహారమును దలపించెను. ఓప్రభూ! అంత నాధనంజయుఁ డున్నకడను సకలధ్వనులను మించి మేనులకు గగుర్పాటు గల్గించు గొప్పచప్పు డుప్పతిల్లెను. అటులే భారతసైన్యమునడుమ సాత్యకివిక్రమ మును మెండై యుండెను. వ్యూహద్వారమున వైరులతో ద్రోణుఁడు పోరాడుచుండెను. ఓరాజా! పార్థుఁడును, సాత్యకియు, ద్రోణుఁడును గుపితులై యుండుటను బుడమిని గొప్పనాశ మారంభమయ్యెను." అని తెలిపి సంజయుఁడు మఱియు నాతనితో నిట్లనియె.

ద్రోణుఁడు పాంచాలసృంజయులపై విక్రమించుట

"ఓరాజా! మఱియు సోమకులతో నాద్రోణునకు గొప్పసంగ్రామ మాయపరాహ్ణమున జరిగెను. అప్పుడు గొప్పచప్పు డుప్పతిల్లెను. పిదప నెఱ్ఱనిగుఱ్ఱములుగలరథ మధిష్ఠించినయాద్రోణుఁడు మఱియు రణరంగ మధ్యమును జొచ్చి మిక్కుఁబ్రియ మొనర్చువాఁడై తనబలము మెఱయఁ జిత్రపుంఖములగు తీవ్రబాణములచేఁ బ్రహరించుచుఁ, బాండవుల నెదు ర్కొని యోధులలో నుత్తములగువారినెల్ల వెదకుచుఁ, బ్రతాపశాలి యై యారణరంగమున విహరించెను. ఓరాజా! పిమ్మటఁ గేకయసోదరు లేవురిలో నుత్తముఁడును, సమరసమర్థుఁడును, మహారథుఁడునగు బృహత్క్షత్రుఁ డాద్రోణుని మార్కొని, తీవ్రవిశిఖముల విడుచుచు, నాయాచార్యుని నొప్పించుచు, మహామేఘము గంధమాదనమున వర్షమునువలె నాతనిపై శరములను వర్షించెను. ఓమహారాజా! అంత నాద్రోణుఁ డాతనిపై సువర్ణపుంఖములై మిక్కిలి తీవ్రము లగు పదునైదు సాయకములను బ్రయోగింపఁ, గుపితసర్పసన్నిభము లగువాని నొక్కొకదాని, నాబృహత్క్షత్రుఁ డైదేసిబాణములచే ననాయాసముగా ఖండించివైచెను. వానిశరలాఘవము నారసి, యా భారద్వాజుఁడు నగుచు, సన్నతపర్వములగు నెనిమిదిబాణముల నాతనిపైఁ బ్రయోగించెను. పిదపఁ దనపైకివచ్చు నాద్రోణప్రయుక్త బాణములను గాంచి, యాకేకయుఁ డెనిమిదిబాణములచే నివారించెను. అట్టి యద్భుతకర్మ మొనర్చిన యాబృహత్క్షత్రుని నైపుణ్యమునకు సైన్య ము వా రాశ్చర్య మొందిరి. పిమ్మట ద్రోణుఁ డాకేకయుని మించునట్లుగా, దుర్జయమగు బ్రహ్మాస్త్రమును బ్రాదుర్భవింపఁజేసెను. అటులు ద్రోణ

ప్రయుక్తమగు బ్రహ్మాస్త్రము నాలోకించి యా కేకయుఁడు నిజప్రయుక్తమగు బ్రహ్మాస్త్రముచే ఖండించెను. అటులు బ్రహ్మాస్త్రము నిహతమగుడు నా ద్రోణు నాతఁడు, సువర్ణపుంఖములును, శిలాశితములునగు నఱువది సాయకములచే నొప్పింప, నా ద్రోణుఁ డొకనారాచముచే నా కేకయునిఁ బ్రహరించెను. అయ్యది వానికవచమును భేదించి, విడువఁబడినకృష్ణసర్పము వల్మీకమునువలెఁ బుడమిఁజొచ్చునంత, వాఁడును గోపావేశపరవశుఁడై కనులఁ బెద్దచేయుచు, సువర్ణపుంఖములగు డెబ్బదిబాణములచే నా ద్రోణుని నొప్పించి, మఱియు నాభారద్వాజుసారథి నొకబాణముచే మర్మము నొప్పించెను. ఓమారిషా! అటు లాబృహత్క్షత్రునిచేఁ బలువిధములుగాఁ బ్రహతుఁడై యా ద్రోణుఁ డాతనిరథముపైఁ బెక్కు సాయకములను బ్రయోగించెను. అయ్యవి మహారథుఁడగు నా కేకయుని వ్యాకులునిఁగా నొనర్చెను. మఱియు నా ద్రోణుఁడు వానిగుఱ్ఱములు నాల్గిటిని నాల్గునారాచములచేఁజంపి, సూతు నొకబాణముచే రథనీడము నుండి కూలఁద్రోసి, రెండు బాణములచే వానిధ్వజచ్ఛత్రములను ఖండించి, పిదప సరిగావిడువఁబడిన యొకబాణముచే వక్షమునుగొట్ట, వాఁడు గుండియలుప్రీలి పుడమిఁబడియెను. ఓరాజా! అటు లా కేకయమహారథుఁడగు బృహత్క్షత్రుఁడు హతుఁడగుడు శిశుపాలపుత్రుఁడు కుపితుఁడై తనసారథితో 'ఓయీ! ద్రోణుఁడున్నకడకు మనరథముఁ బోనిమ్ము. అతఁడు కైకయులను బాంచాలురను గొట్టుచున్నవాఁడు.' అని పలుక విని, వాఁడు, వడిగలకాంభోజాశ్వములతో నా ద్రోణుని సమీపము నొందించెను. పిదపఁ జేదిరాజగు నాధృష్టకేతుఁడును, నగ్నిపై కుఱుకుమిడుతవలె నా ద్రోణుని వధింప నెదుర్కొని, యఱువదిసాయకములచే నాతనిరథమును, నశ్వములను, ధ్వజమును గొట్టి, మఱియుఁ గొన్నితీవ్రబాణములచే, నిద్రించినవ్యాఘ్రమును మేల్కొల్పువాఁడువలె నా ద్రోణునిఁ బీడింప, ద్రోణుఁడు వాఁడిగల యొకక్షురప్రముచే వానిధనుర్మధ్యమును దెగనేసెను. అంత నాధృష్టకేతువు వేఱొకవిల్లు గొని, గ్రద్దఱెక్కలుగలసాయకములచే నాభారద్వాజు నొప్పింప, నతఁడు వానిగుఱ్ఱములఁ గొట్టిఁ సారథిశరీరమునుండి శిరమును దొలఁగించి, నగుచు మఱియు నిరువదైదుబాణముల నాధృష్టకేతు నోనాట నేసెను. అంత నాచైద్యుఁడు, వడిగా రథముడిగి, యొకగదఁబూని,

కుపితసర్పమునాఁదగు దాని నాద్రోణునిపై విసరెను. అశ్మసారమయమై కాలరాత్రివలెవచ్చు నాగద నాలోకించి యాద్రోణుఁడు మహత్తరమై సువర్ణవిభూషితమగుదాని ననేకసహస్రబాణములచే ఖండించెను. అటు లాతనిచే ఖండింపఁబడిన యాగద పుడమి చప్పుడగునట్లుగాఁ బడియెను. అపు డాధృష్టకేతువు, తనగద హతమగుఁడు గుపితుఁడై, సువర్ణోజ్జ్వలమగు నొకశక్తిని దోమరము నాతనిపై వైచెను. అంత నాద్రోణుఁ డాతోమరము నైదిటను, శక్తి నైదిటను ఖండింప, నవి గరుత్మంతునిచే సర్పములువలె భగ్నములయ్యెను. పిమ్మటఁ బ్రతాపనిధియై యాభారద్వాజుఁ డొకతీవ్రవిశిఖముచే నాతనివధించువాఁడై ప్రయోగింప,నయ్యది యాధృష్టకేతునికవచమునుజీల్చి, గుండియలుప్రీల్చి హంసము పద్మమును వలె పుడమిఁజొచ్చెను. అటు లాద్రోణుఁడు కుపితమై యాఁకలిగొన్న పాలపిట్ట పతంగమునువలె నారణరంగమున నటు లాకేకయుని మ్రింగెను. పిదపఁ బరమాస్త్రవేత్త యగు నాధృష్టకేతుసుతుఁడు కుపితుఁడై దలపడ, నగుచు నాద్రోణుఁ డాతనిఁ దీవ్రశరములచే యమమందిరము నొందించెను. అయ్యది మహారణ్యమున బెబ్బులి లేఁడిపిల్లను మ్రింగినట్లయ్యెను. అంత నప్పాండవసైనికులు క్షీణించుచుండుటఁ గాంచి వీరుఁడగు జరాసంధపుత్త్రుఁ డాద్రోణు నెదుర్కొని, వడిగా, మేఘము భాస్కరునివలె శరధారలచే నాతనిఁ గానరాకుండఁజేయ, వానిశరకరలాఘవముల నారసి, యాభారద్వాజుఁడు క్షత్త్రియాంతకుఁడునాఁ జూపట్టుచు,వందలకొలఁదిని వేలకొలఁది బాణముల నాతనిపైఁ బ్రయోగించెను.అటు లాద్రోణుఁ డారథికోత్తముని శరపరంపరలఁ గప్పి యెల్లయోధు లారయుచుండ, నాజరాసంధసుతుని హతునిఁ గావించెను. ఓ రాజా! ఇంత యేల! ప్రళయకాలాంతకుఁడు సకలప్రాణులనువలె నాద్రోణుఁడు తన్నుఁజేరినవారినెల్ల నంత మొందించుచువచ్చెను, మఱియు నతఁడు పెక్కువేలశరములచే నప్పాండవేయుల నావరింప, నామాంకితములై యున్న యాద్రోణబాణములు శిలాశితములై వందలకొలఁది నరులను, నాగములను, హయములను గొట్టెను. అప్పు డప్పాంచాలు రాద్రోణునిచే మున్నాశక్రునిచే రక్కసులువలె హతులగుచుఁ, జలికి వడంకుగోవులువలె వడంకసాగిరి. ఓభరతర్షభా! అటులు తమసైన్యములు మడియుచుండుట నారసి, పాండవులలో ఘోరస్థితి సంభవించెను.

అప్పు డప్పాంచాలురు, సూర్యకిరణములును ద్రోణునిబాణములును దమ్ముఁదపింపఁజేయఁ, జేయునదిలేక నిశ్చేతనులై మూర్ఛవడుచునుండఁ, జేది దేశీయులును, సృంజయులును, గాశికోసలులును, యుద్ధాభిలాషతో నాభారద్వాజుని మార్కొని, 'ద్రోణునిఁ గొట్టుఁడు, చంపుఁడు' అని పరస్పరము పలికికొనుచు, నాతని సమీపించిరి. అటులు తన్నుఁ జంపునట్టి యత్నములతో వచ్చుచున్నయాశూరుల నారసి యాభారద్వాజుఁడు తీవ్రనారాచములచే విశేషించి చేదిసైన్యములను జంపందొడంగెను. అటులు చేదిదేశీయులు క్షీణింపఁగాఁ, బిదప ద్రోణబాణపీడితులై పాంచాలురు వడంకసాగి, భీమసేనధృష్టద్యుమ్నులను బిగ్గరగాఁ బిలిచిరి. అంత నావిధములగుద్రోణునికర్మముల నారసి 'ఆహా! ఈబ్రాహ్మణుఁ డెంతయుఁ జేయరాని గొప్పతపము చేసియున్నవాఁడు. అటులగుటనే యీరణరంగమునఁ గుపితుఁడై క్షత్రియోత్తములనెల్లఁ గాల్చుచున్నవాఁడు. క్షత్రియునకు యుద్ధమును, బ్రాహ్మణునకుఁ దపమును ధర్మములుగదా! ఇతఁడు తపస్వియుఁ గృతవిద్యుఁడునై తనచూపుబలిమిచే నైనఁ గాల్పఁగలఁడు. ఇపుడు సంభవించినద్రోణునియస్త్రాగ్నిలో నృపాలురెల్లఁ గూలుచున్నవారు. మఱియు నితఁడు, తనబలముకోలఁదిని, నుత్సాహముకోలఁదిని, ధైర్యముకోలఁదిని, దేజముకోలఁదిని, సర్వభూతములకును మోహముగల్గించుచు, మనబలమునెల్ల జంపుచున్నవాఁడు.' అని కొందఱు పలుకుచుండఁగా విని మహాబలుఁడగుక్షత్రధర్ముఁడు వెడలి, యొకయర్ధచంద్రబాణముచే నాద్రోణుని శరశరాసనముల ఖండించెను. అంత క్షత్రియమర్దనుఁడగు నాద్రోణుఁడు కుపితుఁడై వేగముగల్గి, భాసురమైన వేఱొకవిల్లుగొని యందుఁ దీవ్రమైన యొకశరము సంధించి యాకర్ణాంతముగా లాగి, యాక్షత్రధర్మునిపై విడిచెను. అయ్యది వానిని జంపి పుడమిఁజొచ్చెను. వాఁడును భిన్నహృదయుఁడై నేలఁగూల, సైన్యములన్నియుఁ జలించెను. పిదప మహాబలుఁడగు చేకితానుఁ డాద్రోణు నెదుర్కొని పదిబాణములచే నొప్పింప, నాద్రోణుఁడును వానివక్షమును నొప్పించి, నాల్గుబాణములచే వాని సారథిని, నాల్గుబాణములచే వానిగుఱ్ఱములను గొట్టి, పదునాఱుబాణములచే వానికుడిభుజమునుగొట్టి, మఱియుఁ బదునాఱిట వానిధ్వజమును, నేడిట వాని మఱియుఁ గొట్టి చంపెను. అంత నాచేకితానుని

సూతుఁడు హతుఁడగుడు, గుఱ్ఱములు రథము నీడ్చికొనిపోయెను. హత సారథియైనవాని నారసి పాంచాలురును బాండవులును మిగుల భయము నొందిరి. ఓమారిషా! పిదప నొకచోనున్న పాండవపాంచాలసృంజయులనెల్ల నాద్రోణుఁడు వెడలఁగొట్టుచు, నెంతయు శోభిల్లెను. ఆకర్ణపలితుఁడై వయసుచే నెనుబదై దేండ్లవాఁడై నల్లని దేహచ్ఛాయగల యావృద్ధుఁడగుద్రోణుఁడు పదునాఱువత్సరముల ప్రాయమువానివలె నారణరంగమునఁ జరించెను. ఓమహారాజా! అటులు నిర్భయముగాఁ జరించు నావైరిమారకుఁడగు ద్రోణుని శత్రువులెల్ల వజ్రహస్తుఁడగు నింద్రునిఁగాఁ దలంచిరి. పిదప మహాబాహుఁడును బుద్ధిమంతుఁడునగు ద్రుపదుఁ డపుడు 'బెబ్బులి ముక్కిడిమృగములనువలె నీలుబ్ధుఁడు క్షత్త్రియులను జంపుచున్నవాఁడు. పాపుఁడగు సుయోధనుఁడు కష్టకరములగు లోకములనొందును. వానిలోభగుణముచేతనేకదా యీసమరమున క్షత్త్రియులనేకులు మరణింపవలసివచ్చెను. మఱియు వందలకొలందిని ఖండింపఁబడి, పుడమిపై గోవృషములువలెఁబడి రక్తసిక్తాంగులై నక్కలకును, గుక్కలకును నాహారములగుచున్నవారు' అని యక్షౌహిణీపతియగు నతఁడు పలికి, పాండవులను మున్నిడికొని యాద్రోణునిపై వెడలెను.” అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## అర్జునున కేమగునోయని ధర్మజుఁడు చింతించుట

“ఓయాంబికేయా! అంత నటు లప్పాండవవ్యూహ మాలోచింపఁబడుడుఁ, బాండవులును, బాంచాలురును సోమకులతోఁగూడ మిక్కిలి దూరముగాఁ దొలఁగియుండిరి. అపుడు మఱియు రౌద్రమై, రోమహర్షణమై సంగ్రామ మారంభమగుడు, యుగాంతమువలె జగమునకుఁ దీవ్రమగుప్రజాక్షయముజరుగ, ద్రోణుఁడు మఱిమఱియు నృత్యమొనర్చుచు విక్రమింపఁ, బాంచాలురును, బాండవసైన్యములును క్షీణించుచుండఁగా వారి కెవ్వరును రక్షకులులేకుండుటఁ గాంచి, యిఁక నిది యెట్లగునని యుధిష్ఠిరుఁడు చింతించి యర్జుసునిఁ గాంచువాఁడై యెల్ల దెసల బరికించెనుగాని, యాతని కవ్వాసుదేవార్జునులు గానరాకుండిరి. పిదపఁ గపిధ్వజముమాత్ర మాతనికిఁ గానవచ్చెను. కాని యాగాండివ

ధ్వని వినరాకుండుట నాయుధిష్ఠిరుఁడు వికలేంద్రియుఁడై వృష్ణిప్రవరుఁడగుసాత్యకియుఁ గనఁబడకుండుటకు, మఱియుఁ జింతాక్రాంతుఁడై యించుకేని మనశ్శాంతి నొందఁడయ్యెను. ఉదారచిత్తుఁడగు నాధర్మజుఁడు తనకు లోకాపవాదము సంభవించునేమోయని మఱియు నా సాత్యకిరథము గానరామి కిట్లు చింతించెను.

'ఆహా! ఈరణరంగమునఁ బార్థునిసహాయమునకై నే నాసాత్యకిని బంపితిని. ఆశైనేయుఁడు మిత్రుల కభయ మొసఁగువాఁడు. కావున నాచిత్త మొక్కటియు రెండువిధములయ్యెను. సాత్యకియు ధనంజయుఁడును నాకిపుడు తెలియఁదగియున్నవారు. అప్పార్థునిరక్షణమునకుఁగా సాత్యకి నంపితినిగాని యాసాత్యకికై యెవ్వని నంపువాఁడను? తన భ్రాతను వెదకుటకై ప్రయత్నించిన యుధిష్ఠిరుఁ డాసాత్యకిని వెదకుటకై ప్రయత్న మొనరింపఁడయ్యెనే యని లోకులు నన్ను నిందింపక మానరు. సాత్యకి నిపుడు వెదకింపక విడువరాదు. కావున లోకాపవాదమునకుఁ బాత్రుఁడను గాకుండునట్లుగా మహాత్ముఁడగుసాత్యకి మార్గమును గనిపెట్టుటకై భీము నిపుడు పంపెదను. శత్రుసూదనుఁడగునర్జునునిపై నాకెట్టిప్రీతియో రణగర్వితుఁడగు నాసాత్యకిపైని నైతమట్టిప్రీతి గలదు. ఆశైనేయునిపై నేను గొప్పభారము పెట్టితిని. అతఁడు మిత్రుఁడనగు నామాట దప్పలేకుండుటను నాపై గౌరవముంచి మహాబలుఁడై, మొసలి సముద్రమునువలె భారతసైన్యమును బ్రవేశించెను. యుద్ధాభిలాషులగుశూరులచప్పుడు వినవచ్చుచున్నది. అయ్యది సాత్యకియుద్ధమైయుండును. హితమాలోచింపఁగా బలవత్తరమగు నిట్టి నానిశ్చయమునకుఁ దగుసమయ మిదియైయున్నది. మహారథులగుపార్థసాత్యకులకడ కిపుడు ధనుర్ధరుఁడగు భీమసేను నంపవలయును. ఇప్పుడమి నిప్పాండవున కసాధ్య మెయ్యదియు లేదు. సకలధనుర్ధరులలో నితఁడు నిజబలమూని ప్రతివ్యూహ మొనర్పఁ దగినసమర్థుఁడు. మహాత్ముఁడగు నీతనిబాహుబలము నాశ్రయించియేగదా! వనవాసమునుండి మరలఁ గల్గితిమి. యుద్ధములందుఁ బరాజయ మొందకుండుటకును నితఁడేగదా హేతువు. ఆసాత్యకిని వెదక నితఁడు వెడలినచో నప్పార్థసాత్యకుల కిరువురకు రక్షణ మొదవెడిని. అటులేని వారినిగూర్చి పరితపింపనక్కఱలేదు. అస్త్రవిశారదులగు వారిరువురు నావాసుదేవు

ననుగ్రహముచే సురక్షితులై యుందురు. ఇపు డవశ్యము నాచింతలు దొలఁగింపఁదగియున్నవి. కావున నాసాత్యకి నన్వేషించుటకై భీముని నియోగించెదను. అపుడు సాత్యకికి నేను జేయఁదగుపని చేసినవాఁడ నగుదును.'

అటు లాధర్మజుఁడు నిశ్చయించి తనసారథితో 'ఓయీ! భీముని కడకు నన్నుఁ దీసికొనిపొమ్ము.' అని పలుక విని వాఁడును, సువర్ణాలంకృతమగురథము నాభీముని చెంతకుఁ దీసికొనిపోయెను. అంత నాయుధిష్ఠిరుఁ డాభీముని సమీపించి యప్పటికిఁ దగుకృత్యమును స్మరించుచుఁ, జింతాక్రాంతుఁడై యాభీమునిఁ బిలిచి 'ఓతమ్ముఁడా! మున్ను దేవగంధర్వులను దైత్యులను నెవ్వఁ డసహాయుఁడై జయించెనో, యట్టి నీతమ్ముని చిహ్నము లెవ్వియుఁ గానరాకున్నవి.' అని పలుకునంతలో నటులు చింతాక్రాంతుఁడై యున్న తనయన్నను గాంచి భీముఁడాతనితో 'ఓ రాజోత్తమా! నీకుఁగల్గిన యిట్టిశోకము నేనెన్నఁడును గని విని యుండలేదు. మున్ను మిగుల దుఃఖార్తులమైన మాకు నీవేగదా గతియైనవాఁడవు. ఓరాజేంద్రా! లెమ్ములెమ్ము. నీకేమి కావలయునో దాని శాసింపుము. ఓయన్నా! నాకసాధ్యమగుకార్య మెయ్యదియు లేదుగదా! నన్నాజ్ఞాపింపుము. నీవు శోకింపకుము' అని పలుక విని యాయుధిష్ఠిరుఁడు కనుల నీరునించుచుఁ, గృష్ణసర్పమువలె బుసకొట్టుచుఁ, బరిమ్లానముఖుఁడై యాభీమసేనునితో 'ఓతమ్ముఁడా! ఉద్రేకముతో నావాసుదేవుఁడు తనపాంచజన్యమును బూరించుట నాధ్వనియే వినవచ్చుచున్నది. నిశ్చయముగా నిపుడు నీతమ్ముఁడు రణరంగమునఁ బడియుండెనేమో? అతఁడు హతుఁడగుటచే జనార్దనుఁడు యుద్ధముచేయుచున్నవాఁడు. సత్త్వవంతుఁడగు నాతని ననుసరించియేగదా మనము జీవించుచున్నవారము. ఆయింద్రు నమరులువలెఁ భయముగల్గినపుడెల్ల నాతనినేగదా శరణమందుచున్నవారము. కావున శూరుఁడగునతఁడు సైంధవవధాభిలాషియై యిపుడు కౌరవసైన్యమును జొచ్చి, మఱి మరలఁజాలకుండెనేమో? ఆహా! శ్యామలాంగుఁడై, యువకుఁడై గుడాకేశుఁడైన యాయర్జునుఁ జూడవలెననియే యున్నది. వ్యూఢోరస్కుఁడును, మహాబాహుఁడును, మత్తగజవిక్రముఁడును, జకోరనేత్రుఁడును, దామ్రాక్షుఁడును నై వైరుల కతఁడు భయము గల్గించువాఁడుగదా!

ఇదియే నాపరితాపమునకు హేతువు. నీకు శుభమగుఁగాక. ఓమహా బాహూ! ఆయర్జునసాత్యకులకుఁగా హవిస్సుచే నగ్నివలె, మఱిమఱియు నాకు శోకము వర్ధిలుచున్నయది. అప్పార్థునిచిహ్నము గానరామికి నాకుఁ జింతవొడముచున్నది. అప్పార్థుని ముప్పుగాంచి కృష్ణుఁడు యుద్ధముచేయుచున్నవాఁడు. పురుషవ్యాఘ్రుఁడగుసాత్యకి మహారథుఁడగుట నెఱుఁగుదువుగదా! అతఁడు నీతమ్మున ననుసరించి పోయినవాఁడు. అతఁడును గానరాకుండుట నాకు వంత మఱింత యధికమగుచున్నది. కావున నాయర్జునసాత్యకులున్నకడకు నీవు వెడలుట కర్తవ్యమని తలంచితేని పొమ్ము. ఓధర్మజ్ఞా! నీకు నేను జ్యేష్ఠభ్రాతనగుట నావచన మంగీకరింపక తప్పదు. ఆయర్జునసాత్యకులలో మున్నుగా సాత్యకివిషయము దెలిసికొనవలయుఁజుమీ! అతఁడు నాకుఁ బ్రియమొనర్పువాఁడై సవ్యసాచి ననుసరించినవాఁడు. అతఁడు వెడలినత్రోవ సాధారణుల, కగమ్యమైనఘోరమార్గము. కావున నోసోదరా! కృష్ణార్జునులయు సాత్యకియు నేమముదెలిసికొని, యందులకు గుఱుతుగా సింహనాద మొనర్పుము.' అని పలుక విని యాతనితో భీముఁ డిట్లనియె.

## భీముఁడు శత్రుసైన్యముఁ జొచ్చి విక్రమించుట

'ఓయన్నా! బ్రహ్మయు, శంకరుఁడు, నింద్రుఁడు, వరుణుఁడును, నధిష్ఠించినరథమెక్కి యాకృష్ణార్జునులు వెడలినవారు. వారికి భయమన నెట్టిది? అయినను నీయానతి శిరసావహించి యిదె పోవుచున్నాఁడను. నీవు మఱి చింతిల్లకుము. ఆనరవ్యాఘ్రులను గలిసికొని నీకు గుఱుతు దెలిపెదను.'

ఓయాంబికేయా! అటు లాభీముఁడు పలికి యుధిష్ఠిరునకును, ధృష్టద్యుమ్ననకును, మఱియుఁగల మిత్రులకును మఱిమఱియు నమస్కరించి, ధృష్టద్యుమ్ననితో 'ఓమిత్రుఁడా! ద్రోణుఁడు మహారథుఁడగుట నీవెఱింగినదియగదా! అతఁడెల్లయుపాయములచే ధర్మజునిఁ బట్టుకొనుయత్నముతో నున్నవాఁడు. ఓపార్షతా! మనరాజును రక్షించు టెంతయావశ్యకమో? నేను బోవునట్టికార్య మట్టియావశ్యకము కానేరదు. ఇటు లింతగా నతఁడు తెలుపుటనుబట్టి మాఱుమాటాడలేక పోయితిని. ఎందాసైంధవుఁడు చావనున్నవాఁడో యందున్నలకు నేను

బోవలయును. ధర్మరాజవచన మంగీకరింపక తప్పనిదిగదా! అటులగుట నాభ్రాతయు సాత్యకియు వెడలినమార్గము ననుసరించెదను. నీవిపుడు సన్నద్ధుఁడవై యుధిష్ఠిరుని రక్షింపుము. మన కీరణరంగమున నిదియే ముఖ్యకర్తవ్యముసుమీ!' అని తెలుప విని యాధృష్టద్యుమ్నుఁడు 'ఓ వృకోదరా! నేను నీయభీష్టము నెఱవేర్చెదను. నీవు శంకింపక పొమ్ము. ఆద్రోణుఁ డీసమరమున నీధృష్టద్యుమ్నునిఁ జంపిగదా ధర్మజునిఁ బట్టుకొనవలయును.' అని పలికెను.

అంత నాభీముఁ డటు లాధృష్టద్యుమ్నున కాయుధిష్ఠిరు నప్పగించి, పూజ్యుఁడును జ్యేష్ఠుఁడునగు ధర్మజునకు మ్రొక్కి, యర్జునుఁడు వెడలినత్రోవ వెడల నుద్యుక్తుఁడయ్యెను. అంత నాధర్మజుఁ డాభీముని గౌఁగిలించికొని, మూర్ధాఘ్రాణ మొనరించి మంగళాశీర్వచనములొనర్ప, నావృకోదరుఁడు, పూజితులై సంతుష్టాంతరంగులగు బ్రాహ్మణులకుఁ బ్రదక్షిణనమస్కార మొనర్చి, యెనిమిదివిధములగు మంగళపదార్థములఁ బూసికొని, కైలాతకమధువు ద్రావి, రెట్టియగుబలముతో మదరక్తాంత నేత్రుఁడై బ్రాహ్మణులిచ్చు నాశీర్వాదములఁ గొనుచు, విజయసూచకముగాఁ దనబుద్ధి యానంద మొందుచుండ, ననుకూలవాయువులు వీవ వెడలెను. ఓరాజా! కవచధారియుఁ, గుండలభూషితుఁడును, సాంగదుఁడునగు నాతనియుక్కుకవచము, సువర్ణచిత్రితమై, మెఱుపులతోఁ గూడిన మేఘమునా వెలయఁజొచ్చెను. మఱియునతఁడు పచ్చనివియు, నెఱ్ఱనివియు, నల్లనివియుఁ, దెల్లనివియునగు వస్త్రములఁ జుట్టికొనియెను. ఇంద్రాయుధముతోఁగూడిన మేఘమువలె నతఁడు, మఱియుఁ గంఠత్రాణముచే వెలయుచు నీవారిసైన్యముతోఁ బోరాడ వెడల, మఱియుఁ బాంచజన్యధ్వని ఘోరమై వినవచ్చెను. దానిని విని ఘోరమై ముల్లోకములకు వెఱపుగొలుపు నాగొప్పచప్పుడు తన్ను జడిపింప,యుధిష్ఠిరుఁడు మఱియు నాభీమునితో 'ఓసోదరా! ఇదె యాయాదవోత్తముఁడు పాంచజన్యమును బూరించుచున్నవాఁడు. ఆశంఖరాజము, తననినాదముచేఁ బృథివ్యంతరిక్షముల ధ్వనింపఁజేయుచున్నది. నిశ్చయముగా నర్జునుఁ డాపదనొందియుండుట నావాసుదేవుఁ డాకౌరవులతోఁ జక్రగదాధరుఁడై పోరాడుచున్నవాఁడు. నిశ్చయముగాఁ బూజ్యయగు కుంతియు, ద్రౌపదియు, సుభద్రయు నిపుడిప్పాపమును బ్రత్యక్షముగా

బంధువులతోఁ జూడవలసివచ్చునేమో? కావున నోతమ్ముఁడా! వడిగా సక్కవ్వాడియున్న కడకు వెడలుము. ఓపార్థా! ఆధనంజయునిఁ జూచు కోర్కిగల నాకు దెసలన్నియు మోహపఱుచుచున్నవి. అటులే సాత్యకియు నాయుత్తలమునకు నిమిత్తమగుచున్నవాఁడు. పొమ్ము. పొమ్ము.' అని యతఁడు సెలవిచ్చిపంప, నాభీముఁడు ప్రతాపశాలియై శరశరాసన ధరుఁడై భ్రాతకుఁ బ్రియమొదవ దుందుభుల మ్రోయించుచు, శంఖమును బూరించుచు సింహనాదమొనరించి, ధనుష్టాంకారమొనర్ప, నాయాశావముచే వీరులచిత్తముల కుత్తలమొదవించుచుఁ, దనఘోరాకారము వైరులకుఁ జూపుచు వడిగా వెడలెను. పిదప విశోకుఁడగుతన సారథి, తేరాయత్తముచేసి తేర, మనోవాయుతుల్యవేగములగు నాతనిగుఱ్ఱములు వడిగాఁ బరువులిడసాగెను. అంత నతఁడు తనవింటి త్రాఁడు పీడించుచు, లాగుచు, సైన్యమును గలఁతనొందించెను. అటులు వెడలుచున్న యాభీముని, సోమకులును, బాంచాలురును, శూరులై యింద్రు నమరులువలె నాతని ననుసరించి వెడలిరి. ఓమహారాజా! సోదరులగు దుశ్శల, చిత్రసేన, కుండభేది, వివింశతి, దుర్ముఖ, దుస్సహవికర్ణలును, శలుఁడును, విందానువిందులును, సుముఖుఁడు, దీర్ఘబాహుఁడు, సుదర్శనుఁడు బృందారకుఁడు, సుహస్తుఁడు, సుషేణుఁడు, దీర్ఘలోచనుఁడు, నభయుఁడు, రౌద్రకర్ముఁడు, సువర్మయు, దుర్విమోచనుఁడును సైన్యములతోఁగూడి సన్నద్ధులై యాభీమసేనుని మార్కొనిరి. అటులు వారు తన్నావరించుటయుఁ బరాక్రమనిధియు, సమరశూరుఁడును మహారథుఁడు నగు నాభీముఁడు వారి నారసి, సింగము మృక్కిడి మృగములనువలె వారిపైఁ దలపడియెను. వారును దివ్యములగుమహాస్త్రములను బ్రయోగించుచు, నుదయకాలసూర్యుని మేఘములువలె శరధారలచే నాతనిఁ గప్పుచుండ, వారి నతిక్రమించి యతఁడు కడువడిగా ద్రోణునిసైన్యమును జేరఁబోయెను. అంత నతఁడు తన కెదురైన గజసైన్యమును శరవర్షమునముంచి, యచిరకాలముననే వానిని దెసలంటఁగొట్టి పీడించెను. ఆయేనుగులు శరభగర్జితమునకు మృగములు వలె జడిసి, భైరవారావములొనర్చుచుఁ బరువులిడిపోయెను. మఱియు నతఁడు వడిగా ద్రోణసైన్యముపైఁ బడియెనుగాని, యాతని నాయాచార్యుఁ డుద్రేకించినసముద్రమును వేలవలె నాపి, నగుచు నొకనారా

చముచే హానిలలాటమునఁ గొట్టి, నపు డూర్ధ్వకిరణుఁడగుసూర్యుఁడు వలె నాభీముఁడు గానవచ్చెను. అంత నాద్రోణుఁడు, 'పార్థునివలె వీఁడును నన్ను మన్నించునేమో' యని తలంచి యాతనితో 'ఓభీమసేనా! మహాబలుఁడవయ్యు నన్నీసమరమున జయింపక శత్రుసైన్యమును బ్రవేశింప నీకు వలనుపడదు. నీసోదరుఁడు కృష్ణునితో నాయంగీకారముపై యిందుఁ బ్రవేశించినవాఁడు. అటులుగాకున్న నీవు నా సైన్యమును బ్రవేశింప నెటులగును?' అని పలుక విని, యాగురునివచనమునకు జడియక, కుపితుఁడై కన్ను లెఱ్ఱవార, వడిగా నాతనితో 'ఓబ్రహ్మబంధూ! మాయర్జునుఁడు నీయనుమతి యుద్ధభూమిని బ్రవేశించెనా? దుర్జయుఁడగునతఁడు వాసవునిసైన్యమునైనఁ బ్రవేశింపఁగలవాఁడు. ఆతనిపరమపూజచే మన్నింపఁబడినాఁడవుగాఁబోలు? ఓ ద్రోణా! నేనాదయగలయర్జునుఁడనుగాను. నేను నీకు వైరినగుభీమసేనుఁడను. మాకెల్లరకును నీవు తండ్రివిని, గురుఁడవును, బంధుఁడవునైనవాఁడవు. అటులే మేమెల్ల నీకుఁ బుత్రులము. అని తలంచుచు నీకు నమ్రులమైనవారము. ఇటులు పలుకుచున్న నీకడ నది యిపుడు విపరీతమై చూపట్టుచున్నది. నీవు నన్ను శత్రునిఁగాఁ దలంతువేని యటులే తలంపవచ్చును. శత్రుఁడవగు నీకుఁ దగినకృత్యమునే యీభీముఁ డొనర్చువాఁడు.' అని పలికి గదను ద్రిప్పుచుఁ, గాలదండము కేలఁబూనిన యముఁడునా భీముఁ డాద్రోణునిపై దానిని వైచెను. అంత నాద్రోణుఁడు రథమునుండి పైకుఱికెను. అపు డాగదాప్రహారము ద్రోణుని సూతుని, ధ్వజాశ్వములను దొలఁగించి, పెనుగాలి వృక్షములనువలెఁ బెక్కురుయోధులకుఁ బ్రహతియొనర్చెను. పిదప మఱియు నీతనయులెల్ల నాతనిఁ జుట్టికొనిరి. అంతట నారథికోత్తముఁడగుద్రోణుఁడు వేఱొక్కరథ మధిష్ఠించి, వ్యూహద్వారమును జేరి, యుద్ధసన్నద్ధుఁడై యుండెను. పిమ్మటఁ బరాక్రమనిధియగుభీముఁడు కుపితుఁడై తన యెదుటి సైన్యసమూహముపై శరవర్షము గురిపించెను. అటు లాయుద్ధమున మహారథులగునీపుత్రులు భీమునిచేఁ బ్రహతులగుచుండియు జయాభిలాషులై యాతనితో యుద్ధముచేయఁదొడంగిరి. పిదప దుశ్శాసనుఁడు కుపితుఁడై రథశక్తినివైవఁ బరశురూపమగు నామహాశక్తిని రెండుఖండములుగా నతఁడు ఖండించెను. అది యెంతయు నాకద్భుత

మొనర్చెను. మఱియు నతఁడు కొన్ని తీవ్రబాణములచేఁ గుండభేదిని, సుషేణుని, దీర్ఘనేత్రుని మూఁడుబాణములచేఁ గొట్టి, మూవురను వధించెను. పిదప వీరులై నీకుమారులు పోరాడుచుండఁ గౌరవకీర్తివర్ధనుఁడగు బృందారకు నాభీముఁడు మ్రందించి, మఱియు మూఁడుబాణములచే నీపుత్రులగు నభయుని, రౌద్రకర్ముని, దుర్విమోచనుని, సువిమోచితులఁ గావించి చంపెను. ఓమహారాజా! బలవంతుఁడగు నాతనిచే నీతనయులు వధింపఁబడుచు, ధనుర్ధరోత్తముఁడగు నాభీముని మఱియు నెల్లెడలఁ జుట్టికొనిరి. అటు లావరించి శరపరంపరలచేఁ గప్పుచు, వేసవి తుదిని జలధారలచే ధరాస్థలిని గప్పుమేఘములునాఁ జూపట్టిరి. ఆబాణవర్షము నాభీముఁడు పాషాణవర్షమును బర్వతమువలెఁ బరిగ్రహించుచు, నించుకేని వ్యథనొందకుండెను. పిమ్మట నతఁడు విందానువిందులను నీకొమరుఁడగు సుశర్మునిఁ గాంచి నగుచునే కొన్ని బాణములచే యమమందిరము నొందించెను. పిదప వీరుఁడగు నీకుమారుఁడు సుదర్శనుఁడుఁ మార్కొన, వానిని వడిగాఁ గొట్టి పడఁద్రోసి చంపెను. అటులతఁడచిరకాలముననే శరపరంపరచే మనరథసైన్యములఁ గొట్టి, నలుగడలఁగాంచుచు, గానవచ్చినవారిని బీడించెను. ఓరాజా! ఆరణరంగమున నీకొడుకులెల్ల నాతనిరథఘోషమునకును, గర్జనమునకును లేడులునా జడిసి, భంగమొంది, వడిగా వారెల్లరును బరువులిడి పోసాగిరి. అంతనాకౌంతేయుఁడు నీపుత్రులసైన్యమును వెంబడించి నొప్పింప, వారు మఱియు వధ్యమానులగుచు, వడిగలగుఱ్ఱములను బ్రేరించుచు, నాభీమునివిడిచి యారణరంగమునుండి తొలఁగిపోయిరి. అటులు మహాబలుఁడగు నామహాబలతనయుఁడు వారినెల్ల నోడించి, బాహువులప్పళించి సింహనాద మొనర్చెను. మఱియు నతఁడు గొప్పచప్పుడుప్పతిలఁ జప్పటులుచఱచి, రథసైన్యమునకు వెఱపుగొలుపుచు, నుత్తములగు యోధులనెల్లఁ గడచి, మఱియు నాద్రోణసైన్యమును దలపడియెను." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

{ అర్జునదర్శనముచే భీముఁడొనర్చిన సింహనాదమును విని యుధిష్ఠిరుఁడు సంతసించుట. }

"ఓయాంబికేయా! అటులు రథసైన్యమును గడచివచ్చిన యఘ్ఫాండవునిఁ గాంచి నగుచు, నాతని నివారించువాఁడై యాద్రోణుఁడు

శరవర్షమును గురియుచుండ, నాద్రోణచాపవిముక్తములగు శరపరంపరల మ్రింగుచున్న వాఁడువలెఁ జలింపక, కౌరవసైన్యమును గవిసెను. అంత నీపుత్త్రులు ప్రేరింపఁ గొందఱు క్షత్త్రియవీరు లావృకోదరు నావరింప, నాభీముఁడు నగుచు, గదను ద్రిప్పుచు, సింహనాదమొనర్చుచు, నాగదను వారిపై విసరెను. ఓమహారాజా! ఇంద్రునిచేఁ బ్రయుక్తమగు వజ్రాయుధమువలె నాతనిమహాగద నీవారిసైనికులను మథించుచు, మహానాదముచేఁ బుడమినెల్లఁ బూరించుచుఁ, దేజముచేఁ బ్రజ్వలించుచు నీపుత్త్రులకు వెఱపుగొలిపెను. తేజోయుక్తమై యటులు వచ్చుచున్నయాగదను గాంచి నీవారెల్లరును భీకరారావము లొనర్చుచుఁ బరువులిడసాగిరి. ఓమారిషా! ఆపరుషధ్వనిని విని కొందఱురథికులు రథములనుండి నేలఁగూలుచుండిరి. గదాహస్తుఁడగు భీమునిచే నీకొమరు లటులు వధ్యమానులగుచు, బెబ్బులినిమూర్కొనిన మృగములువలె జడిసి నలుదెసలకుఁ జెదరిరి. అంత నాకౌంతేయుఁ డటులు వైరుల దూరగతులఁగావించి, పక్షిరాజగు గరుడునివలె వడిగా నాసైన్యమునుగడచి చనుచున్న యాభీమునిఁ గాంచి, యాభారద్వాజుఁడు మఱియు నెదుర్కొని శరతరంగములచే నివారించి, మఱియుఁ బాండవులకు భయముగల్గునట్లుగా సింహనాదమొనర్చెను. ఓమహారాజా! అపు డామహాత్ముఁడగు భీమునకును, ద్రోణునకును, దేవాసురయుద్ధమును బోలిన ఘోరయుద్ధమయ్యెను. ద్రోణచాపవిముక్తములగు బాణములచే యుద్ధవీరులగువారు వందలకొలందిని, వేలకొలంది నెపుడు మడియఁజొచ్చిరో, యప్పు డప్పాండవుఁడు రథముడిగి, కాలినడకతో నాద్రోణుని సమీపించి, యాతనిశరవర్షమును, వృషభము, వర్షమునువలెఁ దలయొడ్డి ప్రతిగ్రహించుచు, నాద్రోణుని రథదండమును గేలఁబూని, మహాబలుఁడై విసరెను. అంత నాద్రోణుఁ డాభీమునిచే నటులు దూరముగాఁ జిమ్మఁబడి వేఱొక రథ మధిష్ఠించి, మఱల వ్యూహద్వారమును జేరెను. ఓరాజా! అతఁ డటులు వచ్చునంతలో విశోకుఁ డాభీమునిరథము వడిగాఁదోలుట మా కెంతయు నద్భుతమయ్యెను. పిదప నాభీముఁ డెప్పటిచొప్పున రథ మధిరోహించి,కడువడిగా నీకొడుకగు సుయోధనునిసైన్యమును సమీపించి, పెనుగాలి వృక్షములనువలెనందలిక్షత్త్రియులను మర్దించుచు,నదీవేగము వృక్షములనువలె శత్రుసైన్యమును నివారించుచు, భోజసైన్యమును

జేరి, యందు నాయకుఁడై నకృతవర్మని నొప్పించి, తలశబ్దముచే సైన్యములను బెదరించుచు, బెబ్బులి వృషభములనుఁబలె సకలసైన్యములను జయించెను. అటు లాభోజునిసైన్యమును దాఁటి కాంభోజునిసైన్యమునుగడచి, యుద్ధవిశారదులగుమ్లేచ్ఛులను, నింకను మఱియనేకులను మర్దించుచు, యుద్ధమొనర్చుచున్నసాత్యకిని గాంచి, యాధనంజయునిఁ జూచువాఁడై కడువడిగా వెడలెను. అట్లు వెడలి యాసమరమున నీవారియోధులతో యుద్ధముచేయుచున్న యర్జునునిఁ గాంచెను. అపుడాయర్జునుఁడు సైంధవవధమునకుఁగాఁ బరాక్రమించుచు, నాతనికిఁ గానరా నతఁడు చూచి గొప్పనాదముతో నఱచెను. ఓమహారాజా! వర్షకాలమేఘధ్వని నాఁదగు నాభీమసేనునిఘోరారావమును విని, యవ్వాసుదేవార్జునులు చూచువారై, మఱియుమఱియు నాదమొనరించు నాతనికి బదులుగాఁ దామును బ్రతినాదములొనర్చి, భీమునివైపు వెడలిరి. అంత నాయుధిష్ఠిరుఁడు తనతమ్ములగు భీమార్జునుల గర్జనములు విని నిర్విచారముగా నుండెను. మఱియు నతఁ డాధనంజయుని విజయము నాశీర్వదించెను. అటులు మదోత్కటుఁడై యాభీముఁడు మహానాదమొనర్చుచుండ నాధర్మజుఁడు చిఱునగవువెలయఁ దనలోఁ బానిట్లనుకొనియెను.

'ఓభీమా! నామాట చెల్లించితివి. నాకు గుఱుతుదెలిపితివి. నీవెవ్వరిని దలపడితివో వారు సామాన్యులుగారు. దైవవశముచే నర్జునుఁడును, సాత్యకియు జీవించియున్నవారు. దైవకృపచే నవ్వాసుదేవార్జునులగర్జనములును వినవచ్చెను. ఆహా! అప్పార్థుఁ డింద్రుఁ జయించి, యగ్నికిఁ దృప్తిగలిగించెనుగాదే! అట్టియర్జునుఁడు శత్రుసైన్యమున దైవకృపచే జీవించియున్నవాఁడు. ఎవ్వనిబాహుబలముపై నాధారపడి మనమెల్ల జీవించితిమో, యట్టిఫల్గునుఁడు వైరులఁ బరిమార్చుచు జీవించియున్నవాఁడు. దేవతలకును జయింపరాని యానివాతకవచుల నెవ్వఁడొక్కధనువుచే జయించెనో, యట్టిపార్థుఁడు దైవకృపచే జీవించియున్నవాఁడు. నాఁడు గోగ్రహణమునకై విరాటనగరమునకుఁ గౌరవులెల్ల గలిసిరా, వారి నెవ్వఁడు జయించెనో, యట్టిపార్థుఁడు దైవానుగ్రహముచే జీవించియున్నవాఁడు. పదునాల్గువేవురుకాలకేయుల నొక్కఁడును దనభుజపరాక్రమముచే నెవ్వఁడు జయించెనో, యట్టివిజయుఁడు

జీవించియుండుట దైవకృపగాదే? మున్నా సుయోధనునకై బలశాలి యగుగంధర్వరాజు నెవ్వాఁడు తనయస్త్రబలముచే నోడించెనో యట్టి క్రీడి దైవానుగ్రహముచే బ్రతికియున్నవాఁడు. కిరీటమాలియు, బల శాలియు, శ్వేతాశ్వుఁడును, కృష్ణసారథియు, నెల్లవుఁడును నాకుఁ బ్రియుఁ డగుపార్థుఁడు ప్రాణములతో నున్నవాఁడు. పుత్రశోకాభితప్తుఁడై దుష్కరకర్మ మొనర్ప నెంచి, సైంధవుని వధింతునని యెవ్వఁడు ప్రతిన వట్టెనో, యట్టిధనంజయుఁ డాజయద్రథుని నేఁటియుద్ధమున మడియిం చునా? సూర్యుఁడస్తమింపకమున్నే సైంధవునిఁ జంపి, తనప్రతిజ్ఞ నెర వేర్చికొని, యవ్వాసుదేవునిచే రక్షితుఁడైనయర్జునుని మరలఁ గలియఁ గల్గుదునా? దుర్యోధనహితముగోరిన యాసైంధవుఁడు పార్థునిచేఁ బుడమిఁబడి వైరుల నానందింపఁజేయునా? అటు లర్జునునిచే హతుఁడైన సైంధవహంతకు నారసి, యాసుయోధనుఁడు మాతో నికనైన సంధి యొనర్చునా? నేఁటియుద్ధమున భీముఁడు చంపిన తనతమ్ములను గాంచి మందబుద్ధియగు సుయోధనుఁ డింకనైన మాతో సంధించునా? మఱియు మడిసి పుడమిఁబడిన మహాయోధులను జూచియైన మందుఁడగుదుర్యో ధనుఁడు పశ్చాత్తాపమునొందునా ? మాతోఁ దనకుఁగలవైరము నా సుయోధనుఁ డొక్కభీష్మునిమరణముతో ముగించి, మిగిలినవారిని రక్షిం చుటకైన మాతో సంధియొనర్చునా?' అని జాలి మిగులఁ బలువిధముల నతఁడు వగచుచుండఁగా, ఘోరయుద్ధ మారంభమయ్యెను" అని తెలుప విని ధృతరాష్ట్రుఁ డాసంజయునితో మఱియు నిట్లనియె.

కర్ణుఁడు భీమునిచేఁ బరాజితుఁడగుట

"ఓసంజయా! మహాబలుఁడగుభీముఁ డటులు మేఘగర్జనమును బోలునట్టు లఱచుచుండ, నాతని మనవా రెవ్వరేని మార్కొనిరా? కుపితుఁడైన యాభీమునెదుట రణరంగమున నిలుచువాని నెవ్వనిని నేను ముల్లోకములందును జూడ లేదు. మహాసంగ్రామమునఁ గాలుఁడు నా గదను బూనియున్న, వాని యెదుట నిలుచువాఁడెవ్వఁడును నా కగపడలేదు. ఒకయేన్గుతో వేఱొకయేన్గును, రథముతో రథమును గొట్టునట్టి యాకట్టడివీరు నెదుట నాయింద్రుఁడేని యెట్టు నిలువఁ గలఁడు? నాకొమరులను జంపువాఁడై సమరమునఁ గుపితుఁడైయున్న

యాభీమునెదుట దుర్యోధనుహితముగోరు వారే నెవ్వరు నిలువఁగలరు? ఓసంజయా! నాకొమరులనెడి తృణరాశికి దవాగ్నియై, యాభీముఁడటులు దవులఁబెట్టుచుండ నాతని నెవరు మాఱ్కొనిరి? యముఁడు ప్రజాసమూహమునువలె నాపుత్రుల నాభీముఁడు చంపుచుండఁ జూచి యెవ్వారే నాతనిఁ జుట్టికొనిరా? ఓయీ! వాయుసుతునుండి నాకుఁగల్గుభయ మాయర్జుననుండిగాని, యావాసుదేవునుండిగాని, యాసాత్యకినుండిగాని, ధృష్టద్యుమ్నునుండిగాని లేదు. అటులగుటఁ బ్రదీప్తమగుభీమాగ్ని నా కొమరులను గాల్చుచుండఁగా శూరులగు నెవ్వా రాతని మాఱుకొనిరి? అదియెల్ల నాకెఱిఁగింపుము."

అది విని యాసంజయుఁ డాతనితో "ఓరాజా! అటులు గర్జిలు మహారథుఁడగు నాభీముని సంకులధ్వనివిని బలశాలియగుకర్ణుఁ డాతని మాఱ్కొని మిగులఁ గుపితుఁడై, మహత్తరమగుధనువు నాకర్షించుచు యుద్ధాభిలాషియై తనబలము వెలయఁ బెనుగాలి మార్గమును వృక్షమువలె నాతనిమార్గము నిరోధించెను. అటు లావేశపూరితుఁడై యెదుట నున్న యక్కర్ణునిఁ జూచి యాభీముఁడు కుపితుఁడై, శిలాతీవ్రములగు బాణములను బ్రయోగింప, వానిని మరలించుటకుఁగా నారాధేయుఁడు కొన్ని నారాచములను బ్రయోగించెను. అపు డాకర్ణభీమసమాగమము నరయునట్టి సకలయోధులయొడళ్లును వడంకసాగెను. వారిరువురి యత్తెముల చప్పుడువినిన రథికులకును, రౌతులకును వెఱపు గలుగఁజొచ్చెను. మఱియు నాభీముని భీమనినాదమును విని యందలిక్షత్త్రియులందఱును భూమ్యంతరిక్షములు నిరుద్ధములయ్యెనని తలంచిరి. మహాత్ముఁడగు నా వృకోదరుఁడు మఱియు నొనర్చిన యానినాదముచే సమరమునఁగల సకలయోధులధనువులును జేతులనుండి జాఱి నేలఁబడియెను. సకల సైన్యములును జడిసి, మలమూత్రములను విసర్జించెను. ఓరాజా! అటులే వాహనములన్నియు వికలచిత్తములై యుండెను. ఘోరములగు పెక్కు దుర్నిమిత్తము లపుడు గానవచ్చెను. ఆకసమంతయు గ్రద్దలతోడను, రాబందులతోడను నిండియుండెను. అట్టి యాభీమకర్ణసమాగమమునఁ గర్ణుఁ డిరువదిశరములచే నాభీమునిఁ బ్రహరించి, మఱియు నాతనిసూతు నైదుబాణములచే నొప్పించెను. అందులకు నగి, యాభీముఁడు తనమహా

బలమేర్పడఁ గరలాఘవము వెలయ, నఱువదిసాయకము లక్కర్ణుని మేనఁ జొొప్పింప, నతఁడు నాల్గుబాణము లాతనిపైఁ బ్రయోగించెను. అంత నవి తన్నుఁ జేరకమున్నే యాభీముఁడు వానిని దీవ్రబాణములచేఁ దన హస్తలాఘవము వెలయ ఖండించివైచెను. అపు డారాధేయుఁ డాతని శరవర్షముచేఁ గప్పె, మహారథుఁడగు భీముఁ డక్కర్ణునిముష్టిదేశమునఁ గొట్టి, వానిధనువుదునుమాడి, మఱియుఁ బదిబాణములచే నొప్పించెను. పిదప నారాధేయుఁడు వేఱొకవిల్లుగొని యెక్కిడి భీకరకర్ముఁడై యా భీముని నొప్పించెను. అంత నప్పాండుసుతుఁడు కుపితుఁడై కడువడిగా మూఁడువాఁడికోలల నక్కర్ణుని యురమున నాట, నపు డతఁడు మూఁడు శిఖరములచే నున్నతమగు పర్వతమునాఁ జూపట్టెను. మఱియు నా శరప్రహారములచే నాతని మేనఁ బర్వతమునుండి స్రవించు గైరిక ధాతురసమువలె రక్తము స్రవింప మొదలిడెను. అందుల కాసూత పుత్త్రుఁ డించుక చలించి, వింట బాణముఁ జేర్చి, మఱియు నాభీమునిఁ బ్రహరించెను. అటులు కొట్టి యూరకుండక వందలకొలందిని, వేల కొలందిని బాణములను బ్రయోగించి యాభీమునిఁ గప్పె, నతఁడు నగుచు నారాధేయుని వింటినారిఁ దెగనేసి, మఱియు వేఱొకభల్లముచే వానిసారథిని జంపి, నాల్గుగుఱ్ఱములను బరిమార్చెను. పిదప మహారథుఁడగు నారాధేయుఁడు, హతాశ్వమగుతనరథమునుండి యెగిరి, వృషసేనునిరథముపై కుఱికెను. ప్రతాపశాలియగు భీముఁ డటు లాకర్ణుని జయించి, మేఘగంభీరధ్వనితో మహానాదమొనర్చెను. ఆమహానాదమును విని భీముఁడు కర్ణుని జయించెనని తలంచి యుధిష్ఠిరుఁ డెంతయు నానందమొందెను. అపు డెల్లెడలను, బాండుసైన్యము శంఖములఁ బూరించెను. వైరిసేనానినాదమును విని, నీవారును, సింహనాదముల నొనర్చిరి. పార్థుఁడు ధనుష్టంకార మొనర్చెను. కృష్ణుఁడు పాంచజన్యమొత్తెను. పిదప భీముఁడొనర్చిన భైరవారావ, మా ధ్వనులనెల్ల గప్పి, సకలసైన్యములకును వినవచ్చెను. పిదప నాభీమ రాధేయులు మఱియు వేఱువేఱుగా నస్త్రములను బ్రయోగించి కొనుచు, మృదువుగను బరుషముగను బోరాడిరి." అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె,

## దుర్యోధనుఁడు పాంచాలురతోఁ బోరాడుట

"ఓరాజా ! మనసైన్యమటులు చలింప, నర్జునుఁడు సైంధవునకై వెడలఁగా, భీమసాత్యకులును సైన్యములను గడచిపోఁగా, నపుడు నీపుత్త్రుఁడు ద్రోణునిఁజేర నేదియో పెక్కుగాఁ జింతించుచుఁ, గడు వడిగా నొకరథముతో వెడలి, సమీపించి, కోపమడరఁ దామ్రాక్షుఁడై 'ఓయాచార్యా ! భీమార్జునులును సాత్యకియు నజేయులై, సకలసైన్యములను జయించి, సైంధవుని సమీపించిరి. మఱియు వారెల్లసైన్యములను జయించుచునే యుండిరిగాని, నెందును బరాజయమొందకుండిరి. ఆసాత్యకి భీముల నేల వదలితివి? నిన్నుఁ దప్పించుకొనిపోవుట, సముద్ర శోషణమువంటిదై యత్యద్భుతముగదా ! ఓవిప్రోత్తమా ! నీవాసాత్యకి భీమార్జునుల, కజేయుఁడవని లోకమెల్లఁ జెప్పుకొనుచుండును. ధనుర్వేదపారగుఁడగు ద్రోణుఁడేమి? జయింపఁబడుటేమి? అని మనయోధులనుకొనుట నమ్మఁదగనిమాటయయ్యెనే ! ఇఁక మందభాగ్యుఁడనగు నాకీసమరమున నిశ్చయముగా నాశమే సంభవింపనున్నది. అటులుగానిచో, నిన్నాముగ్గురరథికులు నతిక్రమించుటేమి ? ఇది యిట్లుండ నదిగదా ! ఇఁక నీవు చెప్పవలసిన దేమిగలదో? తెలుపుము. జరిగినదేమో జరిగినది. ఇఁకనున్నదానికై చింతింపుము. ఇఁకఁ గానున్నది సైంధవుని మరణము. దానికేదేని సంవిధానము లెస్సగా నూహించి, వడిగా నెఱిఁగింపుము.' అని పలుక విని యాసుయోధనుతో నతఁ డిట్లనియె.

'ఓమహారాజా ! నేను జింతింపఁదగినకృత్యము పెక్కుగలదు. దానిఁ దెలిపెదను వినుము. అప్పాండవమహారథులు మువ్వురును నన్నుఁ గడచిపోయిరి. వారు వెనుకనున్న నెంతభయమో ముందునున్నను నంతియభయమని తలంపుము. కావునఁ గృష్ణార్జునులిరువురును గలప్రదేశమే దుర్జయము. వారిచే నీభారతసైన్యము ముందువెనుకలు రెండును గ్రహింపఁబడియున్నవి. అందు సైంధవరక్షకమగుకృత్య మొకటి చింతించుచున్నవాఁడను. వాఁడు కుపితుఁడైయున్న ధనంజయునుండి మనకు రక్షింపఁదగియున్నవాఁడు. వీరులగుసాత్యకి వృకోదరులును సైంధవుని సమీపించి యున్నవారుగదా ! నాఁడు శకునిబుద్ధివలనఁ గలిగిన ద్యూత మిపుడు సంప్రాప్తించెను, ఆసభలో నిపుడు జయమే సంభవిం

చెనుగాని మీరోడుటలేదుగదా! నాఁడా కౌరవసభలో శకునియాడిన ఘోరములగుపాచికలు నేఁటిపోరాటమనెడియాటలో జయాపజయ ములం దేనియొసంగునో? తెలియదు. అయ్యవి పాచిక లనుకొంటివిగాని యదిగాదు. అయ్యవి మీతనువులఛేదించు తీవ్రఘోరనారాచములని నమ్ముము. ఓనాయనా! కౌరవులనేకు లెందుఁగలరో యాసేనయే ద్యూత సభ. శరములే పాచికలని తెలియుము. ఈద్యూతమున సైంధవుఁడే పణము. సైంధవునికై వైరులతో మన కిపుడు గొప్పద్యూతము సంభ వించెను. ఓమహారాజా! ఈద్యూతమున నెల్లరును బ్రాణములు విడిచి, యథావిధిగా సైంధవరక్షణ మొనర్పవలయును. అపుడు మనమహారథు లెల్ల సైంధవుని రక్షింపఁబూనుదు రేని మనద్యూతమున జయాపజయము లేర్పడును. కావునఁ ద్వరగా నందులకుఁబొమ్ము. అందు వానిని రక్షించు చున్నవారి కెల్ల రక్షకుఁడవుగమ్ము. మఱికొందఱ నందుల కంపెదను. నేనిందుండియే జయముగోరుచుఁ బాండవులను సృంజయులను నిరో ధించెదను.’

అది విని సుయోధనుఁడు ద్రోణు నానతివహించి, వడిగా నుగ్రకర్మ మొనర్పువాఁడై సపరివారముగా వెడలి, సవ్యసాచికిఁ జక్ర రక్షకులగు యుధామన్యూత్తమౌజులను సేనకు వెలిగానుండుటను గాంచి వారిని సమీపించెను. వారు, మున్నార్జునుఁడు మనసైన్య మును బ్రవేశించునపుడు కృతవర్మనిచే నివారితులై యుద్ధాభిలాషతో మనసేన కొకపార్శ్వమున నుండిరి. వారితో నక్కౌరవరాజు యుద్ధము చేయఁ దలపడియెను. సోదరులగువా రిరువురును ధనుర్ధరులై యాతనిఁ దలపడి, యందు యుధామన్యుఁడు ముప్పదికంకపత్రములగుబాణ ములచే నాసుయోధనుని నొప్పించి, మఱియు సారథి నిరువదింటను, గుఱ్ఱములను నాల్గింటను బ్రహరించెను. అంత నాసుయోధనుఁ డొక బాణముచే వానిధ్వజము దెగనేసి, వేఱొకనారాచముచే ధనువుఁ ద్రుంచి, మఱియొకభల్లముచే వానిసారథిని రథనీడమునుండి పడఁద్రో సెను. అటులు ద్రోసియు,మఱినాల్గుతీవ్రబాణములచేనాయుధామన్యుని గుఱ్ఱముల నాల్గిటిని బ్రహరింపఁగా, వాఁడు కుపితుఁడై ముప్పదిబాణ ములను సంధించి, నీపుత్త్రునివక్షమునఁ గొట్టెను. అటులే యుత్తమౌ జుఁడును గుపితుఁడై సువర్ణవిభూషితములగు సాయకములచే మన

సుయోధనుసారథిని గొట్టి యమమందిరము నొందించెను. ఓరాజేంద్రా! పిదప నాదుర్యోధనుఁడును, బాంచాల్యుఁడగు నాయుత్తమౌజుని గుఱ్ఱములు నాల్గిటిని, బార్ష్ణిసారథుల నిరువురను గొట్టఁగా, హతాశ్వుఁడును హతసూతుఁడునగు నతఁడు, తనభ్రాతయగు యుధామన్యుని రథ మధిష్ఠించి, యాసుయోధనుని గుఱ్ఱములను బెక్కుబాణములచే నొప్పింప, నవి హతములై పుడమిఁబడియెను. అటు లాతనిగుఱ్ఱములు గూల, యుధామన్యుఁ డొకయుత్తమబాణముచే వడిగా నీకొమరుని శరాసనమును ఖండించెను. అంత నాసుయోధనుఁడు హతసూతాశ్వుఁడగు తనరథమునుండి దిగి యొకగదను బూని, యాపాంచాల్యునిపైకి వెడలెను. కుపితుఁడై యటులు తనపైకివచ్చుచున్న సుయోధను నారసి, వారును రథముడిగిరి. అంత నక్కౌరవేశ్వరుఁడు సువర్ణచిత్రితమైన వారి రథమును, దనగదతో ససూతధ్వజాశ్వముఁగా మోది, పిదప శల్యుని రథము నధిరోహించెను. పిమ్మట నప్పాంచాలముఖ్యులగు నాయుధామన్యూత్తమౌజులును వేఱురథముల నెక్కి యర్జునునిసమీపించిరి." అని తెలిపి సంజయుఁడు మఱియు నయ్యాంబికేయునితో ని ట్లనియె.

## కర్ణుఁడు భీమునితోఁ బోరాడి యోడుట

"ఓరాజా! గగురుపాటొదవించు నాసంగ్రామ మటులు మహత్తరమై జరుగుచుండ, నెల్లరును బీడితులై వ్యాకులచిత్తులగుచుండ నారాధేయుఁడు భీమునిపైకి యుద్ధమొనర్పఁ బోయెను. అపు డతఁ డటులు పరువులిడుచు నెదుర్కొని యడవిలో మత్తగజమును మార్కొనిన మత్తగజమునాఁ జూపట్టెను." అని తెలుప విని ధృతరాష్ట్రుఁడు "ఓ సంజయా! మహాబలులగు నాభీమకర్ణులు యుద్ధమొనర్చి వెడలిపోయిరిగదా! అపు డాయర్జునురథముచేరువ జరిగిన యుద్ధమువిధ మెట్టిది? మున్నొకపరి భీమునిచేఁ గర్ణుఁడు జయింపఁబడియెఁగదా! మరల నారాధేయుఁ డెటు లాభీముపైఁ గవిసెను? ఆభీముఁ డారాధేయు నెటు లెదుర్కొనియెను? అక్కర్ణుఁ డీలోకమున మహారథుఁడని ప్రసిద్ధివడసియున్నవాఁడు. ఆయుధిష్ఠిరుఁడు భీష్మద్రోణులను విడిచి, యక్కర్ణునకే జడియుచుండును. అమ్మహారథునిఁ దలంచునపుడు భయ మొంది యతఁడు సరిగా నిద్రింపలేడు. అట్టి సూతపుత్త్రు నాభీముఁ

డెట్లు గవిసెను? మఱియు బ్రహ్మణ్యుఁడును, బరాక్రమనిధియు, సమరము నుండి మరలనివాఁడునగు నా రాధేయుని భీముఁ డెదుర్కొనఁగలిగెనా? వారిరువురును వెడలి యర్జునరథముచేరువను జేరిరంటివి. అపుడు వారెటులు యుద్ధమొనర్చిరి? ఆసూతపుత్త్రుఁడు భీముని భ్రాతృత్వమును దలంచి దయచూపెడివాఁడుగదా! అట్టియతఁ డాకుంతివాక్యమును స్మరింపలేదా? ఆభీమునితో నెట్లు పోరాడెను? మున్ను గర్ణుఁ డొనర్చిన వైరమును స్మరించి వీరుఁడగు నాభీముఁ డాతనితో నెట్లు పోరాడెను? నాకొమరుఁ డెల్లపు డారాధేయుఁడే పాండవులను జయింపఁగలఁడని యాశించుచున్నవాఁడు. మందబుద్ధియగు నాపుత్త్రుం డెందు జయాశ నొందుచుండెనో యతఁడే భీమకర్ముఁడగు భీమునిఁ దలపడియెనా? మహారథులగు నాకొమరు లెవ్వని నాశ్రయించి పాండవులతో వైరమును దెచ్చికొనిరో యట్టిసూతసుతునితో నావాయుసూనుఁ డెట్లు పోరాడెను?ఆసూతపుత్త్రునివలనఁ దమకుఁగల్గిన పెక్కుకష్టములను దలంచుచు, నాపవమానసూనుఁ డాసూతసూనునితో నెట్లు పోరాడెనో తెలుపుము. ఎవ్వఁడు పరాక్రమశాలియై యొక్కరథముతోడనే వెడలి యెల్ల దిక్కులను జయించెనో, యట్టిసూతపుత్త్రు నాభీముఁ డెక్లెదుర్కొనఁ గలిగెను? కవచకుండలములతోడనే జనించిన యక్కర్ణు నాభీముఁడు మార్కొనెనా? వారిరువుర కెట్లు యుద్ధమయ్యెను! అందు జయమెవ్వరికిఁగలిగెను? అదియెల్ల నాకెఱిగింపుము" అని ప్రశ్నించెను.

అది విని సంజయుఁడు, "ఓరాజా! వినుము. అపు డటులా రాధేయు నాభీముఁడు విడిచి, యవ్వాసుదేవార్జునులున్నకడకుఁ బోవ నిశ్చయించికొనియుండ, నాతని నారాధేయుఁ డెదుర్కొని, మేఘము పర్వతమును వర్షముచేవలె శరవర్షమునఁ గప్పెను. ఓరాజా! అపు డారాధేయుఁడు వికసించినపద్మమునుబోలు తనమొగమున నగవంకురింప, నటు లర్జునునికడకు వెడలనున్న యాభీమునితో 'ఓవృకోదరా! నీకుఁ గలనేని శత్రులతో బోరాటము తగనిది గాఁబోలు. పార్థునిఁ జూచువాఁడవై నాకు నీవెన్నుగాన్పింతువేటికి! ఓపాండవనందనా! కుంతీపుత్త్రుఁడవగు నీకిది తగనిపనిసుమీ! కావున నన్నెదిరించి శరవర్షముగురియుము' అని యాతని హెచ్చరింపఁ గుపితుఁడై యాభీముఁ డర్ధమండలగతి నావర్తించి యక్కర్ణునితోఁ బోరాడెను. అపు డా

భీముఁడు తిన్నగా వెడలునట్టి నారాచములచే సర్వశస్త్రవిశారదుఁడును, సన్నద్ధుఁడునగు నక్కర్ణునిఁ జంపువాఁడై ప్రహరించెను. అపు డా భీముని శరవర్షము నారాధేయుఁడు తనయస్త్రమాయలచే నడంచి, విద్యాబలములచే నాయాచార్యునివలె నక్కర్ణుఁ డారణరంగమునఁ జరించెను. మఱియు మహాసంరంభముతోఁ బోరాడు నాభీమునిఁ గాంచి నగుచు, నవమానింప నాతనిపరిహాసమును సహింపక, యావృకోదరుఁడు యుద్ధవీరులెల్లఁ గాంచుచుండ వత్సదంతములచే వానివక్షమును గొట్టి, యంకుశములచే మత్తగజమునువలె నొప్పించి, మఱియు సువర్ణపుంఖములును, దీప్రములునగు నిరువదియొకబాణములచే నారాధేయుని చిత్రకవచమును గొట్టెను. అంత నారాధేయుఁడు బంగారువలలచేఁ గప్పఁబడి వాయువేగముగల్గిన యాభీమునిగుఱ్ఱముల నొక్కొకటి నైదేసిబాణములచేఁ గొట్టి, యొకయరనిముసములో బాణమయజాలముచే నాభీమునిరథము నాచ్ఛాదించెను. అపు డాభీముని రథధ్వజములును సూతుఁడును గానరాకయుండ, మఱియు నాకర్ణుఁ డఱువదిబాణములచే నాతనిదృఢకవచమునఁ గొట్టి, కుపితుఁడై, మఱియు మర్మభేదకములగు నారాచములచే నావృకోదరు నొప్పించెను. అంత నాకర్ణునిశరపరంపరలకు జడియక, వానినెల్ల భరించి, యందుల కించుకేని వ్యథనొందఁడయ్యెను. పిదప నాభీముఁడు తీవ్రములగు ముప్పదిబాణములను రాధేయునిపైఁ బ్రయోగింప, వాని నాతఁడు ప్రయత్నములేకయే తనశరావళిచేఁ దూల్చివైచెను. సైంధవవధాభిలాషియైయున్న మహాబాహుఁడగు నాభీము నటులాసమరమున నారాధేయుఁడు మృదుపూర్వముగా యుద్ధమొనర్చుచుండఁ, బూర్వవైరమును స్మరించుచు భీముఁ డాకర్ణునితోఁ బోరాడెను. అపు డందుల కోరువక కుపితుఁడై యారాధేయునిపై శరవర్షమును గురియ, నాబాణములు సువర్ణపుంఖములును, బ్రసన్నాగ్రములునై వెడలి, ధ్వనిచేయుచుఁ, బక్షులువలె నారాధేయునిఁగప్పి, యగ్నిలోఁబడిన మిడుతలువలె వ్యర్థములయ్యెను. ఓరాజా! అంత నారాధేయుఁ డుగ్రములగు కొన్నిబాణముల నాభీమునిపైఁ బ్రయోగింప, వానినెల్లఁ ద్రోవనడుమనే పెక్కుభల్లములచే నప్పాండవాత్మజుఁడు ఖండించెను. మఱియు నారాధేయుఁడు భీమునిమేన పెక్కునారాచములు ప్రయోగింప,

వానిచే నతఁడు శలభములు చుట్టుకొన్న యేదుఁబందివలెఁ జూప ట్టెను. అపు డాభీముఁ డాకర్ణుని సువర్ణపుంఖములై శిలాధౌతములగు సాయకములను భరించి, నిజకిరణములచే వెలయుసూర్యుడునాఁ గాన వచ్చెను. వానిమేనెల్ల రక్తసిక్తమై పుష్పభారముతోఁ గూడిన యశోక వృక్షముగా నతఁడు చూపట్టెను. అపు డామహాబాహుఁడగు కర్ణుని చర్య నాభీముఁడు సహింపక కోపోద్దీపితుఁడై కనులఁద్రిప్పుచు నా రాధేయు నిరువదిబాణములచేఁగొట్టి,విషసర్పములు శ్వేతమహీధరమును బోలె నతనిఁ గప్పె మఱి పదునాల్గుబాణములచే నొప్పించెను. అటులు నొప్పించి మఱియు నాభీముఁడు ప్రతాపశాలియై యారాధేయుని మర్మ ములు నాట, నొకబాణముచేఁ గొట్టి నగుచు మఱియొకశరముచే నాతని ధనువు ఖండించి, మఱియు నాతనిగుఱ్ఱములఁ బ్రహరించి, సూర్యకిరణ ములునాఁదగు మఱికొన్ని నారాచముల నాకర్ణునివక్షము పగులునట్లు ప్రయోగింప నవి కర్ణుని భేదించి పుడమిఁజొచ్చెను. అంత నారాధేయుఁ డెంతయు వికలుఁడై ధనువుదెగి రథముచెడుటను వేఱొకరథముపై కుఱికెను." అని తెలుప విని ధృతరాష్ట్రుఁడు మఱియు నాతనితో ని ట్లనియె.

### కర్ణుఁడు మఱియు భీమునిఁ దలపడుట

"ఓసంజయా! నాకొమరు లెవ్వనిపై నాధారపడి జయము నా శించియున్నవారో యట్టి రాధేయుఁ డాభీమునుండి విముఖుఁ డగుటఁ గాంచి దుర్యోధనుఁ డేమనియెను? వీర్యశ్లాఘియై మహాబలుఁ డగుభీముఁ డెట్లు యుద్ధమొనర్చెను? పిదప సమరమున నాకర్ణుఁ డేమి గావించెను?"

అది విని సంజయుఁ డాతనితో "ఓమహారాజా! అపు డాకర్ణుఁడు యథావిధిగా నమర్పఁబడిన వేఱొకరథ మధిరోహించి, పెనుగాలిచేఁ గదలినసాగరమువలెఁ జూపట్టుచు నాపాండవు నెదుర్కొనియెను. అటులు కుపితుఁడై యున్న యాకర్ణునిఁ గాంచి నీకొమరులు, భీముఁ డిఁక నగ్నిలో హుతమగునని దలంచిరి. అంత నారాధేయుఁడు తలశబ్ద మును ధనుష్టాంకారము నొనర్చి యాభీమసేనురథముపై శరవర్షమును గురిసెను. ఓరాజా! మఱియు వారిసమాగమము ఘోరమై చూపట్టెను.

మహాబాహులగువారిరువురు నటులు సంరబ్ధులై పరస్పరవధకాంక్షలతో నొకరినొకరి దహించుకొనునటులు చూచుకొనుచుఁ గ్రోధతామ్రాక్షులై సర్పములువలె రోఁజుచుఁ, బరస్పరముఁ బ్రహరించుకొనసాగిరి. అపుడు వారు కుపితములగు బెబ్బులులను, వడిగలడేగలను, నుద్రేకముగల శరభములనుబోలి పోరాడఁదొడంగిరి. అంత నాభీముఁడు మున్నా కర్ణునివలనఁ దమకుఁగల్గిన వనవాసకష్టములను, జూదమునందలి పరాభవమును, విరాటనగరమునఁ బడినక్లేశమును దలంచుచు, మఱియు నీ కొమరులొనర్చిన నిజరాజ్యాపహరణమును, తనయులతో నీవొనర్చిన కష్టములను స్మరించుచు, నిరపరాధయగుకుంతిని బుత్రులతోఁగూడ నీవు కాల్ప నెంచినవిధము నెంచుచు, నాసభామధ్యమున దురాత్ములగు నీసుతులు ద్రౌపది కొనర్చినభంగపాటు నూహించుచు, దుశ్శాసనుఁడామెజుట్టుపట్టి లాగుటయుఁ, గర్ణుఁ డపుడు 'నీపతులు కష్టములపాలై నపుంసకులైరి. నీకిఁకఁ బతులెక్కడ? వేఱొకపతిని వెదకికొను'మని పలుకుటయు, నాద్రౌపదిని నీసుతులు దాసినిగా ననుభవించువారై, నీవు వినుచుండఁగా నామెను దూఱనాడుటయు స్మరించుచు, నటులు తాము నారచీరలుగట్టికొని వనవాసమునకుఁ బోవుచుండఁగా, నాసభలోఁ గర్ణుఁడాడినపరుషవచనములను, నపుడు నీతనయుఁడు తమ్ము నొకతృణముగా భావించి పరిహసించుటయు, బాల్యమునుండియుఁ దాము నీకొమారుల వలనఁ బడుబాములన్నియుఁ జింతించుచు,నాధర్మాత్ముఁడగువృకోదరుఁడు, హృదయనిర్వేదమొంది, ధనుష్టాంకారమొనరించి, శరీరమునెడ నపేక్ష విడిచి యక్కర్ణునిఁ దలపడియెను. అంత నాభీముని బాణమయములగు వలలు సూర్యకిరణముల నాచ్ఛాదింప, నారాధేయుఁడు నగుచు, సాన వెట్టినబాణములచే నాతని నారాచములను ఖండించెను. అటులు ఖండించి మఱియు వాఁడిగల పెక్కుకోలలచే నాభీముని నొప్పింప, నంకుశముల వేటువడినయేన్గువలెఁ గుపితుఁడయ్యుఁ దొట్రుపడక యాసూతపుత్రునిఁ దలపడఁబోవుచుండ, నారాధేయుఁడు నాతని మత్తగజము మదగజమునువలె నెదుర్కొనియెను. అపుడు సైన్యములందు భేరీనినాదములును, శంఖధ్వనులును విజృంభించెను. మఱియు నాసైన్యము చలించిన సాగరమువలె నల్లకల్లోలమైయుండెను. అటులు కదలుచున్న గజాశ్వ రథపదాతిసైన్యమును గాంచి యాభీముఁడు, కర్ణుని సమీపించి సాయ

కములచేఁ గప్పెను. భల్లూకకాంతిగల తనగుఱ్ఱములను, హంసవర్ణము లగు నాభీమునిగుఱ్ఱములతోఁ గలియునట్లుగా నారాధేయుఁడు మూర్ఛిల్లిన శరపరంపరల నాతనిఁ గప్పెను. అటులు వారిరువురును సమీపించునపుడు నీసైన్యమున హాహాకారములు జనించెను. వాయు వేగముగలవారిరువుర నల్లని తెల్లగుఱ్ఱములు గలిసి, బలాహకములతోఁ గూడిన యాకసమును దలపించెను. అటులు సంరబ్ధులై కోపారుణిత నేత్రులై యున్న యాభీమకర్ణుల నారసి, నీవారిమహారథు లెల్ల రును జడిసి వడంకిరి. అపుడు వారికి జరిగినయుద్ధము యమరాష్ట్రసదృ శమై గానవచ్చెను. ఓమహారాజా! చూచుటకు భయంకరమై, ప్రేత రాజపత్తనమునాఁదగు వారియుద్ధపథము నొకచిత్తరువునుబోలె మహా రథులెల్లరును గాంచఁదొడంగిరి. ఆమహాసంగ్రామమున వారిరువురలో నెవ్వరికి జయముగల్గునో యనువిషయ మెవ్వరు నూహింపఁజాలకుండిరి; ఓరాజా! నీవును నీపుత్త్రుఁడు నొనర్చినదురాలోచనకు ఫలముగా వారి మహాస్త్రములసమ్మర్దము నపు డందఱును గాంచిరి. అపు డద్భుతవిక్రము లగు నాభీమకర్ణులిరువురును బరస్పరము శరపరంపరలఁ గప్పికొనుచు, నాకసమును శరజాలమయముగా నొనర్చిరి. అటులు మహారథులగు వారు, పరస్పరజిఘాంసలతో సాయకములఁ బ్రయోగించుకొనుచు, వర్ష కాలపుమేఘములునాఁ జూడఁదగియుండిరి. మఱియు, వారొకరిపై నొకరు ప్రయోగించుకొను సువర్ణవికారములగుసాయకములు, మహో ల్కలునా నాకసమును బ్రకాశింపఁజేయఁదొడంగెను. ఓరాజా! వారు విడుచుచున్న గ్రద్దఱెక్కలబాణములు, శరత్కాలమున మదించినసారస పక్షులవరుసలునాఁ జూపట్టును. అపు డటు లారాధేయుని మార్కొనిన యాభీమునిఁ గాంచి కృష్ణార్జును లాభీమున కతిభారమగుచుండెనని తలంచిరి. అటు లాకర్ణభీములు ప్రయోగించుకొనుచున్న సాయకము లచేఁ గట్టిగాఁ గొట్టువడిన గజాశ్వములును బదాతులును బుడమిఁ బడుచుండ, నీసైన్యమందలి రాజపుత్త్రులనేకులు క్షయమొందుచుండిరి. గతజీవితములగు గజాశ్వాదులచే నొకక్షణముననే పుడమియెల్ల నిండెను." అని తెలుప విని ధృతరాష్ట్రుఁడు మఱియు నాసంజయునితో ని ట్లనియె.

భీమరాధేయులయుద్ధము

"ఓసంజయా! అలఘుపరాక్రముఁడగు మనకర్ణు నెదుర్కొని భీముఁడాసమరమున సరిగాఁబోరుట నారయ, నాతనివిక్రమ మద్భుత మైయున్నదని తలంపవలసియున్నదే! సకలశస్త్రాస్త్రధరులై యసురాసుర మానవులతోఁ గూడివచ్చిన యావియచ్చరులను సైతము మనగాధేయుఁడు నివారింపఁగలఁడుగదా! అట్టివాఁడాభీము నెట్టులీయుద్ధమున నతిక్రమింపలేకుండెనో తెలుపుము. ఆప్రాణద్యూతమున వారికెట్టులు యుద్ధమయ్యెను? వారియుద్ధమున జయాపజయములు సమానములని తలంతును. నాకొమరుఁడగు సుయోధనుఁడీరాధేయునాశ్రయించియే గోవిందాదియాదవులతోఁ బాండవులనోడింప నుత్సహించుచున్నవాఁడు. భీమకర్ముఁడగు, భీమునిచే మఱిమఱియు నాకర్ణుఁడోడుట విని నా కెంతయు మోహాముగల్గుచున్నది. నాపుత్రునిదుర్నయములచేతనే కౌరవులు నశింతురని తలంచెదను. ఓసంజయా! మహేష్వాసులగునప్పాండవుల నీకర్ణుఁడు జయింపలేఁడు. వీఁడప్పాండవులతోఁ బలుమాఱులు యుద్ధములొనర్చెనుగాని, వానియందెల్ల వీఁడోడుచువచ్చెను. దేవతలతోఁగూడినవారగుటకేని, వారు జయింపరానివారు. ఆపాండవు లట్టివారని మందుఁడగు నానందనుఁ డెఱుంగఁడు. ఆకుబేరునుండివలె నా యుధిష్ఠిరునుండి ధన మపహరించి నాకొడుకు, కొండచఱియపై నున్న తేనెపెఱనుగోరు బుద్ధిహీనునిఁబోలెఁ గానవచ్చుచున్నవాఁడు. నీచబుద్ధియగు నాసుతుఁడు, మహాత్ములగువారిరాజ్య మపహరించి, యవమానమొనరించి, వారిని జయించెనని యే తలంచుచున్నవాఁడు. పుత్త్రుని యెడఁ గలస్నేహముచే నేనును బుద్ధిహీనుండనై కర్తవ్యమెఱుఁగక ధర్మాత్ములగునప్పాండవుల నవమానించితిని. దూరదృష్టిగల యాయుధిష్ఠిరుఁ డెల్లపుడును సంధినిగోరుట నారసి, మనవా రాతఁడసమర్థుఁడనికొని, యాతని నవమానించిరి. ఆయపకారములను మనవారొనర్చినకష్టములను మనసులోనుంచికొని, యిపు డామహాబాహుఁడగు భీముఁడే రాధేయుని మార్కొనియెను. కావున నోసంజయా! ఆభీమరాధేయులు పరస్పరవధాభిలాషులై యెటులు యుద్ధమొనర్చిరో తెలుపుము."

అది విని యాసంజయుఁ డాతనితో "ఓరాజా! అడవియేన్గులకువలె నక్కర్ణభీములకు జరిగినయుద్ధమువిధము వినుము. అప్పు డాకర్ణుఁడు కోపమడరఁ, గుపితుడై యున్న భీముని ముప్పదిశరములచే నొప్పింప, నంత నాభీముఁడు, మూఁడువాఁడికోలలచేఁ గర్ణునిధనువు దునుమాడి, మఱియు నొకభల్లముచే నాతనిసారథిని, రథనీడమునుండి పడఁద్రోసెను. పిదప నారాధేయుఁ డాభీమునిఁ జంపువాఁడై, సువర్ణవైదూర్యవిచిత్రితమగుదండముగల యొకశక్తిని, దడవిపట్టుకొని, కాలశక్తినాఁదగు దానినాపవమానసూనుని ప్రాణహానియగునట్లుగా వైచి, వజ్రాయుధమును బ్రయోగించిన పురందరుఁడునా విరాజిలుచు గొప్పసింహనాదము నొనర్చెను. ఆమహానాదమును విని నీనందనులందఱు నమందానందభరితులైరి. సూర్యాగ్నిసమతేజమై కర్ణభుజవినిర్ముక్తమగు నాశక్తి నాభీముఁడేడుబాణములచే ఖండించెను. ఓమారిషా! అటు లతఁ డద్దానిని దునిమి, యాసూతసుతుని ప్రాణములను వెదకువాఁడువలె, సంరంభమడరఁ, బింఛాలంకృతములై, సువర్ణపుంఖములగు సానవెట్టినబాణములను బ్రయోగించెను. కర్ణుఁడును, సువర్ణపృష్ఠమై దుర్జేయమగు వేఱొకవిల్లుపూని యాకర్షించి కొన్నిబాణములను బ్రయోగింప, వాని నాభీముఁడు నతపర్వములగు తొమ్మిదిసాయకములచే ఖండించి, మఱియు నావృషసేనప్రయుక్తములగుబాణములను ఛేదించి, సింహామువలె నఱచెను. పిదప వారిరువురును, వృషభములువలె నఱచుచు, నామిషముకై తలపడి గర్జించుబలవత్తరములగు బెబ్బులులవలెఁబరస్పరముఁ బ్రహరించుకొన నవకాశమును వెదకికొనుచు, గోశాలలోనున్న మహావృషభములువలె నొకరినొకరు చూచుకొనుచు, మహాగజములు దంతాగ్రములచేవలె, సాయకములచే నన్యోన్యముఁ గొట్టికొనిరి. ఓరాజా! వారటులు పరస్పరముఁ బ్రహరించుకొనుచు, విక్రమించుచుఁ, గోపముచేఁ గనులఁ బెద్దచేయుచు, నవ్వుకొనుచుఁ, బరస్పరము నిందించికొనుచుఁ, శంఖములు పూరించుచుఁ బోరాడిరి. అంత నాభీముఁడు మఱియు నాకర్ణుని ముష్టిపైఁ గొట్టి, ధనువు దునుఁగనేసి, శంఖవర్ణములగువాని గుఱ్ఱములను బ్రహరించి యమమందిరమునొందించి, మఱియు సారథిని, రథనీడమునుండి పడఁద్రోసెను. పిదప నారాధేయుఁడు సహింపరానిచింతనొంది యాభీమునిబాణజాలములచేఁ గప్పఁబడి, యటులు హతాశ్వుఁడును

హతసారథియు నగుట, నేమిచేయుటకుఁ దోపక నిశ్చేష్టుఁడై యుండెను. అప్పు డటు లాకర్ణుఁడు దురవస్థనొందియుండుటను గాంచి, మనసుయోధనుఁడు కోపముచే వడఁకుచు, దుర్జయుఁడనువానిని జూచి 'ఓరీ! దుర్జయా! భీముఁడు కర్ణుని మ్రింగుచున్నవాఁడు. వడిగా వెడలి, కర్ణునకు సహాయుఁడవై వీనిని జంపు' మని పలుక విని, వాఁడు వల్లెయని, నీకొమరుఁడగు నాదుర్జయుఁడు శరవర్షమును గురియుచు, భీమసేనునిఁ దలపడి తొమ్మిదిబాణములచే నాతనిఁ గొట్టి, యెనిమిదిబాణములచే నా భీమునిగుఱ్ఱములను నొప్పించెను. అటులే సూతునాఱిటను, గేతువును మూఁడిటను గొట్టి, మఱియు నాభీము నేడింట నొప్పించెను. అంత నా భీముఁడు కుపితుఁడై తీవ్రనారాచములచే వానిగుఱ్ఱములను సారథిని గొట్టి, యాదుర్జయుని కవచమును భేదించి, వానిని యమమందిరమున కంపెను. అలంకృతుఁడై పుడమిఁబడి, సర్పమువలెఁ గొట్టుకొనుచున్న యా నీపుత్త్రు నారసి, యారాధేయుఁ డాతనికిఁ బ్రదక్షిణముగాఁ దిరుగుచు, నార్తుఁడై యేడ్చుచుండ, వానిం గాంచి యావృకోదరుఁడు శతఘ్నులతోడను, శంకులతోడను మఱియుఁ గొట్టెను. అటు లాభీముని భీమసాయకములచే నొచ్చియు, నాయతిరథుఁడగుకర్ణుఁడు కుపితుఁడై యున్న యాభీముని విడువక సమరమొనర్పసాగెను." అని తెలిపి మఱియు నాసంజయుఁ డి ట్లనియె.

### కర్ణుఁడు పరాజితుఁడై పాఱిపోవుట

"ఓరాజా! అటు లారాధేయుఁడు విరథుఁడై యోడియు, వేఱొక రథ మధిష్ఠించి యావృకోదరునిఁ బ్రహరింప, నప్పుడు మఱల వారిరువురును మహాగజములు దంతాగ్రములచేవలెఁ, గట్టిగాఁ దిగిచి విడువఁబడినశరవ్రాతములచేఁ బరస్పరముఁ బ్రహరించుకొనిరి. పిదపఁ గర్ణుఁ డా భీముని శరసమూహములచేఁ గొట్టి,సింహనాద మొనర్చి,మఱియు వక్షము నొప్పింప, నావృకోదరుఁడు పదిబాణములచే నాతనిఁ బ్రతిప్రహారమొనర్చి,మఱియు నిరువదిబాణములచేనాతని నొప్పించెను. ఓరాజా! పిమ్మట నారాధేయుఁ డాభీమునిఁ దొమ్మిదిబాణములచే వక్షమునఁగొట్టి, యొక తీవ్రనారాచముచే ధ్వజమును బ్రహరింప, నాకౌంతేయుఁ డఱువది సాయకములచేఁ బ్రతిప్రహార మొనరించెను. అంధుల కంకుశపుప్రేటుల

గాంచినయేన్గును గశాహతులనొచ్చినగుఱ్ఱమునుబోలి కుపితుఁడై పెద వులతుదలఁ దడుపుచుఁ, గ్రోధతామ్రాక్షుఁడై యెల్లయవయవముల నొప్పించు నొకశరము నాభీమునిపై యింద్రుఁడు వజ్రాయుధమునువలె విడువ, నది యాభీముని భేదించి పుడమిఁజొచ్చెను. అంత నావృకోద రుఁడు కోపమడరఁ గన్ను లెఱ్ఱసేయుచు,నాల్గుమూరలుగల్గి,యాఁఅంచులచే వజ్రాయుధమునాఁదగు నొకగొప్పగద నారాధేయునిపై వైవ, నది వాని గుఱ్ఱములను బ్రహరించెను. మఱియు నాభీముఁడు రెండుక్షురప్రములచే వానిధ్వజము దునిమి, మఱికొన్ని బాణములచే నాతనిసూతుని రెగ టార్చెను. ఓభరతోత్తమా! అటు లాకర్ణుఁడు హతాశ్వుఁడై ధ్వజము గూలినరథమును విడిచి, ధనువుసారించుచుఁ, జింతాక్రాంతుఁడై విర థుఁడయ్యె, నాతని నివారించుచుండుట మాకెంతయు వానిపరాక్రమ మద్భుత మొనరించెను. అటులు విరథుఁడైయున్న యారాధేయుం గాంచి, మఱియు సుయోధనుఁడు దుర్ముఖునితో 'ఓయీ! దుర్ముఖా! ఆ రాధేయుఁడు భీమునిచే విరథుఁడైయున్నవాఁడు. నీవు వెడలి యాతనికి రథమొసంగుము" అని పలుక విని, వాఁడు వడిగాఁబోయి శరములచే భీముని వారించుచుఁ గర్ణునిం జేరెను. అపు డాసంగ్రామమున సూత పుత్రు ననుసరించియున్న యాదుర్ముఖునిఁ గాంచి, భీముఁ డమందానంద మొదవ బెదవులఁదడుపుచుఁ, గొన్ని శిలీముఖములచే నారాధేయుని నివారించి, యాదుర్ముఖునిఁ దలపడియెను. అటులు మార్కొని తొమ్మిది బాణములచేఁ గొట్టి వానిని సంహరింప, నపు డారాధేయుఁ డాదుర్ము ఖునిరథ మధిరోహించి, యంశుమంతుఁడునా వెలయుచు, భిన్నకవచుఁడై యొడలెల్ల రక్తము స్రవింపఁ, బుడమిఁబడియున్న దుర్ముఖునిఁ గాంచి కనులు నీరువెట్టుచు, రెండుగడియలనే పూరకుండి యటులు గతాసుఁ డైన నీపుత్త్రునిచుట్టును దిరిగి కడుంగడు నిట్టూర్పులిడుచు, నేమియుఁ జేయఁజాలకుండెను. అంతలో మఱియు నాభీముఁడు పదునాల్గునారాచ ముల నారాధేయునిపైఁ బ్రయోగింప, నవి కర్ణునికవచమును భేదించి, సువర్ణపుంఖములును, హేమచిత్రములును నగుచు, దశదిశల బ్రకా శింపఁజేయుచు, నాతనిరక్తశోణితములఁ ద్రావి, కాలచోదితములై కుపిత ములగుసర్పములువలె వెడలిపోయెను.అంత నాకర్ణుఁడు సువర్ణవిభూషిత ములగు పదునాల్గుబాణములను బ్రయోగింప, నవి యాభీముని సవ్యభుజ

మును భేదించి, ప్రకాశించుచుఁ బుడమిఁజొచ్చెను. సూర్యాస్తసమయమున వెలయుకాంతులువలె నొప్పునాబాణములచేఁ బ్రహృతుఁడై, సెలయేఱులుగల పర్వతమువలె రక్తములు స్రవింపఁ, గుపితుఁడై మూఁడు బాణములచే నారాధేయునిఁ గొట్టి, యేడుబాణములచే వానిసారథిని బ్రహరించెను. అపుడాకర్ణుఁడు వివశుఁడై తనవడిగలగుఱ్ఱములతో నారణరంగమును విడిచిపోయెను. అంత నాభీముఁడు ధనుష్టంకారమొనరించి, మండుచున్నయగ్నివలె నాసంగ్రామరంగమున నిలిచియుండె" నని తెలుప సంజయునితో ధృతరాష్ట్రుఁడు మఱియు నిట్లనియె.

## భీముని పరాక్రమము

ఓసంజయా! దైవమే బలవత్తరమని తలంపవలెను. ఛీఛీ! అనర్థకమగుపురుషప్రయత్నముచే నేమిపని? అటులు ప్రయత్నించిన యాకర్ణుఁడును భీము నతిక్రమింపఁజాలఁడయ్యెనే. 'వాఁడెపుడును వాసుదేవునితోఁగూడఁ బాండవులను జయింతుననియే యుత్సహించుచుండును. వానితో సరియగుయోధుఁ డిప్పుడమిలేఁడని యూహించుచుండును.' అని సుయోధనుఁడు పలుమాఱు వలుకుచుండ వినియుంటిని. ఓసంజయా! మున్నొకపుడు దుర్యోధనుఁడు నాతో 'కర్ణుఁడు మిగుల బలవంతుఁడును, శూరుఁడును, శ్రమలకోర్చువాఁడును, దృఢధన్వుఁడునైయున్నవాఁడు' అని తెలిపెను. 'ఇక్కర్ణునిసహాయము నాకుఁగలుగ నా దేవతలే నన్ను జయింపఁజాలరుగదా? బలహీనులును, బుద్ధిహీనులునగు పాండవులన నాకేపాటి?' అనియు నుగ్గడించెను. అట్టికర్ణుఁడే విషశూన్యమగుసర్పమువలె నిస్సారుఁడై యుండుటను గాంచి, దుర్యోధనుఁ డేమి పలికెను? అయ్యో! యుద్ధనైపుణ్యములేని మనదుర్ముఖు నొక్కని నగ్నిలోఁ ద్రోయుపతంగమునువలె యుద్ధమున నెట్లు ప్రవేశపెట్టెను? ఓసంజయా! ఆయశ్వత్థామయు, శల్యుఁడు, కృపుఁడు, కర్ణుఁడును గలిసియైన నాభీమునియెదుట నిలువఁజాలకుండిరా? నాగాయుతబలుఁడై ఘోరాకారమును బూనియున్న యాపవమానసూనునిపరాక్రమ మెఱిఁగినవారె ట్లాకాలాంతకతుల్యుఁడగు నాతనిఁ గోపింపఁజేయుదురు? మహాబాహుఁడగు కర్ణుఁడుమాత్రము నిజబాహుబలము నాశ్రయించి, వానిని లక్ష్యపెట్టక మార్కొనియుండునుగాఁబోలు. అట్టికర్ణునే పురంద

ఁడు రాక్షసునివలె జయించినభీము నెవ్వఁడు రణరంగమున జయింపఁ గలఁడు? ధనంజయునివెదకుటకై వెడలినయాభీముని ద్రోణునంతటి వాఁడు నివారింపలేక మనసైన్యముపై విడిచెనుగదా! బ్రతుకఁదలఁచి నవాఁ డెవ్వఁ డట్టిభీముని మార్కొనఁగల్గును? ఓసంజయా! వజ్రా యుధమునెత్తిన యింద్రునియెదుట దానవుఁడువలె నావృకోదరుని యెదుట నెవ్వఁడు నిలువఁగలఁడు? యమపత్తనమున కేగినవాఁడు మరలునా? ఆభీము నెదుర్కొనినవాఁడు మఱిమరలుట కల్ల. వానిని మార్కొనిన బలహీను లగ్నిలోఁబడిన మిడుతలే యగుచున్నారు. కుపితుఁడైనభీముని మార్కొనువారు మందబుద్ధు లనుకొనక తప్పదు. నాఁడు కౌరవులు వినుచుండఁగా సభలో నాపుత్రులను వధింతునని పలికిన యాభీమునివచనములు దలంచి, దానికి నిదర్శనముగా నిప్పుడిక్కర్ణుఁ డిట్లోడుట గాంచి, దుశ్శాసనుఁడు తనయన్నతోఁ గూడ వెఱచి, యాభీముని మార్కొనకుండుట నిశ్చయము. ఓసంజయా! దుర్బుద్ధియగు నాసుయోధనుఁడు, సభలో మాటికిని, 'కర్ణుఁడు, దుశ్శాసనుఁడును, నేనును రణరంగమునఁ బాండవులను జయింతుము.' అని పలికెనుగదా! అట్టివాఁ డిపుడు విరథుఁడై యోడినకర్ణునిఁ గాంచి, తాను కృష్ణునిసంధివచనములను బ్రత్యాఖ్యాన మొనరించినందులకుఁ దప్పక పరితపించియుండును. అయ్యో! నాపుత్రకుఁడు సంగ్రామమునఁ జచ్చిన తనతమ్ములనెల్లఁ గని, తానొనర్చినగొప్పతప్పును దలంచుకొనక మానఁడు. భీమాయుధుఁడై, కాలుఁడే యిటులు వచ్చెనన్నట్లు కుపితుఁ డగుభీముని బ్రతుకదలఁచినవా డెవ్వఁ డెదుర్కొనఁగలఁడు? బడబాగ్ని నడుమఁ బడినవాఁడేని విడువఁబడవచ్చునుగాని, భీమునెదుటఁ బడిన వాఁడు మరలఁజాలఁడని నాయభిప్రాయము. అప్పార్థుఁడును, బాంచాలురను, గేశవుఁడును, సాత్యకియును రణరంగమున సంరంభించియు, నాభీమునుండి ప్రాణములను రక్షించుకొనునుపాయ మెఱుఁగరని తలంచెదను. ఓసంజయా! ఇఁక నాపుత్రులజీవితముసమాప్తమయ్యెను."

అది విని సంజయుఁ డాతనితో "ఓకౌరవోత్తమా! ఇపుడు జనక్షయ మిటు లారంభమగుడు, నీవు చింతించుచున్నవాఁడవు. ఈలోకమెల్ల నశించుటకు నీవే మూలమగుట నిస్సంశయము. పుత్రులమాట పట్టి, నీవు నీయంతన పాండుపుత్రులతో గొప్పవైరము తెచ్చిపెట్టి, సంధి

చేసికొమ్మని యెవ్వరెన్ని చెప్పినను, రోగి పథ్యమగు నౌషధమునువలె విన నిష్టపడవైతివి. ఓమహారాజా! నీవు నీయంతన దుర్జయమగు కాలకూటమును ద్రావితివి. దానిఫలమెల్ల నీవు డనుభవింపుము. తమతమ శక్తికొలఁది పోరాడుచున్న యోధులను నీవు నిందించుచున్నవాఁడవు. వారొనరించినయుద్ధమువిధ మెట్టిదో వర్ణించెదను వినుము. అటులు భీమసేనపరాజితుఁడగుకర్ణునిఁ జూచి, నీతనయులగు దుర్మర్షణుఁడు, దుస్సహుఁడును, దుర్మదుఁడును, దుర్ధరుఁడు, నజయుఁడును గుపితులై, చిత్రములగుకవచాదులతో వెడలి, యాభీముని మార్కొని, నలుగడలఁజుట్టికొని మిడుతలసమూహములచేవలెఁ దమబాణములచే దెసలెల్లఁ గప్పుచువడవడిగా విక్రమింప, వానినెల్ల నాభీముఁడు నగుచుఁ బరిగ్రహించెను. అపుడు భీమసేను నెదుటనున్న నీపుత్రుల నారసి, యారాధేయుఁడు మహాబలుఁడగునాతని మరల మార్కొని, సువర్ణపుంఖములై సానపెట్టినతీవ్రనారాచములఁ బ్రయోగించుచుండ, నీకొడుకులు వారించుచున్నను నివారింపఁబడక, యాకర్ణునిఁ దలపడియెను. పిదపఁ గౌరవులారాధేయునకు సహాయులై చుట్టును జుట్టి నతపర్వములగు నారాచముల నాభీమునిపై బఱచిరి. ఓరాజా! అపు డాభీముఁడు నీతనయులనెల్ల నశ్వములతోడను, సూతులతోడను నిరువదైదుబాణములచేఁ గొట్టి యమమందిరముఁనొందించెను. వారెల్లరును దమతమసూతులతోఁ గూడ రథములనుండి పుడమిఁబడి, చిత్రపుష్పాలంకృతులగుటఁ బెనుగాలిచే నేలఁగూలిన మహావృక్షములువలె విరాజిల్లిరి. అటు లారాధేయుని వారించుచు, నీతనయులనెల్లఁ జంపిన యాభీమునిపరాక్రమము మాకెంతయు నద్భుతమయ్యెను. ఓరాజా! తీవ్రబాణములచే నటు లాభీముఁడు తన్ను వారించుటయుఁ, గర్ణుఁ డాతనిఁ జూడఁగాఁ గోపముచేఁ గన్ను లెఱ్ఱవాఱ, ధనుష్టంకార మొనర్చుచు, నాభీముఁడును నాతని మాటికిని జూడఁదొడంగెను.” అని పలికి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

## భీముఁడు కర్ణునితోఁ బోరాడుట

“ఓరాజా! అటులు పడిన నీకొడుకులను గాంచి ప్రతాపనిధియగుకర్ణుఁడు క్రోధావేశపరవశుఁడై యెంతయుఁ జింతిలుచుఁ దాను

జూచుచుండఁగా నాభీముఁడు నీతనయులను దునుముట, తనయపరాధముగాఁ దలంచెను. అంత నావృకోదరుఁడు కుపితుఁడై, పూర్వవైరమును స్మరించుచుఁ, దీవ్రనారాచముల నారాధేయు నొనాటనేయ, వాఁడును నగుచు నైదుబాణములచే నొప్పించి, మఱియు సువర్ణపుంఖములగు సానవెట్టినడెబ్బదికోలలచేఁ బ్రహరింప, వానిని లక్ష్యముసేయక యే యాకౌంతేయుఁ డారాధేయుని వాఁడిగల నూఱునారాచములచే నొప్పించి, మఱియు దారుగలయైదుబాణము లాకర్ణునిమర్మములు గాఁడునట్టుఁగాఁ గొట్టి, యొకభల్లముచే వానిధనువు దునుమాడెను. అపు డారాధేయుఁడు చింతాక్రాంతుఁడై వేఱొకవిల్లుగొని, యాభీముని శరపరంపరచేఁ గప్పెను. అంత నక్కౌంతేయుఁ డారాధేయుహయములఁ జంపి, సారథినిగూల్చి, కృతమునకుఁ బ్రతీకారమొనర్చి, యట్టహాసమొనరించి, మఱియు వానికార్ముకము ఖండింప, సువర్ణపృష్ఠమగు నాధనువు, మహాధ్వనితోఁ బుడమిఁబడియెను. అంత నారాధేయుఁడు తనరథముడిగి, యొకగద నాభీమునిపై వైవ, దాని నతఁడు గాంచి, యెల్లసైన్యములు గాంచుచుండ, వడిగలకోలలచే వడిగా వారించి, పిదప వేలకోలఁదిబాణముల నాసూతసుతునిపైఁ బ్రయోగించెను. అటులు తన్ను వధించుటకై ప్రయోగించిన యాబాణముల నారాధేయుఁడు వారించి, పెక్కుసాయకములచే భీమునికవచమును భేదించి, సైనికులెల్లఁ జూచుచుండ, మఱియు నిరువదైదుక్షుద్రకము లాతనిమేనఁ జొప్పించెను. అది యెంతయు నద్భుతమయ్యెను. ఓమహారాజా! పిమ్మట నాభీముఁడు తొమ్మిదిబాణములు ప్రయోగింప, నవి యారాధేయుని కవచమును, గుడిభుజమును భేదించి, పుట్టలోఁజొచ్చిన పాములువలెఁ బుడమిఁ బ్రవేశించెను. మఱియు నాభీమునిబాణపరంపరలచేఁ గప్పంబడి, యిప్పు డారాధేయుఁ డెప్పటిచొప్పునఁ బరాఙ్ముఖుఁడయ్యెను. అటులాభీమబాణసంఛన్నుఁడై యుద్ధము మాని కాలినడకతోఁ బోవు నా సూతసుతునిఁ గాంచి, నీసుతుఁడగుసుయోధనుఁడు, 'ఓవీరులారా! వడిగా సన్నద్ధులై యాకర్ణునిరథమును సమీపింపుఁడు.' అని పలుక విని, నీపుత్త్రులు తమయన్నయానతి నతిక్రమింపనేరక, నారాచములాభీమునిపైఁ బరపుచు, నాభీముని మార్కొనిరి. అటులు తనపైకి వచ్చు, చిత్రోపచిత్రాదులగు నీతనయుల నామహారథుఁడగు భీముఁ

డెంతయు వడిగా నొక్కొకబాణముచే సుక్కడంచి పుడమింబడంద్రోయ, వారు వాతహతములగువృక్షములువలె నేలంగూలిరి. ఓరాజా! అటులు వడిన మహారథులగు నీకుమారుల నారసి, కనుల నీరువెట్టుచుం, గర్ణుండు ము న్నావిదురుండు దెలిపినవచనములను స్మరించి, శాస్త్రీయముగా నమర్చి తెచ్చిన వేఱొకరథ మధిష్ఠించి, మఱియు నాభీముని మార్కొని యెను. అపుడు వారిరువురును సానవెట్టినసువర్ణపుంఖవిశిఖములచేఁ బరస్పరముం బ్రహరించికొనుచు,సూర్యకిరణసూత్రములగు మేఘములునాం జూపట్టిరి. అంత నాకౌంతేయుండు కుపితుండై, దారువెట్టిన ముప్పది యాఱుతీవ్రభల్లములచే నాకర్ణునికవచమును గొట్టంగా, నారాధేయుం డును నతపర్వములగు నేంబదిబాణములచే నావృకోదరు నొప్పించెను. అపుడు రక్తచందనాలంకృతములగు తమమేనులు పరస్పరబాణములచేఁ గృతవ్రణములై రక్తములు స్రవింప, వారపు డుదయించుచున్న సూర్య చంద్రులువలెఁ గానవచ్చిరి. రక్తసిక్తములగు తమమేనులఁ జినిగినకవచ ములు దూలఁ, బొరలడుల్చిన పాములునాఁ వారిరువురును జూపట్టిరి. ఓరాజా! నరవ్యాఘ్రులగువారిరువురు బెబ్బులులువలె శరధారలనెడికోఱలచేఁ బరస్పరముం బ్రహరించికొనుచు, మబ్బులువలె శరములంగురియు చుండిరి. మఱియు మత్తగజములువలె, సాయకములనెడి దంతాగ్రము లచేఁ బరస్పరము ఛేదించికొనుచుం బ్రకాశించిరి. మహాబలులగు నా వీరవరులు హర్షములొందుచు, నారణరంగమునఁ జరించుచు, మండలా కారముగా రథములను జరింపఁజేయుచు, నేమిస్వనములఁ గల్గించుచు, మహావృషభములువలె అంకెలువేయుచు, సింగములునా విక్రమించుచుం గ్రోధతామ్రాక్షులై, పరస్పరము నరసికొనుచుం, దమతమపరాక్రమము లతిశయిల్ల, నింద్రబలిచక్రవర్తులునాఁ బోరాడునెడ, మహాబాహుండగు భీముండు, తనదీర్ఘబాహులచే ధనువు నాకర్షించుచు, మెఱుపుతోఁ గూడినమేఘమునాఁ జూపట్టెను. ఓమహారాజా! ధనుష్టంకారములెఁ గర్జనములుగా, శరధారలె శరధారలుగా, భీముండనెడి యాభీమమేఘ మాకర్ణపర్వతమును గప్పెను. అటు లాభీమధనుర్ముక్తములగు శర సహస్రములచేఁ గప్పఁబడిన కర్ణునిఁ గాంచి, నీతనయులందఱును భీముని పరాక్రమమున కద్భుతమందిరి. అంత నాభీముండు సుపుంఖములగువిశి ఖములచే నాకర్ణునిఁ గప్పుచు, నవ్యాసుదేవార్జునుల సంతసింపఁజేయుచు,

సాత్యకియుఁ జక్రరక్షకులును బ్రహర్షమొందఁ, గర్ణునితోఁ బోరాడెను. ఓమహారాజా! ఆభీమునిపరాక్రమమును, భుజబలమును, ధైర్యమును గాంచి, నీకొమరులు మతిచెడినవారైరి" అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## భీమునిపరాక్రమము

"ఓయాంబికేయా! ఆభీమునిధనుష్టంకారమును విని, కర్ణుఁడు మత్తగజము శత్రుగజము బృంహితమునువలె సహింపనోపక, రెండు గడియ లాభీమునికంటఁబడక తొలఁగి, భీమసేనునిచేఁబడిన నీకొడుకులను గాంచి దుఃఖితుఁడై, మతిచెడి వేఁడినిట్టూర్పులు నిగిడించుచు, మఱియు నాతనిమార్గాన నక్కొంతేయుఁ డెంతయుఁ గుపితుఁడై, కన్ను లెఱ్ఱ వాఱ మహాసర్పమువలె బుసకొట్టుచుఁ, గిరణమాలియగుభాస్కరుఁడునాఁ గర్ణుని శరపరంపరలఁ గప్పుచుఁ, గిరణజాలములునాఁదగు కర్ణచాపవినిర్ముక్తబాణముల నాచ్ఛాదితుఁడయ్యెను. చిత్రవర్ణములగు నాకర్ణునిబాణములు వృక్షమున నివసింపఁ, బఱపులిడుపక్షులునా వెడలి యాభీముని మేనఁజొచ్చెను. మఱియు నటులు కర్ణుఁడు ప్రయోగించుసాయకము లెల్లెడల వెడలి, సువర్ణపుంఖములై వరుసలుగా వెడలినహంసలునా విరాజిల్లెను. ఓరాజా! ఇంతయేల! కర్ణప్రయుక్తములగుబాణము లాతని చాపమునుండియు, ధ్వజోపకరణములనుండియు, ఛత్రమునుండియు, రథదండమునుండియు, ధ్వజమునుండియు వెడలుచుఁ గానవచ్చెను. అటులు కడువడిగల్గి యాకసము నాక్రమించుచు, గ్రద్దఱెక్కలుగల్గి, సువర్ణమయములై చిత్రములగు నారాధేయునిశరసమూహములనారసి, యంతకుఁడునాఁదగు నాతని నావృకోదరుఁడు, వెనుదీయక తలపడి తొమ్మిదిబాణములచే నొప్పించుటయెగాక, యాతనిశరపరంపరలకు లక్ష్యపెట్టక, మఱియు నిరువదితీవ్రనారాచముల నొప్పించెను. అపు డాకర్ణుఁ డాభీము నెటులు శరములచేఁ గప్పెనో, యటులే భీముఁడును నాకర్ణునిఁ గప్పెను. అపు డాభీమునిపరాక్రమముఁగాంచి చారణులును నీవారును సంతసించిరి. ఓరాజా! అపుడు మహారథులగుభూరిశ్రవుఁడును, కృపాశ్వత్థామలును, శల్యజయద్రథులును, నుత్తమౌజుఁడును, యుధామన్యుఁడును, సాత్యకియుఁ, గేశవార్జునులును నగుకురుపాండవప్రవ

రులు పదుగురును మేలుమేలని పొగడుచు, వేగముగా సింహనాదము లొనర్చిరి. అపు డటులు గగురుపాటొదవించు నాసంకులసమరమారంభమగుడు, మనసుయోధనుఁడు వడిగా నచ్చోటఁగల రాజపుత్రులతో 'ఓరాజులారా! రాజపుత్రులారా! సోదరులారా! వడిగాఁ గర్ణుని సమీపింపుఁడు. వృకోదరుని మార్కొనుఁడు. మీకు శుభమగుఁగాక. భీముని ధనువునుండి వెడలినబాణములు కర్ణునిఁ బీడించుచున్నవి. కావున మీరెల్ల నాసూతసుతుని ప్రాణములను గాపాడుటకై ప్రయత్నింపుఁడు.' అని పలుక విని యాతనిసోదరు లేడ్వురు సంరబ్ధులై వెడలి, యాభీమునిఁ జుట్టికొనిరి. అటులు వారెల్ల వర్షకాలమేఘములు పర్వతమునుబోలె నావరించి, శరవర్షముచే నాతనిఁ బీడించుచుఁ, బ్రజాక్షయకాలమునఁ జంద్రునిఁజుట్టుకొన్న సప్తగ్రహకూటమునాఁ జూపట్టిరి. పిదప నావృకోదరుఁడు, తనదృఢతరముష్టిచే విల్లుసారించి, యాయేడ్వురకుఁ దగునట్లుగా నేడుసాయకములను సంధించి, సూర్యకిరణములునాఁదగు నాబాణములను వారిపైఁ బ్రయోగింప, నవి వారిపై భీము నకుఁగలవైరమును స్మరించునవివోలె వడిగా వెడలి, నీతనయులమేనిరక్తములఁ ద్రావి పైకివెడలెను. అంత నాశరప్రహారములచే వారు భిన్నకవచులై నేలఁ గూలిరి. అటులు కొండచఱియలపైఁ బుట్టినచెట్టులు మహాగజముచేవలె నాభీమునిచే నీపుత్రులగుశత్రుంజయుఁడును,శత్రుసహుఁడు,చిత్రుఁడు, చిత్రాయుధుఁడు, దృఢుఁడు, చిత్రసేనుఁడు, వికర్ణుఁడును హతులగుట మిగుల సంతాపకరమయ్యెను. అంత నాకౌంతేయుఁడు నీతనయులెల్ల హతులగుటఁ గాంచి, తమకుఁ బ్రియుఁడగువికర్ణునికై శోకించుచు, 'ఓవికర్ణా! ఈసంగ్రామమున మీసోదరులనెల్లఁ జంపెదనని ప్రతిజ్ఞ చేసినవాఁడనగుట, నిన్నును జంపి నాప్రతిన నిర్వర్తించుకొంటిని. అయ్యో! నీవు క్షత్రియధర్మమును స్మరించి సంగరరంగమును బ్రవేశించితివి. నీ వాసుయోధనునకును, విశేషించి మాకును హితముగూర్చువాఁడవు. న్యాయముగనో యన్యాయముగనో మహాద్యుతివగు నీవు హతుఁడవై యీరణక్షితిని బడియుంటివి. మహాప్రాజ్ఞుఁడై సురగురుఁడు నాఁదగు నాగాంగేయుఁడు సమరభూమిని బ్రాణములుపరిత్యజింపలేదా? కావున యుద్ధ మతినిష్ఠురమైనది' అని పలికెను.

ఓరాజా! అటు లాభీముఁడు వారినెల్లఁ జంపి, యారాధేయుఁ డారయుచుండఁగనే ఘోరముగా సింహనాద మొనర్చెను. శూరుఁడగు నాసమీరకుమారు నాయారావ మాధర్మజుని చెవిఁబడి, యానాఁటియుద్ధమున, వారిగొప్పవిజయమును దెలిపెను. ఆభీమసేనునిమహానాదమును విని యాయుధిష్ఠిరుఁడు పరమానందభరితుఁడై, వాదిత్రధ్వనులతోఁ గూడ దానిని బ్రతిగ్రహించెను. అటు లావృకోదరుఁడు గుఱుతెఱిఁగించుటయు నాయుధిష్ఠిరుఁడు సోత్సాహుఁడై, మఱియు నాద్రోణుని మార్కొనియెను. ఓమహారాజా! నీయక్కుమారు లిరువదియొక్కం డ్రొక్కమాఱుగా నుక్కడంగుటఁ గాంచి యాసుయోధనుఁ డావిదురునివచనములను స్మరించి, 'అయ్యో! విదురుఁ డెఱిఁగించినహితవచనములు వినమి కిపుడు దగుఫలము సంప్రాప్తించెనుగదా' యని తలంచికొని, మాఱుపలుక లేకూరకుండెను. ఓరాజా! దుర్బుద్ధియగునీకొమరుఁ డాద్యూతకాలమున సభలో నటు లాద్రౌపది నీడ్చి తెచ్చి కర్ణునితోఁ గూడి యల్పబుద్ధియై, పనికిమాలినపనులొనర్చుటకును, నీవును నవ్వాండవులును వినుచుండ నాసభలోఁ గర్ణుఁ డాద్రౌపదితో, 'ఇంక నీకుఁ బతులెక్కడ? వారు శాశ్వతనరక మొందినవారు. వేఱొకపతిని వెతకికొనుము.' అని పలికిన పరుషవచనములకును దగుఫల మిపుడు ప్రాప్తించెను. మఱియు మహాత్ములగుపాండవులకుఁ గోపముగల్గునట్లుగా నీతనయులాడిన 'షండతిలాదిపరుషవచనముల కలిగినభీమసేనుని క్రోధాగ్ని, పదుమూఁడేండ్లు నాఱిపోక యిపుడు నీపుత్రుల నంత మొందించుచున్నది. ఆవిదురుఁడు పలుమాఱు నీకడ మొఱపెట్టికొనినను, సంధి యాతనికొసంగవైతివి. కావున, దానికిఁ దగుఫల మిపు డీవు నీపుత్రునితోఁ గలిసి యనుభవింపుము. వృద్ధుఁడవును, బండితుఁడవును, గార్యతత్త్వమెఱిఁగినవాఁడవయ్యు, నీ వామిత్రులవచనములను వినకుండుటకు దైవమే హేతువు గావలెను. ఈగొప్పతప్పు నీదై యుండుట, నిఁక విచారింపఁ బనిలేదు. నీవే నీపుత్రులవినాశమునకుఁ గారణమైతివని నానిశ్చయము. ఓరాజేంద్రా! వికర్ణుఁడును, వీర్యశాలియగుచిత్రసేనుఁడును, మహారథులైన మఱికొందఱుపుత్రులును గతించిరి ఇంత యేల! ఆభీమునికంటఁబడిన నీసుతులెల్ల హతులగుచునేయున్నవారు. ఆకౌంతేయరాధేయుల శరపరంపరలచేఁ గాల్పఁబడుచున్నసైన్యమును జూచితిని. ఇదియెల్ల నీ

నుండియేగదా!' అని తెలుప విని ధృతరాష్ట్రుఁడా సంజయునితో మఱియు ని ట్లనియె.

కర్ణుఁడు భీముని మరల నెదుర్కొనుట

"ఓసంజయా! ఇందు విశేషించి నాదియే గొప్పతప్పు. దానికిఁ దగు ఫల మిపుడు సంప్రాప్తించెనని తలంచెదను. ఏదియెటులైన నటులగునని నేను నిశ్చయించుకొంటిని. కానిచో నిపు డిందేమిచేయగలను? కావున, నోసంజయా! నాతప్పువలనఁగల్గిన యీగొప్పవినాశమువిధ మెట్టిదో స్థిర చిత్తుఁడవై యె ఱేఁగింపుము."

"ఓరాజా! మహాసంగ్రామమునఁ బరాక్రమనిధులగు నాకర్ణభీము లిరువురును, వర్షకాలమేఘములవలె శరవర్షమును వర్షించుకొనుచుండ, సువర్ణపుంఖములై సానవెట్టిన భీమసేనాంకితములగు బాణను లారాధే యునిజీవితమును భేదించునవియై వాని మేనఁ బ్రవేశించుచుండెను. అటులేకర్ణప్రయుక్తములై విషసర్పములునాఁదగు బాణములు వేలకొలఁది భీమునిఁ జుట్టికొనుచుండెను. ఓమహారాజా! ఎల్లెడలఁ బడుచున్న వారి శరపరంపరలచే, నీసైన్యములందు సాగరతుల్యమగు సంక్షోభము జనించెను. ఘోరములై సర్పములునాఁదగు భీమచాపవిముక్తసాయకము లచే మనసైన్యమున ననేకులు చంపఁబడిరి. ఓరాజా! అపుడు పుడమిఁ బడినయేన్గులు, గుఱ్ఱములు, పదాతులు నెల్లెడల వ్యాపించి, వాతనిర్ఘాతములగు వృక్షసమూహములునాఁ జూపట్టిరి. అంత, నీవారియోధులు కొందఱు భీమునిశరప్రహారములచే వధ్యులగుచు, నిదియేమియుపద్రవ మని జడిసి పరువులిడసాగిరి. పిదప సింధుసౌవీరకౌరవసైన్యమంతయుఁ దొలఁగి, కడువడిగల కర్ణపాండవులశరములకుఁ దాళఁజాలక చెదరి పోయెను. అపు డందలిశూరులు, హతాశ్వులును, హతవారణులు నై సగముచచ్చి, యాభీమకర్ణులను విడిచి నలుగెలంకులకుఁ బాఱఁజొచ్చిరి. ఓరాజా! 'కర్ణభీమప్రయుక్తములగు శరపరంపరలచే మనసైన్యమె నశించుచుంట నారయఁగా, దేవత లాపాండవులకార్యమునకుఁగా నిట్టి మోహమును గల్గించుచున్నారనుట నిశ్చయము' అని మనయోధులు పలుకుచు, భయగ్రస్తులై వారిశరపాతములకు దూరముగాఁ దొలఁగి యుద్ధము చూచుచుండిరి. పిమ్మట నమ్మహాసంగరరంగమున, శూరు

లకు హర్షమును, భీరులకు భయమును గల్గించునదై, గజాశ్వపదాతుల రక్తము, ఘోరరూపమగునదియై ప్రవర్తిల్లెను. మఱియు గతప్రాణులగు గజాశ్వపదాతులతోడను, బతాకలతోడను, రథాశ్వాదులగుభూషణములతోడను, విఱిగినరథములతోడను, భగ్నములగు చక్రకూబరాదులతోడను, సువర్ణాలంకారములతోడను గూడి, మఱియు, ధ్వని యొనర్చుధనువులచేతను, సువర్ణపుంఖములగు వేలకొలఁదినారాచములచేతను, పన్నగములునాఁదగి కర్ణపాండవచాపవినిర్ముక్తములగు ప్రాసతోమరఖడ్గపరశ్వధాదులచేతను, గదాముసలపట్టసములచేతను, వివిధాకారములగు శక్తిపరిఘాదులచేతను, జిత్రములగుశతఘ్నులచేతను, నపుడాభారతభూమి యెంతయు నలరారుచుండెను. ఓమారిషా! అందొకచోఁ, సువర్ణాంగదహారకుండలమకుటాదులును, వేఱొకచోఁ గవచములును, దలత్రములును, ధ్వస్తములైనవస్త్రములును, ఛత్రములును, జామరములును, వ్యజనములును, గజాశ్వాదులరక్తములచే సిక్తములైనబాణములును నందందుఁగలిగి, యాసంగ్రామభూమి గ్రహములతోఁగూడిన యాకసమువలె నెంతయు విరాజిల్లెను. ఓరాజా! ఊహింపరాని యాకర్ణరాధేయుల యమానుషకృత్యము నత్యద్భుతముగాఁ జూచి చారణులును, సిద్ధులును విస్మయమందిరి. వాయుసహాయుఁడగు నగ్ని యెండుగడ్డిపైఁ గవిసినట్టులుగా, నాయుద్ధమున భీమునితోఁగలిసిన యారాధేయురౌద్ర మెంతయు భయంకరమైయుండెను. పతనమొందిన రథధ్వజములును, హతములైన నరద్విపసమూహములును గల్గినయాసైన్యము, రెండుమత్తగజములు ప్రవేశించినపద్మవనమువలెఁజూపట్టెను. ఆకౌంతేయరాధేయుల కపు డెంతయు గొప్పసమ్మర్ద మయ్యెను.” అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

### భీమరాధేయులయుద్ధము

“ఓరాజా! పిదప నారాధేయుఁడు భీముని మూఁడుబాణములచే నొప్పించి, చిత్రములైన పెక్కుశరముల మఱియు నాతనిపైఁ గురిసెను. అంత నామహాబాహుఁడగు భీముఁ డాకర్ణుని ప్రహారముల కించుకేనిఁ జలింపక, కొండపలెఁ దిరముగా నుండెను. ఓమారిషా! అపు డా వృకోదరుఁ డాకర్ణునిఁ జముఁగునఁ గడుగఁబడి పచ్చునై దారుగల యొకకర్ణి

యనుబాణముచే నొంచి, మిగులఁ జక్కనై సువర్ణమయమగు గొప్ప కుండల మొకటి యాకసమునుండి నక్షత్రమునువలెఁ బడఁద్రోసి, మఱియు నొకభల్లముచే నాతనివక్షమును బ్రహారించి, కుపితుఁడై నగుచు, మఱియుఁ బదిబాణముల నారాధేయునిపైఁ బ్రయోగించెను. మహాబాహుఁడగు నాభీముఁడు ప్రయోగించిన సర్పతుల్యములగు నాసాయకము లాకర్ణుని నెన్నుదురు భేదించి, ప్రవేశించెను. అపు డాసూతసుతుఁడు తనలలాటమున నాటినబాణములచే నెంతయు నలరారెను. వడిగలయాభీమునిచే నటు లెంతయు నొచ్చుట, నారాధేయుఁడు రథకూబరమునుబట్టికొని, కనులుమూసి సోలఁబడి, కొంతవడికిఁ దెలిసి రక్తసిక్తసకలాంగుఁడై కోపము తెచ్చికొని, కడువడిగా నాభీమునిరథము పైకి వెడలెను. అటులు వెడలి యతఁడు, గ్రద్దఱెక్కలుగల పెక్కు బాణముల నాభీమునిపైఁ గురియ, నతఁడు నాతనిపరాక్రమమును లెక్కసేయక, యుగ్రములగు పెక్కుశరముల వర్షించెను. ఓమహారాజా! పిదప నారాధేయుఁ డాభీమునిపైఁ దొమ్మిదిబాణములు పఱపి, కుపితుఁడైన యాతని మఱియు వక్షమునఁ బ్రహారించెను. నరవ్యాఘ్రులగువారిరువురును గోఱలుగలబెబ్బులులవలెఁ బోరుచు, మబ్బులువలె శరవర్షములను వర్షించుకొనిరి. మఱియు వారు తలశబ్దములచేతను,వివిధములగుశరజాలములచేతను బరస్పరము బెదరించుకొనుచుఁ గుపితులై కృతప్రతీకారము లొనర్చుకొనుచు నుండిరి. పిదప నావృకోదరుఁ డొకక్షురప్రముచే నాకర్ణునిధనువు దునుమాడి సింహనాద మొనర్ప, నారాధేయుఁడును వేఱొకవిల్లుపూని, యటు లక్కురుసౌవీరసింధుసైన్యక్షయమును గాంచియుఁ, గవచధ్వజశస్త్రాదులచే నావృతమైన రణభూమి నరసియు, సంరంభింప నాతనిదేహము దీప్యమానమైయుండెను. ఓరాజా! అటు లారాధేయుఁడు ధనువుపూని, సారించి ఘోరదృష్టితో నాభీము నారయుచు, సారములగుశరవారములఁ గురియుచు, నెంతయు మధ్యందినమార్తాండునివలెఁ బ్రకాశించుచుండెను. మఱియు నతఁడు బాణములను సంధించుచు, విడుచుచు నుండుటలో నవకాశము గానరాకుండెను. అతనిధనువు మండలాకారమై యగ్నిచక్రమువలెఁ గానవచ్చెను. ఓమహీపాలా! ఆరాధేయుఁడు కుడియెడమలఁ బ్రయోగించు సువర్ణపుంఖములగువాఁడికోల లాసూర్యునిప్రభలను, దెసలను గప్ప

సాగెను. వానిధనువునుండి వెడలినసాయకము లాకసమున గుంపులై, వరుసలుగా నేర్పడినక్రౌంచములునాఁ జూపట్టెను. అటులు గ్రద్దఱెక్కలు గల్గి, సువర్ణవిభూషితములై, కడువడిగల్గి, ప్రదీప్తాగ్రములై సానవెట్టిన యాకర్ణుని బాణపరంపర లాభీమునిరథముపైఁ బడుచుండెను. మఱియు నాకర్ణచాపవిముక్తములగు బాణములు వేలకొలఁదిగా, మిడుతలవలె వెడలుచు, నన్నియు నొకటిగా దీర్ఘమై యాకసముఁ గప్పట్టి, పర్వత మును వారిధారలువలె నాభీమునిఁ గప్పెను. అపుడు భీముని బలవీర్య పరాక్రమములను బ్రయత్నమును గాంచి, యతఁ డేమియొనర్చునో యని నీపుత్రులు సైనికులతోఁగూడ జూచుచుండిరి. అటులు వెడలిన యాశరవృష్టిని, విజృంభించినసాగరమును వేలవలె నాపి, లక్ష్యము సేయక కుపితుఁడై భీముఁ డాకర్ణునిఁ దలపడి, సువర్ణపృష్ఠమైనధనువు మండలాకారముగా నొనర్చుచుండ, నింద్రచాపసమానమగు దాని నుండి వెడలినసాయకము లాకసమును గప్పునవివోలె వెడలి, యారా ధేయప్రయుక్తసాయకములను ఖండించుచుండెను. అగ్నికణములునాఁ దగు నాకర్ణభీములశరజాలములచే నాకసమెల్ల నిండెను. అపుడు సూర్యుఁడు గానరాకుండెను. గాలులు వీవఁ జోటులేకుండెను. అటు లా బాణములచేఁ గప్పఁబడినయాకసమున నేమియుఁ దెలియఁబడకుండెను. అపుడు కర్ణుఁ డాభీమునిశరపరంపరలఁ గప్పుచు, నాతని లెక్కగొనక సమీపించెను. ఓమారిషా! వారిరువురును శరజాలములఁ బఱపికొను చుండ, నవి పరస్పరము గలిసి వాయుభూతములై గానవచ్చెను. ఓభరత కులోత్తమా! ఆమహావీరులశరసంఘర్షముచే నాకసమున నగ్ని జనిం చెను. అంత నారాధేయుఁడు కర్మారపరిమార్జితములై దారుగలబాణము లను సంధించి, కోపావేశముతో నాభీముని వధించువాఁడై ప్రయో గింప, వాని నాకసమందే తనతీవ్రబాణములచే నావృకోదరుఁడు మూఁడు మూఁడుఖండములుగా ఖండించి, నిలునిలుమని పలుకుచు, మఱియు నుగ్రమగుశరవర్ష మారాధేయునిపైఁ గురియుచుఁ, గుపితుఁడై దహింపఁబూనినపావకుఁడునాఁ బ్రజ్వరిలుచుండెను. వారు చేతులకుఁ దగుల్చుకున్న కవచములందుఁ జటచటాశబ్దముప్పతిల్లెను. అటులే తలశబ్దమును, సింహనాదమును, రథనేమిధ్వనియు, నల్లెత్రాటిచప్పుడును దారుణమై వినవచ్చుచుండెను. వీరులెల్లరును వారిపరాక్రమ మారయు

వారై యుద్ధములను మాని చూచుచుండిరి. పరస్పరవధాకాంక్షులగు నాకర్ణభీములవిక్రమము, నా దేవర్షిసిద్ధగంధర్వులు మేలుమేలని సన్నుతించిరి. మఱియు నపుడు విద్యాధరులు పుష్పవర్షమును గురిపించిరి. పిదప మహాబాహుండగు భీముఁడు దృఢవిక్రముఁడై సంరంభ మడర, నిజాస్త్రములచే నాతనియస్త్రములను వారించుచుఁ, గొన్ని సాయకములచే నొప్పించెను. మహాబలుఁడగు కర్ణుఁడును, నాభీమునిబాణములను వారించి, సర్పతుల్యములగు తొమ్మిదిబాణము లాతనిపైఁ బఱపె, నన్నిబాణములచేతను భీముఁడు వానిని ఖండించెను. అటులు దునిమి, 'ఓ రాధేయా! నిలునిలు' మని పలుకుచుఁ, గుపితుఁడై యంతకతుల్యమై యపరయమదండమునాఁదగు నొకబాణ మాతనిపై విడిచెను. ఓరాజా! అటులు తనపై కివచ్చు నాఘోరనారాచము నారాధేయుఁడు నిజప్రతాపమేర్పడ మూఁడువాఁడికోలలచే ఖండించి, పరిహాస మొనర్చెను. అంత, నాకౌంతేయుఁడు మఱియు నుగ్రమగుశరవర్షమును గురియ, దాని నాకర్ణుఁడు నిర్భయుఁడై ప్రతిగ్రహించెను. అటు లాభీముఁడు శరప్రయోగ మొనర్చుచుండ నారాధేయుఁడు తనయస్త్రమాయచే నాతని యమ్ములపొదులను, ధనువుత్రాటిని, గుఱ్ఱములను, బగ్గములను ఖండించి, యశ్వములను గొట్టి, సూతుని నొప్పించెను. అంత నాతనిసూతుఁడు వడిగా యుధామన్యునిరథమును జేరెను. మఱియు నారాధేయుఁడు కుపితుఁడై కాలాగ్నితుల్యుఁడై నగుచు, నావృకోదరునిధ్వజమును బతాకను ఖండింప, మహాబాహుండగుభీముఁడు, ధనువు దునుగుట నొకశక్తిని దడవి యాకర్ణునిరథముపై విడువఁ, గనకభూషితమగునాశక్తి, మహోల్కవలె వెడలుటయు, దాని నారాధేయుఁడు పదిబాణములచే ఖండించెను. అది పదిముక్కలై నేలఁబడియెను. అంత నాకౌంతేయుఁడటులు మిత్రకార్యమునకుఁగాఁ జిత్రయుద్ధ మొనర్చు నాసూతపుత్రుని వధించువాఁడై, సువర్ణభూషితమగు నొకకేడెమును, ఖడ్గమునుబట్టి, మృత్యువేని, జయమేనిఁ గావలయు ననుపట్టుదలతో నాతని సమీపింపఁ, గర్ణుఁడు పరిహాసించుచు, నుగ్రములగు పెక్కుబాణములచే నాభీముని కేడెమును బీడించెను. ఓమహారాజా! అటులు తనకేడెమును జెడ, విరథుఁడైన యాభీముఁడు కోపమడర, నారాధేయురథముపై ఖడ్గమును విసరెను. ఆకత్తి, యాకర్ణునిధనువు దునుమాడి, కుపితమగుసర్పమువలె

నాకసమునుండి పుడమిఁ బడియెను. పిదప నాసూతసూతి నగుచు, వేఱొకవిల్లు పూని కడువడియు దృఢమగునారియుఁగల యాధనువున నాభీమసంహారకములగు శరముల నమర్చి ప్రయోగించెను. కర్ణచాప విముక్తములగుబాణముల కొట్టువడి, యావృకోదరుఁడు కర్ణునకు వెఱపుగల్గునట్లుగా నాతనిరథముపై నుఱుక, నప్పటిసంగ్రామమున జయము గోరువాఁడగుట నారాధేయుఁ డాతనికిఁ గానరాకుండ నందే యడఁగియుండెను. అంత, నాకౌంతేయుఁ డట్లు రథమధ్యమున డాగియున్న యక్కర్ణునిఁ గానక, పుడమికి డిగి నిలువఁబడి యుండెను. అపుడు కౌరవులును జారణులును నావృకోదరునిఁ గాంచి, 'ఆహా! ఇతఁ డీకర్ణుని రథమునుండి గరుడుఁడు సర్పమునుబోలె నెత్తికొనిపోవనున్నవాఁడు. తాను విచ్ఛిన్నధన్వుఁడును, విరథుఁడునయ్యు, నిజధర్మమును బరిత్యజింపక రథమువెనుకఁబెట్టి, యుద్ధసన్నద్ధుఁడై యున్నవాఁడుగదా!' అని యాతని గౌరవించిరి. అంత, నారాధేయుఁడు కొంతవడికి దానినుండి వెడలి, యుద్ధమునకు సిద్ధపడియున్న యాభీమునిఁ దలపడియెను. ఓమహారాజా! మహాబలులగువారిరువురు నటులు గలిసి, పరస్పరస్పర్ధ లడర వర్షకాలపుమేఘములునా గర్జించుచు మార్కొన, నపుడు వారికి దేవదానవులకువలె గొప్పయుద్ధ మారంభమయ్యెను. అంత నాకౌంతేయుఁడు క్షీణాస్త్రుఁడై తన్నారాధేయుఁడు తఱుముటను గాంచి, యంతకుమున్నర్జునహతములై పడియున్న యేనుఁగులప్రోవులోఁ జొచ్చి, జీవితము నిలుపుకొనువాఁడై, యందొకరథముచాటున నొక యేనుఁగుక్రింద నుండెను. అపు డారాధేయుఁడు, మున్నాహనుమంతుఁడు మహౌషధులుగలపర్వతమునువలె నాయేనుఁగును గొట్టెను. అంత నా భీముఁ డాచోటఁ బడియున్న యేనుఁగుల నాకర్ణునిపై వైచెను. అటులే యావృకోదరుఁ డందుఁగలరథచక్రములను, గుఱ్ఱపుడొక్కలను, మఱియుఁ దనకు దొఱకినవానినెల్ల నారాధేయునిపై వైచుచువచ్చెను. వానినెల్ల నారాధేయుఁడు ఖండించుచుండెను. అపు డాభీముఁడు వజ్రతుల్యమై దారుణమగు తనపిడికిటిపోటుచే వానిని జంపఁగల్గువాఁడై తలంచియు, నాక్షణమ యాసూతపుత్రునిఁ బార్థుఁడు చంపనున్నవాఁడని స్మరించి విడిచెను. అటు లాయర్జునుప్రతిజ్ఞను స్మరించి, దానిని గాపాడువాఁడై చింతించుచున్న యాభీముని, మఱిమఱియుఁ దీవ్రనారాచము

లచే నొప్పించి, మూర్ఛనొందించియుఁ, గుంతివచనములను స్మరించుచు, నిరాయుధుఁడగు నాతనిఁ జంపఁబోక వింటికొనచేఁ బొడిచెను. అపు డా భీముఁ డాతనిధనువు తనతనువు సోకినంతమాత్రమునఁ గుపితమగుసర్పముచాడ్పున బుసకొట్టుచు, వానిధనువు లాగికొని దానితో నాకర్ణునిఁ గొట్టెను. అంత నారాధేయుఁ డాతని తాడనమునకుఁ గుపితుఁడై, కన్నులెఱ్ఱచేసి, పరిహాసముగా 'ఓనిస్సారుఁడా! మూఢా! ఓతిండిపోతా ! అస్త్రపద్ధతి తెలియనివాఁడవు. ఇటు లీచిన్నయుద్ధమునకే జడిసితివి. ఇఁక యుద్ధమును జేయఁదలంపకుము. ఓపాండవా! బహువిధములగుభక్ష్యభోజ్యపానీయము లున్నచోటి కీవు దగుదువుగాని, యుద్ధముగలచోటికెన్నఁడును దగవు. పుష్పఫలమూలాదు లాహారముగా వనమున వ్రతములకును, నియమములకును నీవు దగుదువుగాని, యుద్ధమునకుఁ దగినవాఁడవుగావు. ఓవృకోదరా! యుద్ధమునకును, మునిధర్మమునకును జాలదూరము గావున వనమునకుఁ బొమ్ము. నీకు వనవాసమందే యభిరుచిగాని యుద్ధమున లేదు. ఓవృకోదరా! నీవు నీయింటనున్నవంటవారిని, సేవకులను, నౌకరులను, ద్వరపెట్టుచు, భోజనమునకుఁగా వారిపై నీకోపముచూపుటకును,గొట్టుటకును దగుదువు. లేదా! మునివై వనమున ఫలాదులను దెచ్చుచుండవచ్చును. అందులకుఁ బొమ్ము. నీకు యుద్ధనైపుణ్య మెక్కడ? ఓభీమా ! ఫలమూలాదులను దెచ్చికొని యతిథుల కిచ్చుటకును, దినుటకును దగువానిఁగాఁ దలంపవలెనుగాని శస్త్రోద్యోగమునకుఁ దగుదువని తలంపరాదు.' అని యాభీముఁడు కౌమారమునఁజేసిన యప్రియములన్నియు నతిపరుషముగా నుగ్గడించుచు, సందడఁగియున్న యాతనిఁ దనధనురగ్రముచే మఱిమఱియుఁ బొడుచుచుఁ, బరహసించుచు, మఱియు నాతనితో 'ఓభీమా ! నీకు యుద్ధముచేయుకోర్కిగలదేని మఱియెవ్వరితోనేనిఁ బోరాడవచ్చును గాని మావంటివారి నెన్నఁడు మార్కొనకుము. మాయట్టివారితోఁ బోరుదువేని యిదియెగాక, యింకేమియైన జరుగును. కావున, నిప్పటి కప్పార్థవాసుదేవులున్నకడకుఁబొమ్ము. వారు నిన్ను రక్షింతురు. లేదందువేని నీమందిరమునకేనిఁ బొమ్ము. నీ కీయుద్ధముతోఁ బనియేమి?' అని పలికెను. అతిదారుణమగు నాతనిపరుషవచనమును విని భీముఁ డాతనిఁ జూచి నగుచు, నెల్లవారు విన వానితో 'ఓరీ దుష్టా! పలుమాఱులు

నాచే జయింపఁబడియు, నిటులు వ్యర్థముగా నేల గర్వించుచున్నాఁడవు? ఆయింద్రలోకమునందే పూర్వ మెందఱో జయాపజయముల నొంది యున్నవారు. ఓదుష్టకులసంభవా! నాతో నీవిపుడు మల్లయుద్ధమొన రింపుము. మహాబలుఁడును, మహాభోగియునగు నాకీచకు నెట్లు చంపి తినో యటులే యీరాజులెల్లఁ జూచుచుండఁగా నిన్నీఁచమడంచెదను' అని పలికెను. అంత నారాధేయుఁ డాభీమునిపద్ధతి నెఱిఁగించినవాఁడగుట బుద్ధిమత్తరుఁడై యాలోచించికొని, యందుఁగలవీరులెల్ల నారయు చుండఁగనే యప్పటియుద్ధమునుండి మరలెను. ఓరాజా! అటు లాకర్ణుఁ డాభీముని విరథునొనరించి గర్వించెను. ఆపరిహాసము నాపార్థవాసు దేవు లిరువురు గాంచుట, నపు డాపార్థుఁ డాసూతపుత్త్రునిపై వాసు దేవానుమతి వడసి కొన్నితీవ్రనారాచములను బ్రయోగింప, బార్థ ప్రయుక్తములై గాండివమునుండి వెడలినయాబంగరునారాచములు హంసలు క్రౌంచమునువలె నారాధేయుమేనఁ జొరఁబాఱెను. సర్ప ములునాఁదగు నాగాండీవికాండపరంపరచేఁ బ్రహతుఁడై, యాకర్ణుఁడు భీమునివిడిచివెడలిపోయెను. అటులు కర్ణుఁడు భీమునిచేఁ ఛిన్నధన్వుఁడై, యర్జునసాయకహతుఁడై కడువడిగా వెడలిపోవ, భీముఁడును సాత్యకి రథ మధిరోహించి, యర్జునునికడ కరిగెను. మఱియు నాయర్జునుఁడు క్రోధతామ్రాక్షుఁడై వడిగా నారాధేయునిపై నొకనారాచమును బఱపు, నది సర్పమును వెంబడించినగరుడునివలె నాకర్ణునిపైకి వెడలు టయు, దాని నంతరిక్షముననే యశ్వత్థామ ఖండించెను. అటు లక్కర్ణునిఁ గాపాడుటకై తనబాణమును ఛేదించిన యాద్రోణసుతునిఁ గోపమడర, నఱువదినాల్గుబాణములచే నర్జునుఁడు నొప్పించి, నిలునిలుమని పలుక, నాద్రోణసుతుఁ డాపార్థప్రహార మెంతయు నొప్పింప, మత్తగజాకీర్ణమై రథసంకులమైయున్న యాసైన్యమునడుమఁ బ్రవేశించెను. పిదప సువర్ణ పృష్ఠములగుధనువులచప్పుడు లుప్పతిల్లుచుండ, నందు గాండివఘోషము గలిసి బలవత్తరమై వినవచ్చెను. అటులు వెనుకకుఁ బోవుచున్న యశ్వ త్థామ నాధనంజయుఁడు కొలఁదిత్రోవనే తలపడి శరసమూహముచే వెఱపుగొలుపుచు, గజాశ్వపదాతులదేహములను జీల్చుచు,నాసైన్యము నెంతయుఁ బీడించెను." అని తెలుప విని ధృతరాష్ట్రుఁడు మఱియు నాత నితో ని ట్లనియె.

## అలంబుసుఁడు సాత్యకిచేఁ జచ్చుట

"ఓసంజయా! ప్రతిదినమును నాదీప్తమగుయశము తఱుగుచునే యున్నది. ఇప్పటి కనేకులు యోధులు హతులైరి. ఇదియెల్లఁ గాలవ్యత్యాస మనఁదగియున్నది. ధనంజయుఁడు కుపితుఁడై మాసైన్యమును బ్రవేశించెను. దేవతలకును జొరరాకుండఁ గర్ణాశ్వత్థామలు రక్షించుచున్నను, బరాక్రమశాలియగునతఁడు వీర్యనిధులగుకృష్ణభీములయు, సాత్యకియు సహాయమున మాసైన్యమును జెండాడుచున్నవాఁడు. అదిమొదలు శోకమగ్నివలె నాహృదయమును దహించుచున్నది. సైంధవుఁడు మున్నగుభూపాలు రిఁక మ్రింగబడుదురనియే తలంచుచున్నాఁడను. సైంధవుఁ డప్పార్థునెడ గొప్ప తప్పిదము గావించియు, నాతనిదృష్టిపథమునఁ బడియున్నవాఁడుగదా! వాఁ డిక నెట్లు జీవింపఁగలఁడు? ఓసంజయా! నేనూహించిచూచుచున్నాఁడను. సైంధవుఁ డిఁక లేఁడనవచ్చును. అపుడు యుద్ధ మెట్లు జరిగెనో తెలుపుము. మన గొప్పసైన్యమును గలఁతనొందించి, మఱిమఱియు నాలోచించి, పద్మవనము నేన్గువలెఁ గుపితుఁడై, యాసాత్యకి యొకడే ప్రవేశించెనుగదా! వృష్ణివీరుఁడగు నాతనియుద్ధమువిధ మెట్టిదో తెలుపుము."

అది విని యాసంజయుఁ డాతనితో "ఓరాజా! అటులు కర్ణప్రపీడితుఁడై వెడలిపోవుచున్న యాభీమునిఁ గాంచి, యాసాత్యకి వీరులనడుమ రథముతో వెడలి, వర్షకాలపర్జన్యుఁడువలె గర్జించుచు, వేసవి సూర్యునివలె వేఁడిచూపుచుఁ,దనదృఢధనువుచే వైరులను హింసించుచు, మనసైన్యమును గంపింపఁజేయుచు నుండెను. వెండిగుండులునాఁదగు గుఱ్ఱములతో యుద్ధమున కటులు వెడలినయావీరప్రవరు నెవ్వరును నివారింపఁజాలరైరి. ఓరాజా! అట్టితఱి బెట్టుకోపమొదవ యుద్ధభీరువుగాక, సువర్ణకవచధారియై విల్లుకేలఁబూని, యలంబుసుఁడను నొకరాజోత్తముఁ డాసాత్యకిని నివారించెను. ఓభరతకులోత్తమా! వారికపుడు జరిగినయుద్ధమునుబోలుయుద్ధ మెన్నఁడును జరుగలేదు. యుద్ధశోభితులగువారిని నీవారును, నితరులును జూడసాగిరి. అపు డారాజవరేణ్యుఁ డగునలంబుసుఁడు పదిబాణము లాసాత్యకిపైఁ బ్రయోగింప, వానిని ద్రోవనడుమనే యాశైనేయుఁడు ఖండించెను, మఱియు నాయలంబుసుఁ

డా కాల్ణాంతముగఁ దిగిచినయగ్ని తుల్యములగు మూఁడుతీవ్రసాయకము లను వైవ, నవి యాసాత్యకికవచమును జీల్చి, శరీరమును బ్రవేశించెను. అగ్ని వాయుతుల్యములై ప్రజ్వలించుచుఁ, దీవ్రములగు బాణములచే నటు లాసాత్యకిమేను నొప్పించి, యాయలంబుసుఁడు, మఱియు నాల్గు బాణములచే నాతని వెల్లగుఱ్ఱముల నాల్గిటిని బ్రహరించెను. చక్రధర తుల్యుఁడగు నాసాత్యకియు నటులు వానిచే నభిహతుఁడై, మిక్కిలి వడి గల యాయలంబుసునిగుఱ్ఱములను జంపి, పిదప నొకకాలాగ్నితుల్య మగుభల్లముచే వానిసూతుని తలఁదెగనేసి, కుండలాలంకృతమై, పూర్ణ చంద్రుఁడునావెలయు నాతనివక్త్రమును దేహమునుండి తప్పించి, పిమ్మట నీవారిసైన్యములను నివారించి, పార్థు ననుసరించెను. అటు లనుసరించి శత్రుసేనామధ్యమునఁ దిరుగుచు, శరపరంపరచేఁ గురువీరులనలయించు, మబ్బులనుదూల్చు పెనుగాలివలె విజృంభించు నావృష్ణివీరుఁ డేయే చోటులకుఁ బోఁదలంచుచుండెనో, యచ్చోటులకెల్ల సాధుశిక్షితము లును, క్షీరకుందేందుహిమధవళములునునగు నాతనిగుఱ్ఱములు బంగరు కవచము లలరుచుండ బరువులిడుచుండెను. పిదప నీపుత్త్రులును మఱి కొందఱు యోధులును గలిసి కడువడిగా భారతయోధముఖ్యుఁడగు దుశ్శాసను ముందుగా నుంచికొని వెడలి, యొక్కమారుగా నాశైనే యునిఁ జుట్టికొని ప్రహరింపసాగిరి. వీరుఁడగు నాసాత్యకియు వారినెల్లఁ దనశరజాలముచే నివారించి, ధనువెత్తి దుశ్శాసను నగ్నితుల్యములగు బాణములచేఁ గొట్టెను. పిమ్మట నర్జునుఁ డాసాత్యకిని గాంచి సంతసిం చెను." అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

సాత్యకి యర్జునునిఁ గాంచుట

"ఓరాజా! అటులు దుశ్శాసనునిఁ దలపడి ధనంజయజయాభిలాషి యై యనంతమగుసేనాసముద్రమును బ్రవేశించి, వడిగా శరప్రయోగ మొనర్చు నాసాత్యకిపై సువర్ణధ్వజులగుత్రిగర్తులు ముట్టడించిరి. అటు లెంతయుఁ గుపితులై రథసమూహముతో నావరించి శరపరంపరలఁ బ్రహరించు నాయేఁబదిరాజపుత్త్రులను సాత్యకి తానొక్కఁడే జయిం చెను. ఓరాజా! తలధ్వనిసమాకుల మైయున్న యాభారతసైన్య మధ్యము నతఁ డటులు తెప్పలేకుండ జలమునువలెఁ బ్రవేశించి విక్ర

మించుట మాకెంతయు నద్భుతమయ్యెను. అపుడు పడమర నగపడి మఱి యపుడే తూర్పునఁ గానవచ్చుచుండెను. అటులే లాఘవముగల యాసాత్యకి ప్రాక్పశ్చిమములను, నుత్తరదక్షిణములను, విదిక్కులను నాట్యముచేయుచు, రథశతమువలెఁ దనరథ మొకటియే చరించుచుండ విజృంభించెను. సింహపరాక్రముఁడగు నాతనిచరిత్రమును గాంచి త్రిగర్తులు సంతప్తులై స్వజనమును జేరఁబోయిరి. పిదప శూరసేన శూరులు కొందఱాతనివారించిరి. అటులు వారు మత్తగజమునంకుశములచేవలెఁ దన్ను శరవ్రాతములచే నొప్పింప, నాతఁడు రెండుగడియలలో వారినెల్ల బరిమార్చెను. పిమ్మట నవక్రవిక్రముఁడగు నాసాత్యకి కలింగులతోఁ బోరాడి, దుర్జయమగునాసైన్యమును గడచి, పిదప నర్జును సమీపించెను. లోఁతునీటఁ దిరిగి తిరిగి తుద కొడ్డుచేరికొనిన వానివలె నాసాత్యకి యటు లాయర్జునుఁజేరి యూఱడిల్లెను. అటులు తమ్ము సమీపించుచున్న యాసాత్యకి నారసి, యవ్వాసుదేవుఁ డప్పార్థునితో 'ఓయర్జునా! అదె నీత్రోవఁబట్టి మనసాత్యకి యిందులకే వచ్చుచున్నవాఁడు. సత్యపరాక్రముఁడగు నితఁడు నీకు శిష్యుఁడును మిత్రుడును నై, సకలయోధులను దృణీకరించి జయించెను. ఇతఁడు కౌరవయోధులకెల్ల నుపద్రవమొనర్చి, నీకుఁ బ్రాణప్రియుఁడై యిదె యిచ్చోటికి వచ్చుచున్నవాఁడు. ఓపార్థా! ఇతఁడు ద్రోణుని, భోజుఁడగుకృతవర్మని నిస్సారులఁగానొనర్చి,ధర్మజునకుఁ బ్రియమొనర్చువాఁడై, మఱియుఁ జెరుగలవీరులనెల్లఁ గొట్టి యిట్లు వచ్చుచున్నాఁడు. ఓయీ! శూరుఁడును, కృతాస్త్రుఁడునై యాసైన్యమధ్యమున దుష్కరకృత్య మొనరించి, నీదర్శనమును గోరుచు నిదె వచ్చుచున్నవాఁడు. ఈయుద్ధమునఁ దనయొకరథముతోడనే మహారథుల ననేకుల వధించి, ద్రోణుఁడు మున్నగువారినోడించి, యాసాత్యకి యిదెవచ్చుచున్నవాఁడు. ఓపార్థా! ధర్మజుఁ డంపుటచే నిజబాహుబలముచే శత్రుసైన్యమునెల్ల జీల్చి, యిదె నిన్నుఁ గాంచ వచ్చుచున్నాఁడు. అకౌరవులలో నెవ్వనికి సరియగుయోధుఁడు లేఁడనవచ్చునో యట్టి యుద్ధగర్వితుఁడగుసాత్యకి యిదె యిందుల కరుదెంచుచున్నాఁడు. ఆలమందనడుమనుండి సింహమువలెఁ గురుసైన్యములనుండి విడివడి, పెక్కుసైన్యమును బరిమార్చుచు

నిదె యాసాత్యకి వచ్చుచున్నాఁడు. ఓపార్థా! పద్మములునాఁదగు రాజ సహస్రములనెమ్మోము లిమ్మహిపై నింపి వడిగా నిదె యాసాత్యకి వచ్చుచున్నవాఁడు. అటులే సోదరులతోఁగూడ సుయోధను నోడించి, జలసంధునిఁ జంపి, రక్తప్రవాహముగల్గి, మాంసకర్దమముగల నదిని గల్గించి, కౌరవ్యులనెల్ల నొకతృణముగా భావించి యిదె వచ్చుచున్న వాఁడు.' అని పలికెను.

అది విని యాకౌంతేయుఁ డంతరంగ ముప్పొంగ నావాసుదేవు నితో 'ఓమహాబాహూ! నాకడ కీసాత్యకి వచ్చినను నాకది ప్రియము కానేరదు. ఆధర్మజునివృత్తాంత మేమియు నాకుఁ దెలియకుండెను. ఈ సాత్యకి తన్ను విడిచి వచ్చుటచే నతఁడు జీవించియుండెనో, లేదో? ఓకృష్ణా! ఇతఁడేగదా యాధర్మజుని రక్షింపవలయును? అట్టిస్థితిలో నీతఁ డాతని విడిచి నాకడ కెట్లు వచ్చెను? రాజును ద్రోణున కప్పగించితిని. సైంధవుఁ డింకను జంపఁబడలేదు. ఈభూరిశ్రవుఁ డాసాత్యకి నెదిరించు చున్నవాఁడు. సైంధవవధార్థముగా నీగొప్పభారము నాయందునుపఁబడి నది. ఆధర్మజువృత్తము తెలియఁదగియున్నది. సాత్యకిని రక్షింపవలసి యున్నది. సైంధవునిఁ జంపవలసియున్నది. సూర్యుఁ డదె వ్రేలుచున్న వాఁడు. మహాబాహుఁడగు నీసాత్యకి యలసి యల్పబాణుఁడై యున్న వాఁడు. మఱియు నిపు డీతనిగుఱ్ఱములును సారథియు నలసియుండెను. ఓకేశవా! భూరిశ్రవుఁడన్ననో యలయికలేక, ససహాయుఁడై యున్న వాఁడు. ఈవీరికలయికలో నీతనికి క్షేమమగునా? సత్యవిక్రముఁ డయ్యు, సాత్యకి యీసాగరమును దాఁటఁగల్గునా? మహాతేజుఁడగు నాతనికి వీఁడొకగొప్పద మేలకాకుండును? కురుముఖ్యుఁడును, కృతా స్త్రుఁడునగు నాభూరిశ్రవునితోఁ దలపడిన యీసాత్యకికి స్వస్తియగుఁ గాక. ఓవాసుదేవా! ఆయుధిష్ఠిరుఁ డాద్రోణునుండి భయమువిడిచి సాత్యకి నిచ్చోటికి కనుపుట, యాతని కది యుచితము కాదని తలంచె దను జుమీ! ఆద్రోణుఁ డామిషమునకుఁ గాచియున్నడేగవలె ధర్మ జునిఁ బట్టికొనుటకై నిత్యముఁ గాచియున్నవాఁడు అతఁడు కుశ లియై యుండెనో లేదో.' అని పలికె నని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

—అర్జునుఁడు భూరిశ్రవుబాహువు దెగనేయుట—

"ఓరాజా! అటులు రణగర్వితుఁడై పలు తెంచునాసాత్యకి నారసి భూరిశ్రవుఁడు కుపితుఁడై వడిగా నాతనిపైకి వెడలి, 'ఓశైనేయా! దైవవశముగా నిపుడు నీవు నాదృష్టిగోచరుఁడవైతివి. చిరకాలమునుండి నాకుఁ గలయభిలాష మిపు డీడేర్చికొనియెదను. ఇపు డీవు రణరంగమును విడువకుందువేని, బ్రదికిపోఁజాలవు. శూరంమన్యుఁడవగు నిన్నిపు డీసమరమున సమయించి, కురుపతియగు సుయోధనుని సంతసింపఁజేసెదను. ఇపుడు మద్బాణాగ్నిదగ్ధుఁడవై పడిననిన్ను నీయన్నయగువాసుదేవుఁడును బార్థుఁడును జూడఁగలరు. అటులే నీవు నాచే హతుఁడవగుట విని నిన్నిందుల కనిపినధర్మజుఁడును సిగ్గువడకమానఁడు. నీవు నాచే నిహతుఁడవై మేన నెత్తురులు స్రవింపఁ బుడమిఁబడుటఁ గాంచి, యిప్పుడప్పార్థుఁడు నావిక్రమమెఱుంగకపోఁడు. మున్నా దేవాసురయుద్ధమున బలితో నింద్రునకువలె నాకు నీతో యుద్ధమునకుఁ దలపడఁ జిరకాలమునుండియు నభిలాషము గలదు. ఓసాత్వతా! ఇపుడు మహాఘోరమగు యుద్ధ మొసంగెదను. అందు నావీర్యబలపౌరుషములు యథార్థముగాఁ దెలియుదువు. మున్ను లక్ష్మణునిచే నింద్రజిత్తువలె రణరంగమున నాచే హతుఁడవై నీవు యమపురికరుగఁ గృష్ణార్జునులును, ధర్మజుఁడును నిరుత్సాహులై యిఁక నిస్సంశయముగా యుద్ధముమానక పోరు. ఓమాధవా! నాతీవ్రసాయకములచే నిన్ను క్షీణింపఁజేసి, నీవింతకు మున్ను చంపినవారికాంతలను సంతసింపఁజేయకమానను. ఓయీ! సింగముకంటఁబడిన క్రుక్కిడిమృగమువలె నాదృష్టిపథమునఁబడుట నీకిఁకఁ బోఁజాలవు.' అని పలికెను.

అది విని యాసాత్యకి నగుచు, నాభూరిశ్రవునితో 'ఓకౌరవేయా! యుద్ధమున నాకు భయమనికొంటివిగాఁబోలు. నీ యీకల్లజడిపించుటలకు జడియువాఁడనుగాను. సంగ్రామమున నన్నెవ్వఁడు నిరాయుధుఁగానొనర్చునో వాఁడే నన్నుఁ జంపును. సంగరరంగమున నన్నెవ్వఁడు చంపఁగల్గునో వాని కెల్లచోటుల జయమే యగునని తెలియుము. ఈవృథాలాపములతోఁ బనిలేదు. పనిచేసి నీసామర్థ్యమును దెలియఁజేయుము. శరత్కాలమేఘగర్జితమువలె నీపలుకు నిష్ఫలమనఁదగియున్నది. ఓ

వీరుఁడా! నీకల్లగర్జితము వినిన నాకు నవ్వురాలేకపోలేదు. ఓకౌరవా! నీకుఁ జిరకాలమునుండియుఁ గలయుద్ధాభిలాష మిపుడు తీర్చుకొందువు గాక. ఓతాతా! నీతో యుద్ధము చేయుకోర్కి నన్నును ద్వరపెట్టు చున్నది. ఓపురుషాధమా! నిన్నిపుడు చంపక మరలువాఁడను గాను జుమీ!' అని ప్రత్యుత్తరమిచ్చెను.

ఓరాజా! వారిరువురు నటులు పరస్పరము మాటలతోఁ గొట్టు కొనుచు,నన్యోన్యముఁ జంపుకొనుతలంపులతో నొకరినొకరు ప్రహరించు కొనసాగిరి. ఓమారిషా! మహారథులగువా రటులు పరస్పరస్పర్ధలడరఁ గవిసి, యాఁడేన్గునకై కుపితములై పెనఁగులాడు మత్తగజములువలెఁ జూపట్టిరి. అంత నావీరులిరువురును ఘోరనారాచవర్షమును మేఘములు వలెఁ బరస్పరముఁ గురిపించికొనుచుండ, నాభూరిశ్రవుఁ డాసాత్యకిని సాయకములచేఁ గప్పి, మఱియు వానిఁ జంపువాఁడై పదితీవ్ర బాణము లచే నొప్పించి, యింకను గొన్నితీవ్రసాయకములచేఁ బ్రహరించెను. ఓప్రభూ! అపు డాసాత్యకి దారుగలయాభూరిశ్రవు నారాచముల నెల్ల నంతరిక్షముననే తదయ్యస్త్రబలముచే నివారించి, తన్నుఁ జేరకుండఁజేసి కొనియెను. ఉత్తమవంశోత్పన్నులై కురువృష్ణివంశకీర్తికరులగు వారిరు వురును వేలువేలుగా నస్త్రవర్షములను బరస్పరమును గురిపించికొనిరి. మఱియును వారు నఖములచే బెబ్బులులును, దంతములచే మత్తగజ ములునుబోలె రథశక్తులతోడను విశిఖములతోడను బరస్పరము ఛేదించి కొనిరి. అటులు వారన్యోన్యము ప్రహరించుకొనుచు, రక్తముస్రవింపఁ బ్రాణద్యూత మాడుకొనుచుండ, నాకురువృష్ణికీర్తికరులు పోరాడుచున్న మత్తగజములునాఁ గానవచ్చిరి. వారు కొలఁది కాలముననే యుత్తమ స్థానమునొందువారై గర్జించుచు, మనసైన్యము లుత్సాహపూరితులై గాంచుచుండ, నొకరినొకరు శరవర్షమునఁ గప్పికొనిరి. ఆఁడేన్గునకై పోరాడుమత్తగజములనుబోలెఁ బోరాడుచున్నవారి నిరువుర నెల్లవా రును గాంచఁదొడంగిరి. పిమ్మట వారు పరస్పరము గుఱ్ఱములను గూల్చి కొని, విండ్లు ఛేదించికొని విరథులై, ఖడ్గయుద్ధమునకుఁ గవిసి, చిత్ర ములై వృషభచర్మనిర్మితములగు కేడెములను ధరించి, కత్తులొఱవెలికి ఖడ్గయుద్ధశాస్త్రాను సారముగా మండలగతులఁ జరించుచు, నొకరినొకరు సమీపించి, కుపితమానసులై. పరస్పరము ప్రహరించుకొనిరి. అటులు

వారు ఖడ్గధారులై, చిత్రకవచకాంతులును, నంగదాదిభూషణకాంతులును వెలయఁ దిరుగుచు, నెగురుచు, గంతులువైచుచుఁ, బరువులిడుచు, మఱియుఁగల గతివిశేషములను జూపుకొనుచుఁ, బరస్పరము కత్తులతో మొత్తుకొనుచుఁ, బ్రహరించుకొనన నవకాశములను గని పెట్టుచుఁ, జిత్రముగాఁ జరించిరి. ఓరాజేంద్రా! అటులు వారిరువురును దమయభ్యాసపాటవమేర్పడ లాఘవసౌష్ఠవములను జూపుచు, నొకరినొకరాకర్షించుకొనుచు రెండుగడియలసేపు పరస్పరము ప్రహరించికొని యెల్లసైన్యములును గాంచుచుండ, శతచంద్రములగు తమ కేడెములను గత్తులతో ఛేదించికొని, బాహుయుద్ధమునకుఁ దలపడిరి. దట్టములగువక్షములును, దీర్ఘములగు బాహువులును గల్గి, బాహుయుద్ధకుశలులై, యినుపగదలతో వలె బాహువులతోఁ గొట్టుకొనుచుండ, నిజశిక్షాబలమునఁ గలిగిన నిగ్రహప్రగ్రహములును భుజాస్ఫాలనములును సకలయోధులకు హర్షకరము లయ్యెను. ఓరాజా! అటు లామానవోత్తము లిరువురును బోరాడుచుండ వజ్రపర్వతమేళనమున జనించినమహాశబ్దము జనించెను. దంతాగ్రములచే నేనుగులును, గొమ్ములచే వృషభములునువలె, భుజములతోడను, దలలతోడను, బిడికిటిపోటులతోడను, దాడనములతోడను నొప్పించుకొనుచుఁ, బాదములను లాగికొనుచుఁ, బాదములతోఁ గదలనీక నిలుపుచుఁ, బాదోదరబంధములచేతను, నుద్భ్రమణములచేతను, గతాగతక్షేపములతోడను, బడుటలు, లేచుటలు, నెగురుటలు మున్నగువానితోడను విక్రమించి, వారు పోరాడ నారంభించిరి. ఓరాజా! మహాబలులగువారటులు పోరాడుచు, యుద్ధమునకుఁగల ముప్పది రెండుసాధనములను జూపిరి. ఆపోరాటమున నాసాత్యకి క్షీణాయుధుఁడగుటయు, నావాసుదేవుఁ డర్జునునితో 'ఓపార్థా ! సకలధనుర్ధరులలోఁ బోరాడుచు విరథుఁడై యున్న యాసాత్యకిని జూచితే! ఓపాండవమధ్యమా! నీవెనుకనే వెడలి భారతసైన్యమును బ్రవేశించి, భారతయోధులతోఁబోరాడి వారి నోడించి, పరిశ్రాంతుఁడై యుండ, నాభూరిశ్రవుఁడు యుద్ధాకాంక్షియై యాసాత్యకిని దలపడియెను.' అని పలికెను. ఓరాజా! పిమ్మట రణగర్వితుఁడగు నాభూరిశ్రవుఁడు కుపితుఁడై, మత్తగజమును మదగజమువలె నాసాత్యకిని, రథస్థులై కోపముడర నావాసుదేవార్జునులు చూచుచుం

డఁగాఁ, బైకెత్తి నేలఁబడవైచెను. అదిచూచి కేశవుఁ డాయర్జునునితో 'ఓపార్థా! చూడుము చూడుము. అదె సాత్యకి సోమదత్తివశం గతుఁడై యలసియుండెను. తొలుత నద్భుతముగాఁ బోరాడి, తుది కలసి పుడమిపైఁబడియున్న నీశిష్యుని రక్షింపుము. ఓయర్జునా! నీకుఁగా నీతఁ డాభూరిశ్రవునిపాలు గాకుండఁ జూడుము' అని తెలుప, నప్పా ర్థుఁ డుప్పొంగి, యాతనితో 'ఓదేవా! మత్తగజముతోఁబోరాడు సింగమువలె మనసాత్యకితో భూరిశ్రవుఁడు పోరాడుచున్నవాఁడు చూడుము.' అని పలుకుచుండఁగనే సైన్యములందు హాహాకార మెంతయు జనించెను. మహాబాహుఁడగుభూరిశ్రవుఁ డాసాత్యకిని బుడమిపైఁ బడవైచి, సింగము మాతంగమునువలె లాగుచు, నొఱనుండి కత్తివెలికి జుట్టువట్టికొని, కాలితో గుండియలపైఁ దన్ని శిరము నఱుక నుద్యమించియుండ, మఱియు నావాసుదేవుఁ డాయర్జునునితో 'ఓధనంజయా! భూరిశ్రవునకు వశుఁడైయున్న యావృష్ణివీరు నారయుము. సత్యవిక్రముఁడగుసాత్యకి నాసోమదత్తి మించుచున్నవాఁడు.' అని తెలుప, నప్పార్థుఁడు 'ఆహా! ఆభూరిశ్రవుఁడు మత్తగజముతో సింహమువలె నాడుకొనుచున్నవాఁడుగాని యిప్పటికిఁ జంపలేదు. ఇది నా కెంతయు సంతసమొదవించెనుగదా!' అని యాభూరిశ్రవుని మెచ్చికొని, యావాసుదేవునితో 'ఓదేవా! నాదృష్టియెల్ల సైంధవునిపై సక్తమైయుండుటచే నాసాత్యకిని సరిగాఁ జూడలేదు. మీయాదవుల కుఁగా, దుష్కృత్యమిదె యొనర్చుచున్నవాఁడను.' అని పలికి, తీవ్రమగు నొకక్షురప్రమును గాండివమున సంధించి విడువ, నది మహోల్కవలె నాకసమునుండి పడి, యాభూరిశ్రవునిబాహువు తెగనేసెను." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## సాత్యకి భూరిశ్రవునిఁ జంపుట

"ఓరాజా! అపు డాభూరిశ్రవునిబాహువు ఖడ్గముతోడను,భూషణముతోడను బుడమిఁబడ, లోకమున కెంతయు నద్భుతమును దుఃఖమును గలిగెను. అట్లు సాత్యకిని జంపఁబోవుచు, దూరమందుండి యగపడనియర్జునుచేఁ దెగి, యైదుమొగములుగల సర్పమువలెఁ దనబాహువు నేలఁగూల, నాభూరిశ్రవుఁడు తన్ను వ్యర్థునిఁగా నెంచి, యాసాత్యకిని

విడిచి, మిగులఁ గోపమడర నాయర్జునుంజూచి 'ఓక్రూరుఁడా! కౌంతేయా! ఇదియేమిపని యని చేసితివి? నీవు నాకగపడలేదు. నీతో యుద్ధము చేయలేదు. అట్టి నాబాహువేలఁ దెగనేసితివి? నీ వాయుధిష్ఠిరునితో నేమి చెప్పఁగలవు? నేనేమిచేయుటను జంపితినని తెలుపుదువు? నీకిది మహాత్ముఁడగునింద్రుఁ డుపదేశించెనా? రుద్రుఁడు తెలిపెనా? లేక కృపద్రోణులలో నెవఁడైన నుపదేశించెనా? లోకమున నస్త్రధర్మజ్ఞులలో నీవధికుఁడవుగదా! పరులతో యుద్ధముచేయుచున్నవాని నెట్లు ప్రహరించితివి? ప్రమత్తుని, భయపడినవానిని, విరథుని, యాచించుచున్నవానినీ, వ్యసనమునఁబడియున్నవానిని వీరులగువారు ప్రహరింపరు. నీచు లాచరించినదియు, దుర్జనసేవితమయినదియునగు నీపాపకర్మమును దుష్కర్మమును నేమనిచేసితివి? ఓధనంజయా! మంచివాఁడు మంచిపని నొనర్పఁజాలునుగాని చెడ్డపని నొనర్పఁజాలఁడు. ఓపార్థా! మానవుఁడు దేనిదేనియందు వర్తించుచుండునో తుదికదియే వానిస్వభావముననాటుకొనును. అది నీయెడ నిపుడు గన్పట్టుచున్నది. ఓయీ! నీవు రాజవంశమునఁ బుట్టితివి. అందును గౌరవుఁడవు. సద్వృత్తుఁడవు, వ్రతములాచరించినవాఁడవుగదా! అట్టి నీవు క్షత్రియధర్మము నెట్లు విడిచితివి? నీవీసాత్యకికై మిక్కిలి క్షుద్రమగుపని యొనర్చితివి. ఇది యావాసుదేవునిమతముగాని, నీకిది తగదు. అజాగరూకుఁడై యున్న మఱియొకనితో నెవ్వాఁడు యుద్ధముచేయును? కృష్ణసఖుఁడుగానివాఁ డెవ్వాఁడు నిట్టిదుష్కృత్య మొనర్పఁడు. సంస్కారహీనులై తగనిపనులొనర్చినవారు సహజముగా నిందితులగుచుందురు. ఓపార్థా! వృష్ణ్యంధకులను నీవెట్లు ప్రమాణముగా సమ్మతించితివి?' అని గర్హించెను.

అది విని యప్పార్థుఁ డాభూరిశ్రవునితో 'ఓతాతా! మానవుఁడు ముదుసలియయినకొలఁదిని, వానిబుద్ధియు ముదిమి నొందుచుండుట స్పష్టము. నీవిపుడు పలికినదెల్ల వ్యర్థము. నన్నును, గేశవుని నెఱిఁగియు నిట్లు నిందించుచున్నవాఁడవు సకలశాస్త్రార్థపారగుఁడను సంగ్రామధర్మజ్ఞుఁడను నగు నే నధర్మము నాచరింపలేదు. నీవిది యెఱిఁగియు భ్రమపడుచున్నాఁడవు. క్షత్రియులు తమతమవారితోఁగూడి శత్రులతోఁబోరాడుదురు. మఱియు వారు తమతండ్రులు, సోదరులు, పుత్రులు, సంబంధిబాంధవులు, వయస్యులు, మిత్రులును, సహాయులుగా వైరుల

నోడింతురు. నాకు సంబంధియు శిష్యుఁడు నై నాకుఁగా విడువరాని ప్రాణములను విడువఁదలంచి యుద్ధముచేయుచు నాకుఁ గుడిభుజమై యున్న యాసాత్యకిని రక్షింపరాదా? ఓరాజా! యుద్ధముననున్న వాఁ డాత్మను రక్షించుకొనఁగూడదా? ఎవ్వఁ డెవ్వనికై పాటుపడునో వాఁడు వానిచే రక్షింపఁదగియున్నవాఁడుగదా! తానెవ్వనిచే రక్షింపఁ బడియెనో వానిని వాఁడు రక్షింపవలయును. ఈమహాసంగ్రామమునఁ జంపఁబడుచున్న సాత్యకిని గాంచియు నుపేక్షించితినేని, వానిని గోల్పోవుటయు నరక మొందుటయు నాకుఁ దప్పనిదిగదా! నే నాతని రక్షించి నందులకు నీకింతకోపమేల? మఱియు నేను గృష్ణునితో స్నేహముచేసి యాతనిమత మంగీకరించితినని నిందించితివి. అది నీబుద్ధిపొరపాటు. ఎవ్వఁ డాతనిమైత్రి నపేక్షింపఁడో తెల్పుము. నీవు రథము నధిష్ఠింపలేదా? కవచమును సరుదుకొనలేదా? విల్లెక్కిడియుండలేదా? శత్రులతోఁ బోరాడుచుండలేదా? చెప్పుము. ఇదియుగాక రథగజాకీర్ణమై హయపదాతిసంకులమై సింహనాదారావపూరితమై గంభీరమైన యీసేనాసాగరమున ననేకు లనేకులతోఁ బోరాడుసమయమున నీయొక్కసాత్యకితో నీవొక్కఁడవు పోరుట యెట్లుసంభవించును? అతఁ డనేకులఁ దలపడి, మహారథుల నోడించి, మఱియు శస్త్రపీడితుఁడై తానును దనగుఱ్ఱములును నలసియుండ,నపు డామహారథుని నీవు మార్కొని యోడించి, నీకిటులు వశపడియెనని గర్వించుచు, నధికుఁడ ననుకొంటివి. ఇంతియగాక యటులు వశముతప్పియున్న యాతనితలఁ దెగనేయ నుద్యమించితివి గదా! అట్టిదురవస్థలోనున్న యాసాత్యకిని జూచినవాఁ డెవ్వఁ డుపేక్షించును? ఆత్మను రక్షించుకొనఁజాలని నీవు నిన్నే నిందించుకొనుము. ఓవీరాగ్రణీ! నిన్నాశ్రయించినవానిని నీవు రక్షింప కేమిచేయుదువు' అని పలికెను.

పిమ్మట నాభూరిశ్రవుఁ డాపార్థునిపలుకు లాలించి మహాబాహుఁ డగు నాయూపకేతు వాసాత్యకిని విడిచి ప్రాయోపవేశ మొనరించెను. అటు లతఁడు ప్రాయోపవిష్టుఁడై తనయెడమచేతితో బాణములను బఱచికొని పావనలక్షణుఁడై బ్రహ్మలోకమును బొందువాఁడై ప్రాణములను బ్రాణములందే హోమమొనర్చి, సూర్యునియందు దృష్టియుఁ, బ్రసన్నమగుమనస్సును సలిలమందును నిలిపి, మహోపనిషదమును

ధ్యానించుచు, మౌనమూని యోగయుక్తుఁడై యుండెను. పిదప నా సేనయందలివారందఱును వాసుదేవార్జునులను నిందించుచుఁ, బురుష వరేణ్యుఁడగు నాభూరిశ్రవుని సన్నుతించిరి. అటులు నిందింపఁబడియు నవ్వాసుదేవార్జును లించుకేని యప్రియమును బలుకరైరి. అటులే వారిచేఁ బ్రశంసింపఁబడియు నాయూపకేతుఁడు ప్రహర్ష మొందఁ డయ్యెను. ఓరాజా! అటులు పలుకుచున్న నీపుత్రులవచనముల సహింప కుండియుఁ గోపము తెచ్చికొనక యే, వారివచనములను స్మరింపఁ జేయుచు, నప్పార్థుఁడు సాక్షేపముగా, 'ఓరాజులారా! మీరెల్ల నామహావ్రతము నెఱింగియేయున్నవారు. ఎవ్వఁడు నాబాణమునకుగోచరుఁడై యుండునో వాఁడు, నాపక్షమువానిని జంపఁజాలఁడు. ఈభూరిశ్రవునిఁ గాంచి నన్ను నిందింపకుఁడు. ధర్మమును దెలియక యిట్లు నిందింపరాదు. యుద్ధ రంగమున సాత్యకిని జంపువాఁడై కత్తినెత్తియున్న యీభూరిశ్రవుని బాహువు దెగనేయుట ధర్మమేగాని నింద్యముగానేరదు.' అని పలికి యర్జునుఁడు మఱియు నాభూరిశ్రవునితో 'ఓతాతా! శస్త్రహీనుఁడై కవచములేక వికలుఁడైనబాలు నభిమన్యునిఁ జంపుట నెవ్వఁడేని సమ్మ తించెనా?' అని పలికెను.

అది విని యాభూరిశ్రవుఁడు తల నేలమోపి యెడమచేతితోఁ దనకుడిబాహువు నాయర్జునుసమీపమునకుఁ ద్రోసి, మహాద్యుతియై యతఁ డూరకుండెను. అంత నప్పార్థుడు భూరిశ్రవునితో 'ఓతాతా! ఆయుధిష్ఠిరునందును, భీమునందును, నకులసహదేవులందును గలప్రీతి నీయందు నాకు లేకపోలేదు. నేనును నీశ్రీకృష్ణభగవానుఁడును ననుజ్ఞ యొసంగితిమి. ఉశీనరపుత్త్రుఁడగు శిబివలెఁ బుణ్యలోకములకుఁ బొమ్ము.' అని పలికెను. పిదపవాసుదేవుఁడును, 'ఓభూరిశ్రవా! బ్రహ్మాదులగు దేవ తలకును గోరఁదగు విమలములగు నాలోకములెల్ల వడిగాఁ గాంచి, నాసారూప్యముఁబొంది గరుడగమనుఁడవై చరింపుము.' అని పలికెను.

ఓరాజా! అంత నాసాత్యకి యాభూరిశ్రవునిచే విడువంబడి లేచి, మహాత్ముఁడగునాతని తలఁదెగనేయువాఁడై కత్తినెత్తి యంతకుమున్నే కౌంతేయునిచే హతప్రాయుఁడై, నిష్కల్మషుఁడైన యాతనిఁ జంపఁబూని కొనియెను. తొండము తెగినయేనుగువలె భుజము తెగి కూలఁబడియున్న యాభూరిశ్రవు నాసాత్యకి దుష్టబుద్ధియై, వలదని యఱచుచు సైన్య

మెల్ల నిందించుచుండఁ గృష్ణుఁడును బార్థుఁడును నివారించుచుండినను, నటులే భీముఁడును, గృపాశ్వత్థామకర్ణసైంధవాదులును వలదను చున్నను మానక చంపెను. ఓరాజా! పార్థునిచే విచ్ఛిన్న బాహుఁడై, ప్రాయోపవిష్టుఁడై యున్న యాకురువృద్ధు నాసాత్యకి ఖండించుట కా సైన్యములెల్ల నాతని నిందించెను. సహస్రాక్షతుల్యుఁడయ్యు, పార్థ హతుఁడై సాత్యకిచేఁ జంపఁబడి, ప్రాయోపవేశ మొందియున్న యాకురూ ద్వహు నారసి, చారణులును, సిద్ధులును, మానవులును గాంచి పూజిం చిరి. దేవత లాశ్చర్య మొందిరి. నీసైనికు లెల్లరును బలువిధములుగాఁ బక్ష ముల నవలంబించి పరస్పరమును సంభాషించికొనిరి. అందుఁ గొందఱు 'ఇట్లు కాఁదగియుండుటచే నైనదియెగాని యిం దాసాత్యకి తప్పులే' దని యు నుడివిరి. కోపము దుఃఖమునకు నిమిత్తమగుట, దానిచేఁ బ్రయో జనము లేకుండుట నిఁక నూఱకుండుఁడనియు, నీవీరునిచే నితఁడు చంపఁదగియుండ నిందులకు విచారింపఁబనిలేదనియు, నీసాత్యకియే వీనికి మృత్యువుగా నావిధాత కల్పించియుండెననియుఁ బలుకసాగిరి.

అంత నాసాత్యకి లేచి, 'ఓధర్మహీనులారా! మీారు ధర్మకంచు కములఁదొడిగికొని వీనిని 'చంపరాదు, చంపరాదు' అని పలుకుచున్న వారేగాని, నిరాయుధుఁడై యున్న బాలుఁడగు నభిమన్యునిఁ జంపుట యధర్మమని పలుకరైతిరే! అపుడు మీాధర్మ మెందులకుఁ బోయెను? ఓ మూఢులారా! ఎవ్వఁడు నన్ను సంగ్రామమునఁ బడవైచి పాదముతోఁ దన్నునో వానిని జంపుదునని నేను బ్రతిజ్ఞచేసియున్నవాఁడను. అట్టి వాఁడు, మునివ్రతమూనియున్నను నాకు వధ్యుఁడే. ప్రతిఘాతమున సభుజుఁడనయ్యుఁ బుడమిఁబడి దొరలుచున్న నన్ను కన్నులుగల మీారు మృతునిఁగాఁ జూచియుండలేదా! అట్టినన్ను వీఁడు చంప నుద్యమింప లేదా? ఇటులు పలుకుట మీాబుద్ధిచులుకఁదనము. ఓకురుపుంగవులారా! నాయొనర్చిన వీనిప్రతిఘాతము యుక్తమే. వీఁడు నన్ను వంచించెను. నాప్రతిజ్ఞను రక్షించుటకై పార్థుఁడు వీనిఖడ్గముతోఁగూడినభుజమును నఱికెను. కాఁదగినదానినే దైవ మెపుడును జేయించుచుండును. ఈ సమ్మర్దమున వీఁడిట్లు హతుఁడగుట యధర్మమన నెట్టిది? మున్నా వాల్మీ కియు నిట్లు తెలిపియున్నవాఁడు. 'ప్లవంగమా! స్త్రీలు చంపఁదగనివారని

తెలుపుచున్నాఁడవు. కాని, శత్రులకుఁ బీడాకరమగున దెద్దియో యదియే చేయఁదగినది.' అని.

ఓయాంబికేయా! ఇటు లాసాత్యకి పలుకఁగాఁ, గురుపాండవు లెల్లరును, మఱియేమియుఁ బలుకక యాతని గౌరవించిరి. మహాధ్వరము లందు మంత్రాభిపూతుఁడై భూరిసహస్రదక్షిణాలొసంగిన యాభూరి శ్రవునివధమును, నరణ్యగతుఁడగు మునివధమునుబోలె నందలివారు సమ్మతింపరైరి. శూరుఁడగునాతని, వినీలకేశమైన శిరము విచ్ఛిన్నమై యాహవరంగమునఁ బడ, నతఁడు దానిని హవిర్ధానమునువలె నందు విడిచి, తనయుత్తమధర్మముచే నూర్ధ్వలోకముల నాశ్రయించెను." అని సంజయుఁడు తెలుప విని ధృతరాష్ట్రుఁడి ట్లనియె.

## సాత్యకిప్రశంస

"ఓసంజయా! అటు లాసాత్యకి, ధర్మజునికడఁ దాను బ్రతిజ్ఞ చేసిన చొప్పున ద్రోణరాధేయులకును, వికర్ణకృతవర్మలకును వశపడక సైన్య సాగరమునెల్ల దాటి, సమరమున నెందును నివారింపఁబడనివాఁడయ్యు నెటు లాభూరిశ్రవునకు వశుఁడై పుడమిఁ ద్రోయఁబడెనో తెలుపుము."

అది విని యాసంజయుఁ డాతనితో "ఓరాజా! వినుము. ఆసాత్యకి యుత్పత్తివిధ మెఱిఁగించెదను. నీకుఁ గలసంశయము వదల నాభూరి శ్రవునివిధమును దెలిపెదను. అత్రిమహర్షిపుత్రుఁడు సోముఁడు. సోముని కొమరుఁడు బుధుఁడు. అతనికి మహేంద్రతుల్యుఁడగు పురూరవుఁడును, నతని కాయువును, నాతనికి నహుషుఁడును, నాతనికి యయాతియు, నాయయాతికి దేవయానియందు జ్యేష్ఠుఁడై యదువును బుత్రులుగా జనించిరి. ఆయదునివంశమున దేవమీఢుఁడు పుట్టెను. వానికిఁ ద్రైలోక్య సమ్మతుఁడై శూరుఁడనువాఁ డుద్భవించెను. ఆశూరునికిఁ గీర్తికరుఁ డగు వసుదేవుఁడు పుట్టెను. వానివంశమునందే కార్తవీర్యసముఁడై ధను ర్విద్యాపారగుఁడగు శిని జనించెను. ఇట్టులుండ నాకాలమున మహాత్ముఁ డగు దేవకునిపుత్రియగుదేవకికిస్వయంవరమహోత్సవ మారంభమగుడు, క్షత్రియులెల్లఁ జేరఁగా, నపు డాశిని, వసుదేవునకుఁగాఁ బార్థివులనెల్ల జయించి, యాదేవకిని రథముపైఁ గూరుచుండఁబెట్టెను. అటు లతఁడు రథముననుండఁగా, మహాతేజుఁడగు నాసోమదత్తుఁ డాదేవకిని గాంచి

సహింపక పోరాడ నారంభించెను. ఓరాజా! అపుడు వారిరువురకును నొకదివార్ధము చిత్రము, నద్భుతమునై ఘోరయుద్ధము జరిగెను. ఆ బాహుయుద్ధమున శినిచే సోమదత్తుఁడు బలాత్కారముగాఁ బుడమిఁ బడఁద్రోయఁబడియెను. అంత నాశిని యాసోమదత్తుని జుట్టుపట్టుకొని కాలితోఁ దన్ని కత్తియెత్తి, రాజసహస్రములు చూచుచుండఁగా, నవమానించి, మఱియు దయఁదలఁచి, వానిని జీవముతో విడిచెను. ఓ మారిషా! అటు లవమానపడిన యాసోమదత్తుఁడు కోపము నాపుకొనఁ జాలక యాపురారాతి ప్రసాదమువడసి యాశిని నవమానించువాఁడై తపమొనర్చెను. వరదుఁడగు నమ్మహాదేవుఁ డాతనికిఁ బ్రసన్నుఁడై వరముకోరికొమ్మన, నాసోమదత్తుఁడు 'ఓభగవానుఁడా! ఆశినిపుత్త్రుని, రాజసహస్రములనడుమ యుద్ధమునఁ గాలితోఁ దన్ను నట్టిపుత్త్రు నొకని ననుగ్రహింపు' మని వేఁడికొన, నమ్మహేశ్వరుఁ డటులే యగుఁ గాకయని వరమొసంగి యంతర్హితుఁడయ్యెను. ఓరాజా! ఆసోమదత్తుఁ డామహేశువరదానముచే నట్టికొమరునిఁ గనియెను. అటులగుటనే యాశినిపుత్త్రుఁడగుసాత్యకి నీసోమదత్తపుత్త్రుఁడగుభూరిశ్రవుఁడు సర్వసైన్యములును గాంచుచుండ సమరమునఁ బడఁద్రోసి కాలితోఁ దన్నెను. దీనిని నీవు ప్రశ్నించితివిగానఁ దెలిపితిని. ఈసాత్యకి మానవవీరులకు జయింపరానివాఁడు. చిత్రయుద్ధము లెఱింగి, సంగ్రామమున లబ్ధలక్ష్యులై, దేవదానవగంధర్వులనుసైతము జయించినవీరులును, నీవృష్ణివరులతోఁ దుల్యులు కానేరరు. వీరితో సమానుఁ డీభూతభవిష్యద్వర్తమానములందును గానరాఁడు. మఱియు వీరు వృద్ధశాసనము నతిక్రమింపనివారై జ్ఞాతుల నవమానింపరు. దేవాసురగంధర్వులును, యక్షరాక్షసోరగులును, నీవృష్ణివీరులను జయింపఁజాలరన, మానవులు వీరిని జయింపఁజాలరని దెల్పనేటికి? వీరు బ్రహ్మద్రవ్యమందును, జ్ఞాతిద్రవ్యమందును, గురుద్రవ్యమందును నాసవడకుండెడివారు. ఏదే నాపదనొందినవారిని వీరు రక్షింతురు. ధనవంతులయ్యును గర్వమువహింపరు. మఱియు వీరు బ్రహ్మణ్యులును సత్యవాదులునై సమర్థులయ్యు నొకరి నవమానింపక దీనుల నుద్ధరింతురు. నిత్యమును దేవతారాధనపరులై, దాంతులును, దాతలును, గర్వహీనులును, నైయుందురు. ఆకారణముచే వృష్ణివీరులచక్రమునకుఁ బ్రతిహతిలేదు, మేరువునైన మోయవచ్చును.

సాగరమునైన దాఁటవచ్చును. కాని వృష్ణివీరులఁ దలపడి జయింపవలను పడదు. ఓప్రభూ! నీసంశయముడంగుటకై యిదియెల్ల నీకెఱిఁగించితిని. ఓకౌరవాధిపా! ఇదియెల్ల నీగొప్పతప్పుగాని వేఱొకటిగాదు." అని తెలుప విని యాధృతరాష్ట్రుఁడు మఱియు నిట్లనియె.

## సంకులయుద్ధము

"ఓసంజయా! కౌరవుఁడగు భూరిశ్రవుఁ డావిధముగా హతుఁడైన పిదప యుద్ధ మెట్టులయ్యెనో నాకెఱిఁగింపుము."

అది విని యాసంజయుఁ డాతనితో "ఓరాజా! ఆభూరిశ్రవుఁ డటులుహతుఁ డగుడుఁ, బార్థుఁ డావాసుదేవునితో 'ఓదేవా! ఆసైంధవుఁడున్నకడకు మనగుఱ్ఱములను బఱుపుము. ఓయనఘా! నాప్రతిజ్ఞను ఫలింపఁజేయుటకును నీవు దగుదువు. ఓమహాబాహూ! సూర్యుఁడు వడిగా నస్తాద్రికిఁ బోవుచున్నవాఁడు. ఓపురుషోత్తమా! నే నీగొప్ప కార్య మారంభించితిని. ఈసైంధవుఁడు కౌరవయోధులచే రక్షింపఁ బడుచున్నవాఁడు, కావున సూర్యుఁ డస్తమింపకము న్నాసైంధవునిఁ జంపి నేను, ప్రతిజ్ఞ సత్య మొనరించుకొనునట్లుగా నాగుఱ్ఱముల నందు లకుఁ బఱుపవలయును.' అని పలుక విని యశ్వహృదయజ్ఞుఁడగు వాసుదేవుఁడు వెండిగుండులునాఁదగు తనరథాశ్వములను సైంధవునిపైకిఁ దోలెను. సాయకములునా నెగిరి పరువులిడుచున్న గుఱ్ఱములతో నమోఘసాయకుఁడై వెడలినయక్కవ్వడిని, మనసేనాముఖ్యులగు సుయోధనుఁడును, గర్ణవృషసేనులును, శల్యకృపాశ్వత్థామలును, సైంధవుఁడును వడిగాఁ దలపడిరి. అటులు వచ్చినసైంధవునిఁ జేరి యప్పార్థుఁడు క్రోధదీప్తాక్షుఁడై వానిని దహించువాఁడువలెఁ గాంచుచుండెను. అటులు సైంధవునివధమునకై సమీపించుచున్నయప్పార్థునిఁ గాంచి సుయోధనుఁ డారాధేయునితో 'ఓమిత్రమా! మహాత్మా! ఇదె యుద్ధకాలమువచ్చెను. నీబలము నిపుడు చూపవలసియున్నది. ఎటు లీసైంధవుఁ డర్జునునిపాలు గాకుండునో యటు లొనర్పవలయును. ఇఁక నీదిన మల్పావశిష్ట మై యున్నది. కావున నిపు డీరిపుని శరవర్షముచే నొప్పింపుము. దినముగడచెనేని మనకు జయము కాకతప్పదు. సూర్యుఁ డస్తమించునంతకును సైంధవుఁడు రక్షింపఁబడునేని, యకౌంతేయుఁడు

వ్యర్థప్రతిజ్ఞుఁడై యగ్నిలోఁ బ్రవేశించును. ఓమానధనా! అటులర్జునుఁడే శూన్యుఁడైనచో, నాతని ననుసరించియున్న వానిసోదరులు రెండు గడియలైన జీవింపరు. అటు లప్పాండవులు నశింతురేని, నిష్కంటకముగా శైలవనకాననములతోఁగూడిన యిప్పుడమి నెల్ల మన మనుభవింపఁ వచ్చును. ఇప్పార్థుఁడు దైవోపహతుఁడై కార్యాకార్యముల నెఱుఁగక యిట్టిదుష్కరప్రతిజ్ఞ చేసియున్నవాఁడు. ఓకర్ణా! నిశ్చయముగాఁ దన వినాశమునకే యిప్పార్థుఁ డీప్రతిజ్ఞ చేసియున్నవాఁడు ఓరాధేయా! దుర్జయుఁడవగు నీవుండఁగా నాపార్థుఁడు బ్రతుకుటెట్లు? అతఁడు సూర్యుఁడ స్తమింపకమున్నా సైంధవునిఁ జంపుటెట్లు? మహాత్ములగు శల్యకృపు లిరువురును, యుద్ధముఖమున నిలిచి సైంధవుని రక్షింపనుండఁగా, నాధనంజయుఁ డీతని నెట్లు చంపఁగలఁడు? కాలచోదితుఁడై యిట్లు ప్రతిన నొనర్చెనుగాని, నేనును దుశ్శాసనుఁడును, నశ్వత్థామయును రక్షించుచుండఁగా నప్పార్థుడు సైంధవు నెట్లు చంపఁగల్గును? శూరులనేకులు పోరాడుచున్నారు. సూర్యుఁ డస్తమించుచున్నవాఁడు. కావున ధనంజయుఁ డీసైంధవునిఁ జేరలేఁడనియే నాయూహ. కావున, నోకర్ణా! నీవును నాతోఁగూడ, మహారథులగు మఱికొందఱుశూరులును, శల్యకృపాశ్వత్థామలును దోడ్పడ నెంతయుఁ బ్రయత్నముగల్గి సంగ్రామమునఁ బార్థునితోఁ బోరాడుము' అని పలికెను.

ఓమారిషా! నీపుత్త్రుఁ డిటులు పలుక విని యారాధేయుఁ డాతనితోఁ ఓరాజా! దృఢలక్ష్యుఁడై శూరుఁడైన యాభీమునిశరజాలములచే నెంతయు నీయుద్ధమున నొడలు నొచ్చియున్నవాఁడను. ఇపుడు యుద్ధమునుండి పోఁగూడదనియుంటినిగాని, భీమశరసంతప్తుఁడనగు నాయంగము లెవ్వియుఁ బనిచేయఁజాలకున్నవి. అయినను నీకుఁగా నాశక్తికొలఁదిని బోరాడెదను. ఇప్పార్థుఁ డీసైంధవునిఁ జంపకుండఁ జేయుదును. తీవ్రనారాచములను బ్రయోగించుచు, నేను యుద్ధముచేయుచుండఁగా నాసవ్యసాచి మనసైంధవునిఁ జేరఁజాలఁడు. ఓరాజా! నీయెడ నాకుఁ గలభక్తికిని, నేనుగోరునట్టి నీహితమునకును లోపమొదవకుండ యుద్ధము చేయుదును. జయము దైవాధీనము. ఈయుద్ధమున సైంధవునకుఁగాఁ దగుయత్న మొనర్చి, నీకుఁ బ్రియమొనర్చెదను. జయము దైవముపై నున్నది. ఓపురుషవర్యా! నీకుఁగా నాయర్జునుతోఁ బౌరుషము నాశ్ర

యించి పోరాడెదనుగాని, జయము దైవాయత్తమని తెలిసికొనుము, ఓకురూత్తమా! ఇపుడు నాకును నప్పార్థునకును జరిగెడియుద్ధము సర్వసైన్యములును గాంచుచుండ దారుణమై గగురుపాటొదవించును' అని పలికెను.

అటులు వారు సంభాషించుకొనుచుండఁగా, నర్జునుఁడు నీసైన్యమును దీవ్రనారాచముల నొప్పించుచు, మరలక నిలిచియున్నశూరుల పరిఘతుల్యములగు బాహువులను దలలను దెగనేయ నారంభించెను. అప్పార్థుని క్షురప్రములచే మనసైన్యమునందలి యేన్గులతొండములు, గుఱ్ఱములకంఠములును, రథాక్షములును, ప్రాసతోమరాదులతోఁగూడి రక్తసిక్తాంగులైనరౌతులును నొకటిరెండు మూఁడుచెక్కలై పుడమిఁ బడుచుండిరి. గజాశ్వాదులును నెల్లెడలం గూలుచుండెను. ధ్వజములు, ఛత్రములు, చామరములు, ధనువులును రణభూమి నిండుచుండెను. ఎండుగడ్డిపైఁ బ్రజ్వలించినయగ్నివలె విజృంభించి యప్పార్థుఁ డచిరకాలముననే నీసైన్యమును రక్తసిక్తము గావించెను. ఓరాజా! అటులు నీసైన్యమునెల్ల హతప్రాయముగా నొనర్చి దుర్జయుఁడై సైంధవునిఁ జేరఁబోయి భీమసేనసాత్యకులు తనకు రక్షులై యుండ నయ్యర్జునుఁడు మండుచున్న పావకుఁడునాఁ బ్రకాశించుచుండెను. పరాక్రమసంపన్నుఁడై యటులు విజృంభించుచున్న యక్కౌంతేయు నారసి సారముగల మనవీరులెల్ల సహింపక సైంధవరక్షణమునకై సంరంభించి యాతనిఁ జుట్టికొనిరి. రథమార్గముల నిరంకుశముగాఁ జరించు నప్పార్థుపై నటులాసు యోధనుఁడును, కర్ణశల్యవృషసేనాశ్వత్థామలును, కృపుఁడును, సైంధవుఁడును నిర్భయులై, తమయుద్ధకౌశలమేర్పడఁ బ్రళయకాలయముఁడునాఁదగు నాతనిఁ దలపడి సైంధవుని వెనుకనుంచి యవ్వాసుదేవార్జునులఁ జంపువారై సూర్యాస్తమయము నవేక్షించుచు, సూర్యుఁ డెట్టివాఱుచుండఁగాఁ దమదీర్ఘబాహువులతో విండ్లనువంచి, యాతనిపై సాయకములఁ గురియసాగిరి. అటులందఱును గురియుశరముల నాకిరీటి రణగర్వితుఁడై యొక్కొకదానిని రెండుమూఁడుఖండములుగా ఖండించుచువచ్చెను. ఓరాజా! అపుడు సింహలాంగూలధ్వజుఁడగు కృపుఁడు తనశక్తిమెఱయ నయ్యర్జునుని వారించి, యాతనిఁ బదిబాణములచేతను, వాసుదేవు నేడుబాణములచేతను నొప్పించి, మఱియు రథమార్గముల

నాసైంధవునకు హానిగలుగకుండఁ గాపాడుచుండెను. పిదప మహారథు లగుకౌరవశ్రేష్ఠులెల్లరును రథసమూహముతో నెల్లెడల నాపార్థునిఁ జుట్టుకొనిరి. అటు లావరించి వారు నీతనయునాజ్ఞచే సైంధవుని రక్షించువారై ధనుష్టంకారములఁ జేయుచు, శరపరంపరలఁ గురియఁ జొచ్చిరి. అప్పు డప్పార్థుని బాహుబలమును, గాండివపటుత్వమును, సాయకములసమృద్ధియుఁ గానవచ్చెను. అంత నక్కౌంతేయుఁడు కృపాశ్వత్థామలయస్త్రముల నస్త్రములచే నివారించి, యవ్వీరులనెల్ల నొక్కొకనిఁ దొమ్మిదేసిబాణములచే నొప్పించెను. అపు డాపార్థు నిరువదైదిట నశ్వత్థామయు, వృషసేనుఁ డేడిటను, దుర్యోధనుఁ డిరువదింటను, కర్ణ శల్యులు మూఁడుమూఁడిటను నొప్పించి, మఱిమఱియు గర్జించుచు ధనువులఁద్రిప్పుచు నలుగడల నావరించిరి. అటులు వారు తమరథములను మండలాకారముగా నొనర్చి, సూర్యాస్తమయమును గోరుచు, ద్వరపడుచు నాతని కెదురుగర్జించుచు, ధనువులను గదల్చుచు, మబ్బులుదకములచేవలెఁ, దీవ్రనారాచములచే నాతనిఁ గప్పసాగిరి. ఓరాజా! పరిఘబాహులగు నాశూరు లాధనంజయునిపై దివ్యాస్త్రములను బ్రయోగించుచుండిరి. అపు డాపార్థుఁడు మఱియు మనసైన్యమును హతప్రాయముగా నొనర్చి, సైంధవుని సమీపించుచుండ, నపుడు కర్ణుఁ డాతనిఁ దలపడియెను. అంత నాయర్జునుఁడు భీమసాత్యకులు గాంచుచుండఁగా నటు లెదుర్కొనినకర్ణునిఁ బదిసాయకములచే నొప్పించెను. మహాబాహుఁడగుసాత్యకి సకలసైన్యమును జూచుచుండఁగా మూఁడు బాణములచే నారాధేయునిఁ బ్రహరింప, భీముఁడును మూఁడుబాణములచేఁ గొట్టెను. మఱియు నాపార్థుఁ డేడువాఁడికోలల నారాధేయునిపైఁ బరప, వాని నాతఁ డఱువదేసిబాణములచే ఖండించెను. ఓరాజా! అపు డనేకులతోఁ గర్ణున కద్భుతముగా యుద్ధము జరిగెను. ఆభీమార్జునసాత్యకుల నపు డతఁ డొకఁడే నివారించెను. పిమ్మట నమ్మహాబాహుఁడగు నర్జునుఁ డారాధేయు నూఱునారాచములచే మర్మములనొప్పింప, రక్తసిక్తాంగుఁడై యాసూతసూతి యేఁబదిబాణములచేఁ బ్రతిప్రహార మొనర్చెను. అట్టియారాధేయునికరలాఘవమును సహింపక వానివిల్లు దునిమి, తొమ్మిదిసాయకములచే వానిఱొమ్ము నొప్పించి, మఱియు వానిని జంపువాఁడై సూర్యకాంతిగల యొకసాయకమును

వడిగా నాతనిపైఁ బ్రయోగింపఁ గడువడిగావచ్చుదాని నాద్రౌణి
ఖండించెను. పిదప నారాధేయుఁడు వేఱొకవిల్లుగొని పెక్కువేలసాయ
కములచే నాపార్థునిఁ గప్పె, నతఁడును వానికిఁ బ్రతీకారముగా ననేక
సాయకములచే నారాధేయు నాచ్ఛాదించెను. మహారథులగువారిరువు
రును వృషభములువలె అంకెలువేయుచు, బాణములచేఁ బరస్పరము
గప్పికొనుచు, నన్యోన్యశరసమూహముచే నదృశ్యులగుచుఁ బోరాడిరి.
మఱియు వారిరువురును 'ఓరీ! నేను బార్థుఁడను నిలుము, ఓరీ! నేను
గర్ణుఁడను నిలుము' అని పరస్పరము పలికికొనుచుఁ, జిత్రముగను,
లఘువుగను బోరుచు, సర్వయోధులకును జూడఁదగియుండిరి. ఓమహా
రాజా! అటులు వారు పరస్పరవధాభిలాషులై సిద్ధచారణులచేఁ బొగ
డ్తగనుచుఁ బోరాడుచుండ, సుయోధనుఁడు నీవారితో 'ఓవీరులారా!
ఈరాధేయునిఁ బ్రయత్నముచేఁ గాపాడుఁడు. ఇతఁ డర్జునుఁ జంపక
సమరమునుండి మరలనని నాతోఁ దెలిపియున్నవాఁడు.' అని పలుకు
చుండునంతలో నక్కర్ణునివిక్రమమునకు సహింపక యాకర్ణాంతప్రయుక్త
ములగుసాయకములచే నాకర్ణునిగుఱ్ఱముల నాల్గిటి నాపార్థుఁడు మృత్యు
లోకమున కంపించె. మఱియు నొకభల్లముచే వానిసారథిని రథనీడము
నుండి పుడమిఁబడఁద్రోసి, నీకొమరుఁడు చూచుచుండఁగా శరవర్షమునఁ
గప్పెను. అటు లారాధేయుఁ డాయర్జునుబాణములచేఁ గప్పంబడి
హతాశ్వుఁడును, హతసారథియు నగుట, మతితప్పి యేమియుఁ జేయఁ
జాలకుండెను. ఓమహారాజా! అటులు విరథుఁడైనయక్కర్ణుని దనరథము
పైనిడికొని యశ్వత్థామ యప్పార్థునితోఁ బోరాడఁ దలపడియెను.
అపుడు శల్యుఁ డప్పార్థుని ముప్పదిసాయకములచే నొప్పింపఁ, గృపుడు
వాసుదేవు నిరువదిబాణములచేఁ బ్రహరించి, మఱియు నతఁ డాధనంజ
యునిఁ బండ్రెండుబాణములచేఁ గొట్టెను. అటులే సైంధవుఁడు నాల్గి
టను, వృషసేనుఁ డేడిటను నవ్వాసుదేవార్జునుల నొప్పించిరి. అంత
నప్పార్థుఁడు ద్రోణపుత్త్రు నఱువదినాల్గిటను, శల్యుని నూఱిటను,
సైంధవునిఁ బదింటను, వృషసేనుని మూఁడింటను, గృపు నిరువదింటను
నొప్పించెను. అపుడు వారెల్ల నాసవ్యసాచిప్రతిజ్ఞను జెఱుచువారై
కోపావేశములడర నాధనంజయునిపైఁబడిరి. అంత నయ్యర్జునుఁడు కౌర
వులకు వెఱపుగలుగ వారుణాస్త్రమును బ్రాదుర్భవింపఁజేయ నపుడు

వారెల్లరును మహాశ్వములగురథములతోఁజేరి శరవర్షముచే నప్పార్థునిఁ గప్పిరి. దారుణమై భారతమోహాకరమగు నాసంకులసమరమున నించు కేని వెఱపుగనక శరపరంపరలఁ గురియుచు నయ్యర్జునుఁడు రాజ్యాభిలాషియై, మనవారొనర్చిన పంద్రెండేండ్లకష్టములను స్మరించుచు, గాండీవ ప్రయుక్తములగు సాయకములచే సకలదిశల నాచ్ఛాదింపసాగెను. ఓరాజా! అపు డంతరిక్షము జ్వాలాప్రదీప్తమయ్యెను. పక్షులు దగ్ధములై పుడమిఁబడియెను. అంత నక్కిరీటి తనగొప్పధనువున శరముల నుంచి మనహయోత్తమములను, గజశ్రేష్ఠములను, గురుప్రవీరులను గొట్టి పడఁద్రోయుచుండెను. అపుడు మనమహాయోధులు గొప్పగదలును, నినుపదుడ్డులను, శక్తులను, గత్తులను, గొప్పశస్త్రములను బూని యానరునిపైఁ దలపడిరి. పిదప యుగాంతమేఘగర్జనమొదవ నింద్రచాప తుల్యమగు గాండివము నాకర్షించి, నగుచు యమరాస్త్రము వర్ధిల నీ వారిని రూపుమాపుచు, రథగజాశ్వపదాతులను జంప నారంభించె'' నని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## సైంధవు నర్జునుఁడు వధించుట

''ఓరాజా! పిడుగునాఁదగు ఘోరమైన యాధనంజయుధనుష్టాంకారధ్వని విని, నీవారిసైన్యమెల్ల భయభ్రాంతమై యుద్వేగమొంది, ప్రళయవాతముచేఁ గదలి కల్లోలము లల్లకల్లోలమగుచునుండఁ, బ్రలీనమీనమకరమగు సాగరోదకమువలె నుండెను. అప్పు డప్పార్థుఁ డొక్కమాఱుగా నెల్లదిక్కులందును జిత్రాస్త్రప్రదర్శనముచేయుచు, నారణరంగమునఁ జూఁడదగియుండెను. ఓమహారాజా! మఱియునాతనిశరాకర్షణమందును సంధానమందును బ్రయోగమందును గరలాఘవమును బట్టి యతఁ డందుఁ గానరాకుండ మెలఁగెను. ఓరాజా! అటు లతఁడు కుపితుఁడై దుర్జయమగు నైంద్రాస్త్రమును బ్రాదుర్భవింపఁజేసి, సకలభారతసైన్యములకును వెఱపుగదుర నాదివ్యాస్త్రమునుండి పెక్కుశరపరంపరల నుద్భవింపఁజేసెను. అగ్నిజ్వాలలునాఁ బ్రదీప్తములై వందలకొలఁదిని వేలకొలందినిఁ దీవ్రముగా వెడలినయాబాణములచే నాకసముల్కలచేవలె నావరింపఁబడియెను. పిదప మనవారొనర్చినశరాంధకార మితరులకు వారింప శక్యముగానిదయ్యు, నప్పార్థుఁడు తనదివ్యాస్త్రమంత్రి

తములగుసాయకములచే నశింపఁజేసెను. ప్రాతఃకాలసూర్యునిచేఁ జీకటులువలెఁ దనశరము లనెడికిరణములచే శత్రుశరపరంపరలడంగుడు నక్కౌరవసైన్యము నాతఁడు వేసవిసూర్యుఁడు పల్వలోదకములనువలె క్షీణింపఁజేసి,మఱియుదివ్యాస్త్రప్రభావమున సూర్యకిరణములు లోకమునువలె సాయకసహస్రములచేఁ గప్పసాగెను. అటులే తీవ్రములై మఱియుఁ బ్రయుక్తములగు కొన్నిబాణములు మనవీరులహృదయములను బ్రియబంధువులునాఁ బ్రవేశింప, నాతని సమీపించియున్నశూరమనుజులగు యోధులెల్లఁ బ్రదీప్తాగ్నిలోఁబడినమిడుతలువలె యమమందిరమునొందుచుండిరి. ఓరాజా! ఆశూరవరుఁడు వైరియశోజీవితముల నటులడంచుచు, మూర్తీభవించిన మృత్యువునా సంగ్రామరంగమునఁ జరించుచుండ, నాతనిశరప్రహారములచేఁ గిరీటములతోఁగూడిన ముఖములును, కేయూరములతోఁ గూడిన భుజములును, కుండలములతోఁ గూడిన కర్ణములును నెల్లెడలఁ గానిపింపఁజొచ్చెను. మఱియుఁ దోమరములతోఁగూడినగజారోహకులయు,ప్రాసధారులగురౌతులయు,ఖడ్గధారులైనపదాతులయు, ధనుర్ధరులైన రథికులయు, నంకుశములతోఁగూడిన మావంతులయు బాహువులను ఖండించుచుండెను. అపు డారణరంగమున నాధనంజయుఁడు ప్రదీప్తశరాగ్నిజ్వాలలతో మిడుఁగురులుగల జ్వాలలతోఁగూడిన పావకుఁడునాఁ జూపట్టెను. ఓరాజా! సకలశస్త్రవేత్తలలో నుత్తముఁడునా నింద్రసమానుఁడై యొక్కపరి నెల్లదిక్కుల రథస్థుఁడై చూపట్టుచు, మహాస్త్రములను బ్రయోగించుచు, రథమార్గములఁ జరించుచు, ధనుష్టంకారముగావించుచు నద్భుతముగా విక్రమించు నప్పార్థునిఁ, బార్థివులం దెవ్వరును బ్రయత్నమొనర్చియుఁ దేఱి చూడఁజాలకుండిరి. అతఁడు ప్రదీప్తోగ్రశరకిరణుఁడై యాకసమునఁ బ్రజ్వలించుమధ్యాహ్నసూర్యుఁడునా విరాజిల్లెను.వర్షకాలమున నింద్రధనువులతోఁగూడి యధికజలములఁగురియు మెఘమబ్బువలె నతఁడు కురిపించుమహాస్త్రప్రవాహము ఘోరమై దుస్తరమగుచుండ నందు మనయోధులెల్ల మున్గుచుండిరి. ఓమహారాజా! అపుడు మొగములులేనిమేనులును, బాహువులూడినదేహములును, మీఁజేతులు తెగిన భుజములును, వ్రేళ్లులేనియఱచేతులును దొండములు తెగినయేన్గులును, మెడలుచెడినగుఱ్ఱములును, శిథిలములగురథములును నెల్లెడల నిండ

సందులువీడి, ప్రేవులూడి, పాదములు తెగి నిశ్చేష్టములై వేలకొలఁది సైన్యములురూపుమాయ, నప్పార్థునిమహాయుద్ధము మృత్యుప్రవేశమును దోఁపఁజేయుచు, భీరుభయవర్ధనమై, మాకుమహాద్భుతమొనర్చెను. ఆ యుద్ధభూమి మున్ను ప్రాణికోటులనుజంపునట్టి రుద్రునిక్రీడాస్థానమువలెఁ గన్పట్టెను. క్షురప్రములచేఁ దెగినయేన్గులతొండములచేఁ బుడమి సర్పములతోఁగూడినదివానుండెను. వేఱొక్కచో ముఖములనెడిపద్మములు గల్గి, పుష్పమాలికను ధరించినదివోలెఁ జూపట్టెను. మఱియు విచిత్రములగుశిరోవేష్టనములును, గిరీటములును, కేయూరకుండలాదులును, సువర్ణవిచిత్రములగుకవచములును, గజాశ్వాదుల సువర్ణభూషణములును వెలయుట, నందందుఁ బుడమి చిత్రమై క్రొత్తపెండ్లికూతురునాఁ జూపట్టెను. ఓరాజా! రక్తమె ప్రవాహముగా, మజ్జయు మెదడును, బురదయై, కవచములు నెమ్ముకలుగల్గి లోతై, కేశములె శైవాలముగాఁ దలలును, భుజములును దీరపాషాణములుగా, ఛత్రచాపాదులెతరంగములై వెలయు, నందు రథశతములు తెప్పలై తేలుచుండ, మృతాశ్వసమూహము లొడ్డులగుచుండఁ, దేఱులచక్రకూబరాదులచేఁ జొరరాక, రాబందులు మొసళులుగా, నక్కలరొదలచే భయంకరమై, నృత్యము చేయు వేలకొలఁదిభూతపిశాచాదులచే వ్యాప్తమై, వైతరణినాఁదగు మహానదియొకటి భయంకరమై ప్రవర్తిల్లెను. అంతకరూపుఁడై యున్న యప్పార్థునిపరాక్రమ, మభూతపూర్వమై కౌరవులకు భయమొదవింప, నతఁడు నిజాస్త్రములచే మనవీరులయస్త్రములను దోలఁగించుచు, రౌద్రముఁదాల్చి, రథికోత్తములగువారినెల్ల ధిక్కరించి, మధ్యాహ్నసూర్యుఁడువలెఁ బ్రజ్వలింప, సకలభూతములు నాతనిఁ గాంచుటకైన, సమర్థములు గాఁజాలకుండెను. మఱియు నమ్మహాత్మునిగాండివమునుండి వెడలిన శరసమూహము లాకసమునఁ బరువులిడుహంసలునాఁ జూపట్టెను. అటులతఁడు రౌద్రము వహించి యుగ్రకర్మావలంబి యై, నిజాస్త్రములచే వైరులయస్త్రముల నడంచుచు, సైంధవునిఁజంపు నుత్సాహముతో మన యోధులనెల్ల నారాచప్రహారములచే మూర్ఛగొట్టుచు, దెసలనన్నిటిని బాణమయములుగా నొనర్చుచుఁ, జూచువారి కద్భుతముగా నతఁ డా రణరంగమునఁ గానవచ్చెను. శూరుఁడగు నాతనిశరవ్రాతము లంతరిక్షమునఁజరించుచు, వేలకొలందిని గానవచ్చెను. సాయకములాకర్షించుచు,

సంధించుచు విడుచుచున్నయన్నరుఁడు మాకు దృష్టిగోచరుఁడు గాకుండెను. ఓరాజా! అటు లతఁ డెల్లదిక్కులను, నెల్లయోధులను గలఁతవెట్టి, జయద్రథునిపై వెడలి, యాతని నలువదిబాణములచే నొప్పించెను. అంత నాసైంధవు నెదుర్కొనినయప్పార్థునిఁ గాంచి మన వీరులెల్ల నాజయద్రథునిజీవితము నెడ నిరాశులై రణమునుండి మరలిరి. ఓప్రభూ! ఆసమ్మర్దమున మనవా రెవ్వరెవ్వ రాయర్జునుఁ దలపడిరో వారిపై నెల్ల నాతనిశరవ్రాతములు పడుచునే వచ్చెను. అటు లతఁడు విక్రమించి శరవర్షమును గురియు, మనసైన్యమెల్ల మొండెములతో నిండఁజొచ్చెను. ఓరాజా! అటులు నీ చతురంగబలము నెల్ల నాకులముగా నొనర్చి, మఱియు నాసైంధవునిఁ దలపడి, యశ్వత్థామ నేఁబదింటను, వృషసేనుని మూఁడిటను, గృపుని దొమ్మిదిటను, శల్యునిఁ బదునాఱిటను, గర్ణుని ముప్పదాఱింటను, సైంధవు నలువదినాల్గింటను గొట్టి సింహనాద మొనర్చెను. అంత నాసైంధవుఁ డప్పార్థునిప్రహారముల కోరువక, యంకుశపుఁబోటులకు గజమువలెఁ గుపితుఁడై, సానవెట్టుటను సర్పతుల్యములైన గ్రద్దఱెక్కలబాణముల నయ్యర్జునురథముపైఁ బ్రయోగించి, మఱియు మూఁడునారాచములచే వాసుదేవునిఁ గొట్టి, యర్జునుపై మరల నాఱుబాణములను బ్రయోగించి, యెనిమిదిటిచే గుఱ్ఱములను, నొకదానిచే ధ్వజమును బ్రహరించెను. అప్పు డప్పార్థుఁడు సైంధవప్రయుక్తములగు తీవ్రనారాచముల, రెండుబాణములచే నొక్కమాఱుగా ఖండించి, మఱియు వాని సారథిని ధ్వజమును ఛేదించెను. అంత నాజయద్రథునిధ్వజముదండము తెగి, యగ్నిజ్వాలనావెలయుచుఁ బుడమిఁబడియెను. అంతలో భాస్కరుఁడు వడిగా నస్తాద్రి కేఁగుచుండెను. అది చూచి వాసుదేవుఁడు త్వరపడుచు నర్జునుతో 'ఓ వీరాగ్రణీ! ఈసైంధవుఁడు, మహారథులగు నార్వురవీరులనడుమనుండి జీవితాభిలాషియై బెదరుచునున్నవాఁడు. ఓపురుషవర్యా! నీ వీయార్వుర నోడింపక, యెంత యత్నించినను సైంధవునిఁ జంపఁజాలవు. కావున నేనిపు డాసూర్యున కావరణముగా నొకయుపాయ మొనర్చెదను. దానిచే నాసైంధవుఁ డొక్కఁడును స్పష్టముగా సూర్యుఁడస్తమించె నని గాంచఁగలఁడు. అపుడు వాఁడు జీవితాకాంక్షియగుట సంతోషముతోఁ, దనవినాశమునకై తన్నుఁ దాచుకొనక పైకి లేచును. అట్టి

సమయము గనిపెట్టి నీ వాతనిఁ బ్రహరింపవలయును. అంతియగాని సూర్యుఁడస్తమించుచున్నవాఁడని నిరాశచెందకుము.' అని పలుక విని యప్పార్థుఁ డందులకు సమ్మతించి, యాతనితో 'ఓదేవా! నీవచనము చొప్పునఁ జేయువాఁడ' నని ప్రత్యుత్తర మొసంగెను. పిమ్మట నాకృష్ణుఁడు సూర్యున కావరణముగాఁ జీకటిని గల్పించెను. యోగీశ్వరుఁడగు నా హరి తనయోగబలముచేఁ జీకటిని గల్పింప, సూర్యుఁ డస్తమించెనని మనవారెల్లరును సంతుష్టాంతరంగులై యప్పార్థునివినాశమును నిశ్చయించిరి. ఓరాజా! అటులు హర్షపూరితులైన మనసైనికులకు సూర్యుఁ డగపడమి, మొగము లెత్తి మఱిమఱియు నాభాస్కరబింబమువైపు చూడ మొదలిడిరి. అంత నాసైంధవుఁడును వారివలెఁ దాను నా భాస్కరు నారయుచుండఁగా, నపు డవ్వ్యాసుదేవుఁ డప్పార్థునితో 'ఓ యర్జునా! ఆసూర్యు నారయుచున్నసైంధవునిఁ గాంచితివా? ఇపుడు నీవు భయమువిడిచి, వీనిని జంపుట కిదె తగునదనుగా నెంచి, వీనితల దెగనేసి, యాత్మసాఫల్య మొనర్చికొనుము.' అని తెలుప విని, ప్రతాప నిధియగు నప్పార్థుఁడు, శరాగ్నిజ్వాలలచే నీసైన్యమును దహించుచుఁ గృపు నిరువదింటను, గర్ణు నేఁబదింటను, శల్యసుయోధనుల నాఱేసి బాణములను, వృషసేను నెనిమిదింటను గొట్టి, సైంధవు నఱువదింట నొప్పించెను. అటులే మఱియుఁగల నీవారివీరుల ననేకుల నొప్పించి, మఱియు నాసైంధవునిఁ దలపడి సమీపముననున్న యాసైంధవుని, దహించునగ్నివలెఁగాంచఁగా,వానికి రక్షకులై యున్నవారెల్ల నెంతయు సందియంపడుచు, మఱియు జయాభిలాషులగుట శరధారల నప్పార్థునిఁ గప్పిరి. అంత నాకౌంతేయుఁ డటులు శరజాలముచేఁ గప్పఁబడి కుపితుఁడై వెనుదీయక, నీవారిసైన్యములఁ జంపువాఁడై, శరజాలము నొక వలగాఁ గల్పించెను. ఓరాజా! అంత నావీరునిచే నీయోధులు హతులై జడిసి, సైంధవుని విడిచి యొకరినొక రంటక పరువులిడసాగిరి. ఓరాజా! మహాయశుఁడగు నయ్యర్జునుఁ డపుడు చూపినపరాక్రమము భూత భవిష్యద్వర్తమానముల నెవ్వరియందుఁ జూపట్టమి, నది మాకెంతయు నద్భుత మొదవించెను. అతఁడు రుద్రుఁడు ప్రాణులనువలె మావంతులతో నేన్గులను, రౌతులతో గుఱ్ఱములను, రథములతో రథికులను జంపుచుండుట, నాసమరమున నొక్కఁడును వాని ప్రహార మొందని

వాఁడు నాకుఁ గానరాకుండెను. అపుడు గల్గినచీకటిచేతను, ధూళి చేతను కనులుగానరాక, మతులుచెడి యొకరినొకరు గన్గొనఁజాలకుండి, యాపార్థునిశరప్రహారముల కోరువలేక, భ్రమించువారును, దొట్రు పడువారును, బుడమిఁబడువారును, బరువులిడువారునైరి. ప్రజాసంక్ష యకారకమై మహాభయంకరముగా నటు లాసంగ్రామము జరుగుచుండ, నపుడు వెడలినరక్తముచే ధూళి లడంగఁజొచ్చెను. ఆనెత్తురుబురద లలో రథచక్రములు దిగఁబడుచుండెను. మావంతులుచావ నంగములు వ్రయ్యలైనయేన్గులు వేలకొలఁది తమసైన్యములనే త్రొక్కుచు, నార్త నాదములొనర్చుచుఁ బరువులువాఱెను. ఓరాజా! అటులే యాపార్థ ప్రహారములచే రౌతులుగూలినగుఱ్ఱములును, బదాతులును బరువు లిడసాగిరి. జుట్టులువీడియు రక్తములోఁడియు వెఱపొదవ, మనసైనికులు పరువులిడుచుండిరి. కొందఱు తొడలుదెగి యందే కూలఁబడిరి. మఱి కొందఱు చచ్చిపడియున్న యేన్గులనడుమ డాగుచుండిరి. ఓరాజా! ఆధనంజయుఁ డటులు మనసైన్యమును జెదరఁజేసి, ఘోరనారాచ ప్రహారములచే, సైంధవరక్షకుల నొప్పింప, కృపాశ్వత్థామశల్య వృషసేనసుయోధనులపైఁ దీవ్రశరజాలములఁ గురిపించెను. అపు డయ్యర్జునుఁడు నారాచముఁదీయుచు, సంధించుచు, విడుచుచు, శీఘ్రాస్త్రుఁడగుటఁ గానరాకుండెను. మండలాకారమగు నాతనిధనువే గానవచ్చుచుండెను. ఎందుఁ జూచినను నతనిశరపరంపరలే యగ పడుచుండెను. అంత నతఁడు కర్ణవృషసేనులధనువులఁ దునుమాడి, యొకభల్లముచే శల్యునిసారథిని రథనీడమునుండి పుడమిఁ బడఁద్రోసి, మఱియు మామయు నల్లుఁడునగు కృపాశ్వత్థామలను గాఢప్రహారములఁ గావించెను. ఓరాజా! ఇటు లతఁడు నీవారిమహారథులనెల్లఁ గలఁతవెట్టి, పిదప దివ్యమంత్రాభిమంత్రితమై పిడుగునాఁదగు నొకఘోరశరమును వజ్రాస్త్రము సంధించి, చిరకాలమునుండియు గంధమాల్యములచేఁ బూజిం పఁబడుచువచ్చిన యాయుత్తమశరమును గాండీవమున నునుప, నంతరిక్ష మున భూతకోటులమహానాద ముదయించెను. అపు డవ్వాసుదేవుఁడు త్వరపడు నప్పార్థునితో 'ఓయర్జునా! దురాత్ముఁడగుసైంధవునితలఁ దెగనేయుము. భాస్కరుఁ డస్తాద్రిఁ జేరుచున్నవాఁడు. జయద్రథుని వధమునకై నాయీవచన మొకటి యాలింపుము. ఈసైంధవునితండ్రి

యగు వృద్ధక్షత్త్రుఁడనువాఁ డొకఁడు గలఁడు. వాఁడు చిరకాలమున కీసైంధవునిఁ గనియెను. అపుడు వాని కగపడకయే యశరీరవాణి వానితో 'ఓరాజా! ఈ నీకొమరుఁడు మానవులలోఁ గులశీలాదిసద్గుణములచే నుభయవంశములకును దగినవాఁడగును. మఱియు లోకమున నితఁడు శూరులలో నొకఁడై యెన్నఁదగియుండును. కాని యుద్ధము చేయుచున్న వీని నొక క్షత్త్రియోత్తముఁడు తలఁ దెగనేసి చంపును' అని పలికెను. అదివిని యావృద్ధక్షత్త్రుఁడు చిరకాలము ధ్యానించి పుత్త్రస్నేహముచేఁ దనజ్ఞాతులతో 'ఓయీ! సంగ్రామమున వీఁడు యుద్ధము చేయునపుడు వీనితల నెవ్వఁడు పుడమిఁబడవైచునో వానిశిరము నూఱు ఖండములగును. ఇందులకు సందియము లేదు' అని పలికి వీనిని రాజ్యమునందు నిలిపి తప మాచరింప నరణ్యమునకుఁబోయెను అటులు పోయి యతఁ డందు ఘోరముగాఁ దపమొనర్చుచు స్యమంతకపంచకమునకు వెలుపల నున్నవాఁడు. కావున నీ వీసైంధవునితలఁ దెగనేసి ఘోరమై యద్భుతకర్మ మొనర్చునట్టి యాదివ్యాస్త్రముచే దాని నావృద్ధక్షత్త్రుని తొడపైఁ బడునట్టు లొనరింపుము. లేక నీవే వానితల, నిలఁ బడఁ ద్రోయుదేని నీతల నూఱుఖండములయ్యెడిని. ఈవిషయము నావృద్ధక్షత్త్రునకుఁ దెలియకుండ నీదివ్యాస్త్ర ప్రభావముచేఁ జేయుము. నీకు ముల్లోకములందును నసాధ్యమగున దేదియును లేదుగదా!' అని తెలిపెను.

అది విని యప్పార్థుఁడు పెదవులకొనలు దడుపుచుఁ దాను వెనుక సంధించియున్నయాసాయకశ్రేష్ఠమును, సైంధవునివధమునకై విడిచెను. అటు లది గాండివనిర్ముక్తమై యొకపక్షికై చెట్టుకొననుండి వెడలినడేగ వలె నెగిరి యాసైంధవునితలఁ దెగనేసెను. అటులు ఖండించి దానిని బుడమిఁబడకుండ బాణములచే నిలుపుచు వైరులకు దుఃఖమును, మిత్త్రులకు సంతోషమును గలుగ, శరకదంబమును బఱపుచు, స్యమంతకపంచకమునకు వెలుపలఁజేర్చి యందు, వృద్ధక్షత్త్రుఁడు తపముచేయుచు నపుడు సంధ్యోపాసనముచేయుచుండ నాతనితొడపైఁ గేశకుండలయుక్తముగాఁ బడవైచెను. అటు లది తనతొడపైఁబడుట యతఁడు గాంచమి, జపానంతరము లేచుచుండఁగా నది వానినుండియే పుడమిఁ బడియెను. అటులు సైంధవునితల, యిలఁబడినంతనే వానితండ్రితలయు, నూఱు

ఖండములయ్యెను. పిదప సకలభూతములును విస్మయమొంది యవ్వాసు దేవార్జునులఁ బ్రశంసించెను. ఓరాజా! అటు లర్జునిచే సైంధవుఁడు హతుఁడగుడు వాసుదేవుఁ డామాయాంధకారమును దొలఁగించెను. అపుడు నీపుత్రులును, వారియోధులును, నది వాసుదేవప్రయుక్తమగు మాయ యని గ్రహించిరి. ఓమహీపాలా! అమితతేజుఁడగు నయ్యర్జునుఁ డటు లెనిమిదియక్షౌహిణులఁగొట్టిసైంధవునిఁ జంపెను. అటులు నిహతుఁడైనసైంధవునిఁ గాంచి దుఃఖితులగుచున్న నీతనయులకనులనుండి నీ రేరై కారఁజొచ్చెను. అంత నవ్వాసుదేవార్జునులు తమతమశంఖములను బూరించిరి. భీమసేనుఁడును, దమసేమము నాయుధిష్ఠిరుస కెఱిఁగించుచు, భూమ్యాకాశములు నిండునట్లుగా సింహనాద మొనర్చెను. ఆమహానాదమును విని యాధర్మజుఁడు సైంధవుఁడు హతుఁడయ్యెనని తలంచెను. అటులు తలంచి వాదిత్రఘోషముచేఁ దనయోధుల సంతసింపఁజేసి, ద్రోణునితోఁ బోరాడ నెదుర్కొన, నాసూర్యాస్తమయ సమయమున, నాద్రోణునకును సోమకులకును గొప్పయుద్ధము జరిగెను. అపు డాసైంధవుఁడు హతుఁడగుట నాసోమకు లాభారద్వాజు నెల్ల ప్రయత్నములచేఁ జంపువారై పోరాడిరి. పిదపఁ బాండవసైన్యములన్నియు సైంధవవధముచే జయమునొందినవారగుట సోత్సాహులై యుద్ధముచేయసాగిరి. అచ్చోట నర్జునుఁడు సైంధవునివధించి నీయోధుల నెల్ల నాయింద్రుఁడు రాక్షసులనువలెఁబీడించి యుదయించినసూర్యుఁడు చీకటినివలెఁ దొలఁగించుచుఁ దనప్రతిజ్ఞ నిర్వహించుకొనియె" నని తెలుపవిని ధృతరాష్ట్రుఁ డిట్లనియె.

### కర్ణసాత్యకులయుద్ధము

"ఓసంజయా! ఆసవ్యసాచి సైంధవునిఁ జంపినపిమ్మట మనవారేమి యొనర్చిరో? అదియెల్ల నాకుఁ దెల్పుము."

అది విని సంజయుఁ డయ్యాంబికేయునితో "ఓమారిషా! ఆ సైంధవుఁడు మడిసినపిదపఁ గృపుఁడు కోపావేశపరవశుఁడై, యర్జునిశరవర్షముచేఁ గప్పినంతనే యశ్వత్థామయు, రథారూఢుఁడై యర్జునునిఁ దలపడియెను. అటు లారథికోత్తము లిరువురును గలిసి యర్జునిరుగెలంకులఁ దీవ్రసాయకముల వర్షింపసాగిరి. అంత నామహాభుజుఁ

డగునర్జునుఁ డటులు, వారిశరవర్షముచే నెంతయుఁ బీడితుఁడై యార్తి నొంది, యాగురు, గురుపుత్త్రులను జంపనెంచియు,మఱియు నాయూహ నుండి మఱలి వారియస్త్రములనుమాత్రము తనయస్త్రములచే నివారించుచు, మందవేగములగుబాణములచేవారిని మెల్లగాఁ బ్రహరించుచు వచ్చెను. కాని యాశరపరంపరలుమాత్రము జయప్రదములై యనేకములగుటచేఁ గృపాశ్వత్థామల కార్తిగల్గించెను. ఓరాజా! పిమ్మట నక్కృపుఁ డక్కౌంతేయునిచే నెంతయుఁ బీడితుఁడై మూర్ఛావిష్టుఁడై రథమధ్యమునఁబడి, వివశుఁడై యుండుటఁగాంచి,హతుఁడయ్యెననికొని యాతనిసారథి రణరంగమునుండి తీసికొనిపోయెను. అటు లాశారద్వతుఁడు భంగమొంద నశ్వత్థామయు నప్పార్థునివిడిచి వేఱొకచోటికేగెను. అటులు శరపీడితుఁడై రథమున, మూర్ఛమునిఁగియున్నకృపు నారసి, యప్పార్థుఁ డెంతయు దైన్యముగాఁ గనుల నీరువెట్టుచు, నేడ్చుచు నిట్లు పలికెను.

"అయ్యో! ఇట్టిదురవస్థలను గనిపెట్టియే ము న్నావిదురుఁ డయ్యాంబికేయునితో 'ఓరాజా! కులవినాశమునకై జనించినపాపుఁడగు నీసుయోధనునిఁ బరలోకమున కనుచుట మేలనియుఁ గులపాంసనుఁడగు వీనిచేఁ గురుముఖ్యులకు గొప్పహాని సంభవించు' ననియుఁ దెల్పెను. సత్యవాదియగు నావిదురునివచనములచొప్పే యిప్పుడు సంభవించెను. ఆసుయోధనుకృత్యముచేత నేగదా! శరతల్పగతుఁడగు భీష్మునిఁ జూడవలసివచ్చెను. ఛీ! ఛీ! క్షత్త్రియధర్మముతో నేమిపని? బలపౌరుషము లెందులకు? మాయట్టివాఁ డెవ్వఁడేని,బ్రాహ్మణుఁడునునాచార్యుఁడునునగు వానికి ద్రోహమొనర్చియుండెనా? అయ్యో! నా కాచార్యుఁడును, ద్రోణునకుఁ బ్రియతముఁడును ఋషిపుత్త్రుఁడునునై యుండియు నిట్లు మద్బాణపీడితుఁడై రథమునఁబడియున్నవాఁడు. కొట్టవలె నను తలంపులేకయు నీతనిఁ బీడించితిని. ఇతఁడు రథమునఁబడి తపించుచు నాప్రాణములనుఁ బీడగల్గించుచున్నవాఁడు. మఱియు నితఁడు పుత్త్రశోకాభితప్తుఁడగుటయేగాక, యిటులు మద్బాణపీడితుఁ డయ్యెనే! ఓ కృష్ణా! నిజరథము నెట్లు కృపణుఁడై క్షీణించియున్నవాఁడో చూడుము. లోకమున నాచార్యులనుండి విద్యను సంపాదించి వారికోర్కుల నీడేర్చినయుత్తములు దేవత్వమొందుదురుగదా! అటులుగాక, యా

చార్యులనుండి విద్యలనుగ్రహించి వారినే పీడించినపురుషాధములు దుర్వృత్తులు నరకము నొందకమానరు. అటులగుట నా యీయొనర్చిన కృత్యమెల్ల నరకమునకే యగుచుండుట నిశ్చయము. ఆచార్యునిశరవర్షముచేఁ బీడించి రథమునఁ బడఁద్రోసినవాని కది తప్పునా? మున్ను నాకతఁ డస్త్రోపదేశముచేయుతఱి, 'నీవెన్నఁడును గురునిఁ బ్రహరింపరాదని' తెలిపియున్నవాఁడు. ఆయాచార్యునివచనమును బాటింపక యిట్టు లాతని శరవర్షమున నొప్పించితిని. పూజ్యుఁడగు నాకృపాచార్యున కిదె నానమస్కారము. ఓవృష్ణివంశోత్తమా! ఈయాచార్యునిఁ బ్రహరించిన నాజీవిత మేటికి? ఛీ!"

అతఁ డట్లు విలపించుచుండఁగా సైంధవవధమున కోరువక యా రాధేయుఁ డర్జునుపైఁ దలపడునంతఁ బాంచాల్యులగుచక్రరక్షకులును సాత్యకియు వడిగా నాతని నెదుర్కొనఁబోయిరి. అపుడు సమీపించుచున్నయారాధేయు నారసి, యప్పార్థుఁడు నగుచు, వాసుదేవునితో 'ఓదేవా! ఇదె కర్ణుఁడు మనసాత్యకిరథముపైకి వెడలుచున్నవాఁడు. ఆసాత్యకి భూరిశ్రవునిఁ జంపుటను సహింపకుండుట నిశ్చయము. కావున నోజనార్దనా! అందులకు మనరథముఁ బోనిమ్ము. ఇక్కర్ణుఁడు మన సాత్యకి నాభూరిశ్రవునిమార్గము నొందింపనున్నవాఁడేమో!' అనిపలుక విని యవ్వాసుదేవుఁ డాతనితోఁ దత్కాలానుకూలముగా, నిట్లు పలికెను.

'ఓయర్జునా! మహాబాహుఁడగుసాత్యకి యారాధేయునకుఁజాలినవాఁడు. వానికి ద్రౌపదేయులుసహాయులగుచుండఁగా మనకు సంశయమేటికి? ఓపార్థా! ఇపుడు నీ వారాధేయునితోఁ బోరాడఁదగదు. మహోల్కవలెఁ బ్రజ్వలించుచు వానికడ నొకయింద్రశక్తి గలదు. దానిని వాఁడు నీకై పూజించుచు దాచుకొనియున్నవాఁడు. అటులగుట నిపు డారాధేయుఁ డాసాత్యకిపై వెడలనిమ్ము. ఓకౌంతేయా! దురాత్ముఁడగు నీసూతసుతునికాలము నేనెఱుంగుదును. ఆసమయమున నీవు వీనిని దీవ్రసాయకములచేఁ బడఁద్రోయఁగలవు.' అని పలికె" నని సంజయుఁడు తెలుప విని ధృతరాష్ట్రుఁడు మఱియు నిట్లనియె.

ఓసంజయా! భూరిశ్రవసుఁడును సైంధవుఁడును హతులయిన పిదప, వీరుఁడగుకర్ణునితో నాసాత్యకి తలపడెనని తెలిపితివిగదా! విరథుఁ

డైనసాత్యకి యెవ్వరిరథ మధిష్ఠించెను ? చక్రరక్షకులగు పాంచాల్యు లెవ్వరిరథము లధిరోహించిరి ? అదియెల్ల నాకెఱింగింపుము.

అది విని సంజయుఁ డయ్యాంబికేయునితో "ఓరాజా! నీదుశ్చరిత మునకు ఫలమగునీయుద్ధమువిధము జరిగినది జరిగినట్లుగాఁ దెల్పెదను. స్థిరచిత్తుఁడవై వినుము. భూరిశ్రవుఁడు వీరుఁడగుసాత్యకిని జయించునని యింతకుమున్నె యవ్వాసుదేవుఁ డెఱుఁగును. అతఁ డటులతీతానాగతములఁ దెలిసినవాఁడగుట సూతుఁడగుదారుకునితోఁ దనరథము సిద్ధముగావించియుండుమని యానాఁ డుదయ మాజ్ఞాపించెను. దేవత లును, గంధర్వయక్షరాక్షసోరగులును, మానవులు నవ్వాసుదేవార్జునుల జయింపఁజాలరు. బ్రహ్మ మున్నగువారును నాతనిమహిమ నెఱుంగు దురు. వారిరువుర ప్రభావము నిరుపమానమైనది. ఇఁక నాయుద్ధము విధము వినుము. కర్ణునిచే నెదుర్కొనఁబడి విరథుఁడై యున్న యాసాత్య కినిఁ గాంచి వాసుదేవుఁడు మహానాదమగునట్లుగాఁ దనశంఖమును బూరించెను. ఆశంఖస్వనసంకేతమును విని యాదారుకుఁడు గరుడ ధ్వజచిహ్నితమగురథమును దీసికొనిరాసూర్యాగ్నితుల్యమగునారథము నాసాత్యకి యధిష్ఠించెను. సువర్ణభాండభూషితములై యున్నతములగు శైబ్యసుగ్రీవమేఘపుష్పవలాహకములచేఁ బూన్పఁబడిన విమానతుల్య మగురథ మతఁ డటు లధిష్ఠించి పెక్కుసాయకములను బ్రయోగించుచు నాకర్ణు నతఁ డెదుర్కొనియెను. ఆతనికిఁ జక్రరక్షకులైన యుధా మన్యూత్తమౌజులును, ధనంజయునిరథమువిడిచి యారాధేయునిఁ దలపడిరి. ఓమహారాజా ! అపుడు కర్ణుఁడును శరవర్షమునుగురియుచు సాత్యకిని మార్కొనియెను. వారి కపుడు జరిగినయుద్ధము మున్నా దేవ గంధర్వరాక్షసోరగులం దెవ్వరికిని జరిగియుండుట వినియుండలేదు. చిత్తములకు మోహమునుగల్గించువారియద్భుతకర్మము నారసి గజరథా శ్వపదాతిసైన్యములవారందఱును యుద్ధమునుండి మరలి, యమానుష మగు వారియుద్ధము నారయుచుండిరి. ఓరాజా! మఱియు నాదారు కునిసారథ్యమునందలి, గతప్రత్యాగతావృత్తములకును మండలనివర్తన ములకును విస్మితులగుచు దేవదానవగంధర్వులు, నభస్థలమునందుండి యాసాత్యకిరాధేయుల యామహాసంగ్రామమును దిలకించుచుండిరి. వారు తమతమమిత్రులకుఁగాఁ బరస్పరస్పర్ధలతోఁ బరాక్రమించుచు

నన్యోన్యము శరవర్షములను ముంచుకొనసాగిరి. అపుడు కర్ణుఁడు, భూరిశ్రవునియు జలసంధునియు వధమునకుఁ గోపము తెచ్చికొని యా సాత్యకిని బెక్కుసాయకములచే నొప్పించెను. అటులు కుపితుఁడై తన్నుఁ బ్రహరించిన యారాధేయు నాసాత్యకియుఁ గోపమదర గజము వైరిగజమునువలె గొప్పసాయకవర్షముచేఁ బ్రతిప్రహార మొనరించెను. వడిగలబెబ్బులులువలె వారటులు పరస్పరము గలిసి యవక్రవిక్రములై యొకరినొకరు శరములచేఁ జెక్కుకొనుచుండిరి. అపు డాసాత్యకి, తీవ్రనారాచములచే మఱిమఱియు నాకర్ణునియవయవములను భేదించి మఱియు నొకభల్లముచే వానిసారథిని రథనీడమునుండి తొలఁగించుటయేగాక, వాఁడికోలలచే వానివెల్లగుఱ్ఱముల నాల్గిటినిగొట్టి, ధ్వజము నూఱుఖండములుగా ఖండించి, నీపుత్త్రుఁడు చూచుచుండఁగా నారాధేయుని విరథునిఁగావించెను. పిదపఁ గుపితులై నీయోధులలోఁ గర్ణపుత్త్రుఁడగు వృషసేనుఁడును, శల్యుఁడును, నశ్వత్థామయు నాసాత్యకి నలుగడలఁజుట్టికొనిరి. అపుడు సైన్యమెల్ల నాకులమగుట నించుకేనిఁ దెలియఁబడకుండెను. ఓరాజా! అటు లాసాత్యకిచేఁ గర్ణుఁడు విరథుఁడగుడు, మనసైన్యమున హాహాకారము జనించెను. అంత నాకర్ణుఁడును సాత్యకి శరభిన్నాంగుఁడై యొడలు తెలియకయే నిట్టూర్పులిడుచు నానుయోధనురథము నధిరోహించెను. అతఁ డటులు సుయోధను నితోఁ దనకుఁగలబాల్యస్నేహమును గౌరవించుచు నతఁడు తనకుఁ జేసిన రాజ్యప్రదానమునకుఁ దానొనర్చినప్రతిజ్ఞను బరిపాలించుచుఁ బోరాడి తుదకు విరథుఁడై యుండెను. అంత నాసాత్యకియు భీమార్జును లొనర్చినప్రతిజ్ఞను స్మరించుచు నీపుత్త్రులగుదుశ్శాసనాదులను జంపక విరథులను వివశులను నొనర్చి ప్రాణములతో విడిచెను. ఓరాజా! నాఁ డాభీముఁడు నీపుత్త్రులను వధింతునని ప్రతిజ్ఞచేయుటయు, నర్జునుఁడు కర్ణునిఁ జంపుదుననుటయు నీవెఱింగినదేగదా! అంతఁ గర్ణుఁడు మున్నగు యోధులు సాత్యకిని జంపఁ బ్రయత్నింపకయే యూరకుండిరి. వారతని నిజముగాఁ జంపనుజాలరుసుమీ! యుధిష్ఠిరుని ప్రియమును బరలోకమునుగోరి వీరుఁడై విక్రమించిన యొక్కధనుర్ధరునిచేఁ గృపాశ్వత్థామలును, మఱియుఁగల మహారథులగు క్షత్త్రియోత్తములునుఁ బరాజితులైరి. పరాక్రమమునఁ గృష్ణార్జునులకుఁ దుల్యుఁడైన యాసాత్యకి

నగుచునే నీవారిసైన్యమునెల్ల నోడించెను. ఓరాజా! లోకమునఁ గృష్ణుఁడును భార్గవుఁడును సాత్యకియుఁదప్ప ధనుర్ధరోత్తములనుటకుఁ దగువాఁడు నాల్గవవాఁడు లేఁడు." అని తెలుప విని ధృతరాష్ట్రుఁడు "ఓసంజయా! తనకు దారుకుఁడు సారథిగా బాహుబలగర్వితుఁడై యజేయమగు వాసుదేవునిరథ మధిరోహించి వాసుదేవతుల్యుఁడై యుద్ధమునఁ గర్ణుని విరథునిఁ గావించెనుగదా! అతఁడు వేఱొకరథము నధిరోహించెనా? వాఁడు వైరుల కోర్వరానివాఁడని తలంతును. అది యెట్లయ్యెనో తెలుపుము" అని ప్రశ్నించెను.

అది విని మఱియు నాసంజయుఁడు "ఓమహారాజా! వినుము. అపుడు దారుకానుఁజుడు శాస్త్రీయముగాఁ గల్పించి తెచ్చిన వేఱొక రథము నధిరోహించి నీసైన్యమును మఱియుఁ దలపడియెను. ఆతని రథము కడువడిగలగుఱ్ఱములతోఁ బూన్పంబడి, సింహధ్వజపతాకగల్గి బహువిధాలంకారాలంకృతమై యుండెను. పిదప దారుకుఁడును గేశవుని సమీపించెను. పిమ్మట మిక్కిలి వేగముగల్గి చిత్రసువర్ణసన్నాహములుగల్గి శంఖగోక్షీరములవన్నెగల్గినగుఱ్ఱములు పూన్చినట్టియు సువర్ణకతూధ్వజోపేతమైనట్టియు, యంత్రపతాకలుగల్గినట్టియు బహువిధములగుశస్త్రములతోనిండి, మంచిసారథిగలిగినట్టియు, సుత్తమమగు నొకరథ మారాధేయునకుఁగాఁ దేఁబడియెను. దాని నాకర్ణుఁ డధిరోహించి వైరులపైకి వెడలెను. ఓరాజా! నీవడిగినప్రశ్నమునకు వలసిన సమాధానమెల్లవచ్చెను. నీయవివేకముచేఁ గల్గినవినాశమెల్ల మఱియు దెలిపెదను వినుము. దుర్ముఖుఁడు ముందునడువ వెడలిననీపుత్రుల ముప్పదియొక్కండ్ర నాభీముఁడు వధించెనుగదా! ఆయర్జునసాత్యకులు వందలకొలందిశూరులను రూపుమాపిరిగదా! అటులే భీష్ముని ముందిడికొని భగదత్తుఁ డంతమొందెనుగదా! ఓరాజా! ఇదియెల్ల నీదురాలోచనాఫలమనక తప్పదు." అని తెలుప విని ధృతరాష్ట్రుఁడు మఱియు ని ట్లనియె.

కృష్ణార్జునులు యుద్ధభూమిని దర్శించుట

"ఓసంజయా! మనవారును వారివారును నటులు వెడలఁగా నపుడు భీముఁ డేమిచేసెను? నా కదియెల్లఁ దెల్పుము."

అదివిని సంజయుఁ డాతనితో "ఓరాజా! భీముఁ డటులు విరథుఁడై కర్ణునివాక్శల్యములు తన్ను నొప్పింప, గోపావేశపరవశుఁడై యర్జునునితో 'ఓతమ్ముఁడా! నన్నా రాధేయుఁడు, నిస్సారుఁడా! మూఢా! భోజనప్రియా! అకృతాస్త్రా! బాలసంగ్రామకాతర! నీవు యుద్ధమునకు వెడలకుము' అని నన్నుఁ బలువిధముల దూషించెను. నీవది గాంచుచునేయున్నవాఁడవుగదా! ఇటులు నిందించిన యారాధేయుఁడు నాకు వధ్యుఁడైయున్నవాఁడు. 'ఓమహాబాహూ! ఈవ్రతము నీతోఁగూడ నేనొనర్చినవాఁడను. ఇందు సందియములేదు. కావున నా యీవచనమును స్మరించి ప్రతిజ్ఞను బాలించుకొనుము. దాని నసత్యము గానీకుము.' అని తెలుప విని యమితవిక్రముఁడగునర్జునుఁడు కర్ణునిఁ గొంచెము సమీపించి 'ఓకర్ణా! కర్ణా! వృథభాగ్యా! సూతపుత్రా! ఆత్మస్తుతిపరాయణా! అధర్మబుద్ధీ! నేనిపుడు తెలుపు నొకవచన మాలింపుము. యుద్ధమున శూరులకు జయపరాజయము లనునవి రెండును సంభవించును. ఓరాధేయా ! అయ్యవి యుద్ధముచేయువాసవునకును ననిత్యములై గల్గుచుండును. నీ వాసాత్యకితోఁబోరాడి విరథుఁడవై, వికలేంద్రియుఁడవై సగముచచ్చి నాకు వధ్యుఁడవగుట నాతనిచేఁ బ్రాణములతో విడువఁబడితివిగాదే? దైవవశముగా నీవు భీముని విరథునొనర్చియు నిటులాడుట నీకు ధర్మముగాదు. వైరినిజయింపక గర్వింపరాదు. దురుక్తులఁ బలుకరాదు. శూరులగు సజ్జను లెవ్వరును నిందింపరు. ఓసూతపుత్రా! నీవు మూర్ఖుఁడవగుట నటులు పల్కితివి. ఆర్యవ్రతనిరతుఁడై విక్రమమువెలయ యుద్ధముచేయుచు శూరుఁడైన యాభీముని నీవాడినవచనము లెవ్వియు సత్యములుగావు. సకలసైన్యములును, నేనును, కేశవుఁడును జూచుచుండఁగా, నీ వాయుద్ధమునఁ బలుమాఱులు భీమునిచే విరథుఁడవు గావింపఁబడితివి. అప్పు డప్పాండునందనుఁడు నిన్నొక్కమాటేనిఁ గొంచెమేనిఁ బరుషవచనముపలికెనా? నీవు పలుమాఱులు పరుషముగా నాతని నిందించితివి. నేను లేనపుడు నాయభిమన్యునిఁ మీరెల్లఁగలిసి చంపితిరిగాదే? ఆ మీగర్వమునకుఁదగుఫల మిపు డనుభవింపుము. ఓదుర్మతీ! నీ వాత్మనాశమునకే యాయభిమన్యుని ధనువు దునుమాడతివి. కావుననే నీవు నిజభృత్యబలవాహనములతోఁగూడ నాకు వధ్యుఁడవైతివి. ఇఁక నీవు చేయఁదగినకృత్యములుగలవేని

వానిని జేసికొనుము. నీకుఁ గొప్ప యాపదరానున్నది. నీవు చూచు చుండఁగనే నీకొమరుఁడగు వృషసేనునిఁ జంపెదను. ఇంకెవ్వరేని బుద్ధిహీనులై నీకు సహాయులుగా వత్తురేని వారినందఱను జంపెదనని యిదె యాయుధముముట్టి సత్యముచెప్పుచున్నాఁడను. మూఢుఁడవు, బుద్ధిహీనుఁడవు, దురభిమానివినగు నిన్ను రణరంగమునఁ బడఁద్రోయఁ జూచి మందుఁడగుసుయోధనుఁ డెంతయుఁ బరితపింపకమానఁడు.” అని పలికెను.

ఓరాజా ! అటు లప్పార్థునిచేఁ గర్ణసుతవధము ప్రతిజ్ఞచేయఁ బడుటయు రథికులలో గొప్పసంకులధ్వని జనించెను. అటులు భయావహమగు సంకులసమర మారంభమగుడు సహస్రాంశుఁడు మందకిరణుఁడై యస్తాద్రి కేగెను. ఓరాజా ! పిదప సంగ్రామముఖమునఁ దన ప్రతిన నెఱవేర్చికొనియున్న యాపార్థునిఁ గాంచి వాసుదేవుఁ డాతనిఁ గౌఁగిలించికొని “ఓయర్జునా! నీయొనర్చిన గొప్ప ప్రతిన దైవవశముగా నిర్వహింపఁబడినది. దైవానుగ్రహముననే పాపుఁడగు వృద్ధక్షత్త్రుఁడు పుత్త్రునితోఁగూడఁ జంపఁబడియెను. ఈసమరమున ధార్తరాష్ట్రసైన్యమును జేరిన దేవసైన్యమేని నీచేఁ జెడక తప్పదు. ఇందు సందియ మొంద వలసినది లేదు. ఓపురుషవ్యాఘ్రా! లోకమం దెందుఁజూచినను నిట్టిబలముతోఁ బోరాడువాని నెవ్వనిని గానలేదు. నీతోసమానులును, నీకంటె నధికులును, మహాప్రభావులునగు పృథివీపతు లనేకు లాసుయోధను శాసనముంబట్టి కలిసి, నిన్నుఁజేరియు రణకుపితుఁడవగుటఁ జూచి మార్కొనలేరైరిగాదే! నీబలపరాక్రమములు రుద్రేంద్రయములపరాక్రమాదులకు సరియైనవి. యుద్ధమున నిట్లు పరాక్రమించుట కెవ్వనికిని వశముగాదు. అట్టికృత్యమును నీవొకఁడవే యొనర్చితివి. ఇటులే దురాత్ముఁడగు కర్ణునిఁగూడ వానిపరివారముతోఁ జంపితివేని, విజితారివి, హతవైరివినగు నిన్ను మఱియు నుత్సహింపఁజేయువాఁడను.” అని పలికెను.

అది విని యర్జునుఁ డాతనితో ‘ఓమాధవా! దేవతలకును దరింపరాని నాయీప్రతిజ్ఞ నీయనుగ్రహముచే నెఱవేర్పఁబడినది. ఓకేశవా ! మాకు నీవు నాథుఁడవైయుండ వారినెల్ల జయించుటలో నాశ్చర్యమేమున్నది ? నీయనుగ్రహముచే మాయుధిష్ఠిరుఁడు పుడమినెల్లఁ

బడయంగలఁడు. ఓవార్ష్ణేయా! ఇదియెల్ల నీప్రభావమే. ఈవిజయమెల్ల నీదియే. ఓమధుసూదనా! మేము నీవు పంపఁగాఁ బనిచేయువారమును నీవు పెంపఁదగినవారమునై యున్నారము.' అని పలుక విని యావాసుదేవుఁడు నగుచు మెల్లఁగా గుఱ్ఱములను నడుపుచు, ఘోరమైయున్న యాగొప్పయుద్ధరంగమును జూపుచు నిట్లుపార్థునితోఁ బలికెను.

'ఓయర్జునా! శూరులగు పార్థివు లెందఱో గొప్పయశమును, యుద్ధజయమును గోరుచు, నిటులు తావకశరప్రహారప్రహతులై పుడమిఁ బడియున్నవారు. అయ్యో! వీరు తమశస్త్రములు నాభరణములును జెదరిపడ, హతరథగజాశ్వులై కవచములు చినుఁగ వివశులై పడియుండిరి. ఇందుఁ గొందఱు గతప్రాణులును, గొందఱు సప్రాణులు నైయుండి తేజ మింకను వెలయుచుండుటను, గతప్రాణులునై తమ సజీవులువలెఁ గానవచ్చుచున్నవారు. ఓయీ! సువర్ణపుంఖములగు వీరిశరములును, వివిధములగుశస్త్రములును, నాయుధములును, వాహనములును నెటు లిప్పుడమిఁ బడియుండెనో చూచితే! ఆహా! ఇమ్మణిహారములతోఁ గవచములును, గుండలములతోఁ దలలును, దలపాగలును, గిరీటములును, మాలికలును, శిరోభూషణములును, గంధభూషణములును, గేయూరములును, నింకను జిత్రములగు నాభరణములును నీ భారతభూమి నలంకరించియున్నవి. మఱియు నొకచో రథముల యనుకర్షములు, నుపాసంగములు, పతాకలు, ధ్వజములు, కూర్చుండుచోటులు, రథదండములు, చక్రములు, చిత్రములగు నిరుసులు, పూఁజులు, యోక్త్రములును నెటులు పడియున్నవో చూడుము. అటులే భూషములును, వింజ్లను, గోలలును నందంందుఁబడియున్నవి. మఱియు నేన్గులపైఁ బఱచెడిపఱుపులును, బరిఘములు, నంకుశములు, గదాముసలముద్గరాదులును, సువర్ణవికృతములగు మునికోలలును బడియున్నవి. ఆహా! ఇటుచూచితే? భిందిపాల, శక్తి, శూల, పరశ్వధ, ప్రాస, తోమర, యష్టికుంత, శతఘ్ని, శుంఠీ, పరశు ఖడ్గాదియుద్ధసామగ్రు లెట్లు చెదరియున్నవో, మఱియు నేన్గులఘంటలు, నాభరణములు, పుష్పమాలికలు, విలువగలవస్త్రములును నందందుఁ జెదరియుండుట నీయుద్ధభూమిగ్రహములతోఁగూడిన శరత్కాలపునాకసమ్మువలె వెలయుచున్నది. బృథివీక్షై

పోరాడి పృథివీపతులు పృథివినే హతులై ప్రియకాంతనువలెఁ బృథివి నాలింగనముచేసికొని నిద్రించియున్నవారు. ఐరావతతుల్యములై కొండలువలెఁ గూలి రక్తములు స్రవింప గుహాముఖములనుండి గౌరికాంబు ప్రవాహములను గార్చుపర్వతములునా? నీయేన్గు లెట్లు బాణహతములై మలమూత్రములను విడుచుచున్నవో చూడుము. అటులే సువర్ణభాండభూషితములై పడియున్న గుఱ్ఱములను, గంధర్వనగరాకారములగు రథములను గనుగొనుము. మఱికొన్ని రథములు, ధ్వజములు, పతాకలు, చక్రములు, నక్షములు దెగి సారథులు హతులుగాఁ గూబరయుగాదులు ఖండితములై పుడమిఁబడి విమానములునా? నెట్లుచూపట్టుచున్నవో చూడుము. విండ్లును, గత్తులునుబట్టి పోరాడి హతులై మేనుల రక్తములు స్రవింప వందలకొలఁదిని, వేలకొలఁదిని బడియున్న పదాతులను జూచితే? మఱియు నీబాణములచే మేనులు వ్రయ్యలుగాఁబడి ధూళిఁబ్రుంగిన కేశపాశములతో యోధు లెటులు పడియున్నవారో గాంచితే ? ఓపార్థా! ఈరణాంగణము పడియున్న గజరథాశ్వములచే సంకులమై, రక్తవసామాంసములచే నిండి, కుక్కలకును, నక్కలకును, పిశాచాదులకును సంతోషకరమై, చూచుట కసహ్యమై యెట్లున్నదో చూడుము. మున్నా మహాసంగ్రామమున దైత్యదానవులఁజంపిన యాయింద్రునందును, నీయందును గీర్తివర్ధనమగు నిట్టి గొప్పకృత్యము చూపట్టెను.' అని క్రమముగా నన్నియు దెల్పుచునే యాజనార్దనుఁడు ధర్మజునిసమీపించి జయద్రథునివధము నాతని కెఱిఁగించెను. ఓరాజా! ఆవాసుదేవుఁ డిటులా యుద్ధభూమిని జూపుచుఁ దనవారితోఁ గూడి, శంఖనాద మొనర్చెను.'' అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

### సైంధవవధమునకు యుధిష్ఠిరుఁడు సంతసించుట

''ఓరాజా! పిదప నావాసుదేవుఁ డాయుధిష్ఠిరు, నట్లు సమీపించి సంతుష్టాంతరంగుఁడై నమస్కరించి 'ఓరాజేంద్రా! దైవానుగ్రహమున మనపార్థుఁ డాసైంధవునిఁ జంపుటచే హతశత్రుఁడవై వర్ధిల్లితివి. నేఁటికి దైవానుగ్రహముచే నీతమ్ముఁడు తనప్రతిజ్ఞ నెఱవేర్చికొనియెను.' అని పలుకుచుండఁగనే యుధిష్ఠిరుఁడు హృష్టమానసుఁడై రథ

మునుండి యెగిరి, సంతోషబాష్పములు మేనెల్లఁ దడుప నవ్వాసుదేవార్జునులఁ గౌఁగిలించికొని, యానందబాష్పపూరితమగు మొగము దుడిచికొనుచు, వారితో 'ఆహా! దైవానుగ్రహముచేఁ బ్రతిన నెఱవేర్చికొని వచ్చిన మిమ్ముఁ గాంచఁగల్గితిని. పురుషాధముఁడును, బాపుఁడు నగు సైంధవుఁడు హతుఁడయ్యెనుగదా! ఓకృష్ణార్జునులారా! దైవకృపచే నాకిపుడు గొప్పసంతోషము సంపాదించితిరి. భగవాను ననుగ్రహము ననే వైరులెల్ల శోకపారావారమున మున్గిరి. ఓజగన్నాథా! నీవు నాథుఁడుగానున్నవారి కసాధ్యకార్యము లెవ్వియుండును? ఓగోవిందా! నీయనుగ్రహముచే ముల్లోకములందును మాకసాధ్యము లేదు. మేము శత్రులనోడింతుము. నీవు మాపై దయగల్గియుండుటను, నీయనుగ్రహముచే మున్నాయింద్రుఁడు దానవులనువలె మే మీశత్రువులను సాధించి, పుడమిఁబడయుటయేగాదు. ముల్లోకములను జయింపఁగల్గుదుము. ఓవార్ష్ణేయా! నీవెవ్వరియెడ దయగల్గియుందువో వారికి సంగ్రామమునఁ బరాజయముగాని, పాపముగాని సంభవింపదు. నిశ్చయము. త్రిదశులకును నాథుఁడవగు నీయనుగ్రహముచే నాయింద్రుఁడును రణరంగమునఁ,ద్రిలోకవిజయము నొందెను. ఓత్రిదశేశ్వరా! నీయనుగ్రహముననేగదా దేవత లమరత్వమొంది, యక్షయలోకముల ననుభవించుచున్నవారు. నీయనుగ్రహమువలనఁ గల్గినపరాక్రమముచేఁ గదా ఇంద్రుఁడు, వేలకొలఁదిదానవసమూహములను జంపి యింద్రత్వము నొందెను. ఓహృషీకేశా! నీకృపచేఁగదా స్థావరజంగమాత్మకమగు జగమెల్లఁ దనస్థానమున నిలిచి, నిజకృత్యములను జేయఁగల్గుచున్నది. ఓదేవా! ఈజగమెల్లమున్నేకార్ణవమై చీకటితో నిండియుండి నీయనుగ్రహముచేఁ బరమాత్ముఁడును, నవ్యయుఁడునగు సర్వలోకస్రష్టను బడయఁగల్గెను. పరాత్పరుఁడును, బురాణపూరుషుఁడును, సనాతనుఁడును, దేవదేవుఁడునగు నిన్ను హృషీకేశు నెవ్వరుఁగాంతురో వారి కెట్టిమోహమును గలుగదు. ఆద్యంతరహితుఁడవును, దేవదేవుఁడగు లోకకర్తవు, నవ్యయుఁడవు నగు ని న్నెవ్వ రాశ్రయింతురో వా రెన్నఁడును మోహమునందరు. ఓహృషీకేశా! నీకెవ్వరు భక్తులై యుందురో వా రెట్టికష్టములనేని గడచుచున్నారు. ఎయ్యది, పరమును

బురాణమును బరాత్పరము నై యున్నదో యట్టిదాని నొందువాని కుత్తమైశ్వర్యము విధింపఁబడుచున్నది. వేదములునాల్గు నెవ్వని స్తుతించునో? వేదములం దెవ్వఁడు కీర్తింపఁబడుచుండునో యట్టిమహాత్ముని శరణమొంది యుత్తమైశ్వర్య మనుభవించెదను. ఓపరమేశా! పరేశా! తిర్యగీశా! నరేశ్వరా! సర్వేశ్వరా! ఈశ్వరేశ్వరా! పురుషోత్తమా! నీకు నమస్కారము. ఓఈశా! మాధవా! ప్రభూ! నీవు వర్ధిల్లుము. సకలసృష్టిలయకారణా! సర్వాత్మా! పృథునేత్రా! ధనంజయసహాయుఁడవును, ధనంజయమిత్రుఁడవును, ధనంజయరక్షకుఁడవునునగు నిన్ను శరణమొందినవాఁడు సుఖముగా వర్ధిల్లుచున్నాఁడు.' అని పలికెను.

అదివిని మహాత్ములగు నక్కేశవార్జునులును, సంతుష్టాంతరంగులై యాతనితో 'ఓరాజా! ఆపాపుఁడగు సైంధవుఁడు నీకోపాగ్నిచే దగ్ధుఁడైనవాఁడు. ఓప్రభూ! అపారమగుధార్తరాష్ట్రసైన్యమెల్లఁ జెదరిపోయెను. కొందఱు చంపఁబడిరి, చంపఁబడుచున్నారు. ఇంకను జావఁగలరు. ఓశత్రుసూదనా! ఇక్కౌరవులెల్ల నీక్రోధముచేఁగాదె హతులైరి. చూడ్కిచేఁ జంపునట్టినిన్నుఁ గుపితునిఁగా నొనర్చిన యాసుయోధనుఁడు, తనమిత్రబంధుపరివారముతో యుద్ధమునఁ బ్రాణములను విడువక తప్పదు. ముందుగా నీక్రోధముచే హతుఁడైనవాఁడౌట నా భీష్ముఁడు, దేవతలకును సాధ్యపడనివాఁడయ్యు, శరతల్పమునఁబడి యున్నవాఁడు. ఓరిపుసూదనా! నీతో వైరమూని వారికి సంగ్రామమునఁ బరాజయమేగాక, మరణమునైతము సంభవింపకమానదు. ఓపరంతపా! నీవెవ్వనిపైఁ గోపింతువో వానిరాజ్యము, ప్రాణములు, ప్రియులగు మిత్రులును, వివిధసౌఖ్యములును నచిరకాలమున నశింపక తప్పదు. రాజధర్మపరుఁడవగు నీవు నిత్యము నాకౌరవులపైఁ గుపితుఁడవై యుంట, వారు సపుత్రపశుబాంధవముగా నశించిరనియే తలంపవచ్చును.' అని పలుకుచుండునంతలో భీముఁడును సాత్యకియువచ్చి యాయుధిష్ఠిరునకు నమస్కరించి, పాంచాల్యులతోఁగూడి పుడమి నిలువఁబడియుండిరి. రక్తసిక్తాంగులై చేతులుమొగిడ్చి సమీపించియున్న యవ్వీరుల నారసి, యతఁ డెంతయు సంతసించి, మఱియు వారితో 'శూరులారా! మీరు కౌరవసైన్యసాగరమునుండి విడివడివచ్చుట, దైవానుగ్రహము యని తలంతును. ద్రోణుఁడనెడి పెద్దమొసలిగల, కృతవర్మఁ డనెడిసముద్రము

నుండి వెడలివచ్చుట దుర్ఘటము. దైవకృపవలన మనమెల్లపార్థివులను జయించితిమి. దైవానుగ్రహముచే మీరు విజయముగల్గివచ్చుటను గాంచితిని. ఆహా! ద్రోణకృతవర్మలును, కర్ణుఁడును బరాజితులగుట దైవానుగ్రహముగాక వేఱొండేమిగలదు. శల్యుఁడును మీకుఁ బరాఙ్ముఖుఁడై పోయెనుగదా? ఆహా! ఆభగవాను ననుగ్రహముచే మీరు సంగ్రామమునుండి సేమముగా మఱలివచ్చితిరి. మీరు యుద్ధవిశారదులని తలంచుచున్నాఁడను. అదియుఁగాక మీరు నాయెడ గౌరవముంచి నామాట చెల్లించి, వెడలి సైన్యసాగరసము త్తీర్ణులై వచ్చుట దైవానుగ్రహముచేననియె తలంతును. సమరోత్సాహులును, సంగ్రామస్థిరులును, వీరులును, నాకుఁ బ్రాణసములునగు మిమ్ము దైవానుగ్రహముచేఁ జూడఁగల్గితిని.' అని పలుకుచు నాధర్మజుఁ డాభీమసాత్యకులను గౌఁగిలించికొని సంతోషబాష్పములను విడువసాగెను. అంత వారిసైన్యమంతయు సంతోషపూరితమైయుండెను. మఱియు బాండవులు యుద్ధాభిలాషపూరితులైయుండిరి." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

### సైంధవునిమృతికి సుయోధనుఁడు చింతించుట

"ఓరాజా! సైంధవుఁ డటులు హతుఁడగుటయు, నీపుత్త్రుఁడగు సుయోధనుఁడు, బాష్పపూరితముఖుఁడును, దీనుఁడు నగుచు వైరిజయమునెడ నుత్సాహముదొలఁగఁ జింతాక్రాంతుఁడై వేడినిట్టూర్పు లిడుచు, కోఱలుపోయినసర్పమువలె నిస్సారుఁడై, తాను లోకమునకెల్లఁ దప్పుచేసినవాఁడగుట నెంతయుఁ బరితపించెను. ఓరాజా! మఱియు నాసుయోధనుఁడు, భీమార్జునసాత్యకులచే నశించి ఘోరమై పడియున్న తనసైన్యమును గాంచి, దీనుఁడై వెలవెలపోవుచుఁ గనులనీరేఱై స్రవింప నర్జునునకు సాటియగుయోధుఁ డిప్పుడమిని లేఁడని తలంచెను. ఓమారిషా! మఱియు నతఁ డాద్రోణుఁడుగాని, కర్ణుఁడుగాని, కృపాశ్వత్థామలుగాని, కుపితుఁడైనపార్థుని యెదుటనిలువఁ జాలరనియుఁ, దనమహారథులనెల్ల నర్జునుఁడు జయించియే సైంధవునిఁ జంపుట, నాతనివారించువారు లేరనియుఁ, దలంచి యిట్లు చింతించెను.

'అయ్యో! ఎన్నివిధములఁ జూచినను, నా యీ గొప్పసైన్యమప్పాండవులపాలఁబడియెను. దీనిని గాపాడ నా పురందరుఁడే నోపఁడు. నేనెవ్వని నాధారునిఁగఁ జేసికొని సమరమునకు సన్నద్ధుఁడనైతినో, యట్టి రాధేయుఁడోడెను. సైంధవుఁడు చంపఁబడియెను. మఱియు నెవ్వనిపరాక్రమము నాశ్రయించి, సంధికై యాచింపవచ్చిన యా శ్రీకృష్ణుని దృణముగాఁదలంచి పొమ్మంటినో, యట్టికర్ణుఁడే యీ యుద్ధమునఁ బరాజితుఁడయ్యెను.' అని చింతాక్రాంతుఁడై సర్వలోకాపరాధియగు నీకొమరుఁడు ద్రోణునిఁ గాంచుటకై వెడలి సమీపించి, కౌరవులవినాశమును, వైరులవిజయమును నాతనికి క్లుప్తీకరించెను.

'ఓయాచార్యా! చూచితివా! మాకుఁ బితామహుఁడును, శూరుఁడునగు భీష్ముని ముందిడికొని, ధారుణిపతులెల్లఁ బోరాడిరి. వానిని బడఁద్రోసి శిఖండి పూర్ణమానసుఁడై సకలపాంచాలురతోఁగూడి సైన్యాగ్రమున నున్నవాఁడు. మఱియు దుర్జయుఁడై నీకు శిష్యుఁడగు సవ్యసాచి, యేడక్షౌహిణులఁగొట్టి సైంధవుని సమయించెను. నావిజయమునుగోరి, నాకుపకారులై, యమమందిరమొందిన నామిత్రులబుణ మెటులు తీర్పఁగలను? మఱియు నెవ్వరు నారాజ్యప్రాప్తికై పాటుపడిరో యట్టివసుధాధిపులెల్లఁ, దమవసుధను నైశ్వర్యమును విడిచికొని వసుధపైఁబడిరి. ఇట్లు మిత్రక్షయమొనర్చి దుష్టుఁడనైన నే నశ్వమేధసహస్రమొనర్చియు నిష్పాపముఁ బాపికొనఁజాలను. లుబ్ధుఁడనై ధర్మహానికిఁ గారణమనై పాపచిత్తుఁడనగు నాకుఁగా? జిగీషులై శ్రమపడి నామిత్రులెల్ల యమమందిరమునొందిరి. పాపవృత్తుఁడను, మిత్రద్రోహిని, దుర్మతినగు నాకిప్పుడమి నేను బ్రవేశించుట కవకాశ మెట్లొసంగును? అప్పితామహుఁడు రాజులనడుమ రుధిరరక్తాంగుఁడై యేమిపలుకునో? సాత్యకిచే హతుఁడైన జలసంధునిఁ గాంచుము. అతఁడు నాకైగదా! శూరుఁడై పోరాడి ప్రాణములను బరిత్యజించెను. అటులే కాంభోజుఁడును, నలంబుసుఁడును, నింకను గలమిత్రులనేకులును, నాకై తమజీవితములను నర్థములను నొసంగి, పరాఙ్ముఖులుగాక శూరులై పోరాడి హతులైరి. నావైరులనోడించుటకై తమశక్తికొలఁదిని బ్రయత్నించియు, మరణించిన నామిత్రులబుణము నీగుటకై యిపుడే వెడలి యమునానదీతీరమున వారికి జలతర్పణము గావించెదను. ఓసకలధనుర్ధరోత్తమా! నా

యిష్టాపూర్తముతోడను, బరాక్రమముతోడను, నాపుత్రులతోడను, నొట్టుపెట్టికొని ప్రతిజ్ఞ చేయుచున్నాఁడను. నే నాపాండవులతోఁ బాంచాలురనెల్ల రణరంగమునఁ జంపి శాంతివహించెదను. లేదా! వారిచేఁ జచ్చి పరలోకమందెదను. నాకై సంగ్రామమున, నప్పార్థునితోఁ బోరాడి హతులైనపురుషవరేణ్యులగు నామిత్రులకడకు, నేఁబోయె దను. నాకిఁక సహాయులై యెవ్వరు నన్నుఁ బురస్కరించుకొనరు. ఇఁకఁ బాండవులను దలంచినట్లు మమ్ముఁ దలంపరు. నీకర్జునుఁడు శిష్యుఁడగుట నుపేక్షించుచున్న వాఁడవు. అటులగుటనే నాజయముగోరువా రెల్లరును నిహతు లగుచున్నవారు. ఇపుడు మాజయముగోరువాఁ డొక్కకర్ణుఁడే యగపడుచున్నవాఁడు. మందబుద్ధియగు నెవ్వఁడు, యథార్థముగాఁ దనకు మిత్రుఁడెవ్వఁడో తెలియక, మిత్రు లొనర్పఁదగుకార్యమునకు, వానినిబనుచునో, వాఁడు నిజకార్యమును జెఱుచుకొనువాఁడగు చున్నాఁడుగదా! అవివేకముచే లుబ్ధుఁడనై వంకరబుద్ధిచే ధనము నభి లషించి పాపుఁడనైన నాకార్యమును, మిత్రులచే నటులే చేయఁబడి నది. అయ్యో! సైంధవుఁడును, భూరిశ్రవుఁడును, నభీషాహులును, సూరసేనులును, శిబులును, ధవసాతులును హతులయ్యెరిగదా! వారిపు డెందున్నవారో యందులకేగెదను. వారాకిరీటితో నాకుఁగాఁ బోరాడి యేగదా హతులైరి. వారిని విడిచిన నా కీజీవితముతో నేమిపని? పాండవుల కాచార్యుఁడవగు నీవు మమ్మనుగ్రహింపుము, అని పలికె" నని సంజయుఁడు తెలుప విని ధృతరాష్ట్రుఁ డిట్లనియె.

## ద్రోణుఁడు సుయోధను నూఱడించుట

"ఓసంజయా! ఆసమరమున సవ్యసాచిచే, సైంధవుఁడు సమ యఁగా, నటులేభూరిశ్రవుఁడును హతుఁడగుడు నేమయ్యెను? మఱియు నక్కురుసభలో సుయోధనుఁడు ద్రోణు నటులువలుక, నాభారద్వాజుఁ డేమి ప్రత్యుత్తరమిచ్చెనో తెలుపుము.

అది విని సంజయుఁ డాతనితో 'ఓభారతా! అటు లాభూరిశ్రవ సైంధవులు హతులయినతోడనే మనసైన్యములలో గొప్పకలఁతగలి గెను. దేనిచే వందలకొలందివీరులు హతులగుచున్నారో యట్టి నీతన యునిదురాలోచనము వారెల్లనగౌరవముగాఁ జూచిరి. పిదప ద్రోణుఁడు

నీతనయుఁ డాడినమాటలు విని, వికలచిత్తుఁడై రెండుగడియ లేదియో చింతించి యెంతయు నార్తుఁడై యిట్లు పలికెను.

ఓదుర్యోధనా! వాగ్బాణములచే నీవు నన్నిటులేల నొప్పించెదు? సమరమునఁ బార్థుఁ డజేయుఁడని నేనపుడు తెలిపినవచనము సత్యమగుట నిపుడు తెలిసెనుగదా! దేవదానవులకును జయింపరాక, యవధ్యుఁడగు భీష్ము నటులు పార్థరక్షితుఁడగుచు శిఖండి పడఁద్రోసిన నాఁడే యీకురు సైన్యము మఱి నిలువదని తెలిసికొంటిని. ముల్లోకములందునుగల వారిలో నెవ్వనినోరతమునిఁగాఁ దలంచితిమో యట్టివీరుఁడే పడినపు డింకఁ దక్కినవారు మిగులుదురనియెట్లూహింపఁగల్గుదుము. ఓనాయనా! నాఁడు కురుసభలో శకునియాడినవి పాచికలుగావు. అవి శత్రులకు సాధనములగునట్టి తీవ్రబాణములు. అవియే వారికి జయముగూర్చ మనలఁగొట్టుచున్నవి. వానిస్థితియట్టిదని విదురుఁడు తెలిపినను నీవెఱుంగ వైతివి. అపుడు మహాత్ముఁడగు విదురుఁడు మొఱవెట్టుచు నీక్షేమము నకుఁగా నెన్నియేని మంచిమాటలను దెలుపఁగా నీవు వింటివా? ఆవినకుండుటయే ఘోరమగువినాశమై పరిణమించెను. ఓసుయోధనా! నీ వాతనివచనముల నవమానించుటచే నిట్టికష్టము గల్గెను. ఎవ్వఁ డాప్తులగుసహృదయుల పథ్యవచనమును దిరస్కరించి నిజమతమే మంచిదని యెంచునో, మూఢుఁ డగువాఁ డచిరకాలమున శోకింపఁదగువాఁ డగుచున్నాఁడు. ఓగాంధారీపుత్రా! సత్కులప్రసూతయై సకలధర్మములను బాటించుద్రౌపది, రజస్వలయై ముట్టుకొనరాకుండుటయు దలంపక మేమెల్లఁగాంచుచుండఁగా నామె నటులు సభలోని కీడ్చి తెచ్చితివిగాదే! దాని యధర్మఫలమే యిట్లు గొప్పగాఁ బరిణమించెను. పరలోకమునఁ బాపఫలమే సంభవింపనిచో నామె నింకేమి చేసియుండువోగదా! నీ వాకపటద్యూతమునఁ బాండవులనోడించి లేఁడిచర్మములఁ గట్టించి యరణ్యమునకు వారి నంపితివిగాదే! అయ్యో! పుత్రులువలె నెల్లపుడు వారు మెలఁగుచు ధర్మపరాయణులై యుండ నట్టివారిని, నాయట్టి నీచ బ్రాహ్మణుఁడుగాక వేఱొకఁ డెవ్వఁడు హింసింప నెంచును. ఓయీ! నీవు శకునితోఁగూడి నాఁడాధృతరాష్ట్రునిసమ్మతిపైఁ గురుసభకుఁ బాండవుల కోపమును లాగికొనివచ్చితివి. నీతెచ్చినకోపముతో దుశ్శాసనుఁడు స్నేహముచేయఁ గర్ణుఁడు దానిని వృద్ధిపొందించెను. మఱియు నీవును

విదురునిమాట లక్ష్యమునేయక మఱిమఱియు దానిపరిచయ మెక్కువ చేసికొంటివి. ఓయీ! మీరెల్ల నటులు యత్నించి పరాజితులయ్యు సైంధవునివిడిచి యర్జునుఁ జుట్టుకొనసేటికి? మీరయెల్లరనడుమనుండఁగా వాఁడు హతుఁడగుటెట్లు? ఓకౌరవ్యా! నీవును గర్ణుఁడును గృపాశ్వత్థామలును శల్యుఁడును జీవించియుంటిరిగదా! ఆసైంధవుఁ డెట్లు మడిసెను? ఆసైంధవునిరక్షించుటకై తేజోనిధులగుమీరెల్ల యుద్ధము చేయుచుండఁగా మీనడుమనున్నయతఁడు హతుఁడగుట వింతగానున్నదే! సైంధవుఁ డప్పార్థునకు జడిసి తన్ను రక్షించుకొనుటలో నన్నుమాత్రమే నమ్మియుండలేదే! విశేషించి నిన్నును నమ్మియున్నవాఁడు. అట్టిసైంధవుఁడు మీరక్షణమొందలేక పార్థునిపాలయినతోడనే నాజీవితస్థాన మెట్లగునో యని నాకేమియుఁ దోపదయ్యెను. ఓరాజా! నేనపుడు శిఖండితోఁగూడఁ బాంచాలురనుగొట్టక, యాధృష్టద్యుమ్నుహంతకుఁడేమిచేయునో యని చూచుచు నూరకుంటిని. దానికే పరితపించుచున్న నన్ను నీవిట్టేల వాగ్బాణములచే నొప్పింతువు? సైంధవునిరక్షింపఁజాలక నన్ను నిందించుట మేలా? సత్యసంధుఁడై మనకుఁ గ్లేశముగలుగకుండఁ బోరాడుభీష్ముని సువర్ణధ్వజము కానరాకున్నపుడు జయముగల్గునని యెట్లూహించుచున్నాఁడవు? మహారథులనడుమనున్న సైంధవుఁడును జంపఁబడియెఁగదా! అటులే భూరిశ్రవుఁడును హతుఁడయ్యెను. ఇఁకఁ దక్కినవారు మిగులుదురని యెట్లు తలంచుచున్నాఁడవు. ఓపార్థివా! కృపుఁడు జీవించియుండియు, దుర్జయుఁడై యాసైంధవునిమార్గమునకడ్డపడకుండుట కాతనిఁ బూజింపవలయును. ఇంద్రాది దేవతలకును సమరమున జయింపరాక దుష్కరకర్మమొనర్చు నాభీష్ముఁడు, నీతమ్ముఁడు దుశ్శాసనుఁడు చూచుచుండఁగా హతుఁడగుట యెపుడు చూచితినో యపుడే నీకుఁ బుడమిదక్కదని తలంచితిని. ఇపుడు నాపై నీపాండవ సృంజయపాంచాలసైన్యములు దలపడుచున్నవి. ఓరాజా! ఈసమరమున సకలపాంచాలురను జంపక, యీ నాకవచము విప్పను. నీకు హితము గావించెదను. ఓరాజా! నాకొమరుఁడగు నశ్వత్థామతో నీయాహావమున సోమకులను విడువక చంపవలయునని తెలుపుము. మఱియు నహింసాదమసత్యార్జవములను విడువక, ధర్మార్థకామకుశలుఁడై వానిని బీడింపక, మఱిమఱియు ధర్మప్రధానకార్యములనే వాఁడొనరించునట్లు

నాశాసనముగా నెఱిఁగింపుము. ఇంకను బ్రాహ్మణులను దక్షిణలచేఁ దృప్తిఁబొందింపవలెననియు, వారెంతయుఁ బూజనీయులగుట వారి కెన్నఁడును నపకార మొనర్పరాదనియు, వారగ్నిజ్వాలలఁబోలిన వారనియు నావచనముగాఁ దెలుపుము. నీవు నన్నిటులు వాగ్బాణములఁ బీడించుటచే, నే నిదె గొప్పయుద్ధమునకు సన్నద్ధుఁడనై శత్రుసైన్యములఁ బ్రవేశించుచున్నవాఁడను. ఓసుయోధనా! నీవును సమర్థుఁడవగుదేని మనసైన్యమును నిలువరింపుము. కురుసృంజయులు సంరబ్ధులైరేని రాత్రియందును బోరాడఁగలరు."

ఓరాజా! ఇటు లా ద్రోణుఁడు పలికి, నక్షత్రములతేజము నాదిత్యుఁడువలె క్షత్రియతేజముల నాకర్షించుచుఁ బాండవసృంజయులపైఁ బయలువెడలె నని తెలిపి, మఱియు నాసంజయుఁ డి ట్లనియె.

కురుపాండవులు మఱియు యుద్ధ మారంభించుట

ఓరాజా! పిమ్మట మనసుయోధనుఁ డాద్రోణునివచనములచే నుత్సాహము తెచ్చికొని కోపావేశమడరఁ దానును యుద్ధమున బుద్ధినిడి కర్ణునితో "ఓమిత్రమా! చూచితివిగదా! కృష్ణసహాయుఁడగుపార్థుఁడు దేవతలకును భేదింపరాని యాచార్యకృతమగు వ్యూహమును భేదించి, నీవును మహాత్ముఁడగు ద్రోణుఁడును విక్రమించుచుండఁగనే, మఱియు యోధులెల్లఁ గాంచుచుండఁగనే సైంధవునిఁ జంపెను. ఓరాధేయా! పుడమిఁగల యుత్తమక్షత్రియులనెల్ల నాయర్జునుఁ డొకఁడే సింగము ద్రుక్కిడి మృగములనువలె హింసించుట నీవు చూచితివిగాదే! నేనును మహాత్ముఁడగుద్రోణుఁడునుజూచుచుండఁగనే యప్పార్థుఁడు నాసైన్యము నల్పావశిష్టముగా నొనర్చెను. ద్రోణుఁడు నివారించుచున్నను నప్పార్థుఁ డాసైంధవునిఁ జంపి తనప్రతిజ్ఞ నెఱవేర్చుకొనఁగల్గునా? ఓవీరాగ్రణీ! ఆభారద్వాజుఁడు ప్రయత్నముగల్గి యంగీకరింపకుండెనేని, దుర్భేద్యమగునావ్యూహము నాయర్జునుఁ డెట్లు భేదింపగల్గును? మహాత్ముఁడగు నాద్రోణునకుఁ బార్థుఁ డెంతయును బ్రియతముఁడు. అటులగుట నతఁడు యుద్ధమొనర్పకయే పార్థునకుఁ ద్రోవయొసంగెను. ఓయీ! చూచితే? పరంతపుఁడగుద్రోణుఁ డాసైంధవునకుఁ దొలుత నభయమొసఁగియు, నప్పార్థున కెట్లు ద్వారమొసంగెనో? ఇది నాలోపమే. ఆసైంధవుఁ

డింటికిఁబోవుదు నన్నపుడు వానికి సెలవొసఁగియుందు నేని యీజనక్షయ
మును గాకుండెడిది. ఆజయద్రథుఁడు జీవితాభిలాషియై యింటికిఁ
బోవుచు దుర్జనుఁడనగు నాచే నిరుద్ధుఁడై ద్రోణునివలన నభయమొంది
నిలిచెను. మఱియు నేఁడు దురాత్ములగు మేమెల్లఁ గాంచుచుండఁగా
భీమసేనునిచే, జిత్రసేనాదులగు నాసోదరులు నశించిరి." అని పలికెను.

అవి విని యారాధేయుఁ డాసుయోధనుతో "ఓమిత్రమా!
నీ వా యాచార్యుని నిందింపకుము. ఆబ్రాహ్మణుఁడు శక్తికొలఁదిగా
యుద్ధముచేయుచునే యున్నవాఁడు. అతఁడు తనబలోత్సాహములకుఁ
గొఱఁతవడనీక, ప్రాణములపై నాశవిడిచి పనిచేయకపోలేదు. శ్వేతవా
హనుఁ డాతని నతిక్రమించిపోవుటలోఁ గొంచెమేని లోప మాచార్యు
నెడ లేదు. అప్పార్థుఁడు రణకుశలుఁడును, దక్షుఁడును, శూరుఁడును,
యువకుఁడును, కృతాస్త్రుఁడును, నవక్రవిక్రముఁడు నైనవాఁడు. కపి
ధ్వజముగల్గి దివ్యాస్త్రయుక్తమై, కృష్ణపరిగృహీతాశ్వమగు రథము నధి
రోహించి, యభేద్యకవచుఁడై, దివ్యమై వినాశరహితమగు గాండీవము
బూని, బాహుబలదర్పితుఁడై తీవ్రబాణములను వర్షించుచు, ద్రోణు
నెదుర్కొనుట యప్పార్థునకుఁ దగినదియే. ఆచార్యుఁడు ముదుసలియు,
శీఘ్రయానమున సామర్థ్యములేనివాఁడు నై యున్నవాఁడు. మఱియు
బాహువ్యాయామక్రియయందును నాతనికి శక్తిచాలదు. అటులగు
టచేఁ గృష్ణసారథియై యా శ్వేతవాహనుఁ డాతనిఁ గడచి వెడలెను.
కావున నాద్రోణునం దిది యొకతప్పుగా నేనూహింపను. అస్త్రవేత్త
యయ్యు నాద్రోణున కప్పాండవు లజేయులని తలంతును. అటు
లగుట నయ్యరునుఁ డాద్రోణు నతిక్రమించి వెడలిపోయెను.
దైవాదిష్టమగున దెన్నఁడును వేఱొకరీతిగా జరుగదని తలంచెదను.
ఓసుయోధనా! మేమెల్ల యథాశక్తిగాఁ బోరాడుచుండఁగనే యా
సైంధవుఁడు యుద్ధమున హతుఁడగుటఁ జూడఁగా దైవబలమే బల
మనక తప్పదు. రణరంగమున నీతోఁగూడి మేమెల్ల నెంతయేని
యత్నమొనర్చుచుండఁగనే మనపౌరుషమునెల్ల నడంచి, మనల నా
దైవము వెనుకఁబెట్టెను గాదే? మన మొకనిమేషమేని యుపేక్షింపక,
యర్జును నవమానబుద్ధితోఁగాంచి విక్రమించితిమిగాదే? దైవానుకూల్య
ములేనిపురుషుఁడు పనియొనర్చుటయేగాని, వాని కది ఫలింపజాలదు.

ప్రయత్నముగలమానవుఁడు తాను జేయవలసినపని చేయుటయేగాని, దానిఫలము దైవాయత్తమైయుండును. ఓభారతా! పాండవులు విష ప్రయోగముచే వంచింపఁబడిరి. లాక్షాగృహమున దహింపఁబడిరి. ద్యూతమునఁ బరాజితులైరి. రాజనీతి నాశ్రయించి యడవులకుఁ బంపఁ బడిరి. మనము యత్నముచే నొనర్చిన యదియెల్ల దైవముచే విఫల మయ్యెను. నీవు దైవమును నిరర్థకముగా నెంచి, పౌరుషము నాశ్రయించి యుద్ధముచేయుము. నీవు ప్రయత్నించుచుండఁగనే దైవము, వారిమార్గమునఁబోవును. ఓకురూద్వహా! అప్పాండవులు బుద్ధిపూర్వకముగా నొనర్చినసుకృతమును లేదు. బుద్ధిహీనుఁడవై నీవొనర్చిన చెడుపనియును లేదు. ఎల్లవారిసుకృతదుష్కృతములకును దైవమే నిదానము. అసాధారణకర్మముగలదైవము నిద్రించుచున్నవారియెడను సైతము జాగరూకుఁడై యుండును. నీ సైన్యములు పెక్కులు, నీయోధు లనేకులు, పాండుపుత్రుల కటులు వేరుగదా! యుద్ధ మెటులుజరుగుచున్నదో చూడుము. అల్పులగువారిచేఁ బెక్కురగు మీరు ప్రహరించుచున్నను క్షయమునొందింపఁబడుచున్నవారు. కావున మీపౌరుషమును నశింపఁజేయుదైవమే వారిజయమునకు నిమిత్తమన వలసియున్నది.

ఓయాంబికేయా! వా రిటు లాయావిధముగా మాటలాడికొను చుండ నాసంగరమునఁ బాండవసైన్యములు గానవచ్చెను. పిదప గజ రథాశ్వాదులుగలిసి గొప్పయుద్ధ మారంభమయ్యెను. ఓరాజా! ఇది యెల్ల నీదురాలోచనామూలమెగదా!" అని తెలిపి మఱియు సంజయుఁ డి ట్లనియె.

### సుయోధనుఁడు యుధిష్ఠిరున కోడుట

ఓరాజా! అపు డధికమగుగజసైన్యముతోఁగూడ నీసైనికులు పాండవసైన్యముల నతిక్రమించి నలుగెలంకులఁ బోరాడఁజొచ్చిరి. అటు లక్కురుపాంచాలురు పరస్పరము పోరుచుఁ, బరలోకదీక్షగల్గి యమపురము వర్ధిల్లఁజేయువారై, శూరులును శూరులునుగలిసి, శక్తి శరతోమరాదులతోఁ గొట్టికొని, యమమందిరమునకుఁ బోవుచువచ్చిరి. పిదప రథికులతో రథికులకు రక్తస్రావఘోరమై పరస్పరము గొప్పయుద్ధ

ప్రారంభమయ్యెను. ఓమహారాజా! మదోత్కటములగు నేనుగులును బర స్పరముఁ జేరి, కుపితములై దంతములచేఁ బీడించుకొనసాగెను. ఆసంకుల సమరమున రౌతులు రౌతులఁ గలిసి, శక్తిపరశ్వధప్రాసాదులతోఁ గొట్టికొనుచు, గొప్పయశముగోరి యొకరినొకరు ఛేదించుకొనఁజొచ్చిరి. అటులే వందలకొలందిపదాతులు శస్త్రములుపట్టి ప్రయత్నపూర్వక ముగా నొకరిపై నొకరు పరువులిడసాగిరి. ఓమారిషా! అక్కరుపాంచా లురలో వారుచ్చరించు, కులగోత్రనామధేయములను వినుటఁబట్టియే వారిని దెలిసికొనఁగల్గితిమి. మఱియు నాసమరమున యోధులు పర స్పరము శరశక్తిపరశ్వధాదులను బఱపికొనుచు, నిర్భయులై పరలోక గమనోత్సాహముతోఁ జరింపమొదలిడిరి. ఓరాజా! వేలకొలఁదిగా, వారు విడుచుచున్న శరసమూహములు, భాస్కరుఁ డస్తమించుటచే నెప్పటిచొప్పున దశదిశలను బ్రకాశింపఁజేయుచుండెను. అటు లప్పాండ వేయులు పోరాడుచుండ, నంత మనసుయోధనుఁ డాసైన్యమును బ్రవేశించెను. అతఁడు సైంధవవధమున కెంతయుఁ జింతాక్రాంతుఁ డగుటఁ జావునకు సిద్ధపడియే శత్రుసైన్యము నటులు ప్రవేశించెను. అటు లతఁడు వెడలి నిజరథఘోషముచేఁ బుడమి వడంకఁజేయుచుఁ, బాండవసైన్యమును దలపడ, నపుడు వారితో నాతనికి గొప్పసమ్మర్దము జరిగెను. అంత సకలసైన్యములకును గొప్పముప్పు వాటిల్లనయ్యెను. అపుడు కిరణములచే మధ్యందినమార్తాండుఁడువలెఁ బ్రజ్వరిల్లుచు శర జ్వాలలు గురియఁ బాండవు లాతని గాంచుటకును జాలకుండిరి. మఱియు మహాత్ముఁడగు నాతనిచే హతులగుచుఁ, బాంచాలురు పరువు లిడుచు, శత్రుజయమున నుత్సాహమువిడిచి రణరంగమునుండి తొలఁగ సాగిరి. సువర్ణపుంఖములును, దీప్తాగ్రములునగు సాయకములచే నీ సుతుఁడు పీడింపఁ బాండవసైనికులును పుడమిఁబడుచుండిరి. ఓరాజా! అపుడు నీతనయుఁ డొనర్చినయద్భుతకృత్యము నప్పాండవులును జేసి యుండలేదు. మత్తగజముచేఁ బద్మలతవలె నీకొమరునిచేఁ బాండవ సైన్యము కలఁతనొందింపఁబడి సూర్యకిరణములచేతను, గాలిచేతను, జలములు తఱుఁగఁ గాంతిచెడినసరోవరమువలెఁ జూపట్టెను. అటులు తమ సైన్యము నశించుచుంట నారసి భీముఁడు ముస్నగుపాంచాలు రాతనిఁ దలపడిరి. అంత నాసుయోధనుఁ డాభీమునిఁ బదింటను, నకులసహదేవు

లను, మూఁడుమూఁడువాఁడికోలలను, విరాట ద్రుపదుల నాల్గింటను, శిఖండిని నూఁటింటను, ధృష్టద్యుమ్నుని డెబ్బదింటను, ధర్మజు నేడింటను, కైకేయులను జేదులను బెక్కునారాచములను, సాత్యకి నైదింటను, ద్రౌపదేయులను మూఁడుమూఁడిటను నొప్పించి, ఘటోత్కచుని బ్రహరించి సింహనాద మొనరించెను. మఱియు నతఁడు శతసంఖ్యాకు లగు యోధులను, గజాశ్వాదులను గుపితుఁ డగుయముఁడు ప్రజలను వలె రూపుమాపుచు రాఁగా, నంత నాతనిసువర్ణపృష్ఠము గు గొప్పధనువు నాయుధిష్ఠిరుఁడు రెండుభల్లములచే మూఁడుముక్కలుగా ఖండించెను. అటులు ఖండించి, తీవ్రముగా విడువఁబడినపదిబాణము లాతనిమేన నోనాఁటనేయ; నవి యాసుయోధనుమర్మములనాఁటి పుడమిఁజొచ్చెను. పిదప నాయుధిష్ఠిరుని మునావృత్రునిఁ జంపుటకై యింద్రునిఁబరివేష్టించిన దేవతలువలె, వారివీరులెల్లఁ బరివేష్టించిరి. పిదప నాయుధిష్ఠిరుఁ డొకయమోఘమగుబాణమును బ్రయోగించెను. దానిచే వాఁడెంతయు నొచ్చి, యారథోత్తమమునఁ గూలఁబడియెను. ఓరాజేంద్రా! పిమ్మటఁ బాంచాలసైన్యములలో "రాజు హతుఁడయ్యె"నని గొప్పధ్వనియొకటి జనించెను. అచ్చట సాయకములచప్పుడును గొప్పగాఁ నుప్పతిల్లెను. అపు డందులకు వడిగా ద్రోణుఁ డరుదెంచి గానవచ్చెను. అంత నాసుయోధ నుఁడును బరమసంతుష్టుఁడై "నిలునిలు"మని పలుకుచు, నాయుధిష్ఠిరునిఁ దలపడియెను. రాజును రక్షించువారై పాంచాలురు నందులకు వడిగా నేతెంచిరి. సుయోధనునిరక్షించువాఁడై ద్రోణుఁడును వారినెల్ల నివారించెను. ఓమహారాజా! అటులు యుద్ధాభిలాషతోఁగలిసిన నీవారికిని బాండవులసైన్యములకును గొప్పసంగ్రామమయ్యెను." అని తెలుప విని ధృతరాష్ట్రుఁ డిట్లనియె.

## ద్రోణునియుద్ధము

ఓసంజయా! మందుఁడును శాస్త్రవిరుద్ధవర్తనుఁడునగు నాపుత్త్రు నటులాడి, కుపితుఁడై తనబలమేర్పడఁ బాండవసైన్యములఁ బ్రవేశించెనుగదా! అటులు శూరుఁడై రథ మధిరోహించియున్న యాద్రోణునిఁ బాండవు లెట్లు మార్కొనఁగల్గిరి? అమ్మహాసంగ్రామమున నయ్యాచార్యుని దక్షిణపార్శ్వము నెవ్వరు రక్షించిరి? వామభాగమును నెవ్వరు

గాపాడిరి? వైరులను ధృడముగాఁ బ్రహరించుచున్న యాతని వెనుక మన యోధులలో నెవరుండిరి? ఆతనియెదుటను శత్రువు లెవరు? అట్టివారి నకాలసంభవమై, యత్యధికమగు శైత్యము ముంచెనని తలంతును. ఆశత్రులు శీతకాలమున గోవులువలె నాద్రోణు నెదుటఁ గంపమొందు దురని తలంతును. ఓసంజయా! అటు లతఁ డజేయుఁడై పాంచాల సైన్యములనుజొచ్చి రథమార్గములఁ జరించుచు, సకలపాంచాలసైనికులను దహించు, ధూమకేతువునాఁ గుపితుఁడై విక్రమించెనుగదా! అతఁ డెట్లు మరణించెను?

అది విని సంజయుఁ డాతనితో 'ఓరాజా! ఆసాయాహ్నమున సైంధవునిఁజంపి, యప్పార్థుఁడు ధర్మజునిఁగలిసినపిదప, నతఁడును సాత్యకియు నాద్రోణునే దలపడిరి. పిదప యుధిష్ఠిరుఁడును భీముఁడును వేలువేలుసైన్యములతోఁగూడి యాద్రోణునే మార్కొనిరి. అటులే నకుల సహదేవులును సైన్యముతోఁగూడ ధృష్టద్యుమ్నుఁడును, విరాట్కైకయులును, దమతమసైన్యములతో మత్స్యులును సాళ్వులును నాతనినే యెదుర్కొనిరి. అపుడు ద్రుపదుఁడును, పాంచాలరక్షితుఁడగుచు ద్రోణునిఁ దలపడుటయు, ద్రౌపదేయులును, ఘటోత్కచుఁడును దమ సైన్యములతోఁ బోరాడఁబోయిరి. ప్రభద్రకులనెడిపాంచాలు రారువేలమంది, శిఖండిని ముందుంచుకొని యాద్రోణునే తలపడిరి. అటులే మఱికొందఱు మహారథులును శూరులై భారద్వాజునితోఁ బోరాడం దొడంగ, నారాతిరి, ఘోరమై, భీరుజనభయంకరమై, యోధులకును బ్రళయకారియగుట' దారుణమై గజాశ్వపదాతులకు మారణకారణమై చూపట్టెను. ఘోరమగునారాతిరి, యెల్లెడల నక్కలు మున్నగునవి యెఱ్ఱనికబళములుగల మొగములతో భయంకరముగాఁ గానవచ్చెను. గుడ్లగూబ లతిభయంకరముగానఱచుచు, నందును గౌరవసైన్యములలో మఱియు దారుణముగాఁ గూయజొచ్చెను. ఓరాజేంద్రా! పిమ్మట సైన్యములలో భేరీశబ్దమును, మృదంగధ్వనియు, నేనుఁగులగర్జితమును, గుఱ్ఱముల హేషారావమును, వానిడెక్కలచప్పుడునుగూడి,గొప్పసంకుల ధ్వని యుప్పతిల్లెను. అపుడు ద్రోణునకు సృంజయులతో గొప్పపోరాటమయ్యెను. లోకమునెల్లఁ జీకటు లావరించుట నించుకేనిఁ దెలియఁ బడకుండెను. అటులే సేనాధూళులును నలుగెలంకుల నావరించెను.

అంత నాసాయంసమయాంతమున గజాశ్వపదాతులరక్తములచేఁ దడిసినభూళి లగపడక కర్దమముగా మాఱెను. రాతిరి కొండపై నంటికొనియుండుచున్న వెదురువనమునందువలె నాయోధులబాణప్రయోగములందుఁ జటచటాశబ్ద ముప్పతిల్లెను. మఱియు మృదంగానకవల్లకీపటహధ్వనులతోడను, జీత్కారములతోడను, హేషితధ్వనులతోడను రణరంగ మెల్ల సంకులమైయుండెను. ఓరాజా! ఆ పెనుఁజీకటిలోఁ దమవారును బెఱవారు ననెడి భేదము తెలియకుండుట నంతయు నున్మత్తమైనట్లు గానవచ్చెను. పిదప నందు వెడలినపరాగము రక్తముచేఁ దడియుటను, సువర్ణభూషణకవచాదులకాంతులచేతను, జీకటులు దొలఁగుచుండెను. ఆరాతిరి భారతసైన్యము మణిసువర్ణభూషణభూషితమై యుండుటను, నక్షత్రములతోఁగూడినయాకసము వలెఁ గానవచ్చెను. శక్తిధ్వజాదిసమాకులమై నక్కలరొదలయు, నేనుగుల బృంహితధ్వనులయు, సింహనాదములయు సంకులారావము మేనులకు గగురుపాటొదవించునదై గొప్పగా నుప్పతిల్లెను. ఎల్ల దెసలను బిడుగులువడున ట్లుండెను. ఓరాజా! ఆరాతిరి భారతసైన్యము కుండలాంగదాదిభూషణకాంతులచేతను, శస్త్రముల తళతళలచేతను గానవచ్చుచుండెను. మఱియు నందు రథములు, నేనుగులును సువర్ణభూషితములై యారాత్రి మెఱుపులతోఁగూడినమేఘములునాఁ జూపట్టుచుండెను. శక్తిగదాఖడ్గముసలపట్టసాదులు పరస్పరసంఘర్షముచే నగ్నులువలె మెఱయుచుఁ గానవచ్చెను. సుయోధనుఁ డనెడిపురోహితమును, రథసమూహము లనెడిమేఘములును, వాద్యఘోషము లనెడిగర్జనములును, చాపము లనెడిమెఱుపులునుగలిగి, ద్రోణపాండవు లనెడిపర్జన్యుఁడును, శక్తిగదాదు లనెడిపిడుగులును, శస్త్రాస్త్రము లనెడిగాలియుఁగల్గి, శీతోష్ణసంకులమునై, ఘోరమై, యాశ్చర్యజనకమైన యాసేనానదిని బ్రవేశించి యుద్ధాభిలాషులై మహారావపూరితమగు నాఘోరరాత్రిముఖమున భీరులకు భయమును శూరులకు హర్షమును గల్గించుచు దారుణమై యుద్ధమారంభమగుడుఁ, గుపితులై పాండవసృంజయులా ద్రోణునిఁ దలపడిరి. అపు డా ద్రోణుఁడు తనయెదుటఁబడినవారి నెల్లఁ బరాఙ్ముఖులఁగావించుచుఁ, గొందఱ యమమందిరము నొందింపసాగెను. ఓరాజా! ఆనిశారంభమున ద్రోణుఁ డొక్కఁడే పెక్కునారాచములచే

వేలకొలఁదియేన్గులను, బదివేలకెక్కువగా రథములను, బదిలక్షలపదాతులను, కోటిగుఱ్ఱములను హతమొనర్చెను." అని తెలుప విని ధృతరాష్ట్రుఁడు మఱియు నిట్లనియె.

## భీమునిపరాక్రమము

ఓసంజయా! అమానతేజుఁడగుభారద్వాజుఁడటులఁ గుపితుఁడై యాసృంజయసైన్యమును దలపడ, నపుడు మీరేమని తలంచితిరి? నాపుత్రు నటులు దూఱినాడి యతఁడు సైన్యముపైఁ దలపడఁ బార్థుఁడేమితలంచెను? సైంధవుఁడును వీరుఁడగుభూరిశ్రవుఁడును హతులగుటను మహాతేజుఁడై యజేయుఁడగుభారద్వాజుఁడు పాంచాలురపై మార్కొనఁగా, నందఱును నేమనికొనిరి? దుర్యోధనుఁడు తత్కాలమునకుఁ గర్తవ్యమెట్టిదని తలంచెను? వీరుఁడగునావిప్రు నెవ్వరనుసరించిరి? అతఁడు యుద్ధముచేయుచుండఁగా నాతనివెనుక నున్నవారెవ్వరు? అతఁడు వైరులను బ్రహరించుచుండఁగా ముందునిలిచి యుద్ధము చేసినవా రెవ్వరు? పాండవు లపు డాభారద్వాజుని శరప్రహారములకు నొచ్చియుందురని తలంతును. ఓయీ! చలికాలమున గోవులువలె వారా ద్రోణునికడ వడంకకుందురా? అట్టిమహారథుఁడు పాంచాలురఁ దలపడియు నెట్లు మరణించెను? అటు లారాత్రి సైన్యములును మహారథులును బరస్పరముఁ గలయ, సామాన్యులుసమ్మర్దమునొందుచుండఁగా, మనవారిలో నెవ్వ రందు నిలిచియుండిరి? ఓసంజయా! మనవారివీరులు హతులైరనియు, నోడిరనియు, మూర్ఛపడిరనియు, విరథులైరనియు నే తెలుపుచున్నవాఁడవుగదా! అటులు పాండవులచేఁ గలఁతనొంది వికలచిత్తులై మూర్ఛలుమునుఁగుచున్నపుడు మనవా రేమని తలంచిరో? ఉదగ్రులై ప్రహృష్టులగుపాండవులవిధమును దుఃఖితులై వికలచిత్తులగుచు, జడిసియున్న మనవారివిధమును దెలుపుము? ఓసూతా! స్థిరచిత్తులై పోరాడుపార్థులయుఁ, గౌరవులయు భేద మారాత్రి యెట్లు యెఱుకపడెను?

అది విని సంజయుఁ డాతనితో "ఓరాజా! ఆరాత్రియుద్ధ మటులు దారుణమై యారంభమగుడుఁ బాండవు లానోమకులతోఁగూడి ద్రోణునిఁ దలపడిరి. పిదప నయాచార్యుఁడు కైకయులను, ధృష్టద్యుమ్న

పుత్త్రులను వడిగలబాణములచేఁ బ్రేతలోకమునకుఁ బంపించెను. ఓరాజా! ఇంతయేల! మహారథులగు నెవ్వరెవ్వ రాయాచార్యునెదుటఁ బడుచుండిరో వారినెల్ల నతఁడు పితృలోకమునకుఁ బంపుచువచ్చెను. అపుడటులు తమసైన్యమును బీడించుచున్న వీరుఁడగు నాభారద్వాజునిపైఁ గుపితుఁడై ప్రతాపశాలియగు శిబి, యాతనిఁ దలపడ, నాద్రోణుఁడాతనిఁ బది తీవ్రనారాచములచే నొప్పించెను. అంత నాశిబియు ముప్పది గ్రద్దఱెక్కలబాణములచే నాతనిఁ బ్రతిప్రహారమొనర్చి నగుచు నొక్కభల్లముచే నాతనిసారథిని గూలనేయ, ద్రోణుఁడు వానిగుఱ్ఱములను సారథిని గొట్టి, పిదప శిరస్త్రాణముతోఁగూడ వానితలను శరీరమునుండి తప్పించెను. పిదప సుయోధనుఁ డాద్రోణునకు వేఱొకసారథిని నియోగింప, వానిచేఁ బరిగృహీతాశ్వుఁడై యతఁడు మరల వైరులపైఁ దలపడియెను. పిదపఁ గాలింగునికొమరుఁడు మున్ను తనతండ్రిని భీముఁడు చంపె ననెడికోపముచేఁ దనసైన్యములతోఁగూడి యావృకోదరుని మార్కొని, యాతని నైదుబాణములచే నొప్పించి, మఱియు నేడు సాయకములచేఁ బ్రహరించుటయెగాక, మఱియు నాభీముసారథిని మూఁడిటను ధ్వజము నొకబాణముచేతను బ్రహరించెను. అటులు కుపితుఁడైయున్న యాకాలింగునితనయునిపైఁ బవనతనయుఁ డెంతయుఁ గినిసి, వానిరథముపై కుఱికి యొకపిడికిటిపోటుచేఁ గొట్టఁగా వాఁడు తనయెమ్ముక లొక్కొకటి వేఱువేఱుగా జాఱి నేలఁగూలెను. అందులకుఁ గర్ణుఁడును గర్ణపుత్త్రులును గుపితులై విషసర్పతుల్యములగు నారాచములచే నాభీముని నొప్పించిరి. పిమ్మట నావృకోదరుఁడు శత్రురథమును విడిచి ధ్రువుఁ డనెడివానిపైఁ దలపడి, యొకపిడికిటిపోటుచే నొప్పించి, పుడమిఁబడఁద్రోసి, మహాబలుఁడై జయరాతునిరథముపై కుఱికి సింహనాదమొనర్చుచు, నెడమచేతితో వాని నాకర్షించి బొబ్బలువెట్టుచుఁ గర్ణునియెదుటనే వాని నొకతలప్రహారముచే నశింపఁజేసెను. అప్పుడప్పాండవునిపై గర్ణుఁ డొకకాంచనశక్తిని బ్రయోగింప, నతఁడు నగుచు, దానినిబట్టి మరల నారాధేయునిపై దానిని బ్రయోగింప, శకుని యొకబాణముచే దానిని ఖండించెను. ఓరాజా! ఇటులు మహాద్భుతకృత్యమొనరించి, యాభీముఁ డెప్పటిచొప్పునఁ దనరథమధిష్ఠించి నీసైన్యముపైఁ దలపడఁ, గుపితుఁడగు యమునిఁబోలియున్న యాభీముని

నీతనయుఁడు నివారించెను. అపుడు మహారథులెల్లరును నాతని శరవర్ష మున ముంచిరి. పిమ్మట భీముఁడు నగుచు దుర్మదుని సారథిని గుఱ్ఱములను గొట్టి చంపఁగా, వాఁడు దుష్కర్ణునిరథముపైకి దుమికి, వారిరువురును నేకరథారూఢులై యాసంగ్రామమధ్యమమున నున్న యాభీమునిఁ దలపడిరి. వారపుడు తారకాసురునిఁదలపడిన మిత్రావరుణులువలెఁ జూపట్టిరి. ఓరాజా! నీపుత్త్రులగు దుర్మదదుష్కర్ణులిరువురును గలిసి యాభీముని నొప్పింప, నతఁడు కర్ణదుర్యోధనాశ్వత్థామలును, కృపసోమదత్తబాహ్లికులును గాంచుచుండఁగనే యాదుర్మదదుష్కర్ణులరథము నొకపాదప్రహారముచే భగ్నమొనర్చి, పిదప శూరులగువారిరువుర నొకపిడికిటిపోటుచే హతులనొనర్చి సింహనాదమొనరించెను. పిదప మనసైన్యమున హాహాకారములు జనింప, యోధులెల్ల భీమునిఁ గాంచి ఆహా! వీఁడు భీమరూపముతో వచ్చిన రుద్రుఁడుగాని వేఱొండుగాదు.' అని పలుకుచుఁ బరువులువెట్టుచు, నొకరినొకరుగలియక నిశ్చేతనులై గుఱ్ఱములను వడిగా నడిపించుచు జెల్లాచెదరై పోయిరి. ఆనిశాముఖమున నటులాసైన్యము నెల్లఁబీడింప, నాభీముని రథికులెల్ల మెచ్చుకొనిరి. పిమ్మట నతఁ డాయుధిష్ఠిరునకు మెప్పుపుట్టించెను. అందుల కాయుధిష్ఠిరుఁడును, నకులసహదేవులును, విరాటద్రుపదకైకయులును బరమానంద భరితులై, యంధకునిఁజంపిన హరుని సురలువలె సన్నుతించిరి. పిదప నీతనయులు కుపితులై మహాత్ముఁడగు ద్రోణునితోఁగూడి యుద్ధాభిలాషులై యెంతయు నాతనిఁ జుట్టికొనిరి. పిమ్మట జీకటు లనెడిమేఘములచే నావృతమై వెలుపుగొలుపు నారాతిరి, నక్కలకును గ్రద్దలకును మోద మావహిల్లునట్లుగా మహాత్ములగుకురుపాండవుల కపుడు దారుణమగుగొప్పయుద్ధము జరిగెను" అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## అశ్వత్థామయుద్ధము.

"ఓయాంబికేయా! సాత్యకిచేఁ బ్రాయోపవిష్టుఁడైన తనసుతుఁడటులు హతుఁడగుడు భూరిశ్రవుని జనకుఁడగు నాసోమదత్తుఁ డెంతయుఁ గుపితుఁడై, యాసాత్యకితో 'ఓయీ! మహాత్ములగు దేవతలు క్షత్త్రధర్మమును గనిపెట్టిరిగదా! ఓసాత్వతా! దానిని నీవు పరిత్యజించి

యీదస్యుధర్మ మెట్టు లవలంబించితివి? రణరంగమునఁ బరాఙ్ముఖుఁడైన వానిని, దీనుఁడైనవానిని, శస్త్రమువిడిచినవానిని, యుద్ధమువలదని యాచించువానిని, క్షత్రియధర్మసక్తుఁడగు ప్రాజ్ఞుఁ డెవ్వఁడు ప్రహరించును? ఓసాత్యకీ! వృష్ణివంశమువారిలో నీవును బ్రద్యుమ్నుఁడును మాత్రమ మహారథులును ముఖ్యులునై యున్నవారుగదా! అట్టి నీవు పార్థునిచే బాహువు దెగఁ బ్రాయోపవిష్టుఁడై మరణింపనున్న యాభూరిశ్రవునిఁ గ్రూరుఁడవై యెట్లు ప్రహరించితివి? ఓమూఢా! ఇదె విక్రమించి నాబాణముచే నీతలఁ దెగనేయుదును. అట్టి నీదుష్కృత్యమునకుఁ దగుఫల మనుభవింతువు. ఓసాత్యకీ! పార్థుఁడు నిన్ను రక్షింపకుండు నేని, వీరుఁడనని గర్వించునట్టి నిన్ను నీసోదరపుత్రాదులతోఁగూడ నీరాతిరి గడవకుండఁ జంపుదునని, నాపుత్రులపైని నాయాగాదిసుకృతముపైని నొట్టుపెట్టుకొనుచున్నాఁడను. అటులు చంపలేకుందునేని, ఘోరనరకమునఁ బడువాఁడను.' అని పలుకుచు, గుపితుఁడై మహాబలుఁడగుచు శంఖమును బూరించి, సింహనాద మొనరించెను. పిమ్మట సింహదంష్ట్రుఁడును, గమలపత్రాక్షుఁడును, మహాబలుఁడునగు నాసాత్యకి మిగులఁ గోపమడర నాసోమదత్తునితో 'ఓకౌరవేయా! నీతోఁగాని, యింకెవ్వరితోఁగాని యుద్ధముచేయు నాకు భయమనునది యించుకేని లేదుసుమీ! నీవు సకలసైన్యముచే రక్షితుఁడవగుచు యుద్ధము చేయవచ్చును. అయినను నీవిషయమున నాకేమియు శ్రమగలుగ నేరదు. నామతమునఁగాని, సజ్జనులమతమునఁగాని యుద్ధమున, నిస్సారవచనములతోఁ బ్రయోజనము లేదు. క్షత్రియధర్మమందున్న నన్ను నీవిట్లు వెఱపింప వీలుపడదు. ఓరాజా! నీకు నాతో యుద్ధముచేయు నుత్సాహముగలదేని, నిష్కరుణముగాఁ దీవ్రబాణములచే నన్నుఁ బ్రహరింపుము. నిన్ను నేఁ బ్రహరించుచున్నాఁడను. ఓసోమదత్తా! మహారథుఁడగునీతనయుఁడు నాచేఁ జంపఁబడియెను.అటులే శల్యుఁడును, వృషసేనుఁడును బీడింపఁబడిరి. ఇపుడు నిన్నును సపుత్రసబాంధవముగా వధించెదను. నీవు కౌరవుఁడవై మహాబలుఁడవై తేని రణమునఁ గదలక నిలిచియుండుము. దానము, దమము, శౌచము, అహింస; బిడియము, ధైర్యము, శాంతియు నాయుధిష్ఠిరు నెల్లపుడును విడువకుండునవి. మృదంగకేతుఁడగు నాతనితేజముచే మున్నీవు హతుఁడవైతివిగాదే! నీ

నీసంగ్రామమునఁ గర్ణసౌబలాదులతో వినాశ మొందనున్నాఁడవు. ఈ యుద్ధమునఁ గుపితుఁడనై నీపుత్త్రులతోఁగూడ నిన్నుఁ జంపుదునని, నా యిష్టాపూర్తముపైని శ్రీకృష్ణభగవానునిచరణములపైని నొట్టుపెట్టుకొనుచున్నాఁడను. నీవు యుద్ధమువిడిచి తొలఁగుదువేని నాచే విడువఁబడుదువు,' అని యిట్లు పలికెను.

ఓరాజా! వారిరువురు నిట్లు పరస్పరము సంభాషించుకొని కోపముచేఁ గన్నులెఱ్ఱవాఱ, యుద్ధారంభ మొనరించి, శరవర్షము గురిసికొనఁదొడంగిరి. పిదప సుయోధనుఁడు, రథసహస్రముతోడను, బదివేల గజాశ్వములతోడను, సోమదత్తునకు సహాయుఁడై చుట్టికొనియుండెను. ఓరాజా! నీకు స్యాలుఁడగు శకునియుఁ గుపితుఁడై శస్త్రాస్త్రములఁబూని యింద్రవిక్రములగుభ్రాతృపుత్త్రపౌత్త్రులు తనతోడరా, లక్షగుఱ్ఱములతో నాసోమదత్తునకు సహాయుఁడై, యాతనిఁ బరివేష్టించియుండెను. అటులు సురక్షితుఁడై యతఁ డాసాత్యకిని శరవర్షముచేఁ గప్పఁగాఁ జూచి, ధృష్టద్యుమ్నుఁడు కోపమడరఁ దనసైన్యముతో నందులకు వెడలెను. ఓరాజా! అపు డాయిరుసైన్యములును బరస్పరముఁ బ్రహరించుకొనుచుండఁ, బెనుగాలిచేఁ గలఁతనొందినసముద్రములఘోషము ననుకరించుచప్పు డుప్పతిల్లెను. అంత నాసోమదత్తుఁ డాసాత్యకిని దొమ్మిది బాణములచే నొప్పింప, నతఁడు నాసోమదత్తునిఁ దొమ్మిదిబాణములచేఁ బ్రతిప్రహార మొనర్చెను. బలవంతుఁడగు నాసాత్యకి ప్రహారముచే నొచ్చి, యాసోమదత్తుఁడు రథమధ్యమునఁ గూలంబడ, గతచేతనుఁడగు నాతని నారణరంగమునుండి వానిసారథి తొలఁగించుకొనిపోయెను. సాత్యకి శరపీడితుఁడై మూర్ఛవడినయాతనిఁ గాంచి, ద్రోణుఁ డాసాత్యకిని హింసించువాఁడై వెడలఁగా, నపుడు యుధిష్ఠిరుఁడు మున్నగు యోధు లాసాత్యకిని రక్షించువారై పరివేష్టించియుండిరి. పిమ్మట, త్రైలోక్యజయాభిలాషచే మును దేవతలతో బలికి జరిగినయుద్ధమువలె నాద్రోణునకుఁ బాండవులతో దారుణయుద్ధ మారంభమయ్యెను. పిదప నాభారద్వాజుఁడు సాయకసహస్రములచేఁ బాండవసైన్యమును గప్పుచు యుధిష్ఠిరుని నొప్పించి, సాత్యకిని బదిబాణములను, ధృష్టద్యుమ్ను నిరువదింటను, భీమునిఁ బదింటను, నకులు నైదింటను, సహదేవు నెనిమిదింటను, శిఖండిని నూటింటను, ద్రౌపదేయుల నేవురనై దేసి

బాణములను, విరాటు నెనిమిదిటను, ద్రుపదునిఁ బదింటను, యుధామన్యుని మూఁడిటను, నుత్తమౌజు నాఱింటనుగొట్టి, యింకనుగల సైనికులను బీడించి మఱియు ధర్మజునిఁ దలపడియెను. ఓరాజా! అప్పాండవసైన్య మటు లాద్రోణునిచే హతులగుచు, జడిసి యార్త నాదములుసేయుచు, నలుగెలంకులకుఁ బరువులిడిపోయిరి. అటులు తనసైన్యము చెదరుటను గాంచి యప్పార్థుఁడు, కొంచెము కోపము తెచ్చికొని, యాద్రోణునిఁ దలపడుటయు మరల నాయుధిష్ఠిరునిసైన్యములు వెఱపుడిగి యుద్ధమునకు మరలెను. మరల ద్రోణునితోఁ బాండవులకు యుద్ధ మారంభమయ్యెను. ద్రోణుఁడు, నీపుత్రులు తనకు సహాయులుగా దూదిపోక నంటికొన్నయగ్నివలెఁ బాండవసైన్యమును బీడింపందొడంగి, తపించునాదిత్యుని మండుచున్నయగ్నిఁబోలి యెంతయు శరాగ్నిజ్వాలలను గురియుచు, గిరగిర ధనువు ద్రిప్పుచు, భాస్కరుఁడు నావైరులను దపింపఁజేయుచు నివారించుచుండెను. ఓరాజా! ఆద్రోణున కెదురుగా నెవ్వఁడెవ్వఁడు నిలిచియుండెనో వానినెల్ల యాతని శరము పడఁద్రోసి పుడమిఁజొచ్చుచుండెను. మహాత్ముఁడగు నాద్రోణుఁ డటులు పీడింప,నర్జునుఁడు చూచుచుండఁగనే మరల నప్పాండవసైన్యము జడిసి చెదరుటయు, నపు డర్జునుఁ డవ్వాసుదేవునితో 'గోవిందా! మన రథము ద్రోణునిపైకిఁ బోనిమ్ము' అని పలుక విని రజత, గోక్షీర, కుందేందు ధవళములగునశ్వములను వడిగా నాతఁ డాద్రోణునిరథము పైకిఁబఱప, దాని నారసి భీముఁడును, నప్పార్థునకుఁ దోడుసూపువాఁడై తనసారథితో 'ఓవిశోకా! మనరథ మాద్రోణసైన్యముపైకి నడిపింపు మన, వాఁడును నర్జునునివెనుక నుండునట్లుగా వడిగా నడిపెను. ఆద్రోణసైన్యము పైకటులు సన్నద్ధులై వెడలిన సోదరులగుభీమార్జునుల నారసి, పాంచాల, చేది, మాత్స్య, సృంజయ, కారూశ, కోసలసైన్యములును, మహారథులగు కైకయులసైన్యములును, వారి ననుసరించి వెడలెను. ఓరాజా! పిమ్మట నప్పార్థుఁడు సైన్యమునకు దక్షిణముగను, భీముఁ డుత్తరముగను నిలిచి, గొప్పరథసమూహములతోఁగూడి మన వారిని బీడింప, నపుడు ఘోరమగుసంగ్రామ మారంభమై గగురుపాటొదవించెను. పురుషవ్యాఘ్రులగు నాభీమార్జునులనుజూచి,సాత్యకియు ధృష్టద్యుమ్నుఁడును వెడలిరి, ఓరాజా! అపుడు పెనుగాలిచేఁగదలిన

సాగరములచప్పుడును బోలినచప్పు డుప్పతిల్లఁ, బరస్పరముఁ బ్రహరించుకొనుచుండ, భూరిశ్రవునిఁ జంపె ననుకోపముచే నశ్వత్థామ సాత్యకిని దలపడఁబోవుచుండఁ జూచి, మహాబలుఁడగు ఘటోత్కచుఁడు మహాఘోరరూపమై యెల్గుబంటిచర్మముతోఁ గప్పంబడియున్న యుక్కురథ మెక్కి యాద్రోణపుత్త్రు నెదుర్కొనియెను. వానిరథము మిక్కిలి విశాలమై, యందందు యంత్రములు వెలయ నేన్గులును, గుఱ్ఱములునుగాక యేన్గుల వంటివాహనములచేఁ బూన్పఁబడి చాపబడినచెక్కలును బాదములును గల్గి, కూయుచున్న గ్రద్దచిహ్నముగలధ్వజము వెఱపుగొలుప, నందుఁ బ్రేవులతోరణములచే నలంకరింపఁబడిన రక్తపూరితపతాక మలరుచుండ, నెన్మిదిచక్రములుగల్గి యొప్పుచుండెను. మఱియు నాఘటోత్కచుఁడు, శూలముద్గరాద్యాయుధ ధారులై వృక్షములను బాషాణములను బట్టికొనియున్నసైనికు లొకయక్షౌహిణికైన తోడ్పడ, గొప్పవిల్లు పట్టి వచ్చుచుండుటనుజూచి దండహస్తుఁడైన ప్రళయకాలయముఁడునాఁ జూపట్టు, నాతనియాకారమునకు మనయోధులు వెఱవసాగిరి. ఓరాజా! గొప్పదౌడలును, శంకుకర్ణములునుగల్గి, కోఱలచే భయంకరమగు మొగమును, నూర్ధ్వకేశమును, దీప్తవదనమును, గుహనుబోలినకంఠద్వారమును, సకలభూతములకును వెఱపుగొలుప, వైరివిక్షోభకారుఁడై వచ్చుచున్నయాఘటోత్కచు నారసి, మనవారిసైన్యము జడిసి, గాలిచే గలఁతనొంది సుడులువెలయ నూర్ధ్వతరంగమైన గంగానదివలె నల్లకల్లోలమై యుండెను. అపుడు ఘటోత్కచుఁ డొనరించినసింహనాదముచే నేన్గులెల్ల వెఱచి, మూత్రములువిడువ మనయోధులెల్లఁ బీడితులుగాఁ జొచ్చిరి. అంత నెల్లెడలఁ బాషాణవర్షముగురియ నారంభమయ్యెను. అయ్యది నిశాముఖమగుట నధికబలులగుచున్న యారాక్షసులు, శక్తితోమరములను, నినుపచక్రములను, శూలములను, బట్టసములను, శతఘ్నులను వర్షింప మొదలిడిరి. ఆభయంకరయుద్ధమును గాంచి, నీపుత్త్రులును గర్ణుఁడును బీడితులై చెదరిపోయిరి. అపుడు బలశాలినెడి యభిమానముగలయశ్వత్థామ యొకఁడుమాత్రము చలింపకుండుటయెగాక, యాఘటోత్కచునిచేఁ గన్పింపఁబడినమాయను దొలఁగించెను. అందులఁ కాఘటోత్కచుఁడు కుపితుఁడై యాద్రోణకుమారుపై ఘోరనారాచములుపనుప, నవి యాతనిమేన నాఁటి కడునడిగాఁ బుట్టలోఁజొచ్చు

పాములునా వెడలి, రక్తసిక్తమ్ములై పుడమిఁజొచ్చెను. అంత నాయశ్వత్థామయుఁ గోపమడర లఘుహస్తుఁడై నిజప్రతాపమేర్పడ నాఘటోత్కచునిఁ బదిబాణములచే భేదింప నాతఁడును నొచ్చి, వేయంచులుగల యొకచక్రమును బట్టికొని కొనలందుఁ జూరకత్తులుగల్గి, మణివజ్రవిభూషితమై, బాలాదిత్యుఁడునాఁదగు నద్దాని నాయశ్వత్థామను జంపు నభిలాషతోఁ బ్రయోగించెను. అయ్యది భాగ్యరహితునిసంకల్పమువలె నాయశ్వత్థామ శరప్రహారమున హతమై పుడమిఁబడియెను. పిదప నాఘటోత్కచుఁడు తనచక్రమటులు భగ్నమగుట నారసి, శరపరంపరలచే రాహువు భాస్కరునివలె నాద్రోణతనయు నాచ్ఛాదించెను. అంత నాఘటోత్కచునితనయుఁడు, కాటుకకొండనాఁదగు మేనిచాయతోఁ బెనుగాలిని బర్వతమువలె నాద్రోణపుత్త్రు నడ్డుకొని భీమపౌత్త్రుఁడై, శూరుఁడగు నాయంజనపర్వుఁడు సాయకములుగురియ, నాతఁడు వారిధారలచే మేరువువలె వానిచేఁ గప్పఁబడి కుపితుఁడై హరిహరతుల్యవిక్రముఁడగుచు నొకబాణముచే నాయంజనపర్వు ధనువు దునిమి రెండుబాణములచే రథమును సారథినిగొట్టి, మూఁడుబాణములచేఁ ద్రివేణుకమును బ్రహరించి, నాల్గిటిచే నాల్గుగుఱ్ఱములనుగొట్టి, యొక కోలచే ధ్వజము ఖండించి, విరథుఁడై యంజనపర్వుఁడు కత్తినెత్తుచుండ, దాని నొకతీవ్రబాణముచే రెండుఖండములుగావించెను. ఓరాజా! అటులే మఱియు వాఁడు వైచఁబూనినగదనుసైత మాయశ్వత్థామ ఖండించివైచెను. అంత నాయంజనపర్వుఁ డంతరిక్షమున కెగిరి వర్షకాల మేఘమువలె గర్జించుచు, నాకసమునుండి వృక్షముల నాతనిపై వర్షించుచుండ, మాయారూపియైన యారక్కసు నాద్రౌణి భాస్కరుఁడు నిజకిరణములచే మేఘమునువలె బాణములచేఁ బీడించెను. పిదప నారాక్షసుఁడును, మరల సువర్ణభూషితమగు తనరథముపైకి డిగ్గి, యంజనాద్రివలె నున్నతుఁడై, యినుపకవచముతో వెలయుచుండ, నాద్రోణపుత్త్రుఁ డాయంజనపర్వుని మహేశ్వరుఁ డంధకాసురునివలె నొప్పించి చంపెను. పిదప నాయశ్వత్థామచే నటులు హతుఁడైన తనతనయునిఁ జూచి కుపితుఁడై యాద్రౌణికడ కేగి, పాండవసైన్యమును బ్రజ్వలించి నయగ్నివలె దహించుచున్న యాతనిఁజూచి 'ఓద్రోణపుత్త్రా! నిలు నిలుము. నాయెదుట నీవు జీవించిపోఁజాలవు. క్రౌంచమును గుమార

స్వామివలె నిదె నిన్నుఁ జీల్చి చెండాడుచున్నవాఁడను' అనిపలుక విని, యతఁ డాఘటోత్కచునితో 'వత్సా! భీమపుత్త్రా! పొమ్ము. నీ పితరులతోఁ బోరాడుము. ఓయీ! ఆర్యుఁడగుతండ్రిని బుత్త్రుఁడు బాధింపరాదుగదా! నీయందు నాకించుకేనిఁ గోపముగలుగదు. కోప పరవశుఁడైనవాఁడు తన్నుసైతముఁ జంపికొనునుగదా! పుత్త్రుఁడని విడుచునా ? కావున నీజీవనముఁ గాపాడికొమ్ము' అని పలికెను.

ఓయాంబికేయా! ఆద్రోణపుత్త్రునివచనములు విని ఘటోత్క చుఁడు కోపముచేఁ గన్ను లెఱ్ఱవాఱ, నాతనితో 'ఓద్రోణతనయా! సామాన్యువలె నేను యుద్ధమునకు వెఱచువాఁడనుగాను. నన్నిటులు మాటలచే భయపెట్టుట నీకుఁ దగదు. గొప్పదగుకురువంశమునఁ బాండ వులలో భీమునకు జనించినవాఁడను. యుద్ధమున మరలను బలముచే రావణతుల్యుఁడనైన రాక్షసాధిపతిని. కావున నీవు మరలిపోక నిలువుము. రణరంగమున యుద్ధశ్రద్ధ నీకు నేనభ్యసింపఁజేసెదను' అని పలుకుచుఁ గ్రోధతామ్రాక్షుఁడై మహాబలుఁడగు నారాక్షసుఁ డాద్రోణతనయుని, గజేంద్రమును సింహమువలె మార్కొని, వాని రథచక్రాక్షములు మున్గునంతటిశరవర్షమును గురియ, నాద్రోణపుత్త్రుఁడు వానిశరములను మార్గమధ్యముననే ఖండించెను. పిదప నంతరిక్షమున వారిసాయకములకు వేఱొకసంగ్రామము జరిగినట్లయ్యెను. ఓరాజా! అపుడు వారిరువురయస్త్రసంఘాతమున జనించినమిడుఁగుఱులతో నా నిశాముఖమున నాకసము మెఱుఁగుడుఁబుర్వులతోవలెఁ జూపట్టెను. రణమానియగుద్రౌణిచే నటులు తనమాయ నిహతమగుటఁ గాంచి, మఱియు నాఘటోత్కచుఁ డంతర్హితుఁడై మాయనుగల్పించి యందొక పర్వతమును సృజించెను. అయ్యది యున్నతములగు శిఖరములతోడను, గహనములగువృక్షములతోడను, శూలప్రాసముసలజలప్రవాహముల తోడనుగూడి, యంజనాద్రినాఁ జూపట్టుటయు, నాద్రౌణి దాని నాదరి చలింపక నగుచు వజ్రాస్త్రమును బ్రయోగింప, దానిచే నా పర్వతము తొలఁగి వడిగా నశించెను. పిమ్మట నాభీమసుతుఁ డింద్రాయుధ ముతోఁ గూడిన నల్లనిమేఘమై, పాషాణవర్షముచే నాయశ్వత్థామను గప్పెను. అపు డస్త్రవేత్తయగు నతఁడు వాయవ్యాస్త్రమును సంధించి, యటులు వెడలిన యానీలమేఘమును, జెదరఁజేసి, మఱియు సాయక

పరంపరలచే నలుదెసలఁ గప్పుచు, రథసహస్రము నతఁడు ప్రహరించెను. మఱియు నాఘటోత్కచుఁడు రథముతో వెడలెను. సింహశార్దూల మత్తగజతుల్యులగు రాక్షసు లనేకు లాతని నావరించియుండిరి. కొంద ఱేన్గులను గుఱ్ఱములను రథముల నెక్కి వెడలిరి. మఱికొందఱు వికృత ముఖశిరఃకంఠములతో నాతని వెంబడించియుండిరి. నానాశస్త్రధారులై, కవచాదివిభూషితులై, యింద్రపౌలస్త్యవిక్రములగు నారక్కసులతోఁ గూడి యటులు వచ్చుచున్న యాఘటోత్కచునిఁ గాంచి,సుయోధనుఁడు విషాదపడుచుండ, నాతనితో నాద్రోణపుత్త్రుఁడు 'ఓరాజా! నీవు భయ పడక నిలువుము. సంభ్రమింపకుము. వీరులతోఁగూడియున్న సోదరులగు పాండవుల నిదె చంపెదను. నీకుఁ బరాజయముగలుగదు. నిజముగాఁ బ్రతిజ్ఞచేసి చెప్పుచున్నాఁడను. నీసైన్యమును నిలువరింపుము.' అని తెలిపెను. అది విని సుయోధనుఁ డాతనితో "ఓగురుపుత్త్రా! నీగొప్ప ధైర్య మట్టిదియే! ఇం దద్భుతమేమియు లేదు, మఱియు మాయెడ నీకట్టి భక్తియును గలదు.' అని బదులు చెప్పెను.

ఓయంబికానందనా! నీతనయుఁ డాయశ్వత్థామతో నిట్లుపలికి శకునిం జూచి 'ఓమామా!నీవు లక్షరథములతోడను, నఱువదివేవురురథి కులతోడను నప్పార్థునిపైకివెడలుము. కర్ణ, వృషసేన,కృప,నీలులును,సుదీ చ్యులును, కృతవర్మడును, బురుమిత్రపుత్త్రులును, దుశ్శాసనుఁడును, నికుం భుఁడును, గుండభేదియు, బురంజయ, దృఢరథ, పతాకి, హేమపుంజకు లును, శల్యారుణీంద్రసేన, సంజయవిజయజయసేనులును, గమలాక్షపర క్రాథిజయధర్మసుదర్శనులును, నీకుఁ దోడుసూపువారై వత్తురు. మఱియు నాఱయుతముల సంఖ్యగలపదాతులునువత్తురు. ఓమామా! నీ వాభీముని నకులసహదేవులను యుధిష్ఠిరునిఁ జంపుము.అసురుల నింద్రుఁడువలెఁ నీవు వారిని జయింతువని యాశించియున్నవాఁడను. ద్రౌణిబాణములచే నెంతయు నొచ్చియున్న మేనులుగల యప్పాండవుల నాకుమారస్వామి రక్కసులనువలె వధించిరమ్ము.' అని తెలుపఁగా విని యతఁడు నీపుత్త్రు లను సంతసింపఁజేయువాఁడై పాండవులదహింతు ననుచు వెడలెను. పిదప మరల నాయశ్వత్థామ ఘటోత్కచులకు యుద్ధమారంభమయ్యెను. ఆరాత్రి నింద్రప్రహ్లాదులకువలె సంకులమగు నాయుద్ధమునఁ గుపితుఁడై, ఘటోత్కచుఁడు దృఢములై, విషాగ్నితుల్యములగు పదిబాణములచే

నా ద్రౌణియురము నొప్పింప, నతఁ డెంతయు నొచ్చి గాలిచేఁ గదలిన వృక్షమువలెఁ గొంతచలింప మఱియు నాఘటోత్కచుఁ డొకయంజలిక బాణముచే నాబ్రాహ్మణునిహస్తమందున్నధనువు దునుమాడెను. అంత నాద్రోణసుతుఁడు వేఱొకవిల్లుగొని మేఘము జలధారలనువలెఁ దీవ్ర సాయకముల నారక్కసునిపైఁ బ్రయోగింప నవి పీనవక్షులగునారాక్షసులనెల్లఁ బీడింప, సింహపీడితములగునేన్గులునా వారు చూపట్టిరి. గజరథాశ్వసారథులతోఁగూడ నారక్కసుల నటులు నొప్పించి యుగాంతమునఁ బ్రాణులను దహించునగ్నివలె వానియక్షౌహిణీసైన్యమును గాల్చుచుఁ,ద్రిపురములను దహించినమహేశ్వరుఁడువలె నాద్రోణసుతుఁ డెంతయు నలరారెను. పిమ్మట నాఘటోత్కచుఁడు కుపితుఁడై, యశ్వత్థామను జంపుఁడని తనభీమకర్ములగు రాక్షసులను బ్రేరింప వారు నాతనియాజ్ఞ శిరసావహించి కోఱలచే నుగ్రములగు మొగములతో ఘోరరూపులై భయముగొల్పుచు నోళులుదెఱచి దీర్ఘజిహ్వలును, క్రోధతామ్రాక్షులునై సింహనాదములొనర్చుచు, నానాయుధధారులై యాద్రోణతనయు నెప్పటిచొప్పునఁ దలపడి కొందఱు శక్తిశూలశతఘ్ని పట్టసాశనిపరిఘములను, మఱికొందఱు ఖడ్గగదాముసలభిందిపాలపరశ్వథములను, వేఱొకకొందఱు ప్రాసతోమరకుణపకంపన స్థూణకార్ష్ణాయస శుభుంఠులను, మహాఘోరములై శత్రుదారకములగు ముద్గరములను, నాద్రోణసుతునిపైఁ గురిసిరి. అటు లాతని తలపైఁబడు నాశస్త్రవర్షమును గాంచి, మనయోధులెల్ల వ్యథనొందసాగిరి. అందుల కాద్రోణతనయుఁడుమాత్రము చలింపక యాశస్త్రవర్షమునెల్లఁ దీవ్రములగుతనశరములచే నశింపఁజేసి, ధైర్యశాలియై మఱియుఁ గొన్నితీవ్రనారాచములను దివ్యాస్త్రమంత్రితములుగా నొనర్చి యారక్కసులపైఁ బ్రయోగించెను. వానిచే నారాక్షసయూథము సింహములచే మత్తగజయూథమువలె సమాకులమగుఁడు వారు కుపితులై మఱియు నాద్రౌణినిఁ జంపువారై తలపడిరి. అపు డెవ్వరికిని శక్యముగాని విక్రమము నాద్రోణతనయుఁ డద్భుతముగాఁ బ్రదర్శించి, మహాస్త్రవేత్తయై తానొక్కఁడే యారక్కసిమూకలనెల్ల నిజశరాగ్నిజ్వాలలచేఁ గాల్చుచుండెను. దాని నాఘటోత్కచుఁడు చూచుచుండెను. ఓరాజా! అటు లాయశ్వత్థామ రాక్షస

సైన్యమును దహించుచు యుగాంతమునఁ బ్రాణులను దహించుప్రళయాగ్నినాఁ జూపట్టెను. ఆరాజసహస్రములందును బాండవులందును విక్రమించి విషసర్పతుల్యములగు సాయకములచే సైన్యములను గాల్చునట్టి యాద్రోణతనయు నొక్కఁడును దేఱిచూడఁజాలకుండెను. మహాబలుఁడును, వీరుఁడును, రాక్షసేంద్రుఁడు నగుఘటోత్కచుఁడు మాత్రము మఱియుఁ గుపితుఁడై కనులు ద్రిప్పుచు సూతునియఱచేయి తనయఱచేతఁబట్టి పెదవిగొఱుకుచు 'ఓయీ! మనరథ మాద్రోణతనయుని సమీపమునకుఁబోనిమ్ము' అని పలుక వాఁడటు లొనర్చెను. అంత నాఘటోత్కచుఁడు ద్రోణపుత్రునితో ద్వంద్వయుద్ధమునకుఁ దలపడి భీమవిక్రముఁడై సింహనాద మొనర్చి, యెనిమిదిగంటలుగల్గి దేవనిర్మితమై ఘోరమగు నొకయశని నాతనిపై వైవ, దాని నాయశ్వత్థామ యెగిరిపట్టుకొని తనధనువు రథముపై నునిచి యాఘటోత్కచుని యశని నాతనిరథముపైకి విసరెను. అంత నాభీమాత్మజుఁడు రథమునుండి పైకెగురునంతలో నది వానిసూతాశ్వధ్వజములను భస్మముగావించి పుడమిని భేదించి యందుఁజొచ్చెను. ఆయద్భుతకృత్యమున కాయశ్వత్థామ నందఱును మెచ్చిరి. ఓరాజా! పిదప నాఘటోత్కచుఁడు ధృష్టద్యుమ్నునిరథ మధిరోహించి యంద్రాయుధతుల్యమగు వేఱొకధనువుఁబూని యాద్రోణసుతునిపై దీవ్రబాణములఁ బ్రయోగించెను. అంత ధృష్టద్యుమ్నుఁడును జలింపక విషసర్పతుల్యములగుచు సువర్ణపుంఖములైన కొన్నిసాయకము లాద్రోణాత్మజునివక్షమునఁ బఱపనతఁడును బెక్కుబాణములు ప్రయోగించెను. అపు డాధృష్టద్యుమ్నఘటోత్కచు లిరువురు నాతనిబాణములను ఖండించిరి.అపుడు వారియుద్ధ మతితీవ్రమై జరిగెను. అది యోధుల కెంతయు సంతస మొదవించెను. పిమ్మట నొకవేయిరథములతోడను మూఁడువందల యేన్గులతోడను నాఱువేలగుఱ్ఱములతోడను భీముఁ డందులకువచ్చెను. అపు డాద్రోణతనయుఁ డాఘటోత్కచధృష్టద్యుమ్నులతో నద్భుతవిక్రముఁడై పోరుచుండెను. సకలభూతములం దెవ్వనికిని శక్యముగాని యద్భుతవిక్రమము నపు డాయశ్వత్థామ ప్రకటించెను. అతఁ డొకనిమేషమాత్రమున గజరథాశ్వసూతులతోఁగూడ నారాక్షససైన్యము నక్షౌహిణిని, దనతీవ్రబాణములచే నశింపఁజేసెను. ఓరాజా! ఆతనివిక్రమము

నాభీమఘటోత్కచులును, ధృష్టద్యుమ్నుఁడును, నకులసహదేవులును, ధర్మజుఁడును, వాసుదేవార్జునులును గాంచుచునేయుండిరి. వారటులు చూచుచుండఁగనే యతఁడు వడిగలసాయకములచే నెన్నియేనియేన్గులు శృంగములు తెగిన పర్వతములుబోలె నేలఁగూలి కానవచ్చెను. కొన్ని తొండములు తెగి యిటునటు చరించుచుండఁ, బ్రాకుచున్న సర్పములచే వలె వానిచేఁ బుడమి యెంతయు నలరుచుండెను. మఱియుఁ గాంచన దండములై తెగిపడిన ఛత్రములచే భూమి యుగాంతమున నుదయించిన సూర్యచంద్రాదిగ్రహాదులచే వ్యాప్తమైన యాకసమువలె మిగుల విలసిల్లఁజొచ్చెను. అపు డాద్రోణతనయుని బాణప్రహారములచే, భగ్నమైన యారాక్షససైన్యమున రక్తప్రవాహములచే నొకమహానది యేర్పడియెను. అటు లాయశ్వత్థామ రాక్షససైన్యమును బరిమార్చి, మఱియు నాఘటోత్కచునిఁ బీడించి, కుపితుఁడై భీమధృష్టద్యుమ్నులతోఁగూడఁ బాండవులను బెక్కుసాయకములచేఁ గొట్టి, సురథుఁడనెడి ద్రుపదపుత్రునిఁ జంపి, వానితమ్ముడగు శత్రుంజయుని, బలానీకుని, జయానీకుని, జయునిఁ బ్రహరించెను. మఱియు నతఁడు సింగమువలె బొబ్బలువెట్టుచుఁ బృషధ్రునిఁ, జంద్రసేనునిఁ గొట్టి, పదిబాణములచేఁ గుంతిభోజపుత్రులను గొట్టి, యమమందిరము నొందించెను. మఱియు మూఁడుబాణములచే బలవంతుఁడగు శత్రుంజయుని స్వర్గలోకమున కనిపెను. ఓరాజా! అటు లతఁ డప్పాంచాలురఁ బీడించి, మఱియుఁ గుపితుఁడై యొకయుగ్రసాయకముసంధించి,దాని నాఘటోత్కచునిపైఁ బ్రయోగింప, నది వానిహృదయమును భేదించి పుడమిఁజొచ్చెను. అటులు హతుఁడై పడిన యాఘటోత్కచుని ధృష్టద్యుమ్నుఁడు వేఱొకచోటికిఁ దీసికొనిపోయెను. అంత నాద్రోణతనయుఁ డట్లు యుధిష్ఠిరసైన్యము నోడించి సింహనాద మొనరింప, నీపుత్రులెల్ల నాతనిఁ బూజించిరి. అపు డారణరంగము బహువిధములుగాఁబడియున్న గజాశ్వాదులచేఁ గొండశిఖరములచేవలె దుష్ప్రవేశమై, భయముగొలుపుచుండెను. ఆద్రోణసుతుని సిద్ధగంధర్వపిశాచసంఘములును, సుపర్ణులును, నాగులును, బితరులును, రక్షోగణములును, భూతములును, నప్సరసలును, సురలును సన్నుతింపఁజొచ్చిరి." అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె,

## ద్రోణయుధిష్ఠిరులయుద్ధము

ఓరాజా! అటు లాయశ్వత్థామ, ద్రుపదపుత్త్రులను, గుంతిభోజ తనయులను, రాక్షసులను హతులఁగావించుటఁ గాంచి, భీమయుధిష్ఠిరులును, ధృష్టద్యుమ్నుఁడును, సాత్యకియుఁ గలిసి, యుద్ధాభినివేశముతో నుండిరి. అపుడు సోమదత్తుఁడు కుపితుఁడై సాత్యకిని గాంచి, గొప్పశరవర్షముచే నాతనిఁ గప్పఁగా, నంతట నీవారికిని బాండవులకును నద్భుతకరమగు గొప్పయుద్ధముజరుగ నారంభమగుడు, సాత్యకికి సహాయుఁడై, భీముఁ డాసోమదత్తునిఁ బదిబాణములచే నొప్పింప, వాఁడును నూఱువాఁడికోలలచేఁ బ్రతిప్రహార మొనరించెను. అంత నాసాత్యకియుఁ గుపితుఁడై, నహుషపుత్త్రుఁ డగుయయాతివలె వృద్ధగుణములతోఁగూడి వృద్ధుఁడైయున్న యాసోమదత్తుని వజ్రతుల్యములై తీవ్రములగుపదిబాణములచే నొప్పించి, మఱియు నొకశక్తిచే నోనాఁటనేసి, యేడుబాణములచే మరలఁ గొట్టెను. పిదప నాసాత్యకికై మఱియు నాభీముఁడు క్రొత్తదై దృఢమగునొకపరిఘము నాసోమదత్తునితలపైఁ బడునట్లుగా విసరెను. అపుడు సాత్యకియుఁ గుపితుఁడై యాసోమదత్తునురము గుఱిచూచి యగ్నితుల్యమై తీవ్రమైన యొకసాయకమును బ్రయోగించెను. ఘోరములగు నారెండు నొక్కమాఱే వీరుఁడగునాసోమదత్తునిశరీరమునఁ బడునంతనే యాతఁడు మూర్ఛితుఁడై పడియెను. అటులు తనతనయుఁడు మూర్ఛనొంద, బాహ్లికుఁడు సాత్యకిని దలపడి, వర్షాకాలమేఘమువలె శరవర్షము గురియుచుండ, మఱియు నాభీముఁడు సాత్యకినిమిత్తముగా నాబాహ్లికునిఁ దొమ్మిదిబాణములచే నొప్పించెను. అందులకతఁడలిగి యాభీమునురముగాఁడునట్లుగానింద్రుఁడు వజ్రాయుధమునువలె నొకశక్తినివైవ, దానిచే నతఁడెంతయు నొచ్చి, చలించి మూర్ఛపడి, మఱియుఁ దెలివొంది, యాబాహ్లికుపై నొకగదను వైవ,నది యాకురువృద్ధుతలను దెగనేసెను. అపు డాతఁడు వజ్రాహతమగు వృక్షమువలెఁ బుడమిఁబడియెను. వీరుఁడగు నాబాహ్లికుఁ డట్లు హతుఁడుగాఁజూచి నీతనయులు పదుగురు శ్రీరామవిక్రములై యాభీమునిఁ దలపడిరి. అటులు దలపడిన నాగదత్తుఁడు, దృఢరథుఁడు, వీరబాహుఁడు, అయోభుజుఁడు, దృఢుఁడు, సుహస్తుఁడు, విరజుఁడు, ప్రమాథి,

ఉగ్రుఁడు, అనుయాయి అనెడిపదువుర నారసి, యాభీముఁడు కుపితుఁడై భారసాధనములగు సాయకములను బూని, యొక్కొకదానిచే నొక్కొకని నోనాటనేయ, వారు విగతచేతనులై రథములనుండి చండవాత భగ్నములై కొండనుండికూలిన వృక్షములనా నేలఁగూలిరి. ఓరాజా! పదిబాణములచేఁ గ్రమముగా నీతనయులఁ బదుగుర మడియించి, పిదప నాభీముఁడు కర్ణపుత్రుఁడగు వృషసేనునిఁ బ్రహరింపఁ గర్ణసోదరుఁడగు వృకరథుఁడు కొన్నినారాచముల నొప్పించుటయు, వాని నాభీముఁడు వధించి, మఱియు నీస్యాలులగు నేడ్వురురథికులను గొట్టి, మఱికొన్ని బాణములచే శతచంద్రుని సంహరించెను. అదిచూచి శకునిసోదరులగు గవాక్షుఁడు, శరభుఁడు మున్నగువారు భీముని దలపడి, తీవ్రనారాచములచే నొప్పించిరి. ఆభీముఁడు వారి నారాచములచే వర్షవేగముచేఁ బర్వతమువలె గప్పంబడి, యతిబలులగు వారినేవురనైదుబాణములచేఁ జంపెను. వారటులు హతులగుటకు మనక్షత్రియయోధులెల్లఁ జింతిల్లిరి. పిదప ధర్మజుఁడు కుపితుఁడై ద్రోణుఁడును నీపుత్రులును గాంచుచుండఁగనే నీసైన్యముచు ఖండింపఁదొడంగెను. నాఁటి యుద్ధమున యుధిష్ఠిరుఁ డంబష్ఠులను మాలవులను త్రిగర్తులను శిబులను మృత్యులోకమునకుఁ బంపించెను. మఱియు నతఁడు నభీషాహులను, శూరసేనులను, బాహ్లీకులను, వసాతికులను ఖండించి, పుడమిరక్తసిక్తముగావించి, యటులే యౌధేయులను, మద్రకులను నొకక్షణములో నిజసాయకపరంపరలచే యమమందిరము నొందింపఁగా, 'యుధిష్ఠిరునిఁ గొట్టుఁడు, పట్టుకొనుఁడు, నొప్పింపుఁడు, ఖండింపుఁడు, చంపుఁడు' అనుధ్వనులు సంకులమై వినవచ్చెను. పిదప మనసైన్యములను దోలఁగదోలు నాయుధిష్ఠిరు నారసి, యాభారద్వాజుఁడు నీతనయుఁడుతన్నుఁ బ్రేరేప, నాతని సాయకములచేఁగప్పుచుఁ, గుపితుఁడై యతనిపై వాయవ్యాస్త్రమును బ్రయోగింప, ధర్మజుఁడును దనవాయవ్యాస్త్రముచేఁ బ్రతిహతి గావించెను అపుడాద్రోణుఁడు తనయస్త్రము నిహతమగుడు మరల నాతనిపై వారుణ, యామ్య, త్వాష్ట్రసావిత్రాగ్నేయాస్త్రములను గ్రమముగా నాయుధిష్ఠిరునిఁ జంపువాఁడై ప్రయోగింప, నతఁడును గ్రమముగా నాయాయస్త్రములచే నాద్రోణాస్త్రములను బడఁగొట్టెను. అప్పు డాకుంభసంభవుఁడు తన ప్రతినసత్యమగునట్లుగా నాయుధిష్ఠిరునిఁ

బీడించి, నీతనయునకు హితమొనర్పవలయునని యైంద్రాస్త్రమును బ్రాజాపత్యాస్త్రమును బ్రాదుర్భవింపఁజేయఁగాఁ గురుశ్రేష్ఠుఁడును, గజసింహగామియు, విశాలవక్షుఁడును, బృథులోహితాక్షుఁడునునగు నాయుధిష్ఠిరుఁడును, దనయస్త్రములచే వానిని బరిహరించెను. అటులు తనయస్త్రములెల్ల భగ్నములగుడు నాద్రోణుఁ డెంతయుఁ గుపితుఁడై, యెటులేని యుధిష్ఠిరుని మడియింపవలెనని బ్రహ్మాస్త్రమును బ్రయోగించెను. ఓరాజా! అపుడు ఘోరమైనచీకటులు జనింపఁ గొంచెమేనిఁ దెలియఁబడకుండెను. సకలభూతములకు నపుడు భయముగలుగఁ జొచ్చెను. ఆద్రోణుఁ డటులు బ్రహ్మాస్త్రమును బ్రయోగించుటయు, నాధర్మజుఁడును దనబ్రహ్మాస్త్రముచే దానిని నివారింప, యుద్ధవిశారదులగు నాద్రోణయుధిష్ఠిరుల నిర్వురను సేనాముఖ్యులెల్ల సన్నుతించిరి. పిమ్మట నాద్రోణుఁ డాయుధిష్ఠిరునివిడిచి కోపావేశపరవశుఁడై పాంచాలసైన్యముపైఁబడి వాయవ్యాస్త్రముచే వారిని బీడించెను. అటులు వారెల్లఁ బీడితులై భయార్తులగుచుఁ బరువులిడసాగిరి. దాని నాభీమార్జునులు గాంచుటను, దమగొప్పరథములతో నాద్రోణునిపైకి మరలి, యప్పాంచాలసైన్యము నిలువరించి, యాతనిదక్షిణపార్శ్వమునఁ బార్థుఁడును, నుత్తరపార్శ్వమున భీముఁడును నిలువఁబడి, గొప్పసాయకములచే నొప్పింపసాగిరి. అపుడు కైకయులును, సృంజయులును, బాంచాలురును, మాత్స్యులును, యాదవులును నాభీమార్జునుల ననుసరించియుండిరి. అపు డక్కిరీటిచే భారతసైన్యము వధింపఁబడుచు, మఱియుఁ దమ్ముఁ జీకటులును నిద్రయుఁ గప్పఁ జెదరఁజొచ్చెను. అంత నాద్రోణుఁడును, నీతనయుఁడును, దమసైన్యమును మరలింపఁజూచిరిగాని వారికది సాధ్యపడదయ్యె" నని తెలిపి సంజయుఁడు మఱియు నాతనితో నిట్లనియె.

## కర్ణకృపాచార్యులసంభాషణము

"ఓరాజా! అప్పాండవమహాసైన్య మటులు విజృంభించుటయు నందుల కోర్వక, సుయోధనుఁడు కర్ణునితో 'ఓమిత్రమా! ఈసైన్యమెంతయు సహింపరాకుండుటను, మనమిత్రులకెల్లఁ గాలము సమీపించె ననవలసియున్నది.మహారథులగు పాండవకేకయమాత్స్యపాంచాల

యోధులచే నావరింపఁబడియున్న మనమహారథులనెల్ల నీవెటులైనఁ గాపాడవలయును. వైరులెల్ల నెల్లెడలఁ బాములువలె నెంతయుఁ గుపితులై బుసలుకొట్టుచున్నవారు. సంతుష్టాంతరంగులై యింద్రోపములగు నిప్పాండవులును బాంచాలురును నెట్లు సింహనాదము లొనర్చుచున్నవారో చూడుము.' అనిపలుక విని యారాధేయుఁ డిట్లనియె.

'ఓమిత్రమా! ఇప్పు డిప్పార్థునిరక్షించుటకై యప్పురందరుఁడు వచ్చినను, వాని నోడించి యీక్రీడిని బీడించువాఁడను. ఓభరతోత్తమా! నిజముగాఁ బ్రతినవట్టి చెప్పుచున్నాఁడను. నేనిదె పాండవులను బాంచాలురనుజంపి, యింద్రునకుఁ గుమారస్వామివలె, నీకు జయమొసంగెదను. ఈరణసమయమున నీకు నేను మేలుగూర్పవలసియున్నదిగాదే! పాండవులలోఁ బార్థుఁడేగదా బలవత్తముఁడు? వానిపై నింద్రదత్తమగు నాయమోఘశక్తిని బ్రయోగించెదను. వాఁడు హతుఁడయ్యె నేని వానిసోదరులు నీకు వశులైయుందురు. లేదా వనమునకేని మరలఁ బోవుదురు. ఓకౌరవరాజా! నేను జీవించియుండఁగా నీవు విచారింప నేటికి? నే నీసమరమున నప్పాండవులనెల్ల జయింపఁగలను. మఱియు నాకేకయులను, మాత్స్యపాంచాలురను, వృష్ణులను నాసాయకములచే ఖండించి, నీ కీధరామండలమొసంగెదను. కావున నూఱడిల్లుము.'

ఓయాంబికేయా! ఆరాధేయువచనములు విని, మహాబాహుండగు కృపుఁడు నవ్వుచు, నాతనితో 'ఓసూతపుత్రా! మేలు మేలు. మాటలచేఁ గార్యములుసిద్ధించునేనిఁ దనకు నాథుఁడవగు నీచే నీసుయోధనుఁడు సనాథుఁ డగుచున్నవాఁడు. ఓరాధేయా! ఈరాజుకడ నిట్లెల నిన్ను నీవే శ్లాఘించుకొనియెదు? నీవిక్రమముగాని, దానిఫలముగాని కానరాలేదు. అక్కౌంతేయులతో నీవు పెక్కుసారులు యుద్ధమునఁ గలియుట చూచితిమి. ఓసూతనందనా! నీవెప్పుడును వారికోడుటయ గానవచ్చెను. ఓకర్ణా! నాఁ డీసుయోధనుఁడు గంధర్వులచే హరింపఁబడుచుండ, సైన్యములన్నియు యుద్ధముచేయుచున్న ముందుగాఁ బరువిడినవాఁడవు నీవగదా! అటులే విరాటనగరమునఁ గౌరవులెల్ల గలిసి పోరాడి యోడినపుడు, నీతమ్ములతోఁగూడ నీవును నోడితివిగాదే? ఒక్కపార్థునకేని నీవు చాలవుగదా! యుద్ధమునఁ గృష్ణునితోఁ గూడఁ బాండవులనెల్ల జయింతునని యెటు లుత్సహించుచున్నాఁడ

వోయి? ఓసూతపుత్రా! నీవెక్కువగా శ్లాఘించుకొనుచున్నాఁడవు. మాటలతోఁ బనిలేదు. యుద్ధముచేయుము. ఎవఁడు మాటలాడక తన విక్రమముచూపునో వాఁడే సత్పురుషుఁ డనఁబడును. ఓసూతపుత్రా! శరత్కాలమేఘమువలె నిష్ఫలముగా గర్జించుచుఁ, గార్యరహితుఁడవై గానవచ్చుచున్నవాఁడవు. అదియీరాజెఱుంగకున్నవాఁడు. ఓరాధేయా! నీ యీ గర్జనము లప్పార్థుఁ డగపడకుండునంతవఱకేగాని, యాతఁడు నిన్ను సమీపించి కంటఁబడునేని, మఱి వినరావు. ఆఫాల్గునుబాణములు నీపైఁ బడునంతకునే నీయీగర్జనములు. పార్థసాయకవిద్ధుఁడవగుదువే, నయ్యవి యెందులకో వెడలిపోవును. బాహుబలముచే క్షత్రియులును, వాక్కులచే బ్రాహ్మణులును శూరులైయుందురు. విల్లుపట్టి పార్థుఁడు శూరుఁడగుచున్నాఁడు. ఓకర్ణా! నీవు మనోరథములచే శూరుఁడవు. ఓరీ! పరాక్రమముచే రుద్రుని సంతసింపఁజేసినయప్పార్థు నెవ్వఁడు మార్కొని ప్రహరింపఁగలఁడు?' అని యాతనిఁ దిరస్కరించెను.

ఓధృతరాష్ట్రా! ఇటు లాకృపాచార్యునిచే నుద్దీపితుఁడై యా రాధేయుఁ డాకృపునితో 'ఓయీ! శూరు లెపుడును వర్షకాలమేఘములువలె గర్జింపకమానరు. పుడమిఁ నుంచినబీజమువలె వారు వెంటనే ఫలమును గల్గింతురు. రణరంగమున, నాయుద్ధభారమెల్లఁ బూనికొనిన శూరులగువారు గర్వించి పల్కుటలో దోషము నాకేమియుఁ గానరాలేదు. ఎవ్వఁడు కార్యభారమును మనఃపూర్వకముగా వహింప నెంచునో, వాని కాకార్యమందుఁ దప్పక దైవము సహాయుఁడగును. ఓబ్రాహ్మణుఁడా! నా ప్రయత్నమే నాకు సహాయముగా నీయుద్ధకార్యభారమును మదినుంచికొని, యుద్ధమునఁ గృష్ణసాత్వతులతోఁగూడఁ బాండవులను గొట్టి గర్జించుచున్నవాఁడను. ఇందు నీకుఁగల నష్టమేమి? శూరులగువా రెన్నఁడును, శారదాభ్రములవలె వ్యర్థముగా గర్జింపరు. తమసామర్థ్య మెఱిఁగియే పండితులు గర్జింతురు. ఓగౌతమా! నేనిపుడు సన్నద్ధులైయున్నవాసుదేవార్జునుల నోడింప, మనఃపూర్వకముగా సిద్ధపడియుండుట నిటులు గర్జించుచున్నవాఁడను. ఓవిప్రా! నా యీగర్జనమునకు ఫల మీవే గాంచెదవు. సపరివారులగుపాండవులను, గృష్ణసాత్వతులతోఁగూడఁ బ్రహరించి, దుర్యోధనున కిప్పుడమినెల్ల నిష్కంటముగా నొసంగెదను.' అని పలికెను.

ఓరాజా! అది విని మఱియు నాకృపుఁ డాతనితో 'ఓసూత పుత్రా! నీమనోరథప్రలాపముల నేను గ్రహింపను. నీవెప్పుడును నవ్యాసుదేవార్జునులను, యుధిష్ఠిరుని నిందించుచునేయుందువు. యుద్ధ విశారదులగువారుగలచోట జయము నిశ్చితమైనది. యుద్ధమున సన్నద్ధులైన దేవగంధర్వయక్షులకును, మానవోరగపక్షులకును, కృష్ణార్జునులు జయింపరానివారు. మఱియు ధర్మజుఁడు, బ్రహ్మణ్యుఁడును, సత్యవాదియు, దాంతుఁడును, పితృదైవతపూజకుఁడును, సత్యధర్మరతుఁడును, విశేషించి కృతాస్త్రుఁడును, ధృతిమంతుఁడును, కృతజ్ఞుఁడు నైన వాఁడు. ఈతనిభ్రాతలునైతము, బలవంతులై సకలశస్త్రాస్త్రకృతపరిశ్రములైయున్నవారు. మఱియు వారు గురుభక్తియుతులును, ప్రాజ్ఞులును, ధర్మరతులును, గీర్తిధనులు నైనవారు. ఇంకను నాతని సంబంధులు శక్రతుల్యపరాక్రములై భక్తిగల్గి యుద్ధముచేయువారు. ద్రుపద పుత్రులగు ధృష్టద్యుమ్నుఁడు, శిఖండియు, దౌర్ముఖియు, జనమేజయుఁడు, చంద్రసేనుఁడు, రుద్రసేనుఁడు, కీర్తివర్మ, ధ్రువుఁడు, ధరుఁడు, వసుచంద్రుఁడు, దామచంద్రుఁడు, సుతేజనుఁడును వీరికి సంబంధులు. ద్రుపదుఁడును మహాస్త్రవేత్త. ఇప్పాండవులకుఁగా విరాటుఁడు సోదరులతోఁగూడి సన్నద్ధుఁడై యున్నవాఁడు. గజానీక, శ్రుతానీక, వీరభద్ర, సుదర్శన, శ్రుతధ్వజ, బలానీక, జయానీక, జయప్రియ, విజయ, లబ్ధలక్ష, జయాశ్వ, రథవాహన, చంద్రోదయ, కామరథులు విరటునిసోదరులు. నకులసహదేవులును, ద్రౌపదేయులును, ఘటోత్కచుఁడును వీరికై పోరాడువారును నాశములేనివారు నైయున్నవారు. వీరే గాక యింక ననేకులును ధర్మజునకుఁ గలరు. మఱియు దేవాసురమానవులతో, యక్షరాక్షసగణములతో భూతభుజగద్విపాదులతోఁ గూడి యున్నసకలజగము నాభీమార్జునులు తమయస్త్రబలముచే నిశ్శేషము గావించువారు. ఇంతయేల! ఆధర్మజుఁడు తనఘోరదృష్టిచేతనే పుడమి నెల్ల దహింపఁగలఁడు. అప్రమేయుఁడగు నవ్యాసుదేవుఁ డాయుధిష్ఠిరు కార్యము నిర్వహింపనున్నవాఁడు. ఓకర్ణా! అట్టివారి నీయుద్ధమున నెట్లు జయింప నుత్సహించుచున్నవాఁడవు? ఓసూతపుత్రా! నీవు సమరమున శౌరితోఁ బోరాడ నుత్సహించుట యొకగొప్ప యపనీతికాకపోదు.' అని బోధించెను.

ఓయంబికానందనా! ఇటు లాకృపుఁడు వలుక విని యారాధే యుఁడు నవ్వుచు, మఱియు నాకృపాచార్యునితో నిట్లుపలికెను. 'ఓబ్రా హ్మణా! నీవిపు డప్పాండవులనుద్దేశించి చెప్పినవచనములన్నియు సత్య ములుగాకపోవు. వారియం దివియగాక మఱికొన్నిసుగుణములు సైతము లేకపోలేదు. ఇంద్రునితోఁగూడిన దేవతలకును సమరమున వా రజేయులనుటయు సత్యమే. అటులయినను నింద్రదత్తమగుశక్తిచే నప్పార్థుల నోడింపఁగలను. ఓద్విజా! ఆయింద్రుఁడు దీనిని నాకొసఁగినపు డమోఘ మిదియని తెలిపెను. మున్ముగా యుద్ధమున దీనిచే నాసవ్య సాచిని జంపెదను. వాఁడు హతుఁడుగాఁ గృష్ణుఁడును, యుధిష్ఠిరాదు లును, నర్జునవిరహితులగుటఁ బుడమిఁబాలింప నసమర్థులగుదురు. ఓగౌ తమా! అటులు వారెల్ల నశింపఁగాఁ జతుస్సముద్రముద్రితమగు నిమ్మేదిని యత్నములేకయే సుయోధనునకు వశపడునుగదా! చక్కఁగా నీతిదెలి సినవారికి సర్వార్థములును సిద్ధించుటలో సందియమెందులకు? ఓగౌతమా! ఇదియెల్లఁ దలంచికొనియే నేనిటులు గర్జించుచున్నాఁడను. నీవు వృద్ధుఁ డవును, బ్రాహ్మణుఁడవు, సమరకర్తవ్య మెఱుఁగనివాఁడవును, మఱియుఁ బాండవపక్షపాతివి నగుట నన్నిటులు దూఱుచున్నవాఁడవు. ఓవిప్రా! మరల నీవిట్లు నాకప్రియమువల్కుదువేని, నాకత్తిచే నీనాల్కఁగోయు వాఁడను. ఓదుర్మతీ! మాకౌరవసైన్యములకు భయముగల్గునట్లుగాఁ బాండవులను నీవు సన్నుతింపఁదలంతువేని యావిషయమునసైతము నేనొకమాట చెప్పెదను వినుము. ఓయీ! సుయోధనుఁడును, ద్రోణుఁ డును, శకునియు, దుర్ముఖజయులును, దుశ్శాసన, వృషసేన, శల్యుఁడును, నీవును, సోమదత్తుఁడును, భూరియు, నశ్వత్థామయు, వివింశతియు యుద్ధవిశారదులై సన్నద్ధులై మనపక్షమున నున్నవారుగాదే? ఇంద్ర తుల్యుఁడగువైరియేని వీరినెల్ల నీరణరంగమున నెవ్వఁడు జయించునో తెలుపుము. వీరు శూరులును, గృతాస్త్రులును, బలవంతులును, స్వర్గము గోరి పోరాడువారునుగారే? యుద్ధధర్మము లెఱిఁగినవారగుట నిపుణులై వీ రా దేవతలనైనఁ జంపగల్గుదురు. వీరెల్ల సంగ్రామమును బాండవవధా ర్థులైనిలువఁబడియుందురు. వీరెల్ల నిక్కారవేయునిజయము గోరుచున్న వారుగాదే? ఎంతబలవంతులకేని జయము దైవాధీనమని తలంపవల యును. మహాబాహుఁడగుభీష్ముఁడు శరశతప్రహతుఁడై శయనింపలేదా?

మఱియు దేవతలకును జయింపరాని వికర్ణ చిత్రసేన బాహ్లికజయద్రథు లును; భూరిశ్రవుఁడును; జయ, జలసంధ, సుదక్షిణులును, శల భగదత్తు లును ; బాండవులచే నిహతులై సమరరంగమునఁ బడియుండలేదా ? ఓపురుషాధమా! ఇది దైవయోగముగాక మఱియేమని తలంతువు? ఓవిప్రా ! రాజునకు వైరులగుపాండవుల నెల్లపుడును బొగడుచుందువు గదా! వారిలో శూరులగువారు వందలకొలందిని, వేలకొలందిని మర ణింపలేదా ! పాండవసైన్యములతోఁగూడఁ గౌరవసైన్యములు నశించు చున్నవి. ఇందుఁ బాండవులప్రభావ మధికముగా నేమియుఁజూపట్టలేదు. ఓనరాధమా ! వారు బలవంతులని నిత్యము నెందులకుఁ బొగడు చుందువో తెలియకున్నది. ఈసమరమున సుయోధనునిహితముకై నా శక్తికొలఁదిని వైరులతోఁ బోరాడఁ బ్రయత్నింతును. జయము దైవా ధీనము' అనిపలికె'' నని తెలిపి సంజయుఁడు మఱయు నిట్లనియె.

### దుర్యోధనుఁ డశ్వత్థామతో సంభాషించుట

"ఓరాజా ! రాధేయుఁ డటులు తనమేనమామను బరుషముగాఁ బలుకుటఁ గాంచి యాద్రోణసుతుఁడు వడిగాఁ గత్తినెత్తి సుయోధ నుఁడు చూచుచుండఁగనే యెంతయుఁ గుపితుఁడై, మత్తగజముపై నుఱుకుసింగమువలెఁ బఱుట కుద్యుక్తుఁడై యిట్లు పలికెను.

'ఓనరాధమా ! రాధేయా ! సత్యములగు నర్జునుసద్గుణములను బలుకుచున్న శూరుఁడగు నామేనమామ నిటులు ద్వేషముచే నిందించు చున్నవాఁడవు. ఓదుర్మతీ ! నీవు గర్వించుచు, నిన్ను నీవే పొగడికొనుచు, సర్వలోకధనుర్ధరుఁడగు పార్థుని శౌర్యముచే రణరంగమున లక్ష్యపెట్టక తిరస్కరించుచున్నవాఁడవు. నీకస్త్రము లెక్కడ? బలమెక్కడ?నీవుచూచు చుండఁగా నాగాండివధరుఁడు నిన్నోడించి, యాజయద్రథు నిపుడు సంహరింపలేదే? ప్రత్యక్షముగా యుద్ధమున నమ్మహాదేవుని నెవ్వఁడు జయించి మెప్పువడసెనో యట్టివానిని జయింతునని వ్యర్థముగాఁ దలంచు చున్నాఁడవు. ఓసూతాధమా ! నీమనోరథములతో నేమిపని? కృష్ణసహి తుఁడై సకలధనుర్ధరోత్తముఁడైనయప్పార్థుని నింద్రాదిదేవతలు సైతము జయింపఁజాలరు. ఓసూతా ! లోకైకవీరుఁడైన యాయర్జునుని నీవీక్షత్రి యయోధులతోఁ గూడియు జయింపఁజాలవని వేఱచెప్పవలెనా ?ఓకర్ణా!

దుర్మతీ! నరాధమా! ఇపుడు నిలువుము. ఇదె చూడుము. నీశరీరము నుండి శిరము తప్పించుచున్నవాఁడను.'

ఓరాజా! అది విని కత్తిపట్టుకొనియున్నయాతనిఁ గాంచి, నీ తనయుఁడగు సుయోధనుఁడు, వడిగా లేచి యాద్రోణపుత్త్రునిఁ, గృపుని నివారించెను. అపుడు కర్ణుఁడు లేచి 'ఓ రాజా! ఈద్విజాధముఁడు దుర్మతియై, సమరశూరుఁడనని గర్వించుచున్నవాఁడు. నాపరాక్రమ మెట్టిదో గాంచఁగలఁడు వీనిని విడువుము' అని పలికెను. అంత మఱియు నాయశ్వత్థామ 'ఓరీ! సూతాత్మజా! దుర్మతీ! నీయీతప్పు క్షమించితిమి. నీయీదర్పము నప్పార్థుఁడే యడఁగించెడిని' అని పలికెను. అపుడు సుయోధనుఁ డాయశ్వత్థామ నారసి 'ఓబ్రాహ్మణోత్తమా! ప్రసన్నుఁడవగుము. క్షమింపుము. ఈరాధేయునిపైఁ గోపముచేయఁ దగదు. ఓద్విజసత్తమా! నీయందును, గర్ణునందును, గృపద్రోణశల్య శకునులందును, గొప్పకార్యభార ముంచితినిగాదే? ప్రసన్నుఁడవగుము. వీరందఱును నీరాధేయునితోఁ బోరాడ నభిముఖులై యున్నవారు. ఓబ్రాహ్మణోత్తమా! ఇదె పాండవులెల్లెడల నిలిచి మనలఁ బిలుచుచు వచ్చుచున్నవారు' అని తెలిపెను.

ఓయాంబికేయా! నీకొమరుఁ డటులు కోపపూరితుఁడై యున్న యాద్రోణపుత్త్రునిఁ బ్రసన్నునిఁగావింప నతఁ డూరకుండెను. పిదప సుహృదయుఁడగు నాకృపాచార్యుఁడు సౌమ్యస్వభావముతో గడు వడిగా మార్దవముఁబూని కర్ణునితో 'ఓసూతపుత్త్రా! మాకు నీతో నేమిపని? నిన్ను మేము క్షమించితిమి. నీగర్వమెల్ల నప్పార్థుఁడే నశింపఁ జేయు'నని శాంతించి యూరకుండెను. ఓరాజా! పిమ్మటఁ గీర్తిధనులగు పాండవులును బాంచాలురు నందులకువచ్చిరి. పిదప రథికోత్తముఁడగు నారాధేయుఁడును బ్రతాపశాలియైవిల్లువట్టి, దేవగణములచే నింద్రుఁడు వలెఁ గౌరవులచేఁ బరివృతుఁడై, నిజబాహుబల మాశ్రయించి నిలువఁ బడియుండెను. అప్పు డప్పాండవులతోఁ గర్ణునకు యుద్ధ మారంభమై, సింహనాదములచే భయముగొల్పుచుండెను. పిదప నప్పాండవపాంచాలు రా రాధేయు నారసి, గొప్పనినాదముల నొనర్చిరి. కొంద ఱిదె కర్ణుఁడనియుఁ, గర్ణుఁ డేఁడియనియు 'కర్ణా' నిలుమనియు, మాతో యుద్ధ ముచేయుమనియుఁ బలుకఁజొచ్చిరి. మఱికొందఱు "ఓదురాత్మా! పురు

పాధమా! రమ్ము, యుద్ధముచేయుము, అనియుఁ బలుకుచు నాతనిఁ గాంచి క్రోధతామ్రాక్షులై, 'అల్పబుద్ధియై, గర్వితుఁడగు నీరాధేయుఁడు వధింపఁబడుఁగాక. వీఁడు బ్రదికినఁ బ్రయోజనము లేదు. వీఁడెల్లపుడును బాండవులపై ద్వేషించుపాపాత్ముఁడు. వీఁడే యనర్థములకెల్ల మూలమై సుయోధనుమతము ననుసరించువాఁడు. కావున వీనిని జంపుఁడు' అని క్షత్త్రియు లాతనిపైకి బరువులిడ నారంభించిరి. అటు లప్పాండవేయ ప్రేరితులై వారా రాధేయు వధింప వెడలి, గొప్పశరవర్షముచేఁ గప్పుచు నురవడింప, నట్లు మహాబలులై వచ్చు పాండవులు మున్నగు యోధుల నారసియు, నతఁ డించుకేని జడియుటగాని, పరితపించుటగాని లేదు. అంత నతఁడు నీపుత్త్రునకుఁ బ్రియముగా సంగ్రామమునకోడక, మహాబలుఁడై సాయకసంఘముచే నద్భుతముగాఁ జూపట్టు నాశత్రుసైన్యసాగరము నల్లకల్లోలముగావింప మొదలిడెను. పిదపఁ బాండవులును, వారి యోధులును వేలకొలఁదిధనువులు ద్రిప్పుచు, దైత్యు లింద్రునితోవలె నారాధేయునితోఁ బోరాడ నారంభించిరి. అప్పార్థివులు గురియుచున్న శరవర్షమునెల్ల నాకర్ణుఁడు నిజశరపరంపరచేఁ బీడించుచువచ్చెను. అపుడు కృతప్రతీకారము లొనర్చుచున్న యవ్వీరులకు, దానవులతో నింద్రునకువలె నద్భుతయుద్ధము సాగెను. ప్రతియోధులెల్లఁ బ్రయత్నించియు నారాధేయు నొక్కని జయింపరాకుండుట, నాతని శరలాఘవ మెంతయు మాకద్భుతముగాఁ జూపట్టెను. అప్పు డతఁ డప్పార్థివులశరౌఘముల నెల్ల నివారించుచు, వారిరథయుగములందును, ఛత్త్రములందును, రథములందును, హయములందును నిజనామాంకితములగు ఘోరనారాచములఁ బఱపుచువచ్చెను. పిదప నారాజులెల్ల నారాధేయశరపీడితులై కలఁతవడి, చలిపీడవడనోపని గోవులువలె నందందుఁ బరిభ్రమింపఁజొచ్చిరి. కర్ణసాయకహతములైన గజాశ్వరథసమూహము లందందుఁ జూపట్టుచుండెను. ఓరాజా! సమరమున మరలక శూరులై పోరాడు వీరులశిరములు పడుట వానిచే బుడమియెల్ల వ్యాప్తమైయుండెను. హతములును హన్యమానములునగు సైన్యములచే నాయుద్ధరంగము యమపట్టణమునాఁ జూపట్టెను. ఓరాజా! పిమ్మట నాసుయోధనుఁ డారాధేయుపరాక్రమము నారసి, యశ్వత్థామకడకేగి యాతనితో 'ఓగురుసుతా! ఎల్లపార్థివుల నెదుర్కొని, కర్ణుఁ డెట్లు పోరుచున్నవాఁడో కాంచితే? మున్ను కుమారస్వామిచేఁ

బ్రహాతమైన రాక్షససైన్యమువలె మనకర్ణునిసాయకములకు వెఱచి యాసైన్య మెట్లు పరువిడుచున్నదో చూడుము. ఈసమరమునఁ గర్ణునిచే జయింపఁబడిన తనసైన్యమును జూచి యాసవ్యసాచి, యారాధేయు వధింపువాఁడై యదె వెడలుచున్నవాఁడు. అందఱును గాంచుచుండఁగా, మహారథుఁడగు నాసూతపుత్త్రు నప్పార్థుఁడు ప్రహరింపకుండు నట్టియుపాయ మొకటి చింతింపవలయునని పలికెను. అంత నాయశ్వత్థామయుఁ, గృపుఁడును, శల్యుఁడును, గృతవర్మఁడును, నారాధేయు రక్షించువారై యప్పార్థునిపైకివెడలిరి. ఓరాజా! అప్పు డప్పార్థుఁడును బాంచాలురతోఁగూడి, వృత్రాసురునిఁ బురందరుఁడువలె నారాధేయు నెదుర్కొనియెను." అని తెలుప విని ధృతరాష్ట్రుఁడు సంజయునితో 'ఓయీ! సంజయా! ప్రళయకాలయమునివలెఁ గుపితుఁడై యున్న యప్పార్థుం గాంచి యపు డేమిచేసెను? మహారథుఁడగు నతఁ డెల్లపుడును బార్థునితో స్పర్థచేయుచు నాతని జయింపవలెనని కోరుచుండును గదా! నిత్యము నత్యంతవైరియై యపు డటులు వడిగావచ్చిన యక్కవ్వాడిని బొడఁగని, యక్కర్ణుఁ డేమితలంచెను? అని పలికెను.

అదివిని సంజయుఁడు మఱియు నాతనితో "ఓరాజా! అటులు వచ్చుచున్నయప్పార్థునిఁ జూచి యారాధేయుఁడు చలింపక మార్కొన, నర్జునుఁ డాతని సువర్ణపుంఖములగు సాయకములచేఁ గప్పఁగా, నారాధేయుఁడును నాతని శరపరంపరచేఁ గప్పెను. మఱియు నప్పార్థుఁడు శరజాలముచే నాకర్ణు నాచ్ఛాదింప, నతఁ డాయర్జునుని మూఁడుబాణములచే నొప్పించెను. అపు డాతనిశరలాఘవము నారసి, యోరువక, యప్పార్థుఁడు దీప్తాగ్రములై, సానపెట్టినముప్పదిబాణములఁ బఱపి, మఱియు నొకబాణముచే నాతని నొప్పించి నవ్వుచు, మఱియు నొక నారాచముచే నారాధేయు సవ్యభుజాగ్రము నొప్పింప, వానిచేతినుండి ధనువు క్రిందఁబడియెను. అంత నమ్మహాబలుఁడగు రాధేయుఁడు మఱియు నాధనువు నొకయరనిముసములోఁ దీసికొని, తనకరలాఘవము వెలయ, సాయకసమూహములచేఁ గప్పఁగా, నప్పుఁ డప్పార్థుఁడు నగుచు నాతని శరవృష్టినెల్ల నివారించెను. అటులు వారిరువురును బరస్పరము శరజాలముచేఁ గప్పికొనుచుఁ గృతప్రతీకారము లొనర్చుకొనుచుండుట యత్యద్భుతముగావించెను. అపుడు వా రాడేన్గునకై పోరాడువనగజ

ములునాఁ జూపట్టిరి. పిమ్మట నప్పార్థుఁ డాకర్ణునివిక్రమముఁ గాంచి,
సహింపక ముష్టిప్రదేశమునఁగొట్టి, యాతనిధనువు దునుమాడి, భల్ల
ములచే నాతనియశ్వములను వధించి, మఱియు సారథిని బరిమార్చి,
పిదప విల్లుదెగి హతసారథియు హతాశ్వుఁడునై యున్నయారాధేయుని
నాల్గుబాణములచే నొప్పించెను. అటు లతఁడు పార్థప్రహారపీడితుఁడై,
తనరథమువిడిచి కృపునిరథ మధిరోహించెను. ఓరాజా! ఆకర్ణుఁ డట్లు
జీవితశేషమును నిల్పుకొనుటకై యక్కృపాచార్యరథ మధిరోహింపఁ
జూచి, నీవారిసైన్యములన్నియుఁ బార్థప్రహారభీతులై, దశదిశలకును
బరువులిడసాగెను. అంత నీతనయుఁ డటులు చెదరుచున్నతనసైన్యము
నారసి, దానిని దానే మరలించుచు 'ఓశూరులారా! క్షత్రియులారా!
పరువులిడకుఁడు. నిలువుఁడు. అప్పార్థునివధింప నిదె నేనే వెడలుచున్న
వాఁడను. పాంచాలురతోఁగూడిన యప్పార్థు నిదె నేను సంహరించె
దను. ఓక్షత్రియులారా! యుగాంతయమునివలె నేనిపుడాగాండీవితోఁ
బోరాడుచుండఁగా, నావిక్రమ మప్పాండవులు చూడఁగలరు. నాచే
వేలకొలఁదిగా విడువఁబడినబాణములు మిడుతలువలెనెల్లెడల వ్యాపింప,
నప్పాండవులు చూతురు. తొలుకరిమేఘమువలె నేను శరవర్షమును
గురియుచుండఁగా మనసైనికులు చూతురుగాక. తీవ్రసాయకములచే
నిపుడే యప్పార్థు నోడించెదను. కావున, నోశూరులారా! అప్పార్థు
నుండి వెఱపుడిగి నిలువుఁడు. ఆయర్జునుఁడు నన్నెదుర్కొనెనేని నాపరా
క్రమమును సహింపఁజాలఁడు. సాగరము వేలనుమీఱిపోఁగల్గునా?'
అని తెలిపి తనమహాసైన్యముతో నప్పార్థునిపైకి మరలి, క్రోధ
తామ్రాక్షుఁడగుచు సంరంభింపఁగా, నపుడు కృపుఁ డాతనిఁ గాంచి,
యశ్వత్థామతో 'ఓవత్సా! మహాబాహుఁడగుమనరాజు, సహింపక
కోపావేశపరవశుఁడై. యగ్నిలోఁబడు మిడుతవృత్తి నాశ్రయించి
పార్థు నెదుర్కొనఁబోవుచున్నవాఁడు. మనము చూచుచుండఁగా
నిప్పు డప్పార్థునిచే నితఁడు ప్రాణములు విడువకుండునట్లుగా మన
మాయర్జును నివారింపవలసియున్నది. ఆకౌంతేయుశరసంతానము
లగపడనంతకే యీకౌరవవీరుఁ డీరణరంగమున నిలుచును. పొరలువిడి
చినపాములునాఁదగు నప్పార్థుఘోరనారాచములపాల్పడి, యీరాజు
భస్మముగాకమునుపే మన మీతని నీయుద్ధమునుండి మరలింపవల

యనుజుమీా! మన మిటు లుపేక్షించియుంట తగవుగాదని యూహింతును. ఇతఁడు సహాయములేక తానొక్కఁడే పార్థునిపైఁ బడువిడుచున్నవాఁడు. అటులగుట నిఁక నీతనిజీవితము దుర్లభమని తలంచుచున్నాఁడను. ఇతనికిఁ బులినోటఁబడినయేన్గుదశ సంభవించెను.' అని తెలిపెను. అంతఁ దన మామమాటలు విని యశ్వత్థామ, వడిగా నాసుయోధనుసమీపించి యాతనితో 'ఓరాజా! నేను జీవించియుండఁగా నీవు యుద్ధముచేయవలసిన యగత్యములేదు. నిత్యము నీహితమును గోరుచున్ననన్ను మన్నించి యుద్ధమున కనుపవలెనుగాని, పార్థునివిజయమునకై నీవు సంభ్రమింపనేటికి? ఓసుయోధనా! నీవాఁగుము. నేనాపార్థుని నివారించెదను.' అని పలికెను. అది విని సుయోధనుఁడా ద్రౌణితో 'ఓవీరాగ్రణీ! అప్పాండవుల నాచార్యుఁడు పుత్రులవలె రక్షించుచున్నవాఁడు. నీవును నావైరులను, వారియెడ నుపేక్షసేయుచున్నవాఁడవు. అదియుఁగాక నేను మందభాగ్యుఁడ నగుటచే యుద్ధమున నీవిక్రమమునైతము క్షీణించుచున్నది. అటులగుట ధర్మరాజుహితమునకో? ద్రౌపదిహితమునకో? తెలియదు. ఛీ! ఛీ! నాదేమిబ్రదుకు? లుబ్ధుఁడనగు నాకై, సుఖకాములైయున్న బందుగులందఱును బరాజితులై దుఃఖమొందుచున్నవారు. శస్త్రధారులలో నుత్తముఁడును, మహేశ్వరసముఁడునునగు గౌతమీసుతుఁడు నైతము శత్రుని సంహరింప శక్తుఁడుగాకుండెను. ఇది నాయభాగ్యముగాదే? ఓ ద్రోణతనయా! నీవు ప్రసన్నుఁడవగుము. నా యీశత్రులను నశింపఁజేయుము. నీయస్త్రములకు గోచరులగు దేవతలును దానవులును నిలువఁజాలరు. ఓయశ్వత్థామా! నీ పాంచాలసోమకులను సపరివారముగాఁ జంపుము. నీచేఁ బరిరక్షితులమై, మేము దక్కినవారిని నశింపఁజేయుదుము. కీర్తిధనులగు నిప్పాంచాలురును సోమకులును గుపితులై, యిదె దవాగ్నివలె నా సైన్యమునఁ జరించుచున్నవారు. ఓమహాబాహూ! వారిని గైకయులను నివారింపుము. వారు పార్థరక్షితులై మనసైన్యమును నిశ్శేషము చేయుచున్నవారు. ఓవైరిమారకా! వడిగా నందులకు వెడలుము. ఓ బ్రాహ్మణోత్తమా! తొలుతఁగాని, చివరఁగాని, యిప్పని నీదైయున్నది. ఓమహాబాహూ! నీ విప్పాంచాలురను బంచత్వమొందించుటకే జనించినవాఁడవుగదా! కావున నీవిఁక నీజగమును, పాంచాలరహితముగా

నొసర్పవలయును. నీవిటులు చేయఁగల్గుదువని సిద్ధులు దెలిపియున్న వారు. కావున నది యటులే యగును. ఇంద్రాదిదేవతలును నీయస్త్రములకు గోచరులై రేని నిలువఁజాలరుగదా! పాంచాలురన నేపాటి? కావున నీవు వడిగా నప్పాంచాలురనువధింపుము. నాయీవచనములందనృతమేమియునులేదు. ఓవీరాగ్రణీ! నేను నిజముచెప్పుచున్నాఁడను. సోమకులతోఁగూడఁ బాండవులు, యుద్ధమునఁ దమబలముచే నిన్నోడింప సమర్థులుగారు. ఓమహాబాహూ! పొమ్ము. పొమ్ము. మనకిఁక గాలవిలంబముగాఁదగదు. ఇదె మనసైన్యము పార్థసాయకపీడితమై పరువులిడుచున్నది. ఓబలశాలీ! నీవు నిజతేజముచేఁ బాండవపాంచాలురను నిగ్రహింప సమర్థుఁడ వగుచున్నాఁడ'వని పలికె''నని తెలిపి సంజయుఁడు మఱియు నాధృతరాష్ట్రునితో నిట్లనియె.

### అశ్వత్థామ పాంచాలురపై విక్రమించుట

"ఓయంబికానందనా! సుయోధనుఁ డిట్లు పలుక విని, యాద్రోణతనయుఁడు యుద్ధగర్వితుఁడై, యింద్రుఁడు దైత్యవధమునకువలె వైరివధమున కెంతయుఁ బ్రయత్నించెను. అటులు సప్రయత్నముగా వెడలునపు డాతఁ డాసుయోధనుతో 'ఓరాజా! నీవు తెలిపినదెల్ల సత్యము. నాకును నాతండ్రికిని బాండవు లెప్పుడును బ్రియులగుట నిజము. అటులే వారును మాయెడఁ బ్రియముగల్గి వర్తింతురు. కాని యుద్ధమున నెన్నఁడును నట్లు జరుగదు. ఓతండ్రీ! ప్రాణములపై నాశవిడిచికొని నిర్భయముగా నేనును, గర్ణుఁడును, గృపశల్యులును, గృతవర్మఁడును మాశక్తికొలఁదిగాఁ బోరాడుదుము. ఓనృపోత్తమా! ఒకనిమేషములోఁ బాండవసైన్యమును నశింపఁజేయుదుము. ఓమహాబాహూ! మేము సంగరమున లేకున్నచో, వారును గౌరవసైన్యము నొకనిమేషమున నశింపఁజేయక మానరు. యుద్ధాభిలాషులమై మేమును బాండవులును, మామాశక్తులకొలందిని బోరాడుచుండఁ దేజమును దేజమునుగలిసి శాంతివహించును. నిజముగా నొకటి తెల్పుచున్నవాఁడను వినుము. పాండవులు జీవించియుండఁగా వారిసైన్యమును వడిగా జయింతుమనుట కల్ల. సమర్థులగు పాండవులు తమకుఁ బోరాడుచు నీసైన్యములను జంపకయెట్లు లుపేక్షింతురు? ఓరాజా! నీవెంతయును లుబ్ధుఁడవై

కార్యమెఱుఁగక, నందఱయెడను సందియపడుచుందువు. మఱియు నహంకారముగలవాఁడవు. అటులగుటనే మమ్మునమ్మక మాటలాడుచుందువు. ఓరాజా! నీవు కపటముగలవాఁడవును, బాపాత్ముఁడవును, బాపపూరుషుఁడవునని తలంతును. ఓక్షుద్రా! కానిచో మమ్మును సైతముఁ బరులఁగా భావింతువా? కానిమ్ము. నేను నీకై ప్రాణములపై నాశవిడిచి, ప్రయత్నపూర్వకముగా సంగ్రామమొనరింప నిదె పోవుచున్నాఁడను. వైరులతోఁ బోరాడెదను. అందనేకులను జంపెదను. మఱియు విశేషించి పాంచాలకైకయసోమకులతోడను, బాండవులతోడను, నీప్రియమునకుఁగా సంగ్రామమొనర్చెదను. ఇదె యిప్పుడు నాసాయకప్రహారముల కోరువక, సింహముచేఁ బీడితములగుగోవులువలె వెఱచి పాంచాలురను సోమకులును బరువులిడిపోవుదురు. ఇప్పుడాధర్మజుఁడు నాపరాక్రమము నారసి, సోమకులును దానును, నీలోకమశ్వత్థామమయమని తలంపక మానఁడు. యుద్ధమున నాచే నిహతులగుపాంచాలురను సోమకులనుగాంచి, యాధర్మజుఁడు నిర్వేదమొందక మానఁడు. ఓభారతా! నాతో నెవ్వరెవ్వరు యుద్ధమునకుఁ దలపడుదురో వారెల్లఁ జావవలసినదియేగాని మద్బాణపీడితులుగాక మరలుటకల్ల.' అని పలికి యాద్రోణసుతుఁడు సకలధనుర్ధరులను దఱుముచు యుద్ధమునకు సిద్ధపడియెను. అటులు నీపుత్రునిప్రియముకై సన్నద్ధుఁడై కైకేయులను బాంచాలురను గాంచి వారితో 'వీరులారా! ఇదె నాగాత్రములను బ్రహరింపుఁడు. మీమీయస్త్రలాఘవము ప్రదర్శించుచు, స్థిరులై యుద్ధమొనర్పుఁడు.' అని పలుకఁగా, వారెల్లరు నాతనిపై మేఘములు జలమునువలె శరములవర్షించిరి. అపు డతఁడు పాండవులయు ధృష్టద్యుమ్నునియు నెదుటనే, వారిలోఁ బదుగురను గొట్టి చంపెను. అటులు పాంచాలసోమకులు హన్యమానులగుచుండుట, నాతనివిడిచి నలుదెసలకుఁ బరువులిడి పోసాగుడు, నాధృష్టద్యుమ్నుఁడారసి యాద్రోణతనయు నెదుర్కొనియెను. అటులు దలపడి సువర్ణచిత్రితములై మేఘములునా గర్జించుచున్న శూరులరథములు కొన్ని తనకు సహాయమునకుఁగా నలుదెసల నావరించియుండ, నశ్వత్థామచే నిహతులయిన తనయోధులను గాంచి, యాతనితో "ఓదుర్మతీ! ఆచార్యపుత్రా! నీవితరులను జంపిన నేమిగొప్ప? నీవు శూరుఁడవేని నాతో

యుద్ధముచేయుము. రమ్ము. నిలువుము. ఇదె నిన్నిపుడు చంపెదను' అని పలికి ప్రతాపనిధియై, యతఁడు దారుణములై కవచమునుజీల్చునట్టి తీవ్ర నారాచముల నాయశ్వత్థామపైఁబఱప, నయ్యవి పంక్తిగా నేర్పడి సువర్ణపుంఖములును, ప్రసన్నాగ్రములును, సకలశరీరభేదకములు నగుచుఁ, దేనియఁగోరి పుష్పవృక్షమునకు వెడలు తుమ్మెదలునా వడిగాఁ జని యాద్రోణతనయు మేనఁ బ్రవేశించెను. అంత నాయశ్వత్థామయు నెంతయుఁ దోకఁద్రొక్కినపాము వలెఁ గుపితుఁడై, యించుకేని చలింపక కేల బాణముఁ బూని, వానితో 'ఓధృష్టద్యుమ్నా! రెండుగడియలు మాత్రము స్థిరుఁడవై నిలువుము. నిన్నిదె నాతీవ్రభల్లములచే యమమందిరమునొందించెదను.' అనిపలుకుచు నేతనహస్తలాఘవమేర్పడ, నెల్లెడల శరజాలమును గప్పెను. అటు లాతనిశరవర్షమునఁ గప్పంబడి, రణగర్వితుఁడగు నాధృష్టద్యుమ్నుఁ డాద్రోణసుతునితో 'ఓరీ! నాప్రతిజ్ఞ నెఱుంగకున్నాఁడవు. అటులె నావిప్రోత్పత్తిని దెలియవైతివి. ఓదుర్మతీ! మున్నుగా ద్రోణునిఁ జంపి, పిదప నిన్ను వధించెదను. నాప్రతిన యిట్టిదగుటచే నిపుడు చంపక విడువవలసివచ్చెను. ఓదుర్బుద్ధీ! ఈరాత్రి గడచినతోడనే నీతండ్రి నిజంపి, పిదపనిన్నుఁ బ్రేతలోకమున కనుపవలయునని నాయుద్దేశము. నీకుఁ బాండవులపైఁ గలద్వేషమునకును, కౌరవులయెడభక్తికిని దగుశక్తి నిపుడు చూపుటకై నిలిచి యుద్ధమొనర్పుము. నన్నుఁ దలపడి బ్రదికిపోఁజాలవు. ఓపురుషాధమా! నీవలె నెవ్వఁడు బ్రాహ్మణ్యమును విడిచి, క్షత్త్రియధర్మము నవలంబించునో యట్టిబ్రాహ్మణుఁడు క్షత్త్రియునకు వధ్యుఁడగుచున్నాఁడు.' అని మాటలచేఁ బరుషముగాఁ బలుకఁబడికోపమొదవ, ద్రోణితనయుఁడు కన్నులెఱ్ఱ నేయుచు, నాధృష్టద్యుమ్ననిఁ జూపులచే దహించువాఁడువలెఁ జూచుచు నిలునిలుమని పలుకుచుఁ, బాముపలె బుసకొట్టుచు, నాధృష్టద్యుమ్నుని శరవర్షముచేఁ గప్పెను. అటు లాసమరమున ద్రౌణిచే నాపార్షతుఁడు నొచ్చి, సకలపాంచాలసైన్యములతోఁగూడి నిజబాహుబలము నాశ్రయించి, చలింపక పలువిధములగుసాయకముల నాయశ్వత్థామపైఁ బ్రయోగించెను. మరల వారిరువురును బ్రాణద్యూతము నాడఁదలఁచి తలపడి, పరస్పరము కుపితులై శరవర్షములనివారించు

కొనుచు, నెల్లెడల శరసహస్రములఁ బ్రయోగించుచు విక్రమింప సాగిరి. ఘోరాకారమై భయప్రదమగువా రిరువురయుద్ధమునారసి సిద్ధులును, జారణులును వారిని గౌరవించిరి. మఱియు వారు నారాచములచే నాకసముఁ బూరించుచు, నిజశరసహస్రములచేఁ జీకట్లు గవియ, నందుఁ గానరాక మెలఁగుచు, రణరంగమున నాట్యముచేయు వారివలె ధనువులు గుండ్రముగాఁ ద్రిప్పుచుఁ, జరించుచు, నొకరినొకరు చంపుకొనువారై, సకలభూతములకు భయముగొల్పుచుఁ జిత్రముగను, లఘువుగను, లెస్సగను బోరాడుచుండ, వారి నాయోధులనేకులు గౌరవించిరి. అటు లడవియేన్గులునాఁ బోరాడు నావీరుల నారసి, రెండు సైన్యములవారును నెంతయు సంతసమందిరి. మఱియు సైనికులలో సింహనాదములును శంఖారావములును జెలరేఁగెను. వందలకొలందిని వేలకొలందిని వాద్యములు విజృంభించెను. పిఱికివారికి వెఱపుగల్గించు నాసంకులసమరమున రెండుగడియ లటులు వారికి యుద్ధముజరిగెను. ఓమహారాజా! పిమ్మట నాయశ్వత్థామ మహాత్ముఁడగు నాపార్షతుని, ధనుర్ధ్వజములను, ఛత్రమును, బార్ష్ణిసారథులను, సూతుని, గుఱ్ఱములను గొట్టి, పరువులిడ నొనరించి, యప్పాంచాలురనెల్లఁ దీవ్రనారాచములచేఁ జెదరఁగొట్టఁ, బాండవసైన్యమెల్ల మిక్కిలిగా నొచ్చెను. ఆసమరమున వాసవుఁడునాఁడగు నాద్రోణసుతుని యద్భుతకృత్యమును గాంచి భయపడఁజొచ్చిరి. అటు లాధృష్టద్యుమ్నుఁడును బార్థుఁడును గాంచుచుండఁగాఁ, గంటఁబడినపాంచాలురనెల్ల నాద్రోణసూతి వధింపసాగెను. ఓరాజా! అంత నాసృంజయపాంచాలురు ద్రోణపుత్రునిచే నటులు పీడ్యమానులగుట నందు నిలువఁజాలక చెదరుచున్నరథధ్వజములతో నాతని విడిచి నలుగెలంకులకుఁ బోసాగిరి. మహారథుఁడగునాద్రౌణి, వైరుల నెల్ల నటు లోడించి, తొలుకరిమేఘముగర్జనమువలె మహానాదమగు నట్లుగా సింహనాదమొనరించెను. మఱియు నటు లతఁ డనేకశూరులను జంపి, యుగాంతమున సకలభూతములను దహించుపావకుఁడునాఁ బ్రజ్వరిల్లెను. అపు డాయశ్వత్థామను గౌరవులెల్ల దైత్యగణములను జయించినయింద్రునివలెఁ బూజించిరి." అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

### సంకులయుద్ధము

"ఓరాజా! పిదప నాభీమయుధిష్ఠిరు లాద్రోణపుత్రునిఁ దలపడిరి. అపు డాసుయోధనుఁడును ద్రోణునితోఁగూడి యప్పాండవులమార్కొనియెను. పిమ్మట వారికి ఘోరరూపమై భీరువులకు భయవర్ధనమైన గొప్పయుద్ధము జరిగెను. అపు డాధర్మజుఁడు కుపితుఁడై, యంబష్ఠ, మాలవ, వంగ, శిబి, త్రైగర్తులను మృత్యులోకమునకుఁ బనిచెను. అంత భీముఁడును, యుద్ధదుర్మదులగుశూరసేనులను, నభీషాహులను జంపి, పుడమి రక్తసిక్తముగావించెను. మఱియు నప్పార్థుఁడు యౌధేయులను, మద్రకులను, మాలవులను యమలోకగతులఁ గావించెను. వారివడిగల నారాచములచేఁ దాడితములై యేనుగులు, రెండుశృంగములుగల పర్వతములునాఁ బుడమిఁబడియెను. శరములచేఁ దెగిపడి యిటునటు గదలుచున్న యేనుగులతొండములచే బ్రాకునట్టిపాములచేవలె భూమి యెంతయు వెలయఁజొచ్చెను. మఱియు నందందుఁబడిన సువర్ణమయచ్ఛత్రములచేఁ బుడమి, యుగాంతమునఁ జెదరిపడిన చంద్రాదిత్యాదిగ్రహములచేవలె విలసిల్లఁజొచ్చెను. ఆద్రోణునిరథముచెంగట 'కొట్టుఁడు, ప్రహరింపుఁడు, నిర్భయులై నొప్పింపుఁడు, ఖండింపుఁడు' అనెడిసంకులశబ్దము వినవచ్చెను. అపు డాద్రోణుఁడు కుపితుఁడై వాయవ్యాస్త్రముచే బెనుగాలి మేఘములనువలె వైరులను దొలఁగించెను. ద్రోణునిచే వధ్యమానులగుచుఁ బాంచాలురు జడిసి పరువులిడిరి. దాని నాభీమార్జును లారయుచుండుటను, దమగొప్పరథవంశముతో నాతనిపైకి మరలిరి. యాతనిదక్షిణపార్శ్వమును బార్థుఁడును, నుత్తరభాగము భీముఁడును శరవర్షము గురియుచుఁ బీడించిరి. అంతఁ బాంచాలురును, మాత్స్యులును, సోమకులును, సృంజయులును నాభీమార్జునులకుఁ దోడుగా ననుసరించిరి. అటులే దుర్యోధనుఁడును గొప్పసేనతోఁ బెక్కురురథికులురా, నాద్రోణుని సమీపించెను. అంత నాభారతసైన్య మక్కిరీటిచే వధ్యమానమై నొచ్చి, నిద్రయుఁ జీకటియుఁ గ్రమ్మఁ జెదరఁజొచ్చెను. ఆసేనను ద్రోణుఁడును నీతనయుఁడును నివారించుచుండిరి. ఓరాజా! అయినను వారికి, వారిని వారింపఁ దరముగాకుండెను. అప్పార్థశరప్రహారములచేఁ బీడితమైన మనసైన్యము చీకటిచే నావృతమగుచు నందు బహుముఖ

ములుగాఁ బరువిడిపోయెను. మఱియు మనయోధులు కొందఱు తమ వాహనములు విడిచి భయావిష్టులై చెదరిపోయి" రని తెలిపి సంజ యుఁడు మఱియు ని ట్లనియె.

సోమదత్తునివధము

"ఓయాంబికేయా! అపుడు సాత్యకి కుపితుఁడై సోమదత్తునిపైఁ దనరథము పోనిమ్మనియుఁ, దా నాదినము కౌరవాధముఁడగు నాసోమ దత్తునిఁ జంపక మరలననియుఁ, దనవచనము తప్పనిదనియుఁ బలుక, నతనిసారథి వడిగల రథాశ్వముల నాతనిపైఁ బఱప, శంఖవర్ణములగు నయ్యశ్వములు మనోమారుతవేగములై యాసాత్యకి నందులకుం గొని పోయెను. పిదపఁ దనపై కటులు వచ్చు నాసాత్యకిని గాంచి, యాసోమ దత్తుఁడును జలింపక, పర్జన్యుఁడు వర్షమునువలె శరసహస్రములఁ గురి యుచు, నాసాత్యకిని దలపడి, మేఘుఁ డాదిత్యునివలె నాతనిఁ దన సాయకములచేఁ గప్పెను. అందుల కాసాత్యకియుఁ జలింపక యాసోమ దత్తుని సాయకసమూహములచేఁ గప్పెను. అంత సోమదత్తుఁ డాతని నఱువదిసాయకములచే వక్షము నోనాఁటనేయ, సాత్యకియు నాతనిఁ దీవ్రనారాచములచే నొప్పించెను. వారటులు పరస్పరము శరప్రహార ములచే భిన్నాంగులై వసంతసమయమునఁ బుష్పించినమోదుగులు నాఁ జూపట్టిరి. మఱియు నక్కురువృష్ణిపుంగవులు రక్తసిక్తాంగులై యొకరినొకరు దహించువారువలెఁ జూచుకొనుచు, రథమార్గముల మండలాకారముగఁ దిరుగుచు, వర్షకాలమేఘములునా ఘోరాకారులై, పరస్పరశరప్రహారభిన్నగాత్రులగుచుఁ, బోరాడు నేదుపందులునాఁ గానవచ్చిరి. ఓరాజా! వారిరువురును సువర్ణపుంఖములగుసాయకములు మేనుల నాఁట మెఱుఁగుడుఁబుర్వులచే నావృతములైన వర్షకాలపు వృక్షములునాఁ జూపట్టిరి. మఱియు వారు, సాయకములచే సంప్రదీపిత సకలాంగులై, యుల్కలచేఁ గానవచ్చునేనుగులునాఁ జూపట్టిరి. ఓమహా రాజా! పిదప మహారథుఁడగు సోమదత్తుఁ డొకయర్ధచంద్రబాణముచే నాసాత్యకిధనువు దునుమాడి, మఱియు నిరువదైదుబాణము లాతనిపైఁ బ్రయోగించి, త్వరపడుచు నింకను బదిసాయకములచే నొప్పించెను. పిదప నాసాత్యకియు వేఱొకవిల్లుగొని కడువడిగా నైదుసాయకములచే నాతని నొప్పించి, వేఱొకభల్లముచే నాతని కాంచనధ్వజము ఖండించి

నవ్వుచుండ, నాసోమదత్తుఁ డందులకుఁ జలింపక తనధ్వజము పడుటకెంతయుఁ గుపితుఁడై యాసాత్యకి నిరువదైదువాఁడికోలలచే నొప్పించుటయు, నాతఁడును గోపమడరఁ దీప్రమగుక్షురప్రముచే నాసోమదత్తుని ధనువు దెగనేసి, మఱియు సువర్ణపుంఖములగు నూఱుబాణములచేఁ, గోఱలులేనిపామునువలె నొప్పించెను. మహారథుఁడగు సోమదత్తుఁడును మఱియొకవిల్లుపూని, మహాబలుఁడై యాసాత్యకిని శరవర్షమున ముంచెను. అపుడు సాత్యకి కుపితుఁడై సోమదత్తుని నొప్పింప, నటులే వాఁడు శరసమూహముచే నాసాత్యకిని నొప్పించెను. అపుడాసాత్యకిపక్షమున భీముఁ డాసోమదత్తునిఁ బదిసాయకములచే నొప్పింప, నతఁడు సంచలింపక యాభీముని నూఱుకోలలచే నొప్పించెను. పిదపఁ గోపమొదవ నాసాత్యకి, హేమదండముతోఁ గ్రొత్తదై దృఢమగు నొకపరిఘమును ఘోరముగా నాసోమదత్తు నురము గుఱిచూచివైవఁ, గడువడిగా వెడలినయాఘోరపరిఘమును గాంచి, నగుచు నతఁడు రెండుఖండములుగా ఖండింప, నది వజ్రతాడితమై పుడమిఁబడిన కొండశిఖరమునా నేలఁబడియెను. పిదప సాత్యకి యొకభల్లముచే సోమదత్తునివిల్లు దెగనేసి, యైదుకోలలచే వానిహస్తావాపము ఖండించి, మఱియు నాల్గుబాణములచే గుఱ్ఱములను గొట్టి, యమమందిరమున కనిపి, పిమ్మట నాతనిసారథితల నొకభల్లముచే ఖండించి, ప్రహాసమొనర్చెను. అటులొనర్చి, యతఁడు మహాఘోరమై యగ్నివలెఁ బ్రజ్వలించు నొక సానవెట్టినసాయకమాసోమదత్తునిపై విడువ, నది డేగవలె వెడలి యాతనివక్షమునఁ బడియెను. బలవంతుఁడై ప్రయోగించినయాసాత్యకిప్రహారముచే నాసోమదత్తుఁ డెంతయు నొచ్చి పుడమిఁబడి మరణించెను. మహారథుఁడగుసోమదత్తుఁ డటులు మరణించుటఁ గాంచి, నీవారు పలువురు తమరథవంశముతో నాసాత్యకిపైఁ దలపడఁబోయిరి. అపుడాయుధిష్ఠిరుఁడును బ్రభద్రకులెల్లఁ దనకుఁ దోడుగా గొప్పసైన్యముతోఁ గూడి ద్రోణసైన్యముపై మార్కొనఁబోయెను. మఱియు నాయుధిష్ఠిరుఁ డట్లు మార్కొని భారద్వాజుఁ డారయుచుండఁగనే, కుపితుఁడై యాతని సైనికులశరప్రహారములచే నొప్పించి, చెదరునట్లుచేయుటయు, నాద్రోణుఁడును క్రోధతామ్రాక్షుఁడై కడువడిగాఁ దలపడి యేడుసాయకములచే నాధర్మజు నొప్పించెను. అందుల కాయుధిష్ఠిరుఁ డలిగి యైదుసాయక

ములచేఁ బ్రతిప్రహారమొనరింపఁ, నాద్రోణుఁడు మఱిమఱియుఁ బెదవి కొనలఁ దడుపుచు, నాధర్మజుని ధనుర్ధ్వజములను ఛేదించెను. పిదప నాధర్మజుఁడు వడిగల్గి వేఱొకవిల్లు పూని శరసహస్రముచే ద్రోణుని నొప్పించి,మఱియు నాతని సూతాశ్వధ్వజరథములను సైతముఁగొట్టెను. ఆదెబ్బున కాద్రోణుఁ డెంతయు నొచ్చి, రెండుగడియ లారథమధ్యమునఁ గూలఁబడి, మఱియుఁ దెలివొంది, సర్పమువలె బుసకొట్టుచుఁ, బరమక్రోధావేశపూరితుఁడై వాయవ్యాస్త్రమును బ్రయోగించెను. అపు డాయుధిష్ఠిరుఁడు సంచలింపక వేఱొకవిల్లు పూని, యాద్రోణు నస్త్రము, నిజాస్త్రముచేఁ బడఁగొట్టి, మఱియు నాతని దీర్ఘధనువు దుని యనేసెను. పిదప క్షత్త్రియమర్దనుఁడగు నాద్రోణుఁడు వేఱొకవిల్లు పూని నిలువ, నాయుధిష్ఠిరుఁడు మఱియు దానిని దెగనేయ, నాత నితో నవ్యాసుదేవుఁడు 'ఓయుధిష్ఠిరా! మహాబాహూ! నేనొకటి తెలిపెదను వినుము. నీవాద్రోణునుండి యుద్ధముచేయక మరలుము. ఇతఁడు నిన్నెల్లపుడును బట్టుకొనఁ బ్రయత్నించుచునే యున్నవాఁడు. నీవీత నితోఁ బోరాడు టుచితమని నాకుఁ దోఁపదు. ఈతనిఁ జంపుట కెవ్వఁడు సృష్టింపఁబడియెనో వాఁడే చంపఁగలఁడు. కావున, నీ వీతని విడిచి యా సుయోధనుకడకు వెడలుము. అదియుఁగాక రాజు రాజుతోఁ బోరాడవలయును. కావున నీవందులకు, గజాశ్వరథపరివృతుఁడవై వెడలుము. నాసహాయముతో ధనంజయుఁడును, యోధశార్దూలుఁడగు భీముఁడును గౌరవులతోఁ బోరాడెదరు.' అని తెలుప విని యాధర్మజుఁడు, రెండు గడియ లాలోచించి, యాభీముఁడున్నచోటికి వెడలెను. ఓరాజా! అటులు వెడలి, ప్రళయకాలయముఁడునా నీయోధులను జంపుచు, గొప్పరథనాదముచేఁ బుడమిఁ బ్రతిధ్వనింపఁజేయుచుఁ దొలుకరిమేఘమునాఁదగి వైరులను బరిమార్చుచున్న యాభీముని వెనుకభాగమునఁ గాచియుండెను. ఆరజనీసమయమున ద్రోణుఁడును బాంచాలుర వధించుచుండెను'' అని తెలిపి సంజయుఁడు మఱియు నాతనితో నిట్లనియె.

## సుయోధనుఁడు దీపముల నుద్దీపింపఁజేయుట

"ఓరాజా! ఘోరాకారమై భయముఁగొలుపుచు యుద్ధ మటు లారంభమగుడుఁ జీకట్లును ధూళులును గవియ, యోధు లొకరి

నొకరు తెలిసికొనఁజాలక, యూహించియు, సంజ్ఞలచేఁ దెలిసికొను చుండియుఁ బోరాడఁదొడంగిరి. మహారౌద్రమగు నాగజాశ్వరథ పదాతిక్షయసమయమునఁ వీరులగుద్రోణకర్ణకృపులును, భీమధృష్ట ద్యుమ్నసాత్యకులును బరస్పరము సైన్యములను గలతనొందించుకొను చుండిరి. అమ్మహారథులచే నటులు వధింపఁబడుచుండుట నాయుభయ సైన్యములును నాచీకటిలోఁ బరువులిడసాగెను. అటు లాయోధు లెల్ల భీతచిత్తులై పరువులిడుచు, మహారథసహస్రములను గొట్టుచుఁ, గొట్టువడుచు, నీపుత్త్రునియాలోచనము చే నావెనుఁజీకటిలో నేమియుఁ దెలియకయుండిరి. అటు లాచీకటి యధికమై యావరించుటను, సేనా ముఖ్యులును సకలభూతములును నేమియుఁ దెలియకుండెను.” అని తెలుప విని ధృతరాష్ట్రుఁ డిట్లనియె.

“ఓసంజయా! అప్పాండవులచే నిహతతేజులై పీడింపఁబడుచు, మహాంధకారమగ్నులైన మనవారేమి తలంచిరి? లోకమును జీకటు లటులావరించియుండెనుగదా! వారికిని మనసైన్యమునకును బరస్పర దర్శన మెట్లయ్యెను? తెలుపుము.”

అది విని సంజయుఁ డాతనితో “ఓమహారాజా! పిదపఁ జావఁగా మిగిలినసైన్యములనెల్ల సేనానాయకులచే వ్యూహములుగాఁ బన్నించి, ముందుభాగమున ద్రోణుఁడును, వెనుకభాగమున శల్యుఁడును, పార్శ్వ ముల నశ్వత్థామయు శకునియు నుండునట్లేర్పఱచి, సుయోధనుఁడు సైన్యముల తానును జుట్టును జరించుచుఁ, దనపదాతిసమూహములతోఁ బ్రియపూర్వకముగా ‘ఓపదాతులారా! మీరెల్లరును మీమీయా యుధములను విడిచి ప్రజ్వలించునట్టిదీపములను బట్టికొనుఁడు.’ అని తెలుప, వారు సమ్మతించి దీపములను బట్టికొనిరి. పిదప దేవర్షులును, గంధర్వాప్సరసలును, విద్యాధరులును, గిన్నరోరగనాగయక్షులును నాకసమున దీపములను బట్టికొనిరి. అటులే దిగ్దేవతలనుండియు సుగంధి తైలదీపములు గ్రహింపఁబడి గానవచ్చెను. విశేషించి నారదపర్వతులు యుద్ధముచూచువేడ్కతో నాకసమున దీపప్రకాశముగావించిరి. ఆ రాత్రి మఱియు నెప్పటిచొప్పున నాసైన్యము పరస్పరముఁ దలపడిరి. గొప్పవిలువగలయాభరణములచేతను బ్రదీప్తములగుశస్త్రములచేతను వెలయునట్టిరథము రథమునకును నైదేసిదీపములు మత్తగజముపై

మూఁడేసిదీపములును, నొక్కొక్కగుఱ్ఱమున కొక్కొక్కమహాదీపమునుగా నక్కౌరవపాండవసైనికులచే నేర్పఱుచుకొనఁబడియెను. ఓరాజా! ఒక్క క్షణములో నీసైన్యములందెల్ల బదాతులు దీపతైలహస్తులై సైన్య మెల్లెడల వెలుతురుగల్గునట్లు గావించిరి. అపు డాకసమున మెఱుపులచే మేఘములువలె నాదీపములచే నెల్లరును బ్రకాశితులై గానవచ్చిరి. అటు లాసైన్య మెల్లఁ దనకు గానరా నాద్రోణుఁ డగ్నికల్పుఁడై యెల్లె డలఁ జరించుచు, సువర్ణకవచుఁడై మధ్యందినమార్తాండునివలె విరా జిల్లెను. అపు డాదీపకాంతులు సైనికులసువర్ణాభరణములందును, సువర్ణ ముద్రికలందును, శరములందును, శస్త్రములందును బ్రతిఫలింపసాగెను. గదలును, బరిఘములును, శక్తులును దీపప్రతిప్రభలచే రథములందు వేఱుదీపములను జనింపఁజేయసాగెను. ఓరాజా! శస్త్రప్రభయు నాభరణ కాంతులయు, దీపకాంతులయు వెలుతురుచే నెంతయు సైన్యము ప్రకాశింపఁజేయఁబడియెను. రక్తసిక్తములైన పచ్చనిశస్త్రములు వీరులచే ఝుళిపింపఁబడి, తొలుకరి నంతరిక్షమున మెఱయు మెఱుపులునాఁ జూప ట్టెను. అభిఘాతవేగములచేఁ గదలుచుఁ బరస్పరము కొట్టుకొనుచున్న పదాతులమొగములు గాలిచేఁ గదలుచున్న పద్మములునా వెలయు చుండెను. మండుచున్న మహావనమున నధికమగుచున్న భాస్కరుని ప్రభ వలె నపుడు మనసైన్యము దీపప్రదీప్తమై భయంకరరూపముతోఁ గాన వచ్చుచుండెను. అటులు మనసైన్య మెల్లఁ బ్రదీప్తమగుటను గాంచి పాండవులు నటులే తమసకలసైన్యములందును గలపదాతులను దీపము లను బట్టుకొనునట్టు లేర్పఱచిరి. వారు తమ యొకయేనుగున కేడేసిదీప ములును, రథమునకుఁ బదేసిదీపములును, గుఱ్ఱమునకు రెండేసిదీప ములును, ధ్వజములకుఁ బార్శ్వములందును వెనుకను గొన్నికొన్నిదీప ములను, సకలసైన్యములపార్శ్వములందును ముందును మఱికొన్నిటిని మధ్యభాగమునఁ గొన్నిటిని బ్రజ్వలింపఁజేసిరి. అటు లుభయసైన్యము లందును దీపములు ప్రజ్వలింపఁజేయబడియెను. ఆవిధముగా దీపముల వెలుతురుచే నాయుభయసైన్యములును బ్రకాశితములై కిరణప్రసార ముచేయుసూర్యునిచే నగ్నివలె గుప్తములై యుండెను. ఆయిరుసైన్య ములదీపకాంతి పృథివ్యంతరిక్షములను దాఁటి, దిక్కుల నతిక్రమించి యుండెను. మఱియు నాకాంతిచే వ్యోమగతులగు దేవతలును, బోధి

తులై గంధర్వులును, యక్షులు, సిద్ధులును వచ్చిరి. అటులువచ్చిన దేవ గంధర్వాదులచేతను, యుద్ధమున హతులై, స్వర్గమును బ్రవేశించు యోధులచేతను యుద్ధభూమి దివ్యకల్పమైయుండెను. మఱియు, గజాశ్వ రథాకులమై సంరబ్ధయోధమై వ్యూహముగా నేర్పడిన యామహా సైన్యము సురాసురవ్యూహతుల్యమై గానవచ్చెను. ఆమహాభయంకర యుద్ధమున మహాత్ముఁడును బ్రాహ్మణోత్తముఁడు నగుద్రోణుఁడు ప్రతాప నిధియై, మధ్యాహ్నగతుఁడైన శరత్కాలసూర్యుఁడు కిరణములతోఁ బ్రకాశించునట్లుగాఁ దనప్రతాపమును జూపించె" నని తెలిపి సంజ యుఁడు మఱియు నిట్లనియె.

## సంకులయుద్ధము

"ఓరాజా! ధూళిచే నావృతమైన లోకమెల్ల మరల దీపప్రకాశిత మగుడు, మహారథికులెల్లరును బరస్పరవధాభిలాషులై గలిసి, శస్త్రములు ప్రాసములు, ఖడ్గములును బట్టి, తమతమవిరోధము లేర్పడ నొకరినొకరు చూచుకొనసాగిరి. అపు డాదీపసహస్రములచేతను, మిక్కిలి ప్రకా శించెడి దేవగంధర్వప్రదీపకాంతులచేతను బుడమి, గ్రహములచే నాకసమువలె విరాజిల్లెను. మఱియుఁ బ్రజ్వలితములగు దివ్వటీలచేఁ బ్రళయమున దహింపఁబడుచున్నదివోలెఁ బుడమి గానవచ్చెను. ఆదివ్వె టీలచే దిశలెల్లఁ బ్రదీప్తములై, వర్షాకాలసంధ్యాసమయమున మెఱుఁ గుడుఁబుర్వులతోఁ గూడినవృక్షములునాఁ జూపట్టెను. ఓరాజా! అపుడు వీరులెల్ల వేఱువేఱుగా నొక్కొకరు దలపడిరి. అటులే యేన్గు లేన్గుల తోడను, రౌతులు రౌతులతోడను, రథికులు రథికులతోడను, సుత్సాహపూరితులై మార్కొనఁజొచ్చిరి. ఆరాత్రి నీతనయునాజ్ఞచేఁ జతురంగసైన్యమునకును గొప్పయుద్ధము జరిగెను. అపుడు పార్థుఁడు కడువడిగాఁ దలపడి నీవారివీరులనెల్లఁ బీడింప నారంభించెను" అని తెలుప విని ధృతరాష్ట్రుఁ డిట్లనియె.

"ఓసంజయా! ఆయర్జునుఁ డట్లు సంరబ్ధుఁడై మనసైన్యమును బ్రవేశింపఁగా, మనవారపు డేమితలంచిరి? సైన్యము లేమనికొనియెను? సుయోధనుఁ డపుడు తనకుఁ గర్తవ్యమేమని చింతించెను? వీరుఁడగు నాయర్జునునితోఁ బోరాడ నెవ్వరు మార్కొనిరి? ఆశ్వేతవాహనుఁ

డట్లు ప్రవేశింపఁగా ద్రోణుని నెవ్వరు కాపాడందొడంగిరి? మఱియు నాతనికుడి యెడమభాగములను రక్షించువా రెవ్వరు? వీరుఁడగు నాద్రోణుఁడు యుద్ధముచేయుచుండఁగా నాతని వెనుక నెవ్వరు రక్షకులై యుండిరి? ముందుభాగమున నిలిచినవా రెవ్వరు? అతఁ డజేయుఁడై యటు లప్పాంచాలసైన్యములఁ బ్రవేశించి, రథమార్గములఁ జరించెను గదా! అప్పు డప్పాంచాలరథికులలో నెవ్వ రెవ్వరిని జంపిరి? కుపిత ధూమకేతువునాఁదగు నాద్రోణుఁ డెట్లు మరణించెను? ఓసంజయా! వైరులు పరాజితులుగాకుండుటయు, సంభ్రమమొందక పోరాడుటయుఁ దెలుపుచుందువు. మనవారు వారివలె హర్షపూరితులై విజృంభించుట నొకమాఱును దెలుపవు. అటులు దెలుపకుండుటయగాక హతులై రనియుఁ, జెదరుచున్నారనియు, వెలవెలఁబోవుచున్నారనియును దెలుపు చున్నాఁడవు. మఱియు విరథులై విముఖులైరనియుఁ దెలుపుచున్న వాఁడవు. హేతు వెయ్యది?"

అది విని సంజయుఁ డాతనితో "ఓరాజా! నాఁటిరాత్రియుద్ధ కాముఁడగు ద్రోణుని యభిప్రాయ మెఱిఁగి, సుయోధనుఁడు తనకు వశ్యులై సోదరులగు వికర్ణచిత్రసేన సుపార్శ్వదుర్ధర్షదీర్ఘబాహులను జూచి, వారితో 'సోదరులారా! మీరు ప్రయత్నపూర్వకముగా ద్రోణునిఁ గాపాడవలయును.' అని తెలిపి, యాద్రోణునకు దక్షిణభాగ మునఁ గృతవర్మని, నుత్తరభాగమున శల్యునిఁ జక్రరక్షకులఁగా నియ మించి, హతశేషులై మహారథులైన త్రిగర్తయోధులను నాద్రోణునకు ముందుభాగమున నుంచున ట్లేర్పఱిచెను. అటు లేర్పఱిచి, మఱియు వారితో 'వీరులారా! ఆచార్యుఁడు శాంతిపరుఁడు. పాండవు లెంతయుఁ బ్రయత్నముతో నున్నవారు. అతఁడు వైరులను జంపుచున్నపుడు మీ రాతనిఁ గాపాడవలయును. మనద్రోణుఁడు బలశాలియుఁ, బరాక్రమనిధి యు,లఘుహస్తుఁడును నగుట దేవతలనేనిజయింపఁగల్గునన్నచోఁ, బాండ వులను సోమకులను బీడించు టాతని కెంతపని? కావున, మీ రెల్లరును గలిసి ప్రయత్నపరులై యమ్మహారణమున మహారథుఁడగుధృష్టద్యుమ్ను నుండి యాతని రక్షింపవలయుఁజుఁడీ! పాండవయోధులలో నెవ్వఁ డును నీతనిసాటివాఁడు లేఁడు. ఒక్కధృష్టద్యుమ్నుఁడుదక్క నాతని జయించువాఁడే యందుఁ గానరాఁడు. కావున నెల్లవిధముల నాతని

రక్షణ మావశ్యకమనియు, నటులేని యతఁడు సోమకులను సృంజయులను గ్రమముగాఁ జంపఁగలఁడనియు నాయభిప్రాయము. ఆసేనాముఖమున సృంజయులెల్ల హతులగుదురేని, యాధృష్టద్యుమ్నుని ద్రోణసుతుఁడు హతునిఁ గావించును. అటులే మహారథుఁడగు మనకర్ణుఁ డాయర్జునుని జయింపఁగలఁడు. యుద్ధసన్నద్ధులైనభీముఁడు మున్నగువారిని నేను జయింతును. హీనతేజులగు మిగిలినపాండవులను మనయోధులు బలాత్కారముగా నోడింతురు. ఇట్టి నాజయముశాశ్వతమైయుండునది. కావున మీరెల్ల నాభారద్వాజుని రక్షింపవలయును' అని తెలుప విని వా రాదారుణాంధకారమున సన్నద్ధులై వెడలిరి. ఓరాజా ! పిదప జయాభిలాషములైన యుభయసైన్యములకును గొప్పయుద్ధ మారంభమయ్యెను. అపు డర్జునుఁడు కౌరవసైన్యమును బీడింపందొడంగుడు, నాతనిఁ గౌరవులు పీడింపసాగిరి. ధృష్టద్యుమ్ను నశ్వత్థామయు, సృంజయులను ద్రోణుఁడును శరసహస్రములచేఁ గప్ప నారంభించిరి. ఓభారతా! పాండవ పాంచాలసైన్యములకును గౌరవులకును బరస్పర ప్రహారములచే ఘోరయుద్ధమయ్యెను. ఆరాత్రి జరిగినభయంకర యుద్ధమును బోలినయుద్ధము మనముగాని మనపూర్వులుగాని చూచి యుండమని చెప్పఁగలను" అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## కృతవర్మని కోడి యుధిష్ఠిరుఁడు పాఱిపోవుట

"ఓరాజా! ఆరాత్రి యుద్ధ మటు లెంతయు భయంకరమై సకల ప్రాణివినాశకర మగుచుండఁగా, నపుడు పాంచాలురను సోమకులను గాంచి వైరిసైన్యముల నశింపఁజేయించుటకై వారితో నాధర్మజుఁడు 'ఓవీరులారా! రండురండు. ద్రోణు నెటులేనిఁ జంపవలయును. నడువుఁడు.' అని పలుక విని యప్పాంచాలసోమకులు భయంకరారావము లొనర్చుచు, నాద్రోణునిపైకిఁ బరువులిడసాగిరి. అపుడు కుపితులై మనవారును గర్జించుచు వెడలి, తమశక్త్యుత్సాహబలమునుబట్టి పనిచేయ నారంభించిరి. అపుడు మత్తగజమును మార్కొనుమత్తగజమునా ద్రోణునిపైకివచ్చు నాయుధిష్ఠిరునిఁ గృతవర్మఁ డెదుర్కొనియెను. అటులే యెల్లెడల శరవర్షమును గురియుచున్నసాత్యకిని గౌరవుఁడగు భూరి సంగ్రామగర్వముతోఁ దలపడియెను. పిదప మహారథుఁడై

ద్రోణునిఁ దలపడవచ్చుచున్న సహదేవుని గర్ణుఁడు నివారించెను. అటులే రథికోత్తముఁడై వచ్చుచున్న భీముని మనసుయోధనుఁడు ప్రతికూల మృత్యువునువలెఁ దలపడియెను. పిదప సకలయుద్ధవిశారదుఁడైన నకులుని శకుని మార్కొనియెను. శిఖండిని గృపుఁడు దలపడియెను. పిమ్మట నా ద్రోణునిపైకివచ్చుచున్న ప్రతివింధ్యుని దుశ్శాసనుఁడు నివారించెను. అటులే మాయాశతవిశారదుఁడై వెడలినఘటోత్కచుని ద్రోణపుత్త్రుఁడు నివారించెను. అనుచరులతోడను సైన్యములతోడను వెడలి మహాబలుఁడై ద్రోణుని మార్కొన నరుదెంచునట్టిద్రుపదుని వృషసేనుఁడు నివారించెను. అటులే వడిగా వెడలి ద్రోణునిపైకివచ్చువిరటునిఁ గుపితుఁడై శల్యుఁడు మార్కొనియెను. పిదప ద్రోణునిఁ జంపుటకై వడిగా వెడలిన నకులపుత్త్రుఁడగుశతానీకునిఁ జిత్రసేనుఁడు తనశరములచే నివారించెను. ఓమహారాజా! రథికోత్తముఁడై మహారథుఁడై వెడలినయర్జునుని నలంబుసుఁడు మార్కొనియెను. పిదప ధనుర్ధరుఁడై వైరులను బరిమార్చుచున్నద్రోణునిఁ బాంచాలోత్తముఁడగు ధృష్టద్యుమ్నుఁడు దలపడియెను. ఓరాజా! మఱియును వెడలినపాండవమహారథులను మనవారి రథికులు తేజము వెలయఁ దలపడిరి. అటులే గజారోహకులు గజములమార్కొని యుద్ధముచేయుచు, వందలకొలఁదిని వేలకొలఁదిని మర్దింపసాగిరి. రాత్రిఁ బరస్పరముఁ బరువులిడుచున్న గుఱ్ఱములు ఱెక్కలుగలకొండలునాఁ జూపట్టెను. ఓరాజా! అటులే రౌతులు రౌతులతోఁ గూడఁ దలపడి, పాశశక్త్యాదిసాధనధరులై కేకలువైచుచుఁ బరస్పరముఁ దలపడిరి. పదాతులు పెక్కురు గదాముసలాదులగు నానాశస్త్రములతోఁ బరస్పరముఁ బోరాడిరి. అపుడు కృతవర్ముఁడును యుధిష్ఠిరుని నుద్రేకించినసాగరమును వేలవలె నివారించెను. అంత, యుధిష్ఠిరుఁడు కృతవర్మనైదుబాణములచే నొప్పించి, నిలునిలుమని పలుకుచు, మఱియునిరువదినారాచములచేఁ బ్రహరించెను. ఓమారిషా! అందులకుఁ గృతవర్మ కుపితుఁడై యొకభల్లముచే నాధర్మజునిధనువు ఖండించి, మఱియేడుబాణములచే నాతని నొప్పించెను. మహారథుఁడగు యుధిష్ఠిరుఁడు వేఱొకవిల్లుపూని పదిబాణములచే నాహార్దిక్యునిబాహువులందును వక్షమునందును గొట్టెను. అపు డాకృతవర్ముఁ డెంతయు నొచ్చి, కొంత చలించియు, రోషమడర నేడుసాయక

ములచే నాధర్మజు నొప్పింప, నప్పాండవాగ్రజుఁడు కృతవర్మనిధనువు దెగ నేసి, హస్తావాపమును ఖండించి, సానవెట్టుటను దీప్రములై యున్న యైదుభల్లముల నాతనిపైఁ బ్రయోగింప, నవి సువర్ణమయమై గొప్ప విలువగల యాతనికవచమును జీల్చి, యుగ్రసర్పములు పుట్టనుజొచ్చు నట్లుగాఁ బుడమిని బ్రవేశించెను. అంత, నాకృతవర్మయు తెప్పపాటులో వేఱొకవిల్లుపూని యెనుబదిబాణములచే నాయుధిష్ఠిరు నొప్పించి, మఱి పదిబాణములచే నాతనిసూతుని నొప్పించెను. ఓభరతశ్రేష్ఠా! అపు డాధర్మజుఁడు తనధనువు రథముపైనుంచి సర్పతుల్యమగు నొకశక్తి నాకృతవర్మనిపైఁ బ్రయోగింప, సువర్ణచిత్రమై మహత్తరమగు నాశక్తి యాకృతవర్మని దక్షిణబాహువును భేదించి పుడమిఁజొచ్చెను. ఇంతలోనే మఱియు నాధర్మజుఁడు విల్లుపూని తీప్రనారాచములచే నాకృతవర్మనిఁ గప్పఁగా, నపు డావృష్ణిప్రవరుఁడగు కృతవర్మయు నాయుధిష్ఠిరు నొకయరనిముసమున సూతరథాశ్వవిరహితునిఁగా నొనర్చెను. అంత నాధర్మజుఁ డొకకత్తిని గేడెమును బూనికొనఁ, దీప్రభల్లములచే వాని నాకృతవర్మ ఖండించెను. పిదప నాధర్మజుఁడు దురాసదమగు నొకతో మరము నాతనిపై వైవ, నది వడిగా వచ్చుటను గాంచి దాని నాకృత వర్మఁడు నగుచు రెండుఖండములుగావించి. మఱియు శరశతముచే నాయుధిష్ఠిరునికవచమును భేదింప,నది యాకసమునుండి జాఱిన నక్షత్ర సమూహమువలె శిథిలమై పడియెను. అటు లతఁడు కృతవర్మశరార్దితుఁ డై విరథుఁడై, కవచము చినిఁగి, కడువడిగా నారణరంగమునుండి తొలఁగిపోయెను. ఓరాజా! అటు లాకృతవర్మఁ డాధర్మజుని జయించి, మరల నాద్రోణునిచక్రమును రక్షించువాఁడై యుండె" నని తెలిపి సంజ యుఁడు మఱియు ని ట్లనియె.

## సుయోధనుఁడు భీమునకోడి పాఱిపోవుట

"ఓరాజా! చతుష్పథమునుండి యేనుగువలె వెడలివచ్చురథికోత్త ముఁడగు నాసాత్యకి, నాభూరి మాఱుకొనియెను. పిదప నాసాత్యకి కుపితుఁడై వాఁడిగలయైదుబాణములచే నాభూరి హృదయమునొప్పింప, రక్తము స్రవింపఁజొచ్చెను. పిమ్మట నాభూరియు సాత్యకిభుజమధ్యమును బదిబాణములచే నొప్పించెను. ఓమహారాజా! వారిరువురు నటు లొకరి

నొకరు ప్రహరించుకొనుచుఁ, గ్రోధతామ్రాక్షులై ధనుష్టంకారము లొనర్చి, దారుణమగుశరవర్షమును గురియుచుఁ, బరస్పరము సాయక సమూహములచేఁ గప్పికొనిరి. ఇట్లు రెండుగడియలకాలము వారు సరిగాఁ బోరాడిరి. పిమ్మట నాసాత్యకి కుపితుఁడై నవ్వుచుఁ, గౌరవుఁడగు నాభూరివిల్లు దెగనేసి, మఱియుఁ దొమ్మిదిబాణములచే నాతనివక్షము నొప్పించి, నిలునిలుమని పలికెను. అంత నాభూరియు బలవంతుఁడగు సాత్యకిప్రహారములచే నొచ్చియు, వేఱొకవిల్లు పూని యాసాత్యకి నొచ్చునట్లుగాఁ బ్రతిప్రహారమొనర్చెను. అటు లతఁడు మూఁడుబాణములచే నొప్పించి, మఱియు నొకతీవ్రభల్లముచే నాసాత్యకివిల్లు దునుమ, నతఁడు కోపావేశపరవశుఁడై యాభూరిపై భూరివేగముగల యొక మహాశక్తిని బ్రయోగింప, దానిచే నతఁడు విభిన్నాంగుఁడై రథము నుండి, యాకసమునుండి కుజగ్రహమువలె నేలఁగూలెను. ఓరాజా! శూరుఁడగు నాభూరి యిటులు హతుఁడగుటఁ గాంచి మహారథుఁడగు ద్రోణసుతుఁడు కడువడిగా నాసాత్యకిపైఁ దలపడి, నిలునిలుమని పలుకుచు, మేఘము వర్షముచే మేరువునువలె శరవర్షముచే నాతని ముంచెను. అటు లాశైనేయునిరథముపైఁ దలపడినయశ్వత్థామ నారసి, ఘటోత్కచుఁడు సింహనాదమొనర్చి 'ఓద్రోణపుత్రా! నిలునిలుము. ప్రాణములతో నెందుఁబోఁగలవు? ఓరీ! కుమారస్వామి మహిషాసురుని వలె నిదె నిన్నుఁ జంపుచున్నవాఁడను. ఈరణరంగమున నీకు యుద్ధశ్రద్ధ నభ్యసింపఁజేసెదను.' అని పలుకుచు, రోషతామ్రాక్షుఁడై యారాక్షసుఁడు గజేంద్రమును సింహమువలె నాతనిఁ దలపడియెను. అటు లతఁడు మార్కొని మేఘము వర్షధారలచేవలె, నాద్రౌణిరథచక్రములు మున్గునట్లుగా శరసమూహము నాతనిపై వర్షించెను. అంత నాద్రౌణియు వానిబాణవర్షము తనపైకిరాకుండఁగనే విషసర్పతుల్యములగుసాయకములచే ఖండించెను. అటులొనర్చి, మఱియు మర్మభేదకములగుతీవ్రశర శతములచే నారాక్షసోత్తముఁడగు ఘటోత్కచునిఁ గప్పఁగా, నపు డాతఁడు నాఁటినసాయకములచే ముండ్లువిప్పిన యేదుపందివలెఁ జూపట్టెను. పిదప నాఘటోత్కచుఁడు కుపితుఁడై తనప్రతాపమేర్పడ నుగ్ర శరపరంపరచే నాద్రోణసుతుని హతునిఁ గావించి, మఱియు నర్ధచంద్రాదులగు బహువిధనారాచములచే నాతనిఁ గప్పెను. క్రూరమై తనపైఁ

బడుచుఁ బిడుగుచప్పుడులుగల యాశరవర్షమున కాద్రోణసుతుఁడు చలింపక దివ్యాస్త్రమంత్రితములగు ఘోరనారాచములచే మహాభ్రములను మారుతమువలె నాఘటోత్కచుశరవర్షమును దొలఁగించెను. పిదప నాకసమున వారిబాణములకు వేఱొకసంగ్రామము జరిగినట్లయ్యెను. ఓమహారాజా! వారియుద్ధము ఘోరరూపమయ్యెను, వీరులకు హర్షవర్ధనమయ్యెను. వారిసంఘర్షమున జనించినమిడుఁగురు లెల్లయెడల వ్యాపించి, యానిశాముఖమున నాకసము మెఱుఁగుడుఁబుర్వులచేవలెఁ జిత్రమై కానవచ్చెను. అపు డాయశ్వత్థామ సాయకశతములచే నెల్లచోటులఁ గప్పి, నీపుత్రునిహితమునకుఁగా రాక్షసుని నొప్పించెను. మరల నాఘటోత్కచాశ్వత్థామలకు గాఢమగు నారాత్రిమధ్యమున నింద్రప్రహ్లాదులకువలె ఘోరయుద్ధ మారంభమగుడు,ఘటోత్కచుఁడు కుపితుడై కాలానలతుల్యములగు పదిబాణములచే నాద్రోణపుత్రునురము నొప్పించెను. అటు లారాక్షసునిచేఁ బీడితుఁడై, బలవంతుఁడయ్యు నాయశ్వత్థామ సంచలించి, గాలిచేఁ గదల్పఁబడినవృక్షమువలెఁ జలించి, మూర్ఛానిష్టుఁడై, ధ్వజస్తంభము నాశ్రయించి యుండెను. ఓరాజా! నీసైన్యమున హాహాకారము జనించెను. నీవారెల్లరును నశ్వత్థామ హతుఁడయ్యెనని తలంచిరి. ఆరణరంగమున నట్టియవస్థలోనున్న యాతనిఁ గాంచి, పాంచాలురును సృంజయులును సింహనాదములొనరించిరి. పిదప మహారథుఁడగు నశ్వత్థామ తెలివొంది, యెడమచేత విల్లు సారించి, ఘోరమై యమదండమునాఁదగు నొకనారాచము నాఘటోత్కచు నుద్దేశించి గట్టిగాఁ దివిచి విడిచెను. ఆయుత్తమసాయక మారాక్షసువక్షమును భేదించి పుడమిఁజొచ్చెను. రణగర్వితుఁడగు నాద్రోణిచే నటులు హతుఁడై బలవంతుఁడయ్యు, నారక్కసుఁ డుక్కుచెడి రథమధ్యమున మూర్ఛవడియెను. అటు లొడలు తెలియక పడిన యాఘటోత్కచునిఁ గాంచి, వానిసారథి యారణరంగమునుండి కడువడిగాఁ దప్పించి తీసికొనిపోయెను. అటు లాసమరమున నారక్కసు నొప్పించి, మహారథుఁడగు నాద్రోణతనయుఁడు గొప్పచప్పుడగునట్లుగా సింహనాదమొనర్చెను. ఓరాజా! అపు డాద్రోణతనయుఁడు నీపుత్రులును సకలయోధులును దన్ను గౌరవింప, మేనికాంతిచే మధ్యాహ్నభాస్కరుఁడనాఁ గానవచ్చెను. అంత నాభారద్వాజునిరథముపైకి వెడలి, యుద్ధము

చేయుచున్న భీముని సుయోధనుఁడు తలపడి తీవ్రనారాచములచే
నొప్పింప, వాని నాభీముఁడు తొమ్మిదిసాయకములచేఁ గొట్టెను. అపు
డాసుయోధనుఁడును నిరువదిబాణములచేఁ బ్రతిప్రహార మొనర్చెను.
వారిరువురును బరస్పరసాయకములచేఁ గప్పంబడి, యారణరంగమున
మబ్బులచే నాకసమునఁ గప్పఁబడిన చంద్రసూర్యులునాఁ జూపట్టిరి. ఓభర
తోత్తమా! అంత నాసుయోధనుఁ డైదుసాయకములచే నావృకోదరు
నొప్పించి, నిలునిలుమనిపలుక నాభీముఁడు తీవ్రబాణములచే నాసుయో
ధనుధనువు దునుమాడి, మఱియు నతపర్వతములైన తొంబదిబాణములచే
నొప్పించెను. అందుల కాదుర్యోధనుఁ డెంతయు నలిగి, వేఱొకగొప్ప
విల్లు పూని సకలధనుర్ధరులును జూచుచుండఁగా నావృకోదరుపైఁ
దీవ్రబాణములను బ్రయోగింప, నాసాయకముల నతఁడు కొట్టి, మఱి
యిరువదైదుక్షుద్రకబాణములచే నాసుయోధను నొప్పించెను. ఓమా
రిషా! అందుల కాసుయోధనుఁడు కుపితుఁడై యొకక్షురప్రముచే
నాభీమునిధనువు త్రుంచి, మఱి పదిబాణములచే నాభీమునిఁ బ్రతిప్రహార
మొనర్చెను. పిమ్మట నమ్మహాబలుఁడగుభీముఁడు వేఱొకవిల్లు గొని
వడిగా నాసుయోధను నేడుతీవ్రబాణములచే నొప్పింపఁ, దనకరలాఘవ
మేర్పడ వడిగా సుయోధనుఁ డాతనిధనువు మఱల దునిమెను.
ఓరాజా! నీతనయుఁ డటులు మదోత్కటుఁడై యావృకోదరుఁడు
గ్రహించుచున్నధనువులెల్లఁ దునుముచుఁ, దుది కైదువిండ్లను ఖండిం
చెను. అటులు తనధనువులెల్లఁ దునియలగుచుండుట గాంచి యా
వృకోదరుఁడు దృఢమైన యొకపరశుమయశక్తి నాసుయోధనుపై
వైచెను. అయ్యది మృత్యుసోదరినాఁదగి ధూమకేతుజ్వాలవలె మండుచు,
నాకసమునకుఁ బాపటనొనర్చి, యగ్నితుల్యప్రభయై వెడల నాసుయోధ
నుఁడు దాని నాత్రోవనడుమనే రెండుఖండములుగా ఖండించెను.
దాని నాభీముఁడెగాక యందఱును జూచి యచ్చెరువొందిరి. పిదప
భీముఁ డొకమహాప్రభగల గొప్పగద నాసుయోధనుపై వైవ,
నది నీతనయురథమును, రథాశ్వములను, సారథిని రూపుమాపెను.
ఓరాజేంద్రా! నీపుత్త్రుఁ డాభీమునకు వెఱచి, విక్రమముచెడి నందకుఁ
డనువానిరథ మధిరోహించెను. పిదప భీముఁ డారాత్రిమధ్యమున
నాసుయోధనుఁడు మడిసెనని తలంచి, కౌరవులకెల్ల వెఱపుగల్గునట్లుగా

గొప్పసింహనాదమొనరించెను. అపుడు నీవారిసైనికులును తమరాజు హతుఁడయ్యెననికొని యెల్లెడల హాహాకారము లొనర్పసాగిరి. అటులు జడిసిన సకలయోధులయార్తారావమును, భీమునిమహానాదమును విని యుధిష్ఠిరుఁడును సుయోధనుఁడు హతుఁడయ్యెనని తలంచి యావృకోదరుఁడున్నకడకు వడిగా వచ్చెను. అపుడు పాంచాలసృంజయమాత్స్యచేదికైకేయులు బహువిధప్రయత్నములతో నాద్రోణునిఁ జంపువారై యాతని దలపడిరి. అపు డాద్రోణునకు వైరులతో గొప్పపోరాట మారంభమగుడు, నాఘోరాంధకారమునఁ బరస్పరముఁ బ్రహరించికొని" రని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## కర్ణునకోడి సహదేవుఁడు పాఱిపోవుట

"ఓరాజా! ద్రోణుని జయించువాఁడై వెడలినమహారథుఁడగుసహదేవుని, సూర్యసుతుఁడగుకర్ణుఁడు నివారించెను. అపు డాసహదేవుఁ డారాధేయుఁ దొమ్మిదిబాణములచే నొప్పించి, మఱియుఁ దీవ్రములగు తొమ్మిదిసాయకములచేఁ బ్రహరింపఁగా, నారాధేయుఁడు నూఱునారాచములచేఁ బ్రతిహారమొనర్చి, మఱియు నెక్కిడియున్న యాసహదేవుధనువును గరలాఘవమేర్పడ వడిగా ఖండించెను. అంత నాసహదేవుఁడును వేఱొకవిల్లుగొని, తనప్రతాపమేర్పడ నిరువదిబాణములచే నారాధేయునిఁ బ్రహరింప, నయ్యది యద్భుతముగాఁ జూపట్టెను. పిమ్మటఁ గర్ణుఁడును, దీవ్రబాణములచే నామాద్రీపుత్త్రుహయములను గొట్టి, మఱియు సారథి నొకభల్లముచే యమమందిరము నొందించెను. అపు డాసహదేవుఁ డటులు విరథుఁడై కత్తియుఁ గేడెమును ధరింప, నారాధేయుఁడు నగుచుఁ,దనవాఁడికోలలచే వానిని సైతముఖండించెను. పిదప నమ్మాద్రీతనయుఁడొకఘోరమైన గొప్పగదను, మహాబలుఁడై యారాధేయురథముపైకి వైవ, దాని నాకర్ణుఁడు, శరసమూహముచేఁ గొట్టి, పుడమిఁ బడఁద్రోసెను. అటులు తనగద భగ్నమగుటఁ గాంచి సహదేవుఁడు వడిగా నొకశక్తి నాకర్ణునిపైఁ బ్రయోగింప, దానిని సైత మాఁతఁడు ఖండించెను. పిదప నాసహదేవుఁడు వడిగాఁ దనరథము నుండి దిగి రోషముచేఁ బ్రజ్వలించుచు, నారాధేయుం గాంచి, తన రథచక్రమును బరిగ్రహించి వానిపై వైచెను. అపు డది వడిగాఁ

ప్రళయకాలచక్రమువలె వెడలఁగా, దానిని శరసహస్రములచే నాసూత సుతుఁడు హతముగావించెను. అటు లాచక్రము భగ్నముకాఁగా, నామహాద్రితనయుఁడు రథదండమును, యోక్త్రములను, యుగములను, బలువిధములగు నేన్గులడొక్కలను, మృతినొందినగుఱ్ఱములను, హతులైనపదాతులను, నారాధేయునిపై వైవఁ దొడంగుటయు, వానినెల్ల నాకర్ణుఁడు ఖండించుచువచ్చెను. అపు డామహాద్రికొడుకు తాను నిరాయుధుఁడగుటఁ దెలిసికొని, యాకర్ణునిశరములచే నివారింపఁబడుచు, యుద్ధమును విడువ, నారాధేయుఁ డాతనిఁ దఱుముచు, నాతనితో 'ఓసహదేవా! అధికులగురథికులతో నీవు యుద్ధ మొనరింపకుము. నామాటకుఁ దప్పు వట్టక నీకుఁ దగువారితోఁ బోరాడుము.' అని పలికి పరిహాసించుచు ధనురగ్రముచేఁ బొడుచుచు, మఱియు నిష్ఠురముగా, 'ఓయీ! ఇదె యర్జునుఁ డక్కౌరవులతోఁ బోరాడుచున్నవాఁడు. అందులకుఁ బొమ్ము. లేదా! ఇష్టమేని యింటికైనఁ బొమ్ము.' అని పలికి నవ్వుచుఁ బాంచాలరాజసైన్యములపైకి వెడలెను. అటు లారాధేయుఁడు తన కాసహదేవుఁడు దొఱకినను, గుంతివచనమును స్మరించి, సత్యసంధుఁడగుట నాతనిఁ జంపక విడుచుటచే నాసహదేవుఁడును జడిసి, కర్ణశరపీడితుఁడై మనసుచెడి వానివాక్ఛల్యములు పీడింప, బ్రదుకు నేవగించుకొనుచుఁ బోయి మహాత్ముఁడగు జనమేజయుఁడను పాంచాల్యునిరథ మధిరోహించెను." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

### అర్జునుఁ డలంబుసునిఁ బరాభవించుట

"ఓరాజా! తనసైన్యముతో ద్రోణునిపైకి వడిగా వెడలిన విరాటుని, శల్యుఁడు మార్కొని శరసమూహముచే నాతనిఁ గప్పెను. ఓరాజా! దృఢధానుష్కులగు వారిరువురకు మున్నా బలివాసవులకువలె గొప్పయుద్ధము జరిగెను. అపుడు సేనాపతియగువిరాటు, నాశల్యుఁడు వడిగా నూఱుతీవ్రబాణములచే నొప్పింప, విరటుఁ డాతని దొమ్మిదితీవ్రశరములచేఁ బ్రతిహార మొనర్చి, మఱియు డెబ్బదిబాణములచేఁ గొట్టి, మఱియు నూఱుబాణములచే నొప్పించెను. పిదప నాశల్యుఁడువిరటుని నాల్గుగుఱ్ఱములనుగొట్టి, రెండుబాణములచే మఱియు నాతనిధ్వజమును

ఛత్రమును బుడమిఁ బడఁద్రోసెను. అంత నావిరటుఁడు, హతాశ్వుఁడగుట, వడిగా రథముడిగి, ధనువు సారించుచు, శరప్రయోగ మొనర్చుచుండఁగా, నాతనిభ్రాతయగు శతానీకుఁడు గాంచి యెల్లవారు గాంచుచుండఁగా, నందులకు వడిగా నరుదెంచెను. అటులు తనపైకివచ్చు నాశతానీకునిఁజూచి యాశల్యుఁడు పెక్కుబాణములచేఁ గొట్టి, వానిని యమమందిరమున కనిపెను. వాఁడటులు నిహతుఁడగుడు, సేనాపతి యగువిరటుఁడు, హతాశ్వమగు తనరథమువిడిచి యాశతానీకునిరథమధిరోహించి, కన్నులు పెద్దచేసి, కోపమడర ద్విగుణితవిక్రముఁడై, యాశల్యునిరథమును శరసమూహముచేఁ గప్పెను. పిదప శల్యుఁడును గుపితుఁడై నూఱుతీవ్రబాణములచే వాహినీపతియగు విరాటునివక్షము నొప్పింప, నతఁ డెంతయు నొచ్చి, రథమధ్యమునఁ గూలఁబడియెను. అటులు రథమున మూర్ఛపడిన యావిరాటు నారణరంగమునుండి యాతనిసారథి తొలఁగించికొనిపోవ, నారాత్రి యావిరాటసైన్యము చెదరిపోయెను. అంత, నాశల్యునిశరప్రహారములకు జడిసి పరువులిడుచున్న యావిరాటసైన్యమును, వాసుదేవార్జునులు గాంచి యాశల్యుఁడున్నకడకు బయలువెడలిరి. ఓరాజా! అటులు వెడలిన యప్పార్థు నలంబుసుఁడు దలపడుటకై, తన యెనిమిదిచక్రములరథము నెక్కి ఘోరాకారులై యశ్వముఖులగుపిశాచులు సహాయులుగా రక్తముచేఁ దడిసిన పతాకముతోఁ బుష్పమాలికాలంకృతమై యుక్కుతోఁ జేయంబడి, భల్లూకచర్మ సమావృతమైన యారథమునందలిధ్వజము, చిత్రపక్షములు గల్గి, వివృతాక్షమై ఘోరముగా ధ్వనిచేయుచుండఁగా, గ్రద్దరూపుగల యాయున్నతధ్వజముతో వెలయుచుఁ, గాటుకకొండనాఁ జూపట్టెను. ఓరాజా! ఆయలంబుసుఁడు తనపైకి వచ్చునవ్విష్వచ్చు నెదుర్కొని, పెనుగాలి నడ్డుకొనినపర్వతోత్తరుమువలెఁ జలింపక, యాయర్జునుని మూర్ధము గుఱిగా శరసహస్రమములఁ బఱపుచుండ, వారిరువురకును ఘోరయుద్ధమయ్యెను. ఆయుద్ధము చూచువారికిఁ బ్రీతికరమై, గ్రద్దలు, కాకులు, రాబందులు, నక్కలు మున్నగువానికి సంతసము గల్గించెను. అపు డాయర్జునుఁ డాయలంబుసు నాఱుబాణములచేఁ బీడించి, పది బాణములచే వానిధ్వజము ఖండించి, మూఁడుబాణములచే సారథిని, మూఁడుకోలలచేఁ ద్రివేణుకమును, నొకకోలచే ధనువును ఖండించి,

నాల్గుబాణములచే గుఱ్ఱములునాల్గిటిని గొట్టి, మఱియు నాయలంబునఁ డెక్కిడినచాపమును ద్రుంచి, మఱియు నాల్గుతీవ్రబాణములచే వానిని నొప్పించెను. అందులకు వాఁడెంతయు నొచ్చి, జడిసి పాఱిపోయెను. అటు లాయర్జునుఁడు వాని జయించి, వడిగా ద్రోణునిఁ దలపడి, గజాశ్వ పదాతులపై శరసమూహముఁ బఱపుచుండెను. ఓరాజా! కీర్తిశాలి యగునప్పాండవేయునిచే నటులు హతులగుచు మనసైనికులు గాలిచేఁ బడిన వృక్షములువలెఁ బుడమిఁబడుచుండిరి. అటులు కొందఱు హతు లగుచుంట, హతశేషులు జడిసి, భయపీడితములగు మృగములువలె నెంతయుఁ బరువులిడిపోసాగిరి" అని తెలిపి సంజయుఁడు మఱియు నాతనితో ని ట్లనియె.

## శతానీకాదులు చిత్రసేనాదులతోఁ బోరాడుట

"ఓరాజా! మనసైన్యములను దీవ్రశరపరంపరలచే నొప్పించు చున్న శతానీకునిఁ జిత్రసేనుఁడు నివారింప, నకులునిపుత్రుఁడగు నా శతానీకుఁ డాతని నైదుబాణములచే నొప్పించెను. అంత నాచిత్ర సేనుఁడును బదితీవ్రబాణములచేఁ బ్రతిప్రహారమొనర్ప, మఱియు నాశతానీకుఁ డాచిత్రసేనునివక్షమును దీవ్రములగుతొమ్మిదిబాణము లచేఁ గొట్టి, వానికవచము శరీరమునుండి తొలఁగునట్లుగా నొనర్చుట నెంతయు నద్భుతమొనర్చెను. ఓరాజా! అపుడు నీకొమరుఁ డటులు కవచహీనుఁడగుట నెంతయుఁ బొరవిడిచినబామునాఁ బ్రకాశించెను. ఓమహారాజా! పిమ్మట నాశతానీకుఁ డాచిత్రసేనుధ్వజమును ఖండించి, వాఁడు ప్రయత్నించుచుండఁగనే ధనువు దునుమాడెను. పిదపఁ జిత్ర సేనుఁ డటులు కవచహీనుఁడగుటయేగాక ధనువునైతము దునియ లయ్యు వెనుదీయక, వేఱొకవిల్లుగొని, వడిగాఁ గొన్నితీవ్రబాణములచే నొప్పింప, నందుల కాశతానీకుఁడు కుపితుఁడై, నిజమహాబల మేర్పడ నాచిత్రసేనుని నాల్గుగుఱ్ఱములను సారథిని గూలనేయ, వాఁడును దన రథమునుండి యుఱికి, యానకులపుత్రు నిరువదైదుబాణములచేఁ బీడించెను. అంత నాశతానీకుఁ డటులు విక్రమించు నాచిత్రసేనుని సువర్ణభూషితమగుచాపము నొకయర్ధచంద్రబాణముచే ఖండింప,వాఁడు హతసారథియు, హతాశ్వుఁడును, విగతకవచుఁడును, విగతచాపుఁడును,

విరథుఁడునై, వడిగాఁ గృతవర్మునిరథ మధిరోహించెను. ఓమహారాజా! అపుడు, తనసైన్యముతోఁగూడ ద్రోణుని మార్కొననున్న మహారథుఁ డగు ద్రుపదుని, శరశతముచేఁ గప్పుచు, మనవృషసేనుఁడు దలపడియెను. ఓరాజా! అపు డా ద్రుపదుఁడు మహారథుఁడగు వృషసేనునివక్షమును బాహువులను నలుబదిబాణములచే నొప్పింప, నాకర్ణునికొడుకు కోప మేపార రథస్థుఁడై యున్న యా ద్రుపదునివక్షము నొవ్వఁ బెక్కుసాయక ములచే నొప్పించెను. ఓమహారాజా! వారిరువురు నటులు పరస్పరశర కంటకములు మేనులనాఁటికొన, ముండ్లపందులునాఁ జూపట్టిరి. మఱియు వారు సువర్ణపుంఖములై తీవ్రాగ్రములగు సాయకములచేఁ బ్రహరించు కొని, రక్తసిక్తాంగులై యారణరంగమునఁ జిత్రములై సువర్ణనిభము లగు కల్పవృక్షములనుబోలియుఁ, బూచినమోదుగులనుబోలియుఁ గాన వచ్చిరి. పిదప వృషసేనుఁ డా ద్రుపదునిఁ దొమ్మిదిబాణములచేఁ గొట్టి, మఱియు డెబ్బదిటను, మరల మూఁడిటను నొప్పించి, పిదప శరసహ స్రములను గురియుచు, జలముగుఱియు మేఘమునాఁ జూపట్టెను. అందుల కా ద్రుపదుఁడు కుపితుఁడై యొకపచ్చనితీవ్రభల్లముచే నావృష సేనుధనువు రెండుఖండములుగా ఖండింప, వాఁడును వేఱొకవిల్లుగొని సువర్ణబద్ధమై దృఢమగునావింటఁ బచ్చని యొకతీవ్రభల్లమును సంధించి, యాకర్ణాంతముగా లాగి, పాంచాలురకెల్లరకు వెఱపుగదుర నా ద్రు పదుని సరిగా గుఱిచేసి ప్రయోగింప, నది వానివక్షమును భేదించి, పుడమిని బ్రవేశించెను. అంత నా ద్రుపదుఁడు మూర్ఛమునుఁగుట నారసి, యాతనిసారథి నిజకృత్యమును స్మరించి, యచ్చోటినుండి దీసి కొనిపోయెను. ఓరాజా! అటు లప్పాంచాలరాజు భంగమొందుటయు, నా ద్రుపదుసైన్యమెల్ల నారాత్రి శరపీడితమై పరువులిడసాగెను. ఓరాజా! పదాతులచే విడువఁబడి ప్రజ్వలించుచున్న దివ్వటీలచే నెల్లెడలఁ బుడమి, గ్రహములతోఁగూడి మేఘములులేనియాకసమువలె నెంతయు విరా జిల్లెను. మఱియు నందందుఁబడియున్న కేయూరములచే నారణరంగము, వర్షకాలమున మెఱుపులతోఁగూడినమేఘమునాఁ బుడమి గానవచ్చెను. పిమ్మట నావృషసేనునకు జడిసిన యప్పాంచాలసైన్యములు, మున్నింద్రు నకు వెఱచిన తారకాసురునిసైన్యములువలెఁ జెదరిపోయెను. ఓమహా రాజా! అటులావృషసేనునిచేఁ బీడితులై యాసంగ్రామమున సోమకులు

గూడఁ బరువులిడుచు, నాదీపములచేఁ జూడఁబడుచుండిరి. వారినెల్ల నట్టు లోడించి యాకర్ణపుత్త్రుఁడు మధ్యందినమార్తాండుఁడునాఁ గాన వచ్చెను. ఓరాజా! మనవారును వారివారునగు రాజసహస్రములలో నొకవృషసేనుఁడుమాత్రమ ప్రతాపశాలియై ప్రజ్వరిల్లుచుఁ గానవచ్చెను. అటులతఁడు శూరులగు సోమకమహారథులను జయించి, వడిగొనా యుధిష్ఠిరుఁ డున్నకడకు వెడలెను. పిదప వైరులను బ్రహరించుచుఁ, దన వైపువచ్చుచున్న ప్రతివింధ్యుని దుశ్శాసనుఁ డెదురింప, వారిసమావేశ మెంతయు నద్భుతముగాఁ గానవచ్చెను. అయ్యది, నిర్మేఘమగునాక సమున బుధశుక్రులసమాగమమును దలపించెను. అపు డటులు దారుణ కృత్యమొనరించుచున్న యాప్రతివింధ్యుని, దుశ్శాసనుఁడు మూఁడు బాణములచే లలాటము నొప్పింప, బలవంతుఁడగు నాతనిప్రహారము లెంతయు నాఁటుకొన, శిఖరములతోఁ గూడినపర్వతమునాఁ బ్రతివిం ధ్యుఁడు చూపట్టెను. అంత నామహారథుఁ డగుప్రతివింధ్యుఁడు, దుశ్శా సనునిఁ దొమ్మిదిబాణములచే నొప్పించి, మఱియు నేడుబాణములచేఁ బ్రహరింప, నపుడు నీపుత్త్రుఁడు తీవ్రసాయకములను వానిగుఱ్ఱము లను బడఁద్రోసి, యెంతయు విక్రమించెను. ఓరాజా! మఱియు నీ కొమరుఁడు వానిసారథి నొకభల్లముచేఁ గొట్టి, ధ్వజమును బడఁద్రోసి, రథము చూర్ణముగావించి, యటులే వానిరథము పతాకలను, దూణీర మును, యోక్త్రములను, గోపమడరఁ దీవ్రనారాచములచే ఖండఖండ ములుగా ఖండించెను. అపు డాప్రతివింధ్యుఁడు విరథుఁడై నేల నిలు వఁబడి, విల్లు కేలఁబూని, పెక్కుసాయకము లాదుశ్శాసనుపైఁ గురి యుచు యుద్ధమొనరించెను. అంత నీతనయుఁడు వానిధనువు నొకక్షుర ప్రముచేఁ, గరలాఘవమేర్పడ ఖండించి, మఱియుఁ బదిబాణములచేఁ బీడింప, నపుడు వానిసోదరులు, కడువడిగాఁ దమసైన్యముతోఁ గలిసి వచ్చి యాతనికిఁ దోడ్పడిరి. అపు డాప్రతివింధ్యుఁడు శ్రుతసోమునిరథ మధిరోహించి, విల్లుపూని, నీకొమరుని నొప్పింప, నంత నీవారెల్లరును దుశ్శాసనునకు సహాయులై గొప్పసైన్యముతో నాప్రతివింధ్యునిఁ దల పడిరి. ఓభారతా! దారుణమగు నారాతిరి, యమరాష్ట్రవివర్ధనమైన గొప్పయుద్ధము నీవారికిని, పాండవులకును జరుగ నారంభమయ్యెను" అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## రాత్రిసంకులయుద్ధము

"ఓరాజా! మనసైన్యమును బ్రహరించుచు విక్రమించుచున్న నకులునిఁ గుపితుఁడై శకుని మార్కొని, నిలునిలుమని పలుకుచు నివారించెను. అపుడు వారిరువురును గృతవైరులై, శూరులై పరస్పరముఁ జంపుకొనునట్టిపట్టుదలలతోఁ గట్టిగా లాగి విడువఁబడుచున్న శరసమూహముచే నన్యోన్యముఁ బ్రహరించుకొనిరి. ఓరాజా! నకులుఁడు తనపై నెటులు శరవర్షమును గురిపించెనో, శకునియు నటులే యాతనిపై శరములను వర్షించెను. అపుడు వారుపరస్పరశరములు తమ తమ మేనుల నాఁటికొన, వానితో ముండ్లపందులునాఁ జూపట్టిరి. సువర్ణ పుంఖములును, సరళాగ్రములునునగు పరస్పర శరప్రహారములచేఁ గవచములు చినుఁగ, రక్తసిక్తాంగులై బంగరురంగుగలిగి, చిత్రములైన కల్పవృక్షములునాఁదగి పూచినమోదుగులునా వెలయుచుండిరి. ఓమహారాజా! శూరులగు వారిరువురును, శరములనెడిముండ్లు మేనులనాఁటికొన, ముండ్లతోఁగూడిన బూరుగుచెట్లునాఁ జూపట్టిరి. మఱియు వారొకరి నొకరు వక్రముగాఁ జూచికొనుచుఁ, గన్ను లెఱ్ఱవాఱఁ బెద్దగాఁ జేయుచుఁ, జూపులచేఁ బరస్పరము దహించుకొనువారుగా నుండిరి. అపు డాశకుని కుపితుఁడై పరిహాసముచేయుచు నానకులునిఁ గర్ణి బాణముచే హృదయమున నొప్పింప, నందుల కానకులుఁ డెంతయు నొచ్చి, రథమధ్యమునఁ గూలఁబడి మూర్ఛనొందెను. అపు డాశకునియు గర్వితుఁడును బరమవైరియునగు నానకులుఁడట్టియవస్థనొందుటనుగాంచి, తొలకరి మేఘమువలె గొప్పనినాద మొనరించెను. పిదపనామాద్రీపుత్త్రుఁడు మరలఁ దెలివొంది, నోరుతెఱచినయంతకుఁడునా, మఱియు నాసౌబలునిఁ దఱపడి, కుపితుఁడై యఱువదిబాణములచే నొప్పించి, మఱియు నూఱునారాచముల నాతనివక్షమును బ్రహరించి, పిదప ముష్టిప్రదేశమునఁగొట్టి, సాయకముతోఁగూడినధనువు దెగనేసి, వడిగా ధ్వజము ఖండించి, పుడమిఁ బడఁద్రోయుటయెగాక యొకవాఁడిగల పచ్చనిబాణముచే శకునితొడల భేదించి, వ్యాధుఁడు ఱెక్కలతోఁగూడిన డేగనువలెఁ గొట్టెను. ఓరాజా! శకునియు మిగుల నొచ్చి రథమధ్యమునఁగూలఁబడి, కాముకుఁడు కామినినివలె ధ్వజస్తంభమును గౌఁగిలించికొనియుండెను,

ఓయనఘా! అటులు తెలివితప్పిపడియున్న నీస్యాలకుని వాని నా సేనా ముఖమునుండి సారథి తొలఁగించి తీసికొనిపోయెను. అపుడు పాండవులును, వారి ననుసరించియున్నవారును నెంతయు సింహానాదము లొనర్చిరి. అంత నటు లానకులుఁడు శకుని నోడించి, శత్రుతాపనుఁడై తనసారథితో 'ఓయీ! మనరథము ద్రోణునిపైకిఁ బఱపుము' అని తెలుప విని, యాసారథి ద్రోణుఁడున్నకడకుఁ దనరథమును బఱపెను. పిమ్మట ద్రోణు నోడించువాఁడై వెడలినమహాబలుఁడగు శిఖండిని గడు వడిగాఁ గృపాచార్యుఁ డెదుర్కొన, నపు డాశిఖండి తొమ్మిదిబాణములచే నాకృపునిఁ బ్రహరించి నవ్వసాగెను. ఓరాజా! అంత నాయాచార్యుఁడును శిఖండి నైదుబాణములచే నొప్పించి, నీపుత్రులకు హితముగూర్చువాఁడై, మఱియు నిరువదిసాయకములచే నొప్పింప, నపుడు వారికి ఘోరముగాఁ బోరారంభమయ్యెను. మున్ను దేవాసురయుద్ధమున శంబరునకు నింద్రునకువలె నమ్మహారథులకు ఘోరయుద్ధమై, వారిశరజాలముచే నాకస మావరింపఁబడియెను. అయ్యది తొలకరిమేఘముల యావరణమునాఁ గానిపించెను. ఓభరతోత్తమా! యుద్ధాభిలాషులగు యోధుల కారాత్రి సహజముగా ఘోర యుద్ధముచే మఱియు ఘోరముగాఁ జూపట్టెను. ఇంతయేల! వారికెంతయు నది భయావహ మగుటచేఁ గాళరాత్రియయ్యె ననవచ్చును. ఓరాజా! అపు డాశిఖండి యొకయర్ధచంద్రబాణముచేఁ గృపునిధనువు దెగనేసి, మఱియుఁ దీవ్రనారాచముల నాతనిపైఁ బ్రయోగించెను. అందుల కాకృపుఁడు కుపితుఁడై దారుణమగు నొకశక్తి నాశిఖండిపై వైవ, సువర్ణదండమై తీవ్రాగ్రమై సానవెట్టఁబడి తనపైకివచ్చుదాని నతఁడు పదిబాణములచే ఖండింప, నది పుడమిఁబడియెను. పిదప నాకృపాచార్యుఁడు వేఱొకవిల్లుగొని తీవ్రసాయకములచే నాశిఖండిని గప్పి పీడింప, నాశిఖండి రథమధ్యమునఁబడియెను. అపు డాకృపుఁడు కృపవీడి దురవస్థలోనున్న యాశిఖండిని బెక్కుసాయకములచేఁ జంపువాఁడై ప్రహరింప, నతఁడు విముఖుఁడయ్యెను. అంత నట్టిశిఖండిని గాంచి పాంచాలురును సోమకులును నాతనినలుగెలంకులఁ జుట్టుకొని, రక్షకులై యుండిరి. అపుడు కృపునకును నీవారు సహాయులై యావరించియుండిరి. అపుడు గొప్పసైన్యములతోఁగూడ నొకరిపై నొకరు పరువులిడుచుండ నాయోధులకు

మఱియును యుద్ధ మారంభమయ్యెను. అంత మేఘగర్జనములునా గొప్పచప్పుడు లుప్పతిల్లెను. పరస్పరముగాఁ బరువులిడు రౌతులయు, గజారోహకులయుఁ బ్రహారములచే యుద్ధమెంతయుఁ గ్రూరమై చూపట్టెను. ఓమహారాజా! మఱియుఁ బరువులిడుచున్న పదాతులకాలిచప్పుడులకుఁ బుడమి యెంతయు భయముచే వడఁకు పడఁతివలెఁ గంపింపఁజొచ్చెను. అటులే రథికులును గడువడిగా రథములతోఁ బరువులిడుచుఁ బెక్కురు శలభములను వాయసములువలె వైరులను బట్టుకొనసాగిరి. అటులే మత్తగజములును, బరువులిడి మదగజముల నొకయడుగుదాఁటకుండఁ బట్టికొనుచువచ్చెను. మఱియు నారీతిగనే రౌతును రౌతు, పదాతిని బదాతియు సమీపించి, కదలకుండ నివారించి,సంరంభముతోఁ బరస్పరముఁ బోరాడిరి. యుద్ధాభిలాషముమై పరువులువెట్టువారియు, భయముచేఁ జెదరిపోవువారియు, మరలునట్టి వారియుఁ జప్పుడు, లా రాతిరి యెంతయు సంకులమై వినవచ్చెను. ఓ మహారాజా! రథగజాశ్వములందుఁ బ్రజ్వలించుచున్న దివ్యాటీ లాంకసము నుండి జాఱిపడు సుల్కాసహస్రమునాఁ జూపట్టుచుండెను. ఓవిభూ! నాఁటిరాతి రాదీపములచే భాసిల్లుచుఁ బగలునాఁదగియుండుట నారణారంగమునఁ జీకటులు లేక సూర్యుఁడు వెలయునప్పటివలె నొప్పుచుండెను. ప్రదీప్తములగు దీపములచేఁ బెనుజీకటు లడంగుటయు, నంతకుమున్ను ధూళియుఁ జీకటియుఁ గప్పియున్న పృథివ్యాకాశములును, దిక్కులును, విదిక్కులును సూర్యకాంతిచేవలె వెలయుచుండెను. మఱియు మహాత్ములగు యోధులకవచములయు, శస్త్రములయు, మణులయుఁ గాంతు లాదీపకాంతులలో నంతర్ధానమొందుచుండ, నారాత్రి వేళ మహాఘోరమై యుద్ధ మారంభమగుడు, నా యోధులలో నొకఁడేనిఁ దన్నుఁబానని తెలియఁజాలకుండెను. ఓరాజా! ఆసమరమునఁ దండ్రి కొమరుని సమయింపవలసివచ్చెను. అటులే తెలియక తండ్రిని గొమరుఁడును, మిత్రుని మిత్రుఁడును, సంబంధిని సంబంధియు, మేనల్లుని మామయుఁ జంపికొనుచుఁ, దమవారిని దామే నశింపఁజేసికొనసాగిరి. ఓరాజా! ఆ రాతిరియుద్ధము భయంకరమై మేరమీఱియుండెను" అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

## సంకులయుద్ధము

"ఓరాజా! ఆసంకులయుద్ధ మటులు భయంకరముగా నారంభమ గుడు, ధృష్టద్యుమ్నుఁడు ద్రోణునిఁ దలపడువాఁడై ధనువు సంధించుచు, నారి సారించుచు, సువర్ణభూషితమగు నాతనిరథమును సమీపించెను. అటు లాద్రోణుని వధించువాఁడై యాతనిసమీపించు నాధృష్టద్యు మ్నునిఁ బాంచాలురును బాండవులును జేరి యాద్రోణునిఁ జుట్టుకొనిరి. అటులు వారిచే నావరింపఁబడియున్న యాద్రోణు నారసి నీకుమారు లెల్లరును బహువిధప్రయత్నములతో నాతని రక్షించువారై యుండిరి. ఆరాతిరి సాగరములునాఁదగు నామహాసైన్యములు రెండును గలిసి, గాలిచేఁ గదలి కలఁతవడినజంతువులచే భయంకరమైన సముద్రములు వలె వెఱపుగొలుపుచుండెను. అపుడు ధృష్టద్యుమ్నుఁ డాద్రోణు నైదు బాణములచే నొప్పించి, సింహనాద మొనర్చెను. అంత నాద్రోణుఁ డిరు వదైదుబాణములచే నప్పాంచాలు నొప్పించి, మఱియు నొకభల్లముచేఁ గాంతిమంతమగు నాతనిధనువు దునుమాడెను. అటు లాద్రోణుఁడు తన్ను నొప్పించి, ధనువు దెగనేసినందుల కెంతయు నాధృష్టద్యుమ్నుఁ డలిగి, ప్రతాపశాలియై, వేఱొకవిల్లుగొని యాచార్యు నంతమునొందించు వాఁడై పెదవి కొఱుకుచుఁ, జెవికొనవఱకు ధనువులాగి, యొకఘోర నారాచ మాతనిపైఁ బ్రయోగింప, నయ్యది రౌద్రమగు నారణరంగ మునఁ గలసైన్యము నెల్ల నుదయించినసూర్యుఁడువలె వెలిఁగించెను. ఆ ఘోరసాయకము నారసి, దేవదానవగంధర్వు లొక్కుమ్మడిగా నపు డాద్రోణునకు శుభమగుఁగాక యని పలికిరి. ఓరాజా! ఆసాయక మాయాచార్యుని వధింప సమీపింపకమున్నె దాని నారాధేయుఁడు పదిఖండములుగా ఖండించి, తనకరలాఘవము ప్రకటించెను. ఓమారిషా! ఆధృష్టద్యుమ్నసాయక మటులు పెక్కుముక్కలై విషములేనిసర్పము వలె వడిగాఁ బుడమిఁబడియెను. ఆరాధేయుఁ డటు లాసాయకమును దెగనేసి, మఱియుఁ బెక్కుబాణములచే ధృష్టద్యుమ్నుని నొప్పించెను. మఱియు నశ్వత్థామ యైదింటను, ద్రోణుఁ డైదింటను, శల్యుఁడు తొమ్మిదిటను, దుశ్శాసనుఁడు మూఁడిటను, దుర్యోధనుఁ డిరువదింటను, శకుని యైదింటను, నాధృష్టద్యుమ్నుని నొప్పించిరి. ద్రోణత్రాణమునకై

యమ్మహారథులెల్లరును దన్నటులు నొప్పింప, నతఁడును వీరులగు నాయేడ్వురను మూఁడుమూఁడుసాయకములచేఁ బ్రతిప్రహారముచేయు వాఁడై, ద్రోణాశ్వత్థామకర్ణదుర్యోధనుల నొప్పించెను. ధన్వియగు నాతనిచే నటులు వారెంతయు నొచ్చి, భయంకరారావము లొనర్చుచు, నొక్కమాఱుగా మరల నెల్లరును నాతనిఁ బ్రహరించిరి. ఓరాజా! పిదప ద్రుమసేనుఁడు కుపితుఁడై యొకబాణముచే నాధృష్టద్యుమ్నుని నొప్పించి, నిలునిలుమని పలుకుచు, మఱియుఁ గొన్నివిశిఖములచేఁ గొట్టఁగా, నతఁ డాద్రుమసేనుని సువర్ణపుంఖములును సానవెట్టినవియు, వైరిప్రాణాంతకరములునునగు మూఁడుతీవ్రబాణములచేఁ గొట్టి, వేఱొక భల్లముచే బంగరుకుండలములచే నలరు నాతనితలను దెగనేయ, నది కొఱకుచున్న పెదవులతోడనే గాలిచేఁ గదలి నేలవ్రాలినతాటిపండు వలెఁ బుడమిఁబడియెను. అటు లాద్రుమసేనునిఁ జంపి, వీరుఁడగునాధృష్టద్యుమ్నుఁడు మఱియు నయ్యోధులను దీవ్రసాయకములచే నొప్పించి, కొన్నిభల్లములచేఁ జిత్రయోధియగు నారాధేయుధనువు దెగనేసెను. అపు డారాధేయుఁ డాధనువు దునుఁగుట నోరువక, తోఁకఁద్రొక్కఁబడిన యుగ్రసింహమువలెఁ గుపితుఁడై వేఱొకవిల్లు పూని, కన్నులెఱ్ఱవాఱ, నిట్టూర్పువిడుచుచు, మహాబలుఁడగు నాధృష్టద్యుమ్నుని శరవర్షముచే ముంచెను. అటులు కర్ణుఁడు విజృంభించుటను గాంచి తక్కినవీరు లాఱువురును, వడిగా నదియ పాంచాలపతిని బంచత్వమొందింపఁదగు నదనని దలంచి చుట్టుకొనిరి. ఓరాజా! వీరులగు నీయోధులార్వురు నటులు ముట్టడింప, నాధృష్టద్యుమ్నుఁడు మృత్యుముఖమునఁ బడియెనని సైనికులు తలంచిరి. అంతలోఁ బరాక్రమించుచు, శరపరంపరలఁ గురియు నాధృష్టద్యుమ్నునకుఁ దోడ్పడ సాత్యకి వెడలి యారాధేయుని సమీపింప యుద్ధగర్వితుఁడై తనపైకివచ్చు నాతనిఁ జూచి, యకర్ణుఁడు పదిబాణములచే నొప్పించెను. ఓమహారాజా! అంత నాసాత్యకి, వీరులెల్ల నారయుచుండఁగా నిలునిలుమని పలుకుచు, నారాధేయునిఁ బదిబాణములచేఁ బ్రతిప్రహారమొనర్చెను. అపు డాబలశాలి యగుసాత్యకికిని మహాత్ముఁడగు రాధేయునకును నింద్రబలిచక్రవర్తులకు వలె గొప్పయుద్ధమయ్యెను. అపు డాసాత్యకి, నిజరథఘోషముచే క్షత్రియులకు వెఱపుగలుగ వెడలి, యారాధేయు నొప్పించి, ధనుష్టాం

కారముచేఁ బుడమి పడంక విజృంభించుటయు, నారాధేయుఁడును నాతనితోఁ దలపడి విపాఠ, కర్ణి, నారాచ, వత్సదంత, క్షుర ప్రముఖము లగు శరశతములచే నాసాత్యకిని నొప్పించెను. అంత నాసాత్యకియు నటులే శరసహస్రముల వర్షింప, వారియుద్ధము సమానమై చూపట్టెను. ఓరాజా! అపుడు నీతనయు లారాధేయుని ముందుంచుకొని, తీవ్ర సాయకములచే నాసాత్యకిని నొప్పింప, నతఁడు నీసుతులయు, నారాధేయునియు నస్త్రములను నిజాస్త్రములచే నివారించుచు, నొకబాణముచే వృషసేనునివక్షమును నొప్పింప, మహాద్యుతియగు నాతఁ డెంతయు నొచ్చి, ధనువునిడిచి రథమునఁ గూలఁబడియెను. పిదపఁ గర్ణుఁడు, తన సుతుఁడు హతుఁడయ్యెనని తలంచి, పుత్రశోకమడరఁ గుపితుఁడై యా సాత్యకిని బీడింపందొడంగుడు, నాసాత్యకియు వడిగా బహువిధబాణములచే, మఱిమఱియు నారాధేయునిఁ బీడించువాఁడై పదిబాణములచేఁ గొట్టి, వృషసేను నైదుబాణములచే నొప్పించి, వారిహస్తావాపములను, ధనువులను ఖండించెను. అపుడు మఱియు వారు భయంకరములగు వేఱువిండ్ల నెక్కువెట్టి, వాఁడికోలలచే నాసాత్యకిని బ్రహరించిరి. ఓరాజా! మహారౌద్రమై వీరవరక్షయకారియగుపో రారంభమగుడు, నెంతయు గాండీవనినాదము వినవచ్చెను. అప్పు డప్పార్థునిరథఘోషమును గాండీవధ్వనియు విని, సూతసుతుఁడు సుయోధనుతో 'ఓ మిత్రమా! ఇదె సకలసైన్యమును బార్థివముఖ్యులను గౌరవులను గొట్టుచున్న పార్థుని గాండీవధ్వనియు రథఘోషమును వాసవగర్జనమునా వినవచ్చుచున్నది. పార్థుఁడు నిజలాభకారియగు కృత్యము నొనర్చుచున్నవాఁడనుట స్పష్టము. ఓరాజా! ఇఁక నిప్పార్థుఁడు మనమహాసైన్యములఁ మర్దింపక మానఁడు. అందులకు నిదర్శనముగా మనసైన్యములు చెదరి యొకఁడును నిలువకున్న వాఁడు. గాలిచేఁ గదలిన మేఘజాలమునాఁ జెదరి, మనసైన్య మాసవ్యసాచిని జేరఁజాలక, పగిలిన యోడవలె భిన్నమై చూపట్టుచున్నది. ఓసుయోధనా! గాండీవప్రయుక్తములగుశరపరంపరలచే మనయోధముఖ్యులు సమరమునఁబడుచుండఁగా, గొప్పనినాదము వినవచ్చుచున్నది. అప్పార్థునిరథముచెంత దుందుభిధ్వానము లెట్లు వెడలుచున్నవో వినుము. ఇఁక నీసాత్యకి మననడుమనున్నవాఁడుగదా! వీనియెడ మనము గుఱిపెట్టితిమేని మనకు జయము గల్గుట స్పష్టము.

ఇప్పాంచాలపతి ద్రోణుని మార్కొనియున్నవాఁడు. ఈతని మనశూరు లెల్లెడల నావరించియున్నవారు. కావున, మన మీసాత్యకిధృష్టద్యు మ్నులను జంపితిమేని, మనకు జయము నిశ్చయము. ఓరాజా! మున్నా సౌభద్రునివలె మహారథులై వీరులగు వీరినిరువురను జుట్టికొని చంపవల యును. మఱియు నీసాత్యకిని బెక్కురకురుపుంగవులు తలపడుట నెఱిఁ గెనేని యప్పార్థుఁడు ద్రోణసైన్యముపైకి వచ్చువాఁడు. కావున మన రథికోత్తము లనేకు లందులకుఁ బోవలసియున్నది. సాత్యకి యిట్లిక్కురు పుంగవులకుఁ బెక్కురకుఁ జిక్కెనన్నవిషయ మప్పార్థుఁడు తెలియక మున్నే మనమహాశూరులు వీనిపై శరప్రయోగమొనర్పఁ ద్వరపడు దురుగాక. ఎటులే నిపు డీసాత్యకి పరలోకగతుఁడుగా నొనర్పఁబడవల యును.' అని తెలిపెను.

అది విని నీకొమరుఁ డాశకునితో, మున్నాయింద్రుఁడు సమర మున విష్ణునితోఁ బలికినట్లుగా, 'ఓమామా! నీవిప్పు డప్పార్థునిపైకిఁ బదివేలయేనుఁగులతోడను, బదివేలరథములతోడనుగూడి వెడలవలయును. దుశ్శాసన, దుర్విషహ, దుష్ప్రధర్షణ, సుబాహువులు పెక్కగు తమ పదాతిసైన్యములతో నీకుఁ దోడ్పడివత్తురు. ఓమామా! మహేష్వాసు లగుకృష్ణార్జునులను, యుధిష్ఠిరునిఁ జంపుము. అటులే నకులసహదేవు లను భీముని వధింపుము. దేవతల కింద్రునందువలె నీయందు మాకు జయాశ గలదు. కావున నోమామా! కుమారస్వామి రక్కసులనువలె నీవకౌంతేయుల యుక్కడంపుము' అని తెలుప, నాశకుని యుత్సా హముడర గొప్పసైన్యముతోఁగూడి నీపుత్రులు తోడుపడ, సుయోధను నకుఁ బ్రియ మొనర్చువాఁడై పాండవులను దహింప నెంచి వెడలెను. ఓరాజా! అట్లు లాసౌబలుఁ డాపాండవబలముపైకి వెడలునంతనే నీ వారికి వైరులతో గొప్పపోరాటమయ్యెను. పిదప రాధేయుఁడును, సాత్యకిని దలపడి, శరసహస్రము లాతనిపైఁ గురియుచుండెను. అపుడు మనవారెల్లరును సాత్యకి నావరించిరి. అంత నాద్రోణుఁడును, శూరుఁ డగుధృష్టద్యుమ్నునితోడను, బాంచాలురతోడను నద్భుతముగాఁ దల పడ, నానిశీథసమయమున గొప్పయుద్ధ మారంభమయ్యె"నని తెలిపి సంజ యుఁడు మఱియు నాతనితో నిట్లనియె.

## సంకులయుద్ధము

'ఓ రాజా! పిమ్మట యుద్ధగర్వితులగు మనవా రనేకులు సంరబ్ధులై, యాసాత్యకిని దలపడి, సువర్ణరత్నభూషితములై కల్పింపఁబడిన రథములతోడను, రౌతులతోడను, నేన్గులతోడను ముట్టడించి, యెందును గదలకుండ నడుమ నాతని నిర్బంధించి, గొప్పసింహనాదము లొనర్చుచు, వెఱపుగొలుపుచు, సత్యవిక్రముఁడగు నాసాత్యకి నలుగెలంకులఁ దీవ్రనారాచముల వర్షించుచు, వడిగా నాతని వధించువారై విక్రమింపసాగిరి. వడిగాఁ దనపైకి వచ్చుచున్నవారి నారసి, యాసాత్యకి వారిపై బహువిశిఖములఁ బ్రయోగించుచు, రణగర్వితుఁడై సన్నతపర్వములగు నుగ్రసాయకములచేఁ బదాతులతలలను, నేన్గులతొండములను, గుఱ్ఱముల మెడలను ఖండించుచు, మఱియు నీసైనికుల కేయూరములతోఁగూడినబాహువులను క్షురప్రములచేఁ దెగనేయుచువచ్చెను. ఆతనిచే నిపాతితములగు శ్వేతచ్ఛత్రచామరాదులచే భూతలము నిండి నక్షత్రములతోఁగూడిన యాకసమువలె భాసిల్లెను. ఆసాత్యకిచే వధింపఁబడుచున్నట్టివారి శబ్ద మెంతయు మొఱలువెట్టుచున్న ప్రేతములశబ్దమునుబోలి తుములమై యుండెను. ఆధ్వనిచేఁ బుడమియెల్ల నిండెను. ఆ రాత్రి ఘోరరూపమై భయంకరముగా నుండెను. అటులు తనసైన్యము సాత్యకిప్రహారహతమగుటఁ గాంచియు, నారాత్రి గగురుపాటొదవించు నామహానాదమును వినియు, నీకొమరుఁడగు సుయోధనుఁ డాతనిపై రథముఁ బోనిమ్మని తనసారథితోఁ బలుక, వాఁడును గడువడిగా నాచప్పుడున్నకడకు నడిపెను. అంత నాసుయోధనుఁడు శ్రమమనక ధనువుఁబట్టి కరలాఘవమేర్పడఁ, జిత్రయోధియై యాయుయుధానునిఁ దలపడునంత, నాసాత్యకి పూర్ణాకృష్టములై విడువఁబడి, మాంసరక్తభోజనములగు పండ్రెండుసాయకములచే నాసుయోధను నొప్పింప, నతఁడును బదిబాణములచే నాసాత్యకిని బ్రహరించెను. అపుడు పాంచాలురకందఱును నీవారితో ఘోరమై యద్భుతమైనయుద్ధము జరిగెను. ఓ రాజా! అపు డాసాత్యకి కుపితుఁడై మహారథుఁడగు నీపుత్త్రు నెనుబదిబాణములచే నొప్పించి, వానిగుఱ్ఱములను యమమందిరమొందించి, మఱియు నాదుర్యోధనుసారథిని రథమునుండి కూలఁద్రోసెను

ఓరాజా! అపుడు నీసుతుఁడు హతాశ్వుఁడై రథమున నిలిచి, యాశ్శైనేయురథముపైఁ దీవ్రసాయకములఁ బ్రయోగించుచుండ, వానినెల్ల నాశ్శైనేయుఁడు నిజకరలాఘవముచే ఖండించుచు, నతఁడు వేఱొకభల్లముచే నీతనయుని ముష్టిప్రదేశమునఁ గొట్టి, ధనువు దెగనేసెను. అంత నీకొమరుఁ డట్లు విరథుఁడును విధన్వుఁడునై సర్వలోకప్రభుఁడయ్యుఁ జేయునదిలేక వడిగా వెడలి, కృతవర్మనిరథ మధిరోహించెను. ఓరాజా! సుయోధనుఁ డటులు మరలఁగా నాసాత్యకి నీవారిసైన్యమును దనవిశిఖపరంపరలచే నానిశామధ్యమునఁ దఱిమెను. అంత నాశకునియు నర్జునునిఁ బెక్కువేలరథములతోడను, బెక్కువేలయేన్గులతోడను, హయసహస్రములతోడను జుట్టుకొని, యెల్లెడల సంకులముగా నొనర్చెను. అపు డాక్షత్త్రియులందఱును గాలచోదితులై దివ్యములగుమహాస్త్రముల నాయర్జునుపైఁ బ్రయోగింపఁదొడంగ, నాతఁడు వానినెల్ల నడంచుచు, వైరుల నివారించుచు, నాశకునిని విముఖునిఁగా నొనర్చెను. అంత నాశకునియుఁ గ్రోధతామ్రాక్షుఁడై వైరిమారకుఁడైయున్న యప్పార్థు నిరువదిసాయకములచే నెంతయు నొప్పించి, మఱియు నూఱుసాయకములచే నమ్మహారథుని నిరోధించెను. అర్జునుఁడును నిరువదిబాణములచే నాసౌబలునిఁగొట్టి, మఱియుఁగలయోధులను మూఁడుమూఁడుబాణములచేఁ బ్రహరించి, వారు ప్రయోగించుసాయకములనెల్ల నివారించుచు, వజ్రవేగములగు శరశ్రేష్ఠములచే నీవారియోధులను రూపుమాపుచుండెను. ఓమహారాజా! వేలకొలఁదిగాఁ దెగిపడినభుజములచేతను, శరీరములచేతను బుడమినిండి, పుష్పములచే నావృతమైనదివోలె వెలయఁజొచ్చెను. మఱియుఁ గిరీటములుగల్గి, చక్కనిముక్కులు వెలయఁ గుండలభూషితములై, కొఱుకుచున్న పెదవులతోఁ గుపితములై తిరుగుడువడినగ్రుడ్లతోఁగూడిన తలలచేఁ, బద్మములచేవలెఁ బుడమి యెంతయునలరుచుండెను. ఉగ్రపరాక్రముఁడై యటులావివ్వచ్చుఁ డెంతయునుగ్రకృత్య మొనరించి, మఱియు సౌబలునైదుసాయకములచే నొప్పించి, యొకబాణముచే నులూకునిఁ గొట్టి, యాశకుని చూచుచుండఁగనే వానిని మఱియుఁ గొట్టి, సింహనాద మొనర్చి, మఱియు నాశకునిధనువు దునుమాడి, యాతని నాల్గుగుఱ్ఱములను యమమందిరము నొందించెను. అంత నాసౌబలుఁడు రథమునుండి యుఱికి, వడిగా నయ్యులూకుని

రథ మధిరోహించి, యాతండ్రికొడుకు లిరువురును బర్వతమును మేఘములువలె నాపార్థుని శరవర్షమున ముంచిరి. ఓమహారాజా! పిదప నప్పార్థుఁడు తీవ్రసాయకములచేఁ గొట్టి, మనసైన్యమును వందలకొలంది గను, వేలకొలందిగను దఱుముచుండఁ, బెనుగాలికి మేఘములువలె మనసైన్యములు విచ్ఛిన్నములయ్యెను. ఓభరతశ్రేష్ఠా! అటులు వధ్యమానమై మనసైన్యము చెదరందొడంగుతఱిఁ, గొందఱు తమవాహనములనువిడిచియు, మఱికొందఱు వాహనములను బ్రేరించుచుండియు, నా పెనుఁజీకటిలోఁ బరువులిడసాగిరి. ఓరాజా! అటు లాసమరమునఁ బార్థుఁడు నీవారినెల్ల జయించి శంఖమును బూరింపఁ, దోడనే వాసుదేవుఁడును శంఖమును బూరించెను. అపుడు ధృష్టద్యుమ్నుఁడు మూఁడుబాణములచే ద్రోణుని నొప్పించి, వేఱొకతీవ్రసాయకముచే నాతనిధనువుత్రాటిని ఖండించెను. క్షత్త్రియమర్దనుఁడగుద్రోణుఁ డాధనువునిడిచి, వేఱొకయుత్తమధనువు పూని యేడుబాణములచే నాతని నొప్పించి, సారథి నైదుబాణములచేఁ బ్రహరించెను. అంత నాధృష్టద్యుమ్నుఁడును శరపరంపరచే నాద్రోణుని నివారించి, మున్నింద్రుఁడు రాక్షససైన్యమునుబోలెఁ గురుసైన్యమును బీడించెను. ఓమారిషా! అటులు నీకొమరునిసైన్యము వధింపఁబడుచుండ, నుభయసైన్యముల నడుమ గజాశ్వపదాతుల రక్తములు ఘోరనదియై ప్రవహింపఁజొచ్చెను. అయ్యది యమురాష్ట్రమునకు వెడలినవైతరణినాఁ జూపట్టెను. ప్రతాపశాలియగు ధృష్టద్యుమ్నుఁ డటులు మనసైన్యమును దొలఁగించి, తేజస్వియై యింద్రుఁడు దేవగణములందువలె నెంతయు విరాజిల్లెను. పిదప శిఖండి ధృష్టద్యుమ్నులును, నకుల సహదేవులును, సాత్యకియు భీముఁడును దమతమశంఖములను బూరించిరి. మఱియు నీవారిక్షత్త్రియయోధసహస్రములను జయించినవారగుట నప్పాండవులు సింహనాదములొనర్చిరి. అది నీతనయుఁడును గర్ణుఁడును ద్రోణాశ్వత్థామలును గాంచుచునే యుండిరి." అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.


సంకులయుద్ధము

"ఓరాజా! మహాత్ములగు నప్పాండవులచే వధ్యమానమై యటులు చెదరినతనసైన్యమును గాంచి, కోప మెంతయు నుద్దీపింప, నీపుత్త్రుఁడు

వడిగా నా ద్రోణరాధేయులను సమీపించి,వచోనైపుణ మేర్పడ వారితో 'ఓయాచార్యా! ఓరాధేయా! సమరమున సవ్యసాచి సైంధవుని సమయించుట గాంచి మీరిరువురును కుపితులై సంగ్రామ మొనరించితిరి. అయిన నిపుడు పాండవసైన్యముచే మనసైన్యము హతమగుచుండఁ గాంచుచు శక్తులయ్యు నశక్తులువలె వారిని జయింపకుంటిరి. ఇఁక మీచే నేను విడువఁదగినవాఁడ నేని, యపుడే మేము పాండవులను సమరమున జయింతుమని చెప్పఁగూడదు. అపుడే మీరు వేఱొకవిధముగాఁ దెలిపియుందురేని మీసమ్మతినిబట్టి నేనాపాండవులతో వైరమే చేయకుందుదును. ఈయోధవినాశ మేల? ఓయవక్రవిక్రములారా! మీకు నేను బరిత్యాజ్యుఁడను గానేని, మీమీపరాక్రమముల కనురూపముగా యుద్ధ మొనరింపుఁడు.' అని పలుక,నీతనయుని వాక్ప్రహారముచేఁ బ్రహతులై, త్రొక్కఁబడినపాములునా నవ్వీరులు యుద్ధమును బ్రవర్తిలఁ జేయువారై, రథికోత్తములును, సకలలోకధనుర్ధరులునగుచు, సాత్యకిప్రముఖులగు పాండవులను దలపడిరి. అటులే సకలసైన్యములతోఁగూడి పాండవులును, మఱిమఱియు గంతులువైచుచు వారి నెదుర్కొనిరి. పిదప ద్రోణుఁడాసాత్యకిని బదిబాణములచే నొప్పించెను. పిమ్మటఁ గర్ణుఁడును బదిబాణములచేతను, నీకొమరుఁ డేడుసాయకములచేతను, వృషసేనుఁడు పదికోలలచేతను, శకుని యేడింటను నాసాత్యకిని నొప్పించిరి. అపుడాసమరమున బాండవసైన్యమును, శరవర్షముచే నడంచు నా ద్రోణుని, సోమకులు శరసహస్రముచే నొప్పించిరి. ఓరాజా! అంత నా ద్రోణుఁడు క్షత్రియులప్రాణములనాభాస్కరుఁడు కిరణములచేఁ జీకటులనువలె హరింప నారంభింప, వధ్యమానులగుచున్న యప్పాంచాలురలో జనించినశబ్ద మెంతయు సంకులమై వినవచ్చెను. వారిలోఁ బుత్రులను దండ్రులును దండ్రులు పుత్రులను, దమ్ము లన్నలను, నల్లురు మామలను, మిత్రులు మిత్రులను, సంబంధులు సంబంధులను, బంధువులు బాంధవులను విడిచి యొకరికొకరుగాక వడిగా, జీవితాభిలాషులై పరువులిడసాగిరి. మఱికొంద ఱేమియుఁ దెలియక యా ద్రోణునికెదురుగనే పోవసాగిరి. మఱికొందఱు యోధులు పరలోకగతులగుచుండిరి. ఓరాజా! మహాత్ముఁడగు నా ద్రోణునిచే నటులు పీడింపఁబడుచు, నప్పాండవసైన్య మానిశామధ్యమున, దివ్వటీల్లువిడిచి, వాసు

దేవార్జునులును భీముఁడును నకులసహదేవులును ధర్మజధృష్టద్యు మ్నులును గాంచుచుండఁగనే, పరువులిడసాగిరి. చీకటు లావరించుటను లోకమున నేమియుఁ దెలియఁబడకుండెను. కొందఱు కౌరవులదీప కాంతులచేఁ బరువులిడుచుఁ గానవచ్చిరి. ఓరాజా! అటులు పరువులిడు చున్నయాసైన్యమును, మహారథులగు నా ద్రోణరాధేయులు, వెంబ డించి తఱుముచుఁ, బెక్కుసాయకములు వర్షించుచుండఁ, బాంచాలురు భంగమొంది క్షీణించుచుండఁగాఁ, జూచి యావాసుదేవుఁడు దైన్య మొదవ నప్పార్థునితో, 'ఓయర్జునా! మహేష్వాసులగు ద్రోణరాధేయు లాసాత్యకిధృష్టద్యుమ్నులను, బాంచాలసైన్యములను దలపడి, సాయక ములచే నొప్పింప, వారిసైన్య మదె చెదరి, యెంత వారించినను నిలు వక విఱిగిపోవుచున్నది.' అని తెలిపెను. పిదప నవ్వాసుదేవార్జునులు పరువులిడిపోవుచున్న తమసైన్యముతో, 'ఓసైనికులారా! జడిసి పోవ కుఁడు. భయము విడువుఁడు. ఇదె మేము సకలసైన్యములను వ్యూహ ముగాఁబన్ని, ధనుర్ధరులమై యాద్రోణరాధేయులను బాధింప సమకట్టి యున్నవారము' అని పలికి, మఱియు నందులకు వచ్చుచున్న భీమునిఁ గాంచి, జనార్దనుఁ డెంతయు సంతసమొదవ నప్పార్థునితో 'ఓయీ! ఇదె రణశ్లాఘియగువృకోదరుఁడు, సోమకపాండవులతోఁగూడి యీ ద్రోణరాధేయుల నెదుర్కొనఁబోవుచున్నవాఁడు. కావున, నీవును నీత నితోఁగూడి, పాంచాలరథికులు నీకుఁ దోడుగా నీమహారథులతోఁ బోరాడుము. మనసైన్యముల కూఱటగల్గునట్లుగా నిపుడే వెడలుము.' అని తెలిపెను. పిదపఁ బురుషవ్యాఘ్రులగు నవ్వాసుదేవార్జును లిరువు రును ద్రోణరాధేయులను జేరి రణాగ్రమున నిలిచియుండిరి.

ఓయాంబికేయా! ద్రోణరాధేయు లెందు వైరులను మర్దించు చుండిరో యావైపు యుధిష్ఠిరుసైన్యము బలమై మరలఁబడియెను. అపుడు, చంద్రోదయసమయమున నుప్పొంగినసాగరములువలె విజృం భింప, నానిశీథమున గొప్పసంకులసమర మారంభమయ్యెను. పిదప నీవారిసైన్యమెల్ల దివ్వటీలువిడిచి, యొడలుతెలియక పాండవులతోఁ బోరాడఁదొడంగెను. ధూళియుఁ జీకటియుఁ గప్పుటను, దారుణమై యున్న యాసంగ్రామమునఁ గేవలము నామమాత్రముగాఁ బోరాడు చుండిరి.క్షత్త్రియులచేఁ దెలుపఁబడుచు,వారివారినామములు తెలియుచు

వచ్చెను. అటులగుట నాయాహవము స్వయంవరమునాఁ జూపట్టెను. మఱియు నాసైన్యము కొంతవడి నిశ్శబ్దముగను, గొంతవడి చప్పుడు గల్గియు నుండెను. కుపితులై యుద్ధముచేయుచు జయించువారును, జయింపఁబడువారు నై యుండిరి. ఎందెందు దివ్వటీలు గానవచ్చు చుండునో యందందుఁ గలశూరులు, మిడుతలువలెఁ బడి గానవచ్చు చుండిరి. ఓ రాజేంద్రా! అటులు పోరాడుచున్న యక్కౌరవపాండవుల కారాతిరి యెంతయు నధికమై యుండెను." అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

## ఘటోత్కచుని యుద్ధప్రయాణము

"ఓరాజా! పిమ్మట నారణరంగమునఁ గర్ణుఁ డాధృష్టద్యుమ్నునిఁ జూచి, మర్మభేదకములగు పదిబాణములచే నాతనివక్షము నొప్పింప, నప్పాంచాలపతియు నారాధేయుని, నిలునిలుమని పలుకుచు, వడిగా నైదుసాయకములచేఁ బ్రహరించెను. ఓరాజా! ఆమహాసంగ్రామమున గట్టిగా లాగి విడువఁబడుచున్న శరపరంపరలచేఁ బరస్పరము నొప్పించి కొనిరి. పిమ్మట నారాధేయుఁ డప్పాంచాలముఖ్యుఁడగు ధృష్టద్యుమ్ను సారథినిగొట్టి,రథాశ్వములను యమమందిరమునొందించి, మఱియుఁ దీవ్ర సాయకములచే నాతనిధనువు దునుమాడి, వేఱొకభల్లముచే మఱియు నాతనిసారథిని రథనీడమునుండి పడఁద్రోసెను. అంత నాధృష్టద్యు మ్నుఁడు హతాశ్వుఁడును హతసారథియు విరథుఁడునై, వడిగా రథము డిగి, కేలనొకగదపూని, శరపరంపరచే నారాధేయుఁడు తన్ను నొప్పించు చున్నను వెనుదీయక, యాతని సమీపించి, యారాధేయురథాశ్వముల నాల్గిటిని గొట్టి, కడువడిగా మరలి యాధనంజయురథ మధిరోహించెను. పిదప మఱియు నాధృష్టద్యుమ్నుఁడు రాధేయునిపై కివెడల నుంకించియు, ధర్మజునిచే నివారింపఁబడియెను. అపు డారాధేయుఁడు తేజోనిధియై సిం హనాదమిశ్రితముగా ధనుష్టంకార మొనరించి, మహారావపూరితముగా శంఖారవ మొనర్చెను. అటు లాయుద్ధమునఁ బరాజితుఁడైన యాధృష్ట ద్యుమ్ను నారసి, శూరులగుపాంచాలు రెల్ల గుపితులై సోమకులతోఁ గూడి యాసూతసుతుని వధించువారై, పలువిధములగుశస్త్రములను బూని, ప్రాణములపై నాశవిడిచి, యాతనిఁ దలపడఁబోయిరి. అపుడు

కర్ణునిరథమునకు, శంఖవర్ణములై వడిగలిగి చక్కగా నడుచునట్టి వేలకొలఁది గుఱ్ఱములు గట్టఁబడియెను. అతఁడును బాంచాలమహారథికులను గుఱిగా నుంచుకొని, పర్వతమును మేఘము వలె శరపరంపరలచే వారిని గప్పి పీడింప, సపాంచాలసైన్య మాతనిపీడవడనోపక, జడిసి, సింహపీడితమగు నాఁడు లేడివలెఁ బరువులిడసాగెను. ఓరాజా! అపుడు కొందఱు గుఱ్ఱములనుండియు నేన్గులనుండియుఁ బుడమిఁబడుచుండిరి. అటులే కొందఱు రథములనుండి వడిగా నెల్లెడలఁ గూలుచుండిరి. పాండవయోధుఁడు పరువిడుచుండఁగనే, వానిబాహువులను, గుండలములుగల తలను మన రాధేయుఁడు ఖండించుచువచ్చెను. మఱియు నేన్గుపైనుండఁగనే కొంద ఱతోడలఁ దునిమెను. అటులే గుఱ్ఱములందున్నవారియుఁ, బుడమి యందు నిలిచియున్నవారియు సంగములఁ జెండుచువచ్చెను. పరువులిడు చున్నమహారథికు లనేకులు, ఖండితములైన తమగాత్రములను వాహ నములను దెలిసికొనఁజాలకుండిరి. అటు లారాధేయఘోరనారాచము లచే వధ్యమానులగుచు, సపాంచాలురును, సృంజయులును దమకుఁ దృణముసోకినను గర్ణునిఁగనే తలంచుచుండిరి. ఆసమరమునఁ బరువులిడు చువచ్చునట్టి తనవానినేనిఁ గర్ణునిఁగనే తలంచుచు, మతిచెడి, జడిసి పరువు లిడసాగిరి. అటు లాపాంచాలసైన్యములు భగ్నములై పరువులిడుచుండఁ గా నారాధేయుఁడు వడిగా వారిని దఱుముచు, నెల్లెడల శరవర్షము గురియుచుండ, యోధులుసైతమువధ్యమానులగుచుఁ బరువులువెట్టుచు, నొడలుతెలియక యొక్కఁడేని యాతని నెదురింపఁజాలఁడయ్యెను. ఓ రాజా! ఆరాధేయునియు భారద్వాజునియు శరపరంపరలచేఁ బీడితులై నలుదెసలఁ బరికించుచుఁ, బాంచాలురు పరువులువెట్టిరి. అంత నాయుధి ష్ఠిరుఁ డటులుచెదరిన తనసైన్యము నారసి నాఁడు యుద్ధముచాలించిపో వలయునని తలంచి, యర్జునుతో 'ఓతమ్ముఁడా! ఆరాధేయునిఁ గాంచితే? ధనుర్ధరుఁడై యెట్టు నిలిచియున్నవాఁడో! ఈదారుణనిశీథసమయమునఁ బ్రజ్వలించుభాస్కరునివలెఁ జూపట్టుచున్నవాఁడు. ఇమ్మహారావ మా రాధేయశరపీడితములగు మనసైన్యము లొనర్చునదియేగదా! ఓపార్థా! దిక్కులేక నీబంధువు లార్తనాదమొనరించుచుంట నీకెంతయు వినరా కుండెనే? ఆరాధేయుఁడు శరపరంపరలను సంధించుటందును, విడుచు టందును నించుకే నవకాశము చూపట్టకున్నది. ఇఁక వీఁడు బంధువుల

నెల్ల రూపుమాపును. నీవిపుడు చేయఁదగినకార్య మెట్టిదిగా నూహించు చున్నాఁడవు? ఓధనంజయా! కర్ణవధముతో సంబంధించినకార్య మొన రింపుము’ అని పలుక విని, యప్పార్థుఁ డవ్యాసుదేవునితో నిట్లనియె.

‘ఓదేవా! ఇపు డీరాధేయునివిక్రమమున శ్రీధర్మతనయుఁడు భయపడుచున్నవాఁడు. ప్రాప్తకాలముగాఁ గర్ణునియుద్ధ మిట్టులుండెను. మనసైన్యము పరువిడుచున్నది. కర్తవ్య మెద్దియో వడిగాఁ జింతింపుము. ఓమధుసూదనా! ఆద్రోణునియుఁ గర్ణునియు సాయకములచేఁ బీడితములై భగ్నములైన మనసైన్యములకు నిలుకడ గానరాకున్నది. ఇపు డారాధేయుఁడు నిర్భయముగాఁ జరించుచున్నట్లు గానవచ్చెడిని. వాఁడు తనతీవ్రనారాచములచేఁ బరువులిడుచున్నరథికులను దఱుముచున్నవాఁడు. ఇపుడు వీనికృత్య మోరువరానియటులున్నది. ఓవృష్ణివర్యా! తోఁకఁద్రొక్కినపామునా వెలయు నీతని బ్రత్యక్షముగా నెదురింపవలయును. కావున నీవందులకు వడిగా వెడలుము. ఓమధుసూదనా! నేను వానినేనిఁ జంపవలయు. వాఁడు నన్నేనిఁ జంపవలయును.’

అది విని యవ్వాసుదేవుఁ డప్పార్థునితో ‘ఓయర్జునా! ఈరణరంగమున నింద్రుఁడువలె నమానుషవిక్రముఁడై చరించుచున్న యారాధేయునిఁ గాంచకపోలేదు. ఓధనంజయా! ఇపుడు నీవుగాని రాక్షసోత్తముఁడగుఘటోత్కచుఁడుగానిదక్క, వేఱొకఁ డారాధేయు నెదుర్కొనువాఁడు లేఁడు. ఓయనఘా! నీవు వానిపైఁబోవుటకుఁ దగుకాల మిదిగాదని తలంచుచున్నాఁడను. ఓమహాబాహూ! వానికడ మహోల్కవలెఁ బ్రదీప్తమై యింద్రదత్తశక్తి యొకటి యలరుచున్నది. ఆసూతసుతుఁ డద్దానిని నీకుఁగా రక్షించికొనియున్నవాఁడు. అది యెంతయు రౌద్రరూపమైనది. కావున వానితో నిపుడు నీవు తలపడుట తగదు. ఓయీ! ఎల్లపుడును ఘటోత్కచుఁడు మనయెడ ననురక్తుఁడై మన హితము గోరుచుండువాఁడుగదా! మహాబలుఁడగు నతఁడే యీరాధేయు నిపు డెదుర్కొనఁ దగియున్నవాఁడు. సురపరాక్రముఁడగు నతఁడు భీమునివలన జనించినవాఁడుగాదే? వానికడ దివ్యాస్త్రములును, రాక్షసాసురాస్త్రములును గలవు. అటులగుట వాఁ డారాధేయునిఁ దప్పక జయించును, నాకందు సంధియము లేదు’ అని పలికెను.

అంత నప్పార్థుఁ డాఘటోత్కచునిఁ బిలువ, వాఁడు వడిగాఁ బ్రత్యక్షమయ్యెను. అటులు వాఁడు కవచధారియు, ఖడ్గియునై శర శరాసనములు ధరించి, వచ్చి యవ్విసవ్యసాచునకును వాసుదేవునకును మ్రొక్కి, గర్వమెంతయు నడర నప్పార్థునితో 'నాయనా! ఇదె వచ్చితిని. ఏదేని శాసింపుము.' అని పలుక విని, మేఘవర్ణుఁడును దీప్తాస్యుఁడును దీప్తలోచనుఁడునగు నాతనిఁ గాంచి, నగుచు 'ఓఘటోత్కచా! నేనొకటి దెలిపెదను వినవలయును. ఇపుడు నీవిక్రమము నెఱపఁ గాలము సంభవించెను. అది వేఱొకరికి సాధ్యముగానిది. కావున నీ వీయుద్ధ సాగరమున మునుఁగుచున్న పాండవుల కోడవై కాపాడవలయును. నీకు వివిధములగునస్త్రములును, రాక్షసమాయయుఁ గలదు. ఓఘటో త్కచా! అదె చూడుము, గోపాలునిచేఁ దఱుమఁబడు గోవులువలెఁ బాండవసైన్య మారాధేయునిచేఁ దఱుమంబడి, యెటులు పఱువులిడు చున్నదో! దృఢపరాక్రముఁడును, ధైర్యశాలియునగు నీరాధేయుఁ డప్పాండవసైన్యమునఁగల క్షత్త్రియోత్తములనెల్ల దహించుచున్న వాఁడు. గొప్పశరవర్షమును గురియు ధనుర్ధరులేని, వానిశరజ్వాలల కోరువఁజాలక, యందు నిలువలేక వెడలుచున్నవారు. ఈనిశీథమున నాసూతపుత్త్రుశరవర్షముచేఁ బీడితులై, పాంచాలు రదె సింహపీడిత ములగు మృగములువోలెఁ బరువులిడుచున్నవారు. ఓయవక్రవిక్రమా! ఇటులు విజృంభించుచున్న యాసూతసుతునిఁ దలపడి నిరోధింప, నీవు దక్క వేఱొక్కఁ డెవ్వఁడును గాన రాకున్నవాఁడు. ఓమహాబాహూ! నీవు నీకుఁదగుకృత్య మొనరింపుము. మఱియు నీతండ్రులకును నీ మామలకును గీర్తిగల్గునట్లుగా నీతేజోబలములను బ్రకటింపుము. ఓహైడింబా! మానవు లిట్టికార్యములకుఁగా దే! తనయులఁగని పెంచు కొనుచుందురు. మమ్మెట్టు లాపదనుండి యుద్ధరించెదో యటులే యిపు డీబాంధవుల నీయాపదనుండి తప్పింపుము. ఓఘటోత్కచా! లోకమునఁ దమకార్యములకుఁగాఁ దండ్రులు బుత్త్రులను గాంక్షింతురు. ఆపుత్త్రులు హితులై వారి నిహపరలోకములఁ దరింపఁజేయుదురు. మహాత్ముఁడవగు నీవును యుద్ధమున నసమానబలుఁడవును ఘోరదర్శనుఁడవు నైన వాఁడవు. సమరమునఁ బోరాడు నీకు సముఁడగువాఁడు లేఁడు. ఈ రాత్రిరి రాధేయసాయకప్రభగ్నులై కౌరవులలో మునుఁగుచున్న

పాండవులకు నీవు తీరముగావలయును. రాక్షసులు రాత్రిరి మఱియు నమానవిక్రము లగుచుందురుగదా! మఱియు వారకాలమున శూరులును బలవంతులును దుర్జయులునై విక్రమించి పోరాడుదురు. ఈనిశీథమున నీమాయాబలముచే మహేష్వాసుఁడగు కర్ణుని వధింపుము. ధృష్టద్యుమ్నుని మున్నిడుకొని మనపాండవు లాద్రోణుని వధింతురు.' అని పలికి ప్రోత్సహించెను.

ఓయాంబికేయా! అవ్యాసుదేవుఁ డటులు పలికినతోడనే యర్జునుఁడును వైరిమారకుఁడగు నాఘటోత్కచునితో 'ఓయీ! నీవును దీర్ఘబాహుఁడగుసాత్యకియుఁ భీమసేనుఁడును మనసైన్యములలో నాకు సమ్మతులైనవారు. కావున నీరాత్రిరి నీవారాధేయునితో ద్వంద్వయుద్ధ మొనర్పఁబోవలయును, మహారథుఁడగు సాత్యకి నీవెనుకఁ దోడ్పడి యుండును. సాత్యకిసహాయముచే శూరుఁడగునారాధేయుని వధింపుము మున్నాయింద్రుఁడు స్కందునిసహాయముచేఁ దారకునిఁ జంపినట్లు వాని రూపుమాపి కీర్తివడయుము.' అని తెలిపెను.

అది విని యాఘటోత్కచుఁడు వారితో 'ఓమహనీయులారా! నేనే యాద్రోణరాధేయులకుఁ జాలుదును. మఱియుఁ గలమహాత్ములును గృతాస్త్రులునునగు క్షత్రియులకును జాలుదును. ఈరేయి నారాధేయునను సంగ్రామము నొసంగెదను. ఆనాయుద్ధమువిధము పుడమిగలంత కాలమును జనులు చెప్పుకొందురుగాక. ఈసమరమున శూరులనిగాని, భీతులైరనిగాని, చేతులుమొగిడ్చిరనిగాని యెవ్వరిని విడుచువాఁడను గాను. రాక్షసధర్మము నాశ్రయించి యెల్లవారిని జంపుదును.' అని పలికెను.

ఓరాజా! వైరిమారకుఁడును మహాబాహుఁడునగు నాఘటోత్కచుఁ డటులుపలికి, యాసంకులసమరమున నీసైన్యమును వెఱపించుచు, కర్ణునిపైకి వెడలెను. అటులు కుపితుఁడై దీప్తాస్యుఁడును, దీప్తకేశుఁడునై వచ్చునాతని,నారాధేయుఁ డారసి, నవ్వుచు నిలువఁబడియుండెను. ఓరాజోత్తమా! గర్జించుచుఁ దలపడిన యక్కర్ణఘటోత్కచులకు నాయింద్రప్రహ్లాదులకువలె గొప్పయుద్ధము జరిగెను," అని తెలిపి సంజయుఁడు మఱియు నాతనితో ని ట్లనియె,

### ఘటోత్కచుఁ డలంబుసుని వధించుట

"ఓరాజా! ఆసూతసుతునిరథముపైకి వెడలినఘటోత్కచుని, వానిఁ జంపువాఁడై, వాని నెదుర్కొనినమహాబాహుఁడగు రాధేయునిఁ గాంచి, సుయోధనుఁడు దుశ్శాసనుతో 'ఓతమ్ముఁడా! ఈరాక్షసుఁ డారాధేయుపరాక్రమమును గాంచి, వడిగాఁ దలపడ వచ్చుచున్నవాఁడు. కావున నీవు వానిని నివారింపుము. వాఁడున్నకడకు మహాబలుఁడవై గొప్పసైన్యముతోఁగూడి వెడలుము. సూర్యతనయుఁడగు కర్ణుఁ డారాక్షసునితోఁ బోర నుత్సహించుచున్నవాఁడు. కావున నీ వాతనికిఁ దోడై కర్ణుని రక్షింపుము. ఆఘోరరాక్షసుఁడు కర్ణునిఁ బ్రమాదముచే నశింపఁజేయును.' అని పలుకునంతలో బలవంతుఁడును, జటాసురపుత్త్రుఁడునగు నలంబుసుఁడు దుర్యోధనుని సమీపించి, యాతనితో 'ఓసుయోధనా! యుద్ధగర్వితులును, ప్రఖ్యాతులును నీకు వైరులునగు పాండవులను జంప నాజ్ఞయొసంగుదేనిఁ జంపెదను. రాక్షసోత్తముఁడగు నాతండ్రి జటాసురుఁడు మిగుల బలశాలి. అట్టివానిని క్షుద్రులగుపాండవులు రూపుమాపిరి. కావున వైరిరక్తముచేఁ బూజించి, నాతండ్రిని దృప్తినొందింతును. వైరిమాంసములచే నాతని గౌరవింతును. నా కనుజ్ఞ యొసంగుము.' అని పలుక విని సుయోధనుఁడు మఱిమఱియుఁ బ్రీతుఁడై వానితో 'ఓరాక్షసోత్తమా! ఈ ద్రోణకర్ణాదులతో నేను శత్రుజయమునకుఁ దగియున్నవాఁడను. నీ వాఘటోత్కచునిపై వెడలి వానిని వధింపుము. ఆరాక్షసుఁడు క్రూరకర్ముఁడును, రక్షోమానవసంభవుఁడునై, నిత్యమును బాండవులహితము గోరుచు, నాకాశగతుఁడై గజరథాశ్వాదుల వధించుచున్నవాఁడు. గావున వానిని యమమందిరము నొందింపుము.' అని తెలిపెను. అది విని మహాకాయుఁడగు నాయలంబుసుఁ డాఘటోత్కచునిఁ బిలిచి నానావిధాయుధములచే వానిని బ్రహరించెను. అంత నాఘటోత్కచుఁ డయ్యలంబుసునిఁ, గర్ణునిఁ, గురుసైన్యమును బెనుగాలి మేఘములనువలెఁ బీడింపఁదొడంగెను. పిదప మాయాబలుఁడగు నాఘటోత్కచునిఁ గాంచి, యాయలంబుసుఁడును నానావిధములగుశస్త్రములను బ్రయోగించి, మఱియు బహువిధబాణములచే నొప్పించి, పాండవసైన్యము

చెదరునట్లు గొట్టెను. అప్పు డప్పాండవసైన్యములు పెనుగాలికిఁ జలించిన మేఘములునా నారాతిరి చెదరిపోసాగెను. అటులే మనవారిసైన్యమును ఘటోత్కచుని ప్రహారముల కోరువక దీపసహస్రములను విడిచి, యానిశీథమున బరువులిడసాగెను. అంత నాయలంబుసుఁడును కుపితుఁడై, యాఘటోత్కచుని బహుబాణములచే, నంకుశములచే మహాగజమునువలె నొప్పించెను. పిదప నాఘటోత్కచుఁడు వానిరథమును సారథిని సకలాయుధములను గొట్టి, ఖండఖండములుగావించి, భయంకరముగా నట్టహాసమొనర్చెను. అటు లొనర్చి, మఱియు నతఁ డారాధేయునిఁ, గురుసైన్యమును శరసహస్రముచే నొప్పించి, మఱియు నాయలంబుసుని మేఘము మేరువునువలె శరవర్షమున ముంచెను. పిదప నాఘటోత్కచపీడితమై కురుసైన్యము కలఁతనొందెను. అంత నిరుసైన్యములనుఁ జతురంగబలమును బరస్పరము మర్దించుకొనసాగెను. ఓమహారాజా! అపు డాయలంబుసుఁడు విరథుఁడు, హతసారథియునై కోపముడర నాఘటోత్కచుని నొకపిడికిటిపోటుచే నొప్పింప, నందులకాఘటోత్కచుఁడు భూమికంపమున తృణవృక్షగుల్మాదులతోఁ గొండవలెఁ జలించి, పిదపఁ బరిఘమునాఁదగి వైరిమారకమగు తనబాహువుచే వానిఁబట్టికొని, కోపావేశపరవశుఁడై పిండిగా నొనరించి విడిచెను. అంత నాజటాసురపుత్త్రుఁడును దన్నాతనినుండి తప్పించికొని, మఱియు నాఘటోత్కచునిఁ దలపడి, క్రిందఁబడవైచి మర్దించి విడిచెను. మహాకాయులగుచు గర్జించువారిరువురకును, గగురుపాటుగల్గించు గొప్ప సంకులయుద్ధము జరిగెను. మాయలచే వారొకరినొకరు మించుచు, మిక్కిలి గర్వితులై, మహావిక్రములై యింద్రబలిచక్రవర్తులువలెఁ బోరాడిరి. మఱియు వారగ్నిసాగరులవలెను, గరుడతక్షకులనుబోలియు, మేఘమహావాతముల మాదిరిగను, వజ్రాయుధపర్వతములవలెను, గజవ్యాఘ్రములవలెను, రాహుభాస్కరులపోలికను బోరుచుఁ, బరస్పరము వధించుకొనువారై, మాయాశతముల సృజించుకొనుచు, నెంతయుఁ జిత్రయుద్ధ మొనరించిరి. మఱియు వారు పరిఘ, ప్రాస, పట్టిస, ముసల, ముద్గరములతోడను, బర్వతశిఖరములతోడను గొట్టుకొనుచుండిరి. ఓరాజా! రాక్షసోత్తములగువారిరువురును మహామాయులై యొకపుడు రథికులై, యొకపుడు గజారోహకులై, మఱియొకపుడు

రాతులై, వేఱొకపుడు పదాతులై పలువిధములఁ బోరాడుచువచ్చిరి. ఓరాజా! పిమ్మట నాఘటోత్కచుఁ డలంబుసుని వధింప నెంచి, యెంతయుఁ గుపితుఁడై, డేగవలె నెగిరి వానిపైఁబడి పట్టుకొని, మున్ను విష్ణువు మయునివలెఁ బుడమిఁ బడఁద్రోసి, కత్తినెత్తి వికృతాకారమై భయంకరమైన యాయలంబుసునితలను దానిచే ఖండించి, రక్తసిక్తమై యున్న యద్దానిని గేశములందుఁబట్టికొనియే సుయోధనురథముపైకి వెడలెను. అటు లాఘటోత్కచుఁడు సుయోధనుఁజేరి, వికృతానన కేశమైయున్న యాయలంబుసునితల నాదుర్యోధనుపై వైచి, వర్షకాల మేఘమువలె భయంకరముగా నఱచుచు, నాతనితో "ఓసుయోధనా! ఇదె ప్రకటితవిక్రముఁడగు నీబంధువు చంపఁబడియెను. ఇఁక నీరాధేయునకును నిట్టియవస్థయే గలిగెడిని. అయ్యో! వీఁడింకను ధర్మార్థకామముల ననుభవింపఁ దలంచియున్న వాఁడు కాఁబోలు? అది మఱి జరుగదు. రిక్తహస్తుఁడై యెవ్వఁడును, రాజును బ్రాహ్మణుని స్త్రీని దర్శింపరాదని రాజవగు నీకు వీనితలఁ దెచ్చితిని. ఇదె యీరాధేయుని వధించునంతకును బ్రీతుఁడవై నిలువుము.' అని పలికి యాకర్ణునిఁ దలపడి, తీవ్ర శరపరంపర లాతనిశిరముపైఁ గురియుచు విక్రమించెను. ఓమహారాజా! అపు డామానవరాక్షసుల కెంతయు నాశ్చర్యకరముగా భయంకరమైన ఘోరయుద్ధ మారంభమయ్యె" నని తెలుప విని ధృతరాష్ట్రుఁ డాతనితో ని ట్లనియె.

## కర్ణఘటోత్కచులయుద్ధము

"ఓసంజయా! సూర్యపుత్రుఁడగుకర్ణుఁడును, రాక్షసుఁడగుఘటోత్కచుఁడును నారాతిరి దలపడిరిగదా! వారియుద్ధ మెట్టులయ్యెను? ఆఘోరరాక్షసునిరూప మెట్టులుండెను? వానిరథ మేరీతిది? వానిగుఱ్ఱములు, నాయుధములు నెట్టివి? మఱియు వాని హయరథధనుర్ధ్వజముల ప్రమాణ మెట్టిది? వానికవచము, శిరస్త్రాణమును నెట్టివై యుండెను? నీవు కుశలుఁడవని ప్రశ్నించితిని, వానివిధ మెల్లఁ దెలుపుము."

అది విని యాసంజయుఁడు ధృతరాష్ట్రునితో "ఓరాజా! ఆఘటోత్కచుఁడు మహాకాయుఁడై యెఱ్ఱనికన్నులును మొగమునుగల్గి వెన్నునంటినయుదరముతో నూర్ధ్వ రోముఁడును, బచ్చనిమీసమును గడ్డ

మును గలవాఁడును నై, శంకువులఁబోలు చెవులు, గొప్పదవుడలునుగల్గి చెవులవఱకును దెఱచిననోరుగల్గి, దీప్రములగు కోఱలుచూపట్ట భయంకరుఁడై, దీర్ఘములును నెఱ్ఱనివియు నైననాలుకయుఁ బెదవులుగల్గి, బొమలుప్రేలాడ స్థూలనాసికుఁడై, నల్లని మేనిచాయతో, నెఱ్ఱనై మెడ వెలయఁ గొండనాఁదగి భయంకరుఁడై యుండెను. మఱియు మహాబాహుఁడును, మహాశీర్షుఁడును, మహాబలుఁడునునై, వికృతరూపమడరఁ బరుషస్పర్శుఁడై కేశరహితమై దృఢాంగముగల తలగల్గి పెద్దపిఱుఁదులును, గూఢనాభియునుగల్గి, గొప్పహస్తాభరణములు వెలయ, మహామాయుఁడై, కేయూరములు ధరించి, పర్వత మగ్నిమాలనువలె వక్షముచే నిష్కమును ధరించియుండెను. మఱియు వానికి సువర్ణమయమై చిత్రమై తోరణాకారమై శుభ్రమగుకిరీటము శిరమున శోభిల్లుచుండెను. బాలసూర్యనిభములగు కుండలములును, సువర్ణమాలికయు, విపులమగుకంచుకవచమును ధరించి, యతఁడు రక్తధ్వజపతాకయు గింకిణీశతనిర్ఘోషము గల్గి, యెలుగుబంటితోలుచేఁ గప్పఁబడి, నాల్గువందలమూరలు పరిమితిగల రథమధిరోహించియుండెను. అయ్యది ధ్వజమాలికలుగల్గి, సకలాయుధములతోఁ గూడియుండెను. దాని కెనిమిదిచక్రములుండెను. దాని నినాదము మేఘగర్జనమునాఁ దగియుండెను. దానికి భయంకరములై యెఱ్ఱనికనులుగల్గి, వలసినవర్ణవేగములతో మత్తమాతంగతుల్యములై, బలిష్ఠములగు గుఱ్ఱములు పూన్పఁబడియెను. అయ్యవి బలముగలవియు, శ్రమమునకోర్చునవియు నై, యాఘోరరాక్షసుని మోయుచు, పెద్ద జూలువెలయ హేషాధ్వను లొనర్చుచుండెను. దీప్తములగుకుండలములును నాస్యమునుగల్గిన విరూపాక్షుఁడను నొకరాక్షసుఁడు సారథియై, సూర్యకిరణములునాఁదగు పగ్గములచే నాతనిగుఱ్ఱములను బట్టికొనియుండెను. అనూరునితో భాస్కరుఁడువలె నాసారథితో నాఘటోత్కచుం డలరుచు, గొప్పమేఘముతోఁగూడిన పర్వతమునాఁజూపట్టెను. వానిరథమున మిన్ను ముట్టునట్టిధ్వజ మెంతయుఁ బొడవై గానవచ్చెను. అం దెఱ్ఱనితల వెలయఁ బరమభయంకరమై మాంసాహారియగు గ్రద్ద చిహ్నముగానుండెను. పండ్రెండరత్నులపొడవును, మూరెడువెడల్పును గల ధనువును బిడుగుచప్పుడు లుప్పతిలునట్లు ద్రిప్పుచు, శరసహస్రములచే దెసలఁగప్పుచు, వీరాపహారియగు నారాత్రి నతఁడారాధేయునిమాఱు

కొనియెను. ఆఘటోత్కచుఁడు రథమున నిలిచి చాపమున నారి సారించుచుఁ, బిడుగుచప్పు డుప్పతిల్లునట్లుగా ధనుష్టంకార మొనర్చెను. దానిచే నీవారిసైన్యములు జడిసి, సముద్రతరంగములువలెఁ జలింపఁ జొచ్చెను. అటులు తనపైకి వచ్చుచున్న యాతనిసారథియగు విరూపాక్షునిఁ గాంచి యారాధేయుఁడు నగుచు, వడిగా నాతని నెదుర్కొని యెను. అపు డారాధేయుఁ డేన్గు నేన్గువలె, వృషభము వృషభమునువలె మార్కొని, శరపరంపరచే నాతనిఁ గప్పెను. ఓరాజా! ఇంద్రశంబరులకువలె నారాధేయరాక్షసులకు గొప్పసమ్మర్దమయ్యెను. భయంకరారావములగు గొప్పధనువులఁ బూని, వారిరువురును బరస్పరము శరసమూహములచేఁ గప్పికొనసాగిరి. పిదప వారు గట్టిగా నాకర్షించి విడువఁబడినశరసమూహముచేఁ, బరస్పరము కంచుకవచములను జీల్చికొనిరి. మఱియు వారు గోళ్లచే బెబ్బులులును, దంతములచే మహాగజములునువలె రథశక్తులతోడను, విశిఖములతోడను బరస్పరముఁ జెక్కుకొనిరి. ఓరాజా! అటులు వారు సాయకములను సంధించుచు, గాత్రములను నఱుకుకొనుచు, శరసమూహముచే దహించుకొనుచుఁ, జూచుటకు భయంకరులైగానవచ్చిరి. వారటులు శస్త్రక్షతసకలాంగులై మేనుల రక్తములు గాలువలుగా, నుదకమును స్రవించు గైరికాద్రులునాఁ జూపట్టిరి. మహారథులైయొకరినొకరు శరాగ్రములచే భేదించుకొనుచుండియు, నించుకేనిఁ జలింపకయుండ, వారి యానిశీథయుద్ధము తుల్యమై కొంతసేపు జరిగెను. ఓరాజా! ఆకర్ణరాక్షసు లటులు ప్రాణములను బణముగా నొడ్డి యాడుచుఁ, దీవ్రనారాచముల సంధించుచు, విడుచుచునుండ నుభయసైన్యములును జలింపసాగెను. ఓయంబికానందనా! ఆకర్ణుఁడు ఘటోత్కచు నెపు డతిక్రమించి విక్రమింపఁజాలకుండెనో, యపు డతఁ డస్త్రవేదియగుట నొకదివ్యాస్త్రమును బ్రాదుర్భవింపఁజేసెను. ఆరాధేయుఁడటులు దివ్యాస్త్రమును సంధించుటఁ గాంచి, యాఘటోత్కచుఁడును రాక్షసమాయను బ్రాదుర్భవింపఁజేసెను. ఆమాయచే శూలపర్వతధారులును, శైలపాదపహస్తులును నై ఘోరాకారులగు పెక్కురరక్కసులుదయించిరి. వారితోఁగూడి యుద్యతాయుధుఁడై యున్న వానినిఁ గాంచి, కాలదండధారియైన యమునకువలె క్షత్రియులెల్ల వెఱచిరి. వాఁడొనర్చిన సింహనాదమునకు జడిసి, యేన్గులు మూత్రమును విడిచెను.

పిదప నెల్లెడల నత్యుగ్రమై పాషాణవర్షము గురిసెను. అది యర్ధరాత్రమగుట నధికబలులగు రాక్షసు లెంతయు విక్రమించి, యినుపజక్రములను, భుసుండులను, దోమరములను, శక్తులను, శూలములను, శతఘ్నులను, బట్టిసములను బ్రయోగింప,నవి దట్టముగాఁ బడుచుండెను. ఆఘోరయుద్ధము నారసి,యందలిక్షత్రియులును, నీపుత్రులును బీడితులై పరువులిడసాగిరి. అందుఁ గర్ణుఁడు మాత్రము పౌరుషశాలియై వ్యథనొందక, యాఘటోత్కచునిచే గల్పితమగుమాయను భేదించెను. అటులు తనమాయ నిహతమగుడుఁ, గుపితుఁడై యాఘటోత్కచుఁడు కర్ణుని వధించువాఁడై, తీవ్రశరప్రయోగ మొనరింప, నయ్యంబకములు కర్ణునికవచమును భేదించి, రక్తసిక్తములై కుపితములగు సర్పములునాఁ బుడమిఁ బ్రవేశించెను. అందులకా రాధేయుఁడును గుపితుఁడై తనకరలాఘవ మేర్పడఁ బ్రతాపశాలియై యాఘటోత్కచుని మర్మములు నాటఁ బదిబాణములచే నొప్పించెను. పిదప నారక్కసుఁ డెంతయుఁ బీడితుఁడై, వేయియంచులుగల యొకదివ్యచక్రమును బట్టికొని, బాలసూర్యసన్నిభమై చుట్టును గత్తులుగల్గి, మణివిభూషితమైనదానితో నారాధేయుని సంహరించువాఁడై వానిపై విసరెను. అది యతివేగముగ వైవఁబడియుఁ, గర్ణసాయకములచేఁ బ్రహతమై, నిర్భాగ్యుని సంకల్పమువలె వ్యర్థమై పుడమిఁబడియెను. అంత నాఘటోత్కచుఁడు కోపమడర, రాహువు భాస్కరునివలెఁ దనబాణపరంపరలచే నాకర్ణునిఁ గానరాకుండఁజేయ, నారాధేయుఁ డందులకు దొట్రుపడక, హరిహరవాసవతుల్యవిక్రముఁడై యాఘటోత్కచురథమును శరపరంపరచేఁ గప్పెను. పిదప సువర్ణాంగదభూషితమగు నొకగద నాఘటోత్కచుఁడు ప్రయోగింప, నది రాధేయశరప్రహతమై పుడమిఁబడియెను. పిమ్మట నారక్కసుఁడు మింటికెగిరి, వర్షాకాలమేఘమునా గర్జించుచు, మేనుపెంచి, వృక్షవర్షము నాకసమునుండి గురిపించెను. అపు డారాధేయుఁడు మాయావియగు నాఘటోత్కచు, నంతరిక్షమున నుండఁగనే, శరసమూహముచే సూర్యుఁడు కిరణములచే మేఘమునువలెఁ దూలించెను. మఱియు నారాధేయుఁడు ఘటోత్కచునిగుఱ్ఱములను గొట్టి, రథమును నూఱుఖండములుగా నొనర్చి, వర్షముచేఁ బర్జన్యుఁడువలె శరవర్షముచేఁ గప్పెను. అపుడు ఘటోత్కచునిమేను రెండంగుళములేని యవకాశ

ములేక కర్ణశరపూరితమై, రెండుగడియలసేపు ముండ్లువిప్పినపందివలెఁ గానవచ్చెను. ఓరాజా! రాధేయశరపరంపరావృతమౌట నాఘటోత్కచునిగుఱ్ఱములుగాని, రథముగాని, ధ్వజముగాని, యాఘటోత్కచుఁడుగాని మాఱుఁ గానరాకుండెను. ఆఘటోత్కచుఁడును, గర్ణునిదివ్యాస్త్రమును దనయస్త్రముచే ఖండించుచు, మాయాయుద్ధముచే, నాతనిఁ బీడింపసాగెను. ఓకురుసత్తమా! ఆభీమపుత్త్రుఁడు మాయయు లాఘవమును నేర్పడ, నాకసముననుండి గానరాకయే శరజాలములను గురిపించుచుఁ, దనరూపమును వికృతముగా నొనర్చి, మోహపెట్టుచు, మఱియు నశుభములుగను, వికృతములుగను, మొగములను గల్గించుచు నారాధేయునెదుట దివ్యాస్త్రములను బ్రదర్శించుచు, మఱియు మేను పెంచి, నూఱుఖండములైనట్లు హతసత్త్వుఁడును, నిరుత్సాహుఁడునునై పడి కానవచ్చెను. ఓమహారాజా! మఱియు నారాక్షసుఁడు మహాకాయుఁడై నూఱుతలలును, నూఱుకడుపులునుగల్గి, మైనాకపర్వతమునా జూపట్టెను. అటులు చూపట్టియు, వెంటనే యంగుష్ఠమాత్రప్రమాణుఁడై, చెదరినసముద్రతరంగమువలె నలుదెసలకు వ్యాపించెను. అటులు వ్యాపించి పుడమినిజీల్చి, మఱిమఱియు నందుఁ జొచ్చుచుఁ గానవచ్చెను. మఱియు వెంటనే పుడమినుండి పైకివచ్చుచుఁ జూపట్టెను. అటులు పెక్కుమాయలొనర్చి, సువర్ణభూషితమగు రథమునుండి దిగి, భూమ్యాకాశములను దిక్కులను నిండి, కుండలములు చలింప వెడలి, యారాధేయునిరథముఁ జేరి, తొట్రుపాటులేక, యాతనితో 'ఓరీ! నిలునిలుము. నాయెదుటఁబడియు నీవు జీవముతో నెందుఁబోఁగలవు! నీకిపుడు యుద్ధశ్రద్ధను శిక్షించువాఁడను,' అని పలుకుచుఁ గ్రోధతామ్రాక్షుఁడును, క్రూరపరాక్రముఁడునై, మింటికెగిరి యట్టహాసమొనర్చి, మఱియు సింహము, గజమునువలెఁ బీడించి, కర్ణుని రథచక్రములుమున్గునన్ని బాణములను వర్షించెను. వాఁడటులు మేఘ ముదకమునువలె, శరములను వర్షింప, వానినెల్ల నారాధేయుఁడు దూరమందుండఁగనె ఖండించివైచెను. అంత నాఘటోత్కచుఁడు నిజమాయ నాసూతసుతుఁడు రూపుమాప, మఱియు నంతర్ధానమొంది మాయను సృజించెను. ఆమాయచే,నతఁడు శిఖరములతోఁగూడి వృక్షములచే గహనమై, శూలప్రాసఖడ్గములతోఁ గూడియున్న యొకయున్నతపర్వతమై, సెలయేళులువాఱఁ, గాటుక

కాంతులతోఁ జూపట్టిన యాఘటోత్కచునిఁ గాంచియు, వాఁడుగ్రములగు పృథుపాషాణములను వహించుచు, దనపైకివచ్చినను జలింపకనవ్వుచు, నొకదివ్యాస్త్రమును వానిపైఁ బ్రేరించెను. ఆయస్త్రముచే నామాయాపర్వతము మాయమయ్యెను. పిమ్మట నారక్కసుఁ డింద్రాయుధముతోఁగూడిన నీలమేఘమై యాకసమునుండి, పాషాణవర్షముచేనత్యుగ్రముగా నాసూతపుత్రునిఁ బీడించెను. అపు డస్త్రవేత్తయగు నారాధేయుఁడు వాయవ్యాస్త్రమును సంధించి, యానీలమేఘమునుదొలఁగించెను. అటు లాకర్ణుఁడు నిజాస్త్రమునుండి వెడలినశరసమూహముచే నాఘటోత్కచప్రేరితాస్త్రమును రూపుమాపఁగా, మహాబలుఁడగు నారక్కసుఁడు, కర్ణునిరథముపై, గొప్పమాయను బ్రయోగించెను. పిదప నాసూతసుతుఁ డటులు పెక్కురాక్షససైన్యములతోఁగూడి, యించుకేనిఁ జలింపకవచ్చుట నారసి, వెనుదీయక వానితోఁ బోరాడఁ దలపడియెను. ఆఘటోత్కచుఁడును, సింహశార్దూలసదృశులును, మత్తమాతంగ విక్రములును, గజరథాశ్వవాహనులును, నానాయుధధారులును,బహువిధకవచభూషితులును, ఘోరాకారులును, క్రూరులు నగురక్కసులు పెక్కురు తనకుసహాయులుగా, దేవతలలో నింద్రుఁడువలె విక్రమించి, యారాధేయునిఁ దలపడియెను. అపుడు ఘటోత్కచుఁడు కర్ణునైదుసాయకములచే నొప్పించి, సకలక్షత్రియులును జడియునట్లుగా భయంకరారావ మొనర్చెను. అటు లొనర్చి, మఱియు నొకశ్వాంజలికమనెడిబాణముచే, బాణములతోఁగూడి యారాధేయుహస్తమందున్నధనువు వడిగా ఖండించెను. పిదప నాకర్ణుఁడును నింద్రాయుధమువలె నున్నతమై భారసహమగు వేఱొకగొప్పవిల్లుపూని, సువర్ణ పుంఖములై వైరిమారకములగు పెక్కుసాయకముల నాకసమునఁ జరించు నారాక్షసులపైఁ బ్రయోగించెను. పీనవక్షులగు నారాక్షససైన్య మారాధేయుశరపరంపరచేఁ బీడితమై, సింహపీడితమగు వన్యగజసమూహమువోలెఁ గలఁతనొందెను. అటు లాకర్ణుఁడు సూతగజాశ్వములతోఁగూడిన యారక్కసుల నుక్కడంచి, యుగాంతవహ్నివలె విరాజిల్లెను. ఓరాజా! మున్నా త్రిపురమును దహించినమహేశ్వరునివలె నారాధేయుఁ డారాజసహస్రములందును, బాంధవులందును మేటియై యొప్పాఱెను. మహాబలుఁడై రాక్షసేంద్రుఁడగు నాఘటో

త్కచుఁడుతప్ప వేఱొకవీరుఁ డెవ్వఁడును నారాధేయు దేఱిచూడఁ జాలఁడయ్యెను. ఆఘటోత్కచుఁడు భీమబలపరాక్రముఁడగు యముఁడునాఁ జూపట్టుచుఁ, గుపితుఁడగు వానికనులనుండి యగ్ని వెడలి, మహోల్కలనుండివలె జ్వాలామయములగు చమురుబొట్టు లుట్టిపడుచుండెను. అపుడు వాఁడు పెదవికొఱుకుచుఁ,జప్పటులుగొట్టి,యెప్పటివలె మాయానిర్మితమై, పిశాచముఖములును, గజతుల్యములు నగువాహనములచేఁ గట్టఁబడిన రథ మధిరోహించి, యారాధేయునిపైకిఁ దనరథము పోనిమ్మని సారథితోఁ బలుకుచు, ఘోరాకారమగురథముతో ద్వంద్వయుద్ధమునకుఁ దలపడియెను. అటు లెదుర్కొని వాఁడు, మహాఘోరమై యెనిమిదిచక్రములుగల్గి, రుద్రనిర్మితమైన యొకయశని నారాధేయునిపైవైవ, నతఁడు తనధనువు రథముపైఁబెట్టి, దానినిబట్టికొని, యాఘటోత్కచునిరథముపైకి విసరెను. అంత నారక్కసుఁడు రథమునుండి దిగి వెడలిపోయెను. ఆయశనియు నారక్కసునిరథమును సూతధ్వజాశ్వములతోఁగూడ భస్మముగావించి, మహాప్రభయై పుడమిఁజొఱ, నందులకు దేవతలును భయవిస్మయములందిరి. అటు లాదేవనిర్మితమైన మహాశనినెగిరి పట్టికొన్నందుల, కారాధేయుని సకలభూతములును బ్రశంసించెను. ఓరాజా! ఆరాధేయుఁ డిటులొనర్చి, యెప్పటివలె రథముపైఁగూర్చుండి, మఱియు బాణప్రయోగ మొనర్చుచు, నపు డాభీమసంగ్రామమున నెవ్వరికిని సాధ్యపడనికృత్య మొనరింపసాగెను. పిదప నారక్కసుఁ డారాధేయు నారాచసహస్రములచే జలధారలచేఁ బర్వతమువలెఁ బ్రహతుఁడగుచు, గంధర్వనగరమువలె మరల నంతర్ధానమునొందెను. అటులంతర్హితుఁడై మాయచేతను, లాఘవముచేతను, నారాధేయునిదివ్యాస్త్రములను నశింపఁజేయఁ, గర్ణుఁడును దొట్రుపడక యారక్కసునితోఁ బోరాడెను. ఓమహారాజా! పిదప మహాబలుఁడగు నాభీమనందనుఁడు కుపితుఁడై,తనరూపమును బహువిధములఁగాఁ జూపుచు, మహారథులను వెఱపించుచుండెను. పిమ్మట నలుదెసలనుండియు సింహములును వ్యాఘ్రములును సివంగులును వెడలివచ్చుచుండెను. మఱియు నగ్నిజిహ్వములగు సర్పములును,నినుపమొగములుగలపక్షులును వెడలఁజొచ్చెను. కర్ణచాపప్రయుక్తములగు శరపరంపరలచే నిండి, కొండనాఁదగు నాఘటోత్కచుఁ డంతే యంతర్ధానమొందెను. పిదప రాక్షసులును పిశాచు

లును, యాతుధానులును, సాలావృకములును, వృకములును వికృతా కారములతో నాకర్ణుని భక్షింప వెడలెను. మఱియు నారక్కసులు క్రూరవచనములచే వెఱపింపసాగిరి. అపు డారాధేయుఁడు వారిలో నొక్కొక్కని గ్రమముగాఁ దనతీవ్రసాయకములచే నొప్పించెను. అటు లారాక్షసమాయ నెల్ల తనదివ్యాస్త్రముచే నడంచి, సన్నతపర్వములగు సాయకములచే వాని క్రూరములగుగుఱ్ఱములను గొట్టెను. అటు లవి ఛిన్నపృష్ఠములై వికృతాకారములతో నారక్కసుఁడు చూచుచుండఁ గనే పుడమిఁబడియెను. అంత నాఘటోత్కచుఁడు తనమాయ లెల్ల భగ్నములగుడు 'ఓరీ! ఇదె నిన్నుఁ జంపుచున్నవాఁడను' అని పలుకుచు మరల నంతర్ధానమొందెను" అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

## అలాయుధ ఘటోత్కచులయుద్ధము

"ఓరాజా! అటు లారాక్షసరాధేయులకు యుద్ధము జరుగుచుండఁగా వీర్యశాలియు రాక్షసోత్తముఁడునగు నలాయుధుఁడు తనగొప్ప సైన్యముతోఁగూడి సుయోధనునిఁ జేరి, నానారూపధరులును, వీరులును, వికృతరూపులునునగు రాక్షసులు వేలకొలఁదిఁ దన్నుఁ బరివేష్టించియుండఁ, బాండవులపైఁ దనకుఁగల పూర్వవైరమును స్మరించుచు,బ్రాహ్మణభక్షకుఁడగు తనజ్ఞాతి బకుఁడును, గిమ్మీరుఁడును, హిడింబుఁడును భీమునిచే హతులైరని; వానిపైఁ గుపితుఁడై, యెట్లేనిఁ జంపవలయు ననునుద్రేకముతో, మత్తమాతంగమువలెను గుపితసర్పమువలెను విజృంభించుచు, నాతనితో 'ఓదుర్యోధనా! నాకు బంధుగులగు బకకిమ్మీరహిడింబులు భీమునిచే హతులగుట నీవెఱింగినదియగదా! మఱియుఁ గన్యకయగు హిడింబను మున్ను వాఁడు బలాత్కరించెనుగాదే? మాకును దక్కుం గలరాక్షసులకును నతఁ డొనర్చుపరిభవ మింకేమి యుండును? ఓమహారాజా! కావున గజరథాశ్వసమేతుఁడై సపరివారుఁడైన యాభీముని, సపరివారుఁడగుఘటోత్కచునిఁ జంపుట కిదె వచ్చితిని. మఱియు నిపుడు పాండవుల నెల్లరను, వాసుదేవుని, వారియనుచరులతోఁ గూడ భక్షించెదను. ఇఁక నీసైన్యమును నివారింపుము. మే మాపాండవులతో యుద్ధము చేయుద్దుము.' అని తెలుప విని, వానివచనమునకు నీతన

యుఁడు సంతుష్టాంతరంగుఁడై సమ్మతించి,తనసోదరులు పరివేష్టించియుండ నాయలాయుధునితో 'ఓయీ! నిన్ను సపరివారముగా ముందిడికొని మేమును వైరులతోఁ బోరాడెదము. వైరమును దుదముట్టించుపట్టుదల గల మాసైనికు లిపుడు మరలనొల్లరు.' అని తెలిపెను. అందుల కారాక్షసోత్తముఁ డంగీకరించి, పురుషాశనులగు రక్కసులతోఁగూడి వడిగా నాభీమునిపైకి వెడలెను. ఓరాజేంద్రా! ప్రదీప్తమగుశరీర కాంతి చేతను, సూర్యసన్నిభమగు రథముచేతను ఘటోత్కచునకుఁ దక్కువ గాకయుండెను. పెక్కుతోరణములచేఁ జిత్రితమై యెలుగుబంటిచర్మ ముచేఁగప్పఁబడి,నిరుపమానని ర్ఘోషముగల వానిరథముసైతము నాలుగు వందలమూరలపరిమితి గలిగియుండెను. వానిగుఱ్ఱములుసైతముఁ బరుష ధ్వనులుగల్గి, యేనుగులునాఁదగి,వడిగల్గి మాంసశోణితాహారములైనూఱు, రథమునకుఁ గట్టఁబడియుండెను. వానిరథఘోషము గంభీరగర్జనము ననుకరించియుండెను. వానివిల్లుసైతము గట్టి యల్లెత్రాడుగల్గి, బలవత్తర మైయుండెను. వానిబాణములును సువర్ణపుంఖములై సానవెట్టుటచే నక్షత్రతుల్యములై యుండెను. వాఁడును ఘటోత్కచునిఁబోలిన మహా బాహుఁడైన వీరుఁడై యుండెను. వానిధ్వజముసైతము గోమాయు బలరక్షితమై, సూర్యాగ్నితుల్యమై వెలయుచుండెను. వాఁడును రూప ముచే ఘటోత్కచుని మించి, యంతకతుల్యుఁడై గానవచ్చుచుండెను. మఱియు నాయలాయుధుఁడు, కిరీటాంగదములు వెలయఁ, బుష్పమా లాలంకృతములగు తలపాగయు, ఖడ్గము గల్గియుండెను. మఱియు వానికి గదయు భుసుంఠ ముసల హల శరాసనములు నాయుధములుగా నేనుఁగుఁబోలిన కవచముగల్గి, యగ్నితుల్యతేజముగురథముచేఁ బాండవ సైన్యమును దఱుముచు, నారణరంగమునఁ జరించుచు, నాకసమున మెఱుపులతోఁగూడి చరించుమేఘమువలె విలసిల్లెను. ఓరాజేంద్రా! వానియనుచరులును మహాబలులై, కవచధారులును, ఖడ్గధారులునై, పాండవవీరులతో సోత్సాహులై పోరాడఁజొచ్చిరి." అని తెలిపి సంజ యుఁడు మఱియు నయ్యాంబికేయునితో ని ట్లనియె.

### అలాయుధునియుద్ధము

"ఓరాజా! అటులు తమకుఁ దోడ్పడవచ్చిన భయంకరకృత్యుఁ డగునాయలాయుధునిఁ గాంచి, యక్కౌరవులెల్లరును సంతుష్టాంతరంగు

లైరి. అటులే సుయోధనుఁడు మున్నగు నీతనయులును, సముద్రమును దాఁటఁదలంచి, యోడ లేకున్నవా రది లభించిన నెట్లు సంతసింతురో, యటు లుప్పొంగిరి. అపుడు పార్థివులెల్లరును బునర్జన్మ మొందినట్లు భావించికొనిరి. వారెల్లరు నాయలాయుధునకు స్వాగత మొసంగి పూజించిరి. ఆరాతిరి భయప్రదమై దారుణదర్శనమై యమానుషమై, యారాధేయరాక్షసుల కటులు యుద్ధముజరుగుచుండఁగాఁ, బాంచాలురు, క్షత్రియవీరులతోఁగూడ నవ్వుచుఁ జూచుచునుండిరి. అటులే నీవారును దమ్ము రక్షించుకొనుచు నుండిరి. నాఁడు రణరంగమున ఘటోత్కచుని యద్భుతకృత్యమును గాంచి, యిట్టియుద్ధ మెందును జూడలేదని ద్రోణ కృపాశ్వత్థామలు ఘోషించిరి. ఓమహారాజా! అపుడు నీసైన్యమెల్ల బెదరి, నిశ్చేష్టమై కర్ణునిజీవితము నెడ నిరాశ చేసికొని హాహాకార మొనరింపసాగెను. అంత నాసుయోధనుఁ డటు లారాధేయుఁడు పీడితుఁడై యుండుటఁ గాంచి, రాక్షసోత్తముఁడగు నలాయుధునితో "ఓ వీరాగ్రణీ! ఇదె చూచితే? ఈరాధేయుఁడు ఘటోత్కచునితోఁగలిసి, మిగుల నుపాయముగా నెంతయు గొప్పకృత్య మొనరించుచున్నవాఁడు. అభిమనందనునిచేశూరులగు నిప్పార్థివు లెటులు నిహతులగుచున్నవారో చూడుము. ఏన్గులు వృక్షములనువలె నానావిధాయుధములతోఁ బ్రహరించుచున్నవాఁడు. ఈరాజమధ్యమున నేఁటియుద్ధమున నీకీభాగమును నియమించితిని. కావున నీవు సమ్మతింతువేని, విక్రమించి వీనిని జంపుము. ఈపాపాత్ముఁడగు ఘటోత్కచుఁడు నిజమాయాబల మాశ్రయించి, యీరాధేయునిఁ బరిమార్పకమున్నే నీవు వీనిని వధింపవలయును, అని పలుకఁ దీవ్రవిక్రముఁడగు నారక్కసుఁడు వల్లెయని వెడలి, మహాబాహుఁడై యాఘటోత్కచునిఁ దలపడియెను. పిదప నాఘటోత్కచుఁ డారాధేయుని విడిచి, ప్రతియోధియైవచ్చు నాయలాయుధుని సాయకములచే నొప్పించెను. పిమ్మటఁ గుపితులైన యారక్కసుల కిరువురకును గొప్పయుద్ధము జరిగెను. అయ్యది యాఁడేన్గుకై పోరాడు వనగజముల యుద్ధమునాఁదగి చూపట్టెను. రథికోత్తముఁడగుకర్ణుఁడును నటు లాఘటోత్కచునిచే విడువఁబడి, సూర్యసన్నిభమగు తనరథముతో భీమసేనునిపైకి వెడలెను. అటులు తనపైకి వచ్చు నారాధేయు నాదరింపక, యలాయుధునిపాలఁబడియున్న ఘటో

త్కచునిఁ గాంచి భీముఁడు వృషభముపై కుఱుకుసింగమువలె నున్న యారక్కసునిపైకి వెడలి, వానిరథముపై శరవర్షమును గురియుచు, విక్రమింపసాగెను. అంత నాయలాయుధుఁడును నాభీమునిఁ గాంచి, ఘటోత్కచుని విడిచి, యాతనిఁ దలపడియెను. ఓరాజా! రాక్షసాంతకుఁడగు భీముఁ డపుడు వానిని సమీపించి, సపరివారుఁడగు నారక్కసునిపై శరవర్షముగురియ, నాయలాయుధుఁడును శిలాధౌతములై, యవక్రములగు సాయకములను మఱిమఱియు నక్కొంతేయునిపైఁ గురిపించెను. అటులే రాక్షసులెల్లరును నానాయుధధారులై భయంకరులగుచు, నీపుత్రులజయముఁ గోరి యాభీమునిఁ దలపడిరి. మహాబలుఁడగుభీముఁడును నటులు పలువురచే నొక్కమాఱుగాఁ బీడితుఁడయ్యు, వారి నొక్కొకరి నైదేసి బాణములచే నొప్పించెను. క్రూరబుద్ధులగు నారక్కసు లటు లాభీమునిచేఁ బ్రహతులై, మహారావము లొనర్చుచుఁ, బదిదిక్కులకుఁ బాఱఁదొడంగిరి. అటులు తనవారు పరువులిడుటఁ గాంచి, మహాబలుఁడగు నాయలాయుధుఁడు వడిగా వెడలి, తీవ్రసాయకము లాభీమునిపై గుప్పించెను. భీముఁడును దీవ్రాగ్రములగుసాయకము లాయలాయుధునిపైఁ బ్రయోగింప, వానిని గొన్నిటి నారక్కసుఁడు ఖండించి, కొన్నిటిని బట్టుకొనియెను. భీమపరాక్రముఁడగు భీముఁ డదిగాంచి, వజ్రపాతతుల్యమగు నొకగదను వానిపై విసరెను. పిదప నారక్కసుఁడు జ్వాలామయమై తనపైకివచ్చు నాభీముగదను దనగదచేఁ బ్రహరింప, నది యాభీమునిపైకి వచ్చెను. పిమ్మట భీముఁ డారక్కసునిపై శరవర్షము గురియ, వానినెల్లవాఁడు తనశరపరంపరచే వ్యర్థములుగా నొనర్చెను. పిమ్మట నారక్కసునానతిచేఁ దక్కినరాక్షసులెల్లరును భీకరాకారులై పాండవుల రథగజాదులఁ బీడింపసాగిరి. అపుడు పాంచాలురును, సృంజయులును గజాశ్వాదులతోఁ గలఁతవడిరి. ఆమహాఘోరయుద్ధము నారసి జనార్దనుఁ డప్పార్థునితో 'ఓధనంజయా! ఆరక్కసునకు వశుఁడైయున్న భీమపరాక్రముఁడగు భీమునిఁ గాంచితే? ఇఁక నాలోచింపక వడిగా నాభీము ననుసరింపవలయును. శిఖండిధృష్టద్యుమ్నులును, యుధామన్యూత్తమౌజులును, ద్రౌపదేయులును గూడి యారాధేయునిపై వెడలవలయును. ఓపాండవా! నకులసహదేవులును, సాత్యకియుఁ దక్కినరక్కసులను జంపవలయును.

నీ వీవిషయమున శాసింపుము. ఓమహాబాహూ! నీవును ద్రోణపురస్కృతమైయున్న యీసైన్యమును నివారింపుము. ఇపుడు గొప్పభయము సంభవించెను, అని వాసుదేవుఁ డానతియొసంగ, రథికోత్తములెల్లరును దమతమనియుక్తకార్యము లొనర్చువారై, కొందఱు రాధేయునిపైకిని, గొందఱు రక్కసులపైకిని వెడలిరి. పిదపఁ బ్రతాపశాలియగు నాయ లాయుధుఁడు విషసర్పతుల్యములగు సాయకముల నాకర్ణాంతముగా లాగి విడిచి, భీమునివిల్లు ఖండించి, మఱియుఁ దీవ్రబాణములచే నాతని గుఱ్ఱములను, సారథిని భీముఁడు చూచుచుండఁగనే ప్రహరించెను. అంత నాభీముఁడు రథాశ్వములును సారథియు హతములగుట, రథము విడిచి సింహనాద మొనర్చుచు ఘోరమైన గొప్పగదను వానిపై వైచెను. పిదప నారక్కసుఁడును దనపై కటులు వచ్చుచు, భయంకర ధ్వనిగల యాగదను, నిజగదచే మోది సింహనాద మొనరించెను. అంత నాభీముఁ డారక్కసుని భయావహమగు ఘోరకృత్యమును గాంచి, మేనువెంచి, తనయుగ్రగదను బట్టుకొనియెను. ఆమానవరాక్షసులకు సంకులయుద్ధ మారంభమయ్యెను. పిదప వారిరువురును బుడమి వడఁకు నట్లుగాఁ జరించుచుఁ, బరస్పరముఁజేరి గొప్పచప్పుడు లుప్పతిలునట్లుగా నొకరిపై నొకరు గదలు ప్రయోగించుకొనసాగిరి. మఱియుఁ బిడికిటిపోటులను, రథచక్రములతోడను, యుగములు, అక్షములు, అధిష్ఠానములు, ఉపస్కారములు మున్నగువానితోడను గుపితులై డగ్గరి, పరస్పరము బ్రహరించుకొనిరి. మఱియు మేనులనుండి రక్తములు స్రవింప, నొకరి నొకరు మత్తగజములునా నాకర్షించుకొనసాగిరి. అట్టి వారియుద్ధమును గాంచి భీమసేనపక్షపాతియగు వాసుదేవుఁ డాతని రక్షించువాఁడై, మఱియు నాయలాయుధునిపైకి ఘటోత్కచునిఁ బొమ్మని ప్రోత్సహించెను." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

ఘటోత్కచుఁ డలాయుధునిఁ జంపుట

"ఓయంబికానందనా! అపు డావాసుదేవుఁ డాభీముని రాక్షస పీడితుఁగా నూహించి, ఘటోత్కచునితో 'ఓమహాబాహూ! అలాయుధ పీడితుఁడగుచున్న భీమునిఁ జూచితే? వాఁడు సకలసైన్యములును గాంచుచుండ విక్రమించుచున్నవాఁడు. కావున నీవు కర్ణుని విడిచి వడిగా

నారక్కసుని వధింపుము. పిదపఁ గర్ణుని వధింపవచ్చును' అని తెలిపెను. అంత నారక్కసుల కిరువురకును నారేయి ఘోరయుద్ధమయ్యెను. శర శరాసనధరులై ఘోరాకారులై వడిగా వెడలిన యలాయుధుని యోధు లగు రాక్షసులను గాంచి కుపితుఁడై సాత్యకియు, నకులసహదేవులును దీవ్ర బాణములచేఁ బీడించిరి. ఓరాజా! అపు డర్జునుఁడు శరపరంపర లెల్లెడలఁ గురియుచు, క్షత్త్రియవీరులనెల్లఁ బీడింపసాగెను. అటులే కర్ణుఁ డును, శిఖండిధృష్టద్యుమ్నాదులగు పాంచాలరథికులను బాఁటఁ ద్రోలెను. వారటులు చెదరుట చూచి, భీమపరాక్రముఁడగు భీముఁడు వడిగా నారాధేయుఁ దలపడి, శరవర్షమును గురిసెను. పిదప సాత్యకియు నకులసహదేవులును రాక్షసులను వధించి, కర్ణుఁడున్నకడ కరుదెంచిరి. అటులువచ్చి వారు కర్ణుని మార్కొనిరి. పాంచాలురు ద్రోణునిఁ దల పడిరి. అంత నాయలాయుధుఁడు కుపితుఁడై, ఘటోత్కచు నొకగొప్ప పరిఘముచేఁ దలపైఁ బ్రహరింప, నందుల కాఘటోత్కచుఁ డించుక మూర్ఛగల్గియు, ధైర్యము తెచ్చికొని దీప్తాగ్నితుల్యమై, నూఱుగంటలచే నలంకరింపఁబడి, సువర్ణభూషితమైన యొకగదను వానిపై వైవ, నద్దానిచే నారక్కసునిగుఱ్ఱములును, సారథియు, రథమును జూర్ణములయ్యెను. అంత నాయలాయుధుఁ డటులు చక్రములు, నక్షములు, కూబరము, ధ్వజము, గుఱ్ఱములును భగ్నములగుటఁ జెడినతనరథమునుండి యెగిరి, రాక్షసమాయ నవలంబించి, రక్తవర్షమును గురిపించుచు, నాకసము మెఱపులచే నిండి, చీకటులచేఁ గప్పఁబడునట్టు లొనరించెను. పిదప వజ్రపాతములును, బిడుగులతోఁగూడ మెఱుపులును నుద్భవించెను. అపు డందు గొప్పచటచటాశబ్దము దయించెను. ఆరాక్షసునిచే నటులు కల్పింపఁబడిన యామాయను గాంచి, ఘటోత్కచుఁడును రథమునుండి యెగిరి, తానును మాయను గల్పించి వానిమాయ నడంచెను. అపు డాయలాయుధుఁడు తనమాయ మాయమగుటయు, మఱియును మాయావియై యాఘటోత్కచునిపైఁ బాషాణవర్షముగురిసెను. అంత నాప్రతాపశాలియగు భీమసుతుఁడు తనశరపరంపరచే వానిపాషాణవర్ష మును దోలఁగించి, యద్భుతమొనరించెను. పిదప వారిరువురును, నినుప దుడ్డును, శూలములు, గదలు, ముసలములు, ముద్గరములును, బినాక ములును, గరవాలములును, దోమరములును, బ్రాసములును, గంపన

ములు, నారాచములు, భల్లములు, శరములు, చక్రములు, పరశ్వధ ములు, అయోగుడములు, భిందిపాలములు, గోశీర్షములు, ఉలూఖములు మున్నగువానితోఁ బరస్పరమును బ్రహరించుకొనసాగిరి. మఱియు వారు పెద్దకొమ్మలుగల వివిధములగు వృక్షములతోడను, వివిధములగు పర్వతాగ్రములతోడను బోరాడనారంభించిరి. వారు ప్రయోగించు కొనుచున్న శమీ, పీలు, కరీర, చంపక, కోవిదార, బదరీ, పలాశ, ప్లక్ష, న్యగ్రోధ, పిప్పలాదులగు వృక్షములతాకుడులచేఁ గలుగుచప్పుడు, వజ్రములు పగులునప్పటిచప్పుడు ననుకరించెను. ఓరాజా! అపు డాఘటోత్కచాలాయుధులకు భయంకరయుద్ధము జరిగెను. ఆరక్క సులపోరాటము వాలిసుగ్రీవులయుద్ధమును దలపించెను. అటులు వారు కొంతవడి వివిధములగు విశిఖాదిబాణవిశేషములతోఁ బ్రహరించికొని, పిదప వాఁడిగలఖడ్గములను బూని పరస్పరము కొట్టుకొనసాగిరి. పిదప వారు జుట్టునుజుట్టు బట్టుకొని, మహాబలులై పెనఁగ, వారిమేనులఁ జెమ్మటలు కాలువలై స్రవించెను. మఱియు రక్తములు, వర్షధారలునా స్రవింపసాగెను. పిమ్మట నాభీమనందనుఁడు వడిగా వానిపై కుఱికి పట్టుకొని గిరగిర త్రిప్పి, వానితలను ఖండించి, కుండలవిభూషితమగు దానిని బట్టుకొని, గొప్పసింహనాద మొనరించెను. అటు లామహాకా యుఁడైన బకసోదరుఁడు హతుఁడగుటఁ గాంచి, పాంచాలురును బాండ వులును సింహనాదములు గావించిరి. ఓరాజా! ఆక్రూరరాక్షసుఁడు మడిసినతోడనే పాండవసైన్యమున వేలకొలఁదిభేరులును నయుతముల కొలఁది శంఖములును మ్రోగసాగెను. ఆరాతిరి పాండవులకు విజయ ప్రదమై మిక్కిలి ప్రకాశించుచు, నెల్లెడల దీపమాలికలుగల్గి యొప్పెను. అపు డాఘటోత్కచుఁ డలాయుధునితల నాసుయోధను నెదుటఁ బడవైచెను. పిదప నాదుర్యోధనుఁడు హతుఁడైనయలాయుధునిఁ గాంచి,తనసైన్యములతోఁగూడఁగలఁత నొంది, వీరుఁడగునలాయుధుఁడు తనకు భీమునితోఁగలపూర్వవైరమును స్మరించుచుఁ దనంతఁదావచ్చి యాభీమునిఁ దాను జంపెదనని ప్రతిజ్ఞ చేసియుండుటను, వాఁ డా భీమునిఁ దప్పక చంపుననియే తలంచినవాఁడగుట, నిపు డారక్కసుఁడు ఘటోత్కచునిచే హతుఁడగుటకుఁ జింతించుటయెగాక, భీముని ప్రతి

పూర్ణమయ్యెనని తలంచినవాఁడును గావలసివచ్చెను.'' అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

### కర్ణుఁడు ఘటోత్కచునిఁ జంపుట

"ఓరాజా! ఆఘటోత్కచుఁ డటు లాయలాయుధునిఁ జంపి, యా సైన్యముఖమున నిలిచి, పలువిధములగునాదము లొనరించెను. ఓమహా రాజా! ఏన్గులకున్ సైతము వెఱపొదవించు నాగొప్పనాదమును విని, నీవా రెంతయు భయమొందిరి. ఘటోత్కచుఁ డలాయుధునిఁ దలపడినతోడనే కర్ణుఁడు పాంచాలురపై వెడలి, ధృష్టద్యుమ్నుని శిఖండిని బదేసిబాణములచే నొప్పించి, మఱియు నాకర్ణాంతాకృష్టములగు తీవ్రనారాచములచే యుధామన్యూత్తమౌజులను గొట్టి, రథికోత్తముఁడగుసాత్యకిని సాయకములచేఁ జలింపఁజేసెను. ఓజనాధిపా! అప్పాంచాలయోధులెల్లరును గుడియెడమల శరప్రయోగ మొనరింపందొడంగ, నెల్లెడల విండ్లు మండలాకారములై గానవచ్చెను. వారిధనుష్టంకారములును, రథనేమిధ్వనులును దొలకరిమబ్బుల గర్జనములునా వినవచ్చెను. ఓ రాజా! ఆసంగ్రామమనెడి మేఘము, ధనుష్టంకారరథఘోషము లనెడి గర్జనములుగల్గి, విండ్లు మెఱుపులుగా శరపరంపరలనెడి గాలివానను వెలయింప మొదలిడెను. మహాశైలసమానసారుఁడగు నారాధేయుఁడు వైరిపీడావహుఁడై, కొండవలెఁ జలింపక శరవర్షమును గురియుచు, నద్భుతముగా క్షత్రియవీరులనెల్ల నశింపఁజేయ నారంభించెను. ఓరాజా! నీపుత్రునిహితముఁగోరి మహాత్ముఁడగు నారాధేయుఁడు వజ్రనిపాతతుల్యములగు తోమరములచేతను, గాంచనచిత్రపుంఖములగు తీవ్రశరసహస్రములచేతను, శత్రులను బీడించుచుండఁ గొందఱు ధ్వజములు విఱిగియుఁ, గొందఱు దేహములు దెగియుఁ, గొందఱు సూతులు చచ్చియుఁ, గొందఱు గుఱ్ఱములు నశించియుఁ బలువిధములుగా భంగమొందిరి. అప్పు డప్పాండవబలమెల్ల ముప్పులపాలయ్యెను. అటులు భంగమొంది యుద్ధవిముఖులైయున్న తమసైనికులఁ గాంచి, యాఘటోత్కచుఁ డెంతయుఁ గుపితుఁడై, తనసువర్ణచిత్రితమగురథము నధిష్ఠించి సింహనాద మొనర్చి, యారాధేయుఁ దలపడి, నిరుపమానసాయకములచే నొప్పించెను. అపుడా రాధేయ ఘటోత్కచు లిరువురును గర్ణి

నారాచశిలీముఖములను, నాలీక,దండాశనివత్సదంతములను, వరాహకర్ణ ములను, విషాణశృంగములతోఁగూడిన క్షురప్రములను బరస్పరము వర్షించికొనిరి. ఆసమరమున నలుదెసలకుఁ జెదరినవారిశరధారల సువర్ణ పుంఖములకాంతులచే నంతరిక్షము పుష్పమాలికలచేవలె నొప్పారెను. నిరుపమానప్రభావులగు వారిరువురును గొప్పగొప్పయస్త్రములచేఁ బరస్ప రముఁ బ్రహరించుకొనుచుండిరి. కాని యావీరులలో నొకఁడును వే ఱొకనిమించుట చూపట్టదయ్యెను. ఓరాజా! ఆకవిభీమసేనసూనుల యుద్ధము నిరుపమానరూపమై చిత్రమై, శస్త్రప్రహారఘోరమై, యాకస మున రాహుభానులకువలెఁ బ్రదీప్తమై జరిగెను. ఓరాజా! ఎప్పుడా ఘటోత్కచుఁడా రాధేయు నతిక్రమింపఁజాలకుండెనో, యప్పుడొక యుగ్రమగునస్త్రమును బ్రాదుర్భవింపఁజేసి,దానిచే నాకర్ణునిగుఱ్ఱములను, సారథినిగొట్టి, యంతర్ధానమొందెను" అని తెలుప విని ధృతరాష్ట్రుఁడా తనితో "ఓసంజయా! కపటయుద్ధనిపుణుఁడగు నాఘటోత్కచుఁ డంత ర్హితుఁడగుడు మనవా రేమిచేసినదియుఁ దెలుపుము."

అని విని సంజయుఁడు మఱియు నాతనితో "ఓరాజా! ఆరాక్షసుఁ డటు లంతర్హితుఁడగుటఁ దెలిసి, కౌరవులెల్లరును 'ఆహా! కపటయోధి యగు నీరక్కసుఁడు గానరాకుండఁగనే కర్ణునిఁ జంపునేమో' యని యఱచిరి. పిదపఁ గర్ణుఁడు కరలాఘవమేర్పడఁ జిత్రయోధియై, యెల్ల దెసల బాణజాలములచేఁగప్ప, నంతరిక్షము చీకటులనిండి యేదియుఁ గానరాకుండెను. అతఁ డమ్ములపొదిని ముట్టుటయు, బాణములఁ దీయు టయు, సంధించుటయుఁ దెలియకుండునట్లుగాఁ గరలాఘవము మెఱయ, సాయకములచే నంతరిక్షమంతయుఁ గప్పెను. పిదప భయంకరాకారుఁ డగు నాతనిచే నంతరిక్షమున ఘోరమగుమాయ కల్పింపఁబడియెను. అయ్యది యగ్నిశిఖవలె నుగ్రమై ప్రజ్వలించుచు, మేఘముల నెఱ్ఱని కాంతులు నెఱపుచుఁ గానవచ్చెను. ఓకౌరవేంద్రా! పిదప మెఱుపులును బ్రజ్వలించునుల్కలును బ్రాదుర్భవించెను. మఱియు నద్దానివలన వేల కొలఁది దుందుభులఘోరారావ ముప్పతిల్లెను. పిదప సువర్ణపుంఖములగు సాయకములునుశక్తిప్రాసముసలాద్యాయుధములును, బరశ్వధములును, దైలధౌతములగుఖడ్గములును, దీప్తాగ్రములగుపట్టసములును, దోమర ములును, గాంతులొలయు పరిఘములును, లోహబద్ధములగుగదలును,

జిత్రములై వాఁడిగలశూలములును, సువర్ణపట్టబద్ధములగు గొప్పగదలును, శతఘ్నులును నెల్లెడలఁ బ్రాదుర్భవించెను. మఱియు నందందు వేలకొలఁది గొప్పపాషాణములును, పిడుగులతోఁగూడ వజ్రములును బడఁజొచ్చెను. అటులే చక్రములును, జ్వలనప్రభలు వెలయ, వందల కొలందిక్షురప్రములును నుప్పతిల్లెను. మాయాసృష్టములగు నారక్కసునిశక్తులయు, ఖడ్గములయుఁ బ్రాసపరశ్వధపాశవజ్రాశనిముద్గరములయు, విశాలవర్షము ప్రజ్వలించుచుఁ బడఁదొడంగ, నారాధేయుఁడు వానిని దనశరజాలముచే నివారింపఁజాలఁడయ్యెను. అపుడు శరములచే హతములగుగుఱ్ఱములయు, వజ్రాహతములగు నేన్గులయు, శిలాహతములగు మహారథములయు గొప్పచప్పుడు లుప్పతిల్లెను. అటు లాఘటోత్కచునితీవ్రములగు నానావిధశస్త్రపాతములచే నభిహతమగుకౌరవసైన్యమంతయు మరలి పీడితమై గానవచ్చెను. మఱియు నది యడంగియు, నలుగెలంకులఁ దిరిగియు, విషాదమొందియు హాహాకారమొనర్చెను. కాని యపుడు మర్యాదదప్పనివీరులు పరాఙ్ముఖులుగాక నిలిచియుండిరి. ఘోరాకారమై, భయంకరమై మహాశస్త్రమయమగు నమ్మాయాశస్త్రవర్ష మటులు పడుచుండఁ, దమసైన్యములు నేలఁగూలుచుండుటను గాంచిన నీపుత్రులకు గొప్పభయము గలిగెను. అగ్నివలె నెఱ్ఱని నాలుకలతో భయంకరారావములై వందలకొలఁది మొఱయు నక్కలను, గంతులిడుచున్న రక్కసులమూఁకను గాంచి, మనయోధులు వ్యథాకులితమానసులైరి. అట్టి లారక్కసులు, ప్రదీప్తములగు మొగములును నాలుకలును గలిగి, పెనుఁగొండలునాఁదగు మేనులతో భయంకరులై మింటికెగిరి, పెనుమబ్బు లుగ్రవర్షమునువలె వేలకొలఁదిశక్తులను వర్షింపఁ దొడంగిరి. ఆరక్కసులుగురియు శరశక్తిశూలగదాపరిఘువజ్రపినాకాశనిప్రహారములచేతను, శతఘ్నులచేతను బీడితులై, మనయోధులు పుడమిఁ బడుచుండిరి. నీతనయునిసైన్యము నటు లారక్కసులు పలువిధములగు నాయుధములచేఁ బ్రహరింప, వారికెల్ల మూర్ఛాతిశయ మావహిల్లెను. అపుడు మనవీరులు నిహతములగుతలలతో భగ్నాంగులై యాయుధములుజాఱ నేలఁగూలసాగిరి. పాషాణవర్షముచే గుఱ్ఱములు డెగియెను. ఏన్గులు భగ్నములయ్యెను. రథములు చూర్ణములయ్యెను. అటు లాఘోరాకారులగు రక్కసులు మహాశరవర్షమును గురియుచు, జడిసి

రనిగాని, యాచించిరనిగాని విడువక చంపుచుండిరి. క్రూరమై కురవీర మారణమై కాలప్రేరితమగు నాక్షత్త్రియనాశమున మనసైనికులెల్లం జడిసి పరువులిడసాగిరి. అందుఁ గౌరవులెల్లరును 'ఓవీరులారా! పొండు పొండు. పాండవులకుఁగా నింద్రాదిదేవతలు మనల హింసించుచున్న వారు.' అని మొఱలిడుచు, విపత్సాగరమున మున్గుచున్నవారికి ద్వీపము నాఁదగి యొక్కఁడును గానరాకుండెను. అపు డటు లాసంకులసమర మారంభమై కౌరవసైన్యము భంగమొంది యడఁగి, సైన్యవిభాగము తెలియఁబడకుండుటను, గౌరవు లెవ్వరో, యితరు లెవ్వరో తెలిసికొన వీలుపడకుండెను. ఓరాజా! ఘోరరూపమై మేరమీఱినయాయుపద్రవ మున మనవారు శూన్యములగు దెసల నారయుచు, వడిగా నాశస్త్రవర్ష మును బ్రవేశించుచున్నరాధేయు నొక్కనినే చూడఁగలిగిరి. అపు డా కర్ణుఁ డారక్కసుని దివ్యమాయను నివారించుచు, శరసమూహముచే నంతరిక్షమును గప్పుచు, దుష్కరమగుకృత్య మొనరించుచు, నతఁ డించుకయు జడియక విక్రమింపసాగెను. ఓరాజా! సైంధవులు బాహ్లీ కులు మున్నగువారెల్లరును జడిసియు, నారాధేయునిధైర్యమునకు మెచ్చుచు, రాక్షసునిజయమును దిలకించుచు నుండిరి. అపు డాఘటో త్కచునిచేఁ బ్రయుక్తమగు చక్రయుక్తమైన శతఘ్నిగుఱ్ఱములనాల్గిటి నొక్కమాఱుగా నొప్పింప, నవి మోకాలఁబడి ప్రాణశూన్యములై, పండ్లు కన్నులు నాలుకలు బయలుపడఁ బుడమిఁబడియెను. పిదప హతా శ్వమగురథము విడిచి, యారాధేయుఁడు ధైర్యశాలియై, కౌరవులు పరువులిడుచుండఁగా, నాఘటోత్కచునిమాయచేఁ దనదివ్యాస్త్రము హతమయినను మోహమందక, ప్రాప్తకాలమును జింతించుచునుండెను. అపుడు కౌరవు లారాధేయుని నారక్కసునిమాయను గాంచి, 'ఓరా ధేయా! ధృతరాష్ట్రసుతులు హతులగుచున్నవారు, కావున వడిగా నాఘటోత్కచుని వధింపుము. భీమార్జునులు మమ్మేమియుఁ జేయఁ జాలరు. ఈనిశీథమునఁ బాపుఁడగుఘటోత్కచుని వధింపుము. ఘోర రూపమగు నీసంగ్రామమున నీఘటోత్కచునుండి విడివడితిమేని, మాకు విముక్తి గల్గించునాతని నాశ్రయించి, పార్థులతోఁ బోరాడఁగలము. కావున, వాసవదత్తమగుశక్తిచే ఘోరాకారుఁడగు నీరక్కసునిఁ జంపుము. ఓరాధేయా! ఈనిశీథమున నీరాక్షసుఁడు హతుఁడుగానిచో

నింద్రతుల్యులయ్యు నిక్కౌరవయోధు లీతని నోర్వఁజాలరు' అని పలికిరి. అటు లారాత్రి జడియుచున్న సైన్యమును గౌరవులఁ గొప్పచప్పుడును దెలిసికొని, తనయింద్రదత్తశక్తి నారక్కసునిపైఁ బ్రయోగింప నిశ్చయించెను. అంత నతఁడు సింహమువలెఁ బ్రతిఘాతమునోర్వక కుపితుఁడై, యమోఘమై యుత్తమమగు వైజయంతి యనుశక్తిని శత్రువధముఁగోరి యాకర్షించెను. ఓరాజా! అర్జునుని వధించుటకై పెక్కువత్సరము లారాధేయునిచే పూజింపఁబడుచు నెయ్యది విలసిల్లెనో, మున్నింద్రుఁడారాధేయునకుఁ గుండలములకు మాఱుగా దేని నొసంగెనో, ఘోరమై ప్రదీప్తమై నాలుకలుగీఁటుచుఁ, బాణములతోఁగూడి యమునిజిహ్వవలె వెలయుచు, మండుచు, నుగ్రమై మృత్యుసోదరినాఁదగి యెయ్యది విరాజిల్లుచుండెనో, యట్టిమహాశక్తి నాకర్ణుఁడాఘటోత్కచునిపైఁ బ్రయోగించెను. ఓరాజా! శత్రుశరీరసంహారకమై యుత్తమమగు నామహాశక్తి, యారాధేయునిబాహుమధ్యమునఁ బ్రజ్వలించుచుండఁగనే చూచి, యాఘటోత్కచుఁడు జడిసి, తనమేను వింధ్యపాదప్రమాణముగాఁ జేసి పరువులిడసాగెను. ఓరాజా! ఆరాధేయుబాహుమధ్యముననున్న యాశక్తిని జూచి, యాకసమున భూతములన్నియు నినాదమొనర్చెను. సుడిగాలులు వీవఁదొడంగెను. పిడుగులువడి పుడమిఁ బ్రవేశించెను. అప్పుడమ్మహాశక్తి ప్రజ్వలించుచు, నారక్కసునిమాయ నడంచి, యగాధమగు వానిహృదయమును భేదించి, యూర్ధ్వముగా వెడలి, యారేయిని జ్వలింపఁజేయుచు నక్షత్రములనడుమఁ బ్రవేశించెను. ఓరాజా! మున్నారక్కసుఁడు వీరులగు రాక్షసులను మానవులను దలపడి, చిత్రములై వివిధములగు శస్త్రములచేఁ జెండాడి, వివిధములగు భైరవారావము లొనర్చి, విక్రమించియు, నపుడిష్టములగు ప్రాణములను విడిచి, యాశక్తిహేతుకముగా మరణించెను. ఇతఁడు శత్రుక్షయమునకుఁగా మఱియొకమహాద్భుతకృత్య మొనరించెను. వినుము. వాఁడటులు శక్తినిర్భిన్నదేహుఁడై నశించుకాలమందును గొప్పమేఘమును గొండనుబోలి తనరూపమును భయంకరముగా నొనరించి, పుడమిఁబడుచుండియుఁ, దనదేహముచే నీసైన్యముఁ గొంతభాగమును నశింపఁజేసెను. ఓరాజా! మహాప్రమాణముగాఁ దనమేను పెంచి పుడమిఁబడుచు నొకయక్షౌహిణీసైన్యముపైఁబడి, తన్మూలమునఁ బాండవులకుఁ

రనిగాని, యాచించిరనిగాని విడువక చంపుచుండిరి. క్రూరమై కురువీర మారణమై కాలప్రేరితమగు నాక్షత్రియనాశమున మనసైనికులెల్లఁ జడిసి పరువులిడసాగిరి. అందుఁ గౌరవులెల్లరును 'ఓవీరులారా! పొండు పొండు. పాండవులకుఁగా నింద్రాదిదేవతలు మనల హింసించుచున్నవారు.' అని మొఱలిడుచు, విపత్సాగరమున మున్గుచున్న వారికి ద్వీపము నాఁదగి యొక్కఁడును గానరాకుండెను. అపు డటు లాసంకులసమర మారంభమై కౌరవసైన్యము భంగమొంది యడఁగి, సైన్యవిభాగము తెలియఁబడకుండుటను, గౌరవు లెవ్వరో, యితరు లెవ్వరో తెలిసికొన వీలుపడకుండెను. ఓరాజా! ఘోరరూపమై మేరమీఱినయాయుపద్రవమున మనవారు శూన్యములగు దెసల నారయుచు, వడిగా నాశస్త్రవర్షమును బ్రవేశించుచున్న రాధేయు నొక్కనినే చూడఁగలిగిరి. అపు డా కర్ణుఁ డారక్కసుని దివ్యమాయను నివారించుచు, శరసమూహముచే నంతరిక్షమును గప్పుచు, దుష్కరమగుకృత్య మొనరించుచు, నతఁ డించుకయు జడియక విక్రమింపసాగెను. ఓరాజా! సైంధవులు బాహ్లీకులు మున్నగువారెల్లరును జడిసియు, నారాధేయునిధైర్యమునకు మెచ్చుచు, రాక్షసునిజయమును దిలకించుచు నుండిరి. అపు డాఘటోత్కచునిచేఁ బ్రయుక్తమగు చక్రయుక్తమైన శతఘ్నిగుఱ్ఱములనాల్గిటి నొక్కమాఱుగా నొప్పింప, నవి మోకాలఁబడి ప్రాణహీనములై, పండ్లు కన్నులు నాలుకలు బయలుపడఁ బుడమిఁబడియెను. పిదప హతాశ్వమగురథము విడిచి, యారాధేయుఁడు ధైర్యశాలియై, కౌరవులు పరువులిడుచుండఁగా, నాఘటోత్కచునిమాయచేఁ దనదివ్యాస్త్రము హతమయినను మోహమందక, ప్రాప్తకాలమును జింతించుచునుండెను. అపుడు కౌరవు లారాధేయుని నారక్కసునిమాయను గాంచి, 'ఓరాధేయా! ధృతరాష్ట్రసుతులు హతులగుచున్నవారు, కావున వడిగా నాఘటోత్కచుని వధింపుము. భీమార్జునులు మమ్మేమియుఁ జేయఁజాలరు. ఈనిశీథమునఁ బాపుఁడగుఘటోత్కచుని వధింపుము. ఘోరరూపమగు నీసంగ్రామమున నీఘటోత్కచునుండి విడివడితిమేని, మాకు విముక్తి గల్గించునాతని నాశ్రయించి, పార్థులతోఁ బోరాడఁగలము. కావున, వాసవదత్తమగుశక్తిచే ఘోరాకారుఁడగు నీరక్కసునిఁ జంపుము. ఓరాధేయా! ఈనిశీథమున నీరాక్షసుఁడు హతుఁడుగానిచో

నింద్రతుల్యులయ్యు నికౌరవయోధు లీతని నోరువఁజాలరు' అని పలికిరి. అటు లారాత్రి జడియుచున్నసైన్యమును గౌరవులగొప్పచప్పుడును దెలిసికొని, తనయింద్రదత్తశక్తి నారక్కసునిపైఁ బ్రయోగింప నిశ్చయించెను. అంత నతఁడు సింహమువలెఁ బ్రతిఘాతమునోరువక కుపితుఁడై, యమోఘమై యుత్తమమగు వైజయంతి యనుశక్తిని శత్రువధముఁగోరి యాకర్షించెను. ఓరాజా! అర్జునుని వధించుటకై పెక్కువత్సరము లారాధేయునిచే పూజింపఁబడుచు నెయ్యది విలసిల్లెనో, మున్నింద్రుఁ డారాధేయునకుఁ గుండలములకు మాఱుగా దేని నొసంగెనో, ఘోరమై ప్రదీప్తమై నాలుకలుగ్రక్కుచుఁ, బాశములతోఁగూడి యమునిజిహ్వవలె వెలయుచు, మండుచు, నుగ్రమై మృత్యుసోదరినాఁదగి యెయ్యది విరాజిల్లుచుండెనో, యట్టిమహాశక్తి నాకర్ణుఁ డాఘటోత్కచునిపైఁ బ్రయోగించెను. ఓరాజా! శత్రుశరీరసంహారకమై యుత్తమమగు నామహాశక్తి, యారాధేయునిబాహుమధ్యమునఁ బ్రజ్వలించుచుండఁగనే చూచి, యాఘటోత్కచుఁడు జడిసి, తనమేను వింధ్యపాదప్రమాణముగాఁజేసి పరువులిడసాగెను. ఓరాజా! ఆరాధేయుబాహుమధ్యముననున్న యాశక్తిని జూచి, యాకసమున భూతములన్నియు నినాదమొనర్చెను. సుడిగాలులు వీవఁదొడంగెను. పిడుగులువడి పుడమిఁ బ్రవేశించెను. అపు డమ్మహాశక్తి ప్రజ్వలించుచు, నారక్కసునిమాయ నడంచి, యగాధమగు వానిహృదయమును భేదించి, యూర్ధ్వముగా వెడలి, యా రేయిని జ్వలింపఁజేయుచు నక్షత్రములనడుమఁ బ్రవేశించెను. ఓరాజా! మున్నారక్కసుఁడు వీరులగు రాక్షసులను మానవులను దలపడి, చిత్రములై వివిధములగుశస్త్రములచేఁ జెండాడి, వివిధములగుభైరవారావము లొనర్చి, విక్రమించియు, నపు డిష్టములగుప్రాణములను విడిచి, యాశక్తిహేతుకముగా మరణించెను. ఇతఁడు శత్రుక్షయమునకుఁగా మఱియొకమహాద్భుతకృత్య మొనరించెను. వినుము. వాఁడటులు శక్తినిర్భిన్నదేహుఁడై నశించుకాలమందును గొప్పమేఘమును గొండనుబోలి తనరూపమును భయంకరముగా నొనరించి, పుడమిఁబడుచుండియుఁ, దనదేహముచే నీసైన్యమునఁ గొంతభాగమును నశింపఁజేసెను. ఓరాజా! మహాప్రమాణముగాఁ దనమేను పెంచి పుడమిఁ బడుచు నొకయక్షౌహిణీసైన్యముపైఁబడి, తన్మూలమునఁ బాండవులకుఁ

బ్రియ మొనర్చి ప్రాణములను విడిచెను. అంతఁ గౌరవులెల్లరును గలిసి సంతుష్టాంతరంగులై, సింహనాదము లొనర్చిరి. భేరీమృదంగానకాదులు మ్రోగెను. అటు లారాక్షసుఁడును, వానిమాయయు నిహతమగుట నారసి, మున్నా వృత్రవధమున దేవత లింద్రు నివలెఁ గౌరవులందఱును గర్ణుని సన్నుతించిరి. పిదప నతఁడు నీతనయునిరథ మధిరోహించి, నిజ సైన్యమును బ్రవేశించె" నని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

## ఇంద్రశక్తి నశించుటకుఁ గృష్ణుఁడు సంతసించుట

"ఓరాజా! కూలినకొండవలెఁ బుడమిఁబడిన హైడింబునిఁగాంచి, పాండవులెల్లఁ గన్నీ రేఱులుగాఁ బ్రవహింప దుఃఖాక్రాంతులైరి. కాని వాసుదేవుఁడుమాత్ర మమందానందభరితుఁడై, పాండవులకు మనో వ్యథయగునట్లుగా సింహనాద మొనరించెను. అటు లొనర్చి, తేజిపగ్గ ములు విడిచి, యర్జునుఁ గౌఁగిలించికొని, గాలిచేఁ గదలువృక్షమువలె సంతోషపరవశుఁడై గంతులువైచుచు, మఱియు నాతనినాలింగన మొన ర్చుచుఁ, బలుమఱునాతనివీపు చఱచుచు, రథమధ్యముననిలిచి,మఱియు సింహనాద మొనరించెను. ఓరాజా! అపు డాధనంజయుఁ డక్కేశవుని సంతోషమును దిలకించి, చింతాక్రాంతుఁడగుచు, నాతనితో 'ఓమధు సూదనా! నీవిపు డిట్టు లతిహర్ష మొందుటకు సమయముకాదు. ఘటో త్కచుఁడు హతుఁడగుట, నిది శోకస్థానమైయున్నది. వాఁడు మరణిం చుటను మనసైన్యములన్నియు విముఖములై యున్నవి. మఱియు, వాని పతనముచే మనముసైత ముద్వేగ మొందవలసివచ్చెను. ఓజనార్దనా! నీవు సంతసించుట కించుకేనిఁ గారణము గానరాకున్నయది. కావున, నోసత్యనిధీ! ఇపు డీవు సంతసించుటకు నిమిత్తమును సత్యముగాఁ దెలు పుము. రహస్యముగాదేని వినఁగోరుచున్నవాఁడను. ఓమధుసూదనా! సముద్రపుసంక్షోభమును, మేరువుచలనమును బోలిన మాహాధైర్యపు వికారమున కిది స్థానమైయుండ, నీవిపుడు సంతసింపనేటికి? నీ యీ కృత్య మతిపేలవమని తలంచుచున్నాఁడను.' అని పలికెను.

అదివిని యవ్వాసుదేవుఁ డాతనితో 'ఓయర్జునా! ఇపుడు నా మదికి స్వాస్థ్యమును గల్గించుచు, నుత్తమమగు సంతోష మొదవుటకుఁ దగునిమిత్త మెఱిఁగించెదను. వినుము, ఓధనంజయా! రాధేయుని

యిమ్మహాశక్తి ఘటోత్కచునిమూలమున వ్యయపడుట, నిపుడు యుద్ధమునఁ గర్ణుఁడు హతుఁడయ్యెనని తలంపుము. యుద్ధమునఁ గుమారస్వామినాఁడగు నారాధేయుఁడు, శక్తిని గేలఁబూనియుండ, వానియెదుట నిలుచుమగవాఁ డీలోకమున లేఁడు. మఱియు వీఁడు దైవవశముగాఁ గవచహీనుఁడును, నటులే కుండలహీనుఁడునై, యిపు డీఘటోత్కచునిచేఁ జెఱుపఁబడి, శక్తియు లేనివాఁడయ్యెను. వీఁడు కవచముతోడను గుండలములతోడను గూడియుండెనేని, దేవతలతోఁగూడియున్న మూఁడులోకములను జయింపఁగల్గును. అట్టి వీని నావాసవుఁడును, గుబేరుఁడును, వరుణుఁడును, యముఁడును రణరంగమున నెదుర్కొనఁజాలకుండెడివారు. ఇంతయేల! గాండివధరుఁడవై నీవును జక్రహస్తుఁడనై నేనును, వీనిని జయింపఁజాలకుండుదుము. మహాత్ముఁడగు నింద్రుఁడు నీహితముఁగోరియే వీనిని గవచకుండలహీనునిఁగా నొనర్చెను. అవ్వాసవునిమాయ తెలియక, యీరాధేయుఁడు తనకవచమును, గుండలములను నొలిచియిచ్చినవాఁడు. కావుననే యీతనికి వైకర్తనుఁ డనుపేరు గలిగెను. మంత్రతేజముచేఁ గదలనేరక కుపితమైయున్నసర్పమువలె నున్నకర్ణుఁ డిపుడు జ్వాలలు చల్లారినయగ్నివలె వెలయుచున్నవాఁడు. ఓమహాబాహూ! ఇపు డీఘటోత్కచునిపైఁ బ్రయుక్తమైనయీశక్తి, మహాత్ముఁడగువాసవునిచే నెపుడు గుండలములకును గవచమునకునుగాఁ గర్ణున కొసంగఁబడియెనో, నాఁటినుండి యీరాధేయుఁడు రణరంగమున నిన్నుఁ జంపఁబడినవానిఁగాఁ దలంచియున్నవాఁడు. ఇటులైనను వీఁడు నీకుఁదక్క వేఱొక్కనికి జయింపశక్యముగానివాఁడు. ఇది నిశ్చయమని ప్రమాణముచేసి చెప్పుచున్నవాఁడను. ఓయర్జునా! మఱియు వీఁడడవిలో మత్తమాతంగయూథములను సింగమువలె సోత్సాహుఁడై, శరశరాసనములఁ బూని రణరంగమున రథికోత్తములనెల్ల గర్వహీనులఁగా నొనర్పఁదగువాఁడు. బ్రహ్మణ్యుఁడును, సత్యవాదియుఁ, దపస్వియు, నియతవ్రతుఁడునై, వైరులయెడ దయగలవాఁడు నగుట, నీతనికి వృషుఁడని పేరు గలిగెను. ఓపురుషవ్యాఘ్రా! మధ్యందినమార్తండునివలె, మహాత్ములగు నీయోధముఖ్యులకుఁ దేఱిచూడరాక, శరసహస్రమనెడి సహస్రకిరణములతో వెలయుచు, శరత్కాలభాస్కరుఁడునాఁదగి వర్షకాలమేఘమువోలె శర

ధారలను మఱిమఱియుఁ గురియుచుఁ, బర్జన్యుఁడునా దివ్యాస్త్రములను వర్షించుచు, మాంసశోణితములు స్రవించునట్లుగా శరవర్షమును గురియుచు, దేవతలకేని జయింపవలనుపడక యుండెడివాఁడు. ఓపార్థా! కవచకుండలహీనుఁడై యిపు డింద్రదత్తమగుశక్తిచెడ, సాధారణమానుషత్వమొందెను. వీనిని జంపుట కొక్కటియే యుపాయముగల దది వినుము. వీనిరథచక్రము మునుఁగ, వీఁడు దురవస్థనొందియుండఁగా, నప్రమత్తుఁడవై నీవు నాసంజ్ఞను గ్రహించి, ప్రమాదముగానుండు వీని సమయమును గనిపెట్టి చంపవలయును. వీఁడు యుద్ధమున నాయుధముపట్టికొనియుండెనేని, వజ్రాయుధధారియగు నాయింద్రుఁడైనను వీనిని జంపఁజాలఁడు. ఓపార్థా! నేను నీహితముఁగోరియే, యాయాయుపాయములచే, మున్నా చేదిరాజగు జరాసంధుని, మహాబాహుఁడగు నేకలవ్యునిఁ జంపించితిని. మఱియు మీహితమునకే రాక్షసోత్తములగుహిడింబకిమ్మీరబకప్రభృతులు చంపింపఁబడిరి. అటులే వైరిసేనావమర్దియగు నలాయుధుఁడును, నుగ్రకర్ముఁడగు ఘటోత్కచుఁడును నాచేతనే చంపింపఁబడిరి.' అని తెలుప వాసుదేవునితో మఱియు నయ్యర్జునుఁ డిట్లుపలికె" నని తెలిపి సంజయుఁ డిట్లనియె.

## కృష్ణుఁడు జరాసంధాదు లజేయులని తెలుపుట

"ఓరాజా! అవ్వాసుదేవువచనము లాలించి పార్థుఁ డాతనితో 'ఓదేవా! మాహితమునకై, యేయే యుపాయములచే జరాసంధాదులగుపృథివీశ్వరులు చంపింపఁబడిరి?' అని ప్రశ్నింపఁగా, నప్పురుషోత్తముఁ డాతనితో నిట్లు తెలిపెను.

"ఓపార్థా! చేదిరాజగు జరాసంధుఁడును, మహాబలుఁడగు నేకలవ్యుఁడును, మున్నే హతులుగాకుందురేని, యిపుడు భయంకరులై యుండెడివారు. వారు బ్రతికియుందురేని, సుయోధనుఁడు రథికోత్తములగువారిని గోరక తప్పఁడు. మనకు నిత్యవైరులైన, వా రాకౌరవేశ్వరు నాశ్రయింపక తప్పరు. మహేష్వాసులును గృతాస్త్రులును దృఢయోధులునునగు, నాజరాసంధాదులెల్లరును, దేవతలువలె నాసుయోధను రక్షింపకమానరు. అటులగుట నీరాధేయుఁడును, జరాసంధుఁడును, నేకలవ్యుఁడును సుయోధను నాశ్రయించి, యిప్పుడమినెల్ల జయించి

యుందురు. ఓధనంజయా! వా రేయేయుపాయములచేఁ జంపింపఁబడిరో తెలిపెదను వినుము. వారి నాదేవతలే, నుపాయములేక జయింపఁజాలరు. ఓపార్థా! సమరమున, వారిలో నొక్కొక్కఁడును, లోకపాలాభిరక్షితమగు సకలసురసైన్యమును దలపడి పోరాడఁగలవాఁడు. ఓయీ! ఆజరాసంధుఁడు బలరామునిచేఁ గదల్పఁబడి, కుపితుఁడై మమ్మునెల్ల వధించుటకై సర్వఘాతినియగు నొకగదను బ్రయోగించెను. అయ్యది యాకసమునకుఁ బాపటగూర్చుచు, నగ్నిప్రభతో నింద్రప్రయుక్తమగునశనివలెఁ బఱచుచుఁ గానవచ్చెను. అటులు తనపైకి వచ్చుచున్న యాగదను గాంచి, యాబలరాముఁడు, దానిని ఖండించుటకై, స్థూణాకర్ణమను నొకయస్త్రమును బ్రయోగించెను. అపు డాయస్త్రవేగముచే నాగద ప్రహతమై, పుడమి బ్రద్దలుగాఁ, బర్వతములను జలింపఁజేయుచు నేలఁబడియెను. ఓయర్జునా! వాఁ డిద్దఱతల్లులదేహములనుండి వేఱువేఱుగా జనించి, యవక్రవిక్రమయగు జరయనెడిఘోరరాక్షసిచే సంధింపఁబడి, యొకరూపమొందుటను జరాసంధుఁ డనెడిపేరు వడసెను. ఓపార్థా! ఆస్థూణాకర్ణ మనెడియస్త్రముచేతను, బుడమిఁబడిన గదచేతను నారాక్షసి, సపుత్రబాంధవముగా నశించెను. ఓయర్జునా! అటు లాగద నశించుటచే నాజరాసంధుఁడు సమరమున నీవు గాంచుచుండఁగనే భీమునిచేఁ జంపఁబడియెను. ఓయీ! ప్రతాపశాలియగు నాజరాసంధుఁడే గదాహస్తుఁడై యుండెనేని, వాని నా దేవేంద్రాదిదేవతలును జంపఁజాలరని తెలుపవచ్చును. మఱియు నీహితమునకై ద్రోణుని గురుదక్షిణయనెడినెపముచే సత్యవిక్రముఁడగు నాయేకలవ్యుని చేతిబొట్టనవ్రేలు ఖండితమగునట్లుగా నొనరింపించితిని. దృఢవిక్రముఁడగు నాయేకలవ్యుఁడు, బద్ధాంగుళిత్రాణుఁడై యున్నకాలమున, నతిగర్వితుఁడై వనచారియగు రెండవశ్రీరాముఁడువలెఁ జరించెను. వాఁడంగుష్ఠముగల్గి యుండెనేని దేవతలును వానిని జయింపఁజాలరు. అటులు దేవదానవాదులేని వానిని జయింపఁజాలకున్నచో, మానుషమాత్రుఁడు వానిని దేఱిచూచుటకేనిఁ దగఁడని తెలుపనక్కఱలేదుగదా! వాఁడు దృఢముష్టియు, నిపుణుఁడునునై, నిత్యము శరప్రయోగము నభ్యసించుచునే యుండెడివాఁడు. మఱియు నీహితముఁగోరియే, సంగ్రామమున విక్రమించినచేదినాథునిఁ జంపితిని. అది నీప్రత్యక్షమున జరిగినదియగదా!

వాఁడును సకలసురాసురులకును సమరమున నోరువరానివాఁ డనక తప్పదు. వానిని, మఱికొందఱరక్కసులను, వధించుటకే యవతరించి, నీసహాయమున లోకమునకు హితమొనర్పువాఁడ నైతిని. మఱియు హిడింబ, కిమ్మీర, బకులను భీమునిచేఁ జంపించితిని. ఆరక్కసులు రావణతుల్యపరాక్రములై, బ్రహ్మయజ్ఞవినాశకులై యుండెడివారు గాదే! అటులే,మాయావియగు నలాయుధుఁడు ఘటోత్కచునిచేఁ జంపబడియెను. ఆఘటోత్కచుఁడును, నుపాయముగా రాధేయు నమోఘశక్తిచేఁ బుడమిఁ బడఁద్రోయింపఁ బడియెను. ఇమ్మహాసంగ్రామమున నీరాధేయుఁడు తనశక్తిచే నీఘటోత్కచునిఁ జంపకుండెనేని, వీనిని నేను జంపవలసివచ్చును, మీకుఁ బ్రియమొనర్పఁగనే మున్ను వీనిని నేను జంపక విడిచితిని. ఈరాక్షసుఁడు బ్రాహ్మణద్వేషియు యజ్ఞవిరోధియునై యాగములను జెఱుచునట్టిపాపుఁడు. కావున వీని నిట్లు పడఁద్రోయించితిని. అంతియగాక, వీనిమూలమున నింద్రదత్తమగుశక్తియు నశింపఁజేయఁబడియెను. ఓపాండవా ! ఎవ్వరు ధర్మమునకు లోపము గల్గింతురో, వారు నాకు వధ్యులుగదా ! ధర్మసంస్థాపనమునకై నేను బ్రతిజ్ఞచేసియున్నవాఁడను. వేదము, సత్యము, దమము, శౌచము, ధర్మము, బిడియము, లక్ష్మియు, ధైర్యము, శాంతియు నెందెందుఁగల్గియుండునో, యందు నేను నిత్యము నివసింతును. నీవుకర్ణునెడఁ బ్రమాదపడియుండఁ జనదు. వానిని నీవెట్టులోరువఁగల్గుదువో, యట్టియుపాయముపదేశించెదను. భీముఁడును నీరణరంగమున సుయోధనునిఁ జంపును. ఆభీమునకును సుయోధను వధించునుపాయ మెఱిఁగింతును. శత్రుసైన్యమున సంకులశబ్దము పెచ్చుపెఱుగుచున్నయది. మీసైన్యములు పదిదిక్కులకును బరువులిడుచున్నవి. కౌరవులు గుఱివెట్టి నీసైన్యమును బీడించుచున్నవారు. మనల నీద్రోణుఁడు దహించుచునే యున్నవాఁడు గదా!' అనిపలికె"నని తెలుప విని ధృతరాష్ట్రుఁడా సంజయునితో నిట్లనియె.

## కృష్ణుఁడు సాత్యకికిఁ దనసంతోషనిమిత్తము దెల్పుట

"ఓసంజయా! ఆరాధేయునిమహాశక్తి యొకవీరుని వధించుటచే వ్యర్థమొనర్పఁబడియెనుగదా! వాఁడెల్లయోధులను విడిచియప్పార్థునిపై దాని నేల ప్రయోగింపఁడయ్యెను? అయ్యర్జునుఁడొక్కఁడునునాశక్తిచే

హతుఁడయ్యేనేని, పాండవులును సృంజయులును హతులై యుందురే! ఫాల్గునినే చంపఁగల్గెనేని యుద్ధమున జయ మేల సంభవింపదు? ఆయర్జునుఁ డొకనిచేఁ బిలువఁబడి, యుద్ధమున నివర్తింపననిగదా ప్రతిజ్ఞయొనర్చిన వాఁడు. వాని నారాధేయుఁడు తనంతఁదా నేల పిలువఁడయ్యెను? అటు లాతని, యుద్ధమునకు రమ్మని, యింద్రదత్తమగుశక్తిచే నేల చంపకుం డెనో? అది నాకెఱిఁగింపుము. ఓసంజయా! నాకొడుకు నిశ్చయముగా బుద్ధిహీనుఁడును నసహాయుఁడునై వైరులచేఁ బీడితుఁడుగాక తప్పదు. వాఁడెట్లు శత్రుల జయింపఁగల్గును? అయ్యో! జయమునకు ముఖ్య హేతువైన యారాధేయుని యమోఘశక్తి వాసుదేవునిచే ఘటోత్క చునిమూలమున వ్యర్థముగాఁ జేయఁబడియెను. సొట్టచేయివానిచేతిలో నున్నఫలమును బలవంతుఁడు లాగికొన్నట్లుగా, నమోఘశక్తి ఘటో త్కచునిఁ జంపించి వాసుదేవునిచే వ్యర్థముగాఁ జేయఁబడెను. ఓసం జయా! పందియుఁ గుక్కయుఁ బోరాడి యందేది నశించినను, చండాలు నకు లాభమైనట్లుగాఁ, గర్ణఘటోత్కచులలో నెవ్వఁడు చచ్చినను నా వాసుదేవునకు లాభమే యగుచున్నది. ఘటోత్కచుఁడే కర్ణుని సమర మున సమయించెనా! పాండవులకు గొప్పలాభము చేసినవాఁడగును. లేక రాధేయుఁడే యాఘటోత్కచుని వధించెనా! శక్తినాశముచేఁ దనపని నెఱవేఱును. ఇదియెల్లఁ బ్రాజ్ఞుఁడగువాసుదేవుఁ డాలోచించియే కర్ణు నిపై ఘటోత్కచునిఁ బ్రేరించి, పాండవులకు హితముసేయువాఁడై, ఘటోత్కచునిఁ గర్ణునిచేఁ జంపించెను."

అది విని సంజయుఁడు మఱియు నాధృతరాష్ట్రునితో "ఓరాజా! మధుసూదనుఁ డిదియెల్ల నెఱిఁగియే కర్ణునితో ద్వంద్వయుద్ధమునకు ఘటోత్కచునిఁ బ్రోత్సహించి పంపెను. కర్ణుని యమోఘశక్తి విఘాత మొందెను, ఇదియెల్ల నీదురాలోచనవలనఁ గల్గినదియే. ఓరాజా! వాసు దేవుఁ డావిధముగాఁ గర్ణునుండి పార్థుని రక్షింపఁడేని, మన మపుడే కార్యసిద్ధి వడసినవార మగుదుము. పార్థుఁడు గజరథాశ్వసమేతముగా హతుఁడై నశింపవలసివచ్చును. ఉపాయశాలియై ప్రభుఁడగుజనార్దనుఁ డాయాయుపాయములచే నర్జును రక్షింపఁడేని, వానిని జయించుటెంత పని? అప్పార్థుఁడు వాసుదేవరక్షితుఁడై యెదుటఁబడినవైరుల నెల్ల జయించుచున్నవాఁడు. అందును విశేషించి యిపు డీ యమోఘశక్తినుండి,

పార్థుని వాసుదేవుఁడు రక్షించెను. ఇది యిటులుగాదేని, వానిశక్తిచే విఱుగువడినచెట్టువలెఁ బార్థుఁడు వడిగా హతుఁడు గావలసియుండును." అని తెలిపెను.

అది విని మఱియు నాధృతరాష్ట్రుఁ డాతనితో "ఓసంజయా! నాకొమరుఁడు ప్రాజ్ఞుఁడనని గర్వించుచు, విరోధశీలియై సదాలోచన లేనివాఁ డనవలసియున్నది. కానిచో పాండవజయ మొదవించునట్టి యీవధోపాయమును బోఁగొట్టుకొనునా? అది యటుండనిమ్ము. మహాబుద్ధిశాలియు, శస్త్రవేత్తలలో నుత్తముఁడునగు నారాధేయుఁ, డాధనంజయుపై నాయమోఘశక్తి నేల ప్రయోగింపఁడయ్యెను? ఓసంజయా! ఆమహాయుద్ధమున నీవే నావిషయమును వారికి బోధింపవైతివా? అయ్యో! తగుసమయమున నుపేక్షించి, ఫలము చెఱచితివే!" అని పలికెను.

అంత నాసంజయుఁడు ధృతరాష్ట్రునితో "ఓరాజా! సుయోధనుఁడును, శకునియు, దుశ్శాసనుఁడును, నేనును బ్రతిదినము నారాధేయునితో 'ఓకర్ణా! సకలసైన్యమును విడిచి ధనంజయుని వధింపుము. అటులేనిఁ బాండవులను బాంచాలురను దాసులఁగాఁజేసి యనుభవింపఁగలము. లేక కృష్ణునేనిఁ జంపుము. అదియే యుత్తమమార్గము. ఒకప్పుడర్జునుని నీవు చంపినను, గృష్ణుఁడున్నచోఁ దక్కినపాండవులలో నెవ్వనినే నతఁడు రాజ్యమున నిలుపును. మఱియు నిప్పాండవసైన్యవృక్షమునకు గృష్ణుఁడే మూలమువంటివాఁడు. అర్జునుఁడు స్కంధము. తక్కినపాండవులును బాంచాలురును బత్రములవంటివారు. పాండవులు కృష్ణాశ్రయులును, గృష్ణుఁడే బలముగగలవారును, నతఁడే యధీశుఁడుగ నున్నవారునునై యుండిరిగాదే! నక్షత్రములకుఁ జంద్రుఁడు వలెఁ బాండవులకుఁ గృష్ణుఁడే బరమస్థానము. కావున నోరాధేయా! పత్రములను శాఖలను స్కంధమును విడిచి, యెల్లవిధములఁ బాండవులకు మూలమనఁదగుకృష్ణునిఁ జంపుము.' అని బోధించుచునే యుంటిమి" అని తెలిపి మఱియు నాతనితో నిట్లనియె.

"ఓయాంబికేయా! యాదవాధీశుఁడగు నాదాశార్హునిఁ గర్ణుఁడు చంపియుండెనేని, యివ్వసుమతియెల్ల నీవశమైయుండెడిని. అందులకు సందియము లేదు. యదుపాండవసమ్మోదకారియై మహాత్ముఁడగు నతఁడే

పుడమిఁబడియుండెనేని, చతుస్సముద్రముద్రితమగు నిప్పుడమియెల్ల నీకు వశము గాకుండునా? అట్టిబుద్ధి యారాధేయున కెల్లపుడును గలదు. కాని, దేవేశ్వరుఁడు నప్రమేయుఁడునగు హృషీకేశుఁడు జాగరూకుఁడై యుండుటను, గర్ణునకు మోహము గల్గెను. అవ్వాసుదేవుఁడాయర్జును నెల్లపుడును రక్షించుచునే యుండును. అటులగుటనే యొకపుడును నాయర్జును నారాధేయునెదుటఁ బడకుండఁ జేయుచువచ్చెను. ఆయచ్యుతుఁ డెపుడును గర్ణునిశక్తి నెట్లు వ్యర్థము చేయువాఁడనని చింతించుచు, నారాధేయుతోఁ బోరాడ నితరరథికులనే పురికొల్పుచువచ్చెను. ఓరాజా! మహాబుద్ధిశాలియగు కృష్ణుఁడు, కర్ణునుండి పార్థుని రక్షించుటలో వింత యేమిగలదు? ఆపురుషోత్తముఁడు తన్నుఁదాను రక్షించుకొనకుండునా? ఓప్రభూ! ఎంత చింతించినను, వైరిమారకుఁడగు నాజనార్దను నిమ్ముల్లోకములందును జయించువీరుఁడు గానరాఁడుగదా!

ఓరాజా! పిమ్మట సత్యవిక్రముఁడగు సాత్యకి, మహాబాహుఁడగు నవ్వాసుదేవునిఁ గాంచి 'ఓదేవా! నాకొకటి తెలుపుము. అమితశక్తి గలశక్తి యొకటి కర్ణునకుఁ గలదని ప్రతీతి యున్నదిగదా! ఆరాధేయుఁ డాశక్తినిఁ బార్థునిపై నేల విడువఁడయ్యెను?' అని ప్రశ్నించెను. అది విని వాసుదేవుఁడు 'ఓసాత్యకీ! దుర్యోధనదుశ్శాసన,శకుని, కర్ణ,సైంధవు లేవురునుగూడి, యెల్లపుడు నాలోచించుచుండెడివారు. అపుడారాధేయునితో 'ఓకర్ణా! కర్ణా! మహారథుఁడగు పార్థునిపైఁదప్ప వేఱొకనిపై నీమహాశక్తిని బ్రయోగింపవలదు సుమీ! దేవతలలో నింద్రుఁడువలె, వాఁడు పాండవులలోనెల్లఁ గీర్తిస్థానమైనవాఁడు. అప్పార్థుఁడు నిహతుఁడగునేని,సృంజయులతోఁగూడ సకలపాండవులును,నగ్నిశూన్యులగు దేవతలువలె నిస్సారులగుదురు.' అని తెలుప వాఁడును నటులే యని ప్రతిజ్ఞచేసెను. ఓశినిపుంగవా! అప్పార్థుని రాధేయువధము నిత్యము నాహృదయమున స్థిరమైయున్నది. నేనేయారాధేయుని మోహపెట్టితిని. అటులగుట నాశ్వేతవాహనుఁడగు పాండవునిపై నాకర్ణుఁడు శక్తిని బ్రయోగింపఁడయ్యెను. ఓవీరాగ్రణీ! యుద్ధాభిలాషియగు నయ్యర్జునుని యామృత్యువు దప్పించునంతకును, నాచిత్తమునకు సంతోషమును నిద్రయుఁ గలుగకుండెను. ఓశైనేయా! ఘటోత్కచునం దారాధేయుశక్తి ప్రయుక్తమై ధ్వంసమొందుటను గాంచి, యిపుడు

పార్థుఁడు మృత్యుముఖమునుండి విముక్తుఁడైన ట్లూహించుచున్నాఁడను. ఓయీ! పార్థుని రక్షించుటలోఁ గలయాదరము, తలిదండ్రులను గాని, సోదరులగు మిమ్ములనుగాని, నాప్రాణములనుగాని రక్షించుటందు నాకు లేదని నమ్ముము. ఓసాత్యకీ! పార్థుఁడు లేనియెడఁ త్రైలోక్యాధిపత్యమునకన్న దుర్లభమయినదియును నాకు రుచింపదు. ఓతమ్ముఁడా! ఇపుడు త్రైలోకాధిపత్యము లభించుటకన్నను గొప్ప సంతోషము గల్గెను. ధనంజయుఁ డిపుడు చచ్చి బ్రదికెనని తలంచి సంతసించుచున్నాఁడను. అందులకే నేనాఘటోత్కచునిఁ గర్ణునిపైకిఁ బంపితిని. రాత్రిసమరమున రాధేయుని బాధించువాఁ డాఘటోత్కచుఁడు తప్ప వేఱొకఁడు లేఁడు.'

ఓరాజా! పైరీతిగా నావాసుదేవుఁ డాసాత్యకితోఁ బలికి, ధనంజయుని హితముగోరి, వానిప్రియమునే యెల్లపుడును జేయువాఁడై యుండె"నని తెలుప విని ధృతరాష్ట్రుఁ డాసంజయునితో ని ట్లనియె.

## ఘటోత్కచునికై దుఃఖించుధర్మజుని వ్యాసుఁ డూరార్చుట

"ఓసంజయా! కర్ణదుర్యోధనులును, శకునిదుశ్శాసనులును, విశేషించి నీవును గొప్పయపనయమును జరిగించితిరి. ఆరాధేయునిశక్తి యేకవీరఘ్నియని యెపుడును దెలిసియేయుంటిరి. మఱియు నది యనివార్యమై యింద్రాదిదేవతలకును నసహ్యమైయుండుట యు నెఱుంగుదురు. అయ్యది కర్ణుఁడొనరించుయుద్ధములో నవ్వాసుదేవార్జునులలో నొకనిపై నేనిఁ బ్రయోగింపఁబడకుండుట నిందింపఁదగినవిషయమైయున్నయది. మీ రేల యటు లొనర్పకుంటిరి?"

అది విని సంజయుఁ డాతనితో 'ఓరాజా! యుద్ధ మారంభమైనది మొదలుగాఁ బ్రతిదినము యుద్ధమునుండి మరలఁగనే రాత్రి మేమెల్లఁ గూడి యాలోచించి 'ఓకర్ణా! తే పటియుద్ధమునఁ దప్పక నీయమోఘశక్తి నప్పార్థునిపైఁగాని, కృష్ణునిపైఁగాని ప్రయోగింపుము' అని బోధించుచునే యుంటిమి. ఓరాజా! అదియేమోగాని తెల్లగాఱఁగనే, యారాధేయునకును దక్కినయోధులకును నట్టిబుద్ధియే నశించెడిది. అయ్యది దైవతములచేఁ జేయఁబడియుండును. ఆరాధేయుఁడు తన హస్తమందున్నశక్తిచేఁ గృష్ణార్జునులలో నొక్కనిఁ జంపకుండుట చూడ,

దైవమే యెందులకుఁ బరమనిమిత్తమని తలంచుచున్నాఁడను. అమ్మహా శక్తి కాలరాత్రివలె ధరింపఁబడియు, నతఁడు దైవోపహతబుద్ధియగుటఁ, బార్థునిపైఁ బ్రయోగింపఁబడదయ్యెను. దేవమాయచేతనే యతఁ డావాసుదేవార్జునులలోనొక్కనిపై నేనిదానిని బ్రయోగింపఁడయ్యెను" అని తెలుప విని ధృతరాష్ట్రుఁడు మఱియు నాతనితో "ఓసంజయా! దైవోపహతులయిన మీబుద్ధిచేతను, వాసుదేవునిచేతను, నాయింద్ర శక్తి ఘటోత్కచునిఁ జంపి తృణమయ్యెను. ఈయపమార్గముచేఁ గర్ణుఁ డును నాకొమరులును నింకనుగలయోధులును యమమందిరము నొంద వలసినవారైరి. ఆఘటోత్కచుఁడు నిహతుఁడైనపిదపఁ గురుపాండవులకు మరల యుద్ధ మెటులు జరిగెనో తెలుపుము. మఱియు వ్యూహముగా నేర్పడి యాద్రోణునిఁ దలపడినస్సృంజయపాంచాలురను నెట్లు పోరాడిరి? భూరిశ్రవసునియు సైంధవునియు మరణముచేఁ గుపితుఁడై జీవితేచ్ఛ విడిచి, నోరుతెఱచినబెబ్బులిబోలియుఁ, గుపితుఁడైన యమునిఁ బోలియు వారిసైన్యమును జొచ్చు నాభారద్వాజునిపై నప్పాంచాల సృంజయు లెట్లు తలపడిరి? ద్రోణరక్షకులైన సుయోధనుఁడును, గర్ణ కృపాశ్వత్థామలును యుద్ధమున నెట్లు ప్రవర్తించిరి ? భారద్వాజుని వధించువారైన భీమార్జునులను, మనవారేమిచేసిరి? నా కెఱిఁగింపుము. సైంధవునివధముచే మనవారును, ఘటోత్కచునివధముచేఁ బాండవులును గుపితులై విజృంభించి యెట్లు యుద్ధమొనరించిరి?"

అది విని సంజయుఁ డాధృతరాష్ట్రునితో "ఓరాజా! ఆరాతిరి రాక్షసోత్తముఁడగు ఘటోత్కచుఁడు హతుఁడగుట, నీవారు ప్రహృష్టులై! సింహనాదములొనర్చుచు, యుద్ధోత్సాహులై, వడిగాఁ దనసైన్యములపైఁ బడుచుండఁగాఁ, దనసైన్యము వధ్యమానమగుచుండుటను, నాగాఢరాత్రి నాయుధిష్ఠిరుఁ డెంతయు దైన్యమొదవ భీమసేనునితో 'ఓమహాబాహూ! ధార్తరాష్ట్రసైన్యమును నివారింపుము. ఘటోత్కచునివధముచే నాకెంతయు మోహమొదవుచున్నది' అని యాజ్ఞాపించి, యతఁడు రథముపైఁ గూలఁబడి, కన్నీళుల మొగము దడియ, మఱిమఱియు నిట్టూర్పులిడుచు, ఘోరమగు నారాధేయునివిక్రమముఁగాంచి మూర్ఛానిష్ఠుఁడయ్యెను. అటులు శోకగ్రస్తుఁడైయున్న యుధిష్ఠిరు నారసి వాసుదేవుఁడు 'ఓధర్మజా! దుఃఖింపకుము. నీకిది తగదు. ప్రాకృతుని

వలె నీవిటులు పరితపింపరాదు. ఓరాజా! లెమ్ము. యుద్ధమొనర్పుము. ఈ గొప్పభారమును వహింపుము. నీవిట్లు వివశుఁడవై యుంటివేని, జయము సంశయగ్రస్తమగుచున్నది.' అని తెలిపెను. అవ్వ్యాసుదేవువచనమును విని యుధిష్ఠిరుఁడు, కన్నీళులఁ దుడిచికొని, మఱియు నాకృష్ణునితో 'ఓ మహాబాహూ! ధర్మముపరమగతి నే నెఱుంగుదును. ఒకరొనర్చినయుప కార మెవ్వఁడు మఱచునో, వాఁడు బ్రహ్మహత్యాఫల మొందుచున్న వాఁడు.ఓజనార్దనా! మేము వనవాస మొనరించుతఱి మహాత్ముఁడగుఘటో త్కచుఁడు బాలుఁడయ్యు నెంతే సుపకార మొనరించెను. ఓకృష్ణా! అస్త్ర సంపాదనమునకై యర్జునుఁడు వెడలుటఁ దెలిసికొని,మహేష్వాసుఁడగు నితఁడు కామ్యకవనమందున్న మాకడకు వచ్చి, యర్జునుఁ డచ్చోటికి వచ్చునంతకును మమ్ము విడువక యండే సహాయుఁడై యుండెను. గంధ మాదనయాత్రలో మాకుఁ దోడ్పడై కష్టములనుండి మ మ్ముద్ధరించెను. మఱియు, నొకపు డలసియున్న ద్రౌపదిని దనబుజముపైఁ బెట్టుకొని మో సెను.అంతియగాక యుద్ధాభిజ్ఞుఁడై, మానిమిత్తముగఁ నద్భుతమగుకృత్య మొనరించెను. ఓజనార్దనా! సహజముగా నాకానహదేవునిపై నెట్టిప్రీతి గలదో, అంతకురెట్టియగు ప్రీతి యారాక్షసేంద్రుఁడగు ఘటోత్కచుని పైఁ గలదని నమ్ముము. ఓవార్ష్ణేయా! అమ్మహాబాహుఁడగు ఘటోత్క చుఁడు నాకుభక్తుఁడును, బ్రియుఁడును నగుట, నేను వానిపైఁబ్రియము గల్గియుంటిని. అటులగుటనే శోకతప్తుఁడనై మూర్ఛావిష్టుఁడ నగు చున్నవాఁడను. ఓదేవా! అదె చూడుము. కౌరవులచే మనసైన్యము లెటులు తఱుమఁబడుచున్నవో! మహారథులగు ద్రోణకర్ణు లెటులు యుద్ధ మునకు సన్నద్ధులై యున్నవారో గనుఁగొనుము. ఈనిశీథమునఁ బాండవ సైన్యము మర్దింపఁబడుట చూచితివా? ఆద్రోణరాధేయు లిరువురును, మదించినయేన్గులు పద్మవనమునువలె, భీమసేనునిబలమునైత మాదరింప కున్నవారు. పార్థుని చిత్రాస్త్రప్రయోగమును లక్ష్యపెట్టక కౌరవు లదె విక్రమించుచున్నవారు. ఈద్రోణరాధేయులును సుయోధ నుఁడును యుద్ధమున ఘటోత్కచుఁడు హతుఁడగుట కెంతయు సంత సించుచు గంతులిడుచున్నారు. ఓజనార్దనా! నీవును మేమును జీవించి యుండఁగాఁ గర్ణునిచేఁ దలపడి యాఘటోత్కచుఁడు నశించుట వింతగాదే?

ఓకృష్ణా! మనలనెల్ల వ్యర్థులఁగాఁజేసి సవ్యసాచి చూచుచుండఁగా, మహాబలుఁడగు నాఘటోత్కచు నారాధేయుఁడు వధించెను. ఓదేవా! దురాత్ములగు ధార్తరాష్ట్రు లభిమన్యునిఁ జంపునపుడు మహారథుఁడగు నర్జునుఁ డందు లేఁడయ్యెను. మహాత్ముఁడగుసైంధవుఁ డపుడు మమ్మెల్ల నిరోధించెను. అయ్యభిమన్యువధమున ద్రోణాశ్వత్థామలు నిమిత్త భూతులైరి. అపుడు ద్రోణుఁడు తనంతఁదా నాయభిమన్యునివధమున కుపాయ మారాధేయున కెఱిఁగించెను. ఖడ్గమును వైవఁగా దానిని రెండుఖండములుగాఁజేసెను. మఱియు వ్యసనమునఁ బడియుండఁగాఁ గ్రూరుఁడై కృతవర్మఁడు వానిగుఱ్ఱములను బార్ష్ణిసారథులను ఖండించెను. అటులే మఱికొందఱు ధనుర్ధరులు వానిని బడఁద్రోసిరి. ఓకృష్ణా! అపు డల్పకారణమునకుఁగా నర్జునుఁడు సైంధవుని వధించుట నాకంత ప్రియము గానేరదు. పాండవులకు శత్రువధముచేయుట న్యాయ్యమే. యుద్ధమున ద్రోణరాధేయులను వధింపవలయునని నాకింతకుమున్నే గలదు. వీరిరువురే మాదుఃఖముల కెల్ల మూలముగదా! వీరేయుద్ధమున సుయోధను నూఱడించిరి. నిజముగా మహాబాహుఁడగుపార్థుఁడు ద్రోణరాధేయులను వధింపవలసి యుండఁగా, దూరహేతువుగానున్న సైంధవునిఁ జంపెను. ఓవీరాగ్రణీ! ఆసూతపుత్రు నిపుడు వధించుట యావశ్యకము. కావున, వానిని జంపునిశ్చయముతోఁ బోరాడెదను. మహాబాహుఁడగు భీముఁడా ద్రోణునిసైన్యమును దలపడియెను' అని పలికి యాధర్మజుఁడు రాధేయునిపైకి వడిగా వెడలి, ధనుష్టాంకార మొనరించి, భయంకరముగా శంఖము పూరించెను. పిదప వేలకొలఁది రథములతోడను, మూఁడువందలయేన్గులతోడను, నైదువేలగుఱ్ఱముల తోడను, మూఁడువేలప్రభద్రకసైన్యములతోడనుగూడి, వడిగా శిఖండి ధర్మజునివెనుక నాతనికిఁ దోడుగా వెడలెను. పిమ్మట భేరులు మ్రోగెను. సన్నద్ధులై యోధులు శంఖములఁ బూరించిరి. అటులు ధర్మజుని మున్నిడికొని పాంచాలపాండవులు వెడలఁ జూచి, వాసుదేవుఁ డర్జునునితో 'ఓపార్థా! ఈధర్మజుఁడు కోపావేశపరవశుఁడై కర్ణుని వధించునుద్దేశముతో నిదె వడిగా వెడలుచున్నవాఁడు. ఇట్టి వీని నుపేక్షించుట నీకుఁ దగదు.' అని పలికి యవ్వాసుదేవుఁడు వడిగాఁ దనగుఱ్ఱములను

ప్రేరించి, దూరముగానున్న యుధిష్ఠిరునిఁ గలిసికొనియెను. పిదప నటులా సూతపుత్రునిఁ జంపువాఁడై, శోకసంతాపతప్తుఁడగుట మండుచున్న యగ్నినాఁదగి యాతనిపైకి వడిగాఁ బోవుచున్న యాధర్మజునిఁ గాంచి, వ్యాసుఁ డందుల కేతెంచి, యాధర్మజునితో నిట్లు పలికెను.

'ఓయుధిష్ఠిరా! మనయర్జునుఁడు కర్ణునితో మాఱొడ్డియు దైవవశముగా జీవించెను. ఆరాధేయుఁ డర్జునవధాకాంక్షియై తనయమోఘశక్తిని రక్షించుచుండు టెఱుంగవే? ఓభరతర్షభా! అర్జునుఁడు భాగ్యవశముగా నారాధేయునితో ద్వంద్వయుద్ధమునకుఁ దలపడఁడయ్యెను. వీరు పరస్పరముఁ దలపడినచో, దివ్యాస్త్రములను బ్రయోగించుకొనక మానరుగదా! అట్టిచోట్టునఁ దనదివ్యాస్త్రములు హతములగుట కోపక, యారాధేయుఁడు వాసవదత్తమగుశక్తి నాసమరమున నిశ్చయముగా నర్జునుపైఁ బ్రయోగింపక మానఁడుగదా! ఓయుధిష్ఠిరా! అటులయ్యేనేని, నీకెంతఘోరకష్ట మావహిల్లెడినో యాలోచింపుము. నీభాగ్యవశమున నారాధేయునిశక్తిచే ఘటోత్కచుఁడు హతుఁడయ్యెను. ఎప్పటికేని హతుఁడుగావలసిన ఘటోత్కచుఁడు వాసవదత్తశక్తిహేతుకముగా మరణించెను. వాఁడట్లు మడియుటయు నీనిమిత్తమైనదనియే తలంపుము. ఓభరతశ్రేష్ఠా! కోపము విడువుము. దుఃఖింపకుము. ఓయుధిష్ఠిరా! సకలప్రాణులకు నిది యున్నదియే గదా! కావున, నీవిఁక నీసోదరులతోడను, మహాత్ములగు నీసకలపార్థివులతోడను గూడి, యెల్లపార్థివులను మార్కొని యుద్ధముచేయుము. ఇఁక నేఁడు మొదలైదవనాఁటికి నీవీపుడమిఁ బడయుదువు. ఓపురుషవ్యాఘ్రా! నీవు నిత్యము ధర్మమునే చింతింపుము. మఱియు నక్రౌర్యము, తపము, దానము, క్షాంతియు, సత్యము ననియెడివానిని సేవింపుము. ఎందు ధర్మముండునో, యందు జయము గలుగక తప్పదు.' అని పలికి యావ్యాసుఁ డందే యంతర్ధానమునొందెను" అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## ద్రోణవధపర్వము-సైన్యములు నిద్రించుట

"ఓరాజా! వ్యాసుఁ డిట్లు పలుకఁగా, నపుడాయుధిష్ఠిరుఁ డారాధేయువధోత్సాహమునుండి మరలెను. ఆరాతిరి సూతపుత్రునిచే దనతనయుఁ డటులు హతుఁడగుట కెంతయుఁ గోపావిష్టుఁడై, భీముఁడు

గొప్పదగు ద్రోణసైన్యమును వారింపఁదొడంగుటయు, నపుడా యుధి ష్ఠిరుఁడు ధృష్టద్యుమ్నునిఁ గాంచి 'ఓవీరాగ్రణీ! నీవు ద్రోణుని నివా రింపుము. ఆ ద్రోణునిఁ జంపుటకేగదా నీ వాయగ్నినుండి పొడమితివి! కావున, శరశరాసనధరుఁడవై కవచమును ఖడ్గమును ధనువును బూని, సోత్సాహుఁడవై భారద్వాజునిఁ దలపడుము. నీవు ద్రోణునికడ జడియ నక్కఱలేదుగదా! మఱియు జనమేజయుఁడును, శిఖండియు, దౌర్ము ఖియు, యశోధరుఁడును, గుపితులై యాద్రోణు నెల్లెడలఁ జుట్టికొన వలయును. అటులే నకులసహదేవులును, బ్రభద్రకులును, ద్రౌపదేయు లును, విరాటద్రుపదులును, వారిభ్రాతలుపుత్త్రులును, సాత్యకియుఁ, గేకయులును, నర్జునుఁడును నాద్రోణునిఁ జంపువారై తలపడుదురు గాక. అటులే యింకనుగల రథికులును గజాశ్వసైన్యమును, బదాతు లును, మహారథుఁడగు నాద్రోణుని రణరంగమునఁ దలపడి యాతనిఁబడఁ ద్రోయవలయును' అని పలికెను.

అంత నటులు వారెల్ల నాధర్మజునిచే నాజ్ఞప్తులై ద్రోణుని జయించునట్టిపట్టుదలతో వడిగా వెడలి యాతనిఁ జుట్టుకొనిరి. అటులు తనపైకివచ్చు నప్పాండవయోధులనెల్ల నాద్రోణుఁడు నివారించెను. పిదప సుయోధనుఁడు ద్రోణజీవితాపేక్షియై యెల్లవిధముల నాతని రక్షింప నెంచి, కుపితుఁడై పాండవుల నెదుర్కొనియెను. పిదపఁ బాండ వులకును గౌరవులకును బరస్పరగర్జనములతో వాహనాదిసైన్య మల యునట్లుగా గొప్పయుద్ధ మారంభమయ్యెను. అపుడు మహారథులెల్ల రును, నలసి నిద్రాంధులై యాసమరమునఁ జేష్టలెఱుఁగక యుండిరి. రాతిరి, త్రియామయయ్యు, ఘోరరూపమును భయంకరమునై, పెక్కు ప్రాణులు నశించుచుండ, సహస్రయామ యనఁదగియుండెను. అటులే ప్రహరించునట్టియోధులకును విశేషించి క్షతులగుచున్న యోధులకును నందును నిద్రాంధులకును నారాత్రి ఘోరమై చూపట్టెను. ఓరాజా! నీసైన్యమున క్షత్త్రియులందఱును దీనమానసులై, యుత్సాహము చెడి యుండిరి శత్త్రుసైన్యములందును, నస్త్రములును బాణములును లేక యుండిరి. అటులయ్యు నుభయయోధులును, సమరమును బారము నొందించువారై, బిడియముగలవారగుటను, మానవంతులగుటను, క్షత్త్రియధర్మమును విడువలేక తమసైన్యములను గాపాడుకొనుచు

నుండిరి. కొందఱు నిద్రాంధులై శస్త్రములనువిడిచి శయనింపఁదొడంగిరి. అటులే కొందఱు రథములందును, మఱికొంద ఱేన్గులందును, గొందఱు గుఱ్ఱములందును నిద్రించుచుండిరి. అటులు నిద్రాంధులై యోధులు తెలియకయుండఁగా, వారిని గొందఱుయోధు లదెసమయమని చంపుచుండిరి. మఱికొందఱు నిద్రచే మతిచెడి, పరులనుకొని తమవారినే చంపుకొనుచుండిరి. ఆమ్మహారణమున మనవారిలోఁ గొందఱు శత్రులను, బలువిధములఁ బలుకుచు, యుద్ధముచేయుఁడని ప్రేరించి నిలువఁబడుచు నిద్రచేఁ గన్నులెఱ్ఱవాఱ, యుద్ధరంగమున కెటులో నడుచుచు, నిద్రాంధులై పరస్పరము కొట్టుకొనసాగిరి. ఆదారుణాంధకారమునఁ బెక్కురు నిద్రచే నెంతయు మోహితులై చంపఁబడుచున్న తమవారిని, వైరులను దెలియక యుండిరి. అట్టి సైనికులయవస్థం జూచి, పురుషవర్యుఁడగు నర్జునుఁడు వారితో 'ఓసైనికులారా! మీరెల్ల నలసి మీమీవాహనములతోఁగూడ నిద్రావశులైయున్నవారు. మఱియుఁ జీకటులచేతను, ధూళిచేతను సైన్యమెల్ల నావృతమైయున్నది. మీకిష్టమగునేని యుద్ధమునుండి నివర్తింపుఁడు. రెండుగడియలసేపు కనులుమూసి యిందే నిద్రింపుఁడు. పిదపఁ జంద్రోదయము కాఁగనే, నిద్రదీఱి, సేదదేఱి మరల స్వర్గమును సాధింప యుద్ధముచేయుదురుగాక,' అని బిగ్గరగాఁ బలికెను. ధార్మికుఁడగు నాతనివచనమువిని, ధర్మజ్ఞులగు వారెల్లరును నందులకు సమ్మతించిరి. అపుడు సైన్యములవారు నొకరితోనొకరు మరలుదమని పలికికొనిరి. కొందఱు 'ఓరాజా! దుర్యోధనా? కర్ణా! పాండవసైన్యము యుద్ధమునుండి నివర్తించుటను మీరును మరలుఁడు' అని యఱచిరి. అటు లర్జునుఁడు తెలుపఁగనే పాండవులయు నీవారియు సైన్యములు మరలెను. మహాత్ముఁడగునయ్యర్జును వచనములకు దేవతలును ఋషులును సకలసైనికులును నెంతయు సంతసించి, యాతనిఁ బూజించిరి. ఓరాజా! సుప్రసన్నమగు నాతనిమాట నటు లాదరించి, సర్వసైన్యములును రెండుగడియలసేపు నిద్రించి విశ్రమించెను.ఓరాజా! అటులు విశ్రమించి నీసైన్యముసైత మెంతయు సుఖపడినదగుట నర్జునుఁ బూజించెను. ఓరాజా! అపు డాయుభయపక్షములందున్న మహారథులును నర్జునుఁ గాంచి, 'ఓమహాబాహూ! నీయందు వేదములు, నస్త్రములు, బుద్ధిపరాక్రమములును, సుఖము, భూతదయ నిత్యము

నిలుచుఁగాక. నీవలన మేమెల్ల విశ్రాంతి నొందితిమి. కావున నీకు సుఖమగుఁగాక యని కోరుచున్నవారము. మఱియు నీవు మనోభీష్టార్థములను వడిగాఁ బడయుము.' అని యావీరునిఁ బ్రశంసించుచు, నారణరంగముననే నిద్రాపరవశులై యూరకుండిరి. కొందఱు గుఱ్ఱములవీపులపై నిద్రించిరి. మఱికొందఱు రథనీడములందుఁ బన్నుండిరి. వేఱొక కొందఱు గజస్కంధగతులై శయనించిరి. కొందఱు పుడమిఁబడి నిద్రవోయిరి. గదాఖడ్గపరశ్వథాద్యాయుధములను బట్టుకొనియే కొందఱు నిద్రించిరి. ధూధూళిధూషితములై పాముపడగలునాఁదగు తొండములతో నేనుగులు నిద్రాపరవశములై నిట్టూర్పులచేఁ బుడమి చల్లవడునట్లుగా నొనర్పసాగెను. ఓరాజా! అటు లాయేనుగులు నిట్టూర్పులిడుచుఁ బుడమిఁబడి మహాసర్పముల నిశ్వాసములుగల్గిన కొండలునాఁజూపట్టెను. సువర్ణయోక్త్రములుగల గుఱ్ఱములు తమమెడజుంజురుల నంటియున్న యుగములతోఁ గూడియే, డెక్కలచేఁ బుడమిఁ ద్రవ్వి సమస్థలము విషమముగా నొనర్చికొని యందు నిద్రించెను. ఓరాజా! ఇటులు యోధులును నేనుగులును గుఱ్ఱములును, మిక్కిలి శ్రమపడియుండుట, నపుడు యుద్ధము మాని నిద్రించెను. అటులు నిద్రామగ్నమై తెలివిలేకయున్న యాసైన్యమెల్ల నిపుణులచేఁ బటమున వ్రాయఁబడిన యద్భుతమగు చిత్రమునాఁ గానిపించెను. మఱియుఁ గుండలాద్యలంకారములు గల కొందఱు క్షత్రియయువకు లేనుగులకుంభస్థలములపైఁ బరుండి, మున్ను పరస్పరసాయక క్షతావయవులగుటను, గామినుల కుచకుంభములందు నిద్రించినవారునాఁ జూపట్టిరి. అంతఁ గొంతవడికిఁ గామిని చెక్కులునాఁ దెల్లనై నేత్రానందకరమైనచంద్రుఁడు తూర్పుదెస నలంకరించెను. తూర్పుదెస యనెడిగుహనుండి వెడలి కిరణములనెడి కేసరములచే భాసురమై, చీకటులనెడి యేనుగులగుంపును, జీల్చుచు, నుదయపర్వతమునందలి సింహమునాఁ వెలయుచుఁ, జంద్రుఁ డుదయించెను. అటు లుదయించి శివుని మేనిచాయ వెలయ, మన్మథుశరాసనమునాఁ గాంతులతో నిండి, నవవధూస్మితమువలె మనోజ్ఞుఁడై కుముదవనమును వికసింపఁజేయుచు నొప్పారెను. పిదప రెండుగడియల కాభగవానుఁడగుచంద్రుఁడుతూర్పుదెసను బొడమి,నక్షత్రకాంతులను మ్రింగుచు,నారుణ్యమును బ్రకటింప, దానిననుసరించియే బంగారుకాంతులనుబోలి కిరణచయము క్రమక్రమ

ముగా వెడలఁజొచ్చెను. అపు డాచంద్రకిరణములు కాంతిచేఁ జీకటులఁ దొలఁగించుచు, మెల్లమెల్లగాఁ బదిదిక్కులను వ్యాపించెను. పిదప మఱి రెండుగడియలకు లోకమెల్లఁ గాంతిమయమయ్యెను. పిదప మఱి రెండు గడియలకు లోకమెల్లఁ గాంతిమయమయ్యెను. చీకటి వెంటనే నామ రూపములు లేక నశించెను. అటు లానిశాకరుఁడు ప్రకాశించుటను రాత్రి పవలుగా, నంత, నక్షత్రంచయులు చేరుచుఁ జేరఁజాలకుండిరి. ఓరాజా! అపు డాచంద్రకిరణములచే సైన్యము మేలుకని, యుదకమున వికసించియున్న పద్మవనమువలెఁ గానిపించెను. ఓరాజా! చంద్రోదయ సమయమునఁ గలఁతనొందిన సాగరమువలె, నపు డాసైన్యము చూపట్టెను. అపుడు పరలోకమును గోరు నవ్వీరుల, కెప్పటివలె యుద్ధ మారంభమై లోకవినాశనిమిత్తమై విజృంభించె" నని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

ద్రోణుఁడు యుద్ధమునకు బయలువెడలుట

"ఓరాజా! అంత నాసుయోధనుఁడు ద్రోణుని సమీపించి, కోప మడర, నాద్రోణునకు హర్షమును దేజమును గలిగించుచు, నాతనితో, ఓయాచార్యా! సంగ్రామమున నలసి యిటులు విశ్రమించుచున్న శత్రు లను మన ముపేక్షింపరాదు. వారలయిక తీఱకమున్నే వారు మనకు గుఱిగావలయును. నీకుఁ బ్రియమొనర్చుటకై మేము సహించితిమి. అక్క తమున నప్పాండవులు విశ్రమించుటచే, మున్ను తేజోబలహీనులై యు న్నను నిపుడు మరల బలవత్తరులైరి. నీవు వారి నటులుపేక్షించుచుండు టనే వారు మఱిమఱియు వృద్ధినొందుచున్నవారు. ఘోరములగు బ్రహ్మా స్త్రాది దివ్యాస్త్రములు నీయందే విశేషించి గలవు. యుద్ధముచేయుచున్న నీకు మేముగాని పాండవులుగాని యింకను లోకమునఁగల ధనుర్ధరులు గాని తుల్యులముగాఁజాలమని సత్యముగాఁ దెలుపఁగల్గుచున్నాను. అటు లగుట నీవు నీదివ్యాస్త్రములచే, సురాసురగంధర్వులతోఁగూడిన యీ మూఁడులోకములను నోడింపఁజాలుదువు. సర్వాస్త్రవేత్తవై విశేషించి నీకడ భయపడుచున్న యప్పాండవులను, వారు నీకు శిష్యులగుటనో నాయభాగ్యముననో క్షమించి, చంపక యుపేక్షించుచున్నవాఁడవు." అని పలికెను.

ఓరాజా! నీకొమరుఁడు త న్నటులాడుటయు నందులకుఁ గుపితుఁడై యాసుయోధనుతో 'ఓరాజా! నేను ముదుసలినయ్యు నాశక్తికొలఁది యుద్ధమునఁ బనిచేయుచునే యుంటిని. విజయము నపేక్షించునట్టి నాకింతకు మించునట్టి క్షుద్రకార్య మేమియున్నది? అస్త్రవేత్తయగు వానిచే, నస్త్రవేత్తలు కానివారెల్ల నవధ్యులై యుందురు. ఓకౌరవ్యా! మంచియేగాని, చెడ్డయేగాని, నీవేమేమి తలంతువో దానినెల్లఁ జేయువాఁడనై యుంటిని. నీసమ్మతికి విరుద్ధముగా జరుగలేదు. ఓరాజా! నేనిపుడు విక్రమించి యీయుద్ధమున సకలపాంచాలురనుజంపి, కవచము విడుచువాఁడనని యిదే యాయుధము ముట్టి చెప్పుచున్నవాఁడను. ఓకౌరవేశ్వరా! యుద్ధమున నర్జునుఁ డలసియుండెనని తలంచుచున్నాఁడవు. వానిపరాక్రమమెట్టిదో సత్యముగా నెఱిఁగించెదను వినుము. ఓయీ! అతఁడు కుపితుఁడగునేని, దేవతలును, గంధర్వులును, యక్షులును, రాక్షసులును నాతనితోఁ బోరాడ నుత్సహింపరు. ఖాండవ వనదహనమున, నాయింద్రుఁ డాయర్జును నెదుర్కొని, వానిసాయకములచే నివారితుఁడై యోడిపోయెను. అటులే యక్షులును, నాగులును, దైత్యులును బలగర్వితులగు మఱికొందఱును నమ్మహావీరునిచే నిహతులైరనుట నీవెఱుంగనిదిగాదు. నాఁడు ఘోషయాత్రాసందర్భమునఁ జిత్రసేనాదులగు గంధర్వు లాతనిచేఁ బరాభూతులైరి. దృఢశరాసనుఁడగు నప్పార్థునిచే, లజ్జితులగుచు మీరెల్ల విడిపింపఁబడితిరిగాదే? అటులే దేవశత్రువులగు నివాతకవచు లాతనిచేఁ బరాభూతులైరి. అవ్వీరునిచే జయింపఁబడినవా రెల్లరును సురలకును నోరువరానివారుగదే! హిరణ్యపురవాసులగు వేలకొలఁదిదానవులును నాతనికోడిరిగదా! అట్టివాఁడు మానవుల కెట్లు వశపడును? ఓరాజా! అప్పార్థునిచేఁ బ్రహతమై యిట్లు నేల దొరలుచున్న నీ యీసైన్యమే వానిపరాక్రమ మెట్టిదో నీకుఁ బ్రత్యక్షముగాఁ దెలియఁజేయుచున్నది.' అని తెలిపెను.

ఓరాజా! అటు లాయర్జును బొగడుచున్న యాభారద్వాజుని వచనముల కెంతయును గుపితుఁడై, యాసుయోధనుఁడు మఱియు నాతనితో 'ఓయాచార్యా! నేనును, దుశ్శాసనుఁడును, శకునియు, రాధేయుఁడును నిపుడు భారతసైన్యము నిరుదెఱఁగులఁ జేసి యీయుద్ధమున నర్జును వధించువారము.' అని పలుక విని యాద్రోణుఁడు

నగుచు, నీకు శుభమగుఁగాక యని పలుకుచు నాతని ననుసరించెను. ఓయాంబికేయా! అటు లా ద్రోణుఁ డాతని ననుసరించి వెడలియు, మఱియు నాతనితో 'ఓసుయోధనా! తేజముచేఁ బ్రజ్వరిలుచు, వీఁగుటనునది లేక క్షత్రియోత్తముఁడైన యప్పార్థుని, క్షత్రియుఁ డగువాఁ డెవ్వఁడు జయింపఁగల్గును? వాని నాయింద్రయమవరుణకుబే రులుగాని, సురాసురోరగులుగాని జయింపఁజాలరు. ఓదుర్యోధనా! ఇటులు పలుకుచున్న మూఢులగు వీరెల్ల రణరంగమున నర్జునుఁ దలపడి, ప్రాణములతో నింటికి మరల గల్గుదురా? మూర్ఖుఁడవును బాపనిశ్చ యుఁడవును నై, యెల్లవారియెడను శంకగల్గియుండువాఁడవగుట, నీశ్రేయము నపేక్షించువారిని నైతము నాయారీతుల నాడఁదొడంగె దవు. నీకార్యమునకై నీ వాయర్జును బాధించుటకై వెడలుము. సత్కుల ప్రసూతుఁడవైన క్షత్త్రియుఁడవై యుద్ధమును గోరుదేని, యపరాధ శూన్యులగు నిప్పార్థివులను జంపఁ బనిలేదు. ఆయర్జునుపై వెడలుము. నీవే యీవైరమునకంతకును మూలమవుగదా! ప్రాజ్ఞుఁడగు నీయీ మేన మామ క్షత్త్రధర్మమును బాలించువాఁడై యున్నవాఁడు. దుష్టద్యూత పరాయణుఁడగు వాఁడే, నాయర్జునునిఁ దలపడుఁగాక. పాచికలందునిపు ణుఁడై వక్రబుద్ధియై మూర్ఖుఁడై ద్యూతమాడునట్టి యాతఁ డీపాండ వులను జయింపగలఁడు. మఱియు నీ వవివేకముచే నాధృతరాష్ట్రుఁడు వినుచుండఁగనే కర్ణునితోఁగూడి సంతసించుచు గర్వించుచు 'ఓతండ్రీ! నేనును గర్ణుఁడును దుశ్శాసనుఁడునుగూడి పాండవులను జంపుదుము' అని పలుమాఱులు సభలలోఁబలుకుచుండుటవినఁబడియెనుగాదే! కావున వారిరువురు దోడ్పడ నీప్రతిజ్ఞను సాధించి సత్యవచనుఁడవుగమ్ము. ఇదె శత్రుఁడగునర్జునుఁ డోరువరాక నీయెదుటనున్నవాఁడు. క్షత్త్రధర్మమును బరికింపుము. అప్పార్థునిజయముకంటె, నాతని వధించుట మఱియుఁ బొగడఁదగినది. ఓరాజా! దానభోగములుసలిపితివి. చదివికొంటివి. అభీ ప్సితమగు నైశ్వర్యమొందితివి. అటులగుట నన్నిటియందును గృతకృ త్యుఁడవైతివి. ఋణములెల్లఁదీఱెను. కావున జడియక పార్థునితోఁ బోరుము.' అని పలికి యాద్రోణుఁడు సమరమున కుద్యుక్తుఁడై వైరు లున్నవైపు మరలెను. పిదప సైన్య మిరువిధములుగా నేర్పడ యుద్ధ మారంభమయ్యెను" అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

సాంకులయుద్ధము

"ఓరాజా! ఆరాత్రి మూఁడుయామములు గడవ నక్కురుపాండవులకు యుద్ధము జరిగెను. పిదపఁ జంద్రకాంతులనడంచుచు, నాదిత్యునకుఁ బురస్సరుఁడై యాకసమెల్లవాఁజ నరుణుఁ డుదయించెను. అంత నాసూర్యుని యరుణకాంతిచేఁ దూర్పుదెస యెఱ్ఱవాఱెను. అపుడు రవి మండలము బంగారుచక్రమునాఁ జూపట్టెను. పిమ్మట నక్కురుపాండవ యోధులు నిజగజరథాశ్వాదులను విడిచి, యాదివాకరున కభిముఖులై చేతులు మొగిడ్చి, సంధ్య నుపాసింపఁదొడంగిరి. పిదప నాద్రోణుఁడు, సైన్యములు వేర్వేర నేర్పడ సుయోధనాదులఁగూడి, సోమకపాంచాల పాండవులఁ దలపడియెను. అపు డాకౌరవసైన్యము లిరుతెఱఁగు లగుటఁ గాంచి వాసుదేవుఁ డర్జునుతో 'ఓపార్థా! శత్రువుల నెడమగానుండి, మనసైన్యములఁ గుడిగానిలుపుము.' అని తెలుప, నతఁడు నటులేగాని మ్మని యాద్రోణరాధేయుల నెడమగానుంచి వెడలెను. పిదపఁ గృష్ణుని యభిప్రాయ మెఱిఁగి, సేనాముఖమందున్నపార్థునిఁ గాంచి, భీముఁడు 'ఓయర్జునా! అర్జునా! నాదొకమాట వినుము. క్షత్రియు లెందులకు జనించిరో యట్టికాలము వచ్చెను. ఇట్టికాలము సంప్రాప్తించినను మేలు కనిపెట్టకున్నవాఁడవు. నీ వసంభావితముగా నిపుడు క్రౌర్యము వహింప మానెదవు సుమీ! సత్యము సిరియు ధర్మము కీర్తియు ననెడివాని కిపుడు ఋణము తీర్పవలయు. ఓవీరాగ్రణీ! సైన్యమును ఛేదింపుము. నీప్రతిజ్ఞను సఫలమొనర్పుము' అని యాతనిఁ బ్రోత్సహించెను.

అంత నయ్యర్జునుఁ డాభీమవాసుదేవులచేఁ బ్రేరితుఁడై ద్రోణ రాధేయులను, గడచి సైన్యములన్నిటిని నివారించెను. అటులు సేనా ముఖమున నడుచుచు, క్షత్రియులను గాల్చుచు విక్రమించుచుండఁగా, క్షత్రియవీరులెల్లరును గూడియు, నాతనిఁ బ్రజ్వలించు నగ్నినివలె నివారింపఁజాలరైరి. పిదప దుర్యోధనుఁడును గర్ణుఁడును శకునియు నప్పార్థునిపై శరవర్షమును గురియఁదొడంగిరి. ఓరాజేంద్రా! ఉత్తమాస్త్రవేత్తయగు నయ్యర్జునుఁడపుడు వారియస్త్రములనెల్లఁ దనయస్త్రములచే నివారించి, కరలాఘువ మేర్పడ వారినెల్లఁ బదిపదితీవ్రశరములచే నొప్పించెను. అపుడు శరవర్షముతో ధూళివర్ష ముప్పతిల్లెను. అటులే పెంజీ

కటియు భయంకరశబ్దమును జనించెను. అటులగుట భూమ్యాకాశము లును దిక్కులును దెలియఁబడకుండెను. సేనాధూళులచే వ్యాప్తమై సకలము నంధప్రాయమై చూపట్టెను. ఓరాజా! దానిచే మేము పరస్పరముఁ దెలిసికొనఁజాలమైతిమి. క్షత్రియులెల్లరును గుఱుతులను బట్టియే యుద్ధముచేయుచుండిరి. ఓరాజా! విరథులగుకొందఱు రథికులు పరస్పరముఁదలపడి భుజములనుబట్టికొనియుఁ,గవచములనుబట్టికొనియుఁ, గేశములందుకొనియుఁ బెనఁగ నారంభించిరి. మఱికొందఱు హతాశ్వులును హతసారథులునై చేష్టలెడలి, భయపీడితులై యుండిరి. కొన్ని గుఱ్ఱములు, చచ్చినయేనుగులనంటి జీవించినవియుఁబోలెఁ జూపట్టుచుండెను. అటులే మఱికొన్ని గతప్రాణములై రౌతులతోఁగూడఁ గానవచ్చుచుండెను. పిదప యుద్ధభూమి కుత్తరముగా వెడలి, ద్రోణుఁడు పొగ లేనియగ్నివలెఁ గానవచ్చుచుండెను. అటులు సేనాముఖమున నున్న ద్రోణునిఁ గాంచి పాండవసైన్యములు చలింపఁదొడంగెను. మఱి కొందఱు శోభాసంపన్నుఁడై, తేజముచే వెలయుచున్న ద్రోణునిఁ గాంచి జడిసి, చలించుచు దైన్యమొందసాగిరి. మత్తగజమువలె శత్రుసైన్యమును యుద్ధమునకు రమ్మని పిలుచుచున్నయాభారద్వాజు నప్పాండవసైన్యములు దానవులు వాసవునివలెమార్కొనఁ సందియమందుచుండిరి. కొందఱు నిరుత్సాహులైరి. మఱికొందఱు మానవంతులు కుపితులై చూచుచుండిరి. కొంద ఱచ్చెరువడి నిలుచుండిరి. వేఱొకకొందఱు కోపముతెచ్చికొని సమీపింపఁదొడంగిరి. ఇంకొకకొందఱు చేతులు నులిపికొనుచుండిరి. మఱికొందఱు కోపోద్దీపితులై దంతములచేఁ బెదవులుకొఱుకుచు నుండిరి. కొందఱు ధనువులు సారించుచువచ్చిరి. మఱికొందఱు మల్లచఱచుచుండిరి. వేఱొకకొందఱు తేజోనిధులై ప్రాణములకుఁ దెగించి, జడియక యాద్రోణునిఁ దలపడఁజొచ్చిరి. అపుడు విశేషించి పాంచాలు రాద్రోణుసాయకములచేఁ బీడితులై, యెంతయు నొచ్చి ధర్మజునిఁ జేరుచుండిరి. అంత నావిరాట ద్రుపదు లాద్రోణునిఁ దలపడిరి. పిదప నటులు దుర్జయుఁడై సంగ్రామరంగమునఁ జరించు నాద్రోణునిఁ జూచి కుపితులై, ద్రుపదపౌత్రులు మువ్వురు మార్కొనిరి. అటులే చేదియోధులు నాతనినె దలపడిరి. అంత నా ద్రుపద పౌత్రులమువ్వుర నాద్రోణుఁడు మూఁడుబాణములచేఁ బ్రహరింప,

వారు గతాసులై పుడమిం బడిరి. మఱియు నా ద్రోణుఁడు చేదికైకేయ సృంజయులను జయించెను. అటులే మాత్స్యులు నాతని కోడిరి. ఓమహారాజా! పిమ్మట ద్రుపదుఁడును విరాటుఁడును గుపితులై, ద్రోణునిపై శరవర్షము గురిసిరి. క్షత్త్రియమర్దనుఁడగు నా ద్రోణుఁడు వారిశరవర్షమును నివారించి, మఱియు వారిని శరవర్షముచేఁ గప్పఁగా, వారు కుపితులై యాతనిఁ గొన్ని సాయకములచే నొప్పించిరి. ఓమహారాజా! పిమ్మట నా ద్రోణుఁ డెంతయుఁ గుపితుఁడై, రెండు తీవ్రభల్లములచే వారిరువురధనువులఁ దెగనేసెను. పిదప విరాటుఁడు కుపితుఁడై పదితోమరములను,బదిబాణములను నా ద్రోణునిపైఁ బ్రయోగించెను. అటులే ద్రుపదుఁడును గుపితుఁడై, సువర్ణభూషితమై దీర్ఘసర్పమునాఁదగు నొకయినుపశక్తి నాభారద్వాజునిపైఁ బ్రయోగించెను. పిదప నా ద్రోణుఁడు తీవ్రభల్లములచే విరటునితోమరములను శరములను ఖండించి, మఱికొన్ని సాయకములచే నా ద్రుపదునిశక్తిని దునిమి, మఱియు రెండుపచ్చనిభల్లములచే నావిరాటద్రుపదులను గొట్టి యమమందిరమునకుఁ బనిచెను. అంత నటు లావిరాటద్రుపదులును, కేకయులును, పాంచాలమాత్స్యులును, ద్రుపదపౌత్త్రులు మువ్వురును, చేదివీరులును హతులగుటఁ గాంచి,మిగులఁ గోపసమన్వితుఁడై, ధృష్టద్యుమ్నుఁడారథికులనడుమ నిలిచి, ఓవీరులారా! నన్నిటులు పరిభవించిన ద్రోణుని నేఁడు చంపక విడిచితినేని, నాయిష్టాపూర్తమునుండియు నా బ్రాహ్మణ్యక్షత్త్రియధర్మములనుండియు నశింతునుగాక యని, యాధనుర్ధరులెల్ల వినుచుండఁగాఁ బ్రతినవట్టి యప్పాంచాలపతి తనసైన్యముతోఁగూడ నా ద్రోణునిఁ దలపడియెను. అపు డాద్రోణునిఁ బాంచాలు రొకవైపునను, పార్థుఁ డొకవైపునను బ్రహరింపఁదొడంగిరి. ఆద్రోణునిఁ గర్ణుఁడును, సుయోధనుఁడును, ముఖ్యులగు నాతనిసోదరులును, శకునియును రక్షింపనుండిరి. మహాత్ములగు వారిచే రక్షింపఁబడుచున్న యాతనిఁ దేఱిచూచుటకైనను, నప్పాంచాలురు చాలకుండిరి. అపు డాభీముఁడు ధృష్టద్యుమ్నునిపైఁ గినిసి, పరుషవచనములచే, నాతఁడు నొచ్చునట్లుగా, 'ఓయీ! నీవు సకలాస్త్రవేత్తవు. ద్రుపదునివంశమున జనించినవాఁడవు. క్షత్త్రియుఁడనని తలంచికొనినవాఁ డెవ్వఁడేని యెదుటనున్న శత్త్రునిఁ గాంచి యుపేక్షించునా? వైరి తనతండ్రిని దనపుత్త్రులను

జంపఁగాఁ జూచియు, మగతనముఁగలవాఁ డెవ్వఁడేని తనపుంస్త్వమును బాలించుకొనకుండునా? అదియుఁగాక రాజసభలో వైరిని జంపుదునని ప్రతిజ్ఞ చేసియు నిటులుపేక్షించుట నీకు యుక్తమా? ఈ ద్రోణుఁడు నిజతేజముచే నగ్నివలెఁ బ్రజ్వలించుచు, శరచాపములనెడి యింధనములచే క్షత్రియజాతిని గాల్చుచున్నవాఁడు పాండవసైన్యమును నిఃశేషముచేయును. ఓ ధృష్టద్యుమ్నా! మీరెల్లనిలిచి చూచుచుండుఁడు, నేనిదె యాద్రోణుపై వెడలుచున్నవాఁడను.' అని పలుకుచు, మఱి మఱియుఁ గుపితుఁడగుచు, ద్రోణసైన్యము నాతఁడు ప్రవేశించెను. అటులు చొచ్చి యతఁడు శరవర్షముచే నీసైన్యమును జలింపఁజేయ నారంభించెను. అంత నాధృష్టద్యుమ్నుఁడును మనగొప్పసైన్యమును జొచ్చి, ద్రోణునిఁ దలపడియెను. అపుడు సంకులసమర మారంభమయ్యెను. ఓ రాజా! అట్టియుద్ధము మున్నెన్నఁడును గని వినియుండలేదు. నాఁటిసూర్యోదయమున రథబృందములన్నియు నొకచోఁ జేరికొనియెను.అందుఁ బెక్కుప్రాణులశరీరములు హతములై, యందందు వ్యాపించెను. కొందఱు వేఱొకచోటికిఁ బోవుచుండిరి మఱికొందఱు త్రోవలో వైరులచే వెనుకభాగమునఁ బ్రహరింపఁబడుచువచ్చిరి. అటు లాసైన్యము లెంతయుఁ గలిసి, యుద్ధము దారుణమై చూపట్టెను. అంత నొక్కగడియలో సూర్యుఁడు సంధ్యాగతుఁడై గానవచ్చెను.'' అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

—⊙ నకులసుయోధనులయుద్ధము ⊙—

''ఓ మహారాజా! వారటులు యుద్ధసన్నద్ధులై, సంధ్యాగతుఁడైన సహస్రాంశుని సేవించిరి.అటులు సూర్యుఁ డుదయించి మేలిబంగారుకాంతుల వెదచల్లుటయు,లోకములు ప్రకాశితముగా మరల యుద్ధమారంభమయ్యెను. సూర్యోదయ మింకను నగుచుండఁగనే యందుఁగలద్వంద్వములెవ్వి పరస్పరము తలపడియెనో, సూర్యోదయమైనపిమ్మటను నైతమవియే కలిసి పోరాడ నారంభించెను. రథికులతో రౌతులును, రౌతులతో గజారోహకులును, గజారోహకులతోఁ బదాతులును, రౌతులతో రౌతులును, బదాతులతోఁ బదాతులును, రథికులతో రథికులును, నేన్గులతో నేన్గులును గలియుచు, వీడుచు యుద్ధమునఁ బ్రవర్తింప, నం

దనేకులు, గడచినరాత్రి పనియొనర్చినవారగుట నలసి, సూర్యోదయము కాఁగనే, యాఁకలిదప్పులకు లోఁగి, చేష్టారహితులై యుండిరి. ఓరాజా! అపుడు శంఖభేరీమృదంగధ్వనులయు, నేన్గులబృంహితములయు, ధనుష్టాంకారములయుఁ జప్పుడులు వెడలి మిన్నుముట్టుచుండెను. మఱియుఁ బరువులిడుచుండెడిపదాతులయుఁ, బడుచుండెడిబాణములయు, హేషాధ్వనులొనర్చు గుఱ్ఱములయు, మరలుచున్నరథములయు, గర్జించునేన్గులయు ధ్వనులు సంకులమై యధికమగుచువచ్చెను. అటులే పలువిధములగునాయుధములచేఁ దెగి దొరలుచు, నాతురులై యున్న వారియార్తధ్వని వినవచ్చుచు, నెంతయుఁ గృపణముగాఁ జూపట్టెను. పడినట్టియుఁ, బడుచున్నట్టియు, గజరథాశ్వములచప్పుడు మిన్నుముట్టెను. అటులా సైన్యములు పెక్కులుగాఁ గలిసి, కొందఱు వైరులను బీడించిరి. ఆసమ్మర్దమునఁ గొందఱు తమవారిని దామే ప్రహరించికొనిరి. ఆద్వంద్వములలో నొకఁడు వేఱొకద్వంద్వములోనివానిని గొట్టెను. యోధులందును, నేన్గులందును, వీరులబాహులచేఁ బ్రయుక్తములై, ప్రతిఖడ్గములచేఁ గొట్టఁబడి పుడమిఁ బడినఖడ్గముల రాశు, లాఱవైచిన వస్త్రముల ప్రోవులునాఁ జూపట్టెను. వాని చప్పుడు వస్త్రము లుదుకునప్పటిచప్పుడుల ననుకరించుచుండెను. పిదప నాసైనికులకు ఖడ్గములతోడను, దోమరములతోడను, బరశ్వథములతోడను, గొప్పసంకులయుద్ధ మారంభమై, దారుణముగాఁ జూపట్టెను. అపు డందలివీరులు, గజాశ్వశరీరములచేఁ బ్రభవమై నరదేహములను బ్రవహించుచు, శస్త్రములనెడిచేఁపలును, మాంసశోణితములనియెడి బురదయుఁ గలిగి, యార్తనాదములనెడి ప్రవాహఘోషముగల్గి, పతాకావస్త్రములె నురుగులుగాఁ, బరలోకమునకుఁ బ్రవహించునట్టి గొప్పనదిని జనింపఁజేసిరి. ఏన్గులును గుఱ్ఱములును శరశక్త్యాదులచేఁ బీడితములై యలసి, యల్పజ్ఞానముగలవగుట, నారాత్రి యేమియుఁ దెలియక యొడలు గదల్పఁజాలక నిలిచి యుండెను. కొందఱు వీరులు నోళులెండి, కుండలాలంకృతములగు తలలువెలయ, యుద్ధసాధనములతో నందందుఁ గూలఁబడి, నక్కలు మున్నగువానిచే నాక్రమింపఁబడియుండిరి. అందుఁ గొందఱు మృతులును, గొంద ఱర్ధమృతులును నై యుండిరి. ఆరణరంగమం దెందును రథమార్గము చూపట్టకుండెను. రథచక్రములు పరరథచక్రాదులలోఁ

దగుల్కొనుటచే, గుఱ్ఱములు నిజబలము నాశ్రయించి లాగుచు నలసి, శరపీడితములై చలించుచు, సహజబలమే యాధారముగా నుండెను. అపు డటులు సైన్యమెల్లఁ బీడితమై భయాక్రాంతమైయుండెను. ద్రోణార్జునులుమాత్రము చలింపకుండిరి. వారిరువురే, వైరిమారకులును, నిజజనభయనివారకులునై యుండిరి. తక్కినవారెల్ల వారిని జేరియే యమమందిరమును జేరుచుండిరి. కౌరవసైన్యమంతయు మిగుల జడిసియుండెను. పాంచాలసైన్యమునైతము సమ్మర్దమై యేమియుఁ దెలియఁబడకుండెను. మఱియు భీరువులకు భయప్రదమై, యముని క్రీడాస్థానమునాఁదగి, పుడమిఁగల రాజులనువారికెల్ల గొప్పఱియమున కదితావై యుండెను. ఓరాజా! అటులు పరస్పరము గలిసి, నేనాపరాగముచేఁ గప్పఁబడియున్న యాద్రోణరాధేయులును, యుధిష్ఠిరార్జునులును, నకులసహదేవులును, సాత్యకిధృష్టద్యుమ్నులును, దుశ్శాసనాశ్వత్థామదుర్యోధనులును, శకునియు, శల్యకృపకృతవర్మలును నింకనుగలవారును మాకుఁ గానరారైరి. అపుడు దిక్కులును బుడమియుఁ గానరావయ్యెను. ఇంతయేల! మాశరీరమే మాకుఁ జూపట్టదయ్యెను. అటులు ఘోరమగు సంకులసమర మారంభమై ధూళియనెడిమేఘము ప్రబలుటయు, మఱియు రాతిరి సంభవించినట్లు తలంచితిమి. వీరు కౌరవులని, వీరు పాంచాలురని, వీరు పాండవులని భేదము తెలియఁబడకుండెను. అటులే యివి దిక్కులు, ఇది పుడమి, ఇది యాకసము, ఇది సమస్థలము, ఇది విషమస్థలము అను భేదము తెలియఁబడదయ్యెను. విజయాభిలాషులగుపదాతులు చేతులతోఁ దడవికొనుచుఁ, బరులను దమవారిని తెలిసికొని పోరాడుచుండిరి. వాయువేగమున ధూళులు మీఁదికిఁ బోవుటవలనను, రక్తవర్షమును గురియుటవలనను, బుడమిఁగలపరాగ మడంగెను. అపు డందుఁగల గజాశ్వరథికపదాతిసైన్యములు రక్తసిక్తాంగములగుటఁ బారిజాతవనములువోఁ జూపట్టెను. పిదప ద్రోణుఁడును గర్ణుఁడును దుర్యోధనదుశ్శాసనులును నాల్గురథములతో వెడలి పాండవులను దలపడిరి. అందు సుయోధనదుశ్శాసనులు నకులసహదేవులను, రాధేయుఁడు భీముని, ద్రోణుఁ డర్జునునిఁ దలపడిరి. విచిత్రములగురథమార్గములచే సంకులమైయున్న యాఘోరరణరంగమును నందలివారెల్లరును మహాశ్చర్యముగాఁ జూడఁదొడంగిరి. మఱియు ముఖ్యులగురథికుల యామానుష

సమాగమమును, వారివిచిత్రయుద్ధమును గాంచుచుండిరి. అపుడు వారు పరస్పరజిగీషువులై ప్రయత్నపూర్వకముగా విక్రమించుచు, వర్షకాల మేఘములునా శరవర్షములను గురిసికొనిరి. సూర్యసన్నిభములగు నుత్తమరథముల నధిష్ఠించినరథికులు శరత్కాలమేఘములునాఁ జూపట్టిరి. ఓమహారాజా! అపు డందలి యోధులు కోపావేశపరవశులై పరస్పర స్పర్ధగలిగి, ధనుర్ధరులై ప్రయత్నపూర్వకముగా, మత్తగజములును, వృషభములునువలెఁ బరస్పరముఁ దలపడిరి. అప్పటి వారిసమాగమమున దేహభేదము తెలియఁబడకుండెను. అమ్మహారథులెల్లరును నొక్కపరిగలిసి బరస్పరప్రహారములచే నశింపసాగిరి. తెగినబాహువులతోడను, బాదముల తోడను, దలలతోడను నిండియుండెను. కార్ముకవిశిఖప్రాసపరశుపట్టిస ఖడ్గనాలీక నారాచశక్తితోమరాదులచేతను, మఱియుఁ బలువిధములగు ప్రహరణోత్తమములచేతను, జిత్రములగు కవచములచేతను, విచిత్రములై, భగ్నములైనరథములచేతను, మృతినొందినగజాశ్వములచేతను, నగరాకారములైన రథములచేతను, హతులైనయోధులచేతను, సారథిహీనములై,జడిసిరథము లీడ్చికొనిపోవుగుఱ్ఱములచేతను నారణరంగము వెలయుచుండెను. మఱియు నలంకృతులై హతులగు వీరులవ్యజనములు, కవచములు, ధ్వజములు నేలఁగూలసాగెను. మఱియు ఛత్రములు, నాభరణములు, వస్త్రములు సుగంధబంధురములగుమాల్యములు,కిరీటోష్ణీషహారాదులును, శిరోమణులును, నురోమణులును నందందు వెలయ, నారణాంగణము తారాగణముతోఁ గూడిన యాకసమునాఁ జూపట్టెను. పిదప నకులసుయోధనులు దలపడి, యొకరిపై నొకరు కుపితులై, యందు నకులుఁడు నీకొమరు నెడమభాగమున నుంచెను. అతఁడు శరశతములఁ బ్రహరింప నారంభింప గొప్పచప్పు డుప్పతిల్లెను. అటులు కుపితుఁడైన శత్రునిచే నపసవ్యముగాఁ జేయఁబడి, కోపమడరఁ దాను సవ్యముగా నిలువఁబడి సుయోధనుఁడు యుద్ధముచేయఁదొడగి యద్భుతముగా విక్రమింపఁ జిత్రమార్గవేదియై యానకులుఁ డాతని నివారించెను. పిదప నీసుతుఁ డతనిఁ బీడించుచు, యుద్ధవిముఖునిఁగా నొనర్ప, సైన్యములన్నియు నీతనయునిఁ బూజించిరి. నీదురాలోచనలచేఁ దమకుఁ గల్గినబహుదుఃఖములను స్మరించుచు నకులుఁడు "ఓరీ! సుయోధనా! నిలునిలు' మని పలికెను." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

సంశప్తకయుద్ధము

"ఓ రాజా! పిదపఁ దనరథవేగముచేఁ బుడమి యద్రువ వెడలి, దుశ్శాసనుఁడు సహదేవునిఁ దలపడునంతనే, వడిగా నొకభల్లముచే సహదేవుఁ డాతనిసారథి శిరస్త్రాణమును ఖండించి తలఁ దునుమాడెను. అపు డాసహదేవు కరలాఘవమునుబట్టి యాసారథి తలదెగుట నా దుశ్శాసనుఁడుగాని, యొకసైనికుఁడుగాని తెలియఁడయ్యెను. పట్టు కొనఁ బడకుండుటను, గుఱ్ఱములు రథము నెపు డీడ్చికొనిపోవ మొదలిడెనో, యపు డాదుశ్శాసనుఁడు తనసూతుఁడు మృతుఁడగుటఁ దెలిసెను. పిదప నతఁడు తనగుఱ్ఱములను బట్టుకొని హయశాస్త్రజ్ఞుఁ డగుట నడుపుచుఁ, జిత్రముగను సౌష్ఠవముగనుయుద్ధ మొనర్ప మొద లిడెను. అతఁ డటులు హతసారథియయ్యు నిర్భీతచేతస్కుఁడై పోరాడు చుండుటకుఁ, దమవారును బెఱవారును నాతని గౌరవించిరి. పిదప సహ దేవుఁడు తీవ్రబాణములచే దుశ్శాసనునశ్వములను బీడింప, నవి వడిగాఁ బరువులిడసాగెను. అంతనతఁడుపగ్గములుపట్టునపుడు విల్లువిడిచియు,విల్లు పట్టినపుడు పగ్గములు విడిచియు యుద్ధముచేయుచువచ్చెను. అట్టి యవ కాశములు కనిపెట్టి సహదేవుఁ డాసుయోధనుఁ గొట్టుచుండెను. అంత నీతనయుని రక్షించువాఁడై రాధేయుఁ డందులకురా, భీముఁ డారాధే యుని మూఁడుభల్లములచే బాహువులందును వక్షమందును గొట్టి నొప్పించెను. పిదపఁ దోఁకఁద్రొక్కినపామునా నారాధేయుఁడు మరలి తీవ్రనారాచములచే నొప్పించి, యాతని నివారించెను. అపు డాభీమ రాధేయులకు గొప్పయుద్ధము జరిగెను. వారిరువురును వృషభములు వలె ధ్వనిచేయుచు, గ్రుడ్లుత్రిప్పుచుఁ, గడువడిగాఁ దలపడుచు, యుద్ధ నిపుణులై పోరాడుచుఁ, గొంతవడికి శరసమూహము సమాప్తమగు టను, వారు గదాయుద్ధ మారంభించిరి. అపుడు భీముఁడు తనగదచే నాకర్ణునిరథకూబరమును వడిగా భేదించుట యెంతయు నద్భుత మయ్యెను. పిమ్మట నారాధేయుఁ డాభీమునిగదను దనగదచే భేదించెను. పిదప భీముఁడు వేఱొక గొప్పగదను గ్రహించి, యాకర్ణునిపైఁ బ్రయో గింప, నతఁడు సుపుంఖములై సానవెట్టిన పెక్కుబాణములచే వాని గదను వారించి, మఱియుఁ గొన్నిబాణములచే దాని నాభీమునిపైఁ

బడునట్లు కొట్టఁగా, దాని ప్రహారముచే నాభీముని విశాలధ్వజమును, సారథియుఁ బడియెను. పిదప భీముఁడు కుపితుఁడై మూర్ఛపడిన తన సారథి లేచునంతలో నెనిమిదిసాయకములు సంధించి, నగుచు నా రాధేయునిశరాసనశరావాపములను ధ్వజమును ఖండించెను. కర్ణుఁడును హేమపృష్ఠమై దురాసదమగు వేఱొకధనువు పూని యాభీమునిఋక్ష వర్ణములగుగుఱ్ఱములను బార్ష్ణిసారథులను బ్రహరించెను. అపు డా భీముఁడు రథముభగ్నమగుడు, సింగము కొండశిఖరమునుండివలె నుఱికి నకులునిరథముపైకి దుమికెను. పిదప ద్రోణార్జునులు దలపడి చిత్రముగా యుద్ధమొనర్పసాగిరి. ఓరాజేంద్రా! గురుశిష్యులిరువురును గలిసి లఘుశరసంధానసందర్భములును, రథప్రచారనైపుణ్యములును వెలయఁ బ్రహరించుకొనుచుఁ, జూచువారిలోచనములను జిత్తములను మోహమొందించుచుఁ బోరాడఁదొడఁగుడుఁ, దక్కినయోధులు జడిసి యుద్ధములనుండి మరలిరి. ఆసేనామధ్యమున విచిత్రరథమార్గముల నరయు నాగురుశిష్యుల యదృష్టపూర్వమగు యుద్ధమును నందలిరథికు లరయుచువచ్చిరి. అపుడు వారిరువురును, బరస్పరము నపసవ్యముగఁ జేయఁ గోరుచు, వారు పరాక్రమించుటకు విస్మితులై చూడసాగిరి. ఓమహారాజా! ఆమిషమునకై యాకసమున డేగలకువలె నాద్రోణార్జునుల కపుడు గొప్పయుద్ధ మారంభమై, ద్రోణుఁ డాపార్థునిఁ గెలుచునుద్దేశముతో నేమేమి యొనర్చుచుండెనో దానికెల్ల విఘాతముగా నాయర్జునుఁడు మాఱుసేయ నారంభించెను. యథావిధిగాఁ బ్రయుక్తములగుచున్నవారిరువురయస్త్రములును బ్రహతము లగుచుండెను. ఎపుడు ద్రోణుఁ డాయర్జునునిమించ నెంచుచు, నప్పార్థునిపై నైంద్రాస్త్రమును, బాశుపతమును, త్వాష్ట్రమును, వాయవ్యమును, వారుణమును విడుచుచుండెనో, యాద్రోణాస్త్రములనెల్ల నపు డప్పార్థుఁడు తనయస్త్రములచేఁ బ్రతిహతములఁ గావించుచు వచ్చెను. అతఁ డటులు తనయస్త్రముల వారించుకొలఁది నాద్రోణుఁడు మఱియు దివ్యాస్త్రము లప్పార్థునిపైఁ బ్రయోగించుచుండెను. దానినెల్ల నర్జునుఁడు నివారించుచుండెను. అపు డాద్రోణుఁ డాయర్జునునిఁ దనచిత్తమునఁ బూజించి, పుడమి నతఁడు తన్నుమించినశిష్యుఁడని తలంచెను. శస్త్రవేత్తలగు తనయెల్ల

శిష్యులలో నధికుఁ డనఁదగు నప్పార్థుఁ డమ్మహారథికులనడుమఁ దన్ను నివారించుచుండఁ, బ్రయత్నపూర్వకముగా విక్రమించి, ప్రీతిచే నగుచు నాతని నివారించుచువచ్చెను. పిదప సంతరిక్షమున వేలకొలఁది దేవతలును, గంధర్వులును, ఋషులును, సిద్ధులును నెల్లెడలఁ జూపట్టిరి. అప్పుడప్సరసలచేతను యక్షరాక్షసాదులచేతనుసంకులమై, యాకసముమఱియు మేఘావృతమైనట్లు గానవచ్చెను. అపు డెవ్వరును గానరాకయు, నాకసమున ద్రోణార్జున సంస్తుతిపరములగువచనములు మఱిమఱియు వినవచ్చెను. వారిచేఁ బ్రయుక్తములై యస్త్రములు ప్రజ్వలింప, నందులకు ఋషులును సిద్ధులును వచ్చి 'ఆహా! ఇది మానుషయుద్ధము గాదు. అటులే యాసురరాక్షసదైవగాంధర్వబ్రాహ్మాదియుద్ధములును దీనిని బోలియుండలేదు. ఇది మిక్కిలి విచిత్రముగా నున్నది. ఇట్టి దెన్నఁడును గని వినియుండలేదు. ఈద్రోణుఁ డిపాండవుని మించియు, నిపాండవుఁ డియాచార్యు నతిక్రమించియు విక్రమించుచున్నవారు. వీరియువురలో విశేష మెవ్వరును గనిపెట్టఁజాలరు. ఆరుద్రుఁడు తన్ను రెండురూపులుఁగా నొనర్చికొని యుద్ధముచేసెనేని, యపుడు వీరియుద్ధమునకు సాటి సంభవించునేమో? కాని వేఱొకయుద్ధము దీనికి సాటి యనరాదు. ద్రోణునం దొక్కజ్ఞానమే గలదుగాని, పార్థునందు జ్ఞానయోగములు రెండునుగలవు. అటులే యాచార్యునందు శౌర్య మొక్కటియు గలదు గాని, పార్థునందు బలశౌర్యములు రెండును గలవు. వీరియువురును నెట్టి మహారథికులకును జయింప నలవిగానివారు. వీరు. తలంతురేని, దేవతలతోఁగూడిన జగమునంతను నంతమొందింపఁగల్గుదురు.' అని పలుకఁ జొచ్చిరి. ఓమహారాజా! అవ్వీరుల నారసి కొన్నిభూతము లంతర్హితములయ్యెఁ, గొన్నికనఁబడియు, సంఘముగా నేర్పడి చూడసాగెను. పిదప మహామతియగుద్రోణుఁడు బ్రహ్మాస్త్రమును బ్రాదుర్భవింపఁజేయ, నది పార్థునిఁ దపింపఁజేయుటయగాక యంతర్హితములగుభూతములకెల్ల సంతాపమొదవించెను. వనద్రుమపర్వతాదులతోఁగూడఁ బుడమి వడంకసాగెను. ప్రతికూలవాయువులు వీవఁదొడఁగెను. సముద్రము లల్లకల్లోలములై కలఁతనొందసాగెను. అపు డాకురుపాండవసైన్యములం దందఱకును గొప్పభయముగలిగెను. ఆబ్రహ్మాస్త్ర మటు లుద్భవింప సకలభూతములకును జడుపుగలిగెను. అంత నప్పార్థుఁడును సంభ్రమములేక

బ్రహ్మాస్త్రమును జనింపఁజేసి,దానిని నివారింప,నపుడన్నియు నుపశమిల్లెను. ఎపుడు వారిరువురలో నొకఁడును, బార మొందఁజాలకుండెనో, యపుడు సైన్యమెల్లఁ జెదరి సంకులసమర మారంభమయ్యెను. ఓరాజా ! పిదప నాద్రోణార్జునులకు సంకులసమరము ప్రవృత్తమగుడుఁ, గొంచెమేనిఁ దెలియఁబడకుండెను. మేఘములచేవలె శరసమూహముచే నాకసము నిండుట, నపు డంతరిక్షచరు లందుఁ జరింప నవకాశము లేకుండెను.” అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## సంకులయుద్ధము

ఓరాజా! గజాశ్వపదాతిక్షయకరమగు సంగర మారంభమగుడు, దుశ్శాసనుఁడు ధృష్టద్యుమ్నునిఁ దలపడ, నతఁడు ద్రోణునిపై దృష్టి నిలిపియు,దుశ్శాసనశరాహతుఁడగుటఁ, గుపితుఁడై వానిరథాశ్వములను బీడించి, మఱియు నొకక్షణములో వానిసారథియు ధ్వజమును గనఁబడ కుండునట్లు శరపరంపరచేఁ గప్పెను. ఓరాజేంద్రా! అట్లు ధృష్టద్యుమ్న శరపీడితుఁడై, దుశ్శాసనుఁ డాతనియెదుట నిలువఁజాలక విముఖుఁ డగుడు, ధృష్టద్యుమ్నుఁడు మరల శరసహస్రములఁ గురియుచు నాద్రోణునే తలపడియెను. అంత నాధృష్టద్యుమ్నునిఁ గృతవర్మయు నాతనిసోదరులు మూవురును మార్కొనిరి. అపుడు నకులసహదేవు లాధృష్టద్యుమ్నుని రక్షించువారై, ద్రోణుని కభిముఖముగా దీప్య మానాగ్నివలె నిలిచియున్న యాతనివెనుక నిలిచియుండిరి. అపు డమ్మహా రథులెల్లరును యుద్ధమొనర్చువారై,కోపములడర, మరణమును లక్ష్యము సేయక, తమతమబలములు వెలయునట్లుగాఁ దలపడిరి. ఓరాజా! పరిశుద్ధ చరిత్రులును బరిశుద్ధాంతరంగులునై, పరస్పరజిగీషలతో వా రుత్తమగతి నపేక్షించి, తమతమ పవిత్రవంశాచారములకు దూరులుగాక ధర్మయుద్ధ మొనర్ప మొదలిడ, నందు ధర్మవిరుద్ధముగను, శస్త్రవిహీనముగను నించు కయు జరుగలేదు. అటులగుట నపుడు కర్ణియు, నాలీకము, విషాది లిప్తము, వస్తికము, సూచికపిశగవాస్థి గజాస్థికములు మున్నగు బాణము లుపయోగింపఁబడలేదు. వారందఱును ఋజువులగునస్త్ర ములనే ధరించి, కీర్తిని నుత్తమలోకములను గోరుచు ధర్మయుద్ధ మొనర్పసాగిరి. పిదప సకలదోషవివర్జితమగు సంకులయుద్ధ మారంభ

మగుడుఁ గృతవర్మాది యోధులు నలువురను సహదేవాదులగు మువ్వురను దలపడిరి. అంత నాధృష్టద్యుమ్నుఁడు వారిని గాంచియు, నకులసహదేవులే వారిని నివారింపఁజాలుదురని యెంచి తా నాద్రోణునిఁ దలపడియెను. పురుషసింహులగు నానకులసహదేవులు మన యోధులనలువురను నివారింపఁదలపడుటయు, వారును బర్వతములను మాఱుకొన్న వాయువులునా వెనువీయక పోరాడసాగిరి. అప్పుడానకులసహదేవులు వైరులలో నిరువురకుఁ నొక్కొక్కఁడై విక్రమించిరి. పిదప ధృష్టద్యుమ్నుఁడు ద్రోణుని శరవర్షమున ముంచుచు నెదుర్కొనుటఁ గాంచి, నకులసహదేవులను దమవారు కొందఱు నివారించుచుండిరిగదా యని తలంచి,యాధృష్టద్యుమ్నునిపైఁ దీవ్రనారాచములఁ గురియుచు,సుయోధనుఁ డాతని నివారింపవెడలెను. అప్పుడా సాత్యకి వడిగా వెడలి యాసుయోధను నెదుర్కొనియెను. పురుషవ్యాఘ్రులగు నాసాత్యకి సుయోధను లిరువురును దలపడి, పరస్పరముపీడించికొనుచుఁ, దమతమ బాల్యచరిత్రములను దలంచికొనుచు, నొకరినొకరు చూచుచుఁ, బరిహాసములొనర్చుచు, నందు సుయోధనుఁడు సాత్యకితో 'ఓ ప్రియమిత్రమా! సాత్యకీ! ఛీ! ఛీ! ఈక్షత్రియధర్మ మేటికి? ఓయీ! ఈ క్రోధలోభమోహాసూయలచే నేమిపని? ఛీ! ఛీ! క్షత్రియుల కేటియాచారమిది? ఈశరీరబల మేల? అటులగుట నేగదా! నీవు నన్నును, నేను నిన్నును దలపడవలసివచ్చెను. నేను బాల్యమున నీకుఁ బ్రాణప్రియుఁడను, నీవును నాకట్టివాఁడవెగదా! మనపిన్ననాఁటిచరిత్రములనెల్ల నిప్పుడేను స్మరించుచున్నవాఁడను. అవియెల్ల నీరణరంగమున జీర్ణములై, యిపుడు విస్మరింపఁబడినవిగదా! ఇఁక నీలోభక్రోధములతోఁ బనిలేదు. చేయవలసినది యుద్ధమే.' అని పలుకుచున్న సుయోధనునిఁ గాంచి, సాత్యకి యాతనితో సపరిహాసముగా 'ఓదుర్యోధనా! ఇదియొక సభగాదు. గురుగృహమును గాదు. ఇది మున్ను మనమాడుకొనిన తావునుగాదుగదా!' అని తీవ్రవిశిఖములను సంధించియుండెను. అంత నాసుయోధనుఁడు మఱియు నాతనితో 'ఓశినిపుంగవా! మనము బాల్యమున నాడుకొన్న యాఁటలెందుఁబోయెనో? అహో! మన కీయుద్ధమేటికి? కాలమతిక్రమింపరానిది గదా! ధనలోభముచే నేమైనను జేయవలసినదియేగాదే? మన మెల్ల

ధనలోభముచేఁ గాదే యిటులు గలిసి పోరాడుచున్నారము' అని పలికెను.

ఓ యాంబికేయా! అటులు పలుకుచున్న యాసుయోధను నారసి, మఱియు నాసాత్యకి యాతనితో ఓరాజా! క్షత్రియధర్మ మిట్టిది. ఇందు గురువులతో నైనఁ బోరాడవలయును. నీకు నాయెడఁ బ్రీతిగల్గె నేని జాగుసేయక నన్ను వధింపుము. నీవలన నే నుత్తమలోకముల నొందెదను. నీకుఁ గలశక్తియు బలమును నాపైఁ జూపుము. జాలము సేయకుము. మిత్రులగు మీగొప్పవ్యసనమును నేను బ్రదికి చూడఁ జాలను.' అని సువ్యక్తముగాఁ బలికి జాగరూకుఁడై నిరపేక్షముగాఁ గడువడి నాసుయోధనుని దలపడియెను. అటులు తనపైకి వచ్చు నాసాత్యకిని నీతనయుఁడు మాఱుకొని శరవర్షముచే నాతని ముంప నపు డాసాత్యకిసుయోధనులకు గొప్పయుద్ధమారంభమయ్యెను. అటులు వారు కుపితములగు గజసింహములువలె ఘోరముగాఁ దలపడి యుద్ధగర్వితుఁడగుసాత్యకిని గట్టిగా లాగి విడిచినశరసమూహముచేనాసుయోధనుఁడు నొప్పింప, సాత్యకియు వానిని దీవ్రనారాచములచేఁ బ్రతిప్రహార మొనరించెను. అంత నీతనయుఁ డేఁబదిటను నిరువదింటను దన్నటు లాసాత్యకి నొప్పించుటయు నగుచు నతఁ డాకర్ణాంతకృష్టములగు ముప్పదిబాణములచే నొప్పించి పిదప నొకక్షురప్రముచే నాసాత్యకిశరశరాసనముల ఖండించెను. అపు డాసాత్యకియు వేఱొకవిల్లుగొని కరలాఘవ మేర్పడ నీసుతునిపై శరసమూహమును బ్రయోగించెను. ఓరాజా! అటులు తన్నుఁ జంపుటకై వచ్చు నాసాత్యకిశరసహస్రమును నీతనయుఁడు బహుఖండములుగా ఖండింప నందుల కందలి వారందఱును సింహనాద మొనర్చిరి. మఱియు నీతనయుఁడు సువర్ణపుంఖములై సానవెట్టిన డెబ్బదిమూఁడుబాణముల నాసాత్యకి నొప్పింప సంధించుచుండునంతనే యాతఁడు తీవ్రనారాచములచే వాని ఖండించి మఱియు నీతనయుని శరసహస్రముచేఁ బీడించెను. ఓమహారాజా! మన సుయోధనుఁ డటులాసాత్యకిచేఁ బీడితుఁడై వేఱొకరథముపైకిఁ బోయి కొంతవడి విశ్రమించి మఱియు నాసాత్యకిని సమీపించి శరవర్షమును గురిసెను. అంత నాసాత్యకియు నీతనయునిపైఁ బెక్కుబాణములఁ బ్రయోగింప నయ్యది సంకులముగాఁ జొచ్చెను. అందుఁ బ్రయోగింపఁ

బడుచున్నట్టియుఁ బడునట్టియు బాణములచే నగ్ని యంటుకొన్న కారడ
వినివలె గొప్పచప్పుడుప్పతిల్లెను. వారిరువురశరసహస్రములచేఁ బుడమిఁ
గప్పఁబడియెను. అటులే యాకసమును గానరాక యుండెను. అటు
లయ్యును నీతనయు నాసాత్యకి మించుట గాంచి రాధేయుఁ డాతని
రక్షించువాఁడై వడిగా నందులకురాఁ జూచి భీముం డందుల కోరువక
వెడలి కర్ణునిపైఁ బెక్కుసాయకములు వర్షించెను. కర్ణుఁ డపుడు నగుచు
నాభీమునిశరపరంపరల ఖండించి మఱియు నాతనిశరశరాసనములఁ
దునిమి యాతనిసూతునిపైతముఁ బ్రహరించెను. భీముఁ డందులకుఁ
గనలి తనగదచే నారాధేయుధనుర్ధ్వజములను సూతుని మర్దించి మహా
బలుఁడై మఱియు నారాధేయురథచక్రమును భగ్నమొనరించెను.
అటులు భగ్నరథచక్రుఁడగుచు నాసూతసుతుఁడు కొండవలెఁ జలింప
కుండుటయు నాయేకచక్రరథమునే యాతనిగుఱ్ఱములు వహించు
చుండెను. సూర్యునిరథమునాఁదగు నాయేకచక్రరథము నధిష్ఠించియే
యారాధేయుఁ డెంతయుఁ గోపమడర భీమునిఁ దలపడి పలువిధములగు
సాయకసహస్రములచేతను నానావిధశస్త్రములచేతను బీడింప నపు డా
భీముఁడు కుపితుఁడై యతనితోఁ బోరాడఁ దొడంగెను. అటులుసంకుల
సమర మారంభమగుడు నాయుధిష్ఠిరుఁ డప్పాంచాలమాత్స్యయోధుల
గాంచి, "ఓవీరులారా! మనకెవ్వరు ప్రాణములును దలయునాఁదగి
మహాబలులై పోరాడుచుండిరో యట్టివీరులు ధార్తరాష్ట్రులకుఁ జిక్కి
యున్నవారుగదా! మూఢులవలె నిటులేల మతిచెడి యూరకున్నవారు?
మనమహారథులు యుద్ధముచేయుచున్నకడకు వడిగా వెడలుఁడు. క్షత్రి
యధర్మమును వదలకుఁడు. వైరులను జయించిగాని వధింపఁబడిగాని
యిష్టగతి నందుఁడు. జయింతురేని బహుదక్షిణలతో యజ్ఞముల
నొనర్పఁగలరు. హతులగుదురేని దేవత్వమొంది యుత్తమలోకముల
ననుభవింపఁగలరు' అని ప్రోత్సహింప నపు డవ్వీరులు క్షత్రియధర్మ
మును బురస్కరించికొని వడిగా నాద్రోణునిఁ దలపడిరి. అపు డాద్రో
ణునిఁ బాంచాలు రొకవంకను, భీమసేనాదులు వేఱొకవంకను బీడింప
నారంభించిరి. అంత నాభీమనకులసహదేవులు మువ్వురును విక్రమిం
చుచు, 'ఓయర్జునా! వడిగా వెడలి యాద్రోణుని రక్షించుకౌరవులను
బాఱఁద్రోలుము. అటులేని యప్పాంచాలు రాద్రోణుని వధింతురు'

అని గట్టిగా కేకలువెట్ట నప్పార్థుఁ డాకౌరవులపైఁ బడువిడెను. అంత నాద్రోణుఁడును, ధృష్టద్యుమ్నుఁడు మున్నగుపాంచాలురను నాఁటి పగటి పంచమకాలమున భంజింప నారంభించెను" అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## యుధిష్ఠిరుఁ డశ్వత్థామ చచ్చెనని పలుకుట

"ఓరాజా! మున్నా దానవనాశమునకై కుపితుఁడై విక్రమించిన యింద్రుఁడువలె, ద్రోణుఁ డప్పాంచాలురతో గొప్పయుద్ధ మొనర్ప సాగెను. ఓమహారాజా! ఆద్రోణునియస్త్రముచే వైరులు వధ్యము లగుచు వచ్చిరిగాని, యెట్టిబలవంతులును నాతనిఁ దప్పించికొనఁజాల కుండిరి. అటు లప్పాంచాలురును సృంజయులును నాద్రోణునిఁ దలపడి పోరుచు నాతనిశరసహస్రములచే నాచ్ఛాదితులగుచుండ, నపుడు శరశక్తులచే వధ్యమానులగువారినుండి, భైరవారావము లుప్పతిల్లెను. మహాత్ముఁడగు నాద్రోణునియస్త్రములచేఁ బాంచాలురు వధింపఁబడుచుండుటను బాండవుల కెంతయు భయముగలిగెను. అటులు తమసైన్యమున సంభవించినగజాశ్వపదాతుల మహాసంక్షయమును గాంచి యప్పాండవులు తమకిఁక జయముగలుగదనుకొనిరి. మఱియును వారపుడు 'ఆహా! ఈద్రోణుఁడు పరమాస్త్రవేత్తయై మనలనెల్ల నశింపఁజేయునేమో? వేసవి నెండుగడ్డి నంటుకొన్నయగ్నివలె మండుచున్నవాఁడు. ఈతని నెట్టి సమర్థుఁడేని దేఱిచూచుటకేని వలనుపడకున్నది. ధర్మవేత్తయై యర్జునుఁ డీద్రోణు నొకపుడును మార్కొనఁడు.' అని పలుకఁజొచ్చిరి. అంత నటు లెంతయు జడియుచున్న యక్కౌంతేయులవిధము చింతించి, మతిమంతుఁడగు నాదానవాంతకుఁడు వారికి శ్రేయముచేయువాఁడై పార్థునితో 'ఓయర్జునా! ఈద్రోణుఁడు ధనుర్ధరుఁడైయున్నయపు డాయింద్రాదిదేవతలును నీతని యుద్ధమున జయింపఁజాలరు. ఈతఁ డస్త్రసన్న్యాసమొనర్చినఁగాని మానవు లీతని జయింపఁజాలరు. కావునఁ బాండవు లిపుడు ధర్మమును విడిచి జయము సంపాదించువారై యుండవలయును. ఇపు డీద్రోణుఁడు మనలనెల్ల నెటులు చంపకుండునో, యట్లుగా నొక యుపాయ మొనర్పవలయును. అశ్వత్థామ హతుఁడగునేని యితఁడు యుద్ధమునుండి విరమించునని నానిశ్చయము. కావున, వాఁడు హతుఁ

డయ్యెనని యిపు డెవ్వఁడేని చెప్పవలయును' అని తెలిపెను. కాని యందుల కొక్క యుధిష్ఠిరుఁడు దక్కఁ దక్కినవారందఱును సమ్మతించిరి. అపుడు మహాబాహుఁడగు భీముఁ డాయుద్ధమున 'అశ్వత్థామ' యను పేరుగల యొకమహాగజమును జంపియుండెను. అటులగుట మాలవ్యుఁ డగు నింద్రవర్మని యాయేన్గును మనమందిడికొని లజ్జపడుచు మెల్లగా నాభీముఁ డాద్రోణునిఁ జేరి 'అశ్వత్థామా హతః' అని బిగ్గరగాఁ బలికెను. ఓరాజా! ఆభీమునివచనము విని, ద్రోణుఁ డెంతయుఁ దనకది యప్రియమగుట ఖిన్నమానసుఁడై నీటిలోఁ గూలిన యిసుకతిన్నెవలె నొడలెల్ల శిథిలమగుచుండ, వానివచన మనృతమని శంకించుచుఁ దన తనయుఁ డమానపరాక్రమనిధియని తలంచి దాని నష్టుఁడుండుట నించుకేని ధైర్యమును విడువఁడయ్యెను. అటులగుట నయ్యాచార్యుఁడు భీమునిమాటవినియుఁ గొంతవడి కెప్పటివడువున ధైర్యమూని తన పుత్త్రుఁడు శత్రులకు లోఁగకుండుట నిశ్చయించికొని, ధృష్టద్యుమ్నుని వధించువాఁడై తలపడి తీవ్రశరసహస్రమును బ్రయోగించుచుండఁ బాంచాలురును నాతని నరువదివేవురుగలిసి శరములచే నొప్పించిరి. వారటులుశరసహస్రములఁ గప్పఁగా నాద్రోణుఁ డపుడు గానరాక, మేఘములచేఁ గప్పఁబడిన సూర్యుఁడువలె నుండెను. అంత నాద్రోణుఁ డప్పాంచాలురశరసహస్రములనెల్ల ఖండించి బ్రహ్మాస్త్రమును బ్రాదుర్భవింపఁ జేసి ధూమహీనమై ప్రజ్వరిలునగ్నివలె నతఁడు ప్రకాశించెను. అటులతఁడు మఱియుఁ గుపితుఁడై ప్రతాపమేర్పడ సకలసోమకులను బ్రహరించుచు నప్పాంచాలురతలల నిలఁ బడఁద్రోయఁ దొడంగెను. అటులే వారిపరిఘాకారములగు బాహువులును బుడమిఁ బడుచుండెను. అపుడాభారద్వాజునిచే వధ్యమానులగుచుఁ బార్థివు లనేకులు గాలిచేఁ గూలినవృక్షములువలె నేలఁబడుచుండిరి. మఱియు హతములైపడు నేన్గులయు గుఱ్ఱములయు మాంసశోణితములపంకముచే నిండి పుడమి యగమ్యరూపమైయుండెను. అటు లాద్రోణుఁ డిరువదివేవుర పాంచాల రథికులను జంపి,యుద్ధరంగమున పొగలేక ప్రజ్వలించునగ్నివలె నుండెను. ఓరాజా! మఱియు నతఁడు కుపితుఁడై ప్రతాపమేర్పడ నొకభల్లముచే వసుదానునితలఁ దెగనేసి, పిదప నైదువందలమాత్స్యులను, నాలువేల సృంజయులను, బదివేలయేన్గులను, బదివేలగుఱ్ఱములను సంహరించెను.

అటు లాద్రోణుఁడు క్షత్రియజాతినెల్ల శూన్యముచేయఁ దలంచియుం డుటఁ గాంచి, యగ్నిదేవుఁడు ముందుగువారును ఋషులగు విశ్వామిత్ర జమదగ్ని భరద్వాజ గౌతమ వసిష్ఠ కశ్యపాత్రులును నాద్రోణుని సమీపించిరి. మఱియు సికతులును, బృశ్నులు, గర్గులు, వాలఖిల్యులు, మరీచిపులు, భృగువులు, నంగిరసులును నింకను సూక్ష్ములగుమహర్షులును నందులకు వచ్చిరి. అటులు వచ్చి వా రాతనితో 'ఓభారద్వాజా! అధర్మ యుద్ధ మారంభమైనది. నీనాశమునకు సమయము సమీపించి యున్నది. కావున నీక నాయుధము విడువుము. ఇందులకు వచ్చియున్న మమ్ముం జూడుము. ఈక్రూరకర్మము చాలును. ఇఁక నిట్టికృత్యము నీకొనరింపఁ దగినదిగాదు. నీవు వేదవేదాంగవేత్తవు. సత్యధర్మపరాయణుఁడవు. బ్రాహ్మణుండవగు నీకు బొత్తుగా నీకృత్యము తగనిది. కావున మోహము త్యజించి విల్లువిడువుము. శాశ్వతపథ మనువర్తింపుము. ఇపు డీమానవలోకమున నీవుండవలసినకాలము సంపూర్ణమైనది. అస్త్రవిద్య నెఱుఁగనివారెల్లరును నీబ్రహ్మాస్త్రముచే దహింపఁబడిరిగదా! ఓవిప్రోత్తమా! నీవిట్టిదుష్కృత్య మొనర్పరాదు. ఇఁక నీవాయుధమును వడిగా విడువుము. జాలముచేయవలదు. ఓద్విజోత్తమా! ఇంకను బాపిష్టతరమగు కృత్య మొనర్తువేటికి?' అని పలికిరి.

అది వినియు, భీమునివచనము వినియు, ధృష్టద్యుమ్నునిఁ గాంచియు, సంగ్రామవిషయమున నాద్రోణుఁడు విముఖుఁడై పరితపించుచు ధర్మజునిఁ జూచి, 'ఓయుధిష్ఠిరా! నాకొమరుఁడు హతుఁడయ్యెనో లేదో తెలుపు'మని యడిగెను. ఓరాజా! మూఁడులోకములయాధిపత్యము లభించునన్నను ధర్మజు డనృతమాడఁడని ద్రోణుని నిశ్చయము. కావుననే యతఁ డాధర్మజు నటులు ప్రశ్నించెనుగాని మఱియొవ్వనినే నడిగెనా? బాల్యమునుండియు నప్పాండవాగ్రజునెడ నట్టిసత్యాశ గలదు. అది గ్రహించియే పుడమిని బాండవరహితముగా నొనర్పఁ దలఁచియున్న యాద్రోణునిఁ జూచి యాగోవిందుఁడు యుధిష్ఠిరునితో 'ఓధర్మజా! కోపోద్దీపితుండైన యీద్రోణుఁ డిఁక నీపగటిసగమును యుద్ధముచేసె నేని, మనసేనయెల్ల నశించు ననుట సత్యదూరము కానేరదు. కావున, మమ్మెల్లఁ గాపాడుటకై సత్యముకంటె ఘనమైన యీాయసత్యమును బలుకుము. ప్రాణరక్షణమునకై పలికినయసత్యమువలనఁ బాపముగలుగ

నేరదు. అటులే కాంతాజనము నెడను, వివాహములవిషయమునను, గోవులను బ్రాహ్మణులను విత్తమును రక్షించుటయందును, ననృతమాడి నను బాతకము గలుగనేరదు' అని పలికెను. అటు లాయుధిష్ఠిరవాసు దేవులు సంభాషించుసమయమున భీముఁడు ధర్మజునితో 'ఓయన్నా! మహాత్ముఁడగు నీద్రోణునివధించునుపాయమువిని,యపుడే నీసైన్యమును జొచ్చిన మాలవుఁడగునింద్రవర్మని యశ్వత్థామ సంజ్ఞగలయేన్గు మడి యుట నెఱిఁగినవాఁడనగుట, నే నానచనము ద్రోణునితోఁ బలికితిని. నే నటులు'అశ్వత్థామా హత' యని పలికినను, నావచన మాతఁడు నమ్మఁ డయ్యెను. ఓరాజా! కావున నీవాగోవిందుని మన్నింపుము. ఇతఁడు మన జయముగోరుచున్న వాఁడు. ఆశారద్వతీసుతుఁడు హతుఁడగుట నాద్రో ణునకుఁ దెలుపుము. అటు లీవు పలికితేని, యీద్విజోత్తముఁడు యుద్ధ మును విడిచెడిని. ముల్లోకములందును నీవు సత్యవంతుఁడవుగాఁ బ్రసిద్ధి నడసినవాఁడవు' అని తెలుప విని మఱియుఁ గృష్ణునిచేఁ బ్రేరితుఁడై, యసత్యభయపీడితుఁడయ్యు, జయాభిలాషియై యుండుట నాయుధిష్ఠిరుఁ డనృతమాడ నిశ్చయించికొని 'అశ్వత్థామా హత' యని బిగ్గరగా నఱి చెను. అటు లఱచియు మెల్లగా నశ్వత్థామసంజ్ఞగలయేన్గు చచ్చెనని పలి కెను. అంతకుమున్ను పుడమికి నాలుగంగుళములు మీఁదుగానున్న రథ మతఁ డనృతమాడినతోడనే, రథాశ్వములు పుడమికంటునట్లుగాఁ గ్రుంగెను.అపుడాయుధిష్ఠిరువచనమాలించి యాద్రోణుఁడు పుత్రవ్యసన పీడితుఁడై జీవితాశ విడిచి, పాండవులకుఁ దానొకతప్పుచేసినవానిఁగా ఋషివచనములచే నిశ్చయించికొని, మనసుచెడి మిక్కిలి యుద్వేగముతో ధృష్టద్యుమ్నునిఁ గాంచియు, వెనుకటివలె వానితోఁ బోరాడఁజాలఁ డయ్యెను" అని తెలిపి మఱియు సంజయుఁ డిట్లనియె.

## ద్రోణధృష్టద్యుమ్నులయుద్ధము

"ఓరాజా! శోకోపహతచిత్తుఁడై యెంతయు నుద్వేగముపొంది యున్న యాద్రోణునిఁగాంచి, ధృష్టద్యుమ్నుఁడు తలపడియెను. ఓరాజా! మానవేంద్రుఁడగుద్రుపదుఁడు మహామఖమున యజించి ద్రోణునిఁ జంపుటకేగదా ఆధృష్టద్యుమ్నునిఁ గనియెను. అటు లాద్రుపదునింటఁ బ్రదీప్తమగునగ్నినుండి జనించినయప్పాంచాలపతి, ఘోరమైన జయ

శీలమై జలదధ్వనిగల యొకవిల్లుపట్టి, విషసర్పతుల్యములగు బాణములను దీసి, యందొకటి ధనువున సంధించెను. ఆకోలయాకృతి జ్వాలావృత మగునగ్నినా వెలయుచు నావింటికిని, వింటిత్రాటికిని నడుమఁ, బరివేషమధ్యగతుఁడగుభాస్కరుఁడునా విరాజిల్లుచుండెను. అటు లాధృష్టద్యుమ్నునిచేఁ బరామృష్టమై ప్రజ్వరిల్లు నావిల్లు గాంచి యందలిసైనికులెల్లరును, ద్రోణున కంతకాలము ప్రాప్తించుటను దలంచిరి. ప్రతాపశాలియగు ద్రోణుఁ డటు లాధృష్టద్యుమ్నుని బాణసంధానమును గాంచి, తనదేహమునకుఁ గాలపర్యాయము సంభవించెనని యూహించుచు, నప్పాంచాలుని వారించుటకై యత్నించియుండెను. ఓరాజా! అపు డమ్మహాత్మున కస్త్రములు స్ఫురింపకుండెను. అప్పటి కాతనికి నాల్గుపగళ్లును నొకరాత్రియుఁ గడచెను. అటులే మఱియు నొక పగలు మూఁడుభాగములయ్యెను. నాఁటి కాతనిబాణము లన్నియుఁ బూర్తినొందెను. అటులు బాణక్షయ మగుటయుఁ, బుత్రశోకమొకటి బీడించుటయు, నస్త్రములు ప్రసన్నములు గాకుండుటయు, మహర్షులవచనములను స్మరించి శస్త్రపరిత్యాగ మొనర్చువాఁడైయుండియుఁ దనతేజమేర్పడ వెనుకటివలె విల్లుగొని యాంగిరసమగు నా దివ్యధనువున బ్రహ్మదండములనాఁదగుసాయకములుసంధించి యాధృష్టద్యుమ్నునితో యుద్ధమునకు సిద్ధపడియెను. ఓరాజా! అటు లతఁడు తలపడి కుపితుఁడై శరవర్షముచే నాపాంచాలుని ముంచుచు ధృష్టద్యుమ్నుని నొప్పించి బహువిధములుగా వానిసాయకములను ఖండించుచు మఱియు వానిధనుర్ధ్వజములను సారథిఁ బడఁద్రోసెను. అంత నాధృష్టద్యుమ్నుఁడును వేఱొకవిల్లుగొని నగుచు నొకతీవ్రబాణముచే నా ద్రోణునివక్షమును నొప్పింప నతఁ డించుక సంభ్రాంతుఁడై తీవ్రమగు నొకభల్లముచే మఱియు నాధృష్టద్యుమ్నునివిల్లు దెగనేసెను. గదాఖడ్గములనుదక్కఁ దక్కినయప్పాంచాలుని ధనుర్బాణముల నన్నిటి నా ద్రోణుఁడు ఛేదించుచు మఱియుఁ దొమ్మిదిబాణములచే నాధృష్టద్యుమ్నుని నొప్పించి బ్రహ్మాస్త్రమును స్మరించుచుఁ దనగుఱ్ఱములు వాని గుఱ్ఱములను సమీపించునట్లుగాఁ గలిసెను. ఓరాజా! అటు లా రెండు రథములును సమీపింప నాద్రోణునిశోణాశ్వములును నప్పాంచాలుని పారావతవర్ణాశ్వములును నెంతయు విరాజిల్లెను. అపు డయ్యవి వర్ష

కాలమున గర్జించుచు మెఱుపులతోఁగూడిన మేఘములునాఁ జూపట్టెను. మఱియు నా ద్రోణుఁడు ధృష్టద్యుమ్నుని యీషాబంధమును, చక్ర బంధమును, రథబంధమును దెగనేయ నప్పాంచాలుఁడు భిన్నశరాస నుఁడును,విరథుఁడును,హతసారథియునై,తనకపుడు గొప్పయాపద వాటి ల్లుటయు, గదను వైచెను. అంత నా ద్రోణుఁడును దానిని దీవ్రనారాచ ములఖండింప, నాధృష్టద్యుమ్నుఁడు కేడెమును ఖడ్గమును ధరించి, నిస్సం శయముగా మహాత్ముఁడగు ద్రోణునకుఁ గాలము ప్రాప్తించుట నెంచి, తన రథేషనుండి రథనీడమందున్న యా ద్రోణుని సమీపించి, యాతనివక్ష మును భేదించి దుష్కరకర్మ మొనర్పనెంచెనై యాతనియుగమధ్యము నందును యుగరజ్జువులందును, మఱియు నాతనిశోణాశ్వములపిఱుదు లందును నిలువఁబడియుండుటను గాంచి యాతని నందఱును బొగడ సాగిరి. అటు లతఁ డాయుగములందును గుఱ్ఱముల వెనుకభాగమందును నిలుచుట యా ద్రోణుఁడునైతము గ్రహించుట కవకాశము లేకుండు టెంతయు నచ్చెరువొదవించెను. అప్పాంచాలుఁ డా ద్రోణుని సమీ పించుట యామిషము గోరి చరించు డేగపాటును దలపించెను. అటు లయ్యు నా ద్రోణుఁడు రథశక్తిచే నప్పాంచాలునిరథాశ్వములను జంప నవి పుడమిఁ బడియెను. అంత నా ద్రోణునిశోణాశ్వములును రథబంధము నుండి వీడిపోయెను. పిదపఁ దనగుఱ్ఱములు నశించుట కెంతయుఁ గనలి యాధృష్టద్యుమ్నుఁడు కత్తిఁబూని సర్పముపై వెడలినగరుడుఁడువలె ద్రోణుని సమీపించెను. ఓరాజా! అపు డా ద్రోణునిఁ జంపనున్న యప్పాంచాలునిరూపమాహిరణ్యకశిపువధ మొనర్పనున్న నారసింహుని రూపమును దలపించెను. మఱియు నపు డతఁడు భ్రాంతోద్భ్రాంతా విద్ధప్రసృతసృతాప్లుతులగు నిరువదియొకమార్గములను జరించుచు, ద్రోణు నంత మొందించుటకై ఖడ్గచర్మములఁ బూనియుండుటఁ గాంచి, యందున్న యోధులును నందులకు వచ్చియున్న దేవతలును నాశ్చర్య మొందిరి. ఓరాజా! అపు డా ద్రోణుఁ డాధృష్టద్యుమ్నుని చర్మఖడ్గ ములను బెక్కువిశిఖములచే ఖండించెను. వైరి సమీపించియున్న పుడు వానిపైఁ బ్రయోగింపఁదగు వైతస్తికములనెడి యాబాణము లాయా చార్యునకును, కృపాశ్వత్థామలకును, కర్ణార్జునులకును, సాత్యకిప్రద్యు మ్నులకును, నభిమన్యునకును దక్క వేఱెవ్వరికిని లేవు. అంత నా

ద్రోణుఁడు దృఢమగు వేతోకవేగవత్తరసాయకముపూని పుత్రతుల్యుఁడగు తనశిష్యుని జంప నుంకింప, దాని నాసాత్యకి, కర్ణదుర్యోధనులు గాంచుచుండఁగాఁ, బదిబాణములచే ఖండించి, యాచార్యునినోటఁబడిన యాధృష్టద్యుమ్నునిఁ దప్పించెను. అపుడుకృపద్రోణరాధేయులనడుమ రథమార్గములఁ జరించుచు, సత్యవిక్రముఁడై యున్న యాసాత్యకినవ్వాసుదేవార్జునులు చూచి, యర్జునుఁ డవ్వాసుదేవునితో 'ఓకేశవా! చూడుము. ఆచార్యుఁడు మున్నగురథికముఖ్యులనడుమ నిలిచి, వారి దివ్యాస్త్రములనెల్ల ఖండించుచు, నన్నును భీముని యుధిష్ఠిరుని నకుల సహదేవులను సంతసింపఁజేయుచున్నవాఁడు. వృష్ణివంశకీర్తికరుఁడగు నతఁడు శిక్షాపాటవము గల్గినవాఁడయ్యు, గర్వితుఁడుగాక, రణరంగమునఁ జరించుచున్నవాఁడు. మఱియు నందలియోధులు సిద్ధులును నాతని యద్భుతకృత్యమునకు మేలుమేలని సంతసించుచు, విస్మితులగుచున్నవారు.' అని పలికెను. అంత నయ్యిరువురు నాతనిఁ బొగడిరి" అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## ధృష్టద్యుమ్నుఁడు ద్రోణుని వధించుట

"ఓయంబికానందనా! ఆసాత్యకికృత్యమును గాంచి సుయోధనాదులు సహింపక, వడిగా వెడలి, యాతని నివారించువారై, తీవ్ర నారాచములఁ బ్రయోగింపసాగిరి. అపుడు యుధిష్ఠిరాదులును సాత్యకిని బ్రోచువారై సమీపించియుండిరి. మహారథులగుకర్ణకృపులును, దుర్యోధనాదులును శరవర్షముచే నాసాత్యకిని గప్పఁదొడంగుటయు, నతఁడును ఘోరమగునాసాయకవర్షమును ద్రోలఁగించుచు, వారితోఁ బోరాడుచు వచ్చెను. ఓరాజా! ఆమహాసంగ్రామమున మనయోధులు ప్రయోగించుచున్న దివ్యాస్త్రములనెల్ల నతఁడు తనదివ్యాస్త్రములచేఁ ద్రోలఁగించుచుండ, నప్పటియోధసమావేశమునఁ గ్రూరమగుయుద్ధ మారంభమయ్యెను. అపుడు కుపితుఁడై ప్రాణులను వధించురుద్రునియుద్రేకమాసంగ్రామమునఁ జూపట్టెను. ఓభరతపుత్రా! బాహువులయుఁ, దలలయు, ధనువులయు, ఛత్రములయుఁ, జామరములయుఁ బ్రోవులెందుఁ జూచినను గానరాసాగెను. అటులే భగ్నచక్రములగు రథములతోడను, దెగిపడినభుజములతోడను, హతులైనశూరులగుపదాతులతోడను

బుడమి నిండియుండెను. ఓకౌరవోత్తమా! బాణప్రహారప్రహతులగు నీ యోధులు పుడమిఁబడి పలువిధములుగా దొరలుచు రణరంగమునఁ గానవచ్చిరి. దేవాసురయుద్ధమునాఁదగు నామహాసంగ్రామమటు లారంభమగుడు, యుధిష్ఠిరుఁ డందలిక్షత్త్రియులతో 'ఓమహారథులారా! ఆ ద్రోణునిపైకిఁ బరువులిడుఁడు. ఇదె మనధృష్టద్యుమ్నుఁ డాతనిఁ దల పడియెను. మఱియు నాతనిఁ దనశక్తికొలందిని నశింపఁజేయనున్నవాఁడు. అందులకెన్నియేనిరూపములఁ జూపుచున్నవాఁడు. అటులగుట నిపు డతఁ డెటులేని ద్రోణునిఁ బడఁద్రోయకమానఁడు. కావున మీ రెల్లరును గూడి యాద్రోణునితోఁ బోరాడవలయును' అని తెలుప, మహారథులగుసృంజయులు సన్నద్ధులై, యాభారద్వాజునిఁ జంపఁ బరువు లిడఁదొడంగిరి. అంత నాద్రోణుఁడును వారి నారసి, తనమరణము నిశ్చయమని యెంచి, కడువడిగా వారిపైకి మరలెను. అటు లతఁడు వెడలు నంతనే పుడమి వడంకెను. సైన్యమునకు జడుపుగల్గునట్లుగా ఘోరములై వాయువులు వీవనారంభించెను. తనపతనముచే లోకమునకు గొప్పభయమును సూచించుచు, భాస్కరునుండి వెడలి గొప్పయుల్కపడి యెను. ఆద్రోణునివస్త్రములు జ్వలించెను. రథము లెంతయు మోఱయ, గుఱ్ఱములు కన్నీళులు గార్పఁజొచ్చెను. ఆద్రోణుఁడును నిస్తేజస్కుఁ డయ్యెను. మఱియు నపు డాతని కెడమబాహువు చలించెను. అతఁ డాధృష్టద్యుమ్నుని ముందుభాగమునఁ గాంచిచింతాక్రాంతుఁ డయ్యెను. బ్రహ్మవాదులగుఋషులయుత్తమలోకము నొందుటకై ప్రాణములను విడువనారంభించియు, పిదప నలుదెసలను ద్రుపదసైన్యము లావరించుటను, నపు డాద్రోణుఁడు క్షత్త్రియులనెల్ల దహించుచుఁ జరించెను. అంతకుము న్నిరువదివేలక్షత్త్రియులను వధించి, మఱియుఁ దీవ్రనారాచములచే నూఱువేలయోధులను సంహరించెను. ఓరాజా! అతఁ డపుడు పొగలేనియగ్నివలె జ్వలించుచు, క్షత్త్రియుల సర్వనాశమునొనర్ప నిశ్చయించి బ్రహ్మాస్త్రమును సంధించెను. అంత నాభీముఁడు హతసర్వాయుధుఁడై యున్న ధృష్టద్యుమ్నుని రక్షించువాఁడై మహాత్ముఁడగు ద్రోణుని సమీపించి, యప్పాంచాలునిఁ దనరథమందిడికొని చేరువ నుండియే శరప్రయోగమొనర్చు నాద్రోణునివిధముఁ గాంచి, ధృష్టద్యుమ్నునితో 'ఓవీరాగ్రణీ! నీవు తప్ప నీయాచార్యునితోఁ బోరాడు

వాఁడు వేఱొకఁడు లేఁడు. కావున ముందుగా నీతని వధించుటకే త్వర పడుము. ఈభారము నీయందుంపఁబడినది' అని తెలుప విని, యమ్మహా బాహుఁడగు ధృష్టద్యుమ్నుఁడు సర్వభారసహుఁడై క్రొత్తదై దృఢమైన యొకయాయుధ ప్రవరమునుబూని, సంరబ్ధుఁడై దుర్వారణుఁడగు ద్రోణు నిపై శరవర్షము గురియుచు, ద్రోణుని వారించువాఁడై యుండెను. అటు లాభీమధృష్టద్యుమ్ను లిరువురును సంరబ్ధులై, బ్రహ్మాస్త్రాదిదివ్యా స్త్రములను బ్రయోగించుచు, నాద్రోణు నాచ్ఛాదించిరి. మఱియు వా రాద్రోణునియస్త్రములను వారించి, వశాతులను, శిబులను, బాహ్లికులను గౌరవులను వధించుచుండిరి. ద్రోణుని రక్షింపనున్న వారినెల్ల సాత్యకి నొప్పించుచుండెను. ఓరాజా! అపు డాధృష్టద్యుమ్నుఁడు కిరణమాలి యగుసూర్యుఁడునా వెలయుచు, నెల్లెడల శరజాలముల నింపుచుండెను. అంత నాద్రోణుఁ డాపాంచాలునివిల్లు ద్రుంచి, మఱియు నొప్పింప, నతఁ డెంతయు నొచ్చెను. పిదప భీముఁడు కుపితుఁడై ద్రోణునిరథముపట్టుకొని యాతనితో మెల్లగా 'ఓయాచార్యా! అస్త్రవిద్యానిపుణులైన బ్రాహ్మ ణాభాసులు యుద్ధముచేయక నిజధర్మపరులై యుందురేని క్షత్రియజాతి నశింపకుండెడినిగదా! సర్వభూతములకును హింసయొనర్పకుండుటయే గదా! ధర్మసారమని పెద్దలు దెలుపుదురు. అట్టిధర్మమునకు బ్రాహ్మ ణుఁడే మూలముగదా! అందును నీవు బ్రహ్మవేత్తవు అట్టి నీవు చండా లునివలె మ్లేచ్ఛులను, మఱియుఁగల కొందఱను బుత్రదారధన వాంఛచే మూఢుఁడవై చంపుచున్న వాఁడవు. ఒక్కపుత్రునికై పెక్కు రను వధించు దుర్జనునివలె, నిజకర్మపరాయణులగుక్షత్రియులను, విరుద్ధ కర్మశీలుఁడవై చంపుచు, లజ్జింపకున్న వాఁడవేమి? నీవెవ్వనికై శస్త్రము పట్టి, యెవ్వనిఁగోరి జీవించుచున్న వాఁడవో యట్టి నీకొమరుఁ డిపుడు పుడమిఁబడియెను. దానిని బ్రశ్నించి తెలిసికొనియే యుంటివి. అదియు ధర్మజుఁ డెఱిఁగించియుంట నిఁక శంకింపఁ బనిలేదుగదా!' అని తెలిపెను. అది విని యాద్రోణుఁడు ధనువు విడిచి, ధర్మబుద్ధి గదుర సకలాస్త్రములను సన్న్యసించువాఁడై యిట్లు పలికెను.

'ఓకర్ణా! కర్ణా! ఓకృపాచార్యా! ఓసుయోధనా! ఇదె నేను దెలుపుచున్న వాఁడను. యుద్ధమునకుఁ దగుయత్న మొనరింపుఁడు. పాండ వులనుండి మీకు శుభమగుఁగాక. ఇదె శస్త్రము పరిత్యజించుచున్నాఁ

డను.' అని తెలిపి, మఱియు నాయశ్వత్థామునుగుఱించి యఱచెను. ఓరాజా! ఆభారద్వాజుఁ డట్లు వల్కి యారణరంగమున శస్త్రసన్న్యాస మొనర్చి, రథమునఁ గూరుచుండి, యోగనిష్ఠుఁడై సకలభూతములకును, భయము నొలఁగించువాఁడయ్యెను. అంత నాధృష్టద్యుమ్నుఁడును, నదియ తగుసమయమని యెంచి, తనశరశరాసనముల రథమందునిచి, కత్తివట్టి కొని వడిగా నాద్రోణుని సమీపించెను. అపుడు మానవాదులగుప్రాణు లన్నియును హాహాకారము లొనర్పసాగెను. మఱియు నట్టిద్రోణుని సమీపించియున్న యప్పాంచాలునిఁ గాంచి 'అయ్యో! అయ్యో!' యని పలుకసాగిరి. ద్రోణుఁడును నట్లు వల్కి శస్త్రసన్న్యాసమొనర్చి పరమ యోగనిష్ఠుఁడై తేజోరూపుఁడై, పురాణపురుషుఁడగువిష్ణుని మనమందిడి, మొగమించుకయెత్తి, వక్షముజూచి నిమీలితనేత్రుఁడై, ధారణాయోగ మువహించి, దేవదేవేశుఁడును నక్షరుఁడును బరమప్రభుఁడగు నాతని స్మరించుచు, సజ్జనులకును నొందరానియుత్తమస్థాన మాక్రమించి యుండెను. అతఁ డట్టులగుడు సూర్యు లిరువురని మే మూహించితిమి. తేజముచే నిండి యాకస మేకరూపమైయుండెను. సూర్యసన్నిభుఁడగు ద్రోణుఁ డట్లు భాస్కరునిఁగలియ నొకనిమేషమున నాతనితేజ మంత ర్హితమయ్యెను. అపుడు సంతుష్టులగు దేవతలందుఁ గిలకిలారావ ముద యించెను. అటు లాద్రోణుఁడు బ్రహ్మలోకమందుట మానవయోను లందు మేమేవురమే తెలియఁగల్గితిమి. అటులు యోగయుక్తుఁడై పరమ గతినొంది, యమ్మహాత్మునివిధమును నేనును, కృష్ణార్జునులును, కృపుఁ డును, యుధిష్ఠిరుఁడునుదక్కఁ,దక్కినవా రెవ్వరును దెలియరైరి. ఆయా చార్యుఁ డట్లు యోగనిష్ఠుడై బ్రహ్మలోకమునకు ఋషివర్యులఁగూడి పోవుటయు, నుత్తమగతినొందుటయు, మానవయోనులు గ్రహింపఁ జాలరైరి. అంత నాధృష్టద్యుమ్నుఁడు సకలభూతములును నిందింపం దొడంగ, ద్రోణునితలవట్టి గతప్రాణుఁడైయున్న యాతనిశరీరమునుండి తలను దప్పించి, సంతోషపూరితుఁడై కత్తిద్రిప్పుచు సింహనాద మొనరిం చెను. ఓరాజా! అమ్మహనీయుఁ డెనుబదైదేండ్లవాఁడై చెవులవఱకును బలితుఁడైయుండియుఁ, బదునాఱేండ్లవానివలె నీకుఁగా యుద్ధమునఁ బోరాడెను. అప్పు డప్పార్థుఁ డప్పాంచాలుం గాంచి 'ఓధృష్టద్యుమ్నా! ఆచార్యుని వధింపకుము. జీవముతో నాతనిఁదెమ్ము.' అని పలికెను.అటులే

సైనికులు నా ద్రోణునిఁ జంపరాదని పలుమాఱులు పలుకసాగిరి. అటు లర్జునుఁడు కనికరముతో నఱచుచుఁ బరువులిడసాగెను. పార్థివులెల్లరును వలదని ఘోషించిరి. అంతలో నాధృష్టద్యుమ్నుఁ డా ద్రోణుని వధించి, శోణితపూరితాంగుఁడై యాతనిఁ బడఁద్రోసి, లోహితాకృతి యగు నాదిత్యుఁడునాఁ జూపట్టెను. ద్రోణుఁ డిట్లు హతుఁడగుట సైనిక జనము గాంచుచుండెను. ఓరాజా! పిమ్మట నాధృష్టద్యుమ్నుఁ డా ద్రోణుని గొప్పతలను నీసైనికులయెదుటఁ బడవైచెను. అపుడు మన వారెల్లరును దాని నారసి, పలాయనపరులై నలుగెలంకులకుఁ జెదర సాగిరి. ద్రోణుఁడు మింటి నధిగమించి నక్షత్రమార్గమును బ్రవేశించెను. ఆవ్యాసమహర్షి యనుగ్రహముచే నేనే యా ద్రోణుని నిధనవిధమును జూచితిని. పొగలేక ప్రజ్వలించునగ్నిజ్వాలనాఁ దిన్నగా వెడలిన యాతని తేజమును నేను గాంచితిని. అటు లాద్రోణుఁడు హతుఁడగుటయుఁ గురుపాండవసృంజయులు నిరుత్సాహులై యుద్ధమును మాని, వడిగాఁ బరువులిడసాగిరి. సైన్యమెల్లఁ జెదరెను. ఆద్రోణుని తీవ్రవిశిఖములచే నెల్లరును నిహతులును, హతప్రాయులునైరి. అతఁడు మరణించుటయు, నీవారెల్లరును నిర్జీవులునాఁ జూపట్టిరి. అపు డందలిపార్థివులకుఁ బరాజయము పలాయితులగుటఁ బరలోకభయమును గల్గుట, నుభయలోక హీనులై ధైర్యము విడనాడి, యా ద్రోణునిశరీరము ననుసరించియుండిరి. పాండవులు జయమందినవారగుటను, గీర్తిపడసినవారగుటను, సింహనాదములను శంఖారావములను గావించిరి. ఓరాజా! భీముఁడును ధృష్టద్యుమ్నుఁడును బరస్పరముఁ గౌఁగిలించికొని, సోత్సాహులై సైన్యమునఁ గానవచ్చుచు, భీముఁ డాధృష్టద్యుమ్నునితో 'ఓపాంచాలపతీ! జయమునొందిననిన్ను మఱియుఁ గౌగిలించుకొనుచున్నాఁడను. ఇఁకఁ గర్ణుఁడును సుయోధనుఁడును హతులగుదురేని మరలఁ గౌఁగిలించుకొనెదను.' అనిపలికి యతఁ డెంతయు సంతోషమొదవఁ, బుడమి చలించునట్లుగా బాహువు లప్పళించెను. ఆగొప్పచప్పుడు విని నీవారెల్లరును జడిసి, క్షత్త్రియధర్మమును బరిత్యజించి, పలాయనపరాయణులైరి. పాండవులు శత్రుక్షయముగా జయమునొందినవారగుటఁ, బరమానందభరితులై సుఖముండిరి" అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

ద్రోణవధమున కశ్వత్థామ కోపించుట

"ఓరాజా! అపు డాద్రోణుఁడు హతుఁడగుడుఁ, గౌరవులు పాండవాస్త్రపీడితులై వీరులెల్ల విధ్వస్తులగుట నెంతయు శోకాకులులై, గర్వితులైయున్న శత్రువులను గాంచి, మఱిమఱియుఁ గంపమొందుచుఁ, గన్నీళు లేఱులుగా లజ్జావనతవదనులై దైన్యమొంది యుండిరి. అట్లు వారు ఖిన్నమానసులై యుత్సాహముచెడి, తేజోహీనులై మొఱలు వెట్టుచుఁ, జలించుచు, నలుదెసలు గాంచుచు, ధూళిఁబ్రుంగి యశ్రుకంఠులై మున్నాహిరణ్యాక్షుని మరణమున దైత్యులువలె దీనులై, యాసుయోధనుఁ జేర జడిసినక్షుద్రమృగములచేవలె వారిచే నావృతుఁడై, వారిని నిలుపఁజాలక, యచ్చోటనుండి యతఁడు వెడలిపోయెను. ఓరాజా! అపుడు నీయోధులు సూర్యతాపముచేవలె నెంతయు నాఁకలిదప్పులు తమ్ముఁ బీడింప వికలమానసులైరి. ఓరాజా! భాస్కరుని పతనమును, సముద్రశోషణమును, మేరువిపర్యాసమును, నింద్రపరాజయమునుబోలి, తలవనితలంపుగాఁ గల్గినయాద్రోణుని పతనమును గాంచి, వెఱపుగదుర మనకౌరవులెల్లరును బరువులిడిపోసాగిరి. పిదప శకునియు నట్లు జడిసియున్న కౌరవులను, హతుఁడైనద్రోణునిఁ జూచి భయభ్రాంతుఁడై తనసైన్యములతోఁ గూడి వడిగా మరలిపోయెను. అటులు వడిగాఁ బరువులిడుచున్న తమ మహాసైన్యమును దీసికొని రాధేయుఁడును భయముచే వెడలిపోయెను. హతములైన గజాశ్వాదులతోఁ గూడియున్న యారణరంగమును గాంచి, శల్యుఁడును జడిసి వెడలిపోయెను. అటులే కృపుఁడును, జావఁగా మిగిలినగజపదాతి ప్రభృతి సైన్యములఁగూడి 'అయ్యో! అయ్యో! ఎంతకష్టము వచ్చె'నని పలుకుచు, యచ్చోటు విడిచిపోయెను. మఱియుఁ గృతవర్మయు, మిగిలినభోజసైన్యముతోఁ గూడి కలింగారట్టబాహ్లికములగు జవనాశ్వములతో వెడలిపోయెను. ఓరాజా! ఉలూకుఁడును నటులుపడిన ద్రోణునిఁ గాంచి, భయపీడితుఁడై పదాతిగణములతోఁ గూడి పరువిడిపోయెను. శౌర్యనిధియు యువకుఁడునునగు దుశ్శాసనుఁడును, నెంతయు నుద్వేగముతో గజసైన్యపరివృతుఁడై వెడలిపోయెను. ఆద్రోణుఁడు పడుటఁ జూచి వెఱచి, వడిగాఁ బదివేలరథములను మూఁడువేలయేనుగులను వెంటనిడికొని

వృషసేనుఁడును బాఱిపోయెను. అటులే గజాశ్వరథాదులును బదాతులును దన్నావరింప సుయోధనుఁడును వెడలిపోయెను. ఓరాజా! పార్థునిచేఁ జావఁగా మిగిలినసంశప్తకులతోఁగూడి సుశర్మయు నాద్రోణమరణమున కోపక యచ్చోటు విడిచి పోసాగెను. అటులే యందఱివారందఱును నాద్రోణుఁడు హతుఁడగుటఁ గాంచి, తమతమ గజరథాశ్వాదుల నధిరోహించి వడిగా వెడలిరి. కొందఱు తండ్రులను దమ్ములను మామలను బుత్రులను మిత్రులను బిలుచుకొనుచుఁ బోసాగిరి. మఱికొంద ఱటులే తమతమ మేనల్లుండ్రను, సంబంధులను బిలిచికొని చెల్లాచెదరై పోసాగిరి. కొందఱు 'అయ్యో! ఇట్లు జరుగునని తెలియదయ్యె' నని హతోత్సాహులును, హతతేజులునై, జుట్టులువీడి వ్రేలాడఁగవచములను బరిత్యజించి వడిగా వెడలిరి. ఓరాజా! నీసైనికులందఱు నిటులు పరస్పరము నిలునిలుమని పిలిచికొనుచు, నాక్రోశించుచు, నొకరి కొకరుగాక పోసాగిరి. కొందఱు యోధు లలంకృతములైన తమరథములను హయములను బరిత్యజించి, వడిగాఁ గాలినడకతోఁ బరువులిడుచు వచ్చిరి. ఓయంబికానందనా! ఇటులు మనసైన్యమెల్లఁ దేజము చెడి, జడిసి పరువులిడిపోవుచుండఁగా, నపు డాద్రోణపుత్రుఁ డెదురీదిన మొసలివలె, శత్రువాహిని నెదుర్కొనియెను. అపుడు శిఖండి మున్నగు వారితో నాతనికి గొప్పయుద్ధము జరిగెను. అంత నతఁడు ప్రభద్రకులును బాంచాలురును జేదులును గేకయులును మున్నగువారితోఁ బోరాడి, యుద్ధగర్వితులగువారినుండి మెల్లగాఁ దప్పించుకొని, పరువులిడిపోవుచున్న తమసైన్యమును గాంచి సుయోధనుని వడిగాఁ జేరి యిట్లు ప్రశ్నించెను.

'ఓరాజా! మనసైన్యము లన్నియు జడిసి యిటులు పరువిడి పోవుచున్న వేమి? దీనిని నీవు నిలుపకుంటివేమి? ఓయీ! నీవును వెనుకటివలె సోత్సాహుఁడవై గానిపింపకున్నవాఁడవు. మనసైన్యమున నేరథికోత్తముఁడు హతుఁడగుట నిట్టిదురవస్థ వాటిల్లెనో తెలుపుము. రాధేయుఁడు మున్నగువారునై తము నిలువక పరువులిడుచున్నవారేమి? ఏయుద్ధములందును మనసేన యిట్లు చెదరిపోలేదుగదా! దాని కిపుడేమి ముప్పు వాటిల్లలేదుగదా?'

అది విని యాసుయోధనుఁ డాఘోరమగు నప్రియవార్త నాతని కెఱిఁగింపఁజాలఁడయ్యెను. ఓరాజా! రథస్థుఁ డైయున్న యాద్రోణ పుత్త్రునిఁ గాంచి మనసుయోధనుఁడు పగిలినయోడవలె, శోకసాగర మగ్నుఁడై యపు డాకృపునిఁ గాంచి లజ్జవొడమగా, 'ఓశారద్వతా! ఈమనసైన్యము చెదరిపోవుటకు నిమిత్త మెఱిఁగింపుము. నీకు శుభ మగుఁగాక.' అని పలికెను. పిదప నక్కృపాచార్యుఁడును సుయోధను నూఱడించుచు, నయ్యాచార్యవధమువిధ మంతయు నాయశ్వత్థామ కిటు లెఱిఁగించెను.

'ఓయయ్యఁడా! అశ్వత్థామా! పుడమిఁగలరథికులలో నుత్తముఁ డనఁదగు నాద్రోణునిఁ బురస్కరించికొని మేమెల్లరమును గేవల మప్పాంచాలురతోఁ బోరాడితిమి. అమ్మహాసంగ్రామమునఁ గౌరవులును సోమ కులును సంకులముగాఁ గలిసి, పరస్పరము గర్జించుచు, నొకరినొకరు శస్త్రములచేఁ బ్రహరించుకొనుచు, దేహపాతము లొనర్చుచుండిరి. అట్టి పట్టున నాధార్తరాష్ట్రసైన్యవినాశమును గాంచి, కుపితుఁడై నీతండ్రి బ్రహ్మాస్త్రమును బ్రయోగించెను. అటులతఁడు బ్రహ్మాస్త్రప్రయోగ మొనరింపఁ బాండవసైన్యములును గేకయమాత్స్యపాంచాలసైన్యము లును బహువిధముల నశింపసాగిరి. అపుడు కాలచోదితులై వేవురు వీరులును రెండువేలయేన్గులును నాతనిబ్రహ్మాస్త్రముపాలఁబడి మృతు లైరి. ఎనుఁబదైదేండ్లవాఁడై యాకర్ణపలితుఁడై శ్యాముఁడైననీతండ్రి, వృద్ధుఁడయ్యుఁ బదునాఱేండ్లవాఁడునా, యుద్ధరంగమునఁ జరించెను. అపుడు రాజవర్గము వధ్యమానమై సైన్యములు క్లేశ మొందియుండఁ బాంచాలురు విముఖులయ్యిరి. అటులు వారు భంగమొదవ వైముఖ్య మొందుటయు, నీతండ్రి తనదివ్యాస్త్రప్రభావమున, నుదయకాల సూర్యుఁడునా విరాజిల్లెను. మఱియు నంతంత కతఁ డప్పాండవసైన్య ములనడుమనిలిచి, శరకిరణుఁడై, ప్రతాపమదర మధ్యందినమార్తాండుని వలెఁ దేఱిచూడరాకుండెను. అటు లతనిచే దహ్యమానులగుచుఁ బరాక్రమములెడల, వారు నిరుత్సాహులై వికలచిత్తులై యుండిరి. ఆద్రోణబాణపీడితులై యున్న పాండవసైన్యములఁ జూచి, యామాధ వుఁడు పాండవజయాభిలాషియై, యందలివారితో 'ఓవీరులారా! ఈధనుర్ధరోత్తముఁడు పరుల కొకపుడును జయింపరానివాఁడు. ఆయిం

ద్రుఁడును నీతనిఁ గెలువఁజాలఁడు. కావున మీరెల్లఁగలిసి ధర్మమును విడిచి యిపుడు పాండవులను రక్షింపవలయును. మఱియు మీరెల్ల నాద్రోణునిపాలుగాకుండుట కాయశ్వత్థామ హతుఁడగుటకన్న వేఱొక యుపాయము లేదని నాయభిప్రాయము. అటులేని యీద్రోణుఁడు యుద్ధమును మానెడిని. కావున, మీలో నొకరాయశ్వత్థామ హతుఁడయ్యెనని యనృతమాడవలయును' అని తెలిపెను. అందుల కాయుధిష్ఠిరుఁడుదక్కఁ దక్కినవారందఱును సమ్మతించిరి. అతిప్రయాసముపై నాధర్మజుఁడు నందుల కంగీకరించెను. పిదప భీముఁడు లజ్జపడుచు వెడలి 'అశ్వత్థామాహత' అని నీతండ్రి వినఁబలికెను. అదివిని నీతండ్రి నమ్మక ధర్మజు నడిగెను. పుత్రవత్సలుఁడగు నీతండ్రి యటులు 'ధర్మజా! నాకొడుకు హతుఁడయ్యెనో లేదో తెలుపుము' అని ప్రశ్నింప నతఁడసత్యభయమగ్నుఁడయ్యు జయాభిలాషియై యుండుటచే, నంతకు మున్నె రణరంగమునమడిసినయశ్వత్థామసంజ్ఞగల యేన్గును మదినిడుకొని ద్రోణునిసమీపించి 'ఓయాచార్యా! నీవెవ్వనికై శస్త్రము ధరించితివో? ఎవ్వనికై జీవించియున్నవాఁడవో యట్టి నీప్రియపుత్రుఁ డశ్వత్థామ పడఁద్రోయఁబడియెను. వనమున సింహశిశువువలెఁ బుడమిఁబడి శయనించియున్నవాఁడు.' అని బిగ్గరగాఁ బలికెను. ఓయీ! ధర్మజుఁ డది తనకు దోషమని తెలిసియు నట్లుపలికి, యస్పష్టముగా నశ్వత్థామసంజ్ఞగలయేన్గు పుడమిఁబడియెనని పలికెను. ఓయల్లుఁడా! అంత నీతండ్రి నీమరణమును విని సంతాపపీడితుఁడై తనదివ్యాస్త్రములనెల్ల నుపసంహరించి, వెనుకటిచొప్పున యుద్ధముచేయమానెను. అటులు శోకసంతప్తుఁడై మిక్కిలి యుద్వేగమొందియున్న నీతండ్రిని గాంచి, యదె యదనని యాధృష్టద్యుమ్నుఁడు క్రూరకర్ముఁడై యాతని దలపడియెను. పిదప లోకతత్త్వజ్ఞుఁడగు నీతండ్రి వానిని జూచి, తనకు మృత్యువాసన్నమగుటఁ దలంచి, దివ్యాస్త్రములనెల్లఁ బరిత్యజించి రణరంగమునఁ బ్రాయోపవేశ మొనర్చెను. అపుడాధృష్టద్యుమ్నుఁడు తనయెడమచేత నాతనిజుట్టువట్టి, యందలివీరులెల్ల నాక్రోశించుచుండఁ, దలను ఖండించెను. చంపరాదు చంపరాదని యందలివారందఱును బలికిరి. అటులే యర్జునుఁడును రథముడిగి వలదు చంపవలదని పలుకుచుఁ బరువిడుచుఁ జేతులెత్తి 'ఓయీ! జీవముతో నాచార్యునిఁ దెమ్ము. చంప

షము' అని పలికెను. ఓయశ్వత్థామా! అటులు కౌరవులును నర్జునుఁడును వలదని వారించుచున్నను లక్ష్యముసేయక నీతండ్రి నాతఁడు వధించెను. పిదప సైనికులెల్లరును భయపీడితులై పరువిడసాగిరి. ఓయనఘా! నీతండ్రి హతుఁడగుటను మేమును నిరుత్సాహులమైతిమి.'

ఓయాంబికేయా! అంత నాద్రోణపుత్త్రుఁడు తనతండ్రిమరణవార్తవిని, తోకఁద్రొక్కినపామువలెఁ గోపోద్దీపితుఁడై, యారణరంగమున నెంతయుఁ బ్రజ్వరిల్లెను. అతఁ డట్లు కట్టెలప్రోవునంటుకొన్న యగ్నివలె ప్రజ్వరిలుచుఁ, జేతులు పిసికికొనుచుఁ, బండ్లుకొఱుకుచుఁ, బాములవలె నిట్టూర్పులిడుచుఁ గ్రోధతామ్రాక్షుఁడయ్యెను" అని తెలుప విని ధృతరాష్ట్రుఁడు సంజయునితో మఱియు నిట్లనియె.

## అశ్వత్థామకోపము

"ఓసంజయా! అటు లాధృష్టద్యుమ్నుఁ డన్యాయముగాఁ దన తండ్రిని వధించుట విని, బ్రాహ్మణుఁడును వృద్ధుఁడును దండ్రియునగుట నశ్వత్థామ యేమి పలికెను? ఏమహాత్ముఁడు పరశురామునివలన ధనుర్వేదమునొంది, గుణకాంక్షియై యాదివ్యాస్త్రములనెల్లఁ దనకొమరున కొసంగెనో యట్టిద్రోణునిమృతి కతఁ డేమి తలంచెను? ఈలోకమున గుణవత్తరుఁడగు పుత్త్రునిఁదక్క వేఱొక్కవస్తువు నధికముగా మానవు లపేక్షింపరుగదా! మహాత్ములగు నాచార్యులయందుఁ గలవిద్యారహస్యములన్నియు, వారిపుత్త్రులందును ననుసరించియున్నవారి శిష్యులందును సంక్రమించెడిని. అటులగుట నశ్వత్థామయు నాద్రోణునకుఁబుత్త్రుఁడును శిష్యుఁడు నైనవాఁడు. మఱియు నతఁడు శూరుఁడై, ద్రోణుని తరువాతి వీరుఁ డనఁబడియెను. ఇంద్రతుల్యపరాక్రముఁడగు నాతని యుద్ధవిధ మాపరశురామునకు సమ్మతమైనది. మఱియు నతఁడు వీర్యమునఁ గార్తవీర్యుని, బుద్ధిని బృహస్పతిని బోలినవాఁడు. ధైర్యముచేఁ బర్వతమై, తేజముచే నగ్నియై, గాంభీర్యముచే సాగరమై, క్రోధముచే విషసర్పతుల్యమైనవాఁడు. అతఁడు లోకమున రథికులలోఁ దొలుతటివాఁడై శ్రమమున కోరువక, గాఢ్పువంటివడిగల్గి, కుపితుఁడై రణరంగమునఁ జరించుచుండును. యువకుఁడైన యెవ్వఁడు ధరణి నడుగిడ సంగ్రామభూమి వడఁకునో యట్టిద్రోణసుతుఁడు సత్యపరాక్రముఁడు.

మఱియు నతఁడు వేదస్నాతుఁడును, వ్రతస్నాతుఁడును, ధనుర్వేద పారగుఁడునునై మహాసముద్రమువలెఁ గలఁతకు లోనుగాక దశరథ రామునిఁ బోలినవాఁడు. ధర్మిష్ఠుఁడును నాచార్యుఁడునగు తనతండ్రి నధర్మముగా నాధృష్టద్యుమ్నుఁడు వధించుట విని యశ్వత్థామ యేమి యొనర్చెను.? ద్రోణునకు ధృష్టద్యుమ్నుఁడు యజ్ఞసేనసుతుఁడై మృత్యు హేతువైనటు లాయశ్వత్థామ ధృష్టద్యుమ్నునకు మృత్యుహేతువు గదా! క్రూరుఁడును బాపుఁడును నల్పదర్శియు క్షుద్రబుద్ధియునగు నాధృష్టద్యుమ్నుఁడు తనతండ్రిని వధించెనని విని యాద్రోణసుతుఁ డేమిపలికెను." అని ప్రశ్నింప విని సంజయుఁ డాతని కిట్లనియె.

## అశ్వత్థామకోపించుట

"ఓరాజా! అధర్మముగా నప్పాపకర్ముఁడగు పాంచాలుఁడు తన తండ్రిని వధించుట విని, యశ్వత్థామ కుపితుఁడై బాష్పాకులితలోచ నుఁడై యుండెను. అటులు కుపితుఁడైన యాతనిమే నెంతయు దీప్తమై ప్రళయకాలమునఁ బ్రాణివినాశకుఁడైన యముని దేహమును బోలుపఁ దగియుండ నతఁడు మఱిమఱియుఁగనుల నీరు దుడిచికొనుచు నిట్టూర్పు పుచ్చుచు సుయోధనుతో నిట్లు పలికెను.

'ఓరాజా! శస్త్రము పరిత్యజించియున్న నాతండ్రిని క్షుద్రులగు వారు పడఁద్రోయుటయు, ధర్మచిహ్నముగల పాండవునిచే నిప్పాప మొనర్పఁబడుటయు నాకుఁ దెలిసినది. ధర్మజుని యన్యాయమును గ్రౌర్యమును వింటిని. ఓరాజా! యుద్ధప్రవృత్తులగువారికి జయపరాజయ ములలో నొకటి గలుగక తప్పకుండుట నాతండ్రి మరణించుట పొగడఁ దగినదియే. రణరంగమున యుద్ధముచేయువాఁడు న్యాయ్యవృత్తమొం దుట తగవు. అటులేని దుఃఖింపఁ దావులేదని పెద్దలు దెలుపుదురు. నా తండ్రి వీరస్వర్గమున కేగుట నిస్సంశయము. యుద్ధమున నతఁడు మర ణించినందుల కించుకేని నేను జింతింపలేదు. కాని యుద్ధమున ధర్మప్రవృ త్తుఁడై యుండుతఱి, నాతనిజుట్టుపట్టికొని సకలసైన్యము లరయుచుండ నప్పాంచాలుఁడు వధించుట కెంతయు నాచిత్తము త్తలపడుచున్న యది. నేను జీవించియుండఁగా నాతండ్రి కేశగ్రహణమొందెనుగదా! ఇఁక లోకమునఁ బుత్రులుగలవా రెవ్వరు పుత్రుల నపేక్షింతురు? కాము

క్రోధములచేఁగాని యవివేకముచేఁగాని, బాల్యమునఁగాని యధర్మ మొనరింతురు. పరిభవ మొనరింతురు. అట్టి గొప్పయధర్మము నీధృష్టద్యుమ్నుఁడొనరించెను. క్రూరుఁడై దురాత్ముఁడగు వానిచే నాకెంతయు నవమాన మొనర్పఁబడియెను. దానికిఁ దగుదారుణఫల మప్పాంచాలుఁ డనుభవింపఁగలఁడు. ఆయుధిష్ఠిరుఁడును మిథ్యావాదియై, యెంతయు నధర్మ మొనరించి, నాతండ్రి శస్త్రము విడుచునట్లుగా నొనర్చెనుగదా! అట్టి యాధర్మజుని రక్త మీభూమిపానముచేయక తప్పదు. ఓరాజా! ఇపుడు నాయిష్టాపూర్తముతో నొట్టుపెట్టుకొనుచున్నాఁడను. పాపకారియగు ధృష్టద్యుమ్నుని నేను జంపక మానను. మృదుదారుణకర్ములం దేదే నొకటిపూని యప్పాంచాలుర నెల్ల వధించి, శాంతివహించెదను. లోకమున మానవులెల్ల నిహపరములందలి మహాభయములనుండి రక్షించుకొనుటకేగదా! పుత్త్రులను వాంఛింతురు. దిక్కులేనివానివలె నాతండ్రి యట్టిదురవస్థనొందెను. కొండవంటికొడుకనై శిష్యుఁడనైన నేను జీవించియుండఁగా నతఁ డిట్టిదురవస్థనొందెనా? అయ్యో! నా దివ్యాస్త్రములచే నేమిపని? నాబాహుబలము గాల్పనా? నాపరాక్రమ మెందులకు? ఇట్టి నన్నుఁ బుత్త్రునిఁగాఁ బడసియుఁ, గేశగ్రహణపరాభవ మొంది, పరలోకగతుఁడైన యతనిబుణవిముక్తి యెట్టులగునో, యటు లొనర్పువాఁడను. ఆర్యుఁడగువాఁ డొకపుడును నాత్మస్తుతి యొనర్పుకొనరాదు. కాని, పితృవధము సహింపని నేనిపుడు నాపౌరుషమును జెప్పుకొనవలసివచ్చెను. జనార్దనుఁడును బాండవులును నాపరాక్రమ మిపుడు గాంతురుగాక. ప్రళయకాలమునవలె సకలసైన్యములను మర్దించెదను. నన్నిపు డాదేవతలును గాని, గంధర్వులుగాని, రాక్షసోరగులుగాని జయింపఁజాలరు. అస్త్రవేత్తలలో నర్జునుఁడుదక్కఁ దక్కిన వాఁడెవ్వఁడును నన్నుఁ బోలఁడు. తేజముగలవారిలో సూర్యుఁడువలె నేను బ్రజ్వరిల్లుచు సేనామధ్యమున నిలిచి, దేవసృష్టములగునస్త్రముల నెల్లఁ బ్రయోగించువాఁడను. ఇమ్మహాసంగ్రామమున నాశరాసనము నుండి వెడలినశరపరంపర లెంతయు వీర్యమును బ్రకటించుచుఁ, బాండవులను మథింపక మానవు. ఓరాజా! ఇపుడు వర్షధారలచేవలె నాశరధారలచే నెల్లదెస లావృతమగుట మనవారెల్లఁ గాంతురుగాక. మఱియు నెల్లెడల భీకరారావముగా శరజాలములఁ గురియుచుఁ, బెను

గాలి వృక్షములనువలె, శత్రుల నిపుడు పుడమిఁ బడద్రోయువాఁడను. ఓ రాజా! నేనొకయస్త్రము నెఱుఁగుదును. సకల్పము సనివర్తనమునగు దాని నాజనార్దనుఁడుగాని,పాండవులేవురుగాని,శిఖండి ధృష్టద్యుమ్నులు గాని, సాత్యకిగాని యెఱుఁగరు. మున్ను వేదరూపముతోఁ బ్రాప్తించిన యీనారాయణాస్త్రమును నాతండ్రి నారాయణునకుఁ గానుకగా నొసంగెను. దాని నాతఁడు పరిగ్రహించి యొకవరము గోరికొమ్మనెను. అపుడు నాతండ్రి యీయస్త్రమునే తనకుఁ బ్రసాదింపుమని కోరికొన, నాభగవానుఁ డాతనితో 'ఓ ద్రోణా! యుద్ధమున నీకు సాటియగువాఁ డొకఁడు గలుగఁడు. దీనిని నీకొసంగెదను. కాని దీని నెవ్వనిపై వడిగాఁ బ్రయోగింపరాదు. ఇయ్యది శత్రువధము సేయక మరలదు. దీని నెవ్వరును నివర్తింపలేరు. దీనిచేఁ జావనివాఁడెవ్వఁడు? ఇది వధింపఁదగని వానిని సైతము వధించునదగుట దీనిచి బ్రయోగింపరాదు. మఱియు నొకటి తెలిపెదను. ఇది ప్రయుక్తమైనపుడు రణరంగమునఁగలవారు రథముడిగి, శస్త్రములవిడిచి శరణమొంది యాచించిరేని, యట్టిశత్రువుల నిది వధింపదు. ఇవియే దీనిని శమింపఁజేయునుపాయములు. అటులు గానిచో నవధ్యులనేని బీడించుచు, నిది యెల్లవిధములఁ జరించును.' అని తెలిపి యొసఁగ, నాతండ్రి దానిని బరిగ్రహించి, యతఁడు నా కొసఁగునపుడును, 'పుత్రకా! ఈదివ్యాస్త్రముచే యుద్ధమునఁ దేజోనిధివై ప్రజ్వరిల్లుచు, దివ్యాస్త్రములను శస్త్రవర్షాదులను భేదింపఁగలవు' అని పలికి భగవంతునివచనము నెఱిఁగించెను. ఈనారాయణాస్త్రమిటులు నాకు నాతండ్రివలన సంప్రాప్తమైనది. దీనిచే నేను బాండవులను, బాంచాలురను,మాత్స్యులను, కేకయులను మున్నాయింద్రుఁడు దేవతలనువలెఁ దోలఁగించెదను. నాయీబాణములు నేనెవ్వరెవ్వరిపైఁ బడఁగోరుచుందునో వారిపైఁ బడును. యుద్ధరంగమున నిలిచి నాయిచ్ఛ వచ్చినట్టు లస్త్రవర్షము వర్షించెదను. మఱియు నయోముఖములగు బాణములచే రథికోత్తములనెల్లఁ బాఱఁద్రోలుదును. నిస్సంశయముగాఁ బలువిధములగుపరశ్వథములను సృజింతును. ఆశస్త్రప్రభావముచే నిట్లు పలురీతుల సృష్టములగునాయుధములచే శత్రువులగుపాండువులను ధ్వంసమొనర్చువాఁడను. మిత్రద్రోహియు, బ్రహ్మద్వేషియు, గురుహింసకుఁ

డును, మూర్ఖుఁడును, నిందితుఁడునగు నప్పాంచాలాపశదు నిపుడు జీవముతోఁ బోనీయను.'

ఓరాజా! ఆయశ్వత్థామవచన మాలించి, మనసైన్యమెల్ల మరల యుద్ధమునకు సిద్ధపడియెను. అంత మనయోధులు శంఖారావములొనర్చిరి. వేలకొలఁది భేరులును డిండిమములును మ్రోయింపఁబడెను. రథనేమి హయఖుర ప్రహారములచేఁ బుడమి ధ్వని యొనర్పసాగెను. ఆగొప్ప చప్పు డుప్పరమునను బుడమిని నిండుటయుఁ, బాండవులు విని యంద ఱునుగూడి యాలోచించికొనియుండిరి. అంతనాద్రోణసుతుఁ డుదకము స్పృశించి, యాదివ్యాస్త్రమును స్మరింప, నది ప్రత్యక్షమయ్యెను." అని తెలిపి సంజయుఁడు మఱియు ని ట్లనియె.

## అర్జునుఁడు ద్రోణవధమునకై చింతించుట

"ఓయాంబికేయా! అపు డానారాయణాస్త్ర మటులు ప్రాదుర్భవింప, జలబిందువులతోఁగూడ వాయువు వీవసాగెను. మేఘములు లేకయే మెఱుపులు గానవచ్చెను. పుడమి వడంకెను. సముద్రములు కలఁతవడియెను. సముద్రమునకుఁబోవునదు లెదురుగాఁ బ్రవహింపసాగెను. పర్వతశిఖరములు వ్రయ్యలుగాఁజొచ్చెను. మృగములు పాండవుల కపసవ్యముగాఁ జరించెను. సూర్యుఁడు నల్లవడి చీకట్లు గ్రమ్మికొనియెను. భూతపిశాచాదులు సంతోషముతో నందుల కరుదెంచెను. దేవదానవగంధర్వులు జడిసిరి. ఆయస్త్రముచేఁ గలిగినసమ్మర్దమును గాంచి యెటులగునో యని క్షత్త్రియులెల్లరును బీడితులై వెఱపునొందియుండిరి. భయప్రదమగు నాఘోరాస్త్రమును గాంచి యెల్లరును జింతాక్రాంతులైరి" అని తెలుప విని ధృతరాష్ట్రుఁడు "ఓసంజయా! పితృవధశోకతప్తుఁడగు ద్రోణపుత్రునిచే నటు లాసైన్యములు మరలింపఁబడ, ధృష్టద్యుమ్నునిపైకిఁ గౌరవులు వెడల, నాతనిరక్షణమునకై పాండవు లేమి యాలోచించిరి. నా కెఱిఁగింపుము" అనిప్రశ్నింప విని సంజయుఁడు మఱియు నాతనితో ని ట్లనియె.

"ఓరాజా! ద్రోణసుతుఁడు ప్రతిజ్ఞసేయకమున్నే కౌరవసైన్యములు పరువులిడుచుండుటఁ గాంచియు, సంకులధ్వని వినియు, యుధిష్ఠిరుఁ డర్జునుతో 'ఓతమ్ముఁడా! మనధృష్టద్యుమ్నునిచే నాచార్యుఁడు

హతుఁడగుడుఁ, గౌరవులు వజ్రహస్తునిచే వృత్రుఁడు హతుఁడుగా దానవులువలె, దీనులై యుద్ధజయమునుగోరక, యాత్మరక్షణపరులై పరువు లిడిరి. కొందఱు భయభ్రాంతులై రథములతోడను, నిహతులయిన పార్ష్ణిసారథులతోడను వెడలిరి. మఱికొందఱు పతాకాధ్వజచ్ఛత్రములు చెడి, శీర్ణ కూబరములై, భగ్న నీడములై, యాకులములైన రథము లధిరోహించి భీతులై వెడలిరి. వేఱొకకొందఱు తమపాదములతో గుఱ్ఱములను దఱుముచుఁ, దమంతఁదామె రథములఁ గడపుచుఁ బోవ సాగిరి. కొందఱు తమయాసనములు సగము జాఱునాసనములతో గుఱ్ఱములపైఁ గూరుచుండి, వానిచే నాకర్షింపఁబడుచుఁ బోవుచున్నవారు. కొందఱేనుఁగులపై బంధింపఁబడి, శరప్రహారములచేఁ జలితాసనులై, శరపీడచే వికృతములగుచున్న యాగజములతోఁ బోవుచున్నవారు. కొందఱు శస్త్రకవచహీనులై, వాహనములనుండి పుడమిఁబడుచున్నవారు. వేఱొకకొందఱు హయగజరథాదుల త్రొక్కుడులకుఁ జిక్కి నలిగి మొఱవెట్టుచు, 'తండ్రీ! కొడుకా!' అని యొకరినొకరు పిలిచికొనుచు, భయముచేఁ బరువులిడుచున్నారు. మఱికొందఱు మతులు చెడి యొకరినొకరు తెలిసికొనఁజాలక పుత్రులను దండ్రులను మిత్రులను భ్రాతలను జూచి, వారు శరహతులగుటఁ దమరథములపైఁ బెట్టుకొని, శీతలోపచారము లొనర్చుచుఁ, గవచములు విడిచిపోవుచున్నవారుగదా! ద్రోణునివధము గాంచి యట్టి యవస్థకొందియున్న కౌరవసైన్యము, మరల యుద్ధమునకుఁ దిరుగఁబడుటకు నిమిత్తమెఱుఁగుదేని నాకుఁ దెలుపుము. ఓయర్జునా! గుఱ్ఱములహాహాధ్వనులును, నేనుఁగులబృంహితధ్వనులును, రథనేమిధ్వనులును గలిసి పెచ్చుపెరిగి వినవచ్చుచున్నవి. తీవ్రములగు నీచప్పుడులెల్ల నాకౌరవసేనాసాగరమున జనించెనుగదా! అయ్యవి మఱిమఱియు హెచ్చుచుఁ బుడమిఁ జలింపఁజేయుచున్నవి. గగురుపాటొదవించు నీసంకులశబ్దమెచ్చోటినుండి వచ్చుచున్నదో గాని, యది ముల్లోకములను మ్రింగునేమో యని నాయభిప్రాయము. ఈయారావము వజ్రధరుని నినాదమునా భయమొదవించెడిని. కావున ద్రోణుఁడు హతుఁడగుటచే నింద్రుఁ డిందులకు వచ్చుచున్నాఁడు. గాఁబోలును, ఓధనంజయా! ఈభయంకరమగు మహానాదమును విని

రథికోత్తములు గరుడపాటోదవ నావేగపూరితులై యున్నవారు. ఇటులు భయపీడితులై వెడలినసైన్యముల నేమహారథుఁ డాపి, యా యింద్రునివలె ధైర్యశాలియై నివర్తింపఁజేయుచున్నవాఁడు?" అని ప్రశ్నించెను.

అది విని యర్జునుఁ డాయుధిష్ఠిరునితో 'ఓయగ్రజా! ఎవ్వనిపరాక్రమ మాశ్రయించి ధైర్యమొదవఁ గౌరవు లుగ్రకర్మమునకై దొడఁగి శంఖములు పూరించుచున్నవారో, మఱియు నెవ్వఁడు ద్రోణవధము జరిగినను, ధార్తరాష్ట్రులకు ధైర్యముగొలిపి నిలుపునో యనుసందేహ మెవ్వనియెడ మనకుఁ గలిగెనో, ప్రీయుంతుఁడును మహాబాహుఁడును మత్తద్విరదగమనుఁడును వ్యాఘ్రముఖుఁడును నుగ్రకర్ముఁడు నై, కౌరవుల కభయ మొసంగు నయ్యశ్వత్థామయే యిట్లు గర్జించుచున్నవాఁడు. మఱియు నెవ్వఁడు జనించినపు డాద్రోణుఁడు మహోత్తములగు బ్రాహ్మణులకుఁ బదివేలధనముల నొసంగెనో, యట్టి యశ్వత్థామయే యిట్టిశబ్దమునకు నిమిత్తము. ఓధర్మజా! అతఁడు జనించుచునే యొనర్చినగొప్పధ్వనిచేఁ బుడమియు మూఁడులోకములును వడంకెను. గుఱ్ఱమువలె సకిలించు నాతనిధ్వని వినియే యాకాశవాణి యాతని నశ్వత్థామయని పిలిచెను. అతఁడే యిట్లు ధ్వనిచేయుచున్నవాఁడు. క్రూరకర్ముఁడై మన ధృష్టద్యుమ్నుఁ డెవ్వని దిక్కులేనివానివలెఁ బట్టికొని వధించెనో, వానిని సంబంధించినదే యీనినాదము. ఆపాంచాల్యుఁడు నాగురునికేశపాశమును బట్టికొనుటచే, నిజపౌరుషము నెఱిఁగినయాద్రోణసుతుఁ డేవిధమున క్షమించును? రాజ్యలోభముచే నీవు మిథ్యావచనములాడి గురువును జంపించితివి. ధర్మజ్ఞుఁడవయ్యు నెంతయు నధర్మమాచరించితివి. వాలివధముచే రామునకువలె, నిటులు ద్రోణునిఁ జంపుటచే ముల్లోకములందును నీయపకీర్తి చిరకాలము నిలువక మానదు. 'సర్వధర్మజ్ఞుఁడును, నాకు శిష్యుఁడునగు ధర్మజుఁ డసత్యము వలుకఁ' డని విశ్వాసము నీయందుఁగలిగి నిన్నుఁ బ్రశ్నించెను. అపుడు సత్యకంచుకము ధరించి, యసత్యమాడి, కుంజరము హతమయ్యెనని మెల్లగాఁ బలికితివి. పిదప నతఁడు శస్త్రసన్న్యాసమొనర్చి, యహంకారమువిడిచి, తెలివితప్పి, వివశుఁడై యుండుట నీవు కన్నులారఁ గాంచినదియగదా! అపు డతఁడు పుత్రవాత్సల్యమడర, శోకసంతప్తుఁడై యుద్ధవిముఖుఁ డయ్యెను. శాశ్వ

తమగుధర్మమును విడిచి, శిష్యుఁడు గురువును జంపెను. న్యస్తశస్త్రుఁడగు గురు నధర్మముగా నీవు చంపితివిగదా! ఇఁక నీకు శక్తిగలదేని నీ మంత్రులతోఁగూడి యాపాంచాలుని రక్షింపుము. హతబంధుఁడగుటఁ గుపితుఁడైన యాచార్యసుతునిచే మ్రింగఁబడియున్న యాధృష్టద్యుమ్నుని మేమెల్ల రక్షింపఁజాలము. అమానుషశక్తిగల యెవ్వఁడు సకల భూతములందును జెలిమిగల్గియుండెనో, యట్టియశ్వత్థామ తనతండ్రి కేశగ్రహపరాభవము విని మనల నిపుడు దహించును. ఆచార్యప్రీతిగల నేను వలదని మొఱవెట్టుచుండఁగనే నిజధర్మమును విడిచి, శిష్యుఁడు గురుని వధించెను. మనకుఁ గడచినవయ సెక్కువ. మిగిలినది తక్కువ. అట్టిదాని కిపు డీగొప్పయధర్మము చేయఁబడియెను. మన కతఁడు సౌహార్దమునుబట్టియు ధర్మనుబట్టియుఁదండ్రియగుట సత్యము. అట్టివాఁ డిపు డల్పమగు రాజ్యమునకై చంపింపఁబడియెను. ఓయన్నా! ధృతరాష్ట్రుఁడు, తత్పరులగుపుత్రులతోఁ గూడఁ బుడమినెల్ల భీష్మునకును ద్రోణునకును నప్పగించెను. అట్టివృత్తినొంది యతఁ డందఱగౌరవమునకుఁ బాత్రుఁడయ్యుఁ, బుత్రునికంటె నధికముగా నన్నుఁ బరిగ్రహించినవాఁడు. అప్పటికి క్షయము లేకున్నను నీమాట నమ్మి యుద్ధమున మరణించెనుగాని, యుద్ధముచేయుచున్న యాతని నాయింద్రుఁడేనిఁ జంపఁగలుగునా? ఆచార్యుఁడును వృద్ధుఁడును నిత్యోపకారియు నగు నాద్రోణున కనార్యులమగుమనము రాజ్యాభిలాషచే నల్పబుద్ధులమై ద్రోహ మొనరించితిమి. రాజ్యలోభముచే నీద్రోణుఁ డన్యాయముగా మనచేఁ జంపఁబడియెను. అయ్యో! అయ్యో! ఎంత కష్టము. దారుణమగుపాప మొనర్చినవారము. నా కాతనియెడఁ గలప్రీతిచే నే నాతనివిషయమున బితరులను భ్రాతలను భార్యలను బుత్రులను సర్వమును బరిత్యజింతునని యెఱుఁగును. అట్టి నేను రాజ్యకాముఁడనై గురుఁడు చంపఁబడుచుండ నుపేక్షించితిని. కావున ఓరాజా! నేను దలక్రిందుగా నరకమునఁబడుచున్నవాఁడను. బ్రాహ్మణుఁడును వృద్ధుఁడును నాచార్యుఁడును శస్త్రము పరిత్యజించినవాఁడును మహామునియు నగుద్రోణుని రాజ్యమునకై చంపించి బ్రతుకుటకంటె మరణమె శ్రేయమని నాయభిప్రాయ'మని తెలిపె"నని చెప్పి సంజయుఁడు మఱియు నిట్లనియె.

ధృష్టద్యుమ్నార్జునులసంభాషణము

"ఓరాజా! అప్పార్థునివచనము లాలించి యందలిమహారథు లెల్లరును నది ప్రియమనిగాని యప్రియమనిగాని బదులు తెలుపరైరి. పిదప భీముఁడు కుపితుఁడై, యర్జునుతో నాతని నిందించుచు 'ఓయర్జునా! అడవిలోనున్న మునివలెధర్మసంహితను దెలుపుచున్నవాఁడవు. మఱియు దండము పరిత్యజించిన సంశితవ్రతుఁ డగుబ్రాహ్మణునివలె నున్నాఁడవు. క్షతమునుండి జీవించుచు, క్షతత్రాతయై, క్షత్త్రియుఁడు స్త్రీలను సాధువులను క్షమించుచుఁ, బుడమిని ధర్మమును గీర్తిని సంపదను బొందుచున్నవాఁడుగదా! సకలక్షత్త్రియగుణోపేతుఁడవై వంశోద్ధారకుఁడవగునట్టి నీవు, మూర్ఖునివలె నిపుడు మాటలాడుచున్నవాఁడవు. ఓకుంతీనందనా! నీవింద్రునివలె మిగులఁ బరాక్రమముగలవాఁడవు. సముద్రము వేలనువలె ధర్మమును దాఁట నిచ్ఛగింపకున్నవాఁడవు. మనము పదుమూఁడువత్సరములును ననుభవించినకష్టమును గోపమును వెనుకఁబెట్టి, ధర్మమునే తెలుపుచున్న నిన్నిపు డెవ్వఁడు గౌరవించును? ఓనాయనా! నీబుద్ధి యెపుడును క్రౌర్యమును సహింపక ధర్మమునే యనుసరించుచుండును. ఇపుడు నటులే దైవవశముగాఁ బ్రవర్తిల్లుచున్నది. ధర్మప్రవృత్తుఁ డగువానిరాజ్య, మధర్మముగా వైరులచే హరింపఁబడుచున్నది. మనవైరులు ద్రౌపదిని సభలోని కీడ్చికొనివచ్చిరి. మఱియు నారచీరలుగట్టించి వనములకనిపిరి. అటులట్టికష్టమును బదుమూఁడేండ్లు శత్రులమూలమున ననుభవించితిమి. ఓయనఘా! ఇక్కోపస్థానములన్నియు నీచే క్షమింపఁబడినవి. క్షత్త్రియధర్మమును సంబంధించియే గదా ఇదియెల్ల మనము చేసినది! వారొనర్చినయన్యాయధర్మమును దోలఁగించుటకై దాని నిపుడు స్మరించి, నీవు సహాయుఁడవుగా, మనరాజ్యము నపహరించిన యావైరులనెల్ల సబాంధవముగా నేను వధించెదను. ఈవిషయము మున్నీ వెఱఁగించినదియే. మనమెల్లఁగూడియేగదా యుద్ధసన్నద్ధులమైతిమి. అటులేయథాశక్తిగాఁ గలిసి పనిచేయుచున్నవారము. ఇపు డిటులీవు మమ్ము నిందించుచున్నాఁడవు. ధర్మమును దెలియఁగోరుచున్నాఁడవు. నీవచనము వ్యర్థమనఁదగియున్నది. భయపీడితులమైన మామర్మములను విరుద్ధవచనములచే నొప్పించుచున్నవాఁడవు. ఇయ్యది

దెబ్బపడిన వారి వ్రణమున క్షారమిడుచున్నట్లు గానవచ్చెడిని. నీవిట్టి వచనశల్యములచే బీడించుట నాహృదయము బ్రద్దలగుచున్నది. ధర్మజ్ఞుఁడవయ్యు, నధర్మస్వరూపమును దెలియకున్నవాఁడవు. నీవు నిన్నును మమ్మును నెన్నవలసియుండఁగాఁ బ్రశంసింపకున్నవాఁడవు. ఇందు వాసుదేవుఁడున్నను, ద్రోణసుతుని నుతించుచున్నవాఁడవు. వాఁడు బదునాఱవపాలేని నీకు సరియనవచ్చునా? నీయంతన నీదోషములనెన్నికొనుచుండియు లజ్జింపకున్నవాఁడవు. సువర్ణమాలికాభూషితమై భయంకరమైన నాగొప్పగదను బూని, పుడమి వ్రయ్యలుచేయుదును. కొండలను బిండిగావింతును. పర్వతములు నాఁదగువృక్షములను, బెనుగాలివలె నశింపఁజేయఁగల్గుదును. మఱియు, నాశరపరంపరలచే నింద్రాదిదేవతల నేనిఁ బాఱఁద్రోలఁగలను. అటులే రాక్షసగణములను, నసురోరగమానవులను దోలఁగింపఁగలను. ఓవీరోత్తమా! ఇట్టి నన్నీవు భ్రాతగా నెఱిఁగియు, నశ్వత్థామనుండి భయపడుట దగదుగదా! కాదందువా? ఓయర్జునా! సకలరాజన్యులును నీవు నూఱకుండుఁడు. నేనొకండనే గదాహస్తుఁడనై శత్రుల నోడించెదను' అని యిటులు కుపితుఁడై పలుకుచు, హిరణ్యకశిపునిపై గర్జించు నారసింహునివలెఁ జూపట్టెను. అంత నా ధృష్టద్యుమ్నుఁ డయ్యర్జునుతో 'ఓబీభత్సూ! యజనయాజనాధ్యయనాధ్యాపనదానప్రతిగ్రహము లనియెడియాఱుకర్మములును నుత్తములగు బ్రాహ్మణులకు విధింపఁబడినవి. వానిలో నతఁడు దేనియందుఁ బ్రతిష్ఠితుఁడు? అట్టిద్రోణుని నేను వధింపఁగా నీవు నన్ను నిందింపనేటికి? అతఁడు నిజధర్మమును విడిచి, క్షత్రియధర్మ మాశ్రయించినవాఁడు. అమానుషమగుబ్రహ్మాస్త్రముచే, క్షుద్రకర్మముపూని మనలఁ జంపుచున్నవాఁడు. ఓపార్థా! మాయను బ్రయోగించి యసహ్యుఁడైయున్న బ్రాహ్మణాధముని, మాయచే వధించుటలోఁ దప్పేమున్నది? అట్టి ద్రోణుని నేను జంపఁగాఁ, గుపితుఁడై ద్రోణసుతుఁడు భైరవారావమొనర్పనిమ్ము దానిచే నాకుఁ గల్గిన లోపమేమి? ఆద్రోణపుత్త్రుఁడు కౌరవులను రక్షింపఁజాలక, యుద్ధమనుమిషచే వారిని జంపించుననుటలో నద్భుత మేమియులేదు. ఓయర్జునా! నీవు ధార్మికుఁడవై నన్ను గురుఘాతిఁగాఁ బలుకుచున్నవాఁడవు. నే నాతనిఁ జంపుటకే ద్రుపదునింట నగ్నిలో జనించితి. ఓధనంజయా! యుద్ధముచేయుచున్న యెవ్వనికిఁ

గార్యాకార్యము లొక్కటిగా నుండెనో, యట్టిద్రోణుని బ్రాహ్మణుఁడని గాని క్షత్త్రియుఁడనిగాని యెట్లు చెల్పుచున్నవాఁడవు? అతఁడు కుపితుఁడై యస్త్రజ్ఞులుగానివారిని బ్రహ్మాస్త్రములచే నేల వధింపవలయును? ఓపురుషవర్యా! మాకెట్టియుపాయములచేనైనను నతఁడు వధ్యుఁడుగా నుండెను. అటులగుట నటులు చంపితిమి. ధర్మవేత్తలగువారు, నిజధర్మపరిత్యాగి విషతుల్యుఁడని తెలుపుదురు. ఈవిషయమెఱిఁగిన ధర్మతత్త్వజ్ఞుఁడవయ్యు, నిటులేల నిందించుచున్నవాఁడవు? క్రూరుఁడగునాతని, రథమందే పడఁద్రోసితిని. ఓయర్జునా! అట్టినన్నీవనింద్యునిఁగాఁగీర్తింపవేమి? ఓపార్థా! కాలాగ్నితుల్యమై, సూర్యాగ్నివిషతుల్యమై భయంకరమైన యాద్రోణశిరమును నేను ఖండింపఁ, బొగడఁదగియున్న నన్నుఁ బొగడవేమి? మఱియు నతఁడు తక్కినవారిని విడిచి, కేవలము నాబంధువులనే యుద్ధమున వధించెను. అట్టివానితలను దెగనేసినను నాపరితాప మడఁగకున్నయది. అటులు ఖండితమైనవానితల సైంధవునితలవలె నిషాదదేశమునఁ బడనైన లేకపోయితి ననుచింత నామర్మములను నొప్పించుచునేయున్నది. ఓయర్జునా! నీవన్నటులేని క్షత్త్రియునకు శత్రువధ మధర్మమనవలసియున్నది. క్షత్త్రియునకు శత్రునిఁ జంపుటగాని, వానిచేఁ జచ్చుటగాని ధర్మమనక తప్పదుగదా! కావున శత్రుఁడగునతఁడు నాచే యుద్ధమునఁ జంపఁబడుట ధర్మమేకాని వేఱుగాదు. నీతండ్రికి స్నేహితుఁడగు భగదత్తుని నీవెందులకుఁ జంపితివి? పితామహుఁడగుభీష్మునిఁ జంపి, యది నీకు ధర్మమనియే తలంచుచున్నవాఁడవుగదా! పాపుఁడగు శత్రునిఁ జంపిన నాకృత్యమును ధర్మముగఁదలంపవేమి? నీకు సంబంధినై లొంగియున్న నన్నీవిటులు నిందింపఁ బాడిగాదు. ఓయర్జునా! నిజశరీరమును సోపానముగ నొనర్చి, శాంతిమైఁ గూరుచుండినయేన్గువలె, నేను నీదురుక్తులనెల్ల సహించితిని. ద్రౌపదీద్రౌపదేయులకుఁగా నీవాడినవచనములకు సహింపవలసివచ్చెనుగాని, వేఱొకహేతువుచేఁ గాదు. కులక్రమాగతముగా నా కాద్రోణునితో వైరమువచ్చుచుండుట పాండునందనులగు మీ రెఱుఁగక లోకమెల్ల నెఱుఁగును. ఓయర్జునా! పాండవజ్యేష్ఠుఁ డనృతమాడను లేదు. నేను ధార్మికుఁడను గాకుండుటయును లేదు. పాపుఁడగుశిష్యద్రోహి హతుఁడయ్యెను. కావున యుద్ధమొన

ర్పము. నీకు విజయమగుఁగాక.' అని తెలిపె" నని చెప్పిన విని ధృత రాష్ట్రుఁడు మఱియు ని ట్లనిరియె.

## సాత్యకి ధృష్టద్యుమ్నునిపైఁ గోపించుట

"ఓసంజయా! మహాత్ముఁడగు ద్రోణుఁడు యథావిధిగా వేదవేదాంగముల నధ్యయనమొనర్చెనుగదా! మఱియు వినీతిగలయాతనికి ధనుర్వేదము సాక్షాత్కరించి యాతనియెడ నిలిచెను. మహర్షితనయుఁడగు నాద్రోణుఁ డట్లు శోకతప్తుఁడై మొఱవెట్టుచుండఁగా, నాతనియెడ గురుఘాతియగు నాధృష్టద్యుమ్నుఁడు నీచకర్మ మొనరించెను. ఆతనియనుగ్రహము చేఁగదా! వీరులై యనేకులు, దేవతలకును సుకరములుగాని యద్భుత కృతము లొనర్చుచున్నవారు. అట్టిద్రోణుఁడు తమసమక్షమున నిందింపఁబడుచుండ, వానిని క్షత్త్రియులెల్లరును గోపింపరైరి. ఛీ! క్షత్త్రియ ధర్మ మేమిప్రయోజకము? వారికోపముల కింకెపుడు ప్రయోజనము? ఓయీ! పుడమిని ధనుర్ధరులగు రాజులెల్లరును, పాండవులును వానివచనములు విని యేమనిరో నాకది యెఱిఁగింపుము."

అది విని సంజయుఁ డాతనితో "ఓయాంబికేయా! క్రూరకర్ముఁడగు నాద్రుపదపుత్త్రునివచనములు వినియు, నందుఁగలరాజులెల్లరునుఁ నూఱకుండిరి. కాని యర్జునుఁడుమాత్రము, సకోపముగా నాద్రుపదపుత్త్రునిఁ జూచి, కన్నులనీరోడ్తై ప్రవహించుచుండఁగా 'ఛీ! ఛీ!' అని పలికెను. అపుడు యుధిష్ఠిరుఁడును భీముఁడును నకులసహదేవులును మఱికొందఱును లజ్జితులై యుండిరి. అంత నాసాత్యకి కుపితుఁడై 'ఓ వీరులారా! అసంబద్ధముగాఁ బలుకుచున్న యిప్పాపాత్ము నీనరాధముని వడిగా మీలో నొకఁడు వధించువాఁడు లేఁడా? ఓపార్షతా! చండాలుని, బ్రాహ్మణులువలె, నిష్పాపకర్మ మొనర్చిన నిన్నీ పాండవులెల్లరును నిందించుచునే యున్నవారు. నీవిట్టిమహాపాప మొనరించి, సకలసాధుజన దూషితుఁడవయ్యు, నిట్టు లీపీసభకువచ్చి పలుకుటకు సిగ్గుపడవేమి? నీ తలయు నాలుకయు నూఱువిధములుగా నేల వ్రయ్యలు గాకున్నయది? ఓనీచా! అధర్మముగా నాగురుని నిందించు, నీకేల పతనము గలుగ కూడదు? నీవిపుడు పాండవులకును, వృష్ణ్యంధకులకును నిందింపఁదగి యున్నవాఁడవు. కలుషకర్మ మొనర్చియు, నీయందఱిలోఁ గొనియాడు

కొనుచున్నవాఁడవు. అట్టితగనిపని యొనర్చుటయేగాక, నాగురుని నిందించుచున్న నీవు నాకు వధ్యుఁడవు. ఇఁక రెండుగడియలేని నీవు జీవింపవలసినప్రయోజనములేదు. నీవుతప్ప మఱియేనీచుఁ డార్యుఁ డొనర్పరాని యిట్టిదుష్కృత మొనరించును? ధర్మాత్ముఁడును సజ్జనుఁ డును గురునికేశగ్రహణ మెవ్వఁడే నొనర్చునా? నీకు వెనుకముందుల నేడుతరముల నీవారు నరకపతితులగుచుఁ, గులపాంసనుఁడవగు నీమూల మునఁ దమకుఁగలకీర్తిని గోల్పోవక మానరు. పార్థుఁడు భీష్ముని వధించె నని పలికితివి. అందుల కుత్తర మొసంగెదను వినుము. ఆగాంగేయుఁడే తనంతనఁ దనయంత మటు లొందింపవలయునని విధించెను. ఆమహా నీయునిసైతముఁ బాపాత్ముఁడగు నీసోదరుఁడేగదా! వధించినవాఁడు. పాంచాలపుత్రులను మించినపాపాత్ముఁ డొకఁ డిప్పుడమిని లేఁడన వచ్చును. వానినిగూడ నీతండ్రి భీష్మాంతకరునిఁగా జనింపఁజేసిన వాఁడఁట. అప్పార్థుఁడు శిఖండిని రక్షించెను. వాఁ డామహాత్మునకు మృత్యువయ్యెను. క్షుద్రులగుపాంచాలురు మిత్రగురుద్రోహులై ధర్మ మునుండి యెడలినవారు. నీవట్టిసోదరుఁడు గల్గుటను సకలసాధుజనము లచే, ఛీ! యనిపించుకొంటివి. ఇపుడు మరల నాసమీపమున నిట్టిమాట 'లాడెదేని, వజ్రతుల్యమగుగదచే నీతలఁ బగులఁగొట్టుచున్నవాఁడను. బ్రహ్మహత్యయొనర్చిన నిన్నుఁ గాంచి, జనము సూర్యునిఁజూచుచున్నది. అట్టిప్రాయశ్చిత్తముచేఁగాని, వారు తమపాపమును బోఁగొట్టుకొనఁ జాలరు. ఓదుశ్చరిత్రా! ఓపాంచాలాపశదా! నాయెదుటనే నాగురుని నిందించుచు, నాగురుని గురువధము నెన్నుచు లజ్జపడకున్నవాఁడవు. నిలునిలుము ఇదె నాగదాపాత మొక్కటి సహింపుము. లేదా! నీగదా పాతములనేనిఁ బెక్కింటిని సహించెదను.' అని పలికెను.

ఇటు లాసాత్యకి మిక్కిలి పరుషముగాఁ బలుక, విని యాధృష్ట ద్యుమ్నుఁ డెంతయుఁ గుపితుఁడై, వెడనవ్వు నగుచు 'ఓశైనేయా క్షమించితి ననుచున్నాఁడవు. వింటిని. వింటిని. ఎపుడేని దుష్టుఁడు నిర్భా గ్యుఁడు నగువాఁడే సజ్జనుని నిందించును. లోకమున శాంతి ప్రశంసింపఁ దగినదియే. కాని, పాపుఁడగువాఁ డద్దాని కర్హుఁడు గానేరఁడు. శాంతి మంతునిఁ, బాపాత్ముఁడు జయించితినని తలంచుచుండును. నీచమాన సుఁడవును, బాపనిశ్చయుఁడవును, క్షుద్రసమాచారుఁడవు నగునీవు,

గోరు మొదలుగఁ గేశాంతముదనుక నిందింపఁదగి యుండియు, నొకని నిందింపఁ గోరుచున్నాఁడవు. బుజము దెగి ప్రాయోపవిష్టుఁడై యున్న యా భూరిశ్రవుని నీవువలదు వలదనిపించుకొనుచుండియు వధించితివిగదా! అంతకుమించిన పాపమేది? ఓరీ! రణరంగమున దివ్యాస్త్రముల నుపయోగించుచు, వ్యూహము పన్నియున్న యాద్రోణుఁడు, శస్త్రపరిత్యాగియై నాచే హతుఁడగుట, యది యొకదుష్కృతమా? యుద్ధము మాని ప్రాయోపవిష్టుఁడై వేఱొకరిచే బాహువుదెగి, మాటలాడక నియతుఁడై యున్నయాతనిఁ జంపినవాని నేమనవలెను? అప్పుడాపాపి యేమి చెప్పఁగల్గును? నీవు వీరుఁడవై యుండియు, నిన్నతఁడు కొట్టి, కాలఁద్రొక్కి మట్టి విక్రమించునప్పుడాతనిఁ జంపకుంటివేమి? మున్నర్జునుచే జయింపఁబడియుండ, దుర్జనుఁడవై ప్రతాపనిధియై శూరుఁడనఁదగు నాభూరిశ్రవుని వధించితివిగాదే! ఆద్రోణుఁడు పాండవసైన్యముల నెందెందుఁ దఱుముచుండెనో, యందులకెల్ల శరసహస్రములఁ బఱపుచు, నేను వెడలుచు వచ్చితినిగాదే. నీవు బుద్ధిపూర్వకముగాఁ జండాలునివలె నిట్టి దుష్కృత్యమొనర్చి నిందాపాత్రుఁడవయ్యుఁ, బరుషవచనములచే నొక్కరి నిందించెదవేటికి? ఓవృష్ణికులపాంసనా! ఇట్టిదుష్కృత్యమునకుఁ గర్త నీవుగాని నేనుగాను. పాపకర్మములకెల్ల నీవే యావాసము. మఱి మాటలాడకుము. ఊరకుండుము. ఇంతకుమించి మరల నన్నుఁ బలుకుట నీకుఁ దగదు. ఇది తక్కువజబాబు. ఇఁక నన్నుఁ బలుకఁదగవు. ఇంకను మూర్ఖుఁడవై, మఱియు నన్నుఁ బరుషముగా నిట్టుపలుకుదేని, నీతో నిపుడు యుద్ధమొనర్చి, నాబాణములచే నిన్ను యమమందిరము నొందింపకమానను. కేవల మూర్ఖధర్మముచే నేదియు వశపడదు. ఆకౌరవులధర్మముగా నొనర్చినచేష్ట యెట్టిదో దెలిపెదను వినుము. పూర్వమీ యుధిష్ఠిరుఁ డధర్మముగా వంచింపఁబడియెను. ఓసాత్యకీ! అటులే ద్రౌపదియు నన్యాయముగాఁ గ్లేశమొందింపఁబడియెను. ద్రౌపదితోఁగూడఁ బాండవు లరణ్యమునకుఁ బంపఁబడిరి. ఓ తెలియనివాఁడా! అటులే యన్యాయముగాఁ బాండవులసర్వస్వమును వారపహరించిరిగదా! మనకు సహాయుఁడుగావచ్చుచున్న శల్యుఁడును వారిచేఁ దీసుకపోఁబడియెను. అటులే యన్యాయముగా బాలుఁడగు నభిమన్యుఁడు వారిచే వధింపఁబడియెనుగాదే? ఇఁక వీరుడు భీష్ముని నన్యాయముగా వధించిరి. ధర్మము

దగ్ధమనునట్లుగా నీవును భూరిశ్రవునిఁ బరిమార్చితివి. ఇటు లావైరులును, పాండవులును జేసిరిగదా! ఓసాత్వతా ! ధర్మజ్ఞులును, వీరులు నగు వీరుభయపక్షములవారును జయమును గాపాడుకొనువారై యిటులొనర్చిరి. ఉత్తమధర్మ మెదియో యధర్మ మెదియో తెలియుట దుర్ఘటము. కౌరవులతోఁ బోరాడుముగాని యమమందిర మెందకుము.' అని పలికెను.

ఓయాంబికేయా! క్రూరములును బరుషములు నగునిట్టివచనములాధృష్టద్యుమ్నుఁడు పలుక విని, యంతయుఁ జలింపఁజేయఁబడినవాఁడై కోపారుణితనేత్రుఁడై యాసాత్యకి గదను బూని, పాముగలె నిట్టూర్పు వుచ్చుచు, చేతివిల్లు రథమందిడి యాధృష్టద్యుమ్నునిపైకి వడిగా వెడలి, యుద్రేకముతో 'ఓపాంచాలా ! ఇఁక నిన్నేమియుఁ బరుషముగాఁ బలుకను. వధార్హుఁడవగుట వధించెదను.' అని పలుకుచుఁ, గుపితుఁడై వెడలి మహాబలుఁడై యప్పాంచాలుఁ నెదుర్కొని, యంతకున కంతకుఁడుగాఁ జూపట్టెను. అపుడు వాసుదేవునిచేఁ బ్రేరితుఁడై, మహాబలుఁడగుభీముఁడు రథమునుండి వడిగా దిగి, బాహువులతో సాత్యకినిబట్టికొని వెనుకకు లాగికొనిపోవఁ బ్రయత్నింపగాఁ, దుదికతఁ డాఱవయడుగున నిలువరింపఁబడియెను. అటులు రథముడిగి బలశాలియై యాభీముఁడు నిలుప, నపు డాసహదేవుఁడు వెడలి, మృదువచనములతో 'ఓశినిపుంగవా! మాకుఁ బాంచాలురకంటెను, వృష్ణ్యంధకులకంటెను బరమమిత్రు లొక్కరు లేరుగదా! అట్లే వృష్ణ్యంధకులకును బాండవపాంచాలురే పరమమిత్రులు. అందును విశేషించి మావలనఁ గృష్ణునకును, నీతనికంటెఁ బరమమిత్రుఁడు వేఱొకఁడు లేఁడుగదా! ఓవార్ష్ణేయా! సముద్రాంతముగా వెదకినను బాంచాలురకు, బాండవవృష్ణులకంటెను, వేఱొకమిత్రులు లేరనుట సత్యము. నీవు తలంచినట్లుగనే నీవును మాకుఁ బరమమిత్రుఁడవుగదా! మీరు మాకెట్టులో మేమును మీకట్టివారమేగదా! ఓసర్వధర్మజ్ఞా! నీవిటులు మిత్రధర్మమును స్మరించుచు, నీపాంచాలునుండి కోపమును మరలింపుము. శాంతింపుము. నీ వాతని క్షమింపుము. అతఁడు నిన్ను క్షమించును. మేమును శాంతించెదము. ఇపుడు శాంతికంటె నుత్తమమార్గ మొకటేమిగలదు?' అని పలికెను.

ఓరాజా! అటు లాసహదేవుఁడు సాత్యకిని శాంతింపఁజేయుటయు, నాధృష్టద్యుమ్నుఁడును నగుచు 'ఓభీమా! యుద్ధగర్వితుఁడగు నాశైనేయుని విడువుము. పర్వతమును గాలివలె నన్నీతఁడు తలపడ నిమ్ము. నా యీతీవ్రనారాచములచే వీనియుద్రేకమే నడంచెదను. మఱియు వీనియుద్ధశ్రద్ధను జీవితము నడంచెదను. ఇందు నేమిచేయు దును? ఇక్కార్య మిట్టు లారంభమైనది. ఇక్కౌరవులు పాండవులపైకి వచ్చుచున్నవారు. అయినఁ గానిమ్ము. వారినెల్ల నిప్పార్థుఁడే నివారింపఁ గల్గును. నేనును వీనితలను నాసాయకములచేఁ బడఁద్రోసెదను. ఈ సాత్యకి నన్ను, భిన్నబాహువగు భూరిశ్రవునిఁగా దలంచుచున్న వాఁడు. కావున వీనిని విడువుము. నేను వీనిని జంపెదను. లేదా! నన్ను వీఁడేనిఁ జంపును.' అని పలికెను. అది విని యాసాత్యకి పామువలె బుస కొట్టుచు, భీముని బాహుమధ్యమున సక్తుఁడయ్యుఁ దనబలమేర్పడ విడిపించికొనఁబోవుచుండెను. ఆటులు వారిరువురును వృషభములువలె గర్జించుచుండ, వడిగావెడలి వాసుదేవుఁడును ధర్మజుఁడును వారిని గడుయత్నముచే నివారించిరి. అంత నాయిరువురును నటులు నివారింపఁ బడి క్రోధతామ్రాక్షులై యుండిరి. క్షత్రియవీరులందఱును, యుద్ధాభి లాషులైయున్న శత్రువుల కెదురొడ్డియుండిరి." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

### పాండవసైన్యము లస్త్రత్యాగ మొనర్చుట

"ఓరాజా! పిదప నాద్రోణపుత్రుఁడు వైరులతో గొప్పపోరాట మొనర్ప నారంభించి, ప్రళయకాలయముఁడునాఁజూపట్టెను. ధ్వజములె వృక్షములుగా, శస్త్రములె శిఖరములుగా, హతములగు నేనుఁగులె మహా శిలలుగా, హయములనెడి కింపురుషులతో నుండి ధనువులనెడిలతలచే నావృతమై, కొంగలు క్రవ్యాదులును గలఁతనొందించుచుండ, భూత పక్షిగణాకులమై వెలయునట్లుగా, దేహములనెడి పర్వతములను నిజ భల్లములచేఁ బ్రోవులుగా నొనర్చుచుఁ, గడువడిగా సింహనాద మొన రించి, మఱియు నాద్రోణసుతుఁడు నీకొమరుఁడు విన నిట్లు ప్రతిజ్ఞ యొనరించెను.

'ఓరాజా! నాదొకప్రతిన వినుము. యుద్ధముచేయుచున్న యా నాతండ్రి నాయుధిష్ఠిరుఁడు ధర్మకంచుకముదొడిగికొని శస్త్రము విడువు

మని పలికెనుగదా! అట్టిధర్మజుఁ డిపుడు గాంచుచుండఁగా వానిసైన్యముసు బాఱఁద్రోలువాఁడను. అటు లెల్లరను ద్రోలి, పాపుఁడగుపాంచాల్యునిఁ జంపెదను. మఱియు నాతో నెవ్వరు తలపడియెదరో వారినెల్లఁ జంపెదను. నేను నిజముగాఁ జెప్పుచున్నవాఁడను. ఇఁక సైన్యమును మఱలింపుము.'

అదివిని సీతనయుఁడు సైన్యమును మఱలించుచు, నెంతయు భయమొదవునట్లుగా గొప్పసింహనాద మొనరించెను. ఓరాజా! పిదపఁ గురుపాండవసైన్యములకు సమాగమమయ్యెను. అయ్యది రెండుసముద్రములకలయికవలెఁ దీవ్రమై చూపట్టెను. అపుడు ద్రోణపుత్రునిచే నిలుపఁబడి కౌరవులు సంరంభించిరి. ద్రోణవధముచేఁ బాండుపాంచాలురు విజృంభించిరి. అంత నాయుభయసైన్యములును బరమోత్సాహులై, తమకే జయమేగలుగునని నిశ్చయించికొనుచు, సంరబ్ధులగుడు, నపుడు గొప్పవేగ మొకటి సంభవించెను. అపుడు కొండలను సముద్రము దాఁకినట్లయ్యెను. అంత నక్కురుపాండవసైన్యములలో భేరీనివాదములును, శంఖారావములును మ్రోగసాగెను. అపు డందు మహాద్భుతమై జనించిన గొప్పచప్పుడు, తఱువఁబడుసాగరముచప్పుడు ననుకరించియుండెను. పిదప మనయశ్వత్థామ నారాయణాస్త్రమును బ్రాదుర్భవింపఁజేసెను. అంత నాయస్త్రమునుండి వెడలుచున్న వేలకొలఁదిబాణములు దీప్తాగ్రములై, పాండుపాంచాలసైన్యములను మోహవెట్టసాగెను. అటు లవి వెడలి సర్పములునా దీప్తముఖములై పాండవబలమును నశింపఁజేయునవగుచు, నమ్మహాసంగ్రామమున సైన్యమును నాకసమును దెసలను గప్పుచు, రెండుగడియలలో సూర్యకిరణములునా నెల్లెడల వ్యాపించెను. అటులే మఱికొన్ని నిర్మలమగునాకసమునందు నక్షత్రములువలె వెలయుచుఁ, గార్ష్ణాయసమయములై వెడలుచుండెను. మఱియు నలుదెసలను విచిత్రములై శతఘ్నులును, గుడలు, గదలు, తురాంతములగుచక్రములును వెడలఁదొడంగెను. అంత నంతరిక్షమెంతయు శస్త్రాకీర్ణమగుటఁ గాంచి పాండవపాంచాలసృంజయులు భయపడఁజొచ్చిరి. అపుడు పాండవరథికు లెట్లెట్లు పోరాడుచు వచ్చిరో, యట్లట్లు లాయస్త్రము వృద్ధినొందుచువచ్చెను. ఓరాజా! అగ్ని

జ్వాలచేవలె నానారాయణాస్త్రముచే దగ్ధులగుచుండిరి. వేసవి నెండు గడ్డిపోవు నంటుకొన్న యగ్నివలె, నప్పాండవసైన్యము నాయస్త్రము దహింపసాగెను. ఓరాజా! అటు లాయస్త్ర మెల్లెడల నిండి తనసైన్యము నశించుచుండుటయు, యుధిష్ఠిరుఁ డెంతయు భయాకులుఁడయ్యెను. చైతన్యము లెడలి పరువులిడుచున్న తనసైన్యమును గాంచియు, బార్థుని మాధ్యస్థము నెంచియు, నాతఁ డాధృష్టద్యుమ్నునితో 'ఓయీ! నీవు పాంచాలసైన్యముతోఁ బొమ్ము. ఓసాత్యకీ! నీవు వృష్ణ్యంధకసేనలఁ గూడి వెడలిపొమ్ము. వాసుదేవుఁడును దనకుఁ దగుకృత్య మొనరించు కొనును. లోకమునకెల్ల నుపదేశింపఁదగిన యిమ్మహానుభావుఁడు తన్నుఁ గాపాడుకొనలేకుండునా? సంగ్రామ మింక వలదనియే మీసైన్యముల వారికెల్లరకుఁ దెలుపుచున్నవాఁడను. నేను నాసోదరులతోఁ గూడ నగ్నిలోఁ బ్రవేశించెదను. భీరువులకు దుస్తరమగుసంగ్రామమున భీష్మ ద్రోణసాగరమును దాఁటియు, ద్రౌణి యనెడిగోష్పదతుల్యసలిలమున మునింగెదను. శుభవృత్తి యగుద్రోణుఁడు నాచే యుద్ధమునఁ జంపింపఁ బడి, దుర్యోధనున కిపుడు రాజ్యమును సంపాదించుఁగాక. బాలుఁడై యుద్ధనిపుణుఁడుగాని యాయభిమన్యునిఁ, గ్రూరులై సమర్థులైన పెక్కురు వధించుచుండ రక్షింపలేనైతిని. మఱియు నాఁడు సభకువచ్చి వివేషప్రశ్న మొనర్చుచున్న ద్రౌపదిని దాసి యగునట్లు నుపేక్షించి తిని. ఓయోధులారా! వీరులందఱును నలసియుండ, నర్జునునిఁ జంపు వాఁడై సుయోధనుఁడు, సైంధవరక్షణార్థముగాఁ గవచమును ధరిం చుటయు, బ్రహ్మాస్త్రవేత్తయగు నాద్రోణునిచేఁ, బాంచాలురగు సత్య జిత్తు మున్నగువారు మాజయమునకై యత్నించియు, సమూలముగాఁ జంపఁబడుటయు మీ రెఱింగినదియెగదా! మేమన్యాయముగా వారిచే రాజ్యార్థమై వనమున కనుపఁబడి, విదురాదులు నివారించుచున్నను, నావనవాసమునే యంగీకరించితిమి. అట్టి మాపై నెంతయుఁ బ్రియము గల్గి వర్తించినబంధువర్గము హతమగుచుండుటను, నేను వారికై మర ణించెదను.' అనిపలుకుచుండఁగనే వడిగా వెడలి వాసుదేవుఁ డా సైన్యమును నివారించి 'ఓవీరులారా! విండ్లు విడువుఁడు. శస్త్రములను బరిత్యజింపుఁడు. వాహనములనుండి దిగుఁడు. మహాత్మునిచే దీని కిదియే ప్రతిఘాతముగా నుపాయము విధింపఁబడియెను. మీరందఱును గజ

రథాశ్వములనుండి డిగుఁడు. నిరాయుధులై పుడమిని నిలువఁబడినచో నీయస్త్రము మిమ్మేమియుఁ జేయదు. అటులుగాక మన మీయస్త్రముతోఁ బోరాడుదుమేనిఁ గౌరవులే బలవత్తరులగుచున్నారు. ఎవ్వరు వాహనములనుండి దిగి, శస్త్రములను బుడమిపై నిడియుందురో యట్టివారి నీయస్త్రము వధింపదు. ఎవ్వరీయస్త్రమును మానసమందేనిఁ బ్రతిఘటింతురో, యట్టివారు పాతాళముఁ జొఱఁబాఱినను, వారి నిది వధింపకమానదు.' అని పలికెను. అపుడు వారావాసుదేవువచనములను విని, యందఱును నటు లొనర్ప నిశ్చయించిరి. అపుడు శస్త్రములను బరిత్యజింప నెంచియున్న యవ్వీరుల నాలోకించి,భీముఁడు వారిని బ్రోత్సహించుచు 'ఓయోధులారా! ఎవ్వరును శస్త్రములను విడువకుఁడు నాసాయకములచే నాద్రోణపుత్రునస్త్రమును నివారించువాఁడను. మఱియు సువర్ణమయమగు నాగొప్పగదచే వాసియస్త్రమును ఖండించుచుఁ, గాలునివలె రణరంగమునఁ జరించెదను. పరాక్రమమున నాకుఁ దుల్యుఁడగువాఁ డొకఁడును లేఁడు. సూర్యతేజమునకు సాటియగు తేజ ముండునా? మత్తగజకరతుల్యములగు నాబాహువుల నిదె చూడుఁడు. ఈనాబాహువు లాహిమవత్పర్వతమును బడఁద్రోయుటకును జాలియున్నవి. ఈమానవలోకమందు నేనొక్కఁడనే నాగాయుతబలుఁడను. దేవతలం దింద్రుఁడువలె వీరులం దేను నిరుపమానుఁడను. బలిసినయంసములుగల, నా యీభుజములపరాక్రమ మీయుద్ధమునఁ గాంతురుగాక. ప్రజ్వలించుచున్న యీయశ్వత్థామాస్త్రము నిదె నివారించెదను. ఈనారాయణాస్త్రమునకుఁ బ్రతియోధుఁడు లేఁడని తలంతురుగాఁబోలు. ఇక్కురుపాండవులు గాంచుచుండఁగా, నిదె దీనితోఁ బోరాడెదను. ఓయర్జునా! అర్జునా! నీవు గాండివమును విడువకుము. నీకిది చంద్రునకుఁ గలంకమువలె మచ్చగూర్చెడిని." అని పలికెను. అది విని యర్జునుఁడాతనితో 'ఓభీమా! నా యీగాండివమును నారాయణాస్త్రమునందును, గోబ్రాహ్మణులందును బ్రయోగింపనని నావ్రతము.' అని తెలుప విని, భీముఁ డపు డాద్రోణపుత్రునిఁ దలపడ, మేఘధ్వనిగల రథముతో వెడలి, రవితేజ మేర్పడ నాతనిఁ దనసాయకసమూహముచే నొకనిమేషమాత్రమునఁ గప్పెను. పిదప నాద్రోణసుతుఁడును నగుచు నభిమంత్రితములును, దీప్తాగ్రములు నగుబాణములచే నాతనిఁ గప్పు

టయు, నవి మర్మభేదకములై నోళులు తెఱచినపాములునాఁ జూపట్టు చుండెను. అపుడాభీముఁడు బంగరుమిడుంగుఱులచేవలెఁ గప్పఁబడి యుండెను. ఓరాజా! అపుడాభీమునిరూపము దినావసానమున మెఱుఁగుడుఁబుగువులతో నిండినపర్వతమునాఁ జూపట్టెను. అంత నాయస్త్రమాభీమునిఁ దాకి, గాలిచేఁ బ్రజ్వరిలినయగ్నివలె వృద్ధినొందసాగెను. అటు లెంతయు వృద్ధినొందుచు, భీమవిక్రమమైయున్న యానారాయణాస్త్రమును గాంచి, భీముఁడుదక్కఁ దక్కినపాండవసైన్యమెల్ల భయభ్రాంతమయ్యెను. అటులగుట వారెల్లరును శస్త్రములను విడిచి, తమతమ రథములనుండియు గుఱ్ఱములనుండియు వడిగాఁ బుడమికి డిగ్గసాగిరి. వారటులు శస్త్రపరిత్యాగపూర్వకముగా వాహనావరోహణ మొనర్ప, నాదివ్యాస్త్రము విపులవీర్యుఁడగుభీమునితలపై సాయకములఁ జొప్పింపసాగెను. అపుడు దానితేజముచే నావృతుఁడై యాభీముఁడు గానరాకుండుట భూతములందు హాహాకారములు జనించెను. పాండవులు మఱియును జడిసిరి." అని తెలిపి సంజయుఁడు మఱియు నాతనితో నిట్లనియె.

## అశ్వత్థామపరాక్రమము

"ఓరాజా! అటు లానారాయణాస్త్రావృతుఁడైన భీమునిఁ జూచి, యాసవ్యసాచి, దానితేజము శాంతించుటకై వారుణాస్త్రమును బ్రయోగించెను. అపుడాయర్జునుకరలాఘవముచేతను, నావారుణాస్త్రముచేఁ దేజము గప్పఁబడియుండుటను, నం దేదియుఁ గానరాకుండెను. అంత నాభీముఁడు సూతాశ్వరథములతోఁగూడ నాయశ్వత్థామాస్త్రముచేఁ గప్పఁబడి, యగ్నిలోఁజొచ్చిన యగ్నివలె జ్వాలావృతుఁడై తేఱి చూడరాకుండెను. ఓరాజా! రాత్రిగడవ నక్షత్రము లస్తగిరినివలె నాభీమునిరథమునే యాబాణములన్నియుఁ జేరుచువచ్చెను. అపుడాభీముఁడు నిజరథాశ్వసారథులతోఁగూడ నగ్నిమధ్యమునఁ జూపట్టెను. ప్రళయసమయమున జగమునెల్లఁ గాల్చి, సురల నాపరమాత్మునిముఖమును జొచ్చునగ్నివలె నాయస్త్ర మాభీము నాక్రమించుటయు, నగ్ని సూర్యునో, సూర్యుఁ డగ్నినో ప్రవేశించినట్టులై, యంతయు నాతేజముచే, గప్పఁబడి యేమియుఁ దెలియఁబడకుండెను. అంత నటు లాభీమునిరథ

మయ్యస్త్రముచే నావృతమగుటయు, ద్రోణసుతుఁ డప్రతిహతుఁడై విక్రమించుటయుఁ గాంచి, పాండవసైన్యములన్నియు నస్త్రములఁ బరిత్యజించి విముఖములయ్యెను. అటులు యుధిష్ఠిరుఁడు మున్నగుమహారథులెల్ల విముఖులగుచుండ, నవ్వాసుదేవార్జునులు వడిగా రథముడిగి, భీమునికడకు వెడలి, యాయశ్వత్థామాస్త్ర బలసంభవమగు తేజమును జొచ్చి, శస్త్రములను విడిచియున్నవారగుటఁ, దదగ్నిచే దగ్ధులు కాకుండిరి. అటులు వారు వెడలి, వారుణాస్త్రప్రయోగమునుబట్టియు, సహజవీర్యవత్త్వమునుబట్టియు నాభీమునిఁజేరి వాని సకలాయుధములను దీసికొని, యాతని లాగికొనివెడలిరి. ఆనరనారాయణు లిరువురును దమ బలముకలిమి నాయస్త్రము శాంతించుటకై, నాతనిఁ బరాఙ్ముఖునిఁగావించుచున్నను, నతఁడు మొఱయుచునే యుండెను. అటులగుట నాయస్త్రము ఘోరమై వర్ధిలుచుండెను. అదిచూచి యవ్వాసుదేవుఁ డాతనితో 'ఓభీమా! నిన్ను మేము నివారించుచున్నను యుద్ధమునుండి నివర్తిల్లవేమి? ఈయుద్ధమునఁ గౌరవులు జయింపఁదగుదురేని మేము యుద్ధము చేయక యూరకుందుమా! ఈక్షత్త్రియు లుపేక్షింతురా? చూడుము. నీవారెల్లరును రథములనుండి డిగ్గిరి. మేమును డిగితిమి. కావున నీవును రథావరోహణమొనర్పుము,' అని పలుకుచు, నవ్వాసుదేవుఁ డాతని, రథమునుండి క్రిందికి లాగెను. మఱియుఁ బాముపలె బుసకొట్టుచుఁ గ్రోధతామ్రాక్షుఁడై యున్న యాభీమునిచేతినుండి యాయుధము లావాసుదేవుఁ డెపుడు నేలఁబడవైచెనో యపుడే యాయస్త్రము శాంతినొందెను.

ఓయాంబికేయా! అట్టివిధానముచే దానితేజము శాంతివహించుఁడు, దశదిశలును నిర్మలములై గానవచ్చెను. మంచివాయువులు వీచెను. పక్షిమృగాదులు శాంతినొందఁగలిగెను. అటులే గజాశ్వాది వాహనములు మోదమొందెను. యోధులు సంతుష్టాంతరంగులైరి. ఓరాజా! అటు లాతేజమడంగుడు, నిశాంతమున సూర్యుఁడువలె నాభీముఁడు వెలయఁజొచ్చెను. అప్పటికిఁ జావగా మిగిలినపాండవబలమచ్చోనిలిచి యస్త్రము శాంతించుట గాంచి, నీపుత్త్రుని వధింపఁదలంచి యుండ, నపు డతఁ డాయశ్వత్థామతో 'ఓద్విజోత్తమా! మఱియు నీయస్త్రమును బ్రయోగింపుము. మఱియు నిప్పాంచాలురు మనల

జయింపఁదలఁచి యిందున్న వాఁడు' అని పలికెను. అప్పుడా ద్రోణసుతుఁడు, నీసుతునిఁ గాంచి యతిదీనస్వరముతో, 'ఓరాజా! మఱి యిది యావర్తింపఁబడదు. దీనికిఁ బ్రయోగము రెండుసారులు లేదు. మరల దీని నావర్తింతునా! నన్నే యిది చంపును. సంశయములేదు. దీని కీవాసుదేవుఁ డిట్లు ప్రతిఘాతవిధిఁ బ్రయోగించెను. కావున శత్రువధము జరుగలేదు. అయ్యో! పరాజయము, మృత్యువు ననెడి రెండిటిలోఁ బరాజయముకంటె మృత్యువే మేలుగదా! అటులగుట నీమనవైరులెల్ల శస్త్రత్యాగమొనర్చి, పరాజితులై మృతతుల్యులైరి.' అని తెలిపెను. అది విని మఱియు నీతనయుఁ డాతనితో 'ఓయాచార్యపుత్రా! ఈయస్త్రము మఱియొకమాఱు ప్రయోగింపఁదగనిదేని గురుఘాతకులగువీరి నెల్ల వేఱగునస్త్రపరంపరచే వధింపుము. దివ్యాస్త్రములన్నియు నీకును, నామహేశునకును గలవు. కావున వానిచే నీవైరులను సంహరింపుము. నీవు తలంతువేని యాయింద్రుఁడు కుపితుఁడయ్యు నిన్ను విడిపించికొని పోఁజాలఁడు' అని హెచ్చరించెను."

అది విని యాధృతరాష్ట్రుఁడు మఱియు నాసంజయు దిక్కు మొగంబై "ఓయీ! ఆద్రోణుఁ డటులు హతుఁడగుటకును, దనయస్త్ర మటులు ప్రతిహతమగుటకును, నాద్రోణసుతుఁ డేమిచేసెను? అటులు నారాయణాస్త్రనిర్ముక్తులై, మరల యుద్ధసన్నద్ధులై యాసేనాముఖమునఁ బాండవులు చరించుచుండ, నతఁ డుపేక్షించియుండెనా? ఏమయ్యెనో తెల్పు" మని యడిగెను. అదివిని సంజయుఁడు మఱియు నాధృతరాష్ట్రునితో "ఓరాజా! పిదప నేమయ్యెనో తెలిపెదను వినుము. సింహలాంగూలధ్వజుఁడగు నాద్రోణసుతుఁడు, తనతండ్రిమరణమును స్మరించుచుఁ, గుపితుఁడై భయమువిడిచి యాధృష్టద్యుమ్నునిఁ దలపడి, యిరువదైదు క్షుద్రసాయకములచే నొప్పించెను. ఓరాజా! అంత నాధృష్టద్యుమ్నుఁడును, బ్రజ్వలించునగ్నినాఁ జూపట్టు నాద్రోణసుతు నఱువదినాల్గుబాణములచే నొప్పించి, స్వర్ణపుంఖములై సానవెట్టిన యిరువదిసాయకములచే నాతనిసారథిని నాలుగేసిబాణములచే గుఱ్ఱములనాల్గిటిని నొప్పించి, మఱి మఱియుఁ బ్రహరించుచుఁ, బుడమిని నాద్రోణసుతుని వడకించుచు, సర్వలోకప్రాణములను హరించువాఁడువలెఁ జూపట్టెను. ఓరాజా! అటులప్పాంచాలుఁ డాయశ్వత్థామను దలపడి బాణమయవర్షమును గురియ

నాయశ్వత్థామయు శరసమూహము చేఁగప్పెను. అపుడు మఱియు నతఁడు తనతండ్రివధమును స్మరించుచుఁ, బదిసాయకములచే నాపాంచాలుని నొప్పించి, రెండుక్షురములచే వానిధ్వజమును గార్ముకమును ఖండించి, మఱియుఁ గొన్నిటిచే నాతనిఁబీడించి, మఱియు వానిసూతునిరథాశ్వములను ననుచరులను బ్రహరించెను. పిదపఁ బాంచాలసైన్యము శరవర్షపీడితమై, యార్తిఁజెంది సంభ్రాంతమైపరువులిడసాగెను. అపుడు విముఖులైన పాంచాలయోధులను, బీడితుఁడగుచున్న ధృష్టద్యుమ్నునిఁ గని సాత్యకి వడిగా వెడలి, యాద్రోణసుతునిరథమును దలపడి, యెనిమిదితీవ్రబాణములచే నాతనిఁబీడించి, నానారూపములగు మఱియిరువదిసాయకములచే నొప్పించి, సూతునిఁ బ్రహరించి, గుఱ్ఱములను నాల్గుబాణములచేఁ గొట్టి, కరలాఘవమేర్పడ వానిధనుర్ధ్వజములను ఖండించెను. మఱియు నతఁడటులే గుఱ్ఱములతో రథమును గొట్టి, ముప్పదిసాయకములచే నాద్రోణసుతునిపక్షమును నొప్పించెను. ఓరాజా! మహాబలుఁడయ్యు నాద్రోణపుత్త్రుఁడు సాత్యకిశరసమూహముచే నావృతుఁడై పీడవడి, యేమి చేయుటకును జాలకుండెను. ఇటులు గురుపుత్త్రుఁ డోడుటయు, సుయోధనుఁడు కృపకర్ణాదులతోఁగూడి యాసాత్యకి నెదుర్కొనెను. అపుడందు సుయోధనుఁ డిరువదింటను, గృపుఁడు మూఁడిటను, గృతవర్ముఁడు పదింటను, గర్ణుఁ డేఁబదింటను, దుశ్శాసనుఁడు నూఱిటను, వృషసేనుఁ డేఁడింటను నాసాత్యకిని నొప్పించిరి. ఓరాజా! పిదప నాసాత్యకియు నమ్మహారథులనెల్ల నొకక్షణములో విరథులుగను, విముఖులుగను జేసెను. అపు డాయశ్వత్థామయుఁ గొంతవడికిఁ దేఱి దుఃఖార్తుఁడై మఱి మఱియు నిట్టూర్పులువుచ్చుచు జింతించెను. అటులై యతఁడు వేఱొక రథ మధిష్ఠించి, పెక్కుశరశతములఁ గురియుచు, నాసాత్యకిని నివారింపఁ బోవ, నాతఁ డాద్రోణసుతునిఁగాంచి మరల విరథునిగా నొనర్చి, విముఖునిఁ గావించెను. పిదపఁ బాండవులందఱును నాసాత్యకిపరాక్రమముఁ జూచి, శంఖారావములను, సింహనాదములనుగావించిరి. ఇటు లాసాత్యకి యాద్రౌణిని విరథునిఁజేసి, వృషసేనుని యోధులను మూఁడువేలను వధించెను. అటులే కృపుని యేనుఁగులఁ బదివేలను జంపెను. మఱియు శకుని గుఱ్ఱముల నేఁబదివేలఁ బరిమార్చెను. ఓరాజా! పిదప నాయశ్వత్థామయు మరల రథమధిరోహించి, కుపితుఁడై యాసాత్యకిని వధించువాఁడై వెడ

లెను. అటులు మరలఁ దన్ను మార్కొనవచ్చిన యాద్రోణసుతుని జూచి యాసాత్యకి క్రూరతరములగు తీవ్రనారాచములచే మఱి మఱియు నొప్పింప, నతఁ డెంతయు నొచ్చియు, నగుచు 'ఓశైనేయా! గురుద్రోహియగు నిప్పాంచాలునిపై నీకుఁగలగౌరవ మేనెఱుఁగుదును. నీ వీతని రక్షింపఁజాలవు. నిన్నును రక్షించుకొనఁజాలవని నానిశ్చయము. ఓసాత్యకి! నాసత్యముచేతను దపముచేతను నిపుడిదె యొట్టు పెట్టుకొనుచున్నాఁడను. వినుము. ఇప్పాంచాలురనెల్లఁ జంపక నేను శాంతింపను. మఱియుఁ బాండవబలమును వృష్ణిసైన్యమును సన్నద్ధమగుఁగాక. వారినెల్ల వధించెదను.' అని పలుకుచు, మంచిపర్వములు గల్గి సూర్యకిరణమునాఁదగు నొకసాయకము నాసాత్యకిపై, యింద్రుఁడు వృత్రునిపై వజ్రమునువలెఁ బ్రయోగించెను. ఆసాయక మాసాత్యకిని భేదించి, బుసకొట్టుచుఁ బుట్టఁజొచ్చినపామువలెఁ బుడమిని బ్రవేశించెను. అంత నాసాత్యకియు భిన్నకవచుఁడై, యంకుశపుఁబోటువడిన యేనుఁగువలెఁ బెద్దగాయముపడి, శరశరాసనములఁ బరిత్యజించి, రక్తసిక్తాంగుఁడై, తెలివితప్పి రథమునఁ గూలఁబడియెను. అపుడు వాని నాద్రోణపుత్రునుండి తప్పించి, సూతుఁడు వేఱొకచోటికిఁ దీసికొనిపోయెను. పిదప నాద్రోణసుతుఁడు సుపుంఖమై నతపర్వమగు వేఱొకసాయకముచే, ధృష్టద్యుమ్నుని బొమలనడుమఁ బ్రహరించెను. ఆధృష్టద్యుమ్నుఁడు మున్నే కొంతనొచ్చియు, మరలనపుడు పీడితుఁడగుట క్షీణవిక్రముఁడై ధ్వజమునకుఁ జేరఁబడియెను. సింగముపాలఁబడిన మత్తగజమునాఁదగు నప్పాంచాలునిఁ గాంచి, శూరులెల్లరును బాండవులున్నకడకుఁ బరువులిడిపోయిరి. అంత నక్కిరీటియు భీముఁడును బౌరవుఁడగు బృహత్క్షత్రుడును జేదియువరాజును మాలవుఁడగుసుదర్శనుఁడును, హాహాకారములొనర్చుచు, శరశరాసనధరులై వీరుఁడగు నాద్రోణపుత్రునిఁ జుట్టికొని, యిరువదవయడుగునఁ గలియఁగల్గి, వారొక్కొకరైదేసిబాణములచే నొక్కమాఱుగాఁ బ్రహరించిరి. అంత నాద్రౌణియు సర్పతుల్యములగు నిరువదైదుసాయకములచే వారేవురసాయకములను ఖండించెను. అటులతఁడు ఖండించుటయెగాక, యేఁడుబాణములచేఁ బౌరవుఁడగుబృహత్క్షత్రుని, మూఁడిటను, సుదర్శనుని నాఱిటను, భీముని నొక్కకోలచే, నర్జునుని నొప్పింప, మఱియు వారెల్లరును నాతని నొక్కమాఱుగను,

వేలువేలుగను, సానవెట్టినసాయకములచే నొప్పించిరి. అందుఁ జేది యువరా జిరువదిబాణములచే నొప్పించెను. అటులే పార్థుఁ డెనిమిదిటను, దక్కినవారు మూఁడుమూఁడునారాచములచేతను నాయశ్వత్థామను నొప్పించిరి. పిదప నాద్రోణసుతుఁడు పార్థు నాఱిటను, వాసుదేవునిఁ బదింటను, భీము నైదింటను, జేదియువరాజును నాల్గింటను, మాలవ పౌరవులను రెండురెండుకోలలను నొప్పించి, మఱియు భీమునిసారథి నాఱిటను గొట్టి, రెండుబాణములచే నాతనిధ్వజకార్ముకములను ఖండించి మఱియు నర్జునుని శరవర్షముచే నొప్పించి, సింహనాద మొనర్చెను. అటు లాద్రోణసుతుఁడు వెనుకకును ముందునకును జిమ్ముచున్న తీవ్రనారాచ ములచే నాకసమును, బుడమియు, దశదిశలును గప్పఁబడియెను. అంత నయ్యశ్వత్థామయు, నుగ్రతేజుఁడై తనరథమునకుఁ జేరువగానున్న సుదర్శనుని యింద్రధ్వజతుల్యములగుభుజములను, దలను, మూఁడు బాణములచే నొక్కమాఱుగా ఖండించెను. అటులే రథశక్తిచే నతఁ డాపౌరవునిఁ గొట్టి,కొన్నిసాయకములచే రథమును ఖండఖండములుగాఁ జేసి, చందనలిప్తములగుబాహువులను ఖండించి, యొకభల్లముచే వాని తల డొల్లనేసెను. మఱియు నతఁడు నల్లకలువమాలికవలె నల్లనిచాయ గలిగి, యువకుఁడైన చేదియువరాజును బ్రజ్వలితాగ్నికల్పములగుబాణ ములచేఁ గొట్టి, యశ్వములతోడను సూతునితోడను మృత్యువుపాలు గావించెను. ఓరాజా! అటు లాద్రోణసుతునిచేఁ దమసమక్షమున హతులగుమాలవపౌరవచేదియువరాజులను గాంచి, మహాబాహుఁడగు భీముఁడు మిగులఁ గోపము తెచ్చుకొని, కుపితములగు విషసర్పములను బోలిన తీవ్రనారాచములఁ బందలకొలందిగాఁ బ్రయోగించి, యాయశ్వ త్థామ నాచ్ఛాదించెను. పిదప మహాతేజుఁడగు నాద్రోణసుతుఁ డతని శరశతమును హత మొనర్చి, కుపితుఁడై తీవ్రబాణములచే నావృకోదరుని నొప్పించెను. అనంతర మామహాబలుఁడగుభీముఁ డొకక్షురప్రముచే నాద్రోణసుతుని ధనువు దునిమి, వేఱొకసాయకముచే నాతని నొప్పిం చెను. ధైర్యశాలియగు నాద్రౌణి వేఱొకవిల్లుపూని కొన్నిబాణములచే నాభీమునిఁ బ్రహరించెను. మహాబలులును బరాక్రమవంతులునగు నా భీమాశ్వత్థాము లిరువురును, శరవర్షముచేఁ బరస్పరము వర్షాకాలమేఘ ములువలెఁ గప్పికొనిరి. అపుడు స్వర్ణపుంఖములై భీమనామాంకితము

లగుబాణములు, మేఘసమూహములు భాస్కరునివలె నశ్వత్థామ నాచ్ఛాదించెను. అటులే వేలకొలఁదిగా నశ్వత్థామప్రయుక్తములగు సాయకము లాభీమునిఁ గప్పెను. ఓమహారాజా! అటు లారణశాలియగు ద్రౌణిచేఁ గప్పఁబడియు, నావృకోదరుఁ డించుకయుఁ జలింపకుండుట యెంతయు నద్భుతమయ్యెను. పిదప నాభీముఁడును బంగరునగలచే నలంకరింపఁబడి, యమదండతుల్యములగు పదిబాణములను బ్రయోగింప, నవి యాద్రోణసుతుని జత్రుదేశమునొంది భేదించి, పుట్టఁజొచ్చినపాములునా వడిగాఁ బుడమిఁ బ్రవేశించెను. ఆభీమప్రహారమున కెంతయు నొచ్చి, యాద్రోణాత్మజుఁడు, నిజధ్వజయష్టి నాశ్రయించి కన్నులుమూసెను. ఓనరాధిపా! మఱియు నతఁడు రెండుగడియలకుఁ దెలివొంది, మిక్కిలి కుపితుఁడై, యప్పటియుద్ధమున మహాత్ముఁడగుభీమునిచే నెంతయు నొచ్చి, రక్తసిక్తాంగుఁడగుట నాభీమసేనుసిరథముపైకి మిగుల వేగమడర వెడలి, తీవ్రతేజములై విషసర్పములునాఁదగు నూఱుబాణము లాకర్ణాంతాకృష్టములుగా నొనర్చి, యాతనిపైఁ బ్రయోగించెను. అపు డాభీముఁడును సమరోత్సాహమడర వానివిక్రమము లక్ష్యముసేయక, వడిగా నుగ్రములగుశరసమూహముల నాద్రోణసుతునిపై వర్షించెను. పిదప నాయశ్వత్థామయుఁ గుపితుఁడై యాభీమునివిల్లు దునిమి, మఱికొన్ని తీవ్రబాణములచే వానివక్షము నొప్పించెను. అంత నావృకోదరుఁడును గోపావిష్టుఁడై వేఱొకవిల్లుగొని, తీవ్రములగునైదుబాణములచే నా ద్రోణసుతుని నొప్పించెను. ఓరాజా! ఆయుద్ధమున వారిరువురును వర్షకాలమేఘములువలె శరవర్షమును గురిసికొనుచుఁ, గ్రోధతామ్రాక్షులగుచుఁ బరస్పర మాచ్ఛాదించికొనిరి. అటులు వారు ఘోరములగు శరవారములఁ గప్పికొనుచు, మిక్కిలి సంరంభమడరఁ గృతప్రతీకారములఁ గావించుకొనుచు, యుద్ధమొనర్చుచున్నంత, నాద్రోణునితనయుఁడు తనపై శరప్రయోగమొనరించు నాభీమునిపైఁ, దనసువర్ణచాపమును సారించి, విరివిగా శరములఁ బ్రయోగింపసాగెను. ఓరాజా! మధ్యాహ్నగతుఁడగు శరత్కాలసూర్యుఁడువలె వెలయుచు, నాద్రౌణి బాణము లాకర్షించుటయు, వానిని వింటసంధించుటయు, మఱియు లాగుటయు, విడుచుటయు ననెడిపనులలో దేనికిని జను లవకాశమును గనిపెట్టఁజాలరైరి. ఆతనివిల్లు మండలాకారమై యగ్నిచక్రమువలెఁ

గానిపించెను. ఆతనివింటినుండి వెడలుసాయకములు వందలును వేలునై యుండెను. అయ్యవి యాకసమున మిడుతలగుంపునాఁ జూపట్టెను. ఆద్రోణపుత్రధనుర్ముక్తములగు సువర్ణభూషితసాయకము లెడతెగకయే యాభీమునిరథముపైఁ బడుచుండెను. ఓరాజా! అపు డాభీమునివిక్రమమును, బలమును, వీర్యప్రభావములను నద్భుతముగాఁ గనిపెట్టితిమి. భీమపరాక్రముఁ డగుభీముఁడు మహాఘోరమైవర్షకాలమేఘమునుండి జనించినవర్షమువలెవెడలి, తనపైకివచ్చునాద్రోణసుతునిబాణవర్షమును, లక్ష్యపెట్టక, వానిని వధించుపట్టుదలతోఁ దానును వర్షకాలమేఘమువలె శరవర్షమును గురియసాగెను. అమ్మహారణరంగమున ఘోరమై సువర్ణపృష్ఠమగునాభీముని విల్లాకృష్టమగుచు, రెండవ యింద్రచాపమునా భాసిల్లెను. దానినుండి వందలకొలందిగను, వేలకొలందిగను బాణములు వెడలుచు, రణశోభితుఁడగు నయ్యశ్వత్థామ నాచ్ఛాదించెను. ఓమారిషా! అటులు వారిరువురును, శరపరంపరలఁ గురిసికొనుచుండ, నందు గాలికేనిఁ జొచ్చుట కవకాశము లేకుండెను. ఓరాజా! అటు లాద్రోణసుతుఁడు, సువర్ణభూషితములై సానవెట్టఁబడి ప్రసన్నాగ్రములైన సాయకముల నాభీముని వధించుకోర్కెమైఁ బ్రయోగింప, వాని నంతరిక్షముననే తీవ్రసాయకములచే ఖండించి, యాభీముఁ డాద్రోణసుతుని మించ నెంచుచు, నిలునిలుమని పలుకుచు, మఱియు ఘోరములై యుగ్రములగు, శరసమూహముల వర్షింపసాగెను. పిదప మహాస్త్రవేత్తయగు నాద్రోణసుతుఁడు, వడిగాఁ దనయస్త్రమాయచే నివారించి, యాభీమునివిల్లు దునుమాడెను. అటులు కుపితుఁడై యాద్రౌణి తీవ్రసాయకములచే ధనువు ఖండింప, నావృకోదరుఁడు కడు వడిగా,దారుణమగురథశక్తి నాద్రోణపుత్రురథముపైకివైవ,మహోల్కవలెఁ దనపైకి వచ్చు నద్దాని నాయశ్వత్థామ వాఁడికోలలచే ఖండించి, తనకరలాఘవము చూపించెను. ఇంతలో భీముఁడు వేఱొకవిల్లు గొని దృఢమగు నద్దాన వాఁడికోలల సంధించి యాద్రౌణిని నొప్పించెను. ఓరాజా! పిదప నాయశ్వత్థామయు, నాభీమునిసారథిలలాటము నొక తీవ్రబాణముచేఁ జీల్చెను. దానికావృకోదరునిసారథి యెంతయు నొచ్చి పగ్గములువిడిచి మూర్ఛపడియెను. అటులు రథసారథి మూర్ఛితుఁడగుడు, గుఱ్ఱములు వడిగాఁ బరువులిడుచు, సకలధనుర్ధరులు గాంచుచుండఁగా

రణరంగమునుండి వెడలిపోయెను. అటు లాభీమునిరథము దొలఁగుడు, నాద్రోణసుతుఁడు శంఖముఁ బూరించెను. అంత నందున్న పాంచాలురును నాభీమునితో పాటుగా నాధృష్టద్యుమ్నునిరథము విడిచి, భీతులై నలుదెసలకుఁ జెదరిపోయిరి. అటులు భంగమొంది పరువిడుచున్న వారి నాద్రౌణి, శరపరంపరలచేఁ దఱుముచుండెను. అటు లాసమరమున ద్రోణసుతునిచే వధ్యమానులగుచు, నాతనికి జడిసి క్షత్త్రియులెల్లరును దిక్కులఁబట్టి పోసాగిరి." అని తెలిపి సంజయుఁడు మఱియు నిట్లనియె.

## వ్యాసుఁడు కృష్ణుని స్తుతించి పలుకుట

"ఓరాజా! అటులు తమసైన్యము భగ్నమగుటఁ గాంచి ధనంజయుఁ డాద్రోణసుతుని వధించువాఁడై సేనల నివారించెను. ఓరాజా! అటు లవ్వాసుదేవార్జునులచే నివారింపఁబడి పాండవసైనికులు నిలువ, నాయర్జునుఁ డొక్కఁడే వెడలెను. కొందఱు సోమకులును మాత్స్యులును కౌరవులు నాతని వెంటనంటి వెడలిరి. అటు లతఁడు వడిగా నాద్రోణసుతునిఁ దలపడి, యాతనితో 'ఓగురుపుత్త్రా! నీకుఁ గలశక్తియు, వీర్యము, జ్ఞానము, పౌరుషము, మఱియు ధార్తరాష్ట్రులపై నీకుఁగల ప్రీతియు, మాపయిఁగలద్వేషము, నింకనుగల నీతేజమును నిపు డిందుఁ బ్రదర్శింపుము. ఆధృష్టద్యుమ్నుఁడే నీదర్పమడంపఁగలఁడు. ప్రళయకాలాగ్నితుల్యుఁడును, వైరులపాలియముఁడునగు మాధృష్టద్యుమ్నునిఁ గేశవునితోఁగూడియున్న నన్నును మార్కొనుము. రణగర్వితుఁడవగు నీదర్పము నశింపఁజేయువాఁడను.' అని పలికె" నని తెలుప విని ధృతరాష్ట్రుఁ డిట్లనియె.

"ఓసంజయా! బలశాలియు గురుపుత్త్రుఁడునై గౌరవింపఁదగియున్నవాఁడుగదా! మఱియు నప్పార్థున కయ్యశ్వత్థామపైఁ బ్రీతియును మెండు. అట్టితఁడె నెన్నఁడులేని యిట్టివాక్యపద్ధతి యాయర్జునున కెట్లు గలిగెను? తనమిత్త్రుఁడగు నాద్రోణసుతు నాకుంతీసుతుఁ డంత పరుషముగా నేల పలుకవలసివచ్చెను?"

అదివిని యతఁ డాధృతరాష్ట్రునితో "ఓరాజా! చేదియువరాజును, పౌరవుఁడగుబృహత్క్షత్త్రుఁడును, మాలవుఁడగుసుదర్శనుఁడును, ధృష్టద్యుమ్నభీమసాత్యకులును బరాజితులగుటయు, ధర్మజునిపరుషవచనములు తనమర్మముల నాఁటుటయు, మనోభేదముగల్గి తమకష్టమును

స్మరించి యతఁ డెన్నఁడును లేనికోపమును దెచ్చుకొనియెను. కావుననే యతఁ డాద్రౌణి ననర్హముగను, నశ్లీలముగను, నప్రియముగను బలుక వలసివచ్చెను. పూజ్యుఁడును నాచార్యపుత్రుఁడు నని తలంపక, యతఁడు మూర్ఖుఁడువలె నాతని నటులు దూఱనాడెను. ఓరాజా! అప్పార్థుఁ డటులు తన్నుఁ బలుక, నయ్యశ్వత్థామ కుపితుఁడై యవ్వాసుదేవునిపై మఱియుఁ గినిసి, రథమందుండియే జలస్పర్శమొనర్చి దేవతలకును సహింపరానియాగ్నేయాస్త్రము నామంత్రించి, దృశ్యాదృశ్యులయిన వైరులనెల్లఁ జంపుఁగాక యని యభిమంత్రించి, దాని నొకకోలపైఁ బెట్టి ప్రయోగించెను. పిదప సంకులముగా నాకసమున శరవర్షముద్భవించెను. అయ్యది యగ్నిజ్వాలాపరీతమై యర్జునుపైఁ బడఁదొడంగెను. ఆకసము నుండి యుల్కలు రాలఁజొచ్చెను. దిక్కులు వెలయకుండెను. వడిగా నాసైన్యమును జీకటులు వ్యాపించెను. రక్షఃపిశాచములు గలిసి నాద మొనర్పసాగెను. వాయువు లమంగళములై వీవ నారంభించెను. సూర్యుఁడు ప్రకాశింపకుండెను. ఎల్లదెసలను భయంకరముగాఁ గాకులు మొఱనెను. ఆకసమున రక్తమును వర్షించుచు, మేఘములు గర్జింప సాగెను. పక్షులు, పశువులు, గోవులు, సువ్రతులును, నియతాత్ములు నగుమునులును శాంతినొందకుండిరి. అపుడు ముల్లోకములును సకల మహాభూతములును భ్రాంతములై దివాకరుఁడు దిరుగఁబడ, జరావిష్టమైన విధవలె నెంతయు సంతప్తము లయ్యెను. ఆయస్త్రము తేజముచేఁ దప్తములై పుడమినున్న సర్పములు బుసకొట్టుచు, ఘోరమగు తేజమును దొలఁగించుకొనునవై పైకెగురుచుండెను. ఓరాజా! నీటియందున్న జంతువులును సంతప్తములు గాఁజొచ్చెను. జలాశయములన్నియుఁ గుతనుడుకుచుఁ జల్లాఱకుండెను. అపుడు వాయుగరుడవేగములై, దిక్కుల నుండియు, విదిక్కుల నుండియు, భూమ్యాకాశములనుండియుఁ బలువిధములుగా శరసమూహములు వెడలుచుండెను. వడిగల యాద్రోణపుత్రుని శరపరంపరలచేఁ బ్రహతములై శత్రుసైన్యములు దగ్ధము లగుచు, నగ్నిదగ్ధములగువృక్షములునాఁ బడుచుండెను. గొప్పగొప్ప యేన్గులసైతము దగ్ధములై నేలఁగూలసాగెను. మఱికొన్ని గర్జనములఁ బోలు మహానాదము లొనర్చుచు, దగ్ధములై పరువులిడసాగెను. మఱియుఁ గొన్ని జడిసి, వనమున దావాగ్నిచుట్టుకొన్న వృక్షశిఖరములువలె జూప

బ్బైను. ఆరణరంగమున, నశ్వబృందములును, రథసమూహములును వేల కొలందిగా నందందుఁబడి గానవచ్చుచుండెను. ఓరాజా! ఆసైన్యము నగ్నిభగవానుఁడు దహింప నారంభించెను. యుగాంతమున సకలభూతములును బ్రళయాగ్ని చేవలె, నాయస్త్రముచేఁ బాండవసైన్య మాయుద్ధరంగమున దహింపఁబడుట గాంచి, నీవారెల్లరును మోదమానమానసులై సింహనాదము లొనర్చిరి. పిదప నీసైన్యమున నానావిధములగు తూర్యములు మ్రోగసాగెను. ఓరాజా! అమ్మహాసంగ్రామమునలోకమెల్లఁ జీఁకటులచే నావృతమగుట, సకలసైన్యములును సవ్యసాచియుఁ గానరాకుండిరి. ఓరాజా! కుపితుఁడగు ద్రోణసుతుఁడు ప్రయోగించినయట్టియస్త్రమును మేమెన్నఁడును గని విని యుండలేదు. అంత నయ్యర్జునుఁడును బ్రహ్మాస్త్రమును బ్రయోగించెను. అయ్యది సకలాస్త్రప్రతీఘాతకారియగు నట్లుగా బ్రహ్మచేవిహితమగుట, రెండుగడియలలో నప్పటికున్న చీఁకటులన్నియుఁ దొలంగెను. చల్లనిగాలులు విసరెను. దిక్కులు నిర్మలములయ్యెను. ఆగ్నేయాస్త్రతేజముచే దగ్ధమైన యప్పాండవసైన్యము నద్భుతముగాఁ జూచితిమి. అపుడు దానినుండి యక్కేశవార్జునులు విముక్తులై యాకసమున సూర్యచంద్రులువలె నొక్కమాఱుగా గానవచ్చిరి. అటు లవ్వాసుదేవార్జును లక్షతులై గానరా, నపుడునీవారికెల్ల భయంకరమై, పతాకాధ్వజములతోడను, గుఱ్ఱములతోడను, నాయుధానుకర్షాదులతోడను నయ్యర్జునురథము గానవచ్చెను. అంత నొక క్షణములోఁ బ్రహృష్టులగు పాండవసైన్యములందు శంఖభేరీనినాదములతోఁ గిలకిలారావము లుదయించెను. అపుడు రెండుసైన్యములందును, వాసుదేవార్జునులు హతులైరనియుఁ, గాలేదనియు నభిప్రాయములు జనించెను. అట్లు వడిగా వెడలివచ్చినతమ్మెల్లరునుగాంచ్చ, దమతమ శంఖములను వారు వూరించిరి. వారిరువుర నారసి సంతోషపూరితాంతరంగులగుపాండవులను గాంచి, నీవారెల్లరును వ్యథనొందసాగిరి. ఓరాజా! అటులు విముక్తులైన మహాత్ములగు నవ్వాసుదేవార్జునులఁ గాంచి, ద్రోణపుత్త్రుఁడు చింతాక్రాంతుఁడై యిదియేమి యని రెండుగడియలు విచారించెను. ఓరాజా! అటులు చింతించి, కొంతవడి ధ్యానశోకపరాయణుఁడై పొడుగగు వేఁడినిట్టూర్పులు విడుచుచు, మతిచెడి యుండెను. అటు లాయశ్వత్థామ యేమియుఁ దోపకుండుటను, ధనువు

విడిచి, రథముడిగి, ఛీ! ఛీ! ఇదియెల్ల మిథ్యయని పలుకుచు, వడిగా నారణరంగమునుండి వెడలిపోయెను. అంతట, గల్మషరహితుఁడును, స్నిగ్ధాంబుదాభాసుఁడును, సరస్వత్యావాసుఁడును, వేదవ్యాసుఁడును నగు వేదవ్యాసుఁ డందులకుఁ బ్రత్యక్షమగుడు, నాతని నాద్రోణసుతుఁడు గాంచి, దీనుఁడై యాతని కభివందన మొనర్చి, మెల్లఁగా నాతనితో 'ఓమహానుభావా! ఇది మాయయో, దైవలబ్ధమో? ఏమియో తెలియఁ బడకున్నది. ఈయస్త్రము మిథ్యయా? కాక నాపారపా టేమియేనిఁ గలదా? ఇది విపరీతమా? లోకపరాభవమా? ఇవ్వాసుదేవార్జునులు జీవించుట కాలవ్యతిక్రమ మనవలసియున్నది. అసురగంధర్వ పిశాచ రాక్షసనాగగరుడులలో నెవ్వరుగాని, మానవులుగాని, నాచేఁ బ్రయుక్తమగునీయస్త్రమును వ్యర్థముగాఁజేయుట కుత్సహింపలేదు. ఇది ప్రజ్వలించుచు, నక్షౌహిణిని వధించి శాంతించెను. ఇది సకలజనవిఘాతుకమని యెంచి, ప్రయుక్తమె పరమదారుణమయ్యు, మానుషధర్ములగు కేశవార్జునుల నేల వధింపఁజాలదయ్యెను? ఓభగవానుఁడా! నా యీప్రశ్నమునకు యథార్థముగా సమాధాన మొసంగుము. మునివర్యా! వినఁగోరుచున్నవాఁడను.' అని ప్రశ్నించెను.

అది విని యాభగవానుఁ డాతనితో నిట్లనియె. "ఓద్రోణపుత్రా! మిక్కిలి యాశ్చర్యముగా నీగొప్పయర్థమును బ్రశ్నించితివి. కావున నీవిషయ మెఱిఁగించెదను. శ్రద్ధాయుక్తుఁడవై వినుము. ఈనారాయణుఁడు పూర్వులకెల్లఁ బూర్వుఁడు. విశ్వకర్తయై యితఁడు కార్యనిర్వహణమునకుఁగా ధర్మునకుఁ బుత్రుఁడై జనించెను. అటులుదయించి హిమవత్పర్వతము నాశ్రయించి,యూర్ధ్వబాహుఁడై తనగొప్పతేజముచే సూర్యాగ్నితుల్యుఁడై యఱువదియాఱువేలవత్సరములు తీవ్రతప మాచరించెను. అపుడటులు తప మొనర్చుచు, వాయుభక్షణుఁడై శరీరమును గృశింపఁజేసి, తనతేజముచే భూమ్యంతరిక్షములవివరమును నింపుటను బ్రహ్మభూతుఁడయ్యెను. నిజతపముచే నతఁడట్లు బ్రహ్మభూతుఁడగుట, విశ్వయోనియు, జగత్పతియు, విశ్వేశ్వరుఁడును, నీశ్వరుఁడును, దుర్ధర్షుఁడును, సర్వదేవేశ్వరుఁడును నగుభగవానుఁ డాతనికిఁ గానవచ్చెను. మఱియు నెవ్వఁ డణువులకంటె నణువును, మహాత్ములకంటె మహాత్మును, రుద్రుఁడును, బ్రహ్మాదులకంటె నుత్త

ముఁడును, హరుఁడును, శంభుఁడును, గపర్దియుఁ, జైతన్యప్రదాతయు, జంగమస్థావరములకుఁ బరమయోనియు, దుర్వారణుఁడును, దుర్ధర్షుఁడును, దీప్రకోపుఁడును,మహాత్ముఁడును,సర్వసంహారియుఁ, బ్రకృష్టచిత్తుఁడును, దివ్యములగునిషంగులను జాపమును ధరించినవాఁడును, హిరణ్యకవచుఁడును, ననంతవీర్యుఁడును, బినాకధారియు, వజ్రహస్తుఁడును, శూలహస్తుఁడును, బరశ్వధధారియు, గదాధారియు, దీర్ఘఖడ్గధారియు, శుభ్రరూపుఁడును, జటాధారియు, ముసలహస్తుడును, శూలపాణియు, వ్యాఘ్రాజినవాసుఁడును, దండహస్తుఁడును, శుభాంగదుఁడును, నాగయజ్ఞోపవీతధారియునై, విశ్వేదేవతలతోడను బ్రమథగణములతోడను, భూతసంఘములతోడను గూడి వెలయుచుఁ, దపములెల్ల నొక్కటఁజేరిన నిధానమై, వయోవృద్ధుల ప్రియవచనములచే సంస్తుతుఁడై విరాజిలుచు, జలమును, భూమ్యాకాశములును, దిక్కులును, సూర్యచంద్రులును, నగ్నియు, వాక్కునని యెడివానిని, జగమును, గొలువఁదెలియు నామహాప్రభుఁడునై పొగడొందుచు, భిన్నవృత్తులగువారికిగోచరుఁడుగాక, బ్రహ్మద్వేషులకు ఘాతకుఁడై, యమృతయోనియై వెలయుచు, సాధువృత్తులగు బ్రాహ్మణులు పాపరహితులై దుఃఖదూరులై, తన్నుఁ గాంచి సంతసింప నలరారుచునుండెనో, విశ్వరూపుఁడగు నట్టిభగవాను నతఁడు దర్శించెను. అటు లాతనిఁ గాంచి యావాసుదేవుఁడు, వాఙ్మనోబుద్ధిదేహములచే సంతుష్టుఁడై, యక్షమాలాపరిక్షిప్తుఁడును, జ్యోతిర్నిధియునగు నా దేవదేవునకు వందనమొనర్చెను. సుందరాంగి యగుపార్వతింగూడి వరదుఁడై, ప్రభుఁడై, భూతసంఘములతోఁ గూడి క్రీడించుమహాత్ముఁడై, యజుఁడును, నీశానుఁడును, నవ్యక్తుఁడును, గారణాత్ముఁడును, నచ్యుతుఁడు, నంధకసంహారుఁడునగు నారుద్రున కటు లభివాదనమొనర్చి, యప్పుద్మాక్షుఁడు భక్తి వెలయ నవ్విరూపాక్షు నిట్లు సంస్తుతించెను.

"ఓవరేణ్యా! ఓయాదిదేవా! భూతకర్తవగు నీనుండియే యీ భువనగోప్తలు జనించి యావేళమున నిప్పుడమిని రక్షించిరి. ఓదేవా! నీసృష్టి పరమప్రాచీనమైనది. సురాసురులను, నాగరక్షఃపిశాచులను, మానవులను, సుపర్ణులను, గంధర్వులను, యక్షులను, బలువిధములగు భూతసంఘములను, నింకనుగల సమస్తమును నీవే వెలయింపఁజేయు

వాఁడవని తెలియుచున్నారము. ఇంద్రయమవరుణకుబేరులకును, పితృదేవతలకును,సోమునకును, త్వష్టకును దృప్తిగా నొనర్పుకర్మములన్నియు నిన్నుఁజేరును. జ్యోతీరూపములును, నాకాశము, శబ్దము, వాయువు, స్పర్శము, జలము, రసము, పృథివియు, గంధము, కాలము, వేదములు, యజ్ఞములు, బ్రాహ్మణులును జంగమస్థావరములును నీవలన జనించెను గదా! ఎట్లు సముద్రోదకములనుండి ప్రభవకాలమున వేఱైనబిందువులు మరలఁ బ్రళయమున వానితో నైక్యమొందునో, యటులే, యిట్టివిధ మెఱిఁగినవాఁడు నీనుండి ప్రభవమై మరల నీయందే యైక్యమొందుచున్నాఁడు. ఓదేవా! దివ్యామృతములు మానసములు నగు రెండుసుపర్ణములును, నవాక్యాఖమును, సప్తగోప్తము నగుపిప్పలమును, శబ్దార్థములును, దేవతలును, లోకపాలురును మున్ను లోకములను ధరించి గతించిన మఱికొందఱును వారికంటెఁ చిరమైనదియు, దత్పరమైనదియు నీనుండియే కలిగెను. వానికంటెఁ బరుఁడవు నీవే. అప్రధృష్యమగుభూతభవిష్యద్వర్తమానకాల మీవే. ఈసకలభువనములును నీవే. ఓమహేశా! నిన్ను భజించుచున్న నన్ను లోకపితవగు నీవు ప్రీతిమెయిఁ గనుంగొనుము. ఆత్మకును నాత్మవగునిన్నుఁ దెలియఁజాలను. ఇట్లు తెలిసినవాఁడు బ్రహ్మతేజ మొందుచున్నాఁడు. ఓదేవవర్యా! నీసమ్మానమును గోరుచు, నిన్ను సంస్తుతించితిని. దీనికిఁ దగురీతిఁగఁ జింతించి దుర్లభములగు నాయిష్టవరముల నొసంగుము. అని ప్రార్థింప, నచింత్యరూపుఁడును, దేవదేవుఁడును, పినాకధారియునగు నామహానీయుఁడు దేవముఖ్యుఁడగు నానారాయణునకు వరములొసంగెను.

ఓయీ! అటులొసఁగి యాభగవానుఁడు మఱియు నానారాయణునితో 'ఓనారాయణా! నాయనుగ్రహముచే నమేయబలరూపుఁడవై నీవు దేవగంధర్వయోనులందు జనింతువు. మఱియు నిన్ను దేవాసురగంధర్వులును, మహోరగులును, పిశాచులును, రాక్షసులును, మానవులును, సుపర్ణులును సహింపఁజాలరు. యుద్ధములందు నిన్నే దేవుఁడును జయింపఁజాలఁడు. మఱియు నాయనుగ్రహముచే నీకెవ్వఁడును శస్త్రముచేఁగాని, వజ్రాయుధముచేఁగాని పీడగల్గింపనోపఁడు. అగ్నివాయువులచేఁగాని, యార్ద్రశుష్కములగు జంగమస్థావరములచేఁగాని హానిగలుగ నేరదు. నీవు యుద్ధమునకు వెడలుదేని, నాకంటెనధికుఁడ వగుదువు.

అని తెలిపెను. ఓద్రోణపుత్రా! ఆనారాయణుఁ డిట్టివరములు వడసెనని తెలియుము. ఆనారాయణుఁడే యీతఁడు. తనమాయచే జగమును మోహపెట్టుచున్నవాఁడు. అతఁడే తనతపముచే మహాముని యగు నరుని జనింపఁజేసెను. ఆదేవునితోఁ దుల్యుఁడగునానరుఁడే యీయర్జునుఁడని తెలియుము. దేవతలలోఁ బరమప్రసిద్ధులై మహర్షులైనవారిరువురే లోకయాత్రావిధానమునకై యివ్వాసుదేవార్జునులైరి. ఇటులే వీరు ప్రతియుగమందును నవతరించుచుందురు. ఓమహామునీ! నీవును నటులే మహత్తరమగుతపఃకర్మముచేఁ దేజము, కోపముగల్గి, రుద్రుని వలన జనించినవాఁడవు. ఆనారాయణునివలెఁ బ్రాజ్ఞుఁడవగునీవును, నీ జగము భవమయముగాఁ దెలిసికొని, యాతనిప్రీతికై నీయాత్మను నియమములచే నవకర్షించితివి. మఱియు మున్నీవు మహాపురుషవిగ్రహుని హరుని, జపహోమోపహారములచే యజించితివి. నీపూర్వదేహమున నీచే నటులు పూజితుఁడై, యతఁ డెంతయు సంతసించెను. అటులు సంతుష్టుఁడై, నీకిష్టములగువరములనెల్ల నొసంగెను. అటులగుట నవ్వాసుదేవార్జునులకును, నీకును జన్మకర్మతపోయోగములు సంపూర్ణములై యున్నవి. యుగయుగమందును, వారును నీవును లింగార్చనచేయుచు నున్నవారు. ఇక్కేశవుఁడు రుద్రసంభవుఁడును రుద్రభక్తుఁడునై యా భవుని, సర్వరూపునిఁగాఁ దెలిసి లింగము నర్చించుచున్నవాఁడు. ఈతనియం దాత్మయోగములును శాస్త్రయోగములును స్థిరములై యున్నయవి. మఱియు నీతనినే సిద్ధులును, బరమర్షులును, దేవతలును యజించుచున్నవారు. లోకమున శాశ్వతుఁడగునీతనినే ప్రార్థించుచున్నవారు. సనాతనుఁడగు కృష్ణుఁడే యజ్ఞములచే యజింపఁదగినవాఁడు. సర్వభూతమయునిఁగాఁ దెలిసికొని, యితఁడు లింగము నర్చించుచున్నవాఁడు. ఆవృషభధ్వజుఁ డీతనియం దధికప్రీతిగల్గియుండును.' అని తెలిపెను.

ఓయాంబికేయా! ఆవ్యాసునివచనములు విని మహారథుఁడగు నాద్రోణసుతుఁడు రుద్రునకు నమస్కరించి కేశవుని మన్నించెను. పిదప నతఁ డటు లావ్యాసునివచనములకు సంతసించి, యాతనికి నమస్కరించి, తనసైన్యమును జూచి యుద్ధసమాప్తిని గావించెను. ఓరాజా! పిదపఁ బాండవులును, ద్రోణవిఘాతమునఁ గౌరవులు దీనులై యుండఁగా

నాఁటికి యుద్ధమును ముగించిరి. ఓరాజా! ఆద్రోణుఁ డటులైదుదినములు యుద్ధమొనరించి, సైన్యమును జంపి, బ్రహ్మలోకమునొందెను.” అని తెలుప విని ధృతరాష్ట్రుఁడు మఱియు నాసంజయునిదిక్కు మొగంబై యిట్లనియె.

## శతరుద్రీయము

“ఓసంజయా! మహారథుఁడగు నాద్రోణుఁ డటులపాంచాలునిచే నిహతుఁ డగుడుఁ గౌరవపాండవు లేమి యొనర్చిరి?”

అది విని సంజయుఁ డాతనితో “ఓరాజా! అటులు కౌరవులు భంగమొందఁగా, నాధనంజయుఁడు మహాశ్చర్యముగాఁ దనకు విజయప్రదుఁడై దైవవశముగా నందుల కేతెంచిన యావ్యాసమహర్షిని గాంచి యిట్లు ప్రశ్నించెను. ‘ఓమహామునీ! ఈయుద్ధమున నేను తీవ్రములగుసాయకములచే వైరులను వధించితిని. అపు డొకపురుషుఁడు పావకప్రభుఁడై శూలమును బైకెత్తి నాయెదుట నడుచుచుండుటను గాంచితిని. అతఁ డేదిశకుఁ బోవుచుండెనో యందులకే నావైరులు పోవుచుఁ గానవచ్చిరి. ఆతనిచే భగ్నులగువైరులనెల్ల నాచే వధింపఁబడిరని జనము తలంచుచున్నది. అతఁడే సైన్యములను జంపుచుండఁగా నాతని వెనుకనుండి యాతనికి వారి నిచ్చుచున్నవాఁడను. ఓమహాత్మా! ఆపురుషవర్యుఁ డెవఁడో నాకెఱిఁగింపుము. సూర్యసన్నిభుఁడగుశూలపాణిని నేను గాంచితిని. అతఁడు, పుడమిపై నడుగువెట్టక, శూలము విడువక యుండెను. ఆతనితేజముచే నొకశూలమును వేయిశూలములు పడుటఁ జూచితిని.

అంత నావ్యాసుఁ డప్పార్థునితో * ‘ఓయర్జునా! నీవు, ప్రజాపతులకుఁ బ్రథముఁడును, దేజోరూపియుఁ, బురుషుఁడును, బ్రభుఁడును,

---

* వ్యాస ఉవాచ.— ప్రజాపతీనాం ప్రథమం తేజసాం పురుషం ప్రభుమ్, భువనం భూర్భువం దేవం సర్వలోకేశ్వరం ప్రభుమ్. ౧. ఈశానం వరదం పార్థ దృష్టవానసి శంకరమ్, తం గచ్ఛ శరణం దేవం వరదం భువనేశ్వరమ్. ౨. మహాదేవం మహాత్మాన మీశానం జటిలం శివమ్, త్ర్యక్షం మహాభుజం రుద్రం శిఖినం చీరవాసనమ్. ౩. మహాదేవం హరం స్థాణుం వరదం భువనేశ్వరమ్, జగత్ప్రధానమధికం జగత్ప్రీతమధీశ్వరమ్. ౪. జగద్యోనిం జగద్వీపం జయినం జగతో గతిమ్, విశ్వాత్మానం విశ్వసృజం విశ్వ

భూర్భువస్సువరూపుఁడును, సర్వలోకేశ్వరుఁడును, దేవుఁడు, నీశానుఁడు, వరదుఁడు నగుశంకరునిఁ గాంచితివి. భువనేశ్వరుఁడును వరదుఁడు నగు నాతని శరణమొందుదము. మహాదేవుఁడును, మహాత్ముఁడును, నీశానుఁడును, జటాధారియు, శివుఁడును, త్రినేత్రుఁడును, మహాభుజుఁడును, రుద్రుఁడు, శిఖియుఁ, జీరవసనుఁడును, హరుఁడు, స్థాణువు, లోకేశ్వరుఁడు, జగత్ప్రధానుఁడు, నధీశ్వరుఁడు, నధికుఁడు, జగత్ప్రియుఁడు, జగద్యోనియు, జగద్బీజుఁడును, జేతయు, జగద్గతియు, విశ్వాత్ముఁడును, విశ్వస్రష్టయు, విశ్వమూర్తియు, యశస్వియు, విశ్వేశ్వరుఁడును, విశ్వనేతయుఁ, గర్మేశ్వరుఁడు, ప్రభువు, శంభుఁడు, స్వయంభువు, భూతేశుఁడు, భూతభవిష్యద్వర్తమాననిమిత్తభూతుఁడును, యోగియు, యోగేశ్వరుఁడును, సకలలోకేశ్వరేశ్వరుఁడును, సర్వశ్రేష్ఠుఁడును, జగచ్ఛ్రేష్ఠుఁడును, బరమేష్ఠియు, లోకత్రయవిధాతయుఁ, గేవలుఁడు, లోకత్రయాశ్రయుఁడును, దుర్జయుఁడును, జగన్నాథుఁడును, జననమరణాతీతుఁడును, జ్ఞానాత్ముఁడును, జ్ఞానగమ్యుఁడును, జ్ఞానశ్రేష్ఠుఁడును, దుర్జ్ఞేయుఁడును, భక్తవరప్రదాతయు నై యతఁడు వెలయుచున్నవాఁడు. ఆవిభునకు నానావిధరూపములతో దివ్యులగు ప్రమథగణములు పరిచారకులై యుందురు. వారు వామనులును, జటాధారులును, ముండులును, హ్రస్వగ్రీవులును, మహోదరులును, మహాకాయులును, మహోత్సాహులును, మహాకర్ణులును నై యుందురు. ఓపార్థా! వికృత

---

మూర్తిం యశస్వినమ్. ౫. విశ్వేశ్వరం విశ్వవరం కర్మణామీశ్వరం ప్రభుమ్. శంభుం స్వయంభుం భూతేశం భూతభవ్యభవోద్భవమ్. ౬. యోగం యోగేశ్వరం శర్వం సర్వలోకేశ్వరేశ్వరమ్, సర్వశ్రేష్ఠం జగచ్ఛ్రేష్ఠం వరిష్ఠం పరమేష్ఠినమ్. ౭. లోకత్రయవిధాతారమేకం లోకత్రయాశ్రయమ్, సుదుర్జయం జగన్నాథం జన్మమృత్యుజరాతిగమ్. ౮. జ్ఞానాత్మానం జ్ఞానగమ్యం జ్ఞానశ్రేష్ఠం సుదుర్విదమ్, దాతారం చైవ భక్తానాం ప్రసాదవిహితాన్ వరాన్. ౯. తస్య పారిషదా దివ్యా రూపైర్నానావిధై ర్విభోః, వామనా జటిలా ముండా హ్రస్వగ్రీవా మహోదరాః. ౧౦. మహాకాయా మహోత్సాహా మహాకర్ణాస్తథాపరే, ఆననై ర్వికృతైః పాదైః పార్థ వేషైశ్చ వైకృతైః. ౧౧. ఈదృశైస్స మహాదేవః పూజ్యమానో మహేశ్వరః, స శివస్తాత తేజస్వీ ప్రసాదాద్యాతి తేఽగ్రతః ౧౨. తస్మిన్ ఘోరే సదా పార్థ సంగ్రామే రోమహర్షణే, ద్రౌణికర్ణకృపైర్గుప్తాం మహేష్వాసైః ప్రహారిభిః. ౧౩. కస్తాం సేనాం తదా పార్థ మనసాపి ప్రధర్షయేత్, ఋతే

ముఖులును, వికృతపాదులును, వికృతవేషులును, వికృతాకారులగు నట్టివా రామహాదేవునిఁ బూజించుచుందురు. తేజస్వియగునతఁడే నీ యెదుట నట్లు చరించువాఁడు. ఓయర్జునా! మహారథులై ప్రహరించు కర్ణకృపాశ్వత్థామలచే రక్షితమగుచున్న యాసైన్యమున నతఁడుగాక వేఱెవ్వఁ డట్లు చరింపఁగలఁడు? బహురూపుఁడును, మహేష్వాసుఁడును, మహేశ్వరుఁడు నగునాదేవుఁడుదక్క వేఱొక్కఁ డారీతిగా నీయెదుట నిలువ నుత్సహింపఁడు. ఆతనితోఁ దుల్యమగుభూత మీ ముల్లోకములందును లేదు. సంగ్రామకుపితుఁడగు నాతనివాసనకును వైరులు తెలివితప్పి హతభూయిష్ఠులై, వడఁకుచుఁ బుడమిఁబడక మానరు. ఆతనికి నమస్కరించుచు దేవత లాకసమున నుందురు. మఱియు మానవులును, స్వర్గజేతలగువారును నాతనికి నమస్కరింతురు. వరదుఁడును, శివుఁడును, రుద్రుఁడు, నుమాపతియు, నగుదేవున కెవ్వరు భక్తులై యుందురో యట్టివా రిహసౌఖ్యములొంది, యుత్తమగతి నొందుచున్నారు. ఓకౌంతేయా! శాంతుఁడగునాతని కెల్లపుడును నమస్కరింపుము. రుద్రుఁడును, శితికంఠుఁడును, గనిష్ఠుఁడు, సువర్చస్కుఁడు నగు నాతనికి నమస్కారము. కపర్దియుఁ, గరాళుఁడు, హర్యక్షవరదుఁడు, యామ్యుఁడు, నరక్తకేశుఁడు, శంకరుఁడు నగుదేవునకు నమస్కారము. కామ్యుఁడు, హరినేత్రుఁడు, స్థాణువు, పురుషుఁడు, హరికేశుఁడు, ముండుఁడు, కృశుఁడు, నుత్తారకుఁడు నగువానికి నమస్కారము.

---

దేవాన్మహేష్వాసాద్బహురూపాన్మహేశ్వరాత్. ౧౪. స్థాతుముత్సహతే కశ్చిన్న తస్మిన్నగ్రతః స్థితే, న హి భూతం సమం తేన త్రిషు లోకేషు విద్యతే. ౧౫. గంధేనాపి హి సంగ్రామే తస్య క్రుద్ధస్య శత్రవః, విసంజ్ఞా హతభూయిష్ఠా వేపంతి చ పతంతి చ. ౧౬. తస్మై నమస్తు కుర్వంతో దేవాస్తిష్ఠంతి వై దివి, యే చాన్యే మానవా లోకే యే చ స్వర్గజితో నరాః. ౧౭. యే భక్తా వరదం దేవం శివం రుద్రముమాపతిమ్, ఇహ లోకే సుఖం ప్రాప్య తే యాంతి పరమాం గతిమ్. ౧౮. నమస్కురుష్వ కౌంతేయ తస్మై శాంతాయవై సదా, రుద్రాయ శితికంఠాయ కనిష్ఠాయ సువర్చసే. ౧౯. కపర్దినే కరాళాయహర్యక్షవరదాయ చ, యామ్యాయారక్తకేశాయ సద్వృత్తే శంకరాయ చ. ౨౦. కామ్యాయ హరినేత్రాయ స్థాణవే పురుషాయ చ, హరికేశాయ ముండాయ కనిష్ఠాయ సువర్చసే. ౨౧. భాస్కరాయ సుతీర్థాయ దేవదేవాయ రంహసే, బహురూపాయ శర్వాయ ప్రియాయ ప్రియవాససే. ౨౨. ఉష్ణీషిణే సువక్త్రాయ సహస్రా

భాస్కరుఁడు, సుతీర్థుఁడు, దేవదేవుఁడు, బహురూపుఁడు, శర్వుఁడు, ప్రియుఁడు, ప్రియవసనుఁ డగువానికి నమస్కారము. ఉష్ణీషుఁడు, సువక్త్రుఁడు, సహస్రాక్షుఁడు, గిరిశుఁడు, సుశాంతుఁడు, పరుఁడు, చీరవసనుఁడును, హిరణ్యబాహుఁడు, ఉగ్రుఁడు, దిక్పతియు నగువానికి నమస్కారము. పర్జన్యపతియు, భూతపతియు, వృక్షపతియు, గోపతియు నగువానికి వందనము. వృక్షావృతకాయుఁడును, సేనానియు మధ్యముఁడును, స్రువహస్తుఁడును, ధన్వియు, భార్గవుఁడు నగు దేవునకు నమస్కారము. బహురూపుఁడు, విశ్వపతి, ముంజవసనుఁడు, సహస్రశిరస్కుఁడు, సహస్రనయనుఁడు, సహస్రబాహువు, సహస్రచరణుఁడు నగువానికి నమస్కారము. ఓకౌంతేయా! భువనేశ్వరుఁడును, వరదుఁడు, సుమాపతియు, విరూపాక్షుఁడు, దక్షయజ్ఞధ్వంసకుఁడు, ప్రజాపతియు, నవ్యగ్రుఁడు, భూతపతియు, నవ్యయుఁడు, కపర్దియు, వృషావర్తుఁడు, వృషనాభుఁడు, వృషధ్వజుఁడు, వృషదర్పుఁడు, వృషపతి, వృషశృంగుఁడు వృషర్షభుఁడు నగుదేవుని శరణమందుము. వృషాంకుఁడును, వృషభోదారుఁడు, వృషభేక్షణుఁడు, వృషభుఁడు, వృషాయుధుఁడు, వృషశరుఁడు, వృషభూతుఁడు, మహేశ్వరుఁడు నగుదేవుని శరణొందుము. మహోదరుఁడు, మహాకాయుఁడు, వ్యాఘ్రచర్మాంబరధారియు, లోకేశుఁడు, వరదుఁడు, ముండుఁడు, బ్రహ్మణ్యుఁడు, బ్రాహ్మణప్రియుఁడు,

---

క్షాయ మీఢుషే, గిరిశాయ సుశాంతాయ పతయే చీరవాససే. ౨౩. హిరణ్యబాహవే రాజన్నుగ్రాయ పతయే దిశామ్, పర్జన్యపతయేచైవ భూతానాం పతయే నమః. ౨౪. వృక్షాణాం పతయే చైవ గవాం చ పతయే తథా, వృక్షైరావృతకాయాయ సేనాన్యే మధ్యమాయ చ. ౨౫. స్రువహస్తాయ దేవాయ ధన్వినే భార్గవాయ చ, బహురూపాయ విశ్వస్య పతయే ముంజవాససే. ౨౬. సహస్రశిరసే చైవ సహస్రనయనాయచ, సహస్రబాహవే చైవ సహస్రచరణాయ చ. ౨౭. శరణం గచ్ఛ కౌంతేయ వరదం భువనేశ్వరమ్, ఉమాపతిం విరూపాక్షం దక్షం యజ్ఞనిబర్హణమ్. ౨౮. ప్రజానాం పతిమవ్యగ్రం భూతానాం పతిమవ్యయమ్, కపర్దినం వృషావర్తం వృషనాభం వృషధ్వజమ్. ౨౯. వృషదర్పం వృషపతిం వృషశృంగం వృషర్షభమ్, వృషాంకం వృషభోదారం వృషభం వృషభేక్షణమ్. ౩౦. వృషాయుధం వృషశరం వృషభూతిం మహేశ్వరమ్, మహోదరం మహాకాయం ద్వీపిచర్మనివాసినమ్. ౩౧. లోకేశం వరదం ముండం బ్రహ్మణ్యం బ్రాహ్మణప్రియమ్, త్రిశూలపాణిం వరదం ఖడ్గచర్మధరం శుభమ్.

త్రిశూలపాణియు, ఖడ్గచక్రధరుఁడును, పినాకధారియు, ఖడ్గధారియు, లోకపతియు, నీశ్వరుఁడు నగువానిని శరణమొందెదను. చీరవసనుఁ డగునతఁడు శరణ్యుఁడైనవాఁడు. ఎవ్వని కాకుబేరుండు మిత్త్రుఁడో యట్టివానికి నమస్కారము. సువసనుఁడును, సువ్రతుఁడును, సుధన్వియు, ధనుర్ధరుఁడును, దేవుఁడును, ప్రియధన్వుఁడును,ధన్వియు,ధన్వంతరుఁడును, ధనురాచార్యుఁడును, ధనువు నగు నాతనికి నమస్కారము. ఉగ్రుఁడు, సురవరుఁడు, దేవుఁడు నగు నీకు నమస్కారము. బహురూపుఁడు, బహుధన్వియు నగు నీకు నమస్కారము. స్థాణువ వగు నీకు నిత్యము నమస్కారము. త్రిపురఘ్నునకు నమస్కారము. భగఘ్నునకు నమస్కారము. వనస్పతిపతియు, నరపతియు నగు నాతనికి నమస్కారము. మాతృపతియు, గణపతియు నగు వానికి నమస్కారము. యజ్ఞపతియు, గోపతియు నగుదేవునకు నిత్యము నమస్కారము. అప్పతియు, దేవపతియు నగువానికి నిత్యము నమస్కారము. పూషదంత వినాశకుఁడును, త్రినేత్రుఁడును, వరదుఁడును, హరుఁడు, నీలకంఠుఁడు, స్వర్ణకేశుఁడు నగువానికి నమస్కారము. ఓయుధిష్ఠిరా! ధీమంతుఁ డగు నామహాదేవుని దివ్యకర్మములను యథాశ్రుతముగను, నాకుఁ దెలిసిన రీతిగను నీకెఱిఁగించెదను. ఓయీ! అతఁడు కుపితుఁడగునేని లోకము నఁగలసురలును, నసురులును, గంధర్వులును, రాక్షసులును గుహాగతులయ్యును సుఖముగా నుండఁజాలరు. మున్ను దక్షుఁడు యజ్ఞకర్తయై శాస్త్రీయముగా నొనర్పఁబడుయజ్ఞమును, గుపితుఁడై నిర్దయముగాఁ

3౨. పినాకినం ఖడ్గధరం లోకానాం పతిమీశ్వరమ్, ప్రపద్యే శరణం దేవం శరణ్యం చీరవాసనమ్. 33. నమస్తస్మై సురేశాయ యస్య వైశ్రవణస్సఖా, సువాససే నమో నిత్యం సువ్రతాయ సుధన్వినే. 3౪. ధనుర్ధరాయ దేవాయ ప్రియధన్వాయ ధన్వినే, ధన్వంతరాయ ధనుషే ధన్వాచార్యాయ తే నమః. 3౫. ఉగ్రాయుధాయ దేవాయ నమస్సురవరాయ చ, నమోఽస్తు బహురూపాయ నమస్తే బహుధన్వినే. 3౬. నమోఽస్తు స్థాణవే నిత్యం నమస్తస్మై సుధన్వినే, నమోఽస్తు త్రిపురఘ్నాయ భగఘ్నాయ చ వై నమః. 3౭. వనస్పతీనాం పతయే నరాణాం పతయే నమః, మాతౄణాం పతయే చైవగణానాం పతయే నమః. 3౮. గవాం చ పతయే నిత్యం యజ్ఞానాం పతయే నమః, అపాం చ పతయే నిత్యం దేవానాం పతయే నమః. 3౯. పూష్ణో దంతవినాశాయ త్ర్యక్షాయ వరదాయ చ, హరాయ నీలకంఠాయ స్వర్ణకేశాయ వై నమః. ౪౦.

జెఱచినవాఁడు. మఱియు నతఁడు సఘోషముగా వింటినుండి బాణము విడిచి మహానాదమొనర్ప, దానిచే దేవతలకు సుఖము గలుగకుండెను. అటు లమ్మహేశ్వరుఁడు కుపితుఁడై యజ్ఞము భగ్నమగుడు నాతనిధనుష్టాంకారముచే దేవతలెల్ల సమాకులులైరి. ఓపార్థా! అపుడు సురాసురులాతనికి వశులై పాదాక్రాంతులైరి. ఉదకములన్నియుఁ గలఁతనొందెను. పుడమి వడంకెను. కొండలు పిండియయ్యెను. దిగ్గజములు మూర్ఛవడియెను. లోకములెల్ల నంధకారబంధురములై కానరాకుండెను. సూర్యునితోఁగూడ సకలజ్యోతిశ్చక్రముకాంతి నతఁ డడఁగించెను. ఆత్మసుఖాభిలాషముగల సకలభూతములును ఋషులును భయభీతులై కలఁతనొంది శాంతినివహించి యూరకుండిరి. అపుడు శంకరుఁడు నగుచు పూషను దలపడి పురోడాశమును భక్షించుచున్న యాతనిదంతములను బెఱికెను. అంత దేవతలు వడఁకుచు నాదేవునకు నమ్రులగుచు వెడలిపోసాగిరి. మఱియు నతఁ డాదేవతలపై దీప్తములగు శరములను సంధించునంతఁ, బొగయు మిడుఁగురులు గల్గి మెఱుపులతోఁ గూడిన మేఘములునాఁదగు నాతనిశరజాలములను గాంచి, యాదేవతలందఱు నమ్మహేశ్వరునకు నమస్కరించి, యపు డారుద్రునకు విశేషముగా నొక యజ్ఞభాగమును గల్పించిరి. ఓయర్జునా! అటు లాత్రిదశులు భయముచే శరణమొంద నతఁడు శాంతుఁడై యజ్ఞమును మఱియు సంఘటిల్లఁ జేసెను. సుర లట్లు భంగమొందుట నిప్పటికిని వా రాతనికి జడియుచునే యుందురు. మఱియు నొకటి తెలిపెదను వినుము. మున్ను వీర్యనిధులగు రక్కసులకు మూఁడుపట్టణము లుండెను. అయ్యవి యాయసము, రాజతము, సౌవర్ణమును నై యుండెను. అందు సౌవర్ణము కమలాక్షుఁడును, రాజతమును దారకాక్షుఁడును, నాయసమును విద్యున్మాలియుఁ గలిగి యుండెను. సకలాయుధములచేతను, వాని నాయింద్రుఁడు ఛేదింపఁజాలకుండెను. అంత నాదేవతలందఱును, రుద్రుని శరణు వేఁడి, మహాత్ముఁడగు నాతనితో నిట్లు పలికిరి. 'ఓదేవా! త్రిపురవాసులగు నీఘోరరాక్షసులు బ్రహ్మవలన వరములు వడసి బలదర్పితులై లోకము నెంతయుఁ బీడించుచున్నవారు. ఓదేవదేవేశా! మహాదేవా! ఆరక్కసులను నీవు దక్క వేఱొక్కఁడు చంపఁజాలఁడు. కావున నాసురవైరులను నీవే

వధింపవలయును. ప్రాణు లెల్లకర్మములందును రౌద్రులు కాఁగలరు. ఓభువనేశ్వరా! ఈరాక్షసులను వధింపవలయును.' అని ప్రార్థించిరి.

అది విని యాదేవుఁ డందులకు సమ్మతించి దేవతలకు మేలుగూర్చు వాఁడై, గంధమాదనవింధ్యపర్వతములను వంశధ్వజములుగను, వనసాగరములతోఁగూడినభూమిని రథముగను నొనర్చి, మఱియు నాత్రిలోచనుఁడు నాగేంద్రుఁడగు శేషు నక్షముగా నొనరించి సూర్యచంద్రులను జక్రములుగను, శైలపుత్రుఁడగుపుష్పదంతుని బండిచీలగను, మలయమును యుగముగను, దక్షునిఁ ద్రివేణుయుగబంధనరజ్జువుగను, సరీసృపపర్వతాదులను యోక్త్రములుగను, నాకర్షాదులుగను జేసి మఱియు నాప్రతాపశాలి యగుమహేశుఁడు నాల్గువేదములను గుఱ్ఱములనుగా నొనరించి యుపవేదములను గళ్లెములుగాఁ గూర్చి, గాయత్రీసావిత్రులను బగ్గములుగాఁ గావించి యోంకారమును, జబుకుగా నొనర్చి, బ్రహ్మను సారథిగాఁ జేసి, మందరమును గాండివముగను, వాసుకి నల్లెత్రాడుగను, విష్ణుని శరముగను, నగ్నిని దానికి శల్యముగను, దానికి వాయువును ఱెక్కలుగను, యమునిఁ బుంఖముగను, మెఱుపును దారుగను, మేరువు ధ్వజముగను జేసి సర్వదేవమయుఁడగు శివుఁ డట్టి రథము నధిరోహించి త్రిపురవధమునకై వెడలెను. ఓపార్థా! అతుల విక్రముఁడు, నసురాంతకరుఁడు నగునాశంకరుఁడు దేవతలును దపోధనులగు ఋషులును దన్ను సన్నుతింప, నిరుపమానమై దివ్యమైన మహేశ్వరస్థానమును గల్పించి, వేయివత్సరములును స్థాణుభూతుఁడై యుండెను. అంతరిక్షమునఁ బురములు మూఁడును నెపుడు గలిసెనో యపుడు వాని నాతఁడు త్రిపర్వము త్రిశల్యము నగుసాయకముచే భేదించెను. విష్ణుసోమసమాయుక్తమై కాలాగ్నితుల్యమగు నాబాణమును త్రిపురదానవులు దేఱిచూడఁజాలరైరి. అటులు పురములను దహించుచున్న యాతనిఁ గాంచుటకై పార్వతీదేవి వెడలెను. అపు డొకవిశేషము జరిగెను. దాని నెఱిఁగించెదను వినుము. అపు డప్పార్వతి, నిజాంకగతుఁడైన పంచశిఖుఁడగుబాలునిఁ జూచి, సురలను దెలియఁగోరి 'ఈబాలకుఁ డెవ్వఁ' డని ప్రశ్నించెను. అపు డాయింద్రుఁ డసూయగలిగి వజ్రముచేఁ బ్రహరింపఁబోవఁ, గుపితుఁడై శంకరుఁ డాయింద్రుని వజ్రాయుధసహితమగు బాహువును స్తంభింపఁజేసెను. సర్వ

లోకేశ్వరేశ్వరుఁడును విభుఁడునునగు భగవానుఁ డటులు తనభుజమును గదలకుండఁజేయ, నింద్రుఁడు దేవతలతోఁగూడి యవ్యయుఁడును, ప్రభుఁడునగు బ్రహ్మకడకు వడిగాఁబోయి, యాతనికి నమస్కరించి, ప్రాంజలిరై 'ఓదేవా! పార్వతియంకమున నద్భుతమగు నొకభూతము బాలాకారము వహించియుండ, దానికి మేము నమస్కరింపమైతిమి. ఆతనికి మేమోడితిమి. ఆబాలుఁడు యుద్ధముచేయకయే మమ్ము జయించెను. కావున నాతఁ డెవ్వఁడో తెలుపుము." అని ప్రశ్నించెను. బ్రహ్మవేత్తలలో నుత్తముఁడగు నాపరమేష్ఠి యాదేవతలవచనము లాలించి' యమితతేజుఁడగునాబాలునిఁ గొంతవడి ధ్యానించి,యాయింద్రాదులతో 'ఓదేవతలారా! అతఁడు చరాచరమగుజగమునకుఁ బ్రభుఁడగు హరుఁడు. అమ్మహేశ్వరునకంటె మించినదైవము వేఱొండు లేదు. పార్వతితోఁగూడ మీకుఁ గన్పడినయతఁ డాయమితద్యుతియగు శంకరుఁడే. ఆదేవుఁడు పార్వతికై బాలరూపమును ధరించినవాఁడు నేను మీరును నాతనినే ప్రాపింపవలయును. ఆభగవానుఁడే సర్వలోకేశ్వరుఁడగుప్రభుఁడు. బాలసూర్యసన్నిభప్రభగల యాభువనేశ్వరుని దేవతలును బ్రజాపతులును దెలియఁజాలరైరి.' అని తెలిపి, పిదప నాపరమేష్ఠి యందులకుఁబోయి యమ్మహేశునిఁ గాంచి, యతఁడుబాలుఁడయ్యు సర్వజ్యేష్ఠుఁడని తెలిసికొని యాతనికి నమస్కరించెను. అటులు నమస్కరించి 'ఓమహేశా! నీవే యజ్ఞము. నీవే యీభువనమునకు గతివి. నీవేపరాయణుఁడవు. మఱియు నీవే భవుఁడవును, మహాదేవుఁడవును, బరమపదమునైనవాఁడవు. జంగమస్థావరాత్మకమగు నీజగమంతయు నీచే వ్యాప్తమైయున్నది. ఓభూతభవ్యేశా! లోకనాథా! జగత్పతీ! నీకోపముచేఁ బీడనొందియున్న యీయింద్రునెడనను గ్రహముచూపుము.'అనిప్రార్థించెను.

ఓయర్జునా! అప్పరమేష్ఠివచనము లాలించి పరమప్రీతుఁడై మహేశ్వరుఁడు ప్రసన్నుఁడై యట్టహాసమొనర్చెను. పిమ్మట నాదేవతలారుద్రునిఁ బార్వతిని బ్రసన్నులఁగావింప, నాయింద్రునిబాహు వెప్పటివలెఁ గదలఁగల్గెను. అంత నావృషధ్వజుఁడు పార్వతితోఁగూడ వారికిఁ బ్రసన్నుఁడైయుండెను.అతఁడే రుద్రుఁడు. అతఁడేశివుఁడు. సకలమతఁడే. అతఁడే సర్వవేత్త. అటులే యింద్రుఁడును, వాయువును, నాశ్వినులు, మెఱుపులు నాతఁడే. భవుఁడు, పర్జన్యుఁడు, మహాదేవుఁడు నగుననఘుఁ

డాతఁడే.సూర్యచంద్రులును,వరుణేశానులును నతఁడే.అతఁడే కాలుఁడు, అంతకుఁడు, మృత్యువు, యముఁడు, రేవపల్లినై యున్నవాఁడు. మాస ములు, పక్షములు, ఋతువులు, సంవత్సరములు, సంధ్యలును నాతఁడే. ధాతయు, విధాతయు, విశ్వాత్ముఁడును, విశ్వకర్మకర్తయు నతఁడై యున్నవాఁడు. సకలదేవతలకును బహువిధముల నుతింపఁదగినవాఁడు. ఆతనిగుణములు వందలకొలందిని వేలకొలఁదిని లక్షలకొలఁదిని దెలుపు దురు. ఆతనితనువులు రెండని వేదజ్ఞు లగుబ్రాహ్మణులు తెలియుదురు. అందొకటి ఘోరయు, నొకటి శివయునై, మఱియు నవి బహువిధముల వెలయును. ఆతనిఘోరతనువు, విష్ణువు భాస్కరుఁడు నగ్నియునై వెల సెను. సౌమ్యయగు శివ జలములు, నక్షత్రములు, చంద్రుఁడు నై యల రారెను. మఱియు నుపనిషత్తులతోఁగూడ వేదాంగములును, నధ్యాత్మ నిశ్చయములగు పురాణములును నాతని పరమరహస్యమును దెలుపు నవియే. భగవానుఁడు, నజుఁడు నగుమహాదేవుఁ డిట్టిభూయస్త్వము గలవాఁడు. ఆభగవానునిగుణములన్నియు నేను దెలుపఁజాలను. ఓపాం డునందనా! అవిచ్ఛిన్నముగా వేయేండ్లకైనను నాతనిగుణములు వర్ణిం పఁబడవు. శరణ్యుఁడగునాతఁడు, సకలగ్రహగృహీతులును, సర్వపాప సమన్వితులు నగువారు శరణమందినచో, వారి నాపాపగ్రహములనుండి తొలఁగించుచున్నాఁడు. అతఁడే మానవులకు విత్తమును, నాయురారో గ్యములను, నైశ్వర్యమును, సంపూర్ణములగు కామములను నొసంగు చున్నవాఁడు. మఱియు నతఁడే వానిని దీసికొనుచున్నవాఁడు.ఇంద్రాది దేవతలం దాతనియైశ్వర్యమే ప్రకృష్టముగాఁ దెలుపఁబడుచున్నది. లోకమునఁ గలమానవుల శుభాశుభములం దతఁడే వ్యాపించియున్న వాఁడు. కామముల ప్రభుత్వముగలవాఁ డగుటచే నీశ్వరుఁ డనఁబడు చున్నవాఁడు. మహాభూతముల కధిపతియగుట మహేశ్వరుఁ డనఁబడు చున్నాఁడు. బహువిధములైన పలురూపములతో నతఁడే సకలజగమును వ్యాపించియున్నాఁడు. ఆతనివక్త్రము సముద్రమం దధిష్ఠితమైయున్నది. అదియే బడబ యనుపేరున జలమయమగు హవిస్సును బానముచేయు చుండును. ఈరుద్రుఁడే నిత్యము శ్మశానములయందు వసించును. కొందఱు జనులందే యది వీరస్థానేశ్వరుఁడని యీతనిఁ బూజించు చుందురు. ఈతనిరూపములు పెక్కులై దీప్తములును ఘోరములునై

లోకమునఁ బూజింపఁబడుచుండును. మానవు లీతనినామము లనేకములను యథార్థముగాఁ దెల్పుచుందురు. అయ్యవి యీతనిమహత్త్వమునుండియు వ్యాపకత్వమునుండియుఁ గర్మమునుండియు నిరుక్తములగుచున్నవి. వేదమందునుత్తమమగుశతరుద్రీయము చెప్పఁబడియున్నది. ఇమ్మహాత్మునియుపస్థానము అనంతరుద్రనామమున కొప్పుచున్నది. దివ్యములును మానుషములు నగుకామముల కితఁడు ప్రభువు. ఇతఁడే విభువు. ఇతఁడే బ్రభుఁడు. ఇతఁడే దేవుఁడు. ఇతఁడే మహావిశ్వమును వ్యాపించియున్నవాఁడు. బ్రాహ్మణులును, మునులును నీతని జ్యేష్ఠునిఁగా బలుకుచున్నవారు. ఇతఁడు దేవతలలో మొదటివాఁడు. ఇతనిముఖమునుండి యగ్ని జనించెను. ఎల్లవిధములఁ బశువులఁ బాలించుటను, మఱిమఱియు వానితోఁ గ్రీడించుటను, వాని కధిపతియగుటను, నతఁడు పశుపతి యనఁబడియెను. బ్రహ్మచర్యముచే దివ్యమగు నీతనిలింగము యథాస్థితమై లోకములను వర్ధిలఁజేయుటచే మహేశ్వరుఁ డనఁబడియెను. ఋషులును, దేవతలును, గంధర్వులు, నప్సరసలు నీతనిలింగము పూజించునట్లుగా నూర్ధ్వస్థితి వహించెను. వారటులు పూజింప నిమ్మహేశ్వరుఁడు మోద మొందుచుండును. మఱియు నీశంకరుఁడు ప్రహృష్టుఁడై తనంతఁ దా ప్రియ మొనర్చును. ఈతనిరూపము బహువిధములుగా భూతభవిష్యద్వర్తమానములం దుండును. మఱియు నితఁడు జంగమస్థావరాత్మకుఁడగుట బహురూపుఁడని చెప్పఁబడును. ఎల్లెడల దృష్టిగలవాఁడయ్యు, నేకాత్ముఁడై ప్రజ్వలించుచు నుండును. అటులంతటను నిండి క్రోధముచే లోకములను బ్రవేశించినవాఁడగుట సర్వుఁ డనఁబడియెను. ఆతనిరూపము ధూమ్రమైయుండుటను ధూర్జటి యనఁబడును. విశ్వేదేవత లాతనియందుండుటచే విశ్వరూపుఁ డనఁబడును. మానవుల సకలకర్మములందును శుభముఁగోరుచు, వారిసకలార్థములను వృద్ధినొందించువాఁడగుట, నతఁడు శివుఁడనఁబడుచున్నాఁడు. సహస్రాక్షుఁడును, నయుతాక్షుఁడును, నంతటను నిండినకన్నులుగలవాఁడై, విశ్వము వహించి పాలించువాఁడగుట, నతఁడు మహాదేవుఁడని తెలుపఁబడుచున్నవాఁడు. త్రిభువనేశ్వరుఁడై పృథివ్యాకాశ జలదేవతలమూవురను బొందియున్నవాఁడగుటఁ ద్ర్యంబకుఁ డనఁబడుచున్నాఁడు. మహాత్ముకంటెను బాల్యమందుండి ప్రాణోత్పత్తిస్థితుఁడై, స్థిరలింగమై నిత్యము వెలయు

వాఁడగుట స్థాణు వనఁబడుచున్నాఁడు. లోకమునఁ బ్రకాశించుసూర్య చంద్రులకాంతు లెల్ల నాతనికేశముసంజ్ఞ నొందియుండుట, నతఁడు వ్యోమకేశుఁడని పిలువఁబడుచుండెను. భూతభవిష్యద్వర్తమానరూప మగు సకలజగ మాతనివలన సంభవించుచుంట, భూతభవ్యభవోద్భవుఁ డనఁబడియెను. కవి యనఁగా శ్రేష్ఠము. వృషమనఁగా ధర్మము. అట్టిశ్రేష్ఠ ధర్మముగలవాఁడగుట, నిమ్మహాదేవుఁడు వృషాకపి యనఁబడుచున్నాఁడు. బ్రహ్మను నింద్రవరుణయమకుబేరులను నిగ్రహించి హరించువాఁడగుటఁ హరుఁ డనఁబడుచున్నాఁడు. మహేశ్వరుఁడగు నాదేవుఁడు నిమీలితములగునేత్రములచే లలాటమున నేత్రమును సృజించినవాఁడగుటఁ, డ్ర్యక్షుఁ డనఁబడుచున్నాఁడు. ఓయీ! ఎవ్వఁ డీదేవునివిగ్రహమును బూజించునో, లింగము నర్చించునో, యట్టి నిత్యలింగపూజకుఁడు గొప్ప లక్ష్మి నొందుచున్నాఁడు. ఈతని శివయనెడితనువున నూరువులనుండి సగ మాగ్నేయమును, సగము సోమమూర్తియు నైయుండును. అటులే యాత్మ సగమగ్నియు, సగము సోమమనియుఁ జెప్పఁబడుచున్నది. తైజసమై మహత్తరమై దీప్తమగుచు, నీతనితనువు దేవతలకు శివగ్యై; మానవులందు ఘోరమై, యగ్ని యనఁబడుచున్నది. ఇతఁడు తనకుఁగల శివయనెడి తనువుచే బ్రహ్మచర్య మొనర్చుచుండును. ఘోరయనెడితనువుచే సకలమును భక్షించుచున్నవాఁడు. జగద్దాహకుఁడై తీక్ష్ణుఁడై యుగ్రుఁడై ప్రతాపశాలియై మాంసశోణిత మజ్జాభక్షకుఁడగుటచే, నితఁడు రుద్రుఁ డనఁబడుచున్నాఁడు. ఓపార్థా! మహాదేవుఁడగు నితఁడే సంగ్రామమున నీయెదుట వైరుల నడంచుచుఁ, బినాకధారియై గానవచ్చెను. ఓయనఘా! నీవు సైంధవుని వధింతునని ప్రతిన నొనర్చినతఱిఁ గైలాసశిఖరమున నీకా కృష్ణునిచేఁ గలలోఁజూపంబడిన భగవానుఁడగు నీదేవుఁడే నీయెదుట సంగ్రామమునఁ జరించెను.మఱియు నీకస్త్రము లెవ్వఁడొసంగెనో, వేనిచే నీవు దానవులను వధించితివో యట్టియస్త్రదాత యితఁడే. ఓయర్జునా! వేదసమ్మితమై ధన్యమై యశస్కరమై యాయుఃప్రదమై పవిత్రమైన యాదేవుని శతరుద్రీయమిపు డేను నీకెఱిఁగించితిని. ఇది సర్వార్థసాధకమును, సకలపాపవినాశకమును, సర్వకలుషహారమును, సమస్తదుఃఖనివారకమును, బవిత్రమునై నాల్గువిధములుగా నున్నది. దీని నెవ్వఁ డెల్లపుడును వినునో, వాఁడు సకలశత్రులను జయించి, రుద్రలోకమున

నుత్కర్ష మొందుచున్నవాఁడు. సంగ్రామోపయుక్తమై శుభప్రదమగు నిమ్మహాత్మునిదివ్యశతరుద్రియచరిత్రమును బఠించుచు, సోత్సాహుఁడై యీవిశ్వేశ్వరునకు భక్తుఁడై యెవ్వఁడు ప్రవర్తిల్లునో, వాఁడీత్ర్యంబకు ననుగ్రహముచే నుత్తమములగు కామములనెల్ల నందఁగల్గుచున్నాఁడు. ఓకౌంతేయా! వెడలుము. యుద్ధముచేయుము. నీకుఁ బరాజయము గల్గదు. నీకు మంత్రియు రక్షకుఁడునై యీజనార్దనుఁడు నీప్రక్కనున్న వాఁడుగాదే.' అని తెలిపెను. ఓయాంబికేయా! ఇటు లారణరంగమున వ్యాసుఁ డయ్యర్జునునకుపదేశించి వెడలిపోయెను. ఓరాజా! మహాబలుఁ డగు నాబ్రాహ్మణుఁ డైదుదినములు పోరాడి బ్రహ్మలోకమందెను. చక్కఁగాఁ జదువఁబడిన వేదమునకుఁ గలఫల మీపర్వమునఁ గలదు. ధీరులగుక్షత్త్రియులకు శుభమును గీర్తిని గల్గించును. పాండవార్జునులకు యుద్ధజయప్రదమై మహార్థములతోఁ గూడిన యిప్పర్వము నెవ్వఁడు పఠించునో, మఱియు నెవ్వఁడు వినునో, వాఁడు నిజపాపకర్మములనుండి విముక్తుఁ డగుచున్నాఁడు. ఇందు బ్రాహ్మణునకు యజ్ఞఫలావాప్తియు, క్షత్త్రియునకు ఖ్యాతియు జయమును, మిగిలినవర్ణములవారి కభీష్టసిద్ధియుఁ, బుత్రపౌత్త్రాదిలాభమును గల్గును.'' అని సంజయుఁ డెఱిఁగించెను.

ద్రోణపర్వము సంపూర్ణము.

శ్రీకృష్ణార్పణమస్తు.



చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—4-1950.

# వచన గ్రంథములు

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశస్కంధములు, ఒకేసంపుటము | ... | 9 | 0 |
| డిటో మూడుసంపుటములు | ... | 10 | 8 |
| ఆంధ్రవచనభారతము, ఆదిసభాపర్వములు | ... | 5 | 0 |
| ,, ఆరణ్యపర్వము | ... | 5 | 0 |
| ,, విరాటోద్యోగపర్వములు | ... | 5 | 8 |
| ,, భీష్మద్రోణపర్వములు | ... | 7 | 8 |
| ,, కర్ణశల్యసౌప్తిక స్త్రీపర్వములు | ... | 5 | 0 |
| ,, శాంతిపర్వము | ... | 7 | 8 |
| ,, అనుశాసనికము మొదలు స్వర్గారోహణపర్వము వరకుగల సంపుటము | | 7 | 8 |
| ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము | ... | 3 | 0 |
| అరేబియన్ నైట్సుకథలు | ... | 2 | 0 |
| తిలకుగారిసెక్యూరిటీకేసు, ఉపన్యాసములు | ... | 0 | 14 |
| భారతరమణీమణులు, ప్రథమభాగము | ... | 1 | 4 |
| డిటో రెండవభాగము | ... | 0 | 14 |
| డిటో మూడవభాగము | ... | 0 | 8 |
| యజుర్వేదకథాసంగ్రహము | ... | 0 | 8 |
| నీతిచంద్రిక, చిన్నయసూరిగారిది | ... | 0 | 10 |
| పంచతంత్రము, వచనము, సులభశైలి | ... | 0 | 12 |
| నీతిరత్నాకరము | ... | 0 | 8 |
| సంగ్రహరామాయణము | ... | 1 | 8 |
| భోజునికథలు | ... | 1 | 0 |
| భోజకాళిదాసకథలు, I భాగము | ... | 1 | 0 |
| డిటో II భాగము | ... | 1 | 0 |
| తెనాలిరామలింగనికథలు, జీవితము | ... | 0 | 6 |
| డిటో A. S. P. అయ్యరుగారిది | ... | 0 | 8 |
| సంస్కృతనాటకకథలు 1. 2 - భా. | ... | 2 | 0 |
| రాజశేఖరుఁడు గోపాలుఁడు | ... | 0 | 12 |
| విక్రమార్కునికథలు | ... | 0 | 12 |
| చార్‌దర్వేషుకథలు | ... | 1 | 0 |
| బేతాళునికథలు | ... | 0 | 12 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్ చెన్నపురి.